శ్రీ కాకతీయ గ్రంథమాలలో నాలుగవ సుమము

సంపాదకులు, పరిష్కర్తలు:

శేషాద్రి రమణకవులు, శతావధానులు.

# దాసబోధ.

శ్రీ ఛత్రపతి శివాజిమహారాజునకు గురువగు

అనువాదకుడు:

కొణకంచి చక్రధరరావు.



ప్రకాశకులు:

1955.

ద్వితీయ ముద్రణము 1000. దీని వెల 3-0-0.



పలయువారు క్రిందివిలాసములకు వ్రాయవలయును:—

1. శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు పోస్టు, (చిత్తూరుజిల్లా.)
2. దూపాటి వెంకటరమణాచార్యులుగారు, బ్రాహ్మణవీధి, హన్మకొండపోస్టు, వరంగల్ జిల్లా.

# అనువాదక విజ్ఞప్తి.

ఆర్యులారా !

దాసబోధ యను నీ యుత్కృష్టగ్రంథము మహారాష్ట్రభాషలో రచించిన మహాత్ముఁడగు శ్రీ సమర్థ రామదాసస్వామి జీవితము దాసబోధ ప్రశస్తి తెలుపు అనుబంధము లిందుఁ గలవు. విశేషాంశములను విఖ్యాతపండితకవులును వాఙ్మయసేవకులు నగు మా శేషాద్రిరమణకవుల పీఠికవలన నింకను విశదమగునని నేనాప్రశంస మానుకొంటిని.

ఈ గ్రంథమును దెనుఁగులోని కనువదించుమని మిత్రులు మిగులఁ బ్రోత్సహించిరి. క్లిష్టభావములుగల యీ యుత్తమగ్రంథమును దాదాపు సంవత్సరము శ్రమపడి యాంధ్రీకరించితిని. ఈయాంధ్రీకరణమునకుఁ దాత్కాలికముగఁ గలిగిన భక్త్యుద్రేకమే కారణముగాని నా శక్తి సామర్థ్యములు కారణములుగావు. గ్రంథము పూర్తియైన పిమ్మట లోపములను సంస్కరించి పలుమాఱు పఠించి గుణముల నలరించి ముద్రణాధికారము, గ్రంథ స్వాతంత్ర్యము గైకొని సర్వాంగసుందరముగ వ్యయ ప్రయాసల నోర్చి ప్రచురించి పల్లెటూరివాసి నగు నన్నుఁ గృతార్థుని గావించిన శ్రీ శేషాద్రి రమణకవులకు వందనముల నర్పించెదను.

ఇట్లు - అనువాదకుఁడు,

తేది 1-4-1929. కొణకంచి చక్రధరరావు.



# అంకితము.

ధర్మసంస్థాపకుఁడును, అవతార పురుషుఁడును, లోకోద్ధారకుఁడును
శ్రీ శివాజి చక్రవర్తికి గురువరేణ్యుఁడును

గ్రంథకర్తయు నగు

## శ్రీ సమర్థ రామదాసస్వామి

చరణకమలములయం దీయాంధ్రానువాదము సమర్పించి
కృతార్థుఁడ నగు చున్నాఁడను.

భక్తజన విధేయుఁడు,
అనువాదకుఁడు.
1—4—1929.

# ప్రకాశకుల సందేశము.



దాసబోధయను నీ సర్వోత్కృష్ట గ్రంథము కొన్ని సంవత్సరముల క్రితము, ఒకసారి చదువగా ఈ పవిత్ర పుస్తకము తెనుఁగుదేశమందంతటను వ్యాపించియుండిన నెంతో బాగుండుననను తలంపు గలిగెను. ఏలన? బ్రహ్మవేత్తలకు, పరమభక్తులకు, యోగనిష్ఠులకు, నిష్కామ కర్మయోగులకు నుండవలసిన ధర్మము లేగ్రంథములోను నింత సవిస్తరముగ కానుపించుట లేదు. అంతియేగాక ఇది పురాణగాథ కాదు. ప్రత్యక్షముగా కొలది సంవత్సరములక్రిందట జరిగిన విషయము. శ్రీ సమర్థరామదాసస్వాముల దివ్యచరిత్రము సాధారణముగా భక్తులందఱు నెఱింగిన విషయమే. ఈ గ్రంథము యెచ్చట దొరకునా యని విచారించగా దూపాటి వెంకటరమణాచార్యులని తెలియడమైనది. వారికి వ్రాయగా 1929 లో మొదటికూర్పు అచ్చైనదనియు, అది యిప్పటికి 26 సంవత్సరములైనదనియు, తరువాత ముద్రించువారు లేకపోవుటచే ద్వితీయ ముద్రణము జరుగలేదనియు తెలుపుటవల్ల యట్టి పావనగ్రంథము నచ్చువేసిన బాగుండుననితలంచుటవల్ల దూపాటి వెంకటరమణాచార్యులకు తెలుపగా ప్రీతిపూర్వకముగా ముద్రణమున కవకాశమొసంగి ఇకమీద దీని సర్వాధికారమును శ్రీ వ్యాసాశ్రమమునకు ఉండులాగున భక్తిపూర్వకముగా అనుమతి పత్రమువ్రాసి యిచ్చిరి. ఇట్టి ఉదారస్వభావమున్ను, పరమభక్తియున్ను గల శ్రీ దూపాటి వెంకటరమణాచార్యులకు కృతజ్ఞులము. శ్రీ సమర్థ రామదాసస్వాముల వారిపై గల భక్తిచేతను పరమభక్తులందఱున్ను దీనిని చదివి తరించవలయునను సదభిప్రాయముతో దీనిని ముద్రించడమైనదేగాని, మఱియొక లాభము నుద్దేశించికాదు.

ఇట్లు,

శ్రీ వ్యాసాశ్రమమువారు.

ఓమ్.

ఓం

# ద్వితీయ ముద్రణము.

---

చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకా ఏర్పేడు శ్రీ వ్యాసాశ్రమమునకు దాసబోధ ముద్రించుటకు అధికారపత్రము ఇచ్చు చున్నాను. వెంటనే ముద్రణముచేయుటకు సంతోష పూర్వకముగా అంగీకరించుచున్నాను. ఇట్లు గ్రంథవిషయమై సర్వాధికారముగల నేను ఆమోదమును తెలుపుచున్నాను. ఇకమీదట దీని సర్వాధికారము శ్రీ వ్యాసాశ్రమమునకు యివ్వబడినది.


దూపాటి వెంకటరమణాచార్యులు,

బ్రాహ్మణవాడ,

హనుమకొండ పోష్టు, హైదరాబాదు. (దక్కన్.)


సంవత్సరము 1955.



## మొదటి కూర్పు

# సంపాదకీయ భూమిక



ఈ దాసబోధ శ్రీసమర్థ రామదాసస్వామి రచించిన మహారాష్ట్ర గ్రంథమున కనువాదము. దాసబోధ ప్రశస్తియు శ్రీ సమర్థుని జీవితమును దెలుపు ప్రత్యేకవ్యాసము లీ గ్రంథమునఁ జేర్చితిమి. గాన నాయా భాగములు వదలి గ్రంథప్రచురణమునుగూర్చి యొకించుక వ్రాసెదము.

దాసబోధ మహారాష్ట్రులు మిగుల నభిమానముతో గౌరవించు పవిత్రగ్రంథము. ఎందఱో మహారాష్ట్రభాషలో నీ గ్రంథమును ముద్రించిరి. అందు ధులియాలోని సత్కార్యోత్తేజక సమితివారు ప్రచురించిన ప్రతి, శుద్ధముగను, సుపరిశోధితముగను నున్నది. దీని ననుసరించియే హిందీయనువాదము ప్రచురింపఁబడెను. ఈ యాంధ్రానువాదము చాల వఱకు హిందీయనువాదము ననుసరించి చేయబడినను గొన్నితావుల మూలగ్రంథమునుండియు గుజరాతి అనువాదమునుండియు విషయసమన్వయమునకు భావములఁ గైకొనవలసివచ్చినది. హిందీ దాసబోధలో మొదటికూర్పునఁగల యంశములకు రెండు మూఁడు కూర్పులలోఁగల యంశములకు భేదముగలదు. ఇన్నిటిని సమన్వయించుటచే నీ దాసబోధయించుక హిందీప్రతి కెంతేని భిన్నముగనున్నను జాలవఱకుఁ జేరువలో నుండును. ఈ గ్రంథమును మూలానుసారముగ మా మిత్రులగు శ్రీయుత కొణకంచి చక్రధరరావుగారు 10—2—26 తేదీ ఆంధ్రింప నారంభించి 4—11—27 తేది పూర్తిచేసిరి. ప్రచురణ విషయమున నవకాశములున్నచో విచారింపుఁడని లిఖితప్రతిని అనువాదకులు మాకొసంగిరి. తవాదిగ గ్రంథమండలులకు, గ్రంథప్రకాశకులకు నీ గ్రంథమును బ్రచురించుకొండని పలుమాఱు వ్రాసితిమి. పెద్దగ్రంథమనియుఁ, దీరికలేదనియు, గ్రంథము పంపిన వీలువెంట యోచింతమనియుఁ బ్రత్యుత్తరమొసంగిరి. ఈ యవకాశములో భాషాంతరీకరణమును మేము పలుమాఱు జదివితిమి. హిందీప్రతితోఁ బోల్చిచూచితిమి. మహారాష్ట్ర పద్యములతోఁగూడఁ బోల్చిచూచితిమి. ఆంధ్రీకరణము సమంజసముగ నుండెను. ఈ గ్రంథరత్న

మాంధ్రవాఙ్మయమున కర్పూర్యాలంకారమని తోఁచెను. కాని ప్రచు రించు మార్గమెద్ది? ముద్రణశాలకేగి విచారింప రు 3000 లు నెచ్చించినఁ గాని ప్రతులు 1000 ముద్రింప వీలుకాదనిరి. సేనా నిర్ధనులము. ఆంధ్రుల కీ సమర్థరామదాసస్వామి సందేశము వినిపించవలసిన శుభావస రము వచ్చినది. ఎట్లు నిర్వహింపనగునని తికమకపడితిమి. మా సద్గురు లు మున్నొకమాఱు భారతిలో నివేదించుకొంటిమి.

"నాకే భాగ్యముకల్గెనేని కవితానందానుసంధాన భా
షాకావ్యంబులతోడ రేయిపవల్గు సాఫల్యముగ్ జేసి వి
ద్యాకాంక్షఁ జరియింపకుందునె? దరిద్రత్వున్నసిర్మాంస శ
ల్యాకారంబుగనుంటి నెట్టులిక నీయాంధ్రాశ చల్లారునో".

ఈ తృష్ణయే గ్రంథప్రచురణమునకు మమ్ము పొందరించెను. ఉదారభావమును సర్వస్వామ్యములతో అనువాదకులు మాకీ గ్రంథ మొసంగిరి. కర్తవ్యమితోచక త్రోక్కులాడుతటి నందిగామలో న్యాయవాది వశమున వసించియున్న మా మిత్రులును ధర్మస్వభావులునగు శ్రీ దేవర కొండ రామమూర్తిగారు ప్రోత్సహించి మాకు జయము చేకూరారును. గ్రంథప్రచురణమునకు సాహసింపుఁడనియు శక్తికొలఁది తోడ్పడుదుమనియు సెలవిచ్చిరి. పలువురు మిత్రులు శక్తికొలఁది గ్రంథవ్యాప్తికిఁ బ్రయత్నింతుమనిరి. దాసబోధ ప్రశస్తితెలుపు కరపత్రముకొన్నటి ప్రచురించి ముందు వెలయొసంగినచో ఆంధ్రదాసబోధ రు 4లకు ఒసంగుదుమని ప్రకటించితిమి. ఎందఱో భాషాభిమాను లభిమానించి తోడ్పడిరిగాని కావలసిన ధనములోఁ గొంతమాత్రమే సమకూరెను. మా శక్త్యతీత మగు పనియని నిరుత్సాహపడితిమి. ముద్రణశాలాధికారులు అనువాద మునకు శుద్ధప్రతి వ్రాయకున్నచో ముద్రింప నవకాశము చిక్కదనిరి. ఆధునిక సంప్రదాయానుసారముగ భాషాసంస్కరణములు ఉచిత పద ప్రయోగము నెలకొల్పి విస్తృతములుగనున్న మకుటములు తగ్గించి రచన మును స్వతంత్రభాషవలె సంస్కరింపవలెనను కోర్కి జనించెను. అను వాదకులు మా తలంపున కామోదించిరి, మూలగ్రంథము మహారాష్ట్రి గ్రంథము చెంతనుంచుకొని 20–6–28 తేదీని శుద్ధప్రతి వ్రాయ నారం భించి యెనిమిదిమాసములకుఁ బూర్తిచేసితిమి. మా మిత్రు లీమార్పుల

కామోదించిరి. ముద్రణమునకు యత్నించుసరికిఁ జేత రొక్కము చాల తక్కువగనున్నను సాహసించితిమి. సిద్ధసంకల్పుఁడు, అమోఘవ్రతుఁడు, మృతజీవుఁడునగు శ్రీ సమర్థరామస్వామి మా హృదయముల నావరించి యెన్ని యంతరాయములు కలిగినను ఎన్ని విషయపరిస్థితు లేర్పడినను బ్రోత్సహించిన కతన నేఁటికీ యాంధ్రానువాదమును బ్రచురింపఁగలిగితిమి. ఆంధ్రసోదరు లీ గ్రంథప్రశస్తిని గమనించి యాదరింతురేని మేము ధన్యులము.

సమర్థ రామదాసస్వామి భారతదేశ పర్యటనము గావించుతఱి ఆంధ్రదేశమునఁ జిరకాలము నివసించి తన సంప్రదాయమును వ్యాప్తి గావించెననియు శివరామదేశికుఁడను నొక విద్వాంసుని ఆంధ్రదేశము నందలి మఠమున కధిపతిని గావించెననియు ఆంధ్రమున సమర్థుఁ డనేక గ్రంథముల రచించెననియు మహారాష్ట్ర గ్రంథములలోఁగలదు. మన దురదృష్టవశమున నింతవరకు శ్రీ సమర్థుని యాంధ్ర కవితారసము గ్రోలుటగాని యతనిచే స్థాపితమైన మఠమును దర్శించుటగాని తటస్థింప దయ్యె. పరిశోధకు లిందుల కెంతేని కృషిచేయవలసియున్నది.

సమర్థ రామదాసస్వామి కేవల వేదాంతిగాడు. ప్రవక్త. ధర్మ స్థాపకుఁడు. శాంతిదూత. శివాజిచక్రవర్తి నాధారముగఁజేసికొని ఆర్యా వర్తనమున నీయన ధర్మసంస్థాపనము గావించి యవతార పురుషుఁడని పేరొందెను. ఆయన యాదర్శములకెల్ల నెలవగు దాసబోధ నెంతేని ప్రశంసింపవలసియున్నది. ఆత్మ, వ్యక్తి, సమాజము, దేశముల కుపక రించు హితోపదేశ మెంతేని యీ గ్రంథరాజమునఁగలదు. ఇందలి పూర్వార్థము పరమార్థాభ్యుదయమునకు, ఉత్తరార్థము సాంసారికా భ్యుదయమునకు నుపకరించును గాన మానవజాతికీ గ్రంథరాజము సర్వ కాల సర్వావస్థలందును సరిపడును. వేదవేదాంతాదులలోఁ బ్రతిపాదితము లగు తత్త్వసారముల నెఱింగించునదిగాన యీ గ్రంథ మాస్తికుల కందఱ కును బఠనయోగ్యము. స్వాతంత్ర్య బీజములు సమకాలికుల హృదయ ములలో నంకురింపఁజేసిన శివాజియంతటి త్యాగమూర్తిచేఁ జిరపఠనీయ మగుటచే నీ గ్రంథము సందిగ్ధావస్థలోనున్న మాతృదేశమునకు విజ్ఞాన మును బ్రసాదించుననుటకు సంశయింపఁ బనిలేదు. దాసబోధను రామదాస స్వామినిగూర్చి శ్రీ కె. వి. లక్ష్మణరావుపంతుల వారిటుల వ్రాసియున్నారు.

"మతజిజ్ఞాసయు మతోపదేశంబును మానవులకు సంసారమునందు విరక్తిగలుగునటులఁ జేయుననియు జ్ఞానోపదేశముయొక్క పరమోద్దేశము సర్వసంగ పరిత్యాగమే యనియు జనసామాన్యము దలంచుచుండ గురూపదేశమువలన శివాజి మఱింత శూరుఁడయ్యెననియు నైహికరాజ్యము సంపాదించుట యందధికోత్సాహి యయ్యెననియు నేను వ్రాయుట చదువరులకు వింతగా నుండును. కాని వివిధదేశ చరిత్రములను జక్కఁగ నభ్యసించినవారికి స్వమతాభిమానము స్వదేశాభిమానముగాఁ బరిణమించు ననుసంగతి వింతగా నుండఁజాలదు. మతాభిమానమును మతశ్రద్ధయుఁ బూర్వము దేశాభిమానమునకు ప్రబల పోషకములుగ నుండెను. క్రీ. శ. 1649 నుండి 1660 వఱకు ఇంగ్లండునకు సంరక్షకుఁడు (Protector)గా నుండిన క్రాంవెల్ గెలిచిన యుద్ధములన్నియు మతాభిమానులగు శూరుల సైన్యంబులవలననే యని యద్దేశచరిత్ర చదివినవారికి విశదమె. ఏవానిని సైన్యములోఁ జేర్చుకొనుటకుఁ బూర్వమాతఁడు అమిత దేశాభిమానముగలవాఁడా కాఁడా యని క్రాంవెల్ ఆలోచించుచుండెను. మతాభిమానము గలవారలనే కాని యితరులను సైన్యములోఁ జేర్పనేలేదు. కనుకనే సార్థకనామధేయులగు నతని లోహకాయులు (Ironsides) పరాభూతులైనవారుకారు. ఇఁక రెండవ యుదాహరణము: హాలండు దేశములో స్థాపింపఁబడిన ప్రజాసత్తాత్మక రాజ్యమంతయుఁ బ్రాటెస్టంటు మతాభిమానముయొక్క ఫలమేయని డచ్ ప్రజాసత్తాత్మక రాజ్యముయొక్క యభ్యుదయము (Rise of the Dutch Republic) అను చరిత్రరాజము చదివినవారికిఁ దెలిసినవిషయమే. అంతమాత్రముపోనేల? సాంఖ్యంబును యోగంబును సమన్వయించి సాంఖ్యయోగంబను శాస్త్రమును నిర్మించి కర్మబ్రహ్మ మీమాంసా ప్రతిపాదితంబులగు కర్మ జ్ఞానయోగముల నన్వయించి అర్జునునకుఁ గృష్ణునిచే నుపదేశింపఁబడిన గీతాశాస్త్రంబె గొప్ప వేదాంతగ్రంథంబని హిందువు లందఱును బలికెదరు. కాని యా వేదాంతశాస్త్రంబు అర్జునుని గర్తవ్యాచరణమునకుఁ బ్రేరేపించి యతనిచే స్వధర్మము ననుష్ఠింపఁజేయలేదా! ఇట్లు నిజమైనమతంబు మనుజుని సంసార పరాఙ్ముఖుని జేయుటలేదు. కర్తవ్యనిష్ఠునినే చేయును. కాన శివాజీ రామదాసుల చరిత్రము సాంసారికులకును సంన్యాసులకును ననుసరణీయమే!......

రామదాసు రాజ్యధర్మముల సంపూర్ణముగా నెఱింగినవాఁడు గావునఁ దనదాసబోధయందు రాజ్యప్రకరణములో రాజ్యమును నడుపువిధము, రాజ్యధర్మములు, ప్రజలు సుఖులై రాజభక్తిగలవారుగ నుండునటులఁ జేయు నుపాయములు, సామదానభేద దండములచే అరిని గెలువవలసినవిధము, జితశత్రువుల నాదరించి ప్రేమభావముతో వశపఱచుకొనుమార్గములు మొదలయిన శకకర్తలకుఁ గావలసిన ధర్మసూత్రములను కడు నేర్పుతో నాతఁడు వర్ణించియున్నాఁడు. ఈ గ్రంథముయొక్క యీ భాగమేకాదు. కడమ గ్రంథమంతయు ననుభవపూర్ణముగను అమృతము చిప్పిలునట్లుగను నుండును.

శివాజీచరిత్రము (రెండవ ప్రతి)

వేదాంతవిషయము నందీ గ్రంథమున నమూల్యములగు ఘట్టములు గలవు. వేదాంతవేత్త లెవ్వరును సమన్వయింపఁజాలని యపూర్వాంశముల నీయన సమంజసముగఁ దెలిపెను. సత్త్వ ద్వైతనిరూపణము, పరమాత్మ నిశ్చయము, మోక్షలక్షణము, బ్రహ్మనిరూపణము, ఆత్మజ్ఞానము, జ్ఞానోప దేశము, లఘుబోధ మున్నగు సమాసములు వేదాంతరహస్యముల వెల్ల డించుచున్నవి. ఈ గ్రంథరాజము సన్న్యాసమును బోధింపక గృహ స్థాశ్రమమునుండి భజనసహాయమున సంఘము కడతేరువిధముల నెఱిం గించుచున్నది. యోగమును వలదనుచున్నది. సంఘమునందలి లోపము లను జ్ఞాన చక్షుస్సుతో విమర్శించుచున్నది. జాతిలోఁ బాదుకొని జీర్ణిం చిన దురాచారములను బ్రేలెత్తిచూపి సంఘమునంతయు నూపివేయు చున్నది. వైదికధర్మము నుద్ధరించుచున్నది. ఇంతయేల! శ్రీ సమర్థ రామదాసస్వామి పవిత్రజీవితమున కన్నితెఱఁగుల నీగ్రంథము దార్కాణ ముగా నున్నది.

రామదాసస్వామి యవతరించుకాలము భారతదేశము యవనుల పరిపాలనమందుండెను. విగ్రహములు చితుకఁగొట్టబడి ఆలయములు మలినపఱుపఁబడెను. బ్రాహ్మణుఁడు మొదలుకొని చండాలుని వరకుఁ గల ప్రజలందఱు పరమతమును బ్రేమించుచుండిరి. ఐహికసౌఖ్యము లకు అధికారములు వలచి అగ్రవర్ణమువారు మహమ్మదీయులకుఁ బ్రతిబింబములైరి. టాకటీలోఁ తపము ముగించుకొని రామాజ్ఞను బడసి ఆసేతు హిమాచలము వరకుఁ బాదచారిగాఁ దిరుగుచు భిక్షాటన ముతోఁ గాలముబుచ్చుచు రామదాసస్వామి దేశపరిస్థితులన్నియు గమ నించెను. పవిత్రములగు దేవమందిరములు నాశనమగుటకు వగచెను. సంక్షుభితమగు భారతజాతిని మేలుకొలిపి ప్రజాహృదయముల నాకర్షించి జాగరూకము గావింప నిశ్చయించెను. తానుబోయి ప్రతిగ్రామమునందును ఆంజనేయుని బ్రతిష్ఠించెను. పవిత్రక్షేత్రముల నన్నిటినిఁ జూచెను. లోకో ద్ధరణమునకుఁ బ్రణాళిక వేసికొనెను. పలుతావుల రామదాసస్వామి యుప దేశమునకు ముగ్ధులై శిష్యు లసంఖ్యాకముగ జేరిరి. తన దివ్యానుభవ మును బురస్కరించుకొని ఉత్తమగ్రంథములు రచించెను. అందు దాస

బోధ జాల మాహాత్మ్యముగల యుత్తమగ్రంథము. అందు వివిధవిషయములు చర్చింపఁబడినవి.

రాజకీయవిదు లిది రాజనీతిశాస్త్రమనిరి. కవులు సాహిత్యకావ్యమనిరి. రామదాసస్వామియే గ్రంథాదియందు ఇది పరమార్థమును బోధించు వేదాంతశాస్త్రమనియు సర్వగ్రంథములసారమిందుఁగలదని చెప్పియున్నాఁడు. చరిత్రకారులు ఆ కాలపు దేశచరిత్రమనిరి. పలువురు పలు విధములఁ దలంచిరి. కాని రామదాసస్వామి అనుయాయులగు భక్తులు వేదాంతశాస్త్రమనియే విశ్వసించిరి. మొత్తముమీఁద సార్వకాలమునఁ నున్న సమస్త విషయశోభితమగు వేదాంతశాస్త్రమనుటయే సమంజసము. రామదాసస్వామి దాసబోధ యపూర్వపద్ధతిలో రచించెను. శిష్యుల సందేహములు నివారణచేయువిధముగఁ గొన్ని సమాసము లిఖించెను. తన దివ్యానుభవములనే కొండొకచోఁ జేర్చెను. [illegible]ములలో నాత్మానుభవమె తొణికిసలాడుచుండును. తాను సాధించిన యమూల్యాంశములనె తఱచుగాఁ జెప్పెను. మఱుఁగులేకుండ స్పష్టముగ శ్రోతలకుఁ దెలియఁజెప్పుటయుఁ దానుజెప్పునది యెంతవరకు గ్రహించిరో యెఱుఁగుటయు నందందుఁ గానవచ్చును. రామదాసస్వామి సర్వమతముల సారము గ్రహించెను. బహుభాషలలోఁ బరిజ్ఞానముగలవాఁడు, చతురుఁడు. సుందరాకారుఁడు మాటకారి ఆచరణము పరిశుద్ధము. ఎంతమంది మహాపండితులను దేశభాషలలో గ్రంథరచనము గావింపఁజేసెను. ఆయన యెచ్చటనున్న నచటఁ దీర్థప్రజవలె భక్తులు ప్రోగై కలసిమెలసి వర్తింతురు.

తొలుత శ్రీ శివాజియు రామదాసస్వామి గొప్ప యవతార పురుషుఁడని మహాత్ముఁడని ఉపదేశమునకు వచ్చెను. ఉపదేశముతో వారల సమావేశము ముగియలేదు. ఆ కాలమున దేశమును సంక్షుభితపఱచు రాజకీయ వ్యవహారములన్నియు వారిచర్చలోనికి వచ్చెను. ఆచరణమునకుఁ బ్రణాళిక లేర్పడెను. శివాజిని తీర్చి దిద్దినవి రామదాసస్వామి దివ్యబోధలే. అనేక సందిగ్ధ సమయములలో రామదాసస్వామి కర్తవ్యము నుపదేశించును. అట్టి దుర్ఘటసమయములో సమావేశము కుదురదేని దాసబోధ నొకమాఱు పఠించుకొనుము. కర్తవ్యము బోధపడునని

చెప్పుచుండువాఁడు. ఆకారణముచే దాసబోధ శ్రీ శివాజికిఁ బారాయణ గ్రంథము. దాసబోధయే శివాజిని దేశభక్తునిగను హిందూధర్మరక్షకుఁడుగను లోకోత్తరపురుషునిగను జేసినది. సమర్థుని యుపదేశసారము శివాజిచక్రవర్తిమనమును మననముఁజేసినచో ఆధ్యాత్మికానందమును దేశభక్తిని సాధింపఁగలుగుదుము. ఈ పవిత్ర సంకల్పముతోనే దాసబోధను ఆంధ్రమున బరివర్తనముఁజేసి వ్యాప్తికెంతయో పాటుపడితిమి. కార్యశూరులగు సోదరాంధ్రుల నీ దాసబోధ యాకర్షింపకుండునా!

అద్వైత దృష్టితోఁజూచినను వ్యవహారదృష్టితోఁ జూచినను దాసబోధ మిగుల మహత్త్వముగల గ్రంథరాజము. ఈ గ్రంథ ప్రశస్తికి విషయకల్పన మనుకూలముగ నున్నది. మొదట మూఁడు దశకములలో ఐహిక జీవితమున మానవుఁ డెఱుంగఁదగిన నీతులెన్నేని గలవు. భాగవతమునందుఁ జేర్కొనిన నవవిధ భక్తులపై వ్రాయఁబడిన వ్యాఖ్యానమనదగు నాలుగవ దశకము ప్రశంసనీయము. సమర్థుఁ డైదవ దశకమునుండి వేదాంతచర్చకుఁ గడంగెను. గురునిశ్చయమునఁ జెప్పఁబడిన యంశములును సద్గురులక్షణమునఁ జెప్పఁబడిన యంశములును సంపూర్ణముగ సమర్థ రామదాసస్వామి కన్వయించును. శిష్యలక్షణము లటులె శివాజి చక్రవర్తి కన్వయించును. ఐదవ దశకమంతయు నిటులె సద్గురు సచ్ఛిష్యలక్షణముల కుదాహరణముగ నున్నది. వేదాంతభావము లిటనుండియె సూచింపఁబడెను. ఆఱవ దశకము దుర్గమమగు నద్వైత నిరూపణము. సమర్థుఁడు శ్రీరామానుగ్రహమునను ఆత్మ ప్రతీతివలనను గ్రహించిన యపూర్వ విజ్ఞానమున కీదశకమునుండి యాధారములు లభించును. సమర్థుఁడు సంస్కృతమునను మహారాష్ట్రమునను గల వేదాంత గ్రంథముల నన్నింటిని గాలించెను. ఎంతటి దుర్ఘట విషయమునేని సమన్వయించుటలో ఆతని కపూర్వమగు నైపుణ్యముగలదు. వక్తృత్వ మనన్య సాధారణమైనది. ఆచరణమునఁ గళంకమే లేదు. ఆయన యాశయము ప్రపంచోద్ధరణము. కావుననే శివాజియంతటి మహారాజు సమర్థునికడ ముగ్ధుఁడై పాదాక్రాంతుఁడై కనుసన్నలలో మెలంగెను. నిస్సంగుఁడగు తుకారామ్ సమర్థుని మహత్త్వము దెలుపు సద్గురు నిశ్చయమును బఠించెను. దాసబోధయందలి లఘుబోధ శివాజికై ప్రత్యేకముగ రచింపఁబడినది. సృష్టిని

బోధ జాల మాహాత్మ్యముగల యుత్తమగ్రంథము. అందు [illegible] ములు చర్చింపఁబడినవి.

రాజకీయవిదు లిది రాజనీతిశాస్త్రమనిరి. [illegible] మనిరి. రామదాసస్వామియే గ్రంథాదియం దు [illegible] పరమార్థమును బోధించు వేదాంతశాస్త్రమనియు సర్వగ్రంథములసారమని [illegible] చెప్పి యున్నాఁడు. చరిత్రకారులు ఆ కాలపు దేశచరిత్రమనిరి. పలువురు పలు విధములఁ దలంచిరి. కాని రామదాసస్వామి [illegible] భక్తులు వేదాంతశాస్త్రమనియే విశ్వసించిరి. మొత్తముమీఁద సార్వకాలముల నున్న సమస్త విషయశోభితమగు వేదాంతశాస్త్రమనుటయే సమంజసము. రామదాసస్వామి దాసబోధ యపూర్వపద్ధతిలో రచించెను. శిష్యుల సందేహములు నివారణచేయువిధముగఁ గొన్ని సమాసము లు [illegible]. తన దివ్యానుభవములనే కొండొకచోఁ జేర్చెను. [illegible] ములలో నాత్మానుభవమె శోభిల్లుచుండును. తాను సాధించిన యమూల్యాంశములనె తెలుపుచుఁ జెప్పెను. మఱుఁగులేకుండ స్పష్టముగ శ్రోతలకుఁ దెలియఁజెప్పుటయుఁ దానుజెప్పునది మెదడువరకు గ్రహించిరో మెఱుఁగుటయు నందందుఁ గానవచ్చును. రామదాసస్వామి సర్వమతముల సారము గ్రహించెను. బహుభాషలలోఁ బరిజ్ఞానముగలవాఁడు, చతు రుఁడు. సుందరాకారుఁడు మాటకారి ఆచరణము పరిశుద్ధము. ఎంతో మంది మహాపండితులను దేశభాషలలో గ్రంథరచనము గావింపఁజేసెను. ఆయన యెచ్చటనున్న అచటఁ దీర్థప్రజవలె భక్తులు ప్రోగై కలసిమెలసి వర్తింతురు.

తొలుత శ్రీ శివాజియు రామదాసస్వామి గొప్ప యవతార పురుషుఁడని మహాత్ముఁడని ఉపదేశమునకు వచ్చెను. ఉపదేశముతో వారల సమావేశము ముగియలేదు. ఆ కాలమున దేశమును సంక్షుభితపఱచు రాజకీయ వ్యవహారములన్నియు వారిచర్చలోనికి వచ్చెను. ఆచరణ మునకుఁ బ్రణాళిక లేర్పడెను. శివాజిని తీర్చి దిద్దినవి రామదాసస్వామి దివ్యబోధలే. అనేక సందిగ్ధ సమయములలో రామదాసస్వామి కర్త వ్యము నుపదేశించును. అట్టి దుర్ఘటసమయములో సమావేశము కుదుర దేని దాసబోధ నొకమాఱు పఠించుకొనుము. కర్తవ్యము బోధపడునని

చెప్పుచుండువాఁడు. ఆకారణముచే దాసబోధ శ్రీ శివాజికిఁ బారాయణ గ్రంథము. దాసబోధయే శివాజిని దేశభక్తునిగను హిందూధర్మరక్షకుఁడుగను లోకోత్తరపురుషునిగను జేసినది. సమర్థుని యుపదేశసారము శివాజిచక్రవర్తిమనమును మననముజేసిన నో ఆధ్యాత్మికానందమును దేశభక్తిని సాధింపఁగలుగుదుము. ఈ పవిత్ర సంకల్పముతోనే దాసబోధను ఆంధ్రమున బరివర్తనముఁజేసి వ్యాప్తికెంతయో పాటుపడితిమి. కార్యశూరులగు సోదరాంధ్రుల నీ దాసబోధ యాకర్షింపకుండునా!

అద్వైత దృష్టిలోఁజూచినను వ్యవహారదృష్టితోఁ జూచినను దాసబోధ మిగుల మహత్త్వముగల గ్రంథరాజము. ఈ గ్రంథ ప్రశస్తికి విషయకల్పన మనుకూలముగ నున్నది. మొదట మూఁడు దశకములలో ఐహిక జీవితమున మానవుఁ డెఱుంగఁదగిన నీతులెన్నెని గలవు. భాగవతమునందుఁ జేర్కొనిన నవవిధ భక్తులపై వ్రాయఁబడిన వ్యాఖ్యానమనదగు నాలుగవ దశకము ప్రశంసనీయము. సమర్థుఁడైదవ దశకము నుండి వేదాంతచర్చకుఁ గడంగెను. గురునిశ్చయమునఁ జెప్పఁబడిన యంశములను సద్గురులక్షణమునఁ జెప్పఁబడిన యంశములును సంపూర్ణముగ సమర్థ రామదాసస్వామి కన్వయించును. శిష్యలక్షణము లటులె శివాజి చక్రవర్తి కన్వయించును. ఐదవ దశకమంతయు నిటులె సద్గురు సచ్ఛిష్య లక్షణముల కుదాహరణముగ నున్నది. వేదాంతభావము లిటనుండియె సూచింపఁబడెను. ఆఱవ దశకము దుర్గమమగు నద్వైత నిరూపణము. సమర్థుఁడు శ్రీరామానుగ్రహమునను ఆత్మ ప్రతీతివలనను గ్రహించిన యపూర్వ విజ్ఞానమున కీదశకమునుండి యాధారములు లభించును. సమర్థుఁడు సంస్కృతమునను మహారాష్ట్రమునను గల వేదాంత గ్రంథముల నన్నింటిని గాలించెను. ఎంతటి దుర్ఘట విషయమునేని సమన్వయించుటలో ఆతని కపూర్వమగు నైపుణ్యముగలదు. వక్తృత్వ మనన్య సాధారణమైనది. ఆచరణమునఁ గళంకమే లేదు. ఆయన యాశయము ప్రపంచోద్ధరణము. కావుననే శివాజియంతటి మహారాజు సమర్థునికడ ముగ్ధుఁడై పాదాక్రాంతుఁడై కనుసన్నలలో మెలంగెను. నిస్సంగుఁడగు తుకారామ్ సమర్థుని మహత్త్వము దెలుపు సద్గురు నిశ్చయమును బఠించెను. దాసబోధయందలి లఘుబోధ శివాజికై ప్రత్యేకముగ రచింపఁబడినది. సృష్టిని

గూర్చినకథ సమర్థుని యపూర్వకల్పనాశక్తికిఁ దార్కాణము. ఉపని
షత్తులు, ప్రస్థానత్రయము మున్నగు వేదాంతగ్రంథముల భావము కర్మ
యోగమని శ్రీలోకమాన్య తిలకుగారు తన కర్మయోగమునందు నుడివి
యున్నారు. సమర్థుఁడు ఈ నిరూపణమునందు లోకమాన్యునకు మార్గ
దర్శకుఁడుగాననే పలుతావుల దాసబోధనుండి తనవాదమునకాధారములు
లోకమాన్యుఁడు గైకొనెను. ఆదర్శపురుషుఁడును సర్వజ్ఞచూడా
మణియు నగు శ్రీ సమర్థ రామదాసస్వామి తన వృత్తాంతము నిట్లు
చెప్పుకొనుచున్నాఁడు.

"ఆత్మజ్ఞానము పురాణములను జదువుటచే నెఱుంగఁబడదు.
దానిని వర్ణించివర్ణించి వేదములు విసిగిపోయెను. కాని శ్రీ సద్గురుమూర్తి
యనుగ్రహమువలన నేనిప్పుడు మీ కందఱకు దానినే చెప్పుచున్నాఁడను.
సంస్కృతము, మహారాష్ట్రము మున్నగుభాషా గ్రంథములందు నా
కేమియుఁ బ్రవేశములేదు. కాని నాహృదయమునందు కృపామూర్తియగు
సద్గురుస్వామి నివసించి విరాజిల్లుచున్నాఁడు. కావున నిపుడు ప్రస్తుతాం
శమును దెలుపుటకు నాకు సంస్కృత ప్రాకృత గ్రంథములతో నెట్టి
యావశ్యకమును లేదు. దాస—5—6"

సమర్థుని నిరాడంబర జీవితమునకును, సహజజ్ఞానమునకును
నుదాహృతభాగములు చాలును. వేమనవలె సమర్థుఁడు తోఁచినయంశము
నెల్ల విమర్శించుచుఁదనకు వెగటుగఁదోఁచినవెల్ల దూషించుచుఁ బోవలేదు.
చెప్పఁదలచిన యంశము విస్పష్టముగను, సుబోధముగను శాస్త్రాను
కూలముగను జెప్పెను. అంతతోఁ దృప్తిజెందక శిష్యులడుగు సందేహ
ములఁ బురస్కరించుకొని సోదాహరణముగ మఱలఁ జర్చించెను.
సుబోధార్థమై చెప్పినయంశమును మఱలఁ జెప్పెను. కడకు విసిగి యింత
జెప్పినను దెలిసికొనజాలరేమియని శిష్యుల నెత్తిపొడిచెను. తత్త్వగ్రహణ
మున యోగ్యులెవరో తొలుత నిర్ణయించి యేరుకొనిన శిష్యులు విషయ
గ్రహణమునఁ బరాకువహించినందులకుఁ గినియుట గురుధర్మమే గదా!
బ్రహ్మనిరూపణము, మాయానిరూపణము, కేవలబ్రహ్మము, కల్పనా
నిరసనము. మున్నగు నంశములలో సమర్థుఁడు తెలిపినయంశము లాతని
సర్వతోముఖవిజ్ఞానమునకుఁ దార్కాణముగా నున్నవి. అలౌకిక మూర్తి

యగు శ్రీసమర్థుని యుపదేశరహస్యములు మానవునిఁ గర్తవ్యోన్ముఖుని
గావించుటకుఁ దత్త్వరహస్యముల నెఱింగించి వైదికమతాభిమానిని
జేయుటకుఁ దగియున్నవి.

ఆర్యావర్తమున ఋషులుసైతము లోకకళ్యాణమునకై శ్రుతి
స్మృతీతిహాసముల రచించిరి. వాత్స్యాయన కామందక శుక్రాదులు రాజ
నీతుల నెఱింగించిరి. బౌద్ధులు తమమతమును కేవలనైతికముగ సంస్క-
రించిరి. జైనులు ప్రజలకు నిరాడంబరము, భక్తిభావము అహింస
బోధించిరి. భర్తృహరి ప్రముఖులు సర్వకాల సర్వావస్థలందు మానవ
జీవితమున కుపకరించు నీతివైరాగ్యబోధకములగు గ్రంథముల రచించిరి.
శంకరుఁడు, రామానుజుఁడు, మధ్వస్వామియు భాష్యముల రచించి
వేదాంతచర్చలలోఁ బాల్గొనిరి. అంతియగాని సంక్షుభితమైయున్న
ఆర్యావర్తమును మేల్కొల్పి స్వాతంత్ర్య సంపాదనమునకు హితవెఱింగింప
రైరి. మాధవ విద్యారణ్యులు ఆంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నమైన పిదప
విద్యానగర సామ్రాజ్యమును స్థాపించుటకుఁ బ్రోత్సహించి హరిహర
రాయలను, బుక్కరాయలను ముందునకుఁ ద్రోచెను. అనంతర మాయన
సన్న్యాసము స్వీకరించి పీఠాధిపతియయ్యెనేగాని పరాధీనమగుజాతి నుద్ధ
రింపఁ దలంపలేదు. తిక్కనసోమయాజి, తిమ్మరుసుమంత్రి, కార్యఖడ్గ
ప్రవీణులు బ్రహ్మజ్ఞులెయయ్యు యేకదేశీయమగు గ్రంథరచనమునకుఁ
దమ సంస్థానపాలనమునకు నుసురులొడ్డిరిగాని ప్రపంచకళ్యాణమునకుఁ
బాటుపడరైరి. వేమన లోకమంతయు నజ్ఞానభూయిష్టముగనున్నదని
కానవచ్చిన దురాచారమును ఖండించెను. నీతిబోధించెను. లోకోద్ధరణ
మునకుమాత్ర మించుకేనియుఁ ద్రోవఁజూపలేదు. తులసీదాసు, జ్ఞానదేవు,
బమ్మెరపోతరాజు, తుకారాము కేవల భగవద్భక్తులు. ప్రపంచాతీతులు.

సమర్థుఁ డీకవుల తెగలోనివాఁడుకాఁడు. కవితాకల్పనమునఁ
దిక్కనసోమయాజి. బ్రహ్మచర్యాశ్రమమున భీష్ముఁడు. తత్త్వబోధనమున
వేమన. శ్రీరామభక్తిలో లక్ష్మణుఁడు. లోకోద్ధారణమునఁ జాణక్యుఁడు.
లోకవిమర్శమునఁ బ్రపంచజ్ఞానమున క్షేమేంద్రుఁడు. ధర్మసంస్థాపనమున,
బోధనాపాటవమున, శాంతజీవనమున బుద్ధుఁడు. యుక్తిప్రయుక్తులలో
యుగంధరుఁడు. రాజనీతిలో బృహస్పతి. సమర్థరామదాసస్వామి నెల

కొల్పిన పీఠములు కావించిన లోకోద్ధరణము దెలుపు టీక ప్రత్యేకించి యిందుఁగలదు. సమర్థుని నవతారపురుషునిగా మహారాష్ట్రులు పరిగణించు చున్నారు. శివాజిని, సమర్థుని నరనారాయణావతారములుగఁ బలువురు తలంచుచున్నారు. సమర్థుఁడు, శివాజిమూర్ధాభిషిక్తుఁడగునట్లుఁ దదేక దీక్షతో మహారాష్ట్రరాజ్యమును వృద్ధికిఁదెచ్చెను. అనేక క్లిష్టపరిస్థితులలో శివాజికిఁ గర్తవ్యముపదేశించెను. తన తపస్సు, జీవితము శివాజికొఱకు వినియోగించెను. మహాత్ముఁడగు నీ సమర్థరామదాసస్వామి నెంతని ప్రశంసింపఁగలము. సన్న్యాసియయ్యు లోకాభ్యుదయమునకు, ధర్మసంస్థాపనమునకు జీవితమును ధారబోసి తన శిష్యపరంపరను, మఠాధిపతులను గనుసన్నలలో సంచరింపఁజేసి ఆర్యావర్తమునకు గర్మయోగమును బ్రబోధించి యిహపరలోకములకుఁ ద్రోవఁజూపిన శ్రీ సమర్థరామదాసస్వామి జన్మము లోకోత్తరము. అనన్య సామాన్యము.

దాసబోధ బహుభాషలలో ననువదింపఁబడెను. సుప్రసిద్ధుఁడగు రామదాసస్వామి చరిత్ర మితిహాసములందును, బురాణములందును, భక్త జీవితములందును బ్రచురింపఁబడెను. మహారాష్ట్రదేశమున శివాజి సామ్రాజ్యమును రామదాసస్వామిరాజ్య మందురు. మహారాష్ట్రదేశమున రామదాసస్వామి చిత్రపటములేని భవనములేదనుట యతిశయోక్తిగాదు. సమర్థుఁడు స్థాపించిన మఠములలోఁ జాల నిప్పటికిని మహారాష్ట్రదేశమునఁ బలుతావులలోఁ గలవు. సమర్థుని సమాధిచెంత నేటికిఁ బూజాపురస్కారములు జరుగుచున్నవి. శివాజి ధర్మపత్ని యొసంగిన గ్రామములపై వచ్చు నాదాయముతో సమర్థునివర్ధంతి మహావైభవముగా మహారాష్ట్రులు జరుపుచున్నారు. రామదాసస్వామి కృతమగు దాసబోధను యథారూపముగ భావము, ఉద్దేశము, శైలి తగ్గనీక మాధవరావు సప్రేమహాశయుఁడు హిందీభాషలోనికి మార్చెను. ఈయనను హనుమాన్ గఢవర్ధా నివాసియు రామదాస మఠాధీశ్వరుఁడును నగు శ్రీధర విష్ణురామజపే బి. ఏ. గారు పదమూఁడుమాఱులు పఠించిన పిదప హిందీలోఁ బరివర్తనముజేయుమని యాజ్ఞాపించిరి. గురునాజ్ఞ శిరసావహించి గ్రంథరచనమును రాష్ట్రభాషలో మాధవరావు సప్రేగా రనువ

దించుటచే సమర్థుని బోధనామృతము జనులెల్లరు గ్రోల నవకాశము లభించెను.

హిందీ దాసబోధ మహారాష్ట్ర గ్రంథమునకు సరిగనున్నదో లేదో చూచి లోపములుసవరింప మహామహులగు హిందీమహారాష్ట్ర విద్వాంసులైదుగు రొకసంవత్సరము శ్రమపడి పరిశోధించి యన్నిరీతుల మెఱుఁగు బెట్టి అమూల్యమగు గ్రంథవిమర్శమును బ్రసాదించి గ్రంథప్రశస్తి నతిశయింపఁజేసిరి. మహారాష్ట్రులు సమస్తవిధముల హిందీ భాషాంతరీకరణమునకుఁ దోడ్పడి 1912 లోఁ బ్రచురించినపిదప వేలకొలది ప్రతులు వ్యయమయ్యెను. లోకమాన్యుఁడు హిందీగ్రంథమునుగూడఁ దానుదాహరణముగఁ గైకొంటినని కర్మయోగమున బ్రచురించెను. ఇందుచే హిందీదాసబోధ మూలగ్రంథమునకు సరియగు ననువాదముగానఁ జాలవఱకు హిందీ ననుకరించియే యీ యాంధ్రానువాదము రచింపఁబడెను. ఆంధ్రానువాదము ప్రచురించుటలో శ్రీ సమర్థుని దివ్యాశీర్వాదమే తోడైనది. యథాశక్తి గ్రంథ సంస్కరణముగావించి యీ గ్రంథమిప్పటికి సమర్పింపఁగలిగితిమి. విజ్ఞులు లో ప ము ల ను దె లి పి న మూడవకూర్పున సవరింతుము.

సమర్థుఁడు భద్రాచల రామదాసునకును, వేమనకును కర్ణాటకవియగు సర్వజ్ఞునకును సమకాలికుఁడు. సమకాలిక గ్రంథములందులేని రాజకీయపరిస్థితులు, ప్రజాభావములు, స్వతంత్రోద్యమధర్మములు విశేషించి చర్చింపఁబడిన కతన దాసబోధ లోకోత్తరగ్రంథముగఁ పరిగణింపఁబడెను. కావున గ్రంథసమాలోచకులచే ననుభవపూర్వకముగ విమర్శమున వ్రాయఁబడిన "ఏపని నీగ్రంథము ప్రప్రథమమునఁ జేసిచూపెనో యాపనినే యది భవిష్యత్కాలమునందుఁగూడఁ జేసిచూపఁదగియున్నది"ను వాక్యముపైఁ గలవిశ్వాసమే గ్రంథ ప్రచురణమునకు మమ్మిన్ని విధములఁ బ్రోత్సహించి సిద్ధసంకల్పులఁ గావించెను.

ఏకదీక్షగా గ్రంథపఠనము, భాషాంతరీకరణపరిశీలనము, శుద్ధప్రతిలేఖనము మున్నగు పనిపాటలచే మాకు దాసబోధతో నొకసంవత్సరము యెడతెగని పరిచయము గలిగెను. సమస్తవిధముల మా జీవితమును

సంస్కరించుకొన నీ గ్రంథరాజము తోడయ్యెను. చిరకాల సహవాసము చేసిన మిత్రుని యెడబాటువలె నొకగడియయేని దాసబోధ జదువకున్న దోచుటలేదు. లోకోత్తరమగు నీ పవిత్రగ్రంథము లోకమునకు నైతికము యిటులె యుపకరించె నేని గ్రంథము నాంధ్రలోకమునకు సమర్పించిన మేము ధన్యులము.

రామదాసస్వామి జీవిత మాకర్షణముగ నుంటకై యందుం దెనుగుపద్యములను మేమె వ్రాసితిమి. ఆంగ్లీకరణమున అనువాదకుల యనుమతినొంది కొన్ని తావుల విషయము సుబోధమగుటకుం బెంచితిమి. మూర్ఖలక్షణమునను దాసత్రయలక్షణములందును ఇతర స్థలముల యందును గల మకుటములు తగ్గించి గ్రంథమునం జప్పుడుగారు తెలుంగురచనల నలరిం చితిమి. సాధ్యమగునంతవఱకు గ్రంథము శబ్దము గ్రాంథిక భాషలో ననువాదకులు నిర్దుష్టముగనే వ్రాసిరి. కొన్నితావుల ముద్రణస్ఖాలిత్య ములు దొరలినవి. ఏయే పద్యమున కేది యనువాదమో తెలియుటకై హిందీగ్రంథము నందువలె నిందును బద్యసంఖ్య యొసంగియుంచితిమి. స్వాతంత్ర్య వీరుఁడగు శ్రీ శివాజిచక్రవర్తియొక్కయు, శ్రీ రామదాస స్వామియొక్కయుఁ బటములు పూనాచిత్రశాలా ప్రెస్సునుండి తెప్పించి గ్రంథమున జేర్చితిమి. అందందుఁ జ్యూతసంస్కార దోషములు ఆంగ్లీకరణ ప్రమాదములునున్నచో తృతీయముద్రణమున సవరింతుము. గ్రంథ ప్రచురణమునకు అవకాశము గలుగఁజేసిన అనువాదకులకును గ్రంథపఠనము ముందుగనొసంగి గ్రంథముకొఱకు నిరీక్షించిన పాఠక సోదరులకును మా గ్రంథమాల పాఠకవర్గమునకును గృతజ్ఞులము.

ఇట్లు భాషాసేవకులు,

నందిగామ,
1—4—29.

శేషాద్రిరమణకవులు, శతావధానులు,
కాకతీయ గ్రంథమాలా
సంపాదకులు.



# రెండవకూర్పు పీఠిక.

---

దాసబోధ మొదటికూర్పు ప్రతులు 1100 చాలకాలము క్రింద కర్చుపడెను. ప్రకటనలకుఁ బెద్దమొత్తము వ్యయమయ్యెను. ఆంధ్రదేశము నందుఁ బలుతావులనుండి పుస్తకములకు జాబులు రాసాగెను. రెండవ కూర్పునకుఁ బ్రయత్నములు నెరవేరకపోవుట యటులుండ ముద్రణ కాగితములు నాలుగురెట్లు పెరిగెను. కర్తవ్యముతోఁచక యూఱకుంటిని. దాసబోధ మా పక్షమున విక్రయించుచున్న సుప్రసిద్ధ వ్యాపారులు స్వల్ప ప్రతిఫలమునకు కాపీరైటు విక్రయించుమని కోరిరి. మఱియొక వర్తకుఁడు ఒక మార్పునకైన అవకాశము గల్పింపుఁడనియు లేకున్న కాపీరైటు యిచ్చినఁ బెద్దమొత్త మిత్తుననియు స్వయముగా నడిగెను. నిష్కామ కర్ముఁడగు శ్రీ సమర్థరామదాసుని కృతి యమ్ముటకు సాహసింపనైతిని. మొదటివారు మరల నాంగ్లీకరింప యత్నించుచుండిరని తెలిసినది. రెండవ వారు నా దాసబోధకుఁ బాఠాంతరములతో వేఱొక దాసబోధ సిద్ధము జేసి ముద్రణముచేయనుండిరని వింటిని. ఈ రెండవవారు కేవల వ్యాపారులు. గ్రంథమువలని లాభము నెఱుంగుదురుగాని గ్రంథము సుప్రసిద్ధులచే వ్రాయించి సర్వాంగసుందరముగ ముద్రించి ప్రకటించు ఔదార్యము లేనివారు. ఏ తప్పుల తడికనో ముద్రించి వేలకువేలుప్రతులు విక్రయింపఁగల వర్తకధర్మ విజ్ఞానులు. స్వయముగా దాసబోధను ముద్రించుటకుఁ దగిన ద్రవ్యమూ లేదు. ఊరకయున్న గ్రంథప్రశస్తి కొఱతపడును. ఏమి చేయుటకుఁ దోఁచదు. ఈ స్థితిలో ఉద్యోగపరిమితి ముగిసినది. సంసార యాత్ర జరుగుట దుస్తరమగుచుండ ఈ వీరక్షామకాలమున వేలు కర్చు పెట్టుట సాధ్యముకానిపని. రామదాసస్వామీ! నీ దాసబోధను నేను ప్రకటింపఁజాలను. నీవె యీగ్రంథమును వెలువరింపవలయును. అని యాలోచనా పరంపరలతోఁ గలఁత నిద్దురతో రేయిగడపితిని. మఱునాటి యుదయమున శ్రీ సద్గురు మలయాళస్వాముల వారియొద్దనుండి శ్రీ ఆగయ్యగారు హనుమకొండకు విచ్చేసి స్వాములవారు దాసబోధను ముద్రింపనున్నారు. మీ యంగీకారముకొఱకు వచ్చియుంటినని చెప్పిరి. శుభమని యంగీకరించితిని. అనతికాలములోనె శ్రీ స్వాములవారు

నిర్దుష్టముగా మునుపటికంటె సుందరముగాఁ ద్వరితముగా ముద్రణము చేయించిరి.

రామదాసస్వామి బహు గ్రంథకర్త. ఆయన వ్రాసిన గ్రంథములలో మనస్సంబోధన శ్లోకములు అను మహారాష్ట్రగ్రంథము చిన్న దైనను విషయము గొప్పది. దానిని పద్యరూపముగాఁ దెనిగించితిని. రామదాసస్వామి జీవితము మానసిక క్లేశములతో స్వాస్థ్యములేనితఱి దిన మునకుఁ బది పద్యములవంతున కావ్యముగ వ్రాయ నారంభించితిని. గ్రంథము 800 పద్యములతో ముగించితిని. గ్రంథము పూర్తియగుటతో మానసిక క్లేశములు మటుమాయమయ్యెను. అదిమొదలు గృహదైవత ముగా రామదాసస్వామి మూర్తిని ఆరాధించుచున్నాఁడ. దాసబోధ నిత్యము పారాయణగ్రంథములలో నొకటిగఁ జేసికొంటిని. పవిత్రతర మగు రామదాసస్వామి బోధనామృతము ఆంధ్రసోదరులు తనివిదీఱఁ గ్రోల శ్రీ మలయాళస్వాములవారు అవకాశము కలుగఁజేయుటచే నెంతయో సంతసము గలిగినది. రెండవకూర్పులో గ్రంథకర్త జీవితమునఁ గ్రొత్తవిషయములు జేర్పవలయు ననియుఁ దాత్త్వికాంశములకు వివరణ ములనొసంగవలయునని సంకల్పించితినిగాని నెరవేరలేదు. సొంతపనులలోఁ దిరుగుచుండుటచే గ్రంథముద్రణ భారములన్నియుఁ దమమీద వదలినను శ్రద్ధతోఁ గార్యమును జయప్రదముగా నిర్వహించిన శ్రీ వేదవ్యాస ముద్రణాలయాధికారులకుఁ గృతజ్ఞుఁడ.

ఆధ్యాత్మిక గ్రంథప్రచురణముతోఁగాక ఆర్షధర్మవ్యాప్తికి సర్వ విధములఁ బ్రయత్నించుచు జిజ్ఞాసువుల నుద్ధరించుటయే పరమార్థముగఁ బెట్టుకొనిన శ్రీ శ్రీ శ్రీ మలయాళస్వాములవారి యౌదార్యముచే ఈదాసబోధ ద్వితీయముద్రణము చూడఁగల్గితినని సంతసించుచున్నాఁడ.

ఇట్లు, భాషాసేవకుఁడు,

దూపాటి వెంకటరమణాచార్యులు

(శేషాద్రిరమణకవులు)

హనుమకొండ,
15—10—55.

## దాసబోధపై మహాత్మాగాంధిగారొసంగిన అభిప్రాయమునకు తెనుగు తరుమా.

ప్రియ మిత్రమా ! . బెజవాడ, 12—4—1929.

మీ జాబుచేరినది. సమర్థరామదాసస్వామి గ్రంథములు బొంబాయి రాజధానియందు యెక్కువ ప్రచారములో నున్నవి. ప్రజలుత్సాహముతో నా గ్రంథములఁ బఠించుచుందురు. ఆయన నిస్సందేహముగా గొప్పబోధకుఁడు. ఆ కాలపు జనులకు, శివాజీమహారాజునకుఁ దనపై గొప్పసదుద్దేశమును కలిగించుకొనెను. ఎం. కె. గాంధి.

---

## దాసబోధపై లోకమాన్య తిలకుమహాశయుఁడొసంగిన అభిప్రాయము.

కర్మయోగము సన్న్యాసమున కంగమనియు లేక సాధనమనియు శ్రీ సమర్థ రామదాసస్వామివారు దాసబోధలో నిరూపించిరి. అంతియగాక కర్మమార్గముయొక్క సత్యమహత్త్వము శుద్ధముగఁ దేటతెల్లముగఁ జెప్పిరి, కాన నెఱుంగఁ గోరువారు శ్రీ సమర్థుల దాసబోధను, అందుపై తము ముఖ్యముగ నుత్తరార్థమును జదువవలెను. శ్రీ సమర్థులవారి యుపదేశమె శ్రీ శివాజి మహారాజుగారికి లభించెను. (తర్జుమా)

---

## దాసబోధపై కొమర్రాజు వేంకటలక్ష్మణరావు ఎం. ఏ., గారి యభిప్రాయము.

శివాజి రామదాసుల చరిత్రము (దాసబోధ) సంసారులకు,సన్న్యాసులకు అనుకరణీయమే. రామదాసు రాజ్యధర్మముల సంపూర్ణముగ నెఱింగినవాఁడు గానఁ దన దాసబోధయందు రాజ్యప్రకరణములో శకకర్తలకుఁ గావలసిన ధర్మములు కడునేర్పుగ వర్ణించియున్నాఁడు. ఈ గ్రంథమునందలి యీ భాగమేగాదు కడమ గ్రంథమంతయు అనుభవ పూర్ణముగను అమృతము చిప్పిలునట్లుగను నున్నది.



# ఆంధ్ర దాసబోధ విషయసూచిక.



### ఆఱవ దశకము.



### ఏడవ దశకము.



### ఎనిమిదవ దశకము.



### తొమ్మిదవ దశకము.



### పదియవ దశకము.



### పదునొకండవ దశకము.

## పండ్రెండవ దశకము.



## పదమూఁడవ దశకము.



## పదునాలుగవ దశకము.



## పదునేనవ దశకము.



## పదునాఱవ దశకము.



## పదునేడవ దశకము.

పదునెనిమిదవ దశకము.



పందొమ్మిదవ దశకము.



ఇరువదవ దశకము.







శ్రీ సమర్థ రామదాసస్వామి.

ఓమ్

# శ్రీ సమర్థరామదాస జీవితము.

* "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్" ॥
(భగవద్గీత ४-७)

ధర్మమునకు హానిగలిగినపుడు సాధుజనులను రక్షించుటకును, దుష్టులను వినాశము గావించుటకును, ధర్మమును స్థాపించుటకును బర మాత్ముఁ డవతరించునను సిద్ధాంతముపై సనాతన ధర్మావలంబు లంద అకు సంపూర్ణమగు విశ్వాసముగలదు. ఈ విశ్వాసము ననుసరించియే మనము శ్రీరాముని, కృష్ణుని, విష్ణుమూర్తిని అవతారపురుషులుగా భావించుచున్నారము. ఇట్లే మహారాష్ట్రదేశమునందు మహానుభావుఁడును ధర్మసంస్థాపకుఁడును జితేంద్రియుఁడునగు శ్రీ సమర్థ రామదాసస్వామిని హనుమంతుని యవతారముగా నమ్మెదరు. దీని కనుగుణముగా నచటికి విద్వాంసులు భవిష్యత్పురాణమునందున్న యీ క్రిందిశ్లోకమును ఉదా హరణముగాఁగూడ జూపుచున్నారు.

శ్లో॥ "కృతే తు మారుతాఖ్యశ్చ త్రేతాయాం పవనాత్మజః ।
ద్వాపరే భీమసంజ్ఞశ్చ రామదాసః కలౌ యుగే ॥

ఆంజనేయునకు ఏయేయుగములం దేయే యవతారములుండెనో యీ శ్లోకమునఁ జెప్పఁబడెను. సత్యయుగమగు కృతయుగమునందలి హనుమానుని యవతారమును మారుతియందురు. త్రేతాయుగమునందుఁ బవనాత్మజుఁడందురు. ద్వాపరయుగమునందు భీష్ముఁడందురు. కలియుగ మునందు రామదాసు అని నుడివెదరు. శ్రీరామదాసస్వామివారు తనను గూర్చి చెప్పుకొను తావులయందుఁగూడ నీ భావము కొలఁదిగనో గొప్ప గనో ధ్వనించుచున్నది. శ్రీ రామదాసస్వామి సామాన్యమానవుఁడు

* అర్జునా ! ధర్మమునకు హానికలిగి అధర్మమునకు వృద్ధియేర్పడుచున్న కాలము నందు నేను భూలోకమునందు మాయచేత జనించి వచ్చుచున్నాఁడను.

గాఁడు. గొప్పభగవద్భక్తుఁడు. యోగ్యతరుఁడగు సాధువు. రాచికుఁడగుకవి. ఇంతియగాదు విశేషించి రాజనీతికోవిదుఁడుగూడ నై యుండె ననుటకు సందియములేదు. ఆయన చరిత్రము, లీలలు అనుపమానములు. ఆతఁడు యవనపద దళితమై పరాధీనదశయందుండి తొల్లింటి సత్త్వమును గోల్పోవనున్న మహారాష్ట్రదేశమునందు జనించి తన యప్రతిమమగు నిస్పృహత్వము, పారమార్థికము, శిక్షణము వెల్లడించి స్వధర్మస్వరాజ్య స్థాపనములలోఁ బాటువడి "సమర్థ" పదవిని గడించెను. మహానుభావుఁడగు శ్రీ సమర్థ రామదాసస్వామి జీవితముపూర్తిగా నీ చిన్నిపొత్తమునఁజెప్పుట యసంభవము. ఐనను శక్తికొలఁదిగఁ జరిత్రమును విశదీకరింపఁ బ్రయత్నించెదము.

## వంశపరంపర జన్మము.

దక్షిణదేశమునందు హిందూరాజులు రాజ్యస్థాపనము గావించు కాలమునందు అరణ్యప్రాంతములను నగరములుగా మార్చుటకును, పాడువడిన గ్రామములను పునరుద్ధరించుటకును అన్యప్రాంతముల యందున్న జనులను దమరాజ్యములో నివసించుటకై ధనమును భూమిని నొసంగి కొనివచ్చుచుండిరి. ఆ కాలమున నిజాముపాసిహాపాలమునందున్న బేడరుప్రాంతమునఁగల ప్రజలు పలువురు గోదావరీ నదీతీరమునకు వలస బోయి యచట స్థిరవాసము లేర్పఱచికొనిరి. అటులేగినవారిలో మన కథాంశమునకు మూలపురుషుఁడగు కృష్ణాజిపంతుఠోసరు అను నొక మహారాష్ట్ర బ్రాహ్మణుఁడుండెను. ఆతఁడు శా. శ. ౮౮౪ (క్రీ. శ. 962) లో ఉత్తరగోదావరీ తీరమునందున్న బీడుప్రాంతమునందలి హింబరాయనుగ్రామమునకుఁ జనుదెంచి యందుఁ గుటుంబసహితముగా నివసించెను. ఆతఁడు బీడుప్రాంతమునఁ బెక్కుగ్రామములను స్థాపించెను. ఆయనకు నలువురు పుత్రులుగలరు. పెద్దకొడుకుపేరు దశరథపంతు. ఈ దశరథపంతు తనతండ్రి సంపాదించినయాస్తిలో భాగమును గైకొనుట యుచితముగాదనియు స్వార్జితజీవనము ప్రశస్తమని తలంచి హింబరాకుఁ గొలఁది దూరమునఁగల బడగావునకుఁ బోయెను. ఆ గ్రామమునందు జనావాసము లేకపోవుటచేఁ బాడువడియుండెను. అచ్చటి యరణ్యములలోఁ బశువులగాపరి జాతివాండ్రు గోవులను మేపుకొనుచుఁ గుటుంబములతో నివసించుచుండిరి.

ఆ గోపాలకులలో ముఖ్యుఁడగు "లఖుమాజి" యను వానిని జమీందారునిగఁజేసి దశరథపంతు అచట కులకర్ణి (కరణము) గను బురోహితుఁడుగను బనిచేయుచుండెను. వారలా గ్రామమునకు జాబ్ అని పేరిడిరి. ఈ గ్రామమే శ్రీరామదాసస్వామికి జన్మభూమిగాన నీ కాలమున అత్యంత పవిత్రక్షేత్రముగా భావింపఁబడుచున్నది. అనంతరము జాబు నగరమునకుఁ జుట్టుపట్టుల నెన్నియో గ్రామములుగట్టిరి. ఈ గ్రామములన్నింటికిని గరణికము, పురోహితత్వము దశరథపంతునకే సంక్రమించెను. దశరథపంతు శ్రీరామభక్తుఁడు. అంతియగాక రామమంత్రోపాసకుఁడు. అతనికి ఆఱుగురు తనయు లుదయించిరి. పెద్దవానిపేరు రామాజీపంతు. తండ్రిమరణించిన తరువాత రామాజీపంతు జాబుయొక్కయుఁ బరిసరగ్రామముల యొక్కయు వృత్తుల కధికారియయ్యెను. పై నిఁ జేర్కొన్న కృష్ణాజీపంతు, దశరథపంతు, రామాజీపంతు అనువారలు మన కథానాయకుఁడగు శ్రీ సమర్థరామదాస వంశమునకు మూలపురుషులు. రామాజిపంతునకుఁ బిదపఁ బందొమ్మిదవ తరమునందు సూర్యాజీపంతు అను ప్రసిద్ధభగవద్భక్తుడును, బ్రహ్మజ్ఞానియునగు నొకపురుషుఁడు జనించెను. ఆతని భార్యపేరు రాణుబాయి. ఈ దంపతులే రామదాసస్వామికిఁ దలిదండ్రులు.

మన యార్యావర్తమునందలి భగవద్భక్తుల వంశములలో నొక విపత్రమగు పరిస్థితి కనిపించుచున్నది. ఈ వంశములలోజనించిన బాలురకు నాలుగైదుసంవత్సరముల యీడుననే విరక్తియు, భక్తిలక్షణములును బ్రకటనమగుచుండును. ఈ లోకమున నాలుగైదు వత్సరముల సంస్కారమువలననే యింతటి పరిణామము బాలకులలోఁ గలుగుట యసంభవము. ఈ సంస్కారము పూర్వజన్మసంచితమని తోఁచుచున్నది. సూర్యాజీపంతుస్థితిగూడ నిట్టిదే. బాల్యావస్థనుండియే యీతఁడు భగవద్భక్తుఁడును, విరక్తుఁడునై సద్గుణశాలియని పేరొందెను. పండ్రెండు వత్సరముల ప్రాయమునందె యాతనిభక్తి సూర్యనారాయణమూర్తిపైఁ గుదురుకొనెను. సూర్యాజీపంతు తన కరణికపుఁబనులు జేయుచు మిగిలిన విశ్రాంతి కాలమునందెల్ల సూర్యనారాయణోపాసనమునందే గడుపుచుండెను. ఇట్లు సూర్యాజీపంతు ముప్పదియాఱుసంవత్సరముల వయస్సు

వచ్చువఱకు సూర్యదేవుని యనుష్ఠానము నడిపెను. చివర కొకదినమునకీ సూర్యనారాయణుఁడు ప్రత్యక్షమై సూర్యాజీపంతున కభిమతమునెఱింగి యిరువురు కుమారులు జనించునటుల వరమునొసంగెనని చెప్పుదురు. శా. శ. ౧౫౨౭ (క్రీ.శ.1605)లో సూర్యాజీపంతునకుఁ బ్రథమకుమారుఁడు జనించెను. ఆ బాలునకు గంగాధరుఁడని నామకరణ మొనరించిరి. బాలుఁ డనంతరము దినదినాభివృద్ధినొంది "శ్రేష్ఠ" "రామి రామదాసు" అను నామములతోఁ బ్రసిద్ధుఁడయ్యెను. శా. శ. ౧౫౩౦ (క్రీ. శ. 1608 ఏప్రెలు నెలలో) కీలకనామ సంవత్సర చైత్రశుద్ధ నవమీ దినమునఁ బట్టపగలు రెండుయామముల సమయమున (సరిగా శ్రీరామజన్మసమయమున) సాక్షీ మతల్లియగు రాణుబాయికిని సూర్యాజీపంతునకును ద్వితీయపుత్రుఁ డవత రించెను. ఆ శిశువునకు నారాయణుఁడని నామకరణమొనరించిరి. ఈ నారా యణుఁడే శ్రీ సమర్థ రామదాసస్వామియనుపేరునఁ బ్రసిద్ధినొందిన మహా పురుషుఁడు. ఈతఁడే మన యీచరిత్రమునకుఁ గథానాయకుఁడు. సూర్యాజి పంతుగృహమున నీతఁడు జనించిననాఁటనుండి సుఖసమృద్ధికిని, శాంతికిని గొఱంతలేకుండెను. ఆ కాలమున మహారాష్ట్ర ప్రాంతమునందు "ఏకనాథ మహారాజు" అను సుప్రసిద్ధుఁడగు బ్రహ్మజ్ఞాని యుండెను. సూర్యాజీ పంతు ప్రతిసంవత్సరమును దనభార్యతోఁగూడ నాతనిని సందర్శించుటకు నేగుచుండెను. వారు సూర్యాజీపంతు దర్శనమొనరించి సెలవునొంది వచ్చునపుడెల్ల ఏకనాథస్వామి రాణుబాయినిజూచి "నీ గర్భమునందు ఇరువురు మహానుభావులగు తనయులు జనింతురు" అని యాశీర్వదించి పంపుచుండెను. సమర్థరామదాసస్వామి జనించినపిదప సూర్యాజిపంతు తన భార్యాశిశువులతో నెప్పటివలె ఏకనాథస్వామిని సందర్శింపనరిగెను. ఏకనాథమహారాజు వారలను దనచెంతఁ గొన్నిదినము లుంచుకొని అతిథి సత్కారము లొనర్చించి వారు సెలవునొంది పోవునపుడు ఈ భవిష్యద్వాణి నా పుణ్యదంపతులను సంబోధించి నుడివెను.

"ఓ పూజ్యదంపతులారా! మీరు మిగుల ధన్యులరు. మీ గర్భ ములు ధన్యములు. మీ వంశముగూడ ధన్యమైనది. మీ యుపాసనయు మీ భక్తియు నిరుపమానములు. కావుననే ఆంజనేయుని యంశముతో నీ బాలకుఁడు మీయొద్ద నుత్పన్నమయ్యెను. శివాంశముతోఁ బ్రసిద్ధఛ్ఛత్ర

పతియగు రాజొకఁడు మహారాష్ట్రదేశమునందు జనింపనున్నాఁడు. ఆతనివలన మీకుమారుఁడు భూభారహరణము జేయించును. అంతియ గాక జనోద్ధారణముగూడ నొనరించును. నేనారంభించిన ధర్మకార్యము లన్నియు నీతఁడె సంపూర్ణ మొనరింపఁగలఁడు. ఇకనేను నాయవతారము సమాప్తి గావింపనున్నాఁడను."

ఈ భవిష్యద్వాణిని నుడివిన కొలఁదిదినములకే ఏకనాథస్వామి నిర్యాణమునొందెను.

## బాల్యావస్థ — విద్యాభ్యాసము.

సమర్థుఁడు బాల్యమున నిరంతరము ప్రసన్నహృదయుఁడుగను, హాస్యవదనుఁడుగను నుండువాఁడు. ఏడుపన నెట్టిదియో యాతఁ డించుకేని యెఱుంగఁడు. శీఘ్రకాలముననే యాతఁడు మాటలాడుట కును, నడచుటకును నేర్చుకొనెను. శరీరము దృఢతరముగను తేజో యుక్తముగను నుండెను. అతఁడు చిన్నతనమున మిగుల గొంటివాఁ డుగను ఉపద్రవకారుఁడుగనుండి యెల్లప్పుడును క్రీడాలోలుఁడై గంతులు వేయుచు నిముసమేని నిలిచినచోట నిలువకఁ దిరుగుచుండెను. చపలత్వ మాతనికి రోమరోమమున నిండియుండెను. వానరునివలె నిచటినుండి యచటికిని అచటనుండి యిచటికిని దిరుగుచుండుటయుఁ దనవెంటనుండు బాలురఁజూచి మూతి వికారముగాఁబెట్టి యఱచుటయు వెక్కిరించుట యు నాతని కొకయాటగా నుండెను. ఈ బాలుఁడు హద్దుపద్దులు లేకుంటచే నపాయకరములగు దుండగము లొనరించుచున్నాఁడని తల్లిదండ్రులు గమనించి యొక యుపాధ్యాయునికడ నప్పగించి చదువ వేసిరి. ఉపాధ్యాయుఁ డాకాలమునఁ జెప్పువిద్యను జ్ఞానమును నీబాలుఁడు కొలఁదికాలముననే పూర్తిగా నేర్చుకొని మరల నిటునటు ఆడుటకును గంతులు వేయుటకును మొదలుపెట్టెను. గ్రామములోని బాలురను వెంట నుంచుకొని గోదావరీతీరమున కరిగి యచ్చటి వృక్షములమీఁదికి వానరమువలె నెక్కుచుండెను. ఒకచిన్న వ్రేలాడుకొమ్మమీఁదికిగూడ నాతఁ డత్యంత సులభముగా నెక్కుచుఁ దిరుగుచు నుండెను. ఒకొ్కక్కప్పుడు గొప్పగొప్పవృక్షముల కొనకొమ్మలకు నెగఁబ్రాఁకి వాని నూఁపుచుండును. ఒకొ్కక్కప్పుడు వృక్షాగ్రముననుండి క్రిందనున్న బాలు

రకుఁ దగులునటులఁ బండ్లగుత్తుల ద్రెంపి విసరివైచుచుండెను. చెట్లనెక్కు
టలో నాబాలునకుఁగల సామర్థ్యమునుగాంచి జనులెల్ల రాశ్చర్యపడు
చుండిరి. ఆతని వెంటనుండు బాలురు చెట్లెక్కి కొమ్మల నూపుచుంటఁ
జూచి “అయ్యయ్యో! నారాయణుఁడు పడెఁబడె”నని తఱచుగా నఱచు
వాడుకగలదు. నీటిలోనికిఁ జెట్లమీఁదినుండి దుముకుటయు, ఈఁదుటయుఁ
గూడ నాబాలునకు మిగుల బ్రియముగానుండెడిది. ఇట్లు గ్రామబాహ్య
ప్రదేశమున నాబాలుఁడాటలాడుచుండువాఁడు. ఇంతియగాక గ్రామములో
నున్నంతసేపుగూడ నిటులే చేయువాఁడు. ఒకానొకప్పు డొకయింటికప్పు
మీఁదినుండి గోడమీఁదికిని, మఱియొకప్పు డొకవృక్షాగ్రమునుండి యొక
యింటిమీఁదికిని దుముకువాఁడు. ఆబాలకుఁడు చేయుబాల్యలీలల నన్నిం
టినిగాంచి జనులంద ఱితఁడు హనుమదవతారముగఁ దలచిరనుటలో
నాశ్చర్యమేమియునులేదు. ఆటలయం దత్యాసక్తిగలవారై చాపల్య
ముగాఁ దిరుగు బాలురు ప్రౌఢావస్థకువచ్చినపిదప గొప్పప్రతిభాశాలురగు
దురని కొందఱు విశ్వసింతురు. ఈ విశ్వాసము సమర్థుని విషయమునఁ
జాలదనుక సరిపోవుచున్నది. ఐదవసంవత్సరము సమర్థునకు వచ్చియురాక
ముందె సూర్యాజీపంతు ఉపనయనము మిగుల వైభవముతో జరిపెను.

ఉపనయనానంతరము సూర్యాజీపంతు సమర్థునకు సంధ్యావంద
నాదికములను నేర్పుటకై యొక వైదికబ్రాహ్మణుని నియోగించెను.
సమర్థుఁ డాబ్రాహ్మణునికడ అక్షరములను మనోహరముగా వ్రాయు
టయు, నిత్యనైమిత్తిక కర్మము లొనరించుటయు నభ్యసించెను. సంస్కృ
తముగూడఁ గొంతవరకు నేర్చెను. సూర్యాజీపంతు అంతలోఁ బరలోక
గతుఁడయ్యెను. సోదరు లిరువురును దండ్రికి ఉత్తరక్రియలు గావించిరి.
తండ్రి గతించినపిమ్మట గంగాధరుఁడు తన సోదరుఁడగు సమర్థుని విద్యా
భ్యాసము నెడ దృష్టినుంచి శ్రద్ధతోఁ జదివించుచుండెను. సమర్థుని గ్రంథము
లను గాంచితిమేని యాతఁడు సంస్కృతమునందు మంచిపండితుఁడని గోచ
రించును. పాండిత్యమునందేగాక ఉపనిషత్తులు, భగవద్గీతలు మున్నగు
నాధ్యాత్మిక గ్రంథములందుఁగూడఁ జక్కనిపరిచయము సమర్థుఁడు సంపా
దించెను. తనకుఁగల వేదాంతగ్రంథానుభవమును దాసబోధలోని మొట్ట
మొదటి సమాసములో విపులముగాఁ జెప్పియున్నాఁడు. సమర్థుఁడు వేద

మున కర్థము స్వయముగ గ్రహించునంతటి పాండిత్యముగలవాఁడనియు బహుశ్రుతత్వముచే వేదాంతవిషయమున అగాధమగు పరిజ్ఞానము గడించెననియుఁ జెప్పవచ్చును.

## మంత్రోపదేశము.

సమర్థరామదాసస్వామి సహజముగా బాల్యమునుండియే భగవద్భక్తియుక్తుఁడై యుండెను. భగవానుని దివ్యనామము నాతఁడు నిరంతరమును స్మరించుచుండెను. తండ్రి గతించినపిమ్మట నాతనికి విరక్తి భావ ముదయించెను. క్రమముగా నా విరక్తిభావ మతిశయించి వృద్ధి గాంచఁ దొడంగెను. సమర్థుని యన్నయగు శ్రేష్ఠునిగూర్చి కొంతవఱకె మన మెఱింగియున్నారము. మహారాష్ట్రదేశస్థులు రామదాసును హనుమదవతారముగా భావించునటులె *శ్రేష్ఠుని సూర్యనారాయణావతారముగా భావించుచుండిరి. శ్రేష్ఠుఁడు సదాచారుఁడు, బుద్ధిమంతుఁడు. ఆతఁడు వంశపరంపరాగతమగు శ్రీరామమంత్రము చిరకాలము జపించి సిద్ధినొందెను. అందుచే నాతని శ్రీరామభక్తుఁడనియు రామోపాసకుఁడనియుఁ బ్రజలుతలంచి యుపదేశార్థము తీర్థప్రజలవలె వచ్చుచుండిరి. శ్రేష్ఠుఁడు వారలనందఱ నాదరించి మంత్రోపదేశము గావించి భక్తిమార్గమునందుఁ బ్రవృత్తులఁ గావించుచుండెను. ఒకదినమున భక్తుఁ డొకఁడు శ్రేష్ఠుని సన్నిధికి ఉపదేశార్థ మేతెంచెను. శ్రేష్ఠుఁ డనుగ్రహపూర్వకముగా నాతని నాదరించి మంత్రదీక్ష నొసంగి భక్తిమార్గము నుపదేశించెను. ఇదియంతయుఁ జూచుచున్న సమర్థుఁడు ఏకాంతమునఁ దన యన్నను సమీపించి "అగ్రజా! నాకును మంత్రోపదేశము గావింపుము" అని పలుతెఱంగులఁ బ్రార్థించెను. శ్రేష్ఠుఁడు తమ్ముని బుజ్జగించి "సోదరా! నీవు మిగులఁ జిఱుతవాఁడవు. మంత్రోపదేశమునకుఁ దగిన పాత్రత నీకింకను సమకూరలేదు. కొంతకాల మాగినపిదప నుపదేశించెదను" అనిచెప్పెను. సహజభక్తిభావుఁడగు సమర్థున కామాటలు వెగటుగాఁదోఁచెను. హృదయము మంత్రోపదేశమునకై తొందరించుచుండెను. అన్నతోఁ దర్కించిన లాభములేదని సమర్థుఁడొంటరిగా నిల్లువిడిచి

* ఈయనకు శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠరాముఁడు, గంగాధరుఁడు మున్నగునవి వ్యవహార నామములు.

బయలుదేరి తమగ్రామమునకు వెలుపల గోదావరీతీరముననున్న ఆంజనే యాలయమున కరిగి మారుతిని ప్రార్థించుచుండెను. ఈ బాలుని నిష్ఠయు భక్తిపారవశ్యము ఆంజనేయుని హృదయమును గరగించెను. ఆంజనేయుఁ డాబాలునియెడఁ గనికరించి నిజరూపముతోఁ బ్రత్యక్షమై “కుమారా! మంత్రోపదేశముకొఱకు నీవేల యింత తొందరపడెదవు? ఇంకను గొంత కాల మాగు”మనెను. సమర్థుఁడు మాఱుపలుకఁజాలక తన హృదయము నందుఁగల యుపదేశాతురత బహిరంగపరచెను. హనుమంతుఁ డాబాలుని యచంచలభక్తికి నిర్మల హృదయమునకు నానందించి శ్రీరామచంద్ర మూర్తిచే దర్శనము నిప్పించెను. శ్రీరామచంద్రుఁ డాబాలుని ననుగ్రహ దృష్టితోఁజూచి మేను నివిరి “శ్రీరామజయరామ జయజయరామ” యను త్రయోదశాక్షరీ మంత్రరాజము నుపదేశించి “కుమారా! భూమండలమునం దంతటను మతాంతరులు వ్యాపించియున్నారు. దుర్నీతి రాజ్య మొనరించుచున్నది. దుష్టు లధికారములలో నున్మదులై యుండి భగవద్భక్తులు శాంతవ్రతులు నగు సాధువులను బీడించుచున్నారు. ధర్మము తగ్గిపోవుచున్నది. కావున నీవు వైరాగ్యవృత్తితోఁ గృష్ణాతీర మునందు నివసించి ఉపాసనా జ్ఞానమార్గములను వృద్ధిగావించి లోకోద్ధరణ మొనరింపుము” అని యాజ్ఞాపించెను. ఇట్లు శ్రీరామచంద్రమూర్తి వలన నుపదేశము ననుజ్ఞనొంది బాలసమర్థుఁడు పరమసంతోషము నందెను. ఈ వృత్తాంతము నాలకించి యాతని మాతయగు రాణు బాయియు నితరబంధువులును పరమానంద భరితులైరి. అదిమొదలు యుక్తవయస్సు వచ్చువఱకును సమర్థుఁడు భగవద్భజనముతోఁ గాలము గడుపుచుండెను.

## వివాహ ప్రసంగము.

తల్లి దనకుమారుపయి నెన్నియో ఉత్సాహపూరితములగు కోరికలను బెట్టుకొనియుండును. ఆకోర్కెలలోఁ “గుమారునకుఁ ద్వరగాఁ బెండ్లి కావలయును. కొడుకు కోడండ్రు కలిసి కాపురము జేయుట జూడవలయును” అను కోరిక ప్రబలమైనది. సమర్థుని మాతయగు రాణు బాయిగూడ నటులె తనపుత్రుఁడగు బాలసమర్థునకుఁ జిన్నతనముననే వివాహము జరుపఁదలంచెను. వివాహ సంబంధములగు మాటలను విని

నంతనే సమర్థుఁడు మిగుల నసహ్యించుకొనుచు నానావిధముల విరక్తిని వ్యక్తముచేయుచుండెను. ఒకమారు ఇటులె వివాహప్రసంగము తల్లి తీసికొని వచ్చుసరికి సమర్థుఁడు గృహమునువిడిచి యడవులకు వెళ్ళిపోయెను. అన్నయగు శ్రేష్ఠుఁడెన్నియో నీతులు తమ్మునకు బోధించి బుజ్జగించి యెంతయో శ్రమపడి యింటికిఁ గొనివచ్చెను. కుమారుఁ డిటుల వివాహమునకు విముఖుఁడై విరక్తిగానుంటఁజూచి రాణుబాయి మిగుల వగచుచుండెను. శ్రేష్ఠుఁడు తమ్ముఁడగు నారాయణుని విరక్తిభావము గమనించి ఇఁక నీతఁడు వివాహమాడఁడు. వీనితో వివాదించి లాభము లేదని తెలిసికొని పెండ్లిప్రయత్నము మానివేసెను. అంతియగాక తల్లితో నారాయణుఁడు కారణజన్ముఁడనియు వివాహమున కియ్యకొనఁడనియు నీ ప్రయత్నము మానుటయే యుక్తమనియుఁ బలుతెఱంగుల విన్నవించెను. రాణుబాయి తన పట్టుదలను వదలక నారాయణున కెటులైన వివాహము జేసిదీరవలయునని యనుచుండెను. ఒకదినమున రాణుబాయి యవకాశము గల్పించుకొని నారాయణుని నేకాంత ప్రదేశమునకు గొనిపోయి ముఖము నివురుచుఁ బ్రేమసూచకములగు మృదుమధుర వాక్యములతో నిటులఁ జెప్పెను:

"పుత్రా! నామాట నంగీకరించెదవా లేదా?"

"మాతృదేవీ! ఈ విషయమై నన్నడుగవలయునా? ప్రత్యక్షదైవతమగు కన్నతల్లిమాట నంగీకరింపకున్న నింక నెవరిమాట నంగీకరించెదను? 'న మాతుః పరదైవతమ్' అని శాస్త్రములు సైతము జెప్పుచున్నవిగదా."

"మంచిది! అట్లైనచో నేను వివాహప్రసంగము దెచ్చినపుడెల్ల నీవు వెఱ్ఱిచేష్టలను జేయుచుందువేల? ఇఁకముందు అట్లుగావించెదవేని 'నాయాన' అని యొట్టుపెట్టుచున్నదానను. కళ్యాణ మండపమునం దంతరపటము (తెఱ) పట్టుకొనునంతవఱకు వివాహ విషయమై యాటంకము నించుకేని చెప్పఁబోకుము."

ఆమాటలువిని సమర్థుఁడు చకితుఁడయ్యెను. కొంతదనుక యోచించి యిట్లు ప్రత్యుత్తరము జెప్పెను. "తల్లీ! నీయాజ్ఞప్రకారము నేను కాండపటము బట్టునంతవఱకును అనంగీకారమును బ్రకటింపను."

అమాయికురాలగు రాణుబాయి కుమారుఁడు తన మనోరథము జెల్లింప గలడని మిగుల నానందించెను. సమర్థునివాక్యలం దిమిడియున్న భావార్థ మామె కొంచెమేని గ్రహింపలేదు. తన కుమారుఁడు వివాహమున కంగీకరించెనని యామె విశ్వసించి వెంటనే యావిషయము తన జ్యేష్ఠ కుమారుఁడగు శ్రేష్ఠునకు దెలిపెను. తల్లియొక్క యమాయికవృత్తియు సోదరుని యచంచలదీక్షయు నెఱింగిన శ్రేష్ఠుఁడు తల్లినిప్పుడే నొప్పింపనేల యని తనలోఁ దానించుక నవ్వుకొని "ఎందుల కొప్పుకొనఁడు?" అని మాత్రము నుడివి యూరకుండెను.

సమర్థుఁడు వివాహమున కంగీకరించినయంశము రాణుబాయి తన బంధు సముదాయమునకుఁ దెలిపెను. పదుగురి సమ్మతిని బడసి ప్రాచీనసంబంధియు సంపన్నుఁడు నగు నొక గృహస్థుఁడు తన కుమారిని నారాయణునకీయ నిశ్చయించెను. వివాహప్రయత్నములు మహత్తర ముగా జరుగుచుండెను. లగ్నతిథినాఁడు శ్రేష్ఠుఁడు సమస్తబంధువర్గమును వెంటనిడుకొని మహావైభవముతోఁ దరలిపోయి కన్యాదాత గృహమున బ్రవేశించెను. సమర్థుఁడందఱితోఁబాటు సంతోషముగా బయలువెడలెను. ఆతనిముఖమున విరక్తిచిహ్నములు గోచరించుటలేదు. సీమంత పూజనము, పుణ్యాహవాచనము మున్నగు శుభవిధులు జరుగుసమయ మున శ్రేష్ఠసమర్థు లిరువురును నొకరినొకరు జూచికొని మందమందముగ నవ్వుకొనిరి. ఆ మందహాసమునందలి భావము నెవ్వరెఱుంగరైరి. కొంత సేపటికిఁ గాండపటమును బట్టుకొను తరుణమేతెంచెను. బ్రాహ్మణులు మంగళాష్టకములు జదువుట కారంభించి అందఱు నొక్కమాఱుగా "సావధానమ్ సావధానమ్" అని నుడివిరి. ఆ మాటవిని సమర్థుఁడు తనలోఁ దానిట్లు యోచించుకొనెను "నేను నిరంతరమును సావధానుఁడుగనున్నాఁ డను. అట్లున్నను మఱల నీ బ్రాహ్మణులు సావధానుఁడవు గమ్మని నుడువు చున్నారు. కాన నీ శబ్దమునందేదియో భేదము తప్పక యుండితీరవలెను. మాతృదేవిగూడఁ గళ్యాణమండపమునందుఁ గాండపటము బట్టుకొను నంతవఱకుమాత్రమే తన యాజ్ఞఁ బాలింపుమని యాజ్ఞాపించినది. ఆమె యాజ్ఞ పూర్తియైనది. నావాగ్దానమును నేను సంపూర్ణముగ నెరవేర్చితిని. ఇఁక నేనిచట నేల కూర్చుండి యుండవలెను? నిజముగా నేనిప్పుడు సావ

ధానుఁడఁ గావలయును.” ఈ విధముగా యోచించి సమర్థుఁడు కళ్యాణ మండపమువిడిచి వెడలిపోయెను. ఆతనిఁ గొనివచ్చుటకై యెందఱో జనులు వెన్నంటిరి. ఎందఱు వెంటఁబడినను సమర్థుఁడు చిక్కలేదు. వివాహమండపమునఁ గోలాహల ముదయించెను. కొంతవడి కాయుద్వేగ మంతయు శాంతించినపిదప బ్రాహ్మణు లాబాలికను మఱియొకనికిచ్చి వివాహము చేయవచ్చునని శాస్త్రాధారములతో సమ్మతుల నొసంగిరి. సమర్థుఁడు వివాహవేదికనుండి యెచటికో వెడలిపోయెనని విని రాణుబాయి మిగుల విచారపడెను. శ్రేష్ఠుఁడాయమ నూఱడించి “తల్లీ! నీవించుకేని విచారింపకుము. నారాయణుఁ డెచ్చటనైన నానందముగ నుండఁగలఁడు. వానిని వివాహప్రయత్నములోఁ బడవేయకుమని నేను మొదటినుండియుఁ జెప్పుచుంటిని. కానిమ్ము జరుగవలసినదెద్దియో యది జరిగినది”అని తెల్పెను.

## టాకలియందుఁ దపశ్చర్య.

వివాహ సమయమునందు సమర్థుఁడు సావధానుఁడై బయలుదేరి రెండుమూఁడుదినములు తన నివాస గ్రామమగు జాబ్ నగరము చెంత నున్న పంచవటిలో దాఁగియుండెను. అచటనుండి యనంతర మాతఁడు నాసిక పంచవటి కరిగెను. ప్రకృతకాలమున ధూమశకటములపై సులభముగాఁ బ్రయాణము జేయువార లాకాలపుఁ బ్రయాణశ్రమల నూహింప జాలరు. పండ్రెండు సంవత్సరముల బాలుఁడు శా.శ. ౧౫౪౨(క్రీ. శ 1620) ప్రాంతమున జాబునుండి నాసికపంచవటిదనుక వందలకొలదిమైళ్ళు పాద చారిగాఁ దిరుగుటలో నెన్నెన్ని శ్రమలొందెనో యెట్లు చెప్పగలము? ఈ యంశమున కనుకూలించునట్లు భర్తృహరి చక్కగా నుడివెను.

“మనస్వీ కార్యార్థీ గణయతి న దుఃఖం న చ సుఖమ్॥”

కార్యమొనరించు పురుషార్థియు సాహసియునగు మహాత్ముఁడు సుఖదుఃఖములను లక్ష్యముజేయఁడు. ఇట్టి మహాత్ముల లక్షణములు చిన్నతనమునుండియే ప్రకాశింప నారంభించును. సమర్థుఁడు నాసికకుఁజేరి పంచవటియందు శ్రీ రా మ చ ం ద్ర మూ ర్తి ని దర్శించి యచటికిఁ దూర్పున రెండుమూడుమైళ్ళు దూరమునందున్న టాకలియను గ్రామమున కరిగెను. అనంతర మాగ్రామమునకు వెలుపలనున్న పురా

తనము విస్తృతమునగు మహావృక్షముయొక్క నీడలో నొక కుటీరమును నిర్మించుకొని వసింపసాగెను.

టాకలిలో సమర్థుఁడు తపస్సుచేయ నారంభించెను. ప్రాతఃకాల మునలేచి గోదావరికి స్నానార్థమేగి రెండుజాములదనుక మొలలోతు నీటిలోనిలిచి జపముచేయును. రెండుజాములైనపిమ్మటఁ బంచవటికి మధుకర భిక్షార్థమై చని దొరికిన పదార్థమును తన యిష్టదైవతమగు శ్రీరామచంద్రమూర్తికి నివేదించి భుజించుచుండెను. పిదపఁ గొంచెము సేపు భజనగావించి సాయంకాలమైనంతన జపధ్యానములందు నిమగ్నుఁ డగుచుండెను. ఆతఁడు మంత్రపురశ్చరణము భజనము మున్నగువానితోఁ గాలముగడుపుచు నితరులతో మాటలాడక పరుల గృహమున కేగక స్థిరదీక్షగా వర్తించెను. నిత్యమును నీటియందు నానుటచే సమర్థుని దేహము నందు నడుమునకుఁ గ్రిందిభాగమంతయు నాని తెల్లబడిపోయెను. పాద ములందలి మాంసము మోఁకాళ్ళయందలి చర్మము జలచరములు కొరికి తినుచుండెను. సమర్థుఁ డాసమయమునందు జపతపములలోఁ దన్మయుఁడై యుంటచే జలచరములు తన దేహమాంసమును దినివేయు సంగతియే యెఱుంగఁడు. మహాత్ములు దేహసంబంధములగు సుఖదుఃఖ ములపై ధ్యానముంచునెడ వారలకు ఈశ్వరభక్తి యెట్లు సిద్ధించును? దేహసుఖము నారయువారలు జనోద్ధరణమున కెటులుపయోగింతురు?

సమర్థుఁ డీవిధముగాఁ బండ్రెండుసంవత్సరములు ఘోరమగు తపస్సు గావించెను. కఠినతపశ్చర్యలవలన అంతఃకరణశుద్ధి యేర్పడును. "మనస్సే బంధమోక్షములకుఁ గారణము." చంచలమగు హృదయ మును దపస్సు గావింపకపోయినచో నెవ్వఁడును స్వాధీనపఱచుకొనఁ జాలఁడు. మనస్సును జయించినవాని కద్భుతమగు సామర్థ్యము కలుగును. కామము, క్రోధము, లోభము, మోహము మున్నగు మనో వికారములకు లోనై మనుజుఁడు నానావిధ దుష్కర్మము లాచరించు చున్నాఁడు. తపశ్చర్యయొనరించి శరీరమును బలవంతముగా గ్లేశముల పాలు గావించినచో మనస్సు బలహీనమగును. అంత్యమున మనోజయము సిద్ధించును. మనస్సును జయింపనంతవఱకు ఈశ్వరప్రాప్తికై యొనరించు సమస్త ప్రయత్నములును సంకటములవలన విఘ్నములౌందును.

కావునఁ దపముగావింపకున్నను గష్టములను భరింపఁజాలకపోయినను, పర మాత్మ స్వరూపజ్ఞానము కలుగదనియు, మోక్షము లభింపదనియు, స్వాతంత్ర్యదర్శనము కానేరదనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. సమ ర్థుఁడు తనస్వానుభవముతో దాసబోధయందు ఈ కష్టములనుగూర్చియుఁ దపోమహిమనుగూర్చియు నిట్లు గానముజేసెను.

కం॥ శ్రమపడక యున్న యడల ఫ। లము దొరుకదు రాజ్యలక్ష్మి లభియింపదు క ష్టము దుఃఖము సైపనియెడ। సమకూరదు సౌఖ్యఫలము జనసంతతికిన్.*

శ్రీ సమర్థస్వామి యీ విధముగాఁ బన్డ్రెండుసంవత్సరములదనుక మిగుల దృఢచిత్తముతోఁ దపముగావించెను. ఆ కాలమున ఋషులవలె మునులవలె మాయాయుతములగు సంకటము లెన్నియో యాతని నావరించెను. ఆ విఘ్నముల నాతఁ డించుకేని లక్ష్యము చేయకుండెను. తపముగావింపునపుడు అనేకమారులు శ్రీరాముఁడు దర్శనము నొసంగి "ఇక నీవు తపశ్చర్యను ముగింపుము. కృష్ణాతీరమునకరిగి జనోద్ధరణ కార్యము నారంభింపుము" అని యాజ్ఞాపించెను. కాని సమర్థుఁ డంతకు మున్నె సంపూర్ణముగా మనోజయము సిద్ధింపనిది, శరీరమునందు జనో ద్ధరణ మొనరించు సామర్థ్యమేర్పడనిది నేను కార్యరంగమునం దడుగిడ" నని దృఢప్రతిజ్ఞ గావించుకొనెను. చివరకు మనోవికారములకిఁక నా శరీరమున స్థానములేదని బాగుగాఁ దెలిసికొన్నపిమ్మట సమర్థుఁడు తపస్సు చాలించెను. సమర్థుఁడు టాకలీలోఁ దపస్సు గావించుకొనునపుడు గట్టు కొన్న కుటీరములో నాంజనేయమూర్తిని స్థాపించి యచటఁ బూజాదిక ములు జరుపుటకై ఉద్ధవగోస్వామియను భక్తుని నియమించెను. తరు వాత సమర్థుఁడు పాదములకుఁ బావుకోళ్లును, చేతియందు జపమాలయు, చంకలో సంచియు, సొరకాయపాత్రయుఁ, దలపై టోపీయు దేహమున నిడుపాటి చొక్కాయుధరించి తీర్థయాత్ర దేశపర్యటనము గావించుటకై యొక శుభముహూర్తమున బయలువెడలెను.

---

* కష్టేవిణ ఫలనాహీం కష్టేంవిణ రాజ్యనాహీం.
ఆథింక స్టాచేం దుఃఖసోసితీ। తే పుఢేం సుఘాచేం ఫలభోగితీ ॥

కష్టపడకున్న ఫలము లభింపదు. కష్టపడకున్న రాజ్యము లభింపదు. తొలుదొలుత కష్టములని దుఃఖమనుభవించినవాఁడు సుఖఫలము ననుభవించును.

## తీర్థయాత్ర — దేశపర్యటనము.

ఇంద్రియ నిగ్రహము గావింపవలయునన్నచోఁ దీవ్ర తపము గావించి మనోజయము ప్రాపించుట యెట్లవశ్యమో యట్లే లోకోద్ధరణము ధర్మస్థాపనము గావింపవలయునన్న దేశపర్యటన మొనరించి దేశస్థితినిఁ దీర్థయాత్రలొనరించి ధర్మస్వరూపమును గ్రహించుట యవశ్యము. సమస్తదేశములు తిరిగి జనసమాజ మే దశలోనున్నదో యెఱుంగుట దేశోద్ధారకులకుఁ గర్తవ్యము. తీర్థక్షేత్రములకరిగి స్వధర్మమునకు హానికరములును ధర్మప్రచారమునకు విఘ్నకరములును నగు కారణములేమేని యున్నచోఁ బరీక్షించుటయు ఉద్ధారకుల ముఖ్యధర్మము. సమర్థుఁడు సమస్తమగు భరతఖండమున ఉత్తరమునుండి దక్షిణమువఱకును, దూర్పునుండి పశ్చిమమువఱకును బాదచారిగాఁ దిరిగి సమగ్రముగ దేశకాల పరిస్థితులు గమనించెను. అతనికిఁ జేతిలో నొక పగిలిపోయిన గవ్వయైన లేకుండెను. ఉదరనిర్వహణార్థమాతఁడు భిక్షావృత్తి నాశ్రయించెను. భిక్షావృత్తిని సమర్థుఁడు కేవల ముదరపోషణార్థమై స్వీకరించెనని మనము భ్రాంతిపడరాదు. అందులకుఁ బ్రత్యేకకారణముండెనని మనము గమనింపవలయును. భిక్షావృత్తినిగూర్చి సమర్థుఁడు తన దాసబోధయం దిట్లు నుడివియున్నాఁడు.

కం॥ భయరహితము భిక్షావృ । త్తియ, దానమహత్త్వమబ్బు దేవుఁడుచిక్కున్
బయ మును స్వాతంత్ర్యశుభో । దయమబ్బును భిక్షకతనఁద త్త్వజ్ఞులకున్ ॥*

భిక్షాటనము గావించుటకు హేతువు కేవలము పొట్టనించుకొనుటయేగాక స్వదేశదశను దెలిసికొనుటకేయైనచో దేశోద్ధారకునకు నిస్సందేహముగా భిక్షావృత్తినిమించిన సాధన మింకొకటిలేదు. శ్రీరామదాసస్వామి స్వానుభవముతో నీ యంశమునుగూర్చి పలుతావులఁ జెప్పినాఁడు. తాను భిక్షాటన మే యుద్దేశముతోఁ గావించుచుండెనో యది యొక తావున నిట్లు స్పష్టముగా జెప్పియున్నాఁడు:

---

* భిక్షామ్హణిజే నిర్భయస్థితీ । భిక్షేనేం ప్రగటే మహంతీ
స్వతంత్రతా ఈశ్వరప్రాప్తి । భిక్షాగుణేం ॥

భిక్ష నిర్భయస్థితిగలది. భిక్షవలన మహత్త్వము వెల్లడియగును. భిక్షవలన నీశ్వరుఁడు లభించును. స్వాతంత్ర్యముగూడ లభించుచున్నది.

క॥ పల్లెయును నగరమును నిల్లిల్లును విడనాడకుండ వీక్షింపఁదగున్ ।
పిల్లలను బెద్దలను మఱి యెల్లర భిక్షామిషన్ బరీక్షింపనగున్ ॥*

ఇటులఁ జేయుటవలనఁ బ్రజలసుఖదుఃఖములను లోకోద్ధారకులు గ్రహింప వీలుచిక్కును. ప్రజలవలన నుద్ధారకు లేవేని క్రొత్తసంగతులు గ్రహింప వీలుకలుగును. తమ భావములు ప్రజలకు బోధింప నవకాశము చేకూరును. ప్రకృతకాలమున మన భరతవర్షమున బిచ్చగాండ్రకుఁ గఱవు లేదు. సమర్థుని మతానుసారముగా లోకోద్ధరణమును దృష్టియందుంచుకొని భిక్షాటనముగావించు భిక్షుకుఁ డొకఁడేని లభించుట కష్టతరమనుట కెంతయో విచారమగుచున్నది.

రామదాసస్వామి భిక్షావృత్తితో జీవయాత్ర గడుపుచు గ్రామములు, నగరములు, అరణ్యములు, కొండలు దిరుగుచుఁ దొలుదొలుత తీర్థరాజమగు కాశీక్షేత్రము ప్రవేశించెను.

సమర్థుఁడచట గంగాస్నానమొనరించి విశ్వనాథుని సందర్శించుటకై యాలయమున కరిగెను. అక్కడఁ గొందఱు బ్రాహ్మణులు రుద్రాభిషేకము గావించుచుండిరి. కాషాయవర్ణలిప్తమగు నిడుపాటిచొక్కాయు, జడలుగట్టిన వెండ్రుకలనాచ్ఛాదించియున్న టోపీయుఁజూచి యచటనున్న బ్రాహ్మణులందఱును వీఁడెవఁడో బ్రాహ్మణేతరజాతికిఁ జెందిన బైరాగి యనితలంచి సమర్థుని లింగముకడకుఁ బోనీయకపోయిరి. సమర్థుఁడు గొంచెమేని కోపమందక "ఇది శ్రీరామచంద్రప్రభుని సంకల్పముకాబోలును" అనిపలికి తానున్నచోటుననేయుండి బ్రాహ్మణులకును విశ్వేశ్వరునకును సాష్టాంగదండప్రణామ మాచరించి యచటినుండి మఱలెను. అతఁడు మఱలిపోవుటయే తడవుగా సమర్థునివారెంచి రుద్రాభిషేకము గావించుచున్న బ్రాహ్మణులందఱకును లింగము కాన్పింపకపోయెను. బ్రాహ్మణులందఱును మిగుల భయపడిరి. చివరకు వారలందఱు నిది మనచే వంచితుఁడైన బైరాగి గావించిన చమత్కారమేగాని మఱియొకటిగాదని నిశ్చ

---

*క్షుద్రగ్రామేం అథవా నగరేం । పాహావీం ఘరాంచీం ఘరేం ।
భిక్షామిసేం లహాన థోరే । పరీక్షూన సోడావీం ॥

క్షుద్రగ్రామమైనఁ గానిమ్ము, నగరమైనఁ గానిమ్ము, ఇంటింటిని వదలక చూడ వలయును. భిక్షామిషతోఁ జిన్నలను బెద్దలను సమస్తవిధ మానవులను బరీక్షింపవలయును.

యుంచుకొనిరి. వారిలోఁగొందఱు బ్రాహ్మణులు పరుగుపరుగునఁబోయి సమర్థునిగాంచి ప్రార్థించి సవినయముగా నాలయమునకుఁ గొనివచ్చిరి. అందఱు బ్రాహ్మణులును దామొనరించిన సాహసమునకు క్షమింపుమని విశ్వేశ్వరుని బశ్చాత్తాపబుద్ధితోఁ బ్రార్థించి రామదాసస్వామిని దమ లోపములను క్షమింపుమని వేఁడుకొనిరి. కొంతసేపటికి లింగము యథావిధిగా బ్రాహ్మణులందఱకును గోచరించెను. అనంతరము సమర్థుఁడు విశ్వేశ్వరుని బ్రార్థించి కొన్నిదినములు కాశీనగరమున వసించెను. అపు డాయన కాపట్టణముననున్న మహాత్ములతోఁ బరిచయమయ్యెను. వారలవద్ద సమర్థుఁడు శ్రద్ధాభక్తులతో వివిధానుభవముల గుర్తెఱింగెను. కొంతకాలమున కాతఁడు కాశీనగరమును విడిచి గయా, ప్రయాగ క్షేత్రములకుఁ బోయివచ్చెను. కాశీనగరమునందలి యొకభాగమునకు హనుమాఘ్ఘట్టమని పేరు. కాని యందు ఆంజనేయాలయము లేదు. సమర్థుఁ డాలోపము దీరుటకై యచట ఆంజనేయుని బ్రతిష్ఠజేసెను.

కాశీనుండి సమర్థుఁడు బయలుదేరి తనకుఁ బరమప్రియమును ఇష్టదైవమునగు శ్రీరామ జన్మభూమియైన అయోధ్యకుఁ బోయెను. అచ్చట సరయూనదిలో స్నానమాడి ఆలయములకరిగి శ్రీరాముని ఆంజనేయుని సందర్శించి కొన్నిదినము లందు నివసించెను. అయోధ్యా మాహాత్మ్యము నాలించెను. తరువాత మథుర, బృందావనము, గోకులం మున్నగు తీర్థక్షేత్రములలోఁ గొన్నిదినములుండి స్నానములు, దేవదర్శనములు గావించుకొని యచటనున్న సాధు సత్పురుష బృందముతోఁ బరిచయముజేసికొని యటనుండి ద్వారకకు మఱలెను. ద్వారకకుఁజేరి శ్రీనాథుని సందర్శించెను. తీర్థవిధులను విధివిధానము ననుసరించి నెరవేర్చెను. పిండార్క—ము — ప్రభాసము మున్నగు క్షేత్రములకేగి యచ్చట గూడఁ దీర్థవిధు లాచరించెను. తీర్థాటన మన్నను ఆచారరక్షణమన్నను సమర్థున కెంతయో యభిమానము. ఈ భావములు వచ్చునటుల దాసబోధలో సమర్థుఁ డిట్లు చెప్పెను.

చ॥ సారవిచార చిత్తుఁడగు సాధువు శక్తి కొలందిగాఁగ నా
చార విధానరక్షణము సల్పుట ధర్మము; యాతఁడే సదా

చార విదూరుఁడైనయెడ జాతికి ధర్మువెఱుంగఁజేయఁ ను
ద్ధారకుఁ డెట్టులౌ, నెటుల తత్త్వమతందు గ్రహింపఁజాలెడిన్ ॥
చ॥ అనిశము తీర్థయాత్రలకునై తిరుగాడుజనుండు దైవతం
బును గురుతింపఁగావలయుఁ, బూనికతోడుత నంతరాత్మనుం
గనవలె శ్రద్ధగల్గి మనఁగావలె నట్లొనరింపకున్నచోఁ
జని ఫలమేమి తీర్థములచాయకు? లేవె శిలాదు లంతటన్ ॥

ప్రభాసక్షేత్రమునుండి సమర్థుఁడు బయలుదేరి కొన్నిదినములకుఁ బాంచాలదేశము (పంజాబు) చేరెను. ఆ దేశమునఁ బ్రసిద్ధములగు గ్రామములు నగరములుజూచుచు సమర్థుఁడు కొన్నిదినములకు శ్రీనగరము జేరెను. అచటనున్న నానకుమతాభిమానులగు సాధువులతో శ్రీ రామదాసస్వామికిఁ బరిచయముగలిగెను. ఆ సాధువులు సమర్థస్వామి పరిచయమునఁ గొలదికాలమున కాత్మజ్ఞానమునందు నిపుణులైరి. శ్రీనగరమున కెవరేని మహాత్ములు వచ్చినచో నచటి సాధువులందఱు వారికడ కేతెంచి వేదాంతవిషయిక ప్రశ్నలనడిగి సందేహములఁ దీర్చుకొనుచుందురు. వారి సందేహములకు సమాధానము నొసంగఁజాలని సాధువుల నెన్నఁడును బరిహాసములాడరు. సమర్థుని యాగమనము నాలకించి యా ప్రాంతమునందున్న ప్రసిద్ధులగు సాధువులందఱును దర్శనమునకరిగిరి. వారిలో గొందఱు సమర్థుని భక్తిపూర్వకముగాఁ గొన్ని ప్రశ్నలడిగిరి. గొప్ప అనుభవముగల మహాత్ములు సైతము సమన్వయించి చెప్పఁజాలని నానకుమతస్థులసందియములన్నింటిని సమర్థుఁడు మాటమాటలోనే నివారించెను సాధువులందఱితని యాధ్యాత్మిక నిరూపణమునకు విస్మయము నొందిరి. వారలందఱును బ్రార్థనపూర్వకముగాఁగోరి శ్రీ రామదాసస్వామి నొక మాసమువఱకుఁ దమయొద్ద నుంచుకొనిరి. సమర్థుఁడు సాధువులవద్దనుండి సెలవు గైకొనునప్పుడు ఆ సిక్కుగురువు లందఱునువచ్చి మంత్రదానమునకై చేతులుమోడ్చి ప్రార్థించిరి. సమర్థుఁడు వారల కిట్లుచెప్పెను.

"మీ గురువును మహానుభావుఁడు నగు నానకుస్వామి మునల్మానులచేఁగూడ రామ, రామయని పలికించిన ధన్యుఁడు. మీ సంప్రదాయమున కాతఁడు అనుగ్రహించిన యుపదేశము తక్కువదిగాదు. మీరలు నానకుస్వామి యేర్పఱచిన మార్గమును సార్థకము గావింపుఁడు. ఇదియ నేనొసంగు మంత్రదానము."

శ్రీనగరమునువిడిచి సమర్థుఁడు హిమాలయమున కరిగెను. హిమాలయమునం దాతఁడు బదరీనాథము, కేదారఖండము, ఉత్తర మానసములు సందర్శించెను. హిమాలయమునఁగల యొక మహోన్నత శృంగముపై "శ్వేతమారుతి" స్థానముగలదు. అచటి శీతాధిక్యమునకు వెఱచి యెవ్వఁడునుబోఁడు. పూర్వము అద్వైతమతస్థాపకులగు ఆదిశంకరులవార లొక్కరు మాత్రమే యంతదనుకఁ బోయిరి. శ్రీసమర్థుఁడాశిఖరమునెక్కి హనుమానుని దర్శించి కొలఁదికాలమునకుఁ దిరిగివచ్చెను. సమర్థుఁడీవిధముగా నుత్తరబశ్చిమయాత్రలు పూర్తిగావించి పూర్వ భాగమునందున్న జగన్నాథమునకు బయలుదేరెను.

జగన్నాథము (పూరీ)లోఁ బ్రవేశించినపిమ్మట పద్మనాభుఁడను పేరుగల బ్రాహ్మణుఁడొకఁడు సమర్థుని శరణమున కేతెంచెను. అతనికి మంత్రోపదేశముగావించి రామదాసీయ సంప్రదాయము నెఱింగించెను. పూరిలో సమర్థుఁడు శ్రీ రామచంద్రమూర్తిని స్థాపించి మఠవ్యవస్థ పద్మనాభునకే యప్పగించెను. జగన్నాథస్వామి దర్శనానంతరము సమర్థుఁడు పూర్వ సముద్రతీరమునఁ బ్రవాసముగావించుచు దక్షిణమునఁగల రామేశ్వరునకుఁ బోయెను. అచట దేవదర్శనము అర్చనపూజనములు గావించి లంకకుఁబోయెను. లంక కేగినపు డాతనికి శ్రీరాముని సేవకులగు విభీషణుఁడు ఆంజనేయుఁడు జ్ఞాపకమునకువచ్చిరి. అచ్చోట సమర్థుఁడు కొన్ని దినములు నివసించి విభీషణ సంప్రార్థనరూపముగఁ గొన్ని పద్యములు రచించెను. లంకనుండి మఱలి సమర్థుఁడు ఆదిరంగము, మధ్యరంగము, అంత్యరంగము, శ్రీ జనార్దనము, దర్శసేనము మున్నగుక్షేత్రములకరిగి దేవదర్శనము గావించుచు గోకర్ణ మహాబలేశ్వరమునకుఁ జేరెను. అచటఁ గొన్ని దినము లుండి శేషాద్రి కేగెను. అనంతరము శ్రీ వెంకటేశము (తిరుపతి) శ్రీశైల మల్లికార్జునము, బాలనరసింహాము, పాలకనరసింహాము, శచోటి, వీర భద్రము అను పురాణప్రసిద్ధములగు పంచలింగములను సందర్శించి కిష్కింధానగరము జేరెను. అచటి పంపాసరోవరము ఋష్యమూక పర్వతము మున్నగు రామాయణ ప్రసిద్ధస్థానములు దర్శించి శ్రీ కార్తిక స్వామిసేవింప దేవగిరిమీఁది కేగెను. అచటినుండి దక్షిణకాశియని ప్రసిద్ధి

నొందిన కరవీరక్షేత్రమునకు మరలివచ్చెను. ఆ పిమ్మట కర్ణాట (కొంకణ) మార్గము ననుసరించి సముద్రతీరములను గాంచుచు మహాబలేశ్వరమునకు వచ్చి శ్రీ పండరినాథుని, భీమశంకరుని సందర్శించెను. తరువాత త్ర్యంబకేశ్వరమున కరిగి నాసిక పంచవటికిఁ జేరెను.

సమర్థుఁ డీవిధముగాఁ బండ్రెండుసంవత్సరములు పాదచారియై భరతఖండమునం దంతటను ప్రవాసముసల్పి వివిధప్రకారములగు ఆధిభౌతికతాపముల యనుభవము గడించెను. ఈ ప్రవాసములలో సమర్థునకు బహువిధమానవులతోఁ బరిచయము కలిగెను. భిన్నభిన్నములగు మానవ స్వభావములను బరీక్షించెను. పలుతెఱంగులనున్న సామాజిక, ధార్మిక, రాజకీయ వ్యవహారములను ఆచారములను శోధించెను. భిన్నభిన్న ప్రాంతములందున్న రాజ్యరీతుల నవలోకించెను. సాధుజనులను సందర్శించి యభేద్యములగు అధ్యాత్మరహస్యముల నెన్నింటినో గ్రహించెను. ప్రకృతియందుఁగల చమత్కారములు రమణీయములునగు దృశ్యముల నన్నింటి నానందముగాఁ దిలకించెను. పర్యటనము ముగించునప్పటికి సమర్థునకు స్వదేశసంబంధములగు నవశ్యవిషయము లన్నింటియందును జ్ఞానమేర్పడెను. దేశపర్యటనము తీర్థయాత్రవలన లోకజ్ఞాన మెక్కువ యయ్యెను. ఈ సంపూర్ణ జ్ఞాన పరిపక్వమంతయు నతని గ్రంథములందు వ్యక్తము గావించెను. సమర్థునిగ్రంథము లన్నింటిలో దాసబోధ అను భవజన్యజ్ఞానమునకు సముద్రము. అందు లేనివిషయమేలేదు. ప్రతిభాగము నందును ప్రకృతిలోని మనోహరములు, అపరూపములునగు దృశ్యముల ప్రతిబింబ మీ దాసబోధలో గోచరించును. ఆ మనోహర దృశ్యముల కెంతయని దృష్టాంతమొసంగఁగలము ?

పంచవటికేతెంచి సమర్థుఁడు పంచగంగాస్నానమొనరించి శ్రీరామచంద్రమూర్తి నీ విధముగాఁ బ్రార్థించెను.

"రఘుకులదీపా ! శ్రీరామా ! నేను మీ కృపవలనఁ బండ్రెండు సంవత్సరములుతీర్థయాత్రగావించి దివ్యక్షేత్రములందున్న దేవతలనందఱను దర్శించితిని. పుణ్యతీర్థములలోఁ గ్రుంకితిని. నానావిధములగు విధివిధాన

ములు నిర్వహించితిని. ఈ కర్మముల ఫలస్వరూపమగు పుణ్యమును నేడు మీ చరణారవిందములకు సమర్పించుచున్నాఁడను."

ఈ ప్రార్థనమువలన సమర్థుఁ డెంతనిష్కాముఁడగు మహాపురుషుఁడో యెట్టికర్మయోగియో తేటపడును. సమర్థుఁడు నిష్కామకర్మమాచరించు మహాత్ముఁడనుట కింతకంటె యోగ్యమగు నుదాహరణము లభింపఁజాలదు. ఆతఁడు తనకొఱకై యెద్దియును గోరకుండెను. మనము గావించు మంచిపనులుగాని చెడ్డపనులుగాని మనకొఱకుఁ గాదనియు ఆ యీశ్వరునికొఱకే చేయుచుంటిమనియు, ఆత్మారామునికొఱకే చేయుచున్నారమనియు సమర్థుఁడు దృఢముగా నెఱింగియుండెను. అందువలననే యాతఁడు తన సంపూర్ణ ధర్మకర్మముల పుణ్యఫలమంతయు శ్రీ రామచంద్రుని పాదారవిందముల కర్పించెను.

పంచవటినుండి సమర్థుఁడు పైఠణ్ గ్రామమునకుఁబోయి తమతల్లిదండ్రులకుఁ బరమపూజ్యుఁడును మహానుభావుఁడు నగు శ్రీ యేకనాథ స్వామివారి సమాధిని దర్శించి గోదావరీ ప్రదక్షిణమునకు బయలు దేరెను. మార్గమధ్యమున గోదావరీతీరమునందున్న తన జన్మభూమియగు జాబుగ్రామనికటము సమీపించెను. చిరపరిచితములును బాల్యవిహార రంగములు నగు నా ప్రదేశములఁ జూడఁగనే సమర్థునకుఁ దన తల్లియు అన్నయు జ్ఞాపకమునకువచ్చిరి. వారల సందర్శించి పోవలయునని బుద్ధి పుట్టెను. వెంటనే గ్రామాభిముఖుఁడై బయలుదేరెను.

సమర్థునితల్లి తనప్రియపుత్రుని వియోగమునకు సహింపఁజాలక అత్యంతవ్యాకులచిత్తయైయుండెను. ఆతని జాడయే తెలియదాయెను. దుఃఖకారణమున నాయమకు దృష్టిగూడఁ దగ్గిపోయెను. ఈ యంధావస్థయందామె యితరవ్యవహారములుమాని తన కనిష్ఠకుమారుఁడగు నారాయణునిఁ దదేకనిష్ఠతో స్మరించుచుండెను. ఇరువదినాలుగు సంవత్స

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ (భ. గీ. ౯-౨౭)

అర్జునా! నీ వెద్దానిని భుజింతువో యేహవనము గావింతువో ఏదానమొనర్తువో ఏ తపముజేయుదువో ఏమేమిచేసెదవో దానినంతయు నాకర్పింపుము.

సరిగ నీ విషయమే సమర్థుని యాచరణమునందుఁ బ్రతిపదమునను గోచరించుచున్నది.

రములకుఁ బిమ్మట సమర్థుఁడు దేశభ్రమణ మొనరించుచుఁ దన జన్మ భూమి కేతెంచెను. గ్రామమునకుఁ జేరువలోనున్న హనుమదాలయము నకుఁబోయి వందనములొనరించి సమర్థుఁడు తన యింటికిఁబోయి సింహ ద్వారమునందు నిలుచుండి యుచ్చైస్స్వరముతో "జయజయ శ్రీరఘువీర సమర్థ" అని నుడివి బిచ్చమడిగెను. ఎదురుగానున్న గృహాంగణమున గూర్చుండియున్న యాతని తల్లియగు రాణుబాయి తన కోడలినిబిలిచి "అమ్మా! ఆ బైరాగికి బిచ్చముదెచ్చిపెట్టు"మని చెప్పెను. సమర్థుఁడు కొంచెముముందునకరిగి తనతల్లితో "అందఱు బైరాగులవలె బిచ్చము గైకొనిపోవుటకు వచ్చినవాఁడుకాఁడుసుమా ఈబైరాగి!" అని పలికెను. రెండవసారి సమీపించి స్పష్టముగాఁ బలికినమీఁదట తల్లి యాతనికంఠ స్వరమును గురుతించి తత్క్షణమే "ఏమీ! నా తండ్రి నారాయణుఁడు వచ్చినాఁడా?" అని పలుకుచు లేవబోవుచుండ రామదాసస్వామి మాతృచరణములపై వ్రాలెను. మాతాపుత్రుల నేత్రములనుండి ప్రేమా శ్రుధారలు పొంగి ప్రవహించెను. అపుడు రాణుబాయి కుమారుని మస్తకముమీఁదను ముఖముమీఁదను ప్రేమాన్వితమగు తన హస్త ములతో నివురుచుండ నామెచేతికి నిడుపుగఁబెరిగి వ్రేలాడుచున్న జటా జూటము గడ్డము సోఁకెను. అపు డాయమ మిగుల ఆశ్చర్యముతో నిట్లు నుడివెను. "ఓరీ నారాయణా! నీ వెంతపెద్దవాఁడ వైనాఁడవురా? అయ్యో! కన్నులు గాన్పింపవుగదా! నారాయణు నెట్లు జూడఁగలను?" తన తల్లి నుడివిన దీనవాక్కులు సమర్థుని హృదయమునుఁ గలంచెను. వెంటనే యాతఁడు తన పవిత్ర హస్తముతోఁ దల్లి కనులపై నిమిరెను. తోడనే యామెకుఁ బూర్వదృష్టిగలిగి సమస్తము గనిపించెను. ఆ సమయ మున రాణుబాయి యెదుట నానందతరంగములు ప్రసరించుచుండెను. ఆ యమ కుమారునిముఖము తేరిపారఁజూచి "తండ్రీ! ఈ భూతవిద్య నెచ్చట నేర్చుకొంటివిరా?" యనెను. సమర్థుఁడు వెంటనే యొకపద్యమును రచించి మాతృదేవికిఁ బ్రత్యుత్తరము నొసంగెను. ఆ పద్యభావ మిది.

సీ॥ శ్రీమదయోధ్యాపురీమందిరంబుల నేభూత మొగి జరియించుచుండు
సమధిక ప్రీతిఁ గౌసల్యాకుచద్వయి నేభూత మెపు డాశ్రయించియుండు

పాదసంస్పృష్టచే బండను జెలువఁగా నేభూత మెలమిమై యేర్పరించె
ప్రజల సమానప్రజ్ఞాబలంబుచే నేభూత మరసి సంతృప్తిపఱచె

తే॥గీ॥ బహువిధచమత్కృతియా జాలపాటవమున । భూతజాలంబులకు నాదిభూతమైన
రామభూతంబు చిత్తాంతరంబునందు । నున్న నివి దానిచర్యలో కన్నతల్లి ॥

మాతాపుత్రు లీవిధముగాఁ బ్రసంగించుచుండిరి. ఎన్నఁడో యిరువదినాలుగుసంవత్సరములక్రిందట విడచినకుమారుఁ డప్రయత్నముగ నరుదెంచినకతన రాణుబాయి యానందపారవశ్యమున మైమఱచెను. విరక్తుఁడగు సమర్థుఁడుగూడ ముగ్ధుఁడై నెలలబిడ్డవలె మాతృదేవిచరణ సమీపమున నుండెను. అంతలో గ్రామములోనికరిగిన శ్రేష్ఠుఁ డింటికి వచ్చెను. సమర్థుఁ డతనినిగాంచినంతన భక్తిసూచకముగాఁ జరణములపై వ్రాలెను. సోదరులిరువురును ప్రేమపూర్వకముగా నాలింగనము గావించుకొనిరి. వారి హృదయము లానందమగ్నములయ్యెను. శ్రీరామదాసస్వామి కొన్నిదినములదనుకఁ దనయింటియం దానందముగా నుండెను. ప్రతిదినమును సోదరులిరువురు భోజనానంతరమునఁ జాలసేపు ఒకతావునఁగూర్చుండి అధ్యాత్మజ్ఞానవిషయికముగా సల్లాపములు జరుపుచుండువారు. సమర్థుని బుద్ధికుశలతయు విజ్ఞానము శ్రేష్ఠునకుఁ బరమాశ్చర్యకరమయ్యెను. గృహమున సుఖముగాఁ గాలయాపనము గావించుచుఁ గర్తవ్యము మఱచుచుంటినని సమర్థున కొకదినమున దోచెను. ఇఁక నిట నిముసమేని నిలువఁదగదని తలంచి సమర్థుఁడు తన తల్లిసన్నిధికేఁ బోయి ప్రయాణమున కనుజ్ఞఁగోరెను. పుత్రవియోగమున కాయమ సహింపలేక వలవలయేడ్చెను. ఆమె విచారము జూడఁగనే సమర్థునకుఁ గూడ హృదయము చరించెను. లోకాతీతుండగు నాతఁడు రాణుబాయికి భాగవతమునఁ గపిలుఁడు తన తల్లియగు దేవహూతికి బోధించిన బోధము నంతయు నివేదించెను. వివేకవతియగు రాణుబాయి హృదయమున కాబోధ వలన శాంతి లభించెను. అనంతరము రామదాసస్వామి అన్నచెంతను మాతృదేవిచెంతను దదితర బంధువర్గముచెంతను ననుజ్ఞఁబడసి తాను సంకల్పించికొనిన గోదావరీప్రదక్షిణము పూర్తిగావింప బయలువెడలెను. సాగరసంగమస్థలమున గోదావరి యేడుపాయలుగాఁ జీలియున్నది. దీనినే సప్తగోదావరి యందురు. సమర్థుఁ డీ పాయలన్నింటిని కుడిప్రక్క

నుండి దాటి దక్షిణతీరమున కేగెను. అచటనుండి త్ర్యంబకేశ్వరము నందలి గోదావరీ జన్మస్థానమునకుఁబోయి పంచవటి దక్షిణపుఁ బ్రక్కకుఁ బ్రవేశించెను. సమర్థుఁడచట శ్రీరామచంద్రమూర్తిని సందర్శించి గోదావరి ప్రదక్షిణము పూర్తిజేసెను. ఈవిధముగాఁ బండ్రెండు సంవత్సరములు తపస్సు, పండ్రెండు సంవత్సరములు తీర్థయాత్రలు దేశపర్యటనము గావించి యాతడు జనోద్ధారణము గావించుటకు వలయు శక్తిసామర్థ్యములు యోగ్యత గడించెను. ఈ కాలమున శ్రీ సమర్థ రామదాసస్వామికి ముప్పదియాఱు సంవత్సరముల వయస్సు.

## ధర్మప్రచారము — జనోద్ధారణము.

శ్రీ సమర్థుఁడు మొట్టమొదట పంచవటినుండి తన తపస్స్థానమగు టాకలి కేతెంచెను. అచ్చట ఉద్ధవస్వామిని గలిసికొని శ్రీరామచంద్ర స్వామి యాదేశానుసారముగాఁ గృష్ణాతీరమునందు ధర్మప్రచారము, లోకోద్ధారణ కార్యములు ప్రారంభించుటకు సమర్థుఁడు దక్షిణదేశమునకు బయలుదేరెను. ప్రప్రథమమునం దాతఁడు మహాబలేశ్వరమున కరిగెను. అచట వర్షర్తులలోని నాలుగుమాసములు గడిపెను. ఆ సమయమునం దచట నొక యాంజనేయ మఠమును స్థాపించి తన సంప్రదాయమును వృద్ధినొందించి యచటి జనులనందఱను భక్తిమార్గమునఁ బ్రవేశపెట్టెను. అనంతభట్టు, దివాకరభట్టు మున్నుగాఁగల సుప్రసిద్ధ విద్వాంసులు పలువురు ఉచట సమర్థునకు శిష్యులైరి. మహాబలేశ్వరమునుండి వెడలి సితారా మండలమునందు సమర్థుఁడు రామదాసీయ సంప్రదాయమునుగూర్చి ప్రచార మొనరించుచుఁ గొంతకాలమునకు వాయీక్షేత్రమునకుఁ బోయెను అచటఁ గృష్ణానదీతీరమునఁగల యొక యశ్వత్థ వృక్షముక్రింద నివసించెను. వాయీక్షేత్రమునందున్న శాస్త్రజ్ఞులు, పండితులు సమర్థుని యాధ్యాత్మికజ్ఞానమును గాంచి ముగ్ధులై శరణ్యమున కేతెంచి దీక్షను గైకొని భజనవర్గమునందుఁ బ్రవేశించిరి. అచటఁగూడ సమర్థుఁడు హనుమానుని బ్రతిష్ఠజేసి మఠనిర్వాహక ధర్మము నొక శిష్యున కప్పగించెను. వాయీక్షేత్రమునుండి బయలుదేరి యాతఁడు "మాహులికిఁ జేరెను. అచట గ్రామమునకు వెలుపలనున్న యొక పర్వతముమీఁది హనుమ

దాలయమునందు వసించెను. ప్రాతఃకాలమునలేచి కృష్ణాతరంగిణిలో స్నానమొనరించి సంధ్యావందనాది నిత్యకృత్యములను నిర్వర్తించుకొని రెండుజాములైనపిదప గ్రామములోనికేగి మధూకరము నడిగి భుజించుచుండెను. అనంతరము మరల నా పర్వతముమీఁది కరిగి భజనము, జపము, ధ్యానములలో మగ్నుఁడై యుండెను. అచ్చటి కప్పుడప్పుడాతని సమకాలికులగు సాధుజనులువచ్చి ధర్మచర్చలు గావించుచుండిరి. ప్రతిసాధువు తన యనుభవమునకు సంబంధించిన విషయములను వివరించుచు నుండును. అందఱునుగలిసి హరిభజనము హరికీర్తనము గావించుదురు. శ్రీ రామదాసస్వామికిఁగల యనుపమాన సామర్థ్యము నెఱిఁగి సాధుజను లాయనకు సమర్థబిరుదము నొసంగి వ్యవహరింపసాగిరి. కొన్ని దినములు సమర్థుఁడు మాహులీయందుండి యనంతరము క్రహాడు (కర్హాడు) నకుఁ బోయెను. క్రహాడు ప్రాంతమునం దీతని యలౌకిక ప్రజ్ఞాతిశయమును గాంచి యసంఖ్యాకులగు జనులాతని శరణ్యమున కేతెంచిరి. ఆ ప్రాంతములోని శాహాపురమను పేరుగల గ్రామమునందాతఁడు ఆలయమును నిర్మించి యందుఁ బ్రతాపమారుతిని బ్రతిష్ఠించి దానిని నిర్వహించు భారమంతయుఁ దన శిష్యుఁడును మిత్రుఁడునగు "బాజీపంతు" అనువాని కప్పగించెను.* బాజీపంతు సమర్థుని సన్నిధిలో సకుటుంబముగా మంత్రోపదేశమును గైకొనెను. ఆతని భార్యపేరు సతీబాయి. ఈమె సమర్థుని పట్ల మిగుల భక్తిప్రపత్తులుగలది. సమర్థుడనేక భయానక ప్రయోగములచే సతీబాయి హృదయమును బరీక్షించెను. ఆమె భక్తి యచంచలముగా దృఢతరముగా నుండెను. సమర్థుఁడు ఆమె నిశ్చల చిత్తవృత్తినారసి మిగులఁ బ్రసన్నుఁడయ్యెను. ఆయమకు సమర్థుఁడు శ్రీ యాంజనేయునిచేఁ బ్రత్యక్షదర్శనము నిప్పించెనని ప్రజలు చెప్పుకొనుచున్నారు.

ఇట్లు సమర్థుఁడు ధర్మప్రచారము గావించుచు ఛాఫల్ అను గ్రామమున కరిగెను. అచట నాతఁడు మొదటఁ గొన్ని సంవత్సరములవఱకు అర

---

* ఈ బాజీపంతు కుమారుఁడే భికాజిగోస్వామి. గోస్వామి సమర్థుని ముఖ్యశిష్యులలో నొకఁడు. ఈయన తంజావూరు మఠములో నుండువాఁడు. సమర్థుని నిర్యాణానంతర మీయన (వి. శ. 1604) సమర్థుని మూలచరిత్ర గ్రంథమును ఓవీఛందములో రచించెను.

ణ్యములయందును బర్వతములందును గుహలందును జరించుచుండెను. అపు డాతఁడెన్నఁడో గ్రామములోనికి వచ్చిపోవుచుండువాడు. ఎప్పుడేని యాతఁడు జనసముదాయములోనికి వచ్చినచో అవధూత దశయందున్న కారణమునఁ బిచ్చివాఁడని తలంచుచుండిరి. వాస్తవమున కాతఁడు పిచ్చివాడు కాఁడు. ఆతని చిత్త మఖండరూపముగాఁ బరమాత్మునియందు మగ్నమైయుండెను. శ్రీ సమర్థుఁడు దాసబోధలోఁ దన స్వీయచరిత్రమును బలు తావులఁ జేర్కొనియున్నాఁడు. ఒకసమాసమునం దాతఁడు నిస్పృహు లగు సాధువుల ప్రవర్తనమును వర్ణనము గావించెను. అందే యాతఁడు 'నేనే దీనినంతయు మొదటఁజేసితిని. తరువాతఁ బ్రజలకుఁ బోధించితిని' అనినుడివెను. ఈ యంశముగల సమాసము మిగుల మహత్త్వముగలది. ఛాఫలలోనుండి మొట్టమొదట సమర్థుఁడు బహుదినములఁదనుక నెట్లు ధర్మప్రచారము, లోకోద్ధరణము గావించెనో యది ప్రకృతసమాసమును జదివినచో బాగుగా దెలియును. ఈ సమాసములోనివగు రెండు పద్యములను మేమిచట నుదాహరించుచున్నారము. ఆ పద్యములను జూచినచో సమర్థుఁడు లోకోద్ధరణమునం దెంత చతురుఁడో పాఠకులు సులభముగా గ్రహింపఁగలుగుదురు.

కం॥ ఉత్తమగుణములఁ దొలిస్వాయత్తము గావించి తెలుపనగు నొరులకు
సద్వృత్తముగల జనసంఘము నెత్తెఱగున నైనఁ గూర్పు మెపుడాపకుమా॥
కం॥ జనసంఘంబునకు నుపాసన మం దాసక్తి గూర్పఁజను, నట్టు లొన
ర్చినయెడ జనములు బోధకు కనుసన్నల మెలఁగుచుంద్రు కార్యగతులలోఁ॥ *

సమర్థుఁడు ఛాఫలులో నివసించియుండి ప్రజల దన బోధనామృతముచేఁ బరవశుల నొనరించి వేలకొలఁది శిష్యులను వందలకొలఁది విరాగులను సాధువులను సిద్ధపఱచెను. మహారాష్ట్ర దేశమునం దనేక స్థలములలో స్థాపింపఁబడిన మఠములయందు వారలనందఱ నియతపఱచెను.

* ఉత్తమగుణాతి తుకే ఘ్యావే, ఘేఊఁ జనాస సికవావే
ఉదండ సముదాయ కరావే, పరీగుప్తరూపే॥ ౧౭
అఖండకామాచీ లగబగ। ఉపాసనేస లవావేం జగ
లోకసముదాయ మగ। ఆజ్ఞా ఇచ్ఛితీ॥ ౧౮ దాసబోధ ద ౧౧ స ౧౦

ఈ విధముగా భజనమును ఉపాసనామార్గమును బాగుగా వృద్ధిగావిం సమర్థుఁడు జనులను స్వధర్మమునందుఁ బ్రవృత్తుల గావించెను. స్వధర్మవ నందభిమానముగలిగినతోడనే జనులయందు స్వాభిమానమునం్దై క్యా కురము లుదయించెను. ఆ కాలమున మహారాష్ట్రదేశమునందు (భర ఖండమునందంతటను) అధికారులై యుండిన యవనులనుండి తమ స్వాతంత్ర్యమును ధర్మమును గాపాడుకొనవలయునను బ్రచండము తీవ్రమ నగు భావము జనుల మానసములయందు వృద్ధినొంద నారంభించెను.

ఇట్లు సమర్థరామదాసస్వామి ధర్మస్వాతంత్ర్యవిషయములయం ద కాలమున నాందోళనమును గలుగఁజేసెను. ఈ స్థితియంతయు ఛత్రపతి యగు శివాజీమహారాజాకర్ణించి వెంటనే సమర్థుని దర్శింప మిగుల నుత్సాహియయ్యెను. కాని సమర్థుని దర్శనము శివాజిచక్రవర్తి కెట్ల కాఁగలదు? స్వయముగా సమర్థుఁడు చక్రవర్తియొద్దకుఁ బోవువాఁడు కాఁడు. ఛత్రపతిమహారాజువచ్చి దర్శింతమనుకొన్నచో సమర్థుఁడొక స్థానమున నిలుకడగా నుండువాఁడుగాఁడు. చివరకు శివాజీ ప్రభునకు సమర్థుని దర్శనము గావించు నుత్సాహ మనివార్యమయ్యెను. ఒకానొక దినమున శివాజి సమర్థుని సందర్శింప రాజహర్మ్యమునుండి బయలుదేరి అరణ్యములు, గుట్టలు, పర్వతములు తిరుగుచుండెను. ఎన్నియో శ్రమలొందిన పిదప నొక యౌదుంబరవృక్షముక్రింద శివాజిచక్రవర్తికి సమర్థుని సందర్శనభాగ్యము లభించెను. అచ్చటనే శివాజీప్రభుఁడు మంత్రోపదేశము నొందెను. ఆ దినమునుండియే సద్గురుఁడును ముముక్షు వును శుద్ధస్వాతంత్ర్యప్రియుఁడును నగు శిష్యుఁడునుగలిసి ధర్మప్రచారము లోకోద్ధరణముజేయ సంకల్పించిరి. సమర్థునియొక్కయు శివాజియొక్కయు సంబంధము నైసర్గికమును మిగుల గహనమును, విస్తృతమును విచారణ యోగ్యము నైయున్నది. ఈ విషయమునుగూర్చి విపులముగా విమర్శింపఁ బూనినచో నొక స్వతంత్రగ్రంథము గావలసియుండును. కావున సంగ్రహ ముగా నింకొకతావున వర్ణింపనెంచితిమి.

ఈ ప్రకారముగ సమర్థుఁడు ఛాఫల్ గ్రామసమీపమున వసించి యుండి ప్రచండముగా శిష్యసముదాయమును సమకూర్చెను. కొంత కాలమున కచట (శా. శ. ౧౫౭౦-క్రీ. శ. 1648) నాతఁడు శివాజిచక్రవర్తి

సహాయమున నొకమందిర నిర్మాణమునుగావించి యందు శ్రీ రామచంద్ర మూర్తిని బ్రతిష్ఠాపించెను. ఆ మందిరము ననుసరించి గొప్పమఠముగూడ గట్టించెను. సమర్థుని శిష్యసముదాయము సాధువులు ఆ మఠమునందే వసియింపుచుండిరి. వారలు నానావిధములగు శ్రీ రామోత్సవము లొనరించుచు భాగవతధర్మమును దేశమునందంతటను విరివిగా వ్యాపింపఁ జేయుచుండిరి. సమస్తకార్యము లొనరించుచున్నను సమర్థుని మానస మఖండరూపముగా ఆత్మారామునియందు లీనమైయుండెడిది. ఒకస్థలమునం దాతఁడిట్లు నుడివెను.

కం॥ గిరులందునుండి గ్రామం । తరముల నూరేగు రాము దర్శింతునొగిన్
మఱి ధ్యానరూపమున సా। దరమున భక్తులను జేరెదను. వేడుకలన్॥ *

ఒకసారి సమర్థుఁడు కొందఱు శిష్యులను వెంటనిడుకొని కరవీర పురప్రాంతమున ధర్మప్రచారము గావించుటకేగెను. అచటి ప్రజలనేకు లీతని భజనకీర్తనముల నాలకించి శరణ్యమునకేతెంచిరి. ఆ ప్రాంతమున ముఖ్యుఁడును శివాజీ పక్షమున నాప్రాంతమున కధికారియునగు పారాజీ పంతు సమర్థునిచెంత దీక్షగైకొనెను. ఆతని తోఁబుట్టువు సమర్థునిభక్తి భావమునకు విస్మయమొంది తన యిరువురుపుత్రులతో సమర్థుని సేవ యందు వర్తించుచుండెను. ఆయమ జ్యేష్ఠపుత్రుని పేరు అంబాదాసు. ఈతఁడు వ్రాయుటయందును జదువుటయందును మిగులఁ జుఱుకుఁదనము గలవాఁడు. కావున సమర్థుఁ డీతని లేఖకునిగా నియమించుకొనెను. ఈ యంబాదాసే క్రమక్రమముగా సమర్థుని ముఖ్యశిష్యులలో నొకఁడై సాధుపదవిబడసి కళ్యాణస్వామియనుపేరఁ బ్రసిద్ధుఁడయ్యెను. సమర్థుఁడు రచించిన గ్రంథములన్నింటికిని కళ్యాణస్వామియే లేఖకుఁడు. సమర్థుఁడు పద్యములను నుడువుచుండఁ గళ్యాణస్వామి వ్రాయుచుండువాఁడు. ఛాఫల్ గ్రామమునకు సమీపమునఁగల వనపర్వతములందుఁ గూర్చుండి వారలు గ్రంథరచనము గావించుచుండిరి.

---

* దాస్ డోంగరీంరాహాతో । యాత్రా దేవాచీపాహాతో
దేవభక్తాసవేంజాతో । ధ్యానరూపేం ॥

రామదాసస్వామి పర్వతములందుండును. అచటనుండియే గ్రామములలో నూరేగు శ్రీ రాముని యుత్సవము దర్శించును. ఇంతియగాదు. ఆతఁడు ధ్యానరూపముతో దైవభక్తులతోఁబాటుగా నాయుత్సవమునఁ జేరియుండును.

ఛాఫల్ గ్రామవాసులు మిగుల నిర్బంధించుటచే నొకసారి సమర్థుఁడు పండరిపురయాత్ర కరిగెను. అచ్చట విఠలస్వామిని (శ్రీకృష్ణుని దర్శించెను. సమర్థుని యుపాస్యదైవము శ్రీరాముఁడగుటచేఁ బండపురము నాతఁడయోధ్యగాఁ భావించెను. విఠలస్వామిమూర్తి రామమూర్తిగ గాన్పించెను. యాత్రనుండి మరలివచ్చినపిదపఁ గొన్నాళ్ళకు శ్రీ శివాజీప్రభువు మిగుల బలవంతపెట్టుటవలన సమర్థుఁడు సతారా సమీపమునందున్న "సజ్జనగడము"నందు నివసించెను. శ్రీ శివాజీ మహారాజచటికి నిత్యమును సమర్థుని దర్శనార్థము వచ్చుచుండెను. ఒకదినమున సమర్థుని తల్లి శ్రేష్ఠునితో రామదాసస్వామి కిట్లొక వర్తమాన మంపెను "కుమారా! నిన్నుఁజూచి చాలదినములైనది. ఒకమారు వచ్చి నన్నుఁజూచిపోవఁ గోరుచున్నదానను." శా. శ. ౧౫౭౪ (క్రీ. శ. 1652) లో శ్రీరామనవమి ఉత్సవసందర్భమున సమర్థుఁడు మఱల దన జన్మభూమికేగి తన రక్తసంబంధులతోఁ గొన్నిదినములు గడిపి పిమ్మట సజ్జనగడమునకుఁ దిరిగివచ్చెను.

శా. శ ౧౫౭౫ (క్రీ. శ 1653) ప్రాంతమున సమర్థుఁడు త్రిలింగ (ఆంధ్ర) దేశమునఁ బర్యటనముగావించుచు రామేశ్వరముదనుక నరిగెను ఆంధ్రదేశమున నీ సందర్భమున గొన్నిమాసములువసించి తన సంప్రదాయమును మిగుల వృద్ధినొందించెను. ఆంధ్రభాషను నేర్చుకొని యనేక కవితా గ్రంథములను రచించెను. ఆ గ్రంథములనన్నింటి నాంధ్రదేశమునందుఁ బ్రచారములోనికిఁ దెచ్చెను. బహువిధముల ననేకాపూర్వచమత్కారములనుజూపి సమర్థుఁడు మాన్యులయొక్కయుఁ బండితులయొక్కయు నభిమానమునకుఁ బాత్రుఁడయ్యెను. ఎందఱో పండితులాతని శరణ్యమున కేతెంచి భజనమార్గమునందుఁ బ్రవేశించిరి. తంజావూరును పాలించు వెంకోజి (శివాజిసోదరుఁడు) సమర్థుని నొకమాసముదనుక మిగుల నాదరముతో నుంచుకొని మంత్రదీక్ష గైకొనెను. సమర్థుఁడు తంజావూరిలో నొక మఠమును స్థాపించి యందు సతీబాయి పుత్రుఁడగు భికాజీబాబాను ధర్మకర్తగా నియమించెను. తంజావూరినుండి బయలుదేరి సమర్థుఁడు రామేశ్వరమున కరిగెను. మంచలక్షేత్రమునందు రాఘవేంద్రస్వామియను జ్ఞానితో సమర్థుఁడు కలిసికొనెను. ఈ యుభయులను

జాలదినములు వేదాంతవిషయిక గోష్ఠులతోఁ గాలము గడిపిరి. సమర్థుఁ డీవిధముగాఁ దేశపర్యటనము గావించుచు మఠములను స్థాపించి తన యలౌకిక ప్రజ్ఞాతిశయమువలన జనులను స్వధర్మమునకు నభిముఖులఁ గావించుచుఁ గొన్ని దినములకుఁ దన పూర్వస్థానమగు ఛాఫలునకు మఱలి వచ్చెను. సమర్థుని రాక వినఁగనే శివాజీమహారాజు సందర్శింపవచ్చెను. దర్శనానంతరము శివాజి సమర్థునిఁ దనవెంట సజ్జనగడమునకుఁ గొంపో యెను. రాజకీయములు, ధార్మికములునగు వివిధోపదేశములతో సమర్థుఁడు శివాజికి మిగుల నానందమును కూర్చుచుఁ గొన్ని దినములు మాత్రమె సజ్జనగడమునందు వసించెను.

## వివిధ విషయములు.

సమర్థుని తల్లియగు రాణుబాయికి అంత్యకాలమేతెంచెను. సమర్థుఁడీయంశమును దన యంతర్జ్ఞానమువలనఁ బదునైదు దినములకు ముందే గ్రహించెను. రోగశయ్యయందుండి రాణుబాయి నిరాశతో 'నా తండ్రి నా నారాయణుఁడు అంత్యకాలమునందిచట లేఁడయ్యెఁగదా' యని జ్యేష్ఠపుత్రుఁడగు గంగాధర శ్రేష్ఠునితో నుడువుచుండెను. అంతలో సమర్థుఁడువచ్చి తనతల్లి చరణాంబుజములపై శిరమునిడి, అమ్మా! నేను నీసన్నిధిలో నున్నాఁడను. ఇఁకనీవు సుఖముగను శాంతముగను జీవయాత్ర ముగింపుము అని పలికెను. శా.శ. ౧౫౭౭ (క్రీ.శ. 1655)లో రాణుబాయి స్వర్గవాసినియయ్యెను. ఆ యమ కూర్ధ్వలోకక్రియలుముగించి శ్రేష్ఠునియొద్ద సెలవొంది సమర్థుఁడు సజ్జనగడమునకు మరలివచ్చెను. కొన్ని దినము లా ప్రాంతమున సమర్థుడు మతప్రచారముగావించి తీర్థయాత్రకుబయలుదేరెను.

శా.శ. ౧౫౮౦ (క్రీ.శ. 1658)లో శ్రీ సమర్థుఁడు నిజానందస్వామి మహోత్సవము సేవించుటకు కర్హాడమునకుఁబోయి కొన్నిదినములట వసించెను. ఉత్సవము సమాప్తియైనపిదప మరలి యాతఁడు సజ్జనగడమునకు వచ్చుచుండెను. ఆతనివెంట దాదాపుగా నిరువది ముప్పదిమంది శిష్యులుఁ గూడ నుండిరి. అప్పటికి దాదాపుగా రెండుజాముల ప్రొద్దెక్కెను. ఆహార సౌకర్యమెచ్చటను గలుగకపోవుటచే శిష్యులాఁకలిగొని యలసిపోయిరి. వారికిఁద్రోవలోఁగంకులబరువుచే వంగియున్న ఊచబియ్యపుఁ బరువములో నున్న యొకజొన్నచేను గనిపించెను. శిష్యులు సమర్థుని యాజ్ఞనొంది

కొన్ని కంకులను ద్రెంచి కాల్చుకొని తినసాగిరి. సమర్థుఁడు శిష్యులచెంత నొకయాసనముపైఁ గూర్చుండియుండెను. ఇంతలో నాచేని యజమానుడు పరుగెత్తుకొనివచ్చి ఈ యాసనముపైఁ గూర్చున్నవాఁడే వీండ్రకు నాయకుఁడని తలంచి జొన్నదంట్లు పెరికి సమర్థుని జేతికొలఁది కొట్ట నారంభించెను. శిష్యులీ దురంతమునుగాంచి కోపావేశముతో క్షేత్రస్వామిని బట్టుకొని కొట్టఁబోవ సమర్థుఁడదిచూచి, వలదు, వలదు! కొట్టవలదు!! విడిచి వేయుఁడనిచెప్పి విడిపించెను. అనంతరము క్షేత్రస్వామి తనయింటికిఁ బోయెను. సమర్థుఁడు శిష్యసమేతముగా సితారాలోనున్న శివాజీచక్రవర్తి కడకుఁ బోయెను.

రెండవదినమున శివాజిచక్రవర్తి సమర్థునకు మంగళస్నానము జేయించుచుండెను. అపుడు దేహముపైనున్న దెబ్బలు కాన్పించెను. శివాజి చాలవిచారపడి ఎవరుగొట్టిరి? తెలుపుమని పలుతెఱంగులఁ బ్రార్థించెను. ఎంతకును సమర్థుఁడు ప్రత్యుత్తరమీయఁడయ్యెను. భోజనానంతరము సమర్థుఁడు శయనగృహమున విశ్రాంతి గైకొనుచుండెను. అపుడు శివాజీ యేకాంతమున నొక శిష్యుని బిలిపించుకొని యెంతయో ప్రయత్నించి మార్గమధ్యమున జరిగిన వృత్తాంతమంతయుఁ దెలిసికొనెను. మూర్ఖుఁడగు నా సేద్యకాఁడుగావించిన యవివేకకృత్యము వినినంతన శివాజికి క్రోధోద్రేకముగలిగెను. కన్నులెఱ్ఱబడెను. ఆ సేద్యగానిని ఱెక్కలు విఱచికట్టి యిప్పుడే నాయొద్దకుఁ గొనిరావలయునని భటులకాజ్ఞాపించెను. ఇదియంతయు శయనాగారమునందుండి సమర్థుఁడు విని శివాజిని తన యొద్దకుఁ బిలిచి ఆ సేద్యగానిని కట్టితీసుకొనిరావలదు. వానినిగొట్టవలదు. ఇక్కడకుఁ బిలువనంపిన పిదపఁ దప్పునకుఁ దగిన శిక్షయేదియో తెలిపెదను. అట్లు విధించినఁ జాలునని పలికెను. శివాజి సమర్థునియాజ్ఞ శిరోధార్యము గావించెను. మఱుసటిదినమున శివాజీచక్రవర్తి కొలువుదీరెను. దర్బారునకు రాజభటులు సేద్యగానిని గొనివచ్చిరి. అంతకుఁబూర్వమే సేద్యగాడు తానుగొట్టినది సాధారణపు సన్న్యాసిని గాదనియు నాతఁడు (శిక్షితుడు) ఛత్రపతి శ్రీ శివాజిచక్రవర్తికిఁ బరమపూజనీయుఁడును గురువును నగు శ్రీ రామదాసస్వామియని గ్రహించెను. దర్బారునకా సేద్యగాఁడు వచ్చుసరికి సమర్థుఁడు దివ్యమును మణిగణాలంకృతమును మహోన్నత

మును నగు సింహాసనముపై శివాజీకి సమీపమున నాసీనుఁడై యుండెను. పాపమాకర్షకునకు భయవశమున శరీరమంతయు గడగడవణకెను. పదములు తడబడెను. నిర్వీర్ణుఁడై కర్షకుఁడు సమర్థుని పాదములపైఁబడి యేడ్చుచు నాదోషమునకు క్షమింపుమని వేఁడుకొనెను. నీ పాలము చక్కఁగా ఫలించుగాకయని యాశీర్వదించి సమర్థుఁడు కర్షకుని లేవనెత్తెను. అనంతర మాతఁడు శివాజీపాదములపైఁబడి క్షమింపుమని ప్రార్థించెను. సమర్థుని యాజ్ఞానుసారముగ శివాజీ చక్రవర్తి కర్షకుని క్షమించి యాచేను పుత్రపౌత్ర పారంపర్యము మాన్యముగా ననుభవించుటకు దానపత్రము వ్రాసియిచ్చెను. ఇదియంతయు గాంచి దర్బారులో నున్నవారందరును నాశ్చర్యమొందిరి. ఔను ఎందుల కాశ్చర్యమొందరు? ఉపకారమునకుఁ బ్రత్యుపకారము గావించువారలు పెక్కుమంది గలరు. అపకారికి నుపకారముజేయువారలు కేవలసాధుపురుషులే. మహాత్ముఁడగు తులసీదాసుఁ డిటుల నుడివియున్నాఁడు.

కం॥ సురసాలము ఫలపుష్పో ♦ త్కరమును బరహేతుకముగ దానము చేయుఁ
నఱికెడివానికి సైతము ♦ దొరికించును గాదె ఫలము తులసీదాసా ॥

సమర్థుని యనుగ్రహమునఁ బడసినభూమిని నేఁటికిని సేద్యగాని వంశీయు లనుభవించుచున్నారు. సమర్థుని క్షమకును ఉదారభావమునకును అనేక ధన్యవాదములు.

సమర్థుని యన్నయగు శ్రేష్ఠుఁడు గృహస్థాశ్రమమునం దుండియు భక్తిమార్గమున నెక్కుడు ప్రచార మొనరించెను. ఆతఁడు భక్తిరహస్యము సుగమోపాయము అను గ్రంథములను, గొన్ని చాటుగ్రంథములను రచించెను. శ్రేష్ఠుఁడు దివ్యజ్ఞానిగావునఁ దనకంత్యకాలము సమీపించినదని యెఱింగి యొకయుత్తరమును సమర్థునికడకంపి యంతిమసమావేశము కొఱకుఁ బిలిపించుకొనెను. శ్రీరామనవమి మహోత్సవమునకుఁ గొన్ని దినములుముందు సమర్థుఁడు తనజన్మభూమియగు జాబునకరిగి యొకమాసము దినము లగ్రజునిసన్నిధిలోనుండి తిరిగి తపోభూమికిఁ జేరెను. తరువాతఁ గొన్నిదినములకే శా. శ. ౧౫౯౯ (క్రీ. శ. 1677) లో శ్రేష్ఠుఁడు

తులసీసంత్ సుఅంబతరు ఫూల్ ఫలహి పరహేత్ ఇతతే జనపావనహానేం ఉతతే వేఫలదేత్॥

స్వర్గవాసి యయ్యెను. ఆతనిధర్మపత్ని సహగమనముగావించి తన పా
ౘ్రత్యగరిమ లోకమునకు వెల్లడించెను. ఈ సమాచారమునువిని సమ
ర్థుఁడు తనశిష్యులలో నొకనిని బంపి శ్రేష్ఠుని కుమారుల నిరువురను ద
యొద్దకు రప్పించుకొనెను. ఈ విషయమంతయు శ్రీశివాజీచక్రవర్తి వి
సమర్థుని సన్నిధానమునకేతెంచి తనరాజ్యములో పెక్కుగ్రామముల
కలిపి జాబును ముఖ్యస్థానముగావించి యీ సంస్థానమును మీస్వాధీ
ములో నుంచుకొనుఁడని సమర్థుని బ్రార్థించెను. "ఇప్పు డట్టియావశ్య
కము లేదు. తరువాత చూడవచ్చును లెమ్ము" అని సమర్థుఁడు
ప్రత్యుత్తరమిచ్చెను. అందులకు శివాజి మిగుల దుఃఖించి "శ్రీరాము
సేవ గావించుభాగ్య మీదీనుని నుదుట వ్రాసిపెట్టియున్నచో మీర
నిరాకరింపకుండువారే" అనెను. శివాజియెడ సమర్థుఁ డనుగ్రహించి
"శివాజీ, సంప్రదాయసిద్ధములగు వ్యయములకు శ్రీరామోత్సవముల
జరుపుటకు ప్రస్తుతము కొలఁదిగ నేర్పాటుగావింపుము" అని పలికెను.
అనంతరము శివాజి చక్రవర్తి ముప్పదిమూఁడు గ్రామములను బ్రతిసంవత్స
రము నూటయిరువదియొక్క పుట్లధాన్యమును సాధుసమాగమములకు
శ్రీరామోత్సవములకు నొసంగెను. ఈ గ్రామములతోఁ గూడిన పరగణా
నేఁటిదనుక శ్రీ సమర్థుని వంశజుల యధికారమునందున్నది. ప్రతివత్సర
మెన్నియోమహోత్సవములు సాధుసత్పురుష సమాగమములు నేఁటివఱ
కాపరగణాపయి వచ్చునాదాయముతో జరుగుచున్నవి. శ్రీ శివాజీ
మహారాజుతో సమానులగు రాజుల యుదారత్వము మిగుల ధన్యమైనది.
సమర్థు డొకసంవత్సరముదనుక శ్రేష్ఠుని కుమారుల నిరువురను దన
యొద్దనుంచుకొని వారలకు బహువిధ విద్యల నేర్పి యింటికి బంపెను.

శా. శ. ౧౬౦౨ (క్రీ. శ. 1680) చైత్రశుద్ధ పూర్ణిమా రవి
వారమున శ్రీ శివాజీమహారాజు స్వర్గమలంకరించెను. ఈవార్త విని
సమర్థుఁడు మిగుల విచారము నొందెను. విచార మెందులకుఁ గలుగదు?
శివాజీకొఱకె రామదాసస్వామి జనించెను. శివాజి రుద్రుఁడనియు
రుద్రావతారమనియు నొప్పుకొనుచున్నారు. శివాజీసమర్థుల సంబంధము
నైసర్గికముగ నుండెను. ఒకరు రెండవవారి సహాయముతో ధర్మప్రచార

లోకోద్ధరణ కార్యములను బూర్ణముగ స్థాపించిరి. శివాజీ వియోగ కారణమున సమర్థుఁడు వెలుపలికి వెడలుటగూడఁ బూర్తిగ మానివేసెను. ఆతఁడు తనగదియందేయుండి భగవచ్చింతనము జేయుచుండెను. శంభాజి రాజ్యాభిషేకోత్సవ సందర్భమున శ్రీ సమర్థుఁడు స్వయముగా నేగక తన యనుచరు నొకనిని బంపెను. కొంతకాలము జరిగినపిదప శంభాజి గావించు ఘోరసాహస కర్మలను విని సమర్థుఁ డొక యుపదేశపూర్ణముగు లేఖవ్రాసెను. ఈలేఖ మిగుల మహత్త్వయుతమైనది. దానిని జూచినచో సమర్థుని రాజనీతివిజ్ఞానము చక్కఁగ విశదపడఁగలదు. శంభాజీమహారాజా సమయమున దుస్సాంగత్యములలోఁ జిక్కుకొనియుంటచే సమర్థుని యుపదేశమువలన నెట్టిలాభమునేను పొందఁజాలక పోయెను.

## సమర్థుని నిర్యాణము.

శా. శ. ౧౬౦౩ (క్రీ. శ. 1681) న శ్రీరామనవమి మహోత్సవమునకు సమర్థుఁడు ఛాఫలునగరమున కేగెను. అచట మందిరమునఁ దన ప్రియోపాస్యదేవుఁడగు శ్రీరామచంద్రుని దర్శించి శ్రీయాంజనేయుని యనుజ్ఞబడసి శిబికారూఢుఁడై సజ్జనగడమునకు మఱలి వచ్చెను. అంత్యకాలము సమీపించుచున్నదని కొన్ని దినములకు ముందటనుండియే యాతఁ డన్నమును మాని కేవలము పాలుద్రావి యుండసాగెను. ఆ సమయమున నాతని తేజ మభివృద్ధినొంది పోవుచున్నను శరీరముమాత్రము దినక్రమమున క్షీణింపఁదొడంగెను. ఇట్లు కొన్ని దినములు జరిగినపిదప మాఘ బహుళాష్టమి వచ్చెను. సమర్థుఁ డాదినమునఁ దనశిష్యులలో నెవరికేని తనయంతిమదినము సమీపించుట తెలియునో తెలియదో పరీక్షింపవలయునను తలంపు కలిగెను. ఈ యోచనతో నాతఁడు తనశిష్యులందఱియెదుట నీయర్థశ్లోకము జదివెను.

రఘుకులతిలకాచా వేళ సన్నిధి ఆలా
తదుపరి భజనానే పాహిజే సంగకేలా ॥

"రఘుకులతిలకుని సమయము సమీపించినది. కావున నిఁక సాంగోపాంగముగ భజనము గావింపవలయును" దీనినాలించి తత్క్షణమే ఉద్ధవస్వామి యా శ్లోకము నీవిధముగాఁ బూర్తిజేసెను.

అనుదిన నవమీ హే మానసీ ఆఠవావీ
బహుళతలగబగీనె కార్యసిద్ధి కరావీ॥

"అంతిమదినమగు నవమిని స్మరణమునం దుంచవలెను. మఱియు మిగుల శీఘ్రముగాఁ గార్యసిద్ధిని గావింపవలెను." ఈ శ్లోకార్థమునువిని సమర్థుఁడు మిగులఁ బ్రసన్నుఁడయ్యెను. అతఁ డన్ని భజనములను జేయుట కాజ్ఞయిచ్చెను. అష్టమిదినమున రాత్రియంతయు భజనముతో నాశ్రమ మంతయు ఘూర్ణించుచుండెను. శిష్యులందఱును గూడిరి. నవమిదిన మేతెంచెను. ఆ దినమున సమర్థుఁడు స్వయముగా మంచము మీదినుండి దిగి క్రిందఁ గూర్చుండెను. శిష్యులందఱును జలవంతపెట్టుటచేఁ గొంచెము పటికిబెల్లముగలిపిన పిండి తిని కొంచముగ జలము గ్రోలెను. కొంతసేపైన పిమ్మట మఱల మంచముపైఁ గూర్చుండవలయునని శిష్యులందఱును బ్రార్థించిరి. "నన్ను లేవనెత్తి మంచముపై నుంచుడు" అని సమర్థుఁ డాజ్ఞయిచ్చెను. ఆజ్ఞానంతరము ఉద్ధవస్వామి సమర్థుని లేవనెత్తఁ బ్రయత్నించెను. కాని యాతనికి సాధ్యము గాకపోయెను. అదిచూచి అకాబాయియను శిష్యురాలు గూడ ఉద్ధవస్వామితోఁగూడి సమర్థుని లేవనెత్తఁ బ్రయత్నించెను. కాని యప్పుడుగూడ వారలు లేవనెత్తఁ జాలకపోయిరి. చివరకు దాదాపుగఁ బదిమందిగలిసి యాతని నెత్తుటకుఁ బ్రయత్నించిరి. అప్పుడును విఫలులైరి. అనంతరము సమర్థుఁ డందఱిని వేఱుగుండని యాజ్ఞాపించెను. అందఱును దూరముగాఁ దొలంగిరి. పిదప సమర్థుఁడు వాయువు నాకర్షించుచుండుటఁజూచి శిష్యులందఱును బిగ్గఱగా నేడువసాగిరి. సమర్థుఁడు వారలందఱితో "నేఁటిదనుక నాకడనుండి మీ రేడ్చుటను మాత్రమే నేర్చుకొంటిరాయేమి?" అని నుడివెను. సగుణమూర్తి పోవుచున్నది. ఇఁక భజనము నెవ్వరితోఁ గలిసి చేసెదము. మాటలాడఁదలంచిన నెవ్వరితో మాటలాడెదము? అని శిష్యులు పలికిరి. అంత సమర్థుఁడు "నాతో మాటలాడఁదలంచువారు 'దాసబోధ' మున్నగు నాగ్రంథములు జదువవలెను. వానిని జదువుటయే ప్రత్యక్షముగా నాతో భాషించుటయని భావింపుఁడు" అని యంతిమోత్తరము నొసంగెను. ఇట్లు నుడివినపిదప పదునొకండుమాఱులు హరహరశబ్దము నుచ్చరించి యంత్యమున రామశబ్దము నుచ్చరించెను. తోడనే సమర్థునిముఖమునుండి యొక దివ్యతేజము వెడలి సమీపమున స్థాపింపఁబడియున్న రామచంద్రుని ముఖమునందుఁ బ్రవేశించెను. భజనము యథావిధిగ జరుగుచుండెను.

ఆ సమయమున భజనధ్వని మిగుల నతిశయించెను. ఈవిషయమున శా. శ. ౧౬౦౩ (క్రీ. శ. 1682 ఫిబ్రవరి) మాఘబహుళ నవమిని (౧౭౩౮ విక్రమశకము ఫాల్గుణ బహుళ నవమి యని యొకమతము) మహారాష్ట్ర ప్రాంతపు ఏకమాత్రసిద్ధరత్నము,సాధురాజు,చాతుర్యసాగరుఁడు,రాజనీతిజ్ఞ శిరోమణి, భక్తిజ్ఞానవైరాగ్య ప్రత్యక్షస్వరూపుఁడు, నిస్పృహామహాత్ముఁడు రామునియందు లీనమైపోయెను. మఱియు దాసబోధలో ననేక స్థలములలోఁ దానునుడివిన యీ క్రిందివాక్యములను సత్యమొనరించెను.

........................... హరిభక్తీస్ సాదర్ వ్హావేమరోన్ కీర్తీస్ ఉర్ వావే.........౧౩.........ద ౧౨ స ౭ "నిరంతము హరిభక్తియందుఁ దత్పరుఁడై యుండవలెను. చనిపోయినపిదపఁ గీర్తి రూపముతో నిరంతరమును జగత్తునందు జీవితుఁడై యుండవలెను."

ఓ సద్గురుసమర్థా! నీవు పూర్వోక్తవచనానుసారముగఁ గీర్తిరూపముతో ఆత్మరూపముతోఁగూడ అమరుఁడవై యున్నాఁడవు. కేవలము నీవమరుఁడవగుటయేగాక యసంఖ్యాకులగు జనులనుగూడ నీదర్శనముచే నమరులఁ గావించితివి. అమరులఁ జేయుచున్నాడవు. అమరులఁ జేయఁ గలవు. ఎంతదనుక నీయార్యావర్తమునందు ధర్మముయొక్క నామము నిలిచియుండునో ఎంతదనుక హైందవుల కీశ్వరుని యాస్తికత్వముపై విశ్వాసముండునో ఎంతదనుక నీ పవిత్రభూమియందు మహారాష్ట్రనామముపై భారతవాసుల కభిమానముండునో యంతదనుక నో సమర్థ మహాత్మా! నీవును నీ యుపదేశములును, నీపృథివిపై నచంచలముగ నమరముగా నుండఁగలవు.

## సమర్థుఁడు — శివాజి.

శ్రీ రామదాసస్వామిని శివాజీ చక్రవర్తి గురువుగా నేర్పఱచికొనెననియు, వారల పరస్పరసంబంధము మిక్కిలి గహనము మహత్త్వపూర్ణమునై యుండెననియు నింతకుముందు తెలిసియుంటిమి. ఈయిరువురువ్యక్తులకుఁగల సంబంధమును నిర్ణయించుటలో ఆధునిక చరిత్రకారులు గొందఱు భిన్నాభిప్రాయులుగా నున్నారు. కాని శ్రీ సమర్థుని శివాజి గురువుగాఁ జేసికొనుటయు సమర్థుని యాజ్ఞలను శివాజీ శిరసావహించి పరమ ధర్మముగనెంచి నిర్వహించుటయుఁ జరిత్రకారులందఱు నంగీకరించిరి.

మహాత్ములగు నీ యిరువురెప్పుడు గలిసికొనిరో కలిసికొన్న పవిత్రస్థల మెద్దియో నిరూపించుటయందును, శివాజీ మంత్రోపదేశము నెప్పుడొందెనో గురుశిష్యుల పరస్పరవర్తనమెట్లుండెనో యనునంశములందును, శివాజీ యేయేవిషయములలో సమర్థుని యాలోచనము గైకొనువాఁడో స్వధర్మవ్యాపనము స్వరాజ్యస్థాపనము అను మహాత్కార్యములలో సమర్థుని సహాయము శివాజి యెంతదనుక నేవిధముగా నొందువాఁడో యను నంశమందును, జరిత్రకారులలోఁ గొంత మతభేదము గలదు. అధికాంశ విద్వాంసుల యభిప్రాయములతో నేకీభవింతుమేని యీ వివాదాంశములు సులభముగాఁ బరిష్కరింపఁబడును. మహారాష్ట్ర దేశచరిత్రమునకు వలయు సామగ్రిని సంపాదించి శోధించుటలోఁ బ్రఖ్యాతిగాంచిన ప్రొఫెసరు రాజవాడేయను విద్వాంసుఁడిటుల నుడువుచున్నాఁడు.

* "సిద్ధాంతమైయున్న ప్రకృతాంశమును మఱల నిర్ణయింపఁ బూనినచో లాభముండదు. దాసబోధయను గ్రంథము లోకమున నిలిచియున్నంతవఱకె ఇతిహాసమునందు మహారాష్ట్రులు పదునేడవ శతాబ్దమున స్వతంత్రరాజ్యము స్థాపించినసంగతి సుస్థిరముగాఁ నుండగలదు. కావున ఛత్రపతి శివాజి, సమర్థ రామదాసస్వామియొక్క సంబంధములను నిఁక నిరూపింపవలసిన యవసరము మతిబోయినవాండ్రకుఁదక్క నితరులకుఁ గాన్పింపదు".

శ్రీరామదాసస్వామి లోకోద్ధరణమునకై ఛాఫల్ గ్రామమునందు వసించిన సమయమున "నరసోమలనాథుఁ"డను నాఁత డాప్రాంతములకు తాసీలుదారుగానుండెను. ఆతఁడు సమర్థుని యోగ్యతనెఱింగి మంత్రోపదేశమొందెను. అనతికాలములో నచట రామదాసీయ సంప్రదాయము మిగుల వృద్ధినొందెను. ఈ వార్త తిన్నఁగా శివాజే యాకర్ణించెను.

---

* ధులియాలోని సత్కార్యోత్తేజక సభవారు శ్రీ రామదాస శివాజీల సంబంధము దెలుప నితిహాసముల నెన్నింటినో ప్రకటించిరి. వారలింకను శోధించుచున్నారు. వారలు సమర్థుని సంపూర్ణ చరిత్రము ఆధునిక సంప్రదాయసిద్ధముగాఁ బ్రకాశము జేయుచున్నారలు. ఆంధ్రలోకమునకుఁగూడ సమర్థుని సేవయు సాంధ్రవాఙ్మయమున కాతఁడు గావించిన యుపకృతియుఁ గొంతవఱకేని తెలియు నవకాశముగలదు.

ఆ సమయమునందు శివాజియొక్క రాజ్యనిర్మాణశక్తి మహారాష్ట్రదేశమునందు దినదినాభివృద్ధి నొందుచుండెను.

ఆతఁడు రాయగడదుర్గమును స్వాధీనపఱచుకొనెను. ప్రతాపగడమునందొక నూతన దుర్గమును గట్టించి యచట భవానీదేవి మూర్తిని స్థాపిత మొనర్చెను. పూనానగరమును ముఖ్యస్థాన మొనరించుకొని నాశికనుండి కరవీరపురముదనుకఁగల సమస్త ప్రాంతములను గొంకణదేశమునందుఁ గొంతభాగమును శివాజి జయించెను. ఈవిధముగ నాతఁడు రాజ్యసంపాదన కార్యమునందు మగ్నుఁడై యుండియు సాధుసమాగమమునం దభిరుచి గలిగియుండెను. బాల్యమునుండియు నాతనికి సాధుసజ్జనులయెడఁ బూజ్యభావముంటచే సాధుసమాగమముకొఱకు నిరంత ముత్సాహిగానుండెను. తన రాజకీయ కార్యముల నెరవేర్చుచుండియు నాతఁడు చించివడ్, దేహూ, ఆలంది మున్నగు ప్రసిద్ధస్థానములయందున్న సాధుజనులను మాటిమాటికి సందర్శించి వచ్చుచుండువాఁడు. మఱియు నచటి మహనీయుల యుపదేశములను శ్రద్ధాయుక్తమగు నంతఃకరణముతో నాలించుచుండువాఁడు. హరిభజనము కీర్తనము జరుగుతావునకెల్ల నాతఁ డవశ్యముగా నేగుచుండును. తల్లియగు జిగాబాయి యాతనికి బాల్యమునందే సనాతన ధర్మముయొక్కయు, వేదశాస్త్ర పురాణాదులయొక్కయు, వేదాంతముయొక్కయు గంభీరతత్త్వములు, సిద్ధాంతములు, శిక్షాదాయకములగు కథలు చక్కఁగఁ నేర్పించెను. కావున దన మాతృశిక్షణమువలనను సాధుసమాగమమువలనను నాతని మానసమునందుఁ దనజీవిత సార్థకత్వ విషయమున ననేకోచ్చవికారములు నిండియుండెను. శివాజి తనజీవితము సార్థకము గావించుటకును నుత్తమరీతియందు వినియోగించుటకును జింతించుచుండెను. ఆతఁడొకసారి సుప్రసిద్ధసాధువగు తుకారాంబాబాను మంత్రోపదేశము గావింపుమని కోరెను. అందులకు తుకారాం ఆమోదింపక శివాజితో "రామదాసస్వామి శరణ్యములోనికరుగు"మని యాజ్ఞాపించెను. ఈవిధముగ మనోముముక్షు దశయందెప్పుడు శివాజి సమర్థుని సాధుకీర్తి నాలించెనో యప్పుడా సాధుపుంగవుని సందర్శింపవలయునను కోర్కి మిక్కుటమయ్యెను. కావున శివాజి సమర్థున కొకలేఖవ్రాసి రాజధానిలోనికి రావలయునని కోరెను. కాని, సమర్థుఁ డాతని సన్నిధి కరుగక

శివాజి కింకొకజాబు వ్రాసిపంపెను. సమర్థునిలేఖ యితిహాసదృష్టితోఁ జూచినచో మిగుల మహత్త్వముగలది. అందు సమర్థుఁడు శివాజికొసంగిన యుపదేశము ధ్యానమునందుంచుటకు యోగ్యమైనది. కావున నాలేఖ లోని కొన్నియంశముల భావము నిచట నుదహరించుట యావశ్యము. సమర్థుఁడు శివాజి కిట్లువ్రాసెను.

“ఈసమయమున ధర్మరక్షణము గావించువాఁడు భూమండలము నందెవ్వఁడును లేఁడు. మహారాష్ట్రధర్మము నీకారణముననే సజీవముగ నున్నది. కొద్దిగనో గొప్పగనో యిపుడు గన్పడు ధర్మమునకును సాధు జనులయెడఁ గావింపఁబడు రక్షణమునకును నీవే కారణము. నీవు ధన్యుఁడవు. దుష్టజన సంహారము గావించితివి. నీవన్న దుష్టులు గజగజ వణకుచున్నారు. పెక్కండ్రుజనులు నీ యాశ్రయమునందున్నారు. ఇపుడు నీవు ధర్మసంస్థాపనకార్యమును నిర్వహింపవలెను. నీకుఁ బెక్కు రాజకీయ కార్యముల నెఱవేర్పవలసియుంటచే నీచిత్తవృత్తి వ్యగ్రమైపోవుచుండుట సత్యమే! ఈ స్థితిలో రాజుయొక్కయు మంత్రియొక్కయు విచార మొక్కటిగావలెను. ఒకవేళ నేకత్వముగాకున్నచోఁ గార్యనాశన మగును. జనులనందఱిని సంతుష్టులుగా నుంచవలెను. మంచి చెడ్డలను బాగుగా బరిశోధింపవలెను. న్యాయమును, నీతిని ఎప్పుడును బరిత్యజింపఁ దగదు. దురాశయం దెప్పుడును జిక్కుకొనవలదు. ఎల్లప్పుడును సావధానముగా నుండవలెను. క్రోధమును దరికె రానీయ జనదని నేను స్పష్టముగా నుడువుచున్నాఁడను. నేను గావించు బోధ మును దగురీతి నాలింపుము. నీవు వాస్తవముగ నంతఃకరణపూర్వక ముగఁ బనిచేయువలసియున్నచో నేనుజూపిన మార్గమున నడువుము. శ్రీరామచంద్రస్వామి తన యనుగ్రహమును బ్రసరింపఁగలఁడు. నీకార్య ము నెరవేరఁగలదు. నీ మనోరథము లన్నియుఁ బూర్ణములగును. ఈ విషయమున సందేహ మేమాత్ర మొందనక్కఱలేదు.” ఈ యుత్తర మును జదువఁగనే ధార్మికము, నిష్ఠాయుక్తమునగు శివాజి యంతఃకరణము నందు శ్రీ రామదాసస్వామిని దర్శింపవలయునను నుత్కంఠ యింకను దీవ్రమయ్యెను. అప్పుడాతఁడు తనవెంటఁ గొంత పరివారమునుఁ దీసి కొని సమర్థునిదర్శనార్థము ఛాఫల్‌గ్రామమునకుఁ బోయెను, కాని సమరుఁ

డొకతావున నుండువాఁడుగాఁడు. అప్పుడు సమర్థుఁడు ఛాఫల్ గ్రామ పరిసరస్థమగు కృష్ణాతీరమునఁగల యరణ్యములలోని దరీగహ్వరముల యందు సంచరించుచుంటచే నాతని దర్శనము శివాజికి గాకపోయెను. మహీపతియను కవి తన "సంతువిజయ"మను గ్రంథమునందిట్లువ్రాసి యున్నాఁడు. ఈ విధముగా శివాజిమహారాజెన్నియోమాఱులు నిరాశ నొంది తిరిగిపోవలసివచ్చెను. ఐనను నాతఁడు తన యత్నమును విరమింప లేదు. చివర కొకదినమున శివాజిచక్రవర్తి తనలో సమర్థుని సందర్శనము ఆతని ప్రసాదము లభింపనిచో నాహారము ముట్టనని ప్రతిజ్ఞయొనర్చి గృహమునుండి బయలు దేరెను. ఇట్లు దృఢనిశ్చయమొనర్చుకొని శివాజి సమర్థుని జాడలుదీయుచు ఛాఫల్‌నగర పరిసరారణ్యముల ననేక శ్రమ లొంది తిరుగుచు మిగుల విహ్వలుఁడు, ఆర్తుఁడునై యుండెను. అప్పుడు సమర్థుని శిష్యుఁడొకఁడు శివాజితో "రాజా! సమర్థుఁ డీసమీపము నందలి యొక చెట్టుక్రిందఁ గూర్చుండియుండె"నని చెప్పెను. శివాజి సత్వ రమ యచ్చటికేగి సమర్థుని సందర్శించెను. ఉభయులకును ప్రేమపూర్ణ మగు సంభాషణము జరిగెను. శా. శ ౧౫౭౦ (క్రీ. శ. 1649) వైశాఖ శుద్ధనవమి గురువారమునాఁడు సమర్థస్వామి శివాజికి మంత్రోపదేశ మొనరించెను. దాసబోధమునందలి పదమూఁడవదశకములోని "లఘు బోధ"మను సమాసమును అద్వైతజ్ఞానమును వివరించుటకై వినిపించెను.

సమర్థుఁ డొకతావుననే చిరకాలము వసించువాఁడుకాఁడనిచెప్పి తిమిగదా! ఒకప్పుడు సమర్థుఁడు ఛాఫల్‌గ్రామమునందలి మఠము నందుండును. ఒకప్పుడు కృష్ణాతీరమునందలి వనపర్వతములలోని వృక్ష ములకడ నుండును. ఒకప్పుడు దేశపర్యటనమునకో, తీర్థయాత్రలకో పోవుచుండును. ఇందుచే శివాజి తన గురుదర్శనమును నిత్యమును నియమ పూర్వకముగఁ జేయఁజాలకపోయెను. సమర్థుఁడు తన సమీపస్థలమున నెందేని వసించియున్నచోఁ దనకు నిత్యసమాగమలాభము గలుగుగదా యని శివాజి కెంతయో కోర్కెయుండెను. అతఁడెన్నియోమాఱులు ప్రార్థించెను. కాని సమర్థుఁడు శివాజికోరిన యీ కోరికపై నెక్కుడు శ్రద్ధ దీసికొనకుండెను. అప్పుడు శివాజీ అనేక భిన్నభిన్న ప్రసంగపూరిత మ్మగు నొక లేఖనంపెను. ఈ యుత్తరము శివాజీ రామదాసుల పరస్పర

సంబంధమును దెలిపెడి యొక ఐతిహాసిక ప్రమాణము. ఆ యుత్తరము లోని యంశములసారము నిచట నుదాహరించెదము. దానివలనఁ బాఠకులు స్వయముగా శ్రీ శివాజీరామదాసుల సంబంధమెంత గాఢముగా నుండెనో తెలిసికొనఁగలిగెదరు. శ్రీసమర్థుఁడు శివాజికి మంత్రోపదేశ మొనరించి రాజ్యసంపాదనముగావించి ధర్మమును స్థాపింపుమనియు, దేవ బ్రాహ్మణసేవ చేయుమనియు ప్రజాపీడ తొలంగించి పరిపాలింపుమనియు, నివి నీముఖ్యధర్మములనియు నాజ్ఞాపించెను. అంతియగాక "నీ హృదయమునందలి కోర్కెలెల్ల పూర్ణమగు"నని యాశీర్వదించెను. ఈ యాజ్ఞానుసారముగా శివాజి గావించిన రాజ్యసంపాదనోద్యోగము సఫలమయ్యెను. మఱియు నాతని మనోరథము స్వామియొక్క యాశీర్వాద ప్రతాపమునఁ బూర్ణమయ్యెను. దుష్టనాశనము, విపులద్రవ్యప్రాప్తియు శ్రీ గురుచరణ ప్రతాపఫలమే యని శివాజికి దృఢవిశ్వాసము కలిగెను. సమర్థుండును సద్గురుఁడునునగు శ్రీ రామదాసస్వామి చరణకమలములయందుఁదనరాజ్య సర్వస్వమును సమర్పించి నిత్యమును గురుచరణసేవ యొనర్చుట కవకాశము లభించినఁజాలునని శివాజి తలంచెను. ఆ సమయమున సమర్థుఁడు నేను తొలుతఁదెల్పిన ధర్మముల ననుసరించి వర్తించుటయే నాకు సేవ గావించుట యని నుడివెను. అనంతరము శివాజీ యిట్లు ప్రార్థించెను. "స్వామీ! తా మేదేని సమీపస్థానమునందు వసించినచో మాటిమాటికిని దర్శనలాభము కలుగును. ఎందేని శ్రీ రామమూర్తిని స్థాపించినచో సంప్రదాయము వృద్ధినొందును." ఈ కోర్కెకనుగుణముగ సమర్థుఁడు ఛాఫల్ గ్రామమున శ్రీ రాముని స్థాపించెను. కాని తానుమాత్రము చుట్టు ప్రక్కల గిరిగహ్వరములందే వసించుచుండెను. తరువాతఁ గొంతకాలమునకు శివాజీ సమర్థునిజూచి శ్రీరాముని పూజామహోత్సవాది ధర్మ కార్యములను సాంగోపాంగముగా నెరవేర్చుట కెన్నిగ్రామములు నియత పఱుపవలయునో యానతిండని ప్రార్థించెను. సమర్థుఁడు శివాజితో "అంత విశేషమగు నుపాధితో నవసరమేమియులేదు. శ్రీ రామునిసేవ గావింపవలయునని నీకు నిశ్చయభావ మున్నచో యథావకాశముగనెంత నియత పఱుపవలయునని తలంచెదవో దానిని నెరవేర్పుము" అని చెప్పెను. అప్పుడు శివాజి శ్రీ సమర్థునకు సంప్రదాయపు సేవ గావించుచుండుటకై గ్రామ

ములను క్షేత్రములను దానమొసంగి శాసనముప్రాసి సమర్థునికడకంపెను. మఱియు దాను శ్రీ రామోత్సవములు నిరంతరము జరుపుట కాజ్ఞ యొసంగుమని వేడుకొనెను. శివాజి మిగుల బలవంతపఱచుచుంటచే సమర్థుండు సితారాయొద్దనున్న సజ్జనగడ దుర్గమునందు వసించెను. అచ్చట శివాజి యొక మఠము గట్టించెను.

శివాజీ సమర్థుల సంబంధమునుగూర్చి యెన్నివిషయములు వ్రాసి నను దక్కువయేయగును. ఇఁక మూఁడువిషయములనుమాత్రము వ్రాసి యీశీర్షికను సమాప్తి గావింతుము.

ఒకదినమున సమర్థుఁడు మాహులీసంగమమునందు స్నానసంధ్యల నొనరించి భిక్షనడుగుచు సితారాలోని శివాజీ భవనములోని కరిగెను. "జయజయ రఘువీరసమర్థ" అని గర్జించి భిక్షనడిగెను. సమర్థునివాక్కును వినఁగనే శివాజీహృదయము గద్గదికమయ్యెను. సత్పాత్రుఁడగు సద్గురుని జోలెయందు ఏమి భిక్షనిడవలయునాయని శివాజి యోచించి తత్క్షణమే యొక కాగితమువిూఁద "శ్రీ సమర్థుని చరణకమలములయందు నారాజ్య మంతయును సమర్పించితిని" అని వ్రాసి యా లేఖనమునఁ దన ముద్ర వేసి సంతకముజేసి వెలుపలికివచ్చి యాకాగితమును సమర్థుని జోలె యందుంచి సాష్టాంగదండము నర్పించెను. ఈ యుదంతమునుగాంచి సమర్థుఁ డిట్లు ప్రశ్నించెను. "ఏమి శివబా! ఎట్టి భిక్షమొసంగితివి ? పిడికెడుబియ్య మును నాజోలెలో వైచినచో నీ రెండుజాములవేళ గడిచిపోయెడిదిగదా ! నేడు కాగితపుముక్కను సమర్పించియే నాకాతిథ్యము నొనర్చెదవా యేమి ?" ఇట్లు నుడివి సమర్థుఁడు జోలెనుండి కాగితమునుదీసి చదువఁగా శివాజీ రాజ్యమునంతయుఁ దనకు సమర్పించినయంశము విశదమయ్యెను. అప్పుడు సమర్థుఁడు శివాజీనిజూచి "ఏమి శివబా ! రాజ్యమును నాకిచ్చి వైచితివిగదా ! ఇఁక నీ వేమిచేసెదవు?" అని ప్రశ్నించెను. శివాజీ చేతులు మోడ్చుకొని స్వామీ ! మీ చరణసేవ గావించుచుఁగాలము గడుపుదును అనెను. ఈ మాటలువిని సమర్థుఁడునవ్వి యిట్లనెను. "బాబా ! ఏది యెవని కార్యమో యది వాఁడె చేయుట యుచితము. బ్రాహ్మణులు జపతపము లొనరించి జ్ఞానసంపాదనము గావింపవలెను. క్షత్రియులు క్షాత్రధర్మపాలనము గావింపవలెను. ఈ విధముగాఁ దమతమ కర్తవ్యములను నెరవేర్చుచుండుట

వలన మోక్షప్రాప్తి యగును. తమతమకర్మలను యథోచితరీతిగఁ బూర్ణ పఱచుటయందే జన్మసార్థకత్వము గలదు. పూర్వకాలమున రామచంద్రుఁడుగూడఁ దన కులగురువగు వసిష్ఠునకు అర్ధరాజ్యమును సమర్పించెను. ఆ సమయమున వసిష్ఠుఁడు శ్రీరామునకు యోగవాసిష్ఠరూపముగ నీతి, న్యాయ, ధర్మముల నుపదేశించి రాజ్యము నాతనికి మఱల నొసంగెను. జనకమహారాజుసైతము యాజ్ఞవల్క్యునకుఁ దనరాజ్యము నిచ్చెను. ఆ సమయమున నాతఁడు జనకునకు రాజధర్మముల నుపదేశించి రాజ్యము తిరుగనొసంగెను. శివబా ! విరాగులమగు మాబోంట్లకు రాజ్యముతో నేమియావశ్యకము. ఎప్పుడేని మేమంగీకరించినచో దానిని వ్యవహరించుట కొకమంత్రి గావలెనుగదా! ఆ మంత్రివి నీవేకమ్ము! రాజ్యము నాయదిగ భావించి దానిని బరిపాలించుము." ఈ యుపదేశమును వినఁగానే శివాజీ యంతఃకరణము గద్గదికమయ్యెను. ఇఁక రాజ్యమును మఱలఁ గైకొనుట దక్క వేఱొకయుపాయము లేదని తెలిసికొని శివాజీ సమర్థు నిట్లు ప్రార్థించెను. "కృపాపూర్వకముగా నిపుడు మీపాదుకలను నాకనుగ్రహింపుఁడు. వానినే సింహాసనమునందుంచి నేను మీ ప్రధానునివలె రాజ్యకార్యములు నెరవేర్చెదను." సమర్థుఁ డీప్రార్థనము నంగీకరించెను. అప్పటినుండి శివాజీ తనరాజ్యచిహ్నమును (జెండాను) కాషాయవర్ణముగలదానిగ నొనర్చెను. మహారాష్ట్రుల కాషాయవర్ణపతాకము ఇతిహాసమునఁ బ్రసిద్ధముగ నున్నది.

శివాజీ మహారాజు సామన్‌గడ దుర్గమును నిర్మించునపు డొక దినమున దుర్గనిర్మాణకార్యమునఁ బాటువడుచున్న వందలకొలఁది మనుజులఁ గాంచి "ఇందఱిని నేను పోషించుచున్నాఁడను గదా! నేను ధన్యుఁడను." అని తలంచుకొనెను. ఈతలంపుకలుగఁగనే శివాజి మహారాజు మానసము నందొకవిధమగు నభిమాన ముదయించెను. ఇంతలో నాకస్మికముగా సమర్థుఁ డచటికరుదెంచెను. అతని గాంచఁగనే శివాజి దండప్రణామము లాచరించి "స్వామీ! తామాకస్మికముగ నేఁడు విచ్చేయుటకుఁ గారణం బేమి"యని ప్రశ్నించెను. సమర్థుఁ డిట్లు నుడివెను. "నీవు శ్రీమంతుఁడవు. వేలకొలఁది మనుజులను బాలించునేర్పరివి. కావుననే నేఁడు నీకర్మశాలను జూడవచ్చితిని," "ఇదియంతయు మీ యనుగ్రహఫలమే" యని శివాజీ

బదులుచెప్పెను. ఈ విధముగఁ బ్రసంగము జరుగుచుండ సమర్థుని దృష్టి సమీపమునందలి యొకఱాతిమీఁది కరిగెను. ఆ ఱాతిని దెప్పించి సమర్థుఁడు శివాజీని జూచి మీ పనివాండ్రలో నొకని బిలిపించి యిప్పుడే యీ ఱాతిని బగులఁగొట్టింపుమని చెప్పెను. శివాజివలన నాజ్ఞనొందిన కర్మకారుఁ డాఱాతిని బగులగొట్టసాగెను. సమర్థుఁడా కర్మకారునితో "మిగుల దెబ్బతగులఁగూడదు. సరిగ రెండుతునకలు మాత్రమే యగు నటుల జాగ్రత్తగఁ గొట్టవలయు"నని చెప్పెను. ఆ విధముగనే రెండు ఖండములుగఁ గొట్టగనే దాని నడిమిభాగమందుఁ గొంచము నీరును బ్రతికి యున్న యొకకప్పయు గోచరించెను. ఈ చమత్కారమునుగాంచి యచట జనులందఱు నాశ్చర్యపడిరి. అప్పుడు సమర్థుఁడు శివాజీ కభిముఖుఁడై "శివబా! నీయోగ్యత చాలగొప్పది. మఱియు నీలీల లగాధముగ నున్నవి చూడుము. ఈ యాశ్చర్యకరమగు నంశ మింక నెవనివలన జరుగఁగలదు?" అని పలికెను. "దీనిలో నాదేమున్న"దని శివాజీ పలికెను. సమర్థుఁ డందులకుఁ జిఱునవ్వునవ్వి "లేకేమి! నీవుదక్క నిఁకఁ గర్త యెవఁడు! నీవుదక్క నీజీవుల నింకనెవఁడు పాలింపఁగలఁడు?" అని పలికెను. అప్పుడు శివాజీ మహారాజు చకితుఁడై తన ప్రమాదమును దెలిసికొని యిట్లు నుడివెను. "స్వామీ! నేను పామరుఁడను. నావలన నేమియుఁ గాజాలదు. ఈదాసుని క్షమింపుడు." సమర్థుఁడు శివాజీని జూచి "ఓయీ సోదరా! క్షమించుటకే సమయమునకు నేనిచ్చటికి వచ్చితిని. నీవు శ్రీరాముని ప్రభుత్వమునం దొక పెద్ద సేవకుఁడవు. నీచేతినుండి యాప్రభు వితరుల కొసంగుచున్నాఁడు. ఇంతమాత్రమునకు నీవీవిధముగ నెప్పుడును నభిమానము నొందఁదగదు" అని పలికెను. దీనిని విని శివాజీ మహారాజు మిగులఁ బశ్చాత్తాపము నొందెను. మఱియు నాతఁడు సమర్థుని చరణపద్మములపైఁబడి మాటిమాటికి క్షమార్పణమును వేఁడు కొనెను. ఈ శిక్షాదాయకమగు చమత్కారము ననుసరించి యొకచిత్ర కారుఁ డొక చిత్రపటమును వ్రాసియున్నాఁడు.

సమర్థుఁ డొకదినమున సజ్జనగడమునందాసీనుఁడై శిష్యమండలి యొసంగు ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరము నిచ్చుచుండెను. ఇంతలో దనశరీరముపై నొక కదుమున్నట్లు గోచరించెను. సమర్థుఁ డదిచూచి "నాతల్లి

నాకొఱకు దేవికి బంగారుపుష్పము సమర్పింతునని మ్రొక్కుకొనెను. ఆ సంకల్పము నెరవేరలేదను సంశయము జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనెను. శివాజీచే స్థాపింపఁబడిన ప్రతాపగడమునందలి దేవీసన్నిధికి సమర్థుఁడేగి తనతల్లి మ్రొక్కుకొన్న స్వర్ణపుష్పమును సమర్పించెను. అప్పుడు దేవిని గూర్చి సమర్థుఁ డొనరించిన స్తుతియందు ఆతని యాత్మ చరిత్రోల్లేఖనము గూడఁ గొంతకలదు. అంత్యమున నుడివిన నాలుగు పద్యములలోనున్న శివాజిని గూర్చిన ప్రార్థనము జ్ఞాపక ముంచుకొనఁదగినది. అందలి భావార్థము నిట నుదాహరింతుము.

"ఓమాతా! నాప్రార్థన మొక్కటి మాత్రమే! నీవు నాకు వరము లనుగ్రహింప నెంచినచో నీ కభిమాన పాత్రుఁడును, సర్వకాల సర్వావస్థలందును నీవాఁడును నగు శివాజిని రక్షింపుము. ఆతనిని నేను జూచుచుండఁగనే వైభవ శిఖరమునం దధిష్ఠింపఁజేయుము. ఇదియే నాకొసంగఁదగిన వరప్రసాదము. నేటిదనుక నీవసంఖ్యాకులగు దుష్టులను సంహరించితివని వినియుంటిని. ఈసమయమున నాకుఁ బ్రతీతి కలిగింపుము. దేవగణములోనివారెల్లరును మమ్మును మామిత్రులను మఱచిరి. నీ వింక నెంతదనుక మాస్వత్వములఁ బరీక్షించెదవు? ఓ దేవీ! నీ భక్తుల మనోరథమును శీఘ్రముగ సఫలమొనర్పుము. నే నత్యంతాతురుఁడనై యున్నాఁడఁ గావున క్షమింపుము. నాకోర్కె సఫలము గావింపుము." ఆహా! శివాజీమహారా జెంతధన్యాత్ముఁడు. ఆతని యైశ్వర్యాభివృద్ధికై సద్గురుఁడగు సమర్థుఁడు దేవి నీవిధముగఁ బ్రార్థించుచున్నాఁడు. సమర్థుని యొక్కయు, శివాజియొక్కయుఁ బరస్పర సంబంధమునం దింతకంటె నధికముగ నేవిషయమును వ్రాయుదుము? ఏ మహాకార్యముకొఱకు శ్రీరామదాసస్వామి తన పుణ్యమంతయు వ్యయ మొనరించెనో తనకుగల శక్తిసామర్థ్యమును వినియోగించెనో దాని నాతని యిష్టానుసారముగ శ్రీరామచంద్రమూర్తి పూర్తిజేసెను. ఈవిషయ మింకను సింహావలోకనమువలనఁగూడఁ దెలియగలదు.

## సమకాలికులగు నుపదేశకులు.

శ్రీరామదాసస్వామి తన జీవితకాలమునందు మహారాష్ట్రదేశమున స్వధర్మస్థాపనమునకును సమాజహితమునకును నొనరించిన య[illegible]

కార్యములలో నాతని సమకాలికులగు నుపదేశకులు (సాధుపురుషులు) కవులుగూడ సహాయముగా నుండిరి. ఆ సమయమున మహారాష్ట్ర సమాజ మభ్యున్నతి బడయుట కావశ్యకములగు సనాతన ధర్మవ్యాప్తి జాతినిబంధనములలో ననిష్టత్వము, కర్తవ్యపరాయణత్వము, ఏకత్వము మున్నగు గుణశిక్షణములను అనేక సాధుసత్తములు కవిజనులు తమ ప్రవర్తనమువలనను, ఉపదేశములవలనను గావించుచుండిరి. మొట్టమొదట ధర్మశాస్త్రాది గ్రంథములన్నియు సంస్కృతమునందుండెడివి. అందుచే బండితులు, విశేషజ్ఞులు నగువారలుదక్క దక్కినవారలెవ్వరును జదివి లాభము గ్రహింపఁజాలకుండిరి. కాని సమర్థుని సమకాలికులగు సాధు జనులు, కవీశ్వరులు తమ యుపదేశములను మాతృభాషయగు మహారాష్ట్రమునందె గావింప నారంభించిరి. ఈకారణమున నహంకారపూరితులగు కొందఱివలన వారలకుఁ గొంతకష్టమును సహింపవలసివచ్చెను. వారల మాతృభాషాప్రేమవలన జనసమాజమున కసాధారణమగు హితము కలిగెను. యూరపుఖండమునందు "బాయిబిల్"ను ఆంగ్ల భాషయం దనువదించి లూథరను ధర్మసంక్రాంతిబీజమును నాటినట్లు మహారాష్ట్రోపదేశకులు(విశేషించి రామదాసస్వామి కాలమునను దరువాతి గాలమునను గల ఉపదేశకులు) సంస్కృతమునందు మరుగుపడియున్న సమస్త జ్ఞానభాండారమును మహారాష్ట్రభాషాముఖమున సర్వసాధారణులగు జనులకు సుగమమును, సులభమును గావించిరి. క్రీ. శ. 1895 లో పూనా సార్వజనిక సభాపక్షమునఁ బ్రచురించు త్రైమాసిక పత్రికయం దిట్లు వ్రాయబడెను.

The saints and prophets addressed the people both in speech and writing in their own vernacular and boldly opened the hitherto hidden and unknown treasures to all and sundry men and women, Brahmans and Sudras alike. These early Marathi writers knew that modern India, after Budhistic revolution, was less influenced by the Vedas and Shastras than by the Ramayana and Mahabharat the Bhagavat Puranam and the Gita, and these latter works were translated and made accessible to all.

(ఋషులును, భక్తులును కవితయందును, మాటలందును దేశభాషల నుపయోగించిరి. అందుచే బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకును స్త్రీపురుషులకును అంతవఱకు మఱుఁగైయున్న విజ్ఞానము బహిర్గతమయ్యెను. బౌద్ధమత విజృంభణమునకనంతరము నవీన భారతవర్షమునందు వేదశాస్త్రములకంటె భగవద్గీతా భారత భాగవత రామాయణము లెక్కుడుగ ఆకర్షించుచున్నవని యీ ప్రాచీన మహారాష్ట్రకవులు గ్రహించి వానిని దేశభాషలలోనికి అనువదించి యందఱి యిండ్లవాటులోనికి దెచ్చిరి.)

ఈ యుపాయముచే మహారాష్ట్ర దేశమునందు ధర్మము వృద్ధినొందెను. జనులు తమ సమాజమునకు దేశమునకు హితముగావించుట యందు సమర్థులైరి. ఈవిధముగ సమర్థునికాలమునందు ధర్మమునకు స్వజనమునకు స్వజాతికి, స్వభాషకు సేవగావించినవారిలోఁ గొందఱి వృత్తాంతములను దెలుపుట యావశ్యకమైయున్నది. జయరామస్వామి, రంగనాథస్వామి, ఆనందమూర్తి, కేశవస్వామి, మోరయాదేవుఁడు, తుకారాంబాబా, వామనపండితుఁడు, దేవీదాసుఁడు, కూర్మదాసు, రామాజీ, బోధలేబాబా, నృసింహసరస్వతి, ముక్తేశ్వరుఁడు, విఠ్ఠలకవి, అనంతకవి, ఆనందతనయుఁడు, నిరంజనస్వామి, షేకు మహమ్మదు, శివదీనుఁడు మున్నగు పలువురు సాధువులును, కవులును సమర్థునకు సమకాలికులుగ నుండిరి. వీరలందఱివిషయమును గొంచెము కొంచెముగా వ్రాసినను బ్రకృత వ్యాసము మిగుల విస్తరించిపోవఁగలదు. కావున వీరిలోని మొదటి నలుగురు సాధుపురుషుల విషయముమాత్రము కొంచెము వ్రాసి యీ భాగము ముగింతుము.

మహారాష్ట్రమునందు రామదాస పంచాయతనమునకు మిగులఁ బ్రసిద్ధిగలదు. ఈ పంచాయతనములో శ్రీరామదాసస్వామితోఁబాటుగ జయరామస్వామియు, రంగనాథస్వామియు, ఆనందమూర్తియు, కేశవస్వామియుఁగలరు. భికాజీపంతు దేశపాండే యనునాతఁడు కాసరాబాదు పరగణాలోని మాండవగణమను గ్రామవాస్తవ్యుఁడు. ఈతనిభార్య కృష్ణాబాయి. జయరామస్వామి యీదంపతుల కుమారుఁడు. తనతల్లితోఁగలిసి జయరామస్వామి పండరిపురమునందు వసించుచుండెను. అచట భక్తియుతముగ భజనముగావించి భగవద్దర్శనమొందినపిమ్మట నాతఁడు "బడ్గావు" అను గ్రామమునందలి "కృష్ణాజీఆపా అభ్యంకరుని" కడ కరిగెను. ఆతని

యుపదేశమువలన జయరామస్వామి రామదాసస్వామికి శిష్యుఁడయ్యెను. జయరామస్వామి శాంతిపంచీకరణము, సీతాస్వయంవరము, రుక్మిణీ స్వయంవరము అను గ్రంథములను రచించి క్రీ. శ. 1672 లో మరణించెను. గోపాలపంతు బయాబాయీల కుమారుఁడు రంగనాథస్వామి. రంగనాథస్వామియన్నయగు బ్రహ్మానందస్వామి గొప్ప సాధుపురుషుఁడు. బ్రహ్మానందస్వామి కుమారుఁడగు శ్రీధరకవి రామవిజయము, హరివిజయము, పాండవప్రతాపము, భగవద్గీత, శివలీలామృతము మున్నగు ననేకగ్రంథములు రచించెను. మహారాష్ట్ర దేశీయులగు పిన్నలుపెద్దలు నగువారలెల్ల నిప్పటికిని మిగుల నుత్సాహముతో నితని గ్రంథములు చదువుచుందురు. రంగనాథస్వామి నిత్యమును రామదాసస్వామిని సందర్శింపఁదలంచి సజ్జనగడమునకు సమీపమునందున్న నిగడీగ్రామమున మఠముగట్టించుకొని యచట నివసించుచుండెను. ఈ స్వామి గొప్పరాజయోగియు విలాసపురుషుఁడునై యుండెను. నిరంతర మీతఁడు గొప్ప యైశ్వర్యశాలివలె నుండువాఁడు. తలపయి జలతారుపనిగల పట్టుపాగయు, చెవులకు విలువగల మంచి ముత్తెములపోగులు, శరీరముపై జరీపనితనముగల అంగరఖాయు, చేతిలోబాకును వీపుపై డాలునుధరించి, మిగుల మూల్యముగల యున్నతాశ్వము నెక్కి వెలుపలకు బయలుదేరువాఁడు. వెంట దాదాపుగఁ గౌపీనధారులగు బ్రహ్మచారి శిష్యులుండువారు. రంగనాథస్వామిగూడ బాలబ్రహ్మచారి. ఆతఁడు లాగునకులోపలఁ గౌపీనము ధరించువాఁడు. బృహద్వాక్యవృత్తి, చిత్సదానందలహరి, వాసిష్ఠసారము మొదలగు నుత్తమోత్తమ గ్రంథముల నీతఁడు రచించెను. క్రీ. శ. 1684 లో నీతఁడు సమాధిగైకొనెను. ఆనందమూర్తి రంగనాథస్వామిశిష్యుఁడు. సమర్థుఁడాతని చిరంజీవా ! యని పిలుచువాఁడు. క్రీ. శ. 1696 లో నాతఁడు సమాధిగైకొనెను. ఆతని సమాధి బ్రహ్మనాళమునఁదుఁ గలదు. మహారాష్ట్రభాషలో ఆనందస్వామి యనేక చాటుపద్యములను రచించెను. కేశవస్వామి యిపుడు హైదరాబాదనఁబడు భాగ్యనగరమునందు వసించుచుండెను. ఆతని గురుఁడు కాశీరాజస్వామి. కేశవస్వామి కొన్ని విస్ఫుటాభంగపద్యములు రచించెను. క్రీ. శ. 1682 లో నీతఁడు స్వర్గవాసియయ్యెను.

రామదాస పంచాయతనమునందలి పైని బేర్కొనిన నలుగురు సాధుపురుషులేగాక సమకాలికులగు నితరసాధువులును, గవీశ్వరులును శ్రీ రామదాసస్వామిని మిగుల సన్మానించువారు. వామనపండితుఁడు మహారాష్ట్రమునందు సుప్రసిద్ధకవియు, గొప్ప సంస్కృత విద్వాంసుఁడును, శాస్త్రజ్ఞుఁడునునై యుండెను. కాశిమొదలు రామేశ్వరముదనుకఁ దన యపూర్వ విద్వత్సామర్థ్యమును బ్రదర్శించి సమకాలిక పండితులవలన జయపత్రముల నార్జించెను. అతఁడు మాతృభాషయగు మహారాష్ట్రము నందును సంస్కృతమునందును ఉత్తమోత్తమగ్రంథము లెన్నియో రచించెను. అందు నిగమసారమను సంస్కృతగ్రంథము మిగులఁ బ్రశస్త మైనది. తొలుదొలుత వామనపండితుఁడు తన మాతృభాషను నిందించు వాఁడు. సాధుజనులయెడల విశేషించి పూజ్యభావ మాతనికి లేకుండెడిది. శ్రీ రామదాసస్వామితోఁ గలిసికొన్నప్పటినుండియు నాతని గర్వమంతయు నశించెను. రామదాసస్వామి సందియములన్నియుఁ దొలంగించి తన యపూర్వ చమత్కృతిచే నాతని సంస్కరించి సాధుజనుల విషయమునందు శ్రద్ధాభక్తులు గలిగించెను. సమర్థుఁడు వామనపండితుని శిష్యునిగాఁ జేసికొని మహారాష్ట్రములో గ్రంథములు వ్రాయుమని యాజ్ఞాపించెను. నాఁటనుండి మహారాష్ట్రభాషలో దాదాపుగ ఏఁబదియఱువది గ్రంథము లను రచించెను. శ్రీ భగవద్గీతపై నాతఁడువ్రాసిన టీకాత్మికమగు ఓవీ ఛందోగ్రంథ మద్వితీయమైనది. వామనపండితుఁడు వ్రాసిన గ్రంథముల లోని పద్యములన్నియుఁగలిసి దాదాపు పంద్రెండులక్షలగునని చెప్పుదురు. ఈ విధముగా రామదాసస్వామి సమకాలిక పండితుల హృదయములందు మాతృభాషయగు మహారాష్ట్రమునందుఁ బ్రేమ గల్గించెను.

## సమర్థ శిష్యులు, ఆతని సంప్రదాయి మఠములు.

సమర్థ రామదాసస్వామికి శిష్యులెందఱు ? ఎక్కడెక్కడ నెవ రుండిరి ? తన సాంప్రదాయికమఠముల నెక్కడెక్కడ నెన్నింటిని స్థాపిం చెను ? ఎవరెవరిని మఠాధీశ్వరులుగ నొనర్చెను ? అను విషయములను నిశ్చయముగాఁ దెలుప సాధ్యముగాదు. మహారాష్ట్రేతిహాసమునందును బ్రాచీన కావ్య సాహిత్యములందును బరిశోధనము గావించువారలు శ్రీ రామదాసస్వామి వేలకొలఁది శిష్యులను వందలకొలఁది మహాంతులను

గావించెననియు అనేకస్థానములందు మఠములు నెలకొల్పెననియు అతని శిష్యులును మహంతులును ఆర్యావర్తమునం దంతటను విశేషించి మహారాష్ట్రమునందును దిరిగి స్వధర్మమును, సునీతిని నుపదేశించి జనులలో జాగరూకత గలిగించిరనియు వారలగణించుట యశక్యమనియుఁ జెప్పుచున్నారు. స్వయముగ సమర్థుఁడు దాసబోధమునందు (ద.19,స. 10 లో) "జనులెందఱున్నారో జనసముదాయ మెంతగలదో తెలియదు. జనులందఱిని శ్రవణ మననములందుఁ బ్రవేశపెట్టి సముదాయముల గణించుట యసాధ్యము" అని వ్రాసియున్నాఁడు. అతని ప్రసిద్ధశిష్యుఁడగు కళ్యాణస్వామి యొకతావున "ఈ భూమండలమునఁగల సమర్థుని భక్తమండలి నెవ్వరును గణింపఁజాలరు" అని వ్రాయుచున్నాఁడు. గిరిధరస్వామియు "సమర్థుఁ డెందఱో శిష్యులను మహంతులను గుప్తరూపముగ నుంచెను. సమర్థుఁడుదక్క వారి నితరు లెఱుంగరు" అని వ్రాసెను. సారాంశమేమన, శ్రీసమర్థుఁ డనేకులను దన జీవితకాలమున శిష్యులుగను మహంతులుగను నొనర్చెను. అనేకస్థానములందు మఠముల నెలకొల్పెను. ఈకాలమున వారందఱిజాడల నెఱుంగుట కేవలము కఠినతరమేగాక యసంభవమనిగూడఁ దోఁచుచున్నది.

సమర్థుని శిష్యగణమును లెక్కించుట యసంభవమైనను నాతని జీవితచరిత్రమును లిఖించిన మహానుభావులగు మహంతులుకొందఱు సమర్థుని శిష్యులయొక్కయు మఠములయొక్కయు నామములఁ జేర్కొనిరి. ధూలియా (ఖాన్దేశము) యందలి సత్కార్యోత్తేజకసభామండలివారు శ్రీరామదాసస్వామి కవిత్వమునందుఁ బ్రథమఖండమును బ్రచురించిరి. అందలి ప్రస్తావనలో శ్రీరామదాసస్వామి సంప్రదాయులగు మహంతులను శిష్యులను మఠములను గొంచెమువర్ణించిరి. దాని నాధారముగాఁ దీసికొని కొన్ని విషయము లుదాహరింతుము.

శ్రీ సమర్థుని మఠాధిపతులలో నిప్పటికి ఎనుబదియాఱుగురిజాడ మాత్రము తెలిసినది. అందుఁ గొందరినామముల మాత్రము తెలుపుదుము. 1. డోమగావు మఠమునందు కళ్యాణస్వామియు, 2. శిరగావు మఠమునందు దత్తాత్రేయస్వామియు, 3. కణహేరీమఠమునందు వాసుదేవస్వామియు, 4. దాదేగావుమఠమున దేవదాసును, 5. టాకలి ఇందూరు

బోధనమఠములయందు ఉద్ధవస్వామియు, 6. ఫాఫలుమఠమునందు దివాకరస్వామియు, 7. కర్ణాటకమఠమునందు అనంతమౌనియు నుండిరి. 8. విశ్వనాథపండితుఁ డుత్తరహిందూస్థానమునను, 9. బాలకృష్ణుఁడు బరారునందును, 10. మాధవుఁడు, యాదవుఁడు, వేణీమాధవుఁడు ప్రయాగయందును, 11. జనార్దనుఁడు సూరతునందును, 12. శ్రీధరుఁడు రామకోటయందును, 13.గోవిందుఁడు గోవాయందును, 14.శివరాముఁడు త్రిలింగ ప్రాంతమునందును, 15. శంకరుఁడు శ్రీరంగ పట్టణమునందును, 16. హరిశ్చంద్రుఁడు అంతర్వేదియందును, 17. రామకృష్ణుఁడు అయోధ్యయందును, 18. హరికృష్ణుఁడు మధురయందును, 19. జయకృష్ణుఁడు మాయాపురమందును, 20. రామచంద్రుఁడు కాశియందును, 21. భగవంతుఁడు కాంధియందును, 22 హరి ద్వారకయందును, 23. దయాళు బదరీకేదారమునందును, 24. బ్రహ్మదాసు ఓంకారేశ్వరమునందును, 25. బల్లాలుఁడు జగన్నాథమునందును, 26. హనుమానుఁడు రామేశ్వరమునందును వసించుచుండిరి.

ఈనామములు వారల మూలనామములు గావు. ఇందుఁ బెక్కునామములు సమర్థుఁడు పెట్టినవి. తఱచుగా నీదేశమునందలి ప్రతిప్రధానస్థలమునందును నాతనిమహాంతులు (మఠాధిపతులు) వసించుచుండిరి. ఆతఁడు తన మహాంతుల నంపని తీర్థక్షేత్రమే లేదు. ఈమహాంతులు చిరకాలము శిష్యులవలె సమర్థునియొద్దనుండి సాంప్రదాయిక శిక్షనొందుచుఁ బరమార్థమార్గరహస్యములను జక్కఁగ నెఱుంగుచు సమర్థుని గ్రంథములకుఁ బ్రతులువ్రాసి శ్రద్ధాపూర్వకముగా బారాయణమొనర్చుచు నందలి గూఢతత్త్వములను స్వయముగా ననుభవప్రాప్తి గావించుకొనుచు శాస్త్రవచనమును, గురువచనమును, ఆత్మానుభవమును నిశ్చయమునొనరించుచు నుండువారు. అనంతరము

**ఆతాంహోణార్ తేం హోయేనాకా । జాణార్ తేం జాయే నాకా**

**తుటలీ మనాంతీల్ ఆశంకా । జన్మ మృత్యూచీ॥ ౮౮ – ద. ౭ – స. ౨.**

ఈ విధముగ నిర్భయము, నిశ్శంకము నగు వృత్తితో జగదుద్ధరణమను కఠినకార్య మొనరించుటకై శ్రీసమర్థుని యాజ్ఞానుసారముగ సమగ్రహిందూదేశమునందును లేక యేదేని యొక విశిష్టప్రాంతమునందును సమ

ర్థుని మహాంతులు సంచరించుచుండిరి. సమర్థుఁడు మహాంతుయొక్క ముఖ్యకర్తవ్యము నిట్లుచెప్పెను.

మహంతేం మహంత్ కరావేం యుక్తిబుద్ధీనేం భరావేం
జాణతేం కరూన్ విఖరావేం । నానా దేశీం ॥ దా. ౧౧ - స. ౧౦.

"మహాంతు, ఇంక ననేకమహాంతులను సిద్ధపఱుపవలెను. వారి యందు యుక్తిని, బుద్ధిని జక్కఁగ నింపవలెను. ఈ విధముగ ననేకజ్ఞాతలగు మహాంతులను సిద్ధపఱచి నానాదేశములందు వ్యాపింపఁజేయవలెను. ఇది యాతనికర్తవ్యము" ఈ కర్తవ్యమును యథోచితముగాఁ భావించుటకై పరిభ్రమణము, వివేకము, కష్టసహానశక్తి, మృత్యువునెడ నిర్భయత్వము, యశమునందు లాలసత్వము, వైరాగ్యము, నిస్పృహాత్వము, చాతుర్యము లేక విచక్షణత్వము, మృదువచనము, క్షమ, శాంతి, సహిష్ణుత్వము, పరోపకారబుద్ధి, ఉత్కటేచ్ఛ మున్నగు ననేక విశిష్టగుణము లావశ్యకములు. ఈగుణముల నన్నింటిని సమర్థుఁడు తన గ్రంథములందు (విశేషించి దాసబోధమున) వర్ణించియున్నాఁడు.

ఈ మహాంతులు భ్రమణము గావించునపుడుగాని మఠమునందున్నపుడుగాని యేయేపను లేవిధముగఁజేయువారో వారి కార్యక్రమ మెట్లుండెనో వార లేవిధముగ నుండిరో వారి వర్తన మెట్టిదో సమర్థుఁ డెట్లు వీరలను బరిశీలించుచుండెనో తెలిసికొనఁదగిన ప్రమాణసహితములగు పూర్వదృష్టాంతము లింతవఱకు లభింపలేదు. ఇది యంతయు విచారకరము. ఈ మహాంతుల కార్యప్రణాళికకు సంబంధించిన సప్రమాణమగు నితిహాసము లభించినచో శ్రీసమర్థరామదాసస్వామి జీవితచరిత్రము నందలి ముఖ్యభాగముపై నప్రతిమప్రకాశము కలుగఁగలదు.

శ్రీసమర్థునకు శిష్యులేగాక శిష్యురాండ్రుగూడ వేలకొలఁదిగ నుండిరనుటకు సందియములేదు. పురుషులలో శ్రీఛత్రపతి శివాజీ మహారాజు నామమమాత్ర మిచట నుదాహరించుట యీ శీర్షికకుఁ జాలును. స్త్రీవర్గమునందు సీతాబాయి, చిమణాబాయి, అంబిక, ద్వారకబాయి, భవాబాయి, కృష్ణాబాయి, వేణూబాయి, మనాబాయి, అన్నపూర్ణ, గంగాబాయి, గోదాబాయి మున్నగువారలు ప్రసిద్ధురాండ్రు. వీరిలో వేణుబాయి సీతాస్వయంవరము, మంగళరామాయణము, సంకేత

రామాయణము, లవకుశ రామాయణము, సుందరరామాయణము, అబ్దరామాయణము, భాషారామాయణము మున్నగు ననేక గ్రంథ రాజములను రచించెను.

## సమర్థుని గ్రంథములు.

ఇతిహాసదృష్టితోఁ జూచినచోఁ బ్రాచీనకవులయొక్కయు సాధువులయొక్కయు గ్రంథసముదాయమును రాష్ట్రీయ సాహిత్యమని చెప్పవచ్చును. ఆ రాష్ట్రీయసాహిత్య మెంతసూక్ష్మముగ నెంతిమార్మికముగ నభ్యాసమొనరించిన నా కాలపు రాష్ట్రీయ విజ్ఞాన మంతయధిక మగును. భరతఖండమునందలి యేప్రాంతమునందైనను బ్రాయికముగఁ బ్రాకృత భాషయందుఁ దొలుతొలుత గద్యగ్రంథముల వ్రాయుచుండు ప్రణాళిక లేనట్లు తోఁచుచున్నది. మాటలాడుభాష గద్యగనుండినను రాజకీయ వ్యవహారము గద్యగ వ్రాయబడుచున్నను కవులు సాధువులు మాత్రము ప్రాయికముగఁ బద్యమునందే గ్రంథరచనము గావించుచుండిరి. ఈ సాధువులయొక్కయుఁ, గవులయొక్కయు రచనాశైలియందును, భిన్నభిన్న ఛందముల నేరుటయందును దప్పక గొంతభేదము మాత్రము గాన్పించును. ప్రాయికముగాఁ బ్రాచీన సాధువుల కవిత్వమునందు స్వతంత్రరచనము మిగులఁ దక్కువగాఁ గాన్పించును. శ్రీరామదాసస్వామి యేదేని పౌరాణిక విషయమునందు మిగులఁ దక్కువగ గ్రంథరచన మొనరించెను. ప్రాయికముగ నాతని రచనమంతయు స్వతంత్రము. అతఁడు సాధారణముగ మనోరంజనార్థమై కవిత్వము వ్రాయలేదు. ఆతని కవిత్వ మంతటియందును నేదియో ముఖ్యహేతువుఁ గలదు. ప్రాచీనప్రథ ననుసరించి సమర్థుఁడుగూడఁ దన గ్రంథము లన్నింటిని బద్యాత్మికములుగ రచించెను. అతఁడు కేవలతము కావ్యరస ప్రధానతనే తన ముఖ్యహేతువుగ భావించి పద్యాత్మికముగ గ్రంథరచన మొనర్పక తన గ్రంథములన్నింటి నుపదేశార్థమై రచించెను. జనసమాజ సంస్కరణమే యాతని గ్రంథరచనమునకుఁ బ్రధాన హేతువు. దీనినిబట్టి యొకవేళ నాకాలమున గద్యమును వ్రాసెడి యాచారమున్నచో సమర్థుఁడుగూడఁ దన గ్రంథములను గద్యమునందే వ్రాసియుండెడి వాఁడని మన మూహింపవచ్చును.

ఇఁక సమర్థుఁడు కవియగునా? కాఁడా? ఒకవేళ నాతఁడు కవి యగుచో నే శ్రేణిలోఁ జేరదగినవాఁడు? అను విషయము తెలిసికొనవలసి యున్నది. ఆతని పద్యరచనమును గాంచి పలువురాతనిని కవి యందురు. సర్వసాధారణులగు జనులు పద్యరచనమునే కావ్యమని భావించుటయే దీనికింగల కారణము. కాని సాహిత్య శాస్త్ర పరిభాషానుసారముగ సమర్థుఁడు కవిగాఁడు. సమర్థుఁడు కవియొక్కయుఁ గవిత్వముయొక్కయు లక్షణములను దాసబోధమునందేవేవి చెప్పెనోవాని ననుసరించిచూచినచో నాతఁడు కవి—(ఆధునిక భాషయందుఁ బ్రతిభాశాలియుఁ బ్రాసాదికుఁడు, ఉపదేశకుఁడు) యని చెప్పవచ్చును. ఆతని కవిత్వమునందుఁ బ్రసాద గుణము నిండియున్నది. మఱియు మనోహర దృష్టాంతములుగూడ విశేషించికలవు. కాని యాతఁడు తన గ్రంథములోని దృష్టాంతములను ఇతర కావ్యగ్రంథములందువలె కేవల రమణీయత్వము, చమత్కారము సమకూర్ప నుదాహరింపలేదు. అందందుఁ బ్రతిపాదింపఁబడిన విషయ ములను బరిపోషణమొనర్చుటకే దృష్టాంతము లొసంగఁబడెను. ఈతని గ్రంథములం దద్భుతవక్తృత్వశక్తి గాన్పించును. అప్రతిబద్ధమగు విషయ నిరూపణ ప్రవాహమువలనను సముచితములగు శబ్దముల కూర్పుల వలనను చిత్తాకర్షకమగు విచారపద్ధతివలనను జదువుచున్నవానికిఁ బ్రత్యక్ష ముగ బృహస్పతియో, వాచస్పతియో వ్యాఖ్యానము గావించుచున్నట్లు తోఁచును. సమర్థుఁడు దాసబోధమునందుఁ బ్రతిపాదించియున్న సిద్ధాంత విషయములు పరమతాత్త్వికములును, గహనములును, శాస్త్రీయ ములునై యున్నను వానిని జదువునపుడు హృదయాహ్లాదకరమగు కావ్య మును జదువుచున్నారమని స్ఫురించుట కిదియే కారణము.

ఈ వివేచనమువలన సమర్థుఁడెట్టి యుత్తమోపదేశికుఁడగు కవియో యాతని గ్రంథస్వరూప మెట్టిదియో పాఠకులకు విదితము కాఁగలదు. ఆధునికకవుల దృష్టిలోఁగూడ సమర్థుని గ్రంథములం దనేక కావ్యగుణ ములు గోచరించును. ఆతని రామాయణమునందలి యుద్ధకాండమునందు వీరరసము పరిపక్వమొందినది. ఆతని పద్యములందును గీర్తనములందును అభంగములందునుగరుణరసమనుపమముగ నావిర్భవించినది. దాసబోధము నందు నిద్రానిరూపణము గావించునపుడు రామదాసస్వామి హాస్య

భీభత్సరసములను బాగుగాఁజిత్రించెను. కావ్యచమత్కృతియందు సైతము దాసబోధమునం దొకటిరెండుతావుల నుదాహరణములు లభింపఁగలవు. దాసబోధ పదునాలుగవ దశకములోని నాలుగవ సమాసమునందు "ఏకాఖడీ" యను నక్షరాలంకారము గలదు.

కవులనుగూర్చియుఁ, గవిత్వమునుగూర్చియు విచారించుటలో సమర్థుని భావమెట్లుండునో తెలిసికొనఁ బ్రయత్నించుదము. పాఠకుల కీవిషయమున నాతని ముఖమునుండియే యాతఁడెట్టికవియైనది విశదము కాఁగలదు. సమర్థుని మతానుసారముగ గద్యపద్య గ్రంథముల రచించు వారలును నానాశాస్త్రములను వివేచనపూర్వకముగఁ జర్చించువారలును కవులై యున్నారు. ఇంతియగాదు, మీదుమిక్కిలిగ వారు ప్రాసాదికులగు కవులై యున్నారు. సమర్థునిదృష్టిలోఁ బ్రతిభాసంపన్నుఁడగు వ్యక్తియే కవి. నవరసాత్మికమగు కవిత్వమును రచించు కవియు, గణితశాస్త్రియు, వేదాంతియు, యోధయు, చిత్రకారుఁడును, వ్యాఖ్యాతయు, శిల్పియు, నిటులే యెవ్వరైనఁగానిమ్ము ప్రతిభాలక్షణములు గలవాఁడే కవియని సమర్థుని మతము. ఆతని మతమును ననుసరించి చూచినచో కేవల గ్రంథ రూపముననేగాక యాచారరూపమున నున్నదిగూడఁ గవిత్వమని తెలియును. సాధనము, పురశ్చరణము, తపము, తీర్థాటనము, ధైర్యము, శౌర్యము, ధృతి మున్నగువాని క్రియలుగూడఁ గవిత్వమునందుఁ జేరి యున్నవి. సారాంశమేమన, ఆచారవిచారములు రెంటియందును నీశ్వరీయ మగు దివ్యాంశప్రతిభ కలిగియుంటయే కవిత్వ లక్షణము. మహాత్ముఁడగు తులసీదాసువలె సమర్థుఁడుగూడ నరస్తుతివిషయిక కవిత్వమును నిషేధించెను. ఉదరశాంతికై రచించు నరస్తుతి కవిత్వమునఁ దన యోగ్యత జూపించుట అధమత్వలక్షణమని సమర్థుని తలంపు. సమర్థుఁడు దాస బోధలో భక్తుఁడగు కవిని వర్ణించుచుఁ బ్రాసాదిక కవిత్వ లక్షణములను ఎట్లు వర్ణించెనో చూడుఁడు.

> నానాధ్యానే నానామూర్తీం। నానాప్రతాప్ నానాకీర్తీ
> తయాపుఢేం నరస్తుతీ। తృణతుల్య వాటే॥ ३२
> త్యాచేం భక్తీచే కౌతుక్। తయానావ్ ప్రసాదిక్
> సవాజ్ బోలతాం వివేక్। ప్రగట్ హోయ॥ ३४

"ఇట్టి కవి వాణినుండి సహజముగనే ప్రకటమగు హరిభక్తి కౌతుకముయొక్కయు, నానావిధములగు నీశ్వరధ్యానములయొక్కయు, నానావిధ మూర్తులయొక్కయు, నానాప్రకార ప్రతాపములయొక్కయు ఆవిర్భావమును బ్రాసాదిక కవిత్వమందురు. ఆ కవిత్వముముందు నరస్తుతి కవిత తృణతుల్యము." సమర్థుఁడు వాకొనిన యీ భావమునే ప్రాసాదిక కవియగు తులసీదాసు తన యద్వితీయగ్రంథమగు 'రామచరిత మానస ము'నం దెంత చమత్కారముగ వ్రాసెనో చూడుఁడు.

భగవతి హేతుబిధి భవనబిహాయీ । సుమిరత శారద ఆవతిధాయీ
కవికోవిదఅస్ హృదయబిచారీ । గావహింహరిజస్‌కలిమలహారీ
కీన్హేప్రాకృతజనగుణగానా । సిర్ ధునిగిరాలాగిపఛితానా ॥ ర. సో. చౌ. ౧౧

"భక్తివర్ణనము గావించుటకై శారదాదేవి (వాణీరూపముతో) సుఖమయమగు విధిభవనమునువదలి కవుల హృదయములలోనికిఁ బరుగెత్తి వచ్చుచున్నది. దీనినెఱింగిన కోవిదులగు కవిసత్తములు కలిమలమును హరించు హరియశమును గానము చేయుచున్నారు. తన పొట్టకొఱకు బలవంతముగ వాణికిఁ గష్టమునుగూర్చి ప్రాకృతజనుల గుణములను గానముచేయుటవలన సరస్వతీదేవి తలదడవికొని పశ్చాత్తాపము నొందుచున్నది." ఉదాహృతవిషయములంబట్టి సమర్థుఁ డేతెగలోఁజేరఁదగిన కవియో, కవులవిషయమునను గావ్యవిషయమునను ఆతని విచార మెట్లుండునో యనువిషయమును మా పాఠకులు చక్కఁగ దెలిసికొనియే యుందురు. ఇఁకఁ బాఠకులకు సమర్థుని గ్రంథ సముదాయముతోఁ బరిచయము గలిగింతుము. సమర్థుని యుపదేశగ్రంథ భాండార మపరిమితముగనున్నది. సమర్థుని శిష్యుఁడగు అనంతకవి సమర్థుని గ్రంథములను సముద్రముతోఁ బోల్చెను. వాస్తవమునకు సమర్థుని గ్రంథ సముదాయము సముద్రమువలె వ్యాపకమును, అగాధమును, గంభీరమును నై యున్నదనియు నందనేకరత్నములు నిండియున్నవనియుఁ జెప్పుటకు సందేహింపఁబనిలేదు. మహారాష్ట్రీయ విద్వాంసులు చిరకాలమునుండి సమర్థుని గ్రంథములకొఱ కన్వేషించుచున్నారు. కొందఱు ప్రకాశకులాతని సమగ్రగ్రంథములను బ్రకటించియున్నారు. కాని యిప్పటికి సమర్థుని గ్రంథసాగరమునందలి రత్నములు చాల కొలఁదిగనే లభించిన

వనియు, అందు నింతవఱకు జరిగినకృషి సమగ్రమని చెప్పఁజాలమనియు విద్వాంసుల యభిప్రాయము. ధూలియా (ఖాన్దేశము) లోని సత్కార్యోత్తేజక సభవారు స్వయముగ సమర్థునియొక్కయు నాతని (రామదాసీయ) సంప్రదాయముయొక్కయు గ్రంథములన్నింటిని వెలువరించు భారము వహించియున్నారు. ఈ సభవార లిప్పటికి శ్రీ సమర్థుని గ్రంథములలోనుండి దాసబోధను (రాయలు 8 పేజీల యాకృతిలో 500 పుటలు) రామాయణము మొదలగు కొన్ని గ్రంథములను (దాదాపు 1000 పుటలను) ప్రచురించియున్నారు. ఇవిగాక యింకను జాలగ్రంథములు సభవారియొద్దఁ బ్రకాశితము గావించుటకు సిద్ధముగనున్నవి. పరిశోధనలవలనఁ బ్రతిసంవత్సరము ఏదో యొక నవీనగ్రంథము లభించుచునేయున్నది. కావున శ్రీ రామదాసస్వామియొక్క సమగ్ర గ్రంథ సముదాయ మింతవఱకు లభింపలేదనియుఁ బ్రకటింపఁబడలేదనియు విశదమగుచున్నది. లభించిన గ్రంథముల పేరుల నిట నుదాహరింతుము. ఇందుఁ గొన్ని అముద్రిత గ్రంథములుగూడఁ గలవు.

1. దాసబోధ, 2. రామాయణము, 3. మనస్సంబోధనశ్లోకములు, 4. చౌదా (పదునాల్గు) శతకము, 5. జనస్వభావగోసావీ, 6. పంచసమాసి, 7. జునాటపురుష్, 8. మానసపూజ, 9. జునాదాసబోధ, 10. పంచీకరణయోగము, 11. చతుర్థయోగమానము, 12. మానపంచకము, 13. పంచమానము, 14. రామగీతము, 15. సప్తసమాసి, 16. రామకృష్ణస్తవము మొదలగునవి.

ఈ పేర్కొనిన గ్రంథములుగాక స్ఫుటాభంగములు, స్ఫుటశ్లోకములు, ఆరతులు, భూపాలములు, వివిధపదములు మున్నగు ననేకస్ఫుటప్రకరణములుగూడ లభించెను. ఈ గ్రంథ సముదాయమునందలి ప్రముఖగ్రంథములతో మా పాఠకులకుఁ గొంచెము పరిచయముగలిగించుట యావశ్యకము. కాని యా విషయమునఁ గొంచెముకొంచెము వ్రాసినను ఈ సంగ్రహాజీవితము విస్తరించుననుభయముతో వదలితిమి. సమర్థుని శిష్యోపదేశాస్యముల నెఱుంగుటకు నాతని "దాసబోధ" మున్నగుగ్రంథముల యథోచితభావమును బ్రకటించుట అత్యంతావశ్యకము.

## సింహావలోకనము.

శ్రీ సమర్థరామదాసస్వామి తన యవతారమును సమాప్తిగావించుటకు ముందుగఁ దనసంకల్పితకార్యముల సిద్ధివిషయమునఁ దనగ్రంథాంతరములలో వ్రాసికొనియున్నాఁడు. దానినే సమర్థుని చరిత్రమున సింహావలోకనమని భావింపనగును. మన స్వతంత్ర కల్పనానుసారముగ మనకుఁ జరిత్రవిషయమున సింహావలోకనము గావింపవలసిన యావశ్యకములేదు. సమర్థుఁడు ఛాఫల్ గ్రామ పరిసరారణ్యములలో సంచరించునపుడును ఏకాంతమునఁ గూర్చున్నపుడును శిష్యు లేదేని ప్రశ్నించినచోఁ దన జీవిత విషయములు జ్ఞాపకమునకు వచ్చినపుడెల్ల శ్రీ రామచంద్రుని స్తుతించుచుండును. భగవంతుని గుణములను గానముచేయుచుఁ దనజీవితచరిత్రమునందలి యనేక వృత్తాంతములనుగూడ సహజముగ నాతఁడు ఉల్లేఖించును. సమర్థుని స్ఫుటప్రకరణములందలి యాత్మచరిత్రమంతయు నీ సహజమగు నానందావస్థయొక్క ప్రేమోద్గారమే. ఈ పద్యములలో సమర్థుఁడు ఈ కార్యమునంతయు నేనే యొనరించితినని యెందును వ్రాయలేదు. అన్ని స్థానములందును రాముఁడేకర్త, రాముఁడే భోక్తయని వ్రాసియున్నాఁడు. సమర్థునివంటి నిరహంకారియు నిస్పృహుఁడును నగు పురుషుని కిదియే యుచితము. అహంకారమునందు మగ్నులై యున్న మనవంటి సాధారణ జనులే "నేను, నాది"యని నుడువుచుందురు. దాసబోధ ౬ వ దశకము ౭ వ సమాసమున సమర్థుఁడిట్లుచెప్పెను.

"మీకర్తా ఐసేమ్హణాసీ । తేణేంతూంకష్టీహోసీ
రామకర్తామ్హణతాంపావసీ । యశకీర్తిప్రతాప్ ॥ ౩౭॥

"నేను కర్తనని నుడివినచో నీకుఁ గష్టములు గలుగును. రాముఁడు కర్తయని నుడువుచో నీవు యశమును కీర్తిప్రతాపమును బొందెదవు" ఆనందభువనమను పేరుగల ౫౯ పద్యముల స్ఫుటప్రకరణమునందు సమర్థుఁడు తాను రామచంద్రుని యాజ్ఞానుసారముగా నారంభించిన జనోద్ధరణ కార్య మెంతదనుక సఫలమైనదియు వర్ణించెను. ఈ కవితాసారాంశముపై దృష్టియుంచినచో సమర్థుని జీవితచరిత్రపు సింహావలోకనము తనంతనే యగును. ప్రథమపద్యమున సమర్థుఁ డానందభువనమున (నాసిక పంచవటి ప్రాంతమున) కరుగుడు హేతువు నీ విధముగాఁ దెల్పెను. "జన్మ

దుఃఖమును, జరాదుఃఖమును మాటిమాటికిని గలుగు నిత్యదుఃఖమును మఱియు సంసారమును, త్యాగముగావించుటకును". దీనినిబట్టి సమర్థుఁడిల్లువదలి పారిపోయిన తరుణముననే తనమనస్సులోఁ బరమార్థవిషయిక హేతువును నిశ్చయించుకొనెనని విశదము కాఁగలదు. రెండవపద్యములో సమర్థుఁడు "ఆనందభువనమునకుఁ జేరఁగనే నాచిత్తము శ్రీరామచరణానురాగమున లీనమయ్యెను" అని నుడివెను. దీనికిందరువాత "ఈప్రపంచమున నేనెట్టి గొప్పదుఃఖములను సహించితినో స్వధర్మాచరణమున నెట్టి విఘ్నము లాటంకపఱచెనో ఆ విఘ్నములను వారించుటకై విఘ్నఘ్నుఁడగు బలభీముని ప్రార్థించుచున్నాఁడ"నని నుడివెను. దీనికిఁ బిమ్మట ఆంజనేయుఁడు విఘ్నముల నెట్లు నశింపఁజేసినదియు ఆవేశయుక్తముగ వర్ణించెను. ఈవర్ణనమును జదువుటవలన స్వధర్మాచరణమునందు అనఁగా జపతపోనుష్ఠానపురశ్చరణ తీర్థయాత్రాది భగవత్ప్రాప్తి సాధనముల నభ్యసించెడి సమయమున శ్రీసమర్థుఁ డెట్టియాపదల నెదుర్కొనవలసివచ్చెనో విశదమగును. సమర్థుఁ డనంతరము ఆనందభువన తీర్థమహిమను గానమొనరించి మఱల బంధవిమోచనమునకు లేక లోకోద్ధరణమునకు భగవంతుఁడగు శ్రీరామచంద్రమూర్తి దేవమునిసహితముగా నొనరించిన పనులును, దాను తలపెట్టిన కార్యములయందు రాముఁడొనర్చిన సహాయములును (యవన) దండయాత్రలును బౌరాణికరీతిగ వర్ణించెను. ముష్కరములగు నీకార్యములను వర్ణించి యావర్ణనాంతమున దండయాత్రల యుద్దేశములనుగూడ సమర్థుఁడు స్పష్టముగ వివరించెను.

కల్పాంతమండలా మోతా । మ్లేంచదైత్యాబుడావయా
కైపక్ష ఘేతలా దేవీ । ఆనందవనభూవనీం ॥ ౨౭

దైత్యులను సంహరించుటకు భగవానుఁడగు శ్రీరామచంద్రమూర్తి మాపక్షము స్వీకరించెను. మఱియు ఆనందభువనమున ఘనమును, ఘోరమునగు సంగరమొనరించెను. ప్రత్యక్ష భగవంతుఁడును, భక్తులపాలిటి కల్పద్రుమము నగు శ్రీరామచంద్రస్వామిని సమర్థుఁడు తనకు సహాయకునిగ నెప్పుడు గావించుకొనెనో యప్పుడే మనోరథములన్నియు సఫలమయ్యెననుటలో నాశ్చర్యమేమున్నది? భగవంతుని సహాయమున నే పరిణామము కలిగెనో అనఁగా ధర్మస్థాపనమునకును, లోకోద్ధారణమున

కును, నేకార్యము లొనరింపఁబడెనో వానినిగూర్చిన యుత్సాహజనక మగు వర్ణనము తక్కిన పద్యములలోఁ గలదు.

మహారాష్ట్రదేశపుఁ బదునేడవ శతాబ్ద చరిత్రముతోఁ బరిచయము గలవారలకు శ్రీరామదాసస్వామినిగూర్చిన పైనుడివిన యాత్మ చరిత్రసంబంధమగు సింహావలోకనముయొక్క యథార్థత చక్కఁగఁదెలియఁ గలదు. ఆ విషయమునం దింకను నధికముగా వ్రాయవలసిన యనసరము లేదు. సమర్థుఁడు మఱియొక స్ఫుట ప్రకరణమున శ్రీరాముని మహిమను గానముచేయుచు మహారాష్ట్రుల జాగరూకత నీవిధముగఁ బేర్కొనెను. "ఇప్పుడు నలువైపులఁ బెచ్చుపెరిగిన ధర్మావనతిని అవహేళనమునుగాంచి దేవుఁడు కుపితుఁడై యున్నాఁడు. కావున నిఁక దేవద్రోహులును, అత్యాచారులును నగువారలు తమకార్యమునలనన్నింటిని (అనీతి, అధర్మము, అత్యాచారములను) కట్టిపెట్టవలెను. జనులలో జాగరూకత కలిగినది. అదియే దేవుని చైతన్యరూపము. దానివలననే జనులకోర్కి సఫలము కాగలదు. ఏమేమిజరుగునో యదియెల్ల మహారాష్ట్రమునందుండి చూడవలెను."

స్ఫుటగ్రంథము ప్రథమ సమాసమునఁగూడ శ్రీరాముని గుణవర్ణనము గావించుతఱి సమర్థునిముఖమునుండి స్వాభావికముగా వెలువడిన వాక్యములలో నాతఁడు తనచరిత్రపు సింహావలోకనమును గొంచెముగ వెల్లడించెను. ఆ పద్యముల సారాంశమిది. "దీనులపాలిటి నాథుఁడగు శ్రీరాముఁడు వైభవమున సమర్థులందఱికంటెను సమర్థుఁడు. ఆతఁడు నామనోరథములను సఫలము గావించెను. నాయభిలాష లన్నింటిని నాతఁడే పూర్తిగావించెను. దీనుఁడనగు నన్ను మర్యాదతో నధికునిగఁ బెంపొందించెను.........శ్రీరాముఁడు విభీషణునకు లంకనొసంగెను. ఇంద్రునకు శంకలఁ దొలంగించెను. మఱియు నల్పుఁడగు రామదాసుయొక్క ప్రతిష్ఠ వృద్ధిగావించెను. అతఁ డీ స్థానమును సుందరమైనదని తలంచి యిచట నివాసమేర్పఱచుకొనెను. దాసుని తన సన్నిధినే యుంచుకొనెను. సమస్త ప్రాంతములను బావనము గావించెను. చూచినంతన భయముగూర్చు దరిగహ్వరగిరికందరములనుగూడ నాతఁడు వైభవ సంపన్నములగునట్లొనరించెను. రాముఁడనుగ్రహించి యిచ్చుట లిట్లేయుండును,

సమర్థునిచరిత్ర సింహావలోకనమున అధ్యాత్మసారమను స్ఫుటప్రక రణము మిగుల మహత్త్వము గలది. కాని యది చాల పెద్దది. కావున నందలి సారాంశమంతయు దెలుపఁజాలము. క్రింది రెండుపద్యముల నుదాహరించుటయే చాలునని తలంచుచున్నారము.

జీవీచాపురలా హేతూ । కామనామన కామనా
ఘమేండ్ జాహాలేంమోఠేం । ఘబాడ్ సాధలేంబళేం

*  *  *  *  *  *

బోళతాం భవానీమాతా । మహీంద్రదాస్య ఇచ్ఛితీ
బోలణేం హేంప్రచీతిచేం । అన్యథావా ఉగేంసవ్హే ॥

"జీవితహేతువు పూర్ణమయ్యెను. ఇఁక మనస్సునందుఁ గామ్యము లకుఁ బనియేలేదు. చాలకీర్తి కలిగినది. అప్రతిమానమగు లాభము లభిం చినది. మాతయగు భవానీదేవి ప్రసన్నురాలైనయెడల గొప్పగొప్ప రాజులుగూడ సేవజేయ నిచ్ఛగింతురు. స్వానుభవమగు నీవాక్యమును నుడువుచున్నారము. దీనినెప్పుడును మిథ్యగా భావింపఁగూడదు."

శ్రీ రామదాసస్వామి గ్రంథములవలననే యాతనిచరిత్రమున నెన్నియోవిషయములు తెలియుచున్నవి. ఏలయన, ఆతఁడెప్పుడేని ఏదేని బోధ గావించువిషయమును వివరించు సందర్భమున మాటిమాటికి నిది స్వానుభవమగు నంశమనియే నుడివియున్నాఁడు. కావున మేము స్వయ ముగ నేమియువ్రాయక సమర్థుని జీవితోద్దేశముల సాఫల్యమును, నతని వచనముల సారాంశముతోఁ బూర్తిచేయ నిశ్చయించితిమి. ఉదాహృత భాగములవలన సమర్థుని చరిత్రమును సింహావలోకన మొనరించుటలోఁ బాఠకులకు సహాయము లభించునని మేమాశించుచున్నారము. శ్రీరామ దాసస్వామి తన సమస్తసంకల్పిత కర్మఫలములను బునరాలోచనము గావించుచున్నపుడు ఆతని యంతఃకరణమునందుఁ బ్రేమ, ఆనందము, హర్షము మున్నగు సాత్త్వికమనోవృత్తి తరంగములు తప్పక యుప్పొంగు చుండనోపునని మేము భావించుచున్నారము. మాపాఠకులుగూడ నిటులే భావింతురనియు నిందు సందేహము లేదనియు మా యభిప్రాయము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

# దాసబోధ గ్రంథ సమాలోచనము.

## ౧. ప్రస్తావన.

భారతవర్షమునందు గొప్ప తత్త్వవేత్తయను ఖ్యాతిగొన్న శ్రీ సమర్థ రామదాస స్వామి సంక్షిప్త జీవితచారిత్రము పాఠకులకు విశదముగఁ దెలిసియేయుండును. అతఁ డీగ్రంథమునకు "దాసబోధ" యను నామము నిడెను. దాసు అన రామదాసు (రాముని సేవకుఁడు). బోధ యన ఉపదేశము. అర్థము స్పష్టముగనే యున్నది. సమర్థుఁడు ఈ గ్రంథముయొక్క ప్రథమసమాసమునందే గ్రంథారంభ నిరూపణ మను విషయమును వ్రాసి యున్నాఁడు. అందాతఁడు స్వయముగనే సాధారణరీతిగఁ దన గ్రంథమునుగూర్చి యాలోచనమును గావించెను. దానిలో నాతఁడు ఈ గ్రంథమును ఆదినుండి యంత్యము దనుక చదివి యాపిమ్మట విషయమునందు మీ మతమును ప్రకటింపవలయు ననియును, అట్లు గావింపక యొకటి రెండు సమాసములనుమాత్రమే చదివి దాని విషయమున మీ మతమును స్థిరపఱచుకొనుట యుచితముగాదనియును పాఠకులకు సూచించియున్నాఁడు. ఈ కథనముపై పూర్ణధ్యానము నుంచుకొనియే మేమీ గ్రంథమునుగూర్చి సమాలోచన మును వ్రాయుటకు కూర్చుంటిమి. అనఁగా ఈ సమాలోచనమునందు ప్రకటింపబడిన మతముల విచారమును, పాఠకులు సమస్త గ్రంథమును చదివియే గావింపవలయునని వేరుగ చెప్పవలసిన యావశ్యకత లేదు. ప్రసిద్ధ మహారాష్ట్ర ఇతిహాసాన్వేషకుఁడగు ప్రొఫెసర్ రాజవాడేచే వ్రాయబడిన యొక నిబంధమునుండి ఈ సమాలోచనమును వ్రాయుటయందు మాకు గొప్ప సాయము లభించినది. కావున రాజవాడే మహాశయున కిచ్చట ధన్యవాదముల నర్పించుట మేము మా కర్తవ్యముగ భావించుచున్నారము.

## ౨. గ్రంథరచనము.

శ్రీ సమర్థ రామదాసస్వామి రచించిన సమస్తోపదేశ గ్రంథములలో దాస బోధమే గొప్ప గ్రంథము. దీనిలో 20 దశకములును ప్రతి దశకమున 10 సమాసములు (అధ్యాయములు)ను గలవు. మొత్తము గ్రంథములో 200 సమాసములున్నవి. పద్య సంఖ్య 7746. ఈ గ్రంథము పూర్తియగుటకు మెల్లమెల్లగ పది పన్నెండు వత్సరములు పట్టి యుండునని సమాలోచకుల మతము. ఈ గ్రంథములోని ఆఱవ దశకము నాలుగవ సమాసమునందు గత కలియుగమానము 4760 అని వ్రాయబడినది. ఇందువలన నిది శా.శ. ౧౫౮౧ కు సరియగు 1660 క్రీ.శ. నందు వ్రాయబడి యుండవచ్చును. శా. శ. ౧౫౬౬

లో శ్రీరామదాసస్వామి తీర్థయాత్రనుండి మరలివచ్చి కృష్ణానదీతీరమున కరిగి వసి యించెను. ఈ సమయముననే యాతఁడు గ్రంథలేఖన కార్యము నారంభించియుండును. శా. శ. ౧౫౭౦ - ౧౫౭౧ రెండు సంవత్సరములలోననే ఈ గ్రంథము పూర్తియయ్యె నని కొందఱు నుడువుచున్నారు. ఒక్కదినముననే ఈ గ్రంథము పూర్తిగావింపఁబడిరెు నని "మహీపతి" యభిప్రాయము. తాత్పర్యమేమన, దాసబోధను నిర్మించుటయం దెంత సమయము పట్టెనో యా విషయము నిప్పుడు నిశ్చయపఱుపజాలము. ఈ గ్రంథ రచన మంతయును నేదేని నిశ్చితప్రకారమగు క్రమములో లేదు. మొదటి యెనిమిది దశకముల దనుక చక్కని కట్టుబాటుతోగూడిన క్రమము గాన్పించును. ఆపిమ్మట విషయక్రమము సరిగ కలియదు. మొదట కొన్ని యధ్యాత్మ విషయిక సమాసములున్నచో పిమ్మట మరల కొన్ని సమాసములు ఉపదేశవిషయికములు, కొన్ని వర్ణనాత్మికములగు సమాసములు వచ్చి యున్నవి. దీనికి కారణము ప్రచారమునందున్న యొక కథవలన తెలియగలదు. ఆ కథ యొక్క సారాంశమేమన, శ్రీరామదాసస్వామి తన చంక సంచి (కుబిడీ) లో నెప్పు డును సిరా, కలము, కాగితమును ఉంచుకొనుచుండెను. ఆతఁ డరణ్యమునం దెచ్చ టెచ్చట తిరుగుచుండెనో అచ్చట నేదేని వృక్షము క్రింద కూర్చుండి వ్రాయుచుండెడి వాఁడు. సమర్థుఁడు చాలకాలముదనుక నొకే స్థానమునందు నివసించియుండక సదా భ్రమణమునే జేయుచుండెననుట సత్యము. దాసబోధవంటి గొప్ప గ్రంథమును వ్రాయు టకు చాలకాలము దనుక నొక స్థానమునం దుండుట యావశ్యకమై యుండెను. కాని యాతఁడెన్నిరెూ స్థానములయం దుండెడివాఁడు. మరియు నెప్పుడాతని కిచ్ఛ కల్గు చుండెనో అప్పుడే ఏదేని కొంత వ్రాయుచుండెడివాఁడు.

ఈ ప్రకారముగ వ్రాయబడుచున్న దాని నొక సమాసముగ జేయుచు, పది సమా సములైన పిమ్మట నొక దశకమును గావించుచు, నీ విధమున గ్రంథము చాలకాలమునకు సిద్ధపరుపబడెను. మొదటి సమాసములయం దేమి వ్రాయబడియెనో యది కొన్ని దినముల యనంతరము రెండవ సమాసము వ్రాయుచున్నప్పుడు స్మరణలో లేకుండనోపును. మరియు నొకానొకప్పుడు వ్రాయఁబడిన ప్రతికూడ నేదేని రెండవ స్థానమున నిలిచి యుండనోపును. ఈ కారణమువలననే విషయక్రమమునందు విసంగత్వము గాన్పించు చున్నది. ఇట్లగుట స్వాభావిక మేయగును. మొదటి యెనిమిది దశకముల విషయక్రమము సరిగ నుండుటకు శ్రీ సమర్థుఁడాయెనిమిది దశకములదనుక గల విషయముల మర్యాదను (వరుసను) మొదటనే నిశ్చితపరుచుకొని యుండుటయే కారణమని తోఁచుచున్నది. ఈ విషయము గ్రంథముయొక్క అంతఃప్రమాణమువలన సిద్ధాంతమగుచున్నది. ఈ యెనిమిది దశకముల విషయ మర్యాదలను నిశ్చయపరుచుకొనిన కారణమువలననే వానిలో పునరుక్తిలేదు. కాని వానిపిమ్మటగల పండ్రెండుదశకములలో పునరుక్తి చాలగలదు.

ఉదాహరణార్థముగ చూడుడు. పంచమహాభూతముల యుత్పత్తినిగూర్చిన తాత్త్విక విషయము లెన్నియో దశకములలో మాటిమాటికిని గాన్పించుచున్నవి. కొన్ని సమాసముల పేర్లుగూడ నొకటిగనున్నవి. ఈ పునరుక్తి కాపైనఁ దువబడిన కాలాంతరస్థలాంతరములే కారణము. దాసబోధ రచనాసంబంధమున మఱియొక విషయము జ్ఞప్తియందుంచుకొనుటకు యోగ్యమైనది గలదు. మహారాష్ట్రియసాధుచరిత్రకారుఁడగు మహీపతి కవి తన సంతువిజయమను గ్రంథమునందిట్లు వ్రాయుచున్నాఁడు.

స్వామీ ప్రసాదవచనే బోలత్ । కల్యాణ లిఖిత నిజహస్తే ।
పాఠాంతరప్రమాణే సురస్ । ఓ వ్యాబోలతీ రామదాస్ ।
చేతోసత్వర్ లిహీతసే । ఉత్తర్ నపుసే పరతోనీ ॥

"శ్రీరామదాసస్వామి తన ప్రాసాదికవచనములను రసయుక్తములగు ఓవీఛందో రూపములో (అవియన్నియును కంఠాగ్రమునందున్నవో యనునట్లుగ) చెప్పుచు బోయెడివాఁడు. కల్యాణస్వామి (అతని ప్రియశిష్యుఁడు) తనచేతితో నతిశీఘ్రముగ వ్రాయుచుండెడివాఁడు. కల్యాణస్వామి చెప్పినదానిని మరల నడిగెడివాఁడుకాఁడు. (అతని ధారణాశక్తి లేఖనానైపుణ్యమవర్ణనీయమైనది)".

## 3. గ్రంథ మహత్త్వము, దాని సర్వ ప్రియత్వము.

అన్ని విధములచేతను నికృష్ట (అవనత) దశను పొందియున్న హిందూ సమాజమునకు ఐహిక, పారమార్థిక మార్గమునుచూపి శాశ్వత సుఖప్రాప్తిని గలిగించుటయే ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. ఐహిక పారమార్థిక కర్తవ్యముల సంగతిని ఈ గ్రంథమునం దేవిధముగ నైక్యపరుపబడినదో ఆ విధముగ నింక నే గ్రంథమునందైనను మిగుల నరుదుగ నుండనోపును. కేవలము ఏదేని యొక వ్యక్తికి తన ఇల్లు వాకిలి కామ్యవ్యాసంగము పిల్లల నిచ్చిపుచ్చుకొనుటయందుగల కర్తవ్యము మాత్రమే ఐహిక కర్తవ్యము గాదనియును సమస్త జన సముదాయముయొక్క ఐహిక సుఖమును, తన దేశీయ సోదరుల సాంసారిక సుఖములనుగూర్చి యత్నించుటయందే (పరోపకారమునందే) మనుష్య జన్మముయొక్క సార్థకత్వ మిమిడియున్నదనియును ఈ గ్రంథమునందు స్పష్టముగు రీతితో చెప్పఁబడినది. గ్రంథ నిర్మాణమగుచుండినప్పుడు భావయుక్తులగు ననేక స్త్రీ పురుషులు దీనిని వినిరి. ఇది సంపూర్ణమగుటతోడనే యనేక హస్త లిఖితములగు ప్రతులు సమస్త మహారాష్ట్రమునందు వ్యాపించెను. అప్పుడే, జనుల దృష్టి యెదుటికి గ్రంథము చేరుటతోడనే, యనేకులు దీనినిగూర్చి నానాప్రకారములగు తర్కములను గావింపసాగిరి. దీనిలో త్రికాండ ధర్మ నిరూపణము గలదని కొందఱు నుడివిరి. ఇది కేవలము వ్యావహారిక నీతిని బోధించెడి గ్రంథమని కొందఱు చెప్పసాగిరి. పృథక్పృథగ్రూపములతో నీకథనము (పైయూహలు) సత్యము గాకపోయినను వాస్తవములో సమష్టి

రూపముగ (నన్నియుయుకలిసి) అవశ్యముగ సత్యమేయని చెప్పవచ్చును. ఈ గ్రంథములో జ్ఞాన, కర్మ, భక్తి, వ్యవహారములనుగూర్చిన నిరూపణములుగలవు. ఆ కాలముననుండిన వేదాంతులకు దీనిలో కేవల జ్ఞానవివేకములే గాన్పించెను. కర్మయోగులకు కేవల కర్మ మార్గప్రతిపాదనమే లభించెను. భక్తులగువారలకు భక్తినిరూపణమే ప్రాప్తియయ్యెను. మరియు కేవలవ్యవహారమునందే దృష్టిగలవారలు వ్యవహారనీతినిమాత్రమేపొందిరి. ఈ ప్రకారముగ నెవ్వరిదృష్టి ఎట్లుండెనో ఎవ్వరిభావ మెట్లుండెనో అట్లే వారలకీగ్రంథము అనుభవమునకువచ్చెను. సరిగ నీ స్థితియే ఇప్పటికాలమునకూడ శ్రీసమర్థునివట్లను ఆతని గ్రంథముల విషయమునందును జరుగుచున్నవి. ప్రాచీనపద్ధతిని ప్రేమించెడివారలకు (సనాతన ధర్మావలంబులకు) సమర్థుఁడు పూజనీయుఁడుగానున్నాఁడు. మరియు నాతని దాసబోధ ప్రియకరమైనదిగనున్నది. అటులే యాధునికవిద్వాంసుల దృష్టిలోగూడ శ్రీ రామదాస స్వామి యొక యలౌకిక పురుషుఁడుగనున్నాఁడు. మరియు నాతని గ్రంథములు మిగుల నాదరణీయములైయున్నవి. కాని ఇప్పుడుకొందఱు మనుష్యులు తమతమస్వభావములను విచారములను అనుసరించి శ్రీ సమర్థుఁ డొక వ్యావహారికుడనియును ఆతని గ్రంథములు రాజనైతిక బోధకములనియును సిద్ధాంతపరుపవలయుననుు యత్నములను గావించుచున్నారు. ఇది వారలభ్రమ. దాసబోధ ఏకదేశీయమగు గ్రంథము కాదు. ఈ గ్రంథమేదేని విశిష్టకాలముకొఱకుఁగాని, దేశముకొఱకుఁగాని నిర్మింపబడలేదు. దీని తాత్త్విక సిద్ధాంతములు అన్నికాలములయందును అన్నిస్థానములయందును నొకే విధముగ సంబంధించియున్నవి. ఈ గ్రంథము నిర్మింపబడిన కాలమున మహారాష్ట్రీయ సమాజము విపన్నావస్థయం దుండెననుట సత్యము. కాబట్టి యాదేశస్థితిని లక్షించి మహారాష్ట్రుల కుపదేశమొసగబడియెను. కాని యథార్థమునం దీగ్రంథము సర్వదేశీయమును, సార్వకాలికమును, మహత్త్వయుతమును నైయున్నది. ఏ పనిని ఈ గ్రంథము ప్రప్రథమమునచేసి చూపెనో యాపనినే యది భవిష్యత్కాలమునందుగూడ చేసి చూపగలిగియున్నది. ధర్మమునకు గ్లాని (హాని) కలిగినప్పుడు ఈశ్వరావతారము కలుగుచున్నటుల సమాజమునకు నికృష్టదశ యేతెంచినప్పుడు సమాజము నుద్ధరించెడి పని ఈ గ్రంథగ్రథితములగు సిద్ధాంతములకే గలదు. ఈ గ్రంథ మట్టిసమయములయందు మార్గప్రదర్శకము కాగలిగియున్నది. ఈ గ్రంథ మహిమ నెంతదనుక వ్రాయనగును ? ఈ గ్రంథము మరాఠీభాషయం దొక యపూర్వమగు రత్నము. మోరోపంత్, వామనపండిట్ వంటి గొప్ప గొప్ప కవి వరేణ్యులు దీనినిగూర్చి ప్రశంస చేసి చేసి విసిగిపోయిరి. మే మేలెక్కయం దున్నారము?

## సంక్షిప్త విషయవర్ణనము.

శ్రీ రామదాసస్వామి ఈ గ్రంథములోని 7 వ దశకము 9 వ సమాసమునందు గ్రంథలక్షణమునుగూర్చి వివరించియున్నాఁడు. ఈ లక్షణములను గాంచినచో గ్రంథముల

యుం దేముండవలయును? సత్యములగు గ్రంథములెయ్యవి? వానిలో నే యే విషయము లుండును? అనునవి చక్కగ విశదమగును. ఉదాహరణార్థముగ నొకటి రెండు పద్యములను జూడుఁడు.

జేణే పరమార్థ వాఢే । ఆఁగీ అనుతాపచఢే ।
భక్తి సార్థ ఆవడే । త్యా నావ్ గ్రంథ్ ॥ ౩౦ ॥
జేణే హోయ్ ఉపరతీ । అవగుణ పాలటతీ ।
జేణే చుకే అధోగతీ । త్యా నావ్ గ్రంథ్ ॥ ౩౨ ॥

"పరమార్థమును వృద్ధినొందించునదియు, మనసునందనుతాపమును బెంపొందఁజేయునదియు, భక్తియెడఁ బ్రియముగలిగించునదియు, అవగుణములను దొలఁగద్రోయునదియు, అధోగతిని విముక్తిజేయునదియు నగుదానినే గ్రంథమని చెప్పవలెను.

సమర్థుని దాసబోధగ్రంథము సరిగ నీలక్షణములతోడనే కూడియున్నది. ఈ ప్రపంచమునందు మనుష్యమాత్రులు జన్మించినదిమొదలు మృతినొందుదనుక తన సుఖముకొరకే యత్నించుచుందురు. కొందరు తమప్రపంచమునందే (గార్హస్థ్య దశయందే) సుఖమున్నటుల భావించెదరు. కొందరు పరమార్థమునందు. ఉభయులును "సుఖ"ప్రాప్తిని గూర్చియే తమ యుద్దేశముల నంగీకరించుచున్నను ఇరువురి ప్రయత్నములయందును ఫలములయందును భేదముగలదు. ప్రతిమానవుడును తనమార్గమే సత్యమనియును అన్యమార్గము మిథ్యయనియును నుడువును. పరమార్థప్రాప్తిమార్గమున పోయెడివారలసంఖ్య మిక్కిలి తక్కువగనుండును. ఏలయన నీమార్గము కఠినతరమైనది. మరియు దీనిలో విఘ్నములు పెక్కులుగలవు. ధైర్యశాలురగు పురుషులే దానిని దాటిపోగలరు. అధిక సంఖ్యాకులగు జనులు స్వార్థమునందే జిక్కియుందురు. కావుననే ఇట్టివారలను పరమార్థమార్గమునం దన్వయింపజేయుటకు సాధుసజ్జనుల బోధ పరమావశ్యకమైయున్నది. ఇట్టి స్వార్థపరాయణులగు (సాంసారికులగు) జనులకు వలయు హితబోధనము ఈ "దాసబోధ" గ్రంథమున గావింపబడినది. శ్రీరామదాసస్వామి పరమార్థమునం దెంతపారంగతుడుగనుండెనో వ్యవహారమునందు గూడ నంతకుశలుడును దక్షుడును నైయుండెను. "ప్రాపంచికకార్యములను యథోచితరీతిగ నెరవేర్చుచు పరమార్థసాధనము గావించుచుండవలయునను నుపదేశమునే యాతఁడీగ్రంథమున గావించెను. గృహస్థధర్మముతో నింటియందుండి సాంసారిక సంబంధములగు కృత్యముల నన్నిటిని నీతిపూర్వకముగ జేయుచు శుద్ధాంతఃకరణముతో నీశ్వరుని భజియించుచున్నచో, నిస్సందేహముగ పరమార్థసుఖప్రాప్తి కాగలదు." ఉచితమును, యథార్థమును నగు నీయుపదేశమే ఈ గ్రంథమునం దొసగబడినది. శూరతకు రణభూమి ఎట్లు పరీక్షస్థానమో అట్లే సత్యమగు జ్ఞానమునకు పరీక్షస్థానము ఈ యసారమగు సంసారమే. జనసముదాయమునుండి వేరై పరమార్థప్రాప్తి కెవ్వడు ప్రయత్నించుచున్నాడో వానికంటె సంసారమునందుండి పర

మార్గప్రాప్తి గావించెడి పురుషుడు అధికశ్రేష్ఠుడును, ధన్యుడును నైయున్నాడు. ఈ భవ సాగరమునకు భయపడి దూరముగ పారిపోగోరెడివారు పిరికిపంద. సమర్థుడు తన మనో బోధయం దిట్లు నుడువుచున్నాడు.

భవాచ్యాభయేకాయభీతోసిలండీ।
ధరీశేమనాధీరధాకాసిసాండీ॥

"ఓ పిరికిపందా! నీవు ఈ భవభయమువలన నేల భీతి నొందుచున్నాడవు? ఓరి! ధైర్యమనన్కుండవు గమ్మ. మరియూ భయమును త్యజించివేయుము."

ఈగ్రంథము గురుశిష్య సంవాదరూపముగ వ్రాయబడినది. మొదటిదశకపు టారంభమునందు గ్రంథనామమును వివరించి దానిలో నేయేవిషయములుగలవో, యావిషయముల ప్రతిపాదన మేయే ప్రాచీనగ్రంథ ప్రామాణ్యములపై గావింపబడియెనో, వాని పాఠకాధికారులెవ్వరో, వానిని చదువుటవలన లాభమెద్దియో యను విషయములు తెల్పబడినవి. దీనితర్వాత ప్రాచీనమగు శిష్టాచార పద్ధతి ననుసరించి మంగళాచరణమును నుడివి సద్గురునకును, (సంతు) సజ్జనులకును వందనము గావింపబడినది. శ్రోతలను ప్రార్థించి కవులను ప్రశంసింపబడినది. సభను వర్ణించి పరమార్థముయొక్క శ్రేష్ఠత దెల్పబడినది. ఈ దశకాంతమున నరదేహ యోగ్యతను దెల్పి దానిని గొప్పపరుపబడినది. ఇచ్చటనుండియే బోధయొక్క ఆరంభము. రెండవదశకములో మూర్ఖులు నరదేహపు టాధిక్యభావముచే భ్రమాన్వితులై దానిని దురుపయోగము గావించెదరని యోచించి దాని న్యూనతను గూర్చి చెప్పబడినది. మరియు దేహాభిమాన త్యాగమునుగూర్చి యుపదేశ మొసగబడినది. "నేను" "నాది" "ఈసంసారము" అనువాని యశ్వరత్వమును దెల్పి కువిద్యను త్యజించుటకు మూర్ఖలక్షణములు వివరింపబడినవి. అనంతరము భక్తినిగూర్చి కొంత వర్ణించి సత్త్వ, రజ, స్తమోగుణములను క్రమశః వర్ణింపక మొదట రజోగుణమును తరువాత తమోగుణమును అంతమున సత్త్వగుణమును వర్ణింపబడినది. మొట్టమొదట రజోగుణమును వర్ణించుటకు గల కారణమేమని యోచించినచో రజోగుణమే సాంసారిక సుఖాది భోగములకు ముఖ్యప్రవర్తకమైయున్నది. ఫలాశను పెట్టుకొని కర్మ నొనర్చుట లేక పూర్వకర్మ నుపభోగించుట రజోగుణధర్మమే. సాంసారిక జనులయొక్క అధికాంశ వ్యవహార మీ రజోగుణమువలననే జరుగుచున్నది. కావుననే మొట్టమొదట దీనినిగూర్చి వర్ణింపబడునట్లు తోచుచున్నది. మరియు "ఈ రజోగుణమునే పారమార్థిక కార్యములయం దన్వయింప జేసినచో సత్త్వగుణవృద్ధియును తమోగుణ నాశనమును తనంతట నదియే యగునని బోధింపబడినది. ఇంతదనుక వివరించి యామందు సువిద్యావర్ణనము గావింపబడినది. ఇది యంతయును వ్యావహారికోపదేశము. మూడవ సమాసమునందు గర్భవాసమునుండి మృత్యుపర్యంతము ఒక వ్యక్తియొక్క జీవితచారిత్రమునుదెల్పి "స్వగుణపరీక్ష"ను గూర్చి యుపదేశింపబడినది. దీనిలో మానవుని సంసారయాత్ర అత్యుత్తమముగ చిత్రింపబడినది.

దీనిని చదివినచో లేక వినినచో మానసముపై మిగుల చక్కని ప్రభావము కలుగును. నాలుగవ దశకమునందు శ్రవణము, కీర్తనము, స్మరణము, పాద సేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మ నివేదనము అను నవవిధ భక్తులనుగూర్చి వేర్వేరుగ వర్ణించి చతుర్విధ ముక్తులు తెల్పబడినవి. ఆత్మ నివేదనమే సాయుజ్య ముక్తిదాయకమగు ముఖ్యభక్తియై యున్నదను శ్రీసమర్థుని సిద్ధాంతము సర్వమాన్యముగ నున్నది.

నవమీభక్తి ఆత్మనివేదన।
నహోతానచుకే జన్మమరణ॥
హేవచన సత్యప్రమాణ॥
అన్యథానవ్హే॥ ౪ - ౨౫.

అయిదవ దశకమునకు మొదట సద్గురు, సచ్ఛిష్యుల లక్షణము లెఱింగించి సత్యోపదేశ మొనర్పబడినది. "సద్గురువిణజ్ఞానకాహీ, సర్వథాహోణార్ నాహీ" సద్గురుఁడులేనిచో జ్ఞానప్రాప్తి ఎప్పుడును కలుగజాలదు అను నార్యుల ధర్మమునందలి సనాతన సిద్ధాంతమునకు శ్రీ సమర్థుఁడు మిక్కిలి బలము నొసఁగెను. కాని దీని వెనువెంటనే శిష్యునికి పరమార్థ సాధనములనుగూర్చి శిక్ష నొసగువాడును, మరియు నింద్రియ దమనమును గావించి విషయములనుండి నివృత్తునిగ జేయువాడును నగు గురువె కావలయుననియును ఈ ప్రకారముగ శిక్ష నొసగజాలని గురువులు గవ్వకు ముగ్గురేని లభించినను త్యాజ్యులే యనియును బోధింపబడియెను.

శిష్యాస్ న లవితీసాధన। న కరవితీ ఇంద్రియేదమన।
ఐసేగురూ ఆడక్యాచే, తీన। మిళాలే తరీ త్యజావే॥

ఇట్లు నుడివి యనేక విధముల సమాజమునందు గురువులుగ నేర్పడి జనులను మోసగించుచు భ్రష్టులను గావింపుచుండెడి యసద్గురువులనుగూర్చి వర్ణింపబడినది. దీనికి పిమ్మట బహువిధ జ్ఞాననిరూపణ మొనర్చి శుద్ధజ్ఞానము వర్ణింపబడియెను. తదనంతరము క్రమశః బద్ధులు, ముముక్షులు, సాధకులు, సిద్ధులు నగువారల లక్షణములను గూర్చియును వారల కర్తవ్యములను గూర్చియును ప్రభావయుతముగ వర్ణింపబడినది. బద్ధుల యొక్కయు ముముక్షులయొక్కయు లక్షణములను చదువునప్పు డెట్టి పాషాణ హృదయుఁడగు మనుష్యునకైనను వాని యంతఃకరణము పశ్చాత్తాపముతో విదీర్ణమైపోవును. ఈ రెండు సమాసములోని ప్రతివాక్యము పాఠకుని హృదయము నల్లూతలూపి యాతఁ డొనరించిన కర్మములను దలంపునకు దెచ్చి కొంతసేపు చిత్తవృత్తి ననుతాపముతో శిథిల పరచి ఈశ్వరస్మరణమునందు లీనమొనర్చును. ఆఱవదశకమునుండి ఆధ్యాత్మ నిరూపణము ఆరంభింపబడినది. దీని మొదటి రెండుసమాసములతో మాయను గురించియును బ్రహ్మమును గురించియును చక్కగ వివరించి సగుణ భజన ప్రతిపాదన మొనర్పబడినది. దీనికి పిమ్మట నన్నిటియందును నేసారముగలదో దాని నన్వేషింపవలయుననియును,

అసారవస్తువును త్యజియింపవలయుననియును ఉపదేశింపబడినది. ఏడవ ప్రకరణమునందు చతుర్దశ బ్రహ్మలను శాస్త్రప్రమాణము నొసగి వర్ణింపబడినది. మరియు నామము లెన్ని గలవో, వాగ్రూపముగ చెప్పగలిగిన దెంతగలదో, అవియున్నియును అశాశ్వత బ్రహ్మము లనియును, శాశ్వతబ్రహ్మము వాక్కునకు వేరుగ నున్నదనియును అది యనిర్వాచ్యమని యును చెప్పబడినది.

ఎనిమిదవ దశకము అధ్యాత్మజ్ఞానసారము. దీనినే జ్ఞానదశకమనియందురు. దీనిలో మొదట ఈశ్వరమహిమ వర్ణింపబడి రెండు సమాసములలో అనేక సూక్ష్మములగు సందేహములు విపరింపబడినవి. తరువాత స్థూలసూక్ష్మ పంచమహాభూతములను గూర్చి విస్తృత పూర్వకముగ వివరించి మోక్షము, ఆత్మ, సిద్ధపురుషులు, శూన్యత్వము నిరూపణము గావింపబడినది. ఎనిమిదవ దశకమునకు పిమ్మట విషయముల కేదేని క్రమము సరిగ కన్పట్టదు. అయినను నీ భాగమునందే సాంసారిక జనుల కుపయుక్తములగు ననేక వ్యావహారికోపదేశరత్నములు నిండియున్నవి. తొమ్మిదవ దశకమున బ్రహ్మ నిరూపణము నొనర్చి అనేక శంకలకు సమాధానము నొసగుచు నిస్సందేహత్వమును స్థాపింపబడినది. పదియవ దశకమున మొదట అందరి యంతరాత్మ యొక్కటియే యను విషయము యుక్తియుక్తముగ ప్రతిపాదింపబడినది. దీనిపిమ్మట బీజ లక్షణము, పంచప్రళయము, ప్రకృతి పురుషులు మున్నగు ననేక మహత్త్వపూర్ణవిషయములను దిగ్దర్శనముగావించి భీమదశకము (పదునొకండవ దశకము) ప్రారంభింపబడినది. ఈ దశకము గొప్ప మహత్త్వయుతమైనది. దీనిపేరువలననే దీని మాహాత్మ్యము నెరుంగవలయును. శ్రీ యాంజనేయస్వామిని శాస్త్రములయందు పదునొకండవ భీముడని (రుద్రుడని) యంగీకరింపబడినది. అందువలననే ఈ దశకనామము భీమదశకమనబడినది. దీనిలో మొదట నధ్యాత్మ విద్యా సిద్ధాంతమును తెల్పి సాంసారికులకు చక్కని శిక్ష యొసంగబడినది.

దీనిలోననే రాజనీతికి సంబంధించిన తత్త్వముల నిరూపణముగలదు. దీని తరువాత మహంతులక్షణములు తెల్పబడినవి. మహంతు ఏయే విషయముల నెఱుంగవలయునో, ఏ విధమగు చతురత్వముతో జనుల యంతఃకరణస్థితిని కనుగొని వారలను తన సముదాయమునందు చేర్చుకొనవలయునో, మరియు కఠిన ప్రసంగ మేదేని వచ్చిపడినప్పుడు దాని నే ప్రకారముగ నిర్వహించుకొనవలయునో ఈ మొదలుగా గల మహత్వయుతములగు విషయము లనేకములు తెల్పబడినవి. ఈ దశకాంతమునందే సాధారణోపదేశమును తెల్పి నిస్పృహులగు వారల ప్రవర్తనము జనసమాజముపట్ల నెట్లుండవలయునను విషయమును గూర్చి విశేషముగ నుడువబడినది. ఈ శిక్షాసారము క్రింద వ్రాయబడిన రెండు పద్యములలో నిండియున్నది.

ఉత్తమగుణతితుకేధ్యావే। ఘేవూన జనాస్ సికవావే।
మహంతేమహంత్ కరావే। యుక్తిబుద్ధి నేభరావే
జాన తేకరూన విఖరావే। నానాదేశీ॥ ౨౫॥

"సమస్తమగు నుత్తమగుణములను మొదట స్వయముగ గ్రహణము నొనర్చుకొని యాపిమ్మట జనులకు నేర్పవలయును. మహంతులగువారికి తమతో సమానులగు ననేక మహంతుల (నిస్పృహ పురుషుల)ను సిద్ధపరచుటయును, వారిని యుక్తికిని సద్బుద్ధికిని నిధానముగ నొనర్చి నానాదేశములలోనికిని నానాప్రాంతములలోనికిని పంపుటయును, కర్తవ్య ధర్మము" పంపుటెందులకు? వారుగూడ నీకార్యమునే జేయుటకు. ఈ ప్రకారముగ జగదుద్ధరణము కాగలదు. ఒకదృష్టితో నీసమాసమింకను గొప్ప మహత్త్వము గలదిగ నున్నది. దీనిలో శ్రీసమర్థుడు వచియించిన దానినంతను స్వయముగ తాను ముందుగ నొనర్చి యాపిమ్మట వాని ననుకరణము నొనర్చుటకై జనులకు ఉపదేశింపబడినవి. కావున దీనిలోని సిద్ధాంతములు కేవలము పక్వము నొందినవి. పండ్రెండవ దశకమునందు వివేక వైరాగ్యములను గూర్చి మిక్కిలి ఉత్తమమగు వివేచనము గావింపబడినది. శ్రీసమర్థుడు వివేకమాహాత్మ్యమును విశేషముగ నుడివినాడు. ఐహికమునకైనను పారమార్థికమునకైనను ఏ విధమగు సుఖప్రాప్తికొరకైనను వివేకములేని యుపాయము లన్నియును నిష్ఫలములగుచుండును.

వివేకపాహిల్యావీణ్ । జోజో ఉపావ్ తో తో సీణ్ ॥

ఎంతదనుక విషయ సంబంధములయందు వైరాగ్య ముత్పన్నముకాదో అంతదనుక కేవలజ్ఞానమువలన లాభము గలుగజాలదనుట నిశ్చయము. కాని యీ వైరాగ్యము వివేకయుక్తమైనదిగ నుండవలయును. వైరాగ్యముతో పాటుగ వివేకము లేకున్నచో అనర్థము తప్ప లాభ మేమియు నుండదు. ప్రాపంచిక సుఖము కలుగదు. పారమార్థిక సుఖమును కలుగదు.

వివేకేవీణ్ వైరాగ్య కేలే । తరీ అవివేకే అనర్థ ఘాతలే ।
అనఘే వ్యర్థచి గేలే । దోహీకడే ॥ ౧౨-౮-౬.

పదమూడవ ప్రకరణమునందు ఆత్మానాత్మ వివేకము, సారాసార నిరూపణము ఉత్పత్తి ప్రయత్నములను గూర్చి వర్ణనము గావింపబడినది. ఈ దశకములోని యారవ సమాసమునందే లఘుబోధ గలదు. దీనిలో సమర్థుని శిక్షయొక్క సారాంశమున్నది. శ్రీరామదాసస్వామి ఈ లఘుబోధనే శివాజికి బోధించియుండెనని ఇతిహాసజ్ఞుల యనుమానము. పదునాలుగవ దశకములో మరల నిస్పృహ లక్షణములను వివరించి భిక్షావిధి, కవిత్వకళ, కీర్తన లక్షణము, హరికథా నిరూపణము, చాతుర్యలక్షణములు తెలుపబడినవి. దీని యనంతరము యుగధర్మ నామక సమాసమునందు తత్కాలీనమగు ధార్మిక సామాజిక దశ చక్కగ విశదమగును. పదునేనవ దశకమున మరల చాతుర్య లక్షణములు నిస్పృహ వ్యాప్త లక్షణములు తెలుపబడినవి. శ్రీసమర్థుడు ఈ గ్రంథమున మహంతులను నిస్పృహులను గూర్చిన వర్ణనమును మాటిమాటికిని గావించి యున్నాడను సంగతి ధ్యానమునం దుంచుకొనుట కర్తవ్యమైనది. నిస్పృహ సాధుత్వమే యాతని వ్యాప

హారిక శిక్షయొక్క సారము. ఎలయన, నిస్పృహులగు మహంతులు లేనిచో జగదుద్ధరణము, లేక లోకకళ్యాణము ఎప్పుడును కాజాలదు. పదునారవ దశకమునందు మొదట వాల్మీకి, సూర్యనారాయణ, భూమాత, పవనదేవుల స్తవనము నొనర్చి జలాగ్నులు మున్నుగాగల మహాభూతములు వర్ణింపబడినవి. ఈ వ్యాఖ్యానము లన్నిటిలో ఆధునిక వైజ్ఞానికము, శాస్త్రీయ సిద్ధాంత పరిచయము లభియించుచున్నది. దీని తరువాత ఉపాసనయొక్క వ్యాపకత్వమునుగూర్చి వివరించుచు ఈ క్రింది సిద్ధాంతమును రామదాసస్వామి స్థాపిత మొనర్చెను.

ఉపాసనేచా మోఠా ఆశ్రయో। ఉపాసనే వీణ్ నిరాశ్రయో
ఉదండ్ కేలేతరీతో జయో। ప్రాప్తినాహీ॥

“మనుష్యునికి ఈశ్వరోపాసనము మిక్కిలి గొప్ప యాశ్రయమై యున్నది. ఆశ్రయము లేనిచో నిరాశ్రితుడై యుండవలసివచ్చును. నిరాశ్రయావస్థయం దెంత ప్రయత్నము నొనర్చినను జయలాభము కలుగదు.”

పదునేడవ దశకమునందు శివశక్తి, అజపామంత్రము, జగజ్జీవనము మున్నగు నానావిషయములనుగూర్చి వర్ణింపబడినది. దీని తరువాత అభాగ్య + ఉత్తమ పురుష లక్షణము, జనస్వభావము వివరించి నిద్రనుగూర్చి హాస్యకరమగు వర్ణనము గావింపబడినది. పందొమ్మిదవ దశక ప్రారంభమున లేఖనక్రియ, భాగ్యులు, అభాగ్యులునగు పురుష లక్షణములు, బుద్ధివాదము, యత్నములనుగూర్చి నిరూపింపబడి అంత్యమున ఉపాధి లక్షణములను వివరించి రాజనీతినిగూర్చి మరల నిరూపింపబడినది. ఇరువదియవ దశకమునందు ఆత్మ, దేహ, క్షేత్రములు, సూక్ష్మనామములు, పూర్ణాపూర్ణములు మున్నగు ఆధ్యాత్మిక విషయముల చర్చయే గావింపఁబడినది. అంత్యమున విమలబ్రహ్మ నిరూపణము నొనర్చి యద్వైత సిద్ధాంతము స్థాపింపబడినది గ్రంథ సమాప్తి సమయమున శ్రీ సమర్థుఁడిట్లు నుడువుచున్నాఁడు.

భక్తాచేని సాభిమానే। కృపా కేలీ దాశరథినే
సమర్థకృపేచీ వచనే। తో హా దాసబోధ॥

“భక్తుని యభిమానించి దాశరథియగు శ్రీరామచంద్రుఁడు నామీద కృపను జూపెను. ఈ గ్రంథమును నేనేమియును రచింపలేదు. దీనిలో సమర్థునిపై శ్రీరామచంద్రుడు చూపిన కృపావచనములు గలవు ఆ వచనములే ఏకత్రయై ఈ (దాసబోధ) గ్రంథ రూపమున గాన్పించుచున్నవి.”

ఇంతదనుక నీ గ్రంథమునందు వర్ణింపఁబడిన విషయములు సంక్షేపముగ లిఖియింపబడియెను. ఇక నీ గ్రంథములోని ముఖ్యాముఖ్య సిద్ధాంతములనుగూర్చి కొంత విస్తృతాలోచన గావింపబడును. వానివలన శ్రీ సమర్థ రామదాసస్వామి లోకోద్ధారణము కొరకు ఏ విధమగు శిక్ష నొసగెనో యా విషయము పాఠకులకు వివరముగ విశదము కాఁగలదు.

## ౫ జ్ఞానము, విజ్ఞానము, బహుధాజ్ఞానము.

మోక్షముకొఱకు జ్ఞానము కావలయును. ఇక నిప్పుడు జ్ఞానమన నెద్దియో చూడ వలసియున్నది. ఈ యఖిల ప్రపంచమునందు నిత్యమును, శాశ్వతమును నగు "వస్తు" వొకటి గలదు. అది శుద్ధము, లేక విమలజ్ఞానము. ఈ గ్రంథముయొక్క 5 వ దశకము 6 వ సమాసమునందు ఈ జ్ఞానమును గూర్చియే వివరింపబడినది. శుద్ధమగు విమల జ్ఞానమునే స్వరూపజ్ఞానమని (అనుభవము లేక విజ్ఞానమని) చెప్పుదురు. ఈ జ్ఞానము పదార్థ విజ్ఞానముకంటె భిన్నమైనదిగ నున్నది. పదార్థ విజ్ఞానమును సమర్థుఁడు బహుధా (బహువిధ) జ్ఞానమని నుడివియున్నాఁడు. దీని వర్ణనము ద 5 స 6 లో చేయబడినది. దీనిని మనమిప్పుడు శాస్త్రము లేక విజ్ఞానమని (Science) చెప్పుచున్నారము. దాని సమావేశ మీ బహువిధ జ్ఞానమునందే కలుగుచున్నది. పశు జ్ఞానము, రోగ జ్ఞానము, ఓషధి జ్ఞానము, మంత్ర జ్ఞానము, ధాతు జ్ఞానము, శాస్త్ర జ్ఞానము, గతి జ్ఞానము, తర్క జ్ఞానము, శబ్ద జ్ఞానము, అంతర్ జ్ఞానము మున్నగు సమస్తవిధములగు పదార్థ జ్ఞానములు ఈ బహుధా జ్ఞానమునందే సమావేశమగుచున్నవి. ఈ జ్ఞానమంతయును మాయో త్పాదిత దృశ్య (జడమును, అశాశ్వతమునునగు) పదార్థములయొక్క వర్గీకరణము. ఇది శుద్ధమగు విమల జ్ఞానము కాదు. ఇది తత్త్వజ్ఞానము కాదు. ఇది యవిద్యయై యున్నది. మాయయై యున్నది. సమర్థుఁడు ఈ బహుధా జ్ఞానమును గురించియే వర్ణించుచు ఇట్లు నుడువుచున్నాఁడు.

> బహుత్ ప్రకారాచీ జ్ఞానే। సాంగో జాతా అసాధారణే।
> సాయోజ్యప్రాప్తిహోయ్ జేణే। తేజ్ఞాన్ వేగళే ॥ 37 ॥

"ఈ బహు ప్రకారములగు జ్ఞానములు నెంతవరకు చెప్పనగును? కాని ఏ జ్ఞానము వలన సాయుజ్యముక్తి లభించునో (పుణ్య స్వాతంత్ర్యత లభియించునో) ఆ జ్ఞానము వేరుగ నున్నది" ఈ యనిత్యమగు దృశ్యమున కవ్వల నే జ్ఞానము గలదో దానినే యాత్మ జ్ఞానమని చెప్పుదురు. ఆత్మ (బ్రహ్మాంశము) నిత్యమును, ఏకమునునై యున్నది. దాని విషయమగు జ్ఞాన మెద్దిగలదో యదియే జ్ఞానము. దృశ్యపదార్థములు (మాయయొక్క వ్యాపకత్వము) అనిత్యములును నైయున్నది. వానికి సంబంధించిన జ్ఞానమే బహుధా జ్ఞానము. క్షేత్రీ క్షేత్రము, ద్రష్ట దృశ్యము, నిత్యము అనిత్యము, వీనియన్నిటికి సంబంధించిన వివేకమే జ్ఞానసారము.

## ౬ ఆత్మ, దేహము.

క్షేత్రి, ద్రష్ట (ఆత్మ) సత్తును, శాశ్వతమును, నిరుపాధియును, నిర్వికారమును నైయున్నది. క్షేత్రము, దృశ్యము (దేహము) అసత్తును, అశాశ్వతమును, సోపాధియును, సవికారమును నైయున్నది. ఆత్మ సూక్ష్మము, దేహము స్థూలము, ఆత్మ

స్వయంభువును దేహము పరభువును నైయున్నది. ఆత్మ బ్రహ్మాంశము, దేహము మాయాంశము. మాయ నాశవంతమును, బ్రహ్మము అవినాశియును నైయున్న విధముగ దేహము నశ్వరమును ఆత్మ అమరమును నైయున్నది. ఈ ప్రకారముగ ఆత్మకు దేహమునకును, బ్రహ్మకు మాయకును, నిత్యమునకు అనిత్యమునకును అఖండముగు భేదము గలదు. సారాంశ మేమన, ఆత్మ లేక బ్రహ్మము స్వతంత్రమును స్వాధీనమును నై యున్నది. మాయ లేక దేహము పరతంత్రమును మాయా సంయోగమును నైయున్నది. ఎప్పుడు ఆత్మపైని మాయాలేపన మెక్కడో లేక యెప్పుడు ఆత్మకు ఈ దేహములో సంబంధము కలుగునో, అప్పుడదియే "దేహి" లేక జీవుడనిగూడ పిలువబడును. ఆత్మ, జీవుడై సుఖదుఃఖములు లాభ నష్టములు మున్నగాగల ద్వంద్వములకు భోక్తయగు చున్నాడు. తాత్పర్యమేమన, స్వతంత్రమగు ఆత్మ దేహము, లేక మాయయొక్క సంసర్గమువలన పరతంత్రమును, లేక బద్ధమునునై పోవుచున్నది. శ్రీసమర్థుడు దశకము 13 సమాసము 9 లో దీనినే వివేచించి యిట్లు నుడువుచున్నాడు.

> ఆత్మయాస్ శరీరయోగే। ఉద్వేగ్ చింతా కరణే లాగే।
> శరీరయోగే ఆత్మా జగే। హేతో ప్రకటచి ఆహే॥ 37॥
> దేహీ సుఖ్ దుఃఖ్ భోక్తా। తో ఏక్ ఆత్మాచీసావాతా।
> ఆత్మ్యావిణ దేహేవృథా। మడేవాలోయే॥ 26॥

"ఆత్మకు శరీర (సం) యోగమువలన ఉద్వేగ చింతాదులను పొందవలసి వచ్చు చున్నది. శరీరయోగముతో ఆత్మ యున్నదనునది ప్రకటమైనదియేగదా! శరీరము లేనిచో ఆత్మగూడ లేచిపోవును. దేహమునందు సుఖదుఃఖములను భోగించునది ఆత్మయే. ఆత్మ లేకున్న శరీరముగూడ శవమే. ఈ ప్రకారముగ రెండును ఒకటి రెండవదాని యాధారమున నున్నవి. ఒకటి రెండవదానితో బద్ధమైయున్నది.

## ౭ నరదేహియగు జీవుడు, లేక బద్ధప్రాణి.

ఆత్మకు మాయాబంధనము కలుగుటయే నరదేహముయొక్క జన్మము. ఎప్పుడు స్వతంత్రమగు నాత్మ నరదేహమును ప్రాప్తించునో అప్పుడే దానికి సాంసారిక సుఖ దుఃఖము తాపత్రయములు ఆరంభమగుచున్నది. తాపత్రయములకు మూల కారణము త్రిగుణాత్మకమగు మాయయే. స్వతంత్రమగు ఆత్మ నరదేహములోకే తెంచి సత్త్వ, రజ, స్తమో గుణముల న్యూనాధిక మిశ్రణమువలన భ్రాంతమై అహంకారవశమై పోవు చున్నది. నేను ఇట్టివాడను, నేను అట్టివాడను, నేను దీని నొనర్చితిని, నేను చతురుడను, పండితుడను, కార్యకర్తను, నా యిల్లు, నా కుటుంబము, నా ధనము అను నీ ప్రకారములగు నహంకార కల్పనములయందు జిక్కుకొని సాంసారిక సుఖదుఃఖములలో ప్రాణి మగ్నమై పోవుచున్నది. మాయామోహమునందు బంధింపబడి యుండుట కతన

దాని జ్ఞానదృష్టికి మసకలు గ్రమ్మిపోవును. అది తన్నుదాను మఱచును. అజ్ఞాన వశమున "నేనెవ్వడ" నని నుడువసాగును. ఈ విధముగ నరజన్మమునొంది ఎప్పుడు స్వతంత్రమగు ఆత్మ తన్నుదాను మరచిపోవునో (తన నిజ స్వరూపమును మరచిపోవునో) అప్పుడది ప్రపంచమునందు మూర్ఖయును, చదివిన (తెలిసిన) మూర్ఖయును, కులక్షణియునునై పోవును. ఎప్పుడొకసారి యజ్ఞానమును, మూర్ఖతయును రోమరోమమున పాదుకొనునో అప్పుడు దాని దుఃఖముల గణనము నెవ్వడు గావింపగలడు? అది ఇతరులను బాధించును. నిర్బంధించును. దుఃఖింపజేయును. మరియు తానుగూడ నదేవిధముగ పీడితము నొందును. ఇతరునిపై దౌర్జన్యము నొనరించును. ఇతరుల ధనమును బలాత్కారముగ లాగికొనును. జనుల స్వాతంత్ర్యమును హరియించును. తానుగూడ దరిద్రియును, పరతంత్రియును నగును. ఇంత జరుగుచుండినను గూడ ఇట్లేల యగుచున్నది? దుఃఖమునకు కారణమెయ్యది? దుఃఖ విమోచన మేలకాదు? దుఃఖమే సుఖముగ నేల గన్పట్టుచున్నది? యను విషయములు తెలియబడవు. కఠినములగు సురులలోబడి పాపము! ప్రాణి భయపడిపోవును. దాని ధైర్యము విచ్ఛిన్నమైపోవును. ఇట్టి దశయందు కొందరీ నరదేహమునే నిందాతిరస్కారముల గావింపసాగుదురు. "ఛీ" ఈ నరదేహము వ్యర్థమైనది. దీనివలననే మనమిట్లు దుఃఖితులము గావలసివచ్చినదని నుడువుదురు. సత్వ రజ స్తమములను మూడు గుణములలోనుండి కేవల రజస్తమోగుణముల యతిశయ సంసర్గమువలననే ఈ దుర్దశ కలుగుచున్నదను నంశమును వారలు మఱచిపోయెదరు. నరదేహము ఒక విలక్షణమగు శక్తియై యున్నది. దానిని యోగ్యముగనైన నుపయోగింపుము. చెడుగుగనైన నుపయోగింపుము. దురుపయోగమును గావించెడివానికి దుర్గతియును, సదుపయోగమును గావించెడివానికి సద్గతియును కలుగును. "జో నర్ కరనీ కరే, తో నర్ కా నారాయణ హోయ్" (తన విధ్యుక్త ధర్మమును నెఱవేర్చు మానవుడు నారాయణుఁడగును.) అను నీ సామెత యెంతయు సత్యము. మనుజు లీసిద్ధాంతమును సర్వవిధముల మఱచిపోవుదురు. అంతట్లోఁ బోక వ్యర్థముగా నీ నరదేహమును నిందింతురు. "నాచ్ న ఆవే అంగణ్ టేఢా" ఆటరాక ముంగిలి సరిగా లేదన్నటుల జను లున్నతికి బదు లవనతి నొందుచున్నారు.

## ౮ ముముక్షువు — సద్గురువు.

బద్ధప్రాణికి సాంసారిక తాపత్రయములవలన ఖేదమును పశ్చాత్తాపమును కల్గగానే ఈ దుఃఖమునుండి విముక్తి నొందుటెట్లు"ను ప్రశ్న యాతని సమ్ముఖమున కేతెంచును. అప్పుడాతఁడు వృద్ధావస్థనుండి ముక్తి నొందుటకుపాయము నన్వేషించును. ఈ నిరూపణము అన్యోన్యగ్రంథములయం దెట్లుగలదో దాసబోధయందును నట్లేగలదు గాని దాసబోధయందలి విశేషమేమన, మహారాష్ట్రపు తత్కాలీనావస్థయం దెయ్యది

యుచితముగ నుండెనో యదియే ఈ గ్రంథమున నిరూపింపబడినది. పూర్వ పుణ్యకారణమున నా బద్ధప్రాణికి సద్గురుని సమావేశ మెప్పుడగునో (ఎప్పుడాతఁడు సద్గురుని శరణమున కరుగునో) అప్పుడు గురూపదేశమువలన నాతఁడు తామస వృత్తిని త్యజియించును. ఆ పిమ్మట నాతఁడు "నేను బద్ధుఁడనుగాను, స్వతంత్రుఁడను, భ్రమ కారణమున నేను నన్ను బద్ధునిగ తలంచుచుంటిని" అని తెలిసికొనును.

కోణాసీచ్ నాహిబన్ధన్ । భ్రాంతి స్తవభులలేజన్
దృఢేఘేతలా దేహాభిమాన్ । మ్హణోనియా ॥ 57 ద 5 స 6

వాస్తవములో బంధన మెవ్వనికిని లేదు. బద్ధుఁడెవ్వఁడును కాఁడు. సమస్త ప్రాణులు భ్రాంతివలన మఱచియున్నవి. ఏలయన, వారలు దేహాభిమానమును (అహం కర్తృత్వభావ యుతమగు గర్వమును) దృఢముగా పట్టుకొనియున్నారు. ఈ భ్రమ నివారణయగుటతోడనే ముముక్షుత్వము (మోక్షేచ్ఛ లేక స్వాతంత్ర్యేచ్ఛ) ఉదయించును. ఈ యిచ్ఛ ప్రబలమైనప్పుడు ప్రాణి సాత్త్వికవృత్తి నభ్యసింపసాగును. మరియు నెవ్వని కృపవలన నీ యిచ్ఛ యుత్పన్నమయ్యెనో అట్టి సద్గురుని సేవను గావింప నారంభించును సద్గురుని యుపదేశ, సహవాస, కృపలవలన గొప్ప లాభము కలుగును. మొట్టమొదట నింద్యముగను తిరస్కారణీయముగను గన్పట్టు నరదేహ మప్పుడు వందనీయముగను ఉపయోగిగను ప్రతీతి కాసాగును. గురూపదేశమువలన మనుష్యుని వివేక దృష్టి శుద్ధమును, నిర్మలమును నైపోవును. అప్పుడు వానికి ఈ లోకమున "నాకు కొంత కర్తవ్యము గలదు. ఎద్దియో యుద్దేశము గలదు. ధ్యేయము గలదు. సాధ్యము గలదు. ఆ సాధ్యమును ప్రాప్తించుటకు ఈ నరదేహము అత్యంత యావశ్యకమును, ఉపయోగియును నైయున్నది" అను నిశ్చయ మేర్పడును. వాస్తవములో నీ నరదేహము లభియింపక యేదేని యన్యదేహము (పశు, పక్షి, కీటాదికము) లభియించినచో నీ సాధ్యమును ప్రాప్తించుట యసంభవముగ నుండెడిది. శ్రీసమర్థు డిట్లు నుడువుచున్నాడు.

పశుదేహీ నాహీంగతీ । ఐసే సర్వత్రబోలతీ ।
మ్హణోన్ నరదేహీంచప్రాప్తి । పరలోకాచీ ॥ 21 ॥
నరదేహ హాస్వాధీన్ । సహసా నవ్హే పరాధీన్ ।
పరన్తుహా పరోపకారీ ఝిజవూన్ । కీర్తిరూపే ఉరవావా ॥ ద 1 స 1-25

"పశుదేహమునందు గతి లేదనియే యెల్లరును నుడివెదరు. పరలోకము నరదేహమునందే లభియించును. నరదేహము స్వాధీనము గలది. ఇది స్వభావసిద్ధముగ పరాధీనమగునట్టిదికాదు. దీనిని పరోపకారమునం దన్వయింపఁజేసి కీర్తిరూపముతో నమరమగునట్లు గావింపవలయును" కాని ఈ శుద్ధమును విమలమును నగు వివేకదృష్టి, గురు కృపాంజనము లేనిచో నెప్పుడును కలుగజాలదు. ఈ లాభమును క్షుద్రలాభముగ భావింపఁజనదు. ఈ విధమగు నరదేహపు యోగ్యతను బోధగావించెడి గురువులనుగూర్చి, "ఇట్టి గురువులు

గవ్వకు ముగ్గురేసి దొరకినను అడుగగూడదని సమర్థుఁడు నుడువుచున్నాఁడు. ఎవడు, అవిద్య (మాయ) యొక్క మూలచ్ఛేదనము నొనర్చునో, అంతర్బాహ్యేంద్రియముల దమనమునుగూర్చియును, విగ్రహమునుగూర్చియును, శిక్ష నొసగునో, మరియు భవసాగర మును తరియింపజేయునో, అతఁడే సద్గురుఁడు. ఇట్టి గురువులు మిగుల నరుదుగ దొరకు దురు. ఈ గురువులు ద్రవ్యమువలన లభియింపరు. పూర్వపుణ్యవశమునసే లభియింతురు. పూర్వపుణ్యమును సఫలము నొనర్చెడిపని గురువుదై యున్నది. సమాజమునందు గాన్పించెడి యసద్విద్యా ప్రచారదోషము కేవలము శిష్యుల తలమీదనే మోపరాదనియును, ఈ దోషము గురువునకుకూడ సంబంధించి యుండుననియును సమర్థుడు చెప్పుచున్నాడు. అనగా అసద్గురుని కారణముననే సమాజమునందు అనీతి అధర్మము అనాచారము ప్రచార మగుచున్నది. శిష్యులు (సమాజమునందలి సర్వసాధారణులగు జనులు) అజ్ఞానులు, మూఢులు వని తెలిసియుండియునుగూడ కేవలము వారల తలలమీదనే దోషమును రుద్దు కొనుటవలన నేమిలాభ మెంనగూడును? సమాజమును సన్మార్గముపైని నడిపించెడి బాధ్యతయంతయును మరియు దాని యుత్తరవాదమును గూర్చిన భార మంతయును సమర్థుని మతానుసారముగ సద్గురునిమీదనే యున్నది.

యే తే శబ్ద నాహీ శిష్యాసీ।
హే అవఘే సద్గురూపాసీ
సద్గురూ పాలటీ అవగుణాసీ।
నానా యత్నే కరూనీ॥ 15 ॥ ద 5 స 3

ఇందు శిష్యునిదోష మెద్దియును లేదు. ఇది యంతయు సద్గురుని పనియైయున్నది. సద్గురుఁడు సర్వవిధములఁ బ్రయత్నించి సమాజమునందలి లోటుపాటులను దొలంగింపఁ గలఁడు. అట్టివాఁ డొకవేళ సమాజమున కధిపతియై లోకుల నుచితమార్గమున నడుప కున్నచో నీ కార్యమున కింక సమర్థులెవరు? సద్గురూత్తముఁడు హిమాలయ కందరము లలోఁ గూర్చుండి యేకాంతమున ననుభవించు బ్రహ్మానందము నొక క్షణము విడిచి సమాజము నుద్ధరించుటకును బరోపకారము గావించుటకును జనసంఘములోనికి రావల యును. అపుడా దేశికుని తేజమునకు, బ్రభావమునకుఁ, బ్రతిభకు ముగ్ధులై ముముక్షువు లగు సచ్ఛిష్యులు శరణ్యములోనికి వత్తురు. సద్గురునియొక్కయు సచ్ఛిష్యునియొక్కయు సమావేశము మేఘచాతకముల కలయికవంటిది. అంతియగాక కృష్ణార్జునుల సమావేశము వంటిదనియు, రామదాస శివాజి చక్రవర్తుల సమ్మేళనము వంటిదనియుఁ గూడ భావింప నగును. ఉత్తముఁడును లోకోద్ధారకుఁడును నగు గురూత్తంముని ఛాయమున సమ్మెదయు డును ముముక్షువు నగు శిష్యుఁడు పరమార్థమునందును జనోద్ధరణ సాధనమునందును మగ్నత నొందును.

## ౭ పరమార్థ మార్గమునందు సాధకము, సిద్ధి.

పరమార్థ సాధనములయెడ నాసక్తుఁడైనంతన పరోపకారము జనోద్ధారణము నిచ్చగించు నిరహంకారియగు ముముక్షువు సాధకావస్థ నొందును. ఆ యవస్థయం దతఁడు పరమార్థమున నెద్దియో గ్రహించును. సమర్థుఁ డిట్లు నుడివియున్నాఁడు.

“పరమార్థము తపస్వులకును, సాధకులకును ఆధారము. పరమార్థమా భవసాగరమును తరింపజేయును. అనంతములను జన్మముల ఫలము ప్రాప్తైయున్నప్పుడే పరమార్థమలవడజాలును. పరమార్థమువలన ముఖ్యపరమాత్మ తత్త్వము అనుభవములోనికివచ్చును.” మరియు నాత్మానుభవ మగుటయే మాయా బంధములనుండి విముక్తి నొందుట. దీనిపేరే మోక్షము లేక స్వాతంత్ర్యము. ఇదియే పరమార్థము. దీనిని ప్రాప్తించుటకు మార్గము ఎయ్యది? జ్ఞానమార్గమా, యోగమార్గమా, కర్మమార్గమా లేక భక్తిమార్గమా! ఈ ప్రకారముగ ననేకప్రశ్నముల వివేచనమును సమర్థుఁడు అయిదవదశకములోని ఏడవసమాసము మొదలుకొని ఇరువదియవ దశకముదనుక గావించెను. ఈ విధముగా ననేకమార్గములతోడనే సాధకుఁడు పరమార్థముకొఱకు దృఢపూర్వకముగ సాధనము జేయుచున్నాఁడు. సాధుసమాగమ మొనర్చుచున్నాఁడు. అద్వైతనిరూపణ శ్రవణ మననములను గావించుచున్నాఁడు. సారాసారవిచారమువలన సందేహములను సాంసారిక వికల్పములను నశింపఁజేసి ఆత్మజ్ఞానమును వివేకించుచున్నాఁడు. వివేకమువలన దేహబుద్ధిని (నేను, నీవు అనుదానిని) ఆపివేయుచున్నాఁడు.

మాయోపాధిని విడచి అసాధ్యవస్తువును (ఆత్మను=పరబ్రహ్మమును) సాధనమువలన సాధించుచున్నాఁడు. మఱియు సత్స్వరూపమునందు తనబుద్ధిని దృఢముగనుంచుచున్నాఁడు. ఈ ప్రకారముగ సాధనమును జేయుచుజేయుచు గురూపదేశమువలన నరదేహమును సార్థకపఱచి యాతఁడీ భవసాగరమును దాటిపోవుచున్నాఁడు. మాయాపటలమును జించివేయుచున్నాఁడు. అజ్ఞానమును నశియింపజేయుచున్నాఁడు. తన్నుదా (ఆత్మను) నెఱుంగుచున్నాఁడు. సత్స్వరూపమునందు లీనమైపోవుచున్నాఁడు. ఇట్టిదశయేతెంచినపిమ్మట, బద్ధదశనుండి ముముక్షువును, ముముక్షువునుండి సాధకుఁడును నైన యాసాధకుఁడే సిద్ధుఁ డనిపించుకొనుచున్నాఁడు. సమర్థుని మతానుసారము సాధకుని (అంతిమ) నిస్సందేహావస్థనే సిద్ధావస్థయని నుడువుదురు. సిద్ధపురుషుఁడు సిద్ధుఁడైయుండియును సాధకుఁడుగనే యుండును. అతఁడు సాధనము నెప్పుడును విడువఁడు. సిద్ధుని లక్షణములను నుడువుచు సమర్థుఁ డేమిచెప్పుచున్నాఁడో చూడుడు.

“సిద్ధలక్షణములను సాధకములేనిచోఁ జెప్ప వీలుగాదు. సిద్ధలక్షణములయందు సాధకత్వము వచ్చితీరవలయును. వెలుపలినుండి సాధకునివలె గాన్పించుచు సాధనకృతిని గావించుచు నంతరమునందు స్వరూపాకారుఁడై యుండువానినే చతురపురుషులు సిద్ధుఁడని తలంతురు.” సాధనమును జేయుచుండు నాతఁడు సిద్ధుఁడెట్లగుననుదానికి

సమర్థుఁడిట్లు ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు. "సందేహరహితమగు సాధనము నొనర్చుటయే సిద్ధునిలక్షణము. సిద్ధుని సాధనములయందు లోపలను వెలుపలను అచలమగు సమాధాన ముండును. ఈ సిద్ధునకే సమర్థుఁడు తన దాసబోధయందు 'మహంతు' 'సాధు' 'విరక్తుఁడు' 'నిస్పృహుఁడు' మున్నగు నామముల నిచ్చియున్నాఁడను విషయమును స్మరణయం దుంచుకొనవలయును.

## ౧౦ ముముక్షువుల సహాయముతో సాధకులయొక్కయు సిద్ధులయొక్కయుఁ గర్తవ్యము.

సిద్ధులు స్వాతంత్ర్యమునొందిన (ముక్తినొందిన)వారలు. సాధకులు ఆస్థితికిఁజేరెడి మార్గము నందున్నారు. ముముక్షువులు స్వతంత్రస్థితికి (ముక్తావస్థ) చేరుటకు ఇచ్ఛయించుచున్నవారలు. అనగా నీ త్రివిధజనులు క్రమముగా ముక్తి, మోక్షము స్వాతంత్ర్యమునం దున్నవారు. లేదా ఆ స్థితిలోఁ బ్రవేశించుట కిష్టపడుచున్నవారనియేని చెప్ప వచ్చును. ఇంక మిగిలినవారలు బద్ధజనులు. బద్ధులగు మానవులకు హితము నెఱింగించి వారలను ముక్తిమార్గమునందు ప్రవేశపెట్టెడికార్యమును సిద్ధులు సాధకులు నగువారలు ముముక్షుజనుల సహాయముతో నెరవేర్పవలయునని సమర్థుఁడు నుడువుచున్నాఁడు.

విరక్తే నిందక్ వన్దావే । విరక్తే సాధక్ బోధావే ।
విరక్తే బద్ధ చేతవావే । ముముక్షు నిరూపణే ॥38॥ ద 2 స 9.

"విరక్తులు లేక సిద్ధపురుషులు నగువారలు నిందకులకు వందనమొనర్పవలయును. సాధకులకు బోధగావింపవలయును. మఱియు ముముక్షులసహాయముతో నిరూపణముల మూలమున బద్ధజనులను ముక్తులుగఁజేయవలయును. పరతంత్రులను స్వతంత్రులఁగావింప వలయును" ఎప్పుడీకార్యము సఫలతనొందునో అప్పుడే ఎల్లరకును పరమార్థలాభము కలుగును. మరియు నరదేహములకు సార్థకత లభించును. అనగా ఎప్పుడందఱకును పరమార్థ ప్రాప్తియగునో (అందఱికిని మోక్షము లేక పూర్ణస్వాతంత్ర్యము లభ్య మగునో) అప్పుడు అఖిలమనుష్యజాతికిని ఉద్ధారణమగును. ఈ మనుష్యజాత్యుద్ధరణమే సమర్థుని సర్వోత్తమమగు ధ్యేయము. ఎంతదనుక నీ సార్వజనికోద్ధారణము జరుగదో అంతదనుక ప్రయత్నమును చేయుచునే యుండవలయునని సమర్థుని యభిప్రాయము. ఇదియే మానవ జాత్యభ్యుదయమునకు (నరదేహప్రాప్తికి) సంబంధించిన యత్నమునకు సర్వోత్తమధ్యేయము. ఈ ధ్యేయము (మానవోద్ధరణము) ప్రాప్తించుటకు యత్నము జరిగినంతన మానవేతిహాస మారంభమగును. ఈ ప్రయత్న మెప్పటినుండి జరుగుచున్నదో మనుష్యజాతియేతిహాస మెప్పటినుండి యారంభమయ్యెనో తెలిసికొనుట యసాధ్యము. కాని మానవజాతికి పరమార్థప్రాప్తి (పూర్ణస్వాతంత్ర్యము లేక ముక్తిలభింపనంతవఱకు) కానంతవఱకు నీ యత్నము జరుగుచునేయుండును. అంతదనుక మానవజాతియేతి

హాని మేర్పడుచునే పోవుచుండును. ఇందు సందియ మావంతయులేదు. ఇక నీ సర్వో త్తమధ్యేయమును బూర్తిగావించుటకు (జనోద్ధరణకార్య మొనర్చుటకు) సిద్ధులగువార లేయే యుపాయముల నవలంబింపవలయునని సమర్థుఁ డుపదేశించెనో విచారించి తెలిసి కొనుట యవసరము.

## ౧౧. లోకోద్ధరణముగూర్చి మూఁడుపాయములు.

సమర్థుఁడు తన దాసబోధయందు సిద్ధులు, సాధులు నగువారలు ముముక్షుజనుల సహాయముతో బద్ధజనోద్ధరణము నేవిధముగ గావింపవలయును? (పరతంత్రుల మనసుల యందు స్వాతంత్ర్యేచ్ఛ నుత్పన్నపరచి వారల బంధనముల నేవిధముగ త్రెంపివేయ వలయును.) అనువిషయమునుగూర్చి విస్తృతమగు వివేచనము నొనర్చెను. ఇదియే ఈ గ్రంథమునఁగల విశేషత్వము. ఈ విషయమునుగూర్చి నిరూపణము నొనర్చుచు సమర్థుఁడు సమాజోద్ధరణము (లోకోద్ధరణము) నకై మూఁడు ఉపాయములను తెల్పెను. 1. నీతిస్థాపనము, 2. ధర్మస్థాపనము, 3. రాజ్యస్థాపనము.

హరికథా నిరూపణ । నేమస్తపణే రాజకారణ ।
వర్తాయేచే లక్షణ । తేహి అసావే ॥4॥ ద 11 స 5

సమర్థుఁడు తన భాషయందు వీనికీనామముల నిడెను. 1 వర్తనలక్షణములేక సద్వర్తనము. 2 హరికథానిరూపణము. 3 రాజకారణము. ఈ మూఁడు ఉపాయములవలననే సమాజము స్వతంత్రముగ నుండును. పరతంత్రమగు సమాజము నుద్ధరించుటకు (స్వాతంత్రము గావించుటకు) సిద్ధులగువార లీ మూఁడుపాయములను అవలంబింపవలసి యున్నది. సమాజము ముక్తినొందవలయును. స్వతంత్రము నొందవలయును. "పరమార్థోప భోగమును గావింపవలయును" అనునభిలాషయున్నచో (అవశ్యకమున్నచో) సిద్ధులును సాధకులు నగువారలు ముముక్షువుల (స్వాతంత్ర్యేచ్ఛకుల) సహాయముతో నీ మూఁ డుపాయములను గూర్చియే యోజన (స్థాపన) గావింపవలయును. ఈ కార్యమునందు సిద్ధులకును సాధకులకును లాభ మేమియును లేదని భావింపఁజనదు. ఈ కార్యమువలన సమాజహితము గలుగుట యటుండ సిద్ధ సాధకులకుఁగూడ హితముగలదు. సమాజము దుఃఖితముగను, పీడితముగను, త్రస్తముగను, విపన్నముగను, బద్ధముగను నుండుట గాంచి సిద్ధుల యంతఃకరణముగూడ దుఃఖితమగును. తాత్పర్య మేమన, సమాజదుఃఖము వలన సిద్ధులకు సైతము ఖేదము కలుగును. కావున సమాజముయొక్క దుఃఖవిమోచనము గావించుటవలన (సమాజమును బంధనముక్తిగావించుట వలన) సిద్ధపురుషులకుఁ గూడ సుఖము కలుగును. ఇందువలన సమాజము నుద్ధరించుట సిద్ధుల స్వతఃసిద్ధమగు కర్తవ్యమైయున్నది. ఇక నీమూఁడు ఉపాయములనుగూర్చి వేరువేరుగ వివేచనము నొనరించెదము.

(1) నీతి స్థాపనము — పైన జెప్పబడిన ఉపాయములలో మొట్టమొదట నీతి స్థాపనము జరుగవలయును. బద్ధజన సముదాయమునందు నీతి యత్యంతముగ లోపించియుండును. స్వధర్మము, భూతదయ, ఆత్మజ్ఞానములను వారు బొత్తుగ మఱచియుండుట యటుండ నింద, ద్వేషము, అనీతి, అనాచారము, అలసత్వము, కపటము, కలహము, క్రూరత, పిఱికిదనము, పాషండగుణము, పాపము, దురాశ మున్నగు దుర్గుణములతోఁగూడిన వికటావరణము వారిపైని ఆవరించుకొనియుండును. ఈ యావరణమును తీసివైచుట (ఈదుర్గుణములను దూరపరచుట) నీతియొక్క పని. నీతిస్థాపనవలన మలినవృత్తులు విమలములగును. మఱియు, మనుష్యుఁడాత్మసంస్కారణ (తనయుద్ధరణ) మార్గమునందుఁ దన్మయుఁడగును. సిద్ధపురుషుల (సద్గురుని) యుపదేశమువలన మాయాజన్యములగు సత్త్వరజస్తమోగుణములలో నేది గ్రాహ్యమో యేది త్యాజ్యమో విదితమగును. అనంతరము ఉద్ధారణకార్యము చాలవఱకుఁ బూర్తియైనట్లు గ్రహింపవచ్చును. మనుష్యుఁ డెట్లు వంచిన నట్లువంగును. నీతివైపాతని ద్రిప్పినచో నందే మగ్నుఁడగును. అవినీతియందుఁ బ్రవేశపెట్టిన నందే మగ్నుఁడగును. ఈ విధముగా సమర్థుఁడు చతురులు, మూర్ఖులు, కువిద్య, సువిద్య, సత్త్వగుణము, తమోగుణములను గూర్చిన నిరూపణము ద. 2 స. 2 లో నొనరించెను. అజ్ఞులకు నీతియన నేమియో తెలియదు. కావున అజ్ఞులవలక్షణులుగ నుందురనుటలో నాశ్చర్యములేదు. అజ్ఞుల నుపదేశముచే సంస్కరింపవలెను. జ్ఞానలవదుర్విదగ్ధులగు అహంమన్య పండితవర్గ మింకొకటిగలదు. వారలను శ్రీ సమర్థస్వామి చదివిన మూర్ఖులని పేరిడెను. వారలెన్నఁటికిని నీతిచే సంస్కరింపఁబడరు. భర్తృహరియు "జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి న రంజయతి" అనెను. (జ్ఞాన లవదుర్విదగ్ధుఁడగు నరుని బ్రహ్మయైనను రంజింపఁజాలఁడు.) వాస్తవమునం దిట్టి తెలిసినమూర్ఖులను సంస్కరించుట గొప్పకఠిన కార్యము. ఈ మనుష్యులు బహుశ్రుతులును, వ్యుత్పన్నులును నై యుందురు. బ్రహ్మజ్ఞానమునుగూర్చి గొప్పగొప్ప విషయములను జెప్పుదురు. కాని కామ, క్రోధ, మద, మోహ, మత్సర, దంభ, దురాశ, అహంకారముల త్రిప్పులకు లోఁబడియుండి తమ ధర్మమునే నిందగావించుచుందురు. భక్తిమార్గమును విచ్ఛేదము నొనర్తురు. భూతదయను మఱచిపోవుదురు. వారలు స్వయముగ నిల్లు జేయుటయేగాక అజ్ఞులచేగూడ చేయించుచుందురు. ఇట్టి తెలిసిన (చదివిన) మూర్ఖులకుసైతము నైతికశిక్షనొసఁగుట సకల సమాజోద్ధరణ దృష్టితో నత్యంతావశ్యకమైయున్నది. ఈ ప్రకారముగ మూర్ఖులకు, తెలిసిన మూర్ఖులకు నైతికశిక్షనొసఁగుట, మఱియు నాశిక్షకొఱకు సంస్థలను స్థాపించుట పరమార్థప్రాప్తికి లేక సమాజోద్ధరణమునకు ప్రథమోపాయము.

(2) ధర్మస్థాపనము — ధర్మమన నిచ్చట పరమేశ్వరుని యుపాసనము లేక భక్తి యని తాత్పర్యము. భక్తి తొమ్మిదివిధములుఁగలది. వీనిలో తొమ్మిదవదగు ఆత్మనివేదన భక్తి శ్రేష్ఠమైనది. అనగా నిదియే శ్రేష్ఠమగు ధర్మము. తక్కిన యెనిమిదివిధములగు

భక్తులలో జీవాత్మ పరమాత్మలయందు భేదభావము శేషించియుండెడి సంభావన గలదు. అనఁగా భక్తుఁడు ఈశ్వరునితో ద్వైతకల్పన మొకప్పుడుండుట తటస్థించుచున్నది. కాని యాత్మ నివేదనమువలన భక్తుని హృదయమునందు విభక్తభావముండదు. దీనివలన అభిన్నత్వము, అనన్యత్వము (ఐక్యవృత్తి) కలుగును. ఈ యుపాసనము ప్రత్యక్షమగు నాత్మ జ్ఞానమే యైయున్నది. సమర్థుఁడు ఈ గ్రంథమునం దనేకస్థలములలో ఉపాసనా మాహాత్మ్యమును గాన మొనరించి యున్నాఁడు. అభిమాన యుక్తముగను, విశ్వాస పూర్వకముగను సమర్థుఁడిట్లు నుడువుచున్నాఁడు.

"ఉపాసన సర్వవ్యాపకత్వము గలది. ఆత్మారాముఁ డెచ్చట లేఁడు? అన్ని తావులను రాముఁడు నిండియున్నాఁడు. నా యుపాసన యిట్టిది. అది కల్పనాతీతము. అది నిరంజనుని కడకు (పరబ్రహ్మము కడకు) చేర్చివైచును." అధ్యాత్మ విద్యాశ్రవణము, దేవపూజనము, భజనము, కీర్తనము, సంధ్యాది బ్రహ్మకర్మము వీనియన్నిఁటి సమావేశము ఉపాసనమున గలుగును. సారాంశమేమన కర్మ జ్ఞానముల సమావేశము ఉపాసనా మార్గమునందే (భక్తిమార్గమునందే) కలుగఁదగియున్నది. భక్తి మార్గమునందు ప్రతిమా పూజనము (మూర్తి పూజనము) చెప్పఁబడియున్నది. కాని ప్రతిమ (మూర్తి) పరమేశ్వరుని ప్రతినిధిరూపమనియును, స్వయముగ దాని (ప్రతిమయొక్క) రూపము లేక నామము పరమేశ్వరుఁడు కాఁడనియు స్మరణయందుంచుకొనవలయును. ఈ విషయమునకు సంబంధించిన చర్చను సమర్థుఁడు అన్ని తావులను గావించియున్నాఁడు. ఏ పరమేశ్వరుని ప్రతిమను మనము పూజించుచున్నామో ఆతనిని గుర్తెఱుంగవలయును.

"నానాదేవతా ప్రతిమలను జనులు ప్రేమ పూర్వకముగఁ బూజించుచున్నారు. కాని వాస్తవములో నది యెద్దాని ప్రతిమయో ఆ పరమాత్మ యిట్టిదని తెలిసికొనవలయును. తెలిసికొని భజియింపవలయును. ఎఱుకయైన పిమ్మట అధికారికి వినయపూర్వకము వందనముల నెట్లు జేయుచున్నారో, అట్లే మూల పరమాత్మ నెఱింగి మూర్తి పూజనము నొనర్పవలయును" తన కల్పనానుసారముగ నిర్మింపఁబడిన పరమేశ్వరుని ప్రతిమయందు పరమేశ్వరుని ధ్యానించుటయే ఉపాసనము. ప్రతిమ (రూపము) ఎటులనైన నుండనిమ్ము. మఱియు దానికేనామమైన పెట్టియుండనిమ్ము, కాని ముఖ్యవిషయమేమన్న, నదియొకే పరమాత్మ (వస్తువు) యొక్క భిన్నభిన్న ప్రతిమలును నామములును నైయున్నవి. ఖండోబా, విఠోబా, నారాయణ, రామ, కృష్ణ, లక్ష్మి, శివ, విష్ణు, సరస్వతి మున్నగు ననేక ప్రకారములగు నామములు ఆ యనిర్వాచ్యమగు వస్తువున కొసంగబడినవియై యున్నవి. ఆ యనిర్వాచ్య వస్తువగు (పరబ్రహ్మము) పరమాత్మయొక్క ఏకత్వమును ఉపాసన గావించు సమయమున నెప్పుడును మఱచిపోఁగూడదు. స్వధర్మము, కుల ధర్మము, వర్ణాశ్రమ ధర్మము అన్నియును ఒక యుపాసనా ధర్మమార్గములోనికి (భక్తి మార్గములోనికి) వచ్చుచున్నవి. జనులను ఈ యుపాసనా ధర్మమునందు (భక్తి

మార్గమునందు) ప్రవృత్తుల నొనర్చుటయే వారలను పరమార్థ మార్గమునందు బెట్టుట యైయున్నది. కావున భక్తిమార్గస్థాపనము (స్వధర్మస్థాపనము) సమాజోద్ధరణముయొక్క (ముక్తి లేక స్వాతంత్ర్యతయొక్క) రెండవదగు గొప్ప యుపాయము. ధర్మస్థాపనము నొనర్చెడి సిద్ధ పురుషులు ప్రత్యక్షముగ నీశ్వరుని యవతారములు.

ధర్మస్థాపనేచేనర్ । తే ఈశ్వరాచే అవతార్ ।
జాలేఆహేత్ పుఢేహోణార్ । దేణీఈశ్వరాచే ॥ 20 ॥ ద 10 స 6

"ధర్మస్థాపనము నొనర్చెడి నరులు ఈశ్వరుని యవతారములు. వారలు (అట్టి వార లెందఱో) వచ్చిపోయిరి ఇంక ముందును రానున్నారు. ఇచ్చుట ఈశ్వరుని చేతిలో నున్నది" రాజ్యస్థాపనము = నీతియొక్కయు, ధర్మముయొక్కయు స్థాపనము వలన పరమార్థము (మోక్షము, ముక్తి, స్వాతంత్ర్యత) అంశతః ప్రాప్తించును. సమాజము అంశతః ఉద్ధారణమగును. కాని దాని పూర్ణత్వముకొఱకు (ఆ లాభమును అప్రతిబద్ధముగను, చిరస్థాయిగను గావించుటకొఱకు) రాజ్యస్థాపన మావశ్యకమైయున్నది. సమాజమునం దండఱును ముముక్షువులు (మోక్షమును లేక స్వాతంత్ర్యమును ఇచ్ఛయించెడి వారలు) నీతిమంతులు, ధార్మికులునునై యుండరు. అధికాంశజనులు బద్ధులుగ నుందురు. (పరతంత్రులును, అనీతిమంతులునునై యుందురు.) కావున సధర్మవర్తనులై యుందురు. నీతిమంతులయొక్కయు, ధార్మికులయొక్కయు ప్రకృతి నీతిధర్మముల వైపున నుండును. అనీతిమంతులయొక్కయు, అధార్మికులయొక్కయు ప్రకృతి, అనీతి, అధర్మముల వైపున నుండును. కాబట్టి సిద్ధులు (సాధకులు) ముముక్షుజనుల సహాయముతో సమాజోద్ధారణము కొఱకు నీతిని, ధర్మమును స్థాపింపుటకు యత్నింప నారంభింపఁగనే బద్ధజనులు (అనగా నీతిమంతులును, అధార్మికులును నగువారలు) విరోధము గావింతురు (విఘ్నముల నొనర్తురు). ఈ విరోధ ఫలమేమన, నీతియొక్కయు, ధర్మముయొక్కయు స్థాపనము పూర్ణరీతిగ నెరవేరదు. ఒకవేళ నెరవేరినను నది చాలకాలము దనుక నిలిచియుండ జాలదు. మఱియు నంత్యమున సమాజమంతయును పరమార్థమునుండి పరావృత్తమై పోవును. ఈ స్థితి ముముక్షు జనులపట్ల నత్యంత హానికారకమగును. ముముక్షుజనుల సంఖ్య స్వభావతః తక్కువగ నుండును. కావున వారలు కేవలము నీతియొక్కయు ధర్మముయొక్కయు బలముమీద బద్ధజనులను (అనీతిమంతులను, అధార్మికులను) తమ యధికారము (చేతి) క్రింద నుంచుకొని అనీతిని, అధర్మమును పరాభవము నొందింపఁ జాలరు. సారాంశమేమన, నీతిని ధర్మమును రక్షించుటకును, అనీతిని అధర్మమును ఉన్మూలన మొనరించుటకును నేదేనియొక శాసక సంస్థ (రాజ్యసంస్థ) అవసరమగును. స్వధర్మమునకు విరోధమును గావించెడి బద్ధజనులు ప్రతిసమాజమునందును వేలకొలఁదిగ నుందురు. ఇఁక నాస్తికులును, పాషండులును నన్నచో వారలు దేవునికిని, ధర్మమునకును విరుద్ధముగ పోరాటములను, కలహములను వ్యాపింపఁజేసెడి కార్యభారమునే తమ తలలపై నిడికొని యుందురు. సిద్ధులు, సాధకులు తీవ్రతపమును గావించి మహాభాగ్యముతో పర

మార్గప్రాప్తి నొందెదరు. జ్ఞానమును అనుభవమునకు దెచ్చుకొందురు. కాని తామస వృత్తియందు మునిఁగియుండి బద్ధావస్థలో మగ్నులై మిథ్యాపదార్థ సుఖమునందే ఆనందము గలదని భావించెడి మూఢజనులకు పూర్వోక్త సజ్జనుల పారమార్థిక సంస్థారహస్యము బోధపడదు. కావున వారలు సిద్ధులను ద్వేషింతురు. నిందించెదరు. ఇంతియగాదు, పరమార్థ సంస్థలను భంగము నొందించెడి ప్రయత్నములనుగూడ గావింతురు. ఇట్టి దుష్టులును అధములును నగు జనులనుండి ధర్మమును రక్షనొనర్చుటకొఱకు శాసక సంస్థ తప్పక కావలయును. ఎచ్చట న్యాయ ధర్మముల ప్రసారణమగుచుండునో, ఎచ్చట మనుష్యునర్గమునదయింపునో, ఎచ్చట స్వాతంత్ర్యేచ్ఛ గల్గిన జనులు వృద్ధి నొందసాగెదరో అచ్చట సమాజముయొక్క నియమన, ప్రబంధ, శాసనములఁ గావించుటకై రాజ్యసంస్థా నిర్మాణము గావింపవలసిన యావశ్యకము ప్రతీతి యగుచునే యున్నది. నిజమడిగినచో పరమార్థప్రాప్తికొఱకు యత్నము లొనర్చెడి సమాజమునందు నీతి, ధర్మముల బలముపైని స్థాపింపఁబడిన రాజ్యసంస్థ తనంతటతానే కాన్పింపసాగును.

ఈ రాజ్య సంస్థను గూర్చిన తత్త్వము దాసబోధయందు అతిమార్మికముగాఁ బ్రతిపాదింపఁబడినది. వ్యక్తిభూతనగు నరదేహము నాశ్రయించుకొని యుండెడి యాత్మయే (జాణీవ్) జ్ఞానరూపము. మాయోత్పాదితమగు దేహము ఆవరణముగ నుండిన కారణమున నా యాత్మయొక్క జ్ఞానము అపూర్ణముగ నుండియున్నది. పూర్ణ జ్ఞానమునకు అఖండనిధియగు పరాత్పర, పరబ్రహ్మముతో సాయుజ్యప్రాప్తి నొందుటకునై ఈ యపూర్వజ్ఞానరూపమగు నాత్మకుఁ దనకంటె నధిక జ్ఞానాధిష్ఠానము నాశ్రయింపవలసి వచ్చుచున్నది.

రాయాచే సత్తేనే చాలతే, పరన్తు అవఘే పంచభూతే।
ముళీ అధిక జాణీవేచేతే, అధిష్ఠాన్ అసే॥ 4 ॥ ద 15 స 4.

"రాజా లేక రాజ్యసంస్థ అధిక జ్ఞానాధిష్ఠానము గలది" అను నీ సిద్ధాంతమును ప్రతిపాదనము గావించుటకు దార్ష్టాంతికముగ సమర్థుఁడిటులఁ జెప్పినాఁడు.

దురస్థా దాటల్యా ఫౌజా, ఉంచ సింహాసనీ రాజా।
యాచా విచార్ సమజా అన్తర్యామీ॥ 2 ॥ ద 15 స 3.

"వేలకొలది సైనికుల సమూహము ఎదురుగ నిలువబడియుండును. కాని రాజు ఎత్తైన సింహాసనముపై విరాజమానుఁడైయుండి తన విశేషాధికారముతో నెల్లరకును అజ్ఞ నిచ్చుచుండును. ఇదేవిధముగ లక్షలు, కోట్లు సంఖ్యగల జన సమాజముమీఁద విశేష జ్ఞానకారణమునఁ బరమేశ్వరరూపమగు రాజ్యసంస్థ శాసనము గావించుచుండును.

వివేకే బహుత్ పైసావలే। మహాత్కోన్ అవతారీ బోలిలే।
మను చక్రవర్తీ జాలే, యేణేచి న్యాయే॥ 5 ॥ ద 15 స 3

నేటివఱుక నేయే యవతార రూపులగు రాజులు రాజ్యస్థాపనము నొనర్చిరో వారందఱును వివేకులై (జ్ఞానస్వరూపులై) యుండిరి. భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు గీతయందు "నరాణాం చ నరాధిపమ్" మనుష్యసమాజమునందు రాజును నేనైయున్నాఁడనని

నడుపుచున్నాఁడు. ఈ ప్రకారముగ రాజు పరమేశ్వర రూపుఁడు. రాజ్య సంస్థ పరమేశ్వరుని యధిష్ఠానము. ధర్మమునకును, నీతికిని సహాయము నొనరించుటయును స్వాయముగ నదిగూడ ధర్మమునయొక్కయు, నీతియొక్కయుఁ దోడ్పాటు (సహాయము)తో నడచుటయును నీ రాజ్యసంస్థయొక్క ముఖ్యకార్యములు. ధర్మనీతుల యుద్దేశము పరమార్థప్రాప్తియని మేమిదివరకు నుడివియున్నారము. కావున రాజ్యసంస్థయొక్క ముఖ్యహేతువుగూడ పరమార్థ ప్రాప్తియే కావలయును. పరమార్థము ముక్తి, మోక్షము (స్వాతంత్ర్యము) అనునవి మనుష్యజాతియొక్క ఉద్ధారణమునుగూర్చి చెప్పఁబడునవి యను విషయమును ధ్యానమునం దుంచుకొనవలయును. తాత్పర్యమేమన, ఎప్పుడు మానవసమాజము పరమార్థ లాభము కొఱకు యత్నింపసాగునో, ఎప్పుడది పారతంత్ర్యమను జాలము (వల) నుండి విముక్తి నొందుటకు ఉపాయమును గావింప నారంభించునో, అప్పుడు దానికి నీతి, ధర్మము, రాజ్యము అను నీ మూఁడు సంస్థల ఆశ్రయమును గైకొనవలసివచ్చును. ఈ సంస్థల యాధారముమీఁదనే మనుష్య సమాజము నైతిక, ధార్మిక, రాజకీయ స్వాతంత్ర్యములను (పూర్ణ స్వాతంత్ర్యమును లేక మోక్షమును) ప్రాప్తి గావించుకొనును.

## ౧౨ పూర్వోక్త సంస్థల నెట్లు స్థాపింపవలయును?

సమర్థుఁడు పరమార్థ ప్రాప్తికి నీతి, ధర్మ, రాజ్యసంస్థ లావశ్యకమని మాత్రము నుడివి యంతటితో నూఱుకొని యుండలేదు. అతఁడు పరోపకారబుద్ధితో సమాజోద్ధరణము నొనర్చుటకు ఈ సంస్థల నెట్లు స్థాపింపవలయునో దానినిగూర్చిగూడ విస్తార పూర్వకముగ వివరించెను. (1) నీతిసంస్థ:- సిద్ధులగువారలు ఏకాంతవాస పూర్వకముగ లోకసముదాయమును ప్రోపుపఱచి యనుభవముతో తమకాలముయొక్క వాస్తవికమగు నైతికదశనుగూర్చి విచారము గావింపవలయును. ఉత్తమ గుణములను సంపాదించి లోకులకు నేర్పవలయును మఱియు తమ సముదాయమును ఉత్తరోత్తరముగ వృద్ధి నొందింపవలయును. సముదాయములోని మనుష్యులకు యోగ్యతానుసారముగఁ బనుల నప్పగింపవలయును. మఱియు వారలలో నేపురుషుఁడు సన్నిధియం దుంచుకొనుటకు యోగ్యుఁడుగ నుండునో వానిని సన్నిధియం దుంచుకొనవలయును. ఎవఁడు దూరముగ నుంచుటకు ర్హుఁడో వానిని దూరపుఁ బనిపై నంపవలయును. జనమండలులను (సభా సమాజములను) నిర్మించి వానిలో భూతదయకు సంబంధించిన బీజారోపణమును గావించినచో నీతి స్థాపనము కాఁగలదు. కారణమేమన, జ్ఞానరూపముతో నెల్లర యంతఃకరణములు సమానముగా నుండునుగదా!

ఈ జ్ఞానము సమస్తభూతములయందును (జీవులయందును) ఏకరూపముగ నుండుటకతన సమస్త జనులను ఆత్మతుల్యులుగ భావించుట మనుజుని సహజ ధర్మమై యున్నది. నీతి స్థాపనమును గూర్చిన యత్యంత సూక్ష్మమగు నీ విధిని ఇచ్చట మేము వివరించితిమి.

దాసబోధయందు అత్యంత విస్తృతమగు వర్ణనము విశేషముగాఁ గావింపఁబడినది. అన్ని విషయములు మూలగ్రంథమును చదువుటవలననే విదితము కాఁగలిగియున్నవి. (2) ధర్మ భజన సంస్థ:- భక్తిమార్గము కొఱకు బ్రాహ్మణ మండలులను సంతు మండలులను భక్త మండలులను స్థాపిత మొనర్పవలయును.

బ్రాహ్మణ మణ్డళ్యా మేళవావ్యా। భక్తమండళ్యా మానావ్యా
సన్తమండళ్యా శోధావ్యా! భూమండళీ॥ 14॥ ద 19 స 6.

పరమాత్మని జ్ఞానపూర్వకముగ భజన మొనర్చుటతో దశదిశలు ప్రతిధ్వనింపవలయును. ఈ యుపాయము వలన కర్మమార్గీయులును కర్మఠులును నగు బ్రాహ్మణులును జ్ఞానమార్గీయులును సాధువులును నగు సంతులును, మఱియు కేవల భజన ప్రియులును అన్ని జాతులకు అన్ని వర్ణములకుఁ జెందిన భక్తులును ఏకహృదయముతో ప్రేమపూర్వకముగ నొకచో సమావేశమూ కాఁగలరు. ధర్మస్థాపనము నొనర్చుట సిద్ధుల (సాధువుల)కు ముఖ్యకర్తవ్యమైయున్నది.

ఐసా జో మహానుభావ్ । తేణే కరావా సముదావ్
భక్తియోగే దేవాధిదేవ్ । ఆపులా కరావా ॥ 32॥ ద 12 స 10
శాహాణే కరావేజన్ । పతితకరావే పావన్
సృష్టిమధే భగవద్భజన్ । వాఢవావే॥ 33 ॥ ద 14 స 6

ఇట్టి మహానుభావులు సముదాయమును సమకూర్పవలయును. మఱియు భక్తిమార్గముతో నా దేవాధి దేవుఁడగు పరమాత్మని సంతసింపఁ జేయవలయును. జనులయందు నానావిధములగు చతురత్వమును వ్యాపింపఁ జేయవలయును. పతితులను పావనులుగ జేయవలయును. మఱియుఁ బ్రపంచమునం దంతటను భగవద్భజనమును వృద్ధి నొందింపవలయును. ఈ ధర్మ స్థాపనా ప్రబంధమును సిద్ధులగువారలు తమ జీవితాంతము దనుక మాత్రమే జరుగునట్టిదిగ గావింపఁజనదు. ఏలయన,

ఆపణ అవచితే మరోని జావే । మగ్ భజన్ కోణే కరావే ।
యాకారణే భజనాన్ లావావే । బహుత్ లోక్ ॥ 33 ॥ ద 12 స 10

ఆకస్మికముగ నొక దినమున మృతినొందిన పిదప మరల భజనము నెవరు చేయుందురు? కావున పెక్కుమందితో గూడిన సముదాయముల నేకత్రపరచి భజనమునం దన్వయింపఁజేయవలయును. ఏదేని మతమును పూర్ణప్రసారము గావించుటకు ఒంటరియగు నొక మనుష్యునికంటె జన ఘటిత సమాజము (సభ్యసముదాయము) అధికోపయోగకరముగ నుండును. కొంద ఱాధునికు లీసమాజస్థాపనము విదేశీయులకడ మనము నేర్చుకొంటి మనుచున్నారు. శ్రీ సమర్థుఁ డీమండలులను నిర్మించిన సంగతియు మండలులఁగూర్చి దాసబోధలోఁ బలుతావులఁ జేర్కొనిన సంగతియు వారెఱుంగరు. ఇపుడిపుడు దేశీయులు సభలు, సమాజములు, మండలులు మున్నగువానివలని యుపయోగములను దెలిసికొనుచున్నారు. కాని యింకను నీ విషయమునఁ బెక్కు సంగతులను దాసబోధమునుండి

తెలిసికొని యనుష్ఠింపవలసియున్నది. బాధ్యత యంతగాలేని యే ముగురు నలుగురు వ్యక్తుల మనస్సులనో చేతిక్రిందికిఁ దీసికొనినందువలన లాభమెద్దియును లేదు. మహత్కార్యముల సిద్ధినిమిత్తము పెక్కుమంది మనోగతముల నెఱుంగవలయును.

జేణే బహుతా సఘడే భక్తి । తే హే రోకిడీ ప్రబోధశక్తి ।

బహుతాచే మనోగత హాతీ । ఘేతలే పాహిజే ॥ 37 ॥ ద 12 స 1

సిద్ధులయందు ప్రబోధశక్తి (ఇతరులకు బోధ గావించెడి శక్తి) యును, వక్తృత్వశక్తియును నుండుట అత్యంతావశ్యకము. ఎంతదనుక నీశక్తి కలుగదో అంతదనుక పెక్కుమందియొక్క మనస్సు లాతనిచేతికివచ్చుట కఠినతరము. కాదుకాదు. అసంభవము. మఱియు వారల మనోగతము నెఱుంగఁజాలక పోయినచో సముదాయములో కలిపి వారిని భక్తులలో నెట్లు అన్వయింపఁ జేయగలరు? ఈ కార్యమునందు మిగుల ఆతురత (తొందర) గూడ జెందఁజనదు. తొందరపడినచో అనీతిమంతులును, అధార్మికులును, స్వార్థులును, బద్ధులును నగువారగలవలన విఘ్నము వాటిల్లుట కవకాశము గలదు. ఈ విషయమును మేము పైన సైతము నుడివియున్నారము. దాసబోధయం దీవిషయమునుగూర్చి యున్నిటికంటె నధికమగు వివేచనము గావింపఁబడియున్నది. ఈ ధర్మమే ఈ గ్రంథము యొక్క ఆలోచ్య విషయము. మేమిచ్చట సంక్షేపముగ వివరించితిమి. అధికముగ నెఱుంగవలయునను నుత్కంఠగలవారలు మూలగ్రంథమునే మననము గావింపవలయును.

3 రాజ్యసంస్థ:— ఈ సంస్థను స్థాపించుటయందుఁగూడ సిద్ధులకును, సాధులు, నిస్పృహులు మహాపురుషులకును, నీతి, ధర్మ సంస్థలను స్థాపించెడి విషయమునందు వారికెంత బాధ్యత గలదో అంత కర్తవ్య బాధ్యతలు గలవు. ఈ కార్యమునకై అవు సాధువులు మిక్కిలి గొప్ప సముదాయ మేర్పరుపవలసియున్నది. మఱియు దానిని దృఢపూర్వకముగ తమ యాధీనమున నుంచుకొని యెల్లపుడు కర్తవ్యమునందు తత్పరత్వము నుంచవలసియున్నది. శ్రీ సమర్థుఁ డీవిషయమునం దిట్లు నుడువుచున్నాఁడు.

సముదావ పాహిజే మోఠా । తరీ తనావా అసావ్యా బళకటా ।

మత కరూనియా తాఠా । ధరూఁ నయే ॥ 22 ॥

గొప్ప సముదాయమును దృఢపూర్వకముగఁ దన యధికారమునం దుంచుకొనవలయును గాని మిక్కిలి నమ్మకమును, విశ్వాసమును, విశ్రామమును గలిగించి సముదాయములో పని గొనుచుండవలయును. ఏలయన, సముదాయము నేర్పఱచి దాని పట్ల ద్రోహచింతన గలిగియుండఁజనదు. అట్లు గావించినచో పరస్పర విద్వేష ముదయించును. పూర్వోక్తవిధముగ దోషరహితమగు సముదాయ మేర్పడఁగనే పరమార్థబుద్ధి (మోక్షబుద్ధి) తత్క్షణమే జనులలో జాగ్రత్త నొందసాగును.

ఠాయీ ఠాయీ ఉదండ్ తాబే । మనుష్యమాత్ర్ తితుకే ఝూటే ।

చహూకడే ఉదండ్ లాబే । పరమార్థబుద్ధీ ॥ 27 ॥ ద 15 స 2

"ఆత్మవత్సర్వభూతేషు" యను సూక్త్యనుసారముగ సమస్త జనులను, సమస్త సమాజములను, సకల రాష్ట్రములను ఆత్మవలె భావించుటయే రాజకీయదృష్టితో "పర

మార్గ బుద్ధియై యున్నది. ఈ బుద్ధి సముదాయమునందు బద్ధజన సమాజమునందు సంపూర్ణ రాష్ట్రమునందు ప్రకాశితమై దృఢమైనంతన నీతియొక్కయు, ధర్మముయొక్కయు సంస్థలు రక్షింపఁబడును. ఈ ప్రకారముగ సముదాయ వ్యాప్తిని గావించుచు కష్టనిష్ఠురములను (డక్కాముక్కీలను) సహించుచుండువాఁడు చూచుచు చూచుచుండఁగనే భాగ్యశిఖరముమీఁది కెక్కిపోవుచున్నాఁడు (పరమార్థమునకు చేరిపోవుచున్నాఁడు).

వ్యాప ఆటోప కరితీ । ధకే చపేటే సోసితీ ।
తేణే ప్రాణీ సదేవ్ హోతీ । దేఖత దేఖతా ॥ 7 ॥ ద 15 స 3

“టాకీ సహే సో దేవతా హోయ్” అను సామెతగూడ నీ యర్థమునఁ గలదు. సుత్తె దెబ్బలవలన తరిగి తరిగి విగ్రహము సిద్ధమగుచున్నది. అప్పుడే దానియందు దేవతాత్వమేతెంచును.

కష్టపడనిచో ఫలము లేదు. చేయుకున్న నేదియును గాదు. రాజ్యము స్థాపింపకున్నచో నీతికిని, ధర్మమునకును రక్షణము లభింపదు. సిద్ధులును, సాధకులు నగువారలు స్వాతంత్ర్యేచ్ఛగల (ముముక్షువులగు) జనుల సహాయముతో రాజకీయ సముదాయము నిర్మింపవలయునని శ్రీసమర్థుఁ డిట్లు దాసబోధలోఁ జెప్పియున్నాఁడు. “మానవుఁడు తన దేశమునకు రాజుగఁగాని, రాజప్రతినిధిగఁగాని యున్నవాని యాశ్రయమును బడయవలయును. ఆశ్రయరహితముగను ఏకాంగిగను నుంట మేలుగాదు.”

సమర్థాచి నాహీ పాఠీ । తయాస్ భలతాచ కుటీ ॥ 30 ॥ ద 16 స 10

“సమర్థుఁడగు పురుషుని యాశ్రయముతో నుండనివానిని సాధారణుఁడగు మనుజుఁడుగూడ నులిమివేయును.” ఈ ప్రకారముగ రాజ్యసంస్థను స్థాపించుట నీతిమంతులకును ధార్మికులగు నేతలకును అనుయాయులకును హితదాయకమై యున్నది. ఈ సంస్థయొక్క సహాయమువలన జీవాత్మకు పరమాత్మతో సాయుజ్యత (పరమార్థము, మోక్షము, ముక్తి లేక స్వాతంత్ర్యత) లభియించును.

పరమార్థీ తో రాజ్యధారీ । పరమార్థ నాహీ తో భికారీ ।
యా పరమార్థాచీ సరీ । కోణాస్ ద్యావీ ॥ 23 ॥ ద 1 స 9

ఎవ్వఁడు పరమార్థియో ఆతఁడే రాజు. మఱియు నెవ్వనియొద్ద పరమార్థము లేదో యాతఁడే భికారి (భిక్షుకుఁడు — వ్యర్థజీవి.) ఇట్టి పరమార్థమును దేనితో నుపమింపనగును?

## ౧౩ దాసబోధయొక్క విశేషత్వము.

దాసబోధయం దొక విశేషము గలదని మేమిదివరకు నుడివియున్నారము. ఈ గ్రంథములోని వేదాంత సిద్ధాంత నిరూపణము సమర్థుని కాలపు మహారాష్ట్ర పరిస్థితి కనుకూలముగఁ జేయబడినది. మహారాష్ట్రముయొక్క యా సమయపుటవస్థయందు ఏ విధమగు నిరూపణము ఉచితముగను, ఆవశ్యకముగను, ఉపయోగకరముగను నుండెనో, ఆదేవిధముగ నీ గ్రంథమునందు సమర్థుఁడు స్వతంత్రరీతితోఁ గావించెను. భగవద్గీతయందు గల వేదాంత నిరూపణ తత్త్వము, సర్వదా యొకేవిధముగ సంబంధించియున్నను నా గీతాకాలీన సమాజపుటవస్థ కధికముగ ననుకూలించుచున్నది. అట్టి నిరూపణము పదునేడవ శతాబ్దమునందు సమర్థునికి అనావశ్యకముగఁ గాన్పించెను. కావున, నీ గ్రంథమునందు

ఉపనిషత్తులు, గీత, భాగవతము మున్నగు గ్రంథములలోని సిద్ధాంతములనే ప్రతిపాదించి
నను ప్రబంధ రచనము, నిరూపణ శైలి, దృష్టాంతములు మొదలగునవి యన్నియును కేవ
లము నూతన ఫక్కీ గలవిగను తత్కాలీన మహారాష్ట్ర పరిస్థితులకు సంబంధించినవిగను
నున్నవి. దాసబోధ ఏదేని యన్యగ్రంథమున కనువాదముగాఁ గాని టిప్పణముగాఁ గాని
వ్రాయఁబడిన గ్రంథము కాదు. తన కాలపు సమాజము (దేశము) యొక్క నైతిక
ధార్మిక రాజకీయదశలను పూర్ణముగ ధ్యానములోనికి తెచ్చుకొని సమర్థుఁడీగ్రంథమును
స్వతంత్ర బుద్ధితో నిర్మించెను. ఉపనిషత్తులు, గీత, భాగవతము మున్నగు సంస్కృత
గ్రంథములలోని వేదాంత విషయిక సిద్ధాంతములను సమర్థుఁడు ప్రమాణ భూతములుగ
అవశ్యములుగ భావించినను ప్రాచీన సిద్ధాంతములపట్ల సమాజముయొక్క హృదయముల
యందు నిండియుండిన విపరీతార్థమును (భావనమును) ఈ గ్రంథమునందు దూరపరచెను.
ఈ గ్రంథమున గల రెండవ విశేషత యేమన్న, మన వేదాంతము నిరాశావాదియు లేక
ఆలస్యవాదియుఁ గాదను విషయ మీ గ్రంథమునందు స్పష్టపరుపఁబడినది. ఇందు పైని
గూడ సన్న్యాసి, బైరాగి, సాధువేషములనుదాల్చి సమస్త లౌకిక కార్యములను పరి
త్యజించి ఇతరుల యాధారముతో పొట్టనించుకొనుచుండెడి మనుజులు పెక్కుమంది
సమాజమునందు కాన్పించుచున్నారు. వీరలు లోకోద్ధరణమునకు సంబంధించిన మహా
కార్య మేదేని జేయుచున్నట్లు గోచరింపకపోయినను బహుజన సమాజమునందు గొప్ప
జ్ఞానులుగను పరమార్థవేత్తలుగను సిద్ధ పురుషులుగను విశ్వసింపఁబడుచుందురు. "ఓ
యన్నా (భాయీ)! కర్మత్యాగమును సన్న్యసమని (విరక్తి లేక జ్ఞానమని) శాస్త్రము
చెప్పుటలేదు. లోకులవలె వేయేల, అన్యజనులకంటె మిక్కిలి యోగ్యతరముగ సంసార
విషయిక కృత్యముల నన్నింటిని నెరవేర్చుచు ఆ కర్మములయొక్క ఫలాశ (భోగముల
యందాసక్తి) నుంచుకొనకుండుటయే సత్యమగు జ్ఞానము. అదియే సత్యమగు సన్న్య
సము. అదియే సత్యమగు వైరాగ్య"మని మన వేదాంత గ్రంథములు మిక్కిలి బలముగ
నెలుగెత్తి యఱచి శిక్ష నొసఁగుచున్నవి.

> అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
> స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥
>
> (1 ॥ భ. గీ. అధ్యాయము 6.)

"కర్మ ఫలముల యాధారము (సహాయము) నుంచుకొనక స్వవర్ణాశ్రమోచితమగు
కర్మను జేయుచుండువాఁడే సన్న్యాసి. అతఁడే యోగి. అగ్నిహోత్రాది సత్కర్మలను
త్యజించినవాఁడు లేక కర్తవ్య కర్మములను విడచినవాఁడు సన్న్యాసి, యోగి కాఁడు"
కాని ఈసిద్ధాంతమును త్యజియించి జనులుపరోపజీవులును, అలసులును, మఱియుస్థాణువు
వలె (జడము లేక అచలమువలె) ను మారిపోయిరి. ఈ జీవితక్రమము సిద్ధులయొక్కయు
సన్న్యాసులయొక్కయు స్వభావములకు విరుద్ధమై యున్నది. ఈ విషయము సమర్థుడు
భిక్షా నిరూపణ నామక సమాసమునందు వివరించియున్నాఁడు. పరమార్థ జ్ఞానులగు సిద్ధ
పురుషులు సాధారణ జనులకు (అజ్ఞులకు) పరమార్థ మార్గమును చూపవలయును. అది
వారికి కర్తవ్య ధర్మము. ఈ సిద్ధాంతము దాసబోధయందు అన్నితావులను ప్రతిపాదింపఁ
బడినది. మహంతు లక్షణము, నిస్పృహుని ప్రవర్తనము, నిస్పృహుని లక్షణము,

నిస్పృహా వ్యాప్త లక్షణము మఱియు నిస్పృహా శిక్షణము మున్నగు సంపూర్ణ సమాసముల యందుగూడ నిదియే వర్ణనము గలదు. దాసబోధయొక్క ఈ విశేషత్వము సదా ధ్యానము నందుంచుకొనుటకు యోగ్యమైనది. సిద్ధులు, జ్ఞానులు నగువారల లౌకిక కర్తవ్య మెంత విస్ఫుటముగను విస్తారపూర్వకముగను ఈ గ్రంథమునందు వివరింపబడియెనో అంతగ నింకెచ్చటను గాన్పింపదు. మూడవ విశేష మేమన్న, దాసబోధయందు సముదాయము వలన పరమార్థ ప్రాప్తిమార్గము చూపఁబడినది. కాని ప్రాచీన వేదాంత గ్రంథములలో "వ్యక్తిమాత్రుఁడు నీతి ధర్మములను లేక భక్తిని ఎట్లు ప్రాప్తి గావించుకొనవలయును?" అను దానినిగూర్చి మాత్రమే చెప్పఁబడినది. వానియందు సముదాయములను నిర్మించి సమాజమును నీతి ధర్మమార్గమునం దెట్లన్వయింపఁ జేయవలయునో యావిషయ విచారము గావింపఁబడలేదు. ఈ విషయమును గూర్చిన నిరూపణమే దాసబోధయొక్క ముఖ్యరహస్యము.

## ౧౪ తత్కాలీన పరిస్థితి.

ఈ విశేషత్వములకు గల కారణము ఆ కాలపు మహారాష్ట్రముయొక్క పరిస్థితియై యున్నది. ఒకవేళ పరమార్థమును గూర్చియును, దాని ప్రాప్తికి వలయు సాధనములను గూర్చియును నీ ప్రకారముగ స్పష్టమును విస్తృతమును నగు వివేచనము గావింపబడక పోయినచో నా కాలపు పరతంత్ర సమాజమున కేదేని లాభము కలుగక పోయెడిది. ఆ కాలపు సామాజిక దశావర్ణనమును స్వయముగ సమర్థుఁడు దాసబోధయం దొనర్చియే యున్నాఁడు. రాజ్యసంస్థ పరకీయులును, విధర్ములును నగు జనుల యాధీనమునం దుండెను. నీతికి ధర్మమునకు ఉచ్ఛేదన మగుచుండెను. పరకీయజనులు హైందవ ప్రజకు అన్నివిధములచేతను దుర్దశను గావించుచుండిరి. హిందూ సమాజము బొత్తుగ తునాతునియలై పోయెను. దాసబోధలోని కలిధర్మ నిరూపణమునందు ప్రాయికముగ నీ పరిస్థితిని గూర్చిన వర్ణనము గలదు. మహమ్మదీయుల వైభవమును గాంచి జనులు తమ యాచార విచారములను, శాస్త్రసిద్ధాంతములను, రీతి పద్ధతులను, దేవధర్మములను మఱియు నడవడిని వదలివేయసాగిరి. తమ దేవస్థానములను త్యజియించి దావూదుల్ ముల్కు అను పేరుగల పీరు (పెద్ద) ను భజియింప నారంభించిరి. ఎందఱో హిందూ జనులు ముసల్మానులై పోయిరి. బ్రాహ్మణుల బుద్ధి తుడిచిపెట్టుకొనిపోయెను. హీనజాతులు బ్రాహ్మణులకు గురువులై కూర్చుండిరి. మానసిక దుర్బలత్వ కారణమున బ్రాహ్మణులుగూడ హీన జాతుల యుపదేశములను వినఁజొచ్చిరి. శూద్రులు స్వధర్మమువాని బ్రాహ్మణాచారముల ననుష్ఠింపసాగిరి. మఱియు బ్రాహ్మణులు వ్యభిచారమునందు దగుల్కొని తమలోఁ దాము కలహింపఁ దొడంగిరి. వర్ణ వ్యవస్థయంతయును భ్రష్టమయ్యెను. ఒకరు ఇంకొకరి మాటను వినుటయును, తెలిసికొనుటయును మానిరి. ఈ ప్రకారముగ నీతి ధర్మముల యొత్తిడి సన్నగిలెను. తీర్థక్షేత్రములు భ్రష్టమయ్యెను. విగ్రహములు ఖండింపఁబడియెను. స్త్రీలసతీత్వము హరణ మొనరింపఁబడియెను. ఈవ్యవస్థను గాంచియే సమర్థుఁడు ౧౫౫౪ శకమున (1632 క్రీ.శ.) లోకోద్ధరణమునకు సంకల్పించెను. నీతిని, ధర్మమును, రాజ్యమును

స్థాపించి సమాజమును పరమార్థమార్గమునం దన్వయింపజేయుటకు నిశ్చయించుకొనియెను. ఈ నిశ్చయమునకు మూర్తిమంతమగు ఫలమే ఈ దాసబోధగ్రంథము.

## ౧౫ సాధారణరీతిగ వివేచన పద్ధతులు నాలుగు.

మానవ సమాజము వేలకొలఁది సంవత్సరములనుండి విడువక యొనరించు నభ్యుదయ యత్నము ఏదిరో బహువిధముల నిర్ణయింపవచ్చును. 1 పలువురు శాస్త్రజ్ఞులు సమాజమునకుఁ గల ప్రాచీనాధునికములగు నితిహాసములను విచారించి సమాజ చరిత్ర మీవిధముగ నుండియుండునని నిర్ణయించుచున్నారు. ముందీసమాజము పొందఁగల మార్పులను భవిష్యచ్చరిత్రమువలన నెఱుంగనగును. భవిష్యత్తును దొలుత నుడువుట ఇతిహాసకుల పని గాదు. ఈ పద్ధతినే యితిహాసపద్ధతి (Historical) యందురు. 2 శాస్త్రజ్ఞులు పలువురు యత్నించి సమాజ మేరూపమును దాల్చుచున్నదో నిర్ణయింతురు. అంతియగాక యీ సమాజము ఏకసత్తాకముగనుండెనో బహుజన సత్తాకముగ నుండెనో చాతుర్వర్ణ్య నియమానుసారముగ నడచెనో జాతియందె ఉండెనో విమర్శించుచున్నారు. ఇదియే శారీరక పద్ధతి (Morphological) అందురు. 3 కొందరు తత్త్వజ్ఞులు సమాజ మేరూపము దాల్చినను పాటింపక దాని చరిత్ర లక్షణములనే నిర్ణయించుచున్నారు. దీనిని లాక్షణిక పద్ధతి (Physiological) అందురు. 4 సమాజ చరిత్రము శరీర లక్షణములపై ధ్యాన ముంచవలయునను నియతిలేనిది నాల్గవ పద్ధతి. సమాజ దృక్పథము గమనించుటయే యీ పద్ధతికి లక్షణము. ఇందు సమాజము నడుపు ఆత్మ చాలక మన్నే ముఖ్యముగా గమనింతురు గాన మొదట ఆత్మ స్వభావము, రూపము, కార్యము, అంతిమ హేతువులఁ జర్చించి సమాజ లక్ష్యమును గ్రహింతురు. ఇదియే ఆత్మిక (తాత్త్విక లేక వైవేకిక) పద్ధతి (Psychological or Philosophical or Rational) యందురు. ఈ నాల్గు పద్ధతులలో సమర్థుఁడు దేనిని స్వీకరించెనో విచారింతము.

## ౧౬ దాసబోధలోఁ బాటించిన పద్ధతి.

ఈ నాలుగు పద్ధతులలో నాల్గవదియగు ఆత్మికపద్ధతిని శ్రీ సమర్థుఁడు తన దాసబోధలో స్వీకరించెను. యూరపులో శ్లెగల్, హేగల్ మున్నగు తత్త్వవేత్త లీపద్ధతినే యనుసరించిరి. తత్త్వవేత్తలంద ఱీపద్ధతి నామోదింతురనుట సత్యము. మానవజాతి ఆత్మపై సర్వవిధముల నాధారపడియున్నపుడు ఏ విధమైన సంచలనము నేని ఆత్మ దృష్టితోఁ గావించుటయే యుచితము. ఇతరవిధములఁగూడ యోచింపవచ్చును గాని మానవజాతియొక్క అంతిమ హేతువును గమనించినచో తాత్త్వికపద్ధతియే పరిగ్రహింప దగినది. మొదటి మూఁడు పద్ధతుల నామోదించిన శాస్త్రజ్ఞులు సమాజముయొక్క యత్నము, సుఖవృద్ధి, రాజపురుషుల సుఖసాధనమునై యున్నదనిరి. బ్లన్ష్లీ వంటి యితిహాసజ్ఞులు, రాజనీతిజ్ఞులు రాష్ట్రీయుల గుణములను వృద్ధి నొందించుటయే రాజ్యస్థాపన యొక్క ముఖ్యోద్దేశమని వాకొనిరి. పాశ్చాత్య శోధకులు మహత్తరము అవ్యాహతము

నగు మానవయత్నమునకు అంతిమహేతువేదియో పరీక్షింపలేకున్నారు. వారలు అంతరంగికముగా బాహిరముగ సమాజోపాధుల గమనింతురుగాన వారికి నిర్ణయశక్తి యలవడలేదు. ఉపాధుల వెలుపటంచి శుద్ధము, విమలము, నిరుపాధియునగు ఆత్మ స్వరూపముపైఁ బాశ్చాత్యులు ధ్యానముంచరు. అట్లు ధ్యానముంచిన పాశ్చాత్యులలో హేగలు గావించిననిర్ణయము శ్రీసమర్థుని నిర్ణయముతోఁ జాలవఱకేకీభవించుచున్నది. తత్త్వజ్ఞుఁడు వేదాంతియునగు హేగలు పండితుఁడు ఆధ్యాత్మిక దృష్టితో మానవసమాజపుఁ గంతిమోద్దేశము Philosophy of History అను గ్రంథమున నెట్లు వ్రాసెనో తెలిపి సమర్థుని దాసబోధ మతముతో నాతనిమత మెంతవఱకేకీభవించునో నిర్ణయించుట ప్రకృతమై యున్నది.

## ౧౩ హేగల్ పండితునియు సమర్థునియు మతమునందుఁగల సమానత్వము.

"ఈ జగము ఆత్మమాయల సంఘటనముతో నిర్మింపఁబడెనని తోఁచుచున్నది. చిత్ స్వరూపముగ నున్నదంతయు నాత్మ. పంచభూతాత్మకముగ నున్నదంతయును మాయ. మానవేతిహాసమున మాయారూపులగు పంచభూతములకంటె ఆత్మకు వేయిరెట్లు మహత్త్వము గలదు. కావునఁ బ్రధానమగు నీయాత్మ గమనమునకును దాని మూర్త్యవతారములకు సంబంధించిన యితిహాసమునకు మానవజాతీయేతిహాసమను పేరిడవచ్చును. మాయయొక్క ముఖ్యలక్షణము జడము. అది పరతంత్రతగ నున్నది. ఆత్మయొక్క ముఖ్య లక్షణము సూక్ష్మత లేక మోక్షము. ఆత్మ స్వయంభువు, స్వతంత్రము, స్వసంవేద్యము (తన్నుఁ దా నెఱుంగునది). ఆత్మ తన ముఖ్యరూపమును (మోక్షమును లేక స్వతంత్రమును) అన్వేషించుచుండును. ఈ యన్వేషణ ప్రయత్నమునే మానవేతిహాసమందురు. ఈ యితిహాసమును సూక్ష్మదృష్టితో విచారించినచో యూరపియన్ జర్మను సమాజములకు మనమందఱము ముక్తులమేయని విదితమగునట్లు తోఁచును. గ్రీసు, రోమన్ దేశీయులకుఁ గొందఱు మనుజులు మాత్రమే ముక్తులగుటకు యోగ్యులని తెలిసియుండెను. హిందువులు, చైనీయులు మున్నగువారికి ముక్తుఁడొక్కఁడేయని తెలిసియుండెను. ఆత్మయొక్క ముక్తస్వరూపమున నీ విధముగా నీ మూఁడు సమాజములకును భిన్నభావము లున్నందుననే యూరపియనులు స్వతంత్రులుగను, గ్రీకులు రోమనులు అంశమాత్ర స్వతంత్రులుగను, హిందువులు చైనీయులు పూర్ణపరతంత్రులుగను నున్నారు. ఈ విధముగ బద్ధత్వము, ముముక్షుత్వము, ముక్తత్వములే ఆత్మేతిహాస విధములు. కాన మానవసమాజమునకంతిమోద్దేశము ముక్తి (మోక్షము లేక స్వతంత్రము) యైయున్నది. ఈ స్వతంత్రతయే, ఈ మోక్షమే, ఈ స్వసంవేద్యమే ఆత్మతత్త్వము. ఈ తత్త్వములోని కరిగి కలియ నెంచువాఁడు (ముముక్షుఁడగు ఆత్ముఁడు) ధర్మము, నీతి, రాజ్యములను నీ మూఁడు రూపములొందుచున్నాఁడు. ఇందు మూఁడవ రూపమగు రాజ్యచరిత్రమునే రాజకీయేతిహాసమందురు. ఆత్మ రాజ్య రూపముతో మూర్తీభవించి యవతీర్ణమైనంతన స్వతంత్రసిద్ధికి

మార్గము తెఱువఁబడినదని తెలిసికొనవలయును. ఈ మార్గములఁ దెలిచు సీజరు, నెపోలియన్ లవంటి వీరపురుషులందు రాజస తామస సాత్త్విక గుణములుండును. వారల ప్రభావముననే జగదుద్ధరణము జరుగుచున్నది. అనఁగా ఆత్మ తన తత్త్వమువైపు (పూర్ణ స్వాతంత్ర్యమువైపు) పోవుచున్నదని భావము. ఇట్టి పురుషులను అవతారమూర్తులని వీర పురుషులని యందురు. రాజ్యము ఆ పరమాత్మ (జీవాత్మ) యొక్క తత్త్వాధిష్ఠము (మూర్తి స్వరూపము) ఐయున్నయెడల దానియందలి రాజ్యహితదృష్టి రాజ్యస్థాపకుల యొక్కయు, సంబంధులయొక్కయు హితదృష్టితో నన్నివిధములచేతను లగ్నమగుచున్నచో నదియే యుత్తమమైనది. ఈ విధమగు కలయికకై ప్రతిమనుజున కాత్మతత్త్వము తెలియవలసియున్నది. ఈ సంస్థలవలన రాజ్యస్థాపకులగు వ్యక్తుల హృదయములయందు ఆధ్యాత్మిక జ్ఞానము నార్జించు సాత్త్విక రాజస గుణములు ప్రాదుర్భావమగును." హేగల్ పండితుఁడు తన ఫిలాసఫీ ఆఫ్ హిస్టరీ (Philosophy of History) యందు ఇట్టి సంస్థల నన్నింటిని విచారింపలేదు. సమర్థుఁడు తన దాసబోధలో విపులముగాఁ జర్చ గావించియున్నాఁడు.

## ౧౮ తత్త్వజ్ఞానమున హేగల్‌కు సమర్థునకుఁ గల మతభేదములు, హేగల్ భ్రమ.

సంక్షేపముగ నుదాహరించిన పై యుదాహరణమువలన దాసబోధయొక్కయు హేగల్ యొక్కయుఁ దత్త్వజ్ఞానములందుఁగల సమత్వము పాఠకులు గ్రహించియుందురు. హేగల్ యొక్కయు శ్రీ సమర్థ రామదాసస్వామి యొక్కయుఁ దత్త్వజ్ఞానమునందు శ్రద్ధతో గమనింపఁదగిన యొక ముఖ్యభేదము గలదు. హేగల్ పండితుఁడు భ్రమపడి హిందూదేశమునుబట్టి యొక్కఁడే ముక్తుఁడనియుఁ దక్కినవారలందఱు బద్ధులనియుఁ దలంచెను. హేగల్ పండితుఁడు తన యితిహాసము క్రీ. శ. 1822 లో నుండి 1831 దనుక రచించెను. ఆ కాలమున హేగలు మొదలగు పాశ్చాత్యులకు పదునేడవ శతాబ్దమున ఆత్మతత్త్వశోధనమునందు మహారాష్ట్రులొనరించిన ప్రచండ క్రాంతిస్థితి తెలిసియుండదు. ఉపనిషత్తులును శ్రీ సమర్థుని గ్రంథములును హేగలు తత్త్వజ్ఞుఁడెఱింగియున్నచో హిందువు లాత్మతత్త్వమును శోధించిన విధము ఆత్మతత్త్వమునకు శ్రీ రామదాసస్వామి శివాజీ చక్రవర్తి మూర్తి స్వరూపము నొసంగిన రీతి చక్కఁగఁ దెలిసియుండెడిది. శ్రీరామదాసస్వామి అందఱును ముక్తులని కంఠోక్తిగఁ జెప్పినాఁడు. (దాసబోధ ద 5 స 6 చూ.)

మహారాష్ట్రేతిహాసము మహారాష్ట్ర సాహిత్యము నెఱుంగని కారణముననే హేగలు విద్వాంసుఁడిట్లు అసత్యకల్పనము గావించెను. హేగలు విద్వాంసుఁడితిహాసము రచించుకాలమున హిందూదేశ రాజకీయస్థితి భిన్నభిన్నముగా నుండెను. ఆ విపరీత పరిస్థితులు మిల్లు మొదలగువారలు విపరీతముగ వర్ణించిరి. హేగల్ పండితుఁడు తన యనుమానము నా విపరీత వర్ణనమువలన స్థిరపఱచుకొనెను. ఈ యార్యభూమి యందుఁ బదునేడవ శతాబ్దమున మహారాష్ట్రులు సాత్త్వికసంపద కోల్పోయిరని దోషమాపాదించినచో వినవచ్చును గాని పదునేడవ శతాబ్దము నాఁటి సుగుణములను యూరోపియను లెఱింగియు మఱుఁగుపఱచుట పక్షపాతలక్షణమనక తప్పదు. ఈ పక్ష

పాతమునసే హేగల్ మహాశయుఁడు హిందువులలో నొక్కఁడే ముక్తుఁడను నసత్య కల్పనము గావించినాఁడు. సద్గుణములవలన హిందువు లెల్లరు స్వతంత్రులగుటకు యోగ్యులని వేదాంతము, గీత, రామదాసస్వామి పదేపదే నుడువుట పక్షపాతియగుటచే హేగల్ గ్రహింపకపోయెను. నేఁటికి మూఁడువందల సంవత్సరములనుండి యే హేతువుచేఁ బాశ్చాత్యులు పరమార్థము వైపున కేగుచుండిరో ఆ హేతువు మహారాష్ట్రులకు గూడ నుండెనని రానడేమహాశయుఁడు మహారాష్ట్రేతిహాసమునందు వ్రాసియున్నాఁడు. ఈ మహారాష్ట్రేతిహాసము నూఱు సంవత్సరములకు ముందె వ్రాయఁబడి యున్నయెడల హేగల్ వంటివారలు ప్రపంచేతిహాసమునందుఁ గొంత మార్పు చేయవలసి వచ్చెడిది. మహారాష్ట్రేతిహాసము ప్రపంచేతిహాసమునం దొక ముఖ్యాధ్యాయమను సంగతి సర్వజనసమ్మతమై యున్నది. ఇంతవఱకొనర్చిన చర్చవలన దాసబోధ గ్రంథస్వరూపము పాఠకులకు విశదమై యుండును. ఈ గ్రంథము వాస్తవికమగు నితిహాస తత్త్వజ్ఞానముతోఁ బూర్ణమై యున్నది. కాని యిందలి వివేచనాపద్ధతిమాత్ర మైతిహాసికము గాదు. అది యాధ్యాత్మికము.

## ౧౯. దాసబోధయందు యోగమేల చెప్పఁబడలేదు?

గ్రంథసిద్ధాంతములను చర్చ గావించినమీఁదట శ్రీ సమర్థుఁడు భక్తి, జ్ఞాన, కర్మ మార్గములను జెప్పి యోగమార్గము నేల విడిచియుండునని పాఠకులు సందేహింపకపోరు. ఇందులకుఁ గారణము వినుండు. వేదాంతమునందు యోగమార్గమునకు మహత్త్వము లేదు. సమర్థుఁడు బట్టుదలగల యద్వైతవాది గావున యోగసంబంధములగు పటాటోపములను వర్ణింపలేదు. యోగశిక్ష సామాన్యజనుల కసాధ్యమనియే సమర్థుఁడు తన గ్రంథములలో వానిని బేర్కొనలేదు. యోగమునకు నిర్వాతము, శాంతమునగు ప్రదేశము కావలయును. మితము సాత్త్వికము నగు భోజనము కావలయును. మౌనము శాంతవృత్తి యుండవలెను. ఇట్టివి యింకఁ గొన్ని యున్నగాని యోగము కుదురదు. ఈ విషయముల యోచించితిమేని గృహస్థులగు సంసారులకు యోగమార్గ మసాధ్యమని సైతము తోఁచును. కావునే సమర్థుఁడు యోగము నుపదేశింపలేదు. వాస్తవమున కతఁడట్లు చేయుటయే యుచితముగ నున్నది. దాసబోధలో శ్రీ సమర్థుఁడు గావించిన కర్మమార్గ, భక్తిమార్గ, జ్ఞానమార్గోపదేశములు అత్యంత సులభములు అమూల్యములునై యున్నవి.

## ౨౦. ఉపసంహారము.

దాసబోధలోని రహస్యముల నెఱింగి దానిని గ్రహించుటకుఁ బలుమాఱా గ్రంథమును జదువుటయు అందలి సిద్ధాంతములను మననపూర్వకముగా విచారించుటయు నత్యంతావశ్యకము. ఈ గ్రంథములోని సిద్ధాంతముల కనుకూలముగా నాచరణ మొనరించినచో మనరాష్ట్రము అభ్యుదయమునకు రాఁగలదు.



శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ఆంధ్ర దాసబోధ.

## మొదటి దశకము.

---

### మొదటి సమాసము — గ్రంథారంభ నిరూపణము.

శ్రీ సమర్థరామదాసులవారి సన్నిధికిఁజేరి శ్రోతలిటుల బ్రశ్నించిరి. స్వామీ ! ఇది యేగ్రంథము? ఇందేయేవిషయములు చెప్పఁబడియున్నవి ? ఈ గ్రంథము నాలించుటవలనఁ గలుగు ఫలములెవ్వి ? 1. సమర్థులిటుల నాజ్ఞనొసంగిరి. ఈ గ్రంథనామము దాసబోధ. ఇందు గురుశిష్య సంవాదముగలదు. ఇంతియగాక యిందు స్పష్టముగాఁ దెలియునటుల భక్తిమార్గము నుడువఁబడినది 2. ఈ గ్రంథమునందుఁ దొమ్మిది తెఱంగుల భక్తులు, జ్ఞానవైరాగ్యముల లక్షణములు విశేషించి ఆధ్యాత్మ నిరూపణము చెప్పఁబడినది 3. మనుష్యుఁడు భక్తియోగమువలన నీశ్వరుని నిశ్చయముగాఁ బ్రాపించునను నంశ మీగ్రంథమునందుఁ దెలుపఁబడినది 4. ముఖ్యభక్తి, శుద్ధజ్ఞానము, ఆత్మస్థితి, శుద్ధోపదేశము, సాయుజ్య ముక్తి, మోక్షప్రాప్తి, శుద్ధస్వరూపము, విదేహస్థితి, అలిప్తత, ముఖ్యదైవము, ముఖ్యబ్రహ్మము, జీవశివులు (జీవాత్మపరమాత్మలు) నానామతములు మున్నగు నంశములనుగుఱించి యీ గ్రంథమునందు సిద్ధాంతము గావింపఁబడినది. మఱియు నిందు "నేను"అనున దెద్దియోయదిఁగూడ వివరింపఁబడినది. ముఖ్యోపాసనము నానావిధములగు కవితారీతులు, నానావిధచాతుర్యములు, మాయయొక్కయుత్పత్తి, పంచభూతములు, వాని కర్తృత్వము మున్నగు విషయముల లక్షణములన్నియు నిందుఁజెప్పఁబడినవి 5 — 11.

దాసబోధలోఁ బెక్కు తెఱంగుల సందియములు శంకలు నివారింపఁ బడు టయేగాక యనేకవిధములగు ప్రశ్నలకుఁగూడ సదుత్తరము లొసంగఁ బడినవి 12. ఈ రీతిగాఁ బయిని చెప్పఁబడిన సంగతులెన్నియో యీ గ్రంథమునందు నిరూపించినాఁడను. గ్రంథమునందంతటను నేమేమి నుడువఁబడెనో దాని సంగ్రహమునంతయు నిచట వివరింప నవకాశము లేదు 13.

అయినను గొంచెము చెప్పెదను. దాసబోధయంతయు నిరువది దశకములుగా విభజింపఁబడి విస్పష్టముగ నొనరింపఁబడినది. ప్రతి దశకము నందు నేయేవిషయములు చర్చింపఁబడునో యవియన్నియు నాయాదశక ములలోనే చెప్పఁబడినవి 14. అనేక గ్రంథముల సమ్మతియు, ఉపని షత్తులు, వేదాంతము, శాస్త్రములు, ఆత్మప్రతీతి (శ్రీ రామదాసస్వామి స్వయముగాఁ బరమార్థమునందు గడించిన యనుభవము) మున్నగువాని నాధారమువిూఁద నీ గ్రంథరచనము జరిగినది 15. అనేక గ్రంథభావ ములను సమన్వయించి యీ గ్రంథము రచింపఁబడినది గాన నెవ్వరును దీనిని మిథ్యయని వాకొనఁజాలరు. ఈ విషయమును నేను జెప్పవలసినపని యేమున్నది ? ఇఁకఁ బ్రత్యక్షానుభవమువలనగూడఁ దెలియును. (గ్రంథ ముయొక్క సత్యాసత్యములు ఇప్పటికిప్పుడే యధ్యయనమువలనఁ దెలియు చుండ నొకరు చెప్పవలసినపని యేమున్నది ?) 16. లోకు లొకవేళ నేదేని మత్సరకారణమున నీ దాసబోధయందలి యంశము మిథ్యయని వాకొన్నచో వారలు "అన్ని గ్రంథములను (నానాప్రకారములగు గ్రంథ ముల సమ్మతిని)మఱియు భగవద్వాక్యములను ఖండనము గావించినవార" లని భావింపుఁడు 17. శివగీత, రామగీత, గురుగీత, గర్భగీత, ఉత్తరగీత, అవధూతగీత, వేదము, వేదాంతము, భగవద్గీత, బ్రహ్మగీత, హంసగీత, పాండవగీత, గణేశగీత, యదుగీత, ఉపనిషత్తులు, భాగవతము మున్నగు పవిత్రగ్రంథముల సమ్మతియే దాసబోధలోఁ జెప్పఁబడినది. ఆయా గ్రంథములలో భగవద్వాక్యములే గలవు. అవి నిశ్చయముగా యథార్థ ములు 18-20. భగవద్వచనమునం దవిశ్వాసముగలిగి వర్తించు పతితుఁడెం దేనిగలఁడా ? ఈ గ్రంథమునఁ జెప్పఁబడినదానిలో నెద్దియును భగవద్వాక్యవిరహితమైనది లేదు 21. పూర్తిగా గ్రంథమును దిలకింపకయే

వ్యర్థదోషము లాపాదించు నా దురాత్ముఁడును దురభిమానియునగు పురుషుఁడు మత్సరకారణముననే యందులకు సాహసించును. వాని హృదయమునందు అభిమానమునుండి మత్సరమును, మత్సరమునుండి తిరస్కారమును జనించుచున్నవి. ఆవలఁ గ్రోధవికారము త్వరితముగ నుత్పన్నమగును 22 — 23. ఆ మనుష్యుఁడు "అహంభావకారణముననే మలినాత్ముఁడై కామక్రోధములతో సంతప్తుఁడగుచున్నాఁ"డనునది ప్రత్యక్షముగనే కనుపించును 24. కామక్రోధములకు లోఁబడియున్న వానిని యోగ్యుఁడని యెటుల నుడువుదుము? చూడుఁడు. అమృతమును సేవించినపిదప రాహువు విష్ణుని చక్రధారచేఁ జంపఁబడెను (రాహువువలె నంతరంగము కలుషితమై మలినమనస్కులై యుండెడి మనుజులు ఈ యమృతతుల్యమగు గ్రంథమునుండి యేమాత్రపు లాభమును బొందఁ జాలరని భావము) మంచిది. ఇఁక నిప్పుడీమాటలను గట్టిపెట్టుదము. ఈ గంథ్రసారమును ఎవనికెట్టి యధికార మున్నవాఁడటుల గ్రహించును కాని అభిమానమును విడనాడుట యన్నిఁటికంటెను మంచిది 25 — 26. అయ్యా! ఈ గ్రంథమునం దేమున్నదని తొలుత శ్రోతలు ప్రశ్నించిరి గావున దానినంతను సంక్షిప్తరీతిగాఁ జెప్పుట జరిగినది 27. ఇఁక నిప్పుడు గ్రంథమునందలి యంశము నాలించుటవలనఁ గలుగు ఫలములను దెలుపు చున్నాఁడను. మొదట నీ గ్రంథ శ్రవణమువలన శ్రోతల కాచరణమునందుఁ దత్క్షణముననే మార్పుగలుగును. మఱియు సంశయమూల మొక్కసారిగాఁ బటాపంచలై పోవును 28. సుగమమగు మార్గము లభించును. దుర్గమము లగు సాధనములవలని యావశ్యక ముండదు. సాయుజ్యముక్తి మర్మము సహజముగనే విశదమగును 29. ఈ గ్రంథము నాకర్ణించుటవలన అజ్ఞానము, దుఃఖము, భ్రాంతి నాశనమగును. అటులె శీఘ్రముగా జ్ఞాన మలవడును 30. యోగులయొక్క పరమభాగ్యమగు వైరాగ్యము ప్రాప్తించును. వివేకసహితమును, యథాయోగ్యమును, జాతుర్యమును నగు జ్ఞానము కలుగును 31. భ్రాంతులుగను, అవగుణులుగను, దుర్లక్షణులుగను నుండు మానవు లీగ్రంథమును బఠించుటవలన సలక్షణు లగుదురు. ఇంతియగాక ధూర్తులును తార్కికులును, విచక్షణులును నగు మనుజులు అవసరమగు

నంశముల వివేచింప నారంభించెదరు 32. అశ్రద్ధగలవారలు ప్రయత్న శీలు రయ్యెదరు. పాపులు తమ దురంతము నెంచికొని పశ్చాత్తాపము నొందెదరు. భక్తిమార్గమును నిందఁజేయువారు దానినే కొనియాడఁ దొడంగుదురు 33. బద్ధులు (సంసారసంబంధులగు మనుజులు) మోక్షమును గోరువారలగుదురు. మూర్ఖు లతిదక్షులయ్యెదరు. మఱియు భక్తివిహీనులునై తము భక్తిమార్గములోనఁ బ్రవేశించి మోక్షమును గడించెదరు 34. ఈ గ్రంథమును జదువుటవలనఁ బెక్కు తెఱంగులగు దోషములు నాశనమగును. పాపులు పావనులయ్యెదరు. మఱియు నీ గ్రంథ శ్రవణమాత్రముననే మానవు లుత్తమగతి నొందెదరు 35. దేహబుద్ధిజములగు పెక్కుతెఱంగుల మోసములు, సందేహపూర్ణములగు ననేక భ్రమలు, సంసారమునందలి సమస్తోద్వేగములు, నీ గ్రంథము వినుటవలన నశించును 36. దీని ఫలశ్రుతి యిట్టిది. ఈ గ్రంథాకర్ణనముకతన అధోగతి నశించును. ఇంతియగాక హృదయమునకు విశ్రాంతియు సమాధానముగూడ సమకూరును 37. ఇంతయేల, యెవనిభావ మీ గ్రంథ విషయమున నెటులుండునో యట్లు ఫలము సిద్ధించును (యాదృశీ భావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ) మాత్సర్యయుతున కీ గ్రంథమున మత్సరమె లభించును 38.

---

## రెండవ సమాసము - గణేశ స్తుతి.

ఓంకారస్వరూపా! సర్వసిద్ధి ఫలప్రదాయకా! అజ్ఞానభ్రాంతిచ్ఛేదకా! బోధరూప గణనాయకా! నీకు నమస్కారముల నొనర్చుచున్నాఁడను 1. నా యంతఃకరణమునందు విరాజిల్లుము. మఱియు నెల్లపుడు సమస్తవిధముల నావాసమొనరింపుము. నీ కడకంటి చూపుల నుండి నాపయి దయారసము ప్రసరింపఁజేసి వాక్యశూన్యుఁడనగు నాచేఁ బలికింపుము. నీ యనుగ్రహాతిశయముననే జన్మజన్మాంతర సంబంధమగు భ్రాంతి తొలఁగిపోవుచున్నది. విశ్వభక్షకమగు కాలమునై తము సేవ గావించుచున్నది 3. నీ యనుగ్రహము ప్రసరించినంతనే పాపములు విఘ్నములు గజగజ వడంకును. నీపేరువిన్నంత నవి సుడివడి తిరుగుచుండును 4. ఇందుచేతనే స్వామీ! నిన్ను విఘ్నహరుఁడని యనుచున్నారు. మా

వంటి దిక్కులేనివాండ్రకు నీవే సాహాయ్యకుఁడవు 5. మంగళనిధియగు గణేశ్వరునకు వందనములొనరించి యేకార్యమునేని చేయఁబూనినచో సమస్త సిద్ధులును జేకూరును. ఎట్టి యాటంకములేని పాదసూపఁజాలవు 6. అతని నామము స్మరించినతోడనే హృదయమున కంతయనరాని నిలుకడ లభించును. మనస్సు ఇతరములగు సమస్తేంద్రియములనువిడచి కేవలము నేత్రములలోని కేతెంచి నివసించును. అన్ని యంగములును గుంటువడి పోవును. అన్ని యింద్రియములపట్ల విస్మరణము కలుగును 7.*

గణేశమూర్తియొక్క సగుణరూపము మిగుల సుందరమును, మోహదాయకమునై యున్నది. అతఁడు నాట్యము గావించినవెంటనే వేలుపులందఱును స్తబ్ధులై పోయెదరు 8. ఆయన యెల్లప్పుడును మదముతో నిండియుండును. ఆనందముతోఁ దూగుచుండును. సంతసముతో సుప్రసన్నముఖుఁడై యత్యుల్లాసియై యుండును 9. మనోహరమును, స్థూలమునగు నాకారముగల వినాయకుని భీమమూర్తి మహాప్రచండమైనది. విస్తీర్ణమును సమున్నతమును నగు నాతని మస్తకము విశేషించి సింధూరచర్చచే నొప్పారియున్నది 10. నానావిధములగు సుగంధముల నీను పరిమళము ఆతని గండస్థలమునుండి (మదజలరూపమున) జారి పడుచున్నది. భ్రమరగణమచట గుంపులుగుంపులుగఁ గూడి ఝుంకారము లొనరించుచున్నది 11. శుండాదండము సరళమై కొంచెము ముడుచుకొని యున్నది. కపోలములు కాంతిచే నిండారి చూడఁదగియున్నవి. అధరము మిగుల బొడవుగానున్నది. క్షణక్షణమునను దీక్ష్ణమగు మదరసము చుక్కలుచుక్కలుగా జారిపడుచున్నవి 12. పదునాలుగు విద్దెలకు వేలుపగు నావేలుపురాయఁడు తన చిన్నికన్నులను మాటిమాటికిఁ గదలించుచున్నాఁడు. మృదులములు విశాలములునగు నాతని చెవులు పళపళమని మ్రోగుచున్నవి 13. రతనములుచెక్కిన కిరీటము ధగధగమని యతనితలపై మెఱయుచున్నది. దానినుండి పెక్కుతెఱంగులగు కాంతులు ప్రకాశమానములై వెలుగొందుచున్నవి. చెవులకుఁగుండలములు విరాజిల్లుచున్నవి.

* పయినిజెప్పిన యేడుపద్యములలో గణేశుని నిర్గుణరూప వర్ణనముగలదు. ఇంక ముందు సగుణవర్ణనము వచ్చును.

వానిపయిని దాపిన నీలమణులు కాంతులను వెదజల్లుచున్నవి 14. దృఢము లును శ్వేతములు నగు దంతములకు మణులు బంగారముతోఁజేసిన కడియములు తొడుగఁబడియున్నవి. ఆ కడియములక్రిందఁ జిన్నచిన్న బంగారురేకులు ప్రకాశించుచున్నవి 15. మెల్లమెల్లఁగఁ దొండము కదలుచున్నది. దానిపయిని సర్పము చుట్టవలెఁ జుట్టుకొనియున్నది. చిఱుగంట మందమందనినాదముతో మ్రోగుచున్నది 16. ఆయనకు నాలుగు భుజములున్నవి. ఉదరము వ్రేలాడుచున్నది. ఒకపీతాంబరమును ధరించియున్నాఁడు. తొండముపై నున్న పాము మాటిమాటికి బుసగొట్టు చున్నది 17. అది పడగనాడించుచు నాలుకలు ముందునకుఁ దీయుచుఁ జుట్టుచుట్టుకొనియున్నది. మఱియు గణేశుని నాభికమలముఁ బయికిఁ బడగ నెత్తి యాపాము తీవ్రదృష్టితోఁ జూచుచున్నది 18. పలుతెఱంగులగు పూవుదండలు సర్పముచేఁ జుట్టఁబడియున్న నాభిదనుక మెడలో వేయఁ బడియున్నవి. ఆతని హృదయకమలము మీఁద మణులుచెక్కిన పతక మొకటి ప్రకాశవంతముగా నలరారుచున్నది 19. గండ్రగొడ్డలి, తామర పూవు రెండుచేతులయందును విరాజిల్లుచున్నవి. వాఁడిగలదియు ధగధగ మని మెఱయుచున్నదియు నగు నంకుశ మొకచేతియందును, వేఱొకచేతి యందు ఉండ్రాయియుఁ దాల్చియున్నాఁడు. విఘ్నేశ్వరునకు ఉండ్రాయి పై నెంతయో ప్రీతి 20. నటననాట్యకళాకౌశలములను వెల్లడించుచు వినాయకుండు పెక్కుతెఱంగుల నృత్యమొనరించుచున్నాఁడు. తాళము మృదంగము మున్నగు వాద్యములు మ్రోఁగుచున్నవి. ఉపాంగముల ఝుంకారము దిక్కుల నిండిపోవుచున్నది 20. ఒకనిముసమేని వినాయ కునకు స్థిరబుద్ధిలేదు. చపలత్వమునం దాతని నగ్రగణ్యునిగఁ దలంపనగును. సమస్తాలంకారశోభితమగు సుందరాకారముగలిగి విఘ్నేశ్వరుఁడు సర్వ లక్షణముల కాటపట్టుగ నున్నాఁడు 22. నూపురములు గణగణ మ్రోగు చున్నవి. పాదభూషణములు ఝణఝణ మనుచున్నవి. గజ్జెలవలనఁ బాదయుగళము మనోహరముగాఁ గనిపించుచున్నవి 23. గణేశుని కారణమున నీశ్వరునిపేరోలగమున కొక్రొత్త చెలువు వచ్చినది. దివ్య మగు నాతని యంబరకాంతులు నలుగడల వెలుంగుచున్నవి. సాహిత్య విషయమున నిపుణులగు అష్టవిధలాయికలు గూడ విఘ్నేశ్వరమూర్తి

వెంట సభలోనఁ బ్రవేశించియున్నారు 24. సర్వాంగసుందరుఁడును సమస్త విద్యలకు నాధారభూతుఁడునగు నిట్టి గణేశ్వరునకు నా భావయుక్తమగు సాష్టాంగప్రణామములను సమర్పించెదను 25. గణేశుని రూపమును వర్ణింపఁగానే భ్రాంతచిత్తులహృదయము ప్రకాశవంతమగును. మఱియు గుణానువాదము నాలించినంతన వారికి సరస్వతీదేవి ప్రసన్నురాలగును 26. బ్రహ్మమొదలుగాఁగల వేలుపులందఱును నీగణపతికి వందనము లొనరించు నపుడు పాపపుమనుష్యుఁ డొకలెక్కలోనివాఁడా? ఇక నీ విషయము నటు లుంచుదము. మందమతులగు ప్రాణులు గణేశ్వరుని స్మరింపవలయును 27. మూర్ఖులును దుర్లక్షణులును హీనాతిహీనులుగూడ విఘ్నేశ్వరునిఁ జింతన మొనరించి సమస్తవిషయములలో నేర్పరులును దక్షులును నగుదురు 28. ఆయన పరమసమర్థుఁడు. కోరికలన్నింటిని సమకూర్చును. ఆయనను భజించుటవలన సమస్తకార్యములును జేకూరును. ఇది యనుభవముచేత నెఱింగినమాట. కలియుగమునందుఁ జండీవినాయకుఁడు ముఖ్యదైవతము 29. కనుక నా మంగళస్వరూపుఁడగు విఘ్నేశ్వరుని స్తోత్రమును బరమార్థవాంఛ హృదయములో నుంచుకొని నా శక్తికొలఁది యొనరించినాఁడను.

---

## మూడవ సమాసము – శారదాస్తుతి.

ఇఁకనిప్పుడు తొలిపలుకులఁ గన్నతల్లియు, నలుమోముల వేలుపు గడుపారఁ గన్నబిడ్డయుఁ బలుకుల కాధారభూతురాలును వాగ్దేవియు మహామాయాస్వరూపిణియు నగు సరస్వతీదేవికి వందనము లొనరించు చున్నాఁడను 1. ఓ శారదాదేవీ! నీవు శబ్దస్ఫూర్తిని నుజ్జీవింపఁజేసి వైఖరీముఖమున నపారమగు వచనసమూహమును బిలుచుచున్నావు. శబ్దమునకుఁ గల యంతర్భావమును నీవు ప్రత్యక్షము గావించుచున్నావు 2. తల్లీ! నీవు యోగులయెడ సమాధిరూపముననను నిశ్చలభావులగు మనుజులయెడ గృతబుద్ధిరూపముననను నలరారి స్వయముగా విద్యాస్వరూపముతో నొప్పి యవిద్యోపాధి నంతరింపఁజేయుచున్నావు 3. నీవు మహానుభావులగువారలకు ననుకూలవతివగు నర్ధాంగివి. తుర్యావస్థవు. నీ కలయిక చేతనేగదా సాధుజనులు మహత్కార్యముల నొనరించుటలోఁ బ్రవృత్తులై

యుండెరి 4. భారతీ ! నీవు మహాత్ములయెడ శాంతివై యీశ్వరునెడ స్వయంశక్తివై జ్ఞానులయెడ విరక్తిభావమవై నిరాశావస్థకుఁ బరమావధివై యలరుచుంటివి 5. అనంతములగు బ్రహ్మాండములను నీవు రచించి లీలావినోదముగా వానినెల్లఁ జెఱచివేయుచున్నావు. ఆదిపురుషుని యందు నీవు చిత్రముగా దాఁగియున్నావు 6. నీవు ప్రత్యక్షముగా జూచుటకుఁ గనిపింతువుగాని విచారము చేయుటచే సాధ్యపడవు. ఇంతయేల బ్రహ్మాదులకు సైతము నీయంతు తెలియరాకున్నది 7. సమస్త సంసార నాటకములకు నీవంతఃకళవు (మూలసూత్రమవు). చిచ్ఛక్తియొక్క నిర్మల మూర్తివి. జ్ఞానశక్తిస్వానందసుఖము మానవులకు నీ యనుగ్రహముననే సమకూరుచున్నది 8. నీవు సుందరాంగులకుఁ దలమానికమవు. సూర్య పరబ్రహ్మమునెడ నీవు కాంతిరూపమున విరాజిల్లుచున్నావు. మోక్షలక్ష్మివి నీవు. శబ్దరూపమునఁ బూర్ణముగ నిర్మితమైన దృశ్యసంసారమును నాశనము జేయుటకు నీవు సమర్థురాలవు. పదునేడవ జీవకళవు. యోగిజను లేది పానముజేసినంతన వేలకొలఁది సంవత్సరములమరులై యుందురో యట్టి బ్రహ్మరంధ్రవినిర్గతమగు నమృతధారవు నీవు. నీవు సత్త్వలీలారూపిణివి. శీతలరూపవు. చక్కఁదనమునకు నీ వునికిపట్టువు 9 – 10. తల్లీ ! నీవవ్యక్త రూపుఁడగు పరబ్రహ్మము నెడ వ్యక్తరూపవు. విస్తారమై వృద్ధినొందు చున్న తత్త్వమునకు నీవు ఇచ్ఛాశక్తివి. కలికాలమునకు నియంత్రిణివి. గురు కృపారూపమున నీవు ప్రత్యక్షమై యర్థుల నాదరించు లోకమాతవు 11. పరమార్థము నెఱుంగుటకు నీవు విచారరూపమగు ప్రధానసాధనముగ నున్నావు. సారము అసారము నిశ్చయించుటకు నీ తోడ్పాటు గావలసి యున్నది. శబ్దబలముచే నీ భవసముద్రమును దరింపఁజేయు నీమహత్త్వము గానియాడ నేరితరము? 12. భగవత్స్వరూపిణీ! వాణీ ! ఈ విధముగా నీవు మాయాస్వరూపముతో బహువేషములను ధరించుచున్నావు. స్వయముగా సిద్ధురాలవై అంతఃకరణములలోఁ జతుర్విధములుగాఁ (పరా పశ్యంతి మధ్యమా వైఖరులను నాలుగు రూపములతోఁ) బ్రకటిత మగుచున్నావు 13. పరా పశ్యంతి మధ్యమ యను మూటి తోడ్పాటుచే నంతఃకరణములోఁ బ్రవేశించు వైఖరిని నీవె ప్రకటనము గావింపఁ గల్గి యున్నావు. అందుచేఁ గర్తృత్వమునునదేదియో యయ్యది నీ కృపాకార

ణమునవే కలుగుచున్నదని స్పష్టమగుచున్నది 14. మాతా! నీవు బ్రహ్మా దులకు జననివి. శ్రీ మహావిష్ణువు శంకరుఁడు నీకతననే యుద్భవించిరి. సృష్టిరచనము లోకత్రయము గూడ నీ విస్తృతివలన నేర్పడినవే 15. పరమార్థమూలతత్త్వముగానే గాక కేవల సద్విద్యారూపముననుగూడ నీవు పేరుగాంచి యుంటివి. నీ సుస్వరూపము శాంతము, నిర్మలము, నిశ్చలము నై యున్నది 16. యోగుల ధ్యానమునందును, సాధకుల చింతనము నందును, సిద్ధుల యంతఃకరణమునందును నీవు సమాధిరూపమున వసించు చుంటివి 17. నీవు నిర్గుణస్వరూపమును సుబోధము గావించుచున్నావు. అనుభవమునకు నీవు చిహ్నముగా నుంటివి. ఘటాంతరములయందు నీవు పరివ్యాప్తురాలవై యలరారుచున్నావు 18. శాస్త్రములు,పురాణములు, వేదములు (శ్రుతులు) నిన్ను నిరంతర మఖండరూపముగాఁ గొనియాడు చున్నవి. ప్రాణిమాత్రులందఱు నీ నిర్మలకీర్తిని బహువిధముల గాన మొనరించుచున్నారు 19. వేదశాస్త్రముల కంతటిమహిమ నీవలన వచ్చినది. నిరుపమానమునకు నీవుపమానభూతురాలవు. నీ సంబంధముచేతనే గదా పరమాత్మకుఁ బరమాత్మ యను గౌరవము వచ్చినది! 20. తల్లీ! బహువిధములగు విద్యలు, కళలు,సిద్ధులు నిశ్చయాత్మికమగు బుద్ధి,సూక్ష్మ వస్తువు మున్నగువానికి నీవు శుద్ధజ్ఞానస్వరూపురాలవై తేజము ప్రసాదించి తివి 21. హరిభక్తులయెడఁగల భక్తివి నీవె. అంతర్నిష్ఠులకు నంతర్దశవు నీవె. జీవన్ముక్తులగు మహాత్ములకు నీవె సాయుజ్యముక్తిగ నొప్పారి యున్నావు 22. అనంతమగు వైష్ణవీమాయవు నీవు. నీ నాటక మోహ కత్వమెంతవారికేని తెలియరాదు. జ్ఞానమను నభిమానముతో నీ వెంత యెంతవారలనేని చిక్కుపఱచుచున్నావు 23. నీ దివ్యస్వరూపము కనులతోఁ గాంచనేరము. శబ్దముల సాయముచే గుఱుతింపఁజాలము. మనసున మాత్రము ప్రకాశించుచుండును 24. స్తవము, భజనము, భక్తిభావ మును వానిలో నెందేని మాయలేకున్న నందమే లేదు. ఈ వచనముల యందలి భావము ననుభవనీయులు దక్క నితరు లెఱుంగరు 25. ఓ జగన్మాతా! పెద్దలందఱికంటెను బెద్దదానవు. సర్వజగన్నియంతయగు నీశ్వరునకు నీ వీశ్వరివి. నీకు నీ యంశములోనే మాయారూపిణివగు నీకు మాయా రూపముననే యిపుడు వందనము లొనరించెదను.

## నాలుగవ సమాసము – సద్గురుస్తుతి.

సద్గురువర్ణనము నెటులఁ గావింపవలయునో తోఁచకున్నది. మాయకుఁ గూడ స్పృశింప నశక్యమగు గురుస్వరూపము అజ్ఞానుఁడనగు నా కేవిధముగాఁ దెలియును? 1. సద్గురు పరబ్రహ్మము స్వరూపము నెఱుంగుట యసాధ్యకార్యము. ఎవరి విషయమున శ్రుతులుసైతము "నేతి, నేతి" యని వాకొనుచున్నవో యట్టి గురుబ్రహ్మమును వర్ణించుటకు మూఢుఁడనగు నాహృదయమునందు స్థానమెక్కడిది? 2. స్తుతి విషయమున నాకేమియుఁ దెలియరాకున్నది. కావున దూరమునందుండియే నీకు వందనములను సమర్పించుచున్నాఁడను. ఓ గురుదేవా! నీ మహిమా సముద్రమును దరిచేరుటకుఁ దగినశక్తిని నాకు దయతోఁ బ్రసాదింపుము 3. నిన్నుఁ గొనియాడవలయునని యాపరానియంత కోరిక గలదు. కాని మాయచే నాధైర్యమంతయు వికలమైపోయినది. కావున నోగురుస్వామీ! నీ వెవ్విధంబున నింతకుమున్నుంటివో యటులె యుండుము 4. ఇంతకు మున్ను మాయాబలమున నిన్నుఁ గొనియాడఁగలనని మురిసితిని. కాని మాయయంతయు లజ్జనొంది పోయినది. ఇఁక నాగురుమూర్తిని స్తోత్రము గావింప ననువగు విధమెద్ది? 5.

ముఖ్యపరమాత్మను గల్పనమొనరించుట యెన్నటికిని సాధ్యము కానిపని. అందుచేతనే యాతనిప్రతిమను జేయవలసివచ్చినది. ఆవిధముగనే నేను మాయాయోగముతో సద్గురునిమహిమ నభివర్ణించెదను 6. సాధకుఁడు తన భావానుసారముగా నేవిధముగా హృదయమునందు దేవతా ధ్యానము గావించునో యట్లు ఈ స్తుతిప్రకరణమునందు సద్గురుమూర్తిని స్తుతించెద 7.

ఓ సద్గురురాజా ! నీకు జయమగునుగాక. నీకు జయమగునుగాక. ఓ విశ్వంభరా ! విశ్వబీజమూర్తీ! పరమపురుషా ! మోక్షధ్వజా ! దీన బాంధవా! సూర్యప్రకాశముచే నంధకారసముదయము పటాపంచలగు నట్లు నీ యభయరూపమగు ప్రకాశలేశముచే దుర్నివారమగు మాయ యంతయు నశించుచున్నది 8 – 9. పగలు సూర్యుఁడంధకారమును రూపుమాపుచున్నాఁడు, రాత్రియైనపిదప నాయంధకారమంతయు లోకము

నిండ నల్లుకొనుచున్నది 10. కాని మా సద్గురుస్వామి యట్టివాఁడుకాఁడు. ఆయన జననమరణములను వినాశన మొనరించుచున్నాఁడు. అజ్ఞానరూప మగు మహాంధకారము నాయన మూలమట్టముగా నశింపఁజేయు చున్నాఁడు 11. బంగార మెన్నఁటికిని ఇనుముగా మాఱనివిధమున గురు భక్తులెన్నఁటికిని సందియములకుఁ బాల్పడఁజాలరు 12. ఏ నదియేని గంగా నదిలోఁ గలసినపిదప అదియు గంగానదియైపోవును. మఱల నొకవేళ నది వేఱు గావింపఁబడినను అది గంగానదిమాత్ర మెన్నఁటికిని గాఁజాలదు 13. కాని గంగానదిలోఁ గలియుటకు ముందుగ నా నదిని జనులందఱు (సామాన్య) నదియె యని యందురుగాని గంగయని యెప్పుడును జెప్పరు. శిష్యుని స్థితి యట్టిదిగాదు. అతఁడు సర్వవిధముల గురుస్వామియే యగును 14. పరుసవేది లోహమును పరుసవేదిగాఁ జేయనేరదు. సువ ర్ణము ఇతరలోహమును సువర్ణముగాఁ జేయఁజాలదు. కాని సద్గురు భక్తుఁడు ఉపదేశములచే నితరులనుగూడ సద్గురులనుగాఁ జేయఁ గలు గును 15. శిష్యున కీవిధముగా గురుత్వము చేకూరును. పరుసవేదిచేఁ గావింపఁబడిన సువర్ణము ఇతరలోహములను సువర్ణముగా జేయనేరదుగాన సద్గురునకుఁ బరుసవేదితో నుపమాన మెన్నటికిని బొసఁగదు 16. పోనిమ్ము సద్గురునకు సముద్రము నుపమానముగ నొసంగుదమన్న నదియు యుక్తి యుక్తముగ లేదు. ఏలయన సముద్ర మత్యంతక్షారోదకముతో నిండి యున్నది. కాదు క్షీరసాగరముతోఁ బోల్చుదమన్న నదియు యుక్తముగ లేదు. ఏలయన, క్షీరసాగరము సైతము కల్పావసానమున నశించు చున్నది 17. మేరు మహాపర్వతముతో సద్గురుమూర్తిని బోల్చుదమన్న నదియుఁ దగియుండలేదు. మేరువు జడపాషాణమయము. మా సద్గురు మూర్తి యట్టివాఁడుకాఁడు. అతఁడు దీనజనులను గాంచినంతన దయార్ద్రి హృదయుఁడగును 18. ఆకాశము నుపమానముగాఁ గైకొందమనిన సద్గురుస్వరూప మాకాశముకంటెను నిర్గుణము కాన సద్గురున కాకాశ దృష్టాంతము జతపడుట లేదు 19. ధీరత్వమునందు సద్గురునకు నొకవేళ భూమి నుపమానముగఁ జెప్పుదమన్న నదియు సరిపడదు. భూమి కల్పాంత మునందు నాశనమగుచున్నది. గావున భూమి నుపమానముగఁ జెప్పుట తగదు 20. అన్నివిధముల సూర్యుఁడు సద్గురుమూర్తితో నుపమింపఁ

దగినవాఁ డందుమేని యాతని ప్రకాశమునకుఁ గూడ శాస్త్రనియమ మున్నటులఁ బెద్దలు జెప్పుచున్నారు. సద్గురుఁడో నిర్ణయాతీతుఁడుగాన నీయుపమానము తగదు 21. కావున సూర్యుఁడుసైతము గురుమూర్తి కంటె నుపమలోఁ దక్కువవాఁడు. సద్గురుని జ్ఞానరూపమగు ప్రకాశము మిక్కిలి గొప్పది. ఒకవేళ నాదిశేషుని నుపమింపఁ దలచినయెడల నదియు సంబంధింపదు. ఆదిశేషుఁడు భూభారమును మోయువాఁడు 22. జలము నుపమించుదమన్నచో నదియు గాలాంతరమునం దెండిపోవును. సద్గురుని రూపము నిశ్చలమైనది గావున నది యెన్నటికిని నశింపఁజాలదు 23. సద్గురున కమృతము నుపమానముగఁ జెప్పుదమన్న నదియు సరిపోకయున్నది. ఏలయన, అమృతపానము గావించువార లమరులు. వార లుగూడ నొకప్పుడు మృత్యువునకు లోనగుచున్నారు. సద్గురుకృప ఆశ్రితులకు యథార్థమగు నమరత్వము కలుగఁజేయునుగాని నీ యుపమానము సరిపడదు 24. ఒకవేళ సద్గురుని గల్పవృక్షమని చెప్పుద మన్న నదియుఁ బొసఁగకున్నది. సద్గురుని స్వరూపము కల్పనాతీతము గానఁ గల్పవృక్షోపమము సర్వవిధముల ననుచితము 25. మనస్సులోఁ గోరికలేనపుడు చింతామణిని బాటించువాఁడెవ్వఁడు? నిష్కాముఁడగు వానికిఁ గామధేనువుతోఁ బనియేమి? కాన మా గురుమూర్తిని జింతామణితోడను, గామధేనువుతోడను బోల్చుట యుక్తముగాదు 26. సద్గురుమూర్తి నొకవేళ లక్ష్మీయుతుఁడని చెప్పుదుమేని యదియు నుచితముగ లేదు. లక్ష్మి నశించునది. మోక్షలక్ష్మిని దన గృహద్వారమునందు బంధించు సద్గురుమూర్తి కీ నాశవంతమగు లక్ష్మితోఁ బోల్కతగదు 27. స్వర్గలోకమునకును దేవేంద్రపదవికిని గూడఁ గాలాంతరమునందుఁ జలనము గలదు. సద్గురుకృప చలనరహితమైనది. గావున దానిని స్వర్గముతో దేవేంద్రపదవితోఁ బోల్చుటయెట్లు? 28. హరి హర బ్రహ్మలుగూడ నాశనమగుదురు. సద్గురుపద మెన్నటికిని నాశనమొందక యవినాశిగా నుండును 29. కావున మాదృష్టిలో సద్గురుని కుపమింపఁదగిన దేదియు లేదు. సమస్తసృష్టియు నాశనమగుటకలదు. గానఁ బాంచభౌతికమగు భూమి నెట్లు గురుమూర్తితోఁ బోల్పనగును? 30. ఇందుచే సద్గురుని వర్ణనము గావించుట నాకశక్యమని తొలుతనే విన్నవించినాఁడను. "ఇక

జాలును. సద్గురువర్ణనము నాకు సాధ్యముకాదు" అని నుడువుటయే నేను గావించు గురువర్ణనము. అంతరస్థితమగు నెఱుకను అంతర్నిష్ఠుఁడె (అనుభవనీయుఁడె) యెఱుఁగును 31.

## ఐదవ సమాసము – సాధుస్తుతి.

పరమార్థమున కాశ్రయభూతులును మనుజులలో నిమిడియున్న జ్ఞానరహస్యమును వెల్లడిచేయువారునునగు సాధుసజ్జనులకు వందనము లొనరించెదను 1. దుర్లభమగు వస్తుసముదాయమేగాక పరమదుర్లభమగు బ్రహ్మముగూడ సాధుసంగమమున సులభసాధ్య మగుచున్నది 2. బ్రహ్మము ప్రకటితముగానే యుండునుగాని చూడఁదలంచినవారి కెవ్వరికి నది కాన్పింపదు. బహువిధములగు సాధనముల నొనర్చినను పెక్కు తెఱంగులఁ బరిశ్రమ మొనరించినను నది లభింపనేరదు 3. బ్రహ్మము నెఱుంగుటలోఁ బరీక్షకులగు విమర్శకులు సైతము మోసపోయిరి. ఇంతియేగాదు. మీఁదు మిక్కిలి కన్నులు గలవారలుసైతము గ్రుడ్డివారలై పోయిరి. మఱియుఁ బరబ్రహ్మమును జూచుచుఁజూచుచు సాధకులు తాము స్వయముగ నంతర్హితులైరి 4. పరబ్రహ్మమును దీపముతో వెదకి కనుఁగొనలేము. నానావిధములగు ప్రకాశముల సహాయముతో గురుతింపనేరము. నేత్రములం దంజనముబెట్టుకొని గాంచినను నయ్యది దృష్టిసమ్ముఖమున గోచరింపదు 5. ఇంతయేల షోడశ కళాభిరాముఁడగు పూర్ణచంద్రుని సాయముననఁగాని తీవ్రకళారాశియగు సూర్యుని తోడ్పాటునఁగాని పరబ్రహ్మమును గుర్తింపఁజాలము 6. సూర్యప్రకాశమునందు ఉన్నిలోనున్న రోమములనన్నింటిని గురుతింపవచ్చును. అణువులు, రేణువులు మున్నగు సూక్ష్మవస్తు సముదాయమునుగూడఁ గనుఁగొనవచ్చును 7. సూర్యుని వెలుఁగున నడిమికిఁ జీల్పఁబడిన వెంద్రుకయొక్క కొననుగూడఁ జూడవచ్చును. కాని పరమాత్మనిమాత్రము సందర్శింపఁజాలము. సాధుజనుల సత్కృప యొక్కటి సంపాదించితిమేని యావస్తువు తనంతన గోచరించును 8. పరబ్రహ్మవిషయమున సమస్తములగు నాక్షేపణలు సమాప్తినొందుచున్నవి. తార్కికులు పరబ్రహ్మములుగూర్చి తర్కించి తర్కించి మంద

మతులై పోవుచున్నారు 9. పరబ్రహ్మము గురుతించుటలో వివేకము సంకుచితమైపోవుచున్నది. కొనియాడుటలో శబ్దములు వెనుకడుగు వేయు చున్నవి. మనస్సునకుఁగల గమనశక్తియు దానినిజేరుటకుఁ జాలకున్నది 10. వేయిముఖములు గలవాఁడును గొప్పవాచాలుఁడునని పేరొందిన దిట్ట యగు నాదిశేషువునైతము పరబ్రహ్మను గొనియాడఁజాలక పూర్తిగా విసుగెత్తిపోవుచున్నాఁడు 11. వేదవిరహితమైన దీప్రపంచమునందేదియు లేదు. సమస్తమును వేదము ప్రకటితమొనర్చియున్నది. అట్టి వేదము నైతము ఇదమిత్థమని పరబ్రహ్మమును జూపనేరకున్నది 12. దుర్లభమగు నా బ్రహ్మపదార్థము సాధుసాంగత్యముననుు, వారల స్వానుభవకారణ మునను నెఱుకలోనికి వచ్చును. కాన నిట్టియోగ్యతగల సాధుసజ్జనుల మహిమవర్ణింప నాకు శక్యముగాదు 13. మాయకుఁగలశక్తి మిగులఁ జిత్రమైనదేగాని యదియు బ్రహ్మపదార్థము నెఱుంగుటకుఁ దోడ్పడ నేరదు. మాయాతీతమగు అనంతవస్తువునుగూర్చిన మార్గమును సాధు వులగు సజ్జనులే చూపఁదగినవారు 14. వర్ణింపనలవిగాని బ్రహ్మపదార్థము సాధుజనరూపమునఁ బ్రత్యక్షమగుచున్నది. ఇందుచే బ్రహ్మమువలె సాధు జనులును ననిర్వచనీయులు 15.

సాధుజను లానందమునకు మందిరములు. సత్యసుఖ స్వరూపులు. నానావిధానందములకు వారలు మూలభూతులు 16. వారు విశ్రాంతికి విశ్రాంతభూతులును తృప్తికిఁ దృప్తిస్వరూపులునై యున్నారు. ఇంతయేల, భక్తియొక్క పరిణామములే సాధుజనులుగ గోచరించుచున్నవి 17. ధర్మమునకు వారునికిపట్టులు. స్వరూపమునకు సత్పాత్రభూతులు. పుణ్య మునకుఁ బవిత్రమగు దేశములు 18. సాధుజనులు సమాధికి ఆటపట్టులు. వివేకమునకు భాండారస్వరూపులు. సాయుజ్యముక్తికి వారలు అధి ష్ఠానులు 19. ఇంతియగాదు సత్యమునకు నిశ్చయులుగను, సార్థకమునకు జయప్రదాతలుగను, ప్రాప్తికి సమయస్వరూపులుగను (సిద్ధరూపులుగను) సాధుజను లలరారుచున్నారు 20. సాధువులన మోక్షలక్ష్మీసమలంకృతు లగు శ్రీమంతులు. అసంఖ్యాకులగు నజ్ఞానజీవులను వారు ముక్తులుగఁ జేసిరి 21. సమర్థులును, ఉదారులును (అత్యంత దానశూరులును) నగు నితరమానవులు సాధుజనులవలె జ్ఞానరూపమగు ధనమును బ్రసాదింపఁ

జాలరు 22. ఎందఱో చక్రవర్తులు, మహారాజులు గతించిరి. ఇంక నెందఱో గతింపనున్నారు. కాని వీరలలో నెవ్వఁడును సాయుజ్యముక్తి నొసంగఁ జాలరు 23. మూఁడులోకములలోని యే ప్రాణియుఁ జేయఁజాలని జ్ఞానదానమును సాధుజను లొక్కరుమొగిఁ జేయుచున్నారు. ఇట్టి సాధు జనుల మహిమాతిశయము నెంతని వర్ణింపనేర్తును ? 24. మూఁడు లోకములకు నతీతమైనదియు శ్రుతులవలన నెఱుంగ శక్యముగానిదియు నగు పరబ్రహ్మము సాధుజనులకుఁ బ్రసన్నమైయుండుటచే సాధకుల కంతఃకరణములోనికిఁజేర నవకాశము గలుగుచున్నది 25. సాధుజనుల మహిమ యీ విధముగ నుండునని కొంచెము దెలిపినాఁడ. వారినెంతగఁ బ్రశంసించినను దక్కువయే. వారలవలననే ముఖ్యపరమాత్మ ప్రకటితమగు చుండును 26.



## ఆఱవసమాసము – శ్రోతలస్తుతి.

ఇప్పుడు భక్తులు, జ్ఞానులు,సాధువులు, సజ్జనులు, విరక్తులు, గుణ వంతులు, సత్యవాదులు నగు శ్రోతలకు వందనము లొనరించుచున్నాఁడను 1. శ్రోతలారా! మీరలు సత్త్వగుణమునకు సముద్రమువంటివారు. మఱియు బుద్ధివిశేషమునకు మందిరములు. శబ్దరత్నములకు గనులు 2. మీరు బహువిధార్థరూపమగు నమృతమును సేవించువారలును నిశ్చయు లగు పురుషులునై యుంటిరి 3. మీ ధారణ (స్మరణశక్తి) అంతులేనిది. ఈశ్వరాంశముతో మీరలవతరించిరి. మీరు ప్రత్యక్షదైవతములవలె నాసీనులై యున్నారు. ఇంతియకాక శ్రోతలారా! మీరలు శాంత స్వరూపులును, సత్త్వగుణవిశిష్టులునునగు ఋషీశ్వరమండలిగ గోచరించు చున్నారు. మీ కారణముననే సభామండలములందుఁ బరమ శోభ వ్యాపించుచున్నది 5. పరమాత్ముఁడు మీ హృదయ కమలములలోఁ బ్రకాశించుచున్నాఁడు. సరస్వతీదేవి మీ ముఖములందు మనోహరముగా విహరించుచున్నది. మఱియు సాహిత్యవార్తలను భావించుటలో మీరలు బృహస్పతివలెఁ గనుపించుచున్నారు 6. మీరలు పవిత్రతలో నగ్నిరూపులు. సంపూర్ణకిరణయుతులగు సూర్యభగవానులు, జ్ఞాతృత్వము

నందు మీా దృష్టియెదుట బ్రహ్మాండమొక లెక్కలోనిదిగాదు 7. అఖండ సావధానరూపులై మీారలు రాజిల్లుచున్నారు. మీారెల్లరు భూత భవిష్యద్వర్తమాన విషయముల నెఱుంగనగు దివ్యజ్ఞానసంపన్నులరు. ఇంతియగాక నిరంతరము మీారు నిరభిమానులుగ నాత్మజ్ఞానులుగ నున్నారు 8. మీా దృష్టియెదుటకు రానిదెద్దియును బ్రపంచమునందు లేదు. మీా హృదయములు ముఖ్యపదార్థమును (బ్రహ్మమును) లక్షిత మొనరించెను 9. నేను చెప్పఁబోవునదంతయు మీాకందఱ కింతకుమున్నె తెలియును. ఇఁక నిప్పుడు మీా ముందు జ్ఞాతృత్వాభిమానముతో నేనేమిచెప్పవలయునో దోఁచకున్నది 10. అయినను మీారలు గుణగ్రహణ పారీణులు. కావున సందేహరహితుఁడనై చెప్పుచున్నాఁడను. భాగ్యో పేతులగు నీ శ్రోతలు నామాటల నాలింపకపోరు 11. భాగ్యయుతులగు పురుషులు నిరంతరము దివ్యాన్నములఁ జవిజూచుచు మనస్సు మార్పు నొందుటకు ఒక్కొక్కప్పుడు శుష్కాన్నముగూడ నారగించుచుందురు. అటులే యీా నా ప్రాకృత భాషావచనములను (శుష్కాన్నమునువలె) సజ్జనులగు శ్రోతలు స్వీకరింతురుగాక 12. నా శక్తికొలఁది హృదయ పూర్వకముగఁ బరమేశ్వరుని నుపాసించుచున్నాఁడను. అటులని పర మాత్ముని పూజ బొత్తిగాఁ గావింపనేకూడదని నేనెందును జెప్పలేదు 13. అట్లే నేనొక వాగ్దుర్లభుఁడను (చెప్పుటకుఁ బూర్ణమగు శక్తిసామర్థ్యములు లేనివాఁడను). శ్రోతలారా! మీారు సత్యముగాఁ బరమేశ్వరులు. ఇఁక నిప్పుడు నా సరళరహితమగు వాక్కుతో మిమ్ములను బూజింప నభిల షించితిని 14.

పాండిత్యము, కళ, చతురత్వము, కావ్య ప్రబంధశక్తి, భక్తి,జ్ఞాన వైరాగ్యములు, వచనమాధుర్యము మున్నగు సల్లక్షణములు నాయం దేవియులేవు 15. నా వాగ్విలాసస్థితి యిట్టిది. అగుఁగాక. ఇపుడు నేనుఁ జెప్పఁదలంచినది ప్రసన్నతాపూర్వకముగా నివేదించెదను. ఏలయన జగ దీశ్వరుఁడు భావమునకె యాఁకలిగొనియున్నాఁడు 16. శ్రోతలగు మీార లందఱు ప్రత్యక్ష జగదీశ్వరమూర్తులు. మీా సన్నిధిలో నా పాండిత్య మెంతటిది. అల్పమతిని బుద్ధివిహీనుఁడనగు నేను మీాయెదుట సాహ సించుచున్నాను. ఈ ప్రపంచమునందు (సమర్థుని) పుత్రుఁడు మూర్ఖ

డై నను దనతండ్రియెదుట ధృష్టత్వము (తనపట్టును) నెరవేర్చెడిసామర్థ్యము వానికిఁగూడనుండును. దీనినే తెలిసికొని సాధుమూర్తులగు మీ సన్నిధిలో నేదియో చెప్పుటకు సాహసించుచున్నాఁడను 18. పెద్దపెద్ద పులులను, సింహములను జూచి ప్రజలు భయపడి పాఱిపోవుదురు. కాని యాజంతువుల పిల్లలా జంతువులముందు నిర్భయముగా నాటలాడుచుండును 19. అటులె సాధుజనుల దాసుఁడనగు నేను సాధువులగు మీ ముందేదియోఁ జెప్ప సాహసించుచున్నాఁడను. మీరలు నన్ను క్షమించితీరెదరని విశ్వసించుచున్నాఁడను 20. నిరర్థకముగాఁ దనవాఁడు భాషించునపుడు విజ్ఞుఁడాదరముతో సమర్థించుచుండును. అటులే నేను జెప్పుదానిలో నేదేని దోసఁగున్నచో మాఱాడక ఆ న్యూనతను బూర్తిజేయ గోరెదను 21. ఇది ప్రీతియొక్క లక్షణము. మనస్సు తనకుఁదానే లోపములను సవరించుకొనును. సాధుసజ్జనులగు నో శ్రోతలారా! మీరు లోకమునకుఁ దల్లిదండ్రులవంటివారు 22. నా భావములను హృదయమునందుంచుకొని యుచితమేదియో దాని ననుగ్రహపూర్వకముగ నొనర్పుఁడు. ఇకముందు రాఁబోవు కథయందు ధ్యానముంచుఁడని యీ దాసానుదాసుఁడు మిమ్ములనందఱను బ్రార్థించుచున్నాఁడు 23.

---

## ఏడవ సమాసము – కవీశ్వరస్తుతి.

కవీశ్వరులారా! మీకిపుడు వందనములొనరించుచున్నాఁడను. మీరలు శబ్దసృష్టికి స్వాములు. వేదరూపముతో నుత్పన్నులైన పరమేశ్వరులు 1. మీరలు సరస్వతీదేవికిఁ బ్రత్యక్షనిలయులు. సమస్తమగు కళలకు జీవనులు అంతియగాక నిజముగా బహువిధములగు శబ్దములకు మీరలు భువనములు 2. మీరలు పురుషార్థమునకు వైభవప్రాయులు. జగదీశ్వరుని మాహాత్మ్యమును, ఆ దేవుని నానావిధ లీలావిలాసములను, సత్కీర్తిని వర్ణనము గావించుటకై మీరలు నిర్మింపఁబడితిరి 3. శబ్దరత్నములకు మీరలు సముద్రములై ముత్యములకుఁ దెఱచిన చెఱువులై నానాప్రకారములగు బుద్ధి విశేషములకు నాశ్రయభూతులయి యుత్పన్నమైతిరి 4. ఆధ్యాత్మిక గ్రంథములకు మీరలు గనులు. మఱియు మాట

లాడనేర్చిన చింతామణులు. శ్రోతలను బ్రసన్నాత్ములఁ గావించుటలో గామధేను దుగ్ధధారలు 5. ఇంతియగాదు. మీరలు కల్పనమునకుఁ గల తరువులు. మోక్షమునకు ముఖ్యమగు నాధార స్తంభములు. కవులారా! సాయుజ్యముక్తియే బహురూపములతో నలరారు మీరుగాఁ బ్రకటన మైనది 6. ఇహలోకముననేగాదు మీరలు పరలోకమునకుఁగూడ ముఖ్యస్వార్థులు. యోగులకు రహస్య మార్గభూతులు. ఏలయన, మీరలు జ్ఞానులకుఁ బరమార్థరూపమగు గృహమునుగావించి ప్రసాదింప నవతరించితిరి 7. మీరు నిర్గుణ పరబ్రహ్మమూర్తులు. మాయనుండి వేరైన పరమాత్మ లక్షణ లక్షితులరు 8. మీరలు వేదమునకు నంతర్భావరూపులు. పరమేశ్వరుని యలభ్యభావములు. కాననే ఆత్మబోధము కవిరూపమున సులభసాధ్యమయ్యెను 9.

మోక్షాపేక్ష గలవారలకు మోక్షనిధిజూపుటకుఁ గవి యంజనము వంటివాఁడు. కవి సాధకులకు సాధనము. సిద్ధపురుషులకు సమాధానము. ఇందు సుంతయైన సందియములేదు 10. కవి స్వధర్మమున కాశ్రయభూతుఁడు. మనోనిగ్రహమునఁ గవి పెట్టినపేరు. ధార్మికభావమున వినయమున నెన్నఁదగువాఁడు. ఇంతియగాక వినయమునునేర్పు బోధకుఁడు 11. వైరాగ్యము రక్షించుటయందును భక్తసమూహము నలరించుటయందును బహువిధములగు స్వధర్మములను గాపాడుటయందును గవిని మించినవాఁడులేఁడు 12. ప్రేమించువారలకుఁ బ్రేమస్థితిగను, ధ్యానించువారలకు ధ్యానమూర్తిగను, ఉపాసకులపాలిటికిఁ గీర్తికాముఁడుగను నుండు కవీశ్వరుని మహత్త్వమెంతని పొగడఁగలను 13. కవుల మూలముననే సమస్తసాధనములు సమకూరుచున్నవి. నానావిధములగు ప్రయత్నములు కవుల కౌశలముల కతననే ఫలించుచున్నవి. ఇంతయేల ? మానవుల కార్యములు ఫలించుటకుఁ గవుల కౌశలమె ముఖ్యమగు కారణమై యున్నది 14. కవియొక్క వాగ్విలాసములకతన మనుజులకుఁ గవితా విషయికమగు ననన్యసాధ్యసంతోషము సమకూరుచున్నది. ఆతని కారణముననే కుశాగ్రబుద్ధులకుఁ గవిత్వముచెప్పఁగల శక్తిసంపద చేకూరుచున్నది 15. విద్వాంసులకు యోగ్యత కవులకతననే లభించుచున్నది. సామర్థ్యవంతులకు శక్తిప్రదాయకుఁడును, నేర్పరులకు నానావిధములగు

కౌశలముల ననుగ్రహించువాడును నగు కవిమహిమ గొనియాడ నేరి తరము ? 16. కావ్యప్రబంధములు, నానాప్రకారములగు ఛందస్సులు, గద్యపద్యభేదాభేదములు, పదప్రాసములు మున్నగు కవితాలక్షణములకుఁ గవిజనులే కర్తలు 17. కవులుసృష్టి కలంకారములు. లక్ష్మీదేవికి శృంగార విలాసములఁ బ్రసాదించు ధన్యులు. సకల కార్యసిద్ధులకు నిర్ధారణకర్తలు 18. సభలు కవులవలననే ప్రకాశవంతము లగుచున్నవి. భాగ్యభోగ్య ములకుఁ గవిరాజులే విభూషణములు. బహువిధములగు మానవసౌఖ్య ములకుఁ గవులే రక్షకులు 19. కవి లోకోద్ధారణమునకు దేవాంశముతో నుద్భవించినవాఁడు. ఋషులకంతటి యశోవిభవము మహత్త్వము గలుఁ గుటకుఁ గవులె కారకులు. బహువిధములగు శాస్త్రధర్మములు వాని వానిమహత్త్వములు సమన్వయించుటలోఁ గవినిమించినవాఁడు లేఁడు 20. కవియొక్క వ్యాపారమే (కావ్యరచనమే) లేకపోయినయెడల లోకోద్ధారణ మునకే యవకాశముఁ జిక్కదు. కావుననే కవిని సమస్తసృష్టికి నాధార భూతునిగాఁ జెప్పగల్గితిని 21. అపారములగు శాస్త్రములను జదివి వాని సారభూతమగు జ్ఞానముగడించుట కవులవలననే మానవజాతికి సిద్ధించినది. కవులవలననే బుద్ధిశాలురగు ధన్యులకు సర్వజ్ఞత్వము సమకూరుట తటస్థించుచున్నది 22. పూర్వకాలమునందు వ్యాసభట్టారకుఁడు వాల్మీ కులవారు కవులను గీర్తినొంది లోకోద్ధరణము గావించిరి. వారివలననే గదా జనులందఱకు జ్ఞానములభించినది 23. మొట్టమొదటనే కవులు గ్రంథ సముదాయమును రచించిరి. అందుచేతనే పాండిత్యము యోగ్యత జనులకు సిద్ధించినది. ఇంతయేల , కవులవలననే పండితులకుయోగ్యత లభించినది24. కవులయోగ్యత యీ విధముగా లోకోత్తరమైనది. కావుననే పూర్వు లలో మిగుల విఖ్యాతులై గొప్పకబ్బములు రచించిన మహాకవులకును, ఇపుడు కవిత రచించి కీర్తి గడించుచున్నవారికిని, ముందు వాఙ్మయ లోకము బాలింపనున్న భవిష్యత్కవి సముదాయమునకును నేను వంద నము లొనరించుచున్నాఁడను 25. పలుతెఱంగులఁ బేరొందిన నేర్పరి తనము లన్నింటికిని గవియే యాటపట్టు. కవిముఖమునుండి బహిర్గతములఁ గుటకు వేదములు శ్రుతులు నుత్సాహపడుచుండును గావునఁ బ్రత్యక్ష ముగా బృహస్పతియని కవిని బ్రశంసించుచున్నాఁడను 26. పరోపకారము

వలని ప్రశస్తిని సాటుటకుఁ గవులెన్నియో శాస్త్రవిహితములగు యుక్తుల నెఱింగించుచున్నారు. ఎట్టి సందియమునైన నివారించుటలోఁ గవులకుఁ గలశక్తి గొనియాడ నెంతవానికేని యశక్యము 27. ప్రపంచమునెడఁ బ్రసన్నత దాల్చుటకై యవతరించిన యమృతపూరితమగు మేఘరాజముగఁ గవిని సంభావింపనగును. నవవిధములగు రసములను బ్రవహించునటులఁ జేయుటలోఁ గవులు ప్రవాహముల వంటివారు. నానావిధములగు సౌఖ్యములను బ్రసాదించుటలోఁ గవులు పరిపూర్ణసరోవరములు 28. వివేకభాండారములు కవులుగా మనుష్యరూపమునఁ బ్రకటితమైయున్నవి. కవులన సమస్తవిధములగు విజ్ఞానములకు నునికిపట్టులు 29. సంసారులగు మానవులకుఁ బూర్వజన్మసంచితమగు సుకృతాతిశయమున లభించిన యుత్తమపదార్థముల శక్తిని ధరించి కవులీ లోకమున నవతరించిరి 30. కవులు ప్రజల కనేకవిధముల నుపకరించుకొఱకు అక్షయానంద పూర్ణమగు సుఖసౌకరూపమునఁ దరించుచున్నారు 31. వీరలు నిరంజనులు (పరబ్రహ్మమూర్తులు) లేదా వీరలు విరాట్పురుషుని యోగస్థితియైనఁ గావలయును. కాదుకాదు సత్యము నెఱింగితిని. వీరలు భక్తియోగమునకు ఫలశ్రుతిరూపమున ఫలించిన ధన్యులు 32. ఇప్పటి కీవర్ణనము చాలును. నిశ్చయముగాఁ గవులు లోకమున కాధారమూర్తులు. ఇందువలననే వారలకు హృదయపూర్వకముగ సాష్టాంగవందనము లొనర్చుచున్నాను.

---

## ఎనిమిదవ సమాసము — సభాస్తుతి.

ముక్తి సులభముగాఁ బడయుట కనుకూలించునదియు స్వయముగా సచ్చిదానందమూర్తియగు పరమాత్ముఁడు వసించు నెలవును నగు నీ సభలకు వందనముల నొనరించుచున్నాఁడను 1.

శ్లో॥ నాహం వసామి వైకుంఠే యోగినాం హృదయే రవా।
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద॥

“నేను వైకుంఠమునం దుండను. యోగుల హృదయమునందును నుండను. ఓ నారదమునీ! నాభక్తులు నన్నేస్థానమునందు గానము చేయుచుందురో యచ్చట నేను నివసించెదను.” అని భగవానుఁడు స్వయ

ముగాఁ జెప్పుచున్నాఁడు 2. అందువలననే యెచ్చట భక్తులు గానము చేయుచుందురో దానిని శ్రేష్ఠమగు సభయని చెప్పుదురు. ఎచ్చట ఈశ్వర నామోచ్చారణఁ జేయుటచే జనించిన కోలాహలము జయ జయాకారములతో గర్జింపఁబడుచున్నదో యదియే వైకుంఠము 3. ఎచ్చట ప్రేమాన్వితులగు భక్తావతంసుల గీతములును, భగవంతుని కథలును, హరికీర్తనములును, వేదవ్యాఖ్యానములును, పురాణశ్రవణము జరుగుచుండునో 4. పరమేశ్వరుని గుణానువాదము, అనేక నిరూపణములనుగూర్చిన సంవాదములు, ఆధ్యాత్మిక విద్యయొక్కయు భేదాభేదముల యొక్కయు మథనము జరుగుచుండునో యదియె సభయని చెప్పఁబడును 5. ఎచ్చట సాధకులకుఁ గలుగు సందియములు నానావిధములగు వాగ్విలాసములతో నివర్తి గావింపఁబడునో, యెచట సందేహవంతులు తృప్తినొందుదురో, యెచట నింపు లొలయుఁ జక్కని మాటలచే భగవానుని ధ్యానమూర్తి భక్తుల హృదయములో నివసించునో, యట్టి సభల పవిత్రత నెన్న నేరితరము? 6. ప్రేమాన్వితులు, భావుక భక్తులు, గంభీరశీలురు, సత్వగుణప్రధానులు నగు సభ్యులు రమ్యముగను రసయుక్తముగను బాటలఁ బాడెడు గాయకోత్తములు, నిష్ఠావంతులు, కర్మశీలురు, ఆచారశీలురు, దానశీలురు, ధర్మశీలురు, శుచిమానులు, పుణ్యశీలురు, అంతశ్శుద్ధులు, కృపాళురు, యోగులు, వీతరాగులు, ఉదాసీనులు, నియమకర్తలు, ఇంద్రియనిగ్రహులగు తాపసులు, విరక్తశీలురు, నిస్పృహులు, అరణ్యవాసులు, దండధారులు, జటాధారులు, నాథపంథులు, ముద్రాధారులు, బాలబ్రహ్మచారులు, యోగీశ్వరులు, పురశ్చరణులు, తపస్వులు, తీర్థావాసులు, మనస్వులు (మనస్సును స్వాధీనమున నుంచుకొన్నవారు) మహాయోగులు, జనస్థులు (జనసమానముగా లోకానుసారులై నడచువారు), సిద్ధులు, సాధులు, సాధకులు, మంత్రశోధకులు, ఏకనిష్ఠోపాసకులు, గుణగ్రాహులు, సాధుశీలురు, సజ్జనులు, విద్వజ్జనులు, వేదజ్ఞులు, శాస్త్రజ్ఞులు, మహాజనులు, బుద్ధులు, సర్వజ్ఞులు, విమలసమాధానకర్తలు, యోగులు, వ్యుత్పన్నులు (శాస్త్రాదిజన్య పరిజ్ఞానముగలవారు), ఋషీశ్వరులు, ధూర్తులు, తార్కికులు, కవీశ్వరులు, మనోజయముగల మునీశ్వరులు, దిగ్వల్కులు (దిశలే

వల్కలములుగఁ గలవారు), బ్రహ్మజ్ఞానులు, ఆత్మజ్ఞానులు, తత్త్వజ్ఞానులు, పిండజ్ఞానులు, యోగాభ్యాసులు, యోగజ్ఞానులు, సంగరహితులు, పండితులు, పౌరాణికులు, విద్వాంసులు, వైదికులు, భట్టులు, పాఠకులు, యజుర్వేదులు, ఉత్తమ మహాశ్రోత్రియులు, యాజ్ఞికులు, అగ్నిహోత్రులు, వైద్యులు, పంచాక్షరులు, పరోపకారులు, త్రికాలజ్ఞులు, బహుశ్రుతులును, నిరభిమానులు, నిరపేక్షులు, శాంతిశీలురు, క్షమాశీలురు, దయాశీలురు, పవిత్రులు, సత్యశీలురు, అంతఃపవిత్రులు, జ్ఞానశీలురు మున్నగాఁగల వివేకశాలురగు నీశ్వరసంబంధులగు భక్తులు వసించుతావును, సభానాయకుఁడు భక్తిభావముతో నానందించు ప్రదేశమునునగు సభయొక్క యలౌకికమహిమ నెంతని కొనియాడనేర్తును? 7-20. పరమార్థచింతనులగు జనుల సముదాయము భగవంతుని కథలఁ జెప్పుచు, నొకరు చెప్పుట నాలించుచు నెచట గాలము గడుపుచుండునో యచ్చట సహజముగాఁ బ్రజోద్ధరణ కార్యము (ప్రజలు తరించుట) జరుగుచుండును 21. సత్యము, ధైర్యము మొదలగు నుత్తమ గుణములుగల సత్వగుణశాలురు నివసించుతావున నెల్లప్పుడు సౌఖ్యము నిండియుండును 22. విద్యాసంపన్నులు, కళావేత్తలు, విశిష్టగుణయుక్తులు, సజ్జనులు, భగవదనుగ్రహపాత్రులు నెచట సమావేశమైయుందురో 23, ప్రవృత్తులు, నివృత్తులు, ప్రపంచ వ్యవహారదక్షులు, పారమార్థికులు, గృహస్థాశ్రములు, వానప్రస్థులు, సన్న్యాసులు మున్నగువారలును, బాలురు,వృద్ధులు, తరుణులు, పురుషులు, స్త్రీలు మున్నగువారలును నెచట నంతఃకరణమునఁ బరమాత్మని ధ్యానముఁజేయుచు నఖండనిష్ఠతో నుందురో యట్టి సభకు మఱల నొకమాఱు నమస్కరించెదను 24-25. పరమేశ్వరభక్తులును, చేతనులకు సందేహనివృత్తి గావించువారునునగు నుత్తములకు నావందనములు 26. నిత్యమును భగవంతుని గుణకీర్తనము ఎడతెగక జరుపఁబడు సభకు నమస్కరించుచున్నాఁడను 27. దేవతుల్యులగు సజ్జనులతోఁ గలసిమెలసి యుండువారలకు మోక్షము లభించితీరును. ఈ మాటలు నా స్వకపోలకల్పితములు గావు. మహానుభావు లగువారలనేకస్థలములలో గ్రంథములందుఁ జెప్పినవిమ్మె 28. తరింపదలచినవారలకుఁ బరమాత్మ గుణకీర్తనము మిగుల ముఖ్యమైనది. అది యెచట

జరుగునో యదియె శ్రేష్ఠమగు సభ. పరమాత్మునికథల నాలించుచున్న యెడల ననేకములగు దుస్సందేహములు తొలఁగిపోవుట సత్యము 29.

---

## తొమ్మిదవ సమాసము — పరమార్థస్తుతి.

ఇప్పుడు సాధకులకు ముఖ్యస్వార్థమగు నీ పరమార్థమును స్తుతించుచున్నాఁడను. పరమార్థయోగ మన్నిఁటికంటెను గొప్పది 1. ఇది యోచించిచూచిన సులభసాధ్యముగఁ గానిపించునుగాని సత్సమాగమమునందలి మర్మము నెఱుంగనివారల కిది మిగుల దుర్గమముగా నున్నది 2. పరమార్థమనఁ బ్రత్యక్షమగు పరబ్రహ్మసాక్షాత్కారము. పరమార్థమన ననేకసాధనముల ఫలములను అప్పిచ్చుటవంటిది (కాలాంతరమున ఫలప్రాప్తిలోనికి వచ్చును). పరమార్థము నెఱింగినవారలకు వేద శాస్త్రములసారము త్వరలో ననుభవమునకువచ్చును 3. (ఈ బ్రహ్మరూపమగు పదార్థము) ఉండుటకు నలుమొగముల నావరించి లోకమంతటను నిండియున్నదిగాని అణుమాత్రమేనియుఁ గాన్పింపకున్నది. లోకులు సన్న్యాసు లగుచున్నారేగాని యేకదేశీయతాకారణమునఁ బరమార్థమును బొందఁజాలకున్నారు 4. ఆకాశమార్గమునఁ బ్రయాణముచేయుట కనుకూలములగు రహస్యమార్గములు సమర్థులగు యోగులకే తెలియును. ఇతరుల కీరహస్యవిషయము సాధారణముగాఁ దెలియనేరదు 5. పరబ్రహ్మము (పరమార్థము) సారమునకుఁ గూడ సారభూతము. అది యఖండరూపముగ అక్షయరూపముగ అపారముగనున్నది. ఎన్నివిధముల నగచాట్లుపడినను చోరుఁడు దాని నెన్నటికిని దొంగలింపఁజాలఁడు 6. దానికి రాజభయముగాని, అగ్నిభయముగాని లేదు. ఆరణ్యజంతువుల వలని భయముగూడ లేదని చెప్పవలయునా? 7. పరబ్రహ్మము ఒకచోట నుండి మరియొకచోటికిఁ గదలునది గాదు. తనతావు నది యెన్నటికిని విడువదు. కాలాంతరములందుఁగూడ దానికి మారుపులేదు. మొదట నది యెటనున్నదో సర్వకాలసర్వావస్థలలోఁగూడ నచ్చటనేయుండును 8. చాలకాలము గడచిపోయినపిదపఁగూడ దానియం దెట్టిమార్పును గలుగఁబోదు. ఎక్కువతక్కువలు గలుగవు. దాని ముఖ్యతత్త్వ స్వరూపమును

గూర్చి యింతకెక్కుడు తెలుపఁ బనిలేదు 9. పరబ్రహ్మము అరుగదు. అదృశ్యమునొందదు. గురుఁడను నంజనముతోఁ జూచిననే యది కని పించును. లేకున్న నెన్నఁటికిని గనిపింపదు 10. పూర్వము సమర్థులని పేరొంది గతించిన యోగులకుఁగూడఁ బరమార్థమె ముఖ్య స్వార్థమైనది. ఇది పరమగుహ్యము. కావుననే దీనికిఁ బరమార్థమను పేరువచ్చినది 11. వెదకి చూచినవారలకె యీ పరమార్థము లభించినది. సిద్ధముగనుండినను నిది యితరులకు జన్మజన్మాంతరములదనుక లభింపలేదు 12. పరమార్థ మునకుఁగల యపూర్వమహత్త్వము నెంతని తెలుపఁగలను? దీనికి జన్మ మృత్యువులనునవి యెన్నఁటికి నంటుకొనవు. దీని సాహాయ్యమున సాయుజ్య త్వపదవి (పరబ్రహ్మములో లీనమయ్యెడుపదవి) వెంటనే లభ్యమగును గదా! 13.

పరమార్థవివేకమువలన మాయ దూరమగును. సారమునసారము నిర్ణయించు జ్ఞాన మలవడును. అంతఃకరణమునందుఁ బరబ్రహ్మజ్ఞాన ముదయించును 14. సర్వవ్యాపకుఁడగు పరమాత్ముని సంబంధమగు జ్ఞానముగలవాఁడై యీ బ్రహ్మాండమును జ్ఞానముచే దనయందు లయము గావించుకొను సాధకున కీపంచభూతముల క్రీడాదికములు తుచ్ఛముగా గానిపించును 15. పరమాత్మ వివేకము గలిగినంతమాత్రముననే యంతః కరణమునం దీ దృశ్యప్రపంచమంతయు మిథ్యగా గోచరించును. మఱియు నీ ప్రపంచము మాయయొక్క మోసపుఁదడికయని బోధపడును 16. అంతఃకరణమునందు బ్రహ్మస్థితి సమావేశముకాఁగానే సందేహములన్నియు బ్రహ్మాండమును దొలఁగి యావలికిఁ బోవును. కంటికగుపడు ప్రతివస్తు వుగూడ జీర్ణాతిజీర్ణముగను వికారముగను గనుపించును 17.

పరమార్థస్వరూపము ఇటులుండునని కొంచెము తెలిపితిని. పర మార్థమును గడింపఁదలఁచువారల కిదియె ముఖ్యమగు స్వార్థము. శ్రేష్ఠ మగు వస్తుసమూహములో నిదియె మిగుల శ్రేష్ఠమైనది. దీనిని వర్ణించుట యసాధ్యము 18. బ్రహ్మాదులకునైతము విశ్రాంతి లభించుచున్నది. యోగులు పరబ్రహ్మమునందుఁ దన్మయు (లీను) లగుచున్నారు 19. సిద్ధులకు, సాధుజనులకు, యోగులకుఁ బరమార్థము విశ్రమస్థానమై యున్నది. ఛివరకు సత్త్వగుణపూర్ణులగు జడపురుషులకుఁగూడ బర

మార్థము సత్సాంగత్యముకతన నెంతయు సులభసాధ్యమైయున్నది 20. పరమార్థమె మానవ జీవితమునకు సార్థకము. పరమార్థము మానవులను సంసార సాగరమునుండి యుద్ధరించునకుఁ జేర్చును. పరమార్థము ధార్మికులను శ్రేష్ఠమగు పుణ్యలోకమునకుఁ జేర్చును 21. తపస్వులకుఁ బరమార్థమె ముఖ్యమగు నాశ్రయము. సాధకులకుఁ బరమార్థమే యాధారము. పరమార్థము భవసాగరమునకుఁ బారమును జూపించును 22. పరమార్థవిదుఁ డెవఁడో యాతఁడె రాజు. పరమార్థము నెవఁడు గడింప జాలకున్నాఁడో యాతఁడె నిజమైన బిచ్చగాఁడు. ఇట్టి లోకోత్తరము పవిత్రమునగు పరమార్థమునకు ఉపమానమును దేనితో నీయఁగలను? 23. బహుజన్మసంచితమగు పుణ్యఫలము ప్రోగైనయపుడె మానవుఁడు పరమార్థి యగును. అంతియగాక పరమాత్మానుభవప్రాప్తి నొందును 24. పరమార్థము నెఱింగిన మానవుని జీవితము సర్వవిధముల సార్థకమైనదని తలంపనగును. పాపులగు నన్యమానవులు కులక్షయము గావించుటకే జనించిరి. పరమాత్మునిఁ బ్రాప్తింపక సంసారసంబంధమగు జంజాటములతో నుండు మూర్ఖుని ముఖమును గూడఁ జూడఁగూడదు 25. పరమార్థసేవనము గావించి శరీరమును సార్థకముచేయుటయు హరిభక్తితోఁ దన్నె గాక తన పూర్వులనుగూడ నుద్ధరించుటయు సత్పురుషుని విధి 26.

## పదియవ సమాసము — నరదేహస్తుతి.

ఈ నరదేహమునకు ధన్యవాదము ధన్యవాదము. పరమార్థము సాధకులకీ నరదేహము వలననే లభించుచున్నది 1. ఈ నరదేహము ధరించినకారణముననే కొందఱు మానవులు భక్తిలో లీనమైరి. కొందఱు పరమవిరక్తులై గిరికందరములలోఁ బరమార్థచింతనులై వసించుటకీ నరదేహమే కారణమైనది 2. కొందఱు నిర్వ్యాసంగులై తపముగావించుచున్నారు. ఇంకఁ గొందరు మహామంత్రములను బురశ్చరణము నొనరించుచున్నారు. మరికొందఱు నిష్ఠావంతులై భగవంతుని యఖండనామమును దలంచుచుఁ గాలము గడుపుచున్నారు 3. కొందఱు తపము గావించుచున్నారు, కొందఱు యోగములం దభినివేశము సంపాదించి సాధనము

గావించుచున్నారు. కొందఱు వేదాధ్యయనము నొనరించుచు శాస్త్ర వివేకము సంపాదించి జ్ఞానానంద మనుభవించుచున్నారు. ఇందఱిన్ని విధములఁ దరించుమార్గములను వెదకుకొనుట యీ నరదేహసహాయమునఁ గాన నెంతని దీనిని బొగడఁగలను? 4. ఒకఁడు హఠయోగము నభ్యసించి దేహము నత్యంతకష్టముల పాలొనరించుచున్నాఁడు. మరియొకఁడు భావబలముతోఁ దీవ్రముగా యత్నించి పరమాత్ముని సన్నిధికిఁ జేరుచున్నాఁడు 5. ఒకఁడు లోకములో నింతవాఁడులేఁడను ప్రఖ్యాతినిగడించి మహానుభావుఁ డయ్యెను.ఇంకొకఁడు సుప్రసిద్ధుఁడగు భగవద్భక్తుఁడని కీర్తిని గడించెను. ఇంకొకఁడు సిద్ధుఁడుగమారి యాశ్చర్యకరముగా నాకాశమున సంచారము గావించుచున్నాఁడు 6. భగవానుని యనంత తేజములో నొకఁడు తేజముగా లీనమైపోయినాఁడు. ఒకఁడు జలములో జలముగాఁ గలసిపోయినాఁడు. ఒకఁడు చూచుచుండఁగనే వాయుస్వరూపమునందుఁ గలసి యదృశ్యుడై పోయినాఁడు 7. ఇంద ఱిన్ని విధముల నతిలోకమహిమ జూపుట కీనరదేహమే గదా హేతువు. మానవులలోఁ గొందరు ఒక దేహముతోనుండి సుంతలో ననేకదేహములను ధరించుచున్నారు. కొందరు చూచుచుండఁగనే యదృశ్యమై పోవుచున్నారు. కొందరొక స్థలమునఁ గూర్చుండి యాసమయముననే యనేకస్థానములలోనను, సముద్రములందును భ్రమణముగావించుచున్నారు 8. కొందరు మంత్రిశక్తిని వశీకరణమొనరించుకొని పెద్దపులి, సింహము మున్నగు భయానకజీవములపై నాసీనులై ప్రయాణము గావించుచుందురు. కొందరు అచేతనములగు వస్తువులను ప్రాణుల నడిపించునటుల నడిపింతురు. కొందరు తపోబలముచే నగ్ని నుత్పత్తిజేసి చచ్చినవారలను గాల్చివేయుదురు 9. కొందరు జ్వలించుచున్న అగ్నిహోత్రము నార్పివేయుచున్నారు. కొందరు నిండుకొనియున్న జలము నింకించుచున్నారు. కొందరు జగమునంతటను నిండి నిబిడముగానున్న ప్రాణవాయువును నిరోధించుచున్నారు. ఇదియంతయు వారికి నరదేహమహత్వముననేగదా సమకూరినది 10.

ఎందఱెందఱో హఠయోగనిగ్రహులు, నిశ్చయశీలురు, బహువిధసిద్ధులను గైవసము గావించుకొనిన సిద్ధాత్ములు గతించిరి 11. వీరలె గాదు, మనోనిగ్రహము గావించిన ధన్యుఁడు, వాచాసిద్ధుఁడైన సుకృతా

త్ముఁడు, అల్పసిద్ధినొందిన కృతార్థుఁడు, సర్వసిద్ధులను గడించిన పుణ్యాత్ముఁడు మొదలగు మహానుభావు లెందరో నానావిధముల విఖ్యాతి గడించి సిద్ధులై గతించిరి 12. నవవిధములనొప్పు భక్తిరూప రాజమార్గమునఁ బ్రయాణముగావించి పరమార్థమును గడించిన సుకృతు లెందరో లోకమునఁ గలరు. అటులే యోగులలోఁ గూడ రహస్య మార్గమున బ్రహ్మలోకము జేరిన మహానుభావు లెందఱో యున్నారు 13. సాధకులలో వైష్ణవుఁడై విష్ణులోకమునకు, బ్రహ్మస్వరూపుడై సత్యలోకమునకు, శివ స్వరూపియై కైలాసమునకుఁ జేరినవార లెందరోగలరు14. నరదేహధారులలో నింద్రలోకమున కింద్రులైనవారును, పితృలోకమునకరిగి పితృస్వరూపులైనవారును, తారకాసదనమునందుఁ దారకలైనవారును, క్షీరసాగరమునఁజేరి క్షీరసాగరశాయిగ మాఱినవారలును బలువురు గలరు 15. కొందఱు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను నాలుగు విధములగు ముక్తులను గోరికదీర ననుభవించుచున్నారు. ఇదియంతయు నరదేహమహత్వముననే సమకూరినది 16.

అసంఖ్యాకులగు సిద్ధులును, సాధువులును, సజ్జనులును దమతమ హితమును సాధించిన దీ నరదేహమహత్వముననె. ఇట్టి మానవదేహ మహత్వము నెంతని కొనియాడగలను 17. ఈ మానవదేహసహాయమునగు నానావిధములగు ధనములను దానము గావించుటవలనను సారాసార విచారణము గావించుటచేతను అనేకులు ముక్తులైనటుల మనము విని యున్నారము 18. ఈ మానవసేవ దేహసంబంధముననే. పలువు రుత్తమ లోకములను బడయఁ గలిగిరి. మఱియు నహంభావమును విడచినంతనె సానందముతో సౌఖ్యము లొందగల్గిరి 19. మానవదేహము నొందిన పిదపనే చేతనులకందఱకు సంశయములు నశించుచున్నవి. మఱియు నుత్తమ గతులుకూడ చేకూరుచున్నవి 20. పశుదేహముతో నెట్టియుత్తమగతి నేని సాధింపఁజాలమని మనమందఱ మెఱింగినసంగతియె. పరలోకము లభించుటకు మానవదేహము సర్వవిధముల సహాయపడుచున్నది 21. ప్రాణు లీ నరదేహ సహాయముననే సజ్జనులుగను, మహాత్ములుగను, ఋషులుగను, మునులుగను, సిద్ధులుగను, సాధువులుగను, సమాధానులుగను, భక్తులుగను, ముక్తులుగను, బ్రహ్మజ్ఞానులుగను, విరక్తులుగను,

యోగులుగను, తపస్వులుగను, తత్త్వజ్ఞానులుగను, యోగాభ్యాసులుగను, బ్రహ్మచారులుగను, దిగంబరులుగను, సన్న్యాసులుగను, షడ్దర్శనులుగను (షడ్దర్శనములు సాంఖ్యము, యోగము, నైయాయికము, వైశేషికము, మీమాంస, వేదాంతము), తాపసులుగను మారిరి 22-23. ఇందువలననే నరదేహము మిగుల శ్రేష్ఠమైనదనియు నన్నిదేహముల కంటె నెక్కువైనదనియుఁ దెలిసికొనగల్గితిమి. మానవదేహమూలముననే యమలోకమునఁ గలుగనున్న యాతనలు తొలఁగిపోవుచున్నవి 24. నరదేహము మానవునకు సర్వవిధముల స్వాధీనములోనుండునది. ఇతర జీవుల కళేబరములవలె మానవదేహము పరాధీనమైనదికాదు. కాన నీ దేహమునుఁ బరోపకారమునఁ బ్రవేశపెట్టి కీర్తిరూపమున దాని నుజ్జీవింపఁ జేయుటకు బ్రతిమానవుఁడును యత్నింప నగును 25. గుఱ్ఱము, ఎద్దు, ఆవు, బఱ్ఱె మున్నగు ననేకవిధములగు పశువులును, స్త్రీజనము, దాసీసమూహము మొదలగువాని నొకవేళ యజమానులు దయఁదలచి బంధమునుండి విడిచిపెట్టినచో మఱల నెవరోయొకరు వానిని దప్పక పట్టుకొనిపోయి తీరుదురు 26. కాని యీ మానవదేహ మట్టిదిగాదు. ఇది తన యిచ్ఛననుసరించి యుంచుకొనవలయునన్న నుండును. వలదన్నఁ దొలఁగిపోవును. దీని నెవ్వరును గట్టివేయఁజాలరు 27. నరదేహ మొకవేళ కుంటిదైనచో లేక గూనిదైనచోఁ బరోపకారమునం దుపకరింపఁ జాలదు 28. అదియొకవేళ గ్రుడ్డిదైనచో నెందులకుఁ బనికిరాకపోవును. లేదా చెవిటిదైనచో భగవత్కథలను గూర్చిన సిద్ధాంతములను వినఁజాలదు 29. మానవదేహము మూఁగదైనచో నెదుటివారికిఁ దన సంశయము దెలుపుటకుఁగాని తానెఱిఁగిన ధర్మము పరులకుఁ దెలిపి సందేహనివృత్తి గావించుటకుఁగాని వీలుండదు. అశక్తముగను రోగవంతముగను నుండి చెడిపోయినచో నట్టి మానవదేహ మెందులకుఁగాక వ్యర్థమగును 30. అటులఁ గాక వివేకహీనమైనను వ్యాధ్రోగముగలదైనను నిశ్చయముగ నట్టిదేహము సర్వవిధముల బనికిమాలినదిగా నెఱుంగవలయును 31.

ఇంతకును దేలిన సారమేమనఁగా — ఇట్లు ఆధివ్యాధి సంబంధమగు లోపములులేక యారోగ్యవంతముగానుండు దేహమును శీఘ్రముగా సాధకుఁడు పరమార్థమార్గమునందుఁ బ్రవేశపెట్టవలయును 32.

శరీర మన్నివిధముల నారోగ్యవంతముగానుండి స్వాధీనములోనున్న తరుణమునందుఁ బరమార్థమునఁ బ్రవేశపెట్టని మూర్ఖులు తప్పక మాయా జాలమునందు బద్ధులయ్యెదరు 33. మంటిగృహముల నా మూర్ఖులు తమవిగ భావించుచుందురు. కాని యీ గృహములపైఁ దమకున్న దానికంటె నెక్కువ యధికార మితర ప్రాణులకున్నదని వారెఱుంగరు 34. ఎలుకలు, పందికొక్కులు, ఈఁగలు, సాలెపురుగులు, బిళ్లపురుగులు, చిమటలు, తేళ్లు, పాములు, బల్లులు, నల్లికండ్లపాములు, చీమలు, ఈల పురుగులు మొదలగునవి యన్నియు నీ యింటిని దమవిగాఁ దలంచు చున్నవి 35—38. ఇటులె పిల్లి, కుక్క, ముంగిస, దోమ, నల్లి, మిణ్ణల్లి, గోమారి మొదలగు జీవిసమూహము దీనిని తమయింటిగనే భావించు చున్నవి 39-43. పశువులు, దాసీజనము, ఇంటిలోని మనుష్యులు నీ గృహ మును దమదని యెంచుకొనుచున్నారు 44. చూడవచ్చినవారలును, మిత్రులునుగాక గ్రామవాసులుగూడఁ బ్రసంగమునం దీగృహమును దమ దనియే చెప్పుచుందురు 45. దొంగవాఁడు ఈ యిల్లు నాదనును. ఈ యింటిపై నున్న యాజమాన్యమంతయు మాదెయని రాజుచెప్పును. ఇది మనయిల్లు లెమ్ము భస్మము గావింతమని అగ్నిహోత్రుఁడు నుడువు చుండును 46. ఈవిధముగా నందరు ఇల్లు తమదెయని నుడువుచుందురు. మూర్ఖులగు మానవులుగూడ నిల్లు మాదెయని పలుకుచుందురు. కాని యెద్దియేని యాపద వచ్చినపుడు మా యిల్లు మా యిల్లు అనుకొన్న మమకారము క్షణములో మటుమాయమగును. మీదుమిక్కిలి యపాయభయమున నన్నివిధములఁ బ్రీతిపాత్రమగు గృహమును వాస యోగ్యమగు దేశమునుగూడ విడిచి మానవులు పారిపోవుదురు 47. కొంతకాల మిటుల గృహత్యాగము దేశత్యాగము గావించి తిరిగి చేర రాకున్నయెడల నూరంతయుఁ బాడువడు. ఇండ్లన్నియుఁ గూలిపోవును. అరణ్యజంతువు లాగృహములలో స్వేచ్ఛగా విహారముఁ జేయు చుండును 48. చీమలు, జెఱ్ఱులు, ఎలుకలు మున్నగు జీవసముదాయ మున కిదియె గృహము. ఇందు సందియము కొంచెముగూడ లేదు. పాప మీ మూర్ఖమనుష్యు లిన్నివిధముల నాది నాదియని కొట్టుకొన్న గృహ ములను వదలిపోవుచుందురు 49. ఇండ్లయొక్కదశ యీవిధముగా స్వల్ప

భోగ్యముగా మిథ్యగా నున్నది. ఇది యనుభవపూర్వకముగా నెఱింగి చెప్పుచున్నమాట. రెండుదినముల జీవితము ఎచ్చటగడిపిన గడుపవచ్చును. ఎందేని యుండవచ్చును 50.

ఒకవేళ నీ దేహమును మనది యనుకొందుమేని యదియు బొసఁగ కున్నది. ఏలయన, నిది యనేక జీవులకొఱకు భగవంతుఁడు నిర్మించి యుండునని తలంచుట కవకాశములు గలవు. పేలు మానవుల మస్తక ములపయి గృహముల నిర్మించి యందు వసించి రక్తమాంసములను జవి జూచుచున్నవి 51. రోగగ్రంథు లన్నింటియందును మనకు గానరాని విధ మున నెన్నియోపురుగు లంటిపెట్టుకొని కాపురము చేయుచుండును. అదియుగాదు. దేహమున నెందేని గాయము కలిగినయెడలఁ గొలఁది కాలములో నందు బురుగులు పడును. ప్రాణుల యుదరములలోఁగూడ జంతు సముదాయ ముండును. ఇది యందరు సామాన్యముగ నెఱింగిన యంశమె 52. దంతములలోఁ, గన్నులలోఁ, జెవులలో బురుగులు పడు చుండును. అటులే యొక కీటకవిశేషము (బగ్ధి) మాంసములోనికిఁ జొర బడి కఱచి తినుచుండును 53. మిణ్ణల్లులు కఱచి రక్తమును దనివితీఱఁ గ్రోలుచుండును. ఒక కీటకవిశేషము (కిలేని) మాంసములోనికి జొచ్చును. దోమ ఉన్నటులుండి బాగుగా గఱచి పారిపోవును 54. జోరీగలుఁ కంది రీగలు మానవుని గుట్టి పలుతెఱంగులఁ పీడించును. కారు దోమలు రక్తమును బీల్చి త్రాఁగుచుండును. తేలు కుట్టియుఁ బాము కఱచియు నానావస్థలఁ బెట్టుచుండును 55. జననమొందినది మొదలుగా దేహమును మనము పలు తెఱంగులఁ గాపాడుచున్నారము. ఆకస్మికముగా నీ దేహ మును బులిదీసికొనిపోయి భుజించును. లేదా తోఁడేలు ఒంటరిపాటునఁ బైఁబడి చంపి భుజించును 56. ఎలుకలు, పిల్లులు మానవుని దేహమును గొరికి తినుచుండును. గుక్కలు, గుఱ్ఱములు మాంసమును దినివేయును. తమజోలికిఁ బోకున్నను జంపుదురని వెఱచి తమంతనఁ బయిఁబడి మెలుగు బంట్లు కోఁతులు చంపివేయును 57. ఒంటె నోటితోఁ బట్టుకొని పైకెత్తి నేలపైఁ బడవేయును. ఏనుఁగు చిక్కినయెడలఁ గనికరింపక తొండముతో రెండుగాఁజీల్చి దేనిపై నేని వేసి మోఁది చంపివేయును. ఎద్దు హఠాత్తుగాఁ బయిఁబడి వాఁడి కొమ్ములతో గ్రుమ్మి చంపివేయును 58. దొంగ

బడితెతో లెక్కలేనన్ని దెబ్బలు గొట్టును. భూతములు భయపెట్టి చంపివేయును. ఏవిధముగాఁజూచినను ఈ దేహమునకుఁగల యవస్థ యీ విధముగా నున్నది 59.

ఈ మానవదేహము నాది నాది యని మరియుదుముగాని నిజమునకిది యొక్కరి సొంతసొమ్ముగాదు. బాగుగ యోచించినచో అనేకులకుఁ జెందియున్నది. అయినను మూర్ఖులీదేహము నాది నాది యని చెప్పుకొనుటలో సిగ్గుపడకున్నారు. కాని *తాపత్రయములలో నీ శరీరము జీవులన్నిటికి నమ్మడిగ భుజింపఁదగిన ఫలాహారవస్తువని చెప్పఁబడి యున్నది 60. దేహమునకుఁగల దురవస్థ గమనించి పరమార్థమునందుఁ బ్రవేశపెట్టినయెడల నప్పుడు తప్పక సార్థకమగును. లేనియెడలఁ బైని పేర్కొనినవియు నింక మనమెఱుంగరానివియు నగు నవస్థలచే మృత్యుముఖమునఁబడి వ్యర్థమైపోయి తీరునని గమనింపుఁడు 61. ప్రపంచ సుఖములయందు మగ్నులై యుక్తాయుక్త జ్ఞానశూన్యులగు మానవులీ మానవ దేహములవలని ప్రయోజనముగాని పరమార్థముగాని యెఱుంగఁజాలరు. ఇట్టి మూర్ఖుల లక్షణములు సంగ్రహముగా ముందుఁ జెప్పబోవుచున్నారము.

ఒకటవ దశకము సమాప్తము.



* మూఁడవదశకము 6, 7, 8 సమాసములలో తాపత్రయమును గూర్చిన వివరములు చెప్పఁబడినవి.



# రెండవదశకము.

## మొదటి సమాసము — మూర్ఖలక్షణము.

ఓం గజాననా! త్రినయనా!* ఏకదంతా! నీకు వందనముల నొన రించుచున్నాఁడను 1. తొలిపలుకులను గన్నతల్లీ! నలుమోముల వేలుపు గారవముననఁగన్న నిసువా! శారదాదేవీ! నీకును వందనముల నొనరించు చున్నాఁడను. అనుగ్రహశాలినీ భారతీ! పూర్ణమగు వాత్సల్యముతోఁ గనికరించి నాహృదయమున నివసింపుమని వేఁడుచున్నాఁడను 2. నాగురు మూర్తి పాదపద్మములను గనులకద్దుకొని నమస్కరించి నా యిష్టదైవ మగు రఘురాముని దివ్యనామమును మనసార స్మరించి మూర్ఖలక్షణ ములను జెప్పుచున్నాఁడను 3. మూర్ఖులు రెండువిధములుగా నుందురు. ఒకతెగవారు సాధారణమూర్ఖులు. రెండవతెగవారు చదివిన మూర్ఖులు. ఇరువురి లక్షణములు చిత్రవిచిత్రముగానుండును. వీనినిగూర్చి శ్రోతలు చక్కఁగ విచారణముగావింపఁగోరెదను 4. చదివిన మూర్ఖుల లక్షణములు ముందురానున్న సమాసములలో వివరించెదము. బుద్ధిమంతులగు శ్రోత లారా! సావధానమనస్కులరై రాఁబోయెడి కథాంశము నాలింపఁ గోరెదను 5. మూర్ఖలక్షణము లన్నింటిని గడముట్ట నుడువఁదలంచితినేని, దాని కంతముండదు. అవి యనంతములు. కావున వానిలోఁ గొన్నింటిని మాత్రమే సంగ్రహించి నివేదించెదను. ధ్యానపూర్వకముగా వినవల యును 6. మూర్ఖులనెవరో తెలుపుట యవసరము. ప్రపంచసుఖమగ్నులై సారాసారముల విచారింపని మానవులును, ఆత్మజ్ఞానమన నేమియో కొంచెమేని యెఱుంగనివారును, పూర్తిగ నజ్ఞానదశయందున్నవారును మూర్ఖులని తలంచి వారల లక్షణములను దెలుపుచున్నాఁడ 7.

---

* త్రినయన పదము వినాయకునకు విశేషణముగఁ జెప్పఁబడెను.

కడుపారఁగన్నతల్లిని, శ్రేయోవృద్ధుల నారయుచుఁ బెంచిన తండ్రిని సాధింపఁదలంచువాఁడును, స్త్రీనిమాత్రమే మిత్రునిగనమ్మి యితరులయెడ నవిశ్వాసిగాఁ బ్రవర్తించువాఁడును నొకవిధమగు మూర్ఖుఁడు 8. తన కుటుంబసంబంధముగల చుట్టపక్కములతోఁగల చుట్టరికము ద్రెంచుకొని యాఁడుదానికి లోఁబడి జీవితమును గడుపువాఁడును, ఆఁడుదాని కవి యివి యనక రహస్యముల నన్నింటిని దెలియఁజేయువాఁడును మూర్ఖుఁడు 9. కులకాంతనువిడిచి పరస్త్రీపయి మరులుగొని దానితో మెలంగువాఁడును, దన యిల్లు వాఁకిలి తల్లి దండ్రులను విడనాడి భార్యతో నత్తవారియింట వసించువాఁడును, గన్యయొక్క కులశీలములను గొంచెమేని విచారింపక పెండ్లియాడు నాతఁడును మూర్ఖుఁడు 10. సర్వవిధములను సమర్థులగు నుత్తమపురుషులతోఁ బగఁబెట్టుకొని సాధింపఁదలంచుటయు, అట్టి గొప్పవానితోఁదాను నన్నివిధముల సమానుఁడనని మిథ్యాభిమానముతో నెంచుటయుఁ, దన యశక్తిని దాను గురుతింపక తనకెంతయో శక్తియున్నటుల నెదుటివారిముందు నటించుటయు మూర్ఖలక్షణములు 11. తననుగూర్చి పలువురిముందుఁ దానే కొనియాడుకొనుటయు, నెంతటికష్టములువచ్చినను స్వదేశమును విడువక కూపస్థకూర్మము వలెఁ బడియుండుటయుఁ, బనిలేనిపనిగ మా పూర్వులంతవారు ఇంతవారు అంతచేసిరి ఇంతచేసిరని కొనియాడుటయుఁగూడ మూర్ఖలక్షణములె 12. కారణములేనిదే పకపక నవ్వునాతఁడును, పెద్దలుచేయు సదుపదేశముల భావమును గ్రహింపనేరని యాతఁడును, బహుజనద్వేషముతో వర్తించు నాతఁడును మూర్ఖుఁడు 13. తనవారల నందఱను విడిచిపెట్టి పరులతో స్నేహము జరుపువాఁడును,రాత్రులయందుఁ బరుల కపకారములుచేయుట కెంతేని సాహసించువాఁడును మూర్ఖుఁడు 14. చాలమంది మనుజు లొక చోటచేరి మేలుకొనియుండి యిష్టాగోష్ఠితోఁ గాలముగడుపునపుడు వారి మధ్యఁజేరి నిదురబోవుటయు, రెండవవాఁడు పిలిచినదే తడవుగా నతనింటి కేగి పరిమితిలేకుండ భుజించుటయు 15, తనమానము అవమానమును బలువురిముందు వెల్లడించుటయు. ♦ సప్తవ్యసనములలోఁ దగులుకొని

♦ జారణము, మారణము, విధ్వంసనము, వశీకరణము, స్తంభనము, మోహనము, ఉచ్చాటనము ఇవి సప్తవ్యసనములు.

యుక్తధర్మము నెఱుంగకుండుటయు 17, ఎవఁడో తన్నుద్ధరించునను దురాశతోఁ దన ప్రయత్నమునంతయు మాని తీరి కూర్చుండుటయు, ఆలస్యము చేయుటయందే సంతోషము కలదని కార్యనిర్వాహణమునం దలసత చూపుటయు మూర్ఖుని లక్షణములు 18.

ఇంటికడ నిటుల మాటలాడవలయును, ఈ యుక్తితో జయింప వలయునని యోచించి సభలోనికి వచ్చినంతన వణకుచేతను, భయము చేతను నొకమాటయేని పలుకఁజాలక సిగ్గుపడిపోవుటయుఁ, దనకంటె నుత్తముఁడగువానితో నతిసీచమగు సంబంధముఁ గలుగఁజేసికొని వర్తించు టయు, క్షేమార్థియై యెవఁడేని సదుపదేశము గావించినయెడల నది చెడుపుగా మనస్సులోఁదలంచుటయు 19, తాను జెప్పినది విననివాని కేది యేని నేరుపఁ బ్రయత్నము గావించుటయుఁ, బెద్దలకడఁ దాను జ్ఞానవంతు డనిపించుట కేదేదియో వదరుటయు, ఉత్తమశీలురగు యోగ్యులను మోసముచేయుటయు మూర్ఖుని లక్షణములు 20. విషయోపభోగముల ననుభవించుటలో సిగ్గునొందకుండుటయు, మరియాదనువిడిచి నిరంకుశ ముగాఁ బ్రవర్తించుటయు 21, రోగమువచ్చినపుడు తగినమందును బుచ్చు కొనకుండుటయు, దేహతత్త్వము ననుసరించి బథ్యపానములు జరుపక పోవుటయు, అనాయాసముగా సమకూర్చినపదార్థము గైకొనకుండుటయు మూర్ఖలక్షణములు 22. వెంటమనుష్యులను సహాయముగా నుంచుకొనక పరదేశములలోఁ బ్రయాణము చేయుటయుఁ, బరిచయము లేనివానిని వెంటనుంచుకొని సంచరించుటయు, నదీకూలముల (బురద)యందు దుము కుటయు 23, దనను గౌరవించుతావున కదేపనిగాఁ బలుమారుపోవుటయు, మానాభిమానములనుగూర్చి యజాగ్రత్తగ మెలంగుటయు మూర్ఖుల లక్షణములు 24. ధనవంతుఁడగువానిని సేవకునిగా నుంచుకొని వాని కనుసన్నలలో సంచరించుటయు, నెల్లప్పుడు పాపభూయిష్ఠమైన హృదయ ముతో సంచరించుటయు 25, కారణకార్యముల సంబంధములు బాగుగా విచారింపక యపరాధములేనిదే శిక్షగావించుటయు, స్వల్పవిషయమున లోభిత్వము బ్రకటించుటయు 26, దేవతలను బితృదేవతలను బూజింప మియు, శక్తిలేకున్నను వాగ్బలము జూపుటయు, వ్యర్థముగాఁ గోలా హలము గావించుటయు 27, ఇంటివారలపై మాటిమాటికిఁ బటబటపండ్లు

కొఱుకుటయు, బాపమొనరించి యావల దీనత్వమునుఁ బ్రకటించుటయు, వెంగలితనమున నొడలెఱుంగమియు మూర్ఖలక్షణములు 28. నీచజాతులతో స్నేహముచేయఁదగదు. పరుని భార్యతో నెంతయవసరమున్నను మాటలాడఁగూడదు. ఆహారపదార్థములను భుజించుచుఁ ద్రోవలోనడువఁ జనదు 29. పరుల కుపకారముజేయుటలో శక్తియున్నంతలోఁ బాటుపడవలయును. తనకు మేలుజేసినవాని కెన్నఁటికిని గీడుచేయరాదు. చేయునది కొద్దిగను జెప్పునది గొప్పగా నుండకూడదు. ఇట్టి సామాన్యనీతుల నెఱుంగని యాతఁడొకమూర్ఖుఁడు 30. క్రోధమును విడవలేకపోవుటయు, నదేపనిగ నధికముగాభుజించుటయు, సోమరితనముతోనుచితానుచితములు మఱచి పడియుండుటయుఁ, బాపకార్యములు ఆచరించుటయు, మనస్సునందుఁ గుటిలచింతతో నుంటయు, ధైర్యము ననునది మందునకేని లేకుండ సంచరించుటయు మూర్ఖలక్షణములు 31. విద్య, వైభవము, ధనము, పురుషార్థము, సామర్థ్యము, మానము లేకయే వృథాభిమానమున నేనన్నింటికేని సమర్థుఁడనని విఱ్ఱవీగువాఁడు 32, నీచుడు, అసత్యవాది, మోసగాడు, దుష్కర్మ లొనరించువాఁడు, కుటిలుఁడు, వంచకుఁడు, ద్రోహి, నిరంతరము నిదురబోవువాఁడు గూడ మూర్ఖుఁడె 33. మిగుల నెత్తైన స్థలమునఁజేరి వస్త్రమునువిడిచి కట్టుకొనుటయు, నాలుగు త్రోవలు గలియు (శృంగాటకము) చౌతురాయందుఁ గూర్చుండుటయు దిగంబరుఁడై యెల్లప్పుడు సంచరించుటయు మూర్ఖలక్షణములు 34. దంతములుపాచితోడను, నేత్రములు పుసితోడను, ముక్కులు చీమిడితోడను, వస్త్రములు మురికితోడను, పాదములు మంటితోడను నుంచుకొని పరుల కసహ్యముగా సంచరించువాఁడును 35, వైధృతి, వ్యతీపాతము మున్నగు నిషేధముహూర్తములయందుఁ బ్రవాసము గావించుటకు బయలుదేరువాఁడును, అపశకునములు గలిగినను లక్ష్యపెట్టక మూర్ఖించి ప్రయాణముచేసి యాత్మహత్యాతుల్యముగ నపాయములకుఁ బాల్పడువాఁడును 36, క్రోధము, అవమానము, దుర్బుద్ధి మున్నగువానికి లోనై తన జీవితమును దాను సర్వవిధముల వ్యర్థము గావించుకొనువాఁడును, నిశ్చలము, దృఢతరమునగు బుద్ధి లేనివాడును 37, దనయెడఁ బ్రేమజూపువారలలో నంతఃకలహములు గూర్చువాఁడును, అట్టివారి తోడ్పాటునఁ

దానొందినసుఖములను బల్లె త్తి పలుకనివాఁడును, నీచజనులకు వందనముల నొనరించువాఁడును మూర్ఖుఁడు 38. తననుదాను బహుభంగుల సంరక్షణము గావించుకొనుచుండుటయు, శరణాగతుల ననాదరభావముతోఁ జూచుటయు, అశాశ్వతమగు సంపదలు కలకాలముండునవి యని తలంచి విఱ్ఱవీగుటయు 39, ఈభార్యయు నీ బిడ్డలే నన్నుద్ధరించువారు ఎవరితో నేమిపని యని దేవునియెడ భక్తిభావము ప్రకటింపమియు 40, భగవదిష్ట మెటులున్నదో కార్యఫలమటులుండునను సంగతి నెఱుంగకపోవుటయు మూర్ఖలక్షణములు 41. స్త్రీలకుఁ బురుషులకంటె భగవంతుఁ డెనిమిది రెట్లు కామమును గూర్చియున్నాఁడు (స్త్రీణామష్టగుణాః కామాః) కావున నొక స్త్రీ కొక పురుషుఁడే చాలఁడు అట్టియెడ నుచితమెఱుంగక బహుభార్యలతో విహరించువాఁడును 42, దుర్జను మాటలకతన మర్యాదతొలఁగి వర్తించువాఁడును, బట్టపగటనే కనులమూసికొను వాఁడును, ప్రత్యక్షముగాఁ జూచుచున్న మంచివిషయములపై ధ్యాన ముంచనివాఁడును మూర్ఖుఁడు 43. దేవత, గురువు, తల్లి, తండ్రి, బ్రాహ్మణుఁడు, యజమానుఁడు మున్నగు పూజ్యులయెడ ద్రోహము దలంచువాఁడును 44, ఇతరుల దుఃఖమును దన సౌఖ్యముగాఁ దలంచు వాఁడును, గడచిపోయిన పదార్థములు క్రమ్మఱ రాఁజాలవని యెఱింగియు వానికై శోకించువాఁడును మూర్ఖుఁడు 45. ఆదరము లేనితావున వాయెత్తి మాటలాడరాదు. అడుగకమున్నె సాక్ష్యము జెప్పఁదగదు. నింద్యములగు వస్తువులను గైకొనరాదు 46. ఉత్తముల మహాత్త్వమును దగ్గించి చెప్పఁ గూడదు. సన్మార్గమును విడచి సంచరింపవలదు. దుష్కర్ములతో సహ వాసము జేయుట యుచితముగాదు. ఈ నీతిమార్గముల నెఱుంగనివాఁడు మూర్ఖుఁడు 47. సత్యమును దరికి రానీయరు. నవ్వుల కితరులను బరి హాసము లాడుచుందురు. ఇతరుఁడు నవ్వినంతన తగవునకుఁ దలపడెదరు 48. అనవసరముగా నెంతయో గోల గావింతురు. పనిలేనిపనిగ నార్భాటము లొనర్తురు. నోటికిఁ దాళములుబిగించిరేమో యనునటులఁ బల్లెత్తి యొక పలుకేని పలుకఁబోరు 49. మంచివస్త్రములు ధరింపకున్నను శాస్త్ర జ్ఞానములేకున్నను సభలో ముందుఁగూర్చుందురు. జ్ఞాతులయెడ విశ్వాస ముంతురు. ఇట్టివారలందరును మూర్ఖులనియే నా మతము 50.

దొంగవానితోఁ దనకుఁగల పరిచయము బహిరంగము చేయువాఁడును, కంటికి కింపైన వస్తువు నెచటనైన నొకమారు చూచినచో నదియె తనకుఁగావలయునని తలంచువాఁడును, క్రోధాతిశయమున నోడ లెఱుంగక తనకుఁదా నహితము గావించుకొనువాఁడును 51, హీనజనులతో స్నేహము సంభాషణము జరుపువాఁడును, ఎడమచేతితోఁ దినుచు నెడమచేతితో జలముద్రాగుచు నుండువాఁడును 52, సర్వసమర్థుఁడగు వానితోఁ బగఁగొని యోరువలేనితనము ప్రకటించువాఁడును, అలభ్య వస్తువునకై పరితపించువాఁడును, తన యింటిలోఁ దాను దొంగతనము చేయువాఁడును మూర్ఖుఁడు 53. జగదీశ్వరుని మఱచి మానవునిపయి విశ్వాసముంచువాఁడును, జీవితమును సార్థకముగావింపకయే బ్రతికినంత కాలము గడిపి మరణమునకు సిద్ధమైనవాఁడును 54, దనచెలికాండ్రయెడఁ గల దొసఁగులు లోపములు బహిరంగము చేయువాఁడును, సంసారము నందలి దుఃఖములను సహింపనోపక యీశ్వరుని నింద గావించు వాఁడును 55, కొద్దిపాటి తప్పునకేని క్షమించుట యనునది యెఱుంగని వాఁడును, తన తేజమును మాటిమాటికిఁ జూపుటకుఁ దివురువాఁడును, విశ్వాసఘాతకుఁడై సంచరించువాఁడును మూర్ఖుఁడు 56. చిరకాలము నుండి తన్ను గౌరవించు సమర్థుఁడగుపురుషు నగౌరవించి యాతనియాదరణ మునకు దూరమైనవాఁడును, తన రాకడచే సభకు వివర్ణము నాపాదించు వాఁడును, క్షణములోఁ బ్రసన్నశీలుఁడుగను, క్షణములోఁ గోపస్వభావుఁడు గను వర్తించువాఁడును 57, చిరకాలమునుండి యున్న సేవకుని దొలంగించి క్రొత్తవానిని నియమించువాఁడును, సభలలో నెవరేని నాయకత్వము నొసంగకున్నను నాయకత్వము వహించి నలువురిలోఁ బరిహాసపాత్రుఁడగు వాఁడును మూర్ఖుఁడు 58. అవినీతితో ధనమును గూడఁబెట్టుటయు, ధర్మమును నీతిని న్యాయమును దొలంగి సంచరించుటయు, వెంటనుండెడి మనుష్యులను వేఱుగావించుటయు 59, నింటియందు సుందరియగు భార్య యుండిననుఁ బరస్త్రీగమనముఁ గావించుచుండుటయు, బలువురి యెంగిలిని భుజించుటయు 60, ధనమును విస్తారముగా సేకరింపఁ బ్రయత్నముచేయు టయు, నితరులధనము నెటులేని హరించుటలోఁ గృషిచేయుటయు, హీనులగువారితో నిచ్చిపుచ్చుకొనుచు వ్యవహరించుటయు 61, అతిథికిఁ బని

పాటలుజెప్పి శ్రమ కలుగఁజేయుటయు, కుగ్రామమునందు నివాసమొన రించుటయు, ఎల్లప్పుడు విచారముతోఁ గాలము గడుపుటయు మూర్ఖుని లక్షణములు 62. నీటియందుఁ బుక్కిలించి యుమ్మివేయుటయుఁ, గాలి పయి జిలపుట్టినపుడు వేఱొకకాలితో గోకుకొనుటయు, హీనకులజాతునకు సేవకుఁడుగా నుండుటయు, రెండుచేతులతో నొకేమాఱు తల గోకుకొను టయు 63, ఇద్ద ఱేకాంతముగా నేదియో మాటలాడుకొనునప్పుడు మూఁడవవాఁడుగా వారిమధ్యజేరి ప్రసంగమునందుఁ బాల్గొనఁ బ్రయ త్నము చేయుటయు 64, స్త్రీకిని బాలునకును నోరానించి యెంగిలి సోఁకించుటయుఁ, బిచ్చివానికడకుఁ బోయి కూర్చుండుటయు, మరియాదను విడనాడి కుక్కను బెంచుటయు మూర్ఖునిలక్షణములు 65. పరస్త్రీలతోఁ గలహము గావించుటయు, నోరులేనిజంతువుల నకారణముగాఁ గొట్టి బాధించుటయు, మూర్ఖులతోడ సహవాసము జేయుచుండుటయు 66, దూరముగా నిలిచియుండి వినోదముగ యుద్ధరంగములను గాంచు చుంటయు, దాని నాపివేయించుటకుఁ బ్రయత్నింపకుండుటయు, సత్య మును మరుగుపఱచి యసత్యమును గౌరవించుటయు మూర్ఖుని లక్షణ ములు 67. ఐశ్వర్యము వచ్చినపిమ్మట పూర్వపుఁ బరిచయము పూర్తిగా మరచిపోవుటయు, దేవతలమీఁదను బ్రాహ్మణులమీఁదను దనయధికారము నిలువంబెట్ట యత్నించుటయు 68, దనయవసరమునుబట్టి పనియున్నంత వఱకు నెదుటివానియొద్ద వినయవిధేయతలు ప్రకటించుటయు, నితరులకు సాయముచేయవలసినప్పుడు తిరుగఁబడుటయు 69, చదువునపు డక్షరము లను విడిచి వేయుటయు, లేనివి కలిపిచదువుటయుఁ, బుస్తకముపై దృష్టి నుంచకుండుటయు మూర్ఖుని లక్షణములు 70. స్వయముగా నెప్పుడును జదువకపోవుటయు, ఇతరులను జదువనీయకపోవుటయు, గ్రంథముల నెప్పు డును బదిలముగా సంచిలో గట్టియుంచుటయుఁ గూడ మూర్ఖలక్షణము లని నా తలంపు 71.

మూర్ఖుని లక్షణము లెట్టులుండునో కొంతవఱకుఁ దెల్పితిని. వివేకశాలియగు మనుజుఁడు ఈ లక్షణములను శ్రద్ధతోఁ దెలిసికొని మనస్సులోఁ బెట్టుకొనును 72. ఇంక నెన్నియో మూర్ఖలక్షణములు గలవుగాని త్యాగము గావించుటకు ( విడచిపెట్టుటకు ) అనువైనవానిని

మాత్రమే నా శక్తికొలంది తోఁచినంతలోఁ జెప్పితిని. శ్రోతలు మన్నించి గ్రహింపఁవేఁడెదను 73. ఉత్తమలక్షణములకు మానవులు ప్రయత్నింపవలయును. మూర్ఖలక్షణములు తమయెడ నున్నచోఁ ద్యాగము గావింపవలయును. వచ్చెడి సమాసమునందు ఉత్తమ లక్షణములు వివరింపఁబడినవి 74.

## రెండవ సమాసము – ఉత్తమ లక్షణము.

శ్రోతలారా! సావధానమతితో నాలకింపుఁడు. ఇపుడుత్తమ లక్షణములను వివరింపఁ బోవుచున్నాను. సర్వజ్ఞత యే గుణములవలన నలవడునో వానిని దెలిసికొనుట యవసరము 1. అడిగి తెలిసికొనకయె క్రొత్తమార్గమునఁ బ్రయాణము చేయరాదు. గురుతింపకయే ఫలమును భుజింపరాదు. పడియున్న పదార్థము నాలోచింపక వెంటనే గ్రహింపఁ జనదు 2. మిక్కిలిగా వాదము లాడరాదు. కడుపులోఁ గపట ముంచు కొనరాదు. బాగుగా విచారింపక తొందరపడి పని చేయరాదు. కుల హీనురాలగు స్త్రీని బెండ్లియాడఁగూడదు 3. అడుగనిదె చెప్పుట తగదు. అనాలోచితముగ మర్యాదాహీనముగ సంచరింపఁగూడదు 4. ప్రీతి తనపయి లేనితావున నిష్ఠురములఁ బలుకరాదు. దొంగవానితో నాకును నీకును బరిచయమున్నది సుమా యని భాషింపరాదు. రాత్రులయం దొంటరిగాఁ ద్రోవలో నడువవలదు 5. మనుజులతోఁ నడఁకువ ద్రెంచి భాషింపఁజనదు. పాపపు ద్రవ్యము సమకూర్పఁజనదు. పుణ్య మార్గము నెన్నంటికిని విడనాడరాదు 6. ఒరులపయి నింద మోపరాదు. అటులెఁ బగ దాల్పఁజనదు. దోసమేదియేని తనయెడ నున్నచోఁ దెలిసికొని తొలగించుకొనవలెను. పరధనమునుగాని పరస్త్రీనిగాని బలత్కారముగా హరింపరాదు 7. ఉపన్యాస మధ్యమున వక్త నాక్షేపింపరాదు. ఏకత్వ మును (ఐకమత్యభావమును) ద్రెంచివేయరాదు. ఏమైననుసరియే విద్యా భ్యాసము విడువరాదు 8. నోటి దుడుకుతనము గలవానితోఁ దగవులాడ రాదు. వాచాలునితో (వాగుబోతుతో) మిక్కిలిగ భాషింపరాదు. సాధుజనుల సాంగత్యమును విడువఁజనదు 9. క్రోధమును మిగుల వహింప

రాదు. ప్రేమించువారిలో నంతఃకలహములు గలుగఁజేయరాదు. హితము బోధించినయెడల దానిని జెడ్డగాఁ దలంపరాదు 10. మాటి మాటికిఁ గోపింపరాదు. అసత్య పురుషార్థములగు కథాదికమును గల్పించి బహిరంగపఱుపరాదు. తాను జేయనిపనిని జేసితినని పరాక్రమప్రకటనఁ జేయరాదు 11. చేసిన ప్రతిజ్ఞ నెన్నఁటికిని మఱచిపోకుము. సందర్భము వచ్చినపుడు సామర్థ్యమును జూపుటలో వెనుకడుగు వేయఁబోకుము. వ్యర్థముగఁ బెద్దలగువారలను దిరస్కరించి వారల నొప్పింపకుము 12. ఆలస్యముజేయుటలో సుఖమున్నదని తలంపకుము. ఇతరులపయిఁ గొండెముల నాలింపఁబోకుము. బాగుగా విచారింపని దేవనినేని గావింపఁ బోకుము 13. శరీరమునకు సుఖము నలవాటుజేయకుము. పురుషునకుఁ బ్రయత్నత్యాగము తగనిపని. కష్టములకు నెన్నఁడును భయమునొందకుము 14. సభలో సిగ్గునొందకుము. అర్థములేని వదరుబోతుతనమును వెల్లడింపకుము. ఏమైనను గానిమ్ము పేచీమాటలు, నొప్పించుమాటలు నుడువకుము 15. మిక్కిలిగఁ జింతిలకుము. ఆలస్యమున కలవాటు పడకుము. పరస్త్రీలను బాపబుద్ధితో సందర్శింపఁబోకుము 16. ఎవరి వలననేని యుపకారమును గైకొనకుము. ఉపకారము నొకవేళఁ గైకొంటి వేని దానికిఁ బ్రతికృతిని జేయుము. ఇతరులకు విచారము గలుగఁజేయకుము. విశ్వాసఘాతకుఁడ వనిపించుకొనఁబోకుము 17. అపరిశుభ్రముగా నుండకుము. మురికిబట్టలను ధరింపకుము. పోవుచున్నవారలను మీరెచటికేగుచుంటిరని యడుగఁబోకుము 18. పదుగురిలోఁ గలసిమెలసి యుండుము. అందఱకు మంచివాఁ డనిపించుకొనుము. స్వల్పఫలము నాశించి పరాధీనుఁడవు కాఁబోకుము. నీ భారము నితరులపైఁ బెట్టకుము 19. పద్దువ్రాయుట, వ్రాసినపద్దు తెలియఁజేయుట లేకుండ ఇచ్చిపుచ్చుకొను వ్యవహారము జరుపకుము. నీచునివద్దనుండి ఋణమును దీసికొనకుము. తగిన సాక్ష్యము లేనిది తగవు తీర్పుమని రాజసమ్ముఖమునకుఁ బోకుము 20. అబద్ధపు మాటలను జెవిఁ జేరనీయకుము. పలువురొక్కవిధముగాఁ జెప్పుచున్నమాటను గల్లయనకుము. ఆదరణము లేని స్థలమునఁ గొంచమేని మాటలాడకుము 21. మత్సరమునకుఁ గ్రోధమునకు నీ హృదయమునందుఁ దావొసంగకుము. అన్యాయము గనిపింపదేని యెవరికినిబీడఁ

గూర్పకుము. శరీరబలము అభిమానము పురస్కరించుకొని యవినీతికర ముగాఁ బ్రవర్తింపకుము 22. మిగుల భుజింపకుము. మిక్కిలి నిదురింపకుము. కొండెములఁ జెప్పువానితో నీకు సంబంధమున్నచోఁ ద్వరలో ముగించు కొనుము 23. నిన్ను గూర్చి నీవేమేని సాక్ష్యము నొసంగకుము. నీ కీర్తిని నీవే కొనియాడఁబోకుము. స్వయముగా నీవొకమాటచెప్పి నవ్వకుము 24. ధూమపానము జేయకుము. మత్తువస్తువులను సేవింపకుము. వాగుబోతు వానితోఁ జెలిమి గావింపకుము 25. పనిలేకుండ నుండకుము. నీచవాక్య మును సహింపకుము. కష్టములేక లభించిన యన్నమును బెద్దలు పెట్టిన దైనను దినకుము 26. నోటినుండి యెన్నడును దిట్టుమాటలను రానీయ కుముః. ఇతరులయెడఁగల లోపములను గమనించి పరిహసింపకుము. కులముగలవాని విషయమున నీ హృదయమందు దుష్టభావమునుంచ కుము 27. ఎవరివస్తువునేని దొంగిలింపకుము. మిగుల లోభభావముతో మెలంగకుము. నిన్నుఁ బ్రేమించెడివారితో నెట్టి క్లిష్టపరిస్థితులయందేని పోరాటమునకుఁగాని, కలహమునకుఁగాని దిగకుము 28. ఎవనికిని శ్రమ కలుగనీయకుము. అసత్యపు సాక్ష్యమును దీసికొనకుము. ఎప్పుడును గల్లల నాదరింపఁబోకుము 29. దొంగతనము చేయుటకును, గొండెములఁ జెప్పుటకును నలవాటు పడకుము. పరకాంతలఁ గూడకుము. చాటున నుండి యితరుల కెట్టి యపకారమునేని కావింపకుము 30. సమయము వచ్చినపుడు తెగువ గలవాఁడవు కమ్ము. ఏమైనఁగానిమ్ము ధైర్యము నెన్నటికిని విడువఁబోకుము. సత్త్వగుణము వదలకుము. వైరినేని శరణు జొచ్చినయెడల దండింపఁ బాల్పడకుము 31. అల్పమగు ధనమును జూచు కొని మదోన్మత్తుఁడవు గాకుము. హరిభక్తుఁడనని చెప్పుటలో సిగ్గుపడ కుము. పవిత్రాత్ములగు నుత్తములచెంత నమర్యాదగాఁ బ్రవర్తింప కుము 32. మూర్ఖునితో నెట్టిసంబంధమునేని కలుగఁజేసికొనకుము. చీఁకటిలో నెవరిపయినేని చేయివేయకుము. పరధ్యానముగానుండి జాగ్రత్తతొలంగి నీ వస్తువు నెచటనేని మఱచిపోవకుము 33. స్నానము, సంధ్య లోనగు నిత్యకృత్యములను విడువకుము. కులాచారములను వదల కుము. అనాచారములను వ్యాపింపఁజేయకుము 34. హరికథల నాలించు టలోఁ దనివినొందకుము. శాస్త్రనిర్ణయములను జవదాటకుము. ప్రపంచ

సుఖములలోఁ దగుల్కొని పరమార్థమునెడఁ బెడమొగ మిడ బోకుము 35. కులదేవతలపయి భక్తివిశ్వాసములను దొలంగఁబోకుము. స్వధర్మము నెన్నఁడేని విడనాడకుము. విచారింపక వెఱ్ఱిపట్టుదలతో నీ యిష్టమువచ్చినటులఁ బనిపాటల నొనరింపకుము 36. నిర్దయాభావము నవ లంబింపకుము. జీవహత్యకెన్నఁడు దొరకొనకుము. మేఘమావరించియుండు టఁజూచి దూరప్రయాణము గావింప వెలుపలకుఁ బోకుము. చెడ్డసమయ ములలో (తిథి వార నక్షత్రాదు లనుకూలముగ లేనపుడు) ప్రవాసము నకుఁ బోకుము 37. సభాభయము దరిజేర నీయకుము. సమయము వచ్చి నపుడేమైనఁ గానిమ్ము ప్రత్యుత్తరము నిచ్చుటలో జంకకుము. ఎదుటివాఁడు ధిక్కరించినంతన పిఱికివై లోఁబడకుము 38. యోగ్యుఁడగు గురూత్తముని నిర్ణయించుకొని కడతేర యత్నింపుము. నీచజాతివానిని మాత్రము గురు వుగాఁగైకొనబోకుము. వైభవమునుజూచి మురిసి జీవితము శాశ్వతమని విఱ్ఱవీగకుము39. సత్యమార్గమును విడనాడకుము. అసత్యమునందు దృష్టిని బోనీయకుము. అసత్యము నెట్టితరుణమునందేని యభిమానింపఁ దలంప కుము 40. అపకీర్తి గలిగినచో నది పోగొట్టుకొన యత్నింపవలయును. సత్కీర్తిని మంచికార్యము లొనరించి వృద్ధినొందింపవలయును. వివేక ముతో బాగుగా విచారించి సత్యమార్గమేదియో దానిని గనిపెట్టి నిశ్చల బుద్ధితో ననుసరింపుము 41. ఇట్టి యుత్తమ గుణముల నలవరచికొనని వాఁడు అవలక్షణుఁడు. అట్టివానిని లక్షణములు ముందు సమాసములో వివరింపఁబడును.



## మూఁడవసమాసము – కువిద్యాలక్షణము.

శ్రోతలారా! మీ కిపుడు కువిద్యాలక్షణముల నివేదించుచున్నాఁ డను. శ్రద్ధతో నాలింపుఁడు. అతిహీనములగు కులక్షణములు తమయెడ నున్నచో వానిని విడచుటయే త్యాగము. విసర్జనీయములగు నాయా దుర్లక్షణములను విడచినవాఁడే త్యాగి 1. కువిద్యావంతుఁడగు మానవుఁడు లోకమునజనించి యెంతహానిగావించెనో రాఁబోవు లక్షణముల గమనించితి రేని మీకే తెలియఁగలదు 2. కువిద్యావంతుఁడగు ప్రాణి కఠినరూపణ మునకు భయపడిపోవును, ఏలయన వాఁడు దుర్గుణములన్నింటికి రాశి 3.

* శ్లో॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥
(భగవద్గీత ౧౬-౪)

కామము, క్రోధము, మదము, మత్సరము, లోభము, దంభము తిరస్కారము, గర్వము, విరుగుబాటు, అహంకారము, ద్వేషము, వివాదము, వికల్పము (అవాంతరకల్పనము), ఆశ, మమత్వము, తృష్ణ, కల్పనము, చింత, కామనము (కోరిక), భావన (తలంపు), ఈర్ష్య, అవిద్య, ఓరువలేమి, వాసన, అసంతృప్తి, ఆసక్తి, ఇచ్ఛ, వాంఛ, సందేహము, నింద, అవినీతి, కృతఘ్నత, నిరంతరమదోన్మత్తత, అన్నియుఁ దెలియునను దురభిమానము, అవజ్ఞత, విపత్తి, ఆపద, దుర్వృత్తి, దుర్వాసన, స్పర్థ, కలహశీలత, తంపెలమారితనము, ఉద్వేగము,ఆందోళనము కలుగజేయుట, తిరుగుబాటు తనము నివియన్నియుఁ గువిద్యావంతునకుఁ గలుగు పరమ వ్యథలు 4 — 7. కువిద్యావంతుఁడగు ప్రాణి వికారస్వరూపుఁడుగను, సకల దుర్లక్షణములకు నాటపట్టుగను, శక్తిహీనుఁడుగను, దుర్జనుఁడుగను, దరిద్రుఁడై కృపణుఁడుగను నుండును 8. వాఁడు సోమరిపోతుతనమున దొలుత గణింపఁదగినవాఁడు. తిండిపోతుతనమున వానిని మించిన వాఁడుండఁడు. దుర్బలుఁడై యున్నను గ్రోధగుణమును విడువఁడు. తుచ్ఛ గుణములకు నెలవుగానుండి యెదుటివారిని క్షణములో వలలోన వేసికొనును 9. ఇంతియగాదు మూర్ఖులలో వాఁడు మొదటివాఁడు. కయ్యములుపెంచి వినోదించుచుండును. వెట్టివాఁడుగ నన్నృతవాదిగ వదరుబోతుగ నోటిదుడుకుడుతనము గలవాఁడుగ నుండును 10. కువిద్యావంతుఁడు తాను స్వయముగా మంచియుఁ జెడ్డయు నెఱుంగఁడు. వినదగిన మాటలు పెద్దలెఱింగించినయెడల వినఁడు. స్వయముగా వానికేమియుఁ దెలియదు. ఇతరులవద్దకుఁబోయి నేర్చుకొనడు. సొంతముగా నిర్వహింపఁ బోఁడు. అభ్యాసదృష్టితో నూతనవిషయములు గమనింపడు 11. జ్ఞానహీనుఁడును, నమ్మదగనివాఁడును, వితండవాదము గావించువాఁడును, ఎదుటివానిపై లేనిదోషముల నారోపించువాఁడును, స్వయముగా భక్తియందు

* దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పరుషత్వము, అవివేకము ననునివి అసురసంపత్తిని బుట్టినవానికి గలుగుచున్నవి.

లగ్నముగాని యాతఁడును, భక్తులఁజూచి యాదరింపనివాఁడును కువిద్యావంతులని యెఱుంగనగును 12. ఇతరులను నిందజేయువాఁడు, కష్టవర్తనముతోఁ గాలయాపనము గావించువాఁడు, ఇతరులను హింసించువాఁడు, నిరంతరము విచారమగ్నుఁడై యుండువాఁడు, క్రూరకర్మము లొనరించువాఁడు కువిద్యావంతుఁడు 13. హీనత్వముగ మెలంగుట, లేనివి కల్పించుట, రోగముతో నెల్లపుడు మూలుగుచుండుట, దుష్కార్యము లాచరించుట, లోభిత్వముగా నుండుట, అధర్మముగా సంచరించుట మున్నగు దుర్వృత్తులలో సంబంధము గలుగఁజేసికొనుటయు 14, అన్నివిధముల హీనజన్ముఁడయ్యు నెదుటివారిముందు విరుగుబాటుతనము గనపఱచుటయు, దప్పుడు ప్రమాణములకుఁ దాను పెట్టిన పేరయ్యు బయటికి శ్రీరంగనీతులు చెప్పుటయు, దాను బుద్ధిహీనుఁడు, వివేకహీనుఁడు నయ్యు నెదుటివారికి నీతులు గఱపుటయుఁ గువిద్యావంతుని లక్షణములు 15. నీచుఁడును, ఉన్మత్తస్వభావుఁడును, పనిపాటలులేక యుండువాఁడును, తిరుగుబోతును పిఱికిపందయునై యుండియు బరాక్రమవిషయిక సంభాషణములు గావించువాఁడును 16, వయస్సునఁ జిన్నవాఁడయ్యు గరువమునఁ బెద్దలకంటెఁ గూడఁ బెద్దవాఁడును, విషయాసక్తుఁడును, నష్టుఁడును, ఇతరుల ద్వేషించువాఁడును నియమాదులఁ బాలించుటలో విభ్రష్టుఁడైనవాఁడును కువిద్యావంతుఁడని తెలిసికొనవలయును 17. అతిశయమగు నభిమానభావము గలవాఁడుగనుండి సిగ్గుపడనియాతఁడును, ఋణములపాలుజేసి సంసారమును గూలఁద్రోచినవాఁడును, దుష్టవర్తనుఁడును, డంబములు పల్కుటలో నగ్రేసరుఁడును, ముందువెనుకలు విచారింపక యేపనియేని గ్రుడ్డివానివలెఁ గావించువాఁడును కువిద్యావంతుఁడు 18. ఇతరుల మనస్సు నొచ్చునటుల మాటలాడరాదు. వికారముగ బ్రవర్తింపరాదు. ఎదుటివాఁడొనరించిన మేలు మఱువజనదు. అనృతము లాడగూడదు. తాను సకలదుర్లక్షణములకు నిలయమయ్యు నుత్తములగు నెదుటివారిని ధిక్కరింపఁగూడదు 19. బయటికి మందమతిగానుండి పనిలేని పనిగా మొండివాదములు చేయఁగూడదు. బయటికి దీనభావమును బ్రకటించుచు నితరుల మనసులు నొచ్చి మర్మభేదము లగునటుల భాషింపరాదు. తాను దుర్బలుఁడయ్యు నెదుటివానిని గటువచనములతో నొప్పింపరాదు. ఇట్టి సామాన్యనీతుల

నెఱుంగనివాఁడు కువిద్యావంతుఁడు 20. కఠినములును, గర్కశములును, గపటములును, సందేహజనకములును, దుఃఖకరములు, తీవ్రములునగు మాటలఁ బల్కునాతఁడును, క్రూరభావము, నిష్ఠురాచరణము దురాచారము గలవాఁడును 21, హీనవాక్యములు, మిథ్యాపవాదములు (అసత్యనిందలు), అశుభవచనములు, నిలుకడలేనిమాటలు, ద్వేషవచనములు,అనృతవాక్యములు, వ్యర్థభాషణములు పలుకుచు నితరులను నీవెంత నీ వెంతయని తూలనాడువాఁడును కువిద్యావంతుఁడు 22. బయటి కొకటిగ లోనొకటిగ సంచరించుట, పెద్దలను దిరస్కరించుట, కుటిలముగా బ్రవర్తించుట, కోపమును సమయముకొఱకు మనస్సునందుఁ ద్రాచుపామువలె దాచియుంచుట, ఊరక గొనుగుకొనుట, అదిగో ఇదిగోనని కాలము గడుపుట, కార్యభంగ మొనరించుట, కోపముతో నుండుట, స్వతంత్రముగనుండి విచ్చలవిడిగా మెలంగుట కువిద్యాలక్షణము 23. క్రోధి, తామసి, అవిచారి,పాపి, అనర్థి, అపస్మారరోగి, భూతావిష్టుఁడు 24, ఆత్మహత్యాపాతకుఁడు, స్త్రీహత్యాపాతకుఁడు, గోబ్రాహ్మణహంతకుఁడు, మాతాపితృహంతకుఁడు,మహాపాపాత్ముఁడు,పతితుఁడు, అవిద్యావంతుఁడని చెప్పఁబడును 25. హీనకార్యము లొనరించుటయు, చెడ్డపనులకుఁ బాల్పడుటయు, దురాగతము లొనర్చుటయుఁ, దనను నమ్మిన చెలికాండ్రకు ద్రోహము చేయుటయు, ఎదుటివాఁ డొనరించిన మేలును మఱచిపోవుటయు, సవతితల్లితోఁగాని, గురుపత్నితోఁగాని పాపముచేయుటయు, నరకప్రదములగు కలుషము లాచరించుటయు, ఆతతాయిగ వదరుబోతుగ నుండుటయు 26, మంచిని చెడుగుగాఁ దలంచి తగవులకు దంపెలకుఁ గొట్లాటలకు పాల్పడుటయు, అధర్మము లొనరించుటయు, పనికిమాలిన పనులు జేయుటయు, విచారములలోఁ బాల్పంచుకొనుటయు, సాడీలు చెప్పుటయు, దుర్వ్యసనములను విడచిపెట్టలేకపోవుటయు, విరోధమన్న ముందునకు దుముకుటయు మొదలగు నవలక్షణములు గలవాఁడు కువిద్యావంతుఁడు 27. దుష్టుఁడు, అపయశస్సునార్జించినవాఁడు, మలినుఁడు, పరుల శ్రేయమును సహింపనివాఁడు, స్వైరవిహారము గావించువాఁడు 28, మోసకాఁడు, మూర్ఖుఁడు, పిఱికిపంద, దురాచారుఁడు, ఆలోచింపక గొప్పదాటుగ వర్తించువాఁడు, దారిద్రోపీడికాఁడు, నిందల నారోపించు

వాఁడు, వేదాచారములను పాటింపనివాఁడు, పరద్రవ్యములను దొంగ లించువాఁడు కువిద్యావంతుఁడు 29. బుద్ధిహీనుఁడు,అడ్డదిడ్డములు పలుకు వాఁడు, అడ్డము లేకుండ గబగబ వదరువాఁడు, వికారముగా నవ్వువాఁడు, దుడుకుతనము గలవాఁడు, పాపవృత్తులయెడ మనసుంచువాఁడు, భ్రష్టు త్వము నొందినవాఁడు, దుర్బుద్ధిగలవాఁడు కువిద్యావంతుఁడు 30. పరులఁ జంపుట, దోపిడు లొనరించుట, బందిపోటుతనములు చేయించుట, పరుల గుండెకాయలను గాల్చుకొని తినుట, కనబడినవానినెల్ల మోసగించుట, పరస్త్రీలతో భోగించుట, కార్యసాధనమునకై యెదుటివాని నదేపనిగా స్తోత్రముగావించుట 31, తానుచేయు చెడుపనులకు లోక మేమనునోయని సందేహముగాని సిగ్గుగాని పొందకుండుట, తగవులకు ముందడుగిడుట, నీచబుద్ధి ప్రకటించుట, మిగుల మదోన్మత్తుఁడై సంచరించుట, భయములేక మెలంగుట, చదువననిఁ బెడమొగమిడుట, తగవులన్న జెవులు కోసికొనుట, వికారకార్యములు గావించుట కువిద్యావంతుని లక్షణములు 32. ధైర్యము లేనివాఁడు, పగ సాధింపదలంచువాఁడు, అనాచారముగ నుండు వాఁడు, గ్రుడ్డివాఁడుగ కుంటివాఁడుగ గూనివాఁడుగ జెవిటివాఁడుగ శ్వాసరోగిగ దగ్గురోగిగ నుండియు గరువమును గొంచమేని విడిచిపెట్టని వాఁడు 33, విద్యాహీనుఁడు, వైభవహీనుఁడు, కులహీనుఁడు, ఐశ్వర్య హీనుఁడు, శక్తిహీనుఁడు, సామర్థ్యహీనుఁడు, భాగ్యహీనుఁడు, బిచ్చ మెత్తుకొని బ్రతుకువాఁడు కువిద్యావంతులని తెలిసికొన వలయును 34. బలహీనుఁడు, కళాహీనుఁడు, ముద్రాహీనుఁడు, దీక్షాహీనుఁడు, లక్షణ హీనుఁడు, లావణ్యాహీనుఁడు, అంగహీనుఁడు, సౌందర్యహీనుఁడు 35, బుద్ధిహీనుఁడు, యుక్తిహీనుఁడు, ఆచారహీనుఁడు, ఆలోచనాహీనుఁడు, క్రియాహీనుఁడు, సత్త్వహీనుఁడు, వివేకహీనుఁడు, సంశయగ్రస్తుఁడుగ మానవుఁడు మాఱుట కువిద్యాఫలమే 36. భక్తిహీనుఁడు, భావహీనుఁడు, జ్ఞానహీనుఁడు, వైరాగ్యహీనుఁడు, శాంతిహీనుఁడు, క్షమాహీనుఁడు, అందరికంటెను హీనుఁడు నగుట కువిద్యాప్రభావముననే 37. సమయా సమయములను, ప్రసంగమును, ప్రయత్నమును, అభ్యాసమును, విన్నప మును, మిత్రత్వమును గమనింపనివాఁడును దౌర్భాగ్యులలో నొకఁడని చెప్పఁదగినవాఁడును 38, ఇంతియగాదు పూర్వోక్తములై నవెగాక

యింకను నిట్టివెయగు నవలక్షణములకు నెలవుగ నుండువారలను గువిద్యావంతులని శ్రోతలు గ్రహింపగోరెదను 39. కువిద్యాలక్షణములను బాగుగాగ్రహించి వానినిఁ బూర్తిగాఁ దప్పక విడిచిపెట్టవలయును. దురాగ్రహముతో నుచితానుచితము లెఱుంగక వానినే పట్టుకొని వ్రేలాడుట శ్రేయోదాయకము గాదు 40.

---

## నాలుగవ సమాసము — భక్తినిరూపణము.

పూర్వజన్మములలో నొనరించిన నానావిధములగు సుకృతఫలముగా నీ మానవజన్మము లభించినది. ఆ సుకృతముగూడ మహత్తరము పవిత్రము నయ్యేనేని యీ దేహము సన్మార్గమునందు లగ్నమగును 1. నరదేహము లన్నింటిలో బ్రాహ్మణజన్మము మిగుల శ్రేష్ఠమైనది. అందుఁగూడ స్నానము సంధ్య సద్వాసన ఈశ్వరభజనాసక్తి పూర్వజన్మపుణ్యమున్నగాని యలవడవు 2. పరమాత్మునియెడ భక్తి గలిగియుండుట సర్వోత్తమమగుపని. అందు సత్సమాగమము లభించినయెడలఁ జెప్పవలసిన దేమున్నది! సమయము సార్థకమగును. ఇదియే మానవజన్మము నెత్తుట వలనఁ గలిగిన పరమలాభము 3. భక్తి యభివృద్ధి నొందించుకొనవలయు నన్నచోఁ బ్రేమయొక్కయుఁ బ్రీతియొక్కయు సద్భావము పెంపొందింపవలయును. భక్తులతోఁ గలసిమెలసి యుండుటవలనను, హరికథామహోత్సవములు జరుపుటవలననుగూడ భక్తి యభివృద్ధినొందును 4. నరదేహము నొందినందులకుఁ బరమదుర్లభమైన పరలోకము నార్జించుటకుఁ గొలఁదిగనో గొప్పగనో యత్నించి జీవితమును సార్థకము గావించుకొనవలయును. ఇది యత్యావశ్యకమగు పని 5. సులభసాధ్యమగు విధిననుసరించి వేదవిహితమగు బ్రాహ్మణకర్మము, దానధర్మములు, భగవద్భజనము నొనరింపవలయును 6. సంసారదుఃఖముల ననుభవములోనికిఁ దెచ్చుకొని యనుతప్తుఁడై మానవుఁడు సర్వసంగపరిత్యాగము గావింపవలెను. లేదా భక్తియోగమునేని స్వీకరింపవలయును. దయాదానధర్మములు తొలంగకుండుటయు, భగవంతుని దివ్యనామము భజనము గావించుటయు నావశ్యకము. అట్లుకాదేని సాధుసాంగత్యమునేని జేయవలయును 7. అనేక

శాస్త్రములను బాగుగాఁ బఠించి తత్త్వమును జక్కగాఁ దెలిసి మెలఁగ వలయును. పాపములు నశించుటకై పుణ్యతీర్థములను దర్శింప వలయును. మహామంత్రములను బురశ్చరణము గావింపవలెను 8. శక్తియున్నంతలోఁ బరుల కుపకారముజేయుచుఁ బెద్దలకడ జ్ఞానవిచారము గావించుచు అధ్యాత్మనిరూపణమునందుఁ బాల్గొని సారాసారముల విచారించి గ్రహించుచుఁ గాలము గడుపవలయును 9. మనుజుఁడు జ్ఞానాధికారి కావలయునన్నచో వేదముల యాజ్ఞలను బాలింపవలయును. కర్మకాండమును ఉపాసనాకాండమును ఆచరణలోఁ బెట్టవలెను 10. ఓ మానవుడా ! నామాటలు శ్రద్ధగా వినుము. తనువు, మనస్సు, వాక్కు, పత్రము, పుష్పము, ఫలము, జలము మొదలగువానిలో నీకేది లభించునో దానినిఁ బరమాత్మునికి సంతుష్టికలుగుటకై సమర్పించి నీ జీవితమును సార్థకము గావించుకొనుము 11. ఈలోకమున నీవు జనించినందులకు ఫలము ధర్మకర్మములొనరించుచు భగవంతుని యనుగ్రహము సంపాదించుకొనుటయే! అట్టి సత్కర్మములు గావింపకుందువేని వ్యర్థముగా నీభూదేవికి భారము గూర్చినవాఁడ వయ్యెదవు 12. కొంతలోఁ గొంతయేని యాత్మహితముకొఱకుఁ బ్రయత్నము చేయవలయును. తనువును హృదయమును సమర్పించి శక్తికొలఁది యీశ్వరకార్యములు గావించుట మానవజీవితమునకుఁ బ్రధానధర్మమని యెఱుంగుము 13. ఇట్టి ధర్మముల ననుసరించి సంచరింపని మనుష్యుని మృతప్రాయునిగ భావింపుము. వాని జన్మము వ్యర్థముగాఁ దల్లికి శ్రమగూర్చుటకే 14.

సంధ్య జ్ఞానసంపాదనము దేవభజనము దేవతార్చనము మంత్రము జపము ధ్యానము మానసపూజ భక్తి ప్రేమ నిష్ఠ నియమము అతిథుల నభ్యాగతుల నాదరించుట సద్బుద్ధి సద్గుణములు లేనివారు భక్తులని చెప్పఁదగరు. నిరంతరము హరికథా పరతంత్రులై వర్తింపనివారలును, ఆధ్యాత్మికవిషయములను బెద్దలవలన శ్రద్ధమై విననివారలును, యోగ్యులగువారితోఁ జెలిమి గావింపనివారలును, పరిశుద్ధాంతఃకరణముతో సంచరింపనివారలును,మిథ్యామదలోలురై యుండి కైవల్యమును గాంచనివారలును భక్తియోగమునకుగల మహత్వమేమెఱుంగుదురు? నీతి న్యాయము పుణ్యక్రియ లొనరించుశక్తి యుక్తాయుక్తము నెఱింగి మెలంగుట పరలోక

సాధనము విద్య వైభవము చాతుర్యము కళాపరిచయము సరస్వతీ రమ్యవిలాసము (రసగ్రహణకౌశలము) శాంతి క్షమ (సహనము) దీక్ష మైత్రి శుభాశుభసాధనము మున్నగునవి లేనివారు భక్తునిగ నెన్న టికిని జెప్పఁదగరు. శుచి, స్వధర్మనిర్వహణము, ఆచారము, ఆలోచనము, ఇహలోకచింతనము, పరలోకచింతనము, కర్మనిర్వహణము, ఉపాసనము, జ్ఞానము, వైరాగ్యము, యోగము, ధైర్యము మున్నగు సుగుణములు మందునకైన లేనివాఁడెన్నటికిని భక్తుఁడు కాఁజాలఁడు. ఇచ్ఛవచ్చినటుల సంచరింపకుండుట, ఉపరతి (నిలుపుదల), త్యాగము, సల్లక్షణము, ఆదర భావము, పరమేశ్వరునియెడఁ బ్రియభావము, పరుల శ్రేయోవృద్ధుల కంతః కరణమున నానందించుట, పరోపకారమునఁ గలుగు సౌఖ్యము గురుతిం చుట, హరిభక్తి లేశము ననునివి లేనివారు భక్తులెన్నఁటికిని గాఁజాలరు. ఇంతియేగాదు ఇట్టివారలందఱును జీవన్మృతులు (బ్రతికియుండియుఁ జచ్చినవారు). పవిత్రహృదయులగు పుణ్యాత్ము లిట్టివారితో సంభా షణముగూడఁ గావింపఁజనదు 15 – 26. పూర్వజన్మములయందు బుణ్య సామగ్రి గడించినవారలకు భగవద్భక్తి తనంతన యేర్పడును. తరువాత వారివారి యాచరణముల కనుకూలముగ ఫలమొందుదురు 27.

## ఐదవసమాసము – రజోగుణనిరూపణము.

ఈ దేహము సత్వము, రజస్సు, తమస్సు అను మూఁడుగుణ ములతోఁ గూడియున్నది. మూఁడుగుణములలో సత్వగుణ ముత్తమ మైనది 1. సత్త్వమువలన మానవుఁడు భగవద్భక్తిని, రజోగుణమువలనఁ బునరావృత్తిని (మరల మనుష్యజన్మమును), తమోగుణమువలన అధో గతిని బొందుచున్నాఁడు 2.

*శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః॥
(భగవద్గీత ౧౪–౧౮)

* సాత్వికులు దేవాదిలోకముల నొందుచున్నారు. రజోగుణముగలవారు మనుష్యలోకమునందు మనుజులుగా జన్మించుచున్నారు. నికృష్టవ్యాపారమునందున్న తమోగుణస్థులు పశ్వాది జన్మములను నరకములను జెందుచున్నారు.

వానిలోఁగూడ శుద్ధము, శబలము అను రెండుభేదములుగలవు. నిర్మలభావులగువారు శుద్ధులు. శబలగుణులు బాధకులు 3. విచక్షణులగు నోశ్రోతలారా ! ఇపుడు శుద్ధసత్త్వగుణులయొక్కయు, శబలసత్త్వగుణుల యొక్కయు గుణములను సావధానమతితో నాలకింపఁగోరెదను. శుద్ధగుణ సంపూర్ణులై వర్తించువారు పరమార్థప్రియులుగను, శబలగుణపూర్ణులై మెలఁగువారు సంసారలోలురుగను నుందురు 4. సాంసారికులగు జనులస్థితి చెప్పుచున్నాఁడ. సంసారుల దేహములయందు మూఁడుగుణములు వర్తించును. వానిలో నొకగుణ మెప్పుడు విశేషితమగునో యప్పుడు తక్కిన రెండు గుణములు తగ్గిపోవును 5. రజోగుణము తమోగుణము సత్త్వగుణములవలననే మానవజీవితము నడుచుచుండును. ఇపుడు రజో గుణ కార్యస్వరూపమును దెలియఁజెప్పుదును 6. రజోగుణము దేహము నందుఁ బ్రవేశించినంతన మనుజుఁ డెటులఁ బ్రవర్తించునో యా విషయము నేర్పరులగు శ్రోతలు సావధానమతితో వినియెదరుగాత 7.

ఈ యిల్లు నాది, గృహస్థత్వము నాయది, ఈశ్వరుఁ డేమి పదా ర్థము అని తమలోఁదాము నిశ్చయించువారు రజోగుణులు 8. తల్లి, తండ్రి, స్త్రీ, బాలుఁడు, మనుమఁడు, బాలిక వీరలనుగూర్చి వీరల శ్రేయోభివృద్ధులను దలంచి నిరంతరము చింతించుచుండువాఁడు రజో గుణుఁడు 9. సుఖముగా భోజనము గావించుట జలముగ్రోలుట తృప్తిదీర వస్త్రాదులు ధరించుట సేలువలు గప్పుకొనుట ఇతరుల పదార్థముల నభిల షించుట మున్నగునవి రజోగుణలక్షణములు 10. దానధర్మములు, జప ధ్యానములు, పాపపుణ్యములు మున్నగువానిని గూర్చిన విచారము గావింపకుండుటయు 11, తీర్థవ్రతముల అతిథి అభ్యాగతుల నెఱుంగ కుండుటయు, హృదయ మనాచారమునందు లగ్నమైయుండుటయు 12, ధనమును ధాన్యమును బ్రోగుచేయుటయందుఁ దీవ్రకృషి యొనర్చుటయుఁ, బరమలోభియై మెలంగుటయు 13, నేను పడుచువాఁడను నేను సుందరా కారుఁడను నాయంత బలవంతుఁడులేఁడు నాయంత నేర్పరిలేఁడు నేను అందఱికంటె గొప్పవాఁడను అని చెప్పుకొనుటయు 14, నాదేశము, నాగ్రామము, నాభవనము, నానివాసము మాత్రమే నాకుఁ గావలసినదని తలంచుటయు రజోగుణలక్షణములు 15. తాను సుఖముగనుండవలయును

ఎదుటివాఁడు సర్వవిధముల నాశనము గావలయునని కోరుటయు 16, కపటము మాత్సర్యము తిరస్కారము కామపికార ముప్పొంగుచుండ నితరులకు నెగ్గుగావించుటయు 17, తమ బాలురపయి మిక్కిలి మమత వహించుటయు, స్త్రీలయెడ మిగుల వలపుగలిగియుండుటయుఁ, దన చుట్ట పక్కములపయి విశేషముగాఁ బ్రేమయుంచుటయు 18, తనకుఁ బ్రియులగువారికి మేలుచేయ నమితముగాఁ జింత హృదయమునం దుంచుకొనుటయు రజోగుణలక్షణములు 19. సంసారసంబంధములగు ననేక విపత్తుల నుండి తొలఁగి సుఖపడు విధమెద్దియాయని మిగులఁ జింతించుటయు 20, మొదటఁ దానొందిన సంకటములను మాటిమాటికి జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని యెల్లప్పుడు దుఃఖముల నొందుటయు 21, పరుల వైభవములను దిలకించి మనస్సున నాశపడుటయు, ఆశాకారణమున నిరంతరము దుఃఖమొందుటయు 22, తానుజూచిన మంచివస్తువులన్నియు లభింపవలయు ననుకొనుటయు, లభింపనియెడలఁ బరితపించుటయు రజోగుణలక్షణములు 23. హాస్యము, వినోదము, హేళనము మున్నగువానికై వేడుకపడుటయు నిరంతరము శృంగారగీతములను బాడుచుండుటయు, మఱియు రాగరంగములయందును తానమానములయందును హృదయము నిలుపుటయు 24, కొండెములుచెప్పి నిందించి యైకమత్యముగల తావున తగవులు సమకూర్చుటయు, దనకుఁ దెలిసినరహస్యములను బహిరంగమొనరించుటయుఁ 25, గార్యనిర్వహణమునందు సోమరిపోతుతనముగ నుండుటయు హృదయరంజకములగు క్రీడలలోఁ దన్మయుఁడై యుండుటయు రజోగుణలక్షణములు 26. కళావంతులయొక్కయు (వేశ్యలయు) బహురూపులయొక్కయు (పగటివేషధారులయు) నటకులయొక్కయుఁ గ్రీడలను దిలకించుటలో నాసక్తుఁడై యుండువాఁడును, బహువిధములగు నృత్యములు గావించువారికిఁ దాను గడించినధనము వ్యయము గావించువాఁడును రజోగుణుఁడు 27. మత్తువస్తువులను సేవించుటలో నుత్సాహము, నిరంతరము సంభోగమును స్మరించుచుండుట, నీచసాంగత్యమునందు బ్రీతి 28, దొంగతనమును గూర్చిన యుత్సాహము, ఎదుటివాని హీనత్వము నాలించుటలో జెప్పుటలో సంతోషము, నిత్యనియమములను దొలగుట 29, పరమాత్మునికొఱకు ధ్యానముజేయుటలో సిగ్గుపడుట,

కడుపుకక్కుఱితికై యెంతటికష్టములనేని సహించి నిబ్బరించుట, ప్రపంచము నెడ ప్రేమభావము ప్రకటించుట యనునివియెల్ల రజోగుణలక్షణములు 30. మధురవస్తువులుగల యాహారమును భుజించుటలో విశేషించి యాసక్తి గలిగియుండువాఁడును, మిగుల నాదరభావముతో దన కళేబరమును బోషించుకొనువాఁడును, ఉపవాసమనిన ప్రాణాంతకముగ భావించి జీవితములో నుపవసించుట యెఱుంగనివాఁడును 31, శృంగారవిషయ ములను ప్రియతరములుగా భావించువాఁడును, భక్తివైరాగ్యములను ప్రియకరములుగాఁ దలంపనివాఁడును, కళాసౌందర్యములయందు హృద యము లీనముగావించి యొడలెఱుంగనివాఁడును 32, పరమాత్మని నెఱుంగ యత్నింపక నిరంతరము సంసారసంబంధములగు వస్తువులపయి ప్రేమ గలిగియుండువాఁడును, ఎఱింగియుండియుఁ దనను జన్మమృత్యు భ్రమణమునఁ బడవేసికొనువాఁడును రజోగుణుఁడు 33.

మోహకారణమున నీ రజోగుణము జన్మమును మరణమును మానవులకు సమకూర్చుచున్నది. సంసారబద్ధులగు రజోగుణులను శబలు లని గ్రహింపవలయును. వీరలు దారుణదుఃఖముల ననుభవింపఁ బొల్పడు చున్నారు 34. ఇప్పుడీ రజోగుణ మెంతదనుక విడువదో మానవుఁడంత దనుక నీ సంసారబంధమును విడువఁజాలఁడు. ప్రపంచమునందు మానవుని విషయాదికవాసన లంటియేయుండును. వీనినుండి బయటబడుట కుపా యము లేమేని గలవా యని విచారించుట యవసరము 35. విషయ వాసనలనుండి బయటబడుటకు భగవద్భక్తియే తగినసాధనము. మాన వుఁడు విరక్తుఁడగుట శ్రేయోదాయకము. ఒకవేళ విరక్తుఁడు కాఁజాలఁడేని యథాశక్తి భగవద్భజనము చేయుచుండవలయును 36. దేహము, మనస్సు, వచనము, పత్రము, పుష్పము, ఫలము, జలము మున్నగు వానిలో నేది సాధ్యమైన దానిని హృదయపూర్వకముగాఁ బరమేశ్వ రార్పణముగావించి జీవితమును మానవుఁడు సార్థకమొనరించుకొన వలయును 37. శక్తికి సాధ్యమగునంతలో దానముచేయుటయు, బుణ్య కార్యము లొనరించుటయు నావశ్యకధర్మము. భగవంతునియం దనన్య భక్తి గలిగియుండుటయు, సుఖదుఃఖములు సంభవించినప్పుడు దైవచింత నము గావించుటయుఁ గర్తవ్యము 38. ఆదియందును అంతమునందును

నీశ్వరుఁడొకఁడె. మాయ యీ మధ్యనే తగులుకొని యున్నది. కావున నీశ్వరునియందే పూర్ణ భావమునుంచి కడతేరవలయును 39. ఈ శబల రజోగుణ లక్షణములను సంక్షేపముగా వివరించితిమి. పరమార్థము లభింపవలయునన్న మానవుఁడు సర్వవిధముల యత్నించి శుద్ధరజోగుణము నాశ్రయింపవలయును 40. శుద్ధరజోగుణలక్షణములను సత్త్వగుణములను జెప్పునపుడు తెలియఁజేసెదను. శుద్ధరజోగుణము పూర్ణముగా భజనము గావించుట కుపకరించును 41. శ్రోతల కిప్పటికి రజోగుణలక్షణములు బోధపడియుండునని విశ్వసించుచున్నాఁడను. కావున నికముందుఁ దమో గుణమును వివరించి చెప్పుచున్నాఁడను. శ్రద్ధతో నాలింపఁగోరెదను 42.

---

## ఆఱవసమాసము – తమోగుణ నిరూపణము.

ఇంతకుమున్ను క్రియాయుక్తమగు రజోగుణముల లక్షణములను సాకల్యముగా నెఱింగించితిని. ఇపుడు తమోగుణ లక్షణములను దెలుపు దును. వినఁ గోరెదను 1. సంసారమునం దేదేని దుఃఖము గలిగినతోడనే ఖేదముగాని క్రోధాతిశయముగాని కలిగెనేని యది తమోగుణ లక్షణమని గ్రహింపనగును 2. క్రోధము గలిగినపుడు తల్లి, తండ్రి, బంధువులు, తోఁబుట్టువు, స్త్రీ మున్నగువారలను గొంచెమేని విచారింపక మోదు టయు 3, క్రోధాతిశయమున నొడలెఱుంగక యితరుల ప్రాణములను దీయు టయుఁ, దన ప్రాణములనుగూడ గోలుపోవుటయు 4, క్రోధావేశము కలిగినపుడు ప్రతిక్రియ గావించుటకై పిశాచమువలెఁ దిరుగుటయు, బహువిధోపాయములతో నెదుటివానికి ఘాతగావించుటయు 5, తనదేహ మును దాను శస్త్రముచే ఛేదించుకొనుటయు, నితరులనుగూడ నిర్దయగా ఛేదించుటయుఁ దమోగుణలక్షణము 6. యుద్ధములను వినోదముగాఁజూచు టకు రణరంగమునకుఁ బోవుటయు 7, నిరంతరము భ్రాంతిగా నుండు టయుఁ, దానొనరించిన ప్రతిజ్ఞ నిర్వహింపలేకపోవుటయు, మిక్కుటముగా నిదురబోవుటయు 8, ఇది తియ్యనిది ఇది చేదు అను విచారమును బెట్టుకొనకుండఁ జిక్కినవస్తువుల నెల్ల విశేషించి భుజించుటయు, మిక్కిలి మూఢుఁడై యుచితానుచితముల నెఱుంగక ప్రవర్తించుటయు 9, తాను

విశేషముగా ప్రేమించువాఁడు కాలవశమున మరణించినయెడల నతనికై ప్రాణత్యాగము గావించుటయు, నాత్మహత్య యొనరించుటయు 10, పురుగులు చీమలు ఇంక నితరాటవిక జంతువులు మున్నగువానిని వధించుటలో బ్రీతియు, అత్యంత నిర్దయాళుత్వము కలిగియుండుటయుఁ దమోగుణ లక్షణములు 11. ద్రవ్యముకొఱకు స్త్రీలను, బాలురను, బ్రాహ్మణులను, గోవులను హత్యగావించుటయు 12, ఏదేని బాధలోఁ జిక్కుకొని విషమునుదిన నుత్సహించుటయు, ఇతరుల ప్రాణములను దీయ దలంచుటయు 13, హృదయములోఁ గపటమునుంచుకొని ఇతరులను సర్వనాశనమొనరించుటయు, ఎల్లప్పుడు మదోన్మత్తుఁడై ముక్కోపియై యుండుటయు 14, కలహమున, కయ్యమున నిచ్ఛగలిగియుండుటయు, మనస్సులో ద్వేషముగలిగి వర్తించుటయు 15, యుద్ధములను దిలకించుటయు, యుద్ధవార్తల నాలించుటయు, యుద్ధము స్వయముగా నొనరించి మరణించుటయుఁ, బరులను జంపుటయుఁగూడఁ దమోగుణ లక్షణములె 16. మత్సరగ్రస్తుఁడై భక్తిని విడనాడుటయు, దేవమందిరములను గూల్చించుటయు, పండిన పండ్లతో నలరారు చెట్లుల మొదలంట నఱికించుటయు 17, సత్కర్మముల నొనరించుటలో నాసక్తి లేకపోవుటయు, నానావిధములగు దోషములు యోగ్యములుగా స్ఫురించుటయు, హృదయమునందుఁ బాపమన్న భయము లేకపోవుటయుఁ దమోగుణ లక్షణములు 18. బ్రాహ్మణుల జీవనాధారములను జెడఁగొట్టుటయుఁ, బ్రాణులను దుఃఖింపజేయుటయు, జీవలోకమున కషాయముఁ గలుగజేయుటయు 19, కొంపలు గాల్చిగాని శస్త్రములతో దెగనరికిగాని విష ప్రయోగము గావించిగాని పరులను భౌతికోపాయములచే మత్సరమునఁ దెగటార్చుటయుఁ దమోగుణ లక్షణములు 20. ఇతరుల దుఃఖమును గాంచి యానందించుట, నిష్ఠురముగాఁ బ్రవర్తించుట, పరులసొమ్ములు దొంగిలించుట, ప్రపంచములోనివా రేమనుకొందురో యని జంకకుండుట 21, ఇతరులు తమలోఁదాము తగవులాడునటులఁజేసి వినోదించుట, మనఃపూర్వకముగా దుర్బుద్ధితో జరించుట 22, సంపదలతో విఱ్ఱవీగుచు సామాన్యప్రజల కెగ్గు లాచరించుట, హృదయములో జాలిలేక మెలంగుట మున్నగు లక్షణములు గలవారలు తమోగుణులు 23,

దైవభక్తి, సద్భావము, పుణ్యతీర్థ సందర్శనము అనువానియెడ శ్రద్ధయు, వేదశాస్త్రాదుల నెఱింగి మెలంగుటయు 24, స్నాన సంధ్యాదుల నియమానుసారముగ నాచరించుటయు, స్వధర్మమును విడనాడకుండుటయు సాధారణముగ నెవరియెడ లేదో వారు తమోగుణులు 25. తనకంటెఁ బెద్దవాఁడగు సహోదరునియుఁ దల్లిదండ్రులయొక్కయు మాట లాలింపకపోవుటయు, క్షణక్షణమునకుఁ గోపము నొందుటయు 26, సోమరిపోతుతనమున దేహము గదలింపక కూర్చుండి యదేపనిగా భుజించుటయు, నేదేని యోచింపఁజాలకుండుటయు 27, చేతపడులు చేయుచుండుటయు, శస్త్రప్రహారము లొనరించి పరుల నొప్పించుటలో నాసక్తియుఁ, దులారణములయందు (కుస్త్రీలయందు) ఆదరభావముగ నుండుటయు 28, దేవతలకొఱకు వీపులలో రంధ్రమునుజేసికొని అంకుశమునుఁ దగిలించుకొనుటయు (దీనినే సిడియందురు), మండుచున్న యగ్నికుండములోఁ గూర్చుండుటయుఁ, గాష్ఠయంత్రమును నాలుకకు గ్రుచ్చుకొనుటయు మున్నగు కృత్యములు తమోగుణలక్షణములు 29. కుంపటిలో బొగ్గులను మండించి తలపయినిడుకొనుటయుఁ, గాగడాలతో దేహమునంతయుఁ గాల్చుకొనుటయు, స్వయముగా వాఁడియగు శస్త్రముతో గాయములగునట్లు కొట్టుకొనుటయు, దేవతాప్రసన్నముకొఱకిట్టి మాయలనన్నింటి నాచరించుటయుఁ 30, దలనుగోసి తనయిష్టదైవములకు నివేదనము గావించుటయు, నితరవిధములలో నేదైన నాచరించి తనదేహమును దేవతల కర్పించుటయు, ఎత్తుమీఁదనుండి జారి (భృగుపాతము) క్రిందఁబడి చచ్చుటయు, నీ విధములగు పనులనాచరించి మరణించుటయుఁ దమోగుణలక్షణములు 31. నిగ్రహించి యగ్నిపయిఁగూర్చుండుటయుఁ, దన్నితరులచే బంధింపఁజేసికొని పడియుండుటయు, దేవతామందిర ద్వారమునఁ బ్రాణత్యాగము నొనరించుటయు 32, నిరాహారముగా నుండుటయుఁ, బంచాగ్నుల మధ్యను వసించి దేహమును గాల్చుటయుఁ, బొగద్రావుటయుఁ, దనను భూమిలోఁ బ్రాతిపెట్టించుకొనుటయు 33, సకామములగు (కోరికలనిచ్చు) మంత్రములను అనుష్ఠించుటయు, వాయువును దేహములో నాపియుంచుటయు, దేవత యావేశించెనని కదలకమెదలక పడియుండుటయుఁ దమోగుణ లక్షణములు 34. గోళ్ళను వెండ్రుకలను

దీర్ఘముగాఁ బెంచుటయు, తనచేతిని క్రిందికి వ్రాల్పక పయికెత్తుకొని తిరుగుటయు, నెవ్వరితోడను మాటలాడక మౌనవ్రతముతో నుండుటయు 35, నిగ్రహమున కభ్యాసపడి తనశరీరమును దాను పీడించుకొనుటయు, దేహదుఃఖముతో శ్రమనొందుటయుఁ, గోరికల సమకూర్పలేదను కోపముతో దేవతా విగ్రహములు పగులఁగొట్టుటయుఁ దమోగుణ లక్షణములని యెఱుంగవలయును 36. దేవతానిందనము గావించుటయు, ఆశలకు లోనై పాపములాచరించుటయుఁ, బనికిమాలినవాఁడుగ నుండుటయు,సాధువులను సజ్జనులను ప్రేమింపక స్నేహముచేయక యుండుటయు ఆచారముగాఁ గలవారలు తమోగుణ ప్రధాన పురుషులు 37.

తమోగుణవర్ణనము పూర్తిగాఁ జేయనెంచినయెడల నది మిగుల విస్తరమగును. అందుచే త్యాగము (విడువఁదగినవి తెలియు) కొఱకుఁ గొంచెముగా నిచ్చట నిరూపణము గావించితిని 38. ఈ తమోగుణము పతనకారణము అనఁగా నధోగతినిఁగూర్చునది. మోక్ష మీ తమోగుణము నాశ్రయించినవారి కెన్నఁటికిని లభింపదు 39. తమోగుణానుసారముగఁ జేయఁబడు కర్మములఫలితములు మిగుల చెడ్డవిగా గణింపఁబడును. దీని వలన జన్మమృత్యువుల మూలమెన్నఁటికిని నశింపఁజాలదు 40. జన్మమరణములు నష్టము కావలయునన్న సత్త్వగుణప్రధానుఁడు కావలయును. ముందుసమాసములో దాని నిరూపణము గావింపఁబడును గాన వినఁగోరెదను 41.

---

## ఏడవ సమాసము – సత్త్వగుణ నిరూపణము.

దారుణదుఃఖదాయకమగు తమోగుణము నింతకుముందు సంగ్రహముగా వర్ణించితిని. కాన నిపుడు పరమదుర్లభమగు సత్త్వగుణమును గూర్చి చెప్పుచున్నాను వినుఁడు 1. సత్త్వగుణము భజనకాధారము. యోగులకు సహాయకరము. దుఃఖదాయకమగు సంసారమునుండి మానవుల నుద్ధరించును 2. దీనివలన మనుజులకు ఉత్తమగతి లభించును. భగవంతునితోఁ గలియఁదగు మార్గము సత్త్వగుణము నాశ్రయించినంతన సుబోధమగును. సాయుజ్యముక్తి (పరబ్రహ్మములో లీనమగుట) లభిం

చును 3. సత్త్వగుణము భక్తుల కాధారము. సంసారసాగరమునుండి బయటపడవలయు ననుకొన్నచో సత్త్వగుణము నాశ్రయింపక తప్పదు. దీనిమూలముననే మోక్షలక్ష్మి లభించును 4. పరమార్థము దీనివలననే లభించును. మహాత్ములకునిది భూషణము. దీనిమూలముననే రజోగుణ మును తమోగుణమును నాశనమొందుచున్నవి 5. పరమసుఖకారకము, ఆనందతరంగము, జన్మమృత్యునిరాకరణము 6, అజ్ఞానసంహారణము, పుణ్యప్రకాశము, పరలోకసాధనము నగు సత్త్వగుణప్రభావము నెంతని కొనియాడఁగలను 7. పూర్వోక్తములగు సత్త్వగుణములు గల మానవుని నడవడి యంతయు నెటులుండునో వివరించెద 8.

సత్త్వగుణకారణమున నీశ్వరునియందుఁ బ్రేమగలుగును. ప్రపంచ వ్యవహారమంతయు లౌకికముగాఁ గాన్పించును. వివేకమెల్లప్పుడు కర తలామలకముగా నుండును 9. సంసారదుఃఖమును మఱువవలయునన్న సత్త్వగుణప్రధానుఁడు కావలెను. నిర్మలమగు భక్తిమార్గము సత్త్వగుణ సహాయముననే మానవున కలవడును. భజనభావముగూడ సత్త్వగుణము వలననే కలుగును 10. పరమార్థమునందుఁ బ్రీతియు, భక్తియందు ప్రేమయుఁ బరోపకారమునం దాసక్తియు సత్త్వగుణముచేతనే కలుగును11. మనుష్యుఁడు స్నానసంధ్యాదిసత్కర్మము లాచరించి పుణ్యశీలుఁడగుట కును, అంతఃకరణమును బరిశుద్ధముగానుంచి శరీరమును వస్త్రముల సుందరముగా నుంచుకొనుటకును 12, యజ్ఞయాగాదిక్రతువులను తాను స్వయముగాఁ జేయుటకు నితరులను బ్రోత్సహించి చేయించుటకును, వేదశాస్త్రాదులను జదువుటకును, నితరులచేఁ జదివించుటకును, దానము పుణ్యము స్వయముగాఁ జేయుటకును, నితరులచేఁ జేయించుటకును సత్త్వగుణమే ప్రధానహేతువు 13. సత్త్వగుణప్రధానుఁడగు మానవునకు ఆధ్యాత్మికనిరూపణమునందు మనసు లగ్నమగును. హరికథలన్న నాసక్తి కలుగును. సదాచరణమునం దుత్సాహము కలుగును 14. సత్త్వగుణమువలన మానవుఁడు అశ్వదానము,గజదానము, గోదానము, భూదానము వివిధము లగు రత్నదానములు గావించును 15. ధనదానము, వస్త్రదానము, అన్న దానము, ఉదకదానము, బ్రాహ్మణసంతర్పణములు 16, కార్తికస్నానము, మాఘస్నానము, వ్రతము, ఉద్యాపనము, దానము, తీర్థయాత్ర, ఉప

వాసము వీనిని నిష్కాముఁడై మానవుఁడు సత్త్వగుణసహాయమునఁ గావించుచున్నాఁడు 17. సహస్రజనసమారాధనము, లక్షజనసమారాధనము, బహువిధములగు దానములు మున్నగువానిని నిష్కామబుద్ధితోఁ జేయుట సత్త్వగుణుని లక్షణము. ఇవి కామ్యబుద్ధితో నాచరించుట రజోగుణుని లక్షణము 18. తీర్థస్నానములయందు భూదానములు గావించుటయు, నెడారులలోఁ జెలువులు బావులు త్రవ్వించుటయు, మందిరములకు ఆలయములకు శిఖరములు గట్టించుటయు సత్త్వగుణలక్షణము 19. దేవస్థానములు, నివసించుటకువలయు వసతిగృహములు, సోపానములు నిర్మించుటయు, ఆలయమున దీపమాలను సమర్పించుటయు, తులసి, రావి మున్నగువానికి అరుగులు వేయించుటయు సత్త్వగుణుని లక్షణములు 20. వనము, ఉపవనము, పుష్పవాటిక, కూపము, తటాకము మున్నగువానిని నిర్మించుటయు, మునీశ్వరుల హృదయములకు సంతుష్టి గావించుటయు 21, సంధ్యావందనము నియతకాలమున నాచరించుటయుఁ, దాపసులకు గుహలు నిర్మించుటయు, నదీతీరమునందు సోపానములు కట్టించుటయు, దేవాలయములయందు సత్తరువులను నెలకొల్పుటయు సత్త్వగుణుని లక్షణములు 22. అసంఖ్యాకములగు దేవాలయములయందఖండదీపములను బెట్టించుటయు, దేవున కలంకారములు సమర్పించుటయు 23, గడియారము, మృదంగము, కరతాళము, తాషామార్ఫ, నగారా, సన్నాయి మున్నగు మనోహరములగు సుందరవాద్యములను దేవమందిరములలో నుంచుటయు 24, ఇవిగాక యింక ననేకవిధములగు సుందరవస్తువులను దేవాలయములలో నుంచుటయు, స్వయముగా హరిభజనమునందుఁ దత్పరుఁడై వర్తించుటయు సాత్త్విక లక్షణము 25. ఛత్రము, సుఖాసనము, తాంబూర, పతాకము, చిహ్నము, చామరము, సూర్యపానము మొదలగు వస్తువులను దేవాలయమునకు దానమిచ్చువాఁడును 26, బృందావనమును వేయువాఁడును, రంగమాలలను నిర్మించువాఁడును, దేవమందిరమునందు సమ్మార్జనము గావించువాఁడును సాత్త్వికుఁ డనఁబడును 27. బహువిధములగు దేవపూజోపకరణములను, మండపమును చాందినీని ఆసనమును దేవాలయముల కర్పణము గావించుటయు 28, దేవునికొఱకు నానావిధములగు భోజనములను నివేదనము గావి

చుటయు, నూతనములు అపూర్వములు నగు ఫలములను సమర్పించియు 29 దేవస్థానమునందు భక్తిపూర్వకముగా నెట్టి నీచసేవనైనఁ గావింప నొడంబడుటయు, స్వయముగా దేవమందిరద్వారముల నూడ్చుటయు 30, పర్వతిథులయందును, మహోత్సవములయందును నుత్సాహముతో భగవత్సేవలోఁ బాల్గొనుటయు, తనువు, వాక్కు మున్నగు నింద్రియములను బరమాత్మ సమర్పణము చేయుటయు సత్త్వగుణలక్షణములు 31. హరికథయందు దత్పరుఁడై యుండి చందనము, హారములు, బుక్కా (గంధపొడి) ధరించి నిరంతరము నిలువఁబడియుండుటయు సాత్త్వికలక్షణము 32.

ఈ ప్రకారముగాఁ బురుషుఁడుగాని స్త్రీగాని శక్తికొలఁదిగ సామగ్రిని గైకొని దేవస్థానమునందు నిలిచియుండుట సత్త్వగుణునిలక్షణము 33. తాను జేయుచున్న మహాకార్యము నాపివేసి భగవంతుని సాన్నిధ్యమునకు నరుదెంచుటయు అంతఃకరణమునందు భక్తిగలిగి యుండుటయు 34, గొప్పతనము విడనాడి నీచకృత్యములఁ గయికొని భగవత్సేవకయి దేవమందిరద్వారమున నుండుటయు 35, దేవతల ధ్యానించుచు నుపవసించుటయుఁ, దాంబూలాదులఁ గైకొనకుండుటయు, నిత్యముతప్పక జపసంధ్యాదుల నొనరించుటయు సత్త్వగుణునిలక్షణములు 36. ఇతరులతో నెన్నఁడును గటువుగా మాటలాడి యెఱుంగనివాఁడును, నియమము తప్పక మెలంగువాఁడును, యోగులనర్చించి సంతుష్టిపఱచువాఁడును 37, అభిమానమును విడనాడి నిష్కామభావముతోఁ బరమాత్ముని దివ్యనామమును *కీర్తనగావించువాఁడును, భగవత్కీర్తన సమయమునభక్తియుఁ బ్రేమయు నతిశయించి స్వేదము, రోమాంచము దాల్చువాఁడును 38, హృదయమునం దీశ్వరుని ధ్యానముగావించుచు నానందబాష్పములవిడచి

* మహారాష్ట్రప్రాంతములందుఁ బ్రజలకు సదుపదేశము నొసఁగుటకై కీర్తనము గావించెడిప్రణాళిక మిగులఁ బ్రాచీనకాలమునుండి వచ్చుచున్నది. కీర్తనకారుఁడు ధార్మికములును, నైతికములునునగు పదములతోఁగూడిన నుస్వర గానమును గావించి వానిపయి వ్యాఖ్యానమిచ్చును. మృదంగము, తాంబూర, కరతాళము, వాద్యములుగూడ వీరివెంట నుండును. కీర్తనకారు నాప్రాంతములలో హరిదాసుఁడని చెప్పుదురు. పెక్కుమంది హరిదాసులు ఆర్థికదృష్టితోడను, గొందఱు నిష్కామభావమునను దేవమందిరములలో హరిభజన మొనర్చుచుందురు.

దేహాస్మృతిమఱచి సంతోషముతో వర్తించువాఁడును సత్త్వగుణుఁడు 39. హరికథయందు మిగుల నాదరభావము గలిగియుండుటయు, నిత్యము హరికథ నుత్సాహముతో నాలకించుటయు, ఆదినుండి యంతముదనుక హరికథ నాలించునపుడు ప్రేమ వృద్ధియగుచుండ నానందతరంగములలో నోలలాడుటయు సత్త్వగుణలక్షణములు 40. నోటితోఁ బరమాత్ముని దివ్యనామము నుచ్చరించుచుఁ జేతితోఁ గరతాళములను వాయించుచు నృత్యము చేయుచుండువాఁడును, భగవంతుని బిరుదముల భజనమునం దేమరనివాఁడును, సాధుజనుల పాదధూళిని గైకొని తలపయి ధరించు వాఁడును సత్త్వగుణుఁడు 41. దేహాభిమానము విడిచి విషయసుఖముల యెడ విరాగముగడించి మాయను మిథ్యగాగ్రహించి వర్తించువాఁడు సత్త్వగుణుఁడు 42. "సంసారబంధనములలోఁ జిక్కుకొనుటవలన లాభ మేమున్నది? దీనినుండి ముక్తినొందుట కేదేని యుపాయము కలదేమో కనుగొనవలయును" అని తలంచువాఁడును 43, సంసారమనినంతన మనస్సులో భయమొందుచు భజనము జేసికొన్నచోఁ దరింపఁగలమని తలంచుచు వర్తించువాఁడును సత్త్వగుణుఁడు 44. తన యాశ్రమమును తద్ధర్మమును నిర్వహించుచు సదా రామునియెడఁ బ్రీతిగలిగి వర్తించు వాఁడును, విషయసుఖములయెడ సంపూర్ణమగు నసూయగలవాఁడును, ముఖ్యముగాఁ బరమార్థమునెడ మానసము లగ్నము గావించుకొని సంచ రించువాఁడును, ఆపదలయందు ధైర్యముగలిగి ప్రవర్తించువాఁడును సత్త్వగుణుఁడు 45-46. ఎల్లప్పుడు కార్యదక్షుఁడుగ నుండనివాఁడును, బహువిధములగు భోజనములపయి నాసక్తి తొలగించుకొనువాఁడును, భగవద్భజనమునందు హత్తుకొన్న మనస్సుగలవాఁడును నగు మానవుఁడె సత్త్వగుణుఁడు 47. సంసారసంబంధములగు వస్తువులమీఁదికి మనస్సు పోనీయకుండువాఁడును, భగవంతుని దృఢమగు భక్తితో స్మరించు వాఁడును 48, లోకులు తనపయి నెన్నివిధములగు దోషము లాపాదించు చున్నను, విస్తారముగా వారలను బ్రేమించువాఁడును, హృదయమునందు బరమాత్ముని నిశ్చయరూపమును బాదుకొనఁజేసినవాఁడును 49, తన హృదయములోఁ దాను నేనెవఁడనని తలంచువాఁడును, సత్స్వరూప చింతనముగావించువాఁడును, దుష్టములగు సందేహముల నివారించుకొను

వాఁడును సత్త్వగుణుఁడు 50. ఈ దేహమునకుఁ గొంచెమేని సార్థకత్వము సమకూర్చవలయునను కోరిక హృదయమునందుఁ గలవాఁడును 51, శాంతియు, క్షమయు, దయయు, నిశ్చయము హృదయమం దుదయించిన యాతఁడును 52, అతిథిని అభ్యాగతుని ఆకలితోఁ బోవనీయక యాదరించువాఁడును, శక్తికొలఁది దానము గావించువాఁడును సత్త్వగుణుఁడు 53. దీనుఁడగు బిచ్చగాఁ డాశ్రయించుకొని వాఁకిలిముందుఁ బడియుండ నాదరించుటయు 54, ఇంటియం దాహారము తక్కువగా నున్నప్పుడు సైతము దీనులను గృపతోదిలకించుటయు, శక్త్యానుసారముగాఁ ద్యాగము గావించి యితరులను మన్నించుటయు సత్త్వగుణుని లక్షణములు 55. రుచినిజయించి మధురాదివస్తువులపయి మమకారములేనివాఁడును, విషయ సుఖములయందుఁ గోరికలేనివాఁడును, కామ్యములు లేనియాతఁడును 56, కాఁగలది కాకమానదు, జరుగవలసినది జరుగకపోదు, సంసారసంకటములు వచ్చుచుఁ బోవుచుండును అని అనుకొని యీశ్వరునియెడ హృదయము నిరంతరము నిలుపువాఁడును సత్త్వగుణుఁడు 57. ముఖ్యముగా భగవంతునికొఱకుఁ దనకున్నదంతయు విడచివేయుట, దేహమునెడ మమకారము లేకుండుట 58, విషయములవైపు వాసన పరుగెత్తుచున్నను జంచలింపకుండుట, అచలమగు ధైర్యముతోనుండుట సత్త్వగుణలక్షణము 59. ఆపదవలన దేహము కృశించుచున్నను, ఆకలి దప్పులవలన దహ్యమానమై మనస్సు పట్టుదప్పినను నిశ్చలభావముతో నుండువాఁడును 60, శ్రవణము, మననము, నిదిధ్యాసనము (మఱిమఱి తలంచుట) వలన హృదయమునకు సమాధానము కలిగినవాఁడును, విశుద్ధమగు నాత్మజ్ఞానముతో మెలంగునాతఁడును సత్త్వగుణుఁడనఁబడును 61. అహంకారము లేకపోవుటయు, వైరాగ్యముతో విలసిల్లుటయుఁ గృపాభావముతోఁ దక్కటిజీవుల నారయుటయు 62, అందఱితో నమ్రతగ సంభాషణము గావించుటయు, మర్యాదతోఁ బ్రవర్తించుటయు, అందఱకుఁ దృప్తికరముగా మెలఁగుటయు సత్త్వగుణములు గలవాని లక్షణము 63. అందఱియెడ మిత్రభావముగలవాఁడై యెవరితోనైనఁ బగఁబెట్టుకొనక పరోపకారముకొరకు జీవము నర్పణము గావింపనేర్చి 64 తన పనికంటె నితరుని పనియెడ శ్రద్ధ విశేషముగానుంచి నెరవేర్చుచు మరణాంతమున

భూలోకమునందుఁ దన నిర్మలకీర్తిని విడిచిపోవువాఁడు సత్త్వగుణుఁడు 65. ఇతరుల గుణదోషములను మనస్సునందు నుంచనియాతఁడును, సముద్రములో నేదైనవస్తువును వేయనదియెట్లు వెలుపలకుఁగొనివచ్చునో యటులే యితరుల గుణదోషములను హృదయమునందు నిలుపనివాఁడును 66, నీచవచనములను సహించుటయు, వానికిఁ బ్రత్యుత్తరము నీయకుండుటయు, వచ్చిన క్రోధము నుపసంహరించుకొనుటయు నభ్యాసముగాఁ గలవాఁడును సత్త్వగుణుఁడు 67. అన్యాయముగా నీవు దోషివని యెవఁడైన బాధించినను బహువిధముల దుఃఖపెట్టినను సహించి మనస్సులో నుంచుకొననివాఁడును 68, పరోపకారముకొఱకు దేహకష్టమును సహించువాఁడును, దుర్జనులయెడ సైతము చెడునడవడి ప్రకటింపనివాఁడును, నిందించువానికిగూడ నుపకారము గావించువాఁడును సత్త్వగుణుఁడని చెప్పఁబడును 69. మనస్సును ఇతరవస్తువులమీఁదకు విషయేచ్ఛలమీఁదికిఁ బోవనీయక యాపుకొనుటయు, నింద్రియ నిగ్రహము నొనర్చుటయు 70, ఉత్తమకర్మముల నాచరించుటయుఁ, జెడ్డకర్మములను ద్యజించుటయు, భక్తిమార్గము నెడ నాదరముంచి నడచుటయుఁ 71, ప్రాతఃకాలముననే స్నానముగావించుటయుఁ బురాణశ్రవణము నాదరభావముతో నొనర్చుటయు బహువిధములగు మంత్రములతో దేవతార్చనము గావించుటయుఁ 72, బర్వకాలములయందును, బూజాసమయముల యందును నుత్సవములను భగవత్ప్రీతికయి గావించుటయు, జయంతి యుత్సవముల యెడ నభిమానభావము ప్రకటించుటయు సత్త్వగుణుని లక్షణములు 73. విదేశములయందు మరణించిన దిక్కులేనివారలకు సంస్కారములు గావించుటయు, లేదా స్వయముగా నచ్చటకుఁబోయి కూర్చుండి యవసర కృత్యంబులు నిర్వహించుటయుఁ 74, బలువు రొకనిని గొట్టుచున్నప్పుడు పోయి విడిపించుటయుఁ, బ్రాణిని బంధనమునుండి తొలంగించుటయు 75, నిరంతరము శివార్చనము నియతిప్రకారము చేయుటయు, లక్షలకొలఁది బిల్వపత్రములను సమర్పించుటయుఁ, శివున కభిషేకము శాస్త్రవిధి ననుసరించి గావించుటయు, భగవన్నామ స్మరణమునందు విశ్వాసము గలిగి యుండుటయు, భగవద్దర్శన సమయమున స్థిరభావముతో నుండుటయు సత్త్వగుణుని లక్షణము 76. సాధుజనులనుగాంచి యానందించుటయు,

సాహసించి తోలుదోలుత వారికి భక్తిభావముతో నమస్కరించుటయు77, సాధుజనుల యనుగ్రహమునకుఁ బాత్రుఁడగుటయు సత్త్వగుణశాలి లక్షణము. సత్త్వగుణవంతుఁడు ఈశ్వరాంశసంభూతుఁడు 78. జనులకు సన్మార్గము జూపించుటయు, మానవులకు హరిభజనమునందాసక్తి కలుగఁ జేయుటయు, అజ్ఞానులకు విజ్ఞానము నేర్పుటయుఁ 79, బుణ్యసంస్కార ములు ప్రదక్షిణములు నమస్కారములు గావించుటలో నాసక్తియు, బహువిధములగు నుత్తమవిషయములు జ్ఞప్తియం దుంచుకొనుటయు సత్త్వగుణుని లక్షణము 80. భక్తివిషయమునం దుత్సాహము, గ్రంథ ములు మున్నగువానిని సేకరించుటయు, లోహవిగ్రహములను నానావిధ ములఁ బూజించుటయు 81, నిర్మలమగు పూజాసామగ్రియు, మాలికలు, ఉత్తరీయము, ఆసనము, పవిత్రోజ్వలమగు వస్త్రము మున్నగువానిని సమకూర్చుటయు 82, ఇతరులశ్రమకుఁ దాను వగచుటయు, నితరుల యా నందమును గాంచి సుఖించుటయు, మహాత్ముల విరాగమునుగాంచి సంత సించుటయు 83, బరుల సౌఖ్యము తన సౌఖ్యముగను బరుల దూషణము తన దూషణముగను భావించుటయు, నితరుల దుఃఖముగాంచి తాను దుఃఖించుటయు సత్త్వగుణుని లక్షణము 84.

నిష్కాముఁడై పరమాత్ముని భజించుటయు, ధర్మకార్యములను గావించుటయు సత్త్వగుణుని ప్రధాన లక్షణములని యెఱుంగవలయును 85. సత్త్వగుణుఁడె మానవలోకమును సంసారసాగరమునుండి దరికిఁ జేర్పఁ దగినవాఁడు. ఆతనివలననే జ్ఞానమార్గ మలవడి వివేక మతిశయించును 86. సత్త్వగుణమువలన భగవద్భక్తియు, జ్ఞానప్రాప్తియు, సాయుజ్యముక్తియు లభించును 87. ఇంతవఱకు సత్త్వగుణమునుగూర్చి సంక్షేపవృత్తాంతమును నా బుద్ధ్యనుసారముగ వివరించితిని. ఇఁకముందు శ్రోతలు చెప్పఁబోవు వర్ణనాంశమును ధ్యానదృష్టితో నాలకింపఁ గోరెదను 88.

---

## ఎనిమిదవ సమాసము — సద్విద్యా నిరూపణము.

శ్రోతలారా! సద్విద్యాలక్షణముల నాలకింపుఁడు. ఈలక్షణములు పరమపవిత్రములు. వీనిని విచారించినయెడల మనుజుఁడు తనంతటతానే

సద్విద్యావంతుఁడగును 1. సద్విద్యావంతుఁడగు మానవునియెడ నుత్తమ లక్షణములు విశేషముగా నుండును. ఇట్టి యుత్తముని గుణగణముల నాలకించినచోఁ బరమసంతోషము గలుగును 2. సద్విద్యావంతుఁడు వృద్ధికాముఁడును సత్త్వగుణ ప్రధానుఁడును ప్రేమస్వరూపుఁడును శాంతి శీలుఁడును క్షమాగుణుఁడును దయాభావుఁడును సత్కర్మతత్పరుఁడును అమృత వచనుఁడును నగును 3. సద్విద్యావంతులగు పురుషులు పరమ సుందరులై చతురులుగను మిగులబలవంతులై ధీరులుగను పరమధనవం తులై యుదారులుగను నుందురు 4.

సద్విద్యాకారణమున మానవులు పరమవిజ్ఞానులుగను, భక్తవత్సలు లుగను, మహాపండితులుగను, విరక్తిశీలురుగను, మహాతపస్వులుగను, శాంతమూర్తులుగను నుందురు. 5. ఇంతియగాక వక్తలుగను నిరాశా యుక్తులుగనుండి కీర్తిగడింతురు. సర్వజ్ఞులై యుండియును సద్గ్రంథ ములను సాదరభావముతో శ్రవణము గావించుచుందురు. శ్రేష్ఠులై యుండియు నందఱియెడ విధేయతను గలిగియుందురు 6. సద్విద్యావం తులు దాము రాజులముగదా యని విఱ్ఱవీఁగక ధర్మస్వభావముతో వర్తిం తురు. శూరులమని గరువింపక వివేకముతో మెలఁగుదురు. కోడెతనమున నుంటిమని పొంగక నియమానుసారముగ సంచరింతురు 7. పెద్దలు చూపినమార్గము ననుసరించుటయుఁ,గులాచారము ననుసరించి ప్రవర్తించు టయు, నుచితమగు భోజనముగావించుటయు, వికారరహితముగ వర్తిం చుటయు, వైద్యులై యుండి పరోపకారము నొనర్చుటయు, యశోవం తులై యుండుటయు సద్విద్యావంతుని లక్షణము 8. పాటుపడి పనిచేయు వారుగనుండి దురభిమానము ప్రకటింపమియు, గాయకులుగ విష్ణుభక్త లుగనుంటయు, వైభవమున్నదని గరువింపక భగవత్కథల నాదరముతో నాలించుటయు 9, తత్త్వవిదులై యుండియు నుదాసీనభావము వెల్లడించు టయు, విశేషజ్ఞులై యుండియు సజ్జనులుగ నుండుటయు, మంత్రాంగముల నెఱింగి గుణవంతులుగను నీతిమంతులుగను నుండుటయు సద్విద్యావం తునిలక్షణము 10. సాధుశీలము, పవిత్రవర్తనము, పుణ్యాకర్మాచరణము, అంతశ్శుద్ధి, ధర్మప్రియము, కృపాళుత్వము, కర్మనిష్ఠ, స్వధర్మాచరణము నందు నిర్మలస్వభావము, లోభరహితవృత్తి గలవారును, ప్రమాదమున

ననిష్టమగు కార్యమేదియేని గావించి యందులకుఁ బశ్చాత్తాపము నొందు చుండువారును 11, పరమాత్మునియెడఁ బ్రీతియు, సన్మార్గాచరణము, సత్క్రియా ప్రియత, ధారణ (భగవంతునిదప్ప మఱియొకటి యెఱుంగమి), ధృతి (ధైర్యము), శ్రుతి (వినికి), స్మృతి (తలంచుట),లీల, యుక్తి, స్తుతి, మతి, పరీక్ష మున్నగు నుత్తమవిషయములయందు నభిరుచియుఁ గలవారు సద్విద్యావంతులు 12. దక్షులు, ధూర్తులు, (సభ్యులు Gallant) యోగ్యులు, తార్కికులు, సత్యవంతులు, సాహిత్యవంతులు, నియమము నిర్వహించువారు, భేదము నెఱింగినవారు, కుశలులు, చపలులు, చమత్కారశీలురు నగువారు సద్విద్యావంతులు 13. ఆదరణము, సన్మానము, తారతమ్యము, మర్యాద, ప్రయోగము, సమయము, ప్రసంగము, కార్యకారణచిహ్నముల నెఱింగినవారలును, విచక్షణగా మాటలాడుట 14, సావధానభావము, ప్రయత్నలోలత్వ సాధకత్వము గలవారలును, వేదములను శాస్త్రములను సవిమర్శముగా నెఱుంగువారును, నిశ్చయాత్మకములగు జ్ఞానవిజ్ఞానములనుగూర్చి బోధ గావింపఁగలిగియుండువారును సద్విద్యావంతులు 15. పురశ్చరణము, పుణ్యతీర్థనివాసము, దృఢవ్రతము, శరీరక్లేశసాహనము, ఉపాసనాప్రియత, నిగ్రహబుద్ధి గలవాఁడును 16, నిరంతరము సత్యముపలుకుటయు, శుభకార్యము లొనర్చుటయు, మృదుమధురముగా మాటలాడుటయు నభ్యాసముగాఁగలవాఁడును, సుఖాత్మకమును నిశ్చయమును నగు మాటలు నుడువువాఁడును, ఆడినమాటల యెన్నటికిని జవదాటనివాఁడును, సద్విద్యావంతుఁడును నగు పురుషుఁడు సద్విద్యావంతుఁడు 17. విషయాదివాసనలయెడ దృష్టివహించువారును, గంభీరభావముతో మెలంగువారును, యోగములయందభినివేశము గలిగియుండువారును, భక్తులుగను సుప్రసన్నులుగను రాగహీనులుగను నుండువారును, సౌమ్యస్వభావము, సాత్త్వికశీలము, పరిశుద్ధాంతఃకరణము నిష్కపటవర్తనము, నిర్వ్యసన భావము గలవారును 18, చతురుఁడు, వ్యవస్థితుఁడు (శాస్త్రనిరూపిత నియమము గలవాఁడు) గుణగ్రాహి, అపేక్షారహితుఁడుగ నుండువారును, దోడిమానవులను దన పలుకుబడిలో నుంచుకొనుట, సమస్త ప్రాణులయెడ నడఁకువ చెలిమి గలిగియుండుట యభ్యాసముగాఁ గలవారును సద్విద్యావంతులు

19. ధనము స్త్రీ న్యాయము అంతఃకరణము ప్రవృత్తి నివృత్తి మున్నగువానియెడ నిస్సంగుఁడై యున్నవాఁడును, బరిశుద్ధాంతరంగముగ వర్తించువాఁడును 20, స్నేహభావముతో నెదుటివానికి హితము గావించుట, మధురవాక్యములను నుడివి రెండవవాని చింత తొలంగించుట, సామర్థ్యముతో నెదుటివారిని రక్షించుట, పురుషార్థములను నిర్వహించుచు లోకమునకు క్షేమము గలుగఁజేయుట అభ్యాసముగాఁ గలవాఁడును 21, సందేహములఁదీర్చి మానవుల నుద్ధరించువాఁడును, విశాలములగు భావములతో వక్తృత్వము వెల్లడించువాఁడును. సాధకుల సందేహములను దీర్చుటలో నేర్పరితనము గలవాఁడును, బెద్దలవద్ద విశేషాంశముల నెరుంగుటలో నుత్సాహముగలవాఁడును, పుణ్యకథలను శ్రద్ధమెయి నాలించువాఁడును సువిద్యావంతుఁడనబడును 22. వివాదములు కలుగని విధమున మాటలాడుటయు, సంగరహితుఁడుగను, నిరుపాధికుఁడు (బాధారహితుఁడు)నై వర్తించుటయు, ఆశారహితత్వము, క్రోధభావశూన్యత, నిర్దోషిత్వము, మాత్సర్యరాహిత్యము మున్నగు సుగుణములు గలిగియుండుటయు సువిద్యావంతుని లక్షణము 23. విమలజ్ఞాని, నిశ్చయాత్మకుఁడు, సమాధానచిత్తుఁడు, భజనపరుఁడు, సిద్ధుఁడై సాధకుఁడుగ నుండువాఁడు, సాధనములను గాపాడువాఁడు 24, సుఖరూపుఁడు, సంతోషరూపుఁడు, ఆనందరూపుఁడు, హాస్యరూపుఁడు, ఐక్యరూపుఁడుగ నుండువాఁడు, జనులనందఱను నాత్మరూపముగా దలంచువాఁడు 25, భాగ్యవంతుఁడు, విజయశీలుఁడు, స్ఫురద్రూపి, సుగుణవంతుఁడు, ఆచారవంతుఁడు, క్రియావంతుఁడు, విచారవంతుఁడు (ఆలోచించువాఁడు), స్థిరచిత్తుఁడుగ నుండువాఁడు సద్విద్యావంతుడనఁబడును 26. కీర్తిశాలియు, యశోధనుఁడును, శక్తిమంతుఁడును సామర్థ్యవంతుఁడును, వీర్యయుతుఁడును, వరములను బడసినవాఁడును, నిజము పలుకువాఁడును, పుణ్యకర్మము లొనరించువాఁడును నగు పురుషుఁడు విద్యావంతుఁడు 27. కళలను నేర్చినవాఁడును, సంపదలు కలవాఁడును, శుభలక్షణములతో నొప్పువాఁడును, సత్కుల ప్రసూతుఁడును, పరిశుద్ధుఁడును, బలవంతుఁడును, దయావంతుఁడగు పురుషుఁడును 28, యుక్తిమంతుఁడును, గుణవంతుఁడును, శ్రేష్ఠుఁడును, బుద్ధిమంతుఁడును, విస్తారధైర్య

వంతుఁడును, దీక్షావంతుఁడును, నిరంతరము సంతుష్టిగ నుండువాఁడును, ఆశారహితమనోవృత్తికలవాఁడును, రాగవిహీనుఁడును నగు పురుషుడు సద్విద్యావంతుఁడని తెలియనగును 29.

ఇట్టి యుత్తమగుణము గలవాఁడై యుండుట సద్విద్యావంతుని లక్షణము. ఈ గుణములను మానవు లభ్యసింపవలయుననియే యిట వివరించితిని 30. రూపము, చక్కఁదనము గావలయునని యెన్నివిధములఁ బ్రయత్నించినను లాభములేదు. ప్రకృతిసిద్ధమగు రూపమును సౌందర్యవంతముజేసికొనుట కెట్టియభ్యాసమేనియు నుపకరింపఁజాలదు. ఆగంతుకము లగు (సహవాసాదివశమున వచ్చు) సుగుణములను బొందుట కేదేని యుపాయమున్నచో నావశ్యకముగా వెదకికొనవలయును 31. సద్విద్య యనునది మానవుఁడు కడతేరుట కుపకరించు మంచివిషయము. ఇది సాధారణముగఁ బ్రతిమానవునియొద్దను నుండవలసియున్నది. విరక్తుఁడగు మానవునకుమాత్రము దీని యభ్యాసము మిగుల నావశ్యకము 32.



## తొమ్మిదవ సమాసము - విరక్తలక్షణము.

శ్రోతలారా! మీకిపుడు విరక్తుని లక్షణములను తెలుపఁబోవుచున్నాను. యోగుల కంతసామర్థ్యమును గలుగఁజేసిన యేగుణరాజములు విరక్తులు గడింపనగునో 1, సత్కీర్తిని వృద్ధిగావించునవియు, సార్థకత్వము గలుగఁజేయునవియు, మహాత్వము నభివృద్ధి జేయునవియు నగు నేగుణములు విరక్తు లభ్యసింపవలయునో 2, పరమార్థమును గడించుటకును ఆనందతరంగములపయి నోలలాడుటకును, వివేకయుక్తమగు వైరాగ్యము నభివృద్ధిజేయుటకును నే గుణములు విరక్తు లలవరచికొనవలయునో 3, సుఖము లభించుటకును, సద్విద్యను బ్రసన్నము గావించుకొనుటకును, మోక్షసహితమగు భాగ్యలక్ష్మిని దినదినాభివృద్ధి నొనరించుటకును నే గుణములు విరక్తులు సంపాదింపవలయునో 4, విరాగుల కోరికలు సఫలము గావించుటకును, సకలకామములను బూర్ణపఱచుటకును మధురముగా భాషించుటకును సరస్వతీదేవిని ముఖమునందు వసింపజేయుటకును విరక్తు లేగుణములు గ్రహింపనగునో వానిని జెప్పుచున్నాఁడ 5. శ్రోతలారా!

శ్రద్ధతో నాలకింపుఁడు. ఆలకించిన దంతతోఁబోవనీక హృదయములలోఁ బదిలపఱుపుఁడు. అటు లొనరించినచో మీరు భూమండలమునందు సుప్రసిద్ధులయ్యెదరు 6. విరక్తుఁడు వివేకి గావలయును. ఇంతియగాక యధ్యాత్మవిద్యను లోకమునందు మిక్కిలి ప్రచారములోనికిఁ దీసికొని రావలయును. మఱియు నింద్రియ దమనమునందు విరక్తుఁడు ధైర్యమును (దృఢత్వమును) జూపవలయును 7. విరక్తుఁడగువాఁ డెంతయో భారమును నిర్వహింపవలసి యున్నాఁడు. సాధనమార్గములను సురక్షితము లొనరించుటయు, జనులను భజనమునందు లగ్నము గావించుటయు, బ్రహ్మజ్ఞానమననేమియో ప్రజలకుఁ దేటతెల్ల మొనరించుటయు 8, భక్తిభావము మానవజాతికి అభివృద్ధినొనర్చుటయు, లోకులకు శాంతిని జూపించుటయుఁ, దన విరక్తిని యత్నముతో రక్షించుకొనుటయు 9, సదాచరణములను జేయుటలో నుత్సాహము ప్రజలకుఁ గలుగఁజేయుటయు, నివృత్తిమార్గమునెడ నభిమానము జనింపఁజేయుటయు, హృదయమునందు నిరాశ దృఢముగాఁ బాదుకొల్పుటయు విరక్తుఁడు ముఖ్యముగా నిర్వహింపవలసిన ధర్మములు 10.

ధర్మమును స్థాపింపవలయును. నీతి నవలంబింపవలెను. ఆదరపూర్వకముగా నోరుపును గాపాడుకొనవలయును 11. పరమార్థమును గూర్చి సహచరులకుఁ దెలియఁజెప్పవలయును. విచారణీయమును బాగుగా శోధింపవలయును. సన్మార్గమును సత్త్వగుణమును దమచెంత నిరంతరముంచుకొనవలయును 12. సుస్వభావులను గాపాడుచుండవలయును. ప్రేమస్వభావులను సంతృప్తిపఱుపవలయును. ఐహికములకు రోసి పరమార్థదానమును జేయుమని శరణుజొచ్చిన యమాయికజనుల నుపేక్షింపక యుండవలయును. ఈ యుత్తమగుణములు గలవాఁడె విరక్తుఁడు 13. విరక్తులు పరమదక్షులు (మిగుల నేర్పరులు) కావలయును. అంతఃకరణమునకు సాక్షిభూతులై, పరమార్థపక్షమును గ్రహించి 14, బహువిధాభ్యాసముల నొనర్చుచు సత్ప్రయత్నశీలురై వర్తింపవలెను. ఉపన్యాసములమూలమునఁ బడిపోయిన పరమార్థము మఱల మానవజాతికిఁ బ్రసాదింపవలయును 15. నిర్మలమగు నాత్మజ్ఞానము నుపదేశించుచు వైరాగ్యమును బ్రశంసచేయుచు నిశ్చయాత్మకమగు సమాధానము సాధకుల

కొనంగుచు 16, పర్వతిథులలో నుత్సవములను మహోవైభవముగాఁ గావించుచు భక్తులను దఱచుగా నొకచో సమావేశము చేయించుచు మధ్యమధ్య కలుగు నాటంకములను బాటింపక మహోత్సాహముతో ఉపాసనామార్గమును మిగులనిరివిగా విరక్తుఁడు ప్రచారములోనికిఁ దీసి కొని రావలయును 17. హరికీర్తనము చేయుట, అధ్యాత్మనిరూపణ ప్రచారముగావించుట, నిందించెడి దుష్టులను భక్తిమార్గమునందుఁ జేర్చి పశ్చాత్తాపతప్తులగునటు లొనరించుట 18, మానవజాతి కుపకారము సలుపుట, పడిపోయిన ప్రాచీనగౌరవమును బునఃప్రతిష్ఠ నొనర్చుట, శక్తికొలఁది పుణ్యమార్గము విస్తరింపఁజేయుట విరక్తునివిధి 19. విరక్తులు స్నానము, సంధ్య, జపము, ధ్యానము, పుణ్యతీర్థయాత్ర, భగవద్భజనము నిత్యనియమముగాఁ జేయనగును. మఱియు బాహ్యపవిత్రతతోఁబాటు అంతఃకరణశుద్ధిగూడఁ గలిగియుండవలెను 20. దృఢమగు మనోనిశ్చయము గలిగియుండవలెను. సంసారమును సుఖపూర్ణమొనరించి సత్సాంగత్యముచేఁ బ్రజలను గడతేర్చవలెను 21. విరక్తులు ధైర్యవంతులు గను, త్యాగశీలురుగను (భక్త్యాది) నిరూపణమునందు ఆసక్తిగలవారలు గను 22, సావధానులుగను, శుద్ధమార్గమున సంచరించువారలుగను, జీవితమును బరోపకారమునందు వ్యయపఱచి కీర్తిరూపముతో జీవించువారలు గను నుండవలయును 23. విరక్తులు తమశక్తికిఁ దామానందింపక యింకను మహానుభావులగు విరక్తులెందుందురో విచారించి వారిజాడలు గుర్తింపవలెను. సాధువులెవరో యెఱుంగవలెను. సజ్జనులను, యోగులను, సాధువులను కలిసికొని వారిస్నేహము సంపాదింపవలయును 24. పురశ్చరణము సలుపుట, తీర్థాటనము (పుణ్యతీర్థయాత్ర) నొనరించుట, నానావిధములగు ప్రదేశములలో నాలయములు బృందావనములు నెలకొల్పి పరమ రమణీయములు గావించుట 25, సంసారసంబంధములగు సత్కర్మముల నాదరించుట విరక్తునిధర్మము. కాని సంసారకర్మబద్ధుఁడై కర్మములలో లిప్తుఁ డెన్నఁటికిని గాఁగూడదు. ఇంతియగాక యేవిషయమునందేని దురాశను దరికిఁ జేరనీయఁజనదు 26. విరక్తులు అంతర్నిష్ఠులుగా నుండవలయును. క్రియాభ్రష్టు లెన్నఁటికినిం గాఁగూడదు. పరాధీనతయందుఁ జిక్కి వ్యర్థులు గాఁజనదు 27. సమయమునెఱింగి ప్రవర్తింపవలయును. ప్రసంగములను

బరీక్షింపవలయును. వేయేల, సమస్తవిషయములయందును విరక్తుఁడు చతురతగలవాఁడుగ నుండవలయును 28. విరక్తుఁడు ఏకదేశిగా (పరిమిత జ్ఞానవంతుఁడుగ) నుండక సమస్తవిషయముల నభ్యసించి, యంతతోఁ దృప్తినొందక యేఁదేని తెలిసికొనవలసినది మిగిలెనేని దానినిగూడఁ బూర్ణముగాఁ దెలిసికొనవలయును 29. హరికథ, ఆధ్యాత్మనిరూపణము, సగుణభజనము, బ్రహ్మజ్ఞానము, పిండజ్ఞానము, తత్త్వజ్ఞానము మున్నగు వాని స్వరూపము విరక్తుఁడు బాగుగా నెఱింగి యుండవలయును 30. కర్మమార్గము, ఉపాసనామార్గము, జ్ఞానమార్గము, సిద్ధాంతమార్గము, ప్రవృత్తిమార్గము, నివృత్తిమార్గము మొదలగువాని నన్నింటిని సమగ్రముగా నెఱింగి 31, ప్రేమస్థితి, ఉదాసీనదశ (కర్మములు మొదలగువాని నంటకుండుట) ధ్యానస్థితి, విదేహదశ, సహజస్థితి మొదలగువిషయములను పూర్తిగాఁ దెలిసికొని విరక్తుఁడు సర్వజ్ఞుఁడు ననఁదగియుండవలయును 32. ధ్వని, లక్ష్యము, ముద్రలు, ఆసనములు, మంత్రము, యంత్రము, విధి; విధానము, బహువిధమతములమర్మము విరక్తుఁడు తెలిసికొన్నవాఁడుగ నుండవలయును 33. విరక్తుఁడు ప్రపంచమునకంతకును స్నేహితుఁడై, స్వతంత్రుఁడై, విచిత్రచరిత్రుండై, బహువిధగుణవంతుఁడై యుండి 34, యేవిషయములయందేని రక్తిలేక వర్తింపవలయును. హరిభక్తుఁడుగను, అలిప్తుఁడుగను, నిత్యముక్తుఁడుగను 35, శాస్త్రములను దఱచి సారమును నెఱింగినవాఁడుగను, నానావిధములగు పాషండమతములను (వేదబాహ్యమతములను) రూపుమాపువాఁడుగను, ముక్తిగోరువారలను శుద్ధమార్గమున బ్రవేశపెట్టుటలో సమర్థుఁడుగను విరక్తుఁడుండవలయును 36. ప్రజలకు శుద్ధమగు మార్గమును జూపించుచు; బ్రజలసందేహములను నివారించుచు, మనుష్యమాత్రులనందఱను దనవారలుగఁ జేసికొనుచు 37, నిందయొనర్చువారలకు వందనములను సమర్పించుచు సాధకులకుఁ బ్రబోధము గలుఁగ జేయుచు, నంతతోఁబోక సంసారబద్ధులకు మోక్షమార్గము జూపి మేల్కొల్పుచు విరక్తుఁడు లోకోద్ధరణమునఁ బాటుపడవలయును 38. ఉత్తమగుణములను గ్రహించి, యవగుణములను విసర్జించి, వివేకబలముచే నానావిధములగు నాటంకములను దూరముచేయువాఁడే నిజమగు విరక్తుఁడు 39.

ఈ యుత్తమలక్షణములను ఏకాగ్రబుద్ధితో నాలింపవలయును. విరక్తులగు పురుషులు వీనిని బరిహాసము గావింపఁదగదు 40. పయిని జెప్పఁబడిన విరక్తలక్షణములను నేను సహజస్వభావముతో మీకు విశద మొనరించినాఁడను. వీనిలో మీకెన్నిసాధ్యమగునో చూచి యన్నింటిని గ్రహింపుఁడు. చాల చెప్పితిని. ఇందువలన శ్రోతలు వినుటలో విసుగు చెందవలదని (ఉదాసీనులు కావలదని) కోరుచున్నాఁడను 41. ఈ విరక్త లక్షణములను మానవులు గైకొనలేని వారికి అవలక్షణత్వము సిద్ధించును. ఇంతియగాక యట్టివారు చదివినమూర్ఖు లనిపించుకొందురు 42.

---

## పదియవ సమాసము — చదివినమూర్ఖుల లక్షణము.

గతసమాసమునందు మూర్ఖులలోఁ జతురత్వమేర్పడుటకు నేయే లక్షణము లవసరమో వానిని వివరించితిని. ఇప్పుడు చతురులని పేర్కొనఁ బడుచు మూర్ఖులుగ నుండువారల లక్షణములు నివేదించుచున్నాఁడను 1. ఎట్టివారిని జదివిన మూర్ఖులందురో తెలియుటకయి వారి లక్షణములను దెలుపుదును. వారి లక్షణములను నాలకించి శ్రోతలు విచారింపవలదని నాప్రార్థనము. ఏలయన, అవగుణములను విడచి పెట్టుటవలన సుఖము లభించునుగదా 2. బహుశ్రుతుఁడుగను, బుద్ధిమంతుఁడుగను, స్పష్టమగు బ్రహ్మజ్ఞానము బోధించువాఁడుగను నుండి హృదయమునందు దురాశయు దురభిమానమును వీడఁజాలని వాఁడు చదివినమూర్ఖుఁడు 3. ముక్తావస్థను బ్రతిపాదించు సగుణభక్తిని విడనాడఁగోరువాఁడును, స్వధర్మమును, సాధనములను నిందఁగావించు వాఁడును 4. తనకున్న పరిజ్ఞానమును బురస్కరించుకొని యందఱియెడ దోషములను స్థిరపఱచువాఁడును బరులయెడఁగల లోటుపాటుల వెదకు వాఁడును 5, శిష్యుఁడెందేని తెలిసితెలియక పొరపాటుచేసినను సంకటముల పాలైనను గటువచనములాడి యాతని హృదయమును నొప్పించువాఁడును జదివినమూర్ఖుఁడు 6. రజోగుణప్రధానుఁడు, తమోగుణప్రధానుఁడు, గపట హృదయుఁడు, మనస్సులోఁ గుటిలభావము గలవాఁడు, తనమహత్త్వము వైభవము పొగడుకొనువాఁడు 7. గ్రంథములను సమగ్రముగాఁజూచి

తత్త్వము గ్రహింపక దూషణము గావించువాఁడు, మంచిగుణములను
దుర్గుణములుగా భావించువాఁడు 8, సులక్షణముల అవలక్షణములుగఁ
దలంచువాఁడు, మత్సరమువహించి పరులతోఁ దగవులాడువాఁడు, నీతి
న్యాయములయందు దుడుకుతనముజూపువాఁడును జదివిన మూర్ఖుఁడనఁ
బడును 9. నేను తెలిసినవాఁడనని గరువించి మొండిపట్టుబట్టరాదు.
క్రోధమునాపుట కభ్యాసపడవలయును. చేయునదియొకటి చెప్పునదియొక
టిగ నుండఁజనదు 10. అధికారము లేకున్నదని యెఱింగియుఁ బదిమందిలో
నేదియో జెప్పఁబోఁగూడదు. పరులను గఠినవచనములచే నొప్పింపఁజనదు.
ఈ లక్షణములకు వ్యతిరేకముగ నుండువాఁడొక చదివినమూర్ఖుఁడు 11.
తాను బహుజనులకడ నేర్చినయంశములను నితరులెఱుంగరనియు నితరులు
తనవలె మాటలాడలేరనియు గరువించి వక్తలయెడ లోపము లారోపించు
వాఁడును 12, ఇతరులపై దానారోపించులోపము స్వయముగఁ దన
యందుఁగూడ నున్నను దాని నెఱుంగనియాతఁడును 13, అభ్యాసముజేసి
సమస్తవిద్యలను దెలిసికొని యావిద్యల నుపయోగించి జనుల నానంద
పఱుపఁజాలనివాఁడును 14, స్పర్శసుఖ కారణమున నేనుఁగు నీటిలోఁ
జిక్కుకొనునట్లును పుష్పరసముమీఁది యాసచేఁ దుమ్మెదలు ముండ్లలోఁ
దగుల్కొని చచ్చునట్లును జక్కఁగ నెఱింగి ప్రపంచమునఁ జిక్కినవాఁడును
15, స్త్రీలను వెంటనంటి యుండువాఁడును, బ్రహ్మజ్ఞానమునుగూర్చిన
సంభాషణములు స్త్రీలతోఁ గావించువాఁడును, నిందనీయములగు వస్తు
వులయెడ నభిమతము జూపువాఁడును జదివినమూర్ఖుఁడు 16. శరీరమునకు
హీనత్వము గలుగఁజేయు విషయములను దృఢముగ మనస్సునఁ బాదు
కొల్పి యుంచుకొనుటయుఁ, దనదేహమును దనసుఖమును జూచుకొను
టలో నాసక్తియు 17, భగవంతునిమఱచి మానవులను గొనియాడుటయు,
జూచినదానినెల్ల నభివర్ణించుటయు 18, స్త్రీల యంగకములను జూచి
నంతన ముగ్ధుఁడై వర్ణించుటయు, నానావిధములగు నాటకములను వేష
ధారులయొక్కయు స్త్రీ పురుషులయొక్కయు హావభావములనే యెన్ను
టయు, నీశ్వరుని మఱచుటయుఁ జదివినమూర్ఖుని లక్షణములు 19.
తాను వైభవముగలవాఁడనని విఱ్ఱవీగుచు తోడిమానవులను దుచ్ఛు
లుగఁ దలంచువాఁడును, పాషండ (వేదబాహ్య) మతమును సిద్ధాంత

మొనరించువాఁడును 20, వ్యుత్పన్నుఁడును (శాస్త్రాదిజన్యజ్ఞానము గల వాఁడును) వీతరాగియును, బ్రహ్మజ్ఞానియును, మహాయోగియును నై యుండియు జగత్తునుగూర్చిన భవిష్యద్విధము జెప్పఁదొడంగువాఁడును 21, దాను విన్నవిషయమునుగూర్చి గుణదోషచర్చ యనవసరముగ మనస్సులోఁ గావించువాఁడును, ఇతరుల శ్రేయస్సులుగాంచి యోరువఁ జాలనివాఁడును జదివినమూర్ఖుఁడని నాతలంపు 22. భక్తిసాధనము గ్రహించి భజనము చేయకపోవుటయు, వైరాగ్యమునం దాసక్తిలేమియుఁ, క్రియాశూన్యమగు బ్రహ్మజ్ఞానమును బోధించుటయు 23, తీర్థక్షేత్రము లయం దాదరభావము లేకపోవుటయు, వేదశాస్త్రముల నంగీకరింప కుండుటయుఁ బవిత్రమగు కులమున జన్మించియు నపవిత్రముగ వర్తించు టయు 24, నితరు లాదరించినంతన ప్రీతినొందుటయు, గీర్తిశూన్యుఁడగు మూఢుని గొనియాడుటయు, వెంటనే యనాదరించి నిందఁజేయుటయు నాచారముగ గలవాఁడు చదివినమూర్ఖుఁడనఁబడును 25. ముందొకటియు వెనుకనొకటియుఁ జెప్పునదియొకటి చేయునదొకటియుగ నుండువాఁడును 26, ప్రపంచములయందుఁ దత్పరభావము గలిగియుండువాఁడును, బర మార్థమునందు భక్తిగలవాఁడును, అధికారమదమునఁ దన పరిజ్ఞానము గోల్పోయినవాఁడును 27, బరుల నానందపఱచుటకు సత్యముతొలంగి కల్లలాడువాఁడును,బరాధీనముగ బ్రదుకునాతఁడును జదివినమూర్ఖుఁడు 28. బాహ్యాడంబరములను బ్రకటించువారలును, జేయరానిపను లొనరించువా రును, మార్గమును మఱచియుండియు నిదమిత్థమని హఠముగా వివాదము గావించువారును 29, రాత్రింబవ ళ్ళుత్తమగ్రంథముల నాకర్ణించియుఁ దనకుఁగల దుర్గుణములను విడనాడలేనివారును, స్వయముగాఁ దన హిత వేదియో గుర్తింపలేనివారును 30, నిరూపణసమయమునందు వచ్చి కూర్చుండియున్న శ్రోతలనుగాంచి వారి దోషములను బహిరంగపఱచు వారును జదివినమూర్ఖులలోనివారు 31. శిష్యుఁడు విద్యావివేకశూన్యుఁడై యప్రతిష్ఠాకరములగు పనులు చేయుచుండుట స్వయముగా నెఱింగియు నాతనిపయి నమ్మకముంచుగురువు 32, గ్రంథశ్రవణము గావించునపు డెవరేని కొంచెము తప్పుఁజేసినయెడల వానిపయిఁ గ్రోధమూని యాక్షే పించువక్తయు 33, వైభవమును జూచుకొని మదించి సద్గురు నుపేక్షా

దృష్టితోఁగాంచు శిష్యుఁడును, గురుపరంపరను దాఁచినసాధకుఁడును 34, జ్ఞానోపదేశమును స్వార్థముకొరకు (తన కుటుంబ పోషణమునకు) గావించు బోధకుఁడును, శిష్యులను బీడించి లోభివలె ధనమును బ్రోగుచేయు దురాశాపరుఁడును, బరమార్థమును ద్రవ్యముకొర కుపయోగించు నవివేకియుఁ జదివినమూర్ఖులలోఁ జేరదగినవారు 35. తాను స్వయముగా ననుష్ఠింపనివి పరులకు బోధగావించుటయు, బ్రహ్మజ్ఞానివలె బయటి కాడంబరముగా భాషించుటయు, గోస్వామియై పరాధీనవృత్తిలో నుండుటయు 36, సంపూర్ణమగు భక్తిమార్గమును విడనాడుటయుఁ, దనకు హానికలిగించు పనులొనరించుటయు 37, గృహస్థాశ్రమము దైవవశమునఁ దొలఁగిపోయినను బరమార్థమునందుఁ గొంచెమేని యభిరుచి లేకుండ వర్తించుటయు, దేవబ్రాహ్మణులయెడ ద్వేషభావము ప్రకటించుటయు నేరియందుఁ గలదో వారిని చదివినమూర్ఖులుగా గణింపవలయును 38.

దుర్గుణములను త్యాగముగావింతురని శ్రోతలారా! మీాముందుఁ జదివినమూర్ఖుల లక్షణముల నివేదించితిని. మీారు బుద్ధిమంతులుగానఁ జెప్పుటలో జరిగిన యెక్కువ తక్కువలకు క్షమింపుఁడు 39. సంసారదుఃఖమునకు సరియగుదుఃఖ మింకొకటి ప్రపంచములో లేదుగాన సంసారములో నేదో సుఖమున్నదని దేవులాడువాఁడు పరమమూర్ఖులలో నగ్రగణ్యుఁడు 40. సంసారమునందుఁగల దుఃఖములేవో సుఖములేవో ముందుసమాసమున నిరూపింపనున్నాఁడను. మాతృగర్భముననున్నపుఁడును జనించిన పిదపను బ్రాణి యెట్టి దుఃఖములపాలై శ్రమల ననుభవించుచున్నాఁడో యది యంతయు మీాకు నివేదించెదను. సావధానమతితో నాలింపగోరెదను 41.

## రెండవ దశకము సమాప్తము.



# మూడవ దశకము.

## మొదటి సమాసము — జన్మదుఃఖ నిరూపణము.

దుఃఖమునకును, శోకమునకును, భయమునకును జన్మమే యుత్పత్తి స్థానము 1. కర్మములకు మూటయుఁ, బాపములకు నెలవును, గాల నియతిచేఁ గలుగు దుఃఖములకు నునికిపట్టును నగు నీజన్మమును వర్ణింప నేరితరము? 2. జన్మము కువిద్యాఫలము. ఇంతియగాదు, మోహాకమ లము, జ్ఞానహీనతచేఁ గలుగుభ్రాంతికిఁ దెఱయు 3, జీవునకు బంధనము, మృత్యువునకు హేతువునై యంతలోఁబోక జీవుని నిర్బంధించునదిగ నున్నది 4. పూర్వసుఖము లీజన్మముకతననే మఱపునకు వచ్చుచున్నవి. శారీరములు మానసికములు నగు విచారముల కీజన్మమే యాటపట్టువు. కర్మవాసనలు విస్తరముగా వ్యాపించి జీవుని బంధించుట కీజన్మమే ప్రధాన హేతువు 5. జీవునకు దుర్దశగలుగుట కీజన్మమే ముఖ్యకారణము. మమ కారమను ఢాకినీపిశాచి సంసారముచేయుటకు ననువగుతావీజన్మమే 6. మాయకుఁ బుట్టినిల్లును, గ్రోధమునకు మందిరమును, మోక్షమును గడిం చుట కంతరాయమును 7, జీవుడు"అహం"(నేను)అనుదానిని బ్రసాదించు నదియు, నహంకారము నభివృద్ధిపఱచునదియుఁ, బరాత్పరుఁడగు నీశ్వరునే మఱపించునదియు నగు నీజన్మమునకుఁ గల విడ్డూరపుఁ బెంపుఁ బొగడ నశక్యము 8. ఇదియే ప్రాణికి విషయసుఖములందుఁ బ్రియము గలుగఁ జేయుచున్నది. దురాశాశృంఖలములను బ్రాణి కిదియె తగిలించుచున్నది. కాలపురుషుఁడు మిగులఁ బ్రీతితో నారగించు ఫలరాజముగూడ నిదియే 9. జన్మము నెత్తుటచేతనే ప్రాణికి విషమపరిస్థితు లేర్పడుటయు వికటకాలము చేరువయగుటయు భయంకరమగు నరకమునఁ గూలుటయుఁ దటస్థమగు చున్నది 10. జన్మమునకు శరీరమే సాధనము. దీని పుట్టుపూర్వోత్తరము లనుగూర్చి బాగుగా యోచించితిమేని ప్రపంచములో దీనికి సమానమగు నమంగళపదార్థ మింకొకటి లేదని స్ఫురించును. రజస్వలాసంపర్కమున

నీకళేబర ముదయించినది 11. అత్యంతదూషితమగు రజస్వలాసతియొక్క రజస్సె యీకళేబరము. దీనికి నిర్మలమెక్కడనుండివచ్చును? 12. రజస్వల యొక్క రక్తము (రజస్సు) అంతయు నొక్కచోఁ బ్రోవయి తొలుత యొకబుగ్గగా నేర్పడును. క్రమముగా నా బుగ్గనుండియే యీశరీర మేర్పడినది 13. ఈశరీరము చూచుట కెంతయో సుందరముగా నున్నది. కాని లోపల నరకపు మూట పెట్టఁబడియున్నది. ఇంతయేల, ఈదేహమొకనిధమగు చర్మభాండము (తోలుసిద్దె). దీనిలోన నంతయు దుర్గంధముగాన మూఁత తెఱచుటకె వీలుకాదు 14. అయ్యయ్యో! ఈదేహమును బ్రమాదమున భాండమంటిని. భాండమును శుభ్రముగాఁ గడిగితిమేని కల్మషమంతయుఁ బోవును. శరీర మట్టిదికాదు. స్నానమనుపేరితో మన మీదేహమును బ్రతిదినమును బలుమారు కడుగుచున్నారము. దుర్గంధభూయిష్ఠమగు నిది కొంచమేని పరిశుభ్రము నొందకున్నది. కాన భాండముతోఁ బోల్చుట యనుచితముసుమా! 15. భగవంతుఁ డొక యస్తి పంజరమును నిలువఁబెట్టినాఁడు. దానిని నాడీనివహముతోఁ జుట్టినాఁడు. హెచ్చుతగ్గులు సరిపడుటకై మజ్జా (ఎముకలలోని చమురు) మాంసముల నందందు సవరించి నింపినాఁడు. చాలు. ఇంకేమున్నది? శరీర మేర్పడినది 16. పేరునుబట్టి చూచినను శుద్ధముగానిదగు అశుద్ధము (రక్తము) ఈదేహమునందు నిండియున్నది. అంతియగాక యీదేహమునందు నానావిధములగు రోగములు దుఃఖములు పాదుకొనియున్నవి. "శరీరం వ్యాధిమందిరమ్" అందురుగదా 17. ఈ కళేబరము నరకపుఁబెంటతో నిండియున్నది. దేహమునందున్న యీపెంట మానవుని దలక్రిందుఁజేయుచున్నది. ఈదేహములో నొకభాగమున దుర్గంధబంధురమగు మూత్రకోశమంటుకొనియున్నది 18. లోపల నానావిధములగు జంతువులు కీటకములు క్రేవులు నిండియున్నవి. బహువిధములగు దుర్గంధములకు దీనిలోనిభాగ మాలవాలము. లోపలనుండి బయటికి మిగుల నసహ్యాకరమగు తోలు వ్యాపించి కళేబరమును గప్పియున్నది 19. సంపూర్ణములగు నన్నియవయవములలోఁ దలను శ్రేష్ఠతమమైనదానిగ గణింతురు. అందుఁగూడ ననేకాసహ్యములు గలవు. తలనుండి ముక్కులోనికి మిగుల నేవము గూర్చు కఫము (చీమిడి) ప్రవహించుచున్నది. చెవినుండి యొకప్పుడు

చీము గారుచుండును. అప్పుడు జనించు దుర్గంధమును సహింపఁ జాలము 20. కనులనుండి పుసి బయలుదేరును. ముక్కు చీమిడితో నిండియుండును. ప్రాతఃకాలమున నోటినుండి మలమువంటి దుర్వాసన బయలుదేరును 21. ఉమ్మియుఁ జొంగయుఁ బిత్తరసము కళ్ళె దగ్గు మొదలగు నసహ్యాకరమగు పదార్థములను వెడల్రగక్కు ముఖమును గమలమనియుఁ జంద్రబింబమనియుఁ జెప్పుచుందురు 22. ముఖముసంగతి యటులుండనిండు. ఉదరము మలభాండము. దీనినిండ మలము మూలుగుచున్నది. ప్రత్యక్షముగఁ గానవచ్చు దీనికొఱకు నితరప్రమాణ ములతోఁ బనిలేదు. "ప్రత్యక్షం కిం ప్రమాణం?" 23. ఎన్నియుత్త మోత్తమ పదార్థములను దినినను నవి యుదరమున జేరి మలముగా మారును. లేదా వాంతిరూపమున బయటికివచ్చును. పరమపావనమగు గంగోదకము గ్రోలినను నదియు నుదరగోళములోనికిఁ బోయి మూత్ర ముగా మాఱిపోవును 24. కావున మలము మూత్రము వమనములే యీదేహమునకు జీవమును బ్రసాదించునవియైయున్నవి. ఈ దేహము పెరుగుట కివియె యాధారము. దీనిలో సంశయమున కవకాశము లేదు 25. పొట్టలోనుండి మలమూత్రములుగాని వమనముగాని బయ టికి రానిచో నెల్లరు మరణించుట నిశ్చయము. ధనవంతుఁడైనఁ గానిమ్ము, దరిద్రుఁడైన గానిమ్ము, ఉదరములో మలముండియేతీరును 26. నిర్మలముగా నుంచుదమని యుదరస్థములగు విరేచనాదులు తీసివేయుదు మేని యాదేహము తప్పక నశించును 27. శరీరము రోగరహితముగ నున్నప్పుడే యీవిధముగ మలమూత్ర భాండముగ నున్నది. దానికి దుర్దశకలిగనేని యప్పటిస్థితి నేరీతిగ వర్ణింపగలను? 28. అనేకవిధములగు నపాయముల నొందును. జీవుఁ డీగర్భకోశములోఁ బూర్తిగాఁ దొమ్మిది మాసములు వసింపవలయును. ఆ సమయమున నవద్వారములును మూసికొనిపోయియుండును. లోన గాలివీచుట కవకాశ మెక్కడిది? 29. శిశువు తల్లిగర్భములోని వమనమునను విరేచనమునను మునిఁగితేలుచు జఠరాగ్నిచేఁ బరితపించుచు నుండును. ఇంతియెగాక జఠరాగ్నిచే గర్భస్థుఁ డగు బాలుని యస్థిమాంసాదులు మలముల మాడుచుండును 30. చర్మము పూర్తిగ దేహమున కల్లుకొనకపోవుటచేఁ దల్లిగర్భమునందున్న

శిశువు ఎట్టిబాధకు లోనైనను ఆ బాధయంతయుఁ తల్లికిఁ జెందును. తల్లి భుజించు వేడివేడి వస్తువులవలన గర్భస్థుఁడగు శిశువు ఉడికిపోయి పరితపించును 31. ఎచట పిండ మిమిడియుండునో యచటనే (గర్భకోశమునందు) మలము సంచియున్నది. అచటనే నాభినాళమునుండి శిశువునకు నేదో కొంతరసము లభించుచుండును 32. మలము, మూత్రము, వాంతి, పిత్తము మున్నగువానివలనను నాసికనుండియు ముఖమునందుండియు బయలుదేరు మురికిపదార్థమువలనను గర్భస్థుఁడగు శిశువు అతిశయముగాఁ గలవరపడుచుండును 33.

ఇట్టి కారాగృహ ప్రాయమగు మాతృగర్భమునందు శిశువు బాగుగా నిర్బంధింపఁబడి పడియుండును. అప్పుడీశిశువు భయపడి యీ విధముగా నుడువ నారంభించును. "ఓ యీశ్వరా! నన్నీ నిర్బంధము నుండి బయట పడవేయుము 34. దైవమా! ఈసారికి నన్ను నీవీ నిర్బంధమునుండి విడిపించెదవేని నాకు సత్యమగు హితమును నేనే గావించుకొందును. ఇఁక నీ గర్భవాస కష్టము కలుగకుండుటకై యెన్నియో పుణ్యకార్యము లొనరించెదను" 35. శిశువు మాతృగర్భమునఁ బొందిన యవస్థలు దుర్భరములగుటచే నింక నెన్నేని యిట్టి ప్రతిజ్ఞ లొనరించును. తరువాతఁ గొంతకాలమునకు శిశువునకు జన్మసమయము సమీపించును. ఆసమయమునఁ దల్లి ప్రసూతివేదనలకు భరింపజాలక హృదయము కరిగి పోవునటుల నేడువ నారంభించును 36. గర్భమునందున్న శిశువునకు ముక్కునిండ నోటినిండ మాంసము నిండి పేర్కొనియుండును. ఇందుచే శిశువు గర్భములోనున్నంతకాలము మస్తకములోఁ గాలి పీల్చుచుండును. జననసమయమునందు శిశువునకు మస్తకముగూడ మూసికొనిపోవును 37. మస్తకద్వారము మూసికొనిపోవగానే శిశువు హృదయము మిక్కిలి భయపడును. భయముచే నేమియుఁదోచక గర్భకోశములో నలు మొగములను గొట్టుకొన నారంభించును. 38 ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆగిపోవుటచే నా ప్రాణి మిగుల భయమునొంది మార్గము కనిపించకుండుటచే నెంతయో దుఃఖమొందును 39. భయభీతులవలన నొకానొకప్పు డాశిశువు మాతృయోనియందుఁ దట్టుకొని ముందునకు రాఁజాలక యందే యాగిపోవును. ఇపుడీ పిండమును గోసి బయటికిఁ దీయవలయును.

కేకున్న తల్లి ప్రాణమునకె యపాయము వచ్చునని చూడవచ్చినవారు చెప్పుదురు 40. వారిమాటలు పాటించి చికిత్సకులు తట్టుకొన్న శిశువును నిపెట్టి చేయి, కాలు, ముఖము, ముక్కు, పొట్ట లోనగువానిలో నేది క్కిన దానిని గోసి వెలికిదీయుదురు 41. తునకలు తునకలుగాఁ కేయుటచే శిశువు వెంటనే మరణించును. తల్లిగూడ నొక్కొక్కప్పుడీ యవస్థలోఁ దన ప్రాణములను గోలుపోవును 42. ఈ విధముగా నా శిశువు తాను జచ్చుటయేగాక తల్లిప్రాణమునుగూడ దీయును. శిశు ిటుల గర్భవాసమున ననేక దుఃఖముల ననుభవించును 43. అదృష్టవశ మున నొకవేళ శిశువునకు సరియగు యోనిమార్గము దొరకినచో నా సమ యమునఁగూడ నొక్కొక్కప్పుడు వెనుకనుండి భుజములో మెడయో కట్టుకొనును 44. జనులప్పు డాశిశువును బలవంతముగా సంకుచితముగ నున్న యోనిమార్గమునుండి బయటికిఁ దీయుదురు. ఈవిధముగా నెందఱో శిశువులు దుర్మరణ మొందుచున్నారు 45. ప్రాణము పోవునపుడు స్మృతి తప్పిపోవుటచే శిశువు గర్భకోశములో నవస్థలొందుతఱి గావించిన ప్రతిజ్ఞ లన్నింటిని మఱచిపోవును 46.

గర్భములోనున్నపుడు శిశువు 'సోహం, సోహం' (నేనేబ్రహ్మ మును. నేనేబ్రహ్మమును) అని నుడువును. వెలుపలకు రాగానే పూర్వ స్మరణము మఱచిపోయి 'కోహం, కోహం' (నేనెవఁడను? నేనెవఁడను?) అని నుడువును. శిశువీవిధముగా గర్భవాసమునం దెన్నియో కష్టముల బొందుచున్నాఁడు 47. గర్భదుఃఖమునుండి బయటకువచ్చిన శిశువునకుఁ బూర్వము దానొందిన యవస్థలు తలంపున కెన్నటికిని రావు 48. వృత్తి శూన్యమగును. మనస్సునందేదియు జ్ఞాపకముండదు. అజ్ఞానమువలన హృదయము భ్రాంతిలోఁ బడిపోవును. సంసారదుఃఖము లన్నింటిని సుఖ ములుగాఁ దలంచుకొనును 49. దేహమును ధరించి నేలబడినదిమొదలు ప్రాణి తానొందిన సుఖముగాని కష్టముగాని మఱచిపోవును. ఈ విధ ముగా జీవుఁడు మాయాజాలమునందుఁ జిక్కుకొనును 50. గర్భవాసము నందు బ్రతిప్రాణికిని నీలాటికష్టములు దుఃఖములు సంభవించుచుండును. ఇందువలననే యీశ్వరుని శరణుజొరమని పెద్దలు చెప్పుచున్నారు 51. పరమేశ్వరునియెడ దృఢతరమగు భక్తిగల పుణ్యాత్ములు జననమరణ

రూపమగు బాధనుండి బయటపడి ముక్తులుగానున్నారు. పుణ్యాత్ములగు నిట్టి యోగ్యులు జ్ఞానబలమువలన సదా విరక్తులుగ నుందురు 52. ఈ గర్భవాస సంబంధమగు కష్టముల నన్నింటిని యథామతిగా వర్ణించి నాఁడను. ఇఁకముందు సావధానమతితో శ్రోతమహాశయులు చెప్పఁబోవు దాని నాలింపఁ గోరెదను 53.

## రెండవ సమాసము – స్వగుణపరీక్ష 1.

### (బాల్యము, యౌవనావస్థ)

సంసారమె సమస్త దుఃఖములకు మూలకారణము. ఇచట దుఃఖాగ్నికణము లంటుకొన నారంభించును 1. వెనుకఁ జెప్పిన గర్భవాస వ్యాకులమునంతయు శిశువు జన్మించినతోడనే మఱచిపోవును. తరువాత దినదినక్రమమునఁ బెరుగ నారంభించును 2. బాల్యమునందు శిశువు మేని మీఁది చర్మము మిగుల సుకుమారముగ నుండును. అందుచేత శిశువు కొంచెము దెబ్బసోకినను సహింపజాలక విలపించును. ఆ సమయమునందు సుఖమునుగాని దుఃఖమునుగాని పరులకుఁ దెలుపుదమన్న నోరులేదు 3. శరీరమునం దేదేని కష్టముగలిగినను, ఆఁకలితో వ్యాకులపడుచున్నను శిశువు మిగుల విలపించును. ఎంతయేడ్చిన నేమిఫలము? శిశువు మనస్సు లోని సంగతి నెవ్వరును గ్రహింపఁజాలరు 4. తల్లి పైనుండి యోదార్చును గాని లోన నేబాధకలిగినదో, యేల శిశువు యేడ్చుచున్నదో గ్రహింపఁ జాలదు. శిశువునకుఁ బలుమాఱు దుఃఖము కలుగుచునేయుండును 5. శిశువు తేపతేపకు వెక్కి–వెక్కి– యేడువసాగును. తల్లి చంకనెత్తుకొని యెన్నోశ్రమలఁబడి యోదార్ప నారంభించునుగాని యే వెతచే బిడ్డ యేడ్చుచున్నదో యామె యెటుల గ్రహింపగలదు? పాపమాశిశువు తనలోఁదాను వ్యాకులపడుచునే యుండును 6. వ్యాధులు మాటిమాటి కిని శిశువునకుఁ గలుగుచుండును. వానిబాధలకు సహింపఁజాలక వాయెత్తి బిగ్గరగా నేడ్చును. అఱచును. పడును. మండు యగ్నిహోత్రమునఁ బడి దేహము గాల్చుకొనును 7. శిశువున కెట్టి యపాయము కలుగకుండఁ గాపాడుట యసాధ్యమగు పని. ఆధివ్యాధుల మూలమున నెన్నియో యుపద్రవములు కలుగును. ఒక్కొ–క్క–ప్పుడు దుర్ఘట పరిస్థితులేర్పడి

బాలుఁడు దుర్మరణము నొందును 8. దైవవశమున నా దుర్ఘట పరిస్థితులు తొలఁగి పూర్వపుణ్య ముదయమైనచో దినదినక్రమముగా వృద్ధి నొంది తల్లిని గుర్తింపసాగును 9. ఒక క్షణమైనఁ దల్లిని జూడకుండెనేని దుఃఖముతో వెక్కి-వెక్కి- యేడువ మొదలుపెట్టును. ఆ తరుణమున శిశువునకుఁ దల్లితో సమానముగఁ బ్రియకరమైన దెద్దియునులేదు 10. తల్లి వచ్చుచున్నదను నాశతో దిక్కులు వెదకును. తల్లిలేకున్నచోఁ గొంచెమేని యూరడిల్లకుండును. శిశు వీస్థితిలోఁ దల్లి తన్నొకనిముసము సేపు విడనాడినను సహింపక విలపించును 11. బ్రహ్మాదిదేవతలు వచ్చినను లక్ష్మీదేవియే స్వయముగావచ్చి బుజ్జగించినను శిశువు తనతల్లిలేకున్నయెడ సంతోషింపదు 12. ఎంత కురూపిణియైనను, ఎంత యవలక్షణురాలైనను, ఎంత దురదృష్టవంతురాలైనను బాలకునికిఁ దల్లియే మిగులఁ బ్రియతరమగు పదార్థము. అంతకుమించిన ప్రియమగు పదార్థ మింకొకటిలేదు 13. తల్లిలేని శిశువు దీనముగను హీనముగను గనుపించును. శిశువును దల్లికోపించి యావలకు నెట్టినయెడల నాశిశువు మఱల నామెనే కౌగలించుకొనును 14. తల్లిసాన్నిధ్యమున శిశువు ఎన్నివిధములైన సౌఖ్యములో యనుభవించును. ఆమె దూరమైనంతన వ్యాకులపడును. ఇంతయేల, చిన్నతనమునఁ దల్లియెడ నింతయనరానిప్రీతి యుండును 15. కాలవశమునఁ దల్లిగతించిన యెడల శిశువు మాతృహీనమగును. ఆ దురవస్థలోఁ దల్లికయి అమ్మా! అమ్మా! యని హృదయము కరగిపోవునటుల నేడ్చును. భయముచేఁ గంపించును 16. అమ్మ కానరాకున్నచో శిశువు మిగుల దైన్యముతోఁ గనుపడినవారలనెల్లఁ దేరిపారఁ జూచుచుండును. అమ్మ మరల వచ్చునని శిశువునకు మనస్సులో ఆశవంటి భావ మొకటి యంటుకొనియుండును 17. తల్లియే కాఁబోలునను భ్రాంతితోఁ గనిపించినవారినెల్ల నదేపనిగఁ జూచుచు వారలు తనతల్లి కాదని గ్రహించి పాపము శిశువు ముఖముప్రేలవైచికొని దీనత్వముతో నిరాశనొందును 18. మాతృవియోగమున దుఃఖించి క్రమక్రమముగా శిశువు దుర్బలమై కృశింప మొదలుపెట్టును 19. దైవయోగమునఁ దల్లిబ్రతికియున్నచో శిశువును వేయికనులతోఁ గనిపెట్టి కాలోచితముగఁ బెంచుటచే శైశవావస్థ క్రమక్రమముగా విడిపోవును 20. ఒక్కొ-

క్కదినము గడచినదిమొదలు శిశువు తెలివితేటలు గడించి తల్లిని వదలి పోవలయునని తలంచును 21.

క్రమముగా శిశువునకు ఆటపాటలయం దుత్సాహ మారంభ మగును. ఆటలాడుకొనుటకు నీడుజోడుబాలురను బిలుచుకొని గుంపుచేసి వారితోఁ గాలయాపనముచేయును. తానోడిపోయినచో విచారపడుచుఁ, దాను గెలిచినచో నానందించుచు శిశువు క్రీడలతోఁ గాలముబుచ్చును 22. శిశువు పెద్దవాఁడైనచో నైదవయేట నక్షరాభ్యాసము చేయింతురు. తల్లిదండ్రులు మిగులఁ బ్రేమతో జదువుచెప్పించుచున్నప్పుడు బాలుఁడది మిగుల దుఃఖముగా భావించును. ఆటలాడుకొనుచున్న బాలురతోఁగూడి తాను గడించు ఆనందమునందె బుద్ధియుంచును 23. బాలురతో నాట లాడుతరుణమునఁ దల్లితండ్రులు మున్నగు వారెవ్వరును బాలునకు జ్ఞాపక మునకు రారు. ఒక్కొక్కప్పు డాటలలోఁ బ్రమాదకరమగు పరిస్థితు లాకస్మికముగాఁ దటస్థమగును 24. ఆటలాడుచుఁ బ్రమాదమునఁ బడరాని తావునబడినయెడలఁ బండ్లూడిపోవును. గుడ్లుచిదికి నీరుగారిపోవును. కాళ్లు విరుగును. నడుమునకు దెబ్బతగిలి గూనివాఁడగును. మదము దిగిపోవును. ఇంక నెన్నియో దుర్దశలు తటస్థమగును 25. అట్లు కాదేని దైవికముగాఁ గొన్ని వ్యాధులలోఁ దగుల్కొనును. స్ఫోటకముపోయును. తలలోఁ బోటుపుట్టును. జ్వరము తెంపులేక వచ్చుచుండును. హృదయశూలయో వాతప్రకోపమో కలుగును 26. భూతప్రేతాదుల పీడవలన శిశువున కేదియో రోగమువచ్చినదని తలిదండ్రులు మిక్కిలి విచారపడుదురు 27. బేతాళగ్రహమో కంకాళగ్రహమో బాలుని బట్టినది, బ్రహ్మగ్రహము బాలు నావేశించినది, కాదుకాదు, ఏదియో గాలిసోకినది, అయ్యయో! ఏదియో నిర్ణయింపఁజాలకుంటిమని చుట్టపక్కములు పలుకుచుందురు 28. వీరు లావేశించిరని యొకఁడనును. ఖండేరావు (ఈ పేరి దేవతావిశేషము మహారాష్ట్రదేశమునఁ గలదు) ఆవేశించినాఁడని వేఱొకఁడనును. ఇవి యన్నియు నమ్మదగినవికావు, వ్యర్థమగు నాలోచనలు, ఇవి బ్రహ్మరాక్షసి చర్యలే యని యింకొకఁడు నిశ్చయించును 29. ఎవఁడో గిట్టనివాఁడు ప్రయోగము చేసినాఁడని మఱియొకఁడనును. ఎవరో భూతవైద్యులు దుష్టగ్రహము నీబాలునిపై నావేశపఱచిరని యొక్కఁడు తెల్పును.

ఇంతతో నూరకుండరు. దేవీపూజలో నేదియో యపచారము గావించి నాఁడు ఇది దాని ఫలితమని కొందఱందురు 30. ఇదియంతయుఁ గర్మాను భవమని వేదాంతులు వాకొందురు. ఈ విధముగా దేహమున ననేక రోగముల నుత్పన్న మొనరింతురు. అనంతరము ప్రసిద్ధులగు రాజవైద్యులు భూతవైద్యులు చికిత్సకు దొరకొందురు 31. ఒకవైద్యుఁడీతఁడిక బ్రదుకుట దుస్తరము, నమ్మకము లేనిదిగ నున్నదనును. ఇంకొకఁడు, వీఁడుచావఁడు పాపకారణమున యాతనల నొందుచున్నాఁడని పలుకును 32. ఈ ప్రకార ముగా నెటులో వ్యాధిబాధలొందియొంది మృత్యుముఖమునుండి బయట పడఁగానే త్రివిధపాపములచేఁ గ్రమక్రమముగాఁ దప్తుఁడై పరితాపమునకు లోనగును. ఇంతియగాక సంసారదుఃఖములతోఁ బ్రాణి బహువిధములగు దుఃఖముల ననుభవించును 33. ఇంత గ్రంథము జరిగినపిమ్మటఁగూడ నొక వేళ మానవుఁడు సజీవుఁడై యున్నచోఁ గొట్టియు నూరిపోసియుఁ గోప గించియుఁ దల్లిదండ్రు లాతనిని సంసారవ్యవహారములలో దక్షుని గావింతురు 34.

కొంతకాలము గడిచినమీఁదట మావానికిఁ బెండ్లియీడు వచ్చె నని తల్లిదండ్రులు పెండ్లిముచ్చటల నారంభింతురు. బహువిధములగు వైభవములను జూపించి కడకుఁ గన్యానిశ్చయము గావింతురు35. పెండ్లికిఁ దరలిపోవుటలోఁ జేయు మహావైభవములకు బాలుఁడు మిగుల నానందిం చును. వివాహానంతరము బాలుని హృదయమును అత్తవారి యి ల్లాకర్షించును 36. తల్లిదండ్రు లేమైపోయినను సరియే అత్తవారియింటఁ గొన్నివిశేషముల సమకూర్ప యత్నించును. తనవద్ద ద్రవ్యములేనియెడల వడ్డికయిన ద్రవ్యమును దెచ్చును 37. తల్లిదండ్రుల నొకప్రక్కకుఁద్రోసి అత్తవారిసంబంధులపయి బాలుఁడు ప్రేమ మిక్కుటముగా నుంచును. అంతియగాక తల్లిదండ్రులు కష్టములు సహించుటకే జనించిరని వారినిఁ బ్రేమతోఁజూడక యాదరింపక విడిచిపెట్టును 38. బాలుఁడు క్రమక్రమ ముగా యువకుఁడగును. పెండ్లికుమార్తె మరల నిద్రకు తనయింటికిరాగానే యువకుని యుత్సాహమునకు మేరయుండదు. ఇంక నాతో సమానులు లేరని భార్యను జూచి మురియనారంభించును 39. భార్య గృహమున లేకున్నప్పుడు తల్లిదండ్రులతో సోదరసోదరీలతోనిండిన తనయిల్లు శూన్య

గృహాముకై వడిఁ గనిపించును. అవిద్యాకారణమునఁ గ్రమముగాఁదనను దామఱచి యువకుఁడు కేవలము స్త్రీ మోహామున మునిగి తేలుచుండును 40. సంభోగము జరుగనప్పుడే భార్యపయి నింతప్రేమ భర్తకుఁ బెంప గును. స్త్రీ వయస్సువచ్చి కాపురమునకు వచ్చినపుడు మర్యాదోల్లంఘ నము గావించుననుటలో వింతయేమున్నది ? దంపతులకు నొకరిపయి నొకరికిఁ గ్రమక్రమముగాఁ బ్రేమ వృద్ధియగును. ఇరువురి ప్రాణములు కామమునందుఁ దగుల్కొనును 41. ఒకక్షణమునేపేని యువకుఁడు తన భార్యను జూడకున్నయెడల మనస్సు పరితప్తమగును. ప్రియకరమగు నా స్త్రీరత్నము మనస్సు నాకర్షించును 42. కోమలములును మంజుల ములును నగు మాటలు, అడఁకువ సిగ్గు ప్రకటించు ముఖకమలము, ఓర చూపులతో విలాసములొలయు నేత్రములు మున్నగునవి యువకు నాకర్షించును 43. ఈ విధముగాఁ దన చెలువపయిఁ గలుగు కామో ద్రేకము నాపుట యెంతవానికేని యశక్యము. అటులే శరీరవ్యాకులము గూడ నాపుట దుస్తరము. కామోద్రేకికి తర ప్రయత్నములయందు హృదయము లగ్నముకానేరదు. ఉదాసీనుఁడై యుండుటయే యప్పుడు సౌఖ్యమనిపించును 44. ప్రయత్నములు వెలుపల గావింపవలసియున్నది. మనస్సు తన చెలువపయి నిమిడియుండును. క్షణక్షణమును యువకుని హృదయమునఁ దనచెలువ రూపురేఖావిలాసములు కనిపించుచుండును 45. పురుషునితోఁ గలసినపుడు సుందరి బాగుగా మనసిచ్చి "ప్రియుఁడా ! నీవు నాప్రాణములకుఁ బ్రాణమవు; నావలపులపంటవు" అని పలికి యెంతయేని మోహాము గలుగఁజేసి యాతని హృదయమును దొంగిలించివైచును 46. దారిదోపుడుదొంగలు తమ వేషభాషలను మార్చుకొని సంచరించుచు బాటసారుల గొంతుకల కురివైచి ధనములను దొంగిలించునట్లు యువ తియుఁ గొడుకులును ఆప్తజనులును యువకుని హృదయమును లోఁగొందురు. ఈ విషయము వయస్సునున్నంతవరకుఁ దెలియదు. చావఁ బోవుముందు బాగుగా గ్రహింపఁగలుగును 47. ప్రీతియంతయుఁ దన ప్రియురాలిపై నుంచి యువకుఁడు తన్మయుఁడై యుండును. ఒకవేళ నెవ రేని తన ప్రియురాలియెడ ననిష్టము ప్రకటించిరేని యువకుఁడు కొంచెమేని సహింపఁజాలఁడు 48. తన స్త్రీపక్షము వహించి తల్లిదండ్రులను దిరస్క-

రించి నీచభాషణము లాడుటకుఁగూడ సాహసించి యవసరమయిన వేఱు కాపురము బెట్టును 49. తన చెలువను బురస్కరించుకొని యువకుఁడు సిగ్గువిడిచిపెట్టును. మిత్రత్వమును విడనాఁడును. తనస్నేహితు లందఱితోఁ గూడ నాయమకతననే పగ గొనితెచ్చుకొనును 50. క్రమక్రమముగాఁ బరదాస్యమున కలవాటుబడి తనదేహమును విక్రయించును. సేవకవృత్తికి లోనగును. వివేకమునంతయును గోలుపోవును 51. అతివ్యామోహమును అనువిధేయవృత్తిని పరాధీనభావమును గడించును 52. లోభియు మోహియునై క్రమక్రమముగా ధర్మమును విడిచివేయును. తీర్థయాత్ర లకుఁ బోఁడు. కులాచార గౌరవాదుల గంగలోఁ గలుపును. ఇట్టి దురా చారములన్నియు యువకునకు స్త్రీ కారణముననే సిద్ధించును 53. స్త్రీ కారణముననే పురుషుఁడు శుభాశుభములనుగూర్చిన విచారణము మాను కొనును. తనువును మనస్సును ధర్మమును ధనమును సర్వస్వమునుగూడ స్త్రీకిఁ బురుషుఁ డనన్యభావముతో సమర్పించును 54. పరమార్థమును విడచి పెట్టుటయు, సత్యమగు హితము గ్రహింపకపోవుటయు, భగవంతుని ముందు అప్రమాణుఁడుగనుంటయుఁ బురుషునకు స్త్రీ కారణముననే సంభవించును. కామమునఁ జిక్కుకొని పురుషుఁ డెందులకుఁ గానివాఁ డగుటస్సైతము స్త్రీ కారణముననె 55.

పురుషుఁడు కామినీమోహమునఁ జిక్కుకొని కావించుదోషము లెన్నేనిగలవు. భక్తినివిడిచిపెట్టును. విరక్తిభావమును జేరువకు రానీయఁడు. సాయుజ్యముక్తినిగూడఁ దుచ్ఛముగాఁ దలంచును 56. బ్రహ్మాండమును గూడఁ దన స్త్రీకారణమున లక్ష్యముగాఁ దిలకింపఁడు. స్నేహితులను దుష్టులని నిశ్చయించును 57. ఈవిధముగా యువకుఁడు స్త్రీప్రేమయందు మగ్నుఁడై సమస్తయోగ్యవిషయములతోడను సంబంధము త్రెంచి వేయును. ఇంతలో నాకస్మికముగఁ దన వలపులబంటయుఁ జక్కదనాల పెంకియునగు భార్యమరణించును 58. దీనితో యువకునిజీవితము మాఱి పోవ నారంభించును. హృదయమునం దింత యనరాని విచారము వృద్ధి యగును. తనలోఁదాను 'ప్రబలమగు ఘాత జరిగినది. నాగృహస్థాశ్రమము కూలిపోయినది' అని పరితపించును 59. దుఃఖముచే భ్రాంతుఁడై యిటులఁ గలువరించును "ఓ ప్రాణప్రియురాలా! నన్ను విడిచిపెట్టి పోతివిగదా?

నీవు మరణించుటచేఁ బూదోటవలెనున్న నాగృహము కూలిపోయినది. నా యజ్ఞానము నశించినది. ఇఁక మాయను విడచెదను" 60. మృతినొందిన తనప్రియురాలి కళేబరమును జంఘులమీఁదనుంచుకొని రొమ్ము బాదుకొని విలపించును. అనంతరము కనఁబడినవారిముందెల్ల నా బంగారుపంట నా వలపులదీవి నా పున్నెముల గని మాయమైపోయినదని సిగ్గువిడిచి మృత భార్యను గొనియాడుచుండును 61. కడకు యువకుఁడు మనస్సు నెటులోఁ గుదురుపఱచుకొని సాటివారితోఁ 'నాయిల్లు మునిగిపోయినది. ఇకముందీ గృహస్థాశ్రమకూపములోఁ బడను' అని వ్యర్థప్రతిజ్ఞలుగావించి విచారాతి శయముచే నోడలుమరచి యేడవఁదొడఁగును 62. పత్నీవియోగకారణ మున భయభ్రాంతుఁడై గృహస్థాశ్రమమునెడఁ దొలుత విముఖుఁడగును. పిదప విరాగమును దుఃఖమును బురస్కరించుకొని యోగిగనో లేక మహా త్ముఁడుగనో మారును 63. అటుల జరుపఁడేని గృహమును గృహస్థ ధర్మమును విడనాడఁజాలక రెండవవివాహమునకై ప్రాఁకులాడి యొక చిన్నదానిని బెండ్లాడును. అదిమొదలా క్రొత్తభార్యయే తనసుద్ధరించునది యని తన్మయుఁడై పంచప్రాణములు దానిపైనుంచును 64. ఈ రెండవ సంబంధపు భార్యపయిఁ దనసంతోషము ప్రేమ లగ్నమొనరించి మానవుఁ డేవిధముగా వర్తించునో యా వివరమునంతయు శ్రోతలు రాఁబోవు సమాసములో వినఁగోరెద 65.



## మూఁడవ సమాసము — స్వగుణపరీక్ష 2.

### ( రెండవ వివాహమువలని దుర్దశ, సంతానోత్పత్తి )

పురుషుఁడు రెండవవివాహము జరిగినంతన పూర్వదుఃఖమునంతయు మఱచిపోవును. సుఖపడఁదలఁచి మరల గృహస్థాశ్రమములోఁ దగుల్కొ నును 1. తొలుత యింతయనరాని లోభత్వ మేర్పడును. కడుపునిండ నన్నముగూడ భుజింపఁడు. ద్రవ్యముకొరకవసరమైనచోఁ బ్రాణమునైన విడచుటకు సిద్ధపడును 2. ఎప్పుడైన ననసేల? కల్పాంతమందుఁగూడ గవ్వ యేని వ్యయముగావింపఁ దలంపఁడు. మఱల మఱల ధనము ప్రోగుచేయు చుండును. హృదయమునందు సద్వాసనకుఁ గొంచమేని తావొసంగఁడు 3.

స్వయముగా ధర్మము గావింపఁడు. ఇతరులు ధర్మము గావింతురేని యూటంకపరచును. సాధుజనులను లేనిపోనివి కల్పించి నిందగావించును 4. తీర్థములు, వ్రతములు, అతిథులు, అభ్యాగతులన్న నేవగించును. చీమల నోటియందున్న ధాన్యపు గింజలనుగూడ నేరి కూడఁబెట్టఁదలంచును 5. స్వయముగాఁ బుణ్యకార్యముల నాచరింపఁడు. ఇతరులు పుణ్యకార్యముల గావించుచున్నచోఁ గనులారజూడలేఁడు. ఇతరులపుణ్యము వాని హృదయమునకుఁ గొంచమేని రుచింపదు. మంచిమాటలతోఁ బుణ్యాత్ములను బొగడకతూలనాడ మొదలుపెట్టును 6. దేవతలను నిందించుటయో భక్తులఁ బరిహాసించుటయో దేహబలముతో విఱ్ఱవీగుచు నితరులకు దుఃఖముగూర్చుటయో నియతవ్రతముగా బెట్టుకొని ద్వితీయవివాహి పరపీడ కలిగించును. నిష్ఠురవాక్యములనాడి యితర హృదయములను నొప్పించును 7. నీతిని విడిచి దుర్నీతితోఁ బ్రవర్తించుటయు, సదా గర్వముతో విఱ్ఱవీగుటయు 8, పెద్దలను మోసగించుటయు, శ్రాద్ధాది పితృక్రియలు మానుటయుఁ, గులదేవతల పూజలు విడచిపెట్టుటయు నియత కృత్యముగాఁ బెట్టుకొనును 9. తనకు భోజనమెప్పు డవసరమని తోఁచునో యప్పుడే దేవతానైవేద్య మొనరించును. బ్రాహ్మణభోజనస్థానమునందుఁ దన్నుఁజూడవచ్చిన బావమరఁదిని గూర్చుండఁబెట్టి భుజింపఁజేయును 10. హరికథయన్న గంటగించును. ఈశ్వరునియందు లక్ష్య మేమాత్రము నుంచడు. స్నానము సంధ్య గావించుట వ్యర్థము, దానివలన నుపయోగ మేమని వాదించును 11. కామ్యములందుఁ బూర్తిగా మగ్నుఁడై ధనము ప్రోగుచేయుచుఁ గానవచ్చినవానినెల్ల నమ్మించి నష్టేటముంచును. తరుణత్వసంబంధమగు మదమునందు లీనుఁడై యున్మత్తునికైవడి యొడలెఱుంగక వర్తించును 12.

ద్వితీయ వివాహితుఁడగు యువకుఁడు సిఁడు యౌవనమున నుండుటవలన స్థిరబుద్ధితో నుండజాలక యకృత్యములను మహాపాపములను జేయసాగును 13. నేను పెండ్లాడిన బాల మిక్కిలి చిన్నది. చిత్తమును జలింపనీయక నిలుపుటకు నాతరముగాదు. కాన స్వేచ్ఛగ వర్తింతునని మనస్సును సమాధాన పఱచుకొని విషయలోలుఁడై పరకాంతాగమనమునకు దొరకొనును 14. జారవృత్తికి లోనైనది మొదలు ఈమె

తల్లి, ఈయమ తోఁబుట్టువు అను భేదములుమఱచి పరద్వారములలోఁ బడియుండి పాపకార్యము లెన్నెని చేయును. న్యాయస్థానములలోఁ డా నొనరించిన దోషములకు రాజకీయదండనముగూడ ననుభవించును. అప్పటికిని తన దుష్ప్రవర్తనమును గొంచమేని సవరించుకొనఁడు 15. పరస్త్రీని గాంచినంతన యాతనికిగామ ముదయించును. పాపమునకుఁ బాల్పడి తరువాత తటస్థించిన కష్టముల నన్నిఁటిని భరించును 16. ఇంక నెంతటి పాపములఁ జేయుటకేని వెనుకడుగు వేయఁడు. శుభముగాని యశుభము గాని విచారింపఁడు. సుఖవ్యాధులు దేహమున జీర్ణమగుటచే నాకస్మికముగా మహారోగియగును 17. క్షయరోగముచే నానావస్థలుపడుచుఁ దానొనరించిన పాపములకు ఫల మీభూలోకముననే యనుభవించును18. రోగములచే శరీరమంతయుఁ బగులును. ముక్కు చితికిపోవును. ఇదివఱకున్న సులక్షణములన్నియు నొకదానివెంట నొకటిగా దుర్లక్షణములుగా మాఱును 19. దేహమునందు నీరస మతిశయించి క్రమముగా క్షీణించి పోవును. అనేకవ్యథ లుత్పత్తియగును. పడుచుదనపు సత్తువ సన్నగిల్లును. ప్రాణి బొత్తిగా నెండిపోవును 20. శరీరమునం దంతటను బాధ యుదయించును. దేహము దుర్దశకుఁ బాల్పడును. శరీర మాపాదమస్తకము గజగజ వణక నారంభించును. శక్తియుండదు 21. చేతులుకాళ్లు ఊడి పోవును. శరీరమునందంతటను బుండ్లుపడి పురుగులుపడును. వానినిజూచి పెద్దలు చిన్నలు అసహ్యించుకొని కేకరించి యుమ్మివేయుదురు 22. కడుపొకప్రక్కను ఆఁకలిచే మలమలమాడుచుండును. నలుదిక్కులనుండి యింతనరాని దుర్వాసన బయలుదేరును. ప్రాణిపూర్తిగా దుర్గతికె బాల్పడును. ఇన్నియవస్థలు పడుచున్నను ప్రాణముమాత్రము పోదు 23. 'ఓ యీశ్వరా! నాకు మరణము నిప్పుడు ప్రసాదింపుము. ప్రాణములు భరింపఁజాలకున్నాఁడను. ఎన్నియో పాపము లొనరించితిని. నాదోషముల నేనెఱుంగకుంటి'నని తనలో వాపోవును 24. దుఃఖము నాపఁజాలక వెక్కివెక్కి యేడ్చును. తన శరీరమును జూచుకొనుకొలఁది హృదయమునందుఁ బరితాప మతిశయించుచుండును 25. ఈ ప్రకారముగా ననేకకష్టముల ననుభవించును. అన్నియు దుర్దశలుగా మారును. వీఁడు నేకరించిన ధనమునంతయు దుష్టులు బందిపోటుగావించియో దొంగి

లించియో గొనిపోదురు 26. అనంతర మీతని కిహలోకముగాని పర లోకముగాని సమకూరదు. విచిత్రమగు ప్రారబ్ధము నెత్తిమీఁదఁ గూర్చుండి యెన్నివిధములనో యాటలాడించుచుండును. పరమాసహ్యాకరములగు దుఃఖముల నెన్నింటినో యనుభవించుచు మొండిబ్రతుకు బ్రతుకును 27.

ఈ విధముగా మానవుఁడు నానావస్థలు పడినపిమ్మట నాతని పాప సామగ్రి దినక్రమమునఁ దగ్గిపోవును. క్రమముగా శరీరవ్యథలుగూడ నొక దానివెంట నొకటి తొలఁగిపోవును. వైద్యు లనుగ్రహించి దివ్యౌషధముల నొసంగుదురు. అనంతరము జవసత్త్వము లేర్పడి యారోగ్యము గడించి సంచరింప మొదలుపెట్టును 28. ఎటులో మృత్యుముఖమునుండి బయట పడినంతన లోకులుజూచి 'పాపము! చచ్చుచున్నవాఁడు బ్రదికినాడు. వీనిది పునర్జన్మమే. మనుజులలోఁ గలిసినాఁ'డని యందురు 29. ఇంత జరిగిన పిమ్మట కార్యముజరుపుకొని తన రెండవభార్యనింటికిఁ గొనివచ్చును 30. గృహస్థధర్మమునకుఁ గావలసిన పదార్థములను జక్కఁగా సమకూర్చును. స్వార్థబుద్ధిమాత్రము ఇన్నియవస్థలు పడినమీదనైన నశింపదు 31. కొంత ధనమును కొన్నివస్తువులను సమకూర్చును. సంతానము కలుగమిచే విచారమునొంది యిల్లుమునిగిపోయినటుల దుఃఖపడును. పుత్రసంతానము లేకపోవుటచేఁ దనజీవితము వ్యర్థమైనటులఁ దలంచును. సంతానము లేని యాడుదానిని లోకులు గొడ్డురాలని యందురు. కొడుకులు కలుగక పోయినమానె, కొమార్తెలైనఁ గలిగినచో గొడ్డురాలనిపేరు పోవునుగదా యని దంపతులు తలంచుచుందురు 32. అదిమొదలు సంతానము కలుగు టకుఁ బురుషుఁడు నానావిధములగు నుపాయములను వెదుకనారంభించును. పెక్కువేల్పులకు మొక్కును. ముడుపులను గట్టియుంచును. తీర్థ యాత్రలకేగి యుపవసించును. బహువిధములగు పాషండవ్రతములఁ జేయును 33. అంతతో విషయసుఖములు మూలబడును. తన భార్య వంధ్యమయ్యెనను చింతతో నిలువు నీరగును. ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మటఁ గులదేవత ప్రసన్నురాలగును. సంతానము కలుగును 34. ఆ శిశువుమీఁద నింతయనరానిప్రేమ కలుగును. స్త్రీ పురుషు లిరువురును క్షణమాత్రముగూడ నాశిశువు నేమరకయుందురు. ఒకవేళ నేదేని

యనారోగ్యము కలిగినచో దీర్ఘస్వరముతో బిగ్గరగా విలపింతురు 35. ఈ ప్రకార మాదంపతులు దుఃఖము లనుభవించుచుఁ గన్నకన్న వేల్పులకెల్ల మ్రొక్కుకొందురు. ఇంతలో నాకస్మికముగాఁ బూర్వపాపకారణమున నాబాలకుఁడు మరణించును 36. దీనివలన మిగుల దుఃఖముకలుగును. ఇంటిలోఁ బుత్రశోకము వ్యాప్తియగును. ఈశ్వరుఁడు మమ్ము వంధ్యల నేల గావించెనోయని దంపతులు విలపింతురు 37. 'మాకీద్రవ్య మెందులకు? అంతయు బోయినను సంతోషమే. సంతానము కలిగినజాలును. సంతానము కొఱకు సర్వస్వము విడువవలసివచ్చినను మాకు లక్ష్యములేదు' అనిపలుకు చుందురు 38. వంధ్యాత్వముపోయి కొంతకాలమేని గడువలేదు. ఇంతలో మృతకవంధ్య (బ్రదుకని బిడ్డలఁగనెడుస్త్రీ) యనునామ మేర్పడినది. ఇప్పు డేయుపాయములతో నా కులకాంత కీపేరు తొలంగింపగలనని భర్త విల పించును 39. దంపతులు గతించినసంతానము జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని 'మాతీగె తెగిపోయినది. ఓ దైవమా! మావంశము నశించినది. కులదేవత లారా! మీరు మాపట్ల నేల నాగ్రహించితిరి? మా కులదీప మారిపోయి నది' 40 అని దుఃఖించిదుఃఖించి యిటులఁ బ్రతిజ్ఞలొనరింతురు. ఇప్పుడు మఱలఁ బుత్రముఖసందర్శనభాగ్యము చేకూరినచో ధగధగలాడుచు మండెడు నిప్పుగుండములలో నడచెదము. కులదేవతల సన్నిధిలో శిశువు నకుఁ బుట్టువెండ్రుకలు దీయించెదము 41. ఓ జగన్మాతా! నీకుఁ బూజ గావించెదము. బాలునకు నీపేరు పెట్టుదుము. ముక్కునకుఁ బోగుఁ గుట్టించెదము. మాకోరికలఁ గొనసాగనిమ్ము 42. ఇంతతోఁ దృప్తినొందక కానవచ్చిన దేవతలకెల్ల మ్రొక్కుబడులు చెల్లింతురు. గోసాయిల కొఱకు వెదకుదురు. సంతానము కలుగునని వృశ్చికములను మ్రింగివేయు దురు 43. భూతములకుఁ దృప్తిగా నుపాయనము లర్పింతురు. అనేక దేవతలను దేహముమీఁది కావేశమునకుఁ దెచ్చుకొందురు. మామిడిపండ్లు కొబ్బరికాయలు బ్రాహ్మణులకుఁ బంచిపెట్టుదురు 44. నానావిధములగు జారణమారణాదికములగు ఘోరకార్యములు చేయుదురు. పుత్రులు గలుగుట కెన్నియోపాట్లు పడుదురు. ఇన్నిపాటులుబడినను దైవాను గ్రహములేకపోవుటచే సంతానము కలుగదు 45. రజోదర్శనమైన నాలుగవ దినమున వృక్షముక్రిందికరిగి యీ వంధ్యాదంపతులు స్నానమొనరింతురు.

అందుచేఁ బూలతోఁ బండ్లతోఁ దులతూఁగుచున్న వృక్షము నిలువున నెండిపోవును. ఇదియెగాక పుత్రలోభమున నింకనెన్నియో దోషముల నొకదానివెంట నొకటి యొనర్తురు 46. సమస్తసుఖములను విడనాడి యనేకోపాయముల నొనరించి వేసారి కట్టకడకు నిరాశతో భయపడు కాలమునఁ గులదేవత ప్రసన్నురాలగును 47. సుకృతవశమున వారి మనోరథము సఫలమగును. అదిమొదలు దంపతుల యానందమునకు మేరయుండదు. ఆ వల కథను శ్రోతలు సావధానహృదయముతో నాలింపఁ గోరెదను 48.

---

## నాలుగవ సమాసము — స్వగుణపరీక్ష 3.

### (గృహస్థ సంకటములచేఁ బరదేశమున కరుగుట)

సంతాన మెక్కువయగు కొలఁది చేతిలోని ధనమంతయు గర్చు పడును. గౌరవముగా బ్రతికిన యాగృహస్థుఁడు బిచ్చమునెత్తు స్థితిలోకి వచ్చును. తినుటకేమియు లభింపని దుర్గతికలుగును 1. చిన్నపిల్లలాడుకొను చుందురు. ఒకఁడు పారాడుచుండును. ఒకఁడు గర్భమునందుండును. ఈ విధముగా బాలబాలికల గుంపుతో గృహము నిండిపోవును 2. దినదినము వ్యయ మెక్కువయగుచుండును. ఆదాయమాగిపోవును. కన్యలు వివాహ మునకుఁ దగినప్రాయము గలవారగుదురు. వారలకుఁ బెండ్లిచేయుదమన్నఁ జేతిలో ద్రవ్యములేదు 3. ఇదివర కీగృహస్థుఁడు ధనవంతుఁడై యుండెఁ గావున నలుగురిలో నీతనికి మర్యాదయుఁ బ్రతిష్ఠయు సమగ్రముగా నుండెను 4. ఇప్పటికేఁ జాలవఱకు సంపద యడుగు బట్టినది. మిగిలినది పరపతియొక్కటి మాత్రమే. ఇంటిలోఁ బూర్వపుఁ గలిమిలేదు. దినములు గడచిన కొలఁది లోలోన దరిద్రము హెచ్చిపోవుచున్నది 5. కుటుంబ మొకప్రక్క వృద్ధినొందుచుండును. బాలబాలికలు దినదిన ప్రవర్ధమాను లగుచుందురు. ఈ పరిస్థితులు జూచి మానవుఁడు చింతాగ్రస్తుఁడగును 6. కన్యలకు వివాహవయస్సు పూర్తియగును. పుత్రులు గూడ వివాహయోగ్యులగుదురు. మా బిడ్డను మీకు మారున కిత్తుమని కొందఱు చుట్టములు సంబంధములకు వత్తురు. ఇక వివాహమాప వీలుం

డదు. 7. ఒకవేళ బాలుర నటులె యవివాహితులుగ నుంచినచోఁ బదు
గురిలో నవ్వుబాటులు కలుగును. అప్పుడు లోకులు పరిహాసముగా
ఈతఁడీ జన్మదరిద్రులను బుట్టింపకపోయిన బాగుండెడిదనియందురు 8.
పదుగురిలో నవ్వుబాటు ఇటులుండ మీఁదుమిక్కిలి పూర్వుల పేరు
ప్రతిష్ఠలకుఁగూడ లోపము తటస్థించును. ఇఁక వివాహములు జరుపవలయు
నన్నచో ఋణము నొసంగువారలెవరు ? 9. మొదట నెవరెవరివద్దనో
తెచ్చి కుటుంబపోషణమున కుపయోగించిన ఋణములు తీరనే తీరలేదు.
వాండ్రొకప్రక్క నొత్తిడిచేయుచుందురు. ఈ విధముగా నాప్రాణి చింతా
సాగరమునందు మునిఁగిపోవును 10. వాఁడన్నము తినును కాని వాని
నన్నము తినివేయుచున్నది. మనస్సులోచింత మిక్కుటమగుటచే నాతు
రతతో నుండును 11. క్రమముగాఁ బరపతియంతయు నశించును. ఇంటి
లోని పదార్థములు, వస్తువాహనములు కుదువకట్టున కొకదానివెంట
నొకటి యంగడికిఁజేరును. అప్పు డాగృహస్థుఁడు 'ఓ దైవమా ! నాకు
దురవస్థ తటస్థించినది. దివాలాతీయుటకు సిద్ధమైతి'నని పలవించును 12.
చేయునదిలేక యంగడికిఁ గొనిపోయి వస్తువుల దెగనమ్మును. పశువులను
దూడలను విక్రయించి కొన్నాళ్ళు కుటుంబము జరుపును. వడ్డికి ధనముఁ
దెచ్చి కుటుంబము మఱికొంతకాలము జరుపును 13. ఈ ప్రకారముగా
ఋణములుదెచ్చి నలుగురిలో డంబముగా గృహస్థుఁడు కాలము
జరుపును. లోకు లీతనిఁజూచి'వీఁడు యోగ్యుఁడు. పూర్వుల పేరుప్రతిష్ఠల
నిలిపినాఁడు'అని ప్రశంసింతురు 14. ఋణబాధ యీవిధముగ వృద్ధినొందిన
కతన షాహుకారులందఱు నొక్కమాఱు వచ్చి యింటిని ముట్టడి
వేయుదురు. ఋణదాతలు పెట్టుబాధలకు వెఱచి యా గృహస్థుఁడు పర
దేశములకుఁ బాఱిపోవును 15. పరదేశములలో నెటులో రెండు సంవత్సర
ములు గడుప నిశ్చయించుకొని నీచసేవలోఁ బ్రవేశించును. మఱియు
నెన్నియో యాపదల ననుభవించును 16. పడరాని పాట్లుపడి యెటులోఁ
గడుపుఁగట్టుకొని కొంతధనము సేకరించును. మనస్సు ఇంటిమీఁదికిఁ
బోవును. కొంతకాలము జరిగినమీఁద దన యజమానివద్ద సెలవుగైకొని
యింటికివచ్చును 17. ఇంటివద్ద నీతని భార్యాపుత్రుల దురవస్థ చెప్పవలసి
నదేలేదు. వార లత్యంతదుఃఖముతోఁ దమ గృహాధికారి యెప్పుడువచ్చు

నాయని త్రోవలుచూచుచుందురు. ఇంతవఱకు రాఁడాయెనే? ఎక్కడకుఁ బోయెనో? యేమియయ్యెనో? యని యింటివా రనుకొనుచుందురు 18. ఇప్పుడు మేమేమి తినవలయును? ఆఁకలితో నెంతదనుకఁ జచ్చెదము? ఈశ్వరుఁ డిట్టి పురుషుని సాంగత్యమున మమ్ము నేలఁజేర్చెను? అని యింటి లోనివారందఱు పలుకుచుందురు 19. ఈ విధముగాఁ గుటుంబములోని వారందఱు తమతమ సుఖములనుగూర్చి పరితపించుచుందురేగాని యాతఁ డేమయ్యెనో యేమి యవస్థల పాలయ్యెనోయని యెవ్వరు దలంపరు. మఱియు వృద్ధుఁడై నపిదపగూఁడ నాతని కెవ్వరు నుపకరింపరు 20.

ఇట్లు కుటుంబములోనివారందఱు త్రోవలు తేరి చూచుచుండు నంతలో నాతఁడాకస్మికముగా నింటికివచ్చును. పిల్లలు పరుగెత్తి నాయన యలసిపోయెనని పలుకుదురు 21. అతనిఁజూచి భార్యగూడ నానందించును. ఇఁక మన దరిద్రము తీరినదని పలుకును. ఇంతలో నాతఁడు సంపాదించి తెచ్చినమూట భార్యచేతి కందిచ్చును 22. అందరకు నానందముగలుగును. నాన్న వచ్చినాఁడు, మాకు చొక్కాలు కుళ్ళాయిలు తెచ్చినాఁడని బాలురు సంతోషముతో బలుకుదురు 23. ఈ విధముగా నాలుగు దినము లానందము ననుభవించినపిమ్మట నింటిలోనివారు మెల్లగ నిటుల సణగ నారంభింతురు 'ఈ ద్రవ్యమంతయుఁ గర్చుపెట్టుదుమేని మనము మఱల గష్టములు పడవలసివచ్చును 24. కావున నిప్పుడు తెచ్చినద్రవ్యమును గష్టకాలములో ననుభవించుటకు నిలువయుంచి పరదేశమునకుఁ బోవుట మేలు. దీని నిచ్చట మేము తినివేయకముందే మఱికొంతద్రవ్య మార్జించి తెచ్చుటయుక్తము' 25. ఇంటిలోనివారందఱి యభిప్రాయముగూడ నిటులేయుండును. తన సుఖముకొఱకేగదా కుటుంబమంతయు గృహస్థుని వెంట నంటియున్నది? అత్యంత ప్రేమపాత్రులగు భార్యసైతము సుఖము కొఱకే భర్తను వెంటనంటియున్నది 26. పరదేశములం దనేకకష్టములను సహించి విశ్రాంతిని గైకొనుటకై పాపమీ మానవుఁ డిల్లుచేరినాడు. కాని యింటికడ స్వేచ్ఛగా శ్వాసమునైన దీసికొనలేదు. పోపొమ్ము మఱలఁ బరదేశమునకుబొమ్ము అను మందలింపులు మెండైనవి 27. తరువాత జ్యోతిష్కునితో నవసరముకలుగును. ప్రయాణమునకు సుముహూర్తమును విచారించుటలోఁ దన్మయుఁడగును. వాని హృదయము ఇంటి

మీఁదనే చిక్కుకొనియుండుటచే బరదేశమున కేగుటకు బుద్ధికలుగదు 28. విధిలేక ధనసంపాదనమునకై పరదేశమున కామానవుఁడు పోవసంకల్పించి త్రోవలో నుపయోగమునకుఁ గొంత సామగ్రి వెంటనుంచుకొనును. పిల్లలనందఱను నొక్కమారు ప్రేమతోఁ గనులారఁజూచి పరదేశయాత్రకు బయలుదేరును 29. భార్యవైపు చూచుచుఁ బోలేకపోలేక ముందున కేగును. వియోగమువలన దుఃఖ మతిశయించును. కాని చేయున దేమున్నది? దరిద్రవశమున నిల్లాలిని విడిచిపెట్టక తప్పదు 30. కన్నీరు కంఠమునిండివచ్చును. వియోగమా భరింపరానిది. తండ్రికి, బిడ్డలకు, భార్యకు, భర్తకు వియోగము కలుఁగబోవుచున్నది 31. ఆ పరిస్థితులలో బాపమా గృహస్థుఁడు పెండ్లము బిడ్డలను విచారకరములగు చూపులతోఁజూచి నేను పోయివచ్చెదను. అదృష్టమున్నచో మరల నొకరి నొకరము చూచుకొందుము. లేనియెడల నిదియె తుదికలయిక 32, యని నుడువలేక నుడివి మనస్సు రాయిజేసికొని పరదేశమునకు బయలుదేరి పోవును. వెనుకకు మఱలిమఱలి మనస్సు నిలువక చూచుచుండును. తనలోఁ 'బాపము నాభార్య వియోగదుఃఖమును సహింపలేదు. పాపము ఏమిచేయగలదు. తప్పని సరియైన'దని యిల్లాలిని బ్రశంసించును 33. ఇట్లు ప్రశంసావాక్యములు పలుకుచుఁ దనగ్రామమును విడిచిపోవును. గార్హస్థ్య చింతతోఁజిత్తము కలవరపడుచుండును. మోహకారణమునఁ బ్రపంచాసక్తిలోఁబడి యాతఁడు పరితపించుచుండును 34. అప్పుడు తల్లి స్మరణకు వచ్చును. ఆ సమయమునం దిట్లుపలుకును: 'ఓతల్లీ! నీవు ధన్యురాలవు. నావలన నీవెన్నియో కష్టము లనుభవించితివి. మూర్ఖుఁడ నగుటచే నీయోగ్యత నెఱుంగఁజాలకపోతిని 35. నేఁడు నీవు నాయొద్దనుంటివేని యీ యవస్థలో నన్ను క్షణమేని విడిచిపెట్టియుండవు. నన్ను వీడిపోవలసి వచ్చినపుడెల్లఁ గన్నీరుమున్నీరుగాఁ విలపించుదానవు. ఆ మోహమే వేఱు 36. వాస్తవముగాఁ బుత్రుఁ డెట్టిదరిద్రుడైనను, ఎంతటి భిక్షుకుఁడైనను తల్లికిమాత్రము తప్పక ప్రియతముఁడు. వాని దుఃఖావస్థను గాంచినచో నామె తన హృదయమున నెంతయో వ్యాకులపడును 37. గృహస్థాశ్రమము కావలయునన్న మఱలమఱల సమకూరఁగలదు. కాని యెవరి గర్భమునుండి యీ శరీరము ఉత్పత్తియయ్యెనో యాతల్లి వెయ్యి

జన్మములకేని లభింపఁజాలదు 38. ఆమె మిగుల గయ్యాళియైనను సరియే ఆమె తల్లియే. వేలకొలఁది స్త్రీలను గైకొనుటవలన నేమిఫలము? సర్వము నెఱింగియుఁ గామవికారమునకు లోనై వ్యర్థముగా జీవితము పాడుచేసి కొంటిని 39. ఈ కామకారణముననే ప్రాణసమానులగు నాస్నేహితులతో నకారణముగాఁ గలహించితిని. స్నేహితులను దుష్టులని తలంచితిని 40. తల్లిదండ్రుల కెట్టి విచారము గలుగనీయక సంతోషముగానుంచు గృహస్థుఁడే ధన్యుఁడు. అంతియగాక స్నేహితులను నిష్ఠురవాక్యములనాడి మనస్సు నొప్పింపనివాఁడు ధన్యతముఁడు 41. భార్యాపుత్రులసాంగత్యము జన్మమున్నంతవరకు వెంటనంటియుండును. తల్లిదండ్రులు మాత్రము దాటిపోయిన పిదప వలయునన్నను లభింపరు 42. ఇదియంతయు నే నిది వరకు బాగుగా వినియేయుంటిని. కాని దేహములో జవసత్త్వములున్నంతవర కీయంశ మనుభవమునకు రాదయ్యెను. ఈ నా తుచ్ఛమానసము సంభోగసుఖమున నింతవరకుఁ బూర్తిగా మగ్నమైయుండెను 43. ఈ సతియు నీ కుమారులు మిత్రులవలెఁ గనిపింతురు. నిజమునకు వీరలు మిత్రులెన్నఁటికినిగారు. గొప్ప స్వార్థపరులు. తమతమ సౌఖ్యములకొరకె వీరలు పురుషు నాశ్రయించుకొనియున్నారు. వీరియెదుటకు శూన్యహస్తములతో నెటులఁబోవలయునో తోఁచక సిగ్గగుచున్నది 44. ఇప్పుడేమైనఁ గానిమ్ము ద్రవ్యము నార్జించితీరవలయును. రిక్తహస్తములతో నేగుట దుఃఖకారణము' 45. ఈ ప్రకారములగు యోచనలు చేయుకొలఁది పురుషుని హృదయము దుఃఖపూరితమగును. క్రమముగాఁ జింతాసాగరమునందు మునిఁగిపోవును 46. అనంతరము పరదేశమునకేగి ద్రవ్యముకొరకుఁ దన దేహమును బరాధీనమొనరించును. కుటుంబమునకు సేవకుఁడై యీశ్వరునియెడ విశ్వాసద్రోహియగును 47. ఇట్లు పురుషుఁడు కేవల కామముతోఁ బరవశుఁడై తన పవిత్రజన్మమును వ్యర్థముగాఁ గోల్పోవుచున్నాఁడు. ఇంతలో నాయుష్కాలము పూర్తియగును. అపు డెచ్చటి వచ్చట విడిచిపెట్టి యెక్కఁడే దాటిపోవును 48. కొంతసేపువరకా ప్రాణి తన మనస్సునందు గతముదలంచి పశ్చాత్తాపమునొందును. క్షణమాత్రము కొరకు ఉదాసీనుఁడగును. మరల శీఘ్రముగనే మాయాజాలమునందుఁ దగుల్కొనును 49. పుత్రికలు పుత్రులు జ్ఞాపకమునకు వత్తురు. హృదయ

ములో మిగుల ఖిన్నుడగును. నా పిల్లలను నే విడిచిపోవుచుంటినని పల వించును 50. ఇట్లు వెనుకటి దుఃఖములన్నింటిని స్మరణకుఁదెచ్చుకొని పనివిపనివి బిగ్గరగ నేడువనారంభించును 51. అరణ్యరోదనము నొనరించును. ఓదార్చువారెవరు గనఁబడరు. తన హృదయము నాలోచనము లోనికి దించి 52 'యిపుడేడ్చిన నేమిప్రయోజనము ? ప్రాప్తమెద్దియో దానిననుభవించి తీరవలయును' అని తనకై తానెటులో నిబ్బరించును 53. ఇటుల బహువిధములగు దుఃఖములచే భీతినొంది శల్యమాత్రావశిష్టుఁడై పరదేశయాత్రకు బయలుదేరును. ముందు జరుగుసంగతి సాదరముగా వినఁగోరెద 54.

## ఐదవ సమాసము – స్వగుణపరీక్ష 4.

(మూడవ వివాహమువలని సంకటములు - వృద్ధావస్థవలని దుఃఖములు.)

ఇపుడు మరల ఆ ప్రాణి పరదేశములోనికరిగి ప్రయత్నమున కారంభించును. నానా విధములగు పరిశ్రమలను గావించును 1. ఈ దుస్తరమగు సంసారసముద్రము దాటుటకు మానవుఁ డెన్నికష్టములు భరించెనో యెవరు నిర్ణయింపగలరు ? మూఁడు నాలుగు వత్సరములు పరదేశములలో దాస్యమొనరించి మరలఁ గొంతధనము సేకరించును 2. తత్క్షణమె యింటిత్రోవఁబట్టును. ఇల్లుచేరి విచారింపఁగా దేశమునందుఁ గరవు కలిగినదనియు నందుచే నింటిలోనివారందరు దుఃఖములపాలై యుండిరనియు గ్రహించును 3. ఇఁక వాని కుటుంబస్థితిగతు లెటులున్నవో వినుఁడు. ఒక కుమారునకుఁ గండలెండిపోయి యాహారము లేమిచే అస్తి పంజరమువలె నుండెను. ఒకనికి గ్రుడ్లువెళ్ళివచ్చెను. ఇంకొకఁడు దీనావస్థకు లోనై నిలువలేక గజగజవణకుచున్నాఁడు 4. ఇంకనొకఁడు మూలుగుచు జాలిచూపులు చూచుచుఁ గూర్చుండియున్నాఁడు. మరియొకనికి ఒడలు వాచినవి. వేరొకఁడు చనిపోయినాఁడు. ఈ పరిస్థితులలో దుర్దశననుభవించు తన కుటుంబమును నీతఁడు తిలకించును 5. అయ్యో! పూదోటవలెనున్న నా కుటుంబమున కెంతటిదుర్గతి పట్టినదని యేడవ నారంభించును. కన్నీటితోఁ గంఠము నిండిపోవును. అత్యంత వ్యాకులభావముతోఁ బరితపిం

చును 6. కొంతసేపటికిఁ దెప్పరిల్లినమీఁదఁ గుమారులందఱును దండిగ్రిని సమీపింతురు. అందొకఁడు 'నాయనా! తినుటకేమేని యొసంగు'మని పలుకుచు ఆఁకలిచిచ్చుచే నకనకలాడుచుఁ బైఁబడును 7. వేరొకఁడు మా నాన్న మాకేమియో తెచ్చినాఁడని మూటవిప్పిచూచును. చేతికిఁజిక్కినది చిక్కినటులందుకొని నలువురుపిల్లలు నమలివేయుదురు. కొంత నోటిలో నున్నది. కొంత చేతిలోనున్నది. ఈ దశయందే కుమారుల ప్రాణములు వెడలిపోవును 8. అత్యాతురతతోఁ దినుటకారంభించుటచేతఁ దినెడువారు తినుచుండగనే చావు తటస్థించును. మిగిలినవారు అజీర్ణవ్యాధితోఁ గతింతురు 9. ఈ విధముగాఁ గుటుంబమంతయు మృత్యుదేవతకు బలియగును. కర్మానుభవమున మిగిలియున్న యొకరిద్దఱుబాలు రీ యకాలమృత్యుముఖమునఁబడక బ్రదికియుందురు. వారుగూడఁ దల్లిలేని కలవరపాటుతో విచారపడుచుందురు 10. ఈ విధముగాఁ గుటుంబమంతయు క్షామదేవతకు బలియగును. కొంతకాలమునకు సుభిక్షమగు కాల మేతెంచును 11. చావఁగా మిగిలిన పసికూనలను సంబాళించువారలకుఁ గరవువచ్చును. తన చేతిమీఁదుగ వండికొనితినుచు బిడ్డలు దాను గాలముగడుపవలసివచ్చును. వంటపనియన భయముపుట్టును 12. ఇరుగుపొరుగువారి నిర్బంధము తన ప్రాలుమాలిక ఆధారపరచుకొని మూఁడవవివాహము చేసికొనును. దానితో శేషించినధనమంతయుఁ గర్చుపడి అయ్య మిగులును 13. ఇంటనున్న లాభములేదు. కాఁగలకర్చు లెన్నోయున్నవని గృహస్థుఁడు ద్రవ్యసంపాదనమునకు మరలఁ బరదేశమునకేగి యెట్లో కొంతరొక్కము నార్జించి ఇల్లుచేరును. ఇంటివద్ద సవతితల్లికి గుమారులకుఁ గలుగు కలహములుచూచి విసిగిపోవును 14. భార్య మంచిపడుచుఁదనములోనుండును. పుత్రులామె యెడ నసూయతోనుందురు. భర్తకు వయసా జారి దానికిఁదోడుగా నశక్తత యేర్పడును 15. కుమారులు తమలోఁదాము తగవులాడుచు నొకరిమాటనొకరు వినక పెనగులాడుచు దెబ్బలాటకు దిగుదురు. ఈ పరిస్థితులలో నతఁడు తనయిల్లాలిమాటలనే విశ్వసించుచు నామెపయిఁ బ్రీతియుంచి కనుసన్నలలో మెలంగును 16. తన భార్యావిషయమున నకారణముగా సందేహము కలుగును. ఎల్లపుడాందోళనము. ఏ విచారమేని మనస్సులో స్థిరముగాఁ గొంచముకాలమేని యుండదు. అందుచేఁ దన

వ్యవహారములను బరిష్కరించుటకు మధ్యవర్తులగు పెద్దమనుష్యులను సమకూర్చును 17. పెద్దమనుష్యులీతగవులు త్రెంచుటకు విభాగములు కాకతప్పదని ఉన్నయా స్తినంతయు భాగముల వరుసను బంపకము చేయు దురు. ఈ పంపకములోఁ బక్షపాతమున్నదని కుమారు లాక్షేపింతురు. ఇందుచే విభాగము పూర్తికాదు. చివరకు యుద్ధరంగములోనికిఁ బ్రవేశిం తురు 18. తండ్రికిఁ గుమారులకుఁ దగవు ముదిరిపోవును. కుమారులు వృద్ధుఁడగు తండ్రినిఁబట్టుకొని కొట్టుదురు. అప్పుడు తల్లి బిగ్గరగా అయ్యా లారా! నా మగనిని జంపుచున్నారు. విడిపింపుఁడని యరవసాగును 19. ఆమెయరపువిని గ్రామస్థులందరును గుంపుగాఁగూడుదురు. వచ్చినవారు వినో దము చూచుచు నిలువఁబడి యుందురు. బలే! బలే! తండ్రికిఁ గుమారులు బాగుగా నుపయోగపడిరని పలుకుదురు 20. ఎవరికొఱకు నిన్నియనరాని మ్రొక్కులుచెల్లించి నానావస్థల బడిరో యట్టికుమారులు నేఁడు తండ్రిని గొట్టుచున్నారు. ఎంత వింత! కలికాలప్రభావమని యా చూడవచ్చిన వారిలోఁ గొందఱందురు 21. కలియుగ చర్యల లక్షణము లివియెయని వచ్చినవారందరు నాశ్చర్యపడుదురు. ఆయుద్ధము నెటులోయాపుదురు22. మధ్యవర్తులు తగవునాపి యందరకునచ్చజెప్పి యున్నయా స్తిని సమభాగము లొనరించి వారందరకుఁ బంచి యొసగుటతోఁ దండ్రికుమారుల కలహ ముపశమించును 23. తండ్రినుండి తాముచీలి కుమారు లాతఁడుంట కొక గుడిసెనుగట్టి యొసంగుదురు. అనంతరము కుమారులతోఁ దండ్రివిడిబోయి తన పడుచుపెండ్లముతోఁ గ్రొత్తకాపురమునకు నడుముగట్టును. అది మొదలుకొని పెండ్లము స్వార్థపరతంత్రురాలగును 24. ముసలిమగఁడు పడుచుపెండ్లము సుఖముగాఁ గొంతకాలముందురు. ఉభయు లభేదముగా నానందముగా నుంటిమనుకొందురు 25. గుణవంతురాలును సుందరియుఁ జాతుర్యవతియు నగు నా భార్య వృద్ధావస్థలో లభించుట తనయదృష్టాతి శయముననేయనితలంచి యానందించును 26. ఈ యానందములో మునింగి తన దుఃఖమునంతయు మఱచి యా వృద్ధగృహస్థుఁడు కాలము గడుపు చుండ రాజ్యమునఁ గల్లోలమేర్పడి మహోత్పాతములు తటస్థించును.

విరోధిరాజులు తానున్న రాజ్యముమీఁదికి సైన్యసహితముగా దండయాత్రకు బయలుదేరుదురు 27. ఆకస్మికముగాఁ పెద్దముట్టడిజరుగును.

ఈ సంకులావస్థలోఁ గొందఱు దుండగులు నగరములోఁ బ్రవేశించి యీ సుందరిని బలవంతముగా గొనిపోవుదురు*28. భార్యపోయినది. నాసుఖము నశించినది. ఈ వార్థకమున నాకు దిక్కెవ్వరని యీ మానవుఁడు గోడు గోడుమని యేడువసాగును. తన మనస్సులోఁ దన భార్యవంటి సుందరియు గుణవంతురాలును లోకమునలేదని కొనియాడుచుండును 29. ఇంతలో నొకఁ డేతెంచి తాతగారూ! నీ భార్య భ్రష్టురాలై పోయినది. ఆయమను దుండగులుచెఱఁగొని దేశాంతరము గొనిపోయిరని తెలుపును. ఈ మాట వినఁగానే నేలపయిఁబడి మూర్ఛపోవును 30. భూమిమీఁద విచారాతి శయమునఁ బొరలును. కనులనుండి దుఃఖబాష్పములు ధారాళముగాఁ బ్రవహించును. తన పడుచుభార్య జ్ఞాపకమునకు వచ్చినపుడెల్ల దుఃఖా గ్నిచే సంతప్తుడగుచుండును 31. అప్పు డాతఁడిట్లు తనలోఁబరితపించును. "సంపాదించిన ధనమంతయుఁ బెండ్లిండ్లకు గర్చుపెట్టితిని. నాకు బడుచు భార్యమాత్రము మిగిలినది. దానితోఁనైనఁ బదికాలములపాటు గాపురము చేయనీయకుండ దురాచారులు బట్టుకొనిపోయిరి 32. నాకుముసలితనము వచ్చినది. కొడుకులు వేఱుపడిరి ఓ దైవమా! నా భాగ్యము పగిలి పోయినది 33. ద్రవ్యముపోయినది. భార్యను దుండగులు హరించిరి. పోవుద మన్న అండలేదు. దేహమునందు జవసత్వము లంతరించినవి. ఈశ్వరా! నీవే దిక్కు అని నమ్ముకొంటిని"34. హృదయమునందుఁ దొలుతనుండి యీ శ్వరునెడ భక్తికలిగి యుండవలసియుండ వైభవములో మునిఁగి తేలుచు నీయంశమును మఱచెను. ఇపుడు వృద్ధావస్థలో నీతఁడెటులఁ బరితపించు చున్నాఁడో చూచితిరా శ్రోతలారా! 35. శరీరము మిగుల నెండిపోవును. అవయవములన్నియు వంగి దుర్బలములై పటుత్వము తప్పును. వాత పిత్తకఫములు చెలరేగి విజృంభించును. కంఠము చుట్టుకొని కఫము నిబిడ ముగా వ్యాపించును 36. నాలుక తడబడును. గొంతులో గురుకపుట్టును. నోటినుండి దుర్గంధము బయలుదేరును. ముక్కునుండి శ్లేష్మము ప్రవ హించును 37. మెడ వణకును. కనులనుండి యశ్రువులు కారును. ఈ వృద్ధావస్థ యనేక దురవస్థలతో నుపస్థితమగును 38. దంతము లూడి

* ఈ వర్ణనమువలన నా కాలమునఁ బౌరజీవిత మెంత దుర్భరముగ నున్నదో యైతిహాసికు లూహింపవచ్చును.

పోవుటచే నోరంతయు బోసిగానుండును. నోటినుండి దుర్గంధముగల చొంగనీరు బొట్లుబొట్లుగాఁ గారును 39. కనులు కనఁబడవు. చెవులు విని పింపవు. దృఢముగా మాటలాడుదమన్నను దేహమున జవసత్త్వములుండవు. ఆయాసము క్రమక్రమముగా నతిశయించును 40. పాదములలో శక్తియంతరించును. కూర్చుండుటకు దార్ఢ్యములేదు. నడుము విల్లంబువలె వంగెను. గుదద్వారమునుండి నోటినుండి బయలుదేరునటుల నేదియో ధ్వనిపుట్టును 41. ఆఁకలియైనప్పుడు భరించుటయేకష్టము. తిందమన్న అన్నముదొరుకదు. లభించె ననుకొందము ఆ యాహారము పండ్లూడిపోయెను గావున నమిలితినలేఁడు 42. పిత్తాధిక్యమునలన నెటులో మ్రింగిన యన్నము జీర్ణముగాదు. తిన్నది తినినటులనే వాంతిగ వెళ్ళిపోవును. లేక గుదద్వారమునుండి వెడలిపోవును 43. మలమూత్రములు, దగ్గు, వాంతులవలన నలుముఖములనున్న భూమి దుర్గంధముతో నిండిపోవును, దూరముగాఁ బోవుచున్నవారి శ్వాసము లా ప్రదేశముకడ నాగిపోవును 44. బహువిధములగు దుఃఖములును అనేకవిధములగు రోగములు కళేబరము నావరించియున్నవి. వార్ధకదశగావున బుద్ధికికూడ నిలుకడలేదు. ఇట్లు నానావస్థలు పడుచున్నను ఆయుష్యమునకుగల యవధియుగియదు 45. నొసటివెంట్రుకలు కనుబొమ్మలమీఁది వెంట్రుకలు పూర్తిగఁ బండి రాలిపోవును. దేహమునం దంతటను గబ్బిలములు వ్రేలాడునట్లు మాంస మెండిపోయి ముడతలుపడ్డ చర్మము వ్రేలాడుచుండును 46. పరుల సహాయములేనిది నిముసమేని గడుపఁజాలని దుస్థితిలోనికివచ్చును. అస్తిపంజరముమాత్రము శేషించియుండును. ఇంకను వీఁడేలఁ జావకున్నాఁడు, చావఁడు కాఁబోలు అనియందఱు నందురు 47. జన్మమిచ్చి యెవరిని గని పెంచి పెద్దవారిని జేసెనో యాకుమారులు పగవాండ్రయ్యెదరు. చివరకుఁ బ్రాణికి విషమావస్థ సమీపించును 48. వయస్సుమీఱును. బలముడుగును. గృహస్థితి పాడగును. దేహము సంపద నీరసమై నశించును 49. పుట్టినదిమొదలు చేసిన స్వార్థపరతంత్రతయంతయు వ్యర్థమై చెడును. ఇప్పుడీ యంత్యకాలమున నెంతటి దుర్గతి ప్రాప్తించినది! 50. జన్మమున్నంతవరకు సుఖము కొఱకుఁ బ్రాణి విరుగఁబడును. అంత్యమునందు దుఃఖముతో సంతప్తుఁ

డగును. దీనితరువాత యమయాతనలు ప్రత్యేకించి యనుభవింపవలసి యున్నది 51.

జీవితమంతయు దుఃఖమూలము. పుట్టినదిమొదలు జీవిని దుఃఖాగ్ని దహించివేయుచుండును. కావున మనుజుఁడు శరీరమును ధరించినందులకు సత్యమగు నాత్మహితమునకై యత్నింపవలయును 52. వృద్ధావస్థయందుఁ బ్రపంచములో నందఱకును నిదేవిధముగా దుఃఖము కలుగును. కావున మానవుఁడు సర్వము నశ్వరమని నమ్మి భగవంతుని పాదపద్మములకు శరణు జొచ్చవలయును 53. మాతృగర్భమునం దున్నపుడు శిశువున కేపశ్చాత్తాపము కలిగియుండెనో యదివృద్ధావస్థయందును అంత్యకాలము నందును జ్ఞాపకమునకువచ్చును 54. పరమేశ్వరునియెడ భక్తిశ్రద్ధలతో నుండుట మానినందున జన్మాంతరములు, మరల మాతృగర్భవాసము తటస్థించును. ఆవల దుస్తరమగు సంసారపాశములో మఱల జిక్కుకొనును 55. భగవంతునియెడ భక్తిశ్రద్ధలు లేనివారికి జన్మమరణములు తొలంగిపోవ నేరవు. త్రివిధపాపము లనుభవింపవలసివచ్చును. త్రివిధపాపములన నేవియో వాని స్వరూప మేదియో విపులముగా వర్ణించెదను 56.

---

## ఆఱవ సమాసము — అధ్యాత్మికతాపము.

### (శారీరిక మానసిక రోగము)

శ్రోతలారా! ఇపుడు త్రివిధతాపములన నేవియో తెలుపనున్నాఁడను. ఏకాగ్రబుద్ధితో నాలింపఁ గోరెదను 1. ఆర్తుఁడగు పురుషుఁడు తాను గోరినవస్తువు లభించినంతన నెటు లానందించునో యటులె త్రివిధ పాపములచే సంతప్తుఁడగు మానవుఁడు సత్సాంగత్యమువలన శాంతి నొందును 2. ఆఁకలిచే నకనకలాడు పురుషునకు అన్నము లభించిన పిమ్మటను, దప్పిచేఁ బరితపించుమానవునకు జలము చేకూరినపిమ్మటను, కారాగృహమునందున్న మనుష్యునకు బంధోన్ముక్తుఁడైనపిమ్మటను సౌఖ్యము లభించును 3. బురదతోనిండిన నూతిలో దిగఁబడినవాఁడు వెలికి దీయఁబడినయెడల నానందించును. అటులే దుఃఖమయమగు స్వప్నమును గాంచుచున్నవాఁడు మేలుకొనుటచే సౌఖ్య మనుభవించును 4. ఏదేని

యుపాయమునొంది చావనున్నవానికిఁ బ్రాణదాన మొనరించుటవలనను, దురవస్థలలోఁ మునిగిఁ తేలుచున్నవాని కవస్థానివారణ మొనరించుటవలనను సుఖము కలుగును 5. రోగికిఁ గర్మానుభవము పూర్తియైనపిదపఁ బరిశుద్ధ మగు నౌషధము లభించును. దానంజేసి యారోగ్యమొంది యానందభరితుఁడగును 6. ఆవిధముగనే త్రివిధము (ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము) లగు తాపములచేఁ బరితప్తుఁడగువాఁడు సాధుజనుల సంగమముచేఁ బరమార్థమున కధికారియగును 7. త్రివిధతాపములన నేవియో తెలిసికొన శ్రోత లుత్సాహపడుచుందురు. వాని నామములు వానివాని యుదంతములు స్పష్టముగాఁ జెప్పుచున్నాను 8. మొదటిది ఆధ్యాత్మిక తాపము, రెండవది ఆధిభౌతికతాపము, మూఁడవది ఆధిదైవికతాపము అని గ్రహింపవలయును 9. శ్రోత లిట్లు ప్రశ్నించిరి. స్వామీ! ఆధ్యాత్మిక తాపమనగా నెద్ది? దాని కేమి గుర్తులు? ఆదిభౌతికతాపమునకుఁ గల లక్షణముల నేవిధముగా గ్రహింపవలయును? 10. ఆధిదైవిక తాపమన నెట్టిది? స్పష్టముగా నెఱుంగఁజాలినంత విపులముగా ననుగ్రహించి తెలుపవేఁడెదము 11. శ్రోతలతో వక్త మంచిది అటులే యని నిరూపణము గావించి చెప్పుచున్నాఁడు. తొలుదొలుత సావధానమతితో నాధ్యాత్మిక తాపమునుగూర్చి వినఁగోరెద 12. దేహము ఇంద్రియములు మనస్సు వీని సంయోగమువలనఁ దనకుఁ గలిగెడు సుఖదుఃఖానుభవమును ఆధ్యాత్మికతాపమని చెప్పుదురు 13. దేహమునుండి యుత్పన్నమగు దుఃఖమును, ఇంద్రియమువలన జనించు దుఃఖమును, మనస్సునుండి యుత్పన్నమగు దుఃఖమును ఆధ్యాత్మికతాపమని చెప్పుదురు 14. దేహమునుండియు నింద్రియములనుండియు మనస్సునుండియుఁ గలిగెడు దుఃఖములను వేరు వేరుగా వివరింపవలసియున్నది 15. గోకుడుపుండ్లు, దేహములోఁబోటు, కురుపులు, జిల, దద్దు, వంచెలు మున్నగు దేహమునం దుత్పన్నమగు వికారములును 16, గజ్జి, బొలకింక, చిడుము, నెత్తురుగడ్డలు, సహింపరాని మూలవ్యాధిబాధయు 17, వ్రేలిచివరబుట్టు కురుపులు(గోరుచుట్టు), మెడవాపు, పిచ్చినసిమిరి, ముఖము వాపు, దంతబాధయు 18, గడ్డలు దేహమునిండ లేచుట, దేహమువాచుట, వాతముప్రకోపించుట, గాదర లేచుటయు 19, తామరలేచుట, పొట్ట యుబ్బుకొని పెరుగుట, దవడలు

కుదియించుకొని పోవుట, చెవిలో పుండుపుట్టి పగులుట మున్నగునవి యాధ్యాత్మికతాపములు 20. శ్వేతకుష్ఠు, గళితకుష్ఠు, పాండురోగము, క్షయరోగమును 21, గ్రంథివాతము, బిడ్డలు పాలుగ్రక్కుట,వాతగోళము, కాళ్లుచేతులు లాగుట, వెంటవెంట నావలింతలు వచ్చుటయు 22, మల మూత్రాదుల నిరోధమువలనఁ గల్గు రోగములు, ఆవర్తము, హృదయ శూల, పార్శ్వశూల మున్నగు రోగములును 23, నడుము మెడ నొప్పి యెత్తుట, వీపు కంఠము ముఖము అస్థిసంధులు మున్నగువానిలో నొప్పికలుగుటయు 24, అజీర్ణముచే నొడలుత్రిప్పుట, అజీర్ణవిరేచనములు, వాంతులు, కామెరలు, సర్పి, ముక్కుడి, విదేశజలము త్రాగి రోగము లొందుట మున్నగువ్యాధు లాధ్యాత్మికతాపములుగఁ బరిగణింపదగి నవి 25. జలశోషము (ఒకతెగక్షయ), కంటికిఁ బొరలెత్తి దృష్టిదోషము గలుగుట, జ్వరము, దేహము గగుర్పొడుచుటయు 26, చలి, కాక, ఆఁకలి, దప్పిక, నిద్ర, దృష్టిపోకుట, విషయతృష్ణవలన దురవస్థ లొందు టయు 27, సోమరి మూర్ఖుఁడు అపయశస్వియగుటయు, మనస్సులో భయ మకారణముగాఁ గలుగుటయు, అహోరాత్రములయందు దుశ్చి త్తుఁడుగను నపస్మారుఁడుగను నుండుటయు 28, మూత్రావరోధము, ప్రమేహము, రక్తపిత్తము, రక్తప్రామేహము, గర్భములో మలము నిలిచి పోవుటయు 29, త్రిప్పుడు, విరేచనములు, కాకవలన మూత్రలోమంట, మూత్ర మాగిపోవుట, ఇదియని నిరూపింపరాని వ్యథయు నాధ్యాత్మిక తాపములు 30. ప్రేగులు పట్టుతప్పుటవలనఁ గలుగు నొప్పియు, గర్భ ములో జంతువులు పుట్టుట (జంతువాతము), ఆమము, రక్తముపడుట, తిన్నయన్నము తినినయటులు వెడలిపోవుట 31, పొట్టయూఁదుట, కొరబోవుట, పులిత్రేపులువచ్చుట 32, ఎక్కిళ్ళువచ్చుట, కొర యాగి పోవుట, పైత్యము వృద్ధియగుట, వాంతులు వచ్చుట, నాలుకపయి ముల్లువేయుట, జలుబు దగ్గు బాధ కలుగఁజేయుట 33, ఉబ్బసము, శ్వాసకాసము, ఎముక పట్టుతొలఁగుట, పొడిదగ్గు,కఫకాసముకలుగుట 34, ఎవరేని విషము తినుపించుటచేఁ బ్రాణాపాయముకలుగుట, మెడపయి వ్రణములేచుట, ఘఃటసర్పి యల్లుకొనుట 35, నాలుక తెగి పడిపోవుట, ముఖమునుండి దుర్గంధము వెడలుట, దంతములూడిపోవుట, దంతములలోఁ

బురుగులు పడుట యాధ్యాత్మికపాపములు 36. మూత్రనాళములో రాయిపుట్టుట, ముక్కు వ్యాధులచేఁ బగులుట, గండమాల, ఆకస్మికముగాఁ గన్ను పగిలిపోవుట, స్వయముగా వ్రేలు కోసికొనుట 37, స్ఫోటకము పోయుట, పండ్లు కదలుట, పెదవులు నాలుక కొఱికికొనిపోవుట 38, కర్ణబాధ, నేత్రబాధ, నానావిధ దేహబాధలవలన శోకముదయించుట, పుట్టుగ్రుడ్డు, నపుంసకుఁడునగుట 39, కన్నులలోఁ బూవువేయుట, పొరగ్రమ్ముట, కంటినడుమ తెల్లని చుక్కపుట్టుట, కంటిలోఁ బురుగుపడుట, బయటికిఁ గన్నులు బాగుగానుండియుఁ గనిపింపకపోవుట, రేజీకటికలుగుట, దుశ్చిత్తుఁడగుట, భ్రమలపాలగుట, పిచ్చివాడగుట మున్నగు బాధ లాధ్యాత్మికతాపములు 40. మూఁగతనము, చెవుడు, పుట్టుకలోనె పెదవులు తొఱ్ఱిపోవుట, గూని తలతిరిగి వంకరగానుండుట, కాలుకుంటుట, రెండు కాళ్ళు కుంటిగానుండి నడువ వీలుకాకపోవుట, మరుగుజ్జగానుండుట 41, మిగుల పొడుగరిగానుండుట, వంకరగానుండుట, ఓరగాజూచుట, మెల్లచూపు, పిల్లికన్నులు, పొట్టిగానుండి ఎత్తినడుచుట, వికృతరూపము, వికారస్వరూపము, కురూపము 42, పొడుగుగా వెలుపలకుఁ బండ్లు వెడలియుండుట, తొఱ్ఱి, దీర్ఘనాసికము, చట్టిముక్కు, చెవిలేకయుండుట, వదరుబోతుతనము, మిగుల జిక్కిపోవుట, ఎక్కువ లావుగానూరుట యాధ్యాత్మికతాపములు 43. ఎదుటివారిని జీదరించుకొనుట, నత్తిగా మాటలాడుట, దుర్బలత్వము, రోగిగానుండుట, కురూపి, కుటిలుఁడు, మత్సరయుతుఁడు, తిండిపోతు, క్రోధశీలుఁడునై యుండుట ఆధ్యాత్మికతాపములు 44. సంతప్తుఁడు, పశ్చాత్తాపతప్తుఁడు, మత్సరస్వభావుఁడు, కాముకుఁడు, ఈర్ష్యాతురుఁడు, తిరస్కారి, పాపి, అవగుణుఁడు, వికారస్వభావుఁడు నగుటయు 45, చిక్కిపోవుట, వంగిపోవుట, కాలుచేతులు చచ్చుపడుట, మెడవంగుట, నంజు, సంధిరోగము 46, గర్భము ధరించిన మీఁద నది పొట్టలో నిలిచిపోవుటయు, గర్భవతియైనమీఁద నది క్రమముగా క్షీణించుట, తూలిపడిపోవుట, గర్భపాతము, స్తనము లెండిపోవుట, సన్నిపాతము, గృహస్థసంకటములు, అకాలమృత్యువులు 47, గోళ్ళలో విషపుకురుపులు లేచుట, వ్రణములుపుట్టుట, అపథ్యమువలనఁ గ్రొత్తగా రోగములుకలుగుట, ఆకస్మికముగా దంతపంక్తులు రెండును కదలిపోవుట

లోనగునవి యాధ్యాత్మికతాపములు 48. రెప్పలవెంద్రుక లూడిపోవుట, నొసలుబ్బుట, కన్నులలోఁ గురుపులులేచుట, చత్వారముకలుగుట 49, చర్మముపై నల్లని మచ్చలు పుట్టుట, చుక్కలుచుక్కలుగాఁ దెల్లపొడ బుట్టుట, శోభి, బొల్లు, బట్టతల, కణుతులు లేచుట, మనస్సుభ్రమ నొందుట మున్నగునవి యాధ్యాత్మికతాపములు 50. నానాప్రకారము లగు వాపులు, గుల్మములు, శరీరమునందు దుర్గంధము వృద్ధియగుట, చొంగకారుట 51, విచారము లతిశయించి కృశించి నల్లబడిపోవుట, అనేకబాధ లుదయించి చిత్తము క్షోభించుట, వ్యాధియుఁ,గారణము లేని భయభ్రాంతులు 52, వార్ధకదశలోఁ గలుగు నాపదలు, నిరంతరము నానావ్యాధులతో నవస్థపడుట, నిరంతరము చిక్కిపోవుట 53, అనేక వ్యాధులు, నానావిధ దుఃఖములు సకలవిధములగు భోగబాధలు, అన్ని విధములగు దేహవ్రణములు, శోకముచేఁ గుప్పలు గూలుట మున్నగునవి యన్నియు నాధ్యాత్మికతాపము లనఁబడును 54.

ఇంతయేల, పూర్వపాపము హెచ్చినకొలంది మానవున కిట్టివియు నింకఁగొన్ని తెలియంగులవియు నగు నాధ్యాత్మిక తాపములు కలుగును. ఈ లోకము ఆధ్యాత్మికతాపములతో నిండియున్న యగాధసాగరముగా నున్నది. కావున నాధ్యాత్మికతాపములను నెంతవరకు వర్ణింపఁగలను ? 55. కావున శ్రోతలు నేనుజెప్పిన పయియంశములనుబట్టి యాధ్యాత్మిక తాప ములన నేవియో బాగుగా గ్రహింపఁగోరెదను. ఇంకముందు ఆధిభౌతిక తాపమునుగూర్చి చెప్పఁబోవుచున్నాఁడను 56.

## ఏడవ సమాసము — *ఆధిభౌతిక తాపము.

(చరాచర భూతములవలనఁ గలుగు దుఃఖము.)

శ్రోతలారా ! గతసమాసమునందు మీకు ఆధ్యాత్మికతాప లక్షణ మును నివేదించితిని. ఇపుడు ఆధిభౌతిక తాపములగూర్చి తెలుపఁబోవు చున్నాఁడను. శ్రద్ధతో నాలింపుఁడు 1. సమస్త చరాచరభూతముల

* బాహ్యపదార్థములకును ఇంద్రియములకును సంయోగమగుటచేఁ గలుగునవి ఆధిభౌతిక ములు.

సంయోగమున గలుగు సుఖములను, దుఃఖములను విజ్ఞులు ఆధిభౌతిక ములని యందురు 2. మీకు బాగుగా బోధయగుటకై నేను విస్తృత ముగా దృష్టాంతసమన్వితముగా నాధిభౌతికతాపమన నేమియో చెప్పె దను 3. దెబ్బదగిలి కాలు విరిగిపోవును. ముల్లుగ్రుచ్చుకొనుటచేఁ గాలు వాచి బాధకలుగును. శస్త్రప్రహారముచే గాయమై శ్రమపొడమును. కాలిలో లోహపుశకలముగాని పేడుగాని గ్రుచ్చుకొని పుండుపుట్టును 4. దూలగొండి దాహకమగు ఆకు సోకుటచేఁగాని లేక విషయుక్తపదార్థము దేహమునకు సోకుటచేఁగాని వ్యథ కలుగును. జెట్టికరచుటచే శరీరము విషమయమైపోవును. ఇట్లు నానావిధముల సమకూరు దురవస్థల నాధిభౌతిక తాపములందురు 5. ఈఁగలు, జోరీఁగలు, తేనెటీఁగలు, చీమలు, దోమలు మున్నగునవి కుట్టుటచేఁ గలుగుబాధయు, పేలుబడుటచేఁ గలుగు శ్రమయు 6, గోమారి, ముక్కుదోమ, గండుచీమ, తుమ్మెద మున్న గునవి కుట్టుటచేఁ గలుగుపీడయు 7, కణుదురీఁగ, పాము, తేలు, బెబ్బులి, తోఁడేలు, పంది, ఖడ్గమృగము మున్నగు జంతువులవలనఁ గలుగు కష్ట ములును ఆధిభౌతికతాపములు 8. కాఱావు, అడవిదున్న, ఎలుగుబంటి, అడవియేనుఁగు, చిరుతపులి లోనగునవి చెలరేగి పయిబడి పెట్టుకష్టములకు నాధిభౌతికతాపములని పేరు 9. జలములోనికిఁ బోయినపుడు మొసలి గొనిపోయి చంపుటయు, ఆకస్మికముగా మునిఁగిపోవుటయు, నీటిలో నడుచుచుండఁ బాచిపట్టిన రాతిపయి జారిపడి యవయవములు విరుగుట 10, కొండచిలువ మున్నగుపాములు, మొసలి సొరచేప లోనగు జలచర ములు, బెబ్బులి సింహము లోనగు వనచరములు మానవునకుఁ గలుగ జేయు శ్రమలు 11, గుఱ్ఱము, ఎద్దు, గాడిద, కుక్క, పంది, నక్క, పిల్లి మున్నగు దుష్టజంతువులవలనఁగలుగు కష్టములు ఆధిభౌతికతాపములు 12. ఇంతియగాక పయిని పేర్కొనిన కర్కశములు, భయానకములు, నానావిధ దుఃఖదాయకములు నగు ప్రాణులచేఁ గలుగు బహు విధములగు కష్టములనుగూడ నాధిభౌతికతాపములుగనే పరిగణింప వలెను 13. గోడలు, ఇంటికప్పులు తమంతన యాకస్మికముగాఁ గూలు టచేఁ గ్రింద నలిగిపోవుట, కొండలక్రింద, గుహలక్రింద నున్నప్పుడు శిలా పాతముచేఁ జితికిపోవుట, వృక్షమువిరిగి మీఁదబడుటచే అణఁగిపోవుట 14,

పెద్దలుపెట్టిన శాపముచే యాతన లనుభవించుట, కోరికలు తీరకుండుటచే భ్రాంతికలుగుట, దానిచే నున్మత్తుఁడగుట యాధిభౌతిక తాపములు 15. పరులు శక్తిహీనుని గావించుటచేతను, కులభ్రష్టుని నొనర్చుటచేతను, పట్టుకొనిపోయి నిర్బంధములో నుంచుటచేతను గలుగు బాధలును 16, విషప్రయోగముచేతను, అపయశస్సు పరులు కల్పించుటచేతను, వల బోను మున్నగువానిలోఁ జిక్కుకొనుటచేతను గలుగు కష్టములును 17, విష యుక్తమగు చెట్టుతాకుటచేతను, జీడిరస మంటి దేహమునఁ బుండ్లుపడుట చేతను, పొగలోపడి వ్యాకులుఁడగుటచేతను గలుగుశ్రమలు ఆధిభౌతిక తాపములు 18. కణకణమండుచున్న అగ్నిహోత్రములో కాలుపడి కాలి పోవుట, ఱాతిక్రిందఁ జేయియొ కాలో బడి నలిగిపోవుట, పరుగెత్తునపుడు ఎదురుఱాయికొట్టుకొని పడిపోవుట 19, బావి, కోనేరు, చెఱువు, బొంత లోనగువానిలోఁబడుట, నదియొడ్డువిరిగి కూలుటచేఁ బ్రవాహమునబడుట యాధిభౌతికతాపములు 20. దుర్గముమీఁదనుండిగాని చెట్టుమీఁదనుండి గాని పడి గాయములుపడిఁ శ్రమయొందుటకును 21, చలిచేఁ బెదవులు, కాళ్ళు, చేతులు, పిక్కలుపగిలి బాధకలుగుటకును, వానకాలమున బుర దలో నడుచుటచేఁ కాళ్ళు పాచికాని, పుండ్లుపడిగాని శ్రమలొందుట కును 22, వేఁడిపదార్థములు తినుటచేతను వేఁడివేఁడి పానీయములు త్రాగుటచేతను నాలుక గొంతుక కాలుటకును, దంతములలో ఱాయిపడి కటకట లాడుటకునుగూడ నాధిభౌతికతాపమనియే పేరు 23.

బాల్యావస్థలోఁ బరాధీన జీవితమునం దున్నపుడు పరుషవాక్కుల వలనను దెబ్బలవలనను బాధకలుగును. అన్నవస్త్రములకై పరితపింపవలసి వచ్చును. ఇది యాధిభౌతికతాపము 24. అత్తవారియింటిలో నున్నపుడు వదినెలు మఱదండ్రు వావివరసలకై వివిధపదార్థములతో దండలుగ్రుచ్చి మెడలోవేయుదురు. దేహమునకు వస్త్రములకు రంగులంటింతురు. కాలిన యినుపములికితో మచ్చలు గూర్తురు 25. ఏమఱుపాటున నున్నపుడు చెవులు పిండుదురు. కన్నులలో నింగువరసము పోయుదురు. ఎప్పుడును హాస్యము, హేళనము గావింతురు 26. దుష్టులగు పురుషులవలన స్త్రీలు నానావిధముల హింసింపఁబడుదురు. ఆస్త్రీల మానుషమునుగూడఁ దీసి వేయుదురు 27. చెప్పినట్టుల వినలేదని చెవులు, ముక్కులు గోసివేయు

దురు. బలవంతముగా నిర్బంధించి పనిపాటలు చేయింతురు. పనికి నుపయోగింపనిచో నోడలుగాల్తురు 28. స్త్రీని దురాగతులు నిర్బంధించి నీచజాతుల కిచ్చివేయుదురు. అది దుర్దశలపాలై కడకు మరణమొందును. ఇవి యన్నియు నాధిభౌతిక తాపములు 29. రోగముతో నున్నప్పుడు వైద్యులు కటువుగానున్న యౌషధము ద్రావింతురు. భూతవైద్యులనేకవిధముల బాధింతురు 30_31. బహువిధములగు చేదుతీఁగెల రసము, విదాహకరము నసహ్యకరమునగు కషాయము, ఘాటుగల ద్రావకములు త్రాగుటవలనఁ గలుగు భయబాధలు 32, ఔషధ ప్రయోగమునఁ గలుగు విరేచనములు, వాంతులు, కఠినపథ్యములు, అనుపానము మఱచి యౌషధము సేవించుటచేఁ గలుగు క్రొత్తబాధలు 33, శస్త్రముతో దేహము చీల్చి రక్తము దీయుటవలనను, లోహముతో నోడలినిండఁ గాల్చుటవలనను గలుగుకష్టములు ఆధిభౌతికతాపములు 34. వైద్యులు చిత్రమూలముతోడను, జీడిగింజలతోడను బట్టువేయఁగా పుండ్లుపడును. నానావిధములగు బాధలుకలిగింతురు. నరములు విఱచివేయుదురు. జలగలను బట్టింతురు 35. ఇంతయేల, రోగము లసంఖ్యాకములుగాఁ గలవు. వాని కౌషధములుగూడ విశేషముగాఁగలవు. చెప్పఁబూనినచో నీ సమాసము అగాధముగా నపారముగఁ బెరిగిపోవును. రోగముల మూలమునను చికిత్సల మూలమునను దేహమునకుఁ గలుగు సమస్తబాధలు ఆధిభౌతికములని గ్రహింపనగును 36. భూతవైద్యులు పొగలోఁ గూర్చుండఁబెట్టి యూపిరిసలుపకుండ ధూపములు ప్రయోగింతురు 37. దొంగలు బందిపోటుజేసి యిండ్లమీఁదఁబడి యకారణముగాఁ బ్రజల క్షోభపెట్టుదురు 38. అగ్నిదేవుని కాహుతియై సుందరములగు మందిరరాజములు, రత్నభాండారములు, మనోహరములగు వస్త్రములు, నానావిధములగు ధనధాన్యపదార్థములు, పశువులు, పాత్రములు, మనుష్యులు తగులఁబడి పోవును. వీనివలనఁ గలుగు సంతాపము ఆధిభౌతికతాపము 39 _ 41. పంటకు సిద్ధముగానున్న ధాన్యము చెఱకు మున్నగు పైరులు కాలిపోవుట వలనఁ గలుగు సంతాపము 42, స్వయముగా నంటించిన యగ్నివలనఁగాని యితరు లంటించిన యగ్నివలనఁగాని యనేకోత్పాతములు గలిగినందున నొందువిచారము 43_44, ఏదేని ప్రియతరమైన పదార్థము జారిపోయినను,

మఱచిపోయినను, బడిపోయినను,నశించినను,అక్కఱకు రాకుండఁబోయినను బగిలిపోయినను, స్థానభ్రష్టమైపోయినను, నానావిధములగు పశువు లెందేని చిక్కిపోయినను, కన్యలు పుత్రులు భార్యమున్నగు నాత్మసంబంధులు జాడ తెలియక దేశాంతరము పాలైపోయినను గలుగుశ్రమ ఆధిభౌతిక తాపము 45-46. దొంగగాని,వ్యాఘ్యములోఁ బ్రతికక్షిగా నున్నవాఁడుగాని యాకస్మికముగాఁ జంపివేయును. కన్నపుదొంగ యిల్లు దోఁచుకొనిపోవును. పశుచోరులు ఇంటిలోనున్న గొడ్లను దూడలనుదోలుకొనిపోవుదురు 47. పొలముదొంగలు పలువిధములగు ధాన్యములను, వృక్షఫలములను గోసి కొనిపోవుదురు. మొదట నుప్పువైచి భూమిని ఫలింపకుండ నిస్సారము చేయుదురు 48. మోసగాఁడు దారిదొంగ సర్వభక్షకుఁడు రసాయన శాస్త్రజ్ఞుఁడు గారడివాఁడు మాంత్రికుఁడు కపటవర్తనుఁడు తాంత్రికుఁడు మున్నగువారలు బహువిధముల సంకటములు కలిగింతురు 49. జేబులు కత్తిరించుదొంగలు ద్రవ్యమును హరింతురు. చోరులు నానావిధాలంకారములను దీసికొందురు. ఎలుకలు ఇంటిలోని సమస్తవస్తువులను దీసికొనిపోవును. వీనివలనఁ గలిగెడు దుఃఖమున కాధిభౌతిక తాపమని పేరు 50. పిడుగుబడినను, వడగండ్లుపయిఁబడినను, వర్షములోఁదడిసినను, ప్రవాహములో మునిగినను 51, నీటిలోని సుడిగుండమునందును, నీటి జాలునందును, ప్రవాహమునందును, ప్రవాహములలోఁ గొట్టుకొని పోవుచున్న చెత్తచెదారమునందును, అపారములగు తరంగములయందును గొట్టుకొనిపోవునపుడు తేలు జెఱ్ఱి కొండచిలువ మున్నగు జంతువులచే బాధలొందుటయు, జాతిగుట్టకో దీవిగడ్డకో కొట్టుకొని కడగండ్లమారి బ్రదుకు బ్రదుకుటయు, మునుఁగుచు మునుఁగుచునుండ దైవవశమున నొడ్డుబట్టి జీవించుటయు నాధిభౌతిక తాపములని చెప్పుదురు 52 – 53. తన తలంపు ననుసరించి గృహస్థధర్మములు నడువకున్నందునను, భార్య కురూపిణియు కఠినాత్మకురాలు క్రూరవర్తనురాలు నగుటవలనను, కుమారుఁడు, మూర్ఖుఁడు, బిడ్డ వితంతువు నగుటవలనను 54, భూత ప్రేతము లావేశించి యున్మాదము కలిగించినను, శరీరమునుండి దుర్గంధ పూరితమగు దుర్వాయువులు బయలుదేరినను, మంత్ర భ్రష్టత్వముచే నున్మాదము కలిగినను సమకూరుబాధలకు ఆధిభౌతికతాపములని పేరు 55.

క్రూరగ్రహముల దుర్వీక్షణము గ్రహప్రతికూలము కాలతిథిఘాత చంద్ర దోషముకాలదోషము దుష్టనక్షత్రము మున్నగువానిచేఁ గలుగు కష్టములు 56, శరీరమునందున్న బ్రహ్మగ్రహమువలనఁ గలుగు నవస్థలు, బ్రహ్మగ్రహావేశము శనిగ్రహము చాలకుండుట 57, తుమ్ము, బల్లి పలుకుట, పింగళపక్షి, పెద్దపక్షి, కాకి, కలాలి మొదలగు నపశకునపుఁ బక్షులవలనఁ గలుగుచింత నష్టము ఆధిభౌతికతాపములు 58. మోసగాఁడు, బుడుబుక్కలవాఁడు, సూనెగుడ్డలవాఁడు, జోతిష్కుఁడు మున్నగువారుచెప్పు జరుగఁబోవు విషయములనునమ్మి మనస్సునఁ గలుగఁజేసికొను సందేహసంబంధమగు విచారము 59, కుక్కలు నక్కలు ఏడ్చినను, బల్లి పయిని బడినను, నానావిధములగు నపశకునములు గలిగినను జనించు చింత, చెడ్డ కలలను గాంచుటచే మనస్సులోఁ గలుగు వ్యాకులపాటు ఆధిభౌతిక తాపము 60. ఎచ్చటికైనఁ బోవసంకల్పించి బయలుదేరినపుడు అపశకునముగాని, బహువిధములగు విఘ్నములుగాని గలిగి మనశ్శాంతి చెడుటచేఁగలుగు విచారముగూడ నాధిభౌతికతాపముగ గణింపనగును61.

చెరసాలలోఁబడి యనుభవించు బహువిధములగు యాతనలను దుఃఖములను నాధిభౌతిక తాపములని చెప్పనగును 62. రాజదండనము నొందుటకతన భటులు నడుమునకుఁ ద్రాడుగట్టి పాఱిపోకుండఁ బట్టుకొని కొరడాలతోను బరికెలతోడను గొట్టుదురు. అనేక విధముల తాడనము గావింతురు 63. చీకటిలోఁ బడవైచియుఁ గాలిన పెనముమీఁద నిలువ బెట్టియు మట్టియూఁడలతోఁ గొట్టియుఁ బీడింతురు 64. అపానద్వారమునందుఁ బొడవైన మేకులు గొట్టుదురు. తుపాకిమందు బాగుగాఁగూరిన పీపాలోపలఁగాని కొట్టులోఁగాని పడవైచి నిప్పునంటింతురు. నాలుగు వైపులఁ గదలకుండునటుల పగ్గములతో నంటగట్టి లాటీలతోఁ గొట్టుదురు. పిడికిళ్ళతోఁ బొడుతురు. కాలికొక్కెరవైచి కదలమెదలకుండఁ జేసి కొట్టుదురు. మోఁకాళ్ళతోఁ గ్రుమ్మదురు. ఇవియన్నియు నాధిభౌతిక తాపములు 65. తన్నులు మొట్లు పేడతోఁ గొట్టుట చెవులలో గంకర తాళ్ళుదోపి లోనికిదిగునట్లు కొట్టుట, తాళ్లతోఁ జితుకఁగొట్టుట 66, దేనికేని కట్టివేయుట, చిమ్మటలతోఁ జర్మము ముందునకు లాగి కొట్టుట, వెనుకకుఁ జేతులు విఱిచి కట్టుట, సంకెళ్ళు తగిలించుట, గొట్టమువలె వంచి

చెట్టుమొదటి కంటగట్టుట, బండకొయ్యవేయుట, నాలుగు ప్రక్కలఁ గావలి వాండ్రనుంచి కదలమెదలనీయక నిర్బంధములో నుంచుట యాధిభౌతిక తాపము 67. ముక్కురంధ్రములలో దీక్ష్ణమైన సున్నపునీరు నించి బాధింతురు. ఉప్పునీరు తమిదెనీరు బెల్లపునీరుగూడ నించి యూపిరాడకుండఁ జేయుదురు 68. నీటిలో ముంచివేయుదురు. ఏనుఁగుముందుఁ గట్టివేయుదురు. రాజ్యమునుండి వెడలగొట్టుదురు. నానావస్థలఁ బెట్టుదురు. నానా విధముల బాధింతురు 69. చెవి ముక్కు చేయి నాలుక పెదవి మున్నగు నవయవములను గోసివేయుదురు 70. బాణములతో గురిజూచి కొట్టుదురు. ఉరితీయుదురు. నేత్రములను వృషణములను దీసివేయుదురు. అన్ని గోళ్ళలోను సూదులను గ్రుచ్చుదురు 71. ప్రతిదినము తూచిన యెడల గొంచెముకొంచెము తగ్గిపోవునటుల నాహారాదు లొసంగక బాధింతురు. కొండమీాదినుండి క్రిందికి నెట్టివేయుదురు. ఫిరంగిముందునిలువఁ బెట్టి కాల్చివేయుదురు. ఈ విధముగా రాజభటులు ప్రజలకుగూర్చు బాధలకు ఆధిభౌతిక తాపములని పేరు 72. చెవులో మేకులను గుద ద్వారమునందు గూటములను గొట్టుదురు. బ్రతికియుండగనే దేహము మీాఁది చర్మమునంతయు నొలిచివేయుదురు 73. నఖశిఖపర్యంతముగల చర్మమునంతయు దిత్తివలె నొక్కమాఱు ఒలిచివేయుదురు. పొడిచిపొడిచి చంపుదురు. మెడలో బరువైన లోహపుగుండును గొలుసును అంటగట్టి బాధింతురు. కొయ్యగుదియతో ఎముకలన్నియు విరుగగొట్టుదురు 74. సీసా పగులఁగొట్టిన చూరనీటితోఁ ద్రాగింతురు. విసము త్రాగింతురు. తల గోసివేయుదురు. బ్రతికియుండఁగనే బొందలోఁ బూడ్చివేయుదురు. ఈ విధముగా రాజభటులు ప్రజలను బెట్టు బాధలు ఆధిభౌతికతాపములు 75. లాగుతొడిగించి దానిలో తొండలను విడచి పెట్టుదురు. కోపముతోనున్న యరణ్యమృగము లున్నగదిలో రాజదండనపాత్రుని ద్రోసి యతి నికృష్టము కష్టరూపము నగు మృత్యుముఖమునఁ గూలద్రోయింతురు. గొంతుకకు త్రాడుబిగింతురు. నానావిధములఁ గష్టపెట్టి మరణోన్ముఖు నొనర్తురు. ఈవిధముగ రాజభటులు పెట్టుకష్టము లాధిభౌతికతాప

ములు* 76. కుక్కలు గరువగా మరణించుటయు, బులివాతఁబడి చని పోవుటయు, భూతమువలన గతించుటయు, మొసలివలనఁ జచ్చుటయు నాధిభౌతికతాపములు 77. కండరములనుబట్టి లాగివేయుదురు. గంతలలోఁ గట్టి మండుచున్న యగ్నిగుండములలో వేసికాల్తురు. ఇంక ననేకవిపత్తులు గూర్తురు 78. మనుష్యహాని ధనహాని వైభవహాని మహత్త్వహాని, పదార్థహాని పశుహాని మున్నగువానివలన గల్గు తాపములు అధిభౌతిక తాపములు 79.

బాల్యములోఁ దల్లిమరణించుట, వయస్సులో భార్యగతించుట, వృద్ధావస్థలో కొడుకులు కూతుండ్రు చనిపోవుట 80, దుఃఖము,దరిద్రము, ఋణము, విదేశప్రవాసము, దోఁచుకొనఁ బడుట, ఆపదలవెంట నాపదలు కలుగుట, దుష్టాన్నమును దినుట 81, మహామారివాతబడుట, యుద్ధములో నోడుట, తనకు ప్రియతమమైనవారలు మరణించుటవలనిదుఃఖము ననుభవించుట 82, కఠినకాలమువచ్చుట, కరువువచ్చుట, సందేహాస్పద జీవితుఁడగుట, చెడ్డ సమయ మేతెంచుట, ఉద్వేగమునందును జింత యందును బడిపోవుట ఆధిభౌతికతాపములు 83. గానుగలోఁగాని మోటలోఁగాని పడి నలిగిపోవుటయు, బండిచక్రము క్రిందఁబడి యణఁగి పోవుటయు, బహువిధములగు నగ్నిజ్వాలలలో మాడుటయు 84, శస్త్ర పాతముచే మరణించుటయు, నానావిధములగు నరణ్యజంతువులవాతబడి చనిపోవుటయు, బహువిధబంధనములలోఁ దగుల్కొనుటయు 85, అనేక దుష్టస్థలములలో నివసించి భయమున తహతహపడుటయు, అవమాన ములపాలై సిగ్గుపడుటయు, శోకాతిశయముచేఁ బ్రాణి తపించుటయు నాధిభౌతికతాపము 86.

ఈవిధముగాఁ జెప్పఁబూనినచో ఆధిభౌతికతాపమున కంతముండదు. అదియొక మహాపర్వతము. కావున శ్రోతమహాశయులారా ! ఇంతతో ఆధిభౌతిక తాపమననేదియో తెలిసికొనుఁడు. ఇప్పటికె విస్తరించితిని 87.

---

* ఈ యుదాహరణములవలన శ్రీరామదాసస్వామికాలమునందు రాజదండనము లెంతఘోరముగ దుర్భరముగ నుండెనో పాఠకులు తెలిసికొనవచ్చును.

## ఎనిమిదవ సమాసము – ఆధిదైవికతాపము.

(యమయాతనలు)

ఆధ్యాత్మికతాపమును ఆధిభౌతికతాపమును విపులముగా వర్ణించి తెలిపితిని. ఇపుడాధిదైవికతాపమునుగూర్చి తెలుపుచున్నాఁడను. సావధానమతితో నాలింపఁగోరెదను 1. మనుష్యుఁడు శుభాశుభకర్మల నొనరించి మరణము నొందినపిమ్మట ననుభవించు యమయాతనకును, స్వర్గమునందును నరకమునందును గలుగు ననుభవమునకును ఆధిదైవికతాపమని పేరు 2. మదాంధుఁడై మానవుఁ డనేకవిధములగు నవివేకకార్యములొనరించి యనేకపాతకములఁగావించి యంత్యమునందు దుఃఖావహమగు యమయాతనల ననుభవించును 3. శరీరబలము, ద్రవ్యబలము, మనుష్యబలము, రాజబలము మున్నగువాని నాధారపఱచికొని యకృత్యములొనరించువారును, నీతిదప్పి పాపాచారము లొనరించుచు విఱ్ఱవీగువారును యమయాతనలకుఁ బాల్పడుదురు 4-5. స్వార్థపరతంత్రులై కనులమూసికొని మహర్షులవలె కనిపించుచు దురభిలాషలతో వర్తించు దుష్టులును, ఇతరుల వృత్తి స్వాస్థ్యములను భూములను ద్రవ్యములను స్త్రీలను హరించువంచకులును, మదముచే నున్మత్తులై జీవహత్య కుటుంబహత్య మిథ్యాచారము నొనర్చుపాపులును యమయాతన లనుభవింతురు 6_7. నిబంధనల నతిక్రమించి నడిచినయెడల గ్రామాధికారి దండించును. దేశవాసులు నీతిని న్యాయమును విడిచినయెడల దేశాధిపతి దండించును. దేశాధిపతి తగవు తొలంగిన యెడల రాజు దండనము విధించును. రాజు న్యాయముతప్పినచో నీశ్వరుఁడు శిక్షించును. నీతిని న్యాయమును పాటింపక విఱ్ఱవీగి రాజువర్తించెనేని పరలోకమున యమయాతన లనుభవింపవలసివచ్చును 8-9. అవినీతిపరుఁడును స్వార్థపరతంత్రుఁడు నైనయెడల రాజు పాపియగును. పాపమువలన రాజ్యాంతమున నరకము సంభవించును. రాజ్యమునకు బిమ్మట రాజునకు నరకము లభించును. "రాజ్యాంతే నరకం ధ్రువం" అని పెద్దలు చెప్పుదురు. తపస్సువలన రాజ్యము, రాజ్యమువలన నరకము గలుగుననుసామెత మీరెఱుంగనిది గాదు 10. రాజనీతిని దొలంగి వర్తించు భూపాలకున కంత్యకాలమున యముఁడు

భయంకరములగు బాధలొనగూర్చును. యముఁడుపాపులను శిక్షించుటలో నియతి తొలంగినయెడల దేవబృంద మాతని ముట్టడించి పదచ్యుతుని గావించునుగాన దోషులను శిక్షించుపట్ల యముఁడు కడుజాగరూకతతో నుండును 11. ఈశ్వరుఁ డీవిధముగాఁ బాపులను శిక్షించుటకు నిర్ణయము లేర్పఱచినాఁడు. ఇందుచేతనే నీతియుక్తుఁడవై ప్రవర్తింపుమని మనకుఁ బెద్దలు చెప్పుచున్నారు. ఒకవేళ నీవు క్రిందుమీఁదుయోచింపక నీతి తప్పి సంచరింతువేని యమయాతనలు నీకు సిద్ధముగానున్నవని తలంచుకొమ్ము 12. పాపులను దండించుటకు భగవంతుఁడు యముని నియోగించి యున్నాఁడు. అందువలననే యీతాపమునకు ఆధిదైవికమను సార్థకనామ మేర్పడినది. మూఁడవతాపమగు యమయాతన మిగులఁ గఠినమైనది 13. యమలోకమునందుఁ బాపు లనుభవింపవలసిన యాతనలు శాస్త్రములలో బహువిధములుగాఁ జెప్పఁబడినవి. పాపులకు యమదండన మవశ్య భోగ్యము 14-15. పాపమునకును బుణ్యమునకును దగిన కళేబరము లనేకములు పరలోకమున సిద్ధముగానుండును. జీవుని నాకళేబరము నందు దేవదూతలు ప్రవేశపెట్టి నానావిధములగు పాపపుణ్యముల ఫలము లనుభవింపఁ జేయుదురు 16. నానావిధములగు పుణ్యము లొనరించినవారికిఁ బరలోకమున బహువిధములగు భోగానుభవములు సమకూరును. వివిధములగు పాపకర్మము లాచరించి యున్నయెడలఁ గర్కశయాతనల ననుభవింపవలసివచ్చును. ఈ విషయము నా స్వకపోల కల్పనముకాదు. శాస్త్రములయందుఁ జెప్పఁబడినదిగావున నవిశ్వసనీయమని తలంపఁగూడదు 17. వేదము లాజ్ఞాపించువిధమునఁ బ్రవర్తింపనివాఁడును,భగవంతునియెడ భక్తిశ్రద్ధలు వహింపనియాతఁడును యముని సన్నిధికేగి యాతనల ననుభవించును. అదియే ఆధిదైవికతాపము. దాని స్వరూపము వర్ణించెద 18.

ఉడుకుచుండెడి నరకమునందు బహువిధములగు జీవములు పురాతనకీటకములు రవరవయని భయంకరముగా ధ్వనిచేయుచుండును. దానియందుఁ జేతులను గాళ్ళను బిగియఁగట్టించి యముఁడు పాపులగు మనుజులను బడవేయును 19. మిగుల విశాలమగు లోనిభాగమును జిన్నమూతియుఁగల భాండరూపమున యమలోకములో నొక కుండ నిర్మింపబడి యున్నది. దానిలో దుర్గంధవస్తువులు, వమనము నిండియున్నది. దానిపేరు

కుంభీపాకము. ఇచటఁ బాపియగువాఁడు పొందు యాతనలు ఆధిదైవిక తాపములు 20. యమలోకములోఁ బాపులను దూతలు పట్టుకొనివచ్చి కాలుచున్న భూమిపయిఁ బడవేసి నిలువఁబెట్టుదురు. కాలుచున్న స్తంభ మున కంటఁగట్టుదురు. నానావిధముల నుడికి పొంగులువచ్చు తప్తవస్తు వులను పైనఁ బూయుదురు 21. యముఁడు తనదీర్ఘదండముతోఁ బాపు లను నోడలు పగులఁగొట్టును 22. పాపియగువాఁడు తొలుదొలుత భూలోకమునందే బహువిధములగు బాధల ననుభవింప వలయును. యమయాతన లంతకంటెను బెక్కురెట్లు కఠినములు. ఉచ్ఛ్వాసనిశ్వాస ములు దీసికొననీయకుండ యమదూతలు కొట్టుదురు 23. నలుగురు దూతలు నాలుగువైపులనుండి లాగుదురు. కోదండమువేయుదురు. కాలితోఁ దన్నుదురు. బడితెలతోఁ గొట్టుదురు. ముందునకు గుంజు దురు 24. లేచుట కలవిగాదు. కూర్చుండుటకు శక్యముగాదు. ఏడ్చుటకు సాధ్యముగాదు. పడుటకు వశముగాదు. యాతనలపయి యాతనలు వచ్చు చుండును 25. యమలోకబాధ లనుభవింపలేక ప్రాణి వాయెత్తి బిగ్గరగా నేడ్చును. సంకటము లనుభవింపలేక బెదరును. క్రోపుడులకు భయ పడును. ఎండి వరుగైపోవును. నానావిధములగు కష్టము లనుభవించును 26. యమదూతలు కఠినవాక్యము లాడుచుఁ గర్కశముగాఁ గొట్టుదురు. పాపులు యమలోకమునఁ బొందుకష్టము లనేకవిధములుగనున్నవి. వీని నన్నింటిని ఆధిదైవికతాపము లందురు 27.

గతసమాసములో రాజదండనమునుగూర్చి చెప్పితిని. దానికంటెను గూడ మిగులఁ గఠినమైనది యమదండనము. ఈ యాతన మిక్కిలి భయానకమునుఁ గఠోరమునునై యున్నది 28. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక తాపములు రెంటికంటె ఆధిదైవికము మిగుల నసహ్యాకరమైనది. ఇచ్చట దానిని సంక్షేపముగాఁ దెలిపినాఁడను 29.

## తొమ్మిదవ సమాసము — మృత్యునిరూపణము.

(మృత్యువునుండి యెవ్వఁడు తప్పించుకొనఁడు.)

ఈ ప్రపంచము మృత్యువువద్దకుఁ బోవుటకై సిద్ధముగానున్న యొక వాహనము. ఏ గడియయం దీకఁబరము నెత్తుకొనిపోవుదునాయని కాలము త్రోవ లారయుచుండును 1. మృత్యు వెల్లప్పుడును గాలముతో సాంగత్యము గలిగియుండును. మృత్యుదేవి ముందేవిధముగా గమనింప నున్నదో యెఱుంగ నేరికిని శక్యముగాదు. కర్మానుసారముగా మనుష్యుఁడు దేశమునందో, విదేశమునందో మృత్యువు వాతఁబడును 2. సంచిత కర్మముల ననుభవించుట ముగియఁగనే దేహి యీ ప్రపంచమునువిడిచి వెంటనే పరలోకయాత్రకు సిద్ధముగా నుండవలసియున్నది. రెప్పపాటులో నీ ప్రయాణసంరంభము ముగియును 3. ఆకస్మికముగ యమదూతలు ప్రయాణము చేయించుటకు బయలుదేరి వత్తురు. మరియుఁ గొట్టుచు, బాధించుచు మృత్యుమార్గమునకుఁ జేర్చుదురు 4. మృత్యువు దెబ్బ గొట్టినపిమ్మట నెవ్వరును సహాయము జేయఁజాలరు. వెనుకముందుగఁ బ్రాణికోటికంతటికిని నీదెబ్బ తగిలితీరును 5. మృత్యుకాలము బలవంత మగు లాటీదెబ్బవంటిది. అది బలవంతుల తలపయినిఁగూడఁ బడును. గొప్పగొప్పరాజులు, మహారాజులు, మిగుల బలవంతులని పేరొందిన యోధులునైన తమ మృత్యుముఖమునుండి తప్పించుకొనఁజాలరు 6.

మృత్యువు ఈతఁడు క్రూరుఁడని వెరచి విడిచిపెట్టదు. వ్యాయామ విద్యలో నీతఁ డారితేరినవాఁడని గ్రహింపదు. ఈతఁడు సంగరాంగణ ములోఁ జెలరేగి విరోధులఁజంపు శూరపురుషుఁడని తెలిసికొనదు 7. ఈతఁడు క్రోధస్వభావుఁడనిగాని, యీతఁడు ప్రతాపశాలియనిగాని, యీతఁ డుగ్రరూపుఁడగు ఖలుఁడనిగాని మృత్యువు తలంపదు 8. మృత్యు దేవత బలాఢ్యుని, ధనవంతుని, సర్వగుణసంపన్నుఁడగు నుత్తముని సమాన దృష్టితోఁ దిలకించును 9. విఖ్యాతపురుషుని శ్రీమంతునిఁ బరాక్రమ వంతుని సామాన్యరాజునుఁ జక్రవర్తిని మహాత్ముని అశ్వపతి నరపతి గజపతి మున్నగు విఖ్యాతరాజులను మృత్యుదేవత లక్ష్యముచేయదు 10—12. లోకమాన్యులు, రాజనీతివిశారదులు, వేతనభోక్తలు

(మన్సబుదార్లు), అధికారులు, వ్యాపారులు, మదోన్మత్తులగురాజులు మృత్యుదేవతముందు గరికపోచ కక్కఱకురారు 13 – 14. మృత్యువున కీతఁడు ముద్రాధికారియని గౌరవముగాని, ఈతఁడుద్యోగియని యాదరముగాని లేదు. అది పరకాంతనుగాని, రాజకన్యకనుగాని విడిచిపెట్టదు 15. మృత్యువునకుఁ గారణములతోఁ బనిలేదు. ఉన్నతకులమనిగాని, నీచకులమనిగాని యూహింపదు. వీఁడు కర్మనిష్ఠుఁడగు బ్రాహ్మణోత్తముఁడుగదా యని కనికరముజూపదు 16. వ్యుత్పన్నుఁడగు (బుద్ధిమంతుఁడగు) పురుషుని మీఁద మృత్యువు దయదాల్పదు. అన్నివిధముల సంపన్నుఁడై యున్నవానిని, విద్వాంసుని, గొప్ప జనసముదాయమును జేతిక్రిందనుంచుకొని పరిపాలనాకౌశలము జూపువానినిగాని మృత్యుదేవత విడిచిపెట్టదు 17. ధూర్తుని (చతురసభ్యుని), బహుశ్రుతుని, బండితోత్తముని 18, పౌరాణికుని, వైదికుని, యాజ్ఞికుని, జ్యోతిష్కుని సైతము మృత్యు వెత్తుకొని పోవును 19. అగ్నిహోత్ర నిష్ఠగలవానిని, శ్రోత్రియుని, మాంత్రికుని, యాంత్రికుని, వేదమును బూర్తిగాఁ జదివినవానిని గూడ మృత్యు వాదరించి విడిచిపెట్టదు 20. ఈ పురుషుఁడు శాస్త్రపారదుఁడుగదా యని మృత్యు వనుగ్రహింపదు. లేక వేదజ్ఞుఁడు సర్వజ్ఞుఁడనని జాలిదలంపదు 21. బ్రహ్మహత్య, గోహత్య, బాలహత్య, స్త్రీహత్య మున్నగు ఘోరకృత్యములు గావించుచుంటినని మృత్యుదేవత విచారింపదు 22. రాగజ్ఞానిని, తత్త్వవేత్తను, కాళజ్ఞానిని 23, యోగాభ్యాసిని, సన్యాసిని, యోగబలముచే మరణము నాపఁగల మహాత్ములను 24, సావధానపురుషులను, సిద్ధులను, వైద్యులను, భూతవైద్యులను సైతము మృత్యు వెత్తుకొని పోవును 25. ఈతఁడు గోస్వామియనియుఁ, దపస్వియనియు, మనస్వియనియు, నుదాసీనుఁడనియు 26, ఋషీశ్వరుఁడనియు, గవీశ్వరుఁడనియు, దిగంబరుఁడనియు, సమాధిస్థుఁడనియు 27, హఠయోగియనియు, రాజయోగియనియు, రాగదూరుఁడనియు మృత్యువు రవ్వంతయేని యనుగ్రహముజూపదు 28. బ్రహ్మచారిని, జటాధారిని, నిరాహారిని, యోగీశ్వరుని సైతమది యెత్తుకొనిపోవును 29. సాధువును, మహాత్ములను, అదృశ్యవిద్య నభ్యసించి గుప్తమైపోయెడివారిని 30, స్వాధీనుని, పరాధీనుని సైతము విడిచిపెట్టదు. సమస్తప్రాణులను మృత్యువు తినివేయును 31.

ఈ ప్రపంచమునందున్న మనుజులలోఁ గొందరు మృత్యుమార్గములోనికిఁ బూర్తిగా నేతెంచియున్నారు. కొందరు సగముదనుక చేరిరి. మఱికొందఱు వృద్ధులై యంత్యమువరకుఁజేరిరి. ఇంక నెందరెందరో మరణించిరి 32. బాలకుని, తరుణుని, సులక్షణుని, అవలక్షణుని, వ్యాఖ్యాతృ శిరోమణిని మృత్యుదేవత లెక్కగఁ బరిగణింపదు 33. ఈతఁడు సంఘమునకు దేశమునకు నాధారభూతుఁడనిగాని, యుదారశీలుఁడనిగాని, సుందరపురుషుఁడనిగాని, అన్నివిధముల సామర్థ్యముగలవాఁడనిగాని మృత్యువు తలంపదు 34. పుణ్యపురుషుని, హరిదాసుని, భగవత్కీర్తనకారుని, గొప్పగొప్ప సత్కర్మములాచరించు సుకృతాత్ముని నైతము మృత్యువు విడువదు 35.

అది యటులుండనిండు. మృత్యువునుండి తప్పించుకొనువాఁడే లేఁడు. ముందో వెనుకయొ తప్పక యందఱును మృత్యుముఖమున బడవలసియే యున్నది 36. ప్రాణిసమూహము నాలుగువిధములు. జరాయుజములు, ఉద్భిజ్జములు, అండజములు, స్వేదజములు అని యా నాలిగింటిని జెప్పుదురు. ఈ చతుర్విధసృష్టియందుగల యెనుబది నాలుగు లక్షల యోనులనుండి జనియించిన సమస్తజీవులను మృత్యువు రేపోమాపో తప్పక తినివేయును 37. మృత్యుభయమువలన నెచ్చటికేని పాఱిపోయినను వాని నెప్పుడును విడువదు. ఏ యుపాయముచేతనైనఁ గడతేర్చియే తీరును 38. స్వదేశీయునైనను విదేశీయునైనను మృత్యువు తినకమానదు. నిత్యము నుపవాసవ్రతమున నున్నవాని నైననుసరియే మృత్యుదేవత బ్రతికియుండనీయదు 39. మృత్యువు పెద్దల విడువదు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులనునైతమది లక్ష్యముసేయదు. భగవంతుని యవతారములుగఁ దలంపఁబడు రాముని కృష్ణునిగూడఁ గడతేర్చినది 40. నేనిటులఁ జెప్పితినని శ్రోత లాగ్రహింపవలదని కోరుచున్నాఁడను. ఏలయన, ఈ భూలోకమున నవతరించినవాఁడెల్ల మృత్యువు వాతఁబడి దీరును. ఇది మృత్యులోకమని మీరెల్ల రెఱింగియే యున్నారుగాన నిఁక విస్తరమెందులకు? 41. ఇందు సందేహింపవలసిన యంశమేదియునులేదు. దీనికి మృత్యులోకమను పేరు ప్రఖ్యాతమైనది. ఈ యంశము చిన్నలు పెద్దలు బాగుగా నెఱింగినదె 42. ఒకవేళ సందేహించినయెడల నిది మృత్యులోకము గాకపోవునా? ఇది మృత్యులోకమే ! ముమ్మాటికిని

మృత్యులోకమే! ఇచ్చట పుట్టినదెల్లఁ జచ్చియేతీరును 43. కావున వివేకవంతుఁడగు మానవుఁడు సామాన్యప్రాణులవలె మృత్యుముఖమునఁబడక కీర్తిగడించి జన్మము సఫలము గావింపవలయును. అంతియగాక మరణించినతరువాతగూడఁ కీర్తిరూపముతోఁ బ్రపంచమున జీవితుఁడై యుండవలెను 44. చిన్నలు పెద్దలు మొదలుకొని సమస్తప్రాణులు మృతినొందుట నిశ్చయము. ఇందు సందియము లేనేలేదు 45.

మహావైభవ సంపన్నులగు రాజాధిరాజులు, చిరకాలజీవులుగానున్న సిద్ధాత్ములు, అగాధమహిమాన్వితులు మృత్యుమార్గమునఁబడి యదృశ్యమైపోయిరి 46. పలువురు పరాక్రమవంతులు, పలువురు కపటాచారపరాయణులు, పలువురు బహుకాలద్రష్టలు, పలువురు కులనాయకులు, పలువురు రాజులు మరణించిరి 47. బహువిధములగు యుద్ధములలో జయముబడసిన శూరులు, బలసంపన్నులు 48, సమస్త ప్రజాసమూహమును బరిపాలించినవారు, బుద్ధిశాలురు, యుక్తిమంతులు, తార్కికులు 49, విద్యావంతులు, శైలసదృశబలవంతులు, కుబేరుని దిరస్కరించునంతటి ధనికులు 50, పురుషార్థవంతులు, తేజస్సంపన్నులు, కార్యాచరణకౌశలురు 51, శస్త్రధారులు, పరోపకారులు, భిన్నభిన్న మతరక్షకులు పరలోకము చేరిరి 52. ప్రతాపశాలురు, సత్కీర్తిధనులు, భిన్నభిన్న నీతివిదులు, రాజనీతివిదులగురాజులు, ప్రయత్నవాదులు, వివాదశీలురు 53, భిన్నభిన్న మతవాదులు, పండితవతంసులు, శబ్దస్వరూపమును గూర్చి కోలాహలమొనరించు వైయాకరణులు, నానామతములపైఁ బూర్వపక్షసిద్ధాంతము లొనరింపఁగల మహామహులు పరలోకగతులైరి 54—55. తపస్విసమూహము, సన్న్యాసిబృందము, తత్త్వవేదిసముదాయము 56, గృహస్థులు, బహువిధవేషధారులు, నానావిధపురుషులు, బ్రాహ్మణసమూహము, ఆచార్యపురుషులు మృత్యువు నోటఁబడిపోయిరి. ప్రపంచ మేర్పడినదిమొద లింతవఱ కెందరెందఱు మహాత్ములు ప్రపంచమునందుఁ దమ లీల జూపి మరణించిరో యెవరికిఁ దెలియును! ఎంతదనుకఁ జెప్పగలను? 57—58.

ఈ విధముగాఁ బ్రాణిసమూహమంతయు మృత్యుదేవత నోటఁబడిపోయెను. ఇంతప్రాణిబృందము నశించినను నశింపక నాటినుండి నేటి

దనుక శాశ్వతస్థాయిగా నున్నది ఆత్మజ్ఞానస్వరూపాకార మొకటి మాత్రమె యని శ్రోతలు గ్రహింతురుగాక 59.



## పదియవ సమాసము – వైరాగ్యనిరూపణము.

ఈ సంసారము తరంగసంగతులచే నుప్పొంగు నదియైయున్నది. దీనిలో ననేకజలచరములు నివసించియున్నవి. విషయుతములగు కాలసర్పములు కాటువేయుటకుఁ బరుగులిడుచుఁ బైకివచ్చుచున్నవి 1. ఈ మహా నదిలో ఆశ, మమకారము, దేహబుద్ధియను మొసళులుగలవు. అవి మనుజులనుబట్టి ప్రక్కకు లాగుకొనిపోయి సంకటముల పాలుచేయుచున్నవి 2. అహంకారరూపములగు నక్రములు పాతాళమునకుఁ బట్టుకొని తీసికొని పోయి మానవుని నాకస్మికముగా ముంచివేయుచున్నవి. అచటి కీడ్వఁబడిన ప్రాణియెన్నఁటికి బయటఁబడఁజాలఁడు 3. కామరూపియగు మొసలి పిడికిలినుండి యెన్నఁటికి మనుష్యుఁడు విడిపించుకొనలేఁడు. తిరస్కారము వెంటనంటియున్నది. మదమత్సరములను విడువలేకుండుటవలన మనుజుఁడు భ్రమలయందుఁ బడిపోవుచున్నాఁడు 4. వాసనారూపమగు నాఁడుపాము మెడకుఁజుట్టుకొని నాలుకలు గ్రోలుచు విషము నుమియుచున్నది 5. ఇట్టి దశయందు మనుష్యుఁడు చూచినదానినెల్ల నాదినాది యని నుడువుచుఁ బ్రపంచభారము (గృహస్థభారము)ను తలపయి కెత్తుకొనియున్నాఁడు. అతఁడా యుప్పొంగు సంసారనదిలో మునుఁగఁ గోరుచున్నాఁడు. కాని భారము విడువకున్నది. మీఁదుమిక్కిలి కులాభిమానములోఁబడి పొంగిపోవుచున్నాఁడు 6. అట్టిదశయందు భ్రాంతియను నంధకార మావరించుటచే నభిమానరూపుఁడగు చోరుఁడు వానిని దోఁచుకొనుచున్నాఁడు. మఱియు నహంతారూపిణియగు భూతము వాని నలముకొనుచున్నది 7. ఈ విధముగా ననేక ప్రాణులు ఈ మహానదియందుఁ గల సుడిగుండములలోఁబడి చుట్టుకొని పోవుచున్నారు. అటుల నవస్థపడుచు భక్తిభావ పూర్వకముగా భగవంతుని నుద్ధరించుటకుఁ బిలుచువాఁడు ఒడ్డుబట్టు చున్నాఁడు. భగవంతుఁ డాతని నెంతేని మన్నించి యొడ్డునకుఁ జేర్చుచున్నాఁడు. పాపము! తక్కిన భక్తిరహితుల దురవస్థ చెప్పవలసిన పనియే

లేదు. వాంఛా ప్రవాహమున దిక్కు—మోక్షములేక కొట్టుకొని పోవుచునే యున్నారు 8—9. భగవంతుఁడు భక్తిభావమున కాంక్షలిగొని యున్నాఁడు. ఆతఁడు భక్తిభావము నానందముతో గ్రహించును. భక్తిభావముగలవాఁడు సంకటములొందు సమయమున నాతఁడు ప్రసన్న వదనముతోఁ బ్రత్యక్షమై రక్షించుచున్నాఁడు 10. ఎవఁడు పరమాత్ముని మీఁదఁ బ్రేమగలిగియుండునో యాతనియెడఁ బరమాత్ముఁడుగూడఁ బ్రేమతో నుండును. అతఁడు తన భక్తునియెడఁ గనికరించి సమస్తమైన యాపదలనుండి తొలఁగించును 11. పరమాత్మునియెడ భక్తివిశ్వాస ములుగలవారై దాసానుదాసులై వర్తించు పుణ్యాత్ములు తప్పక స్వాత్మ సుఖానందము జూరగొందురు. ఇట్టి భక్తవతంసులకు నమస్కరించెదను 12. ఎవనికి భగవంతునిపయి నెట్టి భావముగలదో వానిపట్ల పరమాత్మునకుఁ గూడ నట్టిభావము గలుగును. భగవానుఁడు ప్రాణిమాత్రుల హృదయ ములలో నంతస్సాక్షిగానున్నాఁడు. మఱియు నందరిభావము లెఱింగి మెలంగుచున్నాఁడు 13. ఎవఁడు మోసగాఁడై లోకులను భగవంతుని వంచించుచుండునో నట్టి వంచకునెడ భగవంతుఁడుసైతము మోసఁ గాఁడుగ నుండును. ఆతని కౌశల మత్యంతాశ్చర్యకరమైనది. ఆయన ఎట్టివాని కట్టివాఁడుగాఁ గనిపించును 14. తన దివ్యనామము జపించుచు నిరంతరము భక్తిశ్రద్ధలతో దపముగావించు భక్తునియెడ భగవంతుఁడు శాంతభావముతో మెలంగి శాంతి ప్రసాదించును. ఒకవేళ భక్తుని భావము కొంచమేని న్యూనమై భక్తిపదవినుండి తొలగినయెడల భగ వానుఁడు వేగమె భక్తునివిడిచి వెళ్లిపోవును 15. ఎవఁడెటులుండునో వానికట్టి ప్రతిబింబము దర్పణమునందుఁ గనిపించును. దానికి ముఖ్య మగు తాళపుఁజెవి మనయొద్దనేయున్నది 16. మనమెట్లు చేయుదుమో దర్పణములోని మన ప్రతిబింబముసైతము మటులే చేయుచుండును. ఒక వేళ మనము కనులను బాగుగా విప్పిచూచితిమేని మన ప్రతిబింబముగూడఁ గనులనువిప్పినటులఁ గనిపించును 17. కనుబొమ్మలను ముడివిలించి మనము కోపముతోఁ జూచినయెడల నదియుఁ గ్రోధస్వరూపముగా గోచరించును. ఒకవేళ మనము నవ్వసాగినచో మన ప్రతిబింబముగూడ నవ్వసాగును. 18. మనుజునిభావములెట్లు దర్పణమునందుఁ ప్రతిబింబితములగుచున్నవో

యటులే పరమాత్ముఁడుగూడ భక్తునివిషయమున మాఱుచుండును. ఎవరు తన్నెటులభజింతురో వారికటులే భగవంతుఁడు కామితఫలములను బ్రసాదించును 19. సాధకుఁడగు మానవుఁడు భావమార్గమునను పరమార్థ మార్గమునను భక్తిస్థానమునకుఁ జేరును. అప్పుడు సాధుసమాగమము చేకూరి మోక్షమార్గము లభించును 20. భావపూర్వకముగ భగవానుని యెడ భక్తిప్రపత్తులు గలిగియుండు మానవులు పావనులగుదురు. అంతియ గాక భావబలమునఁ దమపూర్వులనుగూడ నుద్ధరింతురు 21. స్వయముగ ముక్తులయ్యెదరు. ఇతరులకుఁగూడ నుపకరించి భక్తిరహితులకు భక్తి గలుగఁజేసి తరింపఁజేయుదురు 22. పరమాత్మునియెడ భక్తిగల భక్తులను గన్న తల్లులే ధన్యురాండ్రు. వారల జన్మము సర్వవిధముల సార్థక మైనది 23. భగవంతునికిఁ బ్రియతములగు భక్తుల యాధిక్యము నెంతని కొనియాడనేర్తును! వారలకు దుఃఖము కలిగినపుడు ఆ పరమాత్ముఁ డాలంబనముగాఁ దన నడుమునొసంగి దరిజేర్చుచున్నాఁడు 24. అనేక జన్మములకుఁ బిమ్మట నీ నరదేహము లభించును. ఈ నరదేహమును సత్క్రమ మార్గములఁ బ్రవేశపెట్టి భక్తిమార్గమున నన్వయించినయెడల నీశ్వర సమావేశము కలుగును 25. అట్టి భక్తిస్వభావులగు పుణ్యపురుషు లకు నమస్కరించెదను. భక్తుల ప్రభావము గొనియాడ నశక్యము. వారలు హరినిధానమును సంచితము గావింతురు. అందుచే వారల యనంత జన్మఫలము సఫలమగును 26.

మానవుని యాయు వొక రత్నపేటిక. దీనినిండ సుందరములగు భజనరత్నములు కలవు. మానవులారా! అట్టి లోకోత్తరములగు భజన రత్నములను నీశ్వరసమర్పణము గావించి యానందము చూరగొనుడు 27. సంసారసంబంధములగు భోగభాగ్యములలోహీనులై నంతమాత్రమున హరి భక్తులెన్నఁటికిని హీనులుగాఁ బరిగణింపఁదగరు. వారు వాస్తవమునకు బ్రహ్మాదులకంటెను శ్రేష్ఠులు. సర్వకాల సర్వావస్థలలో వారు నిరాశా నందమున మునిఁగి తేలుచుందురుగదా! బ్రహ్మాదుల కట్టి నిరాశానంద మెక్కడిది? 28. ఈశ్వరుని సహాయము నొక్కదానినిమాత్రము విశ్వ సించి సంసారముపట్ల నిరాశాభావముతోఁ బ్రవర్తించు భక్తిస్వభావులను సర్వవిధముల భగవంతుఁడు సంబాళించును 29. భక్తిస్వభావులగు

నుత్తములు వివేకము గలవారలుగాన సంసారదుఃఖముల నన్నింటిని సుఖములుగా భావింతురు. భక్తిరహితులు సుఖములయందే చిక్కుకొని పడియుందురు 30. ఈశ్వరునియం దత్యంతముగాఁ బ్రేమగల భక్తులు స్వానందసుఖమున నోలలాడుదురు. వారి యక్షయకోశము (స్వానందము) లోకాతీతమైనది 31. భక్తులు సంసారకష్టములను సుఖములుగా భావించి యక్షయసుఖములో సుఖులుగా నుందురు. సంసారదుఃఖమును మఱచి పోయెదరు. ఈశ్వరునియందు మగ్నులై యుండి విషయసుఖమునుండి పరాఙ్ముఖులై యుందురు 32. భక్తులగు మానవు లీ నరదేహముకతనఁ బరమాత్మని బ్రాపింతురు. భక్తిరహితులును అభాగ్యులు నగు నితరులకీ జన్మము వ్యర్థముగాఁబోవును 33. ఎవనికేని సుకృతవశమున నాకస్మికముగా గొప్ప ధనరాశి లభించినచో దానిని గవ్వకు మార్చివేయుట యెట్టిదో భక్తిభావరహితులగు మానవులు తమ యమూల్య దేహమును వ్యర్థముగాఁ గోల్పోవుటయు నట్టిది 34. పూర్వ పుణ్యాకారణమున నెవనికేని స్పర్శవేది లభించినయెడల దాని నుపయోగించు విధ మెఱుంగక పాడుచేయును. అటులే భక్తిహీనుఁడగు పురుషుఁడు పూర్వ జన్మసుకృతమున గడించిన యీ నరదేహమును సార్థకము గావించు విధము నెఱుంగక పాడుచేయుచున్నాఁడు. అంతతోఁబోక మాయాజాలము నందుఁ దగుల్కొని తన జీవితమునుగూడ నాశనము చేసికొనుచున్నాఁడు 35–36. ఈ నరదేహ సంయోగమువలననే మానవు లనేకులు ముక్త పురుషులును మోక్షగాములు నైరి. ఇట్టి మనుష్యజన్మమును బొంది భగవంతునియెడ భక్తిశ్రద్ధలు గలవారై సంచరింపని ప్రాణులు జన్మమరణ దుఃఖములను నిరంతర మనుభవించుచుందురు 37.

కావున మానవులు నరదేహమునకుఁగల గొప్పతనము గ్రహించి సాధుసమాగమముకతన జీవితము సఫలము గావించుకొనవలయును 38. ఏ సమయమున కేది రానున్నదో తెలిసికొనఁజాలము. రాత్రి చెట్టుపయి జేరిన పక్షులు తెల్లవారినంతన పదిదిక్కులకు నెగిరిపోయినటుల నీ సమస్త వైభవము, స్త్రీలు, పుత్రులు, ధనము మున్నగునవి యే సమయమున నేవిధముగాఁ బరాధీనములై యెక్కడకు వెళ్లిపోవునో మనము గ్రహింపలేము 39–40. ఏ గడియకు నేమి కానున్నదో తెలియదు. ఆయువు

పూర్తి కావచ్చినది. దేహాంతమైనపిదప మరల నే నీచయోనియో సిద్ధముగాఁ గాచుకొనియున్నది 41. శ్వాన సూకరాది నీచయోనులలో నెందు జనించి విపత్తుల ననుభవింపవలసి వచ్చునో చెప్పఁజాలము. ఈ నీచ యోనులయందు జనించిన ప్రాణికి ఉత్తమగతి లభింపదు 42. ఓరీ! అవివేకీ! నీవు తొలుదొలుత గర్భవాసమునం దున్నపు డెన్నియో కష్టము లొందితివి. ఎన్నెన్నియో యవస్థల పడిపడి వేసారి పూర్వ సుకృతమున మానవుఁడవై జన్మింపఁగలిగితివి 43. వెనుకటి జన్మములలో సమకూరిన సమస్త దుఃఖములను నీవొక్కరుఁడవే యనుభవించితివి. అక్కడ నీలోఁ బాలు పంచుకొనుటకు ఈ భార్యగాని ఈ కుమారులుగాని లేకుండిరి. మరల నదేవిధముగా నీచజన్మములను నెత్తుటకు నేఁడో రేపో యైహిక జీవితము ముగించుకొని నీవొక్కరుఁడవే పోవలసియున్నాఁడవు 44. ఎక్కడితల్లి, ఎక్కడితండ్రి, ఎక్కడిసోదరి, ఎక్కడిభ్రాతలు, ఎక్కడి స్నేహితులు, ఎక్కడి స్త్రీ పుత్రాదులు? 45. సమస్తమును మిథ్యయై యున్నది. అందరును సుఖమునుగోరి నిన్నాశ్రయించినారు. వీరలకు నీ సుఖముతో సాంగత్యము గలదేమోగాని కొంచెమేని దుఃఖముతో సాంగత్యము కలవారు కారని రూఢిగా నమ్ముము 46. ఈ ప్రపంచ మెక్కడనుండి వచ్చినది? నీ కులమెక్కడిది? ఏల వ్యాకులము నొందెదవు? ధనము, ధాన్యము, సంపద మున్నగు సంసార భోగములన్నియు నస్థిరములు 47. ఎక్కడి దీ గృహము? ఎక్కడి దీ గృహస్థాశ్రమము? ఎదులకై యీ వ్యర్థ పరిశ్రమతో మునిఁగి తేలుచున్నాఁడవు? బ్రదికి యున్నంత వఱకే కుటుంబపు జంజాటమను బరువును మోసిమోసి పరితపింతువు. కడకుఁ గాలము దీరును. అన్నియు విడిచిపోయెదవు 48. ఈ తరుణతా విజృంభణము, ఈ భోగభాగ్యములు, ఈ హావభావానందము జూచి మురిసి మిన్నుముట్టకుము. ఇవి యన్నియు మూన్నాళ్ల ముచ్చటలు. ఇంతియకాక యివి మాయతోఁ గూడినవని గమనింపుము 49. ఒకవేళ నీవాకస్మికముగ మరణింతువేని పరమాత్ముఁడగు శ్రీరాముని జెందనేరవు. నీవు కనుపించుదానినెల్ల నాదినాది యని చెప్పుచున్నాఁడవు. నీవాసన విషయములలోఁ జిక్కియున్నది 50. నీవెన్నెన్నియో జన్మము లిదివర కెత్తియుంటివి. అటులె ప్రతిజన్మమున కొక మరణమువంతున

నెన్నియో మరణములను సైతమొందియున్నాఁడవు. ఈ జననమరణములలో నీకీలాటి తల్లులు, తండ్రులు, భార్యలు, బిడ్డలు, కొడుకులు మున్నగువార లెన్నిలక్షలమంది యైపోయిరో యేమెఱుంగుదువు? 51. కర్మయోగమువలన వీరందరు నీకు సమకాలికులుగా నీలోకమున జనించి నీతోఁ గలసిమెలసియున్నారు. ఓరీ చదివినమూర్ఖుఁడా! వీరలను నీవు సిగ్గుబిడియములులేక నావారలు నావారలు అని యెటులఁ జెప్పుకొనుచుంటివో నాకుఁ దోఁచకున్నది 52. బాగుగా యోచించిచూడుము. ఈ శరీరమే నీదికాదు. అట్టియెడ నెట్టిసంబంధమునులేని వీరినందరను నావారు నావారు అని పూసికొందువేల? ఇప్పటికైన నీయొక్కయు నీవు ప్రేమించు జనులయొక్కయు నస్థిరత్వము గ్రహించి భక్తిభావముతోఁ బరమాత్మ్మని నమ్ముకొనుము 53. ఈపాపపుఁ బొట్ట నించుకొనుట కెందరెందరు నీచ జనులనో సేవింపవలసివచ్చుచున్నది. నీచులకడజేరి సిగ్గులగ్గువిడిచి స్తోత్రపాఠములు వల్లింపవలసిన గతి కలుగుచున్నది. పోషించువానికడ నెంతయో వినయవిధేయతలు జూపవలసివచ్చుచున్నది. పట్టెడన్నము బెట్టినందులకే యీరీతిగ నీ జీవితసర్వస్వమును హీనులకు విక్రయించివేయుచున్నాఁడవు. అంత కెన్నిరెట్లో యోగ్యుఁడును నరదేహప్రదాతయు జీవితము నను గ్రహించినవాఁడు నగు దేవుని నీవేల మఱచిపోవుచుంటివో నాకుఁ దోఁచకున్నది 54 — 55. భగవానుఁడు సర్వశక్తిసంపన్నుఁడు. ఆతని మాహాత్మ్యము నీకుఁ దెలియకున్నచో నేను జెప్పెద నాలింపుము. ఈశ్వరుఁడు రేయింబవళ్లు సమస్త ప్రాణిలోకమునకు శుభము నెటులఁ గూర్పఁ గలుగుదునాయని చింతించుచున్నాఁడు. ఆయన ప్రతాపముకతననే సకాలమున మేఘములు వర్షించి పృథివిని సస్యసంపూర్ణము గావించుచున్నవి. ఆయన కనుసన్నలకు లోనై సముద్రము చెలియలికట్టనుదాటక యథావిధిగా నున్నది 56. భగవంతుని యాజ్ఞననుసరించియే భూభారము నాదిశేషువు వహించుచున్నాఁడు. సూర్యుఁడాతని తేజముచేతనే మింటఁ బ్రకాశించుచున్నాఁడు. సమస్త చరాచరభూతవిశిష్టమగు భూతనివహమును సృష్టిని నాతఁడు తన మహత్వముచే (సత్తామాత్రముచే) నడుపుచున్నాఁడు 57. దేవాధిదేవుఁడు, మహాదేవుఁడు, దయాళుఁడు నగు నాపరమాత్మ్మని లీలలను మానవులే మిగుల గ్రహింపఁగలరు. కృపాపూర్వకముగ నాతఁడు

రక్షింపకున్నచో నీజీవలోకము ప్రాణముతో నింతకాలముండఁగలదా? 58. సర్వాత్ముఁడు లోకపావనుఁడు నగు నిట్టి శ్రీరామచంద్రుని విడిచి కామ్య విషయములలో మగ్నులై యుండు ప్రాణులను దురాత్ములన్నను, అధము లన్నను దప్పులేదు. వారు తాము చేసినదాని ఫలము తప్పక యనుభ వింతురు 59. శ్రీరామచంద్రునిగూర్చి కాక స్వోపయోగమునకయిచేయు నాశాకృత్యములన్నియు నిరాశలని గ్రహింపవలయును. కానఁబడినదాని నెల్ల నాదినాది యనుకొనుటవలనఁ గడకు మిగులునది కష్టమొక్కటియే 60. ఎవనికిఁ గష్టము నొందవలయునను గోరికయుండునో వానిని సంతోష ముగా విషయచింతన నొనరింపనీయవలెను. కడకు విషయచింతనముల వలన లభించునది కష్టమే. అది లభించినంతన హృదయము క్షోభించును. విషయములస్థితి యిట్టిది 61. ఆనందఘనమగు శ్రీరామచంద్రుని విడిచి హృదయమునందు విషయచింతనము లొనరించు మానవుఁడు ఎన్నఁటికిని మోక్షమును బొందఁజాలఁడు. వానికి సమాధానము కలుగనేరదు 62. ఎల్లప్పుడును సౌఖ్యము నభిలషించు మానవుఁడు శ్రీరాము భజనయందుఁ దత్పరుఁడై యున్నఁ జాలును. వాఁడు సుఖపడును. దుఃఖమూలమగు కుటుంబజనముతో సంబంధమునుమాత్రము వాఁడు తొలంగించుకొన వలయును 63. వాసనలకారణముననే మానవునకుఁగష్టములు దుఃఖములు కలుగుచున్నవి. కావున విషయవాసనలను విడనాడినవానికె సౌఖ్యములు సమకూరును 64. విషయములవలన నుత్పన్నమగు సమస్తసుఖములు సుఖ ములుగావు. అవి సుఖాభాసములు. వానిలోఁ బరమదుఃఖము పూర్తిగా నిమిడియున్నది. తొలుదొలుత విషయసుఖములు మధురతరములుగఁ దోఁచును. కాని తరువాత వానివలన శోకము కలిగితీరును. వాని స్వభావ మిట్టిది 65. గాలమునకుఁ దగిలించిన మెఱ్ఱయందుఁ జేపకుఁ దినఁబోవు నపుడు సుఖము కనిపించినను దానిని లాగినపిమ్మట గొంతుక పగిలిపోవు చున్నది. మేఁత దినవలయునను నాశతో లేఁడి వలలోఁ దగుల్కొను చున్నది. అటులె విషయసుఖములయొక్క తీపితనమందు తీపిగనుపించినను నిజము విచారించిన మిక్కిలి చేదు. ఇందుచేతనే శ్రీరామునియెడఁ బ్రీతి నుంచుమని చెప్పుచున్నాఁడను 66 _ 67.

దీనినాలించి శ్రోతలలో నొకఁడగు భక్తిభావయుతుఁడైన శిష్యుఁ డిటు లడుగుచున్నాఁడు. ఓ స్వామీ! ఈజన్మమును సఫలము గావించు నదియు, యమలోకమును దప్పించునట్టిదియు నగు నుపాయమును జూపుఁడు 68. ఓ మహారాజా! పరమాత్ముఁడెచ్చటనున్నాఁడు? ఆతని సాన్నిధ్యము నాకు లభించుమార్గమేది? దుఃఖమూలమగు సంసారము తొలంగుమార్గమేది? 69. ఓ కృపామూర్తీ! తప్పక భగవంతుఁడు లభించు నట్టిదియు అధోగతిని దూరముచేయునదియు నగు నుపాయము దీనుఁడనగు నాకుఁ దెలుపుఁడు 70. వక్త చెప్పుచున్నాఁడు. సోదరా! నీవనన్యుఁడవై భగవంతుని భజనగావింపుము. దీనివలన సహజముగనే నీకు సమాధానము గలుగును 71. శిష్యుఁ డిటుల నడుగుచున్నాఁడు. గురువరా! భగవంతుని భజన మెటులఁ జేయవలయునో మనస్సు నెక్కడ నుంచవలయునో తెలిపి కృపతో నాకు భగవద్భజనలక్షణములను బోధింపుడు 72. ఈవిధముగా భక్తుఁడగు శిష్యుఁడు దీనవదనముతోఁ బలికి దృఢహృదయముతో గురు వరుని పాదములను బట్టుకొని గద్గదకంఠుఁ డయ్యెను. దుఃఖమువలన నాతని కశ్రుపాతమయ్యెను 73. శిష్యుని యనన్యభక్తిని గాంచి సద్భావముతోఁ బ్రసన్నుఁడై శ్రీసద్గురుమూర్తి యిటుల నుడివెను. మిత్రుడా! ఇఁక నిప్పుడు రాఁబోవు సమాసమునందు స్వానందమును బొందుమార్గము తెలుపుదును. సావధానమతితో నాలింపుము 74.

మూఁడవ దశకము సమాప్తము.





# నాలుగవ దశకము.

## మొదటి సమాసము — శ్రవణభక్తి.

ఓ గణేశ్వరా! సర్వవేళలను నీకు విజయమగుఁగాక. దేవా! నీవు విద్యావైభవములందు సమర్థుఁడవు. కృపాళుఁడవై నాకు ఆధ్యాత్మిక విద్యనుగూర్చిన పరమార్థమును సాధకులకు బోధింపగలశక్తినిఁ బ్రసాదింపుము 1. ఓ వేదమాతా! శారదా! నీకుఁగూడ వందనము లొనరించుచున్నాఁడను. నీ మహత్త్వమువలననే వక్తలకు సమస్తసిద్ధులు సమకూరుచున్నవి. నీ కతననే హృదయము మననము గావించుటయందుఁ బూర్ణముగాఁ బ్రవృత్తమగుచున్నది 2. ఇఁక సద్గురుమూర్తిని స్మరించెదను. గురుమూర్తి ఉత్తములలో నుత్తముఁడు. ఆతని యనుగ్రహమువలన జ్ఞానవివేకము ప్రకటితమగును 3. భగవద్భజనము నెటులఁజేయవలయునని శ్రోతలు నన్ను మంచిప్రశ్నమునడిగిరి. కావున ననేక గ్రంథములయొక్కయు షట్ఛాస్త్రములయొక్కయు నాధారములను గైకొని నవవిధభక్తులను గూర్చి వర్ణనమొనరించెదను. శ్రోతలు దీనిని సావధానమతితో నాలించి పావనులు గాఁగోరెదను 4—5.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం॥
(భాగ. స్క. 7-5-23)

శ్రవణము, కీర్తనము, విష్ణుస్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అను నీ తొమ్మిదియు భక్తిభేదములు. వీనిలోఁ బ్రతిభక్తినిగూర్చియు వివరణము ప్రతిసమాసమునందుఁ జేయుదును. సావధానమతితో శ్రోతలు వినవలెను 6. హరికథలను పురాణములను నానావిధములగు నధ్యాత్మనిరూపణములను వినుచుండవలయును. ఇది మొదటిభక్తి 7. కర్మమార్గము, ఉపాసనామార్గము,

జ్ఞానమార్గము, సిద్ధాంతమార్గము, యోగమార్గము, వైరాగ్యమార్గమును గూర్చిగూడ సాధకుఁడు వినుచుండవలెను 8. అనేకవిధములగు వ్రతములు, తీర్థములు, దానములు మున్నగు మహిమలుగూడ నాలింపవలెను 9. ఇంతియగాక బహువిధములగు మాహాత్మ్యములు, పుణ్యస్థలముల వర్ణనములు, బహువిధమంత్రములు, సాధనములు, అనేక ప్రకారములగు తపములు, పురశ్చరణములు వినవలయును 10. దుగ్ధాహారులు, నిరాహారులు, ఫలాహారులు, పర్ణాహారులు, శాకాహారులు, నానావిధాహారులు నెటులుందురో వారి స్థితియు 11, ఎండలోఁ, వానలోఁ, జలిలో, అడవిలోఁ, బృథ్విలో, ఆకాశములో సిద్ధు లేవిధముగా వసింతురో యదియు 12, జపి, తపి, తామసయోగి, నిగ్రహి, హఠయోగి, శక్తి మార్గి, అఘోరయోగి యెటులుందురో యదియు నెఱుంగవలయును 13. అనేక ప్రకారములగు ముద్రలు, ఆసనములు, లక్ష్యస్థానములు, పిండజ్ఞానము, తత్త్వజ్ఞానము మున్నగువాని వర్ణనమువిని స్వరూపము గ్రహింపవలెను 14. నానావిధములగు పిండరచనము, అనేకవిధములగు భూగోళరచనము, పలుతెఱంగులు గల సృష్టిరచనము ఏ విధముగానుండునో యదియు 15, చంద్రుఁడు, సూర్యుఁడు, తారామండలము, గ్రహమండలము, మేఘమండలము, ఇరువదియొక్క స్వర్గములు, ఏడుపాతాళములు మున్నగువాని స్వరూపమును 16, బ్రహ్మ విష్ణు మహేశ్వరులస్థానములు, ఇంద్రాదిదేవతలయొక్కయు ఋషులయొక్కయు స్థానములు, వాయు వరుణ కుబేరులస్థానములు నెటులుండునోయను విషయమును శ్రవణము చేయవలయును 17. తొమ్మిదిఖండములు, పదునాలుగు భువనములు, అష్టదిక్పాలురస్థానములు గహనములగు ననేక వనోపవనముల స్వరూపములును 18, గరుడ గంధర్వ విద్యాధర యక్ష కిన్నర నారద తుంబురు ప్రముఖులగు అష్టగాయకుల సంగీతవిచారవర్ణనములును వినవలయును 19. రాగజ్ఞానము, తాళజ్ఞానము, నృత్యజ్ఞానము, వాద్యజ్ఞానము, అమృతసిద్ధియోగము, ప్రసంగజ్ఞానము లెటులుండునో యవియు 20, పదునాలుగు విద్యలు అఱువదినాలుగు కళలు సాముద్రికలక్షణము, మనుష్యుని ముప్పదిరెండు లక్షణములు, మఱియు నానావిధములగు కళలు వాని స్వరూపములును 21, మంత్రము, మణిమయౌషధములు, సూత్ర

గ్రంథులు, సిద్ధులు, నానాభాషలు, నానావిధౌషధములు, ధాతువులు, రసాయనక్రియలు, నాటికాజ్ఞానము, శ్రవణభక్తిస్వరూపము నెఱుంగఁ గోరువాఁడు వినవలయును 22. ఏ దోషమువలన నేరోగమువచ్చునో ఏ రోగముకొఱకే ప్రయోగము చెప్పఁబడెనో ప్రయోగముకొఱకేయోగ ముపకరించునో యదియు 23, రౌరవ కుంభీపాకాదినరకములు, యమ లోకములోని నానాయాతనలు, స్వర్గనరకములలోని సుఖదుఃఖములు గూడ నెఱుంగవలయును 24. నవవిధభక్తులు, చతుర్విధభక్తులు ఏవిధ ముగానుండునో, ఉత్తమగతి యెటులలభించునో 25, పిండ బ్రహ్మాండ ముల రచనము నానావిధములగు తత్త్వముల స్వరూపము సారాసార విచారము నెటులుండునోయను నంశములు వినవలయును 26. సాయుజ్య ముక్తి స్వరూపము, మోక్షము లభించు తెఱంగు నెఱుంగవలయునన్న యనేక సద్గ్రంథరాజములు బఠింపవలయును 27. వేదము, శాస్త్రములు, పురాణములు, తత్త్వమసి మున్నగు మహావాక్యముల వివరణము, తను చతుష్టయనిరసనము (స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములు) తెలిసికొనవలయును 28. వినుట కన్నియును వినవలయును. వినినంతన లాభములేదు. విన్నయంశములు మనస్సునకుఁ బట్టించుకొని సారము వెదుకవలయును. అసారమును గుర్తించి విడిచివేయవలయును. దీనికే శ్రవణభక్తియనిపేరు 29. సగుణపరమాత్ముని చారిత్రముల నాలించుచు ఆధ్యాత్మజ్ఞానమూలమున నిర్గుణమును వెదకుచునుండుటయే శ్రవణభక్తి లక్షణము 30. ఈశ్వరుని సగుణచరిత్రము, నిర్గుణతత్త్వము అను నీరెండు విషయములు పరమపవిత్రములు గాన వీనిని శ్రద్ధాభక్తులతో వినుచుండ వలయును 31. జయంతులు, ఉపవాసములు, బహువిధసాధనములు, మంత్ర యంత్ర జపధ్యానములు, కీర్తిస్తుతి, స్తవనము, భజనము మొదలగునవి తెలిసికొనవలయును 32. ఈ విధముగా సగుణపరమాత్ముని గుణశ్రవ ణము, నిర్గుణమునుగూర్చిన యాధ్యాత్మిక నిరూపణశ్రవణము గావింప వలయును. మరియు భిన్నత్వమునువదలి భక్తిమూలమును వెదుక వలయును 33. ఇప్పుడు శ్రోతలకు శ్రవణభక్తి యన నేమియో తెలిసి యుండును. కావున నికముందుఁ గీర్తనభక్తిలక్షణముఁ జెప్పెదను. శ్రద్ధతో నాలింతురుగాక 34.

## రెండవ సమాసము – కీర్తనభక్తి

నవవిధభక్తులలో నొకటియగు శ్రవణభక్తిని దెలిపితిని. ఇపుడు రెండవదగు కీర్తనభక్తినిగూర్చి తెలుపుచున్నాను వినుండు 1. సగుణ పరమాత్ముని గుణములను గీర్తనము చేయవలయును. అంతియగాక జగత్తునందు శక్తికొలందితిరిగి తనవాణితో పరమాత్ముని కీర్తినివ్యాపింపఁ జేయవలయును 2. అనేక గ్రంథరాజములను బఠింపవలయును. గ్రంథముల లోని యవసరవిషయములను గంఠస్థము చేయవలయును. భగవంతుని లీలలఁ దెలుపుకథలు నిరంతరమును నుడువుచుండవలయును 3. తన సుఖ స్వార్థముకొరకు హరికథలను భక్తులకుఁ జెప్పుచుండవలయును. హరికథలు లేకుండ నొక నిముసమేని వృథాగాగడుపఁగూడదు 4. నిత్యము నూతన నోత్సాహముతో హరికథల నభివృద్ధిపరచుటలో మిగులఁ గృషిచేయ వలయును. హరికీర్తనతో సంపూర్ణబ్రహ్మాండమును నింపివేయవలయును 5. అత్యంతప్రేమరుచితో సర్వకాల సర్వావస్థలయందును మానవుఁడు తత్పరుఁడై యుండవలయును 6. భగవంతునకుఁ గీర్తనమన్న నింతయన రానిప్రీతి. కీర్తనమువలన హృదయమునకు సమాధానము గలుగును. కలి యుగములోని మనుష్యులలో ననేకులను హరికీర్తనమే తరింపఁజేయు చున్నది 7. వివిధప్రకారములతో నుండునదియు విచిత్రకరమైనదియునగు ధ్యానమును, అలంకారములయొక్కయు భూషణములయొక్కయు వర్ణన మును భక్తుఁడు నిరంతరమొనరింపవలయును. అంతఃకరణమునందు ధ్యాన మూర్తిని దెచ్చుకొని ప్రతిష్ఠించి హరికథలను జెప్పవలయును 8. ప్రేమతోఁ బరమాత్ముని యశమునుఁ గీర్తిని ప్రతాపమును మహిమను వర్ణింపవల యును. దీనివలన భగవద్భక్తుల యాత్మలు సంతుష్టినొందును 9. కథను అన్వయమును, వ్యాఖ్యానమును జెప్పుచుఁగరతాళమును మనోహరముగా ప్రయోగించుచు హరికథకుఁడు పరమాత్ముని నామ ఘోషణమును, ప్రసం గము వచ్చినపు డనేక కల్పితవిషయములను, జరిగిన సంగతులనుగూడఁ జక్కనిరీతిగా వివరించి చెప్పవలయును 10. తాళము, మృదంగము, హరికీర్తనము, సంగీతము, నృత్యము, తానమానము, నానావిధ కథాను సంధానము తెగిపోనీయక యన్నియు హరికథకుఁడు సమానముగా

జరుపుచుండవలెను 11. హరికథఁ జెప్పువాఁడు కరుణారసాత్మికములగు కీర్తనములలోని యానందమున మగ్నుఁడై మహోత్సాహముతోఁ గథను నడుపవలయును. మరియు శ్రోతల శ్రవణపుటముల నానందముతో నింపివేయవలయును 12.కంపితము, రోమాంచము, స్ఫురణము, ప్రేమాశ్రుపాతము గలవాఁడై పరమేశ్వరుని గుణానువాదమును భక్తుఁడు గానము చేయవలయును. దేవస్థానమునందు భగవానునకు సాష్టాంగ నమస్కారము లొనర్పవలయును. భక్తిభావములోఁ బూర్తిగా లీనుఁడై మైమఱచి పొరలాడవలయును 13. పదము, శ్లోకము, ప్రబంధము, ఘాటీముద్ర, దోహా (పద్యభేదము) మున్నగు ననేకఛందములను వీర భాషణములను వినోదములను అవసరమువెంట భక్తబృందము మధ్య గానము చేయవలయును 14. నానావిధములును నవరస భూషితములును, శృంగార రసమయములు సంతోషకరములు నగు గద్య పద్యములను, అనేకవిధములగు ప్రాస్తావిక వచనములను హరికథకుఁడు శాస్త్రాధారముతోఁ జెప్పవలెను 15. భక్తి జ్ఞాన వైరాగ్యముల లక్షణములను, నీతి న్యాయ స్వధర్మముల రక్షణోపాయములను, సాధన మార్గములను, ఆధ్యాత్మిక నిరూపణములను జక్కనిరీతిని భక్తులకడ వివరింపవలయును 16. సందర్భము ననుసరించి హరికథల నుడువవలయును. సగుణోపాసకులగు జనుల కడ సగుణ పరమాత్ముని కీర్తిని వర్ణింపవలయును. మఱియు నిర్గుణముతో నవసరము కలిగినపుడు అధ్యాత్మిక విద్యమీఁద వ్యాఖ్యానము గావింపవలయును 17. పూర్వపక్షమును విడిచి నియమముతో సిద్ధాంత నిరూపణము చేయవలయును. తాను సిద్ధాంతపఱచి చెప్పుదానిని ప్రజల యెదుట శాస్త్రనిరూపిత నియమ క్రమానుసారముగా నుంచవలయును 18. వేదములను పారాయణము చేయవలయును, ప్రజలకుఁ బురాణములు వినిపింపవలయును. అంతియగాక మాయాస్వరూపము బ్రహ్మస్వరూపముగూడ నిరూపింపవలయును 19. బ్రాహ్మణత్వము నాదరభావముతో రక్షింపవలయును. ఉపాసనమును, భక్తిసాధనమును, గురుపరంపరను స్థిరముగా నుంచవలయును 20. హరికీర్తనమునందు వైరాగ్యలక్షణము చేయవలయును. జ్ఞానలక్షణములనుగూడ విడిచిపోవ నీయఁగూడదు. పరమచతురుఁడును, విలక్షణుఁడు నగు పురుషుఁ డన్నిం

టిని సవరించుకొనఁగలఁడు 21. వినువారల హృదయములలోని సత్య సమాధానము (విశదజ్ఞానము) చెదరిపోవునట్లును, సందేహము కలుగఁజేయు నట్లును నుండు విషయములను గీర్తనములలో నుడువరాదు. కీర్తనము నందు నీతి, న్యాయము, సాధనముల రక్షణముగూడఁ జేయవలెను 22. సగుణ పరమాత్ముని గుణానువాదము గావించుటను గీర్తనమని యుగ్గడింతురు. అద్వైత వివరణమున కాధ్యాత్మిక నిరూపణమని చెప్పుదురు. ఎప్పుడేని నిర్గుణ నిరూపణము గావింపవలసి వచ్చినచోఁ బరమాత్ముని సగుణత్వమునుగూడ రక్షగావింపవలయును. ఆధ్యాత్మ నిరూపణము చేయునపుడు సగుణమును బంధింపగూడదని తెలిసికొనవలయును 23. వక్తృత్వమునకుఁ దగినంత విద్యాబల ముండవలయును. అల్పజ్ఞుఁడగు పురుషుఁడు మహద్విషయములనుగూర్చి సత్యమగు వ్యాఖ్యానము గావింపనేరఁడు. అందువలన వక్త ముఖ్యముగా విద్యాధికారియు ననుభవశాలియునై యుండవలెను 24. దేనినైన మాటిమాటికి ఖండనము గావింపక వేదములలోని యాజ్ఞలను మండనము గావించుచు మనుజులందఱును సదాచారములయందుఁ బ్రవృత్తులగురీతిగా హరికథకుఁడు జ్ఞానమును బోధింపవలయును 25.

భక్తియోగమునుగోరు మానవుఁడు వాదవివాదముల నన్నిఁటిని విడిచి పరమాత్ముని సగుణమూర్తిని గీర్తనము చేయవలయును. దీనినే భగవద్భజన మందురు. ఇదియే రెండవభక్తి 26. భగవంతుని గుణములు గీర్తించుటవలన మహాత్తరములైన పాపములు నశించును. ఉత్తమగతి లభించును. కీర్తన భక్తివలన నవశ్యముగ భగవంతుని సన్నిధికిఁ జేర నవకాశము గలుగును. ఇందు సందియము కొంచమేని లేదు 27. కీర్తనమువలన వాణి పవిత్రమగును. సత్పాత్రము గలుగును. జనులందరును సుశీలురును సదాచరణులును నయ్యెదరు 28. కీర్తనమువలన మనశ్చాంచల్యము తొలగిపోవును. స్థిరమగు బుద్ధివిశేషము కలుగును. వినువానికిని జెప్పువానికిగూడ సందియము నివర్తియగును 29. బ్రహ్మపుత్రుఁడగు నారదుఁడు సర్వకాల సర్వావస్థలయందును హరికీర్తన మొనరించుచున్నాఁడు. అందుచేతనే యాతనికి స్వయముగా నారాయణుని పదవి లభించెను 30. కావున కీర్తన మహిమ మపారమయినది, అగాధమయి

నది. కీర్తనమువలనఁ బరమాత్ముఁడు ప్రసన్నుఁడగును. పరమాత్ముని గుణానువాదముగల కీర్తనలు జరుగు ప్రదేశమునందు సమస్త పుణ్యతీర్థములును, స్వయముగా జగదాత్మయు నివసించును 31.



## మూఁడవ సమాసము – స్మరణభక్తి.

గత సమాసమందు మానవులందఱిని పావనముచేయునదియగు కీర్తనభక్తిని వర్ణించితిని. ఇప్పుడు విష్ణుస్మరణమను పేరుగల మూఁడవ భక్తి యెటులుండునో తెలుపుచున్నాను వినుండు 1. హృదయమునందు బరమాత్ముని దివ్యనామమును స్మరింపచేయవలెను. అతని యనంతనామముల నఖండరీతి జపము చేయవలయును. నామస్మరణమువలన మనస్సునకు సమాధానము లభించును 2. నిత్యమును నియమము దప్పక ప్రాతఃకాలమునందును, మధ్యాహ్నమునందును, సాయంసమయమునను నిరంతరముగా భగవన్నామస్మరణము జేయుచుండవలయును 3. సుఖ సమయమునందును, దుఃఖసమయమునను, ఉద్వేగ సమయమునను, చింతాసమయమునను, ఆనందానుభవ సమయమునను, ఇంతయేల, సర్వకాల సర్వావస్థలయందును భగవన్నామ స్మరణము గావింపక యూరకుండరాదు 4. హర్ష సమయమునను దుఃఖసమయమునను సర్వాదికోత్సవములను నాలించునపుడును ఏదేని శుభకార్య ప్రస్తావనము జేయు తరుణమునను విశ్రాంతియందునను నిద్రా సమయమునను భగవన్నామస్మరణము గావించుచుండవలయును 5. ఏవేని దొసఁగులు పొసఁగి సంకటములు గలిగినప్పుడును సంసార సంబంధములగు నిర్బంధము వాటిల్లినపుడును నేదేని దుర్దశ సమకూరినప్పుడును భగవన్నామము సాదరభావముతో స్మరింపవలయును 6. నడుచుచు, మాటలాడుచు, దినుచుఁ, ద్రావుచు, సుఖించుచు, బహువిధములగు నుపభోగములను దనివిదీఱ ననుభవించుచు నుండునపుడుగూడ నేమఱిపాటు లేక భగవంతుని దివ్యనామమును స్మరించుచుండవలెను 7. సంపదలతోఁ దులతూఁగు సమయమునను ఆపదలలో మునిగి తేలుచున్నపుడును కాలగతులు వ్యతిరేకించి చిక్కులు వాటిల్లినను భగవన్నామ

స్మరణము మానరాదు 8. వైభవము, సామర్థ్యము, బలము, బహువిధ పదార్థములు గలవను నహంభావముతోఁగాని వివిధ సుఖముల ననుభవించుచుంటినను సంతోషమునఁగాని భగవన్నామ స్మరణమును విడువదగదు 9. భగవంతుని నామమును నిరంతరము హృదయమునందు దలంచువారి కాపదలు గలుగవు. చేయుచున్న పనులకు విఘ్నములు వాటిల్లవు. అంతమున సద్గతిగూడ లభించును 10. మొదట భోగభాగ్యములతో సౌఖ్యము లనుభవించుచుఁ దరువాత దరిద్రుఁడైనను మొదట దరిద్రుఁడుగనుండి యనంతరము మహాభాగ్యవంతుఁడైనను భగవంతుని స్మరించుటలోఁ దృప్తి నొందఁజనదు 11. భూతములు, పిశాచములు, నానాబాధలు, బ్రహ్మగ్రహము, బ్రహ్మరాక్షసి, మంత్రభ్రష్టతవలన యున్మాదావస్థ, నానావిధములగు నాధివ్యాధులు భగవన్నామస్మరణ మూలమున నశించును 12. విషబాధయు రోగబాధయుఁగూడ భగవన్నామ స్మరణమునఁ దొలఁగిపోవును. ఇంతియగాక యంత్యకాలమునఁ గూడ స్మరించినయెడల నుత్తమగతి లభించును 13. బాల్యావస్థయందును, తరుణావస్థయందును, వార్ధక్యావస్థయందును, కష్టకాలమునందును, సర్వకాలములయందును, అంత్యకాలమునందును భగవంతుని స్మరించుచుండ వలయును 14. నామస్మరణ మహిమ యెంతజెప్పినను నీవు గ్రహించినటుల దోఁచదు. శివుఁడు బాగుగా నెఱుంగును. ఆతఁడు కాశీనగరములో నివసించి నిజ భక్తులకు శ్రీరామనామము నుపదేశించుచుండునను నంశము నీవు వినియేయుందువు. రామనామ మహత్త్వము చేతనే కాశీనగరమునకు ముక్తిక్షేత్రమను నామము గలిగినది 15. రామనామమును దలక్రిందుఁజేసి తొల్లి వాల్మీకి "మరా, మరా" యని జపించి ముక్తినొందినాఁడు. అనంతర మాతఁడు నూరుకోటుల శ్లోకములతో శ్రీరామచంద్రమూర్తి దివ్యచరిత్రమును ఆయన యవతారమునకు ముందుగనే రచింపఁదగినంత జ్ఞానము మహత్త్వమును సంపాదించెను 16. పరమాత్ముఁడగు హరినామమును నిరంతరము జపించి ప్రహ్లాదుఁడు ముక్తినొందెను. తండ్రిపెట్టు కడగండ్లనుండి బ్రదికెను. పాపియగు నజామిళుఁడునైతము నారాయణ స్మరణమువలననే పవిత్రుఁడు మోక్షగామియు నయ్యెను 17. పెక్కులు నుడువనేల? తొల్లి నామస్మరణ

మునసే జడజీవియగు పాషాణముగూడఁ దరించెను. అసంఖ్యాకులగు భక్తులుద్ధరింపఁబడిరి. మహా పాపులుగూడఁ బరమ పవిత్రులై మోక్షమొందిరి 18.

పరమేశ్వరుని నామము లనంతములు. వానిని నిత్యమును నియమపూర్వకముగా హృదయమునందు స్మరించు భక్తులు తరించెదరు. నామస్మరణము గావించువారికి యమలోకబాధలు తప్పును 19. భగవంతుని యసంఖ్యాక నామములలో నేయొక్క నామమునేని ధ్యానము గావించిన యెడల జీవితము సఫలమగును. నామస్మరణమువలనఁ బాపములు నశించి సుకృతము పెంపొందును 20. మనుజుఁ డితరకార్యము లేవియుఁ జేయవలసిన యవసరము లేదు. ఏకాంతముగా పరమపదవాసుఁడును జక్రపాణియునగు పరమేశ్వరుని నామమును స్మరించినయెడలఁ బ్రసన్నుఁడై కాపాడును 21. నిరంతరము భగవన్నామస్మరణము గావించువాఁడె పుణ్యాత్ముఁడు. రామనామము స్మరించుచున్నయెడలఁ గొండలవంటి పాపములు సైతము గూలిపోవును 22. భగవన్నామ మహిమ యగాధమైనది. దానిమహాత్త్వము వర్ణనముచేయ నెవ్వరికినిఁ దరముగాదు. భక్తులనేకులు నామస్మరణమువలన ముక్తులైరి. తొల్లి మహాదేవుఁడైన శంకరుఁడు హాలాహలముద్రావి వ్యాకులుఁడై నపుడు రామనామమును మనసార స్మరించుటకతననే యాకష్టము తొలంగెను 23. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, పురుషులు వారు వీరని చెప్పనేల అందఱికిని నామస్మరణము గావించుట కధికారము గలదు. నామస్మరణముచే జడులు మూఢులుగూడఁ దరించెదరు 24. పరమేశ్వరుని పవిత్రనామమును మానవుఁడఖండరీతిగ నిరంతరము స్మరణ చేయుచుండవలయును. భగవానుని దివ్యరూపమును హృదయమునందు ధ్యానింపవలయును. ఇదియే స్మరణభక్తి. దీని మహాత్త్వము నెంతని తెలుపగలను! 25.

## నాలుగవ సమాసము — పాదసేవనభక్తి.

గత సమాసమునందు స్మరణభక్తిని గురించి చెప్పితిని. ఇపుడు నాలుగవదియగు పాదసేవనభక్తిని జెప్పుచున్నాఁడను1. కామితమునంతయు మోక్షముమీఁద నెలకొల్పి మనోవాక్కాయ కర్మములతో సద్గురుని చరణములను అనన్యభావముతో సేవించుటకే పాదసేవనభక్తి యనిపేరు2. సద్గురుని మాహాత్మ్యము చాలగొప్పది. అనిర్వాచనీయము. ఆతని చరణ కమలములను హృదయమునఁ దలంచుచున్నవారికి జనన మరణ యాతన లెన్నటికిని గలుగఁజాలవు. అనన్యభావముతో నట్టి గురుని సేవింపవల యును 3. సంసారసాగరమునుండి దరిజేరదలంచితిమేని సద్గురుకృపదప్ప నితరాధారమేదియు లేదు. ఐహికతృష్ణయు సంసారనిర్బంధములు తొలఁ గించుకొనఁదలంచిన మానవుఁడు సద్గురుని చరణములను ధ్యానించుటతప్ప గత్యంతరములేదు 4. సద్గురుఁడెంతకేని జాలినవాఁడు. గురుమూర్తి సార మిది అసారమిది యని బాగుగఁ దెలియఁజెప్పి పరమాత్మని దర్శించు భాగ్యమును శిష్యునకు సమకూర్చ గలడు 5. బ్రహ్మము చూచెదనన్నఁ గనిపింపదు. మనస్సునందు భాసింపదా. సంగత్యాగము నొనరింపఁ జాల కున్నయెడల నది యనుభవములోనికి రాదు. అనుభవములోనికిఁ దే దలం చినయెడల సంగత్యాగముగాదు. సంగత్యాగమువలన ననుభవము రాదు. ఈవిషయములోని భావము అనుభవనీయులగువారికే తెలియునుగాని తదితరుల కెట్లు తెలియును? ఇదియొక యభేద్యమగుగాథ 6. అనుభవము లోనికిఁ దెచ్చుకొనఁ దలంచినయెడల సంగత్యాగము (అహంకారము అభిమానము దేహబుద్ధి యనువానిని విడుచుట) జరుగదు. ఏలయన యనుభవములోనికిఁ దెచ్చుకొన నెంచునంతనే అనుభవము, అనుభవము చేయువాఁడు, అనుభవయోగ్య విషయము అను మూఁడిటితో సంగ మము తటస్థమగును. ఈ మూఁడింటిని విడిచివేయుదమన్న వానితో ననుభవశబ్దముసైతము జారిపోవును. ఏలయన, ఈ త్రిపుటియందే యిదియున్నది. ఇంతియగాదు ఎప్పు డహంకారమునుగూర్చిన భావమే లేదో అప్పుడనుభవమెట్లు కలుగును?మఱియు దానిని గైకొనువాఁడెవఁడు? ఇంతకు దేలినదేమన — ఈ విషయముల ననుభవనీయు లెఱుంగుదురు.

ఇతరులకిది యభేద్యమగు గాథ. సంగత్యాగము, ఆత్మ నివేదనము; విదేహస్థితి, అలిప్తత, సహజస్థితి, ఉన్మనము, విజ్ఞానము అను నీయేడును నేకరూపములు 7-8. ఇవిగాక యింకను కొన్ని పేరులు గలవు. వానిని, సమాధానమునకు సంకేతములని చెప్పవలయును. సాధువుల చరణసేవ గావించినయెడల నన్నియుఁ దెలియును 9. వేదము, వేదరహస్యము, వేదాంతము, సిద్ధత్వము, సిద్ధభావము, సిద్ధాంతరహస్యము, అనుభవము, అనుభవవిషయము, అనుభవఫలము, సత్యవస్తువు(బ్రహ్మము)మున్నగునవి యెన్నియో గలవు. ఇవి యనుభవమునకు ద్వారములు. ఈ ద్వారములన్నింటినిగూర్చి పూర్ణ విజ్ఞానము గడించినచో ననుభవమునకు వచ్చును. ఈజ్ఞానము మహాత్ములను సేవించుటచే లభించును. పాదసేవనభక్తి ననుష్ఠించువానికిఁ బరబ్రహ్మము ప్రకటనమగును 10-11. బ్రహ్మముసంగతి బహుచిత్రమైనది. అది ప్రకటనమగుచుండియును గోప్యముగానున్నది. గోప్యముగానుండియు బ్రకటనమగుచున్నది. ఇంతియకాక యది (బ్రహ్మము) గోప్యమునకును బ్రకటనమునకును వేరుగానున్నది. దానిమార్గము గ్రహింపవలెనన్నను దాని నెఱుంగవలెనన్నను మహాత్ముల పాదసేవనము గావింపవలయును. లేకున్న దానిమార్గము లభింపఁజాలదు 12. బ్రహ్మము నెఱుంగుటకు మార్గమున్నది. కాని బ్రహ్మపదార్థ మాకాశమువలె శూన్యముగానున్నది. గుప్తముగఁగూడ నున్నది. అన్నివిధములచేతను నది సందేహాస్పదమైయున్నది. చూడఁదలచితిమేని యలక్ష్యపదార్థమగు నాబ్రహ్మము కనుపింపదు 13. లక్ష్యముతో దేనిని లక్షించుచున్నారమో ధ్యానముతో దేనిని ధ్యానించుచున్నారమో అదియే పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మము త్రివిధప్రతీతితో శాస్త్రము, గురువు, ఆత్మ అను నీ మూఁడింటి యనుభవము నొకటిగావించి తానై (స్వయమై) పోవలయును 14. ఈ యనుభవద్వారములు సారాసార విచారమువలనఁగాని తెలియవు. సత్యవిషయము, సత్సంగమువలనఁగూడ నివి యనుభవములోనికి వచ్చును 15. ఒకవేళ సత్యమును జూడబోయినచో అసత్యముయొక్క అభావము గానిపించును. అసత్యమును జూడబోయినచో సత్యము కాన్పింపదు. ఏలయనిన సత్యాసత్యములను జూచుట చూచెడివానికడ నున్నది 16. చూచెడివాఁడు తాను జూచుచున్న రూపమునందు విలీనుఁడై పోయి

నపుడు (ద్రష్ట, దర్శనము, దృష్టి యనుమూఁడును నేకమైనపుడు) సమా ధానము ప్రాప్తించును. ఎట్టి సమాధానమును బడయఁగోరినను సద్గు రుని కరుణ ముఖ్యముగా గావలయును. సద్గురునికరుణ లేకున్నయెడల నన్మానమెన్నటికిని లభింపబోదు 17-18. నానావిధములగు ప్రయోగముగా సాధనలు, పరిశ్రమలు, ప్రయత్నములు, విద్యాభ్యాసము లేనియెడల నెంత భ్యాసము నొనరించినను గురుగమ్యము, బ్రహ్మము నెఱుంగుమార్గము దొరుకఁజాలదు 19. అభ్యాసమువలనఁ బడయరానిదియు, సాధనములవలన సాధ్యముగానిదియు నగు బ్రహ్మస్వరూపవివేకము సద్గురుసేవలేకున్న నెన్న టికిని దెలియదు 20. జ్ఞానమార్గమును దెలిసికొనుటకు ముఖ్యముగా సత్సాంగత్యము చేయవలయును. అదిలేదేని జ్ఞానమార్గముపేరే యెత్తబని లేదు 21. సద్గురుని చరణములను సేవించిన పరమార్థమును గణింపయత్నిం చుటయే పాదసేవనము. ఇది నవవిధభక్తులలో నాల్గవదియైయున్నది 22. సామాన్యదృష్టితో వేల్పులను నేలవేల్పులను మహానుభావులను సత్పా త్రులనుగా భావించి వారల సేవ యొనరించుటలో సద్భావము గలిగి యుండుటగూడ సేవాభక్తియే యగును. కాని బాగుగా విచారించినచో సద్గురుచరణసేవ గావించుటకే పాదసేవనభక్తియను పేరెంతయుఁ దగి యున్నది 23-24. పాదసేవనమను పేరుగల యీనాలుగవభక్తి మూఁడు లోకములను భావనముచేయుచున్నది. సాధకునకు సాయుజ్యముక్తి పాద సేవన భక్తివలననే లభించును 25. కావునఁ బాదసేవనభక్తికిఁ గల మహా త్త్యము దెలుప శక్యముగాదు. దానివలననే ఈ భూలోకమున ననేక మనుష్యులు తరించి పుణ్యలోకములు బడయుచున్నారు 26.

---

## అయిదవ సమాసము — అర్చనభక్తి.

శ్రోతలారా! మీర లుత్సాహముతోఁ బాదసేవనభక్తితత్త్వము వింటిరి. ఇపుడైదవదియగు అర్చనభక్తినిగూర్చి తెలుపుదును. సావ ధానమతితో వినుండు 1. ఐదవభక్తి పేరు అర్చనము. అర్చనపదము సాధారణముగా మనము దేవతార్చనముపట్ల నుడివెదము 2. బహువిధ ములగు ఆసనములు, మనోహరములగు వస్త్రములు, అలంకారములు,

భూషణములు మున్నగువానిని సమకూర్చి మానసపూజ గావించుటకును మూర్తిధ్యానము గావించుటకును అర్చన భక్తియని పేరు 3. దేవ బ్రాహ్మణులను, అగ్నిహోత్రుని, సాధుసజ్జనులను, అతిథి అభ్యాగతులను, యతీశ్వరులను, మహానుభావులను, గాయత్రిని బూజించుటకును 4, ధాతువులతోఁగాని, పాషాణములతోఁగాని, మృత్తికతోఁగాని చేసిన విగ్రహములను, చిత్తరువులలోఁజిత్రించిన మూర్తులను, సత్పురుషులను, తన యింటిలోని దేవతలను సేవించుటకును 5, సప్తాంకితములు, నవాంకితములు నగు శిలలు, సాలగ్రామములు, శకలములు, చక్రాంకితలింగములు, సూర్యకాంత సోమకాంతములు, బాణతాండలములు, నర్మదేశ్వరములు మున్నగుమూర్తుల నారాధించుటకును 6, భైరవ, భగవతి, ఖండేరావు, ముంజా, నృసింహస్వామి, నవశంకరి, నాగ, శిక్కే మున్నగు బహువిధ దేవతామూర్తులను బంచాయతనమును గొలుచుటకును అర్చనభక్తియని పేరు 7. గణేశుఁడు, శారద, విఠలదేవుఁడు, బాలకృష్ణుఁడు, జగన్నాథుఁడు, తాండవమూర్తి, శ్రీరంగనాయకులు, హనుమంతుఁడు, గరుత్మంతుఁడు 8, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, భార్గవ, రామ కృష్ణ, హయగ్రీవాదులు 9, కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ మూర్తులు 10, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్నానిరుద్ధ, పురుషోత్తమాధోక్షజ, నారసింహాచ్యుత, జనార్దనోపేంద్రమూర్తులు 11, హరిహరులయనంతస్వరూపములు, భగవంతుఁడు, జగదాత్ముఁడు, జగదీశ్వరుఁడునగు పరమాత్ముని యవతారములు శివునియొక్కయు, శక్తియొక్కయు ననంతరూపములు భక్తుఁడు నిరంతరము దేవతార్చనలోఁ బూజింపవలయును 12. అశ్వత్థనారాయణ, సూర్యనారాయణ, లక్ష్మీనారాయణ, త్రిమల్లనారాయణ, శ్రీహరినారాయణ, ఆదినారాయణ, శేషశాయి మున్నగు పరమాత్ముని విగ్రహముల బూజింపవలెను 13.

భగవంతుని యనంతమూర్తులీలోకమునం దంతటను నిండియున్నవి. అన్నిఁట సమానభావముతో నర్చింపవలయును 14. ఇంతియగాక కుల ధర్మానుసారముగా భక్తుఁడు ఉత్తమమధ్యమరీతులతో అనేకదేవీదేవతల పూజనముగూడ నొనరింపవలయును. దేనినిగూడ విడచివేయరాదు 15-16.

భక్తుఁడనేకతీర్థయాత్రలకుఁ బోవలయును అచటి దేవతలను శ్రద్ధాభక్తులతోఁ బూజింపవలయును. నానావిధములగు పూజోపకరణములతో నర్చన మొనర్పవలెను 17. పంచామృతము, చందనము, అక్షతలు, పుష్పములు, ధూపములు, దీపము, కర్పూరము మున్నగు వస్తువుల యథోచితముగాఁ బూజ కుపయోగించి 18, నానావిధములగు భోజనపదార్థములతో నివేదనముగావించి ఫలములు, తాంబూలము, దక్షిణ, బహువిధాలంకారములు, దివ్యవస్త్రములు, వనమాలాది సామగ్రులు భగవంతునకు సమర్పింపవలయును 19. పాలకి ఛత్రము సుఖాసనము మేఘాడంబరము సూర్యముఖి పతాకము ధ్వజచిహ్నము మున్నగు నుపచారపరికరములతోడను, వీణ కరతాళము ఝాంఝ మృదంగము మున్నగు మనోహర వాద్యములతోడను, భక్తిభావపూరితులగు సాధుజనుల భజనములతోడను మిగులఁ గోలాహలముగా భగవంతున కుత్సవములు గావింపవలయును. అంతియగాక హరిదాసులచే హరినామ సంకీర్తనముగూడఁ జేయింపవలయును. అందుచే భగవంతునిపట్ల మానవులకు సద్భావము వృద్ధినొందును 20—21. దేవాలయములచెంత కోనేరు, బావి, సరోవరము, రాజాంగణము, తులసీవనము, మండపములు నెలకొల్పి గర్భాగారముపై నొకశిఖరము గట్టింపవలయును. వసతిగృహములు, యోగులకుఁదగిన మఠములు, ధర్మశాలలు, సత్రువులు దేవాలయమున బ్రతిష్ఠింపవలెను. ఇరువదియేడుము త్తెములతో జనమున కుపకరించు మూలికయు వివిధములగు వస్త్రములు దేవునికొఱకు సమకూర్పవలెను 22—23. బహువిధములగు తెరలు, మండపములు, ఆస్తరణములు,నానావిధరత్నభూషణములు, తోరణములు, గంటలు, ఏనుఁగులు, గుఱ్ఱములు, బండ్లు 24, అలంకారములు, అలంకారపాత్రములు, ద్రవ్యము, ద్రవ్యపాత్రములు, అన్నోదకములు, అన్నోదకపాత్రములు 25, వనములు, ఉపవనములు, పుష్పవాటికలు, తపస్వులపర్ణకుటీరములు సమకూర్పవలయును. ఇవియన్నియు భగవంతుని బూజించుటకే యుపకరించును 26. చిలుకలు, గోరువంకలు, నెమళ్ళు, హంసలు, చక్రవాకములు, కోకిలలు, చకోరములు, సివంగులు, లేడులు, దుప్పులు మున్నగువానిని భక్తులగువారలు దేవాలయముల కర్పింపవలయును 27. కస్తూరిమృగము, పునుఁగుపిల్లి, ఆవు, గేదె, ఎద్దు,

కోఁతి మున్నగు జంతువులను బాలురను దేవాలయముకొఱ కర్పింప వలెను 28.

ఈ విధముగ వివిధవస్తువుల జంతువుల సమకూర్చి భగవంతున కర్పింపవలయును. మఱియు తను,మనో,వచన,చిత్త,జీవ,ప్రాణములతోడను సద్భావముతోడను భగవంతుని నర్చింపవలెను. దీనికే అర్చనభక్తియని పేరు 29. ఇటులె సద్గురునిఁగూడఁ బూజించి యాతనియెడ ననన్యభావ ముతో నుండవలయును 30. పయిన జెప్పఁబడినవిధముగా భగవంతుని సాంగోపాంగముగాఁ బూజింప నవకాశము కలుగకున్నయెడల మానస పూజనైనఁ దప్పక గావింపవలెను. మానసపూజయొక్క మహత్త్వము చాల ప్రశస్తమైనది 31. భగవద్భక్తుఁడు తనహృదయమునందే తనరూప మును భగవంతునిరూపమును సమర్పింపఁదగిన పూజాసామగ్రిని కల్పితము గావించుకొని పరమాత్ము నర్చింపవలయును. ఇదియే మానసపూజా విధము 32. మానసపూజయందు దేయేపదార్థములు తనకావశ్యకములో వానిని గల్పనముజేసికొని పరమేశ్వరునకు సమర్పింపవలెను 33.



## ఆఱవ సమాసము — వందనభక్తి.

శ్రోతలారా! అర్చభక్తియన నేదియో మీరు బాగుగ గ్రహిం చితిరి. ఇప్పుడు మీకుఁ దెలుపఁదగినది వందనభక్తి. ఇది నవవిధభక్తులలో నాఱవది. దానిని వినఁగోరెదను 1. ఈశ్వరునకు సాధువులకు సజ్జనులకు నమస్కారము గావించుటకే వందనభక్తి యనిపేరు 2. సూర్యభగవాను నకును పరమేశ్వరునకును సద్గురునకును సాష్టాంగముగా నమస్కరింపవలెను 3. శాస్త్రములలో ముఖ్యముగా బహువిధములుగనున్న దేవతావిగ్రహ ములకును ఈశ్వరునకును గురువునకును సాష్టాంగప్రణామము లాచరింప వలయునని చెప్పఁబడును. ఇతరులకు వారివారి యోగ్యతల ననుసరించి నమస్కరింపవలెను 4. ఈ పృథివి వైశాల్యము ఏబదియారుకోట్ల యోజన ములు. ఇందు శ్రీ మహావిష్ణుని మూర్తు లనంతములుగా నున్నవి. వానికన్నింటిని బ్రీతిపూర్వకముగా సాష్టాంగ ప్రణామము లొనరింప వలెను 5. మహాదేవుని విష్ణుమూర్తిని సూర్యుని హనుమంతుని దర్శించి

నంత మానవుని సమస్త పాపములు నశించును. ఈ దేవతలకు నిత్యమును నియమము తొలంగక నమస్కరించుచున్నయెడల విశేషముగాఁ బుణ్యము కలుగును 6.

* శ్లో॥ శంకరశ్శేషశాయీ చ మార్తండో మారుతిస్తథా।
ఏతేషాం దర్శనం పుణ్యం నిత్యనేమే విశేషతః॥

భక్తుని, జ్ఞానిని, రాగహీనుని, మహానుభావుని, తాపసుని, యోగిని, సత్పాత్రుని 7. వేదవిదుని, శాస్త్రజ్ఞుని, సర్వజ్ఞుని, పండితుని, పౌరాణికుని, విద్వజ్జనుని, యాజ్ఞికుని, వైదికుని, పవిత్రాత్ముని గాంచి నంతన నమస్కరింపవలెను 8. విశేషగుణ మే మానవునియందు గాన్పించి నను నాతనియందు సద్గురుని యధిష్ఠానమున్నదని తలంచి యత్యాదర ముతో నాతనికి నమస్కారము లొనర్పవలెను 9. గణేశ్వరుడు, సరస్వతి, శక్తి, విష్ణువు, శివుఁడు అను దైవతముల మూర్తులకు లెక్కయేలేదు. వాని వివరముల నెంతవఱకని వివరింపవలెను. అన్ని మూర్తులకును భక్తుఁ డగువాఁడు ప్రేమపూర్వకముగా నమస్కరింపవలయును 10. అన్నిదేవతల కర్పించు నమస్కారములును బరమాత్ముఁడగు భగవంతునకే చేరుచున్నవి. ఇది నా స్వంతమాటగాదు. ఈ యర్థమునందే చెప్పఁబడిన వాక్యము వినుండు 11.

♦ శ్లో॥ ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం।
సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి॥

కావున సమస్తదేవతలకును సాదరభావమున నమస్కరింపవలయును. దేవతలు పరమాత్ముని యధిష్ఠానములు. ఈ యంశమున భేదభావము వదలి విశ్వసించువారికిఁ బరమసుఖము కలుగును 12. దేవతలు పరమా త్ముని యధిష్ఠానములై యున్నటుల సత్పాత్రపురుషులు గూడ సద్గురు నధిష్ఠానములై యున్నారు. కావున సమస్తదేవతలకును బెద్దలకును నమ

* శివుఁడు, విష్ణువు, సూర్యుఁడు, ఆంజనేయుఁడు అనువారి దర్శనము పుణ్య ప్రదము. నిత్యము సేవించిన మిగులఁ బుణ్యము కలుగును.

♦ ఆకాశమునుండి పడిన నీరు సముద్రమునకుఁ బోవునట్లు అందఱు వేలుపులకు మొక్కిన మ్రొక్కులు విష్ణుమూర్తిని జేరును.

స్కరింపవలెను 13. నమస్కారమువలన లీనతగలుగును. వికల్పములు నశించును. అనేకవిధములుగానుండు సజ్జనులచెలిమి వలయునన్నచో నమస్కారమువలననే సమకూరును 14. సమస్తదోషములు పోవలయునన్నను అన్యాయము తొలఁగిపోవలెనన్నను సందేహములు నశింపవలయునన్నను నమస్కారము పెద్దలకుఁ గావింపవలయును 15. తల క్రిందుపఱచుటకంటె గొప్పదండనము మానవునకు వేఱుండఁబోదని పెద్దలుచెప్పుదురు. నమ్రతాపూర్వకముగా లజ్జితుఁడగుటచే నపరాధము తొలంగిపోవును. సాధువులగు సత్పురుషులకు భక్తుఁడు నిరంతరము నమస్కరించుచు వారి శరణమునందుండవలయును 16. నమస్కారమువలనఁ బెద్దలకుఁ గృప యుప్పొంగును. అంతియేగాదు ప్రసన్నతయుఁగూడ నధికమగును. గురుదేవుఁడు నమస్కరించినంతమాత్రముననే సాధకులయెడఁ బ్రసన్నభావము గలవాఁడగును 17. ఎల్లప్పుడు పెద్దలకు నమస్కరించుటవలనను నిరంతరము పెద్దలయెడ విధేయభావముతో వర్తించుటవలనను పాపములు గొండలంతవేని కూలిపోవును. అంతియగాక పరమపితయగు పరమాత్ముఁ డట్టివానిని గనికరించును 18. నమస్కారమువలనఁ బతితులు పవిత్రులయ్యెదరు. సాధుసజ్జనుల శరణము లభించును. జననమరణములు దూరమగును 19. ఏదేని గొప్పయన్యాయము గావించినవాఁడు వచ్చి సాష్టాంగ నమస్కారము గావించినయెడల శ్రేష్ఠులగువా రా యన్యాయమును జేసినవారిని క్షమింపవలెను 20. కావున నమస్కారమును మించిన యనుకరణ యోగ్యమగు కార్యమింకొకటిలేదు. పెద్దలకు నమస్కరించుటవలన సామాన్యమానవులకు సద్బుద్ధికలుగును 21. నమస్కారముచేయుటవలన మనకుఁ జిల్లిగవ్వయేని కర్చుగాదు. కష్టముగూడ నొందఁ బనిలేదు. నమస్కారము గావించుటకేదేని సామగ్రిని సమకూర్పఁబనిలేదు 22. సంసారమునుండి విడిబడఁ దలంచితిమేని పెద్దలకు నమస్కరించుటతో సమానమగు సహజోపాయమింకొకటిలేదు. నమస్కరించునపుడు సాధకుఁ డనన్యభావముతో నుండవలెను. ఇంతటి సహజోపాయమును వదలి అనేక సాధనములతోడను బహువిధోద్యోగములతోడను వ్యర్థముగా నేలఁ బాటుపడవలెనో తోఁచకున్నది 23. సాధకుఁడు పెద్దలకెపుడు భక్తిభావపూర్వకముగా నమస్కరించునో యపుడు వాని నుద్ధరింపవలయునను చింత పెద్దలకుఁ గలుగును.

వారలె యనుగ్రహించి సాధకుఁడు ముక్తినొందుటకు సుగమములగు మార్గములేవియో తెలుపుదురు 24. కావుననే వందనభక్తి సర్వశ్రేష్ఠమైనదని పెద్దలు చెప్పుచున్నారు. వందనము నొనరించుటవలననే గొప్పగొప్ప సత్పురుషులు ప్రసన్నభావులగుదురు. ఇదియె వందనభక్తి 25.

---

## ఏడవ సమాసము - దాస్యభక్తి.

వందనభక్తినిగూర్చి యింతవరకున్ను తెలిపియుంటిని. ఇప్పుడు సప్తమభక్తియగు దాస్యమునుగూర్చి చెప్పఁబోవుచున్నాఁడను. శ్రద్ధాభక్తులతో నాలింపఁగోరుచున్నాఁడను 1. దాస్యభక్తియనఁ బెద్దలకును వేల్పులకును నెట్టి పరిచర్య జేయవలసివచ్చినను బ్రాలుమాలక యొనరించుటయైయున్నది.సాధకుఁడు దాస్యభక్తి నవలంబించెనేని దేవస్థానమునే నెలవు చేసికొనవలయును 2. భగవంతునికి మిగుల వైభవములు సమకూర్చుచు నెట్టి న్యూనతను రానీయకుండుటయు భగవద్భజనమును జనసమూహమునందుఁ బెంపొందించుటయు దాస్యభక్తియందురు 3. దాస్యభక్తి మగ్నుఁడగు సాధకుఁ డితర చింతలు మాని పడిపోయిన దేవళములను బాగుచేయింపవలెను. తెగిపోయిన సరోవరములను మరల గట్టింపవలెను. ధర్మశాలలను నివాసస్థానములను నిర్వహింపవలెను. నిత్యమును బరమాత్ముని లీలలఁదెలుపు నూతన కావ్యములు పఠించుచుండవలెను 4. ఇంతియగాక నానావిధములగు జీర్ణ జర్జరములగు మండపాదులు పునరుద్ధరింపవలెను. వేయేల, యేపనివచ్చిపడినను శీఘ్రముగా నెరవేర్చుచు నుండవలయును 5. ఆలయములోనికిఁ గావలసిన గుఱ్ఱము, ఏనుగు, సింహాసనము, పాలకి, చౌకి, సుఖాసనము, మంచనము, మేనా, విమానము మున్నగు వాహనములను నూతనముగ నిర్మింపవలయును 6. మేఘాడంబరము, ఛత్రము, చామరము, సూర్యముఖి, చిహ్నము మున్నగు నుపకరణములను దేవాలయమునకు నిత్యము నవీనముగా నిర్మింప వలయును 7. నానావిధ యానములు సమకూర్చుటకు నుత్తమ స్థానములగు సువర్ణాసనములు మిగుల మనోహరముగఁ జేయింపవలయును 8. భవనములను, కొట్లను, పెట్టెలను, చందూకలను, వాహనములను, పాత్ర

లను, సకల ద్రవ్యములను మిగుల యత్నముతో నితరులకుఁ జిక్కనీయ కుండఁ గాపాడవలయును 9. గుహలు, అంతర్గృహములు, అరుగులు, బిలములు మున్నగు ప్రదేశములు గుప్తద్వారములు, అమూల్య వస్తు భాండారములు, దేవాలయమున విశేష ప్రయత్నముతో దృఢతర ముగాఁ గట్టించుచుండవలయును 10. అలంకారములు, భూషణములు, దివ్యవస్త్రములు, మనోహర రత్నములు, సువర్ణము మున్నగు నానావిధ ధాతుపాత్రములు ప్రయత్నపూర్వకముగ దేవాలయముకొఱకు సేకరింప వలయును 11. పుష్పవాటికలు, నానావిధ వృక్షములుగల తోఁటలు వేయించి వానికి నిరంతరము నీరుగట్టి పోషించుచుండవలయును 12. పశుశాలలు, పక్షిశాలలు, చిత్రశాలలు, నాట్యశాలలు, దేవళ మున దృఢతరముగాఁ గట్టింపవలెను. అంతియగాక బహువిధ వాద్య ములు గుణవంతులగు గాయకులు భగవద్భజనమునకై ప్రత్యేక ప్రయత్న మున సిద్ధమొనర్పవలెను 13. పాకశాలలు, భోజనశాలలు, ధర్మశాలలు, నిదురింపవచ్చెడి బాటసారులకొఱకు శయ్యాగృహములు, సామగ్రుల నుంచు గృహములు 14, నానావిధ పరిమళ ద్రవ్యములను నిలువజేయు కొట్లు, భిన్న భిన్న ఖాద్య ఫలస్థానములు, రసముల కుచితములగు ప్రత్యేక స్థలములు సాధకుఁడు శ్రద్ధతో నాలయమున నేర్పఱుపవలెను 15. ఆలయములో నేయేభాగములేని జీర్ణములైనయెడల వానిని వెంటనే గమనించి నూతనముగా నిర్మింపవలెను. భగవంతుని వైభవ మనిర్వాచ నీయమైనది. ఎంతదనుక వివరింపగలము? 16. భగవత్సేవా సంబంధము లగు సమస్తకార్యములను నిర్వహింప సంసిద్ధముగా నుండవలయును. భగవంతుని సేవయందు సాధకుఁడు తత్పరభావముతో మెలంగుచు నేపని నేని మఱచిపోఁగూడదు 17. జయంతులు, పర్వములు మొదలగు మహో త్సవములను సాధకుఁడు స్వర్గమునందలి దేవతలుచూచి ముగ్ధులుకాఁగల యంతటి మహావైభవముతో జరుపుచుండవలయును 18. భగవంతునకు నీచాతినీచమగు సేవనుగూడఁ జేయుటకు సర్వసిద్ధముగా నుండవలయును. మఱియు సమయ మేతెంచినపుడు సమస్తోపచారములు గావించుటకు సావధానముగా నుండవలయును 19. భగవంతుని కేదేది యావశ్యకమో ఆలయమున నేయేవస్తువులకుఁ గొఱంతగలదో వానిని తత్క్షణమె యొసం

గుచు సర్వసేవలు ప్రేమపూర్వకముగాఁ గావింపవలెను 20. పాదప్రక్షాళనము, స్నానము, ఆచమనము మొదలగువానికి జలము, చందనాక్షతలు, మనోహరవస్త్రములు, భూషణవిశేషములు, ఆసనములు, నానావిధ పరిమళ పుష్పములు, ధూపదీపనైవేద్యములు మున్నగువానిని పూజాదుల కుచితకాలమున సిద్ధముగా నుంచవలెను 21. శయనమునకు నుత్తమ స్థానము, త్రాఁగుటకుఁ బరిశుద్ధమును శీతలమునగు జలమును, రుచికరమగు తాంబూలమును సమర్పింపవలెను. శ్రుతిని రాగములతో మేళవించి భక్తి యుక్తములగు రసవత్పదములను మ నో హ ర ము గఁ బాడుచుండ వలయును 22. పరిమళద్రవ్యములు, పుష్పములు, నానావిధ సుగంధ మయములగు తైలములు, బహువిధములగు ఫలములు సమకూర్చి దేవ స్థానము నలికి చల్లి స్వచ్ఛముగా నుంచవలెను. జలపాత్రములందుఁ బూర్ణముగా జలము నింపవలయును. వస్త్రములను సుందరముగను నిర్మలముగను నుంచవలయును 23—24.

సమస్తవిషయములను గూర్చియు విచారించుచు సాధకుఁడు జాగరూకతగనుండి యాలయమున కేతెంచు భక్తులను గౌరవింపవలయును. ఇదియే దాస్యభక్తియొక్క సత్యస్థితి 25. మనుష్యమాత్రుని చిత్తము ప్రసన్నమగు విధమున స్తుతిని గరుణాపూరణములగు మాటలతో నుడువ వలెను 26. సప్తమమగు నీదాస్యభక్తిని యథామతితో వివరించితిని. భగవంతునిపట్ల గావించినటులె సద్గురునిట్లుగూడ ననన్యభక్తితో సేవ గావింప వలెను. ప్రత్యక్షముగా సేవజేయుటకు సాధ్యము గానియెడల మానసిక పూజవలెనే యీ దాస్యభక్తినిఁగూడ మానసికముగాఁ జేయవచ్చును27.

---

## ఎనిమిదవ సమాసము — సఖ్యభక్తి.

శ్రోతలారా ! మీరలింతకుమున్ను దాస్యభక్తిస్వరూపము నుత్సాహముతో నాలించితిరి. ఇదుపు సావధానమతితో నెనిమిదవదియగు సఖ్యభక్తిని గూర్చి తెలుపుదును. వినఁ గోరెదను 1. పరమాత్ముని తనకుఁ బరమమిత్రునిగా నొనరించికొని యాతనిని ప్రేమవలనను ప్రీతివలనను లోఁబఱచికొనుటకే సఖ్యభక్తియని పేరు 2. పరమేశ్వరునకు సంతోషా

వహములగు విషయములేవియో గుర్తించి వాని నానందముతో నొనర్చుచు 3, భక్తి, భావము, భజనము, అధ్యాత్మనిరూపణము, భగవత్కథ, భగవద్గుణకీర్తనము, ప్రేమగల భక్తులగానము బరమేశ్వరునకు సంతోషావహముగాఁ గావించుచు నుండుటయే సఖ్యభక్తి 4. పైని చెప్పఁబడిన వన్నింటిని శ్రద్ధతోఁ గావింపవలెను. అందుచే భగవంతుని యెడల మనకును మనయెడల భగవంతునకును మనస్సు గలిసిపోవును. ఈ రూపముగ నుభయులకు సహజముగా మైత్రి యేర్పడును. చాలును. ఇంకఁ గావలసిన దేద్దియున్నది? 5. పరమాత్ముని మైత్రిని గడింపవలయు నన్న మనము మన సమస్త సుఖములకును దిలాంజలి యొసంగవలెను. మఱియు స్వభావముతో జీవుఁడు తనప్రాణమును, శరీరమును గూడ భగవదర్పణము గావింపవలెను 6. సాధకుడా! నీవు సఖ్యభక్తి నభిమానించి యనుష్ఠింపఁ దలంతువేని గృహస్థసంకటములను దలంపక భగవంతుని దివ్యనామము చింతించుచుండుము. నిరూపణము, కీర్తనము, కథ, వార్త మున్నగునవియెల్ల ఈశ్వరసంబంధముగా నుంచుము 7. జగదీశ్వరునితోఁ జెలిమిచేయుటలో నొకవేళ ఇష్టమిత్రులను ముఖ్యబాంధవులను కుటుంబమును మఱియుఁ బ్రేమానుబంధులగు చుట్టపక్కములను విడువవలసి వచ్చియెడల నేమియు నభ్యంతరము చేయకుము. ఇంతియగాక నీసర్వస్వమును సమర్పింపవలసివచ్చినను వెనుకాడకుము. చివరకు బ్రాణములు గూడ భగవత్ప్రీత్యర్థమై విడువవలసి వచ్చినయెడల విడువుము 8. నీసర్వస్వమును గోలుపోవ వలసివచ్చినను నంగీకరింపుము. పరమాత్ముని మైత్రి మాత్రము చెడనీయక హృదయమున బ్రేమింపుము. భగవానుఁడె భక్తుని ప్రాణము. ఆ ప్రాణమును రక్షచేయుటయే భక్తుని కర్తవ్యము. ఇదియే పరమప్రీతియొక్క లక్షణము 9-10. ఇట్టి పరమప్రీతియు మైత్రియు నీయెడ భగవంతునకుఁ గలిగెనేని నిన్నుఁ గాపాడవలసిన బాధ్యతయు శ్రద్ధయు నేర్పడును. లాక్షాగృహములోఁ దగులఁబడిపోవనున్న పాండవులను బిలద్వారమునుండి వెడలించి వారినెటుల నాదరభావముతో భగవంతుఁడు రక్షించెనో యెఱుంగవా? 11. మిత్రరూపమునఁ బరమాత్ముని మనకడ నుంచుకొనఁదగిన తాళఁపుఁజెవి మనయొద్దనేయున్నది. ఎత్తైనస్థలమునకుఁ గ్రిందిభాగమునుండి ధ్వనిగావించినయెడలఁ బ్రతిధ్వని కలుగునటుల

మనము పరమాత్మునిపట్ల ననన్యభావముంచినయెడల నాతఁడుగూడ సమ యమునకుఁ బ్రసన్నుఁడగును. ఒకవేళ మన మాతనియెడఁ బరాఙ్ముఖుల మైనయెడల నాతఁడుగూడ మనయెడఁ బరాఙ్ముఖుఁడగును 12-13.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం ॥

ఎవఁడెటుల భక్తివహించునో అటులే పరమేశ్వరుఁడును వర్తించును. కావుననే దీనితాళపుఁజెవి మనయొద్దనే యున్నదని చెప్పితిని 14. ఒకవేళ మనమనస్సున కనుకూలముగా జరుగకపోయినచో నీశ్వరునెడఁగల భక్తి నేమాత్రము తగ్గింపరాదు. అటులొనరించినయెడల నాపాపమంతయు మన తలపయిఁబడును 15. మేఘము చాతకమునకుఁ బ్రసన్నము కాకపోయి నను చాతకము ప్రయత్నమును మనోనిశ్చయమును వదలుటలేదు. చంద్రుఁడు సమయమున కుదయింపకపోయినను జకోర మాతనిపట్ల ననన్య భావమును విడుచుటలేదు 16. భగవంతునియెడఁ గూడ సాధకుఁ డిట్లె మైత్రిని నెలకొల్పి వివేకయుక్తమగు ధైర్యభావముతో మెలంగుచుండ వలయును. భగవంతునియెడ మమత నెన్నఁటికిని విడనాడఁజనదు 17. భక్తుఁడగు సాధకుఁడు భగవంతుని జెలికానిగాఁ దలంచుచు నంతతోఁ దృప్తిగాకున్నఁ దల్లిగను, దండ్రిగను, గురువుగను, విద్యగను, లక్ష్మిగను, ధనముగను, విత్తముగను, సర్వస్వముగను నెంచుచు నుండవలయును 18. ఈశ్వరుఁడుతప్ప మాకింకొకదిక్కెవ్వరును లేరనుమాట సర్వసాధారణముగ మానవులందఱును ననునదియే. కాని యటులఁ బలుకువారి యాచరణము మాత్రము వ్యతిరేకముగా నుండును 19. తరింపఁగోరువా రెవ్వరును నిటుల ఆచరణ మొకవిధముగా నంతరంగ మొకవిధముగా నుంచఁగూడదు. దీనిని గపటమైత్రి యందురు. మైత్రిని గావింపఁ దలంచినయెడల సత్య మగు మైత్రియే గావింపవలయును. పరమేశ్వరుని దృఢముగా హృదయ పీఠమునందు నెలకొల్పవలయును 20. తనకోరిక నెరవేరనిస్థితిలో నీశ్వరుని యెడఁ గ్రోధభావము గలిగియుండుట సఖ్యభక్తి యనిపించుకొనదు 21. ఈశ్వరునియిచ్ఛ యేదియో గ్రహించి యదియొనరించుటయే మన కుచితవిధి. కేవలము ఇచ్ఛాకారణమున భగవంతుని నెన్నఁటికిని విడువ రాదు 22. భగవానుని యిచ్ఛానుసారముగాఁ బ్రవర్తించుచు నాతఁ డెద్దిగావించిన దానిని శిరసావహించి పరిగ్రహింపవలెను. ఇందువలన సహజ

ముగా నాతఁడు దయను జూపించును 23. ఈశ్వరానుగ్రహముముందుఁ దల్లిదయ యొకలెక్కలోనిది గాదు. తల్లియన్ననో విపత్తికాలము వచ్చి నపుడు బాలకుని జంపిగూడ వేయుచున్నది 24. కాని ఈశ్వరుఁ డెన్నఁ డును దనభక్తుని జంపినటుల నెప్పుడును గనలేదు. వినలేదు. శరణాగతుని పట్ల నీశ్వరుఁడు వజ్రపంజము వంటివాడు 25. పరమాత్ముఁడు భక్తుల యెడఁ బక్షపాతభావముగలవాఁడు. అతఁడు పతితులను దరింపఁజేయును. మఱియు ననాథులకు సహాయకారియగును 26. ఆతఁడనాథులగు దీనజను లనుగాపాడి సంకటములనుండి తొలంగించుటకై యనేకావతారముల నెత్తుచున్నాఁడు. అంతస్సాక్షియగు నాపరమాత్ముఁడు తొల్లి గజేంద్రుని గూడ నుద్ధరించినాఁడు 27. ఈశ్వరుఁడు కృపాసాగరము కరుణామేఘము. ఆయన తనభక్తుల నెన్నఁటికిని మఱువఁజాలఁడు 28. భక్తునిపై నెంతప్రేమ యుంచవలయునో పరమాత్ముఁడు బాగుగా నెఱుంగును. కావున నాత నితో సఖ్యత్వము గావింపవలెను. ఈ కుటుంబసంబంధమంతయు నొక మాయ. అంత్యమున కిది కొంచమేని యుపయోగపడనేరదు 29. ఈశ్వ రుని నిమిత్తత్వమెన్నఁటికిని విడిపోవునదికాదు. ఆయనప్రేమ కెన్నఁటికిని భిన్నము కలుగనేరదు. శరణాగతునిపట్ల నాతఁడెప్పుడును నుపేక్ష వహిం పడు 30. కావున ముముక్షువగుమానవు లీశ్వరునితో సఖ్యము గలిగియుండ వలయును. అతనితోఁ దన సుఖదుఃఖములను విన్నవించుకొనవలయును. ఇదియే సఖ్యభక్తి 31. శాస్త్రములలోఁ బరమాత్ముఁడు, గురువు అను నీ యిరువురు సమానులని చెప్పఁబడెను. కావునఁ బరమాత్ముని పయి నుంచినట్లె సద్గురుని పట్లగూడ మిత్రభావ ముంచవలెను 32.

---

## తొమ్మిదవ సమాసము — ఆత్మనివేదనభక్తి.

శ్రోతలారా! సఖ్యభక్తి తరువాతది ఆత్మనివేదనభక్తి. ఇంతకు మున్ను మీరు సఖ్యభక్తినిగూర్చి సాకల్యముగా వింటిరిగావున నిపు డాత్మనివేదనభక్తినిగూర్చి సావకాశముగా విన(గోరెదను 1. నవవిధభక్తులలో నాత్మనివేదనభక్తి తొమ్మిదవది. దానిస్వరూప మింక స్పష్టముగా మీకు బోధించెదను 2. స్వయముగఁ దాను దనను భర

మాత్మున కర్పణజేసికొనుటయే ఆత్మనివేదనము. ఈ విషయము తత్త్వ వివరణము గావించుటవలన మీకుఁ జక్కఁగా బోధపడును 3. స్వయముగఁ దనకు భక్తుఁడనుటయు మఱియు విభక్తుఁడై యుండి యీశ్వరుని భజించుటయు నాత్మనివేదనభక్తి లక్షణములు 4. లక్షణుఁడై యలక్షణుఁడగుటయు, జ్ఞానియై యజ్ఞానియగుటయు, భక్తుఁడై విభక్తుఁడగుటయు నీ భక్తిలక్షణములె 5. విభక్తుఁడు కానివాఁడే భక్తుఁడు, భక్తుఁడు కానివాఁడే విభక్తుఁడు. ఈ విరోధభావమును గూర్చి సాకల్యముగా విచారము గావింపని సాధకున కెన్నఁటికిని సంతోషము లభింపనేరదు 6. ఈ విషయము సంపూర్ణముగ విచారణ మొనరింపవలయును. ఈశ్వరుని గుర్తింపవలయును. అంతఃకరణమునందు స్వయముగఁ దనను వెదుకవలయును 7. తత్త్వమును విచారించి "నేను అనునదెవ్వరు?" అను విషయమును దృఢముగా తీర్మానించితిమేని "నేను" అనునది యెచ్చటను లేదని విశదము గాఁగలదు 8. తత్త్వము తత్త్వములలోఁ గలిసిపోవునని వివేకమువలన గ్రహించినపుడు నేను అనునది యింక నెక్కడ మిగిలియుండును? ఇదియే ఆత్మనివేదనము* 9. ఇదియంతయు దత్త్వరూపముగా భాసమగుచున్నది. వివేకముతోఁ గాంచినపిమ్మట నంతయును నిరసనమై పోవుచున్నది. ప్రకృతిని వేఱుచేయుటవలన ఆత్మ నిలిచియుండును. అచ్చట నేను అనునది యెచ్చటనుండి వచ్చును? 10. ముఖ్యముగ బరమేశ్వరుఁ డొకఁడున్నాఁడు గదా! రెండవది జగద్రూపమున బ్రకృతియున్నది. (మాయ బ్రహ్మము రెండును నుండనేయుండెను) ఇఁక నీమధ్యకు నేను అను దొంగ నెచ్చటినుండి కొనివచ్చితిరో తోఁచకున్నది 11.

ఇదియంతయు నీవిధముగా సిద్ధాంతమైన పిమ్మటఁగూడ నీ యసత్య దేహముయొక్క అహంతాత్వము (నేననుభావము) మధ్యమునం దంటి

* ప్రకృతి నియమానుసారముగ పంచతత్త్వాత్మికమగు శరీరము పంచతత్త్వములలోఁ గలిసిపోయినప్పుడు "నేను" అనున దెక్కడ మిగిలియుండును? అనఁగా మనుజుఁడు దేనిని "నేను" అని చెప్పునో యది మిగిలియుండదు. కాని యీ శరీరముయొక్క యైదుతత్త్వములు ఒక్కటిగ నొక్కటిగ నైదింటితోఁ గలిపివేయుటతో నిఁక శేషించియుండునదేదియో యదియే ఆత్మరూపమగు "నేను" అనునది. దీని నెఱుంగుటయే ఆత్మ నివేదనము.

యుండును. కాని బాగుగా విచారించి చూచితిమేని యేమియును లేదని స్పష్టమగును 12. తత్త్వవిచారముతోఁ జూచినమీఁదట నీ పిండబ్రహ్మాండములు కేవలము తత్త్వరచనమని విశదపడఁగలదు. నానాప్రకారములగు వ్యక్తులు తత్త్వములతో రచింపఁబడిన విశ్వాకారమునందు వ్యాపించి యున్నవి 13. సాక్షిత్వము వలనఁ దత్త్వములు నిరసనమగును. మఱియు నాత్మానుభవమువలన సాక్షిత్వమేమియును మిగిలియుండదు. కావున ఆదియందును అంతమునందును నున్నది యాత్మయే. అప్పుడు మఱల "నేను" అనున దెచ్చటనుండి వచ్చునో? 14. * ఆత్మయనున దొక్కటియే యైయున్నది. అది స్వానందము. మఱియు అహమాత్మా (అహం+ఆత్మా) అను వచన మొక్కటి యున్నదికదా! మఱల నచ్చట "నేను" అను భిన్నత్వ మెక్కడనుండి శేషించినది? 15. "సోహం హంస" (నేను కేవలముగ ఆత్మనై యున్నాఁడను) అను నీవాక్యము నందుఁగల యంతరార్థము గ్రహింపవలసియున్నది. నేనే యాత్మరూపుఁడనని యాత్మవిచారము గావించుటచే మఱల నచ్చట నేను అనున దెద్దియుఁ గలుగఁబోదు 16. ఆత్మ నిర్గుణము నిరంజనము నై యున్నది. కావున దానివిషయమున ననన్యత గలిగియుండవలయును. అన్యము (ఇతరము) లేదు అని యనన్యపదమున కర్థము. ఇఁక నచట "నేను" అను ననన్య మగునది యెచ్చటనుండి వచ్చినది? 17. ఆత్మ యద్వైతము. అచట ద్వైతాద్వైతము లేమియును లేవు. కావున నిఁక నచ్చట నేను అను కల్పన మెచట నుండఁగలదు? 18. ఆత్మ, పూర్ణత్వముతో బరిపూర్ణమై యున్నది. అచట గుణాగుణము లేవియును లేవు. ఆ నిఖిల నిర్గుణమునందు "నేను" అనున దెవ్వరు? అది యెక్కడనుండి వచ్చినది? 19. త్వంపదము, తత్పదము, అసిపదముల భేదాభేదము నిరసనమై పోయినమీఁదట (తత్త్వ

* నేను అనునది తత్త్వములకు సాక్షియైయున్నది. దీనిచే "నేను" అనునది తత్త్వములకంటె భిన్నమగు నొకపదార్థమని విదితమగుచున్నది. నాది యను ప్రత్యక్ష ప్రమాణమువలననే "నేను" అనునది తత్త్వముకంటె వేరుగనున్నట్లు ధ్రువపడుచున్నది. మఱియు నాత్మ ప్రతీతియైపోయినపిదప అనఁగా 'సర్వంఖల్విదం బ్రహ్మ'యను జ్ఞానము కలిగినపిమ్మట నిఁకఁ బ్రత్యక్షప్రమాణ మెక్కడనుండి శేషింపఁగలదు? సారాంశమేమన — ఆద్యంతములయం దాత్మ యొక్కటియే యున్నది. "నేను" అనునది దానికంటె నేదో యొక భిన్న పదార్థముగాదు.

మసి = అది నీవైయున్నాఁడవు అను ఈ మహావాక్యము సిద్ధియైన మీఁదట) శుద్ధబ్రహ్మము శేషించియుండును. ఇఁక నచ్చట "నేను" అనున దెచ్చటనుండి వచ్చెను? 20.

జీవాత్మ శివాత్మ యను నీ రెండుపాధులు నిరసించినపిమ్మటగాని మొదట నీ రెండు నెచ్చటనుండివచ్చెనో బోధగాదు. స్వరూపమునందు దృఢమగు బుద్ధి గలిగినపిమ్మట "నేను" అనున దేదియు నుండఁబోదు 21. నేను అసత్యము. ఈశ్వరుఁడు సత్యము. ఈశ్వరుఁడు భక్తుఁడు నను నీ యుభయులు ననన్యులు. అనఁగా నీ యిరువురు నొకటియై యున్నారనుట. ఈ వచనమునందలి భావము సామాన్యులగు జనులకుఁ దెలియఁబోదు. అనుభవనీయు తెలుంగుదురు 22. ఆత్మనివేదనమన నిదియేసుఁడీ! ఇదియే జ్ఞానులకు బాగుగాఁ దెలిసినయంశము 23. పంచభూతములలో నాకాశము, దేవతలలో జగత్పితయగు పరమాత్ముఁడు నెటులశ్రేష్ఠులో యటులే నవ విధభక్తులలో ఆత్మనివేదనభక్తి శ్రేష్ఠమైనది 24. తొమ్మిదవదియగు నీ యాత్మనివేదన భక్తి లేని మానవున కెన్నఁటికిని జననమరణములు తొలంగి పోఁజాలవు. ఈ వచనము సత్యసిద్ధము. కావున నిందు సందియము వలదు 25.

ఈ నవవిధభక్తుల నలవఱచికొనిన మానవునకు సాయుజ్యముక్తి లభించును. సాయుజ్యముక్తియన నేమియో యెఱుంగుదువా? దానికిఁ గల్పాంతమునందుఁగూడ నాశనములేదు 26. శేషించిన మూఁడుముక్తుల కును నాశనమున్నది. కాన సాయుజ్యముక్తిమాత్ర మచలమైనది. మూఁడు లోకములు నిర్వాణమై పోయినప్పుడు సైతము సాయుజ్యముక్తి చెక్కు-చెదరక యథారూపముగ నుండును 27. నేనేకాదు వేదశాస్త్రాది సమస్త గ్రంథములు సైతము నాలుగుముక్తులు గలవని చెప్పుచునేయున్నవి. వానిలో మూఁడింటికి నాశనమున్నది. నాలుగవదియగు సాయుజ్యముక్తి యవినాశిగా నుండును 28. మొదటిముక్తి సాలోక్యము (దేవునితో సమానముగానుండుట). రెండవది సామీప్యము (దేవుని సమీపమునం దుండుట). మూఁడవముక్తి సారూప్యము (దేవుని సమానరూపము నొందుట). నాలుగవది సాయుజ్యము (దేవునితో లీనమయ్యెడుపదవి) 29. ఈ నాలుగును మానవులకు సామాన్యప్రయత్నములచే లభింపఁజాలవు.

భగవద్భజనవలననే లభించును. కావున భగవద్భజన ప్రభావమెంతని పొగడగలను! 30.



## పదియవ సమాసము — సృష్టివర్ణనము, ముక్తిచతుష్టయము.

ఆదిబ్రహ్మము నిరాకారము. అందె పూర్ణస్వరూపముతో నహం కార ముత్పన్నమగుచున్నది. ఈ యహంకారము పంచభూతములకును మూలమైయున్నది. దీనినిగూర్చిన విచారమంతయు నెనిమిదవ దశకము నందుఁ జేయఁబడినది 1. ఆ యహంకారము వాయురూపమై యున్నది. దానితరువాత తేజస్స్వరూపము (అగ్నిస్వరూపము) గలదు. ఆ తేజము నాధారముగాఁ జేసికొని జలము ఆవరణరూపముగ వ్యాపించియున్నది 2. ఆ జలావరణపు టాధారముతో నాదిశేషుఁ డీపృథ్విని ధరించియున్నాఁడు. ఈ పృథ్వియంతయు నేఁబదియారుకోట్ల యోజనముల విస్తీర్ణముగా నున్నది 3. పృథ్విని ఏడుసముద్రము లావరించుకొనియున్నవి. పృథ్వి మధ్యమున మహత్తరమగు మేరుపర్వతమున్నది. మరియు నీపృథ్వికిఁ బరివారరూపులుగ అష్టదిక్పాలకులు దూరదూరముగ నొక్కొక్కదిక్కు నావరించుకొని యున్నారు 4. మహత్తరమగు నామేరుపర్వతము సువర్ణ మయము. ఈ భూమండలము దాని యాధారముననే కదలక నిలిచి యున్నది. మేరుపర్వతము ఎనుబదినాలుగువేల యోజనముల విశాలముగ నలరారుచుండును 5. దానిఎత్తు నిర్ణయింప నెంతవానికేని తరముగాదు. పదునాగులువేల యోజనములదనుక మేరుపర్వతము భూమిలోనికిఁ జొచ్చుకొని పోయియున్నది. దాని చుట్టుప్రక్కలను లోకాలోక (చక్రవాళ) పర్వత మావరించియున్నది 6. చక్రవాళపర్వతమున కావల హిమాలయ పర్వతముయున్నది. అచ్చటనే పాండవులందఱు నిలువునీరై కరిగిపోయిరి. ధర్మనందనుఁడును తమాల నీలగాత్రుఁడగు శ్రీకృష్ణుఁడును మాత్రమే హిమాలయముదాటి ముందునకరిగిరి 7. హిమాలయముచేరుట కనువగు మార్గమేలేదు. మార్గమధ్యమున శీతలవాయు సేవనమున సుఖముగానున్న బలిసిన సర్పరాజము లాయాప్రదేశము లావరించుకొనియున్నవి. అవియుఁ జూచుటకుఁ పర్వతములవలెనే కనిపించుచుండును 8. హిమాలయమున

కావల బదరికాశ్రమము బదరీనారాయణము అనుక్షేత్రరాజము లున్నవి. నిర్వాణసమయమునందు మహాతపస్వులగు పుణ్యమూర్తులు దేహత్యాగము గావించుట కచటికి వెళ్ళుచుందురు 9. దానితరువాత బదరీనాథము, కేదారనాథము అను రెండుక్షేత్రములున్నవి. ఈ రెండుక్షేత్రములను పెద్దలు పిన్నలు దర్శించి వచ్చుచుందురు. ఈ ప్రదేశములన్నియుఁ గలిసి మేరుపర్వతమంత విస్తృతిగలవి 10. మేరుపర్వతమునకుఁ బయిభాగమునందు మూఁడు మహోన్నతశిఖరములు గలవు. వానిపయిని బరివారసహితులై బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నివసించుచుందురు 11. బ్రహ్మ నివసించు శృంగము స్వర్ణమయము. విష్ణువు నివసించు శృంగము మరకతమణిమయము. శివుడు నివసించు శృంగము స్ఫటికమణిమయము. దీనినే, కైలాసమని పెద్దలు చెప్పుచుందురు 12. విష్ణువు నివసించు శృంగమునకు వైకుంఠమనియు, నీ మూఁడింటి కావలనున్న లోకమునకు అమరావతి లేక ఇంద్రలోకమనియుఁ బేరు 13.

ఇంద్రలోకమునందు గణములు, గంధర్వులు, లోకపాలురు, ముప్పదిమూఁడుకోటుల దేవతలు మున్నగువారలు నివసించుచున్నారు. అదేవిధముగఁ బదునాలుగు లోకములును మేరుపర్వతము నావరించుకొనియున్నవి 14. స్వర్గలోకమునందుఁ గామధేనువులు మందలుమందలుగా నున్నవి. కల్పతరువులుగల వనములు లెక్కకు మిక్కుటముగా నున్నవి. అమృత సరోవరములు ప్రతి ప్రదేశమునందును నలరారుచున్నవి 15. చింతామణులు, పరుసవేదిగనులు నట లెక్కకు మించి కలవు. ఇంతయేల, అచటి నేలయంతయు స్వర్ణమయము 16. ఆ లోకమునందంతటను బరమ రమణీయమ నయనానందకరము నగుప్రకాశము వ్యాపించియున్నది. అచట గల నవరత్నమయములగు పాషాణములకు లెక్కయేలేదు. అచటివారలగు వేల్పులందఱును నిరంతర మానందవారాశి నోలలాడుచుందురు 17. అచ్చటనున్న వేలుపులందఱకు నాహారము అమృతము. దివ్యసౌగంధికములాలోకమున వెదకికొనవలసిన పనియే లేదు. దివ్యకుసుమము లెప్పుడును వికసించి హృదయానందకరముగా నుండును. అష్టవిధనాయకులును గంధర్వులును మందాకినీ సికతాతలమున నిరంతరము గానముచేయుచు విహరించుచుందురు 18. అచటనున్నవారలందఱు నిరంతరము యౌవను

లుగానుందురు. స్వర్గవాసులకు ఆధివ్యాధు లుండనేయుండవు. వార్ధకము గాని, మరణముగాని వారలకెన్నఁటికిని రాఁజాలదు 19. స్వర్గమునందుఁ గలవానిలో నొకదానికంటె నొకటి సుందరమైనది. ఒకటికంటె మఱియొకటి చతురమైనది. అచట వసించువారలందఱును గొప్ప ధీరమూర్తులును, ఉదారస్వభావులును, శూరవతంసులు నై యున్నారు 20. స్వర్గవాసుల దేహములు మెఱుపు తీఁగెలవలె జ్యోతిస్స్వరూపములై యున్నవి. వారల కీర్తికిని యశమునకును, బరాక్రమమునకును మేరయేలేదు 21. స్వర్గభువన మెటులుండునో మీకు సంగ్రహముగాఁ దెలిపినాఁడను. అది దేవతలకు నివాసస్థానము. దానిమహిమ యెంతవర్ణించినను దక్కువయే గావున విరమించుచున్నాఁడను 22.

భూలోకవాసులగు మానవులు నిష్కల్మషమగు భక్తిభావముతో నే దేవతను భజించెదరో యా దేవతసన్నిధానమునందు సాలోక్యముక్తి ననుభవింతురు 23. భక్తులు తాము ధ్యానించు దేవతలుండు లోకములో నున్నచో సాలోక్యముక్తి నొందిరనియు, సమీపముననున్నచో సామీప్య ముక్తి నొందిరనియు, దేవతాస్వరూపముతో నున్నచో సారూప్యముక్తి నొందిరనియుఁ జెప్పుదురు 24. సారూప్యముక్తియందుఁ బ్రాణికి దేవ రూపముకలుగును. కాని శ్రీవత్సలాంఛనము, కౌస్తుభమణి, లక్ష్మి మున్నగునవి వానికి లభింపవు. ఇదియే సారూప్యముక్తి లక్షణము 25. సుకృతసంచయ మెంతదనుక నుండునో యంతదనుకఁ బ్రాణిలోక మీ మూఁడుముక్తుల ననుభవించుచుండును. అది సమాప్తియైనంతన ప్రాణిలోకమంతయుఁ దమదమ తావులకుఁ ద్రోసివేయఁబడును. దేవతలు మాత్రము యథావిధముగాఁ దమ లోకమునందే యుందురు 26. కావున నీ మూఁడుముక్తులు నశించునవియని చెప్పవచ్చును. నాలుగవదియగు సాయుజ్యముక్తి యట్టిదికాదు. అది నిరంతర మవినాశిగానుండును 27. కల్పాంతమునందు బ్రహ్మము నశించును. మేరుపర్వతముతోఁబాటు భూలోకమంతయు భస్మమైపోవును. ఆ సమయమున దేవతలే నశింతురు. కావునఁ బయినిఁ బేర్కొనిన మూఁడువిధములముక్తు లెటుల నిలువగలవు ? 28. అప్పుడు ముఖ్యముగా నాశనమొందక నిలిచియుండునది కేవల నిర్గుణపరమాత్మ యొక్కటిమాత్రమేసుమా ! కావున నిర్గుణబ్రహ్మమును

గూర్చిన భక్తియొక్కటియే స్థిరమైనది. అదియే సాయుజ్యముక్తి 29. నిర్గుణమునం దనన్యత నొందుటవలన సాయుజ్యముక్తి లభించును. నిర్గుణమునందుఁ గలిసిపోవుటను, తదాకారము నొందుటను సాయుజ్యముక్తి యని చెప్పుదురు 30. సగుణభక్తికిఁ జలనముగలదు. నిర్గుణభక్తి యచలమైనది (స్థిరమైనది). ఇవియన్నియు సద్గురుశరణ్యములోని కరిగినచో విశదమగును 31.

నాలుగవదశకము సమాప్తము.

---



లుగానుందురు. స్వర్గవాసులకు ఆధివ్యాధు లుండనేయుండవు. వార్ధకము గాని, మరణముగాని వారలకెన్నఁటికిని రాఁజాలదు 19. స్వర్గమునందుఁ గలవానిలో నొకదానికంటె నొకటి సుందరమైనది. ఒకటికంటె మఱియొకటి చతురమైనది. అచట వసించువారలందఱును గొప్ప ధీరమూర్తులును, ఉదారస్వభావులును, శూరవతంసులు నై యున్నారు 20. స్వర్గవాసుల దేహములు మెఱుపు తీఁగెలవలె జ్యోతిస్స్వరూపములై యున్నవి. వారల కీర్తికిని యశమునకును, బరాక్రమమునకును మేరయేలేదు 21. స్వర్గభువన మెటులుండునో మీకు సంగ్రహముగాఁ దెలిపినాఁడను. అది దేవతలకు నివాసస్థానము. దానిమహిమ యెంతవర్ణించినను దక్కువయే గావున విరమించుచున్నాఁడను 22.

భూలోకవాసులగు మానవులు నిష్కల్మషమగు భక్తిభావముతో నే దేవతను భజించెదరో యా దేవతసన్నిధానమునందు సాలోక్యముక్తి ననుభవింతురు 23. భక్తులు తాము ధ్యానించు దేవతలుండు లోకములో నున్నచో సాలోక్యముక్తి నొందిరనియు, సమీపముననున్నచో సామీప్య ముక్తి నొందిరనియు, దేవతాస్వరూపముతో నున్నచో సారూప్యముక్తి నొందిరనియుఁ జెప్పుదురు 24. సారూప్యముక్తియందుఁ బ్రాణికి దేవ రూపముకలుగును. కాని శ్రీవత్సలాంఛనము, కౌస్తుభమణి, లక్ష్మి మున్నగునవి వానికి లభింపవు. ఇదియే సారూప్యముక్తి లక్షణము 25. సుకృతసంచయ మెంతదనుక నుండునో యంతదనుకఁ బ్రాణిలోక మీ మూఁడుముక్తుల ననుభవించుచుండును. అది సమాప్తియైనంతన ప్రాణిలోకమంతయుఁ దమదమ తావులకుఁ ద్రోసివేయఁబడును. దేవతలు మాత్రము యథావిధముగాఁ దమ లోకమునందే యుందురు 26. కావున నీ మూఁడుముక్తులు నశించునవియని చెప్పవచ్చును. నాలుగవదియగు సాయుజ్యముక్తి యట్టిదికాదు. అది నిరంతర మవినాశిగానుండును 27. కల్పాంతమునందు బ్రహ్మాము నశించును. మేరుపర్వతముతోఁబాటు భూలోకమంతయు భస్మమైపోవును. ఆ సమయమున దేవతలే నశింతురు. కావునఁ బయినిఁజేర్కొనిన మూఁడువిధములముక్తు లెటుల నిలువగలవు ? 28. అప్పుడు ముఖ్యముగా నాశనమొందక నిలిచియుండునది కేవల నిర్గుణపరమాత్మ యొక్కటిమాత్రమేసుమా ! కావున నిర్గుణబ్రహ్మామును

గూర్చిన భక్తియొక్కటియే స్థిరమైనది. అదియే సాయుజ్యముక్తి 29. నిర్గుణమునం దనన్యత నొందుటవలన సాయుజ్యముక్తి లభించును. నిర్గుణమునందుఁ గలిసిపోవుటను, తదాకారము నొందుటను సాయుజ్యముక్తి యని చెప్పుదురు 30. సగుణభక్తికిఁ జలనముగలదు. నిర్గుణభక్తి యచలమైనది (స్థిరమైనది). ఇవియన్నియు సద్గురుశరణ్యములోని కరిగినచో విశదమగును 31.

నాలుగవదశకము సమాప్తము.





# ఐదవ దశకము.



## మొదటి సమాసము – గురునిశ్చయము.

### సద్గురుసేవ లేనిది మోక్షములేదు.

ఓ పరమపురుషా! ఆత్మారామా! పూర్ణాకామా! సద్గురూ! మీకు జయమగుగాక. జయమగుగాక. మీమహాత్మ్యము వర్ణింపనాతరముగాదు 1. గురువర్యా! మీ యనుగ్రహ మున్నంతమాత్రమున సచ్ఛిష్యులకు వేదముల కగమ్యమును శబ్దముల కందనిదియునగు బ్రహ్మము సాధ్యమగుచున్నది 2. అంతియగాక యోగులగువారలకుఁగూడ ముఖ్య రహస్యముగానున్నదియు, శంకరునకు ముఖ్యవిశ్రామముగ నలరారునదియుఁ, బరమగుహ్యమును అగాధమునునగు బ్రహ్మము మీ యనుగ్రహమువలనఁ బ్రాణి (జీవుడు) స్వయముగఁ దానె యగుచున్నాఁడు. (ఈ దుస్తర సంసారము నుండి విముక్తుఁ డగుచున్నాఁడని భావము) 3–4.

గురువతంసా! ఇపుడు మీ యనుగ్రహమువలననె శ్రోతలకు గురుశిష్య లక్షణముల నెఱిఁగించుచున్నాఁడను. వీని ననుసరించి మోక్షాసక్తి గల శ్రోతలు సద్గురుని శరణ్యములోని కరుగుట కర్తవ్యము 5. వాస్తవమునకు సమస్త వర్ణములవారికి బ్రాహ్మణుఁడె (బ్రహ్మజ్ఞానియై బ్రాహ్మణుఁ డనిపించుకొన్నవాఁడె) గురువై యున్నాఁడు (వర్ణానాం బ్రాహ్మణో గురుః). కావున మోక్షాసక్తిగలవాఁ డనన్యభావముతో నాతని సన్నిధి కరుగవలెను 6. బ్రహ్మజ్ఞానులై బ్రాహ్మణు లనిపించుకొను వారి కొఱకె స్వయముగా శ్రీమన్నారాయణమూర్తి యవతారమెత్తెను. మఱియు శ్రీ మహావిష్ణువే నిరంతరమును శ్రీవత్సలాంఛనము (భృగుమహర్షిచేఁ దన్నఁబడిన తన్ను గురుతు) సాదరముగఁ దన పేరురమునఁ దాల్చినాఁడు. ఇఁక నితరుల లెక్కయేమి? 7. బ్రాహ్మణుల వచనములచేతను బ్రాహ్మణుల మంత్రములచేతను శూద్రాదులు బ్రాహ్మణులగుచున్నారు. వేయేల, ధాతుపాషాణములయందును సైతము బ్రాహ్మణ

మంత్రప్రభావముచే దేవత్వ మేతెంచుచున్నది 8. యజ్ఞోపవీతములేని యాతఁడు నిస్సందేహముగా శూద్రుఁడె. యజ్ఞోపవీత సంస్కారముచే రెండవజన్మము కలుగుచున్నది. నాఁడుమొదలుకొని ద్విజుఁడని చెప్పుచుందురు 9. వేదములుసైతము బ్రాహ్మణుఁడు సమస్త వర్ణములవారికిని బూజ్యుఁడని చెప్పుచున్నవి. ఈ యంశము నందఱు నభిమానభావముతో గమనించుచునేయున్నారు. వేదవిరుద్ధ విషయములు భగవంతునకప్రియములు గావున వానితో మనకేమిపని? 10. యోగము, యాగము, వ్రతము, దానము, తీర్థము మున్నగు కర్మయోగాంగములలో నేదియుఁ బ్రాహ్మణుఁడు లేనిది నెఱవేఱజాలదు 11. బ్రాహ్మణుఁడు ప్రత్యక్షముగా వేదస్వరూపుఁడు. అంతియగాదు భగవంతుఁడుగూడ నైయున్నాఁడు. విప్రవాక్యమువలనఁ గోరికలు ఫలించును 12. బ్రాహ్మణపూజనమువలన వృత్తి పవిత్రమగును. చిత్తము భగవంతునియందు లగ్నమగును. ప్రాణు లుత్తమగతులను బ్రాహ్మణుల తీర్థమువలననే పడయుచున్నారు 13. అన్యజాతులను విడిచి బ్రాహ్మణులకు సంతర్పణలు భోజనములు చేయించుటగూడ బ్రాహ్మణ పూజనమే. భగవంతుఁడు భావమున కాఁకలిగొనియున్నాఁడు. ఆయన జాతులను కులములనుఁ జూడఁడు 14. బ్రాహ్మణునకు గొప్పదేవతలుగూడ నమస్కరించుచున్నారు. ఇఁక సామాన్య మానవునిసంగతి చెప్పవలసినదేమున్నది? నేఁటి కాలముననో బ్రాహ్మణుఁ డెంత మూఢమతియై యున్నను నాతఁడె జగమునందంతటను వందనార్హుఁడై యున్నాఁడు 15. అంత్యజుఁడు గొప్ప శబ్దజ్ఞానియైయున్నచో వానిని గైగొని చేయవలసిన దేమున్నది? బ్రాహ్మణునివద్దఁ గూర్చుండఁబెట్టి వాని నేమేని పూజింపఁగలమా? 16. లోకమునకుఁగాని మతమునకుఁగాని విరుద్ధముగా నెయ్యదియేని గావించిన యెడల దానిని వేదముసైతము పరిహాసము చేయును. వేదదూష్యమగు కార్యమాచరించినవానిని పాషండుఁడని చెప్పుదురు 17. పరమాత్ముని భక్తులగువారలకు బ్రాహ్మణులపయి విశ్వాసము సహజముగనే యున్నది. బ్రాహ్మణునిఁ బూజించి యనేకులు పవిత్రులైరి 18. బ్రాహ్మణసేవవలన దేవాధిదేవుఁడగు పరమాత్ముఁడు లభించుచుండ నిఁక సద్గురునితో నేమిపని? యని యొకవేళ శ్రోతలు ప్రశ్నింతురేమో! అది సరిగాదు.

సద్గురుఁడు లేనిది బ్రహ్మజ్ఞాన మెన్నఁటికిని గలుగఁజాలదు19. స్వధర్మముల యందును స్వకర్మములయందును బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు. కాని జ్ఞానముమాత్రము సద్గురుఁడు లేనిది కలుఁగజాలదు. బ్రహ్మజ్ఞానము కలుగనిది జననమరణ దుఃఖము నశింపదు 20. కావున జ్ఞానము బడయుటకు సద్గురుని యనుగ్రహ మావశ్యకము. సద్గురుని యనుగ్రహము అవలంబనముగా లేకున్నయెడల నజ్ఞానులగు మానవులు సంసార ప్రవాహము నందుఁ బడి కొట్టుకొనిపోవుదురు 21. జ్ఞానరహితముగఁ జేయఁబడు కర్మ మంతయు జన్మకారణమగును. కావుననే జ్ఞానమార్జించి జన్మరాహిత్యము గావించుకొనుటకు సద్గురు చరణములను దృఢభావముతోఁ బట్టుకొన వలయునని చెప్పితిని 22. పరమాత్ముని దివ్యరూపమును సందర్శింపఁ గోరికగలవాఁడు సత్సంగ మొనరింపవలయును. ఏలయన సత్సంగము లేనియెడల దేవాధిదేవుఁడు(బ్రహ్మము) లభింపఁజాలఁడు 23. అయ్యయ్యో! అజ్ఞానులగు పురుషు లీరహస్యము నెఱుంగక సద్గురు నాశ్రయింపఁబోక నానావిధములగు సాధనాంతరములలో మగ్నులై తిరుగుచుందురు. సద్గురు కృపలేని దా పరిశ్రమయంతయు వ్యర్థమైపోవును 24. కార్తికస్నానము, మాఘస్నానము, వ్రతములు, ఉద్యాపనములు, దానములు, గోరాంజనములు (ఈశ్వరప్రీతికై దేహమునిండ వాతలు బెట్టుకొనుట), ధూమపానము (తలక్రిందుగా వ్రేలాడుచుఁ బొగబీల్చి చేయుతపస్సు), పంచాగ్ని మధ్యనుండుట మున్నగు సాధనములు కొందఱు గావించుచుందురు 25. కొందఱు ప్రజలు హరికథలు, పురాణశ్రవణములు, అధ్యాత్మ నిరూపణములు మిగుల నాదరభావముతోఁ గావింతురు. మఱియు మిగుల శ్రమపడి యగమ్యములగు పుణ్యతీర్థములకు యాత్రార్థముగా నేగుదురు 26. నిర్మలభావముతో దేవతార్చనము, స్నానము, సంధ్య, దర్భాసనము, తిలకము, మాల, గోపీచందనము, శ్రీముద్రాధారణము మున్నగునవి యన్నియుఁ గొందఱు నిర్వహింతురు 27. అర్ఘ్యపాత్రములు, సంపుటములు, గోకర్ణపాత్రములు, మంత్ర యంత్రసంబంధమగు తామ్రపాత్రములు, నానావిధపాత్రములు సమకూర్చి కొందఱు భగవత్పూజనము నొనర్తురు28. గణగణమని పూజాసమయమున గంట వాయింతురు. స్తోత్రములు, స్తవములు, స్తుతులు, ఆసనములు, ముద్రలు, ధ్యానములు, నమస్కార

ములు, ప్రదక్షిణములు మున్నగువానిని నన్నిటినిగూడఁ గావింతురు 29. పుష్ప నారికేళాదులను సమర్పించి పంచాయతనపూజయు మృత్తికతో లక్షలకొలఁది లింగములను గావించి వానిపూజయు సాంగోపాంగముగాఁ జేయుదురు 30. మఱియు నియమ నిష్ఠావంతులై కష్టములను సహించి యుపవాసాది కర్మములను నొనర్తురు. కాని వారలీకర్మములయొక్క-ఫలమునుమాత్రమే పొందెదరు. మర్మముమాత్రము గ్రహించుటలేదు 31. హృదయమునందు ఫలాశ నుంచుకొని కొందఱు యజ్ఞయాగాదులు గావించుచున్నారు. ఇవియన్నియు ముందుజన్మమున ఫలముల నొందుటకై బయానాను (క్రయ నిర్ధారణమైనపిమ్మట నిశ్చయార్థకముగ ముందుఁ గొంతయిచ్చుసొమ్ము) పుచ్చుకొనుట వంటివి 32. నానాపరిశ్రమము లొనరించి పదునాలుగు విద్యల నభ్యసింతురు. వారలకావిద్యల సహాయమున సమస్త సిద్ధులును ఫలించును. అయినను సద్గురు కృపలేనిది వారికి సత్యమగు హితము ఎన్నఁటికిని గలుగఁబోదు. అంతియగాదు. వారలకు యమపురమునం దనుభవింపవలసిన యనర్థములలో నొక్క-టియుఁ దొలంగదు 33—34. వేయేల, మానవునకు జ్ఞానప్రాప్తి కలుగనంతవఱకు జననమరణములు నశింపవని రూఢిగా నమ్మవలయును. గురుకృప లేని వారల అధోగతియు గర్భవాసము తొలఁగిపోవఁజాలదు 35. బ్రహ్మ జ్ఞానము సమకూరనంతవఱకు ధ్యానము, ధారణము, ముద్ర, ఆసనము, భక్తి, భావము, భజనము మున్నగునవియన్నియు ఫలమునీయక యటులే యుండును 36. సద్గురుని కృపాభాగ్యమును బడయక యితర సాధన ములతో మునిఁగి తేలుచున్నవాఁడు, గ్రుడ్డివాఁడు త్రోవదెలియక కంద కములోనో గోతిలోనో కూలినటులఁ బడిపోవును 37. గుప్తమగు ద్రవ్యమును రత్నాది ఖనిజములను అంజనము వేసికొనినచోఁ గనిపెట్ట గలుగునట్లు సద్గురువాక్యముతో జ్ఞానము ప్రకాశమొందును 38. సద్గురుఁడు లేనివాని జన్మము నిష్ఫలము. సద్గురుఁడు లేనిమెడల నంతయు దుఃఖమయమే. సద్గురుఁడు లేనివాని కెన్నఁటికిని సంసారవ్యథ నివృత్తి కాఁజాలదు 39. సద్గురుని యనుగ్రహమువలననే పరమకారుణికుఁడగు నీశ్వరుఁడు ప్రసన్నుఁడగును. అంతియగాక యపారమగు సంసార దుఃఖము గూడ నాశనమగును 40. మనమేకాదుసుమా! పూర్వకాలమున మహా

త్ములు, సాధువులు, తపస్వులు, బ్రహ్మర్షులు అనిపించుకొన్న పుణ్యా త్ములుకూడ సద్గురుని సేవచేతనే జ్ఞానవిజ్ఞాన విచారణములు బడయఁ గలిగిరి 41. మహారాజగు శ్రీరామచంద్రమూర్తియు, మహాయోగియగు శ్రీకృష్ణమూర్తియు గురుభజనమునం దెంతయో తత్పరభావము గల వారై యుండిరి. సిద్ధులు, సాధువులు, మహాత్ములు నగువారలు పలువురు గురుసేవగావించి ధన్యులైరి 42. వేయినుడువులెందులకు ? సకలసృష్టిని నడపెడు బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులునై తము సద్గురుచరణసేవ నిరం తరము గావించుచునుందురు. సద్గురుని యెదుట నీ త్రిమూర్తులకుఁగూడ మహత్త్వము లేదు 43. మోక్షవాంఛగల మానవుఁడు సద్గురుని వెదుక వలయును. సద్గురుఁడు లేనివానికి మోక్షమెన్నఁటికి లభింపఁజాలదు 44. సద్గురుఁడు సాధారణులగు నితర గురువులవలె నుండఁడు. ఏలయన, అతని కృపవలన శుద్ధజ్ఞానము శిష్యుని హృదయమునఁ బ్రకాశించును 45. రాఁ బోవు సమాసమునందు సద్గురుని లక్షణము లేవియో సాకల్యముగాఁ జెప్ప బోవు చున్నాఁడను. శ్రోతలు ధ్యానపూర్వకముగా వినియెదరుగాక 46.

---

## రెండవ సమాసము – సద్గురుని లక్షణములు.

సామాన్యముగా జనులు గొప్పగొప్ప మహత్త్వములను జూపెడు వారలను గురువులని నుడివెదరు. కాని యట్టివార లెన్నఁటికిని మోక్ష ప్రదాతలగు సద్గురువులు గాఁజాలరు 1. సభాసమ్మోహన మంత్రములు, గారడివిద్య, భూతవైద్యము, బహువిధములగు అసంభవ చమత్కార ములును నేర్పి సంతోషమును గలుగఁజేయువారును 2, ఔషధప్రయో గము, రాసాయనిక సమ్మేళనము, కనుకట్టు కేవల దృష్టిచేఁ గోరిన వస్తువులను దాత్కాలముననే సమకూర్చు కౌశలము నేర్పువారును 3, సాహిత్యము, సంగీతము, రాగజ్ఞానము, గీతములు, నృత్యము, తానమాన ములు నేర్పువారును నొకవిధమగు గురువులు 4. పంచాక్షరీవిద్యయు నానావిధములగు భూతప్రయోగ మంత్రములు కుక్షింభరవృత్తికి అను వగు విద్యలు 5, జాతి కనుకూలమగు వ్యాపారము నేర్పి మానవుని దన పొట్టఁ దాను బోసికొనుటకుఁగాని నాలుగుడబ్బులు గడించుటకుఁగాని

నేర్పువారుగూడ గురువులే. కాని వాస్తవమునకుఁ జూచినచో వార లెన్నఁటికిని సద్గురువులు కాఁజాలరు 6. సత్యము విచారించినచోఁ దల్లి దండ్రులుగూడ గురువులే. భవసాగరమునుండి యుద్ధరించు సద్గురువు వీరిరువురుగాక వేఱుగనున్నాఁడు 7. గాయత్రీమంత్రము నుపదేశము జేయువాఁడుగూడ యథార్థమునకు గురువే. భవసాగరము దాటుట కనువగు జ్ఞానము నుపదేశించిన సద్గురుఁడు వేఱుగానున్నాఁడు 8. బ్రహ్మజ్ఞానము నుపదేశించి అజ్ఞానమును నిరసింపఁజేసి జీవశివుల కైక్యము గావించువాఁడును జీవత్వ శివత్వ కారణములవలన ఈశ్వరునియందును భక్తుని యందును గలిగిన భిన్నత్వమును దొలఁగించువాఁడును (పరమేశ్వరుని భక్తుని నేకముజేయువాఁడు) మాత్రమె సద్గురుఁడు 9–10. భవభయరూపియగు శార్దూలము పంచవిషయ రూపమగు దుముకులు దుముకుచు జీవరూపియగు దూడను ఈశ్వరరూపియగు నావునుండి లాగుచున్నది. ఆసమయమున నెవ్వఁడు జ్ఞానరూపమగు ఖడ్గముతో నాశార్దూలమును ఖండించి దూడను గాపాడి మరల నావుతోఁ గలిపివేయునో (జీవునకును శివునకును నైక్యము గావించునో) యాతఁడే సద్గురుఁడు 11. మాయాజాలములలోఁబడి సంసారదుఃఖములతోఁ బరితపించు ప్రాణులను ముక్తులఁ గావించునాతఁడును 12, వాసనారూపమగు నదీపంకమునందు దిగఁబడి భయపడుచున్న ప్రాణికడకరిగి దరిజేర్చువాఁడును 13, విజ్ఞానమును బ్రసాదించి గర్భవాససంబంధమగు మహాసంకటములను వారించి యిచ్ఛాబంధములను శృంఖలములను ద్రెంచివేయునాతఁడును 14, తన యుపదేశ ప్రభావముచే నాత్మదర్శనము శిష్యునకు ననుగ్రహించువాఁడును, అనాథులపాలిటికి రక్షకుఁడుగ నుండునాతఁడును సద్గురుఁడు 15. ఏకదేశీయుఁడగు (అంశరూపుఁడగు) జీవుని ప్రత్యక్షబ్రహ్మముగాఁ జేయువాఁడును, ఉపదేశమాత్రమున సంసారసంబంధమగు సమస్తక్లేశములను దూరముచేయువాఁడును 16, వేదములలోని గూఢతత్త్వమును శిష్యుని హృదయమునం దంకితము గావించువాఁడును సద్గురుఁడు 17. వేదములయొక్కయు, శాస్త్రములయొక్కయు, మహానుభావులయొక్కయు ననుభవమొక్కటియే. ఆ యనుభవమే సద్గురురూపము 18. సద్గురుఁడు సందేహములను మొదలంట నాశనముగావించును. స్వధర్మము నాదరపూర్వకముగాఁ బ్రతి

పాలనముజేయును. వేదవిరుద్ధములగు నన్యవిషయములను గురుమూర్తి యెన్నఁటికి దరికిఁ జేరనీయఁడు 19. తన చిత్తవృత్తి ననుసరించి నడచువాఁడు (తన మనస్సును జయింపలేని యాతఁడును) ఎన్నఁటికిని సద్గురువు కాఁడు. వాఁడొకవిధమగు బిచ్చగాఁడు. లోభమునకు లోనై శిష్యుల వెంటఁ దిరుగు పాపగ్రహమని వానిని జెప్పవచ్చును 20. శిష్యులను సాధనములలోఁ బ్రవేశ బెట్టక, యింద్రియదమనము జేయింపక, తనపని తాను జూచుకొను కపటగురువులు గవ్వకు ముప్వురు దొరకినను బరిగ్రహింపరాదు 21. జ్ఞానము కొఱకై శిష్యునకు బోధచేయు వాఁడును, అవిద్యను మొదలంట నాశనము చేయువాఁడును, ఇంద్రియ దమనము గావించువాఁడును సద్గురుఁడని గ్రహింపుము 22. కేవలము ద్రవ్యముకొఱకుఁ దనను శిష్యునకు విక్రయించుకొనినవాఁడును, దురాశా బద్ధుఁడై శిష్యులకడ దీనరూపముతో నను గ్రహార్థియై యుండువాఁడును గురువుగాఁడు 23. పాపదాయకమగు కామమునకు బద్ధుఁడై వర్తించు వాఁడును, శిష్యుని మనస్సుననుసరించి నడచుచు నాతని దృప్తిపరచుటయే తన కర్తవ్యముగా భావించువాఁడును, శిష్యునికడ నణఁగిమణఁగి ప్రవర్తించునాతఁడును గురువుగాఁడు. వాఁడు మహాధమాధముఁడు, దొంగ, మోసగాఁడు, పాపి, ద్రవ్యవ్యసనియని చెప్పఁదగిన వాఁడు 24-25. దురాచారియగు వైద్యుఁడు రోగి మనస్సు ననుసరించి వర్తించుచు వాని సర్వస్వము హరించుటయేగాక యంత్య మున దయ్యమై వాని ప్రాణములనుగూడఁ గైకొనునట్లు ద్రవ్యవ్యసనశీలుఁ డగు పాపిష్ఠిగురువు శిష్యుని గోరువంకదువ్వులు దువ్వి వానినింకను సంసార బంధనములలోఁ బడవేయును. పరమాత్మునితోఁ గలియనీయఁడు. ఇట్టి గురుని పరిచయము వలదు. అపాయకరము 26-27.

శుద్ధబ్రహ్మజ్ఞానియైయుండియుఁ గర్మయోగిగా (సత్కర్మము లాచ రించువాఁడుగ) నుండువాఁడే సద్గురుఁడు. అతఁడే శిష్యునకుఁ బరమార్థ దర్శనము గావింపఁ దగినవాఁడు 28. బాహ్యాడంబరములను జూపుటకు జెవిలో నేదియో మంత్రమునూదుటకుఁ దగిన మిడిమిడిజ్ఞానముగలవాఁడు పాపిష్ఠిగురువు. వాఁడు పరమాత్మునకు విరుద్ధుఁడు 29. గురుప్రతీతి శాస్త్రప్రతీతి ఆత్మప్రతీతియను నీమూఁడింటి యనన్యత మెవనియనుభవ

మునకు వచ్చియున్నదో (గురునిభాషణము, శాస్త్రవాక్యము, స్వానుభ
వము అనువాని సహాయమున ఒకే విషయము గ్రహించెనో) యతఁడే
సద్గురుమూర్తి. మోక్షము నపేక్షించువార లిట్టి సద్గురుని సన్నిధిలోనికె
పోవలయును 30. అద్వైతనిరూపణము గావించుటలో నగాధవక్తగా
నుండి విషయలోలత్వమునఁ జిక్కుకొని చెడిపోయిన గురునివలన సాధకున
కెన్నఁటికిని శుభము కలుగఁజాలదు 31. అనుభవజన్యమును, నిశ్చయా
త్మకమును నగు నిర్మలజ్ఞానము లేకపోవుటచే నేప్రసంగమువచ్చిన నాప్రసం
గమున కనుకూలముగాఁ గొంచముకొంచము చెప్పనేర్చిన వేషధారియగు
వంచకు డెన్నఁటికిని గురువుకాఁడు 32. అధ్యాత్మనిరూపణము గావించు
నపుడు సామర్థ్యసిద్ధుల విషయమువచ్చినయెడల హృదయమున దురాశ
గలవాఁడును, బహువిధములగు చమత్కారస్థితిగతులలోఁ జంచల
హృదయుఁడై వర్తించువాఁడును, మత్సరకారణమున "పూర్వకాలమునం
దీశ్వరునితో సమానమగు సామర్థ్యముగలిగిన విరక్తులు, భక్తులు,
జ్ఞానులు గతించిరి. వారిసామర్థ్యమెక్కడ? మన యీ వ్యర్థజ్ఞానమెక్కడ?
మాయందుఁగూడ నట్టి సామర్థ్యమున్నచో బాగుండునుగదా" యని
హృదయమున లోభప్రేరితుఁడై తలంచువాఁడును సద్గురుడుకాఁడు33-35.
ఎప్పుడు దురాశ పూర్తిగానశించిపోయినదో అపుడే యీశ్వరుఁడులభించును.
దురాశలకు లోనై యుండువారలు క్షుద్రులు, కాముకులు, శబ్దజ్ఞాతలు
నై యున్నారు. అంతియగాని వారు సద్గురువులు కాఁబోరు. సత్య
మిద్దియే 36. దురాశయుఁ గామ్యవాంఛయుఁ బలువురు జ్ఞానులను
మోసగించి నశింపఁజేసెను. పాపము! కొందఱు మూర్ఖులు కామ్యములను
గోరుచునే మరణించిరి 37. కామ్యవాంఛ హృదయమున రవ్వంతయే
నియు లేనివాఁడును తనమతము నక్షయముగా నలౌకికముగాఁ బ్రతిష్ఠిం
చినవాఁడును నగు సాధుమూర్తియైన సద్గురుఁ డెచటనో వేఱుగా
నున్నాఁడు 38. ఆత్మరూపమగు ధనమున్నదో అందఱికిని నక్షయముగా
నున్నది. (అందఱికడనున్న ఆత్మయు నక్షయమే) కాని శరీరముమీఁది
మమత్వము వీడిపోవదు. ఈ కారణముననే యీశ్వరమార్గము నందఱును
మఱచిపోవుచున్నారు 39. సామర్థ్యము సిద్ధి ప్రాప్తమైనంతన దేహ
మహత్త్వ మధికమైనదని సామాన్యజనులు భావించుచున్నారు. ఈకారణ

ముననే దేహబుద్ధియొక్క యభిమానము మఱింత యభివృద్ధి నొందు చున్నది 40. అక్షయసుఖముమాట తలపెట్టక వ్యర్థమగు సామర్థ్యము కొఱకుఁ బ్రాకులాడువాఁడు మూర్ఖుఁడు. ఏలయన, కామ్యవాంఛకు సమానమగు దుఃఖమీప్రపంచమున వేఱొకటిలేదు 41. కామ్యములకు వశులై యున్న యీశ్వరభక్తి రహితులు నానావిధములగు యాతనల ననుభవించి కడకధోగతి నొందుదురు 42. శరీరము నశించుటతోడనే సామర్థ్యముగూడఁ దొలఁగిపోవును. మఱియు నంత్యకాలమునందు మనుజుఁడు కామ్యవాంఛలకతన నీశ్వరునిచే వంచితుఁడగును 43. కావున నిష్కాముఁడును దృఢబుద్ధిశాలియు నైనవాఁడే సద్గురుఁడు. అతఁడే తనశిష్యులను భవసాగరమునుండి దరిజేర్చును 44. మొదట విమలమగు విజ్ఞానము నిశ్చయాత్మికమగు సమాధానము స్వరూపస్థితియు యోగ్యముగానున్నవాఁడే సద్గురుఁడు. ఇవియే సద్గురుని ముఖ్యలక్షణములు 45. ఇంతియగాక సద్గురునియందుఁ బ్రబలమగు వైరాగ్యము, ఉదాసవృత్తి (దేనికిఁదగులమి) యుఁగూడ నుండవలయును. మఱియు నాతఁడు స్వధర్మాచరణమునందు విశేషించి శుద్ధుఁడుగఁగూడ నుండవలయును 46. ఇంతయున్నమీఁదట నిరంతరము అధ్యాత్మశ్రవణము హరికథానిరూపణము పరమార్థవివరణము చేయుచుండువాఁడే సద్గురుఁడు 47. సారాసారవిచారము గావించిన సద్గురుఁడు శిష్యులనెగాదు జగత్తునుగూడ నుద్ధరింపఁగలఁడు. జనుల నుద్ధరించుటకు సద్గురునకు నవవిధభక్తులుగూడ నవసరము. ఏలయన, భక్తిసహాయమునఁ బ్రజలను లోఁబఱచికొను నవకాశము కలుగును 48. కావున నవవిధభక్తులను సాధనముగావించువాఁడే సత్యమగు సద్గురువని నేను చెప్పుచున్నాఁడను 49. అంతఃకరణమునందు శుద్ధమగు బ్రహ్మజ్ఞానముండియు బాహ్యమునకుఁ బరమాత్మని నిష్ఠాపూర్వకముగా భజించువాఁడె సద్గురుఁడు (లోపల జ్ఞానయోగముతోనుండి వెలుపల కర్మయోగ మాచరించువాఁడు). అతని మూలమున నీ ప్రపంచమంతయు నుద్ధరింపఁబడును 50. ఉపాసనాధారము లేనివానికడఁ బరమార్థ మొకదినముననే జారిపోవును. ఏలయన, కర్మయోగము లేకున్నచో అనాచారము వ్యాపించును. అందువలన జనులు సులభముగ భ్రష్టులయ్యెదరు 51. కావున జ్ఞానము, వైరాగ్యము, భజనము, స్వధర్మకర్మము, సాధనము,

కథానిరూపణము, శ్రవణము, మననము, నీతి, న్యాయము, మర్యాద అనువానిలో నేది తక్కువయైనను అలక్షణత్వ మేతెంచును. కావున నీ గుణములన్నియుఁ గలిగి శోభించువాఁడు సద్గురుఁడు. సద్గురుఁడగు వానియం దీగుణములన్నియు విరాజిల్లుచుండును 52 — 53. సద్గురుఁ డనేకులను బరిపాలించును. ఆయనకు అనేకులను గూర్చిన చింత హృదయమునం దుండును. సమర్థుఁడగు సద్గురుసన్నిధిలో బహువిధములగు సాధనల కవకాశము కలుగును 54. కర్మయోగసాధనములు లేకయే పరమార్థమును బ్రతిష్ఠించుకొనఁ జూచువాఁడు మిగులఁ తొందరలో భ్రష్టుఁడగును. కావుననే మహానుభావులగు పురుషులు మొదటినుండియు విచారించి కర్మ యోగసాధనము చేయుచుందురు 55. ఆచారము ఉపాసనము విడిచివేసిన వారలు భ్రష్టులు. అంతియేగాదు భక్తిహీనులుగూడ నగుదురు. ఇట్టి వారల గురుత్వము నిష్ఫలము. వీరి నెవ్వరడుగుదురు? 56. కర్మము ఉపాసనము లేనితావున ఉద్రేకమునకుఁ దావేర్పడును. ఇట్టి కళంకులగు గురువులను జూచినచో జ్ఞానులదనుకఁ బోనేల? సంసారులగు గృహస్థులు సైతము పకపక నవ్వెదరు 57.

నీచజాతిగురువు నేర్పఱచుకొనుటగూడ గొప్ప కళంకము. నీచజాతి గురుఁడు బ్రహ్మజ్ఞానులసభలలో దొంగవలె దాఁగియుండును 58. బ్రహ్మసభయం దాతని పాదతీర్థము నెవ్వరును బరిగ్రహింపరు. ఆతని ప్రసాదమును స్వీకరించినయెడలఁ బ్రాయశ్చిత్తముగూడఁ జేసికొనవలెను 59. తీర్థప్రసాదమును బరిత్యజించుటచే నీచత్వము ప్రకటనమగును. వెంటనే సాధకుల కాతనియెడల గురుభక్తిలోప మేర్పడును 60. ఒకవేళ నాతనిపయి గురుమర్యాదనుంచినయెడల బ్రహ్మజ్ఞానిబృందము ప్రసన్నభావమును విడుచును. బ్రహ్మత్వరక్షణము గావింప యత్నించినయెడల గురుఁ డప్రసన్నుఁడగును. నీచుని గురునిగాఁ జేసికొనుటచే నిట్టితగవు లింకనెన్నియో తటస్థించును 61. ఈ విధముగా నుభయపక్షములనుండి సంకటములు వచ్చినయెడల సాధకునకుఁ బశ్చాత్తాపము కలుగును. అందుచే నీచజాతులకు గురుత్వము నొసంగరాదు 62. ఒకవేళ నెవనికేని నీచజాతి గురువుమీఁద మనస్సు లగ్నమైనయెడల స్వయముగాఁ దానే భ్రష్టుఁడగుట మంచిది. తనతోఁబాటుగా ననేకులను భ్రష్టులనుఁ గావించుట

మంచిదిగాదు 63. ఇఁక నిప్పు డీవిచారము నటులుంచుదము. ఇంతకును సాధనకు స్వజాతిగురుఁడు కావలయును. లేనియెడల భ్రష్టాచారము తప్పక వ్యాపించును 64.

ప్రపంచమున నెన్ని సద్గుణములుగలవో యవియే సద్గురులక్షణ ములు. సద్గురుఁడన నెవరో సాధకులు సులభముగా గుర్తించుటకై కొందఱు గురువుల నిచ్చట వర్ణించెదను 65. ఒకఁడు సాధారణగురువు. ఒకఁడు మంత్రము నేర్పెడిగురువు, ఒకఁడు యంత్రముజూపు గురువు. వేఱొకఁడు తాంత్రికుఁడగు గురువు. ఒకనిని జనులందఱును గురువందురు. ఇంకనొకఁడు రాజగురువుగఁగూడ నుండును 66. ఒకఁడు కులగురువు. ఒకఁడు మర్యాదగురువు. ఒకఁడు విద్యనేర్పినగురువు. అటులె కువిద్యనేర్పిన వాఁడుగూడ గురువె. ఒకఁడు అసద్గురుఁడు. ఒకఁడు జాతిగురువు. ఈ జాతి గురువు దండనకర్తగఁగూడ నుండును 67. తల్లి యొక గురువు. తండ్రి యొకగురువు, రాజొకగురువు. దేవత యొకగురువు. ఒకనిని సమస్తకళల నెఱింగిన జగద్గురుఁ డందురు 68. ఈ విధముగాఁ బదునేడ్గురు గురువులను జెప్పితిని. వీరలుగాక యింక నెందఱో గురువులున్నారు. వారినిగూడఁ దెలుపుదును 69. ఒకఁడు స్వప్నగురుఁడు. (కలలోఁ గన్పించి ధర్మమార్గ మెఱింగించును.) కర్మదీక్ష నొసంగువాఁ డొకగురువు. కొందఱు ప్రతిమనే గురువుగా భావింతురు. ఇఁకఁగొందఱు తమకుఁదామే గురువులమని చెప్పు కొందురు 70. ఏజాతి కేయేవ్యాపారములు గలవో వానివానికి గురువులు ప్రత్యేకించియున్నారు. ఈ నిర్ణయము చాలగొప్పది 71.

ఈ విధముగా నెందఱో గురువులున్నారు. ఇది నానావిధమత విచారము. ఇందఱు గురువులలోఁజేరక మోక్షదాతయగు సద్గురుఁడు వేఱుగానున్నాఁడు 72. సద్విద్యాసంబంధములగు సుగుణములు దయయు నిరంతరముగాఁగల సుకృతాత్ముఁడే సత్యమగు గురువుగా నెఱుంగఁదగిన వాఁడు 73.

## మూఁడవ సమాసము — శిష్యలక్షణము.

గత సమాసమునందు సద్గురు లక్షణములు విస్తరించి చెప్పితిని. ఇపుడు సచ్ఛిష్యుని లక్షణములను జెప్పఁబోవుచున్నాఁడను, శ్రోతలు

సావధానమతితో వినఁగోరెదను 1. సద్గురుఁడు లేనిది సచ్ఛిష్యుని యుపయోగ మెద్దియునులేదు. అంతియగాక సచ్ఛిష్యుఁడు లేనిచో సద్భక్తుని పరిశ్రమమంతయును వ్యర్థమగును 2. సారవంతము నుత్తమమునగు భూమిని వెదకి యందుఁ జిలికిపోయిన విత్తనములను నాఁటినయెడలను లేక చవిటి పఱ్ఱయందు ఉత్తమబీజములు పెట్టినయెడలను నెట్టిస్థితి కలుగునో యట్టిస్థితి సచ్ఛిష్యున కసద్గురునియొద్దను, అసచ్ఛిష్యునకు సద్గురునియొద్దను గలుగును 3. ఉదాహరణము చెప్పెదను. సచ్ఛిష్యుఁడు సత్పాత్రుఁడై వాని కసద్గురువు ప్రాప్తమగుటచేఁ దంత్రములు, మంత్రములు చెప్పును. అందుచే నాశిష్యునకు ఇహలోకముగాని, పరలోకముగాని సిద్ధింపదు. లేదా — గురుఁడు పూర్ణముగాఁ గృపఁజూపును. శిష్యుఁడు అనధికారి ఈ గురుశిష్యన్యాయము భాగ్యవంతుఁడగు పురుషునకు భికారుఁడు పుత్రుఁడున్నటుల నుండును 4-5. సారాంశమేమన — గురువు శిష్యులు యోగ్యులు కానేని కార్యము నడువఁజాలదు. గురువు శిష్యులు సరిగా సమకూరనియెడలఁ బరమార్థము కుదురదు 6. సద్గురునకు సచ్ఛిష్యునకు సంబంధము కుదిరినతావున నిఁకఁ బరిశ్రమతోఁ బనియేలేదు. అనాయాసముగనే యుభయుల యుత్సాహమును నెరవేరును 7. మంచిది ఇపుడు. ఉత్తమమైనభూమియు సారవంతమగు విత్తనములు లభించినవి. కాని సకాలమున వర్షము కురియకున్న పైరతుకదు. ఇటులె సద్గురువు సచ్ఛిష్యుఁడు కూడినపిమ్మట సైతము అధ్యాత్మనిరూపణము లేనిచోఁ గార్యము నెరవేరదు 8. ఇప్పుడు పొలమునందు విత్తనము వేయఁబడినది. బాగుగా మొలచినది — కావలిలేనిచోఁ బైరునకు హానికలుగును. ఈ స్థితియే సాధనములేని సాధకులకుఁ గలుగును 9. సారాంశమేమన — ఎంతదనుకఁ బంట మనయింటికి చేరదో యంతదనుకఁ జేయవలసినదెల్లఁ జేయక తప్పదు. వేయేల, ఆ పంట వచ్చినపిమ్మటఁగూడ నూరకకూర్చుండ రాదు 10. అటులే ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మటసైతము సాధనము జేయుచునే యుండవలయును. ఒక్కసారి మిక్కుటముగా భుజించినను అనంతరమునందుసైతము భోజనసామగ్రితో నవసరము కలుగునటులఁ బూర్ణముగా ఆత్మజ్ఞానము కలిగిన తరువాతఁగూడ సాధనము ముందు నడిచి పనినిచ్చుచునేయుండును 11. కావున సాధనము, అభ్యాసము,

సద్గురుఁడు, సచ్ఛిష్యుఁడు, సచ్ఛాస్త్రవిచారము, సత్కర్మము, సద్వాసన, సదుపాసన, సదాచరణము, స్వధర్మనిష్ఠ, సత్సంగము, సత్యనియమము మున్నగునవియన్నియు నొకచో నేకత్రితమైనపుడే విమలమగు విజ్ఞానము ప్రకాశించును. అటులఁగాకున్నచో జనసముదాయమునందు పాషండత్వము విజృంభించును 12-14. కాని యిందు శిష్యుని దోషమెద్దియును లేదు. తాళఁపుఁజెవియంతయు సద్గురునికడనున్నది. సద్గురుఁడు నానావిధములగు ప్రయత్నము లొనరించి శిష్యునియెడఁగల సమస్తదుర్గుణములను దూరముచేయును 15. సద్గురునిమూలమున శిష్యుఁడు సచ్ఛిష్యుఁడగును. సచ్ఛిష్యునివలన నసద్గురువెన్నటికిని సద్గురువు కాఁజాలడు. ఏలయన, సచ్ఛిష్యునివలన అసద్గురుని గొప్పతనము పోవును. శిష్యుని సంబంధముచే గురుఁడు సద్గురువయ్యోనేని గురునకు గురుత్వ మెక్కడనుండివచ్చును? 16 కావున సద్గురుఁడు లభించినయెడలనే సన్మార్గము లభించును. లేనియెడల శిష్యుఁడు నాస్తికత్వమువలన సర్వనాశనమగును 17. భవసాగరమునుండి దరికిఁ జేర్చుటలో బూర్ణబాధ్యుఁడు గురుఁడైయెనను నేనిచ్చటఁ గొన్ని సచ్ఛిష్యలక్షణములను దెలుపుదును 18.

సద్గురుని వాక్యములయందుఁ బూర్ణవిశ్వాసముంచి యనన్యభావముతో నాతని శరణమునందుండుట సచ్ఛిష్యుని ముఖ్యధర్మము 19. శిష్యుఁడు పవిత్రాంతరంగుఁడు, సదాచార సంపన్నుఁడు, విరక్తాత్ముఁడు, మోక్షాసక్తుఁడు గావలయును 20. శిష్యుఁడు నిష్ఠావంతుఁడును, శుచిమంతుఁడును, సర్వవిధముల నియమవంతుఁడును 21, విశేష ప్రయత్నశీలుఁడును, పరమదక్షుఁడును, నలక్ష్యపదార్థమున లక్ష్యముంచెడివాఁడును 22, అతి ధైర్యశాలియు, అత్యుదారుఁడును, బరమార్థ తత్పరుఁడును 23, పరోపకారియు, నిర్మత్సరుఁడును, నర్థము నవగాహనము గావించుకొనువాఁడునుగా నుండవలయును 24. అంతియెగాక పరమశుద్ధాత్ముఁడుగను, బరమ సావధానుఁడుగను, అంతులేనిరీతిగ నుత్తమ గుణములు గలవాఁడుగను 25, ప్రజ్ఞావంతుఁడుగను, ప్రేమస్వభావుఁడుగను, మర్యాదావంతుఁడుగను, నీతిమంతుఁడుగను 26, యుక్తిమంతుఁడుగను, బుద్ధిమంతుఁడుగను, నిత్యానిత్యములను (సత్ అసత్) విచారించువాఁడుగను 27, ధైర్యశాలిగను, దృఢవ్రతుఁడుగను, కులవంతుఁడుగను,

పుణ్యాత్ముఁడుగను 28, సాత్వికుఁడుగను, భజనచేయువాఁడుగను, సాధన కర్తగను నుండవలయును 29. మఱియు శిష్యుఁడు విశ్వాసవంతుఁడుగను, దేహక్లేశము సహించునంతటి సహనశీలుఁడుగను, బరమార్థము నున్నతికిఁ దేఁదగినవాఁడుగను, సమస్తధర్మముల నెఱింగినవాఁడుగను 30, అన్ని విధములను సత్పాత్రుఁడుగను, స్వతంత్రుఁడుగను, సర్వజన ప్రియుఁడుగను 31, సద్విద్యావంతుఁడుగను, సద్భావవంతుఁడుగను, శుద్ధాంతఃకరణుఁడుగను నుండవలయును 32. శిష్యుఁడవివేకి కాఁగూడదు. పుట్టుక మొదలు సుఖము లనుభవించినవాఁడుగ నుండఁదగదు. మఱియు నాతఁడు సంసారదుఃఖముచేఁ సంతప్తదేహుఁడైనవాఁడుగ నుండవలయును 33. ఏలయన, సంసారదుఃఖములచేఁ బరితప్తుఁడై త్రివిధ తాపములతోఁ గృశించినవాఁడై సర్వవిధములఁ బరమార్థమును బొందుటకుఁ దగిన యధికారియై యున్నాఁడు* 34. సంసారదుఃఖములవలననే మానవునకు వైరాగ్య ముదయించుచున్నది. విశేషించి దుఃఖము లనుభవించినవాని హృదయమునందే పరమార్థము దృఢముగాఁ బాదుకొనును 35. సంసారమునందు దుఃఖముల ననుభవించినవానికిఁ బరమార్థమునందు విశ్వాసముగలుగును. మఱియు వాఁడు విశ్వాసబలముతో దృఢహృదయుఁడై సద్గురుని శరణమును గైకొనును 36. అవిశ్వాసముతో సద్గురుని శరణమును విడనాడువారు ఈ సంసారసాగరమునఁబడి మునిఁగిపోయిరి. వారిని సుఖదుఃఖ రూపములగు జలచరములు మధ్యనే నమలి మ్రింగివేసెను 37. కావున సద్గురుని వచనములపయి దృఢమగు విశ్వాసభావముగలవాఁడు సచ్ఛిష్యుఁడు. వాఁడె యందరికంటె ముందుగా మోక్షమును బడయుట కధికారి 38. సద్గురుని వచనముల నాలించి సంతుష్టుఁడగు మానవుఁడు సాయుజ్యముక్తి నొందును. ఆతఁడు సంసారదుఃఖమువలన నెన్నఁడును బరితపింపఁడు 39. సద్గురుని (నిర్గుణపరబ్రహ్మము) కంటె దేవతను (సగుణ

* మనుజుఁడు సంసారదుఃఖములలో మునిఁగి తాపత్రయముతోఁ దప్తుఁడైనప్పుడు "ఈ సంసారములోనున్నవఱకీయవస్థ తొలఁగదు. కావునఁ గష్టమయమగు నీ సంసారము తొలఁగిపోవువిధ మేదేని కలదాయని విచారింపవలయును" అని యీ విధముగ జిజ్ఞాస యధికమగును. ఇదియే పరమార్థమున కధికారము గలుగుట. ఈ యంశము నిఁక ముందు వివరించెదము.

హరిహరాది దేవతలను) ఎక్కువుగా భావించువాఁడు అభాగ్యుఁడు. వాఁడు వైభవములకు సామర్థ్యములకు మురిసి శాశ్వత సుఖమునుండి (సత్యవైభవమునుండి) వంచితుఁడగుచున్నాఁడు 40. సద్గురుఁడు సత్స్వరూపుఁడు (నిత్యుఁడు) హరిహరాదిదేవతలో కల్పాంతమునందు నాశన మైపోయెడివారు. మోసమునకు లోనై గురునికంటె గొప్పవారని తలంచిన యీ దేవతల సామర్థ్య మిఁక నెచట నుండుగలదు? 41. కావున సద్గురుని సామర్థ్యమునకు మేరయే లేదు. ఆతనిముందు బ్రహ్మవిష్ణుమహేశ్వరాదు లొకలెక్కలోనివారు కారు. కాని అల్పబుద్ధులగు మానవులకీ రహస్యము తెలియదు 42. సద్గురుమూర్తిని సామాన్య గురువులతోడను దేవతలతోడను సమానుఁడుగాఁ దలంచు శిష్యుఁడు దురాచారి. వాని యంతఃకరణమునందు భ్రాంతి స్థిరముగా నెలకొనియున్నది. వానికి సిద్ధాంతములు తెలియవనవచ్చును 43. మనుష్యులమూలముననే శిలలకు దేవతాభావన కలిగినది. మంత్రములవలన నా శిలలకు దేవత్వ మేర్పడినది. సద్గురునియం దటుల మహత్త్వ మొకరు కల్పింపలేదు. ఈశ్వరుఁడు సైతము కల్పింపజాలఁడు 44. కావున సద్గురుఁడు ప్రభావమునందును, బూర్ణరూపమునందును దేవతలకంటెఁ గోటిరెట్లు గొప్పవాఁడు. సద్గురుని వర్ణించుటలో వేదశాస్త్రములలోఁగూడ వివాదము చెలఁగినది 45. సద్గురుపదము ముందు నితరు లెవ్వరికిని మహత్త్వము లభింపఁజాలదు. గురునిముందు దేవతాసామర్థ్య మొకలెక్కలోనిది కాదు. అది మాయాజనితము 46. సద్గురుని యనుగ్రహము బడసిన శిష్యునియొద్ద దేవతల సామర్థ్య మించుకేనియు లెక్కలోనికి రాదు. సద్గురుఁడు తన జ్ఞానబలముచే నెంతటి వైభవమునేని గడ్డిపరకతో సమానముగా భావించును 47. సద్గురుని యనుగ్రహాతిశయమున అపరోక్షజ్ఞానము కలుగును. అనంతరము మాయాసహితమగు నీ బ్రహ్మాండము తుచ్ఛముగాఁ గనిపించును 48. సద్గురుని వచనములయందు దృఢభావ ముంచుటచే సచ్ఛిష్యుఁడు స్వయముగా దేవాధిదేవుఁ (సద్గురు) డగుచున్నాఁడు 49. సచ్ఛిష్యుల యంతఃకరణము మొట్టమొదట సంసారదుఃఖమువలని పశ్చాత్తాపముచే దప్తమై శుద్ధియయ్యెను. కాన వారలిఁక సద్గురుని యుపదేశామృతమును దనివారఁ గ్రోలి అక్షయశాంతిని నొందఁగల్గు

దురు 50. సద్గురుఁడు చూపిన మార్గము ననుసరించి నడుచునపుడు సమస్త బ్రహ్మాండము విరుద్ధమైనను శిష్యునకు గురుభక్తియం దేమాత్రము వ్యతిరేకము కాఁజాలదు 51. సచ్ఛిష్యుఁడు సద్గురుని శర ణ్యము నెప్పుడును విడువఁజాలఁడు. మఱియు సదాచరణుఁడై యీశ్వర దృష్టిలోఁ బవిత్రుఁడుగ నుండును 52.

పయినిజెప్పఁబడిన సద్గురు విషయికసద్భావము హృదయము నందుఁ గలవారలే ముక్తికి భాగస్వాములు. ఇతరమాయావేషధారులగు వంచకులను అసచ్ఛిష్యులుగా భావింపవలయును 53. విషయములయందు సౌఖ్యమున్నటులఁ దలంచువారును బరమార్థము కేవలము లోకాచార మునకేయని తలంచువారును నగు శిష్యులు చదివినమూర్ఖులు. అట్టివారు క్రమముగా నొకరినిజూచి యొకరుగా సద్గురుని శరణమున కేగుదురు 54. విషయేచ్ఛలు తొందరించుట కారంభింపఁగనే వానిధాటికి నిలువఁజాలక దుర్బలహృదయులగు శిష్యులు గృహస్థాశ్రమములోనికిఁ బరతెంతురు. అంతటితో వారలు గడించిన పరమార్థఫలము మలినమైపోవును 55. అంతతో నాగక పరమార్థమును వ్యాజముగాఁగొని ప్రపంచమునందుఁ బ్రేమయుంతురు. కుటుంబభారమును మోయఁజాలక కడకు సర్వవిధముల నాశనమైపోయెదరు 56. వారు ప్రపంచమునందు ఆనందమున్నటుల మనసార నమ్మి పైకిమాత్రము పరమార్థకౌతూహలమును జూపుచుందురు. అంతియగాక భ్రాంతులు, మూఢులు, మందమతులునై బహువిధ కామ్య వాంఛలతో లుబ్ధులగుదురు 57. పందిని సుగంధలేపనముతోఁ బూజించి నను, గేదెకుఁ జందనమలఁదినను వ్యర్థమగునటుల విషయవాంఛాశీలురగు పురుషులకు బ్రహ్మజ్ఞానముగాని, వివేకమునుగాని బోధించుట వ్యర్థప్రయ త్నము 58. బూడిదలోఁ బొరలాడు గాడిదకుఁ బరిమళసుగంధద్రవ్య ముల విలువయు జీఁకటిలోఁ బరుగులువారు గ్రుడ్లగూబకు హంసతో సమానగౌరవము నెట్టివో విషయసుఖములకై పలవించువారలకు భగవ ద్భక్తియు సత్సాంగత్యమును నట్టివి. ఇట్టివారలు తప్పక అధోగతినే పొందుదురు 59-60. కుక్కకు యెముక చిక్కినంతన పండ్లు బయటికిఁదీసి కొఱుకుచుండునట్లు విషయలోలుఁడగు పురుషుఁడు విషయభోగములలో మగ్నుఁడై యుండును 61. అటులనెముకలు కొఱుకుచున్న కుక్కకు నుత్తమ

భోజనము పెట్టినను గోతిని సుందరమగు సింహాసనముమీఁద నెక్కించినను ఏస్థితి కలుగునో యాస్థితియే విషయాసక్తుఁడగు పురుషునకు జ్ఞానోపదేశము గావించుటచేఁ దటస్థించును 62. గాడిదలను బెంచిపెంచి జీవితకాలమంతయు గడుపుకొన్న చాఁకివాఁడుఁ బండితబృందమునఁ జేరుట కసర్హుఁడై నటుల విషయవాంఛల నభివృద్ధి యొనరించుకొనిన పురుషుఁడు పరమార్థమును స్మరించుటకేని తగఁడు 63. బొల్లిగ్రద్ద రాజహంసములమధ్య చేరి నేను రాజహంసమును రాజహంసముననని చెప్పుకొనుచున్నను దాని ధ్యానమంతయు నపరిశుభ్రపదార్థములమీఁదనే యుండును. అటులే విషయాసక్తపురుషుఁడు సజ్జనులమధ్యనుండి తాను సజ్జనుఁడనని పిలిపించుకొనుచున్నను ఆతఁడు తన హృదయమునుమాత్రము విషయరూపమగు మలినముమీఁద నుంచును 64_65. ఎవఁడేని తన చంకలో స్త్రీ నుంచుకొని మహాత్ములవద్దకేగి నన్ను సన్యాసినిగాఁ జేయుఁడని పలుకుట యెటులుండునో విషయములలోఁ జిక్కియున్న పురుషుఁడు జ్ఞానవాక్యములను వల్లించుట యట్లుండును 66. ఇట్టి తెలిసినమూర్ఖులు అద్వైతసుఖమును (బ్రహ్మానందమును) ఏమి యెఱుంగఁగలరు? వీరలు బాగుగా నెఱింగియు నరకమునఁ బడుచున్నారు 67. వేశ్యాసేవ గావించువాఁ డుపదేశమునకుఁ దగనియటుల విషయసేవకుఁడగు పురుషుఁడు భక్తశ్రేష్ఠుఁడని యనిపించుకొనఁజాలఁడు 68. కావున విషయలోలురగు పురుషులకు జ్ఞానము కలుగదు. వారు వాచాటులై కేవల ముపన్యాసములకె యలవాటుపడియుందురు 69. ఇట్టి శిష్యులను నష్టాత్ములుగను, మిగుల నీచులుగను, హీనులుగను, అవివేకులుగను, దుష్టులుగను, దుర్మార్గులుగను దలంపవలయును 70. పాపపూర్ణులును, మహాపరాధులును, అత్యంతకఠినహృదయులును నగు నిట్టి శిష్యులు పశ్చాత్తాపతప్తులగుటకు మంచిప్రాయశ్చిత్తముగలదు71. అదియేదన,వీరలు మరల సద్గురుని చరణమున కరుగవలయును. ఆతనిని బ్రసన్నాత్మునిగా నొనరించుకొనవలయును. వాని యనుగ్రహమును సంపాదించి పరిశుద్ధాత్ములు కావలయును 72. ఏలయన; స్వామిద్రోహియగువాఁడు సూర్యచంద్రులున్నంతవఱకు నరకమునఁబడును. స్వామిని బ్రసన్నాత్ముఁ గావించుకొనకున్నచో వాఁడు కడతేరుట కవకా

శము లేదు 73. * శ్మశానవైరాగ్యము నవలంబించి సద్గురుని పాదముల పయి బడినంతమాత్రమున జ్ఞానము స్థిరముగా బాదుకొనఁజాలదు 74. మనస్సులోఁ గల్పిత గురుభావములను దెచ్చిపెట్టుకొని కొందఱుశిష్యులు గురునికడ మంత్రము గ్రహించి యా మంత్రకారణమున మూన్నాళ్ల పట్టు పగలు శిష్యులుగ నుందురు 75. ఇటులె పలువురు గురువులనుజేసికొని యేవియో పాషండపదములు నేర్చుకొని నోటిగద్దరితనము సిగ్గులేమితనము గల పాషండులై చెడిపోవుచున్నారు 76. ఈ యవివేకులు తమ ప్రమాదము నెఱింగి యెుకప్పుడేడ్తురు. ఒకప్పుడు పడిపోవుదురు. కొంచెము సేపు వైరాగ్యమూర్తులగుదురు. మఱికొంచెముసేపు నేనే జ్ఞానినని గర్వింతురు 77. ఒక గడియకాలము హృదయమునందు విశ్వాసము దెచ్చుకొందురు. రెండవ గడియయందే తిరుగఁబడుదురు. ఈవిధముగాఁ బిచ్చివానివలె అవివేకులగు శిష్యులు నానావేషములు వేయుదురు 78. కామము, క్రోధము, మదము, మత్సరము, లోభము, మోహము, అభిమానము, కపటము, తిరస్కారము లోనగు ననేకవికారములు వారలహృదయములలో వ్యాపించియుండును 79. అహంకారము శరీర సంబంధమగు ప్రేమ, అనాచారము, విషయసాంగత్యము, సంసారప్రపంచ విషయికమగు నుద్వేగము లోనగునవి హృదయములందు వారలకు నిరంతరము కాపురముండును 80. దీర్ఘసూత్రి, కృతఘ్నుఁడు, పాపి, దుష్కర్ముఁడు, కుతర్కి, వికల్పాత్ముఁడు, భక్తిహీనుఁడు, భావశూన్యుఁడు, శీఘ్రకోపి, నిష్ఠురహృదయుఁడు, పరఘాతకుఁడు, శూన్యహృదయుఁడు, దయారహితుఁడగు సోమరి, అవివేకి, విశ్వాసశూన్యుఁడు, అధీరుఁడు, అవిచారి, సందేహాత్ముఁడు నైన యట్టి శిష్యుఁడు నానావస్థల పాలగును. మఱియు ఆశ, మమకారము, తృష్ణ, కల్పనము, కుబుద్ధి, దుర్వృత్తి, దుర్వాసన, బుద్ధిహీనత, విషయవాంఛ మున్నగు దుర్గుణము లాతనిహృదయమునందు వాసము చేయుచుండును 81-83. ఇచ్ఛామోహతిరస్కారములకు వశుఁడై యితరుల నిందచేయుటలో

* శ్మశానమునందు జరుగు శవదహనము గాంచినంతన క్షణికవైరాగ్యమొందఱ కును గలుగును. ఈ వైరాగ్యము ఇల్లుచేరఁగనే నశించును. ఈ వైరాగ్యమును శ్మశాన వైరాగ్యమందురు.

నుత్సాహియై యాతఁడు విఱ్ఱవీగును. మఱియుఁ జక్కఁగ నెఱింగియు దేహాభిమానమునఁబడి యున్మత్తుఁడగును 84. ఆతఁ డాఁకలిదప్పికల నాపఁజాలఁడు. నిద్దురకుఁ గొంచెమేని సైరింపలేఁడు. కుటుంబచింత యెప్పుడును విడువనే విడువఁడు. భ్రాంతియందు మునిఁగియుండును 85. కేవల వాగాడంబరముతోడనే యేవియో గొప్పగొప్ప యుపన్యాసములు గావించును. కొంచమేని నిలకడగనుండడు. పశ్చాత్తాపము, ధైర్యము, సాధనము మున్నగువాని మార్గముల ననుసరింపఁడు 86. భక్తి, విరక్తి, శాంతము వానికడఁ గొంచెమేని యుండదు. సద్వృత్తి, లీనత దమన ములు లేవు. కృప, దయ, తృప్తి, సుబుద్ధి బొత్తిగలేవు 87. కాయ మును గ్లేశముల పాలు గావింపలేఁడు. ధర్మవిషయమునందుఁ బరమకృప ణుఁడు. సదాచరణమును గ్రహింపఁడు. మఱియుఁ గఠోరహృద యుఁడు 88. సాంసారికజనులతో నాతఁడు సరళముగా మెలంగఁడు. సజ్జనులను విద్వేషించును. రాత్రింబవళ్ళు ఇతరుల హీనస్థితి కానందిం చును 89. నిరంతరము అనృతములాడుచుండును. మాయమాటలు చెప్పి యితరులను గష్టముల పాలుచేయును. క్రియావిచారాదులలో నేని యందును సత్యమును బాటింపఁడు 90. అవగుణుఁడగు నిట్టి నీచుఁడు ఇతరులను దత్పరబుద్ధితోఁ బీడించుచుండును. తేలు కుట్టియుఁ బాము కఱచియు బాధకలుగఁజేయునటుల నతఁడు అందఱి యంతఃకరణములను కఠిన భాషణములచే నొప్పించును 91. తన దుర్గుణములను మరుగు పఱచుచుఁ బరులతోఁ గఠినవాక్యములాడుచు గుణదోషరహితులయెడ లేనిదోషము లారోపించుచుఁ 92, బాపుఁడుగను నిర్దయుఁడుగను వర్తిం చును. మఱియు దురాచారియు హింసకుఁడునై యితరులు దుఃఖించు తఱి జాలిగొనఁడు 93. దుర్జనులు ఇతరుల దుఃఖమునకు విచారపడరు. మీఁదు మిక్కిలి దుఃఖమునొందువారిని మఱియు దుఃఖింపఁ జేయుదురు. వారు దుఃఖించుటగాంచి తామానందింతురు 94. తనకు దుఃఖము కలిగి నపుడుమాత్రము దుఃఖించుచుఁ బరులకు దుఃఖముకలిగినపు డానందించు వానికి యమపురము తప్పక సిద్ధించును. అట్టి నీచుని యమకింకరులు నిర్దయగాఁ గొట్టుదురు 95.

--- --- ---

పూర్వపాపమువలన సద్బుద్ధి మందునకేని లేని యట్టి మదాంధులకు భగవంతుఁ డెట్టుల లభించును ? 96. ఇట్టి దుష్టులకు వార్ధకమున అవయవములు శిథిలములై పడిపోయినపుడును గుటుంబములోనివారలు విడిచివేసినపుడును గొంచెము జ్ఞానముకలుగును 97. పయినిజెప్పిన దుర్గుణములు లేనివారు శ్రేష్ఠులగు సచ్ఛిష్యులు. వారలు తమ దృఢభక్తివలన స్వానందసౌఖ్య మనుభవింతురు 98. వికల్పులును కులాభిమానులునగు జనులు ప్రపంచకారణమున దుఃఖముల పాలగుదురు. దుఃఖము దేనివలనఁ గలిగినదో దానినే మరల నాశ్రయించినచో దుఃఖము కలిగితీరును 99-100. సంసారసాంగత్యమువలన సౌఖ్య మెవ్వరికిని గలుగఁజాలదని యెఱింగియుండియుఁ దమకు సత్యహితము గావించుకొననివా రంత్యమున దుఃఖముల పాలగుదురు 101. సంసారమునందు సౌఖ్యమున్నట్టులఁ దలంచు ప్రాణులు మూఢులు. ఇట్టి చదివినమూర్ఖులు సర్వము నెఱింగియుండియు గ్రుడ్డివార లగుచున్నారు 102. గృహస్థాశ్రమమును సుఖముగా జరుపుకొనవచ్చును. పరమార్థమునుగూడ దానితోఁబాటు కొంచెము వృద్ధిఁ జేయవలయును. పరమార్థమును పూర్తిగా ముంచివేయుట యుక్తము గాదు 103. ఈ విధముగా గురుశిష్యుల లక్షణముండునని చెప్పితిని. ఇకముందు మంత్రలక్షణము దెలుపుదును. శ్రోతలు శ్రద్ధతో వినఁగోరెద 104.

## నాలుగవ సమాసము — మంత్రలక్షణము.

మంత్రమున కనేకలక్షణములు గలవు. వానినిట సంగ్రహముగాఁ దెలుపుచున్నాఁడను వినుఁడు 1. కొందఱు గురువు లేదేని మంత్రదీక్ష నొసంగుదురు. కొందఱేదేని దేవతనామమును మాత్రమే చెప్పెదరు. కొందఱోంకారమును జపింపఁజేయుదురు 2. కొందఱు శివుఁడు, దేవి, విష్ణువు, మహాలక్ష్మి, అవధూత, గణేశ్వరుఁడు, సూర్యుఁడు 3, మత్స్యకూర్మవరాహావతారములు, నరసింహమూర్తి, పరశురాముఁడు, రఘునాథుఁడు, శ్రీకృష్ణుఁడు మున్నగు దేవతలను గూర్చిన మంత్రములు జపింప నుపదేశించెదరు 4. భైరవుఁడు, మల్లారి, ఆంజనేయుఁడు, యక్షిణి, నారాయణుఁడు, పాండురంగస్వామి, అఘోరమూర్తి 5, శేషుఁడు, గరు

త్మంతుఁడు, వాయువు, బేతాళుఁడు, ఝోటింగస్వామి మున్నగు దైవత మంత్రములు పెక్కులుగలవు. ఎంతదనుకఁ జెప్పఁగలను? 6. బాల, బగళ, కాళి, కంకాళి, వటుకమూర్తి మున్నగు ననేకశక్తులకు లెక్కలేనన్ని మంత్రములున్నవి 7. ఇటులె భిన్న భిన్న దేవత లెన్నిగలవో యన్ని మంత్రములున్నవి. కొన్ని స్వాభావికములుగా నుండును. మఱికొన్ని యడ్డదిడ్డములుగా నుండును. కొన్ని ఖేచరాది దారుణబీజములుగల్గి యుండును 8. ప్రపంచమునం దెన్నియో దేవతలుగలవు. వాని నన్నిఁటిని లెక్కింప నెవ్వనికిని దరముగాదు. వాని కన్నింటికినిగల మంత్రము లసంఖ్యాక ములుగా నున్నవి. అవి యిన్నియని వివరించుటకు నాకేగాదు; వాణీ దేవికిఁగూడ నశక్యము 9. మంత్రమాల లనంతములుగా నున్నవి. ఒక దానికంటె వేఱొకటి మించియున్నది. ఇదియంతయు మాయయొక్క విచిత్రతరమగుకళ. దీని నెవ్వఁడెఱుంగజాలును? 10. కొన్ని మంత్రములతో భూతములు దిగిపోవును. కొన్నింటితో వెతలంతరించును. కొన్నింటితో విషమజ్వరములు సర్పవృశ్చికాది విషజంతుబాధలు తొలంగిపోవును 11. ఇట్టి నానావిధమంత్రములను జెవిలో నుపదేశింతురు. మఱియు జపము, ధ్యానము, పూజ, మంత్రాదులు విధానపూర్వకముగా వివరింతురు 12. కొందఱు శివశివయనియు, గొందఱు హరిహరియనియు, కొందఱు విష్ణు విష్ణు అనియు, గొందఱు విఠల విఠలయనియు నుపదేశింతురు 13. ఒకఁడు కృష్ణకృష్ణయనియు, నింకొకఁడు నారాయణ నారాయణ యనియు నుప దేశించును 14. కొందఱు అచ్యుత అచ్యుతయనియుఁ, గొందఱు అనంత అనంతయనియుఁ, గొందఱు దత్తదత్తయనియు 15, కొందఱు రామ రామయనియుఁ, గొందఱు ఓం ఓం అనియు శ్రీ మహావిష్ణుని యనేక నామములను ఉపదేశింతురు 16. కొందఱు కేవలము గురుని, కొందఱు పరమేశ్వరుని, కొందఱు విఘ్నేశ్వరుని 17, కొందఱు శ్యామరాజును, ఇటులే కొందఱు గరుడధ్వజుని, అధోక్షజుని 18, దేవదేవుని, కేశవుని, భార్గవుని 19, విశ్వనాథుని, మల్లారిని, [1] తుకాయిని జపింపుమని తమ్మాశ్ర యించినవారికిఁ దెలుపుచుందురు 20. ఎంతవఱకని తెలుపుదును? శివున కును, శక్తికిని అనంతనామములు గలవు. ఈ నామములనే గురువు

1. తుకాయి = తులజాపురమునందుండు దేవి.

లందఱును దమశిష్యులకుఁ దమ యిష్టానుసారముగ నుపదేశించుచుందురు 21. ఒకఁడు ఖేచరి, భూచరి, చాచరి, అగోచరియను [1]నాలుగు ముద్రలను జూపును. ఒకఁడు నానావిధములగు ఆసనములను దెలుపును 22. కొందఱు చమత్కారములగు దృశ్యములను జూపింతురు, కొంద [2]అనాహత ధ్వనినిగూర్చి తెలుపుదురు. పిండజ్ఞానులగు గురువులు (శరీర రచనాజ్ఞానము) పిండజ్ఞానము గలిగింతురు 23. కొందఱు కర్మమార్గమును గొంద ఉపాసనామార్గమును గొంద [3]అష్టాంగయోగమును [4]సప్తచక్రములను జెప్పుదురు 24. కొందఱు బహువిధములగు తపస్సులను, [5]అజపమంత్రములను నుపదేశింతురు. తత్త్వజ్ఞానులగువార లవియన్నియు నేలయని తత్త్వజ్ఞానము నుపదేశింతురు 25. కొందఱు సగుణమును, మఱికొందఱు నిర్గుణమును, దీర్ఘాటనమును నుపదేశింతురు 26. కొందఱు [6]మహావాక్యములను వివరించి వానిని జపించుచుండుమని యాజ్ఞాపింతురు. కొందఱు

---

1. ముద్రలు = విషయములనుండి దృష్టిని ద్రాలంగించి విశేషపదార్థముమీఁద విశిష్ట ప్రకారముతో దృష్టిని లగ్నపఱచుట.

2. అనాహతధ్వని = దేహమునందు నిరంతరము జరుగుచుండు ధ్వనులు. ఇవి పది తెఱంగులనున్నవి. వెలుపలనుండి సాధారణముగా వినిపించు ధ్వనులు ఆహతమువలన (కొట్టుటవలన) కలుగుచుండును. శరీరములో జనించు ధ్వనులస్థితి యట్టిదిగాదు. అందువలననే దానికి అనాహతమను పేరువచ్చినది.

3. అష్టాంగయోగము = యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యానసమాధులను నెనిమిది యోగమున కంగములు. ఈ యెనిమిది యంగములను సాధించిన పిమ్మట యోగము సిద్ధించును. యోగమనఁ జిత్తవృత్తినిరోధము.

4. శరీరమునందు గుదద్వారము మొదలుకొని బ్రహ్మరంధ్రమువరకును గల యేడుస్థానములలో ఏడు చక్రములున్నవి.

5. ప్రాణియొక్క ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములవెంట 'సోహం' అను ధ్వని నిరంతరము కలుగుచుండును. దానిని అజపా గాయత్రి యని చెప్పుదురు 17 దశకము 5 వ సమాసము చూడుము.

6. "ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ" అను నీ నాలుగు మహావాక్యములు వరుసగా ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదములలోనివి.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" యను మంత్రము నుపదేశింతురు 27. కొందఱు శక్తిమార్గమును జూపుదురు. మఱికొందఱు ముక్తిమార్గమును బ్రతిష్ఠింతురు. కొందఱు భక్తిపూర్వకముగా నింద్రియపూజ జేయింతురు 28. కొందఱు వశీకరణము, స్తంభనము, మోహనము, ఉచ్చాటనములను గూర్చిన మంత్రములను, మఱికొందఱు నానావిధప్రయోగ మంత్రములను నుపదేశింతురు 29. ఇది మంత్రముల స్థితి. ఇఁక దీని ప్రశంస చాలించెదను. చాలింపక యెంతదనుక నని చెప్పుదును? ఈవిధముగా మంత్రములు లెక్కపెట్టరానియన్ని యున్నవి 30. మంత్రములు పెక్కులున్నంత నేమి ఫలము? వానిజ్ఞానము లేకున్నచో నిష్ఫలములు, నిరర్థకములు నగును. ఈ విషయమునందు శ్రీకృష్ణభగవానుఁ డిటులఁ జెప్పి యున్నాఁడు 31.

శ్లో॥ నానాశాస్త్రం పఠేల్లోకో నానాదైవతపూజనం।
ఆత్మజ్ఞానం వినా పార్థ సర్వకర్మ నిరర్థకమ్ ॥
శైవశాస్త్రాగమాధ్యాయే అన్యే చ బహవో మతాః।
అపభ్రంశసమాస్తేఽపి జీవానాం భ్రాంతచేతసామ్ ॥
న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిదముత్తమమ్ ॥

జ్ఞానముతో సమానమైన పవిత్రవస్తు వింకొకటిలేదు. అది మిగుల నుత్తమమైనది. అందుచే మానవుఁడు తొలుదొలుత ఆత్మజ్ఞానమును సంపాదించుకొనవలయును 32. అన్ని మంత్రములకంటెను ఆత్మజ్ఞాన మంత్రము (గుహ్యోపదేశము) మిగుల నుత్తమమైనది. ఈ విషయములో భగవంతుఁడు పెక్కుతావుల నిట్లు నుడివియున్నాఁడు 33.

శ్లో॥ యస్య కస్య చ వర్ణస్య జ్ఞానం దేహే ప్రతిష్ఠితం।
తస్య దాసస్య దాసోఽహం భవేజ్జన్మని జన్మని ॥

ఆత్మజ్ఞానమహిమను చతుర్ముఖబ్రహ్మగూడ నెఱుంగఁడు. ఇఁకఁ బాప మీ జీవాత్మప్రాణుల కేమితెలియును! 34. సమస్తమైన పుణ్యతీర్థములను క్షేత్రరాజములను సేవించుటవలనఁ గలుగుఫలమునకుఁ గోటిరెట్లు ఫలమైనను బ్రహ్మజ్ఞానమునకుఁ దుల్యము కాఁజాలదు 35.

శ్లో॥ పృథివ్యాం యాని తీర్థాని స్నానం దానేషు యత్ఫలమ్ ।
తత్ఫలం కోటిగుణితం బ్రహ్మజ్ఞానసమం హి న ॥

ఆత్మజ్ఞానము గహనముకంటెను మిగుల గహనమైనది. ఈవిషయ మునుగూర్చి చెప్పబోవుచున్నాఁడను. శాంతచిత్తముతో శ్రోత లాలింపఁ గోరుచున్నాఁడను 36.

---

## అయిదవ సమాసము — బహుధాజ్ఞానము.

(ఆత్మజ్ఞానముకంటె భిన్నములగు ననేకవిధజ్ఞానములు)

ఎంతదనుక సత్యమగు జ్ఞానముండదో యంతదనుక సర్వమును నిష్ఫలము. ఏలయన, జ్ఞానములేనిది కష్టము దూరముకాఁజాలదు 1. జ్ఞానమనుపే రుచ్చరించినంతన భ్రమ కలుగుచున్నది. అన్నా! దీనియం దేమి రహస్యము లుండవచ్చును? అని యందఱును నడిగెదరేమో? ఇపుడు వరుసగా నీవిషయము వివరించెద 2. భూతభవిష్యద్వర్తమానము లలోని సంగతులను దెలిసికొనుటకూడ జ్ఞానమందురు. నిజమునకిది జ్ఞానము కాఁజాలదు 3. గొప్పగొప్పవిద్యలను జదువుట, సంగీత శాస్త్రము నేర్చుకొనుట, రాగ పరిచయము కలిగియుండుట, వైద్యశాస్త్ర మునందు నేర్పుగడించుట, వేదాధ్యయనము సలుపుట 4, అనేక పరిశ్ర మలను దెలిసికొనుట, నానావిధములగు దీక్షలస్వరూపము గ్రహించుట, మఱియు ననేక పరీక్షలలోఁ గౌశల్యము కలిగియుండుట 5, నానావిధము లుగనుండు స్త్రీలను అనేకరీతులుగనుండు మనుష్యులను బెక్కుతెఱం గులనుండు వ్యక్తులను బరీక్షించుట జ్ఞానమెన్నఁటికిని గాదు 6. బహు విధములుగానున్న అశ్వములను గజములను బెబ్బులులను బరీక్షించి భేదము లెఱుంగుటయు 7, పశువులు పక్షులు మున్నగుజీవులను బరీక్షిం చుటయు 8, నానావిధములగు యానములను, వస్త్రములను, శస్త్రము ములను బరిశోధించుటయు 9, పలుతెఱంగులుగనున్న రతనములను ధాతువులను నాణెములను బరీక్షచేయుటయు జ్ఞాన మనిపించుకొనఁ జాలదు 10. నానావిధములగు పాషాణములను కాష్ఠములను వాద్యము లనుగూర్చి యోచించుటయు 11, అనేకభేదములతోనుండు భూమిని జల మును అగ్నిమయపదార్థమునుగూర్చి యాలోచనచేయుటయు 12, పలు తెఱంగులనున్న రసములను బీజములను అంకురములను బరీక్షించుటయు13,

బహురూపములతో నలరారుచున్న ఫలములను పూవులను దీఁగెలను బరిశీలించుటయు 14, అనేక ప్రకారములగు దుఃఖములను రోగములను వివిధములగు చిహ్నములను బరీక్షించుటయు జ్ఞానముగాదు 15. అనేక రూపములతోనున్న యంత్రములను, మంత్రములను, విగ్రహములను 16, క్షేత్రములను, గృహములను, పాత్రములను బరీక్షించుటయు జ్ఞానముకాదు 17. బహువిధములగు భావికాలపరీక్షలు,అనేకసమయపరీక్షలు, నానావిధతర్క-పరీక్షలు 18, నానాప్రకారములనుండు అనుమానపరీక్షలు, అనేకనిశ్చయపరీక్షలు,బహువిధపరీక్షలు 19, పలుతెఱంగులతో నొప్పారువిద్యలు,కళలు, చాతుర్యములు పరీక్షించుటయు జ్ఞానముగాదు 21, నానావిధములగు స్వరములను, వర్ణములను గూర్చినపరీక్షయు లిపిపరీక్షయు 20. బహువిధములుగా నున్న విద్య కళ చాతుర్యము మున్నగువానినిగూర్చిన పరీక్షయు జ్ఞానముగాదు 22. నానావిధములగు మతములను బహువిధములగు వృత్తులను జ్ఞానమును పరీక్షించుటయు 23, పలుతెఱంగులగు రూపరసగంధములను శోధించుటయు 24, సృష్టిని భూమండలపరిమితిని పదార్థస్వరూపమును నెఱుంగుటయు 25, పరిమితముగా భాషించుటయు, తత్‌క్షణమె ప్రత్యుత్తరమొసంగుటయు, ఆశువుగాఁ గవిత్వము చెప్పుటయు జ్ఞానముగాదు 26. నేత్రపల్లవి, నాదకళ, కరపల్లవి, భేదకళ, స్వరపల్లవి మున్నగు సాంకేతికవిద్యలను గ్రహించుటయు 27, కావ్యకుశలత, సంగీతకళాపరిజ్ఞానము, గీత ప్రబంధ నృత్య కళాపరిచయము, సభాచాతురి, శబ్దసౌందర్యపరిజ్ఞానము 28, వాగ్విలాసము, మోహనకళ, రమ్యరసాలగాయనకళ, హాస్యము, వినోదము, కామకళ, సంగీతయుక్తి, నానావిధచిత్రకళలుగూడ జ్ఞానముగాఁ బరిగణింప దగవు 29. నానావిధ కౌశల్యము, చిత్రకళ, వాద్యకళ, సంగీతయుక్తి, నానావిధ చిత్రకళాజాలము 30, అరువదినాలుగు కళలు మొదలుకొని ప్రపంచమునందెన్ని కళలున్నవో యన్నికళలు, పదునాలుగు విద్యలు, సమస్త సిద్ధుల నెఱుంగుట జ్ఞానముకాదు 31. ఎవఁడెంత సకలకళాప్రవీణుఁడైనను సంపూర్ణ విద్యాపరిపూర్ణుఁడైనను నవియన్నియుఁ గేవలము కౌశల్యములె. వానిని జ్ఞానమని యెవ్వఁడును నుడువఁజాలఁడు 32.

ఇవియన్నియు నెఱుంగుటయే జ్ఞానమని సాధారణముగాఁ దోఁచును. కాని ముఖ్యమగు జ్ఞానము వేఱుగానున్నది. ఆ ముఖ్యజ్ఞానమునకుఁ బ్రకృతి (మాయా) సంసర్గ మేమాత్రమును లేదు 33. ఇతరుల మనస్సులలోని సంగతులను గ్రహించుట సత్యమగు జ్ఞానముగనే కాన్పించును. కాని యది యాత్మజ్ఞాన మెన్నటికిని గాదు 34. యోగ్యుఁడగు మహానుభావుఁడొకఁడు మానసపూజ గావించుచు మధ్య నెద్దియో మఱచిపోయెను. ఇంతలో నెవరో యొక రంతర్జ్ఞానముతో నామఱపును గ్రహించి యా మహానుభావునితో "అట్లుగాదు మీరిచ్చట నీ విషయమును మఱచితిరి" అని యెఱిచిచెప్పెను. ఇటుల జనుల యంతరంగమునందలి సంగతులను దెలిసికొనువారలను జనులు పరమజ్ఞానులని చెప్పుదురు. కాని యే జ్ఞానమువలన మోక్షము లభించునో యాజ్ఞాన మిది కాదు 35—36. జ్ఞానము బహుప్రకారముల నలరారుచున్నది. ఆయా ప్రకారము లేవియో వివరించుట సామాన్యకార్యము గాదు. సాయుజ్యముక్తిని సమకూర్చు జ్ఞానము వేరుగానున్నది 37. ఇదియంతయు నాలించి శిష్యుఁడిటుల గురువర్యుని బ్రశ్నించుచున్నాఁడు. "గురుమహారాజా! అటులైనచో బరమశాంతి ప్రాణి కేజ్ఞానమూలమున లభించునో దానిని విస్తరించి యాజ్ఞయిండు" 38. గురువుచెప్పిన ప్రత్యుత్తరమిది — శిష్యా! అట్టి శుద్ధజ్ఞానమునుగూర్చి రాబోవు సమాసములోఁ దెల్పెదను. ధ్యానపూర్వకముగా వినఁగోరుచున్నాఁడను 39.

---

## ఆఱవ సమాసము — శుద్ధజ్ఞాన నిరూపణము.

శుద్ధమగు జ్ఞాన మాత్మజ్ఞానము. ఆత్మజ్ఞానముయొక్క లక్షణ మేదియనఁ దన్నుఁదాను గ్రహించుటయే 1. ముఖ్యదైవతము నెఱుంగుటయు సత్యస్వరూపమును గురుతించుటయు నిత్యానిత్య విచారమును గావించుటయు జ్ఞానమని పెద్దలుచెప్పెదురు 2. సంపూర్ణముగా నీ దృశ్యప్రకృతి లయమైపోవుటయుఁ బాంచభౌతికము నెవ్వియు లేకుండుటయు, నద్వైతము మూలమట్టముగా నశించుటయు (ఒకటిదక్క రెండవది లేకపోవుటయు) జ్ఞానము 3. మనస్సునకు బుద్ధికినిగూడ నగోచరముగానున్న

దియుఁ దర్కమున కవకాశము నొసంగనిదియు ఉల్లేఖనముకంటెను (నిర్దేశముకంటెను) బరావై ఖరికంటెను బైగానున్నదానికి జ్ఞానమనిపేరు 4. ఎచట దృశ్యమానమగున దేద్దియును లేదో, యెచట [1]అహం బ్రహ్మాస్మి యను జ్ఞానముగూడ నజ్ఞానమగునో యట్టి శుద్ధమును విమలమునునగు స్వరూపజ్ఞానమే జ్ఞానమని చెప్పఁబడును 5. అన్నింటికిని సాక్షియగు [2]తురీయావస్థను జనులు జ్ఞానమందురు. కాని యా యవస్థయందుఁ గలిగెడు జ్ఞానముకూడఁ బదార్థముకంటెను భిన్నముగాదు. కావున నిదియు వ్యర్థమే 6. ఏలయన, దృశ్యపదార్థమును దెలిసికొనుటకుఁ బదార్థజ్ఞానమనియే చెప్పుదురు. శుద్ధస్వరూపమును దెలిసికొనుటకు స్వరూపజ్ఞానమని చెప్పుదురు 7. అస్తిక్యము లేనిదానికి సర్వసాక్షిత్వము అనునది యెచ్చట నుండి రాఁగలదు? కావునఁ దుర్యజ్ఞానము నెన్నఁటికిని శుద్ధజ్ఞానమని తలంపఁగూడదు 8. జ్ఞానమన నద్వైతమని (ఒకటివిడిచి రెండవది లేని దానిని) చెప్పుదురు. తుర్యావస్థయన్ననో యది ప్రత్యక్షముగ ద్వైతరూపము (తురీయ మన్నింటికిని సాక్షిగావున నొకటి స్వయముగఁ దుర్యము. రెండవది సాక్ష్యముగానున్నయది) కావునఁ దుర్యావస్థాజ్ఞానము శుద్ధజ్ఞానము గాదు. శుద్ధజ్ఞానమనునది వేఱుగానున్నది 9. శ్రోతలారా! ఇపుడు మీరు శుద్ధజ్ఞాన లక్షణములను వినుండు. 'మనము శుద్ధస్వరూపులమే' యను దానియం దనుభవముగలుగుటయే శుద్ధజ్ఞానము. మహావాక్య మంత్రము మంచిదియే. తత్త్వమసి (తత్ + త్వం + అసి = ఆ బ్రహ్మము నీవే

---

1. మనము బ్రహ్మస్వరూపులమై యనుకొను నహంకారమను జ్ఞానము. బ్రహ్మస్వరూపప్రాప్తియైన పిమ్మట నీ జ్ఞానముండదు. ఒకవేళ నున్నచో నది యజ్ఞానమగును.

2. అవస్థలు నాలుగు:- జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ, తురీయావస్థ. జాగ్రదవస్థయందు జీవుఁడు సమస్తవిధములగు బాహ్యవ్యవహారములు గావించును. స్వప్నమునం దింద్రియములన్నియు లయమైపోయి కేవలమొక మనస్సే సమస్త వ్యవహారములు చేయును. సుషుప్తి (గాఢనిద్ర) యందు ఇంద్రియములన్నియు మాత్రమేగాక మనస్సుగూడ నజ్ఞానములో లయమైపోవును. జీవుఁడు కేవలము మూఢావస్థయందుండును. ఈ మూఁడవస్థలలో జ్ఞానముఁ గలుగును. తురీయావస్థయందు జీవునకు స్వస్వరూపజ్ఞానము గలుగును. అనగా జీవునకు నేను బ్రహ్మరూపుఁడనను ననుభవము కలుగును. ఈ జ్ఞానముగూడ నుపాధిసహితమేగాన నిదియును శుద్ధజ్ఞానముగాదు. దీని పిమ్మట ఉన్మనీయావస్థ యున్నది. దానిలో మనస్సుగూడ లయమైపోవును.

నైయున్నాఁడవు) ఈ మంత్రము జపించుమని చెప్పలేదు. ఈ వాక్యమును సాధకుఁడు విచారము గావింపవలసియున్నది 10-11. ఈ మహావాక్యము సమస్తమంత్రముల సారము. దీనినిగూర్చి బాగుగా విచారించి పర్యవసానము గ్రహింపవలయును. ఈ మంత్రమును జపించుటవలన అజ్ఞానాంధకార మెన్నఁటికిని నశింపనేరదు 12. ఈ మహావాక్యమున కర్థమును విచారించితిమేని "మనము స్వయముగా బ్రహ్మమే అయియున్నార"మని తేలును. కావున దీనిని జపించుటవలన వ్యర్థపరిశ్రమదప్ప ఫలమేదియుఁ గలుగఁజాలదు 13. ఈ మహావాక్య వివరణమునుశ్రీ గావించుటయే జ్ఞానమునకు ముఖ్యలక్షణము. అట్టిముఖ్యలక్షణముకతన మనము బ్రహ్మస్వరూపుల మనుసంగతి సుబోధమగును 14. తనకుఁ దనది లభించుట (నేనెవ్వరని తెలిసికొనుట లేక యాత్మస్వరూప మెఱుకయగుట) యను నీ జ్ఞానము పరమదుర్లభమైనది. ఈ జ్ఞాన మాద్యంతముయందు స్వయంభూస్వరూపమునన్నది 15. సమస్తము నెచటనుండి ప్రకటితమగుచున్నదో దేనియందిది యంతయు లీనమగుచున్నదో యట్టిజ్ఞానము గలిగినపిమ్మట బంధనములను గూర్చిన భ్రాంతియంతయు నశించును 16. శుద్ధజ్ఞానము ముందు ఈ మతములు మతాంతరములు దుర్బలములై నిలువఁజాలక నశించుచున్నవి. అంతియగాక అతిసూక్ష్మవిచారము గావించినయెడల శుద్ధజ్ఞానము గలిగినవారి కన్నిటను నైక్యము గనిపించును 17. ఈ చరాచరప్రపంచమునకు నిర్మలమును శుద్ధస్వరూపమునగు [1]శుద్ధజ్ఞానమె మూలమైయున్నది (నిర్మలమును శుద్ధస్వరూపము నగుదానిని వేదాంతమతానుసారముగ శుద్ధజ్ఞానమందురు) 18. తనమూలస్థానమును అన్వేషించుటవలన అజ్ఞానము తనంతన నశించును. దీనినే మోక్షప్రదమగు బ్రహ్మజ్ఞానమందురు 19. ఇట్లు తనను గుర్తించుచుండఁ గ్రమముగా సర్వజ్ఞత్వము ప్రాప్తించును. దీనివలన ఏకదేశీయత పూర్తిగాఁ దొలఁగిపోవును 20. "నేనెవ్వఁడను" అను హేతువును హృదయమునం దుంచుకొని చూచిన యెడల "నేను నిశ్చయముగ దేహమున కతీతరూపుఁడనై యున్నాఁడను" అను నంశ మెఱుకపడును 21.

1. మనము అహం (నేను) బ్రహ్మ (శుద్ధస్వరూపమగు బ్రహ్మమును) అని యనుచున్నారము. దీనిని అనుభవములోనికిఁ దెచ్చుకొనుటకే శుద్ధజ్ఞానమని పేరు.

ప్రాచీన కాలమున ఈ జ్ఞానసహాయమున పలువురు మహాత్ములు ముక్తులైరి 22. వ్యాసుఁడు, వసిష్ఠుఁడు, శుకుఁడు, నారదుఁడు, జనకుఁడు మొదలగు మహాజ్ఞానులీజ్ఞానమువలననే మున్ను తరించిరి 23. వామదేవుఁడు, వాల్మీకి, అత్రి, శౌనకుఁడు మున్నగు ఋషీశ్వరులు ఈ జ్ఞాన సహాయముననే వేదాంతవిచారముల నొనరించి పరమాత్ముని బొందిరి24. సనకాదిఋషులు, ఆదినాథుఁడు, మత్స్యేంద్రనాథుఁడు, గోరక్షనాథుఁడు మున్నగు మహాత్ములు ఈ శుద్ధజ్ఞానము కతననే ముక్తులై పోయిరి 25. సిద్ధులు, మునులు, మహానుభావులు మున్నగువార లందఱకును ఆ శుద్ధ జ్ఞానమొక్కటియే మోక్షమును బడయ నాధారమైనది. శుద్ధజ్ఞానానందముననే నిరంతరము మహాదేవుఁడు తాండవమాడుచున్నాఁడు 26. శుద్ధ జ్ఞానము వేదశాస్త్రముల సారము. అదియే గురుప్రతీతి, అదియె ఆత్మ ప్రతీతి విచారము. భావికులకు వారివారి భాగ్యానుసారముగ శుద్ధజ్ఞానము ప్రాప్తించును 27. సాధువులు, సత్పురుషులు, సజ్జనులునగు యోగ్యులేజ్ఞానసహాయమున భూతభవిష్యద్వర్తమానకాలముల నెఱుంగుదురో ఆజ్ఞానముకంటె నధిక గుహ్యాతరమైనది ఆత్మజ్ఞానము 28. తీర్థసేవ, తపము చేయుట, దానములొనర్చుట, ధూమపానముచేయుట (తలను క్రిందుగఁ గట్టుకొని క్రిందనున్న పొగను బీల్చుట), పంచాగ్నులమధ్య నుండుట (నాలుగువైపుల నగ్నిరగులుకొల్పి మధ్యనుండి సూర్యతాపము సహించుట), గోరాంజన మొనరించుట (భగవత్ప్రీతికై యగ్నితోఁ గాల్చుకొనుట) మున్నగువానివలన ఆత్మజ్ఞానము కలుగఁజాలదు 29. అది సకల సాధనములకును ఫలము. సంపూర్ణజ్ఞానమునకు శిరోమణి. ఆత్మజ్ఞానము గలిగినమీఁదట సందేహము లన్నియు నశించును 30. ఏబదియాఱు భాషలును, ఆ భాషలలోని సామాన్యగ్రంథము మొదలుకొని వేదాంతము వఱకునుగల సమస్తమునకు ఆత్మజ్ఞానమే గహనార్థము (ఎఱుంగ శక్యముగాని యంశము) 31. ఆత్మజ్ఞానము పురాణములను చదువుటచే నెఱుంగఁబడదు. దానిని వర్ణించివర్ణించి వేదములు విసికిపోయెను. కాని శ్రీసద్గురుమూర్తి యనుగ్రహమువలన నేనిప్పుడు మీ కందఱకు దానినే చెప్పుచున్నాఁడను 32. సంస్కృతము, మహారాష్ట్రము మున్నగు భాషాగ్రంథములయందు నాకేమియుఁ బ్రవేశములేదు. కాని హృదయమునందుఁ

గృపామూర్తియగు సద్గురుస్వామి నివసించి విరాజిల్లుచున్నాఁడు. కావున నిప్పుడు ప్రస్తుతాంశము దెలుపుటకు నాకు సంస్కృత ప్రాకృతగ్రంథ ములతో నెట్టి యావశ్యకమునులేదు 33 – 34. వేదాభ్యాసము, సద్గ్రంథ శ్రవణము మున్నగు పరిశ్రమలు కొంచెమేని లేకపోయినను కేవలము సద్గురుని కృపవలన నన్నియును సహజము (సులభము) లగును 35.

మహారాష్ట్రము మున్నగు సమస్త దేశభాషలలోఁగల గ్రంథము లన్నింటిలో సంస్కృతగ్రంథములుత్తమోత్తమములు. సంస్కృతగ్రంథము లన్నింటిలో వేదాంతగ్రంథములు సర్వశ్రేష్ఠములు 36. వేదాంతమునందు వేదములందలి సంపూర్ణ రహస్యమంతయు నిమిడియున్నది. అందుచే వేదాంతము సర్వశ్రేష్ఠమనిపించుకొనఁగలిగెను 37. ఆ వేదాంతమునుకూడ మథించి (తఱచి) తీసినయర్థము అతిగహనమగు పరమార్థము. దానిని మీ కిప్పుడు నేనెఱింగించుచున్నాఁడను 38. ఓహో! గహనమునకంటెను గహనమైనది సద్గురుని వచనము. సద్గురుని వచనమువలన నవశ్యముగా శాంతి లభించును 39. సద్గురుని వచనమే వేదాంతము. సద్గురుని వచనమే సిద్ధాంతము. సద్గురుని వచనమే ప్రత్యక్షమగు నాత్మానుభవము 40. ఎయ్యది గ్రహింప శక్యముగానివిషయమో, ఎయ్యది నా గురుస్వామి వాక్యమో, దేనివలన నాకుఁ బరమశాంతిలభించునో, ఎయ్యది నాహృద యమునందలి రహస్యతరాంశమో దానినిప్పుడు ఈ క్షణమున మీ కంద ఱకుఁ దెలుపుచున్నాఁడను. నావైపు ధ్యానమునుంచి వినఁగోరెదను 41-43. "అహం బ్రహ్మాస్మి" అనునది యజుర్వేదములోని మహావాక్యము. దీని యర్థమునుఁ దర్కింప నసాధ్యము. ఇందలి భావమువలన గురుశిష్యుల కైక్యము గలుగుచున్నది 44. "స్వయముగా నీవె బ్రహ్మవు. ఇందు సందే హముగాని, భ్రమగాని యుంచుకొనకుము" అనునదియే యీవాక్యము నందుగల మహామర్మము 45. నవవిధ భక్తులలోనిదగు ఆత్మనివేదన భక్తికిఁగూడ నిదియేమర్మము 46. ఈ పంచమహాభూతములు క్రమముగా నొకదానివెంట నొకటి కల్పాంతమునందు నాశనమైపోవును. మఱియుఁ బ్రకృతిపురుషులు (మాయ, బ్రహ్మము) గూడ బ్రహ్మమేయగును 47. దృశ్యపదార్థములన్నియు లుప్తమైపోవఁగనే వాస్తవములో "నేను" అనునదిగూడ నుండఁజాలదు. ఇఁకఁ బరబ్రహ్మమన్ననో, ఆతత్త్వమాది

నుండియు నద్వైతమే 48. ఎచ్చట సృష్టినిగూర్చిన వార్తయేలేదో యచట నాదినుండియు ఏకత్వము (అద్వైతము) గలదు. అచ్చట పిండముయొక్క-గాని, బ్రహ్మాండముయొక్క-గాని జాడలేవియు నుండవు 49. జ్ఞానాగ్ని ప్రకటనముకాఁగానే దృశ్యరూపమగు చెత్తచెదారమంతయు నష్టమై పోవును. తదాకారమగుటవలన భిన్నత్వమూలమంతయును దెగిపోవును 50. జగత్తు అనిత్యమను జ్ఞానము కలిగినపిమ్మట వృత్తి దానినంటుకొనదు. అది దానినుండి (వృత్తిజ్ఞానమునుండి) పరాఙ్ముఖమై పోవును. కావున దృశ్యము (సంసారము) ఎదురుగాఁ గనిపించుచున్నటులున్నను దాని యభావమే స్పష్టముగా భాసమగుచుండును 51. అనన్యమగు భక్తి గురునియందుఁ గలిగినపుడు నీకిట్టి చింతతోడనే పనిలేదు. గురునినుండి వేఱై భక్తుఁడవు గాక యుండకుము 52. ఈ విషయము దృఢము గావించుకొనుటకు సద్గురునిసేవింపుము. ఏలయన సద్గురుసేవవలన అవశ్యముగ సమాధానము కలుగును 53. ఇదియే ఆత్మజ్ఞానము. దీనివలననే పరమశాంతి లభించును. మఱియు భవభయముగూడఁ దొలంగిపోవును 54. ఈ దేహామే నేనని తలంచువాఁ డాత్మఘాతకుఁడు. అట్టి యవివేకి దేహాభిమాన కారణమున తప్పనిసరిగ జననమరణదుఃఖము లనుభవించుచుండును 55.

ఓ శిష్యుఁడా! నీవు నాలుగు దేహములకంటెను వేఱుగా నున్నాఁడవు. నీవు జన్మకర్మములకు భిన్నుఁడవు. మఱియు సంపూర్ణ చరాచర సృష్టికి లోపలను వెలుపలను నీవే నిండియున్నాఁడవు 56. వాస్తవములో బద్ధుఁడెవ్వఁడును లేఁడు. ఈ జనులందఱును భ్రాంతివలన సర్వమును మఱచి యున్నారు. ఈ దేహాభిమానమును దృఢముగాఁ బట్టుకొనియున్నారు 57. ఓ శిష్యుఁడా! నీవు పరమార్థమును దృఢము గావించుకొనఁ దలంచితివేని ఏకాంతములోఁ గూర్చుండి స్వరూపమునందు (బ్రహ్మస్వరూపమున లేక అహంస్వరూపమున) విశ్రాంతిఁ గైకొనవలయును 58. శ్రవణమును, మననమును ఎప్పు డఖండముగాఁ జేయుదువో అప్పుడే నీకు సమాధానము లభించును. మఱియు బ్రహ్మజ్ఞానము పూర్ణమైనపిమ్మట నీకు వైరాగ్యము లభించును 59. ఓ శిష్యుఁడా! ఒకమాటవినుము. నీవు ఇచ్ఛకువచ్చినటుల మెలంగుచు ఇంద్రియములకు స్వాతంత్ర్యము కలుగజేసి వానికిలోఁబడి మెలంగెదవేని జన్మమృత్యుదుఃఖము లెన్నఁటికిని నిన్ను విడిచిపోఁజాలవు

60. త్యాగము గావించుటచే బ్రాణికెటుల రాజ్యలాభము కలుగునో యటులె విషయసుఖములనుఁ ద్యాగముగావించి వైరాగ్యమును గడించినవానికి సంపూర్ణజ్ఞానము సమకూరును 61. గొంగునఁగల మణియందలి లోభమున మూర్ఛించి రాజ్యము నవహేళనము గావించుట మంచిపనిగాదు 62. అవిద్యను వదలి సువిద్యను గ్రహింపవలయును. దానివలన నీశ్వరప్రాప్తి త్వరలో నగును 63. సన్నిపాత రోగమునందు భయానకదృశ్యములను గాంచునట్టి రోగి సరియగు నౌషధమును సేవించినవెంటనే సుఖానందమును బడయునటుల అజ్ఞాన రూపమగు సన్నిపాతవ్యాధియందుఁగూడ మిథ్యాదృశ్యములు (సాంసారికములు) కానిపించును. కాని జ్ఞానరూపమగు ఔషధమును దీసికొన్నతోడనే యీ మిథ్యాదృశ్యము జాడపాడలే కాన్పింపవు 64-65. అసత్యస్వప్నములతో నిదురించువాఁడు భయమునఁ గేకలువేయును. వానిని మేలుకొలిపినయెడల మొదటి నిర్భయదశ తిరుగ సమకూరును 66. స్వప్నమన్ననో నది మిథ్యయే. కాని స్వప్నము నొందినవాని కది సత్యముగాఁ దోఁచుచున్నందున దుఃఖము కలుగుచున్నది. కాని యెయ్యదిమిథ్యయో దాని నిరసనమును నెటులఁ జేయనగును? 67. స్వప్నము మేలుకొనినవానిపట్లనే యసత్యమైనది. అది నిదురబోవువాని నావరించియుండును. మేల్కొని లేచినపిమ్మట వానికి స్వప్నమువలని భయమెద్దియు నుండదు 68. ఇటులే అవిద్యానిద్రయు నంత గాఢముగా నుండును. దానివలన మిగుల గొప్ప భ్రమ పాదుకొనును. ఇట్టిదశయందు శ్రవణమువలనను మననమువలనను పూర్ణమగు జాగరూకత నొందవలయును 69. హృదయపూర్వకముగా విషయములనుండి విరక్తుఁడై యుండువాఁడే జాగరూకుఁడు (సిద్ధుఁడు) 70. విషయములనుండి విరక్తుఁడుగానివాఁడు సాధకుఁడు. ఆతఁడు నేను గొప్పవాఁడనను అభిమానమును విడిచిపెట్టి మొట్టమొదట సాధనమునే చేయవలయును 71. సాధనమునుగూడఁ జేయఁజాలనివాఁడు సిద్ధుఁడ (జ్ఞాని) నను దురభిమానముచే బద్ధుఁడగుచున్నాఁడు. (సాంసారికబంధనములలోఁ జిక్కువడుచున్నాఁడు) 72. ప్రకృతాంశము సుబోధమగుట కిపుడు బద్ధుల, ముముక్షువుల, సాధకుల, సిద్ధుల లక్షణములను జెప్పెదను. సావధానులరై యాలింపఁ గోరెదను 73-74.

## ఏడవ సమాసము — బద్ధలక్షణములు.

సృష్టిలోని సంపూర్ణచరాచరజీవులు బద్ధులు, ముముక్షువులు, సాధకులు, సిద్ధులు అను నాలుగుతెఱంగుల నున్నారు 1. ఈ నాలుగువిధములఁదప్ప ఐదవవిధమున నున్న దెద్దియును లేదు. ఇపు డీ నాలుగులక్షణములు మీకు సవిస్తరముగాఁ దెలుపుదును 2-3. పై నిఁజెప్పిన చతుర్విధజీవులలోనుండి తొలుదొలుత నీసమాసమునందు బద్ధులలక్షణము దెలుపుదును. సావధానమనస్కులరై వినుండు. శేషించిన మూఁడింటిలక్షణములు క్రమముగాఁ జెప్పుదును 4-5. గ్రుడ్డివానికి దృష్టిలేనికారణమున దశదిశలును శూన్యాకారములుగాఁ దోఁచును. అటులే స్వార్థమను నంధత్వము కలిగినకారణమున బద్ధునకుఁగూడ జ్ఞానదృష్టి లేకుండుటచే సమస్త ప్రపంచము (సంసారమంతయు) బంగారమువలెఁ దోఁచుచున్నది 6. భక్తులు, జ్ఞానులు, తపస్వులు, యోగులు, విరాగులు, సన్యాసులు మున్నగు సత్పురుషులచే నావరింపఁబడిన యీ ప్రపంచమునందు బద్ధుని దృష్టిలోనికివచ్చు యోగ్యులు లేరు 7. బద్ధపురుషుఁడు కర్మములు, అకర్మములు, ధర్మములు, అధర్మములు, సుగమమగుపరమార్థమార్గము నెఱుంగఁడు 8. షట్శాస్త్రములు, సత్సాంగత్యము, సత్పాత్రత, పవిత్రమగు సన్మార్గములుగూడ వానికిఁ గాన్పింపవు 9. సారాసారవిచారము, స్వధర్మాచరణము, పరోపకారము, దానపుణ్యము నాతఁడు గ్రహింపఁడు 10. బద్ధుని హృదయమునందు భూతదయ యుండదు. శరీరము పవిత్రముగానుండదు. మఱియుఁ దోడిమనుష్యులను బ్రసన్నము గావించుకొనుట కాతఁడు మృదుమధురవచనములనుగూడ నుడువఁడు 11. బద్ధుఁడగు పురుషుఁడు భక్తి, జ్ఞానము, వైరాగ్యము, ధ్యానము, మోక్షము మొదలగు సాధనముల నించుకేనియు నెఱుంగఁడు 12. అంతియగాక వాఁడు నిశ్చయాత్మికమగు దేవతనే యెఱుంగఁడు. వీరు మహాత్ములను వివేకమే యతని హృదయమునఁ గలుగదు. మాయాకౌతుకమును దెలిసికొనఁజాలఁడు 13. వాఁడు పరమార్థమును గురుతించు తెఱంగే యెఱుంగఁడు. అధ్యాత్మనిరూపణము నెఱుంగఁడు. అంతదనుకబోనేల, స్వయముగ తన్నే యెఱుంగడు 14. బద్ధునకు జీవుఁడొందు జన్మకారణము తెలియదు. సాధనఫలముల గురుతింపఁడు. మఱియు వానికి యథార్థమగు సత్యమును

గూర్చిన జ్ఞానముండదు 15. దేనియందుఁ దాను స్వయముగా బంధింపఁ బడుచున్నాఁడో అట్టి బంధనస్వరూపమే బద్ధుఁ డెఱుంగఁడు. వానికి ముక్తి లక్షణముగాని విలక్షణవస్తు బ్రహ్మజ్ఞానముగాని యుండదు 16. శాస్త్ర ములలోని యర్థమును విప్పిచెప్పినను వాఁడు తెలిసికొనఁడు. తనజీవితము నకు ముఖ్యమైన స్వార్థమెద్దియో వానికిఁ దెలియదు. మఱియు నేను సంకల్పముచే నిటుల బంధింపఁబడియున్నాఁడనని గూడ నాతఁడు విచా రింపఁడు 17. ఆత్మజ్ఞానము లేకుండుట బద్ధుని ముఖ్యలక్షణము. వాఁడు పుణ్యతీర్థములు దానములు పుణ్యములు మున్నగునవి కొంచమేని యెఱుం గఁడు 18. వాని హృదయమునందు దయ, కరుణ, వినయము, మైత్రి, శాంతి, క్షమ మున్నగు సుగుణములుండుటకుఁ దావులేదు 19. వేయేల, జ్ఞానహీనుఁడగు బద్ధపురుషునకు జ్ఞానలక్షణము లెట్లు పట్టువడనేర్చును? తనయందు సమస్తమైన దుర్లక్షణములు నిండియున్నవాఁడే బద్ధుఁడు 20. బద్ధుని స్వభావము తెలిపెదను. నానావిధములగు పాపకార్యములను గావించుటవలన వానికిఁ బరమానందము కలుగును. వాని హృదయము మూర్ఖోద్రేకముతో నిండియుండును 21. ఏమానవుని హృదయమున కామము, క్రోధము, గర్వము, మదము, ద్వంద్వము, భేదము మున్నగు దుర్గుణములు నిలుకడగానుండునో వానిని బద్ధుఁడని తెలిసికొనుము 22. దర్పము, దంభము, విషయేచ్ఛ, లోభము, కర్కశత్వము, అశుభత్వము, హృదయమునందు విశేషముగనుండువాఁడు బద్ధుఁడు 23. వ్యభిచారము (కామాసక్తి), మత్సరము, అసూయ (పరగుణేషు దోషావిష్కరణం), తిరస్కారము, పాపము, వికారము మొదలగు అవగుణసమూహ మెవని నావరించుకొని యుండునో వాఁడె బద్ధుఁడు 24. బద్ధపురుషుఁడు దురభి మానమునకును, మోహమునకును, అహంకారమునకును, వ్యగ్రతకును (తొట్రుపాటునకు), దుష్కర్మములకును గనిదైయుండును 25. కపటము, వాదవివాదములు, కుతర్కము, భేదము, క్రూరత్వము, నిర్దయాళుత్వము మున్నగు దుర్గుణములు బద్ధుని నాశ్రయించియున్నవి 26. నింద, ద్వేషము, అధర్మము, అభిలాష మొదలగు బహువిధదోషముల కాతఁడు ఆటపట్టుగా నుండును 27. భ్రష్టత్వము, అనాచారము, నష్టత్వము, ఐకమత్యరాహి త్యము, అవినీతి, అవిచారము బద్ధుని హృదయమునఁ బెంపొం

దును 28. నిష్ఠురస్వభావుఁడును, ఘాతకుఁడును, ఇతరులను వధించు వాఁడును, పాపకార్యముల నాచరించువాఁడును, క్రోధమునకు నెలవుగ నుండునాతఁడును, ఉండి యనేక కువిద్యల నెఱింగినవాఁడును బద్ధుఁడు 29. దురాశ, స్వార్థపరత్వము, కలహప్రియత్వము, అనర్థము, దుర్మతి, ప్రతీకారము చేసితీరవలయునను క్రోధస్వభావము 30, కల్పనము, కామన (ఇచ్ఛ), తృష్ణ, వాసన, మమత, భావన మున్నగు దుర్గుణములతో విఱ్ఱవీగుచుండువానిని బద్ధుఁడని గ్రహింపవలయును 31. వికల్పుఁడుగను (ప్రమాది) విషాదిగను, మూర్ఖుఁడుగను, ఆసక్తుఁడుగను, ప్రాపంచికుఁడుగను, అధికోపాధిగను, (కుటుంబపోషకుఁడు) 32, అతివాచాలుఁడుగను, పాషండుఁడుగను దుర్జనుఁడుగను, మోసగాఁడుగను, దుష్టుఁడుగను, దుర్గుణుఁడుగను నుండి 33, అవిశ్వాసము, భ్రమ, భ్రాంతి, తమము, విక్షేపము (చాంచల్యము) ఆలస్యము మున్నగు భావము లెక్కువగాఁ గలవాఁడు బద్ధుఁడు 34. లోభియు, ఉద్ధతుఁడు, పరులశ్రేయస్సునకు సహింపనివాఁడు, మదయుతుఁడు, అసత్కర్ముఁడు, ఎంతవానినేని లక్ష్యము చేయనివాఁడు 35, పరమార్థవిషయమునందు అజ్ఞానిగనుండి ప్రాపంచిక విషయములలో నపరిమితపరిజ్ఞానము గలిగియుండువాఁడు, స్వయముగా మనశ్శాంతి యెఱుఁగనివాఁడు 36, పరమార్థము ననాదరించుచుఁ బ్రపంచము నెక్కువ యాదరించుచు గృహస్థాశ్రమభారమును సంతోషముతో నిరంతరము మోయుచుండువాఁడు బద్ధపురుషుఁడనఁబడును 37. బద్ధునకు సత్సంగము మిగుల నసహ్యాకరముగ నుండును. సాధువులను అవతారపురుషులను నిందించుటయన్నఁ బరమానందము. తన బుద్ధిని ధర్మవిషయమున బ్రసరింపనీక శృంఖలములు తగిలించినటుల బంధించి, కూర్చుండుట యన్న సంతోషావహము 38, చేతిలోద్రవ్యమునకు సంబంధించిన జపమాలధరించి నిరంతరము కాంతారతుఁడై వర్తించుట వాని నియతకృత్యము. సత్సంగ మనునది వానికడఁ గలికమునకేని యుండదు 39. నిరంతరము కనకమును గాంతలను గనులకఱవారఁగాంచి యానందించుటయుఁ, జెవులతో నిరంతరము కాంతాకనకములను గూర్చిన ప్రసంగములను దనివార నాలించుటయు, ధనమునుగూర్చి యెల్లపుడు చింతించుటయు 40, మనోవాక్కాయములతోడను జీవప్రాణముల

తోడను ధనమునకై కాంతలకై పలవించుచుంటయు 41, ఇంద్రియ ములను సంపూర్ణముగా స్థిరమొనరించి స్త్రీలకొఱకును, ద్రవ్యముకొఱ కును మగ్నము గావించుటయు బద్ధుని లక్షణములు 42. కాంతాకనకము లను బుణ్యతీర్థములుగను, బరమార్థముగను, స్వార్థముగను, కడకు సర్వస్వముగను భావించువాఁడును 43, సమయమును ఇతరపుణ్యకార్య ములతో వ్యయపఱుపక నిరంతరము గృహస్థచింతనములతోఁ గడుపుకొను వాఁడును, లోకసంబంధములగు కథలు వార్తలు తనవిగా దలంచి కాల యాపనము చేయువాఁడును 44, బహువిధచింతలు, ఉద్వేగములు, దుఃఖసంసర్గము మున్నగువానికి ఆటపట్టుగా వర్తించువాఁడును, బరమార్థ మును బూర్తిగా విడనాడినవాఁడును బద్ధపురుషుఁడు 45. గడియ, నిము సము, తెప్పపాటు లోనగు నే స్వల్పకాలమునేని సద్వినియోగముచేయక స్త్రీ, ధన, ప్రపంచ, ధ్యానములయందు గడుపునాతఁడును 46, తీర్థ యాత్రలు, దానము, పుణ్యము, భక్తి, సత్కథానిరూపణము,మంత్రము, పూజ, జపము, ధ్యానము మొదలగు సమస్తమును అనుష్ఠించుటలో స్త్రీధనములను విడువనివాఁడును 47, మేల్కొనియున్నప్పుడును, కలలు గాంచునపుడును, రాత్రులందును, పగటియందును, ప్రతినిమిషమునందును విషయములయందు దన్మయుఁడై యా తన్మయసౌఖ్యమునఁ దదితరవిషయ ముల జోక్యము వదలినవాఁడును బద్ధుఁడు 48. ఈ బద్ధలక్షణములు ముముక్షుదశలో మాఱిపోవును. కావున బద్ధలక్షణములు మార్చుకొను టకై ముందుసమాసములో ముముక్షులక్షణముల నెఱింగించెదను. ఆలకింపుడు 49.

---

## ఎనిమిదవ సమాసము — ముముక్షు లక్షణములు.

కులాభిమానమున ననేకక్షుద్రములగు నవలక్షణములకు నెలవైన దుష్టునిముఖము గాంచుటగూడదోషమే 1. అట్టిబద్ధప్రాణికి అదృష్టవశమున స్వైరవర్తనములో మెలంగుచుండఁ గాలాంతరమునందు ఖేదము ప్రాప్తిం చును 2. ఈ విధముగ బద్ధప్రాణి సంసారదుఃఖములలోఁ దగుల్కొని పలవించును. త్రివిధతాపములచే సంతప్తుఁడగును. తరువాత నాబద్ధుఁడు

సౌభాగ్యవశమున అధ్యాత్మనిరూపణములనాలించి యంతఃకరణమునందు దనలోపములకుఁ బశ్చాత్తాపమునొందును 3. తరువాతఁ బశ్చాత్తాపఫలముగా గృహస్థాశ్రమమునుండి విడివడును. పిదప విషయసుఖములన్న దనమనస్సులో విసుగునొందును. చాలుచాలు గృహస్థాశ్రమమువలని యుద్వేగము నాకుఁ దగ్గినదని నుడువును 4. అప్పుడు బద్ధుఁడు 'ఈప్రపంచమంతయు నశించునదే. గృహస్థాశ్రమసంబంధములగు శ్రమలవలన ఫలమేమియుఁ గలుగఁబోదు. ఇప్పుడైన నాజీవితమును సార్థకము గావింపవలయు'నని తలంచును 5. ఈవిధముగా బుద్ధి తిరిగిపోయినపిమ్మట బద్ధుఁడు ఆలోచనములోనికిదిగి 'అయ్యయ్యో! నాజీవితము నేఁటిదనుక వ్యర్థముగా గడచిపోయిన'దని వ్యాకులుఁడగును 6. మొదటినుండి గావించిన దోషములన్నియు జ్ఞాపకమునకు వచ్చును. ఆ దోషములన్నియు మూర్తిమంతములై కన్నులకుఁ గట్టినటు లుండును 7. తన దోషములకు విచారపడి దోషఫలముగా సమకూరనున్న యమయాతనఁ దలంచితలంచి హృదయమునందు భయపడును. అంతతోఁబోక తానొనరించిన యగణితములగు పాపములనుగూర్చి యీవిధముగఁ బరితపింప నారంభించును 8.

"అయ్యయ్యో! నాహృదయమునఁ బుణ్యకార్యము లాచరింపవలయునని యెప్పుడును గొంచమేని విచారింపకపోతినిగదా! నాపాపమంతయుఁ బర్వతమువలెఁ బెరిగిపోయినది. ఇఁక నెటు లీదుస్తరసంసారసాగరమును దాటఁగలుగుదును? 9. నాదోషముల నన్నింటిని దాచియుంచుకొంటిని. యోగ్యులు, ఉత్తములునగు పెద్దలసద్గుణములను దోషములని వాకొంటిని. ఈశ్వరా! నేను సాధువులను, అవతారమూర్తులను, సజ్జనులను వ్యర్థముగాఁ దూలనాడి పాపము గట్టుకొంటిని 10. ఈలోకమునందు బరనిందకు సమానమైన దోష మింక నెద్దియును లేదు. ఈదోషము నాయందు విశేషించి పాదుకొనియున్నది. నా దుర్గుణము లాకాశము నావరించినవి 11. సాధుసజ్జనుల గురుతింపలేకపోతిని. భగవంతుని నర్చించుటలోఁ బాలుగొనకపోయినాఁడను. అతిథులను అభ్యాగతులను సైతము సంతుష్టి నొందింపలేనైతిని 12. పూర్వపాపములవలన నేనించుకేనియు సత్కృత్యము లొనరింపలేకపోయినాఁడను. నాహృదయము నిరంతరము దుష్టమార్గములయందే మగ్నమైయుండెను 13. నాశరీరము

నెన్నఁడు కష్టింపఁజేయనైతిని. పరోపకారబుద్ధి మొదలే లేకుండెను. కామమదమువలన నొడలెఱుంగక ఆచారరక్షణముకూడఁ గావింపనైతిని 14. కన్నతల్లివంటిదగు భక్తిని పూర్తిగా వంచించితిని. శాంతి విశ్రాంతులను భంగపఱచితిని. మూర్ఖత్వమువలన సద్బుద్ధిని సద్వాసనలను నాశన మొందించినాఁడను 15. ఇఁక నెట్లు నా జీవితము సార్థకము కాగలదు? వ్యర్థములగు దోషములను నేను లెక్కలేనన్ని గావించితిని. వివేకము నొక నిముసమేని నాదరికి రానీయనైతిని 16. ఇఁక నేయుపాయమున్నది? పరలోకము నాకు లభించుమార్గమేది? అక్కటా! ఓ పరమాత్మా! దీనుఁడనగు నేను నీసన్నిధి కెటుల జేరగల్గుదును? 17. నా హృదయమునం దింతకుమున్ను సద్భావమొకప్పుడేని యుదయింపదయ్యెను. బ్రతికిన నాల్గునాళ్లు మానప్రతిష్ఠల నార్జించుటతో మునిఁగి తేలుచుంటిని. దాంభికత్వముతో నీకర్మకాండనటనమును జూచువారలను దృప్తిపఱచుట కాచరించితిని 18. పొట్టకొఱకై హరికీర్తనము గావించితిని దేవతావిగ్రహములను వీథులందును అంగడులందును బెట్టి ధనమునార్జించితిని,ఓదైవమా! నేనొనరించిన పాపములు నా పాపబుద్ధియు నాకు బాగుగాఁ దెలియును 19. నేను నిరంతరము హృదయములో నభిమానము పెట్టుకొని పైకిమాత్రము గర్వరహితముగా మాటలాడితిని. మఱియు ధ్యానము గావించు నెపముతోఁ బరులధనము నెటుల హరింపఁగలుగుదునా యని యోచించుచుంటిని 20. నాజన్మకాలమంతయుఁ బరుల మోసగించుచు గడిపితిని. నాశాస్త్రజ్ఞాన మిందులకే పాల్పఱచితిని. పొట్టకొఱకు సాధువులను, సజ్జనులను నింద గావించితిని. ఓ యీశ్వరా! నాహృదయమునందు నానావిధదోషములు నిండియున్నవి 21. సత్యమని తెలిసినదానినే నేను ఖండించితిని. మిథ్యనే యెఱింగి ప్రతిపాదించితిని. ఇటులే పొట్టను నిండించుకొనుటకు లెక్కలేనన్ని కపటకర్మముల నొనరించినాఁడను" 22.

ఈ విధముగా ముముక్షుఁడు బద్ధావస్థలోఁ గావించినపాపములకుఁ బరితాపమునొందును. అధ్యాత్మనిరూపణములను పెద్దలకడ నాలించి తన మొదటివర్తనములన్నియును మార్చుకొనును 23. పుణ్యమార్గమువైపున కాతని హృదయము పరుగులిడును. సత్సంగమున కాశపడును. సంసారమునందు విరక్తినొందును 24. రాజులు, చక్రవర్తులు అంతవారు తమతమ

రాజ్యములనువదలి వెళ్ళిపోయిరి. నావైభవ మొకలెక్కలోనిదా ? కావున నేనిప్పుడు సత్సాంగత్యము చేయవలయును అని తలంచును 25. తన యవగుణములనుగూర్చి విచారపడును. విరక్తివశమునఁ దన దుర్గుణము లన్నింటి నెఱుంగును. పశ్చాత్తాపతప్తుఁడై మనస్సులోఁ దననుగూర్చి యిట్లు నిందఁ గావించుకొనును 26.

"అయ్యో ! నేను లోకమున కపకార మొనరించితిని. డాంబికముగాఁ బ్రవర్తించినాఁడను. ఎన్నియో యనాచారములకుఁ బాల్పడితిని 27. నేను చండాలుఁడను, దురాచారుఁడను, ఖలుఁడను, ఇంతియగాదు మహాపాపాత్ముఁడను 28. నాహృదయమున భక్తికిఁ దావే లేదయ్యెను. దుర్జనుఁడ ననిపించుకొంటిని. హీనులలో నత్యంతహీనుఁడనై సంచరించితిని. జ్ఞానహీనుఁడనగు నేనీప్రపంచమున నొకఱాయివలెఁ బుట్టినాఁడను 29. దురభిమానమునకును, క్రోధగుణమునకును నేనాశ్రయముగా నుంటిని. నాయం దెన్నియో దుర్వ్యసనములు నిండియున్నవి 30. నాయంత సోమరిపోతు లోకమునలేడు. నోటిధాటితో లోకులను బెదరించి బ్రతికితిని. కపటము, పిఱికితనము, అనాలోచనము, మూర్ఖత్వము మున్నగు దుర్గుణములకు నేను శరణ్యమైతిని 31. నేను వ్యర్థుఁడను, వదరుబోతును, పాషండుఁడను, కఠోరవచనుఁడను, కుబుద్ధిని, కపటశీలుఁడను, ఎంతని నన్ను నేను వర్ణించెదను? 32. నేను పూర్ణముగా జ్ఞానవిహీనుఁడను. నాకంటె హీనుఁ డీలోకమున నుండఁబోడు. ఇంకను నాయం దెన్ని యవలక్షణములు పాదుకొనియున్నవో నేనెఱుంగను 33. నేనధికారుఁడను. మలినస్వాంతుఁడను. పనికిమాలినవాఁడను. అత్యంత నీచహృదయుఁడను 34. నేనంతయు నపస్వార్థుఁడను, గొప్ప యసమర్థుఁడను, పరమార్థవాసన నాయందు మందునకేని లేదు 35. అవగుణరాశినగు నేనీలోకమున వ్యర్థముగా జన్మించి భూమికి మిగుల భారమైతిని" 36.

ఈ విధముగ నాతఁడు తన్నుఁదా నిందించుకొనును. గృహస్థాశ్రమమన్నఁ బూర్తిగా నాతనికి విసుగెత్తిపోవును. సత్సంగముకొఱకు నిరంతరము బరితపించును 37. పుణ్యము సంపాదించికొననెంచి యనేక పుణ్యతీర్థములను సేవించును. శమదమాది సాధనములలోఁ దన్మయుఁడై వర్తించును. అనేక మహాగ్రంథములను జక్కఁగాఁ బఠించును. కాని వీనివలన

నాతని కించుకేని సమాధానము కలుఁగదు. సమస్తము నాతనికి సందేహా యుక్తముగా గోచరించుచుండును. ఇఁక సాధువుల శరణ్యములోని కరుగ వలయునని నిశ్చయము గావించుకొనును 38 – 39. దేహాభిమానమును, కులాభిమానమును, ద్రవ్యాభిమానమును నాతఁడు విడిచి నానాభిమాన ములను మఱచి సాధుజనుల శరణ్యమునం దనన్యభావము వహించును 40. అంతతో నూరకుండక యహంకారమును బూర్తిగావిడిచి తన్నుఁదాను బహుభంగుల నిందించుకొనును. మోక్షమునందు గాఢముగఁగోర్కి నెల కొల్పును 41. నేను గొప్పవాఁడనని యంతకుమున్ను ఱెట్టపీగినందులకుఁ బరితపించును. పరమార్థముకొఱకుఁ గష్టించును. సాధుసజ్జనుల చరణ కమలములే తన్నుద్ధరించునవియను నమ్మిక మాతని హృదయమున గట్టిగాఁ బాదుకొనును 42. అనంతరము తన గృహస్వార్థములను బ్రపంచ మును విడిచి పరమార్థమునం దుత్సాహముంచును. ఇఁక నిది మొదలు సాధుసజ్జనులకు దాసుఁడనై యుండెదనని నిశ్చయించుకొనును 43. పైని చెప్పఁబడిన యవలక్షణములనుండి విముక్తుఁడైన పురుషుని ముముక్షుఁడని తెలిసికొనవలెను. ఇఁకముందు సాధక లక్షణములను వివరించెదము 44.

---

## తొమ్మిదవ సమాసము — సాధకలక్షణము.

గత సమాసమునందు మీకు ముముక్షులక్షణములు సంగ్రహ ముగాఁ దెలిపితిని. ఇపుడు సావధానబుద్ధితో సాధకలక్షణములను వినుండు1. తనకుఁ బూర్వమున్న దుర్గుణము లన్నింటినిఁ బూర్తిగా విడిచి పరమార్థ మును గడింప సాధుసజ్జనుల సమాగమము కోరువాఁడు సాధకుఁ డనఁ బడును 2. సాధుజనుల శరణ్యములోని కరుగువానిని, సజ్జనులచే నాదరింప బడువానిని బెద్దలు శాస్త్రములలో సాధకుఁడనిచెప్పిరి 3. సాధుసజ్జనులకడ నాత్మోపదేశము నొంది సంసారబంధములను దొలంగించుకొనుటకు సాధ నము గావించువాఁడును, ఆత్మజ్ఞానము దృఢముగానుండుటకు నిరంతరము సాధనమొనరించువాఁడును సాధకుఁడనఁబడును 4. వాఁడు అధ్యాత్మ శ్రవణమునందును, అద్వైతనిరూపణమునందును బ్రీతియు నభిరుచియు నుంచును. సద్గ్రంథములను మననముగావించి వానియర్థమును, సారమును

వెలికిఁదీయును 5. సారాసారవిచారమును మనస్సుంచి యాలకించును. మఱియుఁ దనకుఁగల సందేహములను దొలంగించుకొని దృఢభావముతో నాత్మజ్ఞానవిచారణము చేయును 6. సాధకుఁడు తన హృదయమునందు నెలకొనియున్న బహువిధ సందేహములను రూపుమాపుకొనుటకై సత్సాంగత్యము నిరంతరము గావించుచుండును. మఱియు శాస్త్రాను భవమును, గురుని యనుభవమును, ఆత్మానుభవమును (ఈ మూఁడిటిని) నేకము గావించును* 7. సాధకుఁడు వివేకముతో దేహబుద్ధిని నిగ్రహించును. ఆత్మబుద్ధిని దృఢముగా ధారణ గావించును. మఱియు శ్రవణమననములను జేయుచునేయుండును 8. దృశ్యమును (సంసారము, ప్రకృతి, మాయ) గూర్చిన యభిమానమును విడిచి సాధకుఁడు దృఢముగా నాత్మజ్ఞానమును ధారణము జేయును. వివేకసహాయమున సమాధానము నొందును 9. ద్వైతోపాధిని (మాయికసృష్టిని)అద్వైతవస్తువును (కేవలబ్రహ్మమును) సాధకుఁడు సాధనముల సహాయముఁనఁ బడయును. మఱియు ఏకత్వమును సమాధి ననుష్ఠించును 10. మలినమైయుండిన తన జ్ఞానమును బ్రకాశింపఁజేయుచు వివేకముతో నాతఁడు భవసాగరమును దాటిపోవును11.సాధకపురుషుఁడు సద్గ్రంథములవలన నెఱింగిన ఉత్తమసాధు లక్షణములను తన యాచరణములోనికిఁ దెచ్చుకొనును. పరమాత్మునిలో లీనమగుట కుత్సహించుచుండును 12. అసత్కర్మములను బరిత్యజించి సత్కర్మములను వృద్ధిగావించును. స్వరూపస్థితిని దృఢముజేయును13. దిన దిన క్రమముగాఁ దనకడనున్న దుర్గుణములను విడనాడి యుత్తమ గుణముల నభ్యసించును. ఆత్మస్వరూపమునందు నిదిధ్యాసము(తదేకధ్యానము) పెట్టును 14. దృశ్యము (సంసారము) అస్తిత్వముగా నున్నప్పటికిని తన దృఢనిశ్చయ బలసహాయమున దానికి బద్ధుఁడుగాక యాతఁడెల్లప్పుడును స్వరూపములోఁ గలసిపోవుచుండును15. ప్రత్యక్షముగనున్నను మాయను

* ఎంతదనుక సత్సాంగత్యము గలుగదో యంతదనుక నానావిధములగు సందేహములు నశింపవు. ఈసందియములను నశింపఁజేయుశక్తి సాధుజనులయందున్నది. సత్సంగతివలన సాధకుఁడు ఆత్మానుభవము, శాస్త్రానుభవము, గురుని యనుభవము నొకటిగ సిద్ధాంతపరచును. ఇట్లు తన యనుభవము, శాస్త్రసిద్ధాంతము, గురునివలన బొందిన యుపదేశము నభ్యాసము గావించినపిదప అంతమున సాధకున కీమూఁడు నొక్కటియను నంశ మనుభవములోనికి వచ్చును.

లక్ష్య పెట్టఁడు. మఱియు నలక్ష్యమును అదృశ్యమునగువస్తువు (బ్రహ్మము)ను అంతఃకరణమునందు లక్షించుచుండును. ఈ విధముగా ఆత్మస్థితిని సాధకుఁడు ధారణముచేయును 16. జనులకు సాధ్యముగాక దాఁగియున్నదియు మనస్సహాయమున ననుమానముచేనైన నున్నటు లెఱుంగరానిదియనగు బ్రహ్మమునే సాధకుఁడు ధారణము గావించును 17. వర్ణనమున కారంభించినంతన మాటలుతోఁచక వాగ్బంధనము గలిగించునదియుఁ జూడనారంభించినంతన కానరాక గ్రుడ్డితనము గూర్చునదియు (వాఙ్నేత్రముల కతీతమైనదియు) నగు వస్తువును సాధకుఁ డనేకయుక్తుల సహాయమునఁ బడయఁగలుగుచున్నాఁడు 18. సాధించుటకు సాధ్యముగానిదియుఁ జూచుటకు దొరకొన్నంతన గానరానిదియునగు తత్త్వము నాతఁడనుభవములోనికిఁ దెచ్చుకొనును 19. ఎచ్చట విచారణము గావింపఁజాలక మనస్సే లోపించిపోవునో ఎచ్చట తర్కమే కుంటువడిపోవునో యట్టివస్తువునే సాధకుఁడు దృఢముగా ననుభవములోనికిఁ దెచ్చుకొనును 20. సాధకుఁడు స్వానుభవయోగముకతన శీఘ్రముగా వస్తువును స్వాధీనము జేసికొనుచున్నాఁడు. అంతియగాదు ఆతఁడే స్వయముగా వస్తువై పోవును 21. ఆతఁడనుభవమార్గమును దెలిసికొని యోగిలక్షణములను బడయుచున్నాఁడు. మఱియు సంసారమున లిప్తుఁడై యుండి కర్మయోగి యగుచున్నాఁడు 22. ఉపాధికి వేఱుగానుండి సాధకుఁ డసాధ్యవస్తువును సాధనముల సహాయమునఁ బడయఁ గలుగుచున్నాఁడు. ఆత్మస్వరూపముతో దన బుద్ధిని దృఢపఱచుచున్నాఁడు 23. ఈశ్వరుఁడన నేమియో భక్తుఁడన నేమియో తెలిసికొనఁగోరి దానిమూలమును శోధించును. దేనిని సాధ్యము గావింపవలయునో యదిగాఁ దానుమాఱును 24. సాధకుఁడు వివేకబలమున గుప్తుఁ (అంతర్ముఖుఁ) డగును. తనలోఁ దాన లుప్తుఁడై (స్వరూపమునందు నిరంతరము లయుఁడై )పోవును. మఱియు నొకవేళ(తనస్థూలశరీరము కనుపించుచున్నను) వానినెవ్వరును గాంచఁజాలరు 25. వాఁడు నేను (అహం) అను దానిని వెనుకకుఁ ద్రోసివేయును. స్వయముగాఁ దన్ను దా నన్వేషించును. తుర్యావస్థనుగూడ దాటిపోవును 26. అటుపిమ్మట ఉన్మనీయావస్థాంతమునం దాతఁ డఖండరీతితో స్వయముగాఁ దనతోఁ గలసిపోవును. (అఖండాత్మానుభవము నొందును)

ఈ విధముగా సాధకుఁడు ద్వైతసంబంధమును విడిచివేయును. భాసియొక్క భాసత్వమునకుఁగూడ సాక్షిగనుండడు. దేహమునందుండియే విదేహుఁడై పోవును 28. ఆతఁడఖండస్వరూపస్థితియందుండును. దేహాహంకారమును విడిచివేయును. సందేహమును సంపూర్ణముగా నివృత్తిగావించుకొనును 29. పంచభూతాత్మికమగు నీ విశాలప్రపంచమంతయు సాధకునకు స్వప్నమువలెఁ దోచును. మఱియు నాతనికి నిర్గుణస్వరూపము నిర్ధారణమైపోవును 30. స్వప్నమునందు దోచిన భయము జాగ్రదవస్థలోఁ గనుపింపనట్లు ఆతఁడీ సంపూర్ణ ప్రపంచమును మిథ్యగాఁ దలంచును 31. జనులకు సత్యముగాఁ గాన్పించుచున్న ఈ మాయారూపమును సాధకుఁడు స్వానుభవమువలన మిథ్యగా భావించుచున్నాఁడు 32. నిద్రనువిడిచి మానవుఁడు జాగ్రదవస్థ నొందినపిదప స్వప్నభయమునుండి విడివడునట్లు మాయనువిడిచి సాధకుఁడు స్వరూపస్థితినిఁ బ్రాప్తించుచున్నాఁడు 33. ఈ విధముగా వాని యంతఃకరణము స్వరూపస్థితియందుండును. వెలుపల నుండి యాతఁడు నిస్పృహత్వము నవలంబించును. సంసారమును విరక్తి భావముతోఁ దలంచును. కామము, క్రోధము, మదము, మాత్సర్యము నొకప్రక్కకుఁ ద్రోసివేయును 34-35. సాధకుఁడు కులాభిమానమును త్యజించును. లోక లజ్జను గూలద్రోయును. విరక్తిబలము నూతఁగాఁగొని పరమార్థభేరిని మ్రోగించును 36. అవిద్యనుండి దూరమగును. ప్రపంచము నుండి తొలంగును. ఆకస్మికముగా లోభమునుండి యావలఁబడును 37. నేను గొప్పవాఁడనను అహంభావము నంతరింపఁజేయును. వైభవమున కరికాలు చూపును. విరక్తిబలమువలనఁ బ్రతిష్ఠనుఁగూడ ధిక్కరించివేయును 38. భేదమును నాశనము గావించును. అహంభావమును గొట్టివేయును. మఱియు, సందేహరూపమును (సందేహమును) ఆవలకుఁ జిమ్మును 39. వికల్పమును వధించును. భవసింధువును దన్ని దిక్కులకు వెదఁజల్లును. సమస్తజీవులపట్లఁ దనకుఁగల విరోధమును త్రెంపివేయును 40. పాపభయమునకు వెఱపుగలిగించును. కాలపు టెక్కలను విఱచివేయును. జన్మమృత్యువుల మస్తకములనుఁ జూర్ణముగావించును 41. దేహసంబంధమగు అహంభావముపైకి దండెత్తును. సంకల్పముపై దాడివెడలును. కల్పనము లాకస్మికముగాఁ జంపివేయును 42. భీతిని నాకస్మికముగాఁ

దాడన మొనరించును. లింగదేహమును శిథిలము గావించును. పాషండ మతమును వివేకబలముచే నోడించును 43. గర్వమును బరాభవించును. స్వార్థము ననర్థమునఁ బడవేయును. అనర్థమునుగూడ నీతిచే న్యాయముచే ఖండించివేయును 44. మోహమును మధ్యనే త్రెంచివేయును. దుఃఖమును నిర్మూలనము చేయును. శోకమును బీల్చి యొకమూల పారవేయును 45. ద్వేషమును తన సరిహద్దులలో నిలువనీయఁడు. నాస్తికత్వమును దెగటార్చును. మఱియు సాధకుని భయమువలనఁ గుతర్కము మొదలంట నశించును 46. జ్ఞానమువలన వివేకమును, వివేకమువలన వైరాగ్యవిషయిక నిశ్చయభావమును బ్రబలము గావించుకొని సాధకుఁడు తనయెడనున్న దుర్గుణముల నన్నింటిని వినాశనమొనర్చును 47. అధర్మమును స్వధర్మముతో జయించును. కుకర్మములను సత్కర్మములవలన రూపుమాపును. విచారమువలన అవిచారమును దీసివేయుమార్గము జూపించును 48. తిరస్కారమును దిరస్కరించును. ద్వేషమును గూలార్చును. విషాదమును సంతోషముచే నిర్జించి లోఁగొనును 49. కోపముమీఁదఁ దనయధికారము జూపును. కపటమును లోలోననే నశింపఁజేయును. ప్రపంచమునందలి సమస్త మానవబృందమును దనకు మిత్రులనుగా జేసికొనును 50. ప్రవృత్తిని బరిత్యజించును. సుహృదుల సాంగత్యమును విడిచివేయును. నివృత్తిమార్గమును జ్ఞానయోగమును బడయును 51. సాధకుఁడు విషయరూపియగు మోసకానిని మోసగించును. కువిద్యను ముట్టడించును. ఆప్తరూపులగు చోరులనుండి తాను తొలంగి బైటఁబడును 52. పరాధీనతపై నాగ్రహించును. మమకారమును దరికి జేరనీయఁడు. ఆకస్మికముగా దురాశాత్యాగము గావించును 53. స్వరూపమునందు హృదయమును మగ్న మొనరించును. యాతనకు యాతన గూర్చును. ఉద్యోగప్రయత్నములకు వీడ్కోలుపు దెలుపును 54. సాధనమార్గములతో నభ్యాసప్రయత్నములు గావింపనారంభించును. ప్రయత్నపూర్వకముగాఁ బని కారంభించును. ప్రయత్నమును దనకు మంచిసహకారినిగాఁ జేసికొనును 55. సాధకుఁడిట్లు వర్తించి యనంతరము సావధానుఁడును దక్షుఁడునునై నిత్యానిత్యవివేచనము జేయును. మఱియు దేహబుద్ధిసాంగత్యమును విడనాడి, కేవల సత్సంగమును బరిగ్రహించును 56.

సంసారమును బలవంతముగా వదలిపెట్టును. వివేకముతో గృహస్థసంబంధ ములగు చిక్కులనన్నిఁటిని విడిచివేయును. మఱియు శుద్ధాచారము నూత గాఁగొని యనాచారమును భ్రష్టముచేయును 57. మఱిపును దరిచేర నీయఁడు. ఆలస్యమున కలసతగూర్చును. దుశ్చిత్తముతో నిముసమేని వర్తింపఁడు. దుశ్చిత్తముతో నుండుట కియ్యకొనఁడు 58.

సాధకపురుషుఁడు అధ్యాత్మికనిరూపణశ్రవణముగావించి యవగుణ ములను వీడును. ఉత్తమమార్గములలోనికి వచ్చును 59. అతఁడు దృఢ భావముతో విరక్తుఁడై పరమార్థమార్గమును బడయుటకై సాధనములను జేయును. ఇఁక సిద్ధలక్షణములను ముందుసమాసములోఁ దెలుపనున్నాఁ డను. శ్రోతలారా! సావధానులై వినుండు 60. ఇచట నిస్పృహుఁడును, విరక్తుఁడును నగు పురుషుఁడే సాధకుఁడగునా? సంసారమునందున్న మను ష్యులు త్యాగముచేయనిచో సాధకులు కాఁజాలరా? యనునొకసందియము కలుగుచున్నది 61. ఈ శంకకు సమాధానముగూడ రాఁబోవుసమాసము నందుఁ జెప్పెదను. ధ్యానపూర్వకముగా వినఁగోరెదను 62.



## పదియవ సమాసము -- సిద్ధలక్షణములు.

సంసారమునం దుండెడిమానవులు త్యాగము గావింపనియెడల సాధకులు కాఁజాలరా? యను గతసమాసమునందలి సందేహమున కిప్పుడు సమాధానమును జెప్పుచున్నాఁడను 1. గృహస్థధర్మము పరిపాలించుచు సాధకుఁడు గాఁదలచినయెడల మానవుఁడు సన్మార్గస్వీకారమును అసన్మార్గ త్యాగమును జేయవలసియే యుండును 2. కుబుద్ధిని విడువకున్న సుబుద్ధి కలుగఁజాలదు. కావున కుబుద్ధిని, అసన్మార్గమును బరిత్య జించుటయే సంసారమనుజుని (గృహస్థుని) త్యాగము 3. ప్రపంచమును జెడ్డదిగాభావించి మనఃపూర్వకముగా నెప్పుడు మానవుఁడు విషయత్యాగ మొనరించునో యప్పుడే ముందునకువచ్చి పరమార్థమును బడయఁగల్గును 4. నాస్తికత్వము, సంశయము, అజ్ఞానముల త్యాగము, పరమార్థము బడసినపిమ్మట మెల్లమెల్లఁగా జరుగును 5. పై నినుడివిన యాంతరిక త్యాగము సాంసారికులు, నిస్పృహులు (విరాగులు) చక్కఁగా నిర్వ

హింపవలయును. నిస్పృహునికొఱకై బాహ్యత్యాగము నింకను విపుల ముగాఁ జెప్పఁబడియున్నది 6. కాని సాంసారికుల (గృహస్థుల) పట్లగూడఁ గొన్నికొన్నియెడల బాహ్యత్యాగ మవశ్యముగాఁ గావలసియున్నది. ఏలయన, ఈ త్యాగమే లేకున్నచో నిత్యనియమము, సద్గ్రంథశ్రవణము జరుగఁజాలదు 7. దీనివలనఁ బైనిచేర్కొనఁబడిన సందేహమునకు సులభ ముగా సమాధానము కలుగును (అనఁగా త్యాగము లేనిది సాధకుఁడు కాఁజాలఁడు). ఇప్పుడు మనము పూర్వనిరూపణములోనికిఁ బోదము రండు 8. గతసమాసములో సాధకుని లక్షణములు చెప్పితిని. ఇప్పుడు సిద్ధలక్షణములు వినుండు 9.

సిద్ధపురుషుఁడు స్వయముగా బ్రహ్మమైపోవును. వానిసంశయము బ్రహ్మాండమునుదాటి యావలికిఁ బోవును. ఆతని నిశ్చయము అచలమై యుండును 10. బద్ధుని అవగుణములు ముముక్షువునం దుండవు. ముము క్షుని లక్షణములు సాధకునియం దుండవు 11. అటులే సాధకుని సందేహ వృత్తి ముందునకరిగిన పిమ్మట సిద్ధావస్థయందు నివృత్తియై పోవును. కావున నెట్టి సందేహములకును ఆస్పదముగా నుండనివానిని సిద్ధపురుషుఁ డనిఁ దెలిసికొనవలయును 12. సంశయరహితమగు జ్ఞానమే సాధులక్ష ణము. సిద్ధపురుషుల కెన్నఁటికిని సందేహము కలుగఁజాలదు 13. కర్మ మార్గము సందేహములతో నిండియున్నది. సాధనములవలన సంశయ ముత్పన్నమయ్యెను. అన్నిటియందును సంశయము నిండియున్నది. నిస్సందేహుఁడు సాధుపురుషుఁ డొక్కఁడేసుమా! 14. ఎవనికేని యొకవేళ తన జ్ఞానముపట్లను, వైరాగ్యముపట్లను, భజనముపట్లను సందేహము నుండినచో, నవియన్నియు నాతనికుపకరింపక నిష్ఫలములగును 15. అటులే ఎవనికేని యీశ్వరునియందును దనభక్తియందును సందేహమున్నచోగాని, లేక తన స్వభావమునందే సందేహమున్నచోగాని వాని సాధనము లన్నియు వ్యర్థములగును 16. ఎవనికేని తనవ్రతము, తీర్థము, పరమా ర్థము మున్నగువానియెడ సందేహమున్నయెడల నవియన్నియు నాతనిపట్ల నిష్ఫలములగును 17. సంశయాత్మకమగు భక్తియుఁ బ్రీతియు సాంగత్య మును వ్యర్థము. మఱియు వానివలన సందేహములే యభివృద్ధి నొందును 18. సంశయసహితమగు జీవితము, సంశయసహితమగు

కృత్యము, సంశయసహితమగు ధారణము మున్నగునవన్నియును వ్యర్థములు 19. పుస్తకము, శాస్త్రజ్ఞానము, ఏదేనిపని సందేహసహితమైనచో (నిశ్చయరహితమైనచో) వ్యర్థము 20. సంశయయుక్తమగు దక్షత్వమును సంశయయుక్తమగు పక్షపాతమును వ్యర్థములు. సంశయయుక్తమగు జ్ఞానముగలవాని కెన్నటికిని మోక్షము లభింపఁజాలదు 21. సాధువులు, పండితులు, బహుశ్రుతులు నగువారలునైనను నొకవేళ సంశయసహితులుగను నిశ్చయరహితులుగను నున్నచో వారును వ్యర్థులే యగుదురు 22. సంశయుని శ్రేష్ఠత్వమును ఉత్పన్నతయును వ్యర్థములు. అటులే సంశయుని నిశ్చయరహితమగు జ్ఞాతృత్వముగూడ వ్యర్థమే 23. నిశ్చయములేనిచో నేదియు అణుమాత్రమేని ప్రామాణ్యమును గలిగియుండదు. ఇవియన్నియు వ్యర్థములై సందేహప్రవాహములోఁ బడిపోయినవి 24. నిశ్చయములేక చెప్పెడిదంతయుఁ బరిగ్రహింపఁ దగనిది. వాచాలుఁడై యమితముగాఁ జెప్పుటయు వ్యర్థమేయగును 25. నిశ్చయములేని వ్యాసము (ఉపన్యాసము) విలంబనామాత్రమే. సంశయమువలన సమాధానమెద్దియును లభింపఁజాలదు 26. కావున సందేహరహితమును నిస్సంశయము నగు జ్ఞానమే మఱియు నిశ్చయ యుక్తమగు సమాధానమే సిద్ధలక్షణము 27. దీనినంతయు విన్నపిదప శ్రోత యిటుల ప్రశ్నించుచున్నాఁడు. నిశ్చయ మెద్దానినిగూర్చి చేయవలయును? నిశ్చయమనుదానికి ముఖ్యలక్షణములెవ్వి? సెలవిండు 28. మంచిది వినుఁడు. దైవతము ఎట్టిదో తెలిసికొనుటయే నిశ్చయమునకు సరియగు లక్షణము. ఇదిదక్క నానావిధములగు దేవతలగొడవ యెప్పుడును వ్యాపింపఁజేయఁదగదు 29. ఎవఁడు చరాచరములను సృజించెనో యా భగవానునిగూర్చి విచారింపవలయును. మఱియు శుద్ధమగు వివేకము నుపయోగించి పరమాత్మని గుర్తింపవలయును 30. ముఖ్యదైవత మెద్దియో భక్తుని లక్షణములెయ్యవియో యెఱుంగవలయును. అసత్యమును విడనాడి సత్యమును గ్రహింపవలయును 31. మొట్టమొదట తన సత్యదేవుని గురితింపవలెను. తరువాత నేననువాఁడెవఁడు అనువిషయమును శోధింపవలయును. సర్వసంగపరిత్యాగము గావించి సిద్ధుఁడు వస్తురూపియై (బ్రహ్మస్వరూపుఁడై) యుండవలయును 32. బంధనములవలనఁ గలుగు సంశయములను ద్రెంచి

వేయవలయును. మోక్షమునుగూర్చి నిశ్చయము జేసికొనవలయును. పంచ భూతములను విచ్ఛేదముగాభావించి వానియన్వయము (మిశ్రణము) ఎట్టు లగుచున్నదో చూడవలయును 33. పూర్వపక్షమును సిద్ధాంతముతోఁ గలిపి ప్రకృతిమూలమును వీక్షింపవలయును. దీనికిఁ బిమ్మట శాంతముగాఁ బరమాత్మ నిశ్చయము ప్రాప్తించును 34. సంశయము దేహాభిమాన ముతోఁగలసి సత్యమగు సమాధానమును వినాశనము గావించును. కావున ఆత్మబుద్ధియొక్క నిశ్చయమును స్థిరముగా నుంచవలయును 35. ఆత్మజ్ఞానము సిద్ధించినపిదపఁగూడ నొకానొకఁడు దేహాభిమానమునకు సందేహ కల్పనమునకుఁ బాలగుచుండును. కావున ఆత్మనిశ్చయ పూర్వక మగు సమాధానమును రక్షణము గావించుచుండవలయును 36. *దేహ బుద్ధి జ్ఞప్తికిరాఁగానే వివేకము విస్మరణము (మఱపు) నకు వచ్చును. కావున ఆత్మబుద్ధిని దృఢముగా ధారణముచేయవలయును 37. నిశ్చయ మునుగూర్చిన యాత్మబుద్ధి కలుగుటయే మోక్షశ్రీయొక్క దశ. "అహ మాత్మా" (నేనాత్మఁడను) అనుదాని నెన్నఁటికిని మఱువఁజనదు 38. ఈ విధముగా నిచ్చట నిశ్చయలక్షణమునుగూర్చి తెలిపితిమి. కాని సత్సాంగత్యములేనిచో నిది విశదముగాఁ దెలిసికొన వీలుగాదు. సాధు జనుల శరణ్యములోని కరుగుటవలన సమస్త సందేహములు నివారణ మగును 39.

మంచిది. ఇపుడీవార్తను ముగింతము. సిద్ధులలక్షణములను దెలుపు చున్నాఁడను వినుఁడు. నిస్సందేహత్వమే సిద్ధుని ముఖ్యలక్షణము 40. సిద్ధస్వరూపములందు దేహమేలేదు (నిరాకారుఁడు). ఇఁక నచట సందేహ మెక్కడినుండి వచ్చును? 41. దేహాభిమాన కారణమున అనేక లక్షణ ములతో ఆస్తిత్వము కలుగుచుండును. కాని యెవఁడు దేహాతీతుఁడో వానికేమి లక్షణములను జెప్ప వీలుకలుగును? 42. నేత్రములతోఁ జూచు టకు వలనుగానిదాని లక్షణములను మాటలతో నెటుల వివరింపఁగలను? నిర్మలవస్తువగు (కేవల బ్రహ్మస్వరూపుఁడగు) సిద్ధునియం దితరలక్షణము

* దేహబుద్ధి — దేహమే నేనను భావమును గ్రహించుట - నేనను శబ్దమునుండి దేహాతీతమగు ఆత్మయను నర్థమును గ్రహించుట.

లెక్కడనుండివచ్చును? 43. లక్షణములనఁగా కేవలగుణములు. అటు వస్తువన్ననో (బ్రహ్మ) నిర్గుణమయ్యెను. ఆ వస్తురూపుఁడగుటయే (నిర్గుణ బ్రహ్మరూపుఁడగుటయే) సిద్ధుని లక్షణము 44. ఇనను జ్ఞానదశకమునందు సిద్ధుల లక్షణములను గురుతించురీతిగా వివరించితిని. కావునఁ బ్రస్తుత సమాసమునం దీవ్యాఖ్యానము చాలునని సమాప్తిగావించితిని. న్యూనాధిక్యములనుగూర్చి శ్రోతలు క్షమింౘెదరుగాక 45.

**ఐదవదశకము సమాప్తము.**





# ఆఱవ దశకము.



## మొదటి సమాసము – పరమాత్మని గురుతించుట.

*చిత్తమును స్థిరము గావింపుఁడు. శ్రోతలారా! ఇదివఱకుఁజెప్పిన దంతయు మనస్సునం దుంచుఁడు. మఱియు నింక నొక క్షణమాత్రము సావధానమతితోఁ గూర్చుండి చెవియొగ్గి యాలింపుఁడు 1. ఒకగ్రామము నందైనను లేక యొక దేశమునందైనను మనము నివసింపవలసి యున్న యెడలఁ దొలుతొలుత నాగ్రామమునుగాని, దేశమునుగాని పరిపాలించు స్వామిని (యజమానుని) కలసికొనవలయును. అతనితో సమావేశము గావింపఁజాలమేని సౌఖ్యము లభింపఁజాలదు 2. కావున నెవరెచట నివసింపఁబోవుచున్నారో యచటి యజమానుని గలసికొనుట యావశ్యకము. దానివలన సమస్తవిధములచేతను మేలు కలుగును 3. స్వామి (యజమాను)తో సమావేశముగావించి పరిచయము జేసికొననిచో మానావమానములుకలుగుట సహజము. యజమానితోఁ బరిచయము కలుగజేసికొననివానికి అగౌరవముకలుగుట (మహాత్వముపోవుట) కెంతయో యాలస్యము పట్టదు 4. ఈ కారణములకతన శ్రీమంతుఁడుమొదలుకొని దరిద్రుఁడుదనుక నెవ్వఁడెందు నాయకుఁడుగానుండునో యట్టివాని సమావేశ మవశ్యముగా నొనరింపవలయును. ఆలోచనాశక్తిగల మానవుఁడీవిషయములోని రహస్యమును దెలిసికొనఁగలుగును 5. యజమానునితో నేమిపనియని యతనిని గలిసికొనక గ్రామములో వసించినయెడల రాజ

---

*మొట్టమొదట కష్టమయసంసారము, త్రివిధతాపములు, నవవిధభక్తులు, విరక్తులు, సద్గురుఁడు, సచ్ఛిష్యులు, శుద్ధజ్ఞానము మున్నగు విషయములనుగూర్చి కావించిన చర్చయంతయు మనస్సులో నుంచుకొనవలయును. ఈ చెవినుండి విని యాచెవినుండి విడువఁగూడదని శ్రీ సమర్థ రామదాసస్వామి శ్రోతలకు సూచించినాఁడు.

ముందు అధ్యాత్మనిరూపణము కాఁబోవుచున్నది గావున స్థిరచిత్తులుకండని శ్రోతలను శ్రీసమర్థులు హెచ్చరించిరి.

దూతలు వెట్టిపనులకుఁ బట్టుకొనిపోయెదరు. మఱియు దొంగతనము జేయకపోయినను దొంగ నేరమువచ్చి తలపైఁ బడును 6. కావున నేర్పరియు నుచితవివేకియు నగువాఁడు యజమానునితోఁదప్పక పరిచయము సంపాదింపవలయును. ఇట్లు గావింపనివారు గార్హస్థ్యజీవితమునందు అనేక సంకటముల ననుభవింపవలసివచ్చును 7. గ్రామమునందు గ్రామాధికారి పెద్ద యనిపించుకొనును. వానికంటె దేశాధిపతి పెద్దవాఁడు. దేశాధిపతికంటె రాజు గొప్పవాఁడుగాఁ బరిగణింపఁబడును 8. రాష్ట్రమున కంతకును నెవ్వఁడు యజమానుఁడో వానిని రాజందురు. మఱియుఁ బెక్కు రాష్ట్రములకు యజమానుఁడగువానిని మహారాజందురు. ఇటులే మహారాజులకుఁగూడ నధిపతిగా నుండువానినిఁ జక్రవర్తి యనియందురు 9. ఒకఁడు నరపతియైయుండును. మఱియొకఁడు గజపతియైయుండును. వేఱొకఁడు అశ్వపతియైయుండును. ఇంకనొకఁడు భూపతియైయుండును. కాని వీరలందఱిలోఁ బెద్దవాఁడు చక్రవర్తియైయున్నాఁడు 10.

వీరలనందఱిని సృజించినవాఁడు బ్రహ్మ. కాని యాబ్రహ్మను సృజించినదెవఁడో యెఱుంగవలయును 11. బ్రహ్మను, విష్ణును, మహేశ్వరునిగూడ నెవఁడు సృజించెనో యాతఁడే వేలుపులందఱిలో గొప్పవాఁడు. ఆవేలుపు పెద్దయగు పరమేశ్వరుని నానాప్రకారములగు సాధనములతో గురుతింపవలయును 12. ఆ పరమాత్మని ప్రాప్తి కలుగనంతదనుక యమయాతన తొలంగిపోవఁజాలదు. అట్టి బ్రహ్మాండనాయకునితో మనకు సమావేశము గలిగించుకొనకుండుట శ్రేయోదాయకముగాదు 13. సమస్త చరాచర భూతావృతమగు నీవిశ్వమును సృజించినవాఁడును బ్రహ్మాండమును గల్పించినవాఁడుననగు పరమాత్మని గురుతింపజాలనివాఁడు పతితుఁడు (పదచ్యుతుఁడు) 14. కావున నీశ్వరుని గురుతించి జన్మము సార్థకము గావించుకొనవలయును. ఒకవేళ నీ విషయమావంతయేని తెలియకున్నయెడల సజ్జనసాంగత్యము గావింపవలయును. దానివలన సమస్తమును దేటతెల్లమగును 15. ఎవఁడు భగవానునెఱుంగునో యతఁడె అవతారపురుషుఁడు. అతఁడే నిత్యానిత్యములను, శాశ్వతాశాశ్వతములను నిశ్చయింపఁ గలిగియుండును 16. పరమాత్మని అచలుఁడనియు, అవికారి యనియు నెవఁ డనుభవపూర్వకముగా నెఱింగి యున్నాఁడో

వానిని మహానుభావుఁడనియు అవతార పురుషుఁడనియు సాధువనియు నెఱుంగవలయును 17. మానవసంఘములో నివసించుచుండియు మానవాతీతములును అలౌకికములును నగు విషయములను గూర్చి భాషించునాతఁడును, అంతర్యమునందు నిరంతరమునుఁ బ్రజ్వలించు జ్ఞానముతో నుండువాఁడును సాధుపురుషుఁడు 18. పరమాత్మనియొక్క నిర్గుణ నిరాకారమును అనుభవము గావించుకొనుటయే ముఖ్యమగు జ్ఞానము. దీనికి భిన్నములగునవన్నియు నజ్ఞానములు 19. కొందఱు మనుష్యులు పొట్ట నిండించుకొనుట కభ్యసించు విద్యల నన్నింటెనికూడ జ్ఞానమని నుడువుదురు. కాని వానివలన నెన్నఁటికిని జన్మము సార్థకముగాదు 20. పరమాత్మని గుర్తించుట కేవిద్య యుపకరించునో యదియే జ్ఞానము. దానివలననే జీవితము సార్థకము సఫలము నగును. తక్కినవన్నియు నిరర్థకములు. పొట్టకూటివిద్యలు 21. మానవులు బ్రతికియున్నంత దనుక పొట్టను నిండించుకొనుచునే యుందురు. దేహరక్షణము గావించుచునే యుందురు. అంత్యకాలమున కివియన్నియు వ్యర్థములై పోవును 22. కావునఁ బొట్టనిండించుకొనుటకై నేర్చుకొను విద్యలనన్నిఁటిని సద్విద్యలని చెప్పఁదగదు. ఏ విద్యవలన సర్వవ్యాపకమగు బ్రహ్మము తత్కాలము నందే లభించునో యదియే జ్ఞానము 23.

ఇట్టిజ్ఞాన మెవనికడనున్నదో వానిని సాధువని యెఱుంగవలయును. వానియొద్దకరిగి పరమశాంతికి వలయు నుపాయ మడుగవలయును 24. అజ్ఞాన పురుషునియొద్ద కజ్ఞానిపోయినయెడల జ్ఞాన మెటుల లభించును? దరిద్రునియొద్దకు యాచించుట కొకవేళ దరిద్రుఁడేగినచో ధనమెటుల లభించును? 25. పిశాచముయొద్దకుఁ బిశాచముపోయినయెడల నేయుద్దేశము వెలువడఁగలదు ? ఒకవేళ నున్మత్తునియొద్ద నున్మత్తుఁడు సమావేశమైనయెడల వారలకు సమాధానములుజెప్పి బోధింపఁగలవాఁడెవఁడు? 26. భైక్షుకునివలన భిక్షము, దీక్షాహీనునివలన దీక్ష, కృష్ణపక్షమునందు వెలుతురు ఎన్నఁటికిని లభింపఁజాలదు 27. రోగియొద్దకు రోగి యొకవేళ పోయినయెడల వానికారోగ్య మెటుల లభించును? దుర్బలునికడ దుర్బలునకు సహాయ మెటులకల్గును? 28. నియమహీనునియొద్దకు నియమహీనుఁడేగినచో నెన్నఁటికిని నియమవంతుఁడు గానేరఁడు. బద్ధపురుషుఁడు బద్ధుని

వద్ద కేగినచో నెన్నటికిని సిద్ధుఁడు గాలేఁడు 29. దేహాభిమాని దేహాభిమానికడ కరిగినయెడల విదేహుఁ డెన్నటికిని గాఁజాలఁడు. ఇటులే జ్ఞానహీనునికడకు జ్ఞానహీనుఁ డేగినచో జ్ఞానమార్గమెన్నటికిని లభింపదు 30. కావున ముముక్షువగువాఁడు జ్ఞానిని శోధించి కనుఁగొని యాతని యనుగ్రహమును సంపాదించి సారాసారమునుగూర్చిన విజ్ఞానమును బడయవలయును. అప్పుడే మోక్షము లభించును 31.



## రెండవ సమాసము – పరమాత్మ ప్రాప్తి.

శ్రోతలారా! సాయుజ్యముక్తి ప్రాప్తించెడి యుపదేశలక్షణములను మీకెఱింగించెదను. చెవియొగ్గి వినుండు. నానావిధములగుమతములను దెలిసికొనుచు నుండుటవలనఁ బ్రయోజనమెద్దియు లేదు 1. బ్రహ్మజ్ఞానము లేని యుపదేశములయందు విశేషమెద్దియు నుండదు. అది ధాన్యమును దీసిన పొట్టువంటిది 2. ఉముకయందు ధాన్యము, చల్లయందు వెన్నయు లభించును. బియ్యమును గడిగిన నీటికిఁ దెల్లదనమున్న నుండుఁగాక పాల రుచి కలుగఁజాలదు 3. ఏదేని ఫలవృక్షమును జేరి దాని తాటతినుట, దానిబెరఁడు నమలుట లేదా రసమునువిడిచి టెంకను భుజించుట మూర్ఖత్వము 4. ఆ విధముగనే బ్రహ్మజ్ఞానములేని యుపదేశములను బడయుటయు వ్యర్థము. అంతియగాక యసారముగూడ. చతురుఁడగు పురుషుఁ డెన్నటికిని సారమునువిడిచి యసారమును బరిగ్రహింపఁడు 5.

ఇప్పుడు నిర్గుణపరబ్రహ్మమును నిరూపించుచున్నాఁడను కావున శ్రోతలు స్థిరచిత్తులు గావలయును 6. ఈ సృష్టియంతయుఁ బంచమహాభూతములతో రచింపఁబడినది. అది ఎప్పటికిని స్థిరముగా నుండఁజాలదు 7. ఈ పాంచభౌతికసృష్టి కాద్యంతములయందు నిర్గుణబ్రహ్మము గలఁడు. ఆతఁడుమాత్రమే శాశ్వతుఁడు. తక్కిన పాంచభౌతిక మెంతగలదో యది యంతయు నాశనమగుచుండును 8. ఈ భూతములను బరమాత్మయని యెటుల నుడువఁగలము? ఒకవేళ నేమనుష్యునేని భూతమన్నచో నాతఁడు కోపించును 9. ఇఁకఁ బరమాత్ముఁడన్ననో జగత్పిత. ఆతని మహిమను బ్రహ్మాదులునైతె మెఱుంగరు. అట్టివానికి భూతోపమాన మెంతమా

త్రము తగియుండదు 10. పంచభూతములవలె బరమాత్ముఁడున్నాఁడని చెప్పుదుమేని మిథ్యాదోషము కలుగును. ఈవిషయము సాధుజను లెఱుంగుదురు 11. పృథ్వి, జలము, తేజము, వాయువు, ఆకాశము అనునవి లోపలను వెలుపలను అన్నిస్థలములందును జగదీశునిచే వ్యాప్తములై యున్నవి. కాని యీ పంచభూతములు నాశనమగును. వీనియందున్న పరమాత్ముఁడుమాత్రము అవినాశిగా నుండును 12. రూపము, నామము ఎంతదనుకఁగలవో అంతదనుక సమస్తమును భ్రమయే కావున నామరూపముల కవ్వలనున్న దానిమర్మమును అనుభవపూర్వకముగా గ్రహింపవలయును 13. పంచభూతములతోడను, త్రిగుణములతోడను గలసి యీ యష్టవిధప్రకృతి యేర్పడినది. దీనికే దృశ్యమనిపేరు 14. అట్టి యీ దృశ్యమునంతను (ప్రకృతిని) నాశవంతమనియును, నిర్గుణబ్రహ్మము శాశ్వతమనియును శ్రుతులుజెప్పుచున్నవి. ఈ విషయమును జ్ఞానులెఱుంగుదురు 15. *బ్రహ్మము శస్త్రములచే భేదింపఁబడదు. అగ్నిచే దహింపఁబడదు. నీటను గరుగఁజాలదు. వాయు వెగురఁగొట్టనేరదు. అది పడుచు లేచుచు నుండునదిగాని కూడిపీడునదిగాని కాదు 16–17. బ్రహ్మమేదేని వర్ణము గలదిగాదు. అది యన్నింటికంటెను నావలనున్నది. అది యెక్కడికక్కడ సూక్ష్మరూపముతో నిండియున్నది 18. కనిపింపకపోయిననేమి, అది సర్వస్థలములయం దిమిడియున్నది. ఎక్కడికక్కడ సూక్ష్మరూపముతో నిండియున్నది 19. తమకుఁ గనిపించుదాని నున్నదనుట, కనుపింపనిదానిని గోప్యమనిచెప్పి యుపేక్షించుట మానవునకొక యభ్యాసముగా నేర్పడినది 20. కాని సత్యమేమన ప్రకటనముగా నున్నదానినంతను అసారముగఁ దెలిసికొనవలయును. మఱియు గుప్తముగా నున్నదానినే సారముగా నెఱుంగవలయును 21. ఎయ్యది తెలియఁబడకుండునో దానిని (ఆ బ్రహ్మమును) వివేకబలముచే గ్రహింపవలయును. ఎయ్యది కానబడకుండునో దానిని వివేకబలముతోఁ జూడవలయును. మఱియు నెయ్యది యెఱుంగబడదో దానిని వివేకబలముచే నెఱుంగవల

* ఈ యంశమే భగవద్గీతలోఁ గృష్ణపరమాత్ముఁ డిటులఁజెప్పెను.

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతిమారుతః॥

యును 22. ఎయ్యది గుప్తమో దానినిఁ బ్రకటింపవలయును. ఎయ్యది యసాధ్యమో దానిని సాధింపవలయును. ఎయ్యది యభేద్యమును గఠినము నై యున్నదో దానినే చక్కఁగనభ్యసింపవలయును 23. చతుర్వేదము చతుర్ముఖబ్రహ్మ సహస్రముఖుఁడగు శేషుఁడు ఎద్దానిని వర్ణించివర్ణించి విసిగి పోయిరో యా పరబ్రహ్మమును బడయవలయును 24. అది సాధుజనుల ముఖమున అధ్యాత్మనిరూపణశ్రవణము గావించుటవలనఁ బ్రాప్తించును25. పరబ్రహ్మమన పృథివ్యాపస్తేజో వాయురాకాశములు గావు. మఱియు నది వర్ణరూపనామములతో వ్యక్తము కాఁజాలదు. అన్నివిధముల నది అవ్యక్తమైయున్నది 26. అదియే సత్యముగాద్వైతము. సాధారణజనులు తమయజ్ఞానమువలన ననేకదేవతలను గల్పించిరి. లోకములో నెన్నిగ్రామములున్నవో యన్నిదైవతములేర్పడియున్నవి27. ఇది పరమాత్మనుగూర్చిన నిశ్చయము (పరమాత్ముఁడు నిర్గుణుఁడని బోధయైనది). ఇఁక స్వయముగాఁ దనను వెదకికొనవలయును 28. "ఈ శరీరము నాది" అని తెలిసికొనునది యేదియో అది వాస్తవమునకు (ఆత్మ) శరీరముకంటె వేఱుగ నున్నది. ఎయ్యది "నామనస్సు"అని నుడువుచున్నదో అది వాస్తవమునకు మనస్సుకంటె భిన్నముగ నున్నది 29. ఇట్లు దేహవిచారమును గావించుటవలన నిదియంతయును బంచభూతములతోడనే నిర్మింపఁబడియున్నదని విదితమగుచున్నది. ఇపుడా పంచతత్త్వములను పంచతత్త్వములలోనికి వేఱువేఱుగాఁ జేర్చివైచినచో మిగులునట్టి సారమిఁక నేమియు నుండబోదు. ఆత్మయే మిగులును 30. ఇపుడు మనము దేనిని "నేనునేను" అని చెప్పుచున్నారమో దానిజాడ లెచ్చటను గనిపింపవు. కావున ఆత్మను శోధించుటెట్లు? ఐదు తత్త్వము లుండెను. అవి ఎక్కడవక్కడనే కలిసిపోయెను 31. ఈ విధముగా విచారము గావించినమీఁదట నీ శరీర మొక పంచతత్త్వముల మూట అనియు, ఇది నశించిపోవుననియు, రెండవది యాత్మ అనియు, నది యవినాశియై యుండుననియు విదిత మగుచున్నది. అంతియే గాని యీ రెండుదప్ప మూఁడవది యగు నేనుగీను అనునది యచ్చట నెద్దియును లేదు 32-33. ఎప్పుడు "నేను" అనుదాని జాడయే లేదో అప్పుడు జన్మమృత్యువు లెవ్వారివగును? అవియెట్లు జరుగును? ఒకవేళ ఆత్మయే జన్మమును దాల్చునని చెప్పునెడల నది యించుకయేని పొసఁగఁ

జాలదు. ఏలయన, ఆత్మ పాపపుణ్యములకు జన్మమృత్యువులకు వేఱుగా నున్నది 34. ఎప్పుడా నిర్గుణమునందు పాపపుణ్యములు, జననమరణములు యమయాతనలు మున్నగునవి లేవో అప్పుడు మనయందుఁగూడ నవిలేవు. ఏలయన, మన మనునది సైత మాత్మయేగదా 35. ఈ జీవుఁడు దేహాభిమాన కారణరమున బద్ధుఁడై యున్నాఁడు. వివేకమువలన దేహాభిమానము వీడిపోవుచున్నది. ఈతఁడు ముక్తుడై పోవుచున్నాఁడు అని సారాంశము 36. ఇంతటితో జన్మము సార్థకమై పోవుచున్నది. నిర్గుణాత్మయును మనమును నేకమైపోవుచున్నారము. కాని దీనిదృఢీకరణమునకు సాధకులు పైని చెప్పఁబడిన వివేచనమును మాటిమాటికిఁ జేయుచుండవలయును 37. మేల్కొని లేచినపిమ్మట స్వప్నమెట్లుండదో యటులే వివేకముతోఁ జూచినపిమ్మట దృశ్యము (పాంచభౌతికసృష్టి)అదృశ్యమైపోవును. నశించిపోవును. మఱియు స్వరూపానుసంధానమువలనఁ (బ్రహ్మస్వరూపమును శోధించుటవలన) ప్రాణిమాత్రులు తరించిపోవుదురు 38. వివేకముతో "నేను" అను దానిని నివేదించి సాధకుఁడు పరమాత్మస్వరూపుఁడై పోవలెను. వానినుండి భిన్నముగా నుండఁగూడదు. ఇదియే యాత్మనివేదనము 39. మొట్టమొదట అధ్యాత్మనిరూపణ శ్రవణమును జేయవలయును. మఱల సద్గురు చరణసేవ గావింపవలయును. అప్పుడు సద్గురు ప్రసాదమువలన ఆత్మనివేదన మగుచుండును 40. ఆత్మనివేదనమునకుఁ బిమ్మట వస్తువు నిర్మలమును, అలిప్తమును, సంపూర్ణమును, అఖండమును, శాశ్వతమును నై యున్నదని బోధపడును. మఱియు నావస్తువే (ఆత్మయే) స్వయముగా మనమై యున్నారమని విదితమగును 41. *పైనిజెప్పఁబడిన బ్రహ్మజ్ఞానమువలన నీ జీవుఁడు స్వయముగా బ్రహ్మమైపోవును. వాని సంసారబంధనములు తెగిపోవును. అతఁ డానందముతో దేహమును బ్రారబ్ధముపై విడిచి వేయును 42. దీని నాత్మజ్ఞానమని చెప్పుదురు. దీనివలననే పరమశాంతము

* ప్రాణికి బ్రహ్మజ్ఞానము కలుగుటవలన స్వయముగా బ్రహ్మరూపియగును. పాంచభౌతికసృష్టి, దృశ్యపదార్థము, ప్రాపంచికసృష్టి మున్నగు కష్టజ్ఞానము దానికి గలుగదు. సమస్తము శూన్యమగును. అది యఖండబ్రహ్మమేయగును. ఇట్టి దశయందు దేహము ప్రారబ్ధాధీనమగును. ఈ దేహ మావల యేమైననుసరియే, అది యుండనీ, నశింపనీ, కాని నిరంతరము ఆత్మ అవినాశిగానే యుండును.

లభించును. ఈ జ్ఞానమువలననే ఈ జీవుఁడు పరబ్రహ్మముతో అభిన్నుఁడై యుండును. సత్యమగు భక్తిగలవాఁడు (ఐక్యమునొందినవాఁడు) గ మాఱి పోవును 43. ఆ సమయమున 'ఏమిజరిగినను జరుగనిమ్ము. ఏమిపోయినను పోనిమ్ము. జన్మమృత్యువులను గూర్చిన సందేహమంతయు నా హృదయమునుండి తొలంగిపోయినదిగదా! ఇఁక నేమైనను గానిమ్ము' అను స్థిరభావముతో నుండుస్థితి యేర్పడును 44. ఈ విధముగా నాతఁడు జనన మరణములనుండి ముక్తుఁడై పరమాత్మని బ్రాప్తించును. ఇది యంతయును సాధుసమాగమ మహాత్మ్యము 45.



## మూఁడవసమాసము — మాయయొక్క పుట్టుక.

నిర్గుణాత్మ నిర్మలమైయున్నది. అది యాకాశమువలె సర్వవ్యాపకమైయున్నది. మఱియు నచలమును, సర్వకాలములందుఁ బ్రకాశవంతమును 1, అఖండమును, గొప్పదానికంటెను గొప్పదియు, నాకాశముకంటె నెక్కువయగు విశాలమును సూక్ష్మమును నై యున్నది 2. నిర్గుణాత్మ చూపులకందదు. అది భాసముగాదు. పెరుగుటలేదు. తరుగుటలేదు. వచ్చుటలేదు. పోవుటలేదు 3. అది నడచుటలేదు. తెగుటలేదు. పగులుటలేదు. అమరుటలేదు. చెడుటలేదు. 4. నిరంతరమును నిర్గుణాత్మ సన్ముఖముగా నున్నది. అంతియగాక నిష్కళంకమును నిఖిలమునుగూడ నై యున్నది. మఱియు నాకాశము పాతాళముగూడ వ్యాపించియున్నది 5. ఆ నిర్గుణబ్రహ్మము అవినాశిగానున్నది. సగుణమాయ నాశనమగును. ఈ లోకమునందు సగుణనిర్గుణములు రెండును గలసియున్నవి 6. యోగీశ్వరులు ఈ సగుణ నిర్గుణమిశ్రణమును గూర్చిన విచారమును నీరక్షీరవివేచనము రాజహంసలు గావించునటుల నొనర్తురు 7. ఈ సంపూర్ణమగు చరాచర పంచభూతాత్మికసృష్టియందు ఆత్మ వ్యాపకమైయున్నది. ఈ విషయము సత్యానిత్యవివేచనము గావించినయెడలఁ దెలియును 8. చెఱకును నమలి రసమును బ్రమింగి పిప్పినిబారవేయునటుల నీ జగమును శోధించి యీశ్వర తత్త్వమును గైకొని మాయికమగు దృశ్యపదార్థమును విడిచివేయవలయును 9. ఇచ్చట రసమున కీశ్వరతత్వము నుపమానముగాఁ దీసికొంటిమిగాని రసము

నాశవంతము పలుచనిది యైయున్నది. ఆత్మ (ఈశ్వర తత్త్వమన్ననో) శాశ్వతము నిశ్చలమునై యున్నది. అంతియగాక రస మసంపూర్ణము. ఆత్మ కేవలము పరిపూర్ణము 10. ఆత్మతో సమానమగు వస్తు వేదేని యున్నచో దాని నిచట దృష్టాంతముగఁ గైకొనవచ్చును. కాని యట్టిది లేకపోవుటచే నేదేని యొకానొక దృష్టాంతము నిచ్చి యేదోయొక విధముగా బోధింపవలసియుండును 11. ఆత్మస్థితి యీ విధముగా నున్నప్పు డిచట మాయ యెటులఁ బుట్టినది? దీనికి దృష్టాంతము నిచ్చుట యసాధ్యము. ఆకాశమునందు వాయుతరంగములు వచ్చునటుల నాత్మ నుండి మాయ బయలువెడలినదని గ్రహింపవలెను 12. వాయువునుండి తేజము, తేజమునుండి జలము, జలమునుండి పృథివి వ్యుత్పన్నమైనది 13. దీనితరువాతఁ బృథ్వినుండి యెన్నిజీవు లుత్పన్నమయ్యెనో గాని యన్నింటి యాద్యంతములందును బ్రహ్మము వ్యాపకుఁడై యున్నాఁడు 14. ఉత్పన్నమైనదంతయు నశ్వరమైనది. కాని అది పరబ్రహ్మము యథార్థ ముగా స్థిరమైయున్నాఁడు 15. భాండమేర్పడకమున్ను ఆకాశమున్నది. భాండములోపలఁగూడ భాండజలమునఁ బ్రతిబింబరూపమున ఆకాశ మున్నది. కాని భాండము పగిలిపోయినపిదప ఆకాశము పగిలిపోవని రీతిగాఁ బరబ్రహ్మతత్త్వము కేవలము అచలమును,అవికారము నై యున్నది. మధ్యను సంపూర్ణ చరాచర జీవులు కలుగుచుఁ బోవుచుండును. 16_17. ఉత్పన్నతమంతయు మొదటినుండియే యగును. బ్రహ్మమువలన నుత్పన్న మగు జీవులన్నియు వ్యాప్తమైయున్నవి. అవి నాశనమైనపిమ్మటఁ గూడ నా యవినాశియగు బ్రహ్మ మెప్పటివలెనే స్థిరముగానుండును 18. జ్ఞాని యగు పురుషుఁడాయవినాశియగు బ్రహ్మమునే వివేచింపుచుండును. అనగాఁ బంచమహాతత్త్వములను బంచమహాతత్త్వములలో నిరసనమొనరించి తనను బ్రాప్తింపఁజేసికొనును19. ఈదేహము పంచతత్త్వములతో నిర్మింపఁ బడినది. తెలిసినవారలు ఈతత్త్వములను జక్కఁగ నావిష్కరణము (వెల్లడి) చేయుదురు 20. తత్త్వములను యావిష్కరణము జరిగినపిమ్మట వారలకు దేహాభిమానము తొలంగును. ఈవిధముగ వివేకముతో వారలు నిర్గుణ బ్రహ్మమునం దనన్యులై పోవుదురు 21. వివేకమువలన నెప్పు డీ దేహసంబంధములగు పంచతత్త్వములు పంచతత్త్వములలోఁ

గలసిపోవునో యప్పుడు "నేను, మనము" అనువాని జాడపాడలే యుండవు* 22. మనము "మన" మనుదానిని శోధించుచున్న యెడల నాది, మనది, మాది యను వార్త పూర్తిగ మాయికమని విశదమగును. ఏలయన, తత్త్వములను నిరసనము గావించుటవలన వాస్తవములోఁ గేవలము నిర్గుణ పరబ్రహ్మమే మిగిలియుండును. ఇంక నెద్దియు నుండదు 23. "మన" యనుదానిని (దేహబుద్ధిని) విడిచి కేవల నిర్గుణబ్రహ్మమును అనుభవము జేయుటయే ఆత్మనివేదనము నందలి మర్మము. ఏలయన, నేను నీవు నాది నీది యను భ్రమ తత్త్వములతోడనే వెడలిపోవును 24. ఒకవేళ నేను అనుదానిని శోధింపుదమన్నచో నది దొరుకదు. ఇటు నిర్గుణ పరబ్రహ్మమో కేవల మచలమైయున్నది. కావున నిజముగ నారసిన యెడల మనము అదియే (నిర్గుణబ్రహ్మమే) అయియున్నారము. కాని సద్గురుమూలమునఁ దప్ప నీవిషయము బోధగాదు 25. మనము సంపూర్ణమగు సారాసారమునుగూర్చి విచారణము జేసితిమేని యసారము తొలంగిపోవును. సారమగు నిర్గుణబ్రహ్మమే నిలిచియుండును 26. సమస్తసృష్టిలోఁ బయిని బేర్కొనఁబడిన బ్రహ్మమే వ్యాప్తమైయున్నది. ఈ సృష్టియంతయు నశ్వరము. బ్రహ్మము అవినాశి 27. వివేకముతో మనమెప్పుడీసంపూర్ణ సృష్టిని సంహారము గావించుచున్నారమో, ఈ పంచభూతాత్మికమగు సృష్టిని మనమెప్పుడు పృథక్కరణము(వేఱుగావించుట)చేయుచున్నారమో అప్పుడు సారము, అసారము వేఱువేఱుగా బయలువెడలును. మఱియు "మన"యనునది మనకు లభించును (ఆత్మలభించును) 28. "నేను"అనునది స్వయముగాఁ గల్పించుకొనఁబడినది. కాని వాస్తవమునందిది యెందును లేదు. తత్త్వనిరసనము గావించినపిదప నేననునది వెడలిపోయి కేవల నిర్గుణమగు ఆత్మ నిలచియుండును 29. తత్త్వనిరసన మైనపిదప శేషించియుండు నిర్గుణాత్మయే "నేను" అనునది (తత్త్వనిరసనానంతరము నేననునది యుండనేరదు) 30. తత్త్వములతోఁ బాటు "నేను" అనునది

---

* ఈ దేహమునుగూర్చి విచారము గావించుటవలన నిది పంచభూతాత్మికమని తెలియుచున్నది. ఈ పాంచభౌతిక శరీరమునందలి తత్త్వములను ఒకటొకటిగా ఆ తత్త్వములలోఁ బంచిపెట్టినచో నిఁక "నాది నీది" అని శేషించినదెద్దియు నుండదు. శేషించునది కేవలము నిర్గుణమగు నాత్మ. దీనినే "మన-నా" యని నుడువవచ్చును.

వెడలిపోవఁగనే స్వాభావికముగనే అది నిర్గుణాత్మమైపోవును. ఈవిధముగ "సోహం" యొక్క యనుభవమువలన ఆత్మనివేదన మగును 31. ఆత్మనివేదనము అయినంతనే దైవతమునందును భక్తునియందును ఏకత్వము కలసిపోవును. విభక్తత్వము (భిన్నత్వము)ను విడిచి యాతఁడు సత్యమగు భక్తుఁడై పోవును. నిర్గుణమునందు జననమరణములు పాపపుణ్యములు మున్నగునవేవియునుండవు. ఇట్టి నిర్గుణమునం దనన్యుఁడై (ఏకమై)న పిదప ఆతఁడు స్వయముగా ముక్తుఁడై పోవుచున్నాఁడు 32-33. పంచభూతము లావరించుటవలనఁ బ్రాణిసందేహములలోఁ జిక్కుకొనును. స్వయముగాఁ దన్ను మఱచి "కోహం" (నేనెవ్వఁడను) అని నుడువసాగును 34. భూతములలోఁ దగుల్కొన్న పిదప "కోహం" అని నుడువును. మఱియు వివేచనము గావించినమీఁదట "సోహం" (ఆ బ్రహ్మము నేను)అని నుడువును. అనన్యత (ఐక్యము) నొందినమీఁదట "కోహంసోహం" అనునవన్నియు విడిపోవును 35. పయినిచెప్పిన అనుభవము గలిగినమీఁదట నుండు నదియే సాధుస్వరూపము. ఇట్టి సాధు (అవతార) పురుషులు సదేహులై యుండియు దేహాతీతులు 36. విషయము మిగుల గహనము గావున శ్రోతలకు ఒక్కమారు చెప్పుటచే సందేహము తీరఁజాలదు. కావునఁ బలుమాఱు చెప్పినదానినే మఱలఁ జెప్పవలసి వచ్చుచుండును*. ప్రసంగ విశేషమునుబట్టి అందందు నే నటుల గావింపవలసివచ్చినది. శ్రోతలు క్షమించెదరుగాక 37.

---

## నాలుగవ సమాసము – మాయయొక్క విస్తారము.

కృతయుగము (సత్యయుగము) యొక్క పరిమితి పదునేడులక్షల యిరువదియెనిమిదివేల సంవత్సరములు. త్రేతాయుగము పండ్రెండులక్షల తొంబదియాఱు వేల సంవత్సరములు. ద్వాపరయుగము ఎనిమిదిలక్షల అఱువదినాలుగువేల సంవత్సరములు. కలియుగము నాల్గులక్షల ముప్పది

---

* చెప్పినది మరలఁ జెప్పుట పునరుక్తియను కావ్యదోషము. ఈదోషమునకుఁ బరిహారముగా శ్రీసమర్థరామదాసస్వామి "జనులసందేహములను నివారించుటకై పలుమాఱు ఒకేవిషయము నే నుడువవలసివచ్చె" నని సెలవిచ్చియున్నారు.

రెండువేల సంవత్సరములు. ఇదియంతయుఁ గలిపినయెడల (నాలుగుయుగ ములపరిమితి) చతుర్యుగ పరిమాణమగును. ఇట్టి చతుర్యుగములు వేయి యైనచో బ్రహ్మ కొక్కదినమగును 1-2. ఇట్టి బ్రహ్మలు వేయిమంది గడిచి పోయినమీఁదట విష్ణువున కొకగడియ యగును. ఇట్టి విష్ణువులు వేయి మంది గడిచిపోయినపిదప మహేశ్వరున కొక తెప్పపాటుకాల మగును 3. ఇట్టి మహేశ్వరులు వేయిమంది గడచిపోయినమీఁదట శక్తికి (మాయ లేక ప్రకృతికి) ఒక తెప్పపాటుకాలమగును. ఈవిధముగానుండు కాలసంఖ్య అన్ని శాస్త్రములందును జెప్పఁబడెను 4.

శ్లో॥ చతుర్యుగసహస్రాణి దినమేకం పితామహం।
పితామహసహస్రాణి విష్ణోర్ఘటికమేవ చ ॥౧॥
విష్ణోరేకసహస్రాణి పలమేకం మహేశ్వరం।
మహేశ్వరసహస్రాణి శక్తిరర్ధపలం భవేత్ ॥౨॥

ఇట్టి శక్తు లనంతములుగానున్నవి. మఱియు ననంతములగు సృష్టి రచనములు జరిగిపోవుచున్నవి. కాని పరబ్రహ్మము యథావిధముగ నఖండ ముగ ననాదినుండియు నొకేవిధముగా నున్నది 5. నిజమారసినచో పరబ్రహ్మమున కీస్థితి యెక్కడినుండివచ్చినది? ఇది యెవరును జెప్పఁజాలని గహనాంశము. ఈవిషయమునందు వేదశ్రుతులుసైతము "నేతి, నేతి" (న + ఇతి, న + ఇతి) యని నుడువుచున్నవి 6. *నాలుగువేల యేడువందల ఱువదినాలుగు సంవత్సరములు కలియుగమునందు గడిచిపోయినవి 7. నాలుగులక్షల యిరువదియేడువేల రెండువందల నలుబదిసంవత్సరములు కలియుగమునం దింకముందు నడువవలసియున్నవి. ఇఁకముందుఁ బూర్తిగా వర్ణసాంకర్యము జరుగనున్నది 8. ఈ చరాచర సృష్టియందున్న వేల్పుల మహిమ కంతేలేదు. ఒక దైవతమును వేఱొకదైవతము మించియుంటచే నీభేదము పారావారమువలె నంతులేనిదిగా నున్నది 9. ఒకఁడు వేల్పు లందఱిలో విష్ణుమూర్తి గొప్పయనియు, నింకొకఁడు శంకరుఁడు గొప్ప వాఁడనియు, వేఱొకఁడు ఆదిశక్తి అందఱు దేవులకంటె గొప్పదనియు నుడువును 10. కాని వీరందఱు కల్పాంతమునందు నశించుపోవువారే. ఏల

* ఈ సంఖ్య శ్రీదాసబోధ రచించుకాలము నాటిది. దీనినిబట్టి ధాధాపు 1716 విక్రమశకమున నీగ్రంథము రచింపఁబడియుండును.

యన, శ్రుతి "యద్దృష్టం తన్నష్టం" అని నుడువుచున్నదిగదా! (కన బడునదెల్ల నశించునదియే) 11. ప్రజలెల్లరును దమతమ యుపాస్య దేవ తలపట్ల నభిమానముంచెదరు. కాని సత్యనిశ్చయము సామాన్యులకుఁ దెలియఁజాలదు. సాధుపురుషులే సత్యమును నిర్ణయింప సమర్థులు 12. సర్వవ్యాపకమగు నాత్మయొక్కటియే సత్యమనియుఁ దక్కిన చరాచర సృష్టియంతయు మాయికమనియు సాధువులు నిశ్చయింతురు 13. పట ములో లిఖింపబడిన సైన్యమునందు (మాయికసృష్టిలో) నెవఁడు పెద్దయో యెవఁడు చిన్నయో నిరూపింప వీలుపడదు. ఈ యంశము మీరే విచా రింపుఁడు 14. స్వప్నములో మన మనేకసంగతులను గాంచితిమనియు, వీరు పెద్దలు వీరలు చిన్నలని నిశ్చయించు కొంటిమనియు నొప్పుకొను చున్నా రముగదా! మేల్కొనినపిమ్మట నానిశ్చయ మేమగుచున్నదో చూడుఁడు 15. మనము మేల్కొని చూచునపుడు కలలోఁ గనుపించిన పెద్దవాఁడు గాని, చిన్నవాఁడుగాని, తదితరముగానీ గోచరించుటలేదు. మీఁదుమిక్కిలి మనము గాంచినదంతయు స్వప్నములోనని విదితమగుచున్నది 16. ఎక్కడిపెద్ద, ఎక్కడిచిన్న, ఇది యంతయు మాయావిచారము. నిజమార యుచోఁ బెద్దచిన్నల విచారమందఱకును దెలియదు. జ్ఞానులకే తెలి యును 17. జననమునొందిన ప్రతిమానవుఁడు బ్రతికిన నాల్గుదినములు 'నేను పెద్దవాఁడను. నేను గొప్పవాఁడ'నని నుడువుచు నుడువుచునే గతించును. ఎవఁడు పెద్దవాఁడో నిర్ణయింపదగినవారు మహాత్ములే 18. మన శాస్త్రములన్నియు ఆత్మజ్ఞానము గలవారలే మహాత్ములనియు, శ్రేష్ఠు లనియు నుడువుచున్నవి. ఇటులే సాధువులు సత్పురుషులుగూడఁ జెప్పు చున్నారు19. అందఱికంటెను గొప్పవాఁడు పరమాత్ముఁ డొకఁడేయనియు, బ్రహ్మవిష్ణు మహేశాదులుగూడ నాపరమాత్మునికి లోఁబడినవారనియు, శాస్త్రములు తెలుపుచున్నవి 20. పరమాత్ముఁడు నిర్గుణుఁడును, నిరా కారుఁడును నై యున్నాఁడు. ఆతనికి ఉత్పత్తివిస్తారములులేవు. మఱియు స్థానమానములను గూర్చి మనము చేయు విచారమంతయు నీవలివిష యము 21. పరమాత్మునిగురించి మనము చేయు నామము, రూపము, స్థానము, మానము మున్నగు నిర్ణయములన్నియు ననుమానమాత్రములే. బ్రహ్మప్రళయమునం దీయనుమానపూర్వక నిర్ణయములన్నియుఁ దుడిచి

పెట్టుకొనిపోవును 22. కాని ప్రళయమునందుఁ బరబ్రహ్మమునకు నాశనములేదు. పరమాత్ముఁడు నామరూప రహితుఁడుగను సర్వకాల సర్వావస్థలయందచంచలుఁడుగను నున్నాఁడు 23. బ్రహ్మనిరూపణము నెఱింగి బ్రహ్మమును దెలిసికొనినవారు బ్రహ్మవిదులని, బ్రాహ్మణులని చెప్పఁదగి యుందురు 24.

## ఐదవ సమాసము — మాయ మఱియు బ్రహ్మము.

శ్రోతలారా! మీకిపుడు మాయయొక్కయు, బ్రహ్మముయొక్కయు నిరూపణము నెఱింగించుచున్నాఁడను. శ్రద్ధతో వినఁగోరెదను 1. బ్రహ్మము నిర్గుణమును నిరాకారము నై యున్నది. మాయ సగుణమును సాకారము నై యున్నది. బ్రహ్మమునకు దరిదాపులులేవు. మాయకున్నవి 2. బ్రహ్మము నిర్మలమును, నిశ్చలమును నై యున్నది. మాయ చంచలమును చపలమునై యున్నది. బ్రహ్మము ఉపాధిరహితము. మాయ ఉపాధి రూపము 3. బ్రహ్మము కనుపింపదు. మాయ కనుపించును. మాయ భాసించును. బ్రహ్మము భాసింపదు. మాయ నాశనమగును. బ్రహ్మము కల్పాంతమునందుఁగూడ నశింపదు 4. మాయ నిర్మితమగుచున్నది. బ్రహ్మము నిర్మితమగుటలేదు. మాయ చెడుచున్నది. బ్రహ్మము చెడుట లేదు. అజ్ఞానమునకు మాయ రుచించును. బ్రహ్మము అజ్ఞానమునకు రుచింపదు 5. మాయ వృద్ధినొందును. బ్రహ్మ మంకురించునదియు, వృద్ధి నొందునదియుఁ గాదు. మాయ మరణించును. బ్రహ్మమునకు మరణము లేదు. మాయ ధారణశక్తితో అవగాహనమగును. బ్రహ్మ మటులఁ గానేరదు 6. మాయ భిన్నమగును. బ్రహ్మము భిన్నమగునదికాదు. మాయ తెగిపోవును. బ్రహ్మము తెగిపోవునదికాదు. మాయ మలినమగును. బ్రహ్మము మలినము కానేరదు. అది యవినాశి 7. మాయ వికారయుక్తము. బ్రహ్మము నిర్వికారము. మాయ యన్నింటిని జేయఁగలదు. బ్రహ్మ మెద్దియును జేయదు. మాయ నానారూపములను ధరించును. కాని బ్రహ్మము రూపరహితము 8. మాయకుఁ బంచభూతాత్మకములగు రూపము లనేకములు గలవు. బ్రహ్మము శాశ్వతముగా

నొక్కటియే. మాయయొక్కయు బ్రహ్మముయొక్కయు వివేచనమును వివే కులుతప్ప నితరులెఱుంగరు 9. మాయచిన్నది. బ్రహ్మము పెద్దది. మాయ సారరహితము. బ్రహ్మము సారవంతము. మాయ కాద్యంతములు గలవు. బ్రహ్మమునకు లేవు 10. సంపూర్ణ మాయావిస్తరమువలన బ్రహ్మస్థితి మరుగుపడియున్నది. సాధుజనులు విజ్ఞానసాధనములచే మాయనుండి బ్రహ్మమును వెలికిఁదీయుదురు 11. నీటిమీఁది శైవాలమును (నాచును) దొలంగించినగాని శుద్ధమగు నీరు లభింపదు. నీరు గలసిన పాలను గాచి విడ దీసినగాని శుద్ధమగు పాలు లభింపదు. అటులే మాయను తొలంగినఁగాని బ్రహ్మము లభ్యముకానేరదు 12. బ్రహ్మము ఆకాశమువలె నిర్మలమైనది. మాయ పృథ్వివలె మలినమైనది. బ్రహ్మము సూక్ష్మరూపము. మాయ స్థూలరూపము 13. బ్రహ్మ మప్రత్యక్షము. మాయ ప్రత్యక్షము. బ్రహ్మము సమము. మాయ విషమరూపము 14. మాయ లక్ష్యము. బ్రహ్మము అలక్ష్యమైనది. మాయసాక్ష్యము. బ్రహ్మము అసాక్ష్యము. మాయయందు జ్ఞానము, అజ్ఞానము అను రెండుపక్షము లిమిడియున్నవి. బ్రహ్మమునందుఁ బక్షములెవ్వియును లేవు 15. మాయ పూర్వపక్షము; అనఁగా సంశయయుక్తము. బ్రహ్మము ఉత్తరపక్షము; అనఁగా సిద్ధాంతము. మాయ అనిత్యము. బ్రహ్మము నిత్యము. మాయ ఇచ్ఛాయుక్తము. బ్రహ్మము నిరిచ్ఛామయము 16. బ్రహ్మమఖండఘనము. మాయ పంచభూతమిళితము. బ్రహ్మము నిరంతరపరిపూర్ణము. మాయ జీర్ణజర్ఝరితము 17. మాయ కల్పింపఁదగినది. బ్రహ్మము కల్పింపరానిది. మాయకుఁ బతనావస్థగలదు. బ్రహ్మమునకుఁ బతనములేదు. మాయ చెడునది. బ్రహ్మము చెడునదికాదు (చెక్కుచెదరక యొకేవిధముగా నుండును) 18. ఎంతటి ప్రళయకాలమునందేని బ్రహ్మముచెదరక స్థిరముగా నుండునది. మాయను నిరసనముగావించినచో నాశనమైపోవును. బ్రహ్మము నందు సంకల్పవికల్పములు లేవు. మాయయందీ రెండు నున్నవి 19. మాయ కఠినమైనది. బ్రహ్మము కోమలమైనది. మాయ అల్పము. బ్రహ్మము విశాలము. మాయకు అంతమున్నది. బ్రహ్మమునకు లేదు 20. బ్రహ్మము ఇట్టిదని వివరింపఁదగినదికాదు. మాయ ఎటులున్నదో యటుల వివరింపవచ్చును. బ్రహ్మమును కాల మంటఁజాలదు. మాయను

గాలము వశము గావించుకొనును 21. ఈ కనుపించుచున్న నానావిధరూప వర్ణములన్నియును మాయయే. ఇవియన్నియు నశ్వరములు. కాని బ్రహ్మము శాశ్వతము 22. ఇంతయేల, ఈ చరాచరరూపమునఁ గలుగుచున్న సృష్టియంతయును మాయ. పరమేశ్వరుఁడీసృష్టికి లోపల వెలుపల నంతటను వ్యాప్తమైయున్నాఁడు 23. ఆకాశము జలమునందుండియు జలమును దాఁకకుండునటుల సకలోపాధిరహితుఁడగు పరమాత్ముఁడును సృష్టికి అలిప్తుఁడుగా నున్నాఁడు 24. ఈ మాయయొక్కయు బ్రహ్మము యొక్కయు వివరణమును సాధుజనులవలననే చక్కఁగా బోధయగును. వారల శరణ్యములోని కరుగుటవలన జననమరణములు విడిపోవును 25. సాధువుల మహిమ కంతము లేదు. వారల యనుగ్రహమున సులభముగాఁ బరబ్రహ్మము సిద్ధించును 26.

---

## ఆఱవ సమాసము — సత్యదైవ నిరూపణము.

శ్రోత వక్తతో నిటుల విన్నవించుచున్నాఁడు. ఓ గురు మహారాజా ! మీరు సర్వజ్ఞులగు గోస్వాములు. నాకున్న యీ సందియమును దొలంగింపుఁడు. సృష్టియొక్క పుట్టుకకుముందు బ్రహ్మమునందు సృష్టియొక్క బీజమే లేకున్నయెడల నీ కాన్పించుచున్న సృష్టి సత్యమా లేక మిథ్యయా ? 1-2. దీనికి వక్త చెప్పఁబోవు ప్రత్యుత్తరమును సావధానులరై వినుండు 3. భగవద్గీతలోనున్న "జీవభూతస్సనాతనః*" అను వాక్యమునుబట్టి చూచినయెడల సృష్టి సత్యమైనదని తెలియుచున్నది 4. మఱియు "యద్దృష్టం తన్నష్టం"(ఎయ్యది కనుపించునో యది నశించునది) అను నీ శ్రుతివాక్యమువలన సృష్టి మిథ్యయని తెలియుచున్నది. ఇపుడు సత్యాసత్యముల నెవఁడు నిశ్చయింపఁగలఁడు? 5. దీని నొకవేళ సత్యమందమా యన్న నిది (యీ సృష్టి) నాశనమగుచున్నది. మిథ్యయందమా యన్న కనంబడుచునే యున్నది. కావున నెటులున్నదో యటులే చెప్పుదును 6. ఈ సృష్టియందున్న మానవులలోఁ గొంద ఱజ్ఞానులుగను

---

* గీతయందుఁ బరమాత్మస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁ డిటుల జెప్పియున్నాఁడు: "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" సృష్టియందు జీవరూపముగనున్నది యెల్ల నాయంశమే. మఱియు నది యవినాశియైనదని భావము.

మఱికొందఱు సుజ్ఞానులుగను నున్నారు. కావున నిందులకు సమాధానము కలుగఁజాలదు 7. సృష్టిసత్యము. ఇటులే దేవ, ధర్మ, తీర్థవ్రతములుకూడ సత్యములే యని యజ్ఞానుల మతము 8. "మూర్ఖస్య ప్రతిమా పూజా" (మూర్తిపూజ అనగా విగ్రహపూజ మూర్ఖులకొఱకే) అని పెద్దలుచెప్పిరి. సృష్టికూడ విచారించినచో సత్యమైనదిగాదు. ఏలయన, ప్రళయమునందది నాశనమగుచున్నది అని జ్ఞానులు తెలుపుదురు 9. దీనిని విని యజ్ఞాని యిటుల వాకొనుచున్నాఁడు. అటులైన యెడల సంధ్యాస్నానము, గురు భజనము, తీర్థాటనము చేయుటవలన ఫలమేమి? 10. జ్ఞాని దీనికిఁ బ్రత్యుత్తర మొసంగుచున్నాఁడు.

శ్లో॥ తీర్థే తీర్థే నిర్మలం బ్రహ్మబృందం
బృందే బృందే తత్త్వచిన్తానువాదః ।
వాదే వాదే జాయతే తత్త్వబోధో
బోధే బోధే భాసతే చంద్రచూడః ॥

తీర్థాటనము గావించుటకుఁ గారణమేమియో నీవు తెలిసికొనఁ జాలకుంటివి. తీర్థములలోఁ గలుగు సాధుజనుల సమాగమమువలన సారా సారవిచారము నెఱింగి భక్తులీశ్వరుని బ్రాప్తింపఁగలుగుదురు. గురుని భజించుటకుఁగల కారణమును గురుగీతయందు స్వయముగా మహాదే వుఁడు చెప్పియేయున్నాఁడు 11.గురుభజనమునకు నియమమేమన, మొదట గురుని సత్యస్వరూపమును గుర్తింపవలయును. తరువాత వివేకముతోఁ దాను గురుని రూపమునందు లీనుఁడై పోవలయును 12.

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

సద్గురునికిఁగల సత్యస్వరూపము గురుగీతలో విపులముగాఁ జెప్పఁ బడెను. ఈ స్వరూపమునందు సృష్టిభాస యుండజాలదు 13. ఈ విధముగా నెప్పుడును జ్ఞాని సద్గురుని సత్యస్వరూపమును జూపి సృష్టిని మిథ్యయని నిశ్చయము గావించుచున్నాఁడు. అప్పుడజ్ఞాని యింకను నధికమగు వివాదమును గావించుటకు సిద్ధమై యిట్లనుడుపుచున్నాఁడు. యిదియేమి?

నీవు పరమాత్ముఁడగు శ్రీకృష్ణు నజ్ఞానియని సిద్ధాంతము గావింపఁబూనుకొంటివి? 14-15. గీతయందలి "జీవభూతస్సనాతనః" అను వచనము మిథ్యయెటులఁ గాఁగలదు? 16. ఈ విధముగా నజ్ఞానియగు శిష్యుఁ డాక్షేపించి తనహృదయమునందు ఖిన్నుఁడగుటనుజూచి జ్ఞాని యిట్లు సమాధానము చెప్పెను 17. గీతయందు శ్రీ కృష్ణుఁ డేమిచెప్పెనో దాని భేదము (మర్మము)ను నీవు కనుఁగొనఁజాలకున్నాఁడవు. ఇందువలననే యీ వివాదమునకుఁ బూనుకొంటివి 18. "అశ్వత్థ స్సర్వవృక్షాణాం" (రావిచెట్టు నా విభూతియైయున్నది) అని నుడివియున్నాఁడు. ఆ వృక్షమో విరిగిపడిపోవు స్వభావము కలది. మఱియుఁ గృష్ణుఁ డిటుల జెప్పినాఁడు 19.

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః॥

నా స్వరూపము శస్త్రముచేఁ దెగదు. అగ్నిచేఁగాల్పబడదు. జలమువలనఁ దడియదు. వాయువు శోషింపఁజేయలేదు 20. కాని రావిచెట్టు(శ్రీకృష్ణుఁడు తన విభూతియని చెప్పిన అశ్వత్థము)శస్త్రమువలన ఖండింపఁదగినదిగను,అగ్నిచేఁ గాల్పబడునదిగను, నీటిచేఁ దడియునదిగను నున్నది. అంతియగాక నాశనముగూడ నొందునది 21. ఇప్పుడు శ్రీకృష్ణుని పరస్పరవిరుద్ధములగు పై వాక్యముల రెంటికిని సమన్వయ మెటులగును? దీనిమర్మము సద్గురు ముఖమునుండియే చక్కఁగాఁ దెలియఁగలదు. "ఇంద్రియాణాం మనశ్చాస్మి" (ఇంద్రియములలో మనస్సును నేను) అని శ్రీకృష్ణుఁడు నుడివియున్నాఁడు. అటులైనచో "చంచలమగు మనస్సునుండి ప్రవహించుచున్న భావతరంగముల నేల యాపవలయును?" 22-23. శ్రీకృష్ణుఁడేల యిటుల నుడివియుండును? అను ప్రశ్నయొకటి యిచట నుపస్థితమగుచున్నది. దీనికిఁ బ్రత్యుత్తరము చెప్పెదను. తెలియని బాలకులకుఁ జిత్రములు మున్నగు పరికరములను ముందుంచి వాని సహాయమున నెట్లు*

* విద్యావిధానమునందు ప్రస్తుతకాలపు కిండర్ గార్డన్ ప్రణాళిని (బాలోద్యాన శిక్షణపద్ధతిని)ఆంగ్లేయులు కనిపెట్టిరని మనవారలు తలంచుచున్నారుగాని యిది మన దేశమునందు మొదటనే యాచరణమునందుండెననియు, మన పూర్వులు ప్రాచీనార్య నైసర్గిక సాధనములతో బాలురకు శిక్ష నొసంగుటను జక్కఁగ నెఱింగియుండిరనియు నీ యుదాహరణమువలన విశదమగుచున్నది.

"ఓం నమః సిద్ధం" అను అక్షరములను నేర్పుదురో యటులే భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు అబోధసాధకులకు గీతలవలన సాధనమార్గములను జూపియున్నాఁడు 24. ఈ వాక్యభేదముల నన్నిఁటిని నాగోవిందుఁడ్డే యెఱుంగును. ఆతనిపట్ల నీదేహాభిమానపురస్సరమగు వివాదము నిలువఁజాలదు 25. ఈ విధముగానుండు వాక్యభేదము లొక్క-గీతయందేకాదు, వేదశాస్త్రశ్రుతిస్మృత్యాది సమస్తగ్రంథములందును గాన్పించుచున్నవి గాని వాని నిర్ణయము సద్గురుని వాక్యములవలననే కాఁగల్గును 26. వేద శాస్త్రములనుండి జనియించు వివాదముల నెవ్వఁడు త్రెంపివేయఁగలఁడు? సాధువులకుఁదప్ప నవి యితరులచేఁ గల్పాంతమునందుఁగూడ సవరింపఁబడ జాలవు 27. శాస్త్రములలోఁ బూర్వపక్షసిద్ధాంతములు సాంకేతిక మాత్రముగా నుడువఁబడియున్నవి. వానికిఁ బూర్ణములగు వివరణములను గ్రహింపవలయునన్న-చో సాధుజనుల శరణ్యమున కరుగవలయును 28. సాధారణముగా వేదశాస్త్రములయందు ఒకదానికంటె నొకదానిని మించిన వాదవివాదప్రశ్న లెన్నియోగలవు 29. కావున మనము వాద వివాదములను విడిచిపెట్టి జ్ఞానమును బడయవలయును. దానివలననే స్వానుభవము గలిగి బ్రహ్మానందము సమకూరును 30. ఒకే కల్పనము యొక్క- గర్భమునం దెప్పు డనంతములగు సృష్టులు కలుగుచుఁ బోవు చున్నవో యప్పుడు ఆ కల్పనమును సత్యమని యెటు లంగీకరింప వీలు పడును? 31. భక్తులు కల్పనముతో నెద్దియేనిదేవతను బ్రతిష్ఠించి ప్రార్థింతురు. మఱియు నంతతోఁబోక యాకల్పితదేవతయెడ దృఢమగుభక్తిని బ్రతిష్ఠింతురు. కారణాంతరములచే నేదేని యా దేవతావిగ్రహమునకు హాని గలిగినచో భక్తులుకూడ నా విచారమునకతన దుఃఖితులగుదురు 32. కొందఱు శిలలతో దేవతలను జేయుదురు. అవి పగిలిపోయినయెడల విచార పడుదురు. ఏడ్తురు. పడిపోవుదురు. అరచెదరు 33. ఒకానొక దేవత యింటియందే భిన్నభిన్నము గావింపఁబడును. ఒకానొకదానిని దొంగ లెత్తుకొనిపోవుదురు. ఒకానొక దేవతావిగ్రహమును దురాచారులు బలాత్కారముగా విరుగగొట్టివేయుదురు 34. ఒకానొక దేవతావిగ్రహమును భ్రష్టత కావించెదరు. ఒకానొకదానిని నీటిలోఁ బారవేయుదురు. ఒకానొక దేవతను గొందఱు దుష్టులు తమ పాదములక్రిందఁ (అరుగుమెట్లుగాఁ).

బడవేయుదురు 35. ఇదియంతయుఁజూచి జను లీవిధముగాఁ జెప్పుకొందురు. 'ఏమి చెప్పుదుము. పూర్వ మీ తీర్థమహిమ మిగుల గొప్పదిగా నుండెను. కాని యీదుర్మార్గులు సర్వనాశనమొనరించిపోయిరి. ఇపు డీవిగ్రహముల మాహాత్మ్య మెచటికిఁ బోయినదో తెలిసికొనఁ జాలకున్నారము*' ఒకదేవతను స్వర్ణకారులు సువర్ణముతో నిర్మింతురు. ఒకదేవతను కంచరులు లోహముతోఁ జక్కఁగాఁ బోతపోయుదురు. ఒకదేవతను శిలా శిల్పులు (కానేపనివాండ్రు) సుందరముగాఁ దీర్చెదరు 36-37. నర్మదా గండకీ నదుల తీరములందుసైతము లక్షలకొలఁది దేవతామూర్తులు పడియున్నవి. ఈ యసంఖ్యాకములగు దేవతావిగ్రహముల నెవరు లెక్కింప గలుగుదురు? 38. చక్రతీర్థమునందు అసంఖ్యాకముగా విగ్రహములు పడియున్నవి. ఆ విగ్రహములు చక్రాంకితములుగనుండి యేదేవతయైనది నిశ్చయింపరానివిధముగా నున్నవి 39. బాణములు, తాండలములు, స్ఫటికమూర్తులు, నాణెములు మనము పెక్కింటిని సేకరించి దేవతా భావముతోఁ బూజించుచున్నారము. ఈ దేవతామూర్తులన్నియును సత్యములో అసత్యములో యెవరెఱుంగఁగలరు? 40. ఒకఁడు పట్టుతో దేవతను గావించును. అదియెప్పుడు చిదిగిగాని విరిగిగాని చెడిపోవునో యప్పుడు మరల మట్టితో మూర్తినొనరించి పూజింప నారంభించును 41. ఒకానొక భక్తుఁడు "అన్నా! మా దేవతామూర్తి మిగుల సత్యమైనది. మా కాపదలుగలిగినపు డామూర్తి యెంతయేని సహాయము గావించును. నిరంతరము మాకోర్కులను నెరవేర్చుచుండును. కాని యేలకో యిపుడు దాని మాహాత్మ్యము తగ్గిపోయినది. ఏమి చేయుదుము! ఏది జరుగవలసి యుండెనో అదియే జరిగిపోయినది. కానున్నదాని నీశ్వరుఁడుసైత మాపఁ జాలఁడు" అని నుడువును 42-43. ఓమూర్ఖుఁడా! లోహము, ఱాయి, మన్ను, కట్టె, చిత్తరువు మున్నగునవి యెచటనేని దైవతములు కాఁగలవా? ఏల భ్రాంతిలోఁ బడియున్నాఁడవు? 44. ఇదియంతయుఁ గేవలము మనము కల్పించునదియే సుమా! కర్మానుసారముగ జీవులకు ఫలము లభించు

---

* ఈ యుదాహరణమువలన ఆకాలపు ధార్మికాచారములను ధ్వంసము గావించిన విధము తెలియవచ్చును. ఈ ధ్వంసక్రియ విశేషించి యవనుల చేతులమీఁదుగా జరుగుచుండెను.

చుండును. ఆయా కర్మములకుఁ దగినఫలము లొసంగు సత్యదైవతము వేఱుగానున్నాఁడు 45. ఈసృష్టి మాయవలనఁ గలిగిన భ్రమయనియు, నిది కేవలము మిథ్యయనియు వేదము, శాస్త్రము, పురాణము నుడువు చున్నవి 46. సాధుసజ్జనులయొక్కయు మహానుభావులయొక్కయు ననుభవముగూడ నిదియే యైయున్నది. సత్యదైవతము ఈ పంచభూతాత్మిక సృష్టి కావలనున్నాఁడు. ఆదేవుఁడు శాశ్వతుఁడు. సృష్టి యశాశ్వతము 47. సృష్టికి ముందుగను సృష్టికి వర్తమానసమయమునను సృష్టి వినాశనమైన పిమ్మటను సత్యదేవుఁడు చక్కఁగా స్థిరుఁడై యున్నాఁడు. ఆయనకు ఆద్యంతములు లేవు 48. ఇదియే శాస్త్రకారుల యభిప్రాయము. ఇందు సందియ మావంతయును లేదు. మాయయొక్కయు బ్రహ్మముయొక్కయు సంబంధము కేవలము కల్పితము 49. కేవలమొక కల్పనాగర్భమునందు ఎనిమిది సృష్టులున్నవని చెప్పుదురు. వానినన్నిఁటిని వివరింపఁబోవుచున్నారము 50.

మొదటిది కల్పనాసృష్టి, రెండవది శాబ్దికసృష్టి, మూఁడవది ప్రత్యక్షసృష్టి. ఈ మూఁడింటి నందఱు నెఱుంగుదురు 51. నాలుగవది చిత్రలేపనసృష్టి, ఐదవది స్వప్నసృష్టి, ఆఱవది గాంధర్వసృష్టి, ఏడవది జ్వరసృష్టి 52. ఎనిమిదవసృష్టి దృష్టిబంధనము. ఈ యెనిమిదియు సృష్టులని చెప్పఁబడును. ఇవు డీయెనిమిదింటిలో సత్యమని యంగీకరింపఁదగిన శ్రేష్ఠమగుసృష్టి యెద్ది? 53. కావుననే సృష్టినాశవంతమైనదని నుడువుదురు. ఈవిషయమును మహాత్ములు సాధువులు బాగుగా నెఱింగియున్నారు. ఐనను ఆత్మజ్ఞానము దృఢమగుటకొఱకు మానవులు సాధనరూపమున సగుణపరమాత్ముని భజనము ముఖ్యముగా జేయవలయును 54. సగుణాధారమువలనను సాధుసజ్జనసమావేశమువలనను సారాసారవిచారము వలనను దప్పక సాధకులకు నిర్గుణపరబ్రహ్మము లభించును 55. ఈ విషయము నిఁక ముగించుదము. ఇప్పటికే విషయము చాల విస్తరమైనది. సాధుసమాగమమువలన సర్వము విదితమగును. లేనియెడల మనస్సు సందేహములపాలగును 56. ఇదియంతయు విని శిష్యుఁ డీవిధముగా నాక్షేపించెను "సృష్టి మిథ్యయగుట తెలిసెను. ఇదియంతయు మిథ్యయైనపుడు మనకేల కనిపించును? 57. ఓ గురుస్వామి! దృశ్యము ప్రత్యక్షముగాఁ

గాన్పించుచున్నది కావున సత్యమనియే నాకుఁ దోఁచుచున్నది. ఇదిమిథ్య యను సంగతి నాకెటుల గోచరించునో యావిషయము కృపతో నాజ్ఞ యిండు"58. దీనికిఁ బ్రత్యుత్తరము వక్త ఇటులఁజెప్పుచున్నాఁడు. ఓయీ! నీప్రశ్నమునకు సమాధానము రాఁబోవుసమాసములో విపులముగా నొసంగఁబడినది. సావధానమనస్సుతో నాలింపుము 59. సృష్టిని మిథ్యయనియే భావింపవలయును. మఱియు సగుణలక్షణమునుగూడ (విగ్రహపూజ కూడ) నాచరింపవలయును. ఈ యనుభవరహస్యమును సామాన్యు లెఱుంగరు. అనుభవనీయులకె యీ యంశము తెలియును 60.

---

## ఏడవ సమాసము – సగుణభజనము.

శ్రోత లిటుల నడుగుచున్నారు. జ్ఞానమువలన దృశ్యమంతయు మిథ్యగ నెఱుంగనయ్యెనుగదా! ఇఁక భజనము నేల చేయవలయును? అట్టి భజనమువలనఁ బ్రాప్తించు ఫలమేదియో యాజ్ఞయిండు 1. జ్ఞానమున కంటె శ్రేష్ఠమైన దెద్దియును లేదని మీరాజ్ఞయిచ్చితిరి. అటులైన ఉపాసనముతోఁ బనియేమున్నది? ఉపాసనమువలనఁ బ్రాప్తించు ఫలమేది? 2. ముఖ్యసారము నిర్గుణముగానుండి సగుణము కనిపించుటయే లేనప్పుడు సగుణభజనము గావించుటవలనఁ గలుగులాభ మేదియో యాజ్ఞయిండు 3. ఈ దృశ్య ప్రపంచమంతయు నశ్వరమని తాము నాకు ధ్రువముగాఁ దెలియఁజెప్పితిరి. ఇఁక నీ నశ్వరపదార్థమునుగూర్చి చేయు భజనమువలనఁ గలుగులాభములెవ్వి? సత్యమువిడిచి యసత్యము నే యవివేకియేని భజించునా? 4. అసత్యవస్తు విదియని గ్రహించినపిమ్మట నీనియమము లేల పాటింపవలయును? సత్యమునువిడిచి యేల యీ యాందోళనములో బడవలయును 5. నిర్గుణమువలన మోక్షము లభించుచున్నది. ఇది ప్రత్యక్షానుభవమునకుఁ గూడ వచ్చుచున్నయంశము. ఇప్పట్టున సగుణము నుపాసింపవలసిన యవసర మేమున్నది? సగుణోపాసన మేమి ఫలము నొసంగునో సెలవిండు 6. మొట్టమొదట మీరు సగుణము నశియించెడి దని చెప్పియుంటిరి. మరల మీరే యిపుడు సగుణభజనము జేయుమని చెప్పుచుంటిరి. కాని యిప్పుడు సగుణభజన మేల చేయవలయునో తోఁచ

కున్నది 7. దేవరవారి భయమువలన నడుగజాలకున్నాము. తామీ విధముగాఁ బరస్పర విరుద్ధముగాఁ జెప్పుటవలన మాకేమియు బోధ గాకున్నది. సాధ్యము ప్రాప్తమైనప్పు డికఁ సాధనములతోఁ బని యేమి యుండును ? 8. శ్రోతలు గావించిన యీ సందేహముల నాలించి వక్త యిటులఁ బ్రత్యుత్తరము నొసంగుచున్నాఁడు 9.

గురునివాక్యములను బ్రతిపాలించుట పరమార్థమునకు ముఖ్యలక్షణము. గురునివాక్యమును నిర్వహింపనియెడలఁ దప్పక హానిగలుగును 10. కావున గురునియాజ్ఞను దలపయిధరించి యవశ్యముగా సగుణభజనము నంగీకరింపవలయును. ఇందుమీఁద శ్రోత మఱల నిటులఁ బ్రశ్నించెను. అయ్యా! ఈశ్వరుఁ డీ సగుణభజనము నేల మాతలపయిఁ బెట్టినాఁడు? 11. ఈశ్వరుఁడు సగుణభజనము ప్రసాదించుట నేల యుపకారముగా భావించును? దీనివలన నేది సాక్షాత్కారమగును? లేక ఈశ్వరుఁడు బ్రారబ్ధ రూపమున వ్రాసియున్నదాని నేమేని యీ సగుణభజనము తుడిచి వేయునా?12. మనుజునకుఁ గావలసినది లభింపనపు డీ సగుణభజనము నేల చేయవలయును? ఇదియేమియును నాకు బోధగాకున్నది 13. తమయాజ్ఞ పవిత్రతరమైనదే. దానినెవ్వరును గాదనఁజాలరు. ముందు నాకీ సగుణభజనమువలనఁ గలుగు లాభములెవ్వియో సెలవిండు 14. వక్త యిటులఁ జెప్పుచున్నాఁడు. ఓయీ! నీవు జ్ఞానివగుచున్నాఁడవు. కాన సావధానుఁడవై నాకు జ్ఞానలక్షణములను దెలుపుము. నీకేమైనఁ జేయవలసిన పని యున్నదా లేదా? 15. నీవు భోజనము జేయుచున్నాఁడవు. జలపానము గావించుచున్నాఁడవు. మలమూత్రములను విడుచుచున్నాఁడవు. వీనిలో నేదేని విడిచిపెట్టుటలేదు 16. నీవు జనుల నానందపఱచుచుంటివి. నీది యనియుఁ బరులదనియు నీవు గురుతెఱుంగుదువు. ఇందు నీవేదియు విడువనేరవుగదా ! అట్టిస్థితియందు నీవు భజనలక్షణమును విడచుట జ్ఞానలక్షణముగా భావింతువాయేమి? 17. జ్ఞానవివేకముతో నీవు సమస్తమును మిథ్యయని గ్రహించినాఁడవు. ఇందు విడిచినదిమాత్ర మెద్దియునులేదు. అట్టియెడ భజనముమాత్రము విడిచిపెట్టుట కేమిపాపము గావించినదో చెప్పుము 18. యజమాని (సాహెబుగారి) పాదములకడ నీవు సంతోషముగాఁ బడి పొరలాడెదవు. చక్కఁగ నెఱింగియుండియు నీచత్వమునకుఁ

గూడ లోనయ్యెదవు. కాని పరమాత్మునిమాత్ర మొప్పుకొనవు. ఇది యెక్కడిజ్ఞానము ? 19. బ్రహ్మవిష్ణు మహేశాదు లెవ్వనిముందుఁ జేతులను జోడించుకొని నిలువఁబడియుందురో యా పరమాత్ము నొకవేళ నీ వంటి నీచమానవుఁడు భజియింపకుండిన నయ్యెడిదేమి? 20. రాముఁడు మా కుపాస్యుఁడు. రామునితోనే మా పరమార్థమున్నది. అతఁడే సమర్థులందఱికంటెను సమర్థుఁడు. దేవతలనుసై తము ముక్తులను గావించెడివాఁడు. మనమందఱ మాయనకు సేవకులము. అతని చరణసేవలవలననే మనకు జ్ఞానము లభించునది. అట్టి రామునియెడ మనము భక్తిజూపక విముఖులమైనయెడలఁ దప్పక పతనమొందుదుము 21-22. సారాసారవిచారమును దెలిపినగురుని మిథ్యయని యెటుల నుడువఁగలము? నీవీవిచారము నే మెఱుంగుదువు? నేర్పరులకందఱకు నీ యంశము తెలిసినదె 23. సమర్థుఁడగు దేశికుని యనుగ్రహమునకు దూరమైన మానవుఁడు దౌర్భాగ్యుఁడు. రాజ్యపదవినుండి చ్యుతుడై నవానిదశ యెటులుండునో గురుని యనుగ్రహమునకు దూరమైనవానిస్థితి యట్లుండును 24. నేను గొప్పవాఁడనని తన హృదయమునందు భావించువాఁడు బ్రహ్మజ్ఞాని కాఁడు. ఆలోచించి చూచినచో వాఁడు ప్రత్యక్ష దేహాభిమాని 25. వాస్తవమగు భక్తితో రాముని భజింపనివాఁడును నేను భజింపనని స్పష్టముగా నుడువనివాఁడును సందేహశీలుఁడు 26. అట్టివానిని జ్ఞానియని చెప్పఁజాలను. భజనశీలుఁడగు భక్తుఁడనిగూడఁ జెప్పఁజాలను. మఱి యెవఁడన్నచో కేవల దేహాభిమాని. ఇందు సందేహ మావంతయు లేదు. ఇది ప్రత్యక్షమగు నుదాహరణము గదా 27. ఇట్లు వర్తింపదగదు. శ్రీరాముని భజింపవలయును. అదియే సత్యమగు జ్ఞానము 28. దుర్జనులను శ్రీరాముఁడు సంహరింపుచున్నాఁడు. భక్తులనుగాపాడుచున్నాఁడు. ఇది ప్రత్యక్షము 29. రామానుగ్రహమువలన భక్తుల మనోరథములు నెఱవేఱుచున్నవి. విఘ్నములు సంపూర్ణముగా దూరమగుచున్నవి. ఇది యనుభవపూర్వకముగాఁ జెప్పుచున్న సంగతి 30. రఘునాయకుని భజనమువలననే జ్ఞానముకలుగును. రఘుకుల భూషణుని భజనమువలననే మహత్త్వము వృద్ధినొందును. కావునఁ దొలుతొల్త నీవు సగుణభజనమును (శ్రీ రామభజనమును) గావింపుము31. అనుభవపూర్వకముగా నేను జెప్పుచున్న యీవిషయమ్ము

నందు నీకుఁ గొంచెమేని నమ్మకము కలుగకున్నది. కావున నీవు స్వయముగ నిది యనుష్ఠించిచూడుము 32. రఘునాథుని స్మరించి యనంతరము గావించు పనులన్నియు వెంటనే నెరవేఱును. కాని కర్త రాముఁడేయని మాత్రము అంతఃకరణమునందు సంపూర్ణముగా విశ్వాసముంచవల యును 33. స్వయముగాఁ దన్నుదేనికిని గర్తనుగా దలంపక రామునే యన్నింటికిని గర్తనుగా దలంచుట సగుణాత్మ నివేదనభక్తి లక్షణము. నిర్గుణాత్మ నివేదమునందన్నచో స్వయముగాఁ దానుకూడ నిర్గుణుఁడై, యనన్యుఁడు గావలసియుండును* 34. తనను గర్తనుగాఁ దలంచినయెడల నెప్పుడును నేవిషయమేని సమకూరదు. ఈ విషయములో ననుభవము నొందుట కంతశ్రమ నొందవలసినపనిలేదు. 35. ఒకవేళ నీవు నేనే కర్తనని నుడివెదవేని కష్టముల పాలగుదువు. రాముఁడే కర్తయని భావించుటవలన నీకుఁ గీర్తియుఁ బ్రతాపము లభించును 36. పరమాత్మునితో సంబంధ మును ద్రెంపివేసికొనుటయు నాతని యనుగ్రహము సంపాదించు కొను టయు భావనామాత్రమున జరుగును. (నీ హృదయమునందు నేనే కర్త నను భావమును గలిగియుంటివేని పరమాత్మునితో నీకుఁగల సంబంధము దూరమగును. పరమాత్మునియందుఁ గర్తృత్వభావమును గలిగియుంటివేని యాతఁడు ప్రసన్నుఁడగును) 37. మనము ఈ ప్రపంచమున రెండుదినము లుండిపోవువారము. పరమాత్ముఁ డంతము లేనియంతకాల మిటనుండును. మన మందఱము స్వల్పపరిచీయులము. పరమాత్ముని మూఁడులోకము లెఱుంగును 38. రఘునాథుని భజనమును జాలమంది యొప్పుకొందురు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులుసైతము రామభజన తత్పరులై యున్నారు 39. భక్తులమగు మనము జ్ఞానబలమువలన ఉపాసనము నంగీకరింపక పోయిన యెడల నీ దోషకారణమున భక్తిశూన్యులమై కడ కధోగతి నొందు దుము 40. పరమాత్ముఁడు మిగుల గొప్పవాఁడు. ఆతఁడు తన భక్తుల నెన్నఁటికిని ఉపేక్షింపడు. ఉపేక్షించునేని కాఁబోవున దేదియో యాతఁ డెఱింగియే యున్నాఁడు. అక్రమకృత్యములు శ్రేష్ఠుఁడగువాఁ డెన్నఁటికిని

* సగుణ నివేదనమునందు సర్వస్వమునకును బూర్ణభారము శ్రీరామునిమీద నే యుండును. సాధకుఁ డిచట కేవల నామమాత్రముగా నుండును. నిర్గుణనివేదనమునందు దానుగూడఁ బూర్తిగ రాముఁడై పోవును.

గావింపఁడు. అటులొనరించుట శ్రేయముగాదని యాతఁ డెఱుంగనివాఁడు కాఁడు 41. సాధువులకు దేహముతోఁబాటు ఉపాసనముగూడ విడరాని బంధముగ నున్నది. లోపలనుండి వారలు పరమాత్మునితోఁ గలిసి యుందురు. (దేహాభిమానమును విడిచి వారలు జన్మాంతము దనుక యీశ్వరోపాసనము గావించుచుందురు) 42. సాధుపురుషులు ఈ సృష్టిని స్వప్నదృశ్యములనువలె మిథ్యగా భావింతురు. ఈ విషయము శ్రీ రామ భజనము కతన విదితమగును 43_44. దృశ్యసృష్టి మిథ్యయగుచో నేల కాన్పించును ? అని శ్రోతలకు సంశయము కలిగినది. ఈ సందేహమును రాబోవు సమాసమునందుఁ దొలఁగించెదను 45.

---

## ఎనిమిదవ సమాసము — దృశ్యమునకుఁగల మిథ్యాభాసము.

ఈ దృశ్యసృష్టియొక్క ఆభాసము (లేనిది యున్నటులఁదోఁచుట) మిథ్య యెటులయ్యెనో మీకు నిరూపించి తెలుపుచున్నాఁడను. శ్రద్ధాభక్తులతో జెవియొగ్గివినుండు 1. జడులు, మూఢులు, అజ్ఞానులునగు మనుజులీసృష్టిని సత్యమని విశ్వసించిన విశ్వసింతురుగాక. కనబడుదానినెల్ల సత్యమని విశ్వసించుట జ్ఞానిదృష్టికిఁ దగినపనికాదు 2. "నాకు గనఁబడునది యెల్ల సత్యము. దీని నెవఁడేని కాదనిపలుకునేని నేను వాని నోడించెదను" అను నీదురభిమానమునకు లోనుగాఁగూడదు. కేవల మీ చర్మచక్షువులకు గాన్పించుచున్నంత మాత్రమునఁ గోట్లకొలఁదిగనున్న గ్రంథముల యొక్కయు, సాధుసజ్జనులయొక్కయు మాటలను మిథ్యయని యెట్లు నుడువఁగలము? 3_4. మృగము మృగజలమును (మృగతృష్ణను) గాంచి జలమని భ్రాంతినొంది నలుగెలంకులఁ బరుగుత్తుచున్నది. "ఇది మిథ్యా దృశ్యము. ఇచ్చట జలములేదు" అని యాపశువుతో నెవ్వఁడు చెప్పఁ గలఁడు ? 5. అపారమగు ద్రవ్యము లభించినట్లును, ఆధనముతోఁ బలువురితో వ్యవహారము గావించినట్లును రాత్రి స్వప్నమునఁ జూతురు. దీనిని సత్యమని యెట్లు నమ్మెదుము? 6. ఒకానొక చిత్రకళాకుశలుఁడు నిర్మించిన ప్రతిమను గాంచినంతన హృదయమునందుఁ బ్రీతి జనించుచున్నది. కాని యటనేమున్నది? మన్ను 7. బహువిధములుగానుండు రమణీమణులను,

ఏనుఁగులను, గుఱ్ఱములను రాత్రులందుఁ గాంచెదమేని మనస్సు మోహా మగ్నమగును. కాని పగటిపూటఁ గాంచెదమేని యవి యన్నియునుఁ దోలు బొమ్మలని తెలియును. చూచుటకెంతయో యసహ్యాకరముగఁగూడ నుండును 8. శిల్పులు నానావిధకౌశలములతో రచించిన దారు పాషాణ విగ్రహములు మిగుల సుందరముగాఁ గాన్పించును. కాని యచట నున్నదేమియో తెలియునా? కొయ్యముక్కలు. లేదా ఱాయి 9. అనేక మందిరముల పై నుండు ప్రతిమలు శరీరము వంచి యోరచూపుతోఁ జూచుచున్నటు లుండును. వాని సౌందర్యము గాంచినంతన చిత్తవృత్తి వానియందు లీనమై పోవును. కాని వానిలో నుండునవి (ఇసుక, సున్నము, మసాలయను) త్రిభాగములే 10. దశావతార నాటకములాడుటలో రంగస్థలమునకు సుందరాంగులగు స్త్రీలు వత్తురు. వారలు కళాకౌశలముతోఁ గనులను ద్రిప్పుదురు. కాని వారలందఱును నటకులగు పురుషులే 11. ఈ సృష్టి నానావిధములనున్నది. అసత్యమైనది. ఇది పగటి వేషకాండ్రు (బహురూపులు) గావించు వినోదమువంటిది. అవిద్యా కారణమున నీకీదృశ్యమంతయును సత్యముగాఁ గాన్పించుచున్నది 12. ఓయీ! నీవు అసత్యమును సత్యముగాఁ దలంచి తిలకించుచున్నాఁడవు. అంతతో నూరకయుండక బాగుగా విచారింపుము. దృష్టికిఁగల తరళత్వ చంచలత్వ వికారములవలన నేదేని యొకటి యింకొకటిగ భాసించినయెడల దానిని సత్యమని నెటుల నంగీకరింతుము? 13. పైకిఁజూచినయెడల నాకాశము నిలుకడగానున్నటులఁ గాన్పించును. నీటిలోఁ గాంతుమేని కదలు చున్నటు లుండును. ఆకాశమధ్యమున నక్షత్ర సముదాయము ప్రకాశించు చున్నవి. కాని యీ దృశ్యమంతయును మిథ్యయేగదా 14. ఒక రాజొక చిత్రకారుని బిలువనంపి తన కుటుంబములోనివారినందఱను యథాతథ్యముగఁ జిత్తరువులోఁ జిత్రింప నాజ్ఞాపించును. చిత్రకారుఁడు చిత్రించిన ప్రతి రూపములువారలవలెనే యుండును.యథార్థమునకు అదిఅంతయు మాయిక రచనముగాక ఏమున్నది ? 15. నేత్రములయందు స్వయముగా నేచిత్రము నుండదు. కాని మనము దేనినేని గాంచినపుడా దృశ్యవస్తు ప్రతిబింబము మననేత్రములలోనికి వచ్చును. ఇపు డీప్రతిబింబము స్వయముగా నావస్తువే యని యెటులొప్పుకొనగలము? 16. నీటియందెన్ని బుడగలుపుట్టునో వాని

యన్నిఁటియందు మనరూపము లనేకములు గాన్పించును. కాని యవి క్షణమాత్రములోఁ బగిలిపోయినపిమ్మట ఆరూపముల యసత్యత్వము ప్రకటితమైపోవును 17. చేతియందెన్ని చిన్నచిన్న యద్దముల దీసికొంటిమో యన్నింటియందును మన ముఖ మన్నిగాఁ గనిపించును. వాస్తవమునకు మన కన్నిముఖము లెక్కడివి? ఒక్కముఖమేగదా! అటులఁ బెక్కులుగాఁ గనిపించుట కేవలము మిథ్యాభాసము 18. నదీతీరమున బరువును గొనిపోవునపుడు తలక్రిందుగానున్న బరువుమోయుచున్న రెండవరూపము నదిలోఁ గాన్పించును. ఆకస్మికముగా మనము గావించు ధ్వనికి బ్రతిధ్వని వినిపించును 19. బావియందును జెఱువునందునుగల నీటిలో సమీపమున నున్న పశుపక్షినరవానర నానావిధవృక్షలతాదులు ప్రతిబింబితములుగాఁ గనఁబడుచుండును 20. కత్తిని త్రిప్పునపుడు చూచితిమేని ఒకకత్తియే రెండుకత్తులుగాఁ గనఁబడును. వివిధములుగానుండు తీఁగలను జలింపజేయుదుమేని యొకటి రెండుగాఁ గనిపించును 21. నిలువుటద్దములతో నలంకరింపబడిన భవనమునందొకవేళ సభ జరుగుచున్నయెడల రెండవసభ ఆభాసరూపముగా నద్దములలోఁ గాన్పించును. దీపపంక్తులుగూడ అద్దములయందు బహువిధ ప్రకాశములతోఁ గానఁబడుచుండును 22. ఈ విధముగా బహుప్రకారములగు నీకౌతుకప్రదర్శనములు సత్యతుల్యముగాఁ గాన్పించుచుండును. వీనినన్నింటిని మనము సత్యములని యెన్నఁటికిని విశ్వసింపనేరము 23. ఇటులె మాయగూడ నొక కపటనాటకము. బైటికి సత్యమువలెనే కాన్పించును. జ్ఞానులు దీనినెన్నఁటికిని సత్యమని విశ్వసింపరు 24. కల్పితమగు వస్తువును సత్యమైనదానిగా భావించినయెడల నిఁక విమర్శకులతో విమర్శనముతో నావశ్యకమేమున్నది? ఈ యవిద్యాకృత్యములును నిటులెయుండును 25. మనుజులుగావించు గారడివిద్యగూడఁ గొందఱకు సత్యముగనే తోఁచును. కాని యంత్యమునందు శోధనముగావించినపిదప నందుగల యసత్యమంతయు విదితమగును 26. రాక్షసులమాయసైతమిట్టిదియే. అది దేవతలకుసైతము సత్యముగనే కాన్పించును. పంచవటియందు శ్రీరాముఁడే లేడిని వెంబడించి పరుగెత్తినాఁడు 27. రాక్షసులు కోరినపుడు తమదేహమును మార్చివేయుదురు. ఒకఁడే పెక్కుమందిగా మాఱును, రక్తపుఁబొట్టులనుండిగూడఁ బలువురు

జనింతురు 28. అభిమన్యుని వివాహసమయమునందు ఘటోత్కచుని మాయవలన అనేకులు రాక్షసులు నానావిధపదార్థములుగ ఫలములుగా మాఱిరి. శ్రీకృష్ణుండే గోకులమునందు ఎందఱో కపటరూపులగు దైత్యులను వధించెను 29. రామునితో సంగరముగావించు సమయమునందు రావణుం డెన్ని కపటములగు మాయలను గావించెనో, ఎన్ని మాయశిరములను నిర్మించి మోసగించెనో, కాలనేమి హనుమంతుని జంపుటకై కపటఋషియై యెటులవంచించెనో మీ రెఱుంగనియంశముగాదు 30. నానావిధములగు కపటమతులుగల రాక్షసుల దేవతలు చంపజాలకున్నపుడు దేవి ప్రత్యక్షమై వారలనందఱను గడతేర్చెను 31. ఇదియంతయును రాక్షసుల మాయ. దీనిని దేవతలుసైత మెఱుంగఁజాలరు. రాక్షసుల కపట విద్యాలీల లఘటితములు 32.

మనుజులుగావించు గారడి మున్నగుమాయలు, రాక్షసులుగావించు మోసములు, భగవంతుని నానావిధములగు విచిత్రమాయలు అను నీమూఁడును బయటికి సత్యసమానములుగా గాన్పించును. బాగుగా విచారించిన మీఁదట నందు సత్యమేమియును లేదని బాగుగాఁ దెలియును. లోనఁ బ్రవేశించి చూచినకొలఁది వాని మిథ్యాత్వము ప్రకటనమగును 33-34. మాయను సత్యమందుమేని యది బొసఁగదు. ఏలయన మాయ నాశమగుచున్నది. ఒకవేళ అసత్యమందుమా, అది కాన్పించుచున్నది. రెండు ప్రక్కలను మనస్సునందు అవిశ్వాసమే కలుగుచున్నది 35. వాస్తవములో నిది సత్యముగాదు. మాయ మిథ్యగ నున్నది. ఈ సంపూర్ణమగు దృశ్యమంతయు స్వప్నమువంటిది 36. అన్నా! వినుము. ఒకవేళ నీకు భాసమే (కనుపించునదియే) సత్యముగాఁ దోఁచెనేని నీవు ప్రమాదము నొందితివని యర్థము 37. ఈ దృశ్యభాసమంతయు నవిద్యాత్మికము. నీదేహముగూడ నవిద్యాత్మికము. కావుననే యీమాయవివేకము నీయందుఁ జొచ్చినది 38. దృష్టివలన దృశ్యము గనిపించుటకును, మఱియు మనస్సు ధానిభాసముపయిఁ బాదుకొనుటకును ఈయవిద్యాత్మికమగు లింగదేహమే

కారణము 39. *అవిద్య యవిద్యను చూచుచున్నది. ఇందువలనఁ బై నిచెప్పిన విషయముపై విశ్వాసము కలుగుచున్నది. ఏలయన, నీశరీరము గూడ నవిద్యచే నిర్మింపఁబడినదిగదా 40. ఈ దేహమునే నీవు స్వాయముగా నేను అనుచున్నాఁడవు. ఇటులనుట దేహబుద్ధిలక్షణము. దీనివలననే సంపూర్ణదృశ్యము నీకు సత్యముగాఁ దోఁచుచున్నది 41. ఇటు దేహమును సత్యమని విశ్వసించుచున్నాఁడవు. అటు దృశ్యమును సత్యమని విశ్వసించుచున్నాఁడవు. ఈ కారణములచేతనే నీకుఁ బ్రబలమగు సందేహము కలుగుచున్నది 42. దేహబుద్ధిని దృఢముగావించి దిట్టతనముతో బ్రహ్మమును జూచుటకు యత్నించుచుంటివిగాని యిచట దృశ్యము మాయ పరబ్రహ్మముయొక్క మార్గము నాటంకపఱుచుచున్నది 43. ఇందుచే దృశ్యమునే సత్యముగాఁ దలంచి భ్రమలోఁబడుచుంటివి 44. మమత్వము (నేను నాది యనుట) వలన బ్రహ్మము లభింపదు. దేహబుద్ధివలననే దృశ్యమునకుగల మిథ్యాభాసమునైతము సత్యముగాఁ దోఁచుచున్నది 45. చర్మచక్షువులతో బ్రహ్మమును దర్శించెడువాఁ డెన్నఁటికిని జ్ఞాతయని జెప్పఁదగఁడు, వానిని గ్రుడ్డివాఁడనిగాని కేవల మూర్ఖుఁడనిగాని నుడువవచ్చును 46. దృష్టికిఁ గాన్పించునదియంతయు మనస్సునకు భాసించునదియుఁ గాలాంతరమునందు వినాశనమగును. కాని యవినాశియగు పరబ్రహ్మము దృశ్యమునకంటె వేఱుగ (ఆవల) నున్నాఁడు 47. శాస్త్రములన్నియును పరబ్రహ్మమును శాశ్వతమనియు మాయ నశాశ్వతమనియు నిశ్చయించుచున్నవి 48. రాఁబోవుసమాసములో దేహబుద్ధిలక్షణములను దెలిపి భ్రమయందుఁ బడియున్న "నేను" అనునదెవ్వరో దానినిగూడ వివరించెదను 49. "నేను" అనుదానినెఱింగి భావమును విడిచి పరమాత్మునియం దనన్యతనొందుటవలన సులభముగాఁ బరమశాంతి లభించును 50.

---

* దృశ్యము అవిద్యాత్మకము. ఈదేహముగూడ అవిద్యాత్మకమే. ఈస్థితియందు నీ యవిద్యాత్మక దేహమునకు (శరీరములనే నీవు నేను అని భావించెదము గాన నీకు) ఈ యవిద్యాత్మకమగు దృశ్యజగత్తు సత్యముగాఁ గనఁబడుచున్నచో నందాశ్చర్యకరమగు విషయ మేదియును లేదు. సాధారణమే!

## తొమ్మిదవ సమాసము — గు ప్తపరమాత్మశోధనము

ఇంటిలో రహస్యముగాఁ దాచినధనమును సేవకు లెఱుంగరు. సేవకులకు బహిరంగముగాఁ గనవచ్చు పదార్థములతోడనే సంబంధముండును1. బయటికిఁ గాన్పించుచున్న పదార్థములను విడిచిపెట్టి నేర్పరులు లోపలనున్న ముఖ్యధనమును వెదకి గైకొందురు 2. ఇటులే వివేకమతులగు మానవు లీ మాయిక (సృష్టి) దృశ్యమును విడిచి పరమాత్మని శోధించి గై కొందురు. తక్కినవారలీ దృశ్యమాయలోఁ దగుల్కొనియుందురు 3. ద్రవ్యమును లోపలనుంచి పై ననీటిని నింపినయెడల జనులది యొకసరోవర మనుకొందురు. కాని దానిలోపల నేమున్నదో సమర్థులగువారలకే తెలియును 4. ఇటులె సమర్థులగు జ్ఞానులు పరమార్థమును గురుతించి గ్రహింతురు. తక్కినవారలు దృశ్యపదార్థమునే తమస్వార్థముగాఁ దలంతురు 5. పాటకపుజనులు కూలివాండ్రు బరువులను మోయుదురు. శ్రేష్ఠులగు పురుషులు సుందరీరత్నములతోఁ గలసి భోగముల ననుభవింతురు. కర్మయోగమువలన నెవ్వానికెయ్యది నియమిత మగుచున్నదో యది వానికిఁ బాగుగాఁ దోఁచుచుండును 6. ఒకఁ డరణ్యము నందలి కొయ్యలను నఱికియు, నొకఁడు ఱాయిఉప్పల నొకచోటఁ జేర్చియు జీవయాత్ర గడుపుకొనుచున్నారు. కాని యుత్తమపదార్థములతో భోగముల ననుభవించు రాజుల కీమరవస్థ కలుగఁబోదు 7. విద్వాంసులగు పురుషులు సౌఖ్యముల ననుభవించుచున్నారు. అన్యులు బరువులను మోయలేక చచ్చిపోవుచున్నారు8. ఒకఁడు దివ్యమగు భోజనమును భుజించుచున్నాఁడు. ఒకఁడమేధ్యమునే వెదకి ప్రోగుగావించుచున్నాఁడు. అందఱును దమతమ కార్యములయం దభిమానులై యున్నారు 9. శ్రేష్ఠుఁడగు మనుజుఁడు సారవంతములగు పదార్థములను సేవించుచున్నాఁడు. సోమరిపోతు అసార వస్తువులను గ్రహించుచున్నాఁడు. ఇంతకును సారమేమన — సారాసార విషయములను సుజ్ఞానులే యెఱుంగుదురు 10. స్పర్శవేదియును జింతామణియును మనకుఁ జిక్కక గు ప్తములుగా నెందోయున్నవి. ఇనుము, కంచు లోనగు సామాన్య లోహములు బహిరంగముగానున్నవి. ఇటులె బంగారము, రత్నములు మున్నగునవి గనులలో నెందో గు ప్తములుగా నున్నవి. ఱాళ్లు, మన్ను ప్రకటనముగా నన్నికడల నున్నవి 11. దక్షిణావర్త

శంఖము దక్షిణావర్తలత అమూల్య వనస్పతులు గుప్తగానున్నవి. గ్రుడ్లు, ఉమ్మెత్తలు, నత్తగుల్లలు ప్రకటనముగా నున్నవి 12.

కల్పతరు వెచ్చటను గాన్పింపదు. కాని యితరవృక్షములు చాల గలవు. చందనవృక్షములు గనిపింపవుగాని రేగు, తుమ్మ మున్నగు వృక్షములు ప్రపంచమునం దంతటను విస్తరించియున్నవి 13. కామధేను వింద్రునియొద్దనే యున్నది. ఇతరములగు దూడలు, ఆవులు దేశమునిండ బెక్కులుగలవు. రాజ్యభోగములను రాజులే యనుభవించుచున్నారు. ఇతరులు కర్మానుసారముగా సుఖదుఃఖముల ననుభవించుచున్నారు 14. బహువిధముల వ్యాపారములు గావించువారలు తమకుఁ దాము ధనవంతులమని చెప్పుకొందురు. కాని కుబేరునిముందు వీరెంతవారో యెఱుంగరు 15. ఇటులే గుప్తమగు నర్థమును (పరమాత్మని) బడయఁగలుగువారలు యోగీశ్వరులే. ఉదరదాసులగు నన్యులు నానామతములను గూర్చి తర్కించుచుందురు 16. సారముగలవస్తువు జనులకుఁ గాన్పింపదు. అసారము సులభముగాఁ గాన్పించును. సారాసారవివేకమును సాధుపురుషులే యెఱుంగుదురు 17. సత్యాసత్యవిషయములను సామాన్యజను లెటుల నెఱుంగఁగలరు? సాధువులయొక్కయు సత్పురుషులయొక్కయు మహత్త్వములను సాధువులు, సత్పురుషులే యెఱుంగుదురు 18. భూగర్భమునందుంచిన ధనమును అంజనమువేసి కనుఁగొనునటుల సాధుజనానుగ్రహమున గుప్తపరమాత్మని గ్రహింపవలయును 19. రాజువద్దనున్న ధనము సులభముగాఁ బ్రాప్తించునటుల సాధుజనులకడనున్న యెడలఁ బరమాత్మ లభించును 20. సజ్జనులకుఁ బరమాత్ముఁడు లభించును. దుష్టులకు దుర్గతిలభ్యమగును. ఆలోచనాధీనుఁడగు మానవునకు ఆలోచనాశక్తి సిద్ధించును 21. సంపూర్ణముగనుండు నీ దృశ్యమంతయు నశాశ్వతమైనది. అచ్యుతుఁడును అనంతుఁడును నగు పరమాత్ముఁడు ఈ దృశ్యమునకంటె వేఱుగా నున్నాఁడు 22. అంతియగాక యాపరమాత్ముఁడు దృశ్యమునకు వేఱుగను దృశ్యమునకు లోపలను నున్నాఁడు. చరాచరము లన్నింటియందును నున్నాఁడు. వివేకసహాయమున నాతఁ డనుభవములోనికి వచ్చును 23. సంసారమును విసర్జింపకున్నను ప్రపంచోపాధిని వదలకున్నను కేవల విచారముతోడనే జీవితము సార్థకమగును 24. ఇది యనుభవసిద్ధమగు

మాట. వివేకసహాయమున దీని ననుభవములోనికిఁ దేవలయును. ఇందు సందియ మావంతయు లేదు. అనుభవనీయుఁడగు పురుషుఁడే సమర్థుడు 25. అప్పుగాఁ దెచ్చుటలో సొమ్మునిచ్చి తెచ్చుటలో నెంత యంతరము గలదో యంత యంతరము అనుభవానుమానములకును మానసపూజా ప్రత్యక్షపూజలకుఁ గలదు 26. ఈ జన్మమునఁ గావించిన సత్కర్మముల ఫలము ముందుజన్మమునకు లభించుటయనునది అప్పుతో సంబంధించిన విషయము. కాని సారాసారవిచారమువలని ఫలము (ముక్తి) తత్కాలము ననే (ఈ జన్మమునందే) లభించుచున్నది 27. సారాసారవివేచనమువలన దత్కాలముననే ఫలితము గన్పించును. మనుజుఁడు సంసారమునుండి విడిపోవును. జనన మరణములనుగూర్చిన సందియములు తొలఁగును 28. వివేకముగలవారు ఈ జన్మమునందే యీ కాలముననే సంసారమునుండి వేఱు గాఁగల్గుదురు. మఱియు నిశ్చలస్వరూపాకారులై మోక్షమును బడయుదురు 29. ఈ విషయమునందు సందేహముగలవాఁడు సిద్ధుఁడై నను దప్పక యధోగతి నొందును. దీని నసత్యమని చెప్పువానితో నిది సత్యము సత్యము అని మాయుపాసనతో శపథము గావించెదము 30. ఈ విషయమంతయు సత్యమైనది. మానవులు వివేకసహాయమునఁ దత్క్షణమే ముక్తులు గాఁగలరు. మఱియును వారు సారమునందుండియు నలిప్తులయ్యెదరు 31. నిర్గుణపరమాత్మస్వరూప మెట్టులుండును? దానియం దనన్యత నొందువిధమేది? అను నీ యంశములనుగూర్చి యోచించినయెడల సాధకునకుఁ బూర్ణ శాంతి లభించును 32. దేహమునందుండియే విదేహుఁడగుటయుఁ, జేసియు నేమియుఁజేయనివాఁడుగ నుండుటయు జీవన్ముక్తుల లక్షణములు. ఈ జీవన్ముక్త లక్షణములు జీవన్ముక్తులే యెఱుఁగుదురు 33. సాధారణముగా నీవిషయము మానవులకు సత్యముగాఁ గాన్పింపదు. ఇది సంశయాస్పదమని తోఁచును. సద్గురువచనములతో నీ సందేహము సమూలముగా నశించిపోవును 34.



## పదియవ సమాసము -- అనుభవము - అకథనీయము.

అనుభవవిషయమును దెలుపుమని యడుగుదుమేని యది యకథనీయమని (చెప్ప వలనుపడనిదని) జనులు చెప్పుదురు గావునఁ దాము దీని

స్థితినంతయు దయచేసి తెలుపఁగోరెదము 1. మూఁగవాఁడు బెల్లపురుచి
నెఱింగింపనేరని యట్లు అనుభవమునుగూడఁజెప్ప వలనుపడదని కొందఱం
దురు. దీనికారణమెద్దియో తాము దెలుపుడు 2–3. ఎవ్వరినడుగబోయి
నను ఈవిషయ మగమ్యమనియే చెప్పుదురు. నాకా మాటపయి నమ్మ
కము గలుగకున్నది. ఈయంశమును నాకు మనస్సునకు బట్టునటులఁ
దాము సెలవీయవలయును 4. శ్రోతలారా! మీరడిగిన ఈప్రశ్నమునకుఁ
బ్రత్యుత్తరము చెప్పెదను. సావధానులరై వినుండు 5. పరమశాంతిని
(ఆత్మానుభవ స్వరూపమును) మీకు స్పష్టముగా వివరించెదను 6. ఏది
మాటలవలన దెలియఁబడదో అటులే యెయ్యేది చెప్పకున్న నెఱుకపడదో
మఱియు నెద్దానిని గల్పించిచెప్పుటవలనఁ గల్పనాశక్తి మందగించునో యట్టి
పరబ్రహ్మము వేదములకుఁగూడఁ బరమగుహ్యముగా నున్నది. దానిని
సాధుసమాగమమువలనఁ బాగుగా గ్రహింపవచ్చును 7 – 8. ఇపుడు
గంభీరశాంతిని నిరూపణము గావించెదను. నేనుజెప్పు అనుభవవాక్యముల
నాలింపుఁడు. మీకిపుడు అనిర్వాచ్యవస్తురహస్యము దెలుపఁబోవుచున్నాఁ
డను 9. తెలుప నశక్యమగు నంశములను దెలుపయత్నించుట తీపునెఱుం
గుటకు బెల్లము నొసంగుటవంటిది. ఈపని (అకథనీయాంశము నెఱింగిం
చుట) గురునివలనఁ దప్ప నితరునివలనఁ గాఁజాలదు 10. తన నన్వేషించు
వానికిఁ (దేహాభిమానము విడిచినవానికి) దొలుదొలుత సద్గురుని యను
గ్రహము ప్రాప్తించును. పిమ్మట వస్తువు (బ్రహ్మము) తనంతన యను
భవములోనికి వచ్చును 11. బుద్ధిని దృఢముగావించి తొలుత "నేనెవఁ
డను" అనుజాడ తీయవలయును. దీనివలన నొక్కసారిగా (సమాధి)
ధ్యాన మేర్పడును 12. "తన" యనుదానిమూలమున శోధించినపిమ్మట
"తన" యనునది మిథ్యయని విశదమగును. ఇది యనుభవమైనపిమ్మట
వాస్తవమునకు దాను స్వయముగా వస్తురూపుఁడై పోవును. ఇదియే పరమ
శాంతి 13. పూర్వపక్షమునందు ఆత్మను సర్వసాక్షియని చెప్పిరి కాని
సిద్ధపురుషు లాపూర్వపక్షమును విడిచి సిద్ధాంతమునే గ్రహింతురు 14.
సిద్ధాంతము మీఁద మనము ధ్యానముంచఁగనే ఆత్మ సర్వసాక్షికాదను
నంశము విశదమగును. అవస్థయే సర్వసాక్షి. ఆత్మ దానికంటె భిన్నమైనది
(అవస్థాతీతమైనది) 15. పదార్థజ్ఞానము లయమైపోవఁగనే ద్రష్ట

(పరమాత్మను జూచువాఁడు) ద్రష్టరూపమున నుండఁడు (స్వయముగా బ్రహ్మమునందు లీనుఁడగును). అప్పుడు "నేను" అను మైకము పూర్తిగాఁ దొలంగిపోవును 16. నేననుభావము లయమైపోవుటయే అనుభవలక్షణము. ఈకారణముననే దీనిని అనిర్వాచ్యసమాధానమని (అనుభవముచే నెఱుంగదగినదని) చెప్పుదురు. ఏలయన "నేను" అనునది లేకపోయి నప్పుడు సమాధానమును వర్ణించువాఁ డెక్కడ నుండును? 17. ఎంత వివేకముతోఁ గూడినమాటలనైనను అనుభవదృష్టితోఁ జూచితిమేని మాయాయుతములుగను వ్యర్థములుగను నుండును. కాని యామాటలు లోపలను వెలుపలను గంభీరార్థముతో నిండినవిగా నుండును 18. శబ్దముల వలన నర్థము తెలియును. అర్థమును విచారించి గ్రహించినపిమ్మట శబ్దములు వ్యర్థములై పోవును. శబ్దములు చెప్పెడి దంతయు యథార్థమెగాని స్వయముగా నవి (శబ్దములు) మిథ్యయై యున్నవి 19. శబ్దముల సంయోగముచే వస్తువు భాసించును. వస్తువును గాంచినపిమ్మట శబ్దములు నశించును (శబ్దములను శోధించి వానియందలి యర్థమును గ్రహించిన పిదప నవి వ్యర్థములగును) 20. లేదా శబ్దములను పొట్టుగను అర్థమును ధాన్యముగను భావింపవచ్చును. ధాన్యమునుగ్రహించి పొట్టును మనము పారవేయుదుము. ఐనను ధాన్యము తొలుత పొట్టుతోడనే మనకు లభించుచున్నది 21. పొట్టులో ధాన్యముండునుగాని ధాన్యములోఁ బొట్టుండదు. అటులే పరబ్రహ్మము శబ్దములయందుండునుగాని శబ్దములు పరబ్రహ్మమునందుండవు 22. ఏదేని చెప్పినపిమ్మట శబ్దములు మిగిలియుండవు. కాని అర్థముమాత్రము శబ్దములు బయలు వెడలుటకు ముందునుండియే స్థిరపడియుండును. కావున శబ్దములు అర్థముతో సమానత్వమును గాంచఁజాలవు 23. మనము పొట్టునువిడిచి ధాన్యము నెటులగైకొందుమో యటులే వాచ్యాంశమును (శబ్దమును) విడిచి లక్ష్యాంశమును (అర్థమును లేక బ్రహ్మమును) శుద్ధమగు స్వానుభవముతో గ్రహింపవలయును 24. దృశ్యమునకు వేఱైన (బ్రహ్మమును) విషయమునుగూర్చి చెప్పుదానిని వాచ్యాంశమందురు. దానియర్థమును శుద్ధలక్ష్యాంశమని చెప్పుదురు 25. పైనఁ బేర్కొనిన శుద్ధలక్ష్యాంశమునుగూడఁ బూర్వపక్షమనియే భావింపవలయును. స్వానుభవమన్ననో యది యలక్ష్యము. అది యెన్నఁటికిని

లక్ష్యములోనికి రాఁజాలదు 26. దేని కాకాశముతోఁగూడ నుపమింప వీలుపడదో, యెయ్యది యనుభవసారమో దానిని(బ్రహ్మమును)లక్ష్యాంశ మని చెప్పుటగూడఁ గల్పనమే 27. ఎయ్యది మిథ్యాకల్పనమువలన నుత్పన్నమయ్యెనో దానియందు సత్యత్వ మెక్కడనుండివచ్చును? కావున నిట ననుభవముతోఁ బనిలేదు 28. అంతియగాదు అద్వైత (పరబ్రహ్మ) మువట్లగూడ ననుభవముతోఁ బనిలేదు. అనుభవమో, అది ద్వైతము నందే యడఁగియున్నది 29. అనుభవకారణముననే త్రిపుటి (అనుభవ నీయుఁడు, అనుభావ్యము, అనుభవము) ఉద్భవమగుచున్నది. అద్వైతము నందన్ననో అందు ద్వైతమే లజ్జనొందుచుండ నిఁకఁద్రిపుటికి నిర్వాహ మెట్లు కుదురును? కావున నది యనిర్వాచ్యమని నుడువుటయే యుక్తమని తోఁచుచున్నది 30. దినమునకును రాత్రికిని బరిమితి నేర్పఱచువాఁడు సూర్యుఁడు.ఒకవేళ సూర్యుఁడే నాశనమగుచో నట్టియవస్థనేమందుము?31. అటులే శబ్దోచ్చారణము గావించుటకుఁగాని లేక మౌనముగా నుండుటకుఁ గాని మూలము ఓంకారము. ఒకవేళ నాయోంకారమే లేకపోయినచో నుచ్చారణము నెటులఁ గావింపవలయును?32, అనుభవము, అనుభవించెడి వాఁడు, అనుభావ్యము అనునవియెల్ల మాయనుండియేఁ యేర్పడినవి. ఒక వేళ మాయయే యుండకపోయినచో నివియెటు లేర్పడును? 33. ఒకవేళ మన ముభయులము వేఱువేఱుగా నున్నచో అనుభవవివేకమువలన వస్తువు చక్కఁగాఁ దెలియునట్టిదియే 34. భిన్నత్వవిషయమిచట గొంద్రాలి సంతతివలె మిథ్యగానున్నది. భిన్నత్వమనుపేరు మొట్టమొదటినుండియు లేదు 35. ఉదాహరణము వినుండు. ఒక యజమ్ముఁడు నిదురించుచు (స్వప్నావస్థలో) నుండెను. వాఁడు సంసారదుఃఖకారణమున సద్గురుని శర ణ్యములోనికిఁ బోవుచున్నటులఁ గలగనుచున్నాఁడని భావించుదము 36. సద్గురునకు వానియం దనుగ్రహము కలుగుటచే వానికి సంసారదుఃఖము నాశనమగుచున్నది. మఱియు నాతనికి సద్గురునను గ్రహమువలన జ్ఞానము కలుగుచున్నది 37. కావున నిదియంతయు "నుండినదెద్దియో యదిలేదు" అనుదానికి సమముగానున్నది. మఱియు 'నెయ్యదిలేదో యది లేనేలేదు.' అనుటకుఁగూడ నిది సమముగనున్నది. అటులే ఉన్నది, లేదు అనునీ రెండును లేకున్నపిమ్మట నాతఁడు శూన్యావస్థను బ్రాపించును 38. దీని

తరువాత, శూన్యావస్థ కావలనున్న శుద్ధజ్ఞానముచే నాతనికిఁ బరమశాంతి కలుగును. మఱియు నైక్యరూపమువలన అభిన్నతయో లేక సహజస్థితియో ప్రాప్తించును 39. అద్వైత నిరూపణమగుటవలన నాతని ద్వైతవార్త యంతయు నంతతో నశించును. అనంతర మాతఁడు జ్ఞానచర్చలు గావింప నారంభించును. ఇంతలోననే ఆయజన్ముఁడు స్వప్నమునందే జాగరూకుఁడగు చున్నాఁడు 40. ఇప్పుడు శ్రోతలు సావధానులరై యిందలి యర్థము నందు ధ్యానముంచుడు. ఏలయన, యిందలి రహస్యము దెలిసినపిమ్మట మీకు సమాధానము గలుగును 41. ఆయజన్ముఁ డెంతజ్ఞానముగడించెనో యదియంతయు స్వప్నముతోఁబాటుగా దాటిపోయినది. శబ్దముల కవ్వల నున్న యనిర్వాచ్యసుఖము వేఱుగనేయున్నది 42. ఆ శబ్దాతీతసుఖముపట్ల శబ్దములేకయే ఏకత్వమున్నది. అచ్చట అనుభవము అనుభవించెడివాఁడు అనునదేద్దియును లేదు. కాని ఆయజన్ముఁ డంతదనుకఁ జేరకముందే మేల్కొనెను. ఇంతకును దేలిన సారాంశమేమన ఆతఁడు స్వప్నమునందు స్వప్నమునుగాంచెను. మఱియు స్వప్నమునందే యొకమాఱు మేల్కొని కనులను దెఱచెను (ముఖ్యావస్థను జేరలేకపోయెను) 43_44. ఈ నిరూపణమునే యింకను స్పష్టముగాఁ జెప్పెదను. దానివలన శ్రోతలకు విషయము చక్కఁగా బోధయగును. 45. ఇదియంతయు నాలించి గురుని శిష్యుఁ డిటుల నడుగుచున్నాఁడు. గురువర్యా ! ఈ యంశమును ముఖ్యముగా మఱల బోధింపుఁడు. అట్లు బోధింతురేని ముఖ్యవిషయము చక్కఁగా గ్రహింప నవకాశముచిక్కును 46_47. ఈ యజన్ముఁ డెవఁడు ? ఆతఁడు గాంచిన స్వప్నమెట్టిది? స్వప్నమునం దాతఁడు గురునితో నేమేమి మాట లాడినాఁడు? 48. గురుడిటులఁ బ్రత్యుత్తరమొసంగెను. ఓ శిష్యుఁడా ! ఆయజన్ముఁడవు నీవే ! నీవు స్వప్నములో నేస్వప్నమును గాంచుచుంటివో దానినిగూడ నెఱింగించెదను 49_50. ఈ సంసారమే స్వప్నములో స్వప్నము. ఇచట నీవు సారాసారవిచారము నొనరించుచున్నాఁడవు 51. సద్గురుని శరణులోనికరిగి యచట శుద్ధనిరూపణము నాలించి ప్రత్యక్షముగా నిపుడు నీవు తద్విషయకచర్చలనే గావించుచుంటివి 52. ఈచర్చల యనుభవమంతయు లభించినపిమ్మట నీ యుపదేశమంతయు ముగియుచున్నది. ఈ శాంతియుత్తమగు విశ్రామమే మేల్కొనుట 53. జ్ఞాన

చర్చలతో సంబంధించిన గోలయంతయు దూరమగుటచే అర్థము ప్రకటన మగుచున్నది. మఱియు నీ విచారమువలన ననుభవము ప్రాప్తించుచున్నది 54. అనంతరము నీవు ఇదియే జాగరూకతయనియు, నాకు (శిష్యునకు) అనుభవము ప్రాప్తించినదనియు (వాస్తవములో కాకున్నను) భావించు చున్నాఁడవు. ఇంకను నీకు భ్రాంతి తొలంగిపోలేదని దీనియర్థము 55. అన్నా! అనుభవమునం దనుభవము మునిఁగిపోవుటయు, అనుభవము లేకయే యనుభవము కలుగుటయుఁగూడ వాస్తవములో స్వప్నమునుండి మేల్కొనుటకాదు 56. పలయన, మేల్కొనినపిమ్మటఁగూడ ఆయజన్మునఁ డను నేనేయని నీవు నుడువుచున్నాఁడవు. ఇందువలన నీకు స్వప్నరూపమగు సంసారతరంగము లింకను దగ్గలేదని విదితమగుచున్నది 57. స్వప్నము నందు జాగ్రదవస్థలోనుంటినని నీ వెటులఁ దలంచితివో యటులే అనుభవము సిద్ధించినదనిగూడఁ దలంచితివి. వాస్తవమున కిదియంతయు స్వప్నమే. మఱియు భ్రమరూపము 58. జాగ్రదవస్థయన్ననో స్వప్నావస్థకుఁ జాల ముందుగానున్నది. ఇఁకఁ జెప్పుటయెట్లు? స్వప్నావస్థయందు వివేకధారణమే విచ్ఛిన్నమగుచున్నది 59.

ఇదియంతయు నిదమిత్థమని వివరింపఁదగని సమాధానము. అంతి యగాదు అకథనీయము. ఇదియే నిశ్శబ్దమునకుఁ జిహ్నము 60. దీనినంత యు నాలకించి శిష్యుఁడాయకథనీయమగు ననుభవమును దెలిసికొనెను 61.

## ఆఱవదశకము సమాప్తము





# ఏడవ దశకము.

## మొదటి సమాసము — మాయనుగూర్చిన శోధనము.

విద్యావంతుల కెల్లరకును బూర్వజుఁడును, గజాననుఁడును, ఏకదంతుఁడును, జతుర్భుజుఁడును, త్రినయనుఁడును, బరశుపాణియు నగు విఘ్నేశ్వరునకు నమస్కరించెదను 1. కుబేరునివలన ధనము, వేదమువలనఁ బరమార్థము, లక్ష్మివలన సౌభాగ్యము లభించువిధమున ఆదిదేవుఁడును మంగళమూర్తియునగు శ్రీ గణేశ్వరస్వామివలన సమస్తవిద్యలు ప్రాప్తించును. ఆవిద్యలవలననే జనులు కవులుగను, బండితులుగను, సాధువులుగను, సత్పురుషులుగను మాఱుచున్నారు 2—3. ధనవంతులు తమ బాలురకు నానావిధములగు భూషణముల నలంకరించుటచే సుందరాకారులుగాఁ గనిపించుచున్నారు. అటులే మూలపురుషుఁడగు గణేశ్వరుని మూలమునఁ గవులు వ్యుత్పన్నులగుచుఁ బేరొందుచున్నారు 4. విద్యాప్రకాశుఁడగు గణేశపూర్ణచంద్రునివలన బోధసముద్ర ముప్పొంగును. ఆయనకు నేను నమస్కరించుచున్నాను 5. అతఁడు కర్తృత్వమునకు ఆరంభరూపుఁడు. మూలపురుషుఁడు. మూలారంభుఁడు. పరాత్పరుఁడు. మఱియు నాద్యంతములయందుఁగూడ నామహాత్ముఁడు స్వయంభువుగానున్నాఁడు 6. సూర్యునివలన మృగతృష్ణ మెఱయునట్లు గణేశ్వరునివలన ఇచ్ఛాకుమారియగు సరస్వతి ప్రకాశవంతురాలగుచున్నది 7. మాయారూపిణియగు శారదాదేవిని మిథ్యయని తలంచువారల నాయమ మోసగించును. అంతియగాక యామె తన మాయాత్వమువలన వారలను మోహింపఁజేసి పరమాత్మనుండి వారలను భిన్నుల నొనర్చును (వక్త బ్రహ్మనిరూపణము జేయుటవలన బ్రహ్మమునకు భిన్నముగనుండును) 8. ఆయమద్వైతమునకు జనని. అంతియగాక యద్వైతమునకు ఖని; మఱియు మూలమాయాస్వరూపముతో నాయమ అనంతబ్రహ్మాండముల నావరించుకొనియున్నది 9. సరస్వతీదేవి యొక్క యౌదుంబరవృక్షము. ఔదుంబర (మేడి)

వృక్షమును ఫలము లంటియుండునటుల ననంతములగు బ్రహ్మాండము లాయమ నంటియున్నవి. పుత్రికారూపముగనున్న యాభారతీదేవి మూల పురుషునకు (బ్రహ్మకు) మాతయైయున్నది 10. ఆయమ వేదమాతకును, ఆదిపురుషునకును సత్తారూపమున నలరారుచున్నది. అట్టి శారదకు నమస్కరించెదను 11.

ఇఁక నిపుడు సమర్థుఁడగు నాసద్గురుని స్మరించుచున్నాఁడను. ఆయన కృపాదృష్టి యానందమును వర్షించుచున్నది. దానిచే నీ సృష్టి యంతయు నానందమయ మగుచున్నది 12. గురుమూర్తి ఆనందమునకు జనకుఁడు. సాయుజ్యముక్తికి నాయకుఁడు. కైవల్యపదవీ ప్రదాయకుఁడు. అంతియగాక యనాథులగు దీనులకుఁ జుట్టము 13. చాతకము మేఘము వైపు చూపులు నిగుడ్చి చినుకులకై యాతురపడునటుల మోక్షేచ్ఛగల సాధకుఁడు నిరంతరమును సద్గురునియందు భక్తినిడి యనుగ్రహమును నభిలషించును. అపుడు ఆ సద్గురుఁడు కృపాభావుఁడై సాధకులపట్లఁ బ్రస న్నుఁడగును 14. సద్గురుఁడు సంసారసముద్రమును దరింపఁజేయుటకునౌక. భావికులు సుడిగుండలములలోఁ బడిపోకుండ నానౌక మిగులఁ దోడ్పడు చున్నది. సాధకులను గురుమూర్తి తన యమూల్యమగు బోధముకతన సంసారమునుండి ముక్తులను జేయుచున్నాఁడు 15. గురుదేవుఁడు కాల మునకు నియంత. ఆపదలను దొలంగించుటలో ననన్యుఁడు. మఱియు భావి కులను గనికరించి యుద్ధరించుటలో దయాళువగు పల్లివలెనున్నాఁడు 16. పరలోకమును బడయుటకు గురుఁడే యాధారము. విశ్రాంతి కాతఁడేనెలవు. సుఖస్వరూపమగు నాశ్రయస్థానము 17. భేదబంధనములను దొలంగించి మానవలోకము నుద్ధరించు ఆప్రభువునకు సద్గురుమూర్తికి విదేహుఁడనై సాష్టాంగ ప్రణామములను గావించెదను 18.

సాధువులకును, సజ్జనులకును, మహాత్ములకును, శ్రోతృగణమునకును నమస్కరించి ప్రకృతము ననుసరించుచున్నాఁడను. సావధానులరై యాలింపఁగోరెదను 19.

సంసారమొక గొప్పస్వప్నము. ఇచట మోహాకారణమున "ఇది నాకాంత, ఇది నాధనము, ఈమె నాకుమార్తె, వీఁడు నాకుమారుఁడు" అని జనులు తలపోయుచుందురు 20. జ్ఞానసూర్యుఁ డస్తమించుటచేఁ

ప్రకాశము లోపించినది. బ్రహ్మాండమంతయు నంధకారముతో నిండి పోయినది 21. కొంచెమేని మార్గమును గాంచుదమన్న సత్త్వమను వెన్నెల గూడ లేదు. విభ్రాంతివశమున జనులందఱును దమ్ముఁదా మెఱుంగ కున్నారు 22. దేహబుద్ధివలని యహంకారముతో జనులు ఘోరనిద్రా మగ్నులై గుఱకలుపెట్టుచున్నారు. విషయసుఖములకొఱకు దుఃఖముతో విలవిలఁ గొట్టుకొనుచున్నారు 23. ఈ విధముగ నిద్రించుచు నిద్రించుచు నెందఱు మానవులు మరణించిరో మన మెఱుంగము. అనేకులు పుట్టుక తోడనే నిదురించుచు మరణించిరి. ఇటులే యసంఖ్యాకులగు జనులు ఈ ప్రపంచములోనికివచ్చిరి; పోయిరి 24. ఈ విధముగా సుప్తావస్థయందుం డియే పొరలిపొరలి యనేకులు పరమాత్మ నెఱుంగని కతన రాకపోకల వలని కష్టము లనుభవించుచున్నారు 25. ఈ కష్టమును దూరపఱుప వలయునన్నచో ఆత్మజ్ఞాన మావశ్యకమై యున్నది. ఇందువలననే (యాత్మజ్ఞానము గలిగించుటకు) ఆధ్యాత్మిక గ్రంథమగు నీ దాసబోధను బ్రకటింపవలసి వచ్చినది 26.

అన్నివిద్యలలో ఆధ్యాత్మికవిద్య యుత్తమమైనది. ఈ విషయ మునుగూర్చి భగవద్గీత పదియవ యధ్యాయములో భగవానుఁడగు శ్రీకృష్ణుఁ డిటుల నుడివియున్నాఁడు. 27.

శ్లో॥ అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహం।

తన యింద్రియముల నన్నింటిని మనస్సమేతముగా బ్రహ్మము నందు లగ్నపఱుచువాఁడు అధ్యాత్మవిద్యను దెలిసికొనఁగల్గును 28. చంచలహృదయుఁడగు మానవుఁడు అధ్యాత్మవిద్యవలని లాభమును గొంచెమేని పడయఁజాలఁడు. పరమార్థియగు పురుషుఁడే యధ్యాత్మవిద్యా విచారమును జేయవలయును. దీనివలన వాని పరమార్థము మిగుల దృఢ మగును 29-30. పరమార్థమునందుఁ బ్రవేశములేనివాఁడు అధ్యాత్మగ్రంథ ములను గొంచెమేని గ్రహింపఁజాలఁడు. నేత్రములు లేనివాఁ డేదేనిగాంచఁ గలఁడా ? అటులే యాధ్యాత్మిక పరిచయమునకుఁ బరమార్థముయొక్క తోడ్పాటు ముఖ్యముగఁ గావలసియున్నది 31. "ప్రాకృతభాష (మహా రాష్ట్రభాష) అంతయు క్షతమైనదిగాదు. యోగ్యులగువారలు దీనిని విననే గూడ"దని చాలమంది నుడువుదురు. అటులఁ బల్కుమూర్ఖులకుఁ గొంచె

మేని అర్థాన్వయ సరళత్వము తెలియదు 32. నానావిధరత్నములతో నింపఁబడిన యినుపపెట్టె, నొకయజ్ఞాని లోహమయమని త్యజించినటులఁ బ్రాకృతభాషలోఁ బ్రకటింపబడిన వేదాంతతత్త్వమును భ్రాంతపురుషుఁడు మందమతియై విడచివేయుచున్నాఁడు* 33-34. అనాయాసముగ ధనము లభించినమీఁదట దానినివిడిచిపెట్టుట మూర్ఖత్వము. ద్రవ్యమును గ్రహింప వలయును. ద్రవ్యపాత్రములను (పేటికాదుల) జూచుటకూడఁ దగదు 35. ముంగింటిలోఁబడియున్న స్పర్శవేదిని, మార్గమునఁ బడియున్న చింతామణిని, నూతిలో బెరిగియున్న దక్షిణావర్తలతను విడిచిపెట్టువాఁడుండఁడు 36. ఇటులనే యొకవేళఁ బ్రాకృతభాషయందు సుగమమగు రీతితో అనుభవ యుక్తముగ నద్వైత నిరూపణము గావింపఁబడియున్నను, దానివలన సులభముగఁ దన కధ్యాత్మజ్ఞానలాభము సమకూరగలిగియున్నను నాగ్రంథము నవశ్యముగా గ్రహింపవలయును 37. విద్యాభ్యాసక్రమ మును జేయకున్నను, సాధుసమాగమమువలన శాస్త్రజ్ఞానమంతయుఁ బ్రాకృత గ్రంథములవలన సులభముగఁ దెలియును 38. విద్యాభ్యాసము వలనఁ దెలియనియంశములు సాధుజన సమావేశమువలన సుబోధమగును. శాస్త్రములలోనున్న సమస్త జ్ఞానకరాంశములు సాధుసమావేశమువలన అనుభవములోనికి వచ్చును. కాన జ్ఞానప్రాప్తికొఱకు సాధుజన సమావేశము గావించుటయే ముఖ్యసాధనము. వ్యుత్పన్నతను (శాస్త్రజ్ఞానమును)

* శ్రీ సమర్థరామదాసస్వామి శ్రీగోస్వామి తులసీదాసు మున్నగు మహాత్ములు మహారాష్ట్రీయ హిందీ మున్నగు ప్రాకృతవాఙ్మయముల కింతయనరాని యుపకార మొనర్చిరి. వీరలు తమ కాలములందుఁ బ్రాకృతభాషలకు ద్వేషులును అనాదరదర్శులునగు సంస్కృత విద్వాంసులను తమ యలౌకిక సామర్థ్యముచేఁ జకితులఁగావించి వారల హృదయములలోఁ బ్రాకృతభాషలపయి భక్తిని గలుగఁజేసిరి. మహాత్ముఁడగు తులసీ దాసునితో నొక సంస్కృతపక్షపాతి 'మీరు మీ గ్రంథములను సంస్కృతములో నేల వ్రాయరని యడిగెను. అపుడు తులసీదాసు మిగుల శాంతస్వభావముతో నిటులఁ బ్రత్యుత్తరము నొసంగెను.

కాభాఖా కాసంస్కృత్ ప్రేమచాహియే సాన్చ
కామ్ జో ఆవేకామరీకాలై కరీకమాచ్ ॥

సంస్కృతమైననేమి? ఇతరభాషయైననేమి? అంత్యకాలమాసన్నమైనపు డేది కడతేర్చునో యట్టి సత్యమగు ప్రేమయే కావలయును.

గూర్చి పరిశ్రమచేయుట వ్యర్థప్రయత్నము. జీవితమును సార్థకముగావించు రహస్యము సాధుసమావేశమునం దిమిడియున్నది 39–40.

శ్లో॥ భాషాభేదాశ్చ వర్తన్తే హ్యర్థ ఏకో న సంశయః ।
పాత్రద్వయే యథా ఖాద్యం స్వాదుభేదో న విద్యతే ॥

భాషాభేదమువలన అర్థమునందుఁ గొంచెమేని మార్పుకలుగదు. ముఖ్యభావము అర్థముతోనున్నది* 41. నిశ్చయమునకుఁ బ్రాకృత భాషవలననే సంస్కృతమునకు మహత్త్వమేర్పడియున్నది. ఇంకొకవిధ ముగానైనచో సంస్కృతములోని గుప్తార్థమును జనులు సర్వసాధారణ ముగా నెటుల గ్రహింపఁగలుగుదురు? 42. ఇఁక నీ విషయము నటుంతము. భాషనువిడిచి అర్థమును గ్రహింపవలయును. సారమును గైకొని పిప్పిని విడిచివేయవలయును 43. అర్థము సారము. భాష పొట్టు. జనులు భాషను గూర్చిన వాదవివాదములను అభిమానపూర్వకముగాఁ జేయు చుందురు. నానావిధములగు అభిమానములే మోక్షమార్గమునకు ఆటం కములై యున్నవి 44. లక్ష్యాంశమును వెదకునపుడు వాచ్యాంశమును గూర్చి భాషింపవలసిన యవసర మేముండును? భగవానుని యగాధ మగు మహిమ నెఱుంగవలయును 45. మూగవానిభావములు మూగ వాఁడే గ్రహించునటుల స్వానుభవ విషయమును స్వానుభవుఁడే యెఱుంగ గలఁడు 46. అధ్యాత్మవిద్యను గ్రహింపగలశ్రోతలు కొలఁదిగనే లభింతురు. వారలకు ఉపదేశముల నొనరించుటవలనఁ బ్రాణి కానందము గలుగును 47. రత్నములనుబరీక్షించువానికి రత్నములనుజూపుటవలన నెటులసంతోషము గలుగునో యటులే జ్ఞానితో జ్ఞానమునుగూర్చి భాషించుటవలన నింతయన రాని యానందము గలుగును 48. మాయాజాలమునందుఁ దగుల్కొని దుశ్చిత్తుఁడై యుండు పురుషునకు అధ్యాత్మ నిరూపణమువలనఁ గొంచె మేని లాభ మొనగూడదు. ఏలయన వానికి దాని యర్థమే బోధ పడదు 49. శ్రీకృష్ణభగవానుఁడు గీతయందిటులఁ జెప్పుచున్నాఁడు.

---

* భారతచంద్రుఁడగు హరిశ్చంద్రబాబుగూడ నొకచో నిటుల నుడివియున్నాఁడు. "బాత్ అనూఠీచాహియే భాషాకోఁమాహోయ్" విషయ ముత్కృష్టమైనదిగా నుండవలయును, భాష యేదైనా నొకటియే.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన।
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో వ్యవసాయినాం॥

వ్యవసాయకారణమున మలినబుద్ధియగువాని కెన్నఁటికిని అధ్యాత్మ నిరూపణము బోధపడఁజాలదు. ఏలయన, అధ్యాత్మ నిరూపణమునకు సావధానబుద్ధి యవసరముగదా! 50. బహువిధ రత్నములను నాణెములను బరీక్షింపక తీసికొన్నచో నెటుల నష్టము కలుగునో మఱియుఁ బరీక్షింప నేరని కారణమున నెటుల మోసమునకు లోనయ్యెదరో యటులే అధ్యాత్మనిరూపణమున సైతము హృదయమును లగ్నము గానింపని యెడల బోధపడనేరదు. ఇంతయేల, ప్రాకృతభాషయే కానిమ్ము హృదయము లగ్నముగానిచోఁ గొంచమేని బోధ కాజాలదు. 51-52. యేభాషయైననుగానిమ్ము. అందు అధ్యాత్మ నిరూపణమున్నచో మఱియు ననుభవ రసమున్నచో దానిని సంస్కృతముకంటెనుగూడ గాంభీర్యమైన దానినిగా భావింపవలయును. దాని నాలించుటకే యధ్యాత్మ శ్రవణమని పేరు 53. మాయను బ్రహ్మమును గుర్తెరుంగుటను అధ్యాత్మ శ్రవణ మందురు. మొట్టమొదట మాయాస్వరూపమును గ్రహింపవలయును 54.

మాయ సగుణమును సాకారమును నై యున్నది. అది యన్ని విధములచేతను వికారిణి యైయున్నది. దానిని బంచభూతముల వికార మనియే గ్రహింపనగును 55. మాయ (దృశ్యము) కాన్పించుచున్నది. అది భాసమానముగ నున్నది. మనసునందు భాసించుచున్నది. క్షణ భంగురమైనది. వివేకముతో జూచినపిమ్మట నది వినాశమగును 56. మాయ బహురూపిణియు విశ్వరూపిణియు నై యున్నది. అయ్యది విష్ణు స్వరూపము. దానినిగూర్చి యెంతవివరించినను దక్కువయే* 57. మాయ బహురూపిణియు బహు వర్ణయుతయు నై యున్నది. అది యీశ్వరున కధిష్ఠానము. చూచుటకది యభంగముగను (భంగము లేనిదిగను) అఖిలముగను (ఖిలము లేనిదిగను) గన్పట్టుచున్నది 58. సృష్టి యొక్క రసనము మాయయే. మనకల్పనముకూడ మాయయే. జ్ఞాన సహాయము లేకుండ మాయనుదెగఁగోయఁ జాలము 59. ఇది మాయను

* ఏలయన, విష్ణుస్వరూపము సగుణబ్రహ్మము. మాయోపాధివలననే సగుణ బ్రహ్మము కల్గుచున్నది. ఇందువలన మాయయే విష్ణురూపమై యున్నటులఁ జెప్పఁబడెను.

గూర్చిన సంక్షేపవర్ణనము. ఇక ముందుసమాసమునందు బ్రహ్మజ్ఞానమును నిరూపణము గావించెదను. దానివలన మాయయెల్ల నొక్కమారు నష్టమై పోవును 60—61.

## రెండవ సమాసము — బ్రహ్మ నిరూపణము.

సాధుజనులు బ్రహ్మమును నిర్గుణమనియు, నిరాకారమనియు, నిస్సంగమనియు, నిర్వికారమనియు, అపారమనియుఁజెప్పుదురు 1. శాస్త్రము లీబ్రహ్మమును సర్వవ్యాపకమనియు అనేకములందొక్కటియనియు శాశ్వతమనియుఁ జెప్పుచున్నవి 2. బ్రహ్మము అచ్యుతము, అనంతము, సర్వదాభాసురము, కల్పనారహితము, నిర్వికల్పము నై యున్నది 3. అది యీ దృశ్యమున కావలనున్నది. శూన్యముకంటెను వేఱై యున్నది. ఇంద్రియసహాయమున దానిని నెఱుంగఁజాలము 4. బ్రహ్మము చూపులకు గాన్పింపదు. మూర్ఖుని వివేకమున కందదు. సాధులకుఁదప్ప నది యితరుల కనుభవములోనికి రాదు 5. బ్రహ్మము అన్నింటికంటెను మిగులఁబెద్దది. దానితో సమానమగు శ్రేష్ఠవస్తు వింకొకటిలేదు. అయ్యది బ్రహ్మవిష్ణు మహేశ్వరాదులకుఁగూడ నగోచరమును సూక్ష్మతరము నై యున్నది 6. శబ్దమూలమునఁ జెప్పఁబడుదానికంటెను బ్రహ్మము వేఱుగనున్నది. అధ్యాత్మశ్రవణము గావించుటవలన నయ్యది సులభముగా లభించును 7. బ్రహ్మమున కనంతనామములు గలవు. ఐనను నది నామాతీతముగనే యున్నది. అందులకుఁ గారణమెద్దియునులేదు. దృష్టాంత మొసంగుటగూడ యుక్తముగఁ దోచుటలేదు 8. బ్రహ్మముతో సమానమగు సత్య మింకొకటిలేదు. కావుననే బ్రహ్మమున కుదాహరణము నొసంగలేమైతిమి 9. శ్రుతిసైత మిట్లు సిద్ధాంతీకరించుచున్నది. శ్లో॥ "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" బ్రహ్మమును వర్ణించుటకు వాక్కు అశక్తమగుచున్నది. మనస్సుసైత మా బ్రహ్మమును జెందనేరదు 10. మనస్సు కల్పనారూపము. బ్రహ్మము కల్పనారహితము. కావున మనస్సు బ్రహ్మమును బొందఁజాలదు. కావున పైనిచెప్పిన శ్రుతివాక్యము యథార్థము 11. బ్రహ్మము మనస్సునకు అప్రాప్యముగదా! అది సాధకున కెటుల సిద్ధించునని మీరు

ప్రశ్నింపవచ్చును. అట్లు ప్రశ్నించెడిపక్షమున బ్రహ్మమును సద్గురుమూల మునఁదక్క వేఱుమార్గమున గ్రహింపరాదనుటయే మా ప్రత్యుత్తరము12. బొక్కసపుఁగొట్టులు ధనముతో నిండియున్నవి. అయిన ఫలమేమి? అవి తాళములచేబాగుగా బంధింపఁబడియున్నవి. తాళపుఁజెవి లభింపనంతవరకు అందు వస్తువులలో నేదియు లభింపదు 13. ఇదివిని శ్రోతయిట్లు ప్రశ్నించు చున్నాఁడు. అయ్యా! అటులైనచో దాళపుఁజెవి యెయ్యది? దయచేసి మాకు సెలవీయరాదా? 14. వక్త యిట్లు చెప్పుచున్నాఁడు. సద్గురుని కృపయే తాళపుఁజెవి. దానివలన బుద్ధి బాగుగాఁ బ్రకాశించును. మఱి యు, ద్వైతకవాటము లొక్కపెట్టునఁ దెఱువఁబడును 15. ఆ పరబ్రహ్మ మునందు సుఖపారావారములేదు. అచ్చట మనస్సునకు గమ్యశక్తిలేదు. కావునఁ పరబ్రహ్మప్రాప్తి కావలయునన్నచో మనస్సును లయముగావింప వలయును. లేకున్నచో ఏ సాధనమును బనిచేయఁజాలదు 16. మనస్సు లేకయే పరబ్రహ్మము ప్రాప్తించును. అచట వాసనాబంధము లేకయే తృప్తియున్నది. బ్రహ్మమునెడఁ గల్పనాచాతుర్యము గొంచెమేని యుప యోగపడఁజాలదు 17. అది పరావాణికంటె నావలనున్నది. మనోబుద్ధుల కగోచరముగనున్నది. సర్వసంగ పరిత్యాగము గావించినయెడల నది సుల భముగా లభించును 18. "తన" యనుదాని సంగమునువిడిచి యా పిమ్మట బ్రహ్మమును జూడవలయును. ఎవ్వఁ డనుభవనీయుఁడగునో యాతఁ డీవిషయమునందు సుఖియగును 19. "నేను" అనుదానిని "తన" యనునర్థమున నుడివెదరు. జీవిత్వమనుదానిని "నేను" అనుదానిపట్ల నుడివెదరు. అజ్ఞానమును జీవత్వమని చెప్పెదరు. ఈ యజ్ఞానసంగమే ప్రాణి నంటుకొనియున్నది 20. అజ్ఞానమును విడిచిన పిమ్మట నిస్సంగము (బ్రహ్మము) తో నేకత్వముకలుగును. ఇదియే (కల్పనము లేని స్థితియే) బ్రహ్మప్రాప్తికిమూలము 21. నేను ఎవఁడను అనుదాని నెఱుఁగకుండుటనే అజ్ఞానమందురు. ఈ యజ్ఞానము నశించినపిమ్మట పరబ్రహ్మము లభించును 22. దేహబుద్ధికిగల గొప్పతనము పరబ్రహ్మమునందు నిలువఁజాలదు. పరబ్రహ్మముముందు అహంకార మంతరించిపోవును 23. పరబ్రహ్మము ముందు ఉచ్చనీచ భేదములులేవు. దానిముందు ధనవంతుఁడు దరిద్రుఁడు స్త్రీయుఁ బురుషుఁడు సమానము 24. బ్రాహ్మణుని బ్రహ్మము శుద్ధ

మైనది; శూద్రుని బ్రహ్మ మశుద్ధమైనదను భేదములచ్చట లేనేలేవు 25. ఉచ్చ బ్రహ్మము రాజులకొఱకు నీచబ్రహ్మ ప్రజలకొఱకు నేర్పడియుండె నను భేదబుద్ధి కచ్చటఁ గొంచెమేని యవకాశములేదు 26. అందఱకు నొక్కటియే బ్రహ్మము. అచ్చట ననేకత్వమునకుఁ దావులేదు. ఏ నీచ మానవుని ప్రాణియైనను బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలైనను బ్రహ్మ మువైపునకే బోవుచున్నారు 27. స్వర్గమర్త్యపాతాళములను మూడు లోకములలోనున్న జ్ఞానులందఱి విశ్రాంతికిని బ్రహ్మమొక్కటియే స్థానము 28. గురుశిష్యులకు నొక్కటియే ప్రాప్యపదము. అచట భేదాభేదములు లేవు. పరబ్రహ్మమును బడయవలయునన్న దేహసంబంధమును విడువ వలయును 29. దేహబుద్ధి (దేహమే నేననుబుద్ధి) యంతరించిన పిదప నెల్లరకు నొక్కటియేవస్తువు ప్రాప్తించును. శ్రుతిసైతము "ఏకం బ్రహ్మ ద్వితీయం నాస్తి" (బ్రహ్మమొక్కటియే రెండవదిలేదు) అనినుడువుచున్నది 30. సాధువులు వేఱువేఱుగాఁ గాన్పింతురు. కాని వారలు స్వరూపము తోఁ గలసిపోవునపుడు దేహాతీతమగు నొక్కవస్తువుగా (బ్రహ్మముగా) నయ్యెదరు 31. బ్రహ్మము క్రొత్తదిగాది. ప్రాతదికాదు. న్యూనముగాదు. అధికముగాదు. ఆ బ్రహ్మము విషయమున న్యూనభావము కలవాఁడు దేహాభిమానియగు శునకము 32. దేహబుద్ధి సంశయ సమాధానములను నశింపఁజేయును. దాని సంయోగమున సమాధానపుటవకాశము గూడఁ దొలంగిపోవును 33. దేహమును శ్రేష్ఠమని భావించుటయే దేహబుద్ధి లక్షణము. ఇందువలననే విచక్షణులగు పురుషులు దేహము మిథ్యయని తెలిసికొని దానిని నిందింతురు 34. మానవుఁడు చనిపోవునంతవఱకు దేహాభిమానమును విడువఁడు. ఈ కారణముననే మనుష్యుఁడు జనన మరణ చక్రమునందు (పరిభ్రమణమునందు) బడియుండును 35. మనుష్య ప్రాణి అజ్ఞానయుతమైనది. అది దేహము క్షణభంగురమను నంశమును గ్రహింపక మిఁదు మిక్కిలిగ నదియే శ్రేష్ఠమైనదానినిగా భావించుచుఁ గడకుఁ దన శాంతినంతయును గోల్పోవుచున్నది 36. హితుఁడగు దేహా తీతుఁడు దేహబుద్ధివలనఁ దప్పక యనహితుఁడగునని సాధుజనులు నుడువు చుందురు 37. తపస్సామర్థ్యమును గూర్చి యొకవేళ యోగులకుసైతము అభిమానము గలిగినయెడల వారలకా దేహాభిమానమే విఘ్నకారణ

మగును 38. కావున దేహబుద్ధి వినాశనమయినపుడే పరమార్థమునందు దృష్టికుదురును. దేహాభిమాన కారణమననే బ్రహ్మముతో (వైరుధ్యము) వ్యతిరేకభావము కలుగును 39. వివేకము మానవుని బ్రహ్మమువైపునకు లాగును. దేహాభిమానమో అచ్చటనుండి క్రిందికిఁ బడవేయును. అహంతాత్వము (నేననుభావము) మనుష్యుని బరమాత్మనుండి వేఱుపఱచును 40. ఈకారణము లన్నింటినెఱింగి విచక్షణులగు పురుషులు దేహబుద్ధిని బరిత్యజించి యథార్థరీతిఁతోఁ బరబ్రహ్మమునందు విలీనులై పోవలయును 41. ఇది యంతయును విన్నమీఁదట "సత్య బ్రహ్మము" అననెవ్వఁడు ? అని శ్రోతలు ప్రశ్నింపఁగా వక్త యిటులఁ బ్రత్యుత్తరము నొసంగును 42.

వాస్తవమునకు బ్రహ్మమొక్కటియే. కాని యది బహువిధముల భాసించుచున్నది. మానవులకు అనేక మతానుసారముగ భిన్నభిన్నవిధములతో దానినిగూర్చిన యనుభవము ప్రాప్తించుచున్నది 43. ఎవ్వనికెటుల ననుభవము ప్రాప్తించునో యటుల నాతఁడు బ్రహ్మమును నంగీకరించుచున్నాఁడు. ఆ యనుభవరూపమననే విశ్వాసముగూడఁ గలుగుచున్నది 44. వాస్తవము విచారించితిమేని బ్రహ్మము నామరూపముల కతీతముగానున్నది. అయినను దానికి నిర్మలము, నిశ్చలము, శాంతము, నిజానందము మున్నగు నామము లనేకములుగలవు 45. ఇంకను అరూపము, అలక్ష్యము, అగోచరము, అచ్యుతము, అనంతము, అపరంపారము, అదృశ్యము, అతర్క్యము మున్నగునామము లెన్నియోగలవు 46. నాదరూపము, జ్యోతీరూపము, చైతన్యరూపము, సత్తారూపము, సాక్షిరూపము, సత్ స్వరూపము అనునవిగూడ బ్రహ్మమునకుఁగల నామములే 47. శూన్యము, సనాతనము, సర్వేశ్వరము, సర్వజ్ఞము, సర్వాత్మము, జగజ్జీవనము అనిగూడ నాబ్రహ్మమునే బేర్కొందురు 48. సహజము, సదోదితము, శుద్ధము, బుద్ధము, సర్వాతీతము, శాశ్వతము, శబ్దాతీతము అనిగూడ నాబ్రహ్మమునే చెప్పుదురు 49. విశాలము, విస్తీర్ణము, విశ్వంభరము, విమలము, వస్తువు, వ్యోమాకారము, ఆత్మము, పరమాత్మ, పరమేశ్వరము అనునవిగూడ దానికె నామములు 50. ఏకరూపము, జగదాత్మము, జ్ఞానఘనము, పురాతనము, చిద్రూపము, చిన్మాత్రము లనునవిగూడ నామరూపరహితమగు నాబ్రహ్మమునకే నామములు 51.

ఇటులె బ్రహ్మమున కనంతనామములుగలవు. కాని యా పరేశుఁడు (బ్రహ్మము) నామాతీతుఁడుగ నున్నాఁడు. ఆతని నిశ్చయము గావించుటకే యీనామము లుంచబడినవి 52. బ్రహ్మస్వరూపుఁడగు నాపరమాత్ముఁడు విశ్రాంతికిగూడ విశ్రామమైయున్నాఁడు. అంతియగాక ఆ యాత్మారాముఁడును, ఆదిపురుషుఁడును నైయున్నాఁడు. ఆతఁడొక్కఁడే పరబ్రహ్మము. రెండవదిలేదు 53.

చతుర్దశ బ్రహ్మలక్షణములు శాస్త్రాధారములతో వివరించెదను. ఈ వివరణమును గ్రహించి అసత్యబ్రహ్మములను వేఱుపఱచినయెడల సత్యబ్రహ్మస్వరూపము గోచరించును 54—55.

## మూఁడవసమాసము — చతుర్దశ మాయాబ్రహ్మములు.

శ్రోతలారా! సావధానులుకండు. సాధకులకు సమాధానమును బ్రసాదించునట్టి బ్రహ్మజ్ఞానమును మీకు వివరించెదను 1. రత్నములను వెదకవలయునన్నచోఁ దొలుతొలుత మట్టిని గాలింపవలయును. అటులే సత్యబ్రహ్మమును నిశ్చయింప వలయునన్నయెడలఁ బదునాలుగు మాయాబ్రహ్మముల లక్షణములను గ్రహింపవలయును. కావున నాయాలక్షణముల నిచట వివరించుచున్నాఁడను 2. పదార్థము లేనియెడల సంకేతమును (నామనిర్దేశమును), ద్వైతము లేనియెడల దృష్టాంతమును, పూర్వపక్షము లేనియెడల సిద్ధాంతమును జెప్పుటకు సాధ్యముగాదు 3. కావున దొలుతొలుత మిథ్యావిషయముల నెత్తుకొనవలయును. తరువాత వానిని బాగుగాశోధించి పరీక్షించుచు విడిచివేయవలెను. ఆ పిమ్మట సత్యమగు విషయము సులభముగా (సహజముగా) నంతఃకరణములోనికి వచ్చును 4. ఇపుడు పదునాలుగు బ్రహ్మములను వర్ణించెదను. శ్రోతలు జాగరూకులై యాలింపవలయును. ఈ వర్ణనము నాలించుటవలన సత్యసిద్ధాంతము విశదమగును 5.

శ్రుత్యనుసారముగాఁ బదునాలుగు బ్రహ్మములనామము లివి: (1) శబ్దబ్రహ్మము, (2) ఓమిత్యేకాక్షరబ్రహ్మము, (3) ఖంబ్రహ్మము, (4) సర్వబ్రహ్మము, (5) చైతన్యబ్రహ్మము, (6) సత్తాబ్రహ్మము, (7) సాక్షిబ్రహ్మము, (8) సగుణబ్రహ్మము, (9) నిర్గుణబ్రహ్మము,

(10) వాచ్యబ్రహ్మము, (11) అనుభవబ్రహ్మము, (12) ఆనంద బ్రహ్మము, (13) తదాకారబ్రహ్మము, (14) అనిర్వాచ్యబ్రహ్మము 6-9. ఇవి పదునాలుగు బ్రహ్మముల నామములు. సంక్షేపముగా నిపుడు వాని స్వరూప మర్మముల నెఱుంగఁజెప్పెద వినుండు 10. అను భవములోనికి రాక శబ్దములలో మాత్ర మెయ్యది చెప్పఁబడుచున్నదో యది శబ్దబ్రహ్మము. ఓంకారమును ఓం ఇత్యేకాక్షర బ్రహ్మ యని చెప్పుదురు 11. ఖంబ్రహ్మము అనగా నాకాశబ్రహ్మమని యర్థము. ఇది మహదాకాశమువలె నన్నికడల వ్యాప్తమైయుండును. ఇక సర్వబ్రహ్మము యొక్క మర్మమును వినుండు 12. ఈ బ్రహ్మమునుగూర్చి శ్రుత్యాశయ మేమన్న "పంచభూత చమత్కారమువలన గనుపడుచున్న యీ సమ స్తము బ్రహ్మమే"యని. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుత్యర్థ మీ సర్వబ్రహ్మమునే చెప్పుచున్నది. ఇక చైతన్య బ్రహ్మరహస్యమును జెప్పు దును వినుండు 13-14. పంచభూతాత్మికమగు మాయయందుఁగలుగు చేతనమే చైతన్యబ్రహ్మము 15. చేతనముమీఁద నధికారము (సత్తా) గలది సత్తాబ్రహ్మము. ఆ యధికారమును (సత్తా) నెఱింగినది సాక్ష్య బ్రహ్మము 16. ఆ సాక్షిత్వమునందుఁ ద్రిగుణము లారోపింపఁబడినపుడు దానినే సగుణబ్రహ్మమందురు 17. గుణాదులెవ్వియు లేకయుండునది నిర్గుణబ్రహ్మము 18. వాక్కులమూలమున నిట్టిదని చెప్పుట కవకాశము గలదై యనుభవమున రానిది వాచ్యబ్రహ్మము. అనుభవములోనికివచ్చి మాటలచేఁ జెప్పఁదగనిది అనుభవబ్రహ్మము. ఆనందమనునది యొక వృత్తిధర్మము. అది వాచ్యముగనున్నది. దానినే ఆనందబ్రహ్మమందురు. భేదాభేదరహితమగు తదాకారత్వమె "తదాకారబ్రహ్మము". ఇక ననిర్వాచ్యబ్రహ్మమునుగూర్చి యేమిచెప్పుదును? దానిగూర్చి చెప్పుటకు వాక్కునకు శక్తిచాలదు (అది వాణివిషయమే కాదు). కాన నీసంవాదము సమాప్తిచేయుదును 19-21.

వరుసఁగఁజెప్పిన యీ పదునాల్గు బ్రహ్మములనుజూచి సాధకులు భ్రమపడఁగూడదు. ఇందున్న శాశ్వతబ్రహ్మమును గుర్తించి మాయా బ్రహ్మముల నశాశ్వతములని పరిత్యజింపవలెను. ఇప్పుడే పదునాల్గు బ్రహ్మములనుగూర్చిన సిద్ధాంతము రాఁబోవుచున్నది. చెవియొగ్గివినుఁడు 22-23.

శబ్దబ్రహ్మము శబ్దములతో సంబంధించినది. అది యనుభవరహిత మైనది. కావున నది మాయికము. దానికి శాశ్వతత్వము లేదు 24. ఏబ్రహ్మము క్షరమును అక్షరమునుగాదో యాబ్రహ్మమునకు ఓమిత్యేకాక్షరబ్రహ్మ (ఓం + ఇతి + ఏక + అక్షర + బ్రహ్మ)అను నామమెక్కడనుండివచ్చినది? కావున నీబ్రహ్మమునందుగూడ శాశ్వతత్వచిహ్న మెద్దియును గాన్పింపదు* 25. ఖంబ్రహ్మ మనునది ఆకాశమువలె శూన్యస్వరూపము (అజ్ఞానస్వరూపము). కావున దానినిగూడ శాశ్వతబ్రహ్మమని చెప్పఁజాలము 26. ఇఁక సర్వబ్రహ్మమునుగూర్చి విచారింతము. సర్వమును (పంచభూతాత్మికమగు సర్వదృశ్యము) అంతమొందును. వేదాంతశాస్త్రమునం దీయంతమును కల్పాంతమనియు, బ్రహ్మప్రళయ మనియు గూడ నుడువుదురు. ఈవిషయము నందఱు నెఱింగియే యున్నారు. కావున సర్వబ్రహ్మమున్నైతము నశ్వరమనియే తేలినది. ఇదిగూడ శాశ్వతముగాదు 27—28. విమర్శకులగు విద్వాంసులు అచలము నందుఁ జలనమును, నిర్గుణమునందు గుణమును, నిరాకారమునం దాకారమును అంగీకరింపరు 29. పంచభూతాత్మికమగునది (పంచభూత రచనము) ప్రత్యక్షముగా నాశవంతమైనది. కావున నది సర్వబ్రహ్మ మెటులఁ గాఁగలదు? 30. సర్వస్వమును నాశనమై పోవునపుడు ఉండునదెవరు? చూచువారలెవరు? 31. ఇఁక చైతన్యబ్రహ్మమును విచారింతము. చైతన్యబ్రహ్మము దేనికి (పంచభూతాత్మికరచనమునకు లేక సర్వబ్రహ్మమునకు) చైతన్యమొసఁగుచున్నదో యదియే మాయికమని సిద్ధాంతమైనప్పుడు దీనికి ఈబ్రహ్మమునకుఁజైతన్యత్వ మెచ్చటనిలచినది? కావున నిదిగూడ అశాశ్వతమని సిద్ధాంతమైనది 32. ఇఁకఁ బ్రజయే (చైతన్య సర్వములే) లేనప్పుడు వాస్తవములో సత్తామాత్ర మెక్కడినుండి వచ్చును? కావున సత్తాబ్రహ్మముగూడ నేమియును లేదు. ఇఁక సాక్షిబ్రహ్మమును దీసికొందము. ఎప్పుడు సత్తాయే లేదో అపుడు సాక్ష్య

* బ్రహ్మము క్షరముగాదు అక్షరమునుగాదు. అవినాశి యేల కాదన, ఎచ్చట నాశనములేదో యచ్చట అవినాశియనుశబ్దప్రయోగమున కవకాశ మెక్కడిది? ఏబ్రహ్మము క్షరముగాదో మఱియు నక్షరముగూడఁగాదో యచ్చట ఓమిత్యేకాక్షర బ్రహ్మ అను దాని నెచ్చటనుండి తెచ్చిపెట్టిరి?

మెవ్వరిది? కావున సాక్షిబ్రహ్మముగూడ నశ్వరమని తేలినది 33. సగుణ బ్రహ్మమన్ననో యది ప్రత్యక్షముగనే నాశవంతమైనదిగదా! దీనిని వెలు పుటకు విశేషించి ప్రమాణములు చూపవలసిన యావశ్యకములేదు 34. ఇఁక నిర్గుణబ్రహ్మమును దీసికొందము. మొట్టమొదట గుణములేలేనపుడు నిర్గుణమను పేరెక్కడనుండి వచ్చినది? గుణములు లేనిచో నెందేని గౌరవము ప్రాప్తించునా? కావున నిర్గుణబ్రహ్మ మనునదిగూడఁ బూర్తిగా వ్యర్థమైనదే యగును 35. మాయ మృగతృష్ణవంటిదని నుడువుట యెటులుండునో యీ (నిర్గుణ) బ్రహ్మమును నిర్గుణమని నుడువుట యటులున్నది. ఎవరేని యాకాశమునకు (స్వరూప) కల్పనము గావించి నచో నది యెంతదనుక సత్యము కాగలదు? 36. గ్రామమే లేనప్పుడు పొలిమేర యెక్కడనుండి వచ్చును? జన్మమే లేనప్పుడు జీవాత్మ యెక్కడ నుండి వచ్చును? అద్వైతమునకు ద్వైతోపమాన మెట్లు సరిపడును? ఈస్థితియే గుణములు లేని నిర్గుణబ్రహ్మమునెడగూడఁ గలదు 37. మాయయే లేనియెడల సత్తాయును, పదార్థమేలేనియెడల సాక్షిత్వమును, అవిద్యయే లేనియెడల చైతన్యము ఎట్లు నిలువఁజాలవో అటులే గుణములు లేనియెడల నిర్గుణముగూడ నిలువఁజాలదు 38. సత్తా, చైత న్యము, సాక్షి యను నివియన్నియు గుణములతోడనే నిండియున్నవి. ఎయ్యది నిర్గుణమో దానిలో గుణము లెచ్చటనుండి వచ్చినవి? 39. గుణ ములు లేనిదానికి నిర్గుణమను సంజ్ఞ నొసంగుట స్వయముగా దాని కశాశ్వతత్వమును సిద్ధాంతము జేయుటయేయని తెలిసికొనుడు 40. ఇఁక వాచ్య బ్రహ్మమునుగూర్చి విచారింతము. నిర్గుణబ్రహ్మము తనం తనే యది పేరుచేతనే యశాశ్వతమని సిద్ధమయ్యెను. అటులే వాచ్య బ్రహ్మముగూడ మిథ్యయైయున్నది. ఏలయన, వాచ్యబ్రహ్మము ఉపర్యుక్త బ్రహ్మములయందు ఖండనము గావింపఁబడిన విషయములతో నున్నది 41. ఇఁక నానందబ్రహ్మమునుగూర్చి వినుండు. ఆనందబ్రహ్మము గూడ వృత్తియొక్క భావనయైయున్నది. వృత్తి ప్రత్యక్షముగా నశ్వరమై యున్నది. కావున ఆనందబ్రహ్మమన్నఁ బ్రత్యక్షముగనే అశాశ్వతమై యున్నది. ఇఁకఁ దదాకారబ్రహ్మమును దీసికొనుఁడు. తదాకారమై పోయినపిమ్మట వృత్తియేమియు వేఱుగానుండదు. కావునఁ దదాకార

బ్రహ్మముగూడ నేమియును లేదు 42. ఇఁక శేషించినది అనిర్వాచ్య బ్రహ్మము. కాని అనిర్వాచ్యమను నీ నామనిర్దేశముగూడ వృత్తి కారణ మననేగదా! బ్రహ్మమునందు నివృత్తి వచ్చుచున్నది. కావున నీ యనిర్వాచ్యబ్రహ్మముగూడ శాశ్వతబ్రహ్మము గాదు. బ్రహ్మమునకు నామమే నిర్దేశము గాజాలదని తాత్పర్యము 43.

ఏ నివృత్తిదశ అనిర్వచనీయముగానున్నదో యదియే ఉన్మనీయావస్థ. అదియే యోగులకు నిరుపాధికవిశ్రాంతి 44. నామము, రూపము, గుణము, వృత్తి మొదలగు నుపాధియేదియును లేని వస్తు వేదియో యదియే జ్ఞానులకు సహజసమాధి. దానివల్లనే భవసాగరము వలన గలుగు అధివ్యాధులన్నియు దూరమగును 45. ఉపాధులన్నియు నెచట నంతరించునో యదియే సిద్ధాంతము. సిద్ధాంతముమాత్రమే కాదు, మీఁదు మిక్కిలి అదియే వేదాంతము. అదియే ఆత్మానుభవము 46.

ఏది శాశ్వతబ్రహ్మమో ఎచ్చట మాయా భ్రమలేదో దాని మర్మమును అనుభవనీయులగు సత్పురుషులు స్వానుభవమువలన నెఱుంగుచున్నారు 47. స్వానుభవసహాయమునఁ దొలుతొలుత కల్పనమును నాశ మొనరించి తరువాత ఆనందమును జూరగొనవలయును 48. నిర్వికల్పమును గల్పన మొనరించుటచేఁ గల్పనము సహజముగా విడిపోవును. పిమ్మట నేమియు శేషించియుండదు. ఆవల సాధకు లాత్మస్వరూపులై కోట్లకొలఁది సంవత్సరములదనుక నుండగల్గెదరు 49. కల్పమునందొక మంచితన మున్నది. ఏమన, దానిని మన మెచ్చట నియోగించెదమో యది అచ్చటనే లగ్నమగును. కాని యొకవేళ మనము పరమాత్మ స్వరూపమునందు నియోగించినచో స్వయముగా దానియందే విలీనమగును. మఱియు మన యనునదిగూడ ఆరూపమే యైపోవును 50. నిర్వికల్పమును గల్పనము చేయఁబూనితిమేని కల్పనము స్వయముగా నశించిపోవును. నిస్సంగమును గలియుటచే స్వయముగా నిస్సంగులై పోవుదురు 51.

బ్రహ్మ మనచేతిలో నిముడ్చుకొనుట కనువగు పదార్థముగాదు. సద్గురుని జ్ఞానోపదేశముచే నది యనుభవములోనికి వచ్చును 52. ముందు మఱల నీ విషయమునుగూర్చి నిరూపణము గావించెదము. ఆనిరూపణము వలన మీకుఁ గేవలబ్రహ్మము అననేదియో బాగుగాఁ దెలియఁగలదు 53.

## నాలుగవ సమాసము — కేవలబ్రహ్మము.

బ్రహ్మము ఆకాశమునకంటె నిర్మలముగను, నిరాకారముగను, విశాలముగను, వ్యాపకముగను నున్నది 1. ఇరువదియొక్క స్వర్గములును ఏడుపాతాళములును గలసి యొక బ్రహ్మాండమైనది. ఈ విధముగానున్న యనంత బ్రహ్మాండములకుఁగ్రిందను మీఁదను అన్నిస్థలములను నదియున్నది. బ్రహ్మముచే నావరింపబడనిస్థల మణుమాత్రముగూడ లేదు 2-3. స్థలజల కాష్ఠపాషాణాదు లన్నింటియందును బ్రహ్మము ఇమిడియున్నది. అది లేని ప్రాణి యెద్దియు నుండఁబోదని యందఱు నెఱుంగుదురు 4. జలమునందు జలచరములు నిలిచియుండునటుల, బ్రహ్మమునందుఁ బ్రాణిసమూహము సమస్తము నిలిచియున్నది 5. కాని బ్రహ్మమునకు జలోపమానము నొసంగుట యుక్తముగాలేదు. ఏలయన, జలము నియమముగలది. జలచరములు నీటియందు నీటివెలుపలను నుండవచ్చును. బ్రహ్మము నియమరహితమైనది. దానికి వేఱుగా నేప్రాణియు నుండఁజాలదు 6. ఒకవేళ నెవఁడేని యాకాశము వెలుపలకుఁ బాఱిపోవఁ దలంచినయెడల నెటులఁ బరుగెత్తఁగలఁడు ? అది యన్నిప్రక్కలను నిండియున్నదిగదా ! అటులే బ్రహ్మమునకుఁగూడ నంతములేదు 7. అది యన్నింటియందును నఖండరీతిగాఁ గలిసియున్నది. శరీరమునం దంతటను నది చుట్టుకొనియున్నది. బ్రహ్మము అన్నింటికి మిగుల సమీపమునందుండియు దాఁగియున్నది 8. అన్నియును బ్రహ్మమునందే యిమిడియున్నవి. అటులున్న విషయము జనులందఱు నెఱుంగరు. తెలియుచున్న దంతయు భాసము. ఆపరబ్రహ్మము కొంచెమేని యెఱుంగఁబడదు 9. మేఘము, ధూమము, ఉరుము, మంచు మున్నగునవి ఆకాశముతోఁ గలిసియున్నటు లొక్కొక్కప్పుడు గాన్పించును. అది సత్యముగాదు. ఆకాశము నిర్మలమైనది 10. ఆకాశముపై పు మనము చాలసేపుదనుకఁ జూచుచున్నయెడల ఆకాశమునం దేదియో ఒక దృశ్యము చక్రమువలెఁ దిరుగుచున్నటులఁ గనిపించును. వాస్తవమున కందేమియునులేదు. మిథ్యాభాస ఇటులే మీఁదృశ్యముగూడ (సృష్టి స్థితము) జ్ఞానులకు మిథ్యగఁ గన్పట్టును 11. నిద్రించినవానికిఁ దనస్వప్నము జరుగుచున్నటులె యుండును. మేల్కొనిన యనంతరము అంతయును మిథ్యయని విదితమగును. అటులే జ్ఞానరూపమగు జాగరూకత గలిగిన

పిమ్మట మనుష్యున కీస్వప్నమువంటి దృశ్యమంతయు మిథ్యయని తెలి యును 12. కావున మానవుఁడు తన యనుభవ జ్ఞాన సహాయమున మేల్కొనవలయును. మేల్కొనిన పిమ్మట నీ మాయికదృశ్యము (ప్రపంచము) అంతయు మిథ్యయని దెలియును 13. ఇఁక నీ కూటసమస్య నటులుంచి యెయ్యది బ్రహ్మాండమున కావలనున్నదో యా బ్రహ్మమును మీకు స్పష్టముగాఁ దెలియఁజెప్పెదను 14.

బ్రహ్మము బ్రహ్మాండమునందుఁ గలిసియున్నది. ప్రతిపదార్థము నందును నది వ్యాప్తమైయున్నది. మఱియు నది అంశ (భాగ) మాత్ర ముతో సమస్త వస్తువులయందును విస్తృతమైయున్నది 15. బ్రహ్మము నందు సృష్టి భాసించుచున్నది. సృష్టియందు బ్రహ్మమున్నది. అనుభవము గావించుకొన్నపిమ్మట నది యంశమాత్రముతో భాసించును 16. బ్రహ్మము అంశమాత్రముతో సృష్టికి లోపలనున్నది. కానిసృష్టికావల నది యెంతవఱకు వ్యాప్తమైయున్నదో యను నియతి నెవ్వరును గనుగొని నిశ్చయింపఁజాలరు. ఏలయన, సంపూర్ణబ్రహ్మము బ్రహ్మాండమునం దెట్లుసరిపోవును? 17. అమృతి (చరణామృతముంచు చిన్నపాత్రము)లో సంపూర్ణాకాశము ప్రతిఫలింపఁజాలదు. అటులే బ్రహ్మములోఁ గొంత యంశము మాత్రమే యీ బ్రహ్మాండమునందు నిండియున్నదని జ్ఞానులు తలంచుచున్నారు 18. బ్రహ్మము సమస్తమునందును గలిసియున్నది. కాని యది కదలదు. వ్యాపకత్వమువలన నన్నింటిలోనను బరిపూర్ణముగా నిండియున్నది 19. పంచభూతములతో నిండియుండియును పంకమునందుండి యును ఆకాశ మలిప్తముగానుండునటుల బ్రహ్మముగూడ సర్వవస్తువులలో వ్యాపించియు వేఱుగానున్నది 20. బ్రహ్మమునుగూర్చి యొసంగఁదగిన దృష్టాంత మెద్దియునులేదు. శ్రోతలకు విషయస్వరూపము బాగుగా బోధ పడుటకై దృష్టాంతము నొసంగవలసిన యవసరముగలదు. బాగుగా విచారించి చూచినచో బ్రహ్మముతోఁ గొంచెమో గొప్పయో పోల్కి గలదిగా ఆకాశ మొక్కటిమాత్రమే కనిపించుచున్నది 21. శ్రుతుల యందును, స్మృతులయందును క్రమముగా బ్రహ్మము ఖంబ్రహ్మమనియు గగనసదృశమనియుఁ జెప్పఁబడెను. కావుననే బ్రహ్మమును ఆకాశ ముతోఁబోల్చుట సంభవించినది 22. ఇత్తడియంచు నలుపురంగు లేని

యెడల నది స్వచ్ఛమగు బంగారమే. అటులే ఆకాశమునందు శూన్యము లేనియెడల నదియే బ్రహ్మము 23. ఇందువలననే బ్రహ్మమును గగనము వలెను, మాయను పవనమువలెను గ్రహించుచున్నారు. అంతియగాని బ్రహ్మమును దర్శింపఁజాలము 24. శబ్దసృష్టికి సంబంధించిన రచనము క్షణక్షణమునఁ గల్పింపఁబడును. అంతలో నశించును. అది వాయువువలె నిలచియుండదు. నడచిపోవుచునే యుండును 25.

మాయయు నిటులె మిథ్యయైయున్నది. కేవలబ్రహ్మమే శాశ్వతము. బ్రహ్మము అన్నింటియందును వ్యాప్తమైయున్నది 26. అది పృథ్విలోనికిఁ జొచ్చి (పృథ్విని భేదించి) యున్నది. కాని యది పృథ్వియంత కఠినమైనదిగాదు. ఏలయన, పృథ్వి సహజముగా జడము (పృథ్విని భేదించుటకు బ్రహ్మము కఠినముగానుండవలెను.) బ్రహ్మము మిగుల మృదువైనది. దాని మృదుత్వమున కుపమానమేలేదు 27. పృథ్వికంటె సూక్ష్మము జలము. జలముకంటె సూక్ష్మము అగ్ని. అగ్నికంటె సూక్ష్మము వాయువు 28. వాయువుకంటె నధికసూక్ష్మ మాకాశము. ఆకాశమునకంటె నధికసూక్ష్మము బ్రహ్మము 29. బ్రహ్మము వజ్రమును గూడ భేదించి యందిమిడియున్నది. కోమలత్వమునఁ జెప్పవలసినపనియే లేదు. బ్రహ్మము పోవలేదు. ఉపమారహితమై యది యన్నింటియందును నిండియున్నది. బాగుగా శోధించిచూచినచో నది కఠినమైనదియు గాదు, మృదువైనదియుఁ గాదు 30. బ్రహ్మము భూమండలమునం దంతటను వ్యాప్తమైయున్నది. భూమండలము నాశనమగునుగాని బ్రహ్మము నాశము గాదు. అటులే జలమెండి యినికిపోవును. బ్రహ్మమో జలమునందుండియు నెండిపోవదు 31. పరబ్రహ్మ మగ్నియందుండునుగాని తగులఁబడిపోదు. వాయువునందుండునుగాని వీవదు. గగనమునం దున్నదిగాని భాసింపదు 32. అది శరీరమునం దంతటను వ్యాప్తమైయున్నది. కాని దొరకదు. మఱియు నది దగ్గఱనుండియును దూరమగుచున్నది. ఇది మిగుల నాశ్చర్యకరమగు విషయము 33. బ్రహ్మ మెదురుగానున్నది. నలుముఖముల నాక్రమించుకొని యున్నది. పగలు రాత్రిగూడ మన మాబ్రహ్మమునందె చూచుచున్నారము. లోపలను వెలుపలను సర్వస్థలములయందును బ్రహ్మము ప్రత్యక్షముగానున్నది. ఇందు సందియ మావంతయు లేదు34.

మనము బ్రహ్మమునం దున్నారము. అది మన లోపలను మన వెలుపలను నున్నది. ఆకాశమువలె నది దృశ్యముకంటెను వేఱుగా నున్నది 35. ఎచ్చటనేమియును గనుపింపదో యచటగూడ బ్రహ్మము నిండియున్నది. తనధనము తనకే కనిపింపనటులఁ బరబ్రహ్మ మదృశ్యమగుచున్నది 36. కనుపించుచున్న ప్రతిపదార్థమును బ్రహ్మమంటుకొనియున్నది. (మొట్ట మొదట బ్రహ్మము మీఁద దృష్టిపడవలయును. అప్పుడు పదార్థము మీఁది) అనుభవమువలన నీకూటసమస్యను సాధింపవలయును 37. సంపూర్ణ దృశ్యపదార్థములను (పృథివ్యాదులను) విడిచి శేషించిన సమస్తమునకును ముందువెనుక నలుముఖములను నాకాశమెటులున్నదో యటులే యా పరబ్రహ్మము నలుముఖముల సామరస్యముగా నిండి యున్నది 38. రూపము, నామము లున్నంతదనుక నది యంతయు నసత్యము. భ్రమ మఱియు నామరూపముల కావలనున్న దాని (బ్రహ్మము) మర్మమును అనుభవనీయులగు పురుషులే యెఱుంగుదురు 39. ఆకాశము నందు ధూమము పెద్దపెద్ద పర్వతములవలెఁ గనంబడునటుల మాయా దేవియుఁ దనయాడంబరమున వింతవింతరీతులఁ గనిపించుచున్నది 40. ఈమాయ అశాశ్వతము. బ్రహ్మము శాశ్వతము. బ్రహ్మము అన్నిస్థలముల యందు నిరంతరము నిండియున్నది 41. చూడుఁడు. పుస్తకము జదువు నప్పుడది యక్షరములలోనైతము నిండియున్నది. మఱియు మిగుల కోమల రూపముతో నేత్రములలోఁగూడఁ బ్రవేశించియున్నది 42. చెవులతో శబ్దము నాలకించునపుడు, మనస్సుతో ఆలోచనమును జేయునప్పుడు వాస్తవములో నాపరబ్రహ్మము హృదయమునకు లోపలను వెలుపలను నమరియున్నది 43. మార్గమునందు నడచునపుడు పాదములుతోలు దొలుత దానినే తాఁకును. అది సర్వాంగములను దాఁకుచున్నది. ఎప్పుడైనను మనమేదేనివస్తువును దీసికొనినచో నపుడావస్తువుకంటె ముందు మనకుఁ బరబ్రహ్మమే చేతిలోనికి వచ్చుచున్నది. 44. ఎంతదనుకఁ జెప్ప గలను. సమస్తేంద్రియములును, మనస్సునునైతము నిరంతరము పర బ్రహ్మమునందే వర్తించుచున్నవి. కాని దానిని దెలిసికొనుటలో మనము హతాశులమగుచున్నారము 45. (పరబ్రహ్మము) దగ్గఱనేయున్నది గాని

చూచినదో గానుపింపదు. అది కనుపింపక పోయినను దప్పక యది యున్నదనుమాట సత్యము 46.

దృశ్యమును నిరసించినపిమ్మటఁ దనయనుభవమువలననే యది (పరబ్రహ్మము) ప్రాప్తమగును. అది యనుభవగమ్యముగా నున్నది 47. జ్ఞానదృష్టితోఁ జూడఁదగినవస్తువు చర్మదృష్టికిఁ గాన్పింపఁజాలదు. లోపలి యనుభవ విషయమును లోనివృత్తియే తెలిసికొనఁ గలుగును 48. బ్రహ్మమును, మాయను, అనుభవవిషయమును దెలిసికొనునట్టి సర్వసాక్షిణి తుర్యావస్థ మాత్రమేసుమా! 49. దాని సాక్షిత్వమునకు వృత్తి కారణము (తుర్యమునందు వృత్తియున్నది). దానికిఁ బిమ్మటనున్నది ఉన్మనీయావస్థ (నివృత్తిదశ). అచట (ఉన్మనీయావస్థయందు) ఎఱుక (జ్ఞాతృత్వము) నశించిపోవును. అదియే విజ్ఞానము 50. ఉన్మనీయావస్థలో అజ్ఞానము విడిపోవుచున్నది. జ్ఞానముగూడ నుండదు. విజ్ఞానవృత్తి పరబ్రహ్మమునందు లీనమైపోవుచున్నది. అచ్చట కేవలబ్రహ్మ మున్నది. కల్పనమచట నంత్యమగుచున్నది. అదియే యోగిజనుల యేకాంతవిశ్రామము. దానిని ననుభవ పూర్వకముగా నెఱుంగవలయును 51-52.

---

## అయిదవ సమాసము — కల్పనానిరసనము.

పైనిఁ జెప్పబడిన శాశ్వతశుద్ధబ్రహ్మము అనుభవములోనికి వచ్చినది. మాయాస్వరూపముగూడ బోధపడినది 1. బ్రహ్మమునుగూర్చి మా హృదయములలో ననుభవము గలుగుచున్నది. మాయగూడ ప్రత్యక్షముగాఁ గన్పించుచున్నది. ఇపుడీ ద్వైతనిరసన మేవిధముగాఁ గావలయునో తెలియకున్నది. గురుమహారాజా! సెలవిండు 2. శ్రోతలకు వక్త యిటులఁ జెప్పుచున్నాఁడు. శ్రోతలారా! అటులైనచో నిప్పుడు మనస్సును సావధానమును, ఏకాగ్రముగావించి మాయను బ్రహ్మమును నెవడెఱుంగునో దానిని వినుండు 3. "బ్రహ్మసంకల్పము సత్యము. మాయావికల్పము మిథ్య" అనునీ ద్వైతకల్పనమును మనస్సే చేయుచున్నది* 4. మాయను,

* మాయయెద్దియో బ్రహ్మమెద్దియో తెలిసినదిగాని మాయాబ్రహ్మముల ద్వైతనిరసన మెటులగును? అని శిష్యుఁ డడిగెను. ప్రత్యుత్తరము: మాయాబ్రహ్మముల కల్పన

బ్రహ్మమును సమస్తమును తుర్యావస్థయొక్కటియే యెఱుంగును. కావు ననే దానిని సర్వసాక్షియని చెప్పుదురు 5. తుర్యము అన్నింటి నెఱుం గును. కాని యెచ్చట అన్ని యనునదిలేదో యచ్చట నెఱుంగువాఁ డెవఁడు? దేనిని? 6. సంకల్పవికల్పములసృష్టి మనోగర్భమునుండి జరిగినది. అంత్యమునం దామనస్సే మిథ్యయని నిర్ధారణమగుచున్నది. అప్పుడు సాక్షియెవఁడు? 7. సాక్షిత్వము, చైతన్యము, సత్త అనుగుణములు మాయాకారణమున వ్యర్థముగ బ్రహ్మమునకు మధ్యను జేర్పఁబడినవి 8. ఘటాకాశము, మఠాకాశము, మహదాకాశము అను నీ మూఁడుభేదము లేర్పడుటకెట్లు ఘటము, మఠము కారణములో యదేవిధముగా మాయా సంయోగమువలన బ్రహ్మమునందు గుణారోపణము కలుగుచున్నది. కాని వాస్తవమునకు ఆకాశ మొక్కటియే. అటులే బ్రహ్మముగూడ నిర్గుణమును శాశ్వతమునునై ఒక్కటిగా నున్నది 9. ఎంతదనుక మాయ సత్యముగా భావింపఁబడునో యంతదనుకనే బ్రహ్మమునందు సాక్షిత్వమున్నది. అవిద్యానిరసనమైనపిదప ద్వైత మెక్కడనుండఁగలదు? 10. ఇటులే సర్వ సాక్షియగు మనస్సు ఉన్మనమైపోయినపుడు తుర్యరూపమగు జ్ఞానమస్త మితమై పోవును 11. ద్వైతముగా భాసమగు మనస్సెప్పుడు ఉన్మన మయ్యెనో యప్పుడు ద్వైతాఽద్వైతానుసంధాన మెచ్చటనున్నది? 12. అనఁగా ద్వైతాఽద్వైతకల్పనము వృత్తిచిహ్నము. వృత్తి నివృత్తి యైపోయిన పిమ్మట ద్వైతముయొక్క జాడపోడలుగూడఁ గాన్పింపవు 13. వృత్తిరహితమగునట్టి జ్ఞానమే (విజ్ఞానము) పూర్ణ శాంతి. పూర్ణ శాంతి లభించిన పిమ్మట మాయా బ్రహ్మములనుగూర్చిన వివాదమంతయు నంత రించును 14. మాయా బ్రహ్మములనుగూర్చిన వివాదమును మనస్సే

---

మగుచున్న దెవనికి? మనస్సునకు. ఆ కల్పనము నశించినపిమ్మట (మనోవృత్తిలేకున్న పిదప అనగా నున్మనీయావస్థలో) ద్వైతమిఁక నెటులుండగలఁదు? కాని యీకల్పనమును నశింపఁజేయుటయెట్లు? కల్పనమువలనఁ గల్పనమే నశించును. బ్రహ్మమును గూర్చిన కల్పనము శుద్ధకల్పనము, సంకల్పము, మాయనుగూర్చినకల్పనము శబలము (ఔపాధికము) లేక అశుద్ధకల్పనము అది వికల్పము. ఇపు డీసంకల్పముకంటె ముందుగా వికల్పములు నాశనమొనరింపవలయును. దీనికిఁ బిమ్మట సంకల్పము స్వయంబ్రహ్మమునందు లీనమై పోవును. మఱియుఁ గేవలబ్రహ్మము ప్రాప్తించును.

కల్పించినది. బ్రహ్మము వాస్తవమునకుఁ గల్పనాతీతమైనది. ఈ రహస్యమును జ్ఞానులే యెఱుంగుదురు 15. మనోబుద్ధుల కగోచరముగా నున్నదియుఁ గల్పనమునకంటె వేఱుగనున్నదియు నగు పరబ్రహ్మముయొక్క యథార్థమును అనుభవము గావించినయెడల ద్వైతమెచ్చట నిలువఁ గలుగును? 16. ద్వైతమువైపు చూచినచో బ్రహ్మము గోచరింపదు. బ్రహ్మమువైపు చూచినచో ద్వైతము నశించును. ఏలయన, ద్వైతాద్వైతముల భాసము కల్పనమువలననే జరిగియున్నది 17. కల్పనము మాయానివారణమును జేయుచున్నది. బ్రహ్మమును స్థాపించుచున్నది. అటులే సంశయమును గలుగఁజేయునదియు సంశయము నాటంకపఱుచునదియుఁగూడ కల్పనమే 18. అదియే (కల్పనమే) మానవుని ఆధిబంధములయందుఁ బడద్రోయుచున్నది. సమాధానము నొసంగుచున్నది. మఱియు బ్రహ్మమువైపు ధ్యానమును గలిగించుచున్నది 19. కల్పనము ద్వైతమునకు జనని. అదియే జ్ఞానమునకు స్వరూపమైయున్నది. మఱియు (బద్ధత్వము) ముక్తిత్వముగూడ దానివలననే యేర్పడుచున్నది 20. శబల (ఔపాధిక) కల్పనము మిథ్యాబ్రహ్మండమును జూచుచున్నది. శుద్ధ కల్పనము ఆ క్షణముననే నిర్మలస్వరూపభావనము గావించుచున్నది 21. కల్పనము క్షణమాత్రములోఁ జింతనము గావించును. క్షణమాత్రములో స్థిరమైపోవును. మఱియు క్షణమాత్రములో విస్మితమై చూచుచుండును 22. కల్పనము క్షణమాత్రములోఁ దెలిసికొనుచున్నది. క్షణమాత్రములో భయపడుచున్నది. ఇటులే బహువిధ వికారములను దెచ్చిపెట్టుకొనుచున్నది 23. జన్మమునకుఁ గల్పనమే మూలము. భక్తికి ఫలము కల్పనమే. మఱియు మోక్షమునుగూడఁ గల్పనమే ప్రసాదించుచున్నది 24. సాధనము చేయునపు డీకల్పనమును జక్కఁగా నుపయోగించినచో శాంతము లభించును. అటులఁ గానియెడల నిదియే మానవుఁడు పతనమగుటకు కారణమగును 25. ఇటులే కల్పన మన్నింటికిని మూలమైయున్నది. దీనిని నిర్మూలనము గావించినపిమ్మట బ్రహ్మము ప్రాప్తించును 26. శ్రవణము, మననము, నిదిధ్యాసములవలన సమాధానము లభించును. అంతతో మిథ్యాకల్పనాభానుఁ డస్తమించును 27. నిశ్చితమగు అర్థమువలన సంశయము నశించునట్లు శుద్ధబ్రహ్మ నిశ్చ

యమువలనఁ గల్పనము నశించును 28. మిథ్యాకల్పనమునకుఁగల టక్కరి తనము సత్యము ముందెటుల నిలువగలదు? సూర్యుని తేజఃపుంజమున కెదురుగాఁ జీఁకటి యెటుల నిలిచియుండఁగల్గును? 29. జ్ఞానప్రకాశము వలన మిథ్యాకల్పనము నశించును. అప్పుడు ద్వైతాభాసము తనంతట తానే విడిచిపోవును 30. మృగమువలన మృగము వంచింపఁబడి (వేట గానిచే) నశించునటులఁ గల్పనమువలన గల్పన మెగిరిపోవుచున్నది. ఆకాశ మార్గమునకు విడువఁబడిన బాణము వేఱొకబాణముచేఁ దెగఁగొట్టఁ బడునటుల కల్పనమువలనఁ గల్పన మంతరించును 31.

శుద్ధకల్పన ప్రబలత్వమువలన శబలకల్పన మెటుల నాశనమగు చున్నదో యీ విషయమును మీకు స్పష్టపఱచి చూపెదను 32. శుద్ధ కల్పనము గురుతించువిధమును వినుండు. శుద్ధకల్పనము స్వయముగా నిర్గుణకల్పనము గావించుచున్నది. మఱియు నది సత్స్వరూపమును విస్మ రింపనీయదు 33. స్వరూపానుసంధానముయొక్కయు, ద్వైత నిరసనము యొక్కయు, అద్వైత నిశ్చయముయొక్కయు జ్ఞానమును గలుగఁజేయు నదియే శుద్ధకల్పనము 34. అద్వైతకల్పనము గావించునది శుద్ధమనియు, ద్వైత కల్పనము గావించునది అశుద్ధమనియు నెఱుంగవలయును. అశుద్ధకల్ప నమునే శబలకల్పన మనిగూడ నందురు 35. అద్వైతనిశ్చయముజేయు టయే శుద్ధకల్పనాకార్యము. శబల (అశుద్ధ) కల్పనము వ్యర్థముగ ద్వైత భావమును జేయును 36. అద్వైతకల్పనము ప్రకాశితమైనంతనే గల్పించు ద్వైతము నశించిపోవును. ద్వైతముతోఁబాటుగ శబల (అశుద్ధ లేక ఔపాధిక) కల్పనముగూడ నిరసనమైపోవును 37. కల్పనమువలనఁ గల్ప నము నశించును. శబలత్వ కల్పనము వెడలిపోయినపిమ్మట శుద్ధకల్పనము శేషించియుండును. ఈ విషయమును జతురపురుషులెఱుంగవలయును 38. శుద్ధకల్పన మేస్వరూపమును గల్పించునో అదియేదానిస్వరూపము. మఱియు నాస్వరూపమును గల్పించుచు గల్పించుచు స్వయముగా నది తద్రూప మైపోవును 39. కల్పనముయొక్క మిథ్యాత్వము ప్రకటనమైపోయిన పిదప సహజముగఁ దద్రూప మేతెంచును. మఱియు నాత్మ నిశ్చయ మైనపిమ్మట కల్పనము లయమైపోవును 40. సూర్యుఁ డస్తమించిన పిమ్మట నంధకారము ప్రబలునట్లు నిశ్చయము లోపించినపిమ్మట ద్వైత

ముప్పాంగును 41. అటులే జ్ఞానము మలినమైనపిమ్మట అజ్ఞానము ప్రబలును. కావున సద్గ్రంథశ్రవణము అఖండరీతిగఁ జేయుచుండవలయును 42. ఇఁక నీ విపుల ప్రసంగము జాలించి యొక్కమాటతోడనే మీ సందియములఁ దీర్చెదను. ద్వైతముగా భాసించు నీవు అనునది లేదు 43. సంశయ మిప్పటికి విడిపోయియుండును. ఇఁకముందుఁ జెప్పబోవు విషయమును సావధానమతితో వినఁగోరెదను 44.



## ఆఱవ సమాసము — ముక్తుఁడెవ్వఁడు?

శ్రోతలిటుల నడుగుచున్నారు. గురువర్యా! తాము కల్పనాతీతమగు అద్వైత బ్రహ్మనిరూపణము గావించి నన్ను క్షణమాత్రముకొఱకుఁ దదాకారునిగఁ జేసివైచితిరి 1. కాని నేను తదాకారుఁడనై కేవల బ్రహ్మమును గావలయునని గోరుచున్నాఁడను. చంచలత్వమునకు లోనై యెప్పుడును నీ సంసారములోనికి రానొల్లను 2. కల్పనారహితమగు ఆ సుఖమునందు సంసారదుఃఖము లేదు. కావున నదియే (ఆ బ్రహ్మమె) యైపోవలయును 3. వాస్తవమునకు అద్వైత శ్రవణమువలన సాధకుఁడు బ్రహ్మమే కావలయును. కాని యిచ్చట మఱల వృత్తిమీఁదకు రావలసి వచ్చుచున్నది. అందుచే నీ రాకపోకలు తొలఁగుట లేదు 4. నేను క్షణమాత్రముకొఱకు ఎత్తుపయినెక్కి బ్రహ్మమునే యగుచున్నాఁడను. కాని తత్క్షణమే మఱల గ్రిందికి (వృత్తిలోనికి) వచ్చి పడుచున్నాఁడను 5. పిల్లలు సీతాకోకచిలుకకాళ్ళకు దారమునుగట్టి దానిని గ్రిందికిని మీఁదకును నెగురవేయునటుల నేనుగూడఁ (వృత్తిబద్ధుఁడనై) గ్రిందికిని మీఁదకును బత్యావర్తనము (రాకపోకలు) చేయుచున్నాఁడను. ఇటు లెంతదనుకఁ జేయవలెనో తోఁచకున్నది 6. ఉపదేశము నాలించునపుడు తదాకారమైనతోడనే శరీరము పతనమైనటులుండవలయును. నాదియిది, పరునిదిదియనుభావము లేకుండఁ బోవలయును 7. ఇట్లు కాఁజాలనిస్థితియందున్న నేను ఏమిచెప్పుచుంటినో యావిషయమునందేసిగ్గు పడుచున్నాఁడను. ఒకసారి బ్రహ్మమునై మఱల గృహస్థాశ్రమములోనికి వచ్చిపడుటఁగూడ నాకు విపరీతముగాఁ గాన్పించుచున్నది 8. ఈ జ్ఞానము

నాకు యుక్తముముగాఁ దోఁచుటలేదు. ఒకసారి స్వయముగా బ్రహ్మమై పోయినవాఁడు మఱల నాదశనుండి యేల వెనుకకుఁ దిరిగివచ్చుచున్నాఁడు? 9. అగుచోఁ బూర్తిగా బ్రహ్మమేయై పోవలయును. లేనియెడల సంసార సాగరమునందే స్థిరముగా నుండవలెను. రెండుప్రక్కల నెంతదనుకఁ దిరిగి వేసారవలయును? 10. అధ్యాత్మనిరూపణమును వినుచుండునపుడు మాత్రము జ్ఞానము ప్రబలమగుచుండును (స్వయంబ్రహ్మమునందుఁ దదాకారమై పోవుదనుకగూడ జ్ఞానము విజృంభించును). నిరూపణ మాగి పోయినపిదప అజ్ఞానము నష్టమైపోవును. మఱల నాబ్రహ్మరూపునే (మనుష్యునే) కామక్రోధము లావరించుకొనుచున్నవి 11. ఇది యెక్కడి బ్రహ్మమగుట? ఈ విధముగా రెండుపక్షములనుండి పడిపోతిని. గార్హస్థ్య కాలమాతయు నిట్టి పెనుఁగులాటలయందే గడచిపోయెను 12. బ్రహ్మా నందమును బడయుకాలమున గార్హస్థ్యకర్మములు వెనుకకు లాగుచుండును. గృహాకర్మములను నెఱవేర్చెడి సమయమున బ్రహ్మమునందుఁ బ్రీతి యుప్పతిల్లుచుండును13. ఈ విధముగా బ్రహ్మానందసుఖమును గార్హస్థ్యము గ్రహించుచున్నది. గార్హస్థ్యసుఖము బ్రహ్మజ్ఞానమువలనఁ దొలంగిపోవు చున్నది. రెండును నసమగ్రములుగానే యున్నవి ఒక్కటియును బూర్తి కాదు 14. ఈ కారణమున నేను జంచలుఁడను. దుశ్చిత్తుఁడనై పోతిని. ఏమిచేయుదును? ఇపుడు నాకెద్దియు నిశ్చితము గాకున్నది 15. సారాంశ మేమన, నేనఖండబ్రహ్మాకారుఁడను గాకుంటిని సరిగదా! ఇటు గార్హస్థ్య మునందుఁగూడ విఘ్నము గలుగుచున్నది. కావున నిపుడెట్లు లుండ వలెను? 16. శ్రోత దెలిపిన యీ సందేహమునకు వక్త చెప్పఁబోవు ప్రత్యుత్తరమును సావధానమనస్కులరై యాలింపుడు 17.

వక్తతిరుగ నిట్లుఁ బ్రశ్నించుచున్నాఁడు. "ఓయీ! జ్ఞాని బ్రహ్మమై జడమువలెఁ గర్మముచేయకుండఁ బడియున్నచో మోక్షముఁబొందుననియా నీయభిప్రాయము? అట్లైనచోఁ గర్మయోగులగు వ్యాసాదులు మునిఁగి పోయిరా? 18. వక్తకు శ్రోత యిట్లు విన్నవించుచున్నాఁడు. అయ్యా! కేవలము శుకుఁడు, వామదేవుఁడు నను నిరువురుమాత్రమే ముక్తినొందిన వారలని శ్రుతి నుడువుచున్నది 19. ఈ యిరువురు జ్ఞానులనే ముక్తులని వేదము లంగీకరించినవి. అన్యులందరును జ్ఞానులని వేదము వాకొనెను.

ఇపు డీ వేదవచనమును అశ్రద్ధతో విడనాడుట యెట్లు? 20. ఈ విధముగ శ్రోత వేదాధారముతోఁ బ్రత్యుత్తరము నొసంగెను. మఱియు మిగుల బట్టుదలతో నిరువురే ముక్తులని సిద్ధాంతీకరించెను 21. ఇది విని వక్త యిటులఁ జెప్పుచున్నాఁడు. ఒకవేళ సృష్టియంతటికిని నిద్దఱే ముక్తుల గలరని చెప్పఁబూనినచో నికఁ దక్కినవారలకు గతియేమియుండును? 22. ఋషులు, మునులు, సిద్ధులు, యోగులు, ఆత్మజ్ఞానులు, సమాధానులు మున్నగువారు పలువురు ముక్తులై పోయిరి 23.

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్ ।
రుక్మాంగదార్జున వసిష్ఠవిభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి ॥ 1

శ్లో॥ కవిర్హరిరంతరిక్షః ప్రబుద్ధః పిప్పలాయనః।
అవిర్హోత్రోథ ద్రుమిలశ్చమసః కరభాజనః ॥ 2

వీరలేగాక మహానుభావులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులును దేవర్షులును జనకాది రాజర్షులునుగూడ ముక్తులై పోయిరి 24. ఒకవేళ శుకమహర్షి వామదేవుఁడు మాత్రమే ముక్తులయినచోఁ దక్కినవారలంద ఱును మునిఁగిపోయిరాయేమి? అవును, మునిఁగిపోయిరందువేని యది మూర్ఖత్వమేయగును 25. ఇదివిని శ్రోత మరల నిటుల నడుగుచున్నాఁడు. అటులైనచో వేద మావిధముగా నేల నుడువును? మీరు వేదమును మిథ్య గావింపఁగలరా? 26. వక్త ప్రత్యుత్తరము నొసంగుచున్నాఁడు. వేదములు నుడివినది పూర్వపక్షము. సిద్ధాంతముగాదు. మూర్ఖులగు జనులు దీనినే పట్టుకొని కూర్చుందురు. సాధువులు, విద్వాంసులు, నేర్పరులు నీవిషయము నంగీకరింపరు 27. వాదసౌకర్యమునకు నెటులో నీవిషయము నంగీకరించినయెడల నిఁక వేదములకు సామర్థ్యమెక్కడ నున్నది? అంగీకరించినపక్షమున వేదమెవ్వరినేనియు నుద్ధరింపఁజాలదని సిద్ధాంతమగును 28. వేదములయందు సామర్థ్యములేనిచో వాని నిఁక నెవ్వరడుగుదురు? కావున నట్లెన్నటికిఁ గాదు. వేదములయందు జనుల నుద్ధరించెడిసామర్థ్యము తప్పకయున్నది 29. వేదాధ్యయనము గావించు

పురుషుఁడు మిగులఁ బుణ్యాత్ముఁడుగాఁ బరిగణింపఁబడుచున్నాఁడు. వేదములయందు సామర్థ్య మెక్కువగానున్నది 30. వేదశాస్త్రపురాణాదుల నాలకించుట భాగ్యవశముననే తటస్థించుననియు వాని నాలకించుటచే జనులు పవిత్రులగుచున్నారనియు సాధుజనులు చెప్పుదురు 31. వానిలో నొకశ్లోకమైనను శ్లోకార్థమైనను కడకొకపాదమైనను గట్టకడ కొకశబ్దము నైనను వినినచో ననేకపాపములు నశించును 32. వ్యాసాదిమహర్షులు నుడివిన యీయర్థముగల శ్లోకములు, వచనములు ననేకములు వేదశాస్త్రపురాణములలో నున్నవి 33. ప్రతిస్థలమునకు వేదశాస్త్రముల మహిమ గానముచేయఁబడెను. వేదమునందేని, శాస్త్రమునందేని యొక్కయక్షరము విన్ననుగూడ మానవులు పవిత్రులగుదురు 34. కావున నొకవేళ శుకమహర్షి, వామదేవుఁడు దప్ప నితరులు ముక్తులు గానియెడల వేదశాస్త్రములకు మహత్త్వ మెక్కడనుండి రాఁగలదు? 35. వేదశాస్త్రపురాణములవలన మానవు లనేకు లుద్ధరింపఁబడిరను విషయము సిద్ధాంతమై యున్నది 36. ఒకవేళ నీవు "మొద్దువలె జడముగాఁ బడియుండువాఁ డొక్కఁడే ముక్తుఁడుగా భావింపఁబడు" ననిచెప్పినచో అది యుక్తమైనది గాదు. ఏలయన, నీవు ముక్తుఁడుగా నొప్పుకొనిన శుకమహర్షి గూడ స్వయముగా ననేకస్థలములలో నిరూపణమును(జ్ఞానోపదేశమును) గావించి యున్నాఁడు 37. శుకుఁడు ముక్తుఁడని వేదములు చెప్పుచున్న యంశము సర్వవిధముల సత్యము. శుకదేవుఁడు అచేతనబ్రహ్మాకారుఁడు గాఁడు 38. శుకదేవుఁడొకవేళ అచేతనబ్రహ్మాకారుఁడే యైనచో మఱల నాతఁ డెట్లు సారాసారవిచారము గావింపఁగలఁడు? 39. నీవు నుడివినవిధముగానైనచో బ్రహ్మాకారుఁడు మొద్దువలె జడమై పడియుండును. శుకయోగీంద్రుఁడట్లు పడియుండక పరీక్షిన్మహారాజునకు భాగవతమును వినిపించెను 40. కథానిరూపణము గావింపవలయునన్నచో సారాసారవిచారము గావింపవలసి వచ్చును. అటులే దృష్టాంతముకొఱకు సమస్త చరాచరసృష్టిని నన్వేషింపవలసి వచ్చును 41. క్షణమాత్రముకొఱకు బ్రహ్మమే యైపోవలసివచ్చును. మఱియు క్షణమాత్రముననే సంపూర్ణదృశ్యసృష్టినంతయు శోధింపవలసి వచ్చును. అటులే యనేకదృష్టాంతములనొసంగి వక్తృత్వ సంపాదనము చేయవలసియుండును 42. శుకయోగీంద్రుఁ డీవిధముగానే భాగవతాదు

లను నిరూపించి వినిపించెను. కావున దీనివలన శుకమహర్షిని మనము ఎప్పుడేని బద్ధుఁడని నుడువఁగలమా? 43.

కావున సద్గురూపదేశమునుబడసి సమస్త కర్మములనుగావించి (నిశ్చేష్టుఁడుగను మొద్దుగను బడియుండక) సాయుజ్యముక్తిని బొంద వచ్చును 44. ఈ లోకము (సంసారము) నందు కొందఱు ముక్తులును కొందఱు నిత్యముక్తులును కొందఱు జీవన్ముక్తులును కొందఱు సమాధానులు కొందఱుయోగులు కొందఱువిదేహస్థముక్తులు నై యున్నారు 45. ఎవ్వరు సచేతనులో (జీవితావస్థయందే జ్ఞానసహాయమున ముక్తులై వ్యవహరించు) వారు జీవన్ముక్తులు. ఎవ్వ రచేతనులో వారలు విదేహముక్తులని చెప్పఁబడుదురు. (అజగరమువలె దేహాభిమానమునుమఱచి జీవితావస్థయందే ముక్తులై పడియున్నవారు). ఈ యుభయులకును వ్యతిరేకులగు యోగీశ్వరులను నిత్యముక్తులనుగా భావింపవలయును 46. స్వరూపబోధయగుటవలన గలిగెడు స్తబ్ధత్వమును (ఉదాసీనతను) తటస్థావస్థగా నెఱుంగ వలయును. ఈ తటస్థత్వ, స్తబ్ధత్వములయందు దేహసంబంధము తొలంగకయుండును* 47. ముక్తికిఁ గారణము స్వానుభవము. మిగిలిన దంతయు వ్యర్థము. తనయనుభవముతోడనే తృప్తుఁడు కావలయును. (వర్తనమును జూచి యెవరేని బద్ధుఁడని నుడువుచున్నను స్వానుభవ తృప్తుఁడగు పురుషుఁడే సత్యమగు ముక్తుఁడు) 48. కంఠపర్యంతము తృప్తిగా భుజించినపురుషుని నెవ్వఁడేని క్షుధాతురుఁ డన్నమాత్రమున నాతఁడు క్షుధావ్యాకులుఁడు గానేరఁడు 49. నిరాకారస్వరూపమునం దెప్పుడు దేహమేలేదో యప్పుడు సందేహ మెక్కడనుండివచ్చును? బద్ధముక్తులభావన దేహమువఱకె యున్నది 50. దేహాభిమానము నుంచుకొన్నయెడల బ్రహ్మవిష్ణు మహేశులునై తము ముక్తులు గాఁజాలరు. అట్టియెడ శుకునిముక్తిత్వ మొక లెక్కలోనిదా? 51. ఏలయన, ముక్తిత్వ

* స్వరూపబోధమైనపిమ్మట నిశ్చేష్టుఁడై పడియుండుట ముక్తునిలక్షణమనియు, గదలుట మెదలుట బద్ధునిలక్షణమనియు శిష్యుని మతము. దీనికి గురువిట్లు చెప్పుచున్నాఁడు: కదలక మెదలక స్తబ్ధుఁడుగను తటస్థుఁడుగను నుండుట దేహకారణముననై యున్నది. దేహబుద్ధిగలవాఁడు ముక్తుఁడు గాఁజాలఁడు. నేను ముక్తుఁడనని నుడువువాఁడే వాస్తవమునకు బద్ధుఁడు.

భావనయే బద్ధత్వలక్షణము. కావున ముక్తబద్ధములు రెండును వ్యర్థములే. సత్స్వరూపమునందు ముక్తభావన లేదు. బద్ధభావనయును లేదు. అది స్వతస్సిద్ధమైనది 52. గర్భమునకు శిలనంటఁగట్టుకొని నీటిలో నీఁద వీలు కానట్లు ముక్తత్వాభిమానమును బెట్టుకొని పరమాత్మునితోఁ గలసి యుండఁజాలము 53. "నేను" అను భావమునుండి విడిపోయినవాఁడె ముక్తుఁడు. ఏలయన, అట్లు విడిపోయినపిమ్మట మూఁగవాఁడుగనున్నను మాటలాడుచున్నను ముక్తుఁడే 54. ఏ సాధుస్వరూపుఁడు బంధింపఁబడఁడో యాతనిపట్ల ముక్తత్వమెక్కడనుండి వచ్చును? (ఎచ్చట బద్ధత్వముగలదో యచ్చటనే ముక్తత్వభావనగూడఁ గలదు). అచ్చట గుణవార్తలన్నియు వ్యర్థములు 55.

శ్లో॥ బద్ధో ముక్త ఇతి వ్యాఖ్యా గుణతో మే న వస్తుతః ।
గుణస్య మాయా మూలత్వాన్న మే మోక్షో న బంధనమ్ ॥

పరమశుద్ధతత్త్వజ్ఞానియైయున్నవానికి బద్ధముక్తుల భేదమే లేదు. ముక్తబద్ధవిరోధము మాయాకారణములవలన నేర్పడుచున్నది 56. నామ రూపములు నశించియుండుటావున ముక్తత్వము శేషించియుండఁజాలదు. అచ్చట ముక్తబద్ధత్వములు పూర్తిగా విస్మరణీయములై పోవును 57. బద్ధముక్తులు వాస్తవములో నెవ్వరు? ఆ (బద్ధముక్తులు) నేను అనునది లేనేలేదు. నేననుభావము అవశ్యముగా నందఱను గట్టివేయుచున్నది. నేననుభావమును ధారణము చేయువారలను అది బంధనమునందుఁ ద్రోయుచున్నది. (దేహాభిమానముగలవానినే ముక్తుఁడనుకొమ్ము లేక బద్ధుఁడనుకొమ్ము. నేననుభావమును విడిచినవాఁడు బద్ధుఁడును ముక్తుఁడును గాఁడు) 58. ఈవిధముగా నిదియంతయు భ్రమయైయున్నది. మాయాతీతమగు విశ్రాంతి లభింపనంతవరకు నీయహంతాత్వకష్టములు మానవుని వెంటనంటియేయుండును 59. ఇప్పుడు బద్ధముక్తతలు కల్పనా మధ్యమునఁ గలుగుచున్నవి. ఇట్టి స్థితియం దాకల్పనము మాత్రము సత్యమా? (ఇదియును సత్యముగాదు) 60. కావున నిదియంతయును మృగతృష్ణ మాయాకారణమువలననే నీ యసత్యమేఘాడంబరము విజృంభించెను. జ్ఞానము జాగరూకత కలిగినమీఁదట నీ మాయాస్వప్నమంతయును వెంటనే మిథ్యయైపోవును 61. ఈ స్వప్నస్వరూపమగు సంసా

రమునందు "నేను బద్ధుఁడను నేను ముక్తుఁడను" అని తలంచువాఁడు నిశ్చయమునకు మేల్కొనలేదనియే గ్రహింపవలయును. ఇందువలననే వానికి, ఎవరు? ఎట్లు? ఏమయ్యెను? అనునవి తెలియకున్నవి 62. కావున నాత్మజ్ఞానము కలిగినవారలందఱును ముక్తులే. శుద్ధజ్ఞానము గలిగిన పిమ్మట ముక్తత్వభావన సమూలముగా నష్టమైపోవును 63. బద్ధత్వ ముక్తత్వభావనలు దేహబుద్ధిని వెంబడించియుండును గాని సాధుజనులు దేహాతీతులు గావున వారలపట్ల బద్ధముక్తభావనలే యుండవు 64. సాధనము నెట్లు చేయవలయునో ముందు దెలుపుదును. శ్రోతలు సావధానులై వినుండు 65.

---

## ఏడవ సమాసము — సాధననిశ్చయము.

వస్తువును గల్పనము చేయవలయునన్నచో నది యెట్లు సాధ్యమగును? ఏలయన, స్వాభావికముగాఁ నది నిర్వికల్పముగదా! అచ్చట కల్పనము నామముతోఁబాటు శూన్యాకారముగానున్నది 1. ఎటులైనను గల్పనము జేయవలయునన్నచో నది సాధ్యముగాదు. గురుతే దొరుకదు. చిత్తమునకు భ్రమకలుగును 2. దృష్టికేమియుఁ గన్పింపదు. మఱియు మనస్సున కేమియును భాసింపదు. భాసింపని, కనుపింపని వస్తువును గురుతించుటయెట్లు? 3. మనము నిరాకారమును జూడఁదలంచితిమేని మనస్సు శూన్యాకారమునందుఁ బడిపోవును. లేదా కల్పనము జేయుదుమంటిమేని యంధకారము నిండియున్నటులఁ దోఁచును 4. కల్పనము జేయుటవలన బ్రహ్మము నల్లగానున్నటుల స్ఫురించును. కాని యది నల్లనిదిగాని, పచ్చనిదిగాని గాదు. అది యెఱుపు, నీలము, తెలుపుగూడఁ గాదు. వర్ణరహితము 5. వర్ణరూపములేనిదియు భాసమునుండి వేఱుగనున్నదియు ఇంద్రియముల కగోచరముగనున్నదియు నగు నావస్తువును గురుతింప నవకాశ మెట్లు చిక్కును? 6. కాన్పింపనిదాని నెంతవఱకు గురుతింపఁగలము? దీని వలన వ్యర్థముగా శ్రమవృద్ధియగును 7. (పరబ్రహ్మము) అది నిర్గుణము లేక గుణాతీతము. అది యదృశ్యము లేక అవ్యక్తము. ఆ పరమపురుష తత్త్వము అచింత్యము లేక చింతనాతీతము నై యున్నది 8.

శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే ।
సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణే నమః ॥

అచింత్యమునుగూర్చి గావించుచింతనము, అవ్యక్తమునుగూర్చి యొనరించు ధ్యానస్మరణము, నిర్గుణము గురితించుట అనునివి యెట్లు సాధ్యమగును? 9. నిర్గుణము కనులకుఁ గాన్పింపదు. మనస్సునకు గోచరింపదు. దాని నెటులఁ జూడఁ గల్గుదుము? 10. అసంగముతో సంగము గావించుటయు నిరావలంబనమునందు (నిరాధారముగ నాకాశమున) వసించుటయు నిశ్శబ్దమును బ్రతిపాదించుటయు నెట్లు జరుగును? 11. అచింత్యమును జింతించుటవలనను నిర్వికల్పనమును గల్పనముచేయుట వలనను అద్వైతమును ధ్యానించుటవలనను ద్వైతమే విజృంభించును 12. ఒకవేళ ధ్యానమునే విడిచివైచినను అనుసంధానమునుగూడఁ బెట్టుకొనక పోయినను సాధకుఁడు సంశయములపాలు గావలసివచ్చును 13. ద్వైత భయమువలన నొకవేళ వస్తువిచారమునే జేయకున్నచో, హృదయమునకుఁ గొంచమేని శాంతి లభింపఁజాలదు 14. అభ్యాసము చేయుటవలన వస్తువలవాటగును. అభ్యాసమువలన వస్తుప్రాప్తియగును. నిత్యానిత్య విచారమువలన సమాధానము గలుగును 15. వస్తువును జింతించుటవలన నద్వైత ముప్పొంగును. దానిని వదలివేయుదుమేని యేమియును గోచరింపదు. ఇటులే వివేకము లేనియెడల శూన్యత్వసందేహములయందుఁ బడిపోవుదుము 16.

కావున మానవుఁడు ముఖ్యముగా వివేకధారణము గావింపవలయును. జ్ఞానసహాయముచేఁ బ్రపంచమునుండి తప్పించుకొనవలయును. అహంభావమును దొలంగఁ ద్రోయవలయును. కాని యెంత యత్నించినను అహంభావముమాత్రము దూరముగాదు 17. పరబ్రహ్మ మద్వైతము. దానిని గల్పించుటతోడనే ద్వైతము వృద్ధియగుచున్నది. అచ్చట హేతువులు దృష్టాంతములు గొంచెమేని సాగవు 18. పరబ్రహ్మమును స్మరియించునపుడు సాధకుఁడు స్మరణమును మఱచిపోవలయును. విస్మరణుఁడైన చిమ్మటగూడ దానిని స్మరించుచుండవలయును. ఆ పరబ్రహ్మము నెఱింగి యెఱుకను మఱచిపోవలయును 19. దానితోఁ (పరబ్రహ్మముతోఁ) గలయిక కలుగకయే కలయిక సమకూరును. కలియఁబోయి

నచో అంతరాయము కలుగును. ఈ మూకావస్థ మిగుల నద్భుతముగా నున్నది 20. పరబ్రహ్మము సాధింపఁదలంచినచో సాధ్యముగాదు. విడిచినచో విడిపోవదు. దానితోఁ గల్గియున్న నిరంతరసంబంధ మేవిధముగానేని తెగిపోవనేరదు 21. అది యెల్లప్పుడును గుదిరిక గల్గియుండును. చూచినచోఁ గనఁబడక దాఁగికొనును. చూడకపోయినచో ఇక్కడ నక్కడఁ (సర్వత్ర) బ్రకాశించుచుండును 22. దానిపట్ల అపాయములే అపాయములు (విఘ్నములు). కాని యపాయమే ఉపాయము. ఇది యనుభవము లేనిది యెట్లు బోధింప ననువగును? 23. పరబ్రహ్మము తెలిసికొన యత్నింపకున్నను దెలియవచ్చును. తెలిసినపిమ్మటఁగూడ నేమి యును దెలియఁబడదు. ఆ నివృత్తిపదమునుఁ బ్రాప్తింపవలయునన్నచో వృత్తిని విడువవలయును 24. అది ధ్యానములోనికి రాఁజాలదేని చింతన మెట్లు చేయవలయును? ఆ పరబ్రహ్మము హృదయమునకు నంటదు 25. దానికి జలోపమానము నొసంగుటయెట్లు? పరబ్రహ్మము నిర్మలమును నిశ్చలమును గలది. విశ్వమంతయు నందు (పరబ్రహ్మమునందు) మునిఁగి యున్నది. కాని యది జగమున కలిప్తముగనే యున్నది 26. అది (పరబ్రహ్మము) ప్రకాశముగాఁగాని యంధకారముతో సమానముగాఁగాని లేదు. ఇఁక దానితో నుపమింపఁదగిన దేమున్నది? 27. ఆ బ్రహ్మము సర్వవిధముల నిరంజనముగానున్నది. ఎప్పుడును గాన్పింపదు. ఇట్టి పరిస్థితులలో దీని ననుసంధానము జేయుట యెట్లు సాధ్యమగును? 28. జాడ దీసినవోఁ నేమియును గోచరింపదు. హృదయము సందేహములలోఁ బడి పోవును 29. ఇట్టిదశయందు హృదయము భీతినొంది సత్యస్వరూపము నభావముగా భావించును (నాస్తికమైపోవును). దాని నెట్లు చూడఁ గలుగుదుము? చూచుట కెచ్చటికిఁ బోవుదము? అది లేనే లేదని నుడువుదురు 30. వాస్తవమున కది యభావముగనే యున్నచో వేదశాస్త్రములు చెప్పినదంతయు మిథ్యయేనా యను ప్రశ్న ముదయించును. కాని వ్యాసాదిమహర్షుల వచనములు మిథ్య యెటులఁ గాఁగలవు? 31. కావున వేదశాస్త్రములు మిథ్యయని నుడువఁజాలము. జ్ఞానులు, మహర్షులు తెలిపిన జ్ఞానసాధనము లెప్పటికిని మిథ్య కాఁజాలవు 32. స్వయముగా మహాదేవుఁడు గురుగీతములయందుఁ బార్వతికి అద్వైతజ్ఞానము

నుపదేశించినాఁడు 33. అవధూతగూడఁ దన యవధూత గీతలయందు గోరక్షమునికిఁ దెలుపు భాగమునగూడఁ జ్ఞానమార్గమునే చెప్పి యున్నాఁడు 34. స్వయముగా శ్రీ మహావిష్ణువు రాజహంసరూపము ధరించి బ్రహ్మ కుపదేశించిన విజ్ఞానమంతయును హంసగీత యనుపేరటఁ బ్రసిద్ధి నొందియున్నది 35. బ్రహ్మ నారదునకుఁ జతుశ్శ్లోకములుగల భాగవతము నుపదేశించెను. దానినే తరువాత వ్యాసుఁడు మిగుల విస్తరముగా రచించెను 36. వసిష్ఠమహాముని యోగవాసిష్ఠమునందు శ్రీరామచంద్రమూర్తికి వసిష్ఠసారము నుపదేశించెను. మఱియు శ్రీకృష్ణభగవానుఁడు అర్జునునకు సప్తశ్లోకములుగల గీతను దెలిపెను 37. ఈ విధముగా నెంతదనుకఁ జెప్పుదును? మహర్షు లనేకులు జనసముదాయమునకు జ్ఞానోపదేశము గావించిరి. సారాంశమేమన, అద్వైతజ్ఞానము సత్యము 38. కావున ఆత్మజ్ఞానమును మిథ్యయని నుడివినచో అధోగతి లభించును. ప్రజ్ఞానరహితులగు నజ్ఞానుల కీయంశము తెలియఁబడదు 39. పరబ్రహ్మ స్వరూపస్థితిని వివరించుటలో ఆదిశేషునిప్రజ్ఞ మందగించెను. శ్రుతులుగూడ మౌనముదాల్చెను. జ్ఞానాభిమానమును బెట్టుకొని నేనేమి చెప్పఁగల్గుదును? 40. మనకుఁ జక్కఁగ బోధకానియంశమును మిథ్యయని యెన్నటికిని సాహసించి నుడువఁగూడదు. దానిని సద్గురుని సన్నిధికేగి దృఢభావముతో నభ్యసింప వలయును 41.

మిథ్యావిషయము సత్యముగాఁ గాన్పించును. సత్యవిషయము మిథ్యగా గోచరించును. ఇటులే మనస్సు ఆకస్మికముగా సందేహసాగరమునందు మునిఁగిపోవుచుండును 42. మనస్సునకుఁ గల్పనము చేయుచుండు అలవాటు గలదు. కాని మనస్సు కల్పనముచేయునది బ్రహ్మముకాదు. ఈ కారణమున "నేను"అను మార్గముననే సందేహము పరుగులిడును 43. అందువలన మొట్టమొదట "నేనేను" అను భావముతోఁగూడిన మార్గమును విడిచి పరమాత్మునిఁ గలసికొనవలెను. సాధుసాంగత్యమువలన సందేహములను సమూలముగాఁ దొలంగించుకొనవలెను 44. "నేను" అనునది శస్త్రముచే దెగదు. పగులఁగొట్టినచోఁ బగులదు. ఏమైనను జేయుము. విడచివేయదలంచినను అది విడిపోఁజాలదు 45. "నేను" అనుదానివలన వస్తువు బోధపడదు. భక్తి జారిపోవును. వైరాగ్యశక్తి

యంతయు వ్యర్థమైపోవును 46. "నేను" అనుదానివలనఁ బ్రపంచము కుదురదు. పరమార్థము మునిఁగిపోవును. యశము, కీర్తి, ప్రతాపము మున్నగునవన్నియు నశించును 47. దానివలన మైత్రి విడిపోవును. ప్రీతి క్షీణించును. అభిమానము వృద్ధియగును 48. నేననుభావము (అహంభావము) వలన వికల్పము తలయెత్తును. కలహ మంకురించును. ఏకత్వ ప్రేమ చెడిపోవును 49. ఈ యహంభావ మెవ్వనికిని రుచియింపదు. ఈ స్థితిలో నా పరమాత్మున కెటుల రుచించును? కావున అహంకారమును విడిచియుండువాఁడే సమాధాని 50. అహంభావము నెట్లువిడువవలయునో, బ్రహ్మానుభవము నెట్లు గావింపవలయునో, శాంతినెట్లు బడయవలెనో తెలిపెదను 51. వివేకమువలన అహంభావమును గుర్తించి వదలివేయవలెను. బ్రహ్మమై బ్రహ్మానుభవమును గడింపవలయును. నిస్సంగుఁడై సమాధానమును బడయవలెను 52. అహంభావమును విడిచి సాధనము జేయుట యెఱింగిన శాంతుఁడే ధన్యుఁడు 53. 'నేను బ్రహ్మమునైతిని. ఇఁక సాధనము చేయునదెవ్వఁడు' అను నీ విషయమును గల్పనముగావించుకొనుటచేఁ గల్పనము మఱింత వృద్ధియగును 54. బ్రహ్మమువిషయమునఁ గల్పనమున కవకాశము లేదు. అది యక్కడ నిలిచియుండును. దాని నెవ్వఁడన్వేషించి చూచునో వాఁడే సాధువు 55. నిర్వికల్పనమును గల్పన చేయవలయును. కాని తాను స్వయముగాఁ గల్పకుఁడు గాఁగూడదు (దేనిని గల్పనముజేయుచున్నారమో దానికంటె మనము వేఱు అనుకల్పన ముండరాదు) 56. కావున నేమియును గాకుండ నుండవలయును. ఇవి యన్నియును బ్రహ్మవిద్యనుగూర్చిన బంధనములు. దక్షుఁడును సమాధానియు నగువాఁడుమాత్రమే యీ యంశమును గ్రహింపగల్గును 57. "మనము దేనిని కల్పించుచున్నారమో అదియైయుంటిమి" అని తెలిసికొనినపిదప "కల్పనము" అనుపేరునుండి శూన్యులమైయుందుము 58. సాధకుఁడు తన పదవిలోఁ జలింపక స్థిరముగానుండి సాధనమును, ఉపాయమును సాధింపవలయును. అప్పుడే అలిప్తతామార్గము లభించును 59. రాజు తన రాచగద్దియమీఁదనే కూర్చుండియుండును. సమస్తప్రభుత్వము తనంత నదియే (అధికారకిరణములచే) నడచుచుండును. అటులే మానవుఁడు సాధ్యుఁడై యుండియును సాధనము గావింపవలయును 60. అప్పుడు

సాధనము దేహమధ్యమునకు వచ్చును. స్వయముగా మనము ఎప్పటికిని దేహముకాము. ఈ ప్రకారముగాఁ జేసితిమేని కర్తలమయ్యును సులభముగా అకర్తలము గావచ్చును 61. "మేము దేహులము" అను కల్పనము గావింపఁగల్గినప్పుడే సాధనము తొలంగఁగల్గును (దేహాభిమానము లేనిది సాధనత్యాగము సాధ్యము గాదు). కావున సాధనత్యాగముచే దేహాభిమానదోష మంటును. మనము స్వభావముగనే దేహాతీతులమైనప్పుడు దేహ మెక్కడినుండివచ్చినది? 62. దానిని దేహమనియును జెప్పఁజాలము; సాధనమనియును జెప్పఁజాలము. మనము స్వయముగా నిస్సందేహులము. దేహముండినను నిదియే విదేహస్థితి 63. సాధనముచేయకయే బ్రహ్మమునైతినని తలంచినచో నంతమాత్రమున దేహమమత్వము తొలంగిపోదు. బ్రహ్మజ్ఞానగ్రాహ్యాలోకమువలన (తప్పుభావమువలన-పొరపాటున) అలసత్వము వృద్ధినొందును 64. పరమార్థలోపమువలన స్వార్థము వృద్ధిగాంచును. ధ్యానమను మిషతో నిద్రాదేవి వచ్చి యావరించుకొనును. ముక్తిలోపమువలన స్వచ్ఛందతాపాపము లభించును 65. నిరూపణలోపమువలన నిందగల్గును. సంవాదలోపములచే వివాదములు పెచ్చరిల్లును. ఉపాధిమిషచే శరీరమునందు అభిమానము ప్రవేశించును 66. అటులే బ్రహ్మలోకమువలన అలసత పట్టువడును. ఆ సమయమున మానవుఁడు సాధనోన్మాదమునఁ బడి "యేమి చేయవలయును?" అనినుడువును 67.

శ్లో॥ కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిం।
ఆత్మనా పూరితం సర్వం మహాకల్పాంబునా యథా ॥

అవివేకి అలసత్వకారణమున బ్రహ్మముయొక్క పూర్ణస్థితిని దనపై నిడుకొని స్వయముగాఁ దనచేతులతోడనే తనపాదములమీఁదఁ గొడ్డలిదెబ్బను గొట్టుకొనుచున్నాఁడు 68. ఇటులే ఉపాయమునకు బదులుగా అపాయమును గలుగజేసికొని కూర్చున్నాఁడు. సత్యమగు హితము నుండి వంచితుఁడగుచున్నాఁడు. మఱియు ముక్తత్వమిషతో నింకను బద్ధుఁడై పోవుచున్నాఁడు 69. ఇట్టి యవివేకులు సాధనము చేసినంతన మా సిద్ధత్వమంతయుఁ గూలిపోవునని తలంతురు. ఈకారణమున సాధనముచేయుటయన్న వారికి రుచింపదు 70. మమ్ములనుగూడ జనులు సాధకులని యెక్కడ అనిపోదు

రో యను బిడియమొక్కటియే వారిని బాధించుచుండును. పాపము బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలుగూడ సాధనము జేయుచుండిరను సంగతి వారికిఁ దెలియనే తెలియదుగదా! 71.

ఇఁక నీ యవిద్యావిషయిక వార్తలను గట్టిపెట్టుదము. విద్య అభ్యాససారిణి యైయున్నది (ఎంత యభ్యసించిన నంత ప్రాప్తించును). అభ్యాసమువలన ఆద్యమగు పూర్ణబ్రహ్మము లభించును 72. ఇది యంతయు నాలించి శ్రోత "ఏయభ్యాసము చేయవలయును? పరమార్థ సాధనము లెవ్వి?" యని యడిగెను 73. వక్త యిటులఁ జెప్పుచున్నాఁడు. ఓయీ! ప్రశ్నములకు సమాధానమును ముందుసమాసములో వివరించినాఁడను. అందే పరమార్థసాధనములనుగూడఁ జెప్పితిని 74.

## ఎనిమిదవ సమాసము — శ్రవణమహిమ.

పరమార్థమునకు ముఖ్యసమాధానకారణమగు సాధనము శ్రవణము 1. శ్రవణమువలన భక్తిలభించును. విరక్తిఉత్పన్నమగును. మఱియు విషయాసక్తి తెగిపోవును 2. శ్రవణమువలనఁ జిత్తశుద్ధి యగును. బుద్ధి దృఢమగును. అభిమానోపాధి తొలంగును 3. శ్రవణమువలన నిశ్చయము కలుగును. మమత్వము తెగిపోవును. అంతఃకరణమునందు సమాధానము జనించును 4. శ్రవణమువలన సందేహములు విడిపోవును. శంక లంతరించును. సద్గుణములు గలుగును 5. శ్రవణమువలన మనోనిగ్రహము సిద్ధించును. సమాధానము చేకూరును. దేహబుద్ధితోఁగూడిన బంధనములు తొలంగును 6. "నేను" అనుభావము దూరమగును. సందేహము దరికిరాదు. బహువిధ విఘ్నములు పటాపంచ లగును 7. కార్యసిద్ధి యగును. సమాధి యేర్పడును. మరియుఁ బూర్ణమగు పరమశాంతి లభించును 8. సాధుసమాగమము గావించి అధ్యాత్మశ్రవణ మొనరించుటచే వృత్తి దానియందు లీనమగును 9. శ్రవణమువలనఁ బ్రబోధము వృద్ధియగును. ప్రజ్ఞప్రబలమగును. విషయపాశములు తెగిపోవును 10. వివేకము వచ్చును. జ్ఞానము వృద్ధినొంది బలము సమకూరును. దానివలన సాధకునకు వస్తుజ్ఞానము కలుగును 11. దుస్సాంగత్యము విడిపోవును.

కామవాసనలు క్షీణించును. ధైర్యము ప్రకాశించును. నిశ్చయాత్మిక మగు సద్వస్తువు భాసమగును 12. శ్రవణమువలన సద్బుద్ధి కలుగును. వివేక మతిశయించును. మనస్సు భగవంతునియందు నాటుకొనును 13. మోహము నశించును. భవభయము నాశనమగును 14. ఉత్తమగతి గలుగును. శాంతి లభించును. నివృత్తియు అచలపదమునుఁ బ్రాప్త మగును 15. శ్రవణమునకు సమానమగు నుత్తమసాధన మెద్దియును లేదు. దానివలన నన్నియును సమకూరును. భవనది తరించుటకు శ్రవణము నౌకసుమా 16.

శ్రవణము భజనకుఁ బ్రారంభము. అన్నివిషయములు శ్రవణ ములును ఆరంభమగుటయుఁ బూర్ణమగుటయుఁ గలదు 17. ప్రవృత్తి మార్గముగాని నివృత్తిమార్గముగాని శ్రవణము లేకున్నఁ బ్రాప్తింపదు. ఈ సంగతిఁ బ్రత్యక్షముగా నందఱు నెఱింగినదే 18. "విననియెడల నెఱుక గలుగదు" అను నీయంశముగూడ నెల్లరకును జక్కఁగఁ దెలిసియే యున్నవి. కావున శ్రవణమె సాధకునకు ముఖ్యప్రయత్నము 19. ఎప్పు డును వినియుండని విషయము హృదయమునకు నిశ్చయముగా నెన్నఁటికిని బోధగాదు. కావున శ్రవణమునకు సమానమగు సాధన మింకొకటి యెక్కడను లేదు. దీనిని విడిచిపెట్టినయెడల నేపనియు జరుగఁజాలదు 20-21. సూర్యుఁ డదృశ్యుఁడుగా నున్నప్పు డంధకార మన్నిస్థలములందును వ్యాపించును. శ్రవణము లేనియెడల నిటులే యజ్ఞానము గలుగును 22. నవవిధభక్తి, చతుర్విధ ముక్తి, సహజస్థితి మున్నగువానియందు జ్ఞానము శ్రవణము లేకున్నచోఁ గలుగఁజాలదు 23. విధియుక్తమగు షట్కర్మా చరణము, పురశ్చరణము, ఉపాసనము చేయవలసిన విధము శ్రవణము లేకున్నచో ద్యోతకముగాదు 24. నానావిధములగు వ్రతములు, దాన ములు, తపస్సు, సాధనములు, యోగములు, తీర్థాటనము శ్రవణము లేకున్నచో నెఱుంగఁబడవు 25. అనేకవిధములుగా నున్న విద్యలు, పిండ జ్ఞానము, బహువిధ తత్త్వశోధనము, నానాకళలు, బ్రహ్మజ్ఞానము శ్రవ ణములేకున్న సమకూరనేరవు 26. అనంతములగు వనస్పతు లొక్క జల ముతోడనే వృద్ధియగుచున్నవి. సంపూర్ణ జీవసమూహము ఒక పృథివి ఒక సూర్యుఁడు ఒకవాయువుపై నాధారపడియున్నవి. సమస్త

జీవులకుఁ జుట్టుప్రక్కల నాకాశమొక్కటియే యావరించుకొని యున్నది. సంపూర్ణజీవాత్మ లోకపరబ్రహ్మమునందే నివసించుచున్నవి. అటులె ప్రాణిమాత్రులందఱకును శ్రవణము ముఖ్యసాధనము. అదియే సమస్త ప్రాణులకుఁ దరింపఁదగిన యవలంబనము 27—30. భూమండలమునఁగల మతములకును భాషలకును దేశములకును లెక్కయేలేదు. వానికన్నిఁటి కిని శ్రవణము విడిచినచో నింక రెండవసాధనమే లేదు 31. శ్రవణమువలన మానవున కుపరతి (నిలుకడ) గలుగును. జనులు బద్ధదశనుండి ముముక్షు లయ్యెదరు. మఱియు ముముక్షుదశనుండి సాధకులై మిగుల నియమ ముతో సాధనము జేయుదురు 32. శ్రవణమువలన బోధము (జ్ఞానము) ప్రాప్తమగును. చాలును. ఇఁకఁ గావలసినదేమున్నది? అట్టి సాధకులే సిద్ధులైపోవుదురు 33. శ్రవణమువలనఁ గలుగు తాత్కాలిక సుగుణము వినుఁడు. మహాదుష్టులు, చండాలురు (హింసకులు) సైతము పుణ్య శీలు రగుదురు 34. దుర్బుద్ధియు దురాత్ముఁడగువాఁడుగూడ శ్రవణ యోగమువలనఁ బుణ్యాత్ముఁడగును. శ్రవణమహిమ అగాధమైనది. దాని మహత్త్వము వర్ణింపఁజాలను 35. పుణ్యతీర్థముల వ్రతముల ఫలములు ముందుముందు లభించునని చెప్పుదురు. కాని శ్రవణస్థితి యట్టిది కాదు. దాని ఫలమంతయును దత్కాలముననే (అప్పుడే) లభించును 36. రోగ ములు, వ్యాధులు ఔషధములవలన నప్పటి కప్పుడే నశించును. అటులే శ్రవణమువలన నంతఃకరణముగూడ శీఘ్రముగాఁ బరిశుద్ధమగును 37. వినినవిషయము అర్థయుక్తముగా నెప్పుడు తెలియునో యప్పుడు మాన వునకుఁ దనంతన భాగ్యశ్రీ సమకూరును. మఱియు ముఖ్యపరమాత్మ స్వానుభవములోని కేతెంచును 38.

ఇది మననఫలము. శ్రవణసమయమున అర్థము గ్రహించుట యందు హృదయము లగ్నము కావలయును. తత్క్షణమే నిదిధ్యాస మేర్పడును. ఆ పిమ్మట పరమశాంతి లభించును 39. చెప్పెడిదానికంత కును అర్థముకూడఁ దెలియునపుడే సమాధానము లభించును. అప్పుడే సందేహములు తొలంగిపోవును 40. ఈ సందేహమే జన్మమునకు మూ లము. శ్రవణమువలన నిది సమూలముగ నష్టమైపోవును. తరువాత సుల భముగా సత్యసమాధానము (పరమశాంతి) లభించును 41. శ్రవణమనన

ములను గావింపనివానికి సమాధాన మెట్లు ప్రాప్తింపఁగలదు? వాని పాద ములకు ముక్తత్వాభిమాన శృంఖలములు గాఢముగఁ దగుల్కొని యుండును 42. ముముక్షు, సాధకుఁడు, సిద్ధుఁడు మున్నగువా రెవరైనను శ్రవణము గావింపవలయును. శ్రవణము గావింపరేని వారలందఱును అవ్యవస్థితు లగుదురు. ఏలయన, శ్రవణ మననములవలనఁ జిత్తవృత్తి శుద్ధమగును 43. నిత్యనియమముగా శ్రవణసాధనము జరుగని తావున నొక క్షణమాత్రమేని సాధకు లుండఁగూడదు 44. శ్రవణసాధనమును గావింపనివాఁడు పరమార్థము నెన్నఁటికినిఁ బడయఁజాలఁడు. శ్రవణసాధ నము లేనియెడల మానవుఁడు పూర్వజన్మమున జేసినసత్కర్మములన్నియు వ్యర్థమగును 45. కావున శ్రవణము జేయవలయును. ఈ సాధనమునందు హృదయముంచవలయును. మఱియు నిత్యనియమములను బాలనము జేయుచు సంసారసాగరమునుండి దాటిపోవలయును 46. మనము ఆఁకలి యగునప్పుడెల్ల ఒకేవిధమగు నన్నమును, ఒకేవిధమగు జలమును దేప తేపకుఁ గైకొనుచున్నారము. అటులే శ్రవణమును మననమునుకూడఁ దేపతేపకుఁ గావించుచుండవలయును 47. సోమరితనముచే శ్రవణమునెడ ననాదరము జూపుమానవుఁడు స్వహితమునకు హాని గావించుకొన్నవాఁ డగును 48. సోమరితనము నభివృద్ధిగావించుకొనుటయన్న పరమార్థమును భగ్నము గావించుటయని గ్రహింపనగును. ఈ హేతువువలన నిరంతరము శ్రవణము గావింపవలెను 49. రాఁబోవు సమాసమునందు శ్రవణమునకుఁగల నియమములను, శ్రవణయోగ్య గ్రంథములనుగూర్చి తెలుపుదును 50.



## తొమ్మిదవ సమాసము — శ్రవణనిశ్చయము.

శ్రవణము నేవిధముగాఁ జేయవలయునో వివరించెదను. శ్రోతలారా! సావధానమతితో నాలకింపుఁడు 1. ఒకానొకని వక్తృత్వము వినుటవలన నంతకుమున్ను కొంచెముగనో గొప్పగనో లభించిన శాంతి ఆకస్మికముగా భంగమగును. మఱియు నిశ్చయముగూడ విడిపోవును 2. ఇట్టి మాయి కము, నిశ్చయశూన్యము నగు వక్తృత్వమును అవశ్యముగాఁ ద్యజింపవల యును 3. ఒకగ్రంథము విన్నపిమ్మట కొంచెమెద్దిమో నిశ్చయము ప్రాప్తిం

చెను. తరువాత వినిన రెండవగ్రంథమువలన ఆనిశ్చయ మెగిరిపోయినది. ఇటులేజరుగుచున్నయెడల బ్రతికినంతకాలము సంశయము వృద్ధియగుచునే యుండును 4-5. కావున సంశయవిచ్ఛేదకములు, శంకానివృత్తికారకములు, అద్వైతబోధకములు, పరమార్థప్రదములు నగు గ్రంథమునే శ్రవణము గావింపవలయును 6. సంసారమునం దాసక్తినిఁ దొలగించుకొనినమాతఁడు మోక్షసాధనముల నొనరించునాతఁడు అద్వైతశాస్త్రమునందు వివేకము గడింపవలయును 7. అద్వైతప్రియుఁడగు శ్రోతకు ద్వైతనిరూపణమును వినిపించినయెడల వానిచిత్తము క్షుబ్ధమగును 8. అట్లుగాక మనోభావాను సారముగా నిరూపణము గావించినయెడల శ్రోత కత్యానందము గలుగును. అన్యమార్గము లవలంబించినయెడల శ్రోత హృదయము ముకుళించి పోవును 9. ఎవ్వని కెవ్వని కెయ్యది యుపాసనమొ తొలుత నెఱింగి తదనుకూలముగా నిరూపణము గావించినయెడల వానికిఁ బ్రీతికలుగును. దీనికిఁ బ్రతికూలములుగానుండు అన్యనిరూపణములు శ్రోతకుఁ బ్రశస్తములుగాఁ దోఁచవు 10. నీరు పల్లమునకుఁ దనంతనపోవునట్లు ప్రీతిగూడ హృదయము నుండి యనాయాసముగాఁ దనకుఁ బ్రియకరములగు విషయములవైపునకు నడచిపోవును. ఇది ప్రీతిలక్షణము 11. సారాసార విచారముగల గ్రంథములే ఆత్మజ్ఞానముగల పురుషునకు రుచికరములగును. ఇతరవిషయములు గల గ్రంథములు వానికి రుచింపవు 12. భగవతియగు పార్వతిని కుల దేవతగాఁ గొలుచువానికి సప్తశతి (దుర్గాస్తోత్రగ్రంథమె) కావలయును. అన్య దేవతా స్తుతి గ్రంథము లతనికి సర్వవిధముల నిరుపయోగములుగా నుండును 13. అనంతవ్రతముజేయువానికి (సకామపురుషునకు) భగవద్గీత (నిష్కామగ్రంథము)తోఁ బనియుండదు. అటులే సాధువులకు సన్యాసులకు ఫలాశానిరూపణగ్రంథములు రుచింపవు 14. వీరకంకణమును ముక్కునకుఁ దగిలించుకొన్నయెడల నెంత శోభాకరముగానుండును! ఏది యెచ్చట ధరించుటకొఱకుఁ దొలుత నుద్దేశించి చేయఁబడెనో దాని నచ్చటనే ధరింపవలయును. అన్యస్థానములయందవి పూర్తిగా నిరుపయోగములు 15. ఏ తీర్థమాహాత్మ్య మాతీర్థమునందే వినిపించినయెడల మహత్వముండును. అన్యస్థలములయం దాగ్రంథమును పఠించినచో నేమియు ఫలముండదు 16. దృష్టాంతమును వినుండు. కాశీక్షేత్రమహిమను ద్వారకలోను, ద్వారకా

క్షేత్రమహిమ కాశీక్షేత్రమునందును, కాశీక్షేత్రమహిమ వేంకటేశ్వర క్షేత్రమునందును నుడివినచో నది యుక్తముగా నుండదు 17. ఏక్షేత్రమునం దాక్షేత్రమాహాత్మ్యము బాగుండును. ఇట్టి దృష్టాంతము లనేకము లీయవచ్చును. జ్ఞానులకు అద్వైతగ్రంథములే గావలయును 18. యోగుల ముందు భూతసంచారవార్తలు, రత్నపరీక్షకుని ముందు కొండఱాళ్ళ ముచ్చటలు, పండితులముందు మూర్ఖాలాపములు రుచింపవు 19. వేద శాస్త్రజ్ఞునిముందు మంత్రతంత్రములు, నిస్పృహుని (సన్యాసి) ముందు ఫలశ్రుతి, జ్ఞానిముందు కోకోక్తశాస్త్రము ఏమి శోభింపఁగలవు ? 20. బ్రహ్మచారియందు నాట్యము, అధ్యాత్మ నిరూపణమునందు రాసక్రీడ, రాజహంసముయెదుట జలము పెట్టిన నిరుపయోగములగును. అటులే ఆత్మజ్ఞానియెదుట శృంగారగ్రంథము లుంచినయెడల నాతనికి సమాధానము గలుగఁజాలదు 21—22. రాజు బీదవాని స్థితిగతుల నాశించుటయు, అమృతము చప్పగానుండుటయు సన్న్యాసి ఉచ్ఛిష్ట చండాలి వ్రతము గావించుట నెన్నఁటికిఁ బొసఁగదు 23. కర్మనిష్ఠునకు వశీకరణ మంత్రములు భూతవైద్యునకుఁ బురాణకథానిరూపణము వినిపించినచో వారల యంతఃకరణములు తప్పక భంగమునొందును 24. ఇటులే పరమార్థియగు పురుషునిముందు ఆత్మజ్ఞానము లేనిగ్రంథములు వినిపించుట వలనఁగూడ సమాధానము గలుగదు 25. ఇఁక నీ విషయము చాలింతము. స్వహితము నపేక్షించు ప్రతిమానవుఁడును నిరంతరము అద్వైతగ్రంథ విచారము చేయుచుండవలయును 26. ఆత్మజ్ఞాని స్థిరచిత్తముతో అద్వైతగ్రంథవిచార మెల్లపుడొనరింపవలెను. మఱియు నేకాంతస్థలము నందు శుద్ధమగు సమాధానము బ్రాపింపవలెను 27. అన్నివిధముల నాలోచించి చూచినచో "అద్వైతగ్రంథములతో సమానమగు గ్రంథము లెవ్వియును లేవు" అని నిశ్చయమగును. పరమార్థియగు పురుషునకు అద్వైతగ్రంథములు భవసాగరమును దరించుటకు నౌక వంటివి 28. ఇతరప్రాపంచిక సంబంధములగు హాస్యవినోద గ్రంథములు, నవరసయుక్తమగు కావ్యములు మున్నగునవి పరమార్థయుక్తుఁడగు పురుషున కెన్నఁటికిని హితకరములు గావు 29. పరమార్థమును వృద్ధిజేయునవియు, విషయములపట్లఁ బశ్చాత్తాపము గలిగించునవియు, భక్తి

యందును సాధనములయందును ఆసక్తి కలుగఁజేయునవియు సత్యమగు నుత్తమగ్రంథములు 30. ఆలకించినంతన గర్వమును దొలంగింపునదియు, భ్రాంతిని నశింపఁజేయునదియు, మనస్సును భగవంతునియందు లగ్నము గావించునదియు సత్యమగు నుత్తమగ్రంథము 31. మనస్సునకు నిలుకడ గలుగఁజేయునదియు, అవగుణములను దూరము గావించునదియు, అధో గతిని దొలంగించునదియు నుత్తమగ్రంథమని చెప్పఁబడును 32. వినినంతన హృదయమునకు ధైర్యముగూర్చునదియు, పరోపకారమును బోధించు నదియు, విషయవాసనల నష్టము గావించునదియు, జ్ఞానమును మోక్ష మును పవిత్రతను సమకూర్చునదియు నుత్తమగ్రంథ మనఁబడును. నానావిధములగు వ్రతాదివిధానములు వానిఫలశ్రుతులు దెలుపుగ్రంథము లనేకము లుండవచ్చును. కాని దేనివలన విరక్తియు భక్తియు గలుగదో యది గ్రంథమేగాదు 33-35. ఫలశ్రుతియందు మోక్షప్రాప్తి చెప్పఁబడని పుస్తకము దురాశాగ్రంథము. దానిని వినుటవలనను జదువుటవలనను దురాశ మిగుల వృద్ధినొందును. వాస్తవమున కట్టి పుస్తకమును పుస్తక మనిగూడఁ జెప్పరాదు 36. ఇట్టి గ్రంథములు చదువుటవలనను వినుట వలనను మోహ ముప్పతిల్లును. వివేకము దూరముగాఁ బలాయనమగును. దురాశాభూతము లావేశించును. చివర కధోగతి సిద్ధించును 37. కామ్య గ్రంథములను విని ఫలశ్రుతిని మనస్సునం దుంచుకొని ముందుజన్మమున నీఫలములను బడయఁగల్గుదునని తలంచువానికి జన్మరూపమగు అధోగతి తప్పక ప్రాప్తించును 38. అనేక పక్షిజాతముల్లు ఫలములను దిని తృప్తి నొందుచున్నవి. కాని చకోరములు తమ హృదయములందుఁ జంద్ర కిరణములనుండి స్రవించు నమృతమునే గోరుచున్నవి 39. అటులే అన్యపక్షిజాతములు ఫలములఁగోరునట్లు సంసారులగు మానవులు సంసార మునే గోరుచున్నారు. కాని భగవదంశగలవారలు చకోరము లమృత మును గోరునటుల భగవంతునే గోరుదురు 40.

జ్ఞానికి జ్ఞానము, భజనపరునకు భజనము, సాధకునకు ఇచ్ఛాను సారమగు సాధనము గావలయును 41. పరమార్థియగువానికిఁ బర మార్థము, స్వార్థతత్పరునకు స్వార్థము, కృపణునకు ధనము, యోగులకు యోగము, భోగపురుషులకు భోగము, రోగులకు రోగనివారణము

జేయు నౌషధము, కవులకుఁ గావ్యప్రబంధములు, తార్కికులకు దర్క వాదము, భావికులకు సంవాదము, పండితులకుఁ బాండిత్యము, విద్వాంసులకు అధ్యయనము, కళావిదులకు నానావిధములగు కళలు రుచించును 42—45. హరిదాసులకు హరికీర్తనము, శుచిపరునకు స్నాన సంధ్యాద్యనుష్ఠానములు, కర్మనిష్ఠునకు విధివిధానములు ప్రియము గలుగఁ జేయును 46. ప్రేమమూర్తికిఁ గరుణము, విచక్షణునకు దక్షత్వము, చతురమనుష్యునకుఁ జాతుర్యము నుత్సాహకరములు 47. భక్తుఁడు ధ్యానమున కుత్సాహపడును. సంగీతవిదుఁడు తాల, తాన, మాన, మూర్ఛనలను బరిశీలించును 48. యోగాభ్యాసి పిండజ్ఞానమును, తత్త్వజ్ఞుఁడు తత్త్వజ్ఞానమును, నాటికాపరిచితుఁడు మాత్రాజ్ఞానమును జూచు చుండును 49. కాముకుఁడు కొక్కోకశాస్త్రమును చేటకీచేటక మంత్రములను, యాంత్రికుఁడు నానావిధయంత్రములను, విదూషకుఁడు వినోద భాషణమును, ఉన్మత్తుఁడు నానావిధచేష్టలను, తామసుఁడు గర్వాంధత్వమును నాదరపూర్వకముగాఁ జూచును 50-51. మూర్ఖుఁడు అంతరంగశుద్ధి లేని పైపై మాటలను బ్రేమించును. నిందకుఁడు దోషమునకుఁ బొంచి యుండును. పాపాత్ముఁడు పాపబుద్ధిని బట్టుకొని యుండును 52. ఒకనికి రసవంతమగు భక్తి రుచించును. ఒకనికి వ్యర్థవిస్తరమగు భక్తినచ్చును. ఒకనికిఁ గేవల మాయికమగు భక్తియే హితమగును 53. ఆగమశాస్త్రజ్ఞుఁడు ఆగమమును, శూరుఁడు సంగరమును, ధార్మికుఁడు నానావిధ ధర్మములను, ముక్తపురుషుఁడు మోక్షానందమును, సర్వజ్ఞుఁడు సమస్త కళలను బ్రేమించును. జ్యోతిష్కుఁడు పింగళ (పక్షివిశేషము) నుజూచి భవిష్యద్వర్ణనము గావించును 54—55. ఈ విధముగా నెంతదనుక లెక్కించి చెప్పుదును. జనులు తమ తమ చిత్తవృత్తుల కనుకూలములగు ననేక గ్రంథములను నిరంతరము జదువుచుందురు. వినుచుందురు 56. దేనివలనఁ బరలోకము లభింపదో దానిని శ్రవణమని చెప్పఁగూడదు. (ఆత్మజ్ఞానప్రదము గానిదానిని మనస్సంతోషకరమనియే చెప్పవల యును) 57. మిఠాయికంటె మధురవస్తువు లేదు. ముఖమునకు ముక్కు లేకున్నచోఁ జక్కదనమే లేదు. జ్ఞానములేకున్న నిరూపణమునకే తావు లేదు 58. ఇఁక నీ విషయము నింతతో ముగింతము. ఇప్పటికి గ్రంథ

వి స్తరమైనది. పరమార్థములు వినవలయును. పరమార్థగ్రంథములుదక్క మిగిలినవన్నియు వ్యర్థగాథలు 59. నిత్యానిత్యవిచారము, సారాసార వివేకము చెప్పఁబడిన గ్రంథములు వినుటవలననే మోక్షము లభించును 60.

---

## పదియవ సమాసము – జీవన్ముక్తుని దేహాంతరము.

మాయవలన సత్యము మిథ్యగా గోచరించును. మిథ్య సత్యము వలెఁ దోఁచును. దానిలీల యిట్టిది 1. సత్యమును నిశ్చయముగావించుట కనేక గ్రంథనిరూపణములు గావింపఁబడెను. ఎంతపనిచేసినను అసత్య ప్రాబల్యముమాత్ర మంతరింపకున్నది 2. అసత్యము మానవహృదయము నందుఁ బాగుగాఁ బాదుకొన్నది. దాని నెవరుపదేశింపక పోయినను మానవహృదయమునందది దృఢముగాఁ దనంతన నాటుకొనియున్నది. అందువలన సత్యమెద్దియో దాని జాడపాడ లెట్టులుండునో మనుజునకుఁ దెలియకున్నది 3. వేదములు, శాస్త్రములు, పురాణములు సత్యమును గూర్చిన నిశ్చయమును దెలుపుచున్నవి. ఐనను సత్యస్వరూపము మనస్సునకు గోచరింపకయున్నది 4. చూడుఁడు: ప్రత్యక్షముగాఁ గనులయెదుటఁ జూచుచుండఁగనే శాశ్వతముగానున్న సత్యము మరుగుపడుచున్నది. మఱియు నశ్వరమగు మిథ్య సత్యమగుచున్నది 5. ఈ మాయాలీల యంతయు సాధుసమాగమ మొనరించి ఆత్మనిరూపణము గావించినపిమ్మట తత్క్షణమె తెలియవచ్చును 6.

"నేను" అనుదాని జాడను గనుగొన్న పిమ్మట బరమార్థమును గురుతించుట తెలియఁగలదని వెనుకఁజెప్పియుంటిని 7. పరమార్థజ్ఞానము వలన సమాధానము లభించును. చిత్తము చైతన్యమునందు లీనమగును. పిమ్మట ఆ ముఖ్యవస్తువు (పరబ్రహ్మము) నేనేయని విశదమగును 8. ఇంత దనుకఁ దెలిసినపిమ్మట జ్ఞానియగువాఁడు ప్రారబ్ధాధీనుఁడై దేహమును విడిచివేయును. సద్బోధమువలన నాతని సందియములన్నియు విడిపోవును. అంతియగాక "ఈ కళేబరము మిథ్య. ఇప్పుడే నశింపనిమ్ము లేక యుండిన నుండనిమ్ము" అని నిశ్చయించుకొనును 9. దేహముయొక్క మిథ్యాత్వము తెలిసికొనుటచే సాధువులదేహములు పవిత్రములగుచున్నవి. అట్టి

పవిత్రదేహముల కెచట నంతముగలిగినను సరియే. అదియే పుణ్యభూమి యగును 10. సాధువుల సంయోగముచేఁ దీర్థములుకూడఁ బవిత్రము లగుచున్నవి. సాధుసంసర్గముననే పుణ్యక్షేత్రముల మహిమ యినుమడించును. సాధువులు వసింపనితీర్థములను బుణ్యతీర్థములనఁదగదు 11. ఏదేని యొకానొక పుణ్యనదీతీరమున శరీరము దొరగుట మంచిదను విచారము అజ్ఞానులకొఱకేర్పడినది. సాధువులు మేనుదొరంగుటకుఁ బుణ్యనదీతీర్థము లతోఁ బనిలేదు. ఏలయన, వారలు నిత్యముక్తులు 12. ఉత్తరాయణము నందు మరణించుట పుణ్యమనియు దక్షిణాయనమున మరణించుట యధమమనియు జనులు సంశయాకులులై పలుకుచుందురు. కాని సాధువు లట్టిసందేహములకు లోనుగారు 13. శుక్లపక్షములో ఉత్తరాయణము నందు ఇంటిలో దీపమున్నప్పుడు పగటివేళ అంత్యమున భగవన్నామ స్మరణమొనరించుచు మరణించినయెడల గృహస్థునకు మోక్షము లభించును* 14. కాని యోగికిట్టి నియమములతోఁ బనిలేదు. ఏలయన, యోగి జీవించియుండఁగనే పాపపుణ్యములకుఁ దిలాంజలియొసంగి జీవన్ముక్తుఁ డయ్యెనుగదా 15.

మంచిదశలో మరణించినవానిని సుఖముగా మరణించినవానినిజూచి అజ్ఞానులగు మానవులు "ఈతఁడు భగవంతునిసన్నిధికిఁ జేరఁగలఁడు" అని నుడువుచుందురు 16. కాని వీరల యభిప్రాయము మిగుల విపరీతమైనది. "అంత్యమున భగవానుఁడు లభించు"ననుకల్పనము వ్యర్థముగాఁగల్పించుకొని వీరలు స్వయముగాఁ దమకుఁదామే హాని కలుగఁజేసికొనుచున్నారు 17. జీవితమునందెన్నఁడును బరమాత్మని భజనము జేయక వ్యర్థముగ నాయువు కోల్పోయినవాండ్రకు అంత్యమున భగవత్సన్నిధి యెట్లు లభించును? ధాన్యపుగింజను నాటకపోయినచో నెటులంకురించును? 18. జన్మాంతముదనుక నీశ్వరభజనము గావించినవానికే ముక్తి లభించును. వ్యాపారమును జేసిననేగదా లాభము గలుగును? 19. "ఈయని వానికి

---

* శ్లో॥ అంత్యకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥
అగ్నిర్జ్యోతిరహం శుక్లః షణ్మాసా ఉత్తరాయణం।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥

దొరుకదు. నాటినగాని మొలువదు" అను సామెత లోకులందఱు నెఱింగి యేయున్నారు 20. స్వామిద్రోహియగు మనుజుఁడు నెలదినములును బని పాటలు చేయక మాసాంతమున జీతమునిమ్మని యడుగుట యెట్లుండునో బ్రతికియున్నంతదనుక నీశ్వరుని భజింపకయే అంత్యకాలమునందు మోక్ష మునుగోరుట యట్లుండును 21. బ్రతికియున్నప్పుడు భగవంతుని భక్తి శ్రద్ధలతో భజింపనిమానవునకు మరణించినపిమ్మట మోక్ష మెటుల లభిం పఁగలదు ? ఇంతయేల, ఎవఁడెటులఁ బ్రవర్తించునో వానికట్లు ఫలము సిద్ధించును 22. కావున జన్మమున్నంతవఱకు భగవంతుని భజింపవల యును. లేకున్నచో నంత్యమున ముక్తి లభింపఁజాలదు. ఎంతమంచిదశలో మరణించిననేమి? భక్తిలేకున్నచో వానికిఁ దప్పక యధోగతి ప్రాప్తిం చును 23. అందువలననే సాధుజనులు ధన్యులని చెప్పుదురు. వారలు జీవించియుండఁగనే తమ జీవితమును సార్థక మొనరించుకొందురు 24. ఇట్టి జీవన్ముక్తులగు జ్ఞానులకు శరీరపాతము అరణ్యములోనైనను లేక శ్మశానములోనైనను నొకటియే. వారలు సర్వ కాలములందును ధన్యులు 25. సాధుపురుషుని దేహ మొకవేళ సంస్కారరహితముగాఁ బడియున్నను దానిని శునకాదులు తినివేసినను ప్రజలకు మందబుద్ధి కారణమున నది బాగుగా నున్నట్లు తోఁచదు 26. ఆ జనులు తఱచుగా "ఈ దేహమున కంత్యక్రియలు బాగుగాజరుగలేదు" అను మాటనే తలంచుకొని మిక్కిలి దుఃఖపడుదురు. కాని పాపము! వారలు దుఃఖపడక యేమిచేయుదురు? మర్మము నెరుంగరుగదా 27. ఎవఁడు వాస్తవమునకు జన్మింపలేదో వానికి మరణమెక్కడినుండివచ్చును? ఆతఁడు వివేకబలము వలన స్వయముగా జననమరణములను నులిమివైచెను 28. స్వరూపాను సంధానకారణమున వానిని మాయ యంటుకొనఁజాలదు. బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులుగూడ వానిగతి నెఱుంగఁజాలరు 29. ఆతఁడు జీవించి యుండి మరణించియున్నాఁడు. అంతియగాదు మత్యువునుకూడఁ జంపి జీవించుచున్నాఁడు. వివేకబలమువలన నాతనికిఁ బూర్వజన్మ మృత్యులను గూర్చి జ్ఞాపకమేలేదు 30. బయటికాతఁడు ఒకమానవునివలెఁ గనిపించు చున్నను నిశ్చయమునకు మానవత్వమున కతీతుఁడుగనున్నాఁడు. జనులతో నాతఁడు గలసిమెలసియున్నటుల భాసించునుగాని వాస్తవమునకు అలిప్తుఁ

డుగనే యున్నాఁడు. వేయేల, ఆ పరిశుద్ధపదార్థమునందు దృశ్యపదార్థముల స్పర్శయేలేదు 31. ఇట్టి సాధుజనులను సేవించుటవలన మానవులు ముక్తు లగుచున్నారు 32.

సద్గురు కృపాపాత్రుఁడగు సాధకుఁడు ఒకసారి గావించిన వివేచనము మఱలమఱలఁ బలుమాఱు చేయవలెను. అట్లు చేయుటవలన అధ్యాత్మ నిరూపణమునందు బుద్ధి గాఢముగాఁ బ్రవిష్టమగును 33. ఇఁక నంత్య మున సాధకుల కొకమాటఁ జెప్పవలసియున్నది. ఏమన, శుద్ధమగు నద్వైత నిరూపణమువలన మీకుఁగూడ సాధుపురుషులకుఁ గల్గిన సమాధానమే కల్గును 34. సాధుపురుషుల శరణములోని కరుగువాఁడు సాధుపురుషుఁ డగును. మఱియు నాతఁడు తన కృపారసముచే మానవసముదాయమును కూడఁ దరింపఁజేయును 35. సాధుజనులమహిమ మిగుల విచిత్రతరమైనది. సాధు సాంగత్యమువలన జ్ఞానప్రాప్తియగును. సత్సంగముతో సమానమగు రెండవసాధన మెద్దియునులేదు 36. గురుసేవవలనను అధ్యాత్మ నిరూపణ మును మననముజేయుటవలనను మానవుని యాచరణము తప్పక పరిశుద్ధ మగును. మఱియు నంత్యమునఁ దప్పక మోక్షము లభించును 37.

సద్గురుని సేవయే పరమార్థమునకు జన్మస్థానము. సద్గురు సేవవలన తనంతటనే సమాధానము లభించును 38. ఈ శరీరము ఏదినముననో నాశన మొందితీరును. కావున నంతదనుక జన్మమును సఫలము గావింపవలయును. భజనభావముతో సద్గురుని చిత్తమును దనయెడఁ బ్రసన్నముగావించుకొన వలయును 39. తల్లి నానాప్రయత్నముల నొనరించి తన కుమారునిఁ బోషించునటుల సద్గురుఁడుకూడ శరణాగతులగూర్చి చింతనము జేయు చుండును. ఇట్టి దాత సద్గురుఁ డొక్కరుఁడే 40. కావున సద్గురుసేవ లభించినవాఁడే పరమధన్యుఁడు. సద్గురుసేవను విడిచినచోఁ బరమశాంతిని బొందుటకిఁక నన్యమగు నుపాయమెద్దియును లేదు 41-42. ఈవిషయము నందు విశ్వాసము లేనివారలు గురుగీతలు చదువనగును 43. దానిలో మహాదేవుఁడు పార్వతీదేవికి సద్గురునిమహిమనుఁ జక్కఁగా వర్ణించి చెప్పి యున్నాఁడు. కావున సద్గురుచరణసేవను ముముక్షువులు సద్భావముతోఁ జేయవలయును 44. ఈ గ్రంథమునందుఁ జెప్పఁబడిన వివేకమును మననము జేయువానికి సత్యజ్ఞానమునుకూర్చి నిశ్చయభావ మేర్పడును 45. అద్వైత

నిరూపణము గావింపఁబడిన గ్రంథమును బ్రాకృతమని (సంస్కృతగ్రంథము గాదు. దేశభాషాగ్రంథమని) యుపేక్షింపఁదగదు. అర్థదృష్టితో నాగ్రంథ మును సత్యమగు వేదాంతగ్రంథమనియే గ్రహింపవలయును 46. ప్రాకృత భాషవలన వేదాంతము విశదమగును. సంపూర్ణశాస్త్రములలోని విషయ ములు ప్రాకృతగ్రంథములలో దేశభాషలలో లభింపఁగలవు. వానిని జదువుటవలన హృదయము పరమశాంతము నొందును 47. జ్ఞానో పాయము చెప్పఁబడిన గ్రంథమును బ్రాకృతభాషాగ్రంథమని నిరసింప రాదు. కాని మూర్ఖుల కీయంశము తెలియదు. అల్పబుద్ధిని కోఁతి ఏమి గ్రహింపఁగలదు? 48.

ఎవని కెంతయధికారముగలదో అంతవఱకే వాఁడు గ్రంథము లందలిసారము గ్రహించును. ముత్తెములు నత్తగుల్లలు నిర్మించిన చిప్పలలో నున్నవి. అంతమాత్రమున ముత్తెముల నెవ్వఁడేని క్షుద్రవస్తువని నుడువఁగలఁడా? నుడువలేడు (అటులే ప్రాకృతభాషయందు నుడువఁబడిన వేదాంతవిషయములనుగూడ నెవరేనిక్షుద్రములుగా భావింపఁగూడదు)49. దేనినిగూర్చి శ్రుతులు "నేతినేతి" అని నుడువుచున్నవో యట్టి విషయము నందు భాషామహత్త్వమేమియునుఁ దోడ్పడఁజాలదు, పరబ్రహ్మము వాస్తవమునకు ఆద్యంతరహితమును అనిర్వాచ్యమునై యున్నది 50.

### ఏడవదశకము సమాప్తము.



# ఏనిమిదవదశకము.

## మొదటి సమాసము — పరమాత్మ నిశ్చయము.

శ్రోతలారా! ఇక సావధానమనస్కులరై శుద్ధజ్ఞాననిరూపణమును గూర్చి చెప్పఁబోవునది వినుండు 1. నానావిధశాస్త్రములను బరిశోధించి భావము గ్రహింపవలయు ననుకొందుమేని జీవితకాలము చాలదు. ఒక వేళ వానినన్నింటిని జూడఁగలిగినయెడల అంతఃకరణమునందు సంశయవ్యథ వృద్ధియగుచునే యుండును 2. ప్రపంచములోఁ బుణ్యదాయకములగు తీర్థస్థానము లనేకములు గలవు. వానిలోఁ గొన్ని సుగమములు, కొన్ని దుర్గమములు, కొన్ని దుష్కరములుగా నున్నవి 3. ఈ తీర్థస్థానముల నన్నింటినెవఁడు తిరిగి సేవింపఁగలఁడు? ఒకవేళ వీనినన్నింటిని సేవింపవలయు ననుకొన్నచో ఆయుష్కాలముకూడఁ జాలదు 4. బహువిధములగు జపము, తపము, దానము, యోగము మున్నగు సాధనములన్నియుఁ గేవలము ఆ పరమాత్మునికొఱకే మానవులు గావించుచున్నారు 5. దేవాధిదేవుఁడగు పరమాత్ముని బొందుటకు సమస్త యత్నములు గావింప వలయు ననునంశము సర్వజనసమ్మతము 6. పరమాత్మను బొందుటకే నానావిధమార్గములు బహువిధమతములు బయలుదేరెను. కాని యా భగవానుని స్వరూప మెట్లుండును? 7. ఈకాలమునఁ బ్రపంచమునం దెందఱో దేవతలున్నట్లు భావించుచున్నారు. ఆ దేవతల నెవ్వరును లెక్కింపఁజాలరు. ఏ దేవతను గూర్చియు సరియగు నిశ్చయము లేదు 8. దేవతల ననుసరించి యుపాసనములలోఁగూడ ననేకవిధములగు భేదము లేర్పడినవి. ఒకానొకనికిఁ గోరికయొకసారి యేదేని దేవతసహాయమున నెరవేరినచో నాతఁ డదిమొదలుకొని యాదేవతనే యాశ్రయించును 9. దేవత లనేకములుగా నున్నట్లు భక్తులునై తము అనేకులుగా నున్నారు. వారలు తమతమ యిచ్ఛానుసారముగా నాయాదేవతలయెడ నాసక్తులై యున్నారు. ఈ విధముగనే ఋషులుకూడఁ బెక్కుమంది గలరు. వారల మతములు అసంఖ్యాకములుగా భిన్నభిన్నములుగా నున్నవి 10. కావున నీ బహుత్వమునం దొకదానియందును నిశ్చయము గలుగకున్నది. అన్ని

శాస్త్రములును బరస్పరము భిన్నాభిప్రాయములతోఁ గలహాము గావించు చున్నవి. కావున సరియగు నిర్ణయము గావింపకున్నవి 11. శాస్త్రము లనేకములు. వానిలో మఱల ననేక భేదములు గలవు. ఇక మతమతాంత రుల విరోధమన్ననో దాని నడుగవలసిన పనియేలేదు. ఈ విధముగానున్న మతభేదములను బట్టుకొని వాదప్రతివాదములను గావించుచు నెందఱం దఱు దాటిపోయిరో యెవరెఱుంగుదురు? 12.

వేయిమందిలో నెవఁడో యొక మానవుఁడుమాత్రమే పరమార్థ మునుకూర్చి విచారము గావించును. కాని వానికిఁగూడ నాస్వరూపపు జాడపోడలు గనుపించుటలేదు 13. అచ్చట నహంకర్తృత్వ మంటియుండె నుగదా! "జాడ గాన్పించుట లేదు" అని యెటుల నుడువుచున్నాఁడవు? (జాడ తెలియుట యెట్లు?) ఈ యహంకృత్వమువలననే పరమాత్మని దర్శ నము కలుగకున్నది 14. ఇక నీయంశము విడిచిపెట్టి ఏపరమాత్మ కొఱకు జనులు నానాప్రకారములగు సాధనములు జేయుచున్నారో, అది యేవిధముగా లభించునో, మఱియుఁ బరమాత్మయని దేనినందురో, దాని నెటులఁ దెలిసికొనఁగలమో యా విషయములనుకూర్చి ముందుఁ దెలుపుదును 15-16.

ఈ సంపూర్ణ చరాచర సృష్టినిగావించి దానికిఁ గదలికను కూర్చిన వానిని అవినాశియనియు, సర్వకర్తయనియుఁ, బరమేశ్వరుఁ డనియుః జెప్పు దురు 17. మేఘమాల నాతఁడే యేర్పఱచెను. చంద్రబింబమునందు అమృతకళ నాతఁడే ప్రసాదించెను. రవిమండలమునకుఁ బ్రకాశము నాతఁడె సమకూర్చెను 18. ఆతని కట్టుబాటువలననే సాగర మొక్కచోట నిలిచియున్నది. భూభరణమునకు నతఁడే శేషుని నియోగించియున్నాఁడు. ఈ సంపూర్ణ తారాగణ మాతని మాహాత్మ్యమువలననే ఆకాశమునందు నెలకొని యున్నది 19. జరాయుజములు, ఉద్భిజ్జములు, అండజములు, స్వేదజములు అను చతుర్విధ జీవసమూహాము, పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరియను నాలుగువిధములగు వాక్కులు ఎనుబదినాలుగులక్షల జీవ యోనులు మూఁడులోకములు నెవ్వఁడు సృజించెనో యాతఁడే పరమా త్ముఁడు 20. బ్రహ్మవిష్ణు మహేశ్వరాదులుగూడ నాతని యవతారములే. ఇందు సందియము కొంచమేని లేదు 21. ఇలువేలుపు చెలరేగి యీ

చరాచర జీవలోకమును నిర్మింపలేదు. ఈ బ్రహ్మాండమును రచించుశక్తి గృహదేవతలకు లేదు 22. అడుగడుగున కెన్నియో దేవతలు గనుపించును. ఈ దేవతలన్నియుఁ గలిసి యీసృష్టి నొనర్పలేదు. అవి చంద్రసూర్య తారాగణములను, మేఘమండలమును నిర్మింపఁజాలవు 23. వీని నన్నింటిని సృష్టిగావించినవాఁడే సర్వకర్తయగు పరమేశ్వరుఁడు. వాస్తవమున కాతఁడు నిరాకారుఁడు. వాని కళాలీలాకౌతుకములను బ్రహ్మావిష్ణు మహేశ్వరాది దేవతలుసైత మెఱుంగరు 24. నిరాకారుఁడు సర్వకర్త గాఁగలఁడను సందేశము కలుగ నవకాశము గలదు. ఈ శంకకు సమాధానము ముందు సమాసములో నొసంగఁబడినది. ఇఁక శ్రోతలు ప్రకృతవిషయమున సావధానులు గాఁగోరెద 25.

ఏమియులేక అవకాశరూపముగానున్న రిక్త (ఖాలీ)స్థలమే ఆకాశము. అది నిర్మలమైనది. వాయువు దానిలోనే జన్మించెను 26. వాయువు వలన నగ్నియు, నగ్నివలన జలమును ఉత్పన్నమయ్యెను. పరమాత్ముని యఘటనఘటనాశక్తి చూడుఁడు ఎంత వింతగానున్నదో ! 27. జలము నుండి పృథివి కలిగెను. అది నిరాధారముగా నిలిచియున్నది. ఇట్టి విచిత్ర కళను గావించినవాఁడే దేవుఁడు 28. వివేకహీనులగు మానవులు ఆ దేవునిచే నిర్మింపఁబడిన పృథ్వియందు వెడలిన శిలలనే దేవరలని నుడువుదురు 29. సృష్టినిర్మాణకర్తయగు దేవుఁడు సృష్టికిఁ బూర్వమునుండియే యుండెననియు, నాతనిశక్తి సృష్టికనంతరము మిగుల విస్తృతమైనదనియు వారలెఱుంగరు 30. కుండకంటె ముందుగానే కుమ్మరివాఁ డేర్పడియున్నాఁడు. అటులే తన సృష్టికంటెఁ బూర్వమే పరమేశ్వరుఁ డేర్పడియున్నాఁడు. ఆతఁడు ఱాయి యెన్నఁటికినిగాఁడు. ఱాయి భగవంతుని సృష్టిలో నొక క్షుద్రపదార్థము 31. ఒకానొకఁడు మట్టితో సైన్యమును నిర్మించెనని భావింపుఁడు. దానిని నిర్మించినవాఁడు నిమిత్తకారణములేక (కర్త) ఆ సైన్యముకంటె వేఱుగా నున్నాఁడు. ఏలయన, కార్యకారణము లెన్నఁటికిని ఒకటి కాఁజాలవు 32. ఒకవేళ కార్యకారణములు రెండును బంచభూతాత్మికములైనవోఁ బంచభూతాత్మికదృష్టి కవి యొక్కటి కాఁగలవుగాని యెచ్చట నిర్గుణవిషయముగా నుండునో యచ్చట నిటుల నెన్నఁడును జరుగఁజాలదు. ఏలయన, కార్యకారణములకు ఏకత్వ సంబం

ధము పంచభూతముల దనుకనే యేర్పడియున్నది 33. కావున నీ సంపూర్ణ సృష్టికర్త సృష్టికంటె వేఱుగానున్నాఁడు. ఇందు సందేహములేదు 34. తోలుబొమ్మల నాడించువాఁడు స్వయముగాఁ దానుగూడ నొకతోలు బొమ్మ యెట్లు కాఁగలఁడు ? 35. ఛాయామండప (బైస్కోపు) సైన్యము కేవలము సత్యమగు సైన్యమువలెనే యుద్ధముజేయును. ఒక మనుష్యుఁ డావినోదము నంతయుఁ జేయించుచుండునుగాని యా మనుష్యుఁ డా సైన్యమునందలి యొకానొక వ్యక్తి కాఁగలిగియుండునా? లేదు 36. ఈ విధముగానే పరమాత్ముఁడు సృష్టిని రచించియున్నాఁడు. కాని యాతఁడు స్వయముగా సృష్టికొక యంగముగా లేఁడు. సమస్త జీవజాతమును సృజించిన యాతఁడు స్వయముగా నొకజీవుఁ డెట్లులగును ? 37. పదార్థ మును జేయువాఁడు స్వయముగా నాపదార్థమై యుండుననుట యెట్లు పొసఁగును ? పాపము! వివేకహీనులగు పురుషులు వ్యర్థముగా సందేహ ములకుఁ బొల్పడుచుందురు 38. పరమాత్ముఁడు సృష్టియొనరించినటుల నొకశిల్పి సుందరమందిరమును నిర్మించెననుకొనుఁడు. కాని యామందిర నిర్మాత స్వయముగా మందిరము కాఁగలఁడా? 39. అటులే జగత్తును నిర్మించిన పరమాత్ముఁడు జగత్తునకంటె వేఱుగా నున్నాఁడు. కొందఱు మూర్ఖు లీయంశము నెఱుంగక "జగమే జగదీశ్వరుఁ"డని నుడువుదురు 40. జగదీశ్వరుఁడు వేఱుగానున్నాఁడు. జగద్రచనము వానికళ. అతఁడన్నింటిలో నున్నాఁడు. కాని అన్నింటికంటెను వేఱుగానుండి అన్నిఁటిలోనున్నాఁడు41.

పంచభూతములను కర్దమమునఁ దగుల్కొనక పరమాత్ముఁడు వేఱుగా నున్నాఁడు. అవిద్యాకారణమున మాయాభ్రమ సత్యముగ గాన్పించును 42. మాయోపాధియు జగదాడంబరమును సత్యమని తలంచుట విపరీతము 43. అన్నింటికంటెను నావలనున్న పరమాత్ముఁడే యన్నింటికి వెలుపలను లోపలను వ్యాపించియున్నాఁడు. ఆ యంత రాత్మయే సత్యమైనది. ఈ జగత్తు మిథ్యయైయున్నది 44. ఆ పరమాత్మనే దేవతయనిగూడ నుడువవచ్చును. తక్కినవన్నియు నసత్యములు. ఇదియే వేదాంత శాస్త్రమర్మము 45. ఈ దృశ్యపదార్థజాతమంతయు నాశవంత మైనదనియు, భగవంతుఁ డవినాశియనియు బ్రత్యక్షానుభవమువలన గన్పట్టుచున్న విషయమేగదా ! కావున భగవంతుఁ డీదృశ్యపదార్థముల

కంటె వేఱుగా నున్నాఁడు 46. శాస్త్రములన్నియుఁ బరమాత్ముని నిర్మ లుఁడనియు, అచలుఁడనియుఁ జెప్పుచున్నవి. చంచలుఁడనియు, నశ్వరుఁ డనియు నాపరమాత్ముని నుడువఁదగదు 47. ఆయనకు వచ్చుట, పోవుట, పుట్టుట, చచ్చుట మున్నగునుపాధుల నారోపించుటవలన మహాపాతకము ప్రాప్తించును 48. పరమాత్మునకు జననమరణములు లేవు. ఆతని సత్తా మాత్రముననే దేవతలందఱును అమరులగుచున్నారు. ఇఁక నాతనికి మృత్యు వెట్లువచ్చును? 49. పుట్టుట, చచ్చుట, వచ్చుట,పోవుట, దుఃఖము ననుభ వించుటయనునవియన్నియుఁ బరమాత్ముని కార్యములు. ఆతఁడు కర్తృత్వ కారణరూపములకు వేఱుగా నున్నాఁడు 50. అంతఃకరణము, పంచప్రాణ ములు, బహువిధతత్త్వములు, పిండజ్ఞానము మొదలగునవి యన్నియును జంచలములు. కాఁబట్టియే యివి పరమాత్మ గాఁజాలవు 51.

ఈవిధముగాఁ గల్పనారహితముగ నున్నవాఁడే పరమాత్ముఁడు. కాని వాస్తవమునకుఁ బరమాత్మత్వమనుమాట యాతనియందు లేదు. (పర మాత్మత్వమనుశబ్దమువలనఁ గల్పన మేర్పడుచున్నది. ఆతఁడు కల్పనా తీతుఁడు) 52. ఈ విషయమంతయు విని శిష్యుఁడిటులఁ బ్రశ్నించెను. "అయ్యా! పరమాత్ముఁడు కల్పనాతీతుఁడైనపు డీబ్రహ్మాండము నాతఁ డెటుల రచించెను? ఈ కర్తృత్వమువలన కర్తృకారణ కార్యములలోనికి వచ్చునుగదా? * 53. ద్రష్టృత్వమువలన ద్రష్ట (చూచెడివాఁడు) అనా యాసముగా దృశ్యమగునట్లు కర్తృత్వమువలన నిర్గుణమునందు గుణము రాగల్గును 54. కావున బ్రహ్మాండకర్త యెవఁడో, ఆతని చిహ్నములెట్టివో, పరమాత్ముఁడు సగుణుఁడో, నిర్గుణుఁడో నాకాజ్ఞయిండు 55. "ఆ బ్రహ్మ ము ఇచ్ఛామాత్రముననే సృష్టికర్తయగును" అని కొందఱు నుడువు దురు. ఆతనిని వదలినచో నిఁక సృష్టికెవఁడు కర్తయగును ? 56. ఈ విధ

* కర్తను గర్తయని నుడువుటవలననే దానికిఁ గర్తృత్వగుణము కలుగుచున్నది. దేనియందు గుణముండునో యది కార్యము. ఈ రీతిగఁ గారణమే (కర్తయే) కార్యమగు చున్నది. ఉదాహరణము: చూచువానియందుఁ జూచునట్టిగుణము (ధర్మము)ండుటవలన వాతఁడు స్వయముగాఁగూడ నితరులకు దృశ్యమగుచున్నాఁడు. ఇంద్రియములు విషయ ములకు ద్రష్టలు. కాని యవి స్వయముగా మనస్సునకు దృశ్యములుగ నగుచున్నవి. అనఁగా మనస్సుచేఁ గాంచుచున్నవి.

ముగా ననేకసంశయములు గలుగుచున్నవి. కావున నోస్వామీ! ఈ మాయ యంతయు నెందుండి కలిగినది ? 57. ఇందుమీఁద వక్త యిటుల నుడివెను. ఇకముందు మాయనుగూర్చి విస్తరించి చెప్పుదును. శ్రోతలారా! సావధాన మనస్కులరై వినుండు 58_60.

## రెండవ సమాసము - మాయయొక్క అస్తిత్వముసందు శంక.

"నిరాకారమునందీచరాచరమాయ యెటులఁగలిగె"నను శ్రోతల సంశయమునకుఁ బ్రత్యుత్తర మొసంగెదను 1. శుక్తియందు రజతము రజ్జువునందు సర్పము భాసించునటుల సనాతన బ్రహ్మమునందు (వాస్తవములో లేకున్నను) మాయ భాసించుచున్నది 2. ఆదియందు నిత్యముక్తము పరమార్థక్రియయు నగు పరబ్రహ్మ మొక్కటియేగలదు. దానియందు అస్పష్టముగను, సూక్ష్మముగను మూలమాయ కలిగెను 3.

శ్లో॥ ఆద్యమేకం పరబ్రహ్మ నిత్యముక్తమవిక్రియమ్ ।
తస్య మాయాసమావేశో జీవమవ్యాకృతాత్మకమ్ ॥

శ్రోత యిటుల మఱలఁ బ్రశ్నించెను. "ఒకవేళ బ్రహ్మము నిరాకారము, ముక్తము, అక్రియ, నిర్వికారమునైనచో దానినుండి మిథ్యయగు మాయ యెట్లుకలిగెను? 4. బ్రహ్మము అఖండనిర్గుణము. దానికి ఇచ్ఛ యెటులఁగలుగును? ఏలయన, ఇచ్ఛయనునది సగుణమునందే కలుగఁదగినది. నిర్గుణమునందది కలుగఁజాలదుగదా 5. బ్రహ్మము ఆదినుండియు సగుణముకాదు. కావుననేగదా దానికి నిర్గుణమను నామము గలిగినది! ఈ స్థితిలో దానికి సగుణత్వము (ఇచ్ఛాశక్తి) యెచ్చటనుండి వచ్చెను? 6. ఒకవేళ నిర్గుణమే సగుణమైనదని చెప్పునెడ దానివలన మూర్ఖత్వము ప్రకటనమగును 7. ఆ నిరాకారుఁడగు నీశ్వరుఁడు సృష్టిజేసియు అకర్తగానున్నాడు. పాపము! ఈ జీవులు వానిలీల నేమి యెఱుంగుదురు?" అని యొకఁడు పల్కెను 8. "ఆతఁడు పరమాత్ముఁడు. వానిమహిమను బాపమీజీవాత్ముఁడెటులఁ దెలిసికొనఁగల్గును?" అని మఱియొకఁడు నుడువును 9. "శాస్త్రముల యర్థమును దాచి వానిమహిమను మానవులు వ్యర్థముగా గానముచేయుచున్నారు. మఱియు నిర్గుణముమీఁద బలవంతముగఁ గర్త్ప

త్వభారమును వైచుచున్నారు 10. కర్తవ్యతయే బొత్తిగా లేనప్పుడు చేసియును అకర్తగా నెవఁడుండఁగలఁడు? అకర్త కర్తల వార్తయే సమూలముగా మిథ్యయైయున్నది 11. ఆదినుండియు నిర్గుణముగా నున్నదాని యందుఁ గర్తృత్వ మెప్పటినుండివచ్చినది? (ఒకవేళ కర్తృత్వము రానిచో) లేనిచో నీ సృష్టిని రచించుకోర్కి యెవ్వని కేర్పడినది? 12. చాలమంది 'పరమేశ్వరుని యిచ్ఛ'యని సాధారణముగాఁ బలుకుచుందురు. కాని యీ నిర్గుణపరబ్రహ్మమునం దిచ్ఛ యెచ్చటినుండి వచ్చెనో తెలియకున్నది 13. అటులైన నీ విశ్వమునంతయు సృజించినదెవరు? తనంతటతానుగా నైనదా? ఈశ్వరుఁడు గాకున్నచో నిదియంతయు నెవ్వఁ డుత్పత్తిచేసెను? 14. ఈశ్వరుఁడు లేకయే అంతయు నుత్పన్నమైనదన్నచో నప్పట్టున నీశ్వరుఁ డెక్కడకుఁ బోవఁగలఁడు? సృష్టి తనంతటనే యేర్పడెననుకొందుమేని యీశ్వరునిపట్ల నభావ మేర్పడును 15. ఈశ్వరుఁడే సృష్టికర్త యని యందుమేని యాతనియందు సగుణత్వ ముండవలయును. అటుల యోజించితిమేని (సగుణత్వ మారోపించితిమేని) యీశ్వరునియెడఁ గలఁ నిర్గుణత్వమే సమాప్తమగును 16. యీశ్వరుఁడు మొదటినుండియు నిర్గుణుఁడైన పక్షమున సృష్టికిఁ గర్త యెవఁడు? ఈశ్వరుఁడే కర్త యని చెప్పుదమాయన్న దానిచే సగుణత్వ మేర్పడుచున్నది. సగుణత్వము నశ్వరముగదా! 17. ఇక్కడ గొప్పశంక గలుగుచున్నది. ఈ చరాచరజగత్తు పరబ్రహ్మము వలనఁ గలిగినదందురుగదా! ఎటులఁ గలిగినది ? ఒకవేళ మాయను స్వతంత్రమైనదానినిగాఁ జెప్పుదమా యన్న నదియు విపరీతముగానే కనఁబడుచున్నది 18. 'మాయ నెవ్వరును జేయలేదు. తనంతటనదియే వ్యాపించిపోయినది' అని యొకవేళ జెప్పుదమాయన్న దీనివలన నీశ్వర విషయిక వార్తయే మునిఁగిపోవుచున్నది19. 'ఈశ్వరుఁడు నిర్గుణుఁడు, స్వతస్సిద్ధుఁడు. ఆయనకును మాయకును సంబంధమేమియును లే'దని నుడువుట గూడ నుచితముగాఁ గనుపట్టదు 20. ఒకవేళ సమస్త కర్తృత్వము మాయపైననే పెట్టుచో నిఁక భక్తుల నుద్ధరించెడి యీశ్వరుఁడే లేఁడా యేమి? 21. యీశ్వరుఁడు తప్ప నీ మాయ నెవఁడు దూరము చేయగలఁడు? భక్తులమగు మమ్ము ననుగ్రహించెడివాఁ డెవఁడేనియు లేఁడా యేమి? 22. మాయను స్వతంత్రమనిగూడఁ జెప్పజాలము. మాయకు నిర్మాణకర్తయగు

సర్వేశ్వరుఁ డొకఁ డవశ్యముగా నున్నాఁడు 23. 'ఈశ్వరుఁ డేవిధముగా నున్నాఁడు? మాయయన నెట్టిది?' ఈ విషయము సవిస్తరముగాఁ దెలుపుము'' 24. వక్త 'ఈసందేహమునుగూర్చి జనులలో భిన్నభిన్నములగు విచారము లనేకములు గలవు. అవియన్నియును క్రమముగా వివరించెదను. శ్రోతలారా! ధ్యానముంచి ప్రకృతాంశమును వినియెదరుగాక' 25_26.

మాయ నీశ్వరుఁడే నిర్మించెను. ఆయనవలననే యది నలుముఖముల వ్యాపించియున్నది. 'ఈశ్వరున కిచ్ఛగలుగకపోయినచో నీ మాయ యెక్కడినుండివచ్చును?' అని యొకఁడు చెప్పును 27. 'ఈశ్వరుఁడు నిర్గుణుఁడై యున్నప్పుడు ఇచ్ఛజేయువాఁడెవఁడు? మాయ మిథ్య, అది లేనే లేదని యొకఁడుజెప్పును 28. 'ప్రత్యక్షముగా నిది గాన్పించుచున్నప్పుడు లేనేలేదని యెటుల నుడువఁగలుగుదుము? మాయ యీశ్వరుని యనాది శక్తి'యని యొకఁడుచెప్పును 29. 'మాయ సత్యమేయగుచో నది జ్ఞానము వలన నేలనిరసనమైపోవును? సత్యసమానముగాఁ గాన్పించునేగాని అది మిథ్యయే'యని యొకఁడుచెప్పును 30. 'ఇది (మాయ) స్వాభావికముగానే మిథ్యయైనయెడల సాధనము నేలచేయవలయును? ఈశ్వరుఁడు మాయాత్యాగముకొఱకే భక్తిసాధనములు వివరించియున్నాఁడు' అని యొకఁడు నుడువును 31. 'మాయ యథార్థమునకు మిథ్యయే. అజ్ఞానరూపమగు సన్నిపాత వ్యాధివలన మాయయన్న భయమగుచున్నది. కావున దానిని వారించుటకు సాధనరూపగు నౌషధమును బుచ్చుకొనవలెను. ఇంతయేల, మాయ మిథ్యయే'యని యొకఁడు చెప్పును 32. 'మాయను త్యాగము గావించుట కెన్నియో సాధనములు చెప్పఁబడెను. ఇందులకు నానావిధ మతములు గలవు. అయినను మాయను ద్యాగము జేయఁజాలకున్నారము. ఈ స్థితిలో దానిని మిథ్యయని యెట్లునుడువుదుము?' అని యొకఁడు చెప్పును 33. 'యోగవాణి మాయనుగూడ మిథ్యయని చెప్పుచున్నది. వేదశాస్త్ర పురాణములలో మాయ మిథ్యయని చెప్పఁబడెను. మఱియు నానావిధ నిరూపణములయందుఁగూడ మాయ మిథ్యయని చెప్పఁబడెను' అని యొకఁడు ప్రత్యుత్తరమిచ్చును 34. 'మాయను మిథ్యయనినంత మాత్రమున నది తొలగిపోయినట్లు మేమెక్కడను వినియుండలేదు. మిథ్య యన్నంతన యది మిగుల వెంటనంటును' అనియొకఁడు పల్కును 35.

'అంతఃకరణమునందు విజ్ఞానము లేనివానికిని సజ్జనులను గురుతింపఁజాలని వానికిని మిథ్యాభాసయగు మాయ సత్యముగాఁ గాన్పించును 36. ఎవఁ డెట్లు నిశ్చయించునో వానికట్లె ఫలితముండును. అద్దములోఁ జూచుకొను వానికిఁ దనఛాయయే యెదురుగా గాన్పించుట యెట్టిదో మాయయొక్క స్థితియు నట్టిదే'యని యొకఁడు నుడువును 37. 'మాయ యెక్కడనుండి వచ్చినది? ఉన్నదంతయు బ్రహ్మమే. కరగియున్నను, పేరియున్నను నేయి యొక్కటియే'యని యొకఁడుచెప్పును 38. 'పరమాత్మస్వరూపము కరుగు ననియుఁ బేరుకొనుననియు నెచ్చటను జెప్పఁబడలేదు. అతనిపట్ల నీవొసం గిన యుపమానము సరిపడలేదు' అని యొకఁడనును 39. 'సర్వ బ్రహ్మము అనుదానిమర్మము నెఱుంగనివానికి భ్రమ తొలంగఁజాల'దని యొకఁడనును 40. 'ఈశ్వరుఁడొకఁడే. అచట నీ సర్వశబ్ద మెక్కడనుండి వచ్చినది? సర్వబ్రహ్మమనునది అపూర్వముగను ఆశ్చర్యముగను గనుపట్టు చున్నది' అనియొకఁడు నుడువును 41. 'సత్యమొక్కటియే. రెండవది లేనే లేదు. కావున సాధారణముగ సర్వబ్రహ్మమని బ్రహ్మమునందురు' అనియొకఁడనును 42. 'అన్నియును నొక్కసారిగనే మిథ్యయైపోవును. ఇఁక నిలచి యేదియుండునో అదియే సత్యబ్రహ్మము' అని యొకఁడు శాస్త్రాధారములతోఁ జెప్పును 43. 'భూషణములందును బంగారము నందును భేదమేమియునులేదు (బంగారము, భూషణములలోని బంగారము నొకటియే). వివాదములతో నేల వ్యర్థముగాఁ బరిశ్రమ చేయుదురు' అని యొకఁడనును 44. 'హీనము ఏకదేశీయము నగు నీ యుపమానము వస్తువుతో (బ్రహ్మముతో) నెట్లు సంబంధించును? వర్ణవ్యక్తిత్వము అవ్యక్తముతోఁ దులఁదూఁగఁజాలదు 45. సువర్ణమును జూచినయెడల దీనియం దనాదినుండియు వ్యక్తత్వమున్నదని తోఁచును. బంగారుసొమ్ములను జూచినచో నా బంగారే కాన్పించును 46. అనఁగా బంగారము మొదటి నుండియు వ్యక్తముగ నున్నది. అది జడమును, ఏకదేశీయమును, పచ్చనిదియు నై యున్నది. ఇట్టి యసంపూర్ణ దృష్టాంతములు పూర్ణబ్రహ్మము నెడ నెట్లు సరిపడును?' అని యొకఁడనును 47. దీనిని విని మొదటివాఁ డిట్లు చెప్పును. 'విషయము బోధచేయుటకై యేకదేశీయ దృష్టాంతము లనుగూడ నీయవలసివచ్చును.సముద్రతరంగములయందు భిన్నత్వ మెక్కడ

నున్నది? ఉత్తమము, మధ్యమము, అధమము అని దృష్టాంతములు మూఁడువిధములుగా నున్నవి. ఒకదృష్టాంతమువలనఁ (బ్రహ్మము) దథ్యమని తెలియును. ఒకదానివలన వ్యర్థముగా సందేహములు వృద్ధినొందును’ 48_49. దీనిమీఁద మఱియొకఁ డిటుల నుడువును. ‘సముద్రమేమి? తరంగములెక్కడ? అచలముతో చలమున కెక్కడనేని సామ్యము నీయఁదగునా? మాయను సత్యముగా నెన్నఁటికిని భావింపఁగూడదు’ 50. ఒకఁడిట్లు చెప్పును. ‘మాయ కల్పనము. ఇది జనులకు నానావిధములగు భాసలను జూపుచున్నది. ఈ విధముచే దీనిని బ్రహ్మమనియే తలంపవలయును’ 51. ఇట్లు మాయ, బ్రహ్మములనుగూర్చి పరస్పర వివాదములు జరుగుచుండుకతన ముఖ్యసందేహము అటులే నిలిచియున్నది. ముందది సావధానులై వినుండు 52.

మాయయనునది మిథ్యయని మీ కిదివఱకే తెలిసినదికదా! కాని యది బ్రహ్మమునందెట్లు ఉత్పత్తియయ్యెను? ఒకవేళ నిర్గుణమే దానిని గావించినదని చెప్పఁదలఁచినచో నది (మాయ) అనాదినుండియు మిథ్యయైయుండెను 53. మిథ్యాశబ్దమువలన “అది యేమియును లేనేలేదు” అనునర్థము వెడలుచున్నది. ఇట్టిస్థితిలోఁ జేసినదేమి? ఎవరుచేసిరి? నిర్గుణమునకుఁ గర్తృత్వము కలుగుటగూడ నసంభవమేగదా! 54. ఒకటి కర్తను గూర్చిన విషయము (అది కర్తయగు బ్రహ్మము) యనాదినుండియు రూపరహితముగా నున్నది. ఇఁక రెండవది అదిగావించిన (బ్రహ్మము గల్పించిన) దానినంతను (మాయను) గూర్చిన విషయము. దానికిఁగూడ అస్తిత్వము లేదు. ఐనను శ్రోతల యాక్షేపణములకు సమాధానముల నొసంగెదను 55.

## మూఁడవ సమాసము — నిర్గుణమునందు మాయ యెట్లుకలిగెను?

ఓరీ! ఎయ్యది కలుగనే లేదో దానినిగూర్చి చెప్పునదేమున్నది? అయినను సంశయమును దూరపరచుటకై చెప్పుచున్నారము 1. రజ్జువువలన సర్పమును, నీటివలనఁ దరంగములును, సూర్యునివలన నెండమావులును భాసించుచున్నవి. మఱియు నీటినుండి వడగండ్లు కలుగు

చున్నవి 2—3. మంటివలన గోడ నిర్మింపఁబడుచున్నది. సముద్రకారణమున అలలేర్పడుచున్నవి. కంటిలోని పాపవలనఁ బ్రపంచము కాన్పించుచున్నది 4. బంగారమువలన భూషణములు, దారములవలన వస్త్రము, తాఁబేటి యొక్క దేహమునుండి దాని హస్తపాదముల విస్తృతి యేర్పడుచున్నది 5. నెయ్యియున్నది. అది యున్నప్పుడే కరుగుటయు నుండును. ఉప్పునీటినుండి యుప్పు వెడలుచున్నది. బింబమునుండి ప్రతిబింబ మేర్పడుచున్నది 6. పృథ్వినుండి వృక్షములు కలుగుచున్నవి. వృక్షమునుండి నీడకలుగుచున్నది. మఱియు ధాతువు (వీర్యము)నుండి ఉచ్చనీచవర్ణము లుత్పత్తియగు చున్నవి 7.

ఇప్పటికి దృష్టాంతములు చాలనైనవి. అద్వైతమునందు ద్వైత మెక్కడనుండివచ్చినది ? ద్వైతమును విడిచినయెడల అద్వైతనిరూపణము గావింప వలనుగలుగకుండు టెందులకు ? 8. ఏదేని యొక వస్తువునకు భాసమున్నప్పుడే యది భాసించును. మఱియు దృశ్యమున్నప్పుడే కని పించును. కాని యా దృశ్యపుస్థితి యిట్టిదిగాదు. కావున నదృశ్యమున కేయుపమానమేని సరిపడదు. అది యనుపమమైయుండును 9. కల్పనము లేకుండ హేతువు, దృశ్యము లేకుండ దృష్టాంతము, ద్వైతము లేకుండ నద్వైతము ఎట్లు కాఁగలవు ? 10. సహస్రముఖములుగల శేషుఁడునైత మేభగవంతుని చిత్రకృత్యములను వర్ణింపజాలఁడో యాతఁడే యీయనంత బ్రహ్మాండములను సృజించెను 11. ఆ పరమేశ్వరుని (పరమాత్ముని) వలననే యీ సృష్టి విస్తృతమైనది. ఆ యీశ్వరుఁడే సర్వకర్తయైయున్నాఁడు 12. ఆయన కనంతనామములుగలవు. ఆయన అనంతశక్తులను నిర్మించెను. అతఁడే మూలపురుషుఁడు 13. ఆ మూలపురుషునిగుర్తు స్వయముగా నా మూలమాయయే యైయున్నది. కావునఁ గర్తృత్వమంతయు దానిలో నికేవచ్చును 14.

శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥

కాని యీ యంశమును స్పష్టముగాఁ జెప్పవీలుగాదు. ఏలయన, దీనివలన (మూలపురుషునకు ద్వైతోపమాన మిచ్చుటవలన) మాటలా డుట, నడచుట, శ్రవణమననాదులగు బ్రహ్మప్రాప్తి యుపాయములే నష్ట

మగును. ఇటులఁజూచిన సత్యమెయ్యది? 15. పరమాత్మునివలన నంతయు సృజింపఁబడిన దనునంశము నందఱు నొప్పుకొనియున్నారు. కాని యా పరమాత్ముని గుర్తింపవలయునుగదా 16. సిద్ధుల నిరూపణము సాధకుని కుపకరింపదు. ఏలయన, సాధకులయంతఃకరణము, సిద్ధుల యంతఃకరణమువలెఁ బక్వముగాదు 17. అవిద్యాకారణమును (పిండరూపమగు నుపాధి ధరించువానిని) జీవుఁడనుచున్నారు. మాయాకారణమును (బ్రహ్మాండోపాధిని ధరించువానిని) శివుఁడనుచున్నారు. మూలమాయా గుణము వలనఁ బరమేశ్వరుఁడు బ్రహ్మమని పిలువఁబడుచున్నాఁడు 18. కావున అనంతశక్తులను ధరించునది మూలమాయయే. దీనియర్థమును అనుభవనీయులగు పురుషులే తెలిసికొనఁ గలుగుదురు 19. మూలమాయయే మూలపురుషుఁడు. అతఁడే సమస్తమునకు నీశ్వరుఁడై యున్నాఁడు. ఆతనినే అనంతనామ జగదీశ్వరుఁడని చెప్పుదురు 20. ఈ సంపూర్ణ విస్తృతమగు మాయ కేవలము మిథ్యయైయున్నది. దీనిమర్మమును దెలిసికొనిన వారలు చాల యరుదుగానున్నారు 21. వాస్తవమున కీవిషయము లనిర్వాచ్యములు. కాని నేనిచ్చటఁ జెప్పుచున్నాఁడను. ఇవి స్వానుభవము వలననే గ్రహింపఁదగినవి. మఱియు నివి సత్సంగము లేకున్నచో బోధగావు 22. సాధకుల కీసందర్భమున మాయయే మూలపురుషుఁ డెటులయ్యెనను సందియము గలుగవచ్చును. అట్లుగానిచో (మాయయే మూలపురుషుఁడు గాకున్న) అనంతనామయుక్త జగదీశుఁడని యెవ్వని నుడువుదురు ? 23. ఏలయన, నామరూపములు మాయదనుకనే గలవు గదా. కానఁ బైనజెప్పినదానిలో సందేహింపవలసిన దెద్దియునులేదు 24. నిరాకారమునందు మూలమాయ యెట్లు కలిగెనను పూర్వసందేహమటులే నిలచియున్నది. దానిని నివారించెదము. శ్రద్ధతో నాలకింపఁ గోరెదను 25.

దృష్టిబంధనపుటాట (గారడి)వలె నీ మాయయంతయును మిథ్యయైయున్నది. ఇప్పు డాగారడియాట (మాయాకౌతుకము) ఏ ప్రకారముగా నగుచున్నదో చెప్పెదను 26. నిశ్చయమగు ఆకాశమునందుఁ జంచలమగువాయువు ఎట్లు కలుగుచున్నదో యటులే అచలమును నిరాకారమునగు స్వరూపమునందు మూలమాయ కలుగుచున్నది 27. కాని వాయువుండుటవలన నాకాశముయొక్క నిశ్చలత్వమునకు వేఱొక విధ

మగు బాధకలుగుట సంభవింపదు 28. ఇటులే మూలమాయయుండుట వలనఁ బరమాత్మని నిర్గుణత్వమునందుఁగూడ నేవిధమగుబాధయుఁ గలుగదు. ఈ దృష్టాంతమువలన వెనుకటిసంశయము తొలఁగిపోవును 29. వాయువు మొదటినుండియే యుండవలయునను నియతములేదు. ఇటులే మూలమాయయుఁ బురాతనముగాదు. దానిని సత్యమని యంగీకరించుచో అది మఱల లీనముగూడఁ గాఁగలిగియున్నది 30. వాయువునకువలె మూలమాయకుఁగూడ స్వరూప మెఱుంగవలయును. వాయువుభాసమగుచున్నదిగాని దృష్టిలోనికి రాదు 31. వాయువును మీరు సత్యమే యనుఁడు. కాని యది యెప్పుడేని కనులకుఁ గనిపించుచున్నదా! దానిని (గాలిని) జూడఁదలఁచినచో ఎగురఁదలఁచినధూళి, కదలుచున్న యాకులు మాత్రమే కనిపించును 32. వాయువువలెనే మూలమాయయు భాసించుచున్నదిగాని కనిపించుటలేదు. అవిద్య మాయయొక్క విస్తరమునుమా 33. వాయుయోగమువలన దృశ్యము (ధూళిమున్నగునవి) ఆకాశమునందుఁ గాన్పించునట్లు మూలమాయా యోగమువలన నీజగము నిర్మింపఁబడినది 34. ఆకసమునం దాకస్మికముగా మేఘాడంబరము కలుగునటుల మాయాగుణమువలన నీజగము నిర్మింపఁబడెను 35. ఆకాశమునందు ఆకస్మికముగా నశ్వరమగు మేఘసముదాయ మావరించునట్లు బ్రహ్మమునం దీమిథ్యామాయ యుత్పన్నమగుచున్నది 36. ఆ మేఘాడంబరము కతన ఆకాశమునకు నిశ్చలత్వమే లేనటులఁ గనిపించును. అది సరిగాదు. ఆకాశము చలనరహితమై యొక్కచోటనే యున్నది 37. అటులె మాయాకారణమున నిర్గుణము సగుణముగాఁ దోఁచును. కాని యది సరిగాదు. పరబ్రహ్మము యథావిధిగాఁ జెక్కుచెదరక నిర్గుణముగనున్నది 38. మేఘములు వచ్చుచున్నను, పోవుచున్నను ఆకాశముమాత్రము తన పూర్వరూపముతో నిలచియున్నది. అటులే మాయవచ్చుచున్నను, బోవుచున్నను నిర్గుణబ్రహ్మమునందు మాయాకారణమున గుణములు కలుగుట లేదు. ఎట్టి దటులేయున్నది 39. పర్వతశిఖరములమీఁద నాకాశము పెట్టబడినటులఁ గనిపించుచున్నను వాస్తవమునకది కేవలము భాసమాత్రమే. అటులే నిర్గుణముగూడ మాయాకారణమున సగుణముగా భాసించుచున్నను వాస్తవముగా నది నిర్గుణమె యైయున్నది 40. ఆకాశమును

జూచినచో దానియందు నీలిమ వ్యాపించియున్నట్లు గన్పించును. కాని దానిని మిథ్యాభాసముగానే భావింపవలయును 41. ఆకాశము బోరగిలఁబడి నాలుగుదిక్కులను జుట్టుకొనినట్లును సంపూర్ణవిశ్వము నది బంధించినట్లును గోచరించును. కాని వాస్తవమున కాకాశము అట్లు లేదు. అది నాలుగు దిక్కుల నావరించినను దిశలు తెలియఁబడియే యున్నవి 42. దూరమునుండి చూచినచో పర్వతములు నీలవర్ణముగాఁ గాన్పించును. కాని వాస్తవమునకు శైలములు నీలవర్ణముగా లేవు. ఇటులె నిర్గుణ బ్రహ్మమునందుఁగూడ గుణభాసము కలుగును. కాని బ్రహ్మము సగుణ మెన్నఁటికినిగాదు 43. రథము పరుగెత్తునపుడు లోనున్నవారి కీ పృథ్వియే పరుగెత్తుచున్నటులఁ దోఁచును. కాని వాస్తవమునకుఁ బృథ్వి నిశ్చలముగానేయున్నది. ఇటులె పరబ్రహ్మముగూడ నిర్గుణము కేవలము నై యున్నది 44. మేఘ కారణమునఁ జంద్రుఁడాకాశమునఁ బరుగెత్తుచున్నటులఁ గానుపించును. కాని యది యంతయును మిథ్య. మేఘమే యుఱుకుచున్నది 45. ఉష్ణవాయువునలనఁగాని, అగ్నిజ్వాలవలనఁగాని వాతావరణము (అంతరాళము) వణకుచున్నటులఁ గనుపించును. కాని యది భ్రమ. అది యెప్పటివలెనే నిశ్చలముగానున్నది 46. ఇటులే పరబ్రహ్మస్వరూపము నిర్గుణమైయుండియు మాయాకారణమున సగుణమువలెఁ దోఁచుచున్నది. కాని యిది కేవలము కల్పనము వలనఁ గలిగినభ్రమ సుమీ! 47.

దృష్టి బంధనపుటాట (గారడి) వలె నీ మాయ చంచలముగను మిథ్యగను నున్నది. వస్తువు (బ్రహ్మము) యథావిధిగా శాశ్వతమును నిశ్చలము నై యున్నది 48. కాని మాయ నిరాకారవస్తువును సాకారముగాఁ జేయుచున్నది. దానికది (మాయకది) స్వభావగుణము. మాయ గొప్పమోసగత్తె 49. చూచినచో మాయ యనునది లేనేలేదు. కాని యది సత్యమువలె భాసించుచున్నది. మఱియు మేఘాడంబరమువలె నుద్భూతమగుచున్నది. అంతలో నాశనమగుచున్నది 50. ఈ విధముగా మాయ ఉద్భూతమగుచున్నది. కాని బ్రహ్మము నిర్గుణముగనేయున్నది. బ్రహ్మమునందు అహంరూపముగనున్న స్ఫూర్తి (శక్తి)యే మాయ 51. గుణములు మాయాఖేలనములు. నిర్గుణమునందు గుణాదులెవ్వియును

లేవు. మాయ సత్స్వరూపమునందు (బ్రహ్మమునందు) ఉత్పన్నమును నాశనమును నొందుచున్నది * 52. దృష్టిచలనమువలన ఆకాశమునందు (మేఘసముదాయము) సైన్యమో బొమ్మలో ఆడుచున్నటులఁ గాన్పించును. కాని యదిమిథ్య 53. ఈ విధముగా జూచితిమేని యీ మాయా నటనమంతయును మిథ్య. దాని పుట్టుకయంతయు నానాతత్త్వముల విస్తరత్వమును విడిచిచెప్పితిని 54.

మొదటనుండియుఁ బంచమహాతత్త్వములు మాయయందున్నవి. ఓంకారము వాయువుయొక్క గతి (శక్తియే వాయువుయొక్క రూపము). దీని యర్థమును దక్షులును జ్ఞానులును నగువారలే గ్రహింపఁగలుగుదురు 55. మూల మాయాచలనమే వాయులక్షణము. మూలమునందలి సూక్ష్మ తత్త్వములే ముందున కరిగి జడత్వమును బెంపొందించుచున్నవి 56. మూల మాయయందుఁ దొలుదొలుత అవ్యక్తముగానున్న యీ పంచ మహాభూతములు సృష్టిరచనమునందు వ్యక్తములగుచున్నవి 57. మూల మాయాలక్షణముగూడఁ బాంచభౌతికమే. దాని శోధనమును సూక్ష్మ దృష్టితోఁ జేయవలయును 58. ఆకాశము, వాయువులేకున్నచో మూల మాయకు శక్తి, ఇచ్ఛ యెటులఁ గలుగఁగలవు? (కావున ఆకాశము వాయువు మూల మాయయందున్నవి). అటులే మాయయందు ఇచ్ఛా శక్తికలుగుట తేజోలక్షణమైనది 59. ఇంతియగాక మాయయందున్న మృదుత్వమే జలము. మఱియు జడత్వము పృథ్వీలక్షణము ఈ విధముగా మూలమాయయందుఁ బంచమహాభూతము లుత్పన్నమయ్యెను. కావున మూల మాయయనఁ బాంచభౌతికమనియే నిర్ధారణమైనది 60. ఇంతియ గాదు. ఒక్కొక్క భూతమునందే దేసి భూతములున్నవి. ఈ విషయము సూక్ష్మదృష్టితో నారయునెడ విశదమగును 61. ముందునకరిగి యవి (పంచమహాభూతములు) స్థూలరూపములోనికి వచ్చుచున్నవి. అప్పుడు గూడ నవియన్నియును బరస్పరము కలిసియేయుండును. ఈ విధముగా

---

* గుణములు వ్యాప్తిమాత్రములు. నిర్గుణమునందివిలేవు. మాయయొక్క సాక్షిత్వమున గుణములు కలుగుచున్నవి, పోవుచున్నవి. రజ్జువుయొక్క యధిష్ఠానమున భుజంగము భాసించుచున్నట్లు నిర్గుణమునందీమాయ తనంతన కలుగుచు నశించుచునున్నది. కడకు నిర్గుణము నిర్గుణముగానే యున్నది.

నీ పంచభూతాత్మికమగు మాయ యంతయును వ్యాపించియున్నది 62. అది మూలమాయయందును, భూమండలములోని యవిద్య (మాయ) యందును, స్వర్గమర్త్యపాతాళలోకములందును ఐదేభూతములున్నవి 63.

శ్లో॥ స్వర్గే మర్త్యే చ పాతాళే యత్కించిత్సచరాచరం।
సర్వం తత్పాంచభౌతిక్యం షష్ఠం కించిన్న దృశ్యతే॥

ఆదియందును అంత్యమందును (అన్నిటిలోను) సత్స్వరూప మున్నది. మధ్యమునఁ బంచమహాభూతములు వర్తించుచున్నవి. ఇదియే పంచభూతాత్మిక మాయాస్వరూపము 64. "పంచభూతములు తమోగుణమునుండి కలిగెను. మూలమాయ గుణములకంటె వేఱుగా నున్నది. ఈ స్థితిలో (మూలమాయ) పంచభూతాత్మిక మెట్లు కాఁగలదు?" అని యిక్కడ నొక సందేహము గలుగును. ఈ శంకకు సమాధానమును రాఁబోవు సమాసమునందు స్పష్టముగాఁ దెలుపుదును 65_66.

## నాలుగవ సమాసము – సూక్ష్మపంచ మహాభూతములు.

వెనుక సందేహమునకు బాగుగాఁ దెలియునట్లు సమాధానము చెప్పెదను. కావున శ్రోత లొక్కక్షణమాత్రము వృత్తిని సరిపఱచుకొని (సావధానులై) వినెదరుగాక 1. మొదట బ్రహ్మమునందు మూలమాయ కలిగెను. తరువాత దానినుండి గుణమాయ జనించెను. ఇందువలననే మాయను గుణక్షోభిణియని చెప్పుచున్నారు 2. మాయవలన సత్త్వరజస్తమోగుణములు మూఁడు గలిగెను. ఆ పిమ్మట తమోగుణమునుండి పంచమహాభూతము లేర్పడెను 3. పంచమహాభూతము లీవిధముగా నేర్పడెను. తరువాత నవి ముందున కరిగి సూక్ష్మభూత సృష్టిరూపముతో విస్తృతమయ్యెను. తమోగుణమునుండి పంచమహాభూతములు కలిగిన క్రమమిది 4. మూలమాయ గుణములకంటె వేఱుగా నుండెనుగదా! అందు భూతము లెట్లు జనించెనని శ్రోతలు వెనుకఁ బ్రశ్నించిరి. దాని కిప్పుడు సమాధానము జెప్పెదను 5. మఱియు ఒక్కొక్క భూతమునుండి వైదేసిభూతము లేవిధముగా నుత్పన్నమయ్యెనో యా విషయముగూడఁ జెప్పెదను 6. సూక్ష్మదృష్టి కౌతుకమును బాంచభౌతిక మూలమాయా

స్థితిని వినుటకు శ్రోతలిప్పుడు తమ వివేకమును నిర్మలము గావించుకొనవలయును 7. మొట్టమొదట భూతరూపములను గురుతింపవలయును. తరువాత సూక్ష్మదృష్టితో వానిని శోధించి చూడవలయును 8. ఎంతదనుక నొకవిషయమునందుఁ బరిచయము కలుగదో యంతదనుక దానిని గురుతింప వీలుకాదు. కావున శ్రోతలు ప్రథమముసఁ బంచమహాభూతములను గూర్చిన వివరమునువిని పరిచయము గావించుకొనవలయును 9.

జడమును గఠినమును నగునది యెంతగలదో యది పృథివి. మృదువును, తేమ యెంతగలదో యది జలము 10. ఉష్ణమును, తేజోయుక్తమును నగునది యెంతగలదో యది యగ్ని 11. చైతన్యమును, జంచలమును నెంతగలదో యది యంతయును గేవలవాయువు. అటులే శూన్యముగను, నిశ్చలముగను, అవకాశముగాఁ గనుపించునదిగను నెంతగలదో యది యాకాశము 12. ఇవి పంచమహాభూతముల సంక్షిప్తచిహ్నములు. ఇఁక నిప్పుడు ఒక్కొక్క భూతమునందు ఏదేని భూతము లేవిధముగా నిమిడియున్నవో మఱియుఁ ద్రిగుణముల కావల నేమున్నదో యా సూక్ష్మవిచారమును దెల్పుదుము. దీనిని ధ్యానపూర్వకముగా వినుండు 13–14.

ముందుగా నిపుడు సూక్ష్మాకాశమునందుఁ బృథివి ఏ విధముగాఁ జొచ్చియున్నదో తెలుపుదుము. శ్రోత లీసందర్భమునందుఁ దమధారణాశక్తిని స్థిరపఱచికొని యుండవలయును * 15. ఆకాశమని యవకాశమునకు జెప్పుదురు. అవకాశమని శూన్యమునకుఁ జెప్పుదురు. శూన్యమని యజ్ఞానమునకుఁ జెప్పుదురు. అజ్ఞానమని జడత్వమునకుఁ జెప్పుదురు. ఆ జడత్వమే (ఆకాశమునందు) పృథ్వియయ్యెను 16. ఆకాశమునందుఁగల మృదుత్వమే జలలక్షణము కావున నాకాశమునందు జలము అవశ్యముగానున్నది 17. అజ్ఞానమువలన నాకాశమునందుఁ దోఁచు శూన్యత్వాభాసమే తేజోలక్షణము. కావున ఆకాశమునం దగ్నియున్నది 18. వాయువునకును ఆకాశ

* ఒక్కొక్క భూతమునందైదేని భూతము లుండుటను దెలుపుటకుముందు శ్రోతలు తమ పంచభూతాత్మక దేహమునందే వాని మిశ్రణమును ధ్యానపూర్వకముగాఁ జూడవలయును. దేహమునందు ధ్యానముంచుటవలన నెంతచక్కఁగ దెలియునో యట్లు వెలుపలి పృథివ్యాది పంచభూతములపై ధ్యానముంచినచో దెలియదు.

మునకును నంతగా భేదమేమియునులేదు. ఏలయన, వాయువునందుఁగూడ నాకాశమునందున్నటుల స్తబ్ధత్వమున్నది. కాన నాకాశమునందుఁగల స్తబ్ధత్వమే వాయులక్షణము 19. ఇక శేషించినది ఆకాశమునం దాకాశము. ఆకాశమునం దాకాశమున్నదనుసంగతి ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. ఈ విధముగా ఆకాశమునం దైదుభూతములు గలవనునంశము సిద్ధాంతమైనది 20. ఇక స్థిరచిత్తులై వాయువునందుఁ బంచమహాభూతము లెట్లు గలిసియున్నవో క్రమముగా వినుండు 21. మిక్కిలి తేలికయగు వస్తువునందుఁగూడ జడత్వముండునట్లు వాయువునందుసైతము జడత్వమున్నది. దాని తాఁకిడివలన (ఝంఝూమారుతమువలన) వృక్షములు పడుచున్నవి. ఈ జడత్వమే పృథ్వీలక్షణము. కావున వాయువునందుఁ బృథ్వియున్నది 22-23. లేదా వాయువునందుఁగల శక్తినే పృథ్వీలక్షణమనిగూడఁ జెప్పవచ్చును 24. మిగుల స్వల్పమగు నంగార (అగ్ని) కణమునందుఁగూడఁ గొంచెముగనో, గొప్పగనో ఉష్ణత్వముండును. అటులే వాయువునందుఁగూడ జడత్వము (పృథివ్యంశము) సూక్ష్మరూపముగా నుండియేయున్నది 25. వాయువునందలి కోమలత్వమే దానిలోని జలము. దానిభాసమే అగ్నిస్వరూపము. ఇటులే వాయువునందుఁ జంచలరూపముతో వాయువు స్వాభావికముగానే వర్తించుచున్నది 26. అవకాశరూపముతో నాకాశము వాయువునందు సహజముగనే కలసియున్నది. ఈ విధముగా వాయువునందుఁగూడఁ బంచభూతము లున్నవని ధ్రువమైనది 27. ఇకఁ దేజమునందుఁగల యైదుభూతములనుగూర్చి వినుఁడు. తేజమునందు భాసించుచున్న ప్రఖరత్వమే (తీక్ష్ణమే) దానియందుఁగల పృథివి 28. మఱియు మృదువుగా గోచరించుచున్న అగ్నిభాసమే దానియందుఁగల జలాంశము. తేజమునందుఁ దేజమున్నదని చెప్పవలసిన యావశ్యకమే లేదు 29. ఇక నగ్నియందుగల సంచలనమే వాయువు మఱియు దానియందుఁగల స్తబ్ధత్వమే యాకాశము. ఈ విధముగా బంచభూతములు తేజమునందుఁగూడఁ గలవు 30. ఇక జలములోని పంచభూతములను గ్రహింపుఁడు. వాస్తవమునకు మృదుత్వమే జలలక్షణము. ఆ మృదుత్వమునకు భాసించు కఠినతయే జలములోని పృథివ్యాంశము 31. ఇక జలములో జలముండియే యున్నదిగదా! ఇదిగాక మృదుత్వము

(జలాంశము) నందుఁ దేజముగూడ మృదురూపముతో భాసించుచుండును; దానియందున్న స్తబ్ధతయే వాయువు 32. ఇప్పుడు జలమునందుఁగల యాకాశమునుగూర్చి వివరింపవలసిన యవసరమే లేదు. ఏలయన, అది (ఆకాశము) స్వాభావికముగా నన్నింటియందును వ్యాప్తమైయున్నది. ఇప్పటికి జలమునందుఁగూడఁ బంచభూతము లున్నసంగతి స్పష్టమైనది 33. ఇఁకఁ బృథివియందుఁగల పంచభూతములసంగతి విచారింపుదము. పృథ్వి యందుఁగల కఠినమే పృథ్వికిఁగల పృథ్విలక్షణము. ఆ కఠినత్వమునందుఁగల మృదుత్వమే పృథ్వియందుఁగల నీరు 34. పృథ్వియందు భాసించుచున్న కఠినత్వమే భాసాగ్నియొక్క-యంశము. మఱియుఁ గఠినత్వము (పృథ్విలక్ష ణము) నందుగల నిరోధలక్షణమే పృథ్విలోఁగల వాయువు 35. అన్నిఁటి యందున్నటులఁ బృథ్వియందుఁగూడ నాకాశమున్నదనుసంగతి ప్రత్యక్షమె గానఁ బ్రమాణమనవసరము. ఆకాశమునందే పంచభూతములు భాసించు చుండ నాకాశమునందు అన్యములగు నాలుగుభూతము లుండుటలో నాశ్చర్యమేమియును లేదు 36. ఏలయన, ఆకాశము విఱచిన విఱుగదు. పగులఁగొట్టినఁ బగులదు. మఱియు నువ్వుగింజయంతయేని యున్నతావు నుండి కదలదు. అదియెంతయు సూక్ష్మమైనది 37. పృథ్విలోగూడ నైదుభూతము లుండుట సిద్ధాంతమైనది. ఇట్లు ప్రతిభూతమునందును ఐదు భూతములు ఇమిడియున్నవి 38. ఈయంశము పైఁబైని తెలియ వలయునన్నఁ దెలియదు. తెలియకపోఁగా సందియముగూడఁ గలుగును. మఱియు భ్రాంతివశమున నీవిషయముపై వివాదములను గావింపవలయు నను దురభిమానముసైతము గలుగును 39.

వాయువునందింకేమేని యున్నటుల స్ఫురింపకపోయినను నందు బంచభూతము లిమిడియున్నసంగతి సూక్ష్మవాయువును శోధించినను గోచరించును 40. ఈ పంచభూతాత్మికవాయువే మూలమాయ. దీని యందే సూక్ష్మత్రిగుణములు గలవు. కావున మాయ, త్రిగుణములు నన్నియుఁ బాంచభౌతికము లైయున్నవి 41. ఇట్లు పంచమహాభూతములు త్రిగుణములుగలసి యష్టవిధప్రకృతి యైనది. కావున త్రిగుణములవెంట నవిగూడఁ బాంచభౌతికములనియే తెలిసికొనుఁడు 42. శోధింపక సందే హములకుఁ బాల్పడుట మూర్ఖత్వమగును. కావున నీయంశమును సూక్ష్మ

దృష్టితో విచారింపవలయును 43. మాయయందున్న సూక్ష్మమహాపంచ భూతములు త్రిగుణములతోఁ గలసి స్పష్టదశకు వచ్చెను. తరువాత జడత్వమునొంది స్థూలపంచతత్త్వస్వరూపములోనికి వచ్చెను 44. పిమ్మట ఆ స్థూలపంచతత్త్వములనుండి యీ పిండబ్రహ్మాండము మొదలగునవి యన్నియు సృజింపఁబడెను 45. పైని సంగ్రహముగాఁజెప్పిన పంచమహా భూతముల మిశ్రణమంతయును బ్రహ్మాండము నిర్మాణమగుటకుఁ బూర్వ స్థితి* 46. బ్రహ్మాండమునకుఁ (సృష్టి రచనమునకుఁ) బూర్వము మూల మాయ యుండెను. దానిని సూక్ష్మదృష్టితో విచారణము జేయవలయును 47. (పంచతత్త్వములు, అహంకారము, మహత్తత్త్వముగలసి) ఈ సప్తకంచుకి యగు ప్రచండబ్రహ్మాండము (త్రైలోక్యము) అప్పుడు నిర్మితము గాకుండెను. ఈ మాయ, అవిద్యల కోలాహలము బూర్తిగా నీవల విషయమే. (పైనఁ జెప్పినదంతయు దీనికిఁ బూర్వస్థితి) 48. బ్రహ్మవిష్ణు మహేశ్వరుల యుత్పత్తియు, పృథ్వి, మేరుపర్వత, సప్తసాగరముల పుట్టు కయుఁ దరువాతిదే 49. సమస్తలోకములు, నానావిధస్థానములు, చంద్ర సూర్య తారాగణములు, సప్తద్వీపములు, పదునాలుగు భువనములు మున్నగునవియు 50, శేషుడు, కూర్మము, సప్తపాతాళములు, ఇరువది యొక్క స్వర్గములు, అష్టదిక్పాలురు, ముప్పదిమూడుకోట్ల దేవతలు మున్నగునవి యన్నియుఁ దరువాత నేర్పడినవే 51. పంద్రెండుగురు సూర్యులు, ఏకాదశరుద్రులు, నవనాగములు, ఋషులు, నానావిధదేవావ తారములు గూడఁ బిమ్మటఁ బుట్టినవె 52. మేఘములు, చక్రవర్తియగు మనువు, నానావిధముల యుత్పత్తి మున్నగునవి యసంఖ్యాకముగా నున్నవి. ఎంతదనుకనని చెప్పుదును. ఇవియన్నియును (బరమాత్మకును మాయకును) నీవలివె 53. ఈ సంపూర్ణవిస్తృత బ్రహ్మాండమూలము, వెనుకఁజెప్పిన పాంచభౌతిక మూలమాయయే 54. ఇంతకుమున్ను జెప్పఁ

* మూలమాయ పాంచభౌతికము. కాని యీపంచభూతములు మాయయందు సూక్ష్మరూపములో నున్నవి. దీనికిఁదరువాత గుణమాయ, త్రిగుణములు, సూక్ష్మభూత ములు, స్థూలభూతములు (వీనిని శ్రీసమర్థులవారు తత్త్వములనిరి.) క్రమముగా నిర్మాణ మయ్యెను. ఐనను పైనజెప్పిన "ఒక్కొక్క భూతములోని పంచభూత మిశ్రణము" సూక్ష్మభూతముల స్థితి. అప్పుడీ బ్రహ్మాండము నిర్మాణము కాకుండెను.

బడిన సూక్ష్మభూతములే ముందునకువచ్చి స్థూలరూపము నొందెను. వాని వర్ణనము రాఁబోవుసమాసమునందు వేఱువేఱుగా విపులముగా నొనర్చితిని. శ్రోతలు వానిని బాగుగా నాలోచించి గ్రహింపవలయును 55—56. అట్లు విచారించి గ్రహించినయెడల నీపంచభూతాత్మికమగు బ్రహ్మాండస్థితి చక్కగా విశదము గాఁగలదు. అటుపిమ్మట నీ "మిథ్యాదృశ్యమును" విడిచి నిరాకారవస్తువును బొందఁగల్గుదురు 57. మహాద్వారమును గడచి భక్తులు దేవదర్శనమును గావించునట్లు దృశ్యవివేచనముగావించి మిథ్యాదృశ్యమును వదలి సాధకులు పరమాత్మదర్శనము నొందఁగల్గెదరు 58. ఈ సంపూర్ణదృశ్యమంతయు బంచభూతమయముగా నున్నది. దృశ్యము పంచభూతములు గలసిమెలసి యొకదానితో నొకటి పెనగొనియున్నవి 59. ఈ విధముగా నీసృష్టియంతయుఁ బంచభూతముల వలననే నిర్మాణమయ్యెను. దీనివర్ణన ముందుగ వినుండు 60.

---

## ఐదవ సమాసము — స్థూలపంచమహాభూతములు.

ప్రస్తుతవిషయము చాల కఠినమైనది. కావున సుబోధమగుటకై మిగుల స్పష్టముగాఁ జెప్పుదును 1. పంచభూతములతో నేర్పడిన యీ మిశ్రణము వేఱువిధముగాఁ గాఁజాలదు. ఇంకను గొంత స్పష్టపఱచి చెప్పుదును 2.

నానావిధములుగానున్న చిన్నపెద్దపర్వతములు, ఱాళ్ళు, శిలలు, శిఖరములు, కంకరఱాయి మున్నగునవియన్నియుఁ బృథ్వి 3. అనేక స్థలములలో నానావిధములుగానుండు మన్ను, ఇసుక మున్నగువస్తువులును 4, గొప్పగొప్ప సుందరగ్రామములు, నగరములు, మందిరములు, సౌధములు, సప్తద్వీపములు, నవఖండములు మున్నగునవియు 5—6, అనేక దేవతలు, రాజులు, బహుభాషలలో గౌశలముగల మానవులు, నానావిధములుగనుండు ఆచారపద్ధతులు గల మనుష్యులు, ఎనుబది నాలుగులక్షల యోనులనుండి జనించిన సంపూర్ణజీవులు, నింక నెందఱు జీవధారులుగలరో వారలందఱును పృథ్వియనియే గ్రహింపవలయును 7, పాడుపడిన మైదానములు, పచ్చగనుండి నేత్రపర్వమునుగూర్చు నరణ్య

ములు,గిరికందరములు మున్నగు నానావిధస్థావరములన్నియునుబృథివియే8. అనేక ప్రాకృతికస్థలములు, నానావిధములుగానున్న మానవనిర్మితస్థలము లును 9, సువర్ణాద్యనేకధాతువులు, నానావిధరత్నములు, బహువిధవృక్ష ములు మున్నగు దారుజాతియుఁ బృథ్వియే 10. ఇంతయేల, జడమును గఠినమును నెంతగలదో యదియంతయు నిస్సంశయముగాఁ బృథివియే11. సాధారణరీతిగా నిప్పుడు పృథ్వీరూపమును దెలిపితిని. ఇఁక జలలక్షణ ములను సంక్షేపముగాఁ జెప్పెదను. శ్రోతలు సావధానులరై వినుదురు గాక 12.

బావి, కొలను, చెఱువు, నది మున్నగువానిలోని జలము,మేఘము, సప్తసాగరములు మున్నగునవి యన్నియును గలసి జలము 13.

"క్షారక్షీరసురాసర్పిర్దధి ఇక్షుర్జలం తథా"

క్షారసముద్రమును మనమందఱము దఱచుగాఁ జూచియే యున్నారము. దాని జలమువలననే లవణమును జేయుచున్నారు 14. రెండవది పాలసముద్రము. దానినే క్షీరసాగరమని చెప్పుదురు. ఈ సము ద్రమును భగవంతుఁడు ఉపమన్యున కిచ్చెను 15. ఇవిగాక, మద్య సము ద్రము, ఘృతసముద్రము, దధిసముద్రము, ఇక్షురససముద్రము, శుద్ధజల సముద్రము అని యేడు సముద్రములుగలవు. ఈ యేడు సముద్రములు భూమి నావరించుకొనియున్నవి 16–17. ఈ విధముగానున్న జలమంతయు అప్పు 18. పృథ్వికిలోపలను వెలుపలను ముల్లోకములయందును నెంత జలమున్నదో యదియంతయు అప్పు 19. బహువిధలతలు, వృక్షములు, వృక్షరసము, తేనె, పాదరసము, అమృతము, విషము మున్నగునవి యన్నియు అప్పులోఁ జేరును 20. నానావిధరసములు, నేయి, నూనె మొదలగు చిక్కని ద్రవపదార్థములు, శుక్ర, రక్త, మూత్ర, లాలా, స్వేద, శ్లేష్మ, బాష్పాదులగు నార్ద్రపదార్థము లన్నియును అప్పులోఁ జేరును 21–24.

ఇఁకఁ దేజోలక్షణములను జెప్పెదను. చంద్రసూర్యతారాగణ ములు, తేజోయుతములగు దివ్యదేహములు మున్నగునవన్నియుఁ దేజో రూపములు 25. సాధారణమగు నగ్నియు మేఘములలోనుండి బయలు వెడలు పిడుగు, ప్రళయాగ్ని, బడబానలము, రుద్రాగ్ని, కాలాగ్ని,

భూగర్భాగ్ని మున్నగునవన్నియుఁ దేజము 26_27. ఇంతకును సారాంశ మేమన, తేజోయుతములును ప్రకాశితములును ఉష్ణోపేతములును ప్రఖర ములు నగునవన్నియుఁ దేజోరూపములు 28.

వాయువునకుఁగల ముఖ్యలక్షణము చంచలత్వము. వాయువు చైతన్యస్వరూపము. అన్నిటికిని జేతనమును బ్రసాదించునది వాయువే. కదలుట, మెదలుట, మాటలాడుట, నడచుట మున్నగు సృష్టిలోని బహువిధవ్యాపారములు వాయువువలననే జరుగుచున్నవి 29_30. చలనము, వల్గనము, ప్రసరణము, నిరోధనము, ఆకుంచనము మున్నగు నవన్నియు జంచలరూపియగు వాయులక్షణములు 31. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానములను బంచప్రాణములును, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయములను ఐదు ఉపప్రాణములును, ఇంకను నితరచలనమునుగూడ వాయులక్షణములు. చంద్రసూర్యతారాగణములుగూడ వాయుకారణముననే యాకాశమున స్థిరముగానున్నవి 32_33. ఇక ఆకాశమును విచారింతము నిర్మలము గను, నిశ్చలముగను, అవకాశరూపముగను, రిక్తముగను నుండు ప్రదేశమునంతయును ఆకాశమని తలంపవలయును 34. ఆకాశ మన్నింటి యందును వ్యాపించియున్నది. ఆకాశ మనేకముతో నొకటియై యున్నది. మిగిలిన నాల్గుభూతములును ఆకాశమునందే వర్తనము గావించుచున్నవి 35. అన్నిభూతములలో శ్రేష్ఠమైనది ఆకాశము. అది యన్నిటికంటెను బెద్దది. నిరాకారస్వరూపములో నది సమానముగ నున్నది 36. శిష్యుఁ డిటులఁ బ్రశ్నించెను. గురువర్యా! రెంటిరూపము సమానముగా నున్నపు డాకాశమునే బ్రహ్మమని యేల నుడువరాదు? 37. ఆకాశమునందును, బ్రహ్మమునందును భేదమేమియును లేనప్పుడు ఆయాకాశమును స్వతస్సిద్ధమని చెప్పవచ్చునుగదా!38. వస్తువు (బ్రహ్మము) అచలము, అటమును నిర్మలమునై యుండునట్లు ఆకాశముగూడ నున్నది. ఇంతయేల, ఆకాశము బ్రహ్మమునకు సరిసమానముగ నున్నది 39. వక్తయొసంగిన ప్రత్యుత్తరము. ఓయీ! వస్తువు (బ్రహ్మము) నిర్గుణమును శాశ్వతమునునై యున్నది. ఆకాశమునందుఁ గామక్రోధ శోకమోహభయములు అజ్ఞానశూన్యత్వములు అను నీ యేడువిధములగు

గుణములున్నటుల శాస్త్రములలోఁ జెప్పఁబడెను. అందుచే ఆకాశము భూతములలో నొకటిగాఁ బరిగణింపఁబడినది. నిర్గుణస్వరూపమన్ననో నిర్వికారమును, నిరుపమమును నై యున్నది 40-42. కంచుతోఁ గూర్పఁబడిన పృథివియు, జలమును నొక్క-రీతిగనే కాన్పించును. కాని యిది కంచు ఇది జలము అను వివేకమును జతురులగు మానవు లెఱుంగుదురు 43. దూదిరాశిలో మధ్య నొక స్ఫటికశిల పడియుండెను. ఇది యంతయును దూదిరాశియని జనులు దలంచుచుండిరి. ఒకదినమున నొక మనుజుఁడు ఇది దూదిరాశి యనుకొని దానిమీఁద దుమికెను. వెంటనే తలపగిలెను. ఈ పని దూదివలన నెట్లుకాగలదు? 44. కొన్నికొన్ని తెల్లని కంకరరాళ్ళు బియ్యములోఁ గలసి బియ్యపుగింజలవలె వంకరగలిగి యుండును. అవి భోజనము చేయుసమయమున దంతములలో బడినపుడు గాని గోచరించవు. త్రిభాగము (సున్నము, ఇసుక, గచ్చు) నందున్న కంకర (ఇసుక) త్రిభాగమువలెనే కనిపించును. కాని వెదకి పరిశోధించినచో కఠినరూపముతో వేఱుగనున్న ఇసుక గోచరించును 45-46. బెల్లమువలెనే బెల్లపురాయిగూడ నుండును. కాని బెల్లపురాయి కేవల కఠోరముగ నుండును. నాగవల్లికట్టెయు, మూలహారియు, హారియు నొక్క-టే పోలికగ నుండును. అంతమాత్రమున నా రెండును నొకటియెయని యెవరును జెప్పఁజాలరు 47. బంగారపునీరు పూయబఁడిన యిత్తడియు బంగారమును జూచుటకు సమానముగ నుండును. నిప్పుపయినుంచి కాల్చినచో బంగారునీరు పూసిన యిత్తడిబ్రతుకు బైటబడును 48. ఇఁక నీయల్ప దృష్టాంతములను జాలింతము. ఆకాశము కేవలము భూతము. ఆ భూతము అనంతము (బ్రహ్మము) నొక్క-టి యెట్లు గాఁగలవు? 49. వస్తువునందు (బ్రహ్మమునకు) వర్ణమేలేదు. ఆకాశమో శ్యామలవర్ణము గలది. ఈ స్థితిలో నేర్పరులగు మానవులు ఆకాశము బ్రహ్మము సమానమని యెట్లు చెప్పఁగలుగుదురు? 50.

అనంతరము శ్రోత లిట్లుప్రశ్నించిరి. స్వామీ! ఆకాశము కేవలరూపహీనము.(ఆకాశము బ్రహ్మము సమానముగా రూపరహితములు)51. మిగిలిన నాలుగుభూతములు నశ్వరములు. ఆకాశమునకుమాత్రము నాశనము లేదు. ఆకాశమునందు వర్ణవ్యక్తియును వికారమును లేదు 52. ఆకాశము

అచలముగాఁ గాన్పించును. దానికి నాశనమున్నటుల నెచట గోచరించును? ఆకాశము శాశ్వతమని మా యభిప్రాయము 53. ఈ ప్రశ్నము నాలించి వక్తయొసంగు ప్రత్యుత్తరమిది. ఇఁక నాకాశలక్షణములను ఆలింపుడు 54. ఆకాశము తమోగుణమునుండి జనించెను. అందుచే ఆకాశము కామ క్రోధ వేష్టితముగా నున్నది. అంతియగాక, ఆకాశమునకు అజ్ఞానము శూన్యత్వము అను పేరులుగూడ గలవు 55. అజ్ఞానమువలనఁ గామక్రోధ మోహాభయశోకాదులు జనించును. ఆ గుణములన్నియును ఆకాశలక్షణ ములే 56. ఆస్తిక్యము లేనిదానికి శూన్యమని పేరు. ఈ యర్థములోనే అజ్ఞానప్రాణులను హృదయశూన్యులని యందురు 57. స్థబ్ధతాకార మున ఆకాశము శూన్యము. శూన్యమే అజ్ఞానము. ఇటులే యజ్ఞానము జడత్వమునకు రూపము 58. కఠినమును, శూన్యమును, వికార రహి తము నగు నాకాశమును శాశ్వతస్వరూపమని యెట్లుచెప్పఁగలుగుదుము? పైపై నిజూచుటకుమాత్రము ఆకాశముసత్స్వరూపమువలెఁ గన్పించును59. కాని యాకాశమునందు అజ్ఞానము గలసియున్నది. ఆకాశము అజ్ఞానుల మిశ్రణము. జ్ఞానమువలన నాశనమగును గాన ఆకాశము నశ్వరమని గ్రహింపనగును 60. ఆకాశము, బ్రహ్మస్వరూపము చూచుటకు ఏక రూపముగా గోచరించును. కాని రెంటిలో శూన్యత్వవిశేషము గలదు. (ఆకాశమునకు స్వరూపమునకు భేదముచెప్పుదును. ఆకాశములో శూన్య త్వమున్నది. స్వరూపమున లేదు) 61. కల్పనబుద్ధితోఁ బైపయిచూచిన యెడల ఆకాశము బ్రహ్మము సమానముగాఁ దోఁచును. వాస్తవమునకు ఆకాశమునకు బ్రహ్మమునకు నెంతయో భేదమున్నది 62. జాగరూక సుషుప్త్యవస్థలు రెండును సమానముగనే గోచరించును. వివేకముతో జూచిన యెడల నీ రెంటియందుఁగల భేదము విశదమగును 63. కల్పిత పదార్థము సత్యపదార్థము సమానముగఁ గాన్పించును. పరీక్షకుల కీ రెంటి కినిగల భేదము గోచరించి తీరును 64. ఎండమావులనుజూచి లేళ్ళేల మోసపోవుచున్నవి? లేళ్ళకు సత్యాసత్య వివేచనశక్తి లేదు.

ఈ దృష్టాంతములవలన ఆకాశభూతము, పరమాత్మస్వరూపము వేఱువేఱని శ్రోతలు గ్రహింపఁగలరు 65. ఆకాశమునకంటె వేఱుగనుండి మనము ఆకాశము జూడఁగలము. అట్లు బ్రహ్మమును జూడవీలులేదు.

బ్రహ్మమును జూడవలయునన్నచో మనముగూడ బ్రహ్మము గావలసి యుండును. స్వభావసిద్ధముగా వస్తువునుజూచు విధమిది. (వస్తువుతోఁ దాదాత్మ్యము కలుగునంతవరకది గోచరింపదు) 66.

ఇంతటితో శంకానివారణమగును. సందేహవృత్తి యస్తమించును. భిన్నత్వమువలన స్వరూపస్థితి యనుభవములోనికి రాఁజాలదు 67. ఆకాశము అనుభవములోనికి వచ్చును. స్వరూప మట్లుగాదు. అనుభవము కంటె వేఱుగానున్నది. కావున నాకాశముతో దానికి సామ్యము కొంచె మేనిలేదు 68. పాలలోఁగలసియున్న జలమును రాజహంసములు విడదీయు నట్లు బ్రహ్మమును ఆకాశమును సాధుపురుషులు గ్రహించి విభజింపఁ గల్గుదురు 69. సంపూర్ణమాయకు సంబంధించిన గాథాజాలము దెలిసి కొనవలయు నన్నచో సాధుపురుషులచెంత కేగవలయును. మోక్షపదవి సాధు సమాగమమువలననే సిద్ధించును 70.



## ఆఱవ సమాసము — సత్సాంగత్యము - మోక్షము.

శ్రోత వక్తనుజూచి వినయపూర్వకముగా నిటులఁ బ్రశ్నించెను. కృపామూర్తీ! దీనుఁడనగునాకు సత్సంగమమహిమ యెట్టిదో, మోక్షము సత్సమాగమమువలన నెన్నిదినములకుఁ బ్రాపించునో తెలుపఁ బ్రార్థించెదను 1-2. వక్త ఇటులఁ బ్రత్యుత్తరముచెప్పెను. సత్సమాగమమువలన ముక్తి తత్కాలముననే లభించును. కాని సాధుజనుల యుపదేశములయందు విశ్వాసముంచవలెను. దుశ్చిత్తుఁడుగనుండుటవలన హానికలుగును3. ప్రశ్న: స్వప్నదశయందుఁగూడ మనస్సొక్కొక్కప్పుడు ఆకస్మికముగఁ జంచలమై పోవును. దానిని స్థిరముగానుంచు విధమెద్ది? 4. ఉత్తరము: మనస్సునకుఁ గల చంచలత్వమును వివేకముతోనాపి సావధానమును జూచికొని సాధు జనుల యుపదేశములనాలించి సమయమును సార్థకము గావింపవలయును5. తాను వినినదాని యర్థమును సిద్ధాంతమునుగూర్చి హృదయమునందు విచారింపవలయును. ఒకవేళ మనస్సింకను జంచలముకాఁదొడంగిన యెడల మఱల శ్రవణము జేయవలయును 6. అర్థమును దన హృదయమునఁ బాదుకొలుపక పైపై శ్రవణములు గావించువాఁడు శ్రోతయనఁదగఁడు

మనుష్యరూపముగానున్న పాషాణము 7. ఇక్కడ శ్రోతలను పాషాణముతోఁ బోల్చినారమని చింతించెదరేమో! మంచిది. ఇఁక సావధానమతితోఁ బాషాణ లక్షణములు వినుండు 8.

ఱాతినొకమారు చెక్కి సరిపఱచినచో నెల్లప్పుడునది యటులేయుండును చూడుఁడు. సుత్తెతో నొకమాఱు ఱాతినుండి విరుగఁగొట్టబడిన తునక మఱల నెప్పుడును దానితో నతుకదు. కాని మనుజునిస్థితి యట్టిది కాదు. వానికున్న దుర్బుద్ధి యొకమాఱు తొలంగించి వైచినచో రెండవ మాఱు తనంతన యావరించును 9-10. నేర్పుటవలన మనుజునకు దుర్బుద్ధి యొకమాఱు తొలంగిన తొలంగును. రెండవసారి మఱల నది లోనికివచ్చును. (పాషాణస్థితి యిట్టిదికాదు. అదియొకసారి చెక్కి సరిచేసినచో నిరంతర మటులేయుండును.) కావున మనుజునికంటెఁ బాషాణము మిగులమంచిదని తేలినది 11. దుర్గుణములను విడువఁజాలని మనుష్యునిఁ బాషాణముకంటె నీచునిగా భావింపనగును. ఆతనికంటె ఱాయియేకోటి రెట్లుమంచిది 12. పాషాణము కోటిరెట్లుమంచిదని యేలచెప్పితినో వినుండు 13. మాణిక్యము, ముత్యము, ప్రవాళము, వైడూర్యము, వజ్రము, గోమేధికమణి, స్పర్శవేది, చంద్రకాంతము, సూర్యకాంతము మున్నగు నమూల్యమగు ఱాళ్ళెన్నియోగలవు. ఇటులె నానావిధములగు నౌషధమణులు అత్యంతోపయోగకరము లింక నెన్నియో గలవు 14-15. ఇవిగాక యింకను విలువగల పాషాణము లెన్నియోగలవు. అవి నానావిధ పుణ్యతీర్థములందును, బావులయందును, గోనేరులయందును నున్నవి. మఱికొన్ని శిలలు శివకేశవులరూపముతోఁ బూజింపఁబడుచున్నవి 16. ఈ దృష్టితో విచారించితిమేని మనుష్యుఁడా పాషాణములముందు మిగులఁ దుచ్ఛుఁడని విశదమగును 17. కావున మనుజుఁడు పైన చెప్పఁబడిన శిలలతో సమానుఁ డెన్నటికిని గాఁడు. దుశ్చిత్తులు, భక్తిహీనులు నగువారలను మాత్రమే అపవిత్రములు, నిరుపయోగములు నగు ఱాళ్ళతో బాగుగాఁ బోల్పవచ్చును 18.

ఇఁక నీ విషయమును విడిచివేయుదము. దుశ్చిత్తమువలన హాని గలుగుననియు, నీ కారణముననే మానవునకుఁ బ్రపంచముగాని పరమార్థముగాని సమకూరఁజాలదనియు బాగుగా జ్ఞాపకముంచుకొనవలయును 19.

దుశ్చిత్తత్వమువలనఁ గార్యనాశనమగును. మనస్సునఁ జింతగలుగును. మఱియు విన్నమాట క్షణమునేఁపేని హృదయమున నుండదు 20. దుశ్చిత్తమువలనఁ బరాజయము కలుగును. జననమరణములుప్రాప్తించును. హానికలుగును 21. దుశ్చిత్తులగువారు సాధనమునకుఁగాని, భజనమునకుఁ గాని తగరు. వారలు జ్ఞానమునెన్నఁటికి నార్జింపఁజాలరు 22. నిశ్చయము గాని, విజయముగాని, స్వహితముగాని దుశ్చిత్తునకు సమకూరదు 23. పైకిఁజూచుటకు స్థిరబుద్ధి గలవానివలె గోచరించినను దుశ్చిత్తుఁడు తన హృదయమునమాత్రము తీరనిసందియములచే నాందోళనపడుచుండును24. పిచ్చివానికి, పిశాచావేశముచే బాధపడువానికి, గ్రుడ్డివానికి, మూఁగ వానికిఁ, జెవిటివానికి నెటులఁ గాలము వ్యర్థముగాఁ గడచునో యటులే దుశ్చిత్తునకుగూడఁ గడచుచుండును 25-26. సావధానము గలిగియున్నను నిట్టి మనుజులకు బరమార్థమేమియు బోధగాదు. చెవులుండినను మంచి విషయము వినఁబడదు. జ్ఞానమున్నను సారాసారవిచారమే తెలియదు 27. దుశ్చిత్తునకును, రాత్రింబవళ్ళు సోమరితనముతో మెలంగువానికిని బరలోక మెన్నఁటికిని లభింపదు 28. దుశ్చిత్తుఁ డెటులో తన నైజగుణమునుండి విడివడినంతనే వానిని సోమరితన మావరించును. సోమరితన మేర్పడిన యంతన మానవునకు సదవకాశము చిక్కఁజాలదు 29.

అలసత్వమువలన నాలోచన మంతరించును. ఆచార మడుగు బట్టును. ఏమేమి యాచరించినను సోమరికి ఉత్తమోత్తమములగు విషయములు జ్ఞాపకముండవు 30. అలసత్వమువలన శ్రవణము కుదురదు. నిరూపణము కాదు. పరమార్థవివేచనమునందు శక్తి మలినమైపోవును 31. నిత్యనియమములు సోమరితనమువలన నశించును. అభ్యాసము తొలఁగి పోవును. సోమరితనమువలన సోమరితనము మఱింత వృద్ధినొందును 32. అలసత్వమువలన ధారణయు, ధృతియు నడుగుబట్టును. వృత్తి మలిన మగును. వివేకము మందగించును 33. అలసత్వమువలన నిద్ర వృద్ధి యగును. వాసన విస్తృతమగును. నిశ్చయాత్మకమగు సద్బుద్ధి నేలఁ గలియును 34. దుశ్చిత్తమువలన అలసత్వ మంకురించును. అలసత్వము వలన సుఖనిద్రవచ్చును. సుఖనిద్రవలనఁ గేవల మాయువునాశనమగును 35. నిద్రయు, సోమరితనము, దుశ్చిత్తత కలుగుటయే **మూర్ఖలక్షణము.**

ఈ యవగుణములవలన నిరూపణము బోధలోనికి రాఁజాలదు 36. ఈ మూఁడు దుర్లక్షణములెచటనుండునో అచ్చట వివేకము నిలువనేనిలువదు. అజ్ఞానియగు పురుషుఁ డీయవగుణములయందే సౌఖ్యమున్నదని తలంచును 37. ఆఁకలియైనతోడనే భుజించును. భుజించినంతన సోమరితన మావరించును.సోమరితన మావరించినంతన నిర్భయముగా నిదురించును38. ఇటుల నిద్రాసౌఖ్య మనుభవించి లేవఁగనే మఱల దుశ్చిత్తుఁడగును. ఇట్లు వర్తించు పురుషు లెన్నఁటికిని సావధానచిత్తులు కాఁజాలరు. ఇఁక నిట్టి స్థితిలో వారలకు నిరూపణమునం దాత్మహితజ్ఞాన మెట్లుకలుగును ? 39. కోతికి రత్నమును, బిశాచమునకు ద్రవ్యకోశమును అప్పగించుటవలనఁ గలుగుదశయే దుశ్చిత్తునిముందు నిరూపణమునకుఁ గలుగును 40.

సాధుసమాగమమువలన మోక్ష మెన్నిదినములలో లభించునని మొదట శ్రోతలు ప్రశ్నించియున్నారు. దానికిఁ బ్రత్యుత్తర మిపుడు సావధానులరై వినవలయును 41—42. స్పర్శవేది సోకినంతనే ఇనుము బంగారముగా మారునట్లుగను, జలబిందువు సాగరములో వెంటనే కలసిపోవునట్లుగను, ఏదేని యొకనది గంగలో సంగమించినంతన గంగారూపమై పోవునట్లుగను 43, సావధానియు, ఉద్యోగియు, దక్షుఁడును నై యుండు పురుషుఁడు తత్కాలముననే సత్సంగమమున మోక్షమును బడయును. ఇతరుల కది యలభ్యము. దాని నితరులు చూడనేలేరు 44. మోక్షము బడయుటకు శిష్యుని ప్రజ్ఞయే ప్రధానసాధనము. ప్రజ్ఞావంతునకుఁ గార్యము సాధించుటలో నాలస్యముండదు. అనన్యుఁడగువానికిఁ దత్కాలముననే మోక్షము లభించును 45. ప్రజ్ఞావంతుఁడును, అనన్యుఁడునగు వాఁడు మోక్షమునొందుట కొకక్షణమాత్రమేని పట్టదు. అనన్యభావము కలుగు నంతవఱకుఁ బ్రజ్ఞయేమియు నుపకరింపఁజాలదు 46. ప్రజ్ఞలేనిది అర్థము తెలియదు. విశ్వాసములేనిది వస్తుజ్ఞానము కలుగదు. ప్రజ్ఞావిశ్వాసముల వలన దేహాభిమానము విడిపోవును 47. దేహాభిమానము విడిపోయినంతన సహజముగానే వస్తుప్రాప్తియగును. సత్సంగమమువలన సద్గతి వెంటనే లభించును 48. విశేషించి సావధానిగను, ఉద్యోగిగను, బ్రజ్ఞావంతుఁడుగను, విశ్వాసిగను నుండువాఁడు సావధానములనుగూర్చి పరిశ్రమ చేయవలసిన యవసరమేలేదు 49. ఉత్తమభావ యుక్తులుగ నుండువారికిఁగూడ

సాధనమువలన మోక్షము లభించును. సాధుసంగమమువలన దత్త్వాలము నసే వివేకదృష్టి వికసించును. 50 ఐనను అధ్యాత్మనిరూపణ శ్రవణసాధన మును అవశ్యముగాఁ జేయవలయును. ఏలయన, నీ సాధనమువలన నందఱ కును లాభముగలుగదు 51.

ఇఁకముందు మోక్షమెట్టిది ? స్వరూపదశయెట్టిది ? సత్సంగము వలన మోక్షము చేకూరునను విశ్వాస మేల కలిగియుండవలయును? అను నీ నిరూపణములన్నియుఁ జక్కఁగ వివరింపఁబడును. శ్రోతలు స్థిరచిత్తులరై యీ నిరూపణములయెడఁ దమధ్యానము నుంతురుగాత 52_53. అవగుణ ములను విడిపించుటకు న్యాయనిష్ఠురములను (న్యాయ మతిక్రమింపని నిష్ఠురవాక్యములను) నుడువవలసివచ్చెను. శ్రోత లనుగ్రహించి యిట్టి వాక్యములు పలికినందులకు అప్రసన్నులు కాకుందురుగాక 54.

---

## ఏడవ సమాసము — మోక్షలక్షణము.

మోక్ష మెన్నిదినములలో లభించునని శ్రోత లింతకుముందుఁ బ్రశ్నించియున్నారు. ఇప్పుడు దానికిఁ బ్రత్యుత్తరము చెప్పుదును. స్థిర చిత్తముతో వినుండు 1. మోక్షమునెటు లెఱుంగవలయును ? మోక్షమని దేనినందురు ? సత్సంగమువలన మోక్షమెట్లు లభించును ? అను విషయ ములనుగూర్చిగూడ మీకుఁ దెలుపుదును 2. బంధింపఁబడినవానిని బద్ధుఁ డందురు. విడివడినవానిని, మోక్షము నొందినవానిని ముక్తుఁడందురు. ఇప్పుడు సాధుసమాగమమువలన మోక్ష మెట్లుగలుగునను విషయమును దెలుపుదును 3. ప్రాణి సంకల్పముతో బంధింపఁబడియున్నది. జీవత్వము వలన బద్ధమైయున్నది. సాధుజనులు బంధమునుండి వివేకముచే విముక్తిని గాంతురు 4. "నేను జీవుఁడను" అను నీ సంకల్పమును దృఢముగా మానవులు ధారణము గావించినపిదపఁ గొన్ని సంకల్పములు దాటిపోయి నవి. ఈ సంకల్పముచేతనే దేహబుద్ధితోఁ బ్రాణిబద్ధమగుచున్నది 5. "నేను జీవుఁడను. నాకు బంధనములున్నవి. నాకు జన్మమరణములున్నవి. మఱియు నిప్పుడు గావించినఫలమును మఱియొకప్పుడు నేను అనుభవింతును. పాప ఫలము దుఃఖము. పుణ్యఫలము సుఖము. పాపపుణ్యముల ఫలము ప్రాణి

యవశ్యముగా ననుభవించి తీఱవలెను. పాపపుణ్య ఫలానుభవము విడిపోదు. గర్భవాసముగూడఁ దొలఁగిపోదు" అను నీకల్పనముదృఢముగా బాదుకొనిపోవుటకే 6-8 బంధింపఁబడి యుండుటయని పేరు. పట్టుపురుగు తన దారముచేఁ దన్నుఁజుట్టుకొని తనకుఁదానే బద్ధమగుచున్నది 9. అజ్ఞాన ప్రాణియగు మానవుఁడు భగవంతుని నెఱుంగఁజాలక యిట్లు నుడువును. "నాకు జన్మమరణములు తొలంగిపోవు 10. ముందుజన్మమున కాధారము గలుగుటకు కిప్పుడేదేని దానముచేసికొందును. దానివలన నా జీవితము సుఖముగా గడువఁగలదు 11. పూర్వజన్మమున దానముచేయలేదు. అందువలననే నేను దరిద్రుఁడనైతిని. ఇప్పుడైనను కొంచెము దానముచేయవలదా" 12. ఇట్లు విచారించి యాతఁడేదేని ప్రాఁతవస్త్రమునో రాగిడబ్బునో దానముగావించును. మఱియు నిఁకముందు నేను జేసిన దానమునకుఁ గోటిరెట్లు ప్రతిఫలము నొందుదునని తలంచును 13. కుశావర్తములోఁ గురుక్షేత్రములోఁ గావించిన దానమహిమలను విని దానములు గావించును. అనంతరము తన హృదయమునందు నేను కోటిరెట్లు ఫలితము నొందుదునని ఆశించును 14. డబ్బునో, దుగ్గానినో దానము గావించును. అతిథి అభ్యాగతుల ముఖము నందొక తృణమునో, కణమునో వేయును. అనంతరము తన మనస్సులో "నిఁకనాకు నేనొసంగినదానికిఁ గోటిరెట్లు లభింపఁగలవు 15. ఆ కోటిరెట్లు నేను ముందుజన్మమునందు హాయిగాఁ గూర్చుండి యనుభవింతును" అని యనుకొనును. ఇట్లే ప్రాణులవాసన జన్మకర్మములయందుఁ గూరుకొనిపోవును 16.

ఈ జన్మమునందు నేనేమియిచ్చితినో దానిని రాబోవు జన్మమునందుఁ దిరుగఁబొందఁ గల్గుదునని తలంచువాఁడు అజ్ఞాని యనియును, బద్ధుఁడనియును నెఱుంగవలయును 17. బహుజన్మముల పిమ్మట నీ నరదేహము లభించినది. ఒకవేళ నీ దేహమున జ్ఞానముచే సద్గతికలుగదేని మఱల గర్భవాసము విడిపోవదు 18. ఆ పిమ్మట గర్భవాస మీ నరదేహమునందే కలుగునని నిశ్చయముగా భావింపవీలులేదు. ఆకస్మికముగా నీచయోనులలో జనించుటగూడఁ దటస్థింపవచ్చును 19. శాస్త్రములనేకములు గలవు. అందు ననేకులీ లోకమునందు మఱల నరజన్మము లభించుట దుర్లభమని ఏకకంఠముగా నిశ్చయించియున్నారు 20. పాప

పుణ్యములు సమముగా నున్నపుడే మానవదేహము లభించుననియు, నితరవిధముగా మానవజన్మము ప్రాప్తింపదనియు శ్రీ భాగవతములో వ్యాసులవారు చెప్పినారు 21.

శ్లో॥ శరీరమాద్యం సులభం సుదుర్లభం ప్లవం సుకల్పం గురుకర్ణధారం।
మాయానుకూలేన నభస్వతేరితం పుమాన్ భవాబ్ధిం నతరేత్సఆత్మహా॥ ౧

పరమదుర్లభమును, అతిదృఢమునగు నరదేహరూపమను నౌకను గురురూపియగు కర్ణధారుని ఈశ్వర కృపారూపమగు అనుకూలవాయువును బొందియుండియు భవసాగరమును దాటఁజాలని మానవుఁడు ఆత్మహంతకుఁడు 22_23. జ్ఞానము లేనియెడల మనుజుఁడు ఎనుబదినాలుగు లక్షల జన్మమృత్యువుల ననుభవింపవలసియున్నది. దీనినిబట్టి యాతఁడు ఎనుబదినాలుగులక్షల జీవములను గావించెనని భావింపవలెను. ఇందువలననే యాతఁ డాత్మహంతకుఁ డయ్యెను 24. జీవుఁడు నరదేహమునందు జ్ఞానప్రాప్తి గావించుకొనన నంతవఱకు జననమరణములు విడిపోవు. నానావిధ దారుణములును, నీచములునునగు యోనుల ననుభవింపవలసియే యుండును 25. జ్ఞానము కలుగకుండుటవలన జీవునకు, ఎలుగుబంటి, కోతి, కుక్క, పంది, గుఱ్ఱము, ఎద్దు, గేదె, గాడిద, కాకి, కోడి, నక్క, బల్లి, తొండ, కప్ప, ఈగ మున్నగు నీచయోను లెన్నియో యనుభవింపవలసియుండును. కాని మూర్ఖమగు మనుష్యజాతి ముందుజన్మమును గూర్చి యికమీఁదఁగూడ ఆశపడుచున్నది 26_27. చనిపోయిన పిమ్మట మఱల మనుష్యదేహమే లభించునను విశ్వాస ముంచుకొనుటలో మనుజులు సిగ్గుపడకున్నారు 28. మఱల నరదేహమే లభించుటకుఁ దగిన పుణ్యమా మానవుఁ డేమిసంపాదించుకొనెను ? ముందుజన్మపు టాశపెట్టుకొనుట దురాశ యనిపించుకొనును 29. మూర్ఖమును, అజ్ఞానమునునగు నీ మనుష్యజాతి సంకల్పమువలననే స్వయముగా దన్ను బంధించుకొని తనకుఁ దాను శత్రువై కూర్చుండియున్నది 30.

ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః॥

ఆ సంకల్పబంధనము సాధుసమాగమమువలన విడిపోవును 31. సమస్త చరాచరజీవుల శరీరములు పంచభూతములవలన నిర్మాణములగుచున్నవి. ప్రకృతిస్వభావముగనే జగదాకారమునందు వర్తించుచున్నది 32.

దేహము, అవస్థ, అభిమానము, స్థానము, భోగము, మాత్రము, గుణము, శక్తి మున్నగునవి చౌపుటి (నాల్గేసిగల) తత్త్వముల లక్షణములు* 33. పిండబ్రహ్మాండముల రచనము ఇట్టిది. విస్తారమువలనఁ గల్పనము వృద్ధియయ్యెను. తత్త్వజ్ఞానమునుగూర్చిన నిర్ధారణము చేసిచేసి నానామతములు డీకొనుచున్నవి 34. ఆ నానామతములలో నానాభేదములు గలవు. భేదములవలన వివాదములు వృద్ధియగుచున్నవి. కాని యేకత్వవిషయము సాధువులుమాత్రమే యెఱుంగుదురు 35. ఆ విషయలక్షణ మేమన! దేహము పాంచభౌతికము. దానియందుఁగల ఆత్మ ముఖ్యమైనది 36. దేహము అంత్యమున నాశనమైపోవును. కావున దాని నాత్మయనఁజాలము. దేహములందు నానాతత్త్వముల సముదాయ మిమిడియున్నది 37. అంతఃకరణము, ప్రాణము, విషయములు, దశేంద్రియములు, సూక్ష్మదేహము ♦మున్నగువాని లక్షణములు శాస్త్రములలో వివరింపఁబడియున్నవి 38. సూక్ష్మదేహమునుగూర్చి శోధించుటవలన అంతఃకరణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మున్నగు నానాతత్త్వోపాధులకంటె వేఱుగ ఆత్మయున్నదని విశదమగును 39. స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము, విరాట్టు, హిరణ్యాగర్భ, అవ్యాకృత, మూలప్రకృతి యనునామములుగల దేహము లెనిమిది గలవు 40. నాలుగు పిండములలో నాలుగు బ్రహ్మాండములలో నీవిధముగా దేహము లెనిమిదిగలవు. వీనియందుఁ బ్రకృతినింబురుషుని వృద్ధినొందించినచో పదిదేహము లగును 41. తత్త్వముల లక్షణమిట్టిది. ఆత్మతత్త్వములకు సాక్షిగానున్నది. ఐనను ఆత్మతత్త్వములకంటె వేఱుగనున్నది. కార్యము, కర్త, కారణము, ఈమూఁడు దాని (ఆత్మయొక్క) దృశ్యములు 42.

జీవశివులు, పిండబ్రహ్మాండములు మున్నగునవి మాయ, అవిద్యలతో సంబంధించిన గందరగోళములు. వీనిని (ఈ గందరగోళములను) వివరింపఁబూనినచో విషయము మిగుల విస్తృతమగును. ఆత్మ వీని

---

* నాలుగేసి తత్త్వములుగల చౌపుటినిగూర్చి 17 వ దశకము 9 వ సమాసము 1 మొదలు 6 పద్యములలో విస్తృతముగ వర్ణింపఁబడెను. అందుఁ జూడనగును.

♦ సూక్ష్మదేహ వివరణమును గూర్చిన విశేషవర్ణనము 17-వ దశకము 6-వ సమాసము 18 మొదలు 22 వఱకుఁగల పద్యములలోఁ గాంచవలయును.

యన్నింటికంటెను వేఱుగానున్నది 43. వాస్తవముగాఁ జూచిన వో ఆత్మలు నాలుగుగలవు. వాని లక్షణములు చెప్పెదును ఈ చెప్పబోవువిషయము నందు మీ హృదయము దృఢముగా నుంచుఁడు 44. మొదటిది జీవాత్మ, రెండవది శివాత్మ, మూఁడవది సంపూర్ణ విశ్వవిశ్వమున కాత్మయగు పర మాత్మ, నాలుగవది నిర్మలాత్మ 45 మాయాకారణమున నీ నాలుగింటిలో ఉచ్చనీచభేదములు భాసించుచున్నవి. కాని వాస్తవమున కీనాలుగును నొక్కటియే. దీనికి దృష్టాంతము 46. ఘటాకాశము, మఠాకాశము, మహదాకాశము, చిదాకాశము అను నీ నాల్గును ఆకాశభేదములు. (ఉపా ధికారణమునఁ గల్గినవి.) కాని వాస్తవమున కివియన్నియును గలసి ఒక్క యాకాశమేయైనట్లు 47, జీవాత్మ, శివాత్మ, పరమాత్మ, నిర్మలాత్మలు అను నీనాలుగు భేదములును మాయాకారముననే యేర్పడి యున్నవి. బాగుగాఁ జూచితిమేని అన్నియును గలసి ఆత్మయొక్కటియే 48. ఘట మునందు వ్యాపించియున్న ఆకాశము ఘటాకాశము. అటులే పిండము (సచరాచర దేహములు) నందు వ్యాప్తమైయున్న బ్రహ్మాంశమును జీవాత్మయందురు 49. మఠము (గృహము) నందు వ్యాపకమైయున్న ఆకాశము మఠాకాశము. అటులె బ్రహాండమునందున్న బ్రహ్మాంశమును శివాత్మయని చెప్పెదురు 50. మఠమునకు వెలుపల వ్యాపించియున్నటులఁ గాన్పించు ఆకాశమును మహదాకాశమని చెప్పెదురు. ఇట్లే బ్రహ్మాండ మునకు వెలుపలనున్న బ్రహ్మాంశమును బరయాత్మయని చెప్పదురు 51. చిదాకాశము ఘటమఠాదులగు నుపాధులకంటె వేఱుగానున్నట్లు పర మాత్మగూడ దృశ్యరూపోపాధికంటె వేఱుగానున్నది 52. ఉపాధియోగ మువలన ఆకాశము భిన్నముగాఁ గాన్పించును. సత్యమునకది యభిన్న మైనది.అట్లేస్వానందఘనమగు సచ్చిదానంద పరమాత్మగూడ సమరసమును అభిన్నమునై యున్నది 53. దృశ్యమునందు లోపలవెలుపల నిరంతర ముగాఁ బరమాత్మ వ్యాప్తమైయున్నది. దాని గొప్పతనము వివరించుటకు శేషుడుగూడ నసమర్థుఁడు 54. ఈ పరమాత్మను నెఱుంగుటవలన జీవత్వ ముండదు. ఉపాధిని జూపుచున్నపుడు జీవాత్మాది చతుర్భేధములును దానియోగముననే యేర్పడియున్నటుల విశదమగును. వాస్తవమున కవియన్నియు నభిన్నములు 55. ప్రాణి జీవత్వకారణమున ఏకదేశీయమై

అహంకార యోగమువలన జన్మపరిభ్రమణములందుఁ బడెను. వివేక దృష్టితోఁ జూచినచోఁ బ్రాణికి జన్మాదులేవియును లేవని తేటపడును 56.

జన్మమృత్యువులనుండి విడిపోవుటను మోక్షమందురు. తత్త్వముల నన్వేషించినచో వాస్తవవస్తువు (బ్రహ్మము) లభించును 57. ఆ వస్తువే మనమైయున్నారము. 'సోహం' అను నీమహావాక్యతాత్పర్యమును సాధువులే తమనోటినుండి చెప్పుదురు 58. సాధు వేక్షణమునం దనుగ్రహించునో ఆ క్షణముననే మోక్షము గలుగును. ఆత్మయందు బంధన మెక్కడ నుండివచ్చినది? 59. ఇంతటితో మాశ్రోతలకు శంకవిడిపోవును. సందేహవృత్తి యస్తమించును. సాధుజనసంగమువలనఁ దత్కాలముననే మోక్ష పదవి లభించును 60. స్వప్నమందు బంధితమగుప్రాణి జాగ్రదవస్థలోనికి వచ్చినపిదప ముక్తమగునట్లు అజ్ఞానకాలమున బద్ధులగు జీవులు జ్ఞానము వలన మోక్షమొందుచున్నారు 61. అజ్ఞాననిశి యంతమైనపిమ్మట సంకల్ప విషయికములగు దుఃఖములన్నియు నాశనమగును. వెంటనే మోక్షము సిద్ధించును. 62. స్వప్నబంధములను ద్రెంచివేయుటకు ఇతరసాధనములను వెదుకవలసిన యవసరము లేదు. జాగ్రదవస్థనొందుటతక్క నందుల కితర యత్నముతోఁ బనియేలేదు 63. అట్లే సంకల్పముతో బంధింపఁబడిన జీవునకుఁ గడతేరుటకు రెండవయుపాయ మేదియులేదు. అతనిబంధనము లన్నియు వివేకమువలననే విడిపోవును 64. వివేకములేక చేయుసమస్తోపాయములు వ్యర్థములగును. వివేకముతోఁ జూచినయెడల స్వయముగా జీవుఁడే యాత్మ 65. ఆత్మకు బద్ధత్వములేదు. మోక్షములేదు. ఆత్మకీరెంటిలో నేదియునులేదు. అట్లే జన్మమృత్యువులు కలుగుటగూడ ఆత్మ కెప్పటికిని సంభవముగాదు 66.



## ఎనిమిదవ సమాసము – పరమాత్మదర్శనము.

పరమాత్మవు నీవేయని వెనుకఁ జెప్పియుంటిని. ఇప్పు డాపరమాత్మను జూడుఁడు 1. పరమాత్మకు జన్మమృత్యువులు, రాకపోకలు, బంధమోక్షములు లేవు 2. పరమాత్మ నిర్గుణముగను, నిరాకారముగను, అనంతముగను, అపారముగను, నిత్యముగను, నిరంతరముగనునై యథా

విధముగనున్నది 3. అది యన్నింటియందును వ్యాప్తమైయున్నది. అనేకములలో నొక్కటిగ నున్నది. దానినిగూర్చిన వివేక మతర్క్యము 4. పరమాత్మస్థితి పైని నుడువఁబడినటులుండునని శ్రుతులు పలుకుచున్నవి. భక్తి వలనఁ బరమాత్మ లభించుననుట నిస్సంశయము 5. ఆ భక్తి తొమ్మిది విధములుగా నున్నవి. నవవిధభక్తులవలన ననేకులు ముక్తులైరి 6. తొమ్మిది విధములగు భక్తులలో ఆత్మనివేదనభక్తి ముఖ్యమును శ్రేష్ఠమును నై యున్నది. దీనిని స్వీయముగను, స్వానుభవరూపముగను, విచారముచేయవలయును 7. తనను దనయనుభవముతోనే నివేదింపవలయును. దీనినే ఆత్మనివేదనమని చెప్పుదురు 8. మహాపూజాంతమున "నా" యను మోహమును విడిచి దేవతాసన్నిధిని మస్తకమునుగోసి యర్పించునట్లు ఆత్మనివేదన భక్తియందుగూడఁ బరమేశ్వరునిలోఁ దన "నా" యను భావమును లీనపఱుపవలయును 9. తన్నుఁదానర్పించెడి (నివేదించెడి) భక్తులు కొలఁదిగనుందురు. అట్లుచేయువారలకుఁ బరమాత్ముఁడు తత్క్షణమే ముక్తి నొసంగును 10. శ్రోత యిట్లు ప్రశ్నించెను. తననెట్లునివేదించుకొనవలయును? ఎక్కడకేనిపోయి సాష్టాంగపడవలయునా? లేక దేవతాసన్నిధిని దలను గోసిపెట్టవలయునా? ఏమి చేయవలయును? 11. దీని ప్రత్యుత్తరమును సావధానముగ వినుండు 12.

ఆత్మనివేదనలక్షణ మెద్దియన, మొట్టమొదట "నేనెవ్వఁడను" అని చూడవలయును. ఆపిమ్మట నిర్గుణపరమాత్మను గుర్తింపవలయును 13. ఈ ప్రకారముగాఁ బరమాత్మునియొక్కయు భక్తునియొక్కయు శోధనము గావించుటవలన ఆత్మనివేదనమగును. భక్తుఁడు పరమాత్ముని శాశ్వతత్త్వము ననుభవము గావించును 14. పరమాత్మను గురుతించుచు గురుతించుచు నుండ భక్తుఁడు ఆ పరమాత్మయందె తద్రూపమైపోవును. మఱియుఁ బరమాత్మునియందును భక్తునియందును భిన్నత్వ మేమాత్రము నుండదు 15. భక్తుఁడు పరమాత్మునికి విభక్తుఁడుగ నుండఁడు. అందువలననే యాతఁడు భక్తుఁడని పిలువఁబడుచున్నాఁడు. బంధనములేనివాఁడు ముక్తుఁడగును. నేను చెప్పునది శాస్త్రోక్తము 16. పరమాత్మునియొక్కయు భక్తునియొక్కయు, మూలమును జూచినచో నీరెంటిమూలములకు భేదము లేదనియు నివిరెండును నొక్కటియేయనియు నీదృశ్యము జగత్తుకంటె

వేఱుగానున్నదనియు విశదమగును 17. పరమాత్మునితోఁ గలిసినపిమ్మట ద్వైతముండదు. పరమాత్మకును, భక్తునకును గలభిన్నత్వభేదము నశించును 18. ఆత్మనివేద నానంతరమునుండెడి యభేదభక్తినే సత్యసాయుజ్యముక్తియని యెఱుంగవలయును 19. సాధుపురుషుల శరణ్యములోని కరిగి అద్వైతనిరూపణ బోధనొందునాతఁడు తప్పక తద్రూపమగును. వానినొకవేళ మఱల వేఱుచేయఁబూనినను వేఱుకాఁడు 20. నది సముద్రములోఁ గలసిపోయినపిదప మఱల వేఱుజేయ నశక్యము. లోహము బంగారమైనపిమ్మట నది మఱలఁ గాళిమము నొందఁజాలదు 21. అటులె భగవంతునిలోఁ గలసిపోయినవాఁడు మఱల వేఱు గాఁజాలఁడు. భక్తుఁడు స్వయముగాఁ బరమాత్ముఁడగును. ఇఁక మఱల నాతఁడెన్నఁటికిని విభక్తుఁడుగాఁడు 22. పరమాత్మునియొక్కయు, భక్తునియొక్కయు అనన్యతను అనుభవముగాపించు సాధుపురుషునే మోక్షప్రదాయకుఁడనఁదగును 23.

ఇఁక భక్తత్వముతోఁ బరమాత్మునిదర్శించు తెఱంగు దెలుపుదును. ఈ యంశము నెఱింగినంతన పరమాత్ముని యైశ్వర్యము మనలోనికే తెంచును 24. దేహమునే నేననిభావించుటవలన స్వాభావికముగా దేహదుఃఖముల ననుభవింపవలసివచ్చును. దేహాతీతుఁడగుటవలనఁ బరబ్రహ్మము లభించును 25. ప్రశ్న, దేహాతీతుఁడగుటయెట్లు? పరబ్రహ్మము నెట్లుపొందవలయును? ఐశ్వర్యలక్షణము లెయ్యవి? ఆజ్ఞయిండు 26. దీనికిఁ బ్రత్యుత్తరమును జెప్పుచున్నాఁడను. సావధానులరై వినుండు27. వస్తువు దేహాతీతము. ఆపరమాత్మయే నిన్నుఁగా నీవుభావింపుము. విదేహుఁడవైన నీకు దేహాసంగముతో నేమియుఁబనిలేదు 28. ఇట్టి (పై నిచెప్పఁబడిన) బుద్ధిగలిగినవానిని వేదము లభివర్ణించును. నానాశాస్త్రములుగూడ వెదకి వానినిబొందనేరవు 29. దేహబుద్ధిని విడిచినపిమ్మట సత్యముగా నీ యైశ్వర్యము సిద్ధించును. దేహమే నేనని భావించునెడల అధోగతికలుగును 30. సాధుపురుషుని వచనముల నసత్యములుగాఁ దలంపఁదగదు. ఏలయన! అట్లు భావించినచోఁ బాపముగలుగును 31. శిష్యుఁడిటులఁ బ్రశ్నించెను - ఓస్వామీ! సాధువచనములనగాఁ నెయ్యవి? విశ్వాసముంచదగినదెద్ది? అనుగ్రహించి సెలవిండు32 స్వానందఘనము, అజన్మ, సోహం, అనుశబ్దములతో నిర్దిష్టమగు నాత్మయే

నీవు, ఇదియే సాధువచనము. దీనిమీదనే విశ్వాసముంచవలయును 33. నీవే నిరంతరము బ్రహ్మమవు. మహావాక్యమునందలి రహస్యమిదియే. ఈ వాక్యమును మఱువఁగూడదు 34. దేహాంతమైనపిమ్మట నేననంతమును (బ్రహ్మమును) పొందెదను అను నీ విషయము నిర్భ్రాంతమని యెప్పుడును భావింపరాదు 35. కొందఱుమూర్ఖులు కల్పాంతమునందు మాయనాశన మైనప్పుడె మాకు బ్రహ్మప్రాప్తియగును. ఇంకొకవిధముగాఁ గలుగదని చెప్పుచుందురు 36. మాయకుఁ గల్పాంతమైనపుడుగాని లేక దేహమున కత్యంతము గలిగినపుడుగాని నేనుబ్రహ్మము బొందుదునని చెప్పుట మిథ్య. ఈ విధముగా సమాధానము కలుగఁజాలదు. సమాధానలక్షణము వేఱుగా నున్నది 37, 38. "సేనయంతయును మరణించిన పిమ్మట రాజ్యపదవి ప్రాప్తించును" అని తలంచువానికి సేన సురక్షితముగా నుండకున్నచో రాజ్యమునేలఁజాలము అనుసంశయము తెలియదు. (ఇదిమూర్ఖకల్పనము)39 దేనియందు మాయయుండియు నుండదో దేహముండియు దేనియందు విదేహదశ కలుగునో యట్టి సమాధానమును బడయవలయును 40. రాజ్యపదము చేతిలోనికి వచ్చినపిమ్మట సేనయున్నను అభ్యంతరమేమి యునులేదు. ఏలయన! సేనయున్నచో రాజ్యమెన్నఁటికిని బోదు 41. ఆత్మ జ్ఞానము ప్రాప్తమైనపిదప దృశ్యదేహస్థితిగూడ నిట్టిదే. దేహదృష్టికలుగుట వలన సమాధానము శాంతితొలంగిపోదు. * 42. మార్గమధ్యమునం దేదేని సర్పరూపముగా నున్న చెట్టువేరును జూచినచో మిగుల భయము కలుగును. వాస్తవమున కిది సర్పముకాదు. చెట్టువేరులని తెలిసినపిమ్మట దానినెవరును గొట్టరు 43. ఇట్లె మాయ భయానకమైనను యోజించి చూచినచో మిథ్య. మఱల నది భయానకమని యేల తలంపవలయును?44. ఎండమావులనుజూచి యెవరేని భ్రాంతులై దీనినెట్లు దాటఁగలుగుదునని

---

* రాజ్యపదవియు, సేనయు నెటులుండునో యట్లె ఆత్మజ్ఞానము, దృశ్యదేహము ఉన్నవి. సేనయంతయును మరణించినపిదప రాజగుటకంటె సేనయుండఁగనే రాజగుట మంచిది. మాయయుండినను అదిమిథ్యగాఁ దోచవలెను. దేహముండినను విదేహస్థితి ప్రాప్తికావలయును. రాజ్యపదవి లభించినపిమ్మట సేనయున్నంత మాత్రమున నేమియును జెడిపోదు. ఇట్లె ఆత్మజ్ఞానము గలిగినపిమ్మట మాయయును దేహమును నేమియును జేయఁజాలవు.

చింతించు చున్నచో నదిభ్రమ. దానిని బాగుగా విచారించితిమేని సంకటము కలిగించునది కాదని స్పష్టమగును 45. భయానకమగు స్వప్నమును గాంచితిమేని స్వప్నావస్థయందు మిగుల భయముకలుగును. మేలుకొన్న పిదప భయము నొందవలసిన యవసరమేలేదు 46. మాయ కల్పనమును జూపుచున్నది నిజమే. కాని కల్పనాతీతుడైన పిదప నిర్వికల్పదశ సిద్ధించును. నిర్వికల్పదశలో మాయ రాజాలదు 47. అంత్యమున మతియెట్టుండునో గతియు నట్టులుండునని యందఱును జెప్పుచుందురు. కావున దేహబుద్ధి నశించినపిమ్మట సహజముగనే మోక్షము సిద్ధించును 48. స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములు అను నీ నాల్గు దేహముల యంత్యమునకు జన్మమునకు ఆత్మ యంటకయున్నది. ఆయాత్మయే నీవు 49.

పైనఁజెప్పఁబడినవిధముగా మతిగలవానికి జ్ఞానమువలన ఆత్మగతి కలుగును. అంత నాతఁడు అవగతికి, గతికి దూరమగును 50. ఎచ్చటవేదములకుఁగూడ మతి మందమైపోవుచున్నదో యచ్చట గతియవగతు లెక్కడినుండివచ్చును? అచ్చట ఆత్మ, శాస్త్రము, గురుప్రతీతియను నీమూఁడు నొక్కటి యగుచున్నవిగదా (ఈమూఁడు నేకత్వ మొందుచున్నవి) 50. సద్గురునిబోధవలన జీవత్వభ్రాంతి తొలంగిపోవును. వస్తువు ఆత్మానుభవము లోనికివచ్చును. ప్రాణి ఉత్తమగతి నొందును 52. సద్గురుబోధ నాలకించుట తటస్థింపఁగనే నాలుగు దేహము లంతరించును. అనంతరము సత్స్వరూపమునందు నిదిధ్యాసము కలుగును 53. ఆ నిదిధ్యాసమువలనఁ బ్రాణి యంతమునందు స్వయముగా పరబ్రహ్మమే (ధ్యేయమే) యగును. మఱియు సాయుజ్యముక్తికి స్వామియైకూర్చుండును 54. దృశ్యపదార్థములను నిరసించుటచే వాస్తవమునందు మిగిలినది ఆత్మయే. దృశ్య మాదినుండియు మిథ్యయని ధ్యానముతో విచారించినచో విదితమగును 55. ఈ మిథ్య (మాయ) యొక్క మిథ్యాత్వము నెఱుంగుటయు నామిథ్యాత్వము ననుభవములోనికిఁ దెచ్చుకొనుటయు మోక్షమనఁబడును 56. సద్గురుని వచనమును హృదయమునరేదునిలుపువాఁడే మోక్షమునకధికారి. వాఁడు మాటిమాటికి అత్యాదరముతో శ్రవణము, మననము జేయుచునే యుండును 57. ఎచ్చట రెండుపక్షములుండవో ఎచ్చట లక్ష్యాలక్ష్యములు లేవో యదియే ఆత్మ. దానిపేరే మోక్షము 58. అచ్చట (మోక్షము

నందు) ధ్యేయధారణములు సమాప్తియగును. కల్పనము నిర్వికల్పనము నందు లీనమగును. మఱియుఁ గేవలజ్ఞప్తిమాత్రమును, జ్ఞానస్వరూపమును నగు సూక్ష్మ బ్రహ్మముమాత్రమే శేషించియుండును 59.

అనంతరము భవమృగజలము (జన్మమను ఎండమావులు) మిథ్యాబంధములు విడిపోవును. అట్టిదశయందు ముక్తుడు వాస్తవముగా నాత్మను జన్మదుఃఖములనుండి విముక్తము గావించును 60. అంతియు గాదు. నిస్సంగుని సంగవ్యాధిని, విదేహుని దేహబుద్ధిని, నిష్ప్రపంచుని యుపాధిని, గూడ వివేకముఁ ద్రెంపివేయును 61. అద్వైతునకుఁగల ద్వైత భావమును దొలంగించును. ఏకాంతున కేకాంతవాసము నొసంగును. మఱియు ననంతున కనంతపుటంతము నిచ్చివేయును 62. జాగ్రతుని మేలు కొలుపును. మేలుకొనియున్నవానికి సావధానము సమకూర్చును. ఆత్మ జ్ఞానికి ఆత్మజ్ఞానమును బ్రబోధించును 63. అమృతమును అమరముగను, మోక్షమును ముక్తినిలయముగను గావించును. సంయోగమునకు నిరంతరయోగము నొసంగును 64. నిర్గుణమును నిర్గుణముగఁజేయును. ఈ విధముగా సార్థకమునకు సార్థకము కలుగును. చాలదినములకుఁ దనకు "తన" యనునదేదియో యది లభించును 65. ద్వైతమను తెఱ చినిఁగిపోవును. అభేదమను భేదమును ద్రెంచివేయును. మఱియు భూతపంచక (పంచ భూతాత్మకమగు దేహముయొక్క అహంకర్తృత్వభావము) బాధ వెడలి పోవును 66. సాధనఫలము లభించును. నిశ్చలమునకు నిశ్చలముదొరకును. వివేకబలమువలన నిర్మలమునందుఁగల మలముగూడఁ దొలంగును 67. దగ్గఱనున్నను దేనిని మఱచియుంటిమో యది (బ్రహ్మము) ప్రాప్త మగును. చూచుచుండఁగనే జన్మదుఃఖములు తొలంగిపోవును 68. దుష్ట స్వప్నమునందు బ్రాహ్మణుఁడు నీచజాతినొంది భయమునొందును. మేల్కొనినపిమ్మట తాను తనజాతియందె యున్నసంగతి గమనించును 69. ఇట్లె అజ్ఞానరూపమగు స్వప్నమునందుఁ దన సత్యస్వరూపమును మఱచియుండిన జీవుఁడు జ్ఞానరూపమగు మెలకువగలిగిన పిమ్మట తన సత్యస్వరూపమును గుర్తించుచున్నాఁడు. ఇట్టిజ్ఞానుల లక్షణములే ముందుసమాసములోఁ జెప్పఁబడినవి 70.

## తొమ్మిదవ సమాసము — సాధులక్షణములు.

అమృతపానమును గావించినపిమ్మట శరీరము కాంతిమంతమగును. అటులె సత్స్వరూపానుభవమైనపిమ్మటఁ గృతార్థత సమకూరును. ఇఁక సత్పురుషులనడిగి తెలిసికొనవలసిన లక్షణము లేముండును ? 1. అయినను సత్యమగు నాత్మజ్ఞానముగలవాఁ డెవఁడు ? అను దానినెఱుంగుట కిచట సాధారణరీతిగా సాధువుల లక్షణములను వివరించెదను 2. సిద్ధులు, సాధువులు ప్రత్యక్షముగా సత్స్వరూపులై యున్నారు. సత్స్వరూప సిద్ధస్వరూపములందు భేదమేమియునులేదు 3. సత్స్వరూపుఁడై యుండు వానిని సిద్ధుఁడందురు. సిద్ధస్వరూపమునందే (బ్రహ్మస్వరూపమునందే) సిద్ధత్వము శోభనిచ్చును 4. వేదశాస్త్రము లెవనిని సహజముగా సత్స్వరూపుఁడని కొనియాడుచున్నవో వానిని సిద్ధుఁడనిచెప్పవచ్చును. రెండవవాని నట్లు చెప్ప వీలులేదు 5. ఐనను సాధకులకు వివేకవంతమగు జ్ఞానముకలుగుటను గూర్చి కొంచెము చెప్పెదను. సిద్ధలక్షణ కౌతుకులు వినుండు 6. అంతరస్థితి స్వరూపాకారమైనప్పుడు శరీరస్థితి స్వప్నావస్థయందలి స్వప్నరచనము వలెనగును 7. ఐనను సిద్ధులలక్షణములను గొంచెముగఁ జెప్పుదును. ఇందువలనఁ బరమార్థముయొక్క చిహ్నము శ్రోతలకు విశదమగును 8.

సాధుల ముఖ్యలక్షణ మేమన, సాధువు నిరంతరము స్వరూపానుసంధానమున లక్ష్యముంచును. జనులకంటె వేఱుగ నుండును 9. స్వరూపమునందు దృష్టిలగ్నమైనంతనే సంసారచింత తొలంగిపోవును. అధ్యాత్మనిరూపణమునందు మమత్వము గలుగును 10. ఇదియే సిద్ధలక్షణము. ఈ లక్షణములు గలవాఁడే సిద్ధుఁడు. సాధకములేనిది సిద్ధలక్షణ మేర్పడఁజాలదు 11. సిద్ధులు చూచుటకు సాధకులవలెఁ గనిపింతురుగాని వార లంతరంగమునందు స్వరూపాకారులు. ఇట్టి సిద్ధలక్షణములు నేర్పరులగువారలు గమనింపవలయును 12. సందేహరహిత సాధనులై యుండుటయే సిద్ధుల లక్షణము. వారలకు లోపలను, వెలుపలను అచలమగు సమాధానముండును 13. అంతరస్థితి యచలమైపోయినయెడల చంచలత నిలువనే నిలువదు. స్వరూపమునందు వృత్తిలగ్నమగుటవలన మానవుఁడు స్వరూపమె యగును 14. ఇట్టిదశ గలిగిన మానవుఁడు నడచుచున్నను అచలుఁడె, చంచలుఁడయ్యును నిశ్చలుఁడె. ఇంతయేల ఆతఁడు స్వయముగా నిశ్చ

లుఁడు. వానిదేహము మాత్రము చంచలము 15. స్వరూపమునందు స్వరూపుఁడైనవాఁడు పడియున్నను లేచి పరుగెత్తినను అచలుఁడే 16. ఇచట ముఖ్యకారణము అంతరస్థితి. అంతరమునందే నివృత్తికావలయును. ఎవని హృదయము భగవంతునియందు లగ్నమైనదో యతఁడె సాధుపురుషుఁడు 17. వెలుపల (దేహాదులు) ఎటులున్నను సరియే. అంతరము మాత్రము స్వరూపమునందు లగ్నమైయుండవలయును. ఈ లక్షణము లన్నియు సాధువులయెడ సహజముగాఁ గన్పించును 18. రాజ్యము లభించినపిమ్మట రాజకళ సహజముగా వచ్చును. అటులే అంతఃకరణము స్వరూపమునందు లగ్నమైనయెడల నీ లక్షణములన్నియు సహజముగా వచ్చును 19. అన్యవిధముగా నభ్యాసము గావించినచో ఈ లక్షణము లెన్నంటికిని సాధ్యముకావు. స్వరూపములో స్వరూపమె యుండవల యును 20. నిర్గుణమునందు వృత్తియుండుటయే అన్నిటికంటెను గొప్ప యభ్యాసము. సాధుసమాగమ మొనరించి అధ్యాత్మనిరూపణమును మననము చేయుటవలన స్వరూపస్థితి కలుగును 21. స్వరూపాకారుఁడై యుత్తమలక్షణముల నభ్యసింపవలయును. స్వరూపమును విడిచినయెడల సాధువు లేవగింతురు 22. ఇపు డీకథానకమును జాలించెదను. ఇక సాధు జనుల లక్షణములను వినుండు. వీనిని వినుటవలన సాధకులకు సమాధానము ప్రాప్తించును 23. స్వరూపమునందుఁ గల్పనము లీనమై పోవఁ గానే కామ్యములపైఁ గోర్కియుండదు. కాననే సాధుజనులకుఁ గామ్యము లుండవు 24. కల్పనము గావించిన విషయము తొలంగిపోయినపుడు క్రోధముకలుగును. సాధుజనులుమాత్ర మిట్లు క్రోధమునకు బాల్గారు 25. అందువలననే వారు క్రోధరహితులై యున్నారు. సాధుపురుషులు నాశ వంతమగు పదార్థమునువిడిచి శాశ్వతస్వరూపమును జూచుచున్నారు 26. ఎచట రెండవ భేదమేలేదో యట్టి సాధుపురుషుని హృదయమునందుఁ గ్రోధమెవరిపయి వచ్చును ? ఇందువలననే సాధుపురుషులు సచరాచరము నందుఁ గ్రోధరహితులై వర్తించుచున్నారు 27. సాధువులు తమయందె తామానందింతురు. ఈ స్థితిలో మదము నెవరిపై చూపుదురు. మదము లేనివారుగాన సాధువులు వాదములందును, వివాదములందును బాల్గొనక వేఱుగా నుండురు 28. సాధువు నిర్వికార స్వరూపుఁడై యుండును

నిర్వికార స్వరూపమునఁ దిరస్కార మెచటనుండివచ్చును ? అంతటను దానే తానుగానున్న సాధుపురుషుఁడు ఎవరిపై మత్సరమును జూపును ? 29. సాధువులు అనాయాసముగనే వస్తురూపులగుదురు. అందుచే వారలు మత్సరమునకు లోనుగారు. మదమత్సర పిశాచములు సాధువుల కంటవు 30. సాధువు స్వయంభూ స్వరూపుఁడుగనుండునుగాన నాతనిని దంభమెటు లావరింపఁగలదు. స్వయంభూస్వరూపమునం దద్వైతమునకు నారంభమేలేదు గదా 31. దృశ్యమును నష్టముగావించు స్వయంభూ స్వరూపమునందుఁ బ్రపంచమెట్లు రాఁగలదు ? కావున సాధువులు నిష్ప్ర పంచులని యెఱుంగవలెను 32. సమస్త బ్రహ్మాండము సాధుపురుషునకు గృహము. సాధువు పాంచభౌతిక విస్తరమును మిథ్యగాఁదలంచి శీఘ్ర ముగాఁ ద్యాగము గావించును 33. అందుచే సాధుపురుషుని లోభ మంటు కొనదు. సాధువు నిరంతరమును లోభరహితుఁడై యుండును. వాని వాసన శుద్ధస్వరూపమునందు సమరసమై కలసిపోవును 34. అంతటను దానే తానుగా నున్నపు డెవనినిగూర్చి శోకింపవలయును ? ఈ కారణము వలన సాధుపురుషుని శోకరహితుఁడని యెఱుంగవలయును 35. నాశవంత మగు దృశ్యమును విడనాడిన శాశ్వతస్వరూపమును సేవించుటవలన సాధువును శోకరహితుఁడని తలంపవలయును 36. శోకముచే వృత్తిని దుఃఖితముగఁ జేయఁగోరునెడ నది సాధ్యముగాదు. ఏలయన. సాధువుల యందు వృత్తినివృత్తియై పోయెను. ఇందువలన నివృత్తులగు సాధువులు నిరంతరము శోకరహితులుగనే యుందురు 37. మోహముచే నొకవేళ మనస్సును వ్యాప్తము చేయఁగోరినయెడల నదియు సాధ్యముగాదు. ఏల యన, వారల మనస్సే బ్రహ్మమునం దున్మనమయ్యెను. అందుచే సాధు జనులు నిరంతరము మోహాతీతులుగ నుందురు 38. సాధు వద్వయవస్తు వుగ నుండును. అట్టియెడ నచట భయమునకుఁ దావెక్కడిది ? పర బ్రహ్మము నిర్భయమైనది. సాధువుగూడ నిర్భయస్వరూపుఁడు 39. కావున సాధుపురుషుఁడు భయాతీతుఁడును, నిర్భయుఁడును శాంతుఁడునునై యుండును. అన్నియును నంత్యమొందగలవుగాని సాధువనంతరూపుఁడు 40. సత్యస్వరూపమునం దమరుఁడుగనున్న వానికి భయమెట్లు తెలియును? కావున సాధుజనులు నిర్భయముగా నుందురు 41. ఎచ్చట ద్వంద్వభేదము

లేదో, ఎచట నంతయుఁదానే తానుగ నభేదరూపముగ నున్నదో యచ్చట దేహబుద్ధికి సంబంధించిన భేదము ఎచ్చటనుండి తలయెత్తఁ గలదు ? 42. సాధుపురుషుఁడు బుద్ధితో నిర్గుణనిశ్చయము గావించును. నిర్గుణము నెవ్వఁడును గొనిపోవఁజాలడు. అందుచే సాధువులచే సాధుపురుషులు ఖేదపడుటకుఁ గారణమేలేదు 43. సాధువు స్వయముగ నొంటరిగనే యుండును. ఆ స్థితిలో స్వార్థము నెందులకై యవలంబింపఁ గలఁడు ? దృశ్యరహితమగు తావున స్వార్థమున కవకాశ మెట్లుగలుగును ? 44. సాధువు స్వయముగా నెప్పుడును ఒకఁడుగా (ఏకాంతముగా) నుండును ? అట్టియెడ దుఃఖశోకములు గలుగుట కవకాశమెక్కడిది ? ద్వైతములేనిది అవివేకముగూడ రాఁజాలదు 45. పరమార్థమునం దాశయుంచుటచే సాధు పురుషునకు స్వార్థసంబంధమగు దురాశ తెగిపోవును. కావున నిరాశయుండు టయు సాధుచిహ్నము 46. సాధువు ఆకాశమువలె మృదువుగ నుండును. కావున వానిమాటలలోఁ గాఠిన్య మెక్కడినుండివచ్చును 47. బ్రహ్మ స్వరూప సంయోగమువలన సాధువు స్వయముగా బ్రహ్మస్వరూపుఁడగును. కావున సాధువునిరంతరము వీతరాగిగ విషయరహితుఁడుగ నుండును 48. స్వరూపస్థితి కలుగుటచే సాధువుదేహచింతను విడిచివేయును. అందుచేఁ గానున్నదానినిగూర్చి వాఁడెంచు కేని చింతనొందఁడు 49. సాధువులబుద్ధి పరబ్రహ్మమునందు లీనమైయుండును. అందుచే వారలకు సంపూర్ణోపాధి పటాపంచలై పగిలిపోవును. అందువలననే వారు నిరుపాధికులుగనున్నారు. 50. సాధువు నిరంతరము పరబ్రహ్మస్వరూపమునం దిమిడియుండును. పర బ్రహ్మస్వరూపమునం దేవిధమగు నన్యసంఘమునకును నవకాశము లేదు. కాననే సాధువు మానము, అవమానములను లక్ష్యముసేయఁడు 51. అలక్ష్యమునందు లక్ష్యముంచిన కారణమున సాధువు పరమదక్షుఁడగు చున్నాఁడు. ఆతఁడు పరమార్థపక్షము నవలంబించువిధ మెఱుంగును 52. సాధువు స్వయముగా బ్రహ్మస్వరూపుఁ డగుచున్నాఁడు. బ్రహ్మస్వరూప మునందు పాపమునకుఁ (మలమునకు) దావులేదు. కావున సాధువు నిర్మ లుఁడు 53. సాధువుయొక్క ముఖ్యలక్షణమేమన ఆతఁడు పరబ్రహ్మ స్వరూపమునందు లీనుఁడై యుండుటయే తనధర్మము లన్నింటిలో శ్రేష్ఠ మగుధర్మముగా భావించును. దీనినే యాతడు స్వధర్మముగానెంచును 54.

సాధు సాంగత్యము గావించుటవలన స్వరూపస్థితి తనంతటనే వచ్చును. స్వరూపస్థితి వచ్చుటవలన దేహమునందు సాధులక్షణము లేర్పడును 55. అధ్యాత్మిక నిరూపణముల నాలించుటవలన దేహమున సాధు లక్షణము కలుగును. కాని యాలక్షణములతోఁ దనియక స్వరూపానుసంధానుఁడై యుండుట మిగుల నవసరము 56. నిరంతరము బ్రహ్మస్వరూపము నందుండుటవలన సాధువు స్వయముగా స్వరూపుఁడగును. దీనికిఁబిమ్మట శరీరమునందు సాధులక్షణములేర్పడుట కాలస్యముపట్టదు 57. స్వరూపము నందు మతియుండుటవలన అవగుణములు తొలంగిపోవును. ఇందుకొఱకు సాధుజనుల సాంగత్యము ఆధ్యాత్మిక నిరూపణము కావలయును 58. సమస్తసృష్టిలో అనుభవ మొకవిధముగాలేదు. అనుభవము లనేకవిధముల నున్నవి. వానినన్నింటిని ముందు సమాసములో వివరించెదను 59. జను లే స్థితిలోనున్నారో? అనుభవము నెట్లు చేయుచున్నారో తెలుపుదును. ధ్యానపూర్వకముగా వినుఁడు 60.

---

## పదియవ సమాసము — బహువిధానుభవములు.

మనము జనుల భిన్నభిన్నానుభవములపైకి దృష్టిని సారింతుమేని సంసారము (ప్రపంచము) నందు గొప్పకోలాహలము జరుగుచున్నటుల గోచరించును. ఈవృత్తాంతమును గుతూహలముతో వినుండు 1. "మనము గార్హస్థ్యమునందుండియే తరింపగలము. ఏలయన! ఈసంసార సంబంధమగు విస్తరమంతయు మనదేమియుగాదు. అంతయునుజీవేశ్వరులది అని యొకఁడనును 2. "అట్లుకాదు మోహముకలుగుచున్నది." పొట్టకొఱకుఁ గుటుంబసేవను జేయవలసియేయున్నది" అని యొకఁడనును 3. "స్వాభావిక సుఖములతోడనే గృహస్థస్థితి యందుండవలయును గాని సద్గతికి ఏమేమి దానము, పుణ్యము చేయుచుండవలయు"నని యొకఁడనును. 4. "సంసారమసత్యము. వైరాగ్యదీక్షధరించి దేశాటనము గావింపవలెను. అందువలన స్వర్గలోకద్వారము తెఱువఁబడు"నని యొకడనును 5. ఎక్కడకు బోవుదము. వ్యర్థముగా నేలతిరుగవలయును. మనయాశ్రమమునందే ఆశ్రమధర్మమునునిర్వహించుచుండవలయు"నని యొకడనును 6. "ఎక్కడి

ధర్మమును దెచ్చిపెట్టుచున్నాడవు. అంతయు నధర్మమే జరుగుచున్నది. ఈ ప్రపంచమునందుండి నానావిధములగు పనులను జేయుచునేయుండవలసి వచ్చుచున్నది''అనియొకడనును 7. "చేతనైనంతదనుక వాసనమంచిదిగా నుండవలయును. వాసనావశముననే అనాయాసముగా సంసారమును దాటి పోవుదురు''అని యొకడనును 8. "ముఖ్యకారణము భావము. భావము వలననే పరమేశ్వరుడు లభించును. తక్కినదంతయును వ్యర్థగాథాజాల''మని యొకడనును 9. "పెద్దలెందఱుగలరో వారలనందఱిని దేవతలుగాభావింప వలయును. జననీజనకులనన్యభావముతోఁ బూజింపవలయు'' నని యొకఁడనును 10. దేవబ్రాహ్మణపూజనము గావింపవలయును. జగత్తులోని జను లందఱికిని నారాయణమూర్తియే తల్లిదండ్రియని''యొకడనును 11. 'శాస్త్రమును జూడవలయును వానియందు ఈశ్వరుడేమి యాజ్ఞాపించెనో దానిననుసరించి వర్తించి పరలోకమును బొందవలయు''నని యొకడనును. 12. "ఓరిఅన్నా! శాస్త్రములను జూచుచున్నయెడలఁ బనిసాగదు. సాధు వులశరణ్యమునకుఁ బోవలయునురా'' అనియొకడనును 13. "అయ్యా! ఈమాటలను జాలింపుడు వ్యర్థముగానేల వదరుబోతుతనము జూపుదురు. హృదయమునందు భూతదయగలిగియుండుట అన్నిటికంటెను ముఖ్యము'' అనియొకడనును 14. "తనయాచారమును విడువకుండవలెను. అంత్యకాల మునందు సర్వోత్తముఁడగు పరమాత్మునినామమును స్మరింపవలయును. ఇదియేమంచిమార్గ'' మనియొకడనును 15. "పుణ్యముండిననేగాని భగవ న్నామము స్మరణమునకురాదు. పుణ్యములేకున్నచో అంత్యకాలమునందు భగవన్నామము మఱపునకువచ్చును''అని యొకడునుడువును 16. బ్రదికి యుండగనే జన్మమునుసార్థకము గావింపవలయును'' అని యొకడనును. "తీర్థాటనము గావింపవలయు''నని యొకడనును 17. "ఇదియంతయును నొకప్రయాస. తీర్థములలో నేమున్నది? అచ్చట జలపాషాణముల సమా వేశమేగదా! మునుకలు వేసివేసి వ్యర్థముగా నేల ఆయాస పడవలయును'' అని యొకడనును 18. "ఈవాచాలత్వమును గట్టిపెట్టుము. భూమండల మునందుఁగల తీర్థముల కగాధ మహిమకలదు. వానిదర్శన మాత్ర ముననే మహాపాతకములు భస్మములై పోవును'' అనియొకడనును 19. "అన్నిఁటికిని గారణమగు మనస్సునునిలుపఁ గలిగినచో తీర్థములు

మనయొద్దనే యున్నవని యొకఁ"డనును "కాదు కాదు ప్రసన్నతా పూర్వకమగు కీర్తనము చేయవలయు"నని యొకఁడనును 20. "అన్నింటి కంటెను మంచిది యోగము. ముఖ్యముగా దానినే మొదట సాధింప వలయును. మఱియు ఆకస్మికముగా దేహమును మరణరహితముగఁ జేయవలయును" అని యొకఁడనును 21. "అందువలన నేమగును. కాలమును మోసగింపఁదగ"దని యొకఁడనును. "భక్తిమార్గమునుసాధింప వలయు"నని యొకఁడనును 22. ఒకడు జ్ఞానముమంచిదనును. అట్లుగాదు సాధనముచేయవలయునని యొకఁడనును. నిరంతరము ముక్తుఁడై యుండ వలయునని యొకఁడనును 23. "అనర్గళమగు పాపములకు భయపడవలయు నని యొక్కఁ"డనును. "ఓరీ! మాది చక్కఁగాఁ దెలుపబడినమార్గమని యొక్కఁడనును" 24. "ఒకరిపట్ల నిందాద్వేషములు వహింపకుండుటయే అన్నిటికంటెను మంచిపద్ధతి"యని యొకఁడనును. దుష్టసాంగత్య మెల్లప్పు డును విసర్జింపవలయు"నని యొకడనును 25. "అన్నా! ఎవరిద్రవ్యమును దింటిమో వారిముందే మరణించినచో తత్కాలముననే మోక్షముప్రా ప్తించునని" యొకఁడనును* 26. "పద, ఈమాటలుచాలింపుము. అన్నిఁటి కంటెనుముందుగ భోజనము సమకూడవలయును. ఆపిమ్మటఁ గుడిచి కూర్చుండి యెన్నిబకవాదములనైనఁ జేయవచ్చు"నని యొకఁడనును 27. "వర్షము సకాలమునగురియుచున్నచో యోగములన్నియుఁ జక్కఁగా నుండును కఱవు దుర్భిక్షాదులు కలుగకుండుటయే మంచిఁదని యొకఁడనును 28. "తపోనిధియగుటవలన సమస్త సిద్ధులును బ్రసన్నములగును" అని యొకఁడనును "ఓరీ!అన్నిటికంటెముందుగా నింద్రపదముప్రాప్తింపవలయు" నని యొకఁడనును 29. "ఆగమములను జూడవలయును. భేతాళుని బ్రస న్నము గావించుకొనవలయును. ఇందువలన స్వర్గమునందుఁ బరమేశ్వరుడు లభించుఁనని యొకఁడనును 30. "అఘోరమంత్రమువలననే స్వాతంత్ర్యము లభించును. దానిమూలముననే లక్ష్మీదేవి ప్రసన్నురాలగును 31. ఆలక్ష్మీ దేవియందే ధర్మములన్నియు సంబంధపడియున్నవి. అన్యక్రియాకర్మము

---

* తంత్రశాస్త్రము:—

శ్లో॥ ఆగతశ్శివ వక్త్రేభ్యో గతంచ గిరిజాశ్రుతౌ
మతంచ వాసుదేవస్య తస్మాదాగమ ఉచ్యతే

లెక్కడనుండివచ్చినవి?" అనియొకఁడనును. "లక్ష్మీదేవి సహాయముననే గదా లోకులు దుష్కర్మములాచరించుట"యని యొకఁడనును 32. "మృత్యుంజయుని జపించుయత్నము చేయవలయును. దానివలన సంకల్పము లన్నియు ఫలించు"నని యొకఁడనును 33. "వటుకభైరవుని పూజించినచో వైభవములన్నియు సమకూరు"నని ఒకఁడనును "ఝోటింగు (ఒకదేవత) తల్లియే సమస్తకామ్యములను పూర్తిచేయు"ననియొకఁడనును34."ఒకఁడు కాళినిఁగంకాళి సేవింపు"మనును. "ఒకఁడుభద్రకాళిని, మఱియొకఁడు ఉచ్ఛిష్టచండాలిని వశపఱచుకొనవలయు"ననును 35. "విఘ్నహరుఁడగు గణేశ్వరు గొల్వవలెనని యొకఁడును, బోళాశంకరుని పూజింపవలయునని యొకఁడును శీఘ్రప్రసన్నయగు భగవతిని ఆరాధింపవలయు"ననియొకఁడును జెప్పును 36. "ఖండోబా త్వరితముగ భాగ్యమునొసంగునని యొకఁడును వేంకటేశ్వరుని సేవించుటయన్నింటికంటె నుత్తమ"మని యొకఁడును బల్కును 37. "పూర్వకర్మానుసారముగా ఫలములభించునని యొకఁడును, అట్లుకాదు ప్రయత్నము చేయవలయునని యొకఁడును, అయ్యో! మన దేమియునులేదు. అన్నియునీశ్వరునిపై విడిచివేయవలయునని యొకఁడనును 38. ఎక్కడి ఈశ్వరునిదెచ్చిపెట్టుదువు? ఆతఁడు మంచివారలకే కష్టములు గలిగించి పరీక్షించుచుండునని యొకఁడును, దానియందీశ్వరునిదోష మావంతయులేదు, ఇది యుగధర్మమని యొకఁడనును 39. కొందఱిది యాశ్చర్యమని యొప్పుకొనుచున్నారు. కొందఱు విస్మితులగుచున్నారు. ఏమిజరుగునో చూడవలయునని కొందఱు భయముతో నుడువుచున్నారు. 40. ఈవిధముగఁ బ్రపంచమునందలి జనులలక్షణములు వివరింపఁబూనినచో నింకనెన్నియోగలవు. కానియిచటఁ గొన్ని చిహ్నములనుమాత్రమే చెప్పెదను 41.

ఇక జ్ఞానుల భిన్నభిన్నానుభవములనుగూడఁ దెలుపుదును. సావధానులరై వినుండు 42. భక్తితో భగవంతుని ధ్యానించుచున్నచో శ్రీహరి సద్గతియొసంగునని యొకఁడును, గర్మమువలననే బ్రహ్మప్రాప్తి యగునని యొకఁడును అనును 43. భోగములు విడిచిపోవు, జననమరణములు తెగిపోవు అని యొకఁడును అజ్ఞానతరంగములు పెక్కలుగనున్నవని యొకఁడును అనును 44. సర్వము బ్రహ్మముగానున్నచోటఁ గ్రియా

కర్మము లెట్లువచ్చునని యొకఁడును, ఇట్టి యధర్మ భాషణములు గావింప గూడదని యొకఁడును బలుకును 45. సర్వమును నశించిన పిదప మిగులు నదియే బ్రహ్మమని యొకఁడును ఇది సమాధానముకాదని యొకఁడును అనును 46. సర్వబ్రహ్మము, కేవలబ్రహ్మము అను నీరెండును పూర్వ పక్షములే, భ్రమాన్వితములే, అనుభవమర్మము వేఱుగనున్నది అని యొకఁ డనును 47. ఇట్లుగాదు. వస్తువు అనిర్వాచ్యము. దానిని వివరింపలేక వేదశాస్త్రములుగూడ మౌనము అవలంబించుచున్నవని యొకఁడనును 48. ఇదివిని శ్రోతయిట్లు ప్రశ్నించెను. అటులైన మీరు గావించిన నిశ్చ యమెద్ది? సిద్ధాంతమతమువలన అనుభవమునకుఁ దావేలేదయ్యెను. (అను భవమును దలంచినంతనె యచట ద్వైతము రానేవచ్చెను) 49. వక్త చెప్పు ప్రత్యుత్తరము. ప్రతిమనుజునియనుభవము వేఱువేఱుగానుండునని తొలు తనేచెప్పితిని. కావున అనుభవమువలన నేమియుగాఁజాలదు 50. కొందఱు సాక్షిత్వముతో వర్తించుచున్నారు. మఱియు సాక్షి (దృశ్యముకంటె) వేఱుగనున్నటులఁ జెప్పుచున్నారు. అటులె తాము స్వయముగ ద్రష్టలై యుండి స్వానుభవస్థితియందున్నారు 51. దృశ్యముకంటె ద్రష్టవేఱుగ నున్నాఁడు. స్వానుభవమువలన సాక్షిత్వముకంటెఁ దానువేఱుగనుండును అలిప్తతారీతియిది 52. అన్నిపదార్థములను నెఱింగియున్నవాఁడు పదార్థ ములకంటె భిన్నుఁడుగనున్నాఁడు. ఈ యనుభవముకలుగుటవలన దేహ మునందున్నను సహజముగనే అలిప్తతవచ్చుచున్నది 53. ఒకజ్ఞాత అనుభ వముతో నిట్లుచెప్పుచున్నాఁడు. సాక్షిత్వముతో వర్తింపవలయును ద్రష్టృ త్వముతో అన్నిపనులను జేయుచుగూడ వేఱుగ నుండవలయును 54. ఒకజ్ఞాత యిటులఁ జెప్పుచున్నాఁడు. "భేదమనునది లేనేలేదు. వస్తువు ఆదినుండియు నభేదముగానున్నది. అచ్చటికి ద్రష్టనెచ్చటనుండి తెచ్చితివి? 55. స్వాభావికముగా శర్కరామయముగనున్న పదార్థములోఁ జేదును విడదీయుట యెట్లు సాధ్యమగును? అట్లె స్వానుభవమువలన సర్వము బ్రహ్మముగానున్న కావున ద్రష్టయెక్కడినుండివచ్చును 56. ప్రపంచ పరబ్రహ్మములు అభేదములు; వీనిలో భేదవాదులు భేదమున్నటుల విశ్వ సింతురు కాని యీస్వానందాత్మయే దృశ్యాకారమైనది 57. కఱఁగిన నెయ్యి పేరుకొనినట్లు నిర్గుణముగూడ సగుణమగును. అచట ద్రష్టృత్వ

ముతో వేఱుగాఁ జేయునదేమున్నది? 58. అనఁగా ద్రష్టృదృశ్యములన్ని యును నొక్క జగదీశ్వరుఁడే యైయున్నాఁడు. ఇంక ద్రష్టృత్వభేదముతో నావశ్యక మేమున్నది 59. ద్రష్టదృష్టికి ఈదృశ్యాకారమంతయు బ్రహ్మ మేయని కొందఱియనుభవము 60. అన్నిటియందును ఆత్మయే పరిపూ ర్ణముగా నున్నప్పుడు స్వయముగా(తాను) భిన్నుఁడై యెట్లుమిగిలెనను?" (కావున బ్రహ్మమే సమస్తమని) ఇది రెండవజ్ఞాత యనుభవము 61. ఇఁక మూఁడవ యనుభవము వినుండు. సమస్తప్రపంచమును నిరసనము గావించినచో మిగిలిన శూన్యమే యీశ్వరుఁడనియు 62. సమస్తదృ శ్యమును వేఱుగావించినపిమ్మటఁ గేవలము అదృశ్యముమాత్రమె మిగు లును. దానినే బ్రహ్మముగా నెఱుంగవలయుననియు వీరలందురు. * 63

శూన్యమును బ్రహ్మమని చెప్పఁజాలను. శూన్యమును బ్రహ్మ మని చెప్పుట అపాయమును ఉపాయముతో సమానముగాఁ జెప్పుటవం టిది. శూన్యమును బ్రహ్మమని యెట్లునుడువగలము? 64. సంపూర్ణ దృశ్యమును దాటిపోయినపిదప అదృశ్యరూపమగు శూన్యత్వము లభిం చును. అజ్ఞులగుప్రాణు లాశూన్యమును బ్రహ్మమనుకొని యచటనుండియే మరలుదురు 65. ఈయొడ్డున దృశ్యముండును. ఆయొడ్డునఁ బరబ్రహ్మ ముండును. మధ్య శూన్యత్వస్థానమున్నది. ఈతావునే జనులు మంద బుద్ధివలన బ్రహ్మమనియెదరు 66. రాజును గుర్తింపలేదు. సేవకుని రాజని విశ్వసించుచున్నారు. రాజును జూచినపిమ్మట పూర్వాభిప్రాయ మంతయు నిరర్థకమగును 67. అటులే శూన్యమును బ్రహ్మమని విశ్వ సించుచున్నారము. కాని ముందుగ బ్రహ్మమును దెలిసికొనుటవలన శూన్యత్వసంబంధమగు సమస్తభ్రమయు విడిపోవును 68. రాజహంస

* ద్రష్ట దృశ్యముకంటె వేఱు అనునది యొకమతము. ద్రష్ట, దృశ్యమునొక్కటి. ఉన్నదంతయును బ్రహ్మమె యనునది రెండవమతము. దృశ్యమును వేఱుపఱచినపిదప "ఏమియును లేనిదే బ్రహ్మము" అని మూఁడవమతము.

క్షీరమునుగ్రహించి నీరమునువిడిచిపెట్టునట్లు వివేకి యీ సూక్ష్మవిఘ్న మును వివేకముతో వేఱుపఱుపవలయును* 69.

మొట్టమొదట దృశ్యమును విడిచివేయుదురు. తరువాత శూన్యత్వమును జేరెదరు. ఆపిమ్మట మూలమాయకు ఆవలనున్న బ్రహ్మము లభించును 70. వేఱుగనుండి చూచుటవలన వృత్తి శూన్యత్వమునందుఁ బడిపోవును. అందుచే శూన్యత్వభ్రమ హృదయమునందుఁ బాదుకొనును 71. భిన్నత్వముతో ననుభవముగావించుటను శూన్యత్వమందురు. వస్తువును లక్షించుటకు ముందుగ సాధకుఁడు అభిన్నుఁడుగావలయును 72. స్వయముగాఁ దాను వస్తురూపుఁడైనపుడె నిశ్చయముగా వస్తువును దర్శించుట యగును. కాని భిన్నత్వముతోఁ దిలకించినయెడల శూన్యత్వమే లభించును 73. శూన్యమెన్నటికిని బరబ్రహ్మము కానేరదు. పరబ్రహ్మమును స్వానుభవముతో వస్తురూపుఁడైనపుడే మానవుఁడు చూడఁగలఁడు 74. యథార్థమునకు, స్వయమే వస్తురూపము. నేను, మనస్సు అనుకల్పనము నెప్పుడునుజేయఁగూడదు. ఆత్మ స్వయముగా నీవేయై యున్నాఁడవు అనుదానినే సాధువులు నిరంతరమును దెలుపుచుందురు 75. నేను, మనస్సు, అనుమిథ్యానిరూపణమును సాధుజను లెక్కఁడను గావింపలేదు. అట్టిస్థితిలో నెవరిబోధ నాధారముగాఁజేసికొని "నేననునదిమనస్సు" అని యంగీకరింపనగును? 76. సాధువులవచనము హృదయమునుంచుటయే శుద్ధస్వానుభవము. మనస్సు స్వాభావికముగనే చంచలమైనది. అది "నేను" అనునదికాదు. "నేను" అనునది స్వయముగా వస్తువే 77.

---

* దృశ్యమునుదాటి పరబ్రహ్మముదనుకఁ బోవునపుడు మధ్యను శూన్యత్వము లభించును. ఎందఱో అరజ్ఞానులు దానినే బ్రహ్మమనిదలఁచి యచటనే యుండి పోదురు. వారలు ముందునకరిగెడి యవసరమునే తెలిసికొనరు. కాని యిదిభ్రమ. ఇట్లు చేయఁగూడదు. ఈ శూన్యత్వసంబంధమగు విఘ్నమును వివేకముతో దూరపఱచి ముందునకుఁ బోవలెను. ఆపిమ్మటనే బ్రహ్మము లభించును.

అనుభవమొందఁదగినదియు, వాస్తవమైనదియు, నిరవయవమైనదియునగు వస్తువే మనమైయున్నారము. మఱియు మనయనుభవమునే సమస్త జగత్తునందలి ప్రజలును గ్రహింతురు 78. లోభియగుమానవుఁడు ధనమును సమకూర్చుకొని స్వయముగా ధనరూపుఁడగును. కాని యాధనమును (ఆభోగమును) భాగ్యవంతుఁడు (అదృష్టశాలి) అగుపురుషుఁడే యానందముతో ననుభవించును 79. దేహబుద్ధిని విడుచుటవలన సాధకులకు గూడ నీస్థితియే వాస్తవముగాఁ గలుగును. ఇదియే అనుభవముయొక్క ముఖ్యవిషయము 80. "స్వయముగా మనము, (అందఱము) వస్తువు, వాస్తవమునందొక్కటియే" అనువివేకము గలుగుటయే జ్ఞానము 81. యథామతిగా నేనీయాత్మజ్ఞాననిరూపణమును గావించినాఁడను. శ్రోతలు న్యూనాధికములకు క్షమింతురుగాక.





# తొమ్మిదవ దశకము

## ప్రథమసమాసము — బ్రహ్మనిరూపణము.

### ప్రశ్నోత్తరరూపము.

నిరాకారము, నిరాధారము, నిర్వికల్పముఅనువానికర్థ మెయ్యదియో నాకుఁ దెలుపుఁడు 1. నిరాకారమన, పరబ్రహ్మమునకు ఆకారములేదని యర్థము. నిరాధారమన, పరబ్రహ్మమునకు ఆధారములేదని యర్థము. నిర్వికల్పమన, ఆ పరబ్రహ్మము కల్పనముచేయఁబడదు. అని యర్థము 2. నిరాభాసము, నిరాధానము, నిరవయవము అనువాని యర్థ మెయ్యదియో తెలుపుడు? 3. నిరామయమన, పరబ్రహ్మము, వికారరహితుఁడు. నిరాభాసుఁడన — ఆతఁడుభాసించుటలేదు, నిరవయవుఁడన ఆతనికవయవములులేవు 4. నిష్ప్రపంచము, నిష్కళంకము, నిరుపాధి. అననేమియో తెలుపుఁడు? 5. నిష్ప్రపంచమన? పరబ్రహ్మమునందుఁ బ్రపంచములేదు. నిష్కళంకమన ఆతనియందుఁ గళంకములేదు. నిరుపాధియన ఆబ్రహ్మమునకు ఉపాధిలేదనియర్థము 6. నిరుపమము, నిరవలంబము, నిరపేక్షముఅననేమియో తెలుపుఁడు? 7. నిరుపమమనఁ బరబ్రహ్మమునకు సమానములేదు. నిరవలంబమన నాతని కవలంబనములేదు. నిరపేక్షమన ఆబ్రహ్మమునందపేక్షలేదు 8. నిరంజనము, నిరంతరము, నిర్గుణమన నేమియర్థమో తెలుపుఁడు 9. నిరంజనమన, బ్రహ్మమునందు నలుపురంగులేదు, నిరంతరమన అందుఅంతరములేదు. నిర్గుణమన నందు గుణములేదనియర్థము 10. నిస్సంగము, నిర్మలము, నిశ్చలము అననెద్దియో వివరింపుఁడు 11. సంగములేనిబ్రహ్మమె నిస్సంగము. మలములేని బ్రహ్మమె నిర్మలము. చలనములేనిబ్రహ్మమే నిశ్చలము. ఆపరబ్రహ్మస్వరూప మిట్టిది 12. నిశ్శబ్దము, నిర్దోషము, నివృత్తి అనుదాని కర్థమేదియో తెలుపుఁడు 13. శబ్దరహితమైనది నిశ్శబ్దము; దోషములేనిది

నిర్దోషము. వృత్తిలేనిది నివృత్తి. ఆపరబ్రహ్మతత్త్వ మిట్టిది 14. నిష్కామము, నిర్లేపము, నిష్కర్మమను దానికర్థము తెలుపుఁడు 15. కామములేనిది నిష్కామము. లేపరహితమైనది నిర్లేపము. కర్మములేనిది నిష్కర్మము. ఆపరబ్రహ్మమిట్టిది 16. అనామ్యము, అజన్మము, అప్రత్యక్షమన నర్థమేదియో తెలుపుఁడు? 17. నామములేనిది అనామ్యము జన్మములేనిది అజన్మము. ప్రత్యక్షములేనిది అప్రత్యక్షము. ఆపరబ్రహ్మ మిట్టిది 18. అగణితము, అకర్తవ్యము. అక్షయము అనుదాని కర్థమేదియో తెలుపుఁడు? 19. లెక్కింపశక్యముగాని దగణితము. కర్తవ్యమేదియులేనిది అకర్తవ్యము. క్షయరహితమైనది అక్షయము. ఆపరబ్రహ్మతత్త్వమిట్టిది 20. అరూపము, అలక్ష్యము, అనంతము, అననేదియో యర్థముదెలుపుఁడు? 21. రూపరహితమైనది అరూపము. లక్ష్యముగానిది అలక్ష్యము, అంతములేనిది అనంతము. ఆపరబ్రహ్మ మిట్టిది 22. అపారము, అటలము, (అచలము) అతర్క్యమననేమియో అర్థము తెలుపుఁడు? 23. పారములేనిది అపారము. చలనములేనిది అచలము (అటలము) తర్కింపరానిది అతర్క్యము. ఆబ్రహ్మమిట్టిది 24. అద్వైతము, అదృశ్యము, అచ్యుతము, అననేమియో యనుగ్రహించితెలుపుఁడు? 25. ద్వైతములేనిది అద్వైతము. దృశ్యముకానిది అదృశ్యము. ఎప్పుడును చ్యుతముకాఁజాలనిది అచ్యుతము. ఆపరబ్రహ్మస్వరూప మిట్టిది 26. అచ్ఛేద్యము, అదాహ్యము, అక్లేద్యమననేమియో తెలుపుఁడు? 27. ఛేదింపరానిదిఅచ్ఛేద్యము. దహింపవీలుగానిది అదాహ్యము. తడుపరానిది అక్లేద్యము. ఆపరబ్రహ్మమిట్టిది 28. అన్నింటికిని ఆవలనున్నదానిని పరబ్రహ్మ మనియెదరు. ఆస్వరూపమును విచారము గావించుటవలన మనము బ్రహ్మమైయున్నారము. ఈవిషయము అనుభవముతో సద్గురునిబోధవలన విదితమగును. 29.

## రెండవసమాసము — ఆత్మజ్ఞానము,

సాకారముగాఁ గాన్పించుచున్నదంతయును గల్పాంతమునందు నాశమగును. పరబ్రహ్మస్వరూప మట్లుగాక నిరంతరము చెదరక యథా

విధముగానుండును 1. అన్నింటిలో సారమైన వస్తువును, మిథ్యగా నిదియు, సత్యమును, నిరంతరము నిలచియుండునదియు 2. నగునది యేదికలదో యదియే భగవంతుని ముఖ్యరూపము. దానినే స్వరూప మందురు. భగవంతున కిదిగాక యింక ననేక నామములు గలవు. 3. భగవత్సంబంధమగు జ్ఞానమార్జించుటకై నామనిర్దేశము గావింపఁ బడెను. కాని వాస్తవమునకు ఆస్వరూపము నామాతీతము, అది నిరంతరము స్థిరముగా నుండును 4. దృశ్యమునందు అది (ఆబ్రహ్మస్వరూపము) వెలుపలనులోపలను అంతటను నిండియున్నది. అంతియగాక యది విశ్వమునందు దాఁగియున్నది; (ఎవరికిఁగాన్పింపదు) అది మనకు సమీపముననుండియు గుప్తముగా నెటులున్నదో చూడుఁడు. 5. పరమేశ్వరుని వర్ణనము విన్నమీఁదటఁ గనులతో జూడవలయునను కోర్కెగలుగును, కాని చూచినచోఁ గనుపించునది సమస్తదృశ్యము మాత్రమేసుమా 6. దృష్టికి విషయముదృశ్యము. విషయముగాంచినచో దృష్టికానందముకలుగును. కాన యిది సత్యమగుచూపుగాదు 7. దృష్టికి గాన్పించునదియంతయు నశించునది. ఈ విషయమును నేనుగాదు శ్రుతియే చెప్పుచున్నది. (యద్దృష్టమ్ తన్నష్టమ్) కావున దృష్టికిఁగాన్పించునది స్వరూపముగాదు. (దృష్టికిఁగానుపించునది నశ్వరమైనది. స్వరూపము అవి నాశము) 8. స్వరూపము నిరాభాసము. దృశ్యమో భాసము. వేదాంత శాస్త్రమునందు భాసము నాశమగునని చెప్పఁబడెను 9. చూచినచో దృశ్యమే భాసించుచుండును. వస్తువు దృశ్యముకంటెను వేఱుగానున్నది. కాని స్వానుభవముతోఁ జూచినపిమ్మట "వస్తువు" దృశ్యమునకు లోపలను, వెలుపలను, అన్నిచోట్లను గనుపించును 10. నిరాభాసమును, నిర్గుణమునునగు బ్రహ్మము ఇటులుండునని గురుతులతో నెట్లుజెప్ప వీలగును? కాని యాస్వరూపము మనయొద్దనే యున్నదనిమాత్రము బాగుగాఁదెలిసికొనుము 11. ఆకాశమునందు భాసము భాసించునట్లును, అన్నింటి యందును, ఆకాశమున్నట్లును, జగదీశ్వరుఁడుగూడ అన్నిస్థలములందు లోపలను వెలుపలనుగూడ నున్నాఁడు 12. నీళ్ళయందున్నాఁడుగాని తడియుటలేదు. పృథ్వియందున్నాఁడుగాని తరుగుటలేదు. అగ్నియందున్నాఁడుగాని కాలుటలేదు 13. అతఁడు బురదయందున్నాఁడుగాని యద్ధి

వానికంటుటలేదు. వాయువునందున్నాఁడు. ఎగురుటలేదు. బంగారమునం దున్నాఁడుగాని (బంగారమువలె) విరుగుతరుగు లొందుటలేదు 14. ఆతఁ డీవిధముగా నిరంతరమును సంచితుఁడుగా నున్నాఁడు. కాని యాతఁడు అవగాహనమునకురాఁడు. ఆ యభేదవస్తువునుండి విభేదమును అభివృద్ధి గావించునది అహంభావమే 15. కావున మీ కిపుడు * "ఆ యహంత" లక్షణములను వివరించెదను. శ్రోతలారా! సావధానులై వినుండు 16.

స్వరూపమువై పునకుఁ బోవునదియు, అనుభవమునకు వెంటనంటి యుండునదియు, అనుభవ సంబంధములగు శబ్దములనన్నింటిని వివరించి చెప్పునదియు 17, నేనే యేకస్వరూపుఁడను (బ్రహ్మమును) అని చెప్పు నదియు నేదియో అదియే అహంతయొక్క రూపము. అది నిరాకారము నందుఁ దనంతఁదానే వేఱగును 18. భ్రమవలన అహంత స్వయముగాఁ దననే బ్రహ్మముగా భావించును. మిగుల సూక్ష్మముగా విచారించినపిదప ఆ భ్రమయంతయు వెల్లడియగును 19. "నేనే బ్రహ్మమును" అను నీ హేతువు (ఇట్లు చెప్పుట) కల్పనముతో నవగాహనము జేసికొనవచ్చును. కాని "వస్తువు" కల్పనాతీతముగా నున్నది. అందువలననే ఆ యనంతము యొక్క యంత మాకలనము గానేరదు 20. అష్టదేహముల యుత్పత్తికి సంబంధించిన నామాన్వయములు ఆ యుత్పత్తియొక్క సంహారమునకు సంబంధించిన నామములు వేఱువేఱుగ నున్నవి. అష్టదేహముల యుత్పత్తి సంహారములనుగూర్చి వివరించుటకొక శాబ్దికజ్ఞానము మాత్రమేచాలును. నిశ్శబ్దమగు పరబ్రహ్మమును వివరింపవలయునన్నచో సూక్ష్మవివేకము గావలయును. సూక్ష్మవివేకములేకున్న నన్వేషింప వీలుగాదు 21. మొదట వాచ్యాంశము నెత్తుకొనుఁడు. తరువాత లక్ష్యాంశమును గుర్తింపుఁడు. లక్ష్యాంశమును గాంచినపిదప వాచ్యాంశ మెట్లుండగలదు? 22. సర్వ బ్రహ్మము, మాయావిరహితబ్రహ్మము అను నీ రెంటిని బ్రతిపాదించు పక్షములు రెండుగలవు. ఈ రెండుపక్షములు చెప్పుటకుమాత్రమే వేఱుగ నున్నవి. లక్ష్యాంశమర్మమును దెలిసికొన్నపిమ్మట (పరబ్రహ్మమెట్టిది

* ఇచట మిగుల నుచ్చమగు అహంతాత్పర్యమును శ్రీ సమర్థులవారు జెప్పుచున్నారు. "నేను స్వయముగా బ్రహ్మమును" అని చెప్పుటకు అహంత్వత్వమని పేరు. అహం బ్రహ్మాస్మి అను మహావాక్యములోని అహంత్వత్వమునకుఁగూడ నిదియే తాత్పర్యము.

అను జ్ఞానము కలిగినపిమ్మట) చెప్పుట (వాచ్యాంశము) ఉండనేయుండదు. ఈ రెండుపక్షములుగూడ నుండవు 23. సర్వము, విమలము (మాయా రహితము) అను నీ రెండుపక్షములు వాచ్యాంశమునందే నిలిచిపోవును. అవి చెప్పెడిదానికంటె ముందున కరుగఁజాలవు. లక్ష్యాంశమునందు లక్ష్య ముంచిన తరువాతఁ బక్షపాతములుండవు 24. ఈ లక్ష్యాంశము ననుభవము గావింపవలయును. ఇచ్చట చెప్పుటకు (వాచ్యాంశమునకుఁ) బనియేలేదు. ముఖ్యానుభవము గనుఁగొనుటకుఁ జెప్పుటతోఁ బనియేమున్నది? 25. పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరులను నాలుగు వాక్కులును గుంఠిత ములగు పరబ్రహ్మమునుగూర్చి చెప్పుటకు శబ్దకళాకౌశలములతోఁ బని యేమున్నది? 26. చూడుము. శబ్దముచెప్పినంతనే నాశనమై పోవుచున్నది గదా! దానికి శాశ్వతత్వ మెట్లురాఁగలదు? ప్రత్యక్షమునకుఁ బ్రమాణము లేదు. చూడుఁడు 27. శబ్దము ప్రత్యక్షముగా నశ్వరముగనున్నది. అందుచేఁ బక్షము లుండనేరవు. అనుభవమునందు సర్వము, విమలము అనుభేదమే యుండదు 28. అనుభవలక్షణములు వినుండు. అనుభవమన అనన్యుఁడగుటయే. ఇఁక నన్య లక్షణములు వినిపించెదను. శ్రద్ధతో వినుఁడు 29.

అన్యములేనిదే యనన్యము. ఆత్మనివేదనమువంటిది. సంగము భంగమైనపిమ్మట (ద్వైతము నష్టమైనపిదప) ఆత్మ ఆత్మత్వముతో స్థిరమై యుండును 30. ఆత్మయందు ఆత్మత్వము గలుగకుండుటయే నిస్సంగ లక్షణము. ఈ విషయము విశదమగుకొఱకు మేము వాచ్యాంశముతోఁ దెలుపుచున్నారము 31. లక్ష్యాంశమును వాచ్యాంశముతోఁ దెల్పుటకు మరియొకవిధముగా నెట్లు సంభవమగును ? మహావాక్య వివరణమువలనఁ దనంతట నదియే విదితమగును 32. తత్త్వవివరణము గావించుటవలనను, నిర్గుణబ్రహ్మము నన్వేషింపఁ బూనుటవలనను, మఱియు స్వయముగాఁ దననుదాను చూచుటవలనను అన్నియును విశదమగును 33. చెప్పుటతోఁ బనిగొనకయే పరబ్రహ్మమును మననముచేయవలయును. ఎల్లప్పుడును మననము చేయుచునే యుండవలయును. ఇందువలననే మహాపురుషులకు

మానమే శోభనొసంగుచున్నది. * 34. దానిని వివరించుటలో శబ్దములు గూడ నిశ్శబ్దము లగుచున్నవి. మఱియు శ్రుతిస్సైతము "నేతి నేతి" యనుచున్నది. ఇవి ప్రత్యక్షానుభవ విషయమేగదా 35. ప్రతీతి (ఎఱుక) యైనపిమ్మట సందేహముంచుకొనుట ప్రత్యక్షదురభిమానము. ఈ స్థితియం దేవిధముగా నుడువవలయును. "నేను అజ్ఞానుఁడను. నాకేమియుఁ దెలి యదు 36. నేను మిథ్య, నాచెప్పునదియు మిథ్య. నావర్తనము మిథ్య. నేను, నాది, అనునంతయు మిథ్య, కల్పనము 37, నేననుదానికిఁ దావే లేదు. నాచెప్పునది యంతయును వ్యర్థము. నాచెప్పునది ప్రకృతిస్వభావము ప్రకృతి మిథ్య" 38. ప్రకృతియుఁ బురుషుఁడు నిరసనమగు తావున అహంతాత్వము (నేననునది) ఉండుట యెప్పుడు సంభవమగును? 39. ఏమియు శేషించి లేనితావున విశేషించి చెప్పవలసిన దేముండును? "నేను మానవ్రతమును ధరించియున్నాఁడను." అని నోటినుండి చెప్పుటవలన మానవ్రతము నష్టమగునట్లు నోటితోఁజెప్పు అనుభవవాక్యమునుబట్టి యాబోధకునకింకను అనుభవముగాలేదని తెలిసికొనవలయును 40. ఇప్పుడు మౌన భంగమును జేయఁగూడదు. (దోషరహితమగు క్రియను జేయ వలయును) చేసియును నేమియుఁజేయఁగూడదు. వివేకబలముతోనుండి యును బొత్తిగా లేకుండవలయును 41.

---

## మూడవసమాసము — జ్ఞానికి జననమరణములు లేవు.

శ్రోత లిట్లుప్రశ్నించుచున్నారు. "ఇది యెట్టిబ్రహ్మజ్ఞానము? ఉండి యును నేమియులేకుండుట యెట్లుసంభవమగును? 1. అన్నిఁటినిగావించి అకర్తగను, అన్నిఁటినిభోగించి అభోక్తగను అన్నిఁటియందు అలిప్తుడు గను నుండుట యెట్లుసంభవమగును? 2. యోగి భోగములననుభవించియు అభోక్తగానుండునని తాము నుడువుచున్నారు. అట్లైనచో నీవద్ధతిప్ర కార మాతఁడు స్వర్గనరకముల ననుభవించిగూడ అభోక్తగానుండునా

* బ్రహ్మము అనిర్వాచ్యమగుట కతన సత్స్వరూపమును చెప్పుటకుఁగాని చూపు టకుఁగాని వీలులేదు. "గురోస్తుమౌనం వ్యాఖ్యానమ్" అను వాక్యము సత్యము.

యేమి? * 3. యోగి జన్మమృత్యువుల ననుభవించుచునే యుండును. జన్మమృత్యువులనుభోగించియు నాతఁడభోక్తగానున్నాఁడు. యాతనల ననుభవించియు ననుభవింపనివాఁడుగానున్నాఁడుగదా 4. యోగీశ్వరుఁడు కొట్టినను గొట్టినవాఁడు కాఁడు. ఏడ్చినను ఏడ్చినవాఁడు కాఁడు. బాధించినను బాధించినవాఁడు కాఁడు 5. జన్మింపకుండినను ఆతఁడుజన్మించుచున్నాడు. పతితుడుగాకుండియుఁ బతితుఁ డగుచున్నాడు. యాతన లొందకయే నానావిధయాతన లొందుచున్నాఁడు. దీని కర్థమేమి? (ఈవిషయము సంశయాస్పదముగా నున్నది గావునఁ దెలుపుఁడు) 6.

శ్రోతల కీసందేహములు గలిగెను, కావున సమాధానములు జెప్పవలయును 7. వక్త చెప్పుచున్నాఁడు "శ్రోతలారా! సావధానులుగండు. మీర లడిగినది బాగుగనేయున్నది. మీకు మీయనుభవమువలన నిట్టిసందేహము గలిగినది 8. మనుజుఁడు తనయనుభవమునుబట్టి చెప్పుచుండును సామర్థ్యసంపదలు లేనిమానవుఁడు ధనవంతుఁడగుట నిరర్థకము 9. జ్ఞానసంపదలులేని జ్ఞాని, యజ్ఞాన దారిద్ర్యమువలనఁ గేవలశబ్దజ్ఞానముతో నిరంతరమాపదల ననుభవించుచుండును 10. యోగీశ్వరుని యోగీశ్వరుఁడే గురుతెఱుంగును. జ్ఞానేశ్వరుని జ్ఞానియే గుర్తెఱుఁగును 11. మహాచతురుని జతురుఁడేగురుతెఱుంగును. అనుభవనీయు ననుభవనీయుఁడే యెఱుంగును. అలిప్తుని నలిప్తుఁడే యెఱుంగును 12. విదేహుని విదేహుఁడే యెఱుంగును. బద్ధునితో సమానముగా సిద్ధుని, సిద్ధునితో సమానముగా బద్ధుని భావించు పురుషుఁడు మూర్ఖుఁడని ప్రత్యేకించి తెలుపవలసిన పనిలేదు 13. దయ్యము పట్టినవాఁడు దేహధారియే. దానిని వారించుమాంత్రికుఁడును దేహధారియే. ఈయిరువురును సమానులని యెట్లు చెప్పగలము? 14. ఇట్లే అజ్ఞానిని లేక పతితుని, జీవన్ముక్తుని లేక జ్ఞానిని సమానముగా దలంచు

* శ్రోతలు బొత్తిగాఁదెలియక యిట్లుప్రశ్నించిరి. "యోగి యన్నిఁటిని జేసియు అకర్తగను అన్నిటినను భవించి యభోక్తగను న్నాఁడని మీరు చెప్పుచున్నారు. ఈ స్థితియందు పాపాచరణమును జేయువారికి అంకుశ మెచ్చటనుగూడ నుండ నేరదు. ఏలయన? పాపమునుజేసినను జేయనివానితో సమానమైనది. కావునఁ బాపపుణ్యములు సుకృతదుష్కృతములు సమానమయ్యెనని చెప్పవలసివచ్చును. స్వర్గమునకుఁబోయినను నరకమునకుఁబోయినను పోనిదానితో సమమే"

పురుషుని బుద్ధిమంతుఁడని యెట్లనగలము? 15. ఇఁక నీదృష్టాంతములను జాలింతము. ఇప్పుడు కొంతయనుభవముతోఁగూడిన విషయమును దెలుపుదును. కొంచెమునేఁపు సావధానమతితో వినఁగోరెదను 16.

జ్ఞానముతో గుప్తుఁడుగానుండి, వివేకముతో నాత్మస్వరూపమునందు లయుఁడై, యనన్యుఁడగుటకతన వేఱుగ నెవఁడుండఁడో 17. యాతని నేవిధముగాఁ బ్రాప్తిఁగావించుకొనవలయును? ఏలయన! ఎప్పుడు మన మాతని వెదుకఁబోవుదమో యప్పుడు మనముగూడ స్వయముగా నదియేయగుచున్నారము. అదియేయగుటవలవ నేదేని చేయవలసినయవసర ముండదు 18. దేహమునందుఁ జూసినచోఁ గనిపింపఁడు తత్త్వముతో శోధింతమన్న భాసింపడు, బ్రహ్మమై యున్నాఁడుగాని యేమిచేసినను గుర్తింపఁబడఁడు 19, చూచుటకు దేహధారియేగాని లోపల నిర్వికారుఁడై యున్నాఁడు. ఈస్థితిలోఁ బైపైఁజూచుటవలన నెట్లుగుర్తింపగలము? 20. ఆతనిగూర్చినజ్ఞానము నార్జించుట కాతని నన్వేషించినచో నతఁడు నిత్యుఁడుగను, నిరంజనుఁడుగను గాన్పించును. అతని నన్వేషించుటవలన వికారిసైతము నిర్వికారియగును 21. అతఁడు కేవలము పరమాత్మ. అతనియందు మాయామలములు లేవు. ఆతఁడ ఖండుఁడు. కామ్యము లాతని నెన్నఁడును నంటుకొనవు 22. ఇట్టియోగిరాజు స్వాభావికముగా ఆత్ముఁడు. ఆతఁడు వేదబీజమగు పూర్ణబ్రహ్మము. దేహమువైపు చూచినంతమాత్రమున నాతఁడు గోచరింపఁడు 23. దేహభావన చేయుటవలన దేహమే కాన్పించును. కాని గుహ్యవిషయము వేఱుగానున్నది. శోధించిచూచితిమేని యాయోగీంద్రునకు జననమరణములు లేవని విదితమగును 24. జననమరణములు పొందుచున్నది అంతరాత్మ యెప్పుడునుగాదు. ఎయ్యది లేనేలేదో దానినెచ్చటనుండి తేఁగలము? ఎట్లు తేఁగలము? 25. నిర్గుణమునకు జననమరణములు గల్పించినచో స్వయముగా మనకే జననమరణములు లభించును 26. రెండుజాములవేళ సూర్యునిమీఁద నుమ్మివైచినచో నాయుమ్మి మనమొగముననే వచ్చిపడును. ఇట్లె యితరులమంచిచెడ్డ తనములనుగూర్చి చింతనమొనరించినచో మనకే యామంచిచెడ్డలు తటస్థించును 27. సమర్థరాజేశ్వరునిమహిమ నెఱింగినచో సమాధానము కలుగును. కానియొక్కొక్కవేళ కుక్క

మొలకెత్తినచో (నేమందుము? చివరకు) అది కుక్కయేగదా 28. జ్ఞాని సత్యస్వరూపుఁడు. కాని యజ్ఞాని వానిని (జ్ఞానిని) మనుష్యరూపునిగా భావించుచున్నాఁడు. భావము ననుసరించి యీశ్వరుఁడు ప్రాప్తించును 29. ఈశ్వరుఁడు నిరాధారుఁడు. నిర్గుణుఁడు. జనులు పాషాణమును ఈశ్వరుఁడని నమ్ముచున్నారు. పాషాణమన్నచో పగిలిపోవును. నిర్గుణ మెట్లు పగిలిపోఁగలదు? 30. ఈశ్వరుఁడు సదోదితముగా నొక్కఁడే యున్నాఁడు. కాని జనులాతని ననేకవిధములఁ జేసివేసిరి. అంతమాత్రమున నాతఁడు బహువిధములగుట యెప్పటికిని దటస్థింపదు 31. అట్లే ఆత్మ జ్ఞానియగు సాధువు తన జ్ఞానమువలన బూర్ణసమాధానియై యుండును. అతఁడు వివేకముతో ఆత్మనివేదనుఁడును ఆత్మస్వరూపుఁడును నగును 32.

కొయ్యబొమ్మ కాలినచో దానినిగాల్చినయగ్ని కొయ్యబొమ్మవలెఁ గాన్పించును. అంతమాత్రమున అగ్నిహోత్రుఁడు కొయ్యబొమ్మవంటి యాకారముగలవాఁడగుట తటస్థింపదు 33. జ్ఞానియొక్క దేహదశ కర్పూరమువంటిది. ఒకసారి కర్పూరము కాలిపోయినయెడల మఱల నది తన పూర్వరూపములోని కెప్పుడును రాఁజాలదు. అటులే జ్ఞానిదేహము ఒక్కసారి యదృశ్యమైనయెడల మఱల నది జన్మము నొందదు 34. వేయించిన విత్తనములు మొలువవు. కాలిన వస్త్రములు మఱల బూర్వరూపము నొందవు. గంగయందుగలిసిన రెండవ నదీప్రవాహమును జూడఁదలంచినచో నది వేఱుగాఁ గాన్పింపదు 35. ఆ ప్రవాహము గంగకు వెనుకఁ గాన్పించును. ఏలయన, గంగ ఏకదేశీయము. కాని సాధువునకు భాసమేమియుఁ గలుగదు. (ఏలయన, దేనియందు సాధువు గలిసియుండునో) ఆ యాత్మ సర్వగతము 36. (స్పర్శవేదితోఁ జేసిన) బంగారము మఱల యినుము కాదు. ఇటులే సాధువునకు మఱల జన్మము రాదు. జడులు మూఢులు నగు అజ్ఞానప్రాణుల కీవిషయము బోధగాదు 37. గ్రుడ్డివాని కేమియుఁ గాన్పింపనట్లు అజ్ఞానులకుఁగూడ సత్యవిషయము గోచరింపదు. అజ్ఞానులను సన్నిపాత వ్యాధిలోఁ బ్రలాపించు పిచ్చివానివలెఁ దలంపవలెను 38. స్వప్నమునందు భయపడినవాఁడు ఆ స్వప్నభయముతో నేదేని ప్రలాపించును. ఆ భయము మేల్కొనియున్నవాని కెట్లు గలుగును? 39. ఏదేని చెట్టువేఱు పామువలెఁ గనిపించుటచే నొకఁడు భయపడి పాఱిపోవును.

ప్రపంచము, పరమార్థము అను నీ రెంటిలో నేయొక్క-దానినైనను లేదా రెంటినైనను దెలిసికొనినవాఁడు సమర్థుఁడగును. ఏమియుఁ దెలియని మానవుని జీవితము వ్యర్థము 19. ఎఱుగనిని కావుననే తేలు, పాము కఱచుచున్నది. జీవఘాతము కలుగుచున్నది. ప్రతికార్యము ఎఱుఁగమికతననే నష్టమగుచున్నది 20. ఎఱుగని స్థితియందు మనుజుఁడు చిక్కు-ల పాలగుటయు, హారమునందుఁ బడుటయు, మోసగింపఁ బడుటయుఁ దటస్థించుచున్నది. ఏదేని పదార్థమును మఱచిపోవుటయు నెఱుఁగమివలననే కలుగుచున్నది 21. ఎఱుఁగని స్థితియందుఁ బ్రతిపక్షుఁడున్నపుడే వైరి విజయమును బడయును. ఎఱుఁగని స్థితివలననే మానవుఁడు సంకటముల పాలగును. జీవనాశనము ఎఱుఁగని స్థితియందే జరుగుచున్నది 22. తన హితమును దానెఱుంగని కారణమున జనులు యాతన లనుభవించుచున్నారు. జ్ఞానము లేనికారణముననే అజ్ఞాని కధోగతి లభించుచున్నది 23.

మాయాబ్రహ్మములను, జీవశివులను, సారాసారములను, భావాభావములను గ్రహించుటచే జననమరణములు నశించును 24. నిశ్చయముగు కర్త యెవఁడో బద్ధుఁడు, ముక్తుఁడు అని యెట్టివారలనందురో తెలిసికొనుటవలనఁ బ్రాణులకు విడుదల (ముక్తి) కలుగును 25. నిర్గుణదైవమును గుర్తింపవలయును. "నేను" అనునదెద్దియో యెఱుంగవలయును. అనన్యలక్షణములను గ్రహింపవలయును. దీనివలన ముక్తి లభించును 26. మానవుఁడు తెలిసి యెంతవిడిచివేయఁగలఁడో యంతదృశ్యము (మాయ)ను దాటిపోవఁగలఁడు. జ్ఞాత నెఱుంగుటవలన అహంతాత్వమూలము నశించును 27. తెలిసికొనకయే కోట్లకొలఁదిగా నానావిధ సాధనములు గావించినను మానవుఁడు మోక్షాధికారి కాఁజాలఁడు 28. మాయాబ్రహ్మముల గురుతెఱుఁగవలయును. మరియు స్వయముగాఁ దన్నుఁదా నెఱుంగవలయును. ఇంతవరకుఁ దెలసికొన్నచోఁ జాలును. సులభముగా జనన మరణములు విడిపోవును 29. రాజుయొక్క-గాని ధనవంతునియొక్క-గాని మనస్సులోనిమాటను గురుతించి తక్షణమె సమయానుకూలముగా మాటలాడినచో మిక్కు-టమైన వైభవము లభించును 30. కావున ఎఱుగుట యనునది సామాన్య విషయముగాదు. ఎఱుకవలన మానవుఁడు సర్వమాన్యుఁడగును. ఏమియు నెఱుంగనివాని కన్నితావులయందును అవ

మానమే తటస్థించును 31. ఏదేని పదార్థమును గాంచి దానియందుఁ బిశాచమున్నదని భావించి ఎఱుఁగని మానవుఁడు భయపడి ప్రాణములు విడచును. ఎఱిఁగిన మనుజుఁడు పిశాచముల విషయము మిథ్యయని తెలిసి కొనును 32. ఎఱిఁగినవానికె మర్మము తెలియును. ఎఱుఁగని మనుజుఁడు మిథ్యాకర్మములయందుఁ జిక్కుకొని పడియుండును. ధర్మాధర్మాదులన్ని యును నెఱుకవలననే విదితము లగుచున్నవి 33. ఎఱుఁగనివానికి యమ యాతనలు కలుగును. ఎఱిఁగినవాని కెట్టి సంకటములును గలుగవు. సమ స్తము నెఱింగి యెఱింగినవానినిగూర్చి విచారము గావించువాఁడే ముక్తుఁ డగును 34. రాజనీతివిషయము లెఱుంగకపోవుటచే నొక్కొక్కప్పుడు కొందఱకు అవమానము కలుగుటయేగాక ప్రాణములనుగూడ వెంటనే విడువవలసిన దుర్దశ తటస్థించుచున్నది. ఇటులే యెఱుఁగనిస్థితివలన నెల్లఱకును సంకటములు గలుగును 35. కావున నెఱుఁగని దశయందుం డుట మంచిదిగాదు. ఎఱుకలేని ప్రాణు లభాగ్యులు. ఎఱుఁగుటవలనను దెలిసికొనుటవలనను జననమరణములు నశించును 36. కావున మానవుఁడు ఎఱుఁగుటయందు మెలకువలేక వర్తింపఁదగదు. ఎఱుంగుటయే ముఖ్యో పాయము. ఎఱుకవలనఁ బరలోకమార్గము లభించును 37. ఎఱుఁగుట యందఱకును మంచిదిగఁ గన్పట్టుచున్నది. మూర్ఖునకుమాత్రము మంచి దిగాఁ దోచదు. ఎఱుకవలననే అలిప్తతను గుర్తించుట సాధ్యమగును 38. ఎఱుఁగుట (జ్ఞానము) తప్ప నింకెయ్యది ప్రాణులను ముక్తులఁజేయ గలదు? ఏపనియైనను గానిమ్ము. ఎఱుకలేక యున్నచోఁ గాఁజాలదు 39. ఎఱుఁగుట (స్మరణము) ఎఱుఁగకుండుట (విస్మరణము = మఱపు) అను నీ రెంటిలో నెయ్యది యోగ్యముగానున్నదో యావిషయము చతురులగు వారలు తెలిసికొనఁగలరు 40. ఎఱుక గలవారలే చతురులుగను, ఎఱుఁగని వారే పిచ్చివారుగను, దీనులుగను నున్నారు. ఎఱుకవలన విజ్ఞానము (అను భవజ్ఞానము) గూడఁ దెలియును 41. ఎచ్చట ఎఱుక కుంఠితమయ్యెనో యచ్చట చెప్పుటఁగూడ సమాప్తమయ్యెనని తెలిసికొనుఁడు. చాలును. ఈదశ కలిగినపిమ్మటనే అనిర్వాచ్యమగు సమాధానము లభించును 42.

ఇదియంతయు విని శ్రోతలిట్లు ప్రశ్నించిరి. మీరు చెప్పినది బా గుగానున్నది. మాకు దీనివలనఁ జాల సమాధానము కలిగెను. ఇఁకమాకుఁ

పిండబ్రహ్మాండలక్షణములేవియో అనుగ్రహించి తెలుపుఁడు 43. బ్రహ్మాం డమునం దేదియున్నదో అదియే పిండమునందున్నదని చాలమంది చెప్పు దురు. ఈ విషయమును దామ మాకుఁ బ్రత్యయము (విశ్వాసము) కలుగు విధమున వివరించి తెలుపుఁడు 44.

## ఐదవ సమాసము – పిండబ్రహ్మాండములు.

పిండసమానముగా బ్రహ్మాండ మెటుల రచింపఁబడెనో యా విష యము మాకుఁ దెలియకున్నది. దీనిని బ్రతీతి (ఎఱుక) గావించుటకై మతములన్నియుఁ దట్టుమిట్టాడుచున్నవి 1. సమయాసమయములందు (ఎల్లప్పుడును) తత్త్వజ్ఞులగువారలు "ఏయ్యది పిండములోనున్నదో యది బ్రహ్మాండములో నున్న"దని చెప్పుచుందురు 2. పిండబ్రహ్మాండములు రెండును నొకేవిధముగానున్నవని జనులు చెప్పుదురు. కాని యీ విష యము ప్రత్యయమను నికషోపలముపై (నమ్మకమను ఒఱపిఱాయిపై) పరీ క్షింపఁబడకున్నది 3. స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము అను నీ నాలుగుపిండదేహములు, విరాట్టు, హిరణ్యగర్భము, అవ్యాకృతి, మూలప్రకృతియను నీ నాలుగుబ్రహ్మాండదేహములు 4. ఇది శాస్త్ర ములలోఁ జెప్పఁబడిన విధము. కాని దీని నెట్లు ప్రతీతి (నిశ్చయము) చేయవలయును? ప్రతీతినిగూర్చి విచారింప నారంభించితిమేని గొప్ప గందర గోళములోఁ బడుదుము 5. పిండమునం దంతఃకరణ మెట్లున్నదో యట్లే బ్రహ్మాండమునందు విష్ణువున్నాఁడు. పిండమునం దెట్లుమనస్సున్నదో అట్లే బ్రహ్మాండమునందుఁ జంద్రుఁడున్నాఁడు 6. పిండమునందు బుద్ధియున్నటుల బ్రహ్మాండమునందు బ్రహ్మమున్నాఁడు. పిండమునందుఁ జిత్తమున్నట్లు బ్రహ్మాండమునందు నారాయణుఁడున్నాఁడు 7. పిండమునందు అహంకార మున్నదనియు, బ్రహ్మాండమునందు రుద్రుఁడున్నాఁడనియు నిశ్చయించు చున్నారు. ఈ విచారము శాస్త్రములందుఁ గలదు 8. అటులైన నచో విష్ణున కంతఃకరణమెవ్వఁడు? చంద్రునకు మనస్సెయ్యది? బ్రహ్మమునకు బుద్ధియెట్టిది? మాకుఁదెల్పుఁడు 9. నారాయణుని జిత్తమెయ్యది? రుద్రుని యహంకార మెయ్యది? వీని నన్నింటిని జక్కగావిచారించి మాకుఁ దెలు

వుఁడు 10. ప్రతీతి నిశ్చయములయందు అనుమానము సింహముముందుఁ గుక్కవలె నిస్తేజమగును. సత్యముముందు అసత్యము సరియైనదని యెవఁ డంగీకరింపఁగలఁడు? 11. కాని దీనికొఱకొక పరీక్షకుఁడు గావలయును. పరీక్షకునివలన సత్యవిషయము విశదమగును. పరీక్ష నెఱుంగకపోయిన యెడల సందేహములకుఁ బాల్పడవలసివచ్చును 12. ఓస్వామీ! విష్ణువు, చంద్రుఁడు, బ్రహ్మ, నారాయణుఁడు, రుద్రుఁడు అను నీయైదుగురి యంతఃకరణములనుగూర్చిన వివరములు దెలుపుఁడు 13. ఇచ్చట ప్రతీతియే (ఎఱుకయే) ప్రమాణము. శాస్త్రములకు సంబంధించిన అనుమానములతో బనిలేదు. లేదా శాస్త్రములనుజూచి సత్యవిషయమును బ్రత్యయము (విశ్వాసము) లోనికిఁ దేవలయును 14. ప్రతీతిలేకున్నచో నే కథానకమైనను మంచిదిగానుండదు. అట్లు (ప్రత్యయరహితముగాఁ) జెప్పెడిదంతయుఁ గుక్క నోరుతెఱచి యేడ్చుటవంటిది 15. ఎచ్చట బ్రత్యయమనుపేరుతో శూన్యాకారమున్నదో యచ్చట నేమివినవలయును? ఏమి వెదకిచూడవలయును? 16. గుడ్డివాండ్రందఱు గుమిగూడినతావునఁజేరి కనులుగలవాఁ డేమినుడువగలడు? అటులే యనుభవనేత్రములు పోయినతావున సర్వమును అంధకారబంధురమగును 17. పాలును నీరునుగలచోటనే రాజహంసలకుఁ బనియుండును. పురీషమయమగు ప్రదేశమున మాలకాకులకె పనిగలదు గాని రాజహంసలకుఁ బనియుండునా? 18.

మీయిచ్ఛానుసారముగాఁ బిండసమానము బ్రహ్మాండమని నిశ్చయించుకొంటిరి. కాని యది ప్రతీతిలోనికిఁగూడ రావలయునుగదా 19. కావున నీసందేహమంతయుఁ గల్పనముతోఁగూడిన మహారణ్యము. యోగ్యులగువారలు అరణ్యములలోనికిఁబోవు వంకరటింకరత్రోవలలో నడువరు. ఆత్రోవలలో నడచుపని దొంగలది 20. మంత్రములు కల్పనములకతన నిర్మింపఁబడెను. దేవతలుగూడఁ గల్పనమువలననే నిర్మింపఁబడిరి. దేవతలు స్వతంత్రులుగారు. మంత్రాధీనులు 21. ఈవిషయ మొకరుచెప్పకయే తెలిసికొనవలయును. చతురపురుషులు వీఁడు గ్రుడ్డివాఁడని నడవడినిబట్టియే గుర్తింతురు. అట్లే పూర్వోక్తవిషయములనన్నింటిని వివేకముతో నెఱుంగవలయును 22. ఎవని కెట్లుభాసించునో వాఁడట్టికావ్యమును రచించును. తనబుద్ధితో దానినెఱుంగవలయును 23. బ్రహ్మ యీ సంపూర్ణసృష్టిని

రచించుచున్నాడుగదా! బ్రహ్మనెవఁడురచించినాడు? విష్ణువు సమస్తవిశ్వ మును బాలించుచున్నాఁడుగదా? విష్ణువును బాలించువాఁడెవఁడు? 24. రుద్రుఁడు విశ్వసంహారమునకు గర్తయైయున్నాఁడుగదా? రుద్రుని సంహ రించుటకు గర్తయెవఁడు? కాలమన్నిఁటిని శాసించుచున్నదిగదా? కాల మును శాసించువాఁ డెవఁడు? ఈవిషయములన్నియు నెఱుంగవలయును 25. పైవిషయములు తెలియనంతవరకు నంతయు నంధకారముగనే భావింపవలయును. కావున సారాసారవిచారము గావింపనలయును 26. బ్రహ్మాండము తనంతటతానే యగుచున్నది. పిండాకార మంగీకరింపఁబడు చున్నది. అంగీకరింపఁబడుచున్న దేగాని దీనిప్రత్యయ మెన్నఁటికిని గలుగదు 27. బ్రహ్మాండముయొక్క ప్రతీతినిగూర్చి విచారముగావించుటవలన ననేక సందేహము లుత్పన్నమగును. వాస్తవమున కిదియంతయుఁ గల్పనముగా నెఱుంగవలయును 28. పిండసమానముగా బ్రహ్మాండము రచింపఁబడెనని యెవ్వఁడంగీకరించును? బ్రహ్మాండమునం దనేకపదార్థములు నిండిపడియు న్నవి. అవి పిండమునందెక్కడ నున్నవి? 29. మూఁడుకోట్ల యేఁబదిలక్షల భూతజాతులు, మూఁడుకోట్ల యేఁబదిలక్షల తీర్థజాతులు, మూఁడుకోట్ల యేఁబదిలక్షల మంత్రములు పిండమునందెక్కడ నిమిడియున్నవి? 30. ఏఁబది ఆఱుకోటుల చాముండీదేవతలు, ఎన్నియో విధములుగనుండు కోట్లకొలఁదిజీవులు, ఎనుబదినాలుగులక్షల జీవయోనులు, వీనికూడిక పిండ మునందెక్కడ నున్నది? 31. ముప్పదిమూఁడుకోట్ల దేవతలు, ఎనుబది నాలుగువేల ఋషులు, తొమ్మిదికోటుల కాత్యాయనీదేవతలు, పిండము నందెక్కడ నున్నారు? 32. ఇంతియగాక యింకను బ్రహ్మాండమునందు నానాప్రకారములగు పదార్థములు పెక్కులు వేఱువేఱుగా నిర్మాణములై యున్నవి. వానినన్నింటిని పిండమునందుఁ జూపింపవలయునుగదా? 33. అనేకౌషధములు, అనేక రసాలఫలములు, నానావిధ బీజములు, ధాన్య జాతులు మొదలగువాని నన్నింటినిఁ బిండమునం దెవఁడు చూపఁగలఁడు? 34. ఇటులే యెంతచెప్పినను బ్రకృతాంశము పూర్తికాదు. ఇంకను నిటులే చెప్పుచుండుటగూడ సాధ్యముగాదు. మఱియుఁజెప్పినది ధ్యానములోనికి రాకుండుటవలన సిగ్గుగలుగును 35.

ఇది చెప్పఁజాలని విషయమేయైనప్పుడు మఱల నేలవ్యర్థముగాఁ జెప్పవలయును? సందేహపడవలసిన యవసరములేదు 36. వాస్తవమునకుఁ బంచభూతములు బ్రహ్మాండమునందును బిండమునందునుగూడ వర్తించుచున్నవి. దీనిని జక్కఁగాఁదెలిసికొనుఁడు 37. పంచభూతముల కల్పనమే బ్రహ్మాండము. పిండముగూడఁ బాంచభౌతికమే. దీనికి వ్యతిరేకముగనున్న జ్ఞానమంతయు ననుమానజ్ఞానమే 38. అనుమానమునకు సంబంధించినది వమనమువలెఁ ద్యాజ్యము. నిశ్చయాత్మకమగు కథనమే ప్రత్యయపూర్ణమును గ్రాహ్యమునైయున్నది 39. ఏయ్యది పిండమునందుఁ గలదో యదియే బ్రహ్మాండమునందుఁ గలదను విషయము ప్రత్యక్షానుభవము గాకున్నను బంచభూతములవ్యాప్తి రెంటియందును నున్నది 40. ఈ రెండింటి విషయమునం దిది అనుమానమాత్రముగనే యున్నపు డీక ముఖ్య సమాధాన మెద్ది?* 41.

## ఆఱవ సమాసము — పంచభూతములు, త్రిగుణములు.

ఆకాశమువలె బ్రహ్మము నిరాకారము. ఆకాశమునందు వాయువుత్పన్నమైన విధమున బ్రహ్మమునందు మూలమాయ గలిగెను 1. ఈ యంశము గ్రంథములందుఁగూడ వివరింపఁబడెను. గత దశకమునం దీయంశము విశదీకరింపఁబడెను. మూలమాయయందుఁ బంచభూతముల యునికి (అస్తిత్వము) చూపింపఁబడెను 2. ఆ మూలమాయయందుఁ గల యెఱుకయే సత్త్వగుణము. ఎఱుక లేమియే (మఱపే) తమోగుణము. రెండింటి మధ్యదశ (కొంతయెఱుక - కొంత యెఱుకలేమి) రజోగుణము 3. అక్కడ ఎఱుక యెక్కడినుండి వచ్చినది? అని యొకవేళ శ్రోతలు ప్రశ్నింతురేమో! దాని యభిప్రాయ మేమన, పిండమునం దేవిధముగా మహాకారణ దేహమే సర్వసాక్షిణి (తురీయమగు) అవస్థయగుచున్నదో 4, అట్లే బ్రహ్మాండము యొక్క మహాకారణదేహము మూల ప్రకృతియై, యున్నది. ఇందువలన

* ఈ సమాసమునందుఁ బ్రశ్నోత్తరములు నిరూపించి వ్రాయఁబడలేదు. సందర్భమునుబట్టి 13 వ పద్యము వఱకుఁ బ్రశ్నయనియు 14 వ పద్యమునుండి ప్రత్యుత్తరమనియుఁ దోఁచుచున్నది.

మూల ప్రకృతియందు ఎఱుకకు అధిష్ఠానమున్నది 5. త్రిగుణములు మూల మాయయందు గుప్తరీతిగా నున్నవి. కాని యా త్రిగుణములు స్పష్టమైనపు డాదశను జతురులు గుణక్షోభిణి (గుణమాయ) యనుచున్నారు 6. ఏ దేని గరికెమొక్కకుఁ జివర రేకెత్తి పూవు వికసించునట్లు మూలమాయ నుండి త్రిగుణములుగూడ సులభముగాఁ బ్రకటనమగును 7. మూలమాయ వాయుస్వరూపముగా నుండును. అల్పగుణ వికారమైన పిమ్మట దానినే గుణక్షోభిణి యని యందురు 8.

దీని తరువాత ఎఱుక, ఎఱుకలేమి, ఎఱుక యెఱుకలేముల మధ్య స్థితి అను నీ మూఁడును (త్రిగుణములు) ప్రకటనమై మిశ్రరూపముతోఁ బ్రవర్తించును. దాని తరువాత అకారాద్యక్షరముల కధిష్ఠానమగు శబ్దము ప్రకటనమగును 9. ఆ శబ్దమే ఆకాశగుణము. శబ్దమువలననే వేద శాస్త్రముల స్వరూప మేర్పడెను 10. పంచభూతములు, త్రిగుణములు, ఎఱుక, ఎఱుకలేమి మున్నగునవి యన్నియు వాయు వికారములే 11. వాయువు లేనిచో ఎఱుక ఎచ్చటినుండి రాఁగలదు? ఎఱుక లేనిచో ఎఱుక లేమి యెచ్చటనుండి రాఁగలదు? ఎఱుక మఱపులు వాయుకారణముననే యుండును 12. చలనము (వాయు లక్షణము) లేని తావున జ్ఞానలక్షణ మెచ్చటినుండి కలుగఁగలదు ? కావున వాయుగుణమే ముఖ్యమైనది 13. ఒకదానినుండి రెండవది బయలు వెడలుట (మనము) ప్రత్యక్షముగా గాంచుచున్నను త్రిగుణములు, పంచభూతములు, మూల స్వరూపము (మూల మాయ) నందే యున్నవి 14. ఈ విధముగా నీకర్దమము ఆదిదై యున్నది. అదియే మఱల వెనుకనుండి ప్రకటనమగుచున్నది. ఇంతియగాక క్రమముగా నొకదానినుండి మఱియొకటి యుత్పత్తియగునని చెప్పుటయుఁ గూడ సత్యమే 15. పైన వాయు నిశ్చయము జెప్పితిని. ఇఁక దాని తరు వాతి సంగతి వినుండు. వాయువునుండి అగ్ని కలుగుచున్నది. కాని వాస్తవమున కదియునుగూడ కర్దమరూపముననే యుండును 16. తరు వాత అగ్నినుండి జలము, జలమునుండి పృథ్వి కలుగుచున్నది. ఐనను నిది గూడఁ గర్దమరూపముగనే యుండును 17.

భూతముల కెఱుకయున్న సంగతి నెవఁడు చూచినాఁడు? పంచ భూతముల కెఱుక యున్నదని మేమెప్పుడును విన లేదే? యను శంక కిచట

దావు గలదు. పరిహారము వినుండు 18. వాస్తవమునకుఁ జలన శక్తి నెఱుక యందురు. వాయువునందు సమస్త గుణము లున్న సంగతి వెనుకఁ జెప్పియున్నారము. ఈ విధముగా ఎఱుక మఱపులతో మిశ్రితములై పంచ భూతము లన్నియుఁ బ్రవర్తించును. కావున భూతములయందు ఎఱుక యవశ్యముగ నున్నది 19-20. అవును; అది యొకానొక-చోటఁ గనిపించు చున్నది. ఒకానొక-చోటఁ గనిపించుటలేదు. నిజమేకాని యది భూతము లయం దవశ్యముగా వ్యాప్తమైయున్నది. దాని స్థూలత్వముగాని సూక్ష్మ త్వముగాని దృష్టికి భాసించును 21. భూతములలో భూతము లణఁగియుండి యైదు భూతము లయ్యెను. వాస్తవముగాఁ జూచినచో నొకటి స్థూలము గను నొకటి సూక్ష్మముగను భాసించుచున్నది 22. నిరోధవాయు వెటులఁ గనిపింపదో అటులే యెఱుకయుఁ గాన్పింపదు. కాన్పింపకున్నను అది భూత రూపమునం దున్నమాట తథ్యము 23. కట్టెయందున్న అగ్ని కనుపింపదు. వాయువు కనులకుఁ గనుపింపదు. అట్లే భూతములందున్న యెఱుకయు నాకస్మికముగాఁ గాన్పింపదు 24. భూతములు మనకు వేఱువేఱుగాఁ గని పించుచున్నను సత్యమున కవియన్నియును గలసియున్నవి. ఈ యంశము నెఱుంగుటకు మిగులఁ జతురతతో ననుభవమును సంపాదింపవలయును 25. బ్రహ్మమువలన మూలమాయ, మూలమాయవలన గుణమాయ, గుణ మాయవలనఁ ద్రిగుణములు కలిగెను 26. అనంతరము గుణములనుండి పంచ మహాభూతములు గలిగెను. వీని యన్నిఁటి స్వరూపమును మున్నె చెప్పితిని 27. శ్రోత యిట్లు నుడివెను. ఆకాశము గుణమునుండి యెప్పు డును కలుగఁజాలదు. ఇది యసంభవము. శబ్దమును ఆకాశముగా భావిం చుటయే మిథ్య 28. ఇందుమీఁద వక్త కొంచెము బిగ్గరగా నిటుల జెప్పెను. "నేను చెప్పునది యొకటి. నీవు భావించుచున్నది మఱియొకటి. వ్యర్థముగా గాథాజాలమును బెంచుచున్నాఁడవు. ఇఁక నిట్టి పిచ్చివాని కెవ్వఁడు బోధింపఁగలఁడు? 29. నేర్పినఁ దెలియుట లేదు. బోధించినను మనస్సునకుఁ బట్టుటలేదు. ఈ మందరూపుఁడు (శిష్యుఁడు) దృష్టాంతము లతోనైన విషయమును తర్కింపఁడు 30.

ఒక భూతముకంటె మఱియొక భూతము పెద్దదని చెప్పితిని. ఇపుడు భూతములకంటెఁ బెద్దదియు, స్వతంత్రమును నగునదేది? 31. మూల

మాయయే పాంచభౌతికమైయుండ నిఁక నేవివేకము శేషించును? మూల మాయకావల నొక నిర్గుణ పరబ్రహ్మమే యున్నది 32. ఆ పరబ్రహ్మము నందుఁ గలుగు మూలమాయనుగూర్చి మనము విచారింతుమేని అది (మూలమాయ) పంచభూతములచేతనుఁ ద్రిగుణములచేతను నేర్పడి యున్నదని విదితమగును 33. ఆకాశము నిర్వికారము. మిగిలిన నాలుగు భూతములును వికారవంతములు. ఉపాధి కారణమున ఆకాశము భూతము లలో నొకటిగఁ బరిగణింపఁబడెను 34. వస్తువునకుఁ బిండమునందు వ్యాప్త ముగా నున్నందున జీవనామము కలిగినట్లుగను బ్రహ్మాండమునందు వ్యాప్త ముగా నున్నందున శివనామము కలిగినట్లుగను, ఆకాశమున కుపాధికారణ మున భూతనామ మేర్పడెను 35. ఆకాశ ముపాధిలోఁ బడిపోయెను. సూక్ష్మముగాఁ జూచినచో భాసించుచున్నది. చాలును. ఈ కారణము వలననే ఆకాశము భూతరూపమొందెను 36. ఆకాశము శేషించిన నాల్గు భూతముల యుపాధికంటెను శూన్యరూపముతో భాసించుచున్నది. పర బ్రహ్మము నిరాభాసము. ఉపాధిరహితమగు నాకాశమే వాస్తవమునకుఁ బరబ్రహ్మము 37. ఎఱుఁగుట, ఎఱుకలేమి, ఈ రెంటి మధ్యమస్థితి అను నదియే త్రిగుణ లక్షణము. ఇచ్చట త్రిగుణములుసయితము రూపసహి తములని చెప్పఁబడినవి 38. ప్రకృతి విస్తృతియైన కొలఁది ఒకటికి మఱి యొకటిగ నేర్పడిపోవసాగెను. వికారవంతమగుదానికి నియమ ముం డునా? 39. నలుపును తెలుపును గలిపినచో నీలవర్ణ మేర్పడును. మఱియు నలుపును బసుపును గలిపినచో ఆకుపచ్చ రంగేర్పడును 40. ఈ విధముగా బలుతెఱంగుల రంగులు కలియుటచేఁ గ్రొత్తక్రొత్త రంగులు కలుగునట్లు ఒకటితో మఱియొకటి కలియుట కతన నీ వికారవంతమగు దృశ్యము నానారూపములు ధరించుచున్నది 41. ఒక్కటియగు జలము నానావర్ణములతోఁ దరంగరూపముగ లేచుచుండును. ఈ త్రిమ్మరి వికా రముల నెంతదనుక విచారింపనగును 42. ఒక జలమందు వికారము లపారములుగ నున్నవి. ఇఁకఁ బంచభూతముల విస్తరమన్ననో అది యెనుబదినాలుగు కోటుల యోనుల రూపమున నున్నది 43. నానా దేహముల బీజమే జలము. ఉదకమునుండి సమస్తజనులును జనించిరి. కీటకము, చీమ మొదలుగాఁగల శ్వాపదాదికము (హింసించు జంతు

జాతి) అంతయు ఉదకమునుండియే కలుగుచున్నది 44. నీటి వలననే రజస్సు, వీర్యము ఏర్పడెను. ఈ శరీరమంతయు జలమయము. నఖములు, దంతములు, శల్యములు మున్నగునవియన్నియు నీటివలననే నిర్మితము లగుచున్నవి 45. వేళ్ళయొక్క సూక్ష్మద్వారములనుండి వృక్షములోనికి జలము ప్రవేశించును. ఆ నీటివలననే వృక్షజాతు లభివృద్ధి నొందు చున్నవి 46. జల కారణముననే మయూరము మామిడిచెట్టులోని కరు దెంచుచున్నది. వృక్షము ఫలములతోc, బల్లవములతోc, బూవులతో నలరారుటకు జలమే కారణము 47. వృక్షముయొక్క మొదలును, శాఖ లను బగులcగొట్టి ఫలములనువెదకినచోc గనిపింపవు. అచ్చటcబచ్చిచెక్క మాత్రమే యుండును 48. వేఱుమొదలుకొని పయిరెమ్మలవరకు శోధించి నను వృక్షములోc బండ్లుగనిపింపవు. ఇcక ఫలము లెక్కడనుండి వచ్చు చున్నవి ? వృక్షములో ఫలము జలరూపముగానున్నది. ఈ యంశము చతురులగు పురుషులు వివేకముచే గ్రహింతురు 49. ఆ జలమే పై కెక్కి నపుడు వృక్షమంతయుc బూవులతోc బండ్లతో నలరారును. ఈ విధముగా జలసహాయమున నన్నియు నేర్పడును 50. ఇట్లే ఆకులు, పూవులు, పండ్లు కలుగును. మాటిమాటికి ఈ విషయము నెంతదనుకని చెప్పవల యును ? సూక్ష్మదృష్టితో నారయుచో నంతయు విదితమగును 51. భూతముల వికారము నెంతదనుకc జెప్పcగలను ? క్షణక్షణమును భూత ములు మాఱుచుండును. నానావర్ణరూపములతో నొకటి వేఱొకటిగా మాఱుచుండును 52. త్రిగుణములు, పంచభూతములు (అష్టవిధప్రకృతి) వీనిచలనమును విచారించినచో వీనికిc బెక్కురూపములు గలవని విదిత మగును. నానావిధముల మాఱుచుండు వానివివరణము నెంతదనుకc జెప్ప సాధ్యమగును ? 53. ఈ ప్రకృతి వివేకసహాయమున బాగుగా నిరసనము గావింపవలయును. ఆ పిమ్మటc బరమేశ్వరుడగు నాపరమాత్ముని యనన్య భావముతో భజింపవలయును 54.

---

## ఏడవసమాసము — వికల్ప నిరసనము.

శ్రోత యిట్లు శంకించుచున్నాcడు "మొట్టమొదట నొకస్థూలదేహ మున్నది. పిమ్మట దానిలో అం తః క ర ణ పం చ క మున్నది. జ్ఞాతృత్వ

వివేకము స్థూలకారణమువలన నేర్పడెను 1. ఇట్లే బ్రహ్మాండములేనిది మూలమాయయందు ఎఱుక రానేరదు. స్థూలాధారమువలన నన్ని పనులును నడచుచున్నవి 2. స్థూలమే నిర్మాణము కానప్పుడు అంతఃకరణ మెచ్చటనుండఁగలదు ? 3. పై శంకకుఁ బ్రత్యుత్తరము. పట్టుపురుగు జాతిలోఁజేరిన పెద్దవి చిన్నవి యగుపురుగులు తమతమ శక్త్యనుసారముగా దాముండెడి చెట్టుమీఁదనే గృహములు నిర్మించుకొని యందు వసించును4. ఇటులే శంఖపుఁ బురుగులు, నత్తగుల్లలోని పురుగులు, గవ్వలలోని పురుగులు మొదట పుట్టుచున్నవియా ? లేక మొదట వాని గృహములు నిర్మాణము లగుచున్నవా ? ఈ యంశమునుగూడ విచారింపవలయును 5. పై నిఁబేర్కొనిన కీటకజాతులే తొలుతఁ బుట్టును. తరువాత నవి తమతమ నివాసములను నిర్మించుకొనును. ఈ విషయము ప్రత్యక్షానుభవమైనది. దీనిని విశేషించి వివరింపఁ బనిలేదు 6. ఈ విధముగఁ దొలుత సూక్ష్మమును దరువాత స్థూలమును నిర్మాణమగుచున్నది. ఈ దృష్టాంతమువలన శ్రోతల ప్రశ్నకు సులభముగఁ బ్రత్యుత్తరము చెప్పినట్లగును 7.

పిమ్మట శ్రోత మఱల నిట్లడిగెను. "అయ్యా ! నాకిపుడు జన్మమరణవిచారమును బోధింపుఁడు 8. జన్మము నిచ్చువాఁ డెవఁడు ? జన్మమును గైకొనువాఁ డెవఁడు? దీని నెట్లెఱుంగవలెను? 9. బ్రహ్మ జన్మము నొసఁగుననియు, విష్ణువు ప్రతిపాలించుననియు, రుద్రుఁడు సంహారము గావించుననియుఁ బెద్దలు చెప్పుదురు 10. కాని యీ ప్రవృత్తికథనము (జనరూఢి) నాకు బోధగాకున్నది. అనుభవదృష్టికీకథనము విశ్వాసనీయముగఁ దోఁచుటలేదు 11. బ్రహ్మ కెవఁడు జన్మము నొసంగుచున్నాఁడు ? విష్ణువు నెవ్వఁడు ప్రతిపాలనము జేయుచున్నాఁడు ? మహాప్రళయమునందు రుద్రునెవ్వఁడు సంహారము చేయుచున్నాఁడు?12. నాబుద్ధి కిదియంతయును సృష్టిప్రభావమనియు, మాయాస్వభావమనియుఁ దోఁచుచున్నది. నిర్గుణి యగు దేవునే యొకవేళ కర్తగా నంగీకరింతమా యన్న నాతఁడు నిర్వికారి గదా (వికారములేనిది కర్తృత్వ మెట్లు రాఁగలదు?) 13. ఈ కార్యము లన్నింటిని మాయయే యొనర్చుచున్నదని యందుమన్నచో మాయ స్వయముగా నుత్పత్తియై నశించునది. మాయా విస్తరము స్వయముగా నగుచున్నది. విచారించిచూచినచో మాయ స్థిరముగలది కాదనిగూడ

విశదమగుచున్నది. (కావున నిట్టి యశాశ్వతమగు మాయ కర్తయని యెట్లు చెప్పనగును?) 14. ఇదిగాక జన్మించువాడెవఁడు? వాని చిహ్నములు గుర్తించుటయెట్లు? సంచితలక్షణమెద్ది? వీనినిఁగూడ నెఱింగింపుఁడు 15. పుణ్యాపాప స్వరూపములెవ్వి? మఱియుఁ బ్రస్తుతము శబ్దములతో శంకలను గలుగఁజేయువాఁ డెవఁడు? (ఈ శబ్దములవలన నీ శంకల నొనర్చిన 'నేను' ఎవఁడను?) 16. ఇవి యేమియు నాకుఁ దెలియుటలేదు. వాసనయనునదియే జన్మను గైకొనుచున్నదని యందురు. కాని వాసన కనుపింపనే కనుపింపదు. అది పట్టుకొనుటకుఁగూడ నవకాశములేనిదిగా నున్నది. ఈ స్థితిలో వాసన జన్మముల నెట్లు గైకొనుచున్నది? 17. వాసన, కామనము, హేతువు, భావన, కల్పనము, నానావిధములుగ నున్నమతి మున్నగు ననేకవృత్తులు అంతఃకరణ పంచకములోనివై యున్నవి 18. ఇవియన్నియు ఎఱుకయొక్క యంత్రములు. ఎఱుకయన, కేవలస్మరణ మున కర్థమగును. ఆ స్మరణమునందు జన్మసూత్ర మెట్లు సంధించును? 19. దేహము పంచభూతములతో నిర్మింపఁబడినది. దానిని నడపునది వాయువు. మఱియు ఎఱుఁగుట మనస్సునకుఁగల మనోభావము 20. ఈ విధముగా నిదియంతయు స్వాభావికముగనే, తనంతటనే య గు చు న్న ది. ఇది యంతయుఁ బంచభూతముల జంజాటము. ఎవఁడు, ఎవనికి జన్మమునొసంగు చున్నాఁడు? 21. కావున జన్మము లేనేలేదని నాయభిప్రాయము. ఒకసారి పుట్టినప్రాణి మఱల నెన్నఁటికిని జన్మము నెత్తజాలదు 22. మానవునకు మఱల జన్మములేదు. అట్టియెడ సాధుసమాగమము గావింపవలసిన యవ సరమేమున్నది? 23. మొట్టమొదట స్మరణ విస్మరణములే (ఎఱుక మఱుపులే) లేవు. ఈ స్మరణము మధ్యనే వచ్చినది. అది యంతఃకరణము నెఱింగెడి యొకకళ 24. చైతన్య మున్నంతదనుకనే స్మరణ ముండును. చైతన్యము నష్టమైనతోడనే విస్మరణము (మఱపు) కలుగును. అట్లే విస్మరణము వచ్చినతోడనే ప్రాణికి మరణముకలుగును 25. స్మరణము, విస్మరణము నష్టమైనంతనే దేహమునకు మరణము ప్రాప్తించును. అపుడు మఱల జన్మమును ఎవరికెవరిచ్చెదరు? 26. కావున జన్మములేదు. యాతన యును గాన్పించుటలేదు. ఈ కల్పనమంతయు వ్యర్థముగా వృద్ధిమైనది 27. సారాంశమేమన్న — "ఎవనికిని జన్మము కలుగుట లేదు. ఒకసారి మర

ణించినవారలు మఱల జన్మమునెత్తరు. (అని శ్రోతలకు శంకగలిగెను.) 28. ప్రత్యుత్తరము — ఎండిపోయినకట్టె మఱలఁ బచ్చదనము నొందదు. పడిపోయినఫలము మఱల నతుకదు. ఇట్లే పతనమైనశరీరము మఱల జననము నొందఁజాలదు 29. కుండ ఆకస్మికముగాఁ గ్రిందఁబడి పగిలిపోయినచో మఱల నది యే విధముగానైనను కుండగాదు. అటులే మృతమనుష్యుఁడు మఱల జన్మమునొందఁడు 30. అనగా మరణించి యెవ్వఁడును మఱల జన్మమునే యెత్తకపోయినచో అప్పుడు శ్రోతల యభిప్రాయములో అజ్ఞాన సుజ్ఞానములు సమానములేయైనవి 31.

శ్రోత యిట్లు నుడివెను "వినుఁడు. సకలమును పాషండమును గావింపకుడు. సందేహము కలిగినచో వివేకసహాయమున విచారింప వలయును 32. ప్రయత్నములేనిది పని నెఱవేరుటయుఁ దినకయే కడుపు నిండుటయు జ్ఞానముకలుగకయే ముక్తిలభించుటయు నెప్పుడును సంభవింపదు 33. తాను తృప్తిగా భుజించినవానికిఁ బ్రపంచమంతయుఁ దృప్తి నొందినట్లు తోఁచవచ్చును. కాని యందఱును దృప్తి నొందుదనుక నది సత్యమెట్లుకాఁగలదు ? 34. ఈఁతను నేర్చినవాఁడే తీరమునకుఁ జేరఁగలడు. ఈఁత నేరువనివాఁడు మునిఁగిపోవును. ఇందు సందేహ మావంతయును లేదు 35.

ఈ విధముగా జ్ఞానప్రాప్తి నొందినవారలు తరింతురు. బంధనములు తెగిపోయినవాఁడే ముక్తుఁడగును 36. ముక్తపురుషుఁడు బంధనము లేనేలేదని చెప్పును. లోకులు ప్రత్యక్షముగా బంధనములకుఁ బాల్పడి యున్నారు. వారలస్థితి యేమి ? దీనినిగూడ నీవుకొంచెము యోచించి చూడుము! 37. ఇతరులదుఃఖము నెఱుంగనివానిని, ఇతరులదుఃఖములోఁ దనకు సుఖమున్నదని తలంచువాఁడని నిశ్చయింపవచ్చును. పూర్వోక్తమగు నీ యనుభవస్థితియు నట్టిదె 38. ఆత్మజ్ఞానము గలిగినవాఁడు వాస్తవమునకు సంపూర్ణతత్వములను వివరించుకొనును. అనుభవము లభించిన పిమ్మట వానికిఁ బరమశాంతికలుగును 39. జ్ఞానమువలన జననమరణములు నశించునను కథనమును మిథ్యగ భావించితిమేని వేదశాస్త్రపురాణములను గూడ మిథ్యయని చెప్పవలసి వచ్చును 40. ఒకవేళ వేదశాస్త్రములను ప్రపంచమునందలి మహానుభావుల వాక్యములను మిథ్యయని భావించినచో

నిఁక మావంటివారల మాటల నెవ్వఁడు విశ్వసించును? కావున నెవని కాత్మజ్ఞానముండునో యాతఁడె ముక్తుఁడు 41-42. వాస్తవమునకు మనుజులందఱును ముక్తులే. ఇట్లు చెప్పువాక్యములుగూడ జ్ఞానకాండము లోనివే. కాని యిదియంతయు జ్ఞానము కలిగినప్పుడే సంభవమగును 43. ఆత్మజ్ఞానము కలిగినయెడల దృశ్యము మిథ్యయైపోవును. కాని యజ్ఞానదశ యం దీదృశ్య మందఱను జుట్టువేసుకొని యుండును 44. ఇంతటితో నీ ప్రశ్నము పూర్తియైనది. అనఁగా జ్ఞాని జ్ఞానమువలన ముక్తుఁడగును. అజ్ఞాని తన కల్పనమువలననే బంధింపఁబడి యుండును 45. విజ్ఞానమును అజ్ఞానమునకు సమానముగను, ముక్తుని బద్ధునకు సమానునిగను, నిశ్చ యము అనుమానమునకు సమానముగను భావింపఁ దగదు 46. బాగుగా యోచించిచూచినచో బంధనమనునది లేనేలేదు. ఇది సత్యమే! కాని బంధన మందఱ నావరించుకొని యున్నదిగదా! బంధనము తొలంగుటకు జ్ఞానముతప్ప వేఱు సాధనములేదు 47. తొలుత నీయాశ్చర్యమును గమ నింపుడు. బంధనమనునది లేనేలేదు. అయినను అది యందఱ బంధించి యున్నది. జను లీబంధనమును (మాయను) జ్ఞానసహాయమున మిథ్య యని తెలిసికొనలేకపోవుటచేతనే బద్ధులై యున్నారు 48. కేవల నిష్కపటభావమువలననే మోక్షము సిద్ధియగునను నమ్మకమునందుండుట గౌణవిషయము. వివేకమునో జ్ఞానమునో ప్రాప్తిగావించుకొని తత్కాల మునననే ముక్తినొందుట ముఖ్యము 49. ప్రాణిముక్తినొందవలయునన్నచో అన్నింటికంటెను దొలుత "ఎఱుక" యనుకళ యుండవలయును. ఇఁక నేమున్నది. అన్నింటి నెఱుంగుటవలన సులభముగనే ప్రాణిబంధములనుండి విడివడి బ్రహ్మరూపుఁడగును 50. ఏమియు నెఱుంగకుండుట యజ్ఞానము. అన్నింటి నెఱుంగుట జ్ఞానము. ఇట్లే యన్నింటి నెఱింగిన భావనగూడ లయమైపోవుట విజ్ఞానము. ఈ దశగలిగిన పిమ్మటఁ బ్రాణి స్వయముగా ఆత్మయైపోవును 51. అమృతమును సేవించి స్వయముగా నమరుఁడైన వాఁడు ఇతరులనుజూచి వీరలిట్లు మరణించుచున్నారేమి యనును. అట్లె వివేకియగు పురుషుఁడు బద్ధులనుజూచి మరల వీర లిట్లు జన్మములెత్తు చున్నారేమి యనును 52. భూతవైద్యుఁడు ఓ యన్నా! నీకు భూత మావేశించునప్పు డెట్లుండునురా యని యడుగును. విషవైద్యుఁడు

నీకు విషమేవిధముగా నెక్కనని యడుగును. 53. కాని యీ విషయము లట్లడిగినంతమాత్రమునఁ దెలియునవికావు. మొదట స్వయముగా నా దశలోనికి రావలయును. (వివేకము నొకప్రక్కనుంచి మొదటఁ దాను బద్ధునితో సమానుఁడై బద్ధుని లక్షణములను బరిశీలింపవలయును.) అట్లు గావించినచో నిఁక వాని నడుగవలసిన యవసరముండదు 54. మేల్కొని యున్నవాఁడు నిదురించెడువానినిజూచి ఓరీ! నీ వెందులకు గుఱ్ఱుపెట్టుచున్నాఁడవని యడుగును. ఇటుల నడుగుటకంటె గుఱ్ఱుపెట్టుటయందలి యనుభవమును గుర్తింపవలయునన్నచో స్వయముగా నిద్రించియే చూడవలయును 55. ఏలయన, జ్ఞాతయొక్క వృత్తి జ్ఞానకారణమున జాగరూకత నొందును. కావున నది బద్ధునివృత్తివలెఁ జిక్కవడదు. కడుపు నిండినవాని కాఁకలిగొన్నవాని కష్టనిష్టురములు తెలియఁజాలవు 56. చాలును. ఇంతటితో శ్రోతల సందియము విడిపోవఁగలదు. జ్ఞానమువలన మోక్షము కలుగును. వివేకమువలన ఆత్మానుభవము కలుగును. ఇది సిద్ధాంతము 57.

## ఎనిమిదవ సమాసము — బద్ధుని పునర్జన్మము.

ప్రశ్న — జ్ఞాత జ్ఞానకారణమున జన్మమును వదలించుకొనిపోవును. కాని బద్ధునకు మఱల నెట్లు జన్మములభించుచున్నది? వాఁడు మరణించిన పిమ్మట నేయవయవము జన్మము గైకొనుటకై శేషించియుండును? 1. ప్రత్యుత్తరము — ఒకసారి బద్ధప్రాణి చనిపోయినపిమ్మట వానియవయవము లెవ్వియును శేషించియుండవు. వాని యెఱుక వాఁడు మరణించుటకు ముందుగనే వెడలిపోవును 2. శ్రోతలారా! మీ సందియమునకుఁ బ్రత్యుత్తరము సావధానులరై వినుండు 3. వాసనావృత్తి ప్రాణులను వెంటనంటి యుండును. కావునఁ బంచప్రాణములు తమతమస్థానములను విడిచిపోవుచున్నపుడు వాసనగూడ వానివెంట దేహమును విడిచి వెడలిపోవును 4. ఈ విధముగాఁ బ్రాణవాయువుల వెంటనంటి తొలుదొలుత వెడలిపోవునది వాసనయే. మఱల హేతువుననుసరించి యదియే జన్మముగైకొని ప్రపంచములోనికి వచ్చును 5. ఎన్నియో ప్రాణులు పూర్తిగా మరణించి యావల

మఱల లేచుచుండుటను మనము అప్పుడప్పుడు జూచియున్నారము. వారలు మరణించిరని గట్టిగఁ దాళ్ళతో బిగించికట్టుటచేఁ జేతులును, పాదములునుగూడ బాధనొందుచున్నవి 6. సర్పము కఱచుటచే మనుజుడు మరణించును. మూఁడేసిదినములు గడచినపిదప వైద్యులు వానిని బ్రతికించుచున్నారు. ఇట్టిసంఘటనము లప్పుడప్పుడనేకులు చూచియున్నారు. ఇది యెట్లుజరుగుచున్నదో చెప్పెదను. ఆ వాసనయే వెనుకకుఁ దిరిగివచ్చుచున్నది 7. మృతినొందినవారల నెందఱెందఱనో ఒకఁడు మఱల బ్రతికించుచున్నాఁడు. మఱియుఁ గొందఱు యమలోకమున కేగిన ప్రాణములను గూడఁ దిరిగి వెనుకకు రప్పించుచున్నారు 8. ఎందఱో శాపమునొంది అన్యదేహము నొందుచున్నారు. శాపనివారణసమయ మేతెంచినంతన మఱలఁ దమ పూర్వదేహములలోనికి వచ్చుచున్నారు 9. ఎందఱెందఱో జనులు పెక్కుజన్మములను ధరించుచున్నారు. ఎందఱో పరకాయ ప్రవేశము గావించుచున్నారు. ఈ విధముగా నెందఱరిగిరో యెంద ఱీలోకములోని కేతెంచిరో యెవ్వరెఱుంగుదురు? 10. ఊ ది న ం త నే అగ్ని ప్రకటనమగునట్లు వాసనారూపమగు వాయువు గూడ జన్మము నొందుచుండును 11. మనస్సునకు నానావిధములగు వృత్తులు గలవు. వానియందే (ఆ వృత్తులయందే) వాసన యుత్పత్తి యగును. వాసన యనునది చూచుటకుఁ గాన్పింపకున్నను అది యవశ్యముగా నున్నదిసుమా 12. వాసనయందు ఎఱుకయొక్క హేతువున్నది. ఈయెఱుక మూలమాయనుండి వెడలిన తంతువు. ఇది కారణరూపముతో మూలమాయయందు మిశ్రితమైయుండును 13. ఎఱుకయనునది కారణరూపముతో బ్రహ్మాండమునందును, కార్యరూపముతోఁ బిండమునందునుఁ బ్రవర్తించుచుండును. త్వరత్వరగా దానిని అనుమానము గావించినచో నది యనుమానములోనికి రాదు 14. ఎఱుక వాయుస్వరూపమువలె సూక్ష్మముగానున్నది. దేవతాగణము వాయుసృష్టి వాయురూపముగనే యున్నది 15. వాయువునందు నానావికారములు గలవు. అయినను వాయువు చూచుటకుఁ గాన్పింపదు. ఇటులె యెఱుకయొక్క వాసనగూడ అతి సూక్ష్మముగా నున్నది. అదిగూడఁ గాన్పింపదు 16. త్రిగుణములు, పంచభూతములు వాయువునందు మిశ్రితములై యున్నవి.

ఈ విషయ మనుమానములోనికి రాఁజాలకున్నను మిథ్యయని దీని నెన్నఁటికినిఁ జెప్పఁజాలము 17. స్వాభావికమగు వాయువువలననే సుగంధదుర్గంధములు విదితమగుచున్నవి. మఱియు ఉష్ణత, శీతలత గూడ నీవిధముగనే భాసించుచున్నది 18. వాయువువలననే మేఘములు వర్షించుచున్నవి. వాయువువలననే నక్షత్రములు నడచుచున్నవి. సృష్టియంతయును నీవాయువువలననే ప్రవర్తించుచున్నది 19. దేవతలు, భూతములు వాయురూపమున ఆకస్మికముగ శరీరములోనికేతెంచి నిండి పోవును. విధివిధానమునను మంత్రప్రయోగమునను శవములు బ్రతికి లేచు చున్నవి 20. శరీరములోనికి దేవత నావేశపరచుటవలన బ్రహ్మపిశాచములు తొలంగిపోవును. హరింపఁబడినవి లభించును. మఱియు ననేక గుప్త విషయములు ప్రత్యక్షముగా విశదమగును 21. వాయువు ప్రత్యేకించి మాటలాడదుగాని శరీరమునందంతటను నిండియుండి మాటలాడును. ఎన్నియోప్రాణులు తమ యిచ్ఛవలననే జన్మమును బడయుచున్నవి 22. వాయువికార మిట్టిది. దీనివిస్తారము తెలియనే తెలియదు. సమస్త చరాచరజంతుజాలము వాయువువలననే వర్తించుచున్నది 23. వాయువు స్తబ్ధరూపముతో సృష్టిని ధారణము చేయుచున్నది. మఱియుఁ జంచల రూపముతో సృష్టిని రచించుచున్నది 24. ఆదినుండి యంతము దనుక సమస్తమును వాయువే కావించుచున్నది. వాయువునకుఁదప్ప నింక దేనికేని కర్తృత్వమున్న-చోఁ జతురులగు పురుషులు నాకెఱింగింపఁ గోరెదను 25.

మూలమాయ యెఱుకరూపమున నుండును. ఆ యెఱుకయే మనయందుఁగూడ నున్నది. ఈప్రకారముగా నెఱుక యొక-చోట గుప్తముగను, ఒక-చోటఁ బ్రకటనముగను జగమునందు వర్తించు చుండును 26. నీ రావిరిరూపమున గుప్తమైపోయి వర్షరూపమునఁ బ్రకట మగునట్లు ఎఱుకయనునది వాయువునందు నిరంతరము హెచ్చుచుఁదగ్గుచు గుప్తమును, బ్రకటనమును నగుచుండును. అది యొకానొక-చోట వికృతియగుచుండును. ఒకానొక-చోట సాధారణముగ వాయురూపమున నుండును 27-28. ఒక్కొక్కప్పుడు శరీరముమీఁదినుండి వాయువు వెడ లుటవలనఁ జేతులు కాళ్లు మున్నగు నవయవములు పట్టుకొనిపోవును.

ఒక్కొక్కప్పుడు వాయుప్రసరణమువలననే నిలిచియున్న పచ్చని పైరు లెండిపోవును 29. అనేకరోగములలో నిట్టివాయువు లనేకములుగలవు. వానివలన జనులకు బాధలు కలుగుచుండును. ఆకాశమునందుఁ బిడుగు సైతము వాయుకారణముననే జ్వలనమగుచున్నది 30. వాయువువలననే సంగీతశాస్త్రజ్ఞానము, సర్వజ్ఞానవిశ్చయము గలుగును. సంగీతశాస్త్రము నందుఁగల (దీపకళ్యాణరాగముతో) దీపము వెలిగింపఁబడుటయొక్కయు (మేఘమల్హారరాగముతో) మేఘములు వర్షించుటయొక్కయుఁ జమత్కారము వాయుకారణముననే కలుగుచున్నది 31. వాయువుసోకుట వలన భ్రమకలుగును. వృక్షాదులెండిపోవును. వాయువువలననే నానావిధ మంత్రములు నడచుచున్నవి 32. మంత్రములవలన దేవతలు ప్రత్యక్షమగుచున్నారు. భూతములు పాఱిపోవుచున్నవి. మంత్రసామర్థ్యమువలననే యక్షిణివిద్య (గారడి), రాక్షసమాయ మొదలగు కౌతుకములు గోచరించుచున్నవి 33. రాక్షసమాయారచనము దేవాదులుగూడ గ్రహింపఁజాలరు. స్తంభనము, మోహనము మున్నగు బహువిధముల విచిత్రసామర్థ్యములన్నియు వాయుకారణముననే యగుచున్నవి 34. మంచివానిని పిచ్చివానిగను, బిచ్చివానిని మంచివానిగను జేయుట మున్నగు ననేక విచిత్రములు వాయువువలననే జరుగుచున్నవి. ఇక్లెంత దనుకనని చెప్పఁగలుగుదును ? 35. మంత్రమువలననే దేవసంగరములు జరుగుచున్నవి. మంత్రములవలననే ఋషులయెడ నభిమానము కలుగుచున్నది. మంత్రసామర్థ్యమహిమ నెవ్వఁడెఱుంగఁగలఁడు ? 36. మంత్రము వలనఁ బక్షులు వశమగును. మూషికశ్వాపదాదులు బంధింపఁబడును. మహాసర్పములు స్తబ్ధములగును. అంతియగాక ధనలాభము సైతము మంత్రములవలననే కలుగును 37. పయినిజెప్పినదాని విచారమువలన బద్ధునిజన్మము విశదమగుచున్నది. శ్రోతలుగావించిన వెనుకటి సందేహము గూడ నివారణమైనది 38.



## తొమ్మిదవ సమాసము — బ్రహ్మములో బ్రహ్మాండము.

బ్రహ్మము ఆపిన నాగునదిగాదు. కదిలించినఁ గదలునదికాదు. ఒకప్రక్కకుఁ దొలఁగునట్టిదియుఁ గాదు 1. బ్రహ్మము భేదించినచో భేదింపఁబడదు. ఛేదించినచో ఛేదింపఁబడునది కాదు. వేఱుగావింప నెంచినచో వేఱగునట్టిదియుఁగాదు 2. బ్రహ్మము అఖండము. అందెట్టి గజిబిజియు (వికారమును) లేదు. అట్టి బ్రహ్మములోనికి బ్రహ్మాండ మేవిధముగాఁ జొరఁబడివచ్చెను? 3. పర్వత, పాషాణ, శిలా, శిఖర, నానాస్థల, స్థలాంతరాదులతోఁగూడిన భూగోళరచనము పరబ్రహ్మము నం దేవిధముగా నేర్పడెను? 4. బ్రహ్మమునందు భూగోళమున్నది. భూగోళమునందు బ్రహ్మమున్నది. విచారించిచూచినచో నొకటి రెండవ దానియందుఁ బ్రత్యక్షముగాఁ గనుపించుచున్నది 5. బ్రహ్మమునందు భూగోళము ప్రవేశించియున్నది. భూగోళమునందు బ్రహ్మము నిండియు న్నది. విచారించిచూచినయెడల నీవిషయము ప్రత్యక్షముగా విశ్వాసము లోనికి వచ్చును 6. బ్రహ్మము బ్రహ్మాండమునందు వ్యాపించియున్నదని చెప్పుట సమంజసముగనే కన్పట్టుచున్నది. కాని బ్రహ్మాండము బ్రహ్మ మునం దెట్లిమిడియున్నదో బోధ గాకున్నది 7. ఒకవేళ బ్రహ్మాండము బ్రహ్మమునందుఁ బ్రవేశించియుండలేదని చెప్పఁబూనినచో నదియును యుక్తముగా లేదు. ఏలయన, బ్రహ్మమునందు బ్రహ్మాండ మున్న సంగతి అనుభవమువలన నందఱకును సహజముగనే కాన్పించుచున్నది 8. బ్రహ్మ మునందు బ్రహ్మాండ మెట్లుండెను? ఈయంశముల నిపుడు విచారమొన రించి తెలుపవలయును. శ్రోత లీవిధముగాఁ బ్రశ్నించిరి 9. ఇక్కడ గొప్పసందేహాంశ మడ్డుపడినది. ఇఁక దీనికిఁ బ్రత్యుత్తరమును శ్రోతలు సావధానులరై వినుదురుగాక 10.

బ్రహ్మాండమే లేదని చెప్పుదునా? యది సరిగాదు. ఏలయన, అది కాన్పించుచున్నది. కనుపించుచున్నదిగావున ఉన్నదనిచెప్పుదునా? అది యును యుక్తముగా లేదు. ఏలయన, అది నాశమగుచున్నది. ఇప్పుడిక్కడ పెద్దచిక్కువచ్చిపడినది. శ్రోతలీవిషయమును దెలిసికొనఁగలుగుటయెట్లు? 11. దీనిని విని ఉత్కంఠతో శ్రోతలిట్లు చెప్పిరి. "మేము సావధానులమై

యున్నారము. ఇఁకఁ బ్రసంగానుసారముగ నుచితమగు నుత్తరమునిచ్చెదము 12. చూడుఁడు. ఆకాశమునందు దీపము వెలిగింపఁబడినది. కాని దానిని ఆకాశమునుండి వేరుపఱచియుంచుట యెట్లు తటస్థింపఁ గలదు? 13. ఆపస్తేజోవాయువులు ఆకాశమును తొలగింపజాలవు. ఏలయన, ఆకాశము సఘనముగానున్నది. (చంచలముగాదు) 14. పృథ్వి కఠినమైనదే! ఐనను ఆకాశము దానిని దనయునికి కనువుగాఁ జేసివైచినది. అది (ఆకాశము) సంపూర్ణపృథివియందు వ్యాప్తముగానున్నది 15. జడరూపము లగు సమస్తవస్తువులును నాశనమగుట సత్యము. ఆకాశమెప్పుడును ఒకే విధముగా నుండును. అది యచంచలము 16. భిన్నముగనుండి మానవుఁడు తాను చూచుదానిని ఆకాశమని చెప్పుచున్నాఁడు. అభిన్నుఁడై చూచినచోఁ గనుపించు ఆకాశమే పరబ్రహ్మము. (ఆకాశము పరబ్రహ్మములలో నంతరమేమన, ఆకాశము భిన్నముగానున్నప్పుడుగూడఁ గాన్పించును. పరబ్రహ్మమట్లుకాదు. తద్రూపమైన యెడలనే కనుపించును) 17. సారాంశము – ఆకాశము అచలము. దానిభేదము తెలియదు. బ్రహ్మము వలె భాసించుదానినంతను ఆకాశమనవలయును 18. అది నిర్గుణబ్రహ్మము వలె భాసించుచున్నది. కల్పనముగావించినచో ననుమానములోనికి వచ్చును. ఇందువలననే దాని నాకాశమనుచున్నాము. (కల్పనకారణమున నది యాకాశ మనిపించుకొనుచున్నది) 19. కల్పనమున కెంతభాసము భాసించునో యది యాకాశము. కాని బ్రహ్మము నిరాభాసము, నిర్వికల్పము నై యున్నది 20. ఆకాశము స్వాభావికముగానే శేషించిన నాలుగుభూతములతో నిండియున్నది. ఆభాసించునది బ్రహ్మాంశము 21. ప్రత్యక్షముగ నుత్పన్నమగునవన్నియు నాశనమొందునవియే. అట్టివాని నచలములని యెట్లు చెప్పగలము? గగనము నేదియు భేదింపఁజాలదు 22. పృథ్విలేకుండఁబోయిన పిమ్మట జలము శేషించును. జలము లేకుండఁబోయినపిమ్మట అగ్ని మిగులును. అగ్ని చల్లారినపిదప వాయువుండును. అదియు (వాయువుగూడ) అంత్యమున నాశనమగును 23. మిథ్యాపదార్థము వచ్చుచుండును, పోవుచుండును. అంతమాత్రమున సత్యభంగమగుట (మిథ్యాపదార్థము నిల్చుట) సంభవముగాదు 24. భ్రమకారణము నిదియంతయుఁ బ్రత్యక్షముగాఁ గాన్పించును. విచారించిచూచినయెడల నందేమియును లేదని

బోధపడును. ఈ భ్రమమూలమగు జగత్తును సత్యమని యెట్లుచెప్పఁగలము? 25. భ్రమను శోధించితిమేని అది యేమాత్రమును సత్యము గాదని విదితమగును. అట్టిస్థితిలో భేదించినదెవరు? దేనిని? ఒకవేళ భ్రమ భేదించిన దని చెప్పినచో నదిమాత్ర మెట్లుపోఁగును? అది స్వాయముగనే మిథ్యగదా 26. భ్రమరూపము మిథ్యగాఁ బ్రతీతియైనపుడు అదియే భేదించినదని సులభముగా ననుకొనుము. కాని స్వాయముగా మిథ్యయగున దేదియో యదిగావించినవెల్ల నట్లే (మిథ్యగ) గావలసియున్నది 27. ఎయ్యది స్వాయముగా మిథ్యయో యది యేమిచేసినను జేయనిమ్ము. దానివలన మన దేదిపోవును? చతురపురుషులు మిథ్యాకర్తృత్వమును మిథ్యగనే భావించెదరు 28. సాగరములో నొక యావగింజవేసిన నెటులుండునో యటులే పరబ్రహ్మమునం దీసమస్తదృశ్యము గూడియున్నది. మతిననుసరించి హృదయమున నూహాశక్తి ప్రసరించును 29. మతిని విశాలముగావించినచో ఆకాశమునుగూడఁ జేతిలోనికిఁ దీసికొనవచ్చును. బ్రహ్మాండముగూడ వెలగపండువలె సుబోధమగును 30. మతికంటె వృత్తిని నధికవిశాలము గావించినయెడల బ్రహ్మాండము రేఁగుపండువలెఁ గాన్పించును. కేవల బ్రహ్మాకారమైనపిమ్మట నేమియునుండదు 31. వివేకసహాయమున దనను అమర్యాదితధీవిశాలునిగ (హద్దులేనంత విశాలబుద్ధిఁగలవానినిగాఁ) గావించినచో బ్రహ్మాండము వటబీజమువలెఁ గనుపించును 32. అంతకంటెను బుద్ధి యధికవిస్తీర్ణమైనపిమ్మట ఈ బ్రహ్మాండము వటబీజములోఁ గోట్యంశ సమానముగా (అతిసూక్ష్మముగ) గోచరించును. మఱియు కేవలపరిపూర్ణుడైన పిదప నేమియునుండదు 33. భ్రమకారణమున అల్పుఁడై తననొక దేహధారినిగాఁ దలంచుకొనువాఁడు బ్రహ్మాండమును దనచేతిలోని కెట్లు తీసికొనఁగలఁడు? 34. వృత్తిని వృద్ధినొందింపవలయును. దానిని వికసింపఁ జేసి యూరకయుండరాదు. దానిని (వృత్తిని) పూర్ణబ్రహ్మముతో నలుమొగముల నిండింపవలయును 35. జొన్నగింజంత బంగారమునుదెచ్చి దానితో బ్రహ్మాండమునంతను జిత్రింపఁబూనితిమేని యెన్నఁటికిని ఆ ప్రయత్నము సాధ్యముగాదు 36. (జొన్నగింజంత బంగారమునుదెచ్చి రేకును జేసి దానిమీఁద బ్రహ్మాండమును జిత్రింపఁబూనినచో ఆయాకు పగిలి బంగారము లయమగునట్లు) వృత్తితో నెవఁడేని బ్రహ్మము నాకలనము గావింప

నెంచు నెడల వృత్తిభిన్నమై లయమగును. కేవలనిర్గుణాత్మ యథావిధముగ మిగిలియుండును 37.

ఇంతటితో సందేహము తీరును. శ్రోతలారా! సందేహముంచు కొనకుడు. ఒకవేళ సంశయము గలిగినచో వివేకముతో దానిని నిరసన మొనర్పుడు 38. వివేకమువలన సందేహములు తొలంగును. సమాధానము కలుగును. మఱియు వివేకసహాయమున ఆత్మనివేదనమైనపిదప మోక్షము లభించును 39. మోక్షమునుగూడ నుపేక్షించి, (అపేక్షించుటపూర్వపక్షము) విచారముతోఁ బూర్వపక్షవిషయమును వేఱుజేసి సిద్ధాంతవస్తువును (ఆత్మను) ప్రత్యక్ష ప్రత్యయములోనికిఁ దెచ్చువానికి అన్యప్రమాణములతో నావశ్యకములేదు 40. ఈప్రతీతివచనములు సారాసారవిచారము గావించినపిమ్మట విశదమగును. మననముయొక్క అభ్యాస(మిథ్యాజ్ఞానము) వలన బ్రహ్మము సాక్షాత్కారమగును. మఱియుఁ బరమశాంతి లభించును 41.



## పదియవసమాసము — ఆత్మస్థితి.

దేవతావిగ్రహము ఆలయములోపల నుండును. కాకి మందిరశిఖరముపైఁ గూర్చుండును. అంతమాత్రమునఁ గాకి యాలయమునందలి దేవతకంటె గొప్పదగునా? 1. రాజమందిరమునందు సభ జరుగుచుండును. ఒక కోఁతి యా మందిరములోని స్తంభముమీఁది కొఁగ్రాకి పైనఁజేరి కూర్చుండును. ఆ కోఁతికి సభ్యులందరికంటె శ్రేష్ఠత్వము కలుగునా? 2. బ్రాహ్మణుఁడు స్నానము గావించి నీటితోఁ బనిముగించుకొనును. నీటికొంగ (బాతు) నీటియందే స్థిరముగా నుండును. అంతమాత్రమున నీటికొంగకు బ్రాహ్మణునితో సమానమగు పవిత్రత గలదని యెట్లంగీకరింపనగును? 3. బ్రాహ్మణులలోఁ గొందఱు నియమవంతులై యుందురు, గొందఱు అవ్యవస్థితముగా నుందురు. కుక్క నిరంతరము ధ్యానస్థముగా నుండును. ఇందువలనఁ గుక్క యెన్నఁటికైన బ్రాహ్మణునితో సమానమగునా? 4. ఒకానొక బ్రాహ్మణుఁడు ఏకాగ్రధ్యానము నెఱుంగఁడని భావింపుము.

మార్జాలము తదేకధ్యానమునందు మిగులఁ జతురతగలదై యుండును. అంతమాత్రమున మార్జాలము బ్రాహ్మణునితో సమానమగు గొప్పదనము గలదని యెవరైనఁ జెప్పఁగలరా? 5. బ్రాహ్మణుఁడు భేదాభేదవిచారముతో వర్తించును. మఱికము అందఱను సమానముగాఁ జూచును. ఇందువలన నీఁగకు జ్ఞానబోధకలిగెనని యెట్లు నుడువనగును? 6. ఒక నీచ మనుజుఁడు గొప్పవారలు ధరింపఁదగిన విలువకల దుస్తులుధరించి కూర్చుండి యుండును. ఒకరాజు దేహముపయి నాచ్ఛాదనమైనలేక కట్టుబట్టతోఁ గూర్చుండియుండును. చతురుఁడగు పురుషుఁడు ఈ యిరువురిని వెంటనే గుర్తింపఁగలఁడు 7. సారాంశము - బాహ్యరూపము నెంతగా అలంకరించు కొనినను ఆ యలంకారమంతయు మోసమని తనంతనే వెల్లడియగును. మానవునకుఁ గావలసినది బాహ్యాడంబరముగాదు. ముఖ్యమగు ఆత్మనిష్ఠ కావలయును 8. సంసారమునందు మిగులఁ బ్రతిష్ఠను సంపాదించినను ఆత్మవిషయమగు జాగరూకత లేనివాఁడును పరమాత్మను మఱచిన వాఁడును ఆత్మఘాతకుఁడు 9. దేవతలను భజించుటచే దేవలోకము, పితరులను భజించుటచేఁ బితృలోకము, భూతములను భజించుటచే భూతలోకము లభించును 10. ఎవ్వరెవ్వరిని భజించెదరో వారలు వారిలోకమున కరుగుదురు. నిర్గుణభజనమువలన నిర్గుణులగుదురు 11. నిర్గుణమునందనన్యుఁడై యుండుటయే నిర్గుణభజనము. అనన్యుఁడగుటవలనఁ దప్పక నిర్గుణత్వము ప్రాప్తించును 12. ఏకస్వరూపుఁడగు పరమాత్ముని గుర్తించుటయే సంపూర్ణకర్మఫలము. మఱియు, "మనము ఎవ్వరము" అను విచారమును జేయవలయును 13. నిరాకార పరమాత్ముని యనుభవము గడించుటవలన దేహాభిమాన ముండదు. అంతియకాక "బ్రహ్మముమేమే" అను నిశ్చయ మేర్పడును 14. పూర్వోక్తదశ గలిగినయనంతరము సందేహమునకుఁ దావుండదు. పరమాత్మునియం దనన్యత కలుగును. మఱియు దేహభావనకు సంబంధించిన జాడ గన్పింపదు 15. ఆయవస్థయందు సిద్ధాంతములు సాధనములు భ్రమమాత్రముగా నుండిపోవును. ముక్తునకు సాధనాదిబంధనములతో నేమియవసరము? 16. ఏలయన, సాధనములను సాధింపవలసినది తాను (ముక్తుఁడు) స్వయముగనే యయ్యెను. ఇఁక సాధకుఁడు గావలసిన యావశ్యకము మిగిలియుండలేదు 17. కుమ్మరివాఁడు

రాజైనపిమ్మట వాఁడు (కుండలను మంటిని మోయు) గాడిదల నింక నెందుల కుంచుకొనును?కుమ్మరితనమునకు సంబంధించిన మన్ను మోయుట వలన వానికేమి ప్రయోజనము కలుగును? 18. ఇట్లే సాధ్యవస్తువు ప్రాప్త మైనపిదప సంపూర్ణవృత్తిభావనయు, సాధనప్రయత్నములును ఉండ నేరవు 19. ఆదశయందు సాధనములవలన నేమి సిద్ధి గావించుకొనవలసి యున్నది? నియమసహాయమునఁ బడయవలసినఫలప్రాప్తి యేమియున్నది? ముక్తుఁడు స్వయముగా బ్రహ్మమైనపు డింక నెందులకు శ్రమనొంద వలయును? 20.

దేహము పంచభూతములతో నిర్మింపఁబడెను. జీవుఁడు బ్రహ్మాంశము. అదిగూడఁ బరమాత్మునందు లీనము గాఁగలిగి యున్నది 21. కావున "నేను" అనునది మధ్యనే వచ్చినది. విచారించి తెలిసికొనిన యెడల "నేను" అనునది యేమియును లేదు. పంచభూతములు నిరసనమై పోయినపిదప నిఖిలమగు ఆత్మ నిలిచియుండును 22. ఆత్మ ఆత్మత్వముతో నున్నది. జీవుఁడు జీవత్వముతో నున్నాఁడు. మాయ మాయాత్వముతో విస్తృతమైయున్నది 23.

ఈవిధముగా నన్నియు నున్నవి. మనముగూడ నేదియో యొకటిగా నున్నారము. వీనినన్నింటిని విమర్శించి చూచువాఁడె జ్ఞాని 24. అన్నిఁటిని విమర్శించి శోధింపనేర్చినవాఁడును దన్నుదానుజూచుట నెఱింగినవాఁడును జ్ఞానియనఁదగినవాఁడు. జ్ఞానియొక్క-వృత్తి యేకదేశీయముగానుండును. (వ్యాపకముగలది కాదు) 25. ఇట్టివృత్తిని మనము విచారించినయెడల నేమియును లేదని విశదమగును. ఏలయన, ప్రకృతిని నిరసించినపిమ్మట వికారవంతమగు (పదార్థము) ఏదియు నిలచియుండఁజాలదు 26. ఒకవేళ నేదేని నిలిచియున్న-చో నది కేవలనిర్గుణమే! విచారించిచూచినపిమ్మట నదియే మనమైయున్నారము. ఇది పరమార్థమున కొకగొప్పచిహ్నము 27. ఆ యవస్థయందు "ఫలము వేఱు, మనము వేఱు" అను వివేకముండదు. అచట ఫలము, మనము ఒక్క-టియై పోవుచున్నారము 28. ఒకానొక భిక్షుఁడు రాజయ్యెననియును నేను రాజును అను ననుభవముగూడ వానికిఁ గలుగుచున్నదనియును భావిం

పుఁడు. ఇఁక వాఁడు భిక్షము నెందుల కడుగును ? భిక్షుకుఁడుగా నున్న వాఁడే భిక్షము నడుగును 29. వేదశాస్త్రపురాణము లెవ్వని వర్ణించుచున్నవో, అనేకసిద్ధసాధుపురుషు లెవనికొఱకు నానావిధముల సాధనముల తోడను నిరూపణములతోడను బరిశ్రమ సలుపుచున్నారో యట్టి పరబ్రహ్మరూపము సారాసారవిచారములవలన సాధకుఁ డొందినపుడు మఱల నచ్చట చేయుట, చేయకుండుట (విధినిషేధములు) మొదలగు విచారమేదియు నుండదు 30 — 31. ఒక భిక్షుకుఁడు రాజాజ్ఞ నాలించి భయము నొందెననియు, ఆ భిక్షుకుఁడు మఱల ముందున కరిగి (కొన్నాళ్ళతరువాత) రాజయ్యెననియును భావింపుఁడు. ఇప్పు డట్టిదశ యందు వానికి రాజాజ్ఞ యనిన భయమెట్లుండఁగలదు ? 32. వేదము వేదాజ్ఞలననుసరించి యెట్లు నడచును ? సచ్ఛాస్త్రములు శాస్త్రాభ్యాసము నెట్లు చేయును ? తీర్థములు తీర్థముల కెట్లరుగును ? 33. అమృతము అమృతము నెట్లు సేవించును ? అనంతము అనంతము నెట్లుగాంచును ? భగవంతుఁడు భగవంతు నెట్లుజూచును? 34. సత్స్వరూపము సత్స్వరూపముతో నెట్లుకలియును ? నిర్గుణము నిర్గుణభావన నెట్లుగావించును ? ఆత్మ యాత్మయం దేవిధముగా నానందించును? 35. స్వయముగా అంజనము అంజనము నెట్లుపెట్టుకొనును ? ధనము ధనము నెట్లు బడయఁగలదు ? నిరంజనుఁడు నిరంజను నెట్లనుభవము గావింపఁగలఁడు ? 36. సాధ్యము స్వయముగా సాధనము నెట్లుచేయును? స్వయముగా నున్మనుఁడైనవాఁడు (మనస్సు లయమైనవాఁడు) మనస్సు నేవిధముగా నరికట్టఁగలఁడు ? 37.

తొమ్మిదవ దశకము సమాప్తము.





# పదియవ దశకము.

## మొదటి సమాసము – అంతఃకరణ మొక్కటి.

శ్రోత యిట్లు ప్రశ్నించుచున్నాఁడు. "అయ్యా! అందఱకును అంతఃకరణ మొక్కటియా లేక వేఱువేఱా? దీనిని నిశ్చయాత్మకముగా దెలుపుఁడు". వక్త – మంచిది. దీనికిఁ బ్రత్యుత్తరము వినుండు 1–2. అందఱియంతఃకరణ మొక్కటియే. ఇందు సందేహమేమియు లేదు. ఇది యనుభవముచే గ్రహించినయంశము 3. శ్రోత యిట్లు నుడివెను. అయ్యా! అందఱియంతఃకరణ మొక్కటియేయని మీరంటిరిగదా! అట్లైనచో నందఱియందును ఏకత్వమును గలయికయును నేలలేవు? 4. అంతఃకరణ మొక్కటియేయైనచో నొక్కఁడు తినినయెడల నందఱకును క్షుధ తీరవలయును. ఒకఁడు సంతుష్టుఁడగుచో నెల్లరును సంతుష్టులు గావలయును. ఒకఁడు చనిపోయినచో నెల్లరునుఁ జనిపోవలయును 5. ఈ లోకమునందుఁ గొందఱు సుఖులుగను మఱికొందరు దుఃఖులుగను నున్నారు. దీనినిబట్టి యందఱియంతఃకరణ మొక్కటియేయని యెట్లనుకొనఁగలము? 6. జనుల భావనలు వేఱువేఱుగానున్నవి. ఒకనితో నింకొకనికిఁ గలయిక కలుగుటలేదు. కావున నిట్టిస్థితియందు అంతఃకరణమొక్కటి యగుట యెట్లో తెలియకున్నది 7. ఒకవేళ నెల్లరి యంతఃకరణ మొక్కటియే యగుచో నొకని యంతఃకరణములోని విషయము రెండవవానికిఁ దెలియుచుండెడిది. అందుచే లోకమునందు గోప్యమగు విషయముండుటయే సంభవము గాదు. అందఱి యంతఃకరణ మొక్కటియేయగుచో జనులయందుఁ బరస్పర విరోధ మేల వ్యాపించియున్నది? 8–9. సర్పము కాటువేయుటకుఁ బరుగెత్తుచున్నది. ప్రాణి భయపడి పారిపోవుచున్నాఁడు. అన్ని జీవుల యందును అంతఃకరణమొకటియేయగుచో నీ విరోధ మేల కలిగెను? (సర్పముకరచుటకుఁ బరుగెత్తరాదు. జీవుఁడు భయపడి పాఱి పోవరాదు గదా)

శ్రోత యిట్లు శంకింపఁగా వక్త యిటుల నుడివెను. భయపడకుఁడు. సావధానులరై నిరూపణము నాలింపుఁడు. అంతఃకరణమని సంజ్ఞకుఁ జెప్పుదురు. సంజ్ఞయని యెఱింగెడిస్వభావమునకుఁ జెప్పుదురు. ఇదియే దేహ రక్షణ కుపాయము (ఎఱుఁగునట్టికళ) 11-12. సర్ప మెఱిఁగి కఱువవచ్చు చున్నది. ప్రాణియెఱిఁగి పాఱిపోవుచున్నాఁడు. సంజ్ఞ (consciousness) ఇరుపక్షముల నున్నది 13. సంజ్ఞయనునది రెండుపక్షముల నొక్కటియే యున్నట్లుగఁ జూచెదమేని అంతఃకరణముగూడ నొక్కటియగును. ఏల యన, అంతఃకరణము సంజ్ఞారూపమని యింతకుముందుఁ జెప్పితిని 14. కావున సంజ్ఞారూపముతో నందఱి యంతఃకరణ మొక్కటిగనేయున్నది. సంపూర్ణజీవులయందెఱుక యొక్కటియే 15. దృష్టితోఁజూచుట, నాలు కతో రుచిని గ్రహించుట, వినుట, ముట్టుకొనుట, వాసనదెలిసికొనుట మున్నగునవి యందఱియందును నొకటిగనే యున్నవి 16. పశు, పక్షి, కీటక, పిపీలికాది జీవములెన్నియో లోకమునందు నిర్మాణమైయున్నవి. వానియన్నిఁటియందును సంజ్ఞాశక్తి యొకటిగనే యున్నది 17. అన్ని జీవ ములకును జలము శీతలముగా నున్నది. అన్ని జీవములకును అగ్ని వేడిగా నున్నది. అందఱకును అంతఃకరణ మొక్కటిగనే యున్నది 18. ఒకానొక వస్తువు చెడ్డగను మంచిగను దోఁచుటకు దేహస్వభావమే కారణము. ఈ విషయము అంతఃకరణయోగమువలననే తెలియును 19. అందఱి యంతఃకరణము నొక్కటియే. ఇది పూర్తిగ సత్యము. దీని నుత్సాహ వంతులందఱు నెఱుఁగుదురు 20. ఇంతటితో సందేహము నివారణ మగును. ఇంక శంకింపవలసిన పనిలేదు. ఎంత తెలిసికొనవలయునో యది యంతయు నంతఃకరణధర్మము 21.

ఎఱిఁగి జీవములు మేఁతమేయుచున్నవి. ఎఱిఁగి భయపడుచున్నవి. ఎఱిఁగి దాఁగుకొనుచున్నవి. ఎఱిఁగియే పాఱిపోవుచున్నవి 22. కీటక ములు, పిపీలికములు మొదలుకొని బ్రహ్మవిష్ణు మహేశ్వరులవఱకు అంతఃకరణ మందఱకు నొక్కటియే. ఈ విషయమును ఉత్సాహవంతు లనుభవముతో నెఱుంగవలయును 23. పెద్దదైనను, చిన్నదైనను అగ్ని అగ్నియే. స్వల్పముగానున్నను, ఎక్కువగానున్నను జలముజలమే. ఈ విధ ముగనే (వస్తుస్వరూపమును) ప్రాణి అంతఃకరణమువలననే తెలిసికొను

చున్నది 24. ఒకానొకచోట న్యూనముగా నున్నను ఒకానొకచోట నధికముగా నున్నను బదార్థముయొక్క గమనిక యొక్కటియే. సంజ్ఞా రహితమగు జంగమప్రాణి యెద్దియును లేదు 25. సంజ్ఞయని యంతఃకరణమునకుఁ జెప్పుదురు. అంతఃకరణము విష్ణ్వంశము. ఈ విధముగా విష్ణువు పాలనము జేయుచున్నాఁడు. (అంతఃకరణరూపుఁడై యన్నింటి యందుండుటయే యతని పాలనము) 26. సంజ్ఞారహితము కాఁగానే ప్రాణి మరణించును. సంజ్ఞారహితమగుట తమోగుణలక్షణము. ఈ విధముగాఁ దమోగుణముతో రుద్రుఁడు సంహారము జేయుచున్నాఁడు 27. కొంత సంజ్ఞగలిగి కొంతసంజ్ఞ లేకయుండుట రజోగుణలక్షణము. దీని కారణముననే ప్రాణి జన్మము నొందుచున్నది 28. ఎఱుకవలన సుఖము కలుగును. మఱపు (ఎఱుకలేమి)వలన దుఃఖముకలుగును. ఇట్లే యుత్పత్తి గుణమువలన (ఎఱుకమఱపుల మిశ్రణమువలన) సుఖదుఃఖములను రెండిటిని అవశ్యముగా ననుభవింపవలసియున్నది 29. ఎఱుక యెఱుకలేమితోఁ గలసినబుద్ధియే యీ దేహములోని బ్రహ్మము. ఆతఁడే వాస్తవమున నుత్పత్తికర్త 30. ఈయుత్పత్తి, స్థితి, సంహారముల విషయము ప్రసంగము వచ్చినందునఁ జెప్పవలసివచ్చినది. కాని దీనిని అనుభవముతో నిశ్చయింపవలయును 31.

---

## రెండవ సమాసము – ఉత్పత్తి విషయమునందు సందేహము.

శ్రోత యిట్లు ప్రశ్నించెను. అయ్యా! తాము పైన వివరించిన విచారమునందు విష్ణువుయొక్క యభావము గాన్పించుచున్నది. విష్ణువే యననేల? దానియందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లెవ్వరికిని దావు లేదు 1. ఉత్పత్తి స్థితి సంహారములను బ్రహ్మ, విష్ణు, మహేశు లెట్లు చేయుచున్నారు? ఇదియేమియును బోధ గాకున్నది 2. ఈ విచారమునందు ఉత్పత్తికర్త చతుర్ముఖ బ్రహ్మయనుటలో విశ్వాసము కలుగకున్నది. పాలనకర్త చతుర్భుజధారియగు విష్ణుమూర్తియని యాలించుట మాత్రముగలదు 3. మహేశుఁడెట్లు సంహారము గావించునో యదియు విశ్వసింపఁదగినదిగా లేదు. పురాణములలోఁ జెప్పఁబడిన లింగమహిమగూడ

విపరీతముగానున్నది 4. మూలమాయ నెవ్వఁడు నిర్మించెనో యది తెలిసి కొనవలసియున్నది. మూఁడు మూర్తులుగూడ మూలమాయ కావలనే గదా యుత్పత్తియైనది ? 5. మూలమాయ లోకజనని. దానివలన గుణక్షోభిణిమాయ యుత్పన్నమయ్యెను. గుణక్షోభిణివలనఁ ద్రిగుణాత్మిక ములగు త్రిదైవతములు కలిగెను 6. శాస్త్రకారు లీ విధముగాఁ జెప్పు చున్నారు. వారలేగాక "ప్రవృత్తిని లేక గుణపరంపరను" వివరించెడి వారలుగూడ నిట్లే చెప్పుచున్నారు. కాని యనుభవమునుగూర్చిన ప్రశ్న వచ్చినంతన యెందరో భయపడిపోవుచున్నారు 7. కావున నీ సందేహము ఇట్టి భయశీలురవలన నెన్నఁటికిని దీఱఁజాలదు. వారల నడిగియుఁ బ్రయో జనములేదు. వారలు బోధింపనుగూడ సమర్థులుగారు. అట్లే తెలిసికొనని ప్రయత్నమంతయు వ్యర్థము 8. అనుభవములేక యెవఁడేని తాను వైద్యుఁడని పదిమందిచేఁ బిలుపించుకొనుచు నేదియో తనకుఁ దెలియని కార్యభారమును దలపైనఁబెట్టుకొన్నచో నట్టిమూర్ఖుని ప్రాణిమాత్రు లందఱును నిందింతురు 9. ప్రకృతవిచారముగూడ నిట్టిదే ! వాస్తవికమగు నిర్ధారణము అనుభవముతోడనే చేయవలయును. అనుభవము లేకున్నచో గురుశిష్యు లిరువురియందును అంధకారముండును 10. జనుల ననవలసిన దేమున్నది? జనులు తాముచెప్పుదానిని యుక్తమనియే తలంచిచెప్పుదురు. కావున నీ విషయమును సంపూర్ణముగాఁ దామే విశదము గావింప వలయును 11.

దేవతలు మాయను నిర్మించిరనియందమా యన్న దేవతల రూప ములు మాయలోనికి వచ్చుచున్నవి. లేక మాయయే మాయను గావించె నని యందమాయన్న నదియు నసంభవమే. ఏలయన, మాయయంతయు నొక్కటియే గదా 12. లేక భూతములే మాయను గలిగించెనంద మాయన్న నదియుఁ బొసఁగదు. ఏలయన, మాయయే భూతములను గలుగఁజేసెను. కాదు పరబ్రహ్మమే మాయను గలిగించెనని యందమా యన్న బ్రహ్మమునందుఁ గర్తృత్వమే లేదు. అతఁడెట్లు నిర్మింపఁగలడు? 13.

మాయనే సత్యమన్నచో బ్రహ్మమునందుఁ గర్తృత్వ మాపాదిత మగును. లేక మాయను మిథ్యగా భావింతమాయన్నచో నట్టిస్థితియందు దానికిఁ గర్తృత్వ మెక్కడనుండి రాగలదు ? 14. ఓ స్వామీ ! సాధు

మహారాజా ! దయతో నీ వృత్తాంతమంతయు అనుభవములోనికి వచ్చు నట్లు బోధింపుడు 15. అక్షరములేనిది వేదము కలుగదు. అక్షరములేనిది దేహములు కలుగవు. దేహములులేనిది దేహనిర్మాణము గలుగదు 16. అన్ని దేహములలో నరదేహము శ్రేష్ఠము. నరదేహమునందు బ్రాహ్మణ దేహము శ్రేష్ఠము. బ్రాహ్మణ దేహమునకే వేదాధికారము గలదు 17. వేదము లెట్లు గలిగెను ? దేహముల నెవ్వరు సృజించిరి ? దైవమెట్లు ప్రకటన మయ్యెను ? 18.

శ్రోత లిట్లు సందేహించిరి. దీనికి సమాధానము చెప్పవలయును. వక్తయిట్లు చెప్పెను. శ్రోతలారా ! సావధానులరై వినుండు 19. అనుభవమును విచారించెదమేని చిక్కుగలుగును. (ఏలయన, లోకవ్యవహారము శాస్త్రనిర్ణయము ఒకేవిధముగా నుండని కారణమున అనుభవ మొక్కవిధముగా నుండదు.) అంతయును జెడిపోవును. గడియగడియకును అనుమానించుచుండుటవలన సమయము వ్యర్థముగా నష్టమైపోవును 20. లోకవ్యవహారమునందును, శాస్త్రనిర్ణయమునందును బహువిధములగు నిశ్చయములు గలవు. ఈ కారణమున నొకేవిధమగు ననుభవము కలుగదు 21. ఇప్పుడొకవేళ శాస్త్రములకే భయపడుదమాయన్నచో వాని గోలలో నొకతెన్నె స్ఫురింపదు. ఎటులేని యా గోలను (లోకవ్యవహారమును) నొకతెన్నునకుఁ దెత్తమాయన్న నచట మఱల శాస్త్రభేదములు కలుగుచున్నవి 22. కావున శాస్త్రములను గాపాడుచుఁ బ్రతీతిని (ఎఱుకను) గడింపవలసియున్నది. పూర్వపక్షమునువిడిచి సిద్ధాంతమును జూడవలయును. చతురతయో, మూర్ఖతయో ఒక్కమాటతో బోధింపవలెను 23. శాస్త్రమునందు పూర్వపక్షము చెప్పఁబడెను. మిథ్యను బూర్వపక్షమని నుడువుదురు. కావున దీనిదోషము మనమీఁదకు రాఁజాలదు 24. ఐనను శాస్త్రములను రక్షగావించుచు కొన్ని కౌతుకములను వివరించెదను. శ్రోతలు చక్కగా విచారమును గావింపవలయును

## మూడవసమాసము - సృష్టియొక్క యుత్పత్తి.

నిరుపాధియగు నాకాశమే నిరాభాసబ్రహ్మము. ఇట్టి నిరాభాస బ్రహ్మమునందు మూలమాయ జనించెను 1. ఆమూలమాయ వాయు స్వరూపము. పంచభూతములు, త్రిగుణములు, ఆ వాయురూపమగు మూలమాయవలనఁ గలుగుచున్నది 2. ఆకాశమునుండి గలిగినవాయువు వాయుదేవుఁడని పిలువఁబడుచున్నాఁడు. వాయువునుండి కలిగిన అగ్ని అగ్నిదేవుఁడని పిలువఁబడును 3. అగ్నినుండి కలిగిన జలమే ఆపోనారా యణుఁడని పిలువఁబడెను. జలమునుండి కలిగిన పృథ్వియే సంపూర్ణబీజ ములకు మాతయయ్యెను 4. పృథ్వినుండి కలిగిన రాళ్ళే దేవతలని పిలువఁ బడుచున్నవి. పాషాణదైవతములయెడ జనులకు బహువిధములుగా నను భవములు గలవు 5. జనులు రాయి, మట్టి మున్నగువానిని దేవతలుగ విశ్వసింతురుగాని వాస్తవమునందు సంపూర్ణ దేవతలు వాయువునందే యుందురు 6. దేవి, యక్షిణి, కాత్యాయిని, చాముండ, జాఖిణి, మానవిణి మున్నగునానాశక్తులు భిన్నభిన్న దేశానుసారముగా ననేక స్థానము లందున్నవి 7. ఇవిగాక యింక నెన్నియో దేవతలు పురుషవాచక నామముల నున్నవి. ఇట్లే భూతములు, దేవతలు మున్నగునవి కొన్ని నపుంసకనామములతోఁ గూడఁ గలవు 8. దేవ, దేవత, దైవత, భూతా దులు భూమండలమునం దసంఖ్యాకములుగా నున్నదిగాని యివియన్నియు వాయురూపములుగా జెప్పఁబడును 9. నిరంతరము వాయురూపముగనుండు టయుఁ బ్రసంగముగలిగినపుడు నానాదేహములను ధరించుటయు గుప్త ముగను బ్రకటనముగను నుండుటయు మున్నగు వర్తనములు వీనియన్నిం టికార్యములు 10. వాయుస్వరూపముతో దేవతలు చరించుచున్నారు. వాయువునందు చేతన, వాసన, వృత్తి మున్నగురూపములుదాల్చి జగ జ్జ్యోతి యలరారుచుండును 11. ఆకాశమునుండి కలిగిన వాయువు రెండు విధముల నున్నది. ధ్యానపూర్వకముగా వినుండు 12. ఒకటె సాధారణ వాయువు. దీని నందఱు నెఱుంగుదురు. రెండవది వాయువునందు జగ జ్జ్యోతిరూపమున నుండునది. ఈ జగజ్జ్యోతిరూపమునందు దేవీదేవుల యన న్యమూర్తు లుండును 13. వాయువు మిగుల వికారయుక్తముగానున్నను

అది రెండు ప్రకారములుగా విభజింపఁబడియున్నది. ఇక శ్రోతలు తేజో వికారమునుగూర్చి వినవలయును 14. వాయువునుండి తేజము జనించెను. అది యుష్ణముగను శీతలముగను బ్రకాశవంతముగను నున్నది. తేజో రూపము సయితము రెండువిధముల నున్నది. వినుండు 15. ఒక తేజము ఉష్ణము, రెండవది శీతలము. ఉష్ణమువలనఁ బ్రకాశయుతుఁడును దేదీప్యమానుఁడునునగు సూర్యుఁడు, సర్వభక్షకుఁడగు నగ్ని, విద్యుల్లత జనించెను 16. శీతల తేజమువలన జలము, అమృతము, చంద్రుఁడు, నక్షత్రములు, మంచు మున్నగునవి జనించెను. ఇక శ్రోతలు సావధానులై ముందువృత్తాంతము నాలింపుడు 17. తేజముగూడ బహువికారయుక్తమైనదిగ నున్నను నదియు రెండువిధములుగా నుండును. అట్లే జలముగూడ రెండువిధములుగఁ జెప్పఁబడెను. ఉదకము, అమృతము అనియే ఆ రెండువిధములు 18. ఇఁకఁ బృథ్వినిగూర్చిన విచారము నాలింపుడు. పృథ్విలోని యొకవిధము పాషాణము మంటితోఁగూడినది. రెండవవిధము సువర్ణము, స్పర్శవేది, నానావిధరత్నాదులునై యున్నది 19. ఈ వసుంధరకు బహురత్నయని నామాంతరముగలదు. ఎయ్యది నిజమో, యెయ్యది కల్పితమో యదియంతయును విచారించినచో విశదమగును 20. "ఇఁక మనుష్యు లెచ్చటనుండి కలిగిరి?" అను ముఖ్యసందేహము మిగిలియున్నది. దానినిగూడ సావధానమతితో నాలకింపుఁడు 21.

---

## నాలుగవ సమాసము – ఉత్పత్తియొక్క విస్తారము.

మనము ఉత్పత్తినిగూర్చి విచారించితిమేని మనుష్యునివలన మనుష్యుఁడును, పశువునుండి పశువును బుట్టుచున్నవని స్పష్టముగా విశదమగును 1. ఖేచరములు, భూచరములు, వనచరములు, జలచరములు మొదలగు నానావిధశరీరములు శరీరమునుండియే కలుగుచున్నవి 2. ప్రత్యక్షముగ గనుపించుదానికిఁ బ్రమాణముతోఁ బనిలేదు. నిశ్చయమునకు అనుమానముతో నవసరములేదు. సరళమార్గమున్నపుడు వంకరటింకర త్రోవలతో నావశ్యకములేదు 3. విపరీతములకంటెను విపరీతములు కలుగుచుండును గాని యవియన్నియు శరీరములనియే పిలువఁబడును. శరీరములేనిది

ఉత్పత్తి కాఁజాలదు 4. అట్లైనచోఁ దొలుత నీయుత్పత్తి యెట్లు లయ్యెను? దేనివలన నయ్యెను? ఎవరు గావించిరి? మఱియు నెవ్వరు గావించిరో వానిదేహమును నెవ్వఁడు నిర్మించెను? 5. ఇట్టివిచారము గావింపఁ బూనినచో మిగులదూరము బోవలసివచ్చును. కాని ఆదియందు దేహ మెట్లునిర్మితమైనది? ఎవ్వఁడేపదార్థము నేవిధముగా నుద్భూతమొనరించెను? 6. ఈవిధమగు నీవెనుకటిశంక శేషించియుండెను. దాని నిప్పుడు వినుండు. ప్రతీతియైనపిదప మఱల శంకింపఁబనిలేదు 7. ప్రతీతియే ముఖ్యముగాని మూర్ఖులగువార లీవిషయమును దెలిసికొనరు. ప్రతీతియైన విషయముల యందే విశ్వాసముగలుగును 8. బ్రహ్మమునందున్న మూలమాయయే ముందునకరిగి అష్టవిధప్రకృతి యనఁబడుచున్నది. పంచభూతములయందును త్రిగుణములయందును మూలమాయ కలసియే యుండును 9. ఆ మూల మాయ వాయుస్వరూపము. వాయువునందున్న చేతనారూపమే యిచ్ఛ. కాని దీనియారోపణము బ్రహ్మమునిూఁదికిరాదు 10. ఐనను బ్రహ్మము నందు "ఇచ్ఛ చేయుట"యను నారోపణము నొకవేళ నంగీకరింతమన్నను నది వ్యర్థము. ఏలయన, బ్రహ్మము నిర్గుణమును శబ్దాతీతమును నై యున్నది 11. ఆత్మ నిర్గుణవస్తుబ్రహ్మము. నామమాత్రముగా నెంత గలదో యంతయును భ్రమ. ఒకవేళ బ్రహ్మమునందుఁ గల్పనముగావించి ఉపాధినంటించినచో నది యంటునెట్లు? 12. బ్రహ్మమునం దారోపణము నంటించితిమేని ఆకాశమును జాతితో గొట్టినటులగును. కాని దీనివలన నాకాశమెట్లు భిన్నము కాఁగలదు? 13. ఇట్లే నిర్వికారబ్రహ్మమునందు వికారము నంటించుట వ్యర్థము. వికారమునకు నాశనమున్నది. నిర్వికారము శాశ్వతమును యథావిధముగ నుండునదియు నై యున్నది 14.

ఇఁక ననుభవవిషయమును వినుండు. దాని నెఱింగి నిశ్చయింప వలయును. దానివలననే యనుభవసంబంధమగు జయము లభించును 15. బ్రహ్మమునందు సమీరరూపముగనున్న మూలమాయయందుఁగల చైతన్యమే యీశ్వరుఁడు. ఆ చైతన్యమును ఈశ్వరుఁడనియు సర్వేశ్వరుఁ డనియుఁగూడఁ జెప్పుదురు 16. ఆ యీశ్వరుఁడే గుణయుక్తుఁడైనపు డాతనిగుణము ననుసరించి మూఁడుభేదములు కలుగుచున్నవి. ఆ భేద ములను బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు అని యందురు 17. సత్వ

రజస్తమోగుణములు మూఁడు. ఈ గుణములను వెనుక వర్ణించితిమి 18. జ్ఞాత విష్ణుభగవానుఁడు, జ్ఞాత అజ్ఞాత చతురాననబ్రహ్మ, అజ్ఞాత పంచానన మహేశ్వరుఁడు. ఈతఁడు (మహేశ్వరుఁడు) మిగుల నమాయికుఁడు 19. త్రిగుణములు పరస్పరము కలసిమెలసియున్నవి. అవి యిప్పుడెట్లు వేఱు గాఁగలవు? కాని కొంచెముగనో, గొప్పగనో భాసించెడివానిని వివరింపవలసి వచ్చుచున్నది 20. మొట్టమొదట వాయుస్వరూపమగు మూలమాయ యందు సత్త్వగుణాత్మకమగు విష్ణుస్వరూపముగూడ వాయుస్వరూపము గనే యుండును. ఆ పిమ్మట నారూపము దేహధారియగు చతుర్భుజుఁ డుగా నగుచున్నది 21. ఇదేవిధముగా బ్రహ్మమహేశ్వరులుగూడ దేహ మును ధరించుచున్నారు. వారికి గుప్తమగుటకును, ప్రకటనమగుటకును నాలస్యముపట్టదు 22. ఇఁకఁ బ్రత్యక్షప్రతీతి గావించుకొనుము. మను ష్యుఁడే గుప్తముగను, ప్రకటనముగను మాఱుచున్నప్పుడు దేవతలసంగతి చెప్పవలసిన పనిలేదు. దేవతలు స్వయముగా శక్తిసంపన్నులు 23. దేవు నకు, దేవతలకు, దైవమునకు, భూతములకు మనుజులకంటె మిగుల నెక్కువసామర్థ్య ముండును. వారలకున్నట్లు రాక్షసులకుఁగూడ సామర్థ్యకళ యుండును 24. పిశాచము వాయుస్వరూపముగా నుండును. మిగులఁ ద్వరగా నడచును. కొబ్బరికాయలు, పెంకులు, రాళ్ళు ఆకస్మికముగాఁ బడవేయును 25. ఒకవేళ యివియన్నియు లేవని యంగీకరించెదమేని యది యుక్తముగాదు. ఏలయన, పిశాచాదులయునికి పలువు రెఱింగియే యున్నారు. తమతమ యనుభవానుసారముగా నందఱకీ విషయము తెలియును 26. మనుష్యుఁడే యనేక వేషములను ధరించుచుండఁ బురుషు లనేకులు పరకాయములలోఁ బ్రవేశించుచుండ నిఁక స్వయముగాఁ బర మాత్ముఁడగు జగదీశుఁ డిట్లీల చేయఁజాలఁడు? 27. ఈ విధముగా వాయుస్వరూపమునుండి దేహరూపులై బ్రహ్మవిష్ణుమహేశ్వరు లుత్పత్తి యైరి. అనంతరము వారలే పుత్రపౌత్రులతో విస్తృతు లగుచున్నారు 28. వారలంతఃకరణమునందె స్త్రీలను గల్పనముగావింతురు. కల్పనముగావింప గనే స్త్రీ లుత్పన్నమగుదురు. కాని వారివలన సంతానోత్పత్తి యెప్పుడును గాదు 29. వారలు ఇచ్ఛామాత్రముననే పుత్రులనుగూడఁ గల్పనము గావింతురు. కల్పనము గావించునపుడెల్ల బుత్రు లుత్పన్నమగుదురు. ఇట్లే

హరిహరవిధాత్రాదులు వర్తించుచుందురు 30. అనంతరము బ్రహ్మ సృష్టిని కల్పనము గావించును. అతని యిచ్ఛానుసారముగా సృష్టి నిర్మింపఁ బడును. ఇట్లే బ్రహ్మ జీవసృష్టి నేర్పఱచును 31. ఈ రీతిగ నానావిధ ప్రాణులు కల్పనమగుదురు. అన్నియు నిచ్ఛానుసారముగాఁ గల్పన మగు చుండును. అండజములు, జరాయుజములునగు జీవులు జతలుజతలుగా (ఒకటి మొగది ఒకటి ఆఁడుదిగఁ) బుట్టును 32. స్వేదమువలనఁ గలుగు ప్రాణులను స్వేదజములందురు. వాయువు వలనఁ గలుగు జీవములను ఉద్భిజ్జములనెదరు 33. ఇట్లే మనుజుల యింద్రజాలము (గారడీవిద్య), రాక్షసుల యంబరీవిద్య, బ్రహ్మయొక్క సృష్టివిద్య యుండును 34. మనుజుల సృష్టివిద్య కొంచెముపాటిది. రాక్షసుల సృష్టివిద్య అంతకంటె గొప్పది. దానికంటెను మిగుల గొప్పది బ్రహ్మసృష్టివిద్య 35. కొన్ని ప్రాణులు జ్ఞానవంతములుగను, మఱికొన్నిప్రాణు లజ్ఞానవంతములుగను సృజింపఁబడెను. బ్రహ్మ తొలుదొలుత వేదములను బ్రచురించి యా వేద ముల సహాయమునఁ బ్రాణులను మార్గమునఁ బెట్టుచున్నాఁడు 36. అనంతరము శరీరమువలన శరీరము లేర్పడుచున్నవి. ఈ వికారమువలన సృష్టి యథేచ్ఛముగాఁ బెరిఁగిపోవుచున్నది. శరీరములన్నియు నీవిధముగా నిర్మాణము లగుచున్నవి 37. ఇంతటితో శ్రోతలకు సందేహము నివార ణమైె సృష్టియంతయు నెట్లు విస్తృతమయ్యెనో విశదము గాఁగలదు. విచా రముగావించునచో నీవిషయము చక్కఁగా ననుభవములోనికివచ్చును 38. ఈవిధముగ బ్రహ్మ సృష్టి యొనరించుచున్నాఁడు. ఈ సృష్టినంతయు విష్ణు వెట్లు ప్రతిపాలనము గావింపుచుండునో శ్రద్ధతో శ్రోత లాలకింతురు గాక 39.

విష్ణువు మూలరూపము, సత్త్వగుణము, జ్ఞానము నై యున్నది. ఈ సూక్ష్మరూపము స్థూలదేహధారణముగావించి దుష్టులను సంహరించు చుండును 40. నానావతారములు ధరించుటకును, దుష్టులను సంహ రించుటకును, ధర్మస్థాపనము గావించుటకును విష్ణువు జననము నొందు చుండును* 41. ధర్మస్థాపనము గావించు పురుషుఁడుగూడ విష్ణుని

* శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ (గీత. అధ్యా 4.)

యవతారమే ! అట్టివాఁడలుగాక అభక్తులుగను, దుర్జనులుగను నుండు వారెల్లరును సహజముగనే రాక్షసగణములోనికి వచ్చెదరు 42. పుట్టిన ప్రాణులన్నియుఁ జైతన్యరహితములై నంతన నాశనమగును. ఈ విధముగా రుద్రుఁడు తమోగుణరూపముగా వానిని సంహరించుచున్నాఁడు 43. రుద్రులకుఁ బూర్తిగాఁ గోపముగలిగినపిదప సంపూర్ణ సృష్టియంతయు సంహారము కాఁగలదు. ఆసమయమున సమగ్రమగు బ్రహ్మాండమే భస్మము కాఁగలదు 44. ఈ యుత్పత్తి, స్థితి, సంహారములవర్ణనమును శ్రోతలు ధ్యానముతో యోజింపవలయును 45. ఇఁక ముందుసమాసమునందుఁ గల్పాంతసంహారమునుగూర్చి వర్ణించెదను. పంచప్రళయముల నెఱింగినవాఁడే జ్ఞాని గాఁగలఁడు 46.



## ఐదవ సమాసము — పంచప్రళయములు.

శ్రోతలారా ! ఇఁక ప్రళయలక్షణములను వినుండు. పిండము (శరీరము)నందు రెండు ప్రళయములు గలవు. ఒకటి నిద్ర, మఱియొకటి మరణము 1. దేహధారులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నిదురఁబోవు సమయమును బ్రహ్మాండనిద్ర ప్రళయమందురు 2. ముగ్గురు మూర్తులకును బ్రహ్మాండమునకునుగూడ నంత్యము కలుగుకాలమును బ్రహ్మప్రళయమందురు 3. మొత్తము నాలుగువిధములగు ప్రళయములుగలవు. వీనిలో రెండు పిండమునందును, రెండు బ్రహ్మాండమునందును నున్నవి. అన్నిఁటికంటెను గొప్పదగు నైదవప్రళయము వివేకమునుగూర్చినది 4. ఇటులే నైదుప్రళయములను గ్రమముగాఁ జెప్పితిని. ఇఁక నీ యంశము అనుభవములోనికి వచ్చునటులఁ దెలిపెదను 5.

నిదురవచ్చినప్పుడు జాగరూకతకు సంబంధించిన ప్రచారమంతయు నాగిపోవును. ఆకస్మికముగ దేహమునకు స్వప్నావస్థయో సుషుప్త్యవస్థయో తటస్థించును 6. ఈ జాగరూకత నశించుటకు నిద్రాప్రళయమని పేరుగలదు. ఇఁక మృత్యుప్రళయస్థితి వినుండు. అది దేహాంతసమయమునఁ గలుగును 7. దేహమునందు రోగము వృద్ధినొందినపుడుగాని, యేవేని కఠినపరిస్థితులు సంభవించినపుడుగాని పంచప్రాణములు దమ తమ

వ్యాపారములు మానివేయును 8. ఆ సమయమున మనస్సుగూడ వెడలి పోవును. కేవల దేహముమాత్రమె నిలచును. ఇదియే రెండవప్రళయము 9. బ్రహ్మ నిద్రించినపుడు మృత్యులోకము లయమగును. ప్రాణిమాత్రుల వ్యవహారములన్నియు నాగిపోవును. ఇది మూఁడవ ప్రళయము 10. ఆ సమయమునఁ బ్రాణికోటుల సూక్ష్మాంశములు వాయుచక్రమునందు వసించును. ఎంతయోకాలము గడచినపిమ్మట బ్రహ్మకు జాగ్రత గలుగును 11. బ్రహ్మ మఱల సృష్టి గావించును. విసంచితజీవులను (నష్టజీవులను) మఱల సంచితములుగఁ జేయును. బ్రహ్మ కాయుష్కాలము పూర్తియగునప్పుడు వచ్చు ప్రళయము పేరు బ్రహ్మప్రళయము 12.

నూఱుసంవత్సరముల దనుక వర్షము కురియదు. అందుచేఁ బ్రాణులన్నియు నశించును. పృథ్వీమండలము అసంభావ్యము అమర్యాదితముగాఁ బగిలిపోవును 13. సూర్యుఁడు ద్వాదశ కళాపూర్ణుఁడై భూమండలమును దీపింపఁజేయును. అందుచే భూమండలమంతయుఁ గాలిపోవ నారంభించును. ఈ యగ్ని క్రమముగాఁ బాతాళలోకములోనికి వ్యాపింపఁగనే శేషువు విషమును వాంతిచేసుకొనును 14. ఆకాశమునందు సూర్యకిరణజ్వాలలు విజృంభించుటచేతను బాతాళమున శేషువు విషము వమనము చేయుట చేతను భూమండల మీఁద రెండుప్రక్కల నున్న యగ్నులచే మాడిపోవును. ఈ పరిస్థితులలోఁ బృథ్వీమండలము అపాయమునుండి బయటఁబడఁజాలదు 15. సూర్యునివేడిఁ మిగుల వృద్ధినొందును. నలుముఖములఁ గోలాహలము చెలరేగును. మేరుశిఖరములు విరిగి పడిపోవును 16. అమరావతి, సత్యలోకము, వైకుంఠము, కైలాసము మున్నగు లోకములన్నియు భస్మమైపోవును 17. మేరుపర్వతమంతయుఁ గ్రుంగిపోవును. దాని మహత్త్వము గూడ నంతరించును. దేవసముదాయము వాయుచక్రమునందుఁ దిరుగ నారంభించును 18. ధరణి భస్మమైపోయినపిదప రోఁకటిరింటి ధారలతో వర్షము గురియును. నిమిషమాత్రములో బూదిదైన భూమండలమంతయు జలములోఁ గరిగిపోవును 19. పిమ్మట భూమండలముండదు. కేవలము జలమే నిల్చియుండును. ఆ జలమునుగూడ అగ్ని శోషింపఁజేయును. అనంతరము హద్దు, అంతములేని అగ్నిజ్వాల లావరించును 20. సముద్రములోని బడబానలము, శివుని నొసటి నేత్రానలము, సప్తకంచుకి యగ్ను

బ్రహ్మాండముయొక్క ఆవరణానలము, సూర్యుఁడు, విద్యుల్లత మున్నగు నగ్నులన్నియు నొకచోట రాశియగును. ఆకారణమున దేవతలందఱును దేహములను విడుతురు. అనంతరము దేవతలు వాయురూపముతోఁ బ్రభంజనునియందుఁ గలసిపోవుదురు 21_22. ఆ వాయువు అగ్నిని లోఁగొనును. అగ్నియారిపోవును. వాయువు స్వచ్ఛందముగాఁ బరబ్రహ్మములోనికిఁ బరుగెత్తును 23. పొగ ఆకాశమునందంతటను వ్యాపించి నష్టమగునట్లు వాయువుగూడ నశించును. మహద్వస్తువులతోఁబాటు స్వల్ప వస్తువులకుఁగూడ నాశనము గలుగును 24. వాయువు లయమైనతోడనే సూక్ష్మభూతములు, త్రిగుణములు, ఈశ్వరుఁడు (ప్రకృతి, పురుషుఁడు అనగా మూలమాయ) నిర్వికల్పమునందు లీనమై తమతమ యధిష్ఠానములను విడిచివేయుదురు 25. అప్పు డెఱుక యుండదు. జగజ్జ్యోతి లయమగును. నిరాకారస్వరూపస్థితి శేషించియుండును 26.

నామరూపములన్నియునుఁ బ్రకృతికారణములు. ప్రకృతిలేనప్పుడు చెప్పుట యెట్లుపొసఁగును? 27. ప్రకృతియుండగనే వివేకించుటను వివేక ప్రళయమందురు. ఈ పంచప్రళయములను వివరముగా దెలిపితిని 28.



## ఆఱవ సమాసము — భ్రమనిరూపణము.

ఇంతవఱకు ఉత్పత్తి, స్థితి, సంహారములవృత్తాంతము చెప్పితిని. ప్రళయాంతమునఁగూడ నిర్గుణనిరాకారపరమాత్మ యథావిధముగా నుండును 1. కలుగుట, వర్తించుట, నశించుట యనువాని సంబంధము లా పరమాత్మునకు లేవు. ఆతఁడు ఆదిమధ్యాంతములయందు నిరంతర మొకే విధముగ నుండును 2. పరబ్రహ్మము యథావిధముగా నుండును. మధ్యయందే యీ సృష్టిభ్రమ భాసించుచున్నది. కాని కాలాంతరమున నంతయు నాశనమైపోవును 3. మధ్యయందు ఉత్పత్తిస్థితిసంహారము లఖండరీతిగా జరుగుచుండును. కాని యంత్యమున నన్నిఁటికిని బ్రళయము కలుగును 4. వివేకముగలవాఁ డీయంశము మొట్టమొదటనే గ్రహించును. సారాసారవిచారమువలన వివేకశాలి యీ యుత్పత్తిస్థితిసంహారముల స్వరూపమును మొదటినుండియుఁ దెలిసికొనును. ఇట్లెఱుంగువారలనే జ్ఞాను

లందురు 5. భ్రాంతాత్మలు పలువురు ప్రోగైనచోట నొక తెలిసినపురుషుం డేమిచేయఁగలఁడు? సృష్టియం దిట్టి వివేకవంతులు చాల స్వల్పముగా నున్నారు 6. ఈ మహాపురుషు లెన్నఁడును భ్రమకుఁ బాల్పడరు. తెలిసినవారి ముఖ్యలక్షణము భ్రమకుఁ బాల్పడకయుండుటయే సుమా! 7. భ్రమయందుఁ జిక్కుకొననివారెవరో మనము మనస్సులో గుర్తింపవలయును. భ్రమయొక్క తత్త్వమును జెప్పెదను. సావధానులరై వినుండు 8. ఒక పరబ్రహ్మమె పరిపూర్ణముగా నంతటను నిండియున్నాడు. ఆతఁడెన్నఁటికిని వికారయుక్తుఁడు గాఁడు. ఆతనిని విడిచినచో మిగిలినభాసమంతయును భ్రమరూపము 9. ప్రళయమునొందుచున్న త్రిగుణములు, పంచభూతములు (అష్టవిధప్రకృతి) మున్నగునవన్నియు భ్రమరూపములే యగును 10. నేను, నీవు, ఉపాసన, ఈశ్వరభావము అనునవిగూడ నిశ్చయముగ భ్రమయే 11.

శ్లో॥ భ్రమేణాహం భ్రమేణ త్వం భ్రమేణోపాసకా జనాః ।
భ్రమేణేశ్వరభావత్వం భ్రమమూలమిదం జగత్ ॥

ఈ కారణమున సృష్టి భాసమానమగుచుండినను సమస్తమును భ్రమరూపమే. ఈ విషయమునం దెవ్వరు విచారము గావింతురో వారలు ధన్యులు 12. ఇఁక భ్రమనుగూర్చి మిగుల స్పష్టముగాఁ జెప్పెదను. మఱియు దృష్టాంతపూర్వకముగా శ్రోతలకు బోధించెదను 13. దూరదేశమున సంచరించుచు నొకవేళ దిశాభ్రమణము గలిగినను లేక తనకుటుంబములోనివారు తన్ను గుర్తింపఁజాలకపోయినను దానిని భ్రమయందురు 14. మత్తుపదార్థములను సేవించినచో ఒకవస్తు వనేకవస్తువులుగాఁ గనిపించుచుండుటను భ్రమయందురు. భూతముసోఁకి నానావ్యాధులు కలిగినచో దానినిగూడ భ్రమయందురు 15. దశావతార నాటకము లాడునపుడు పురుషులు స్త్రీలుగాఁ గాన్పించుట, ఇంద్రజాలవిద్య, యంతఃకరణమునం దేదేని సందేహము నెలకొనుట మున్నగువానిపేరు భ్రమ 16. ఏదేనివస్తువు నెందేనిదాఁచి మఱచిపోవుట, నడచుచు నడచుచుఁ ద్రోవను మఱచిపోవుట, పట్టణములోఁ దెన్నుగానక తిరుగుట భ్రమయనఁదగును 17. తనయొద్దనున్న వస్తువు పోయినదనుకొని దానికై పరితపించి దుఃఖితుఁడగుటయు, స్వయముగాఁ దన్నుఁదా మఱచిపోవుటయు భ్రమ 18. ఏ వస్తువునేని మఱచుట, లేక నేర్చినవిద్య మఱచుట, స్వప్నదుఃఖమువలన

భయమొందుటగూడ భ్రమయే 19. దుస్స్వప్నములవలనఁగాని, అపశకునములవలనగాని, మిథ్యావార్తలవలనగాని మనస్సు చెదరుటయు నేదేని పదార్థమునుజూచి వెఱచుటయు భ్రమ 20. వృక్షమునుగాని, కొయ్యనుగాని చూచి భూతము వచ్చుచున్నదని సందేహించుటయు, ఏమియు లేకున్నను భయమొందుటయు భ్రమయనఁబడును 21. నీటిని కాంస్యమనుకొని యందుఁబడుటయు, నిలువుటద్దములోఁగనిపించు సభాప్రతిబింబమునుగాంచి యందుఁ జొర యత్నించుటయు, ద్వారమునుమఱచి యిటునటు తిరుగుటయు భ్రమ 22. ఒకటియున్న మఱియొకటి యనుకొనుటయు, ఒకటిచెప్పిన మఱియొకటిగా గ్రహించుటయు, ఒకదానినిజూచి మఱియొకదానిని మనస్సులోనికిఁ దెచ్చుకొనుటయు భ్రమ 23. ఈ జన్మలోనిదానిని ముందుజన్మములోఁ బొందెదనను నాశ పెట్టుకొనుటయు, మనుష్యునిపేరుపైఁ బ్రీతియుంచుటయు భ్రమ 24. ఈ జన్మమునందిచ్చిన దానిఫలము ముందుజన్మములో ననుభవింపఁగల ననుకొనుటయుఁ, జనిపోయినవారలు (శ్రాద్ధాదులలో) తినుటకు వత్తురని నమ్ముటయు భ్రమ 25. మరణించినవారలు స్వప్నములోఁ గనిపించి మనల నేదేని యడుగుచుందురను భావము హృదయమునందు నిశ్శంకముగా నుంచుకొనుటయు 26, సర్వము మిథ్యయని చెప్పుచు ధనద్రవ్యములపైకి మనస్సును బరుగులెత్తించుటయు, జ్ఞాతయయ్యు వైభవములను జూచుకొని యుక్తాయుక్తముల మఱచుటయు భ్రమ 27. కర్మతత్వముతో జ్ఞానమును మఱచుటయు, జ్ఞాతృత్వముతో బలాత్కారముగ భ్రష్టుఁడగుటయు, నేదేని నియమము నుల్లంఘించుటయు 28, దేహాభిమాన, కర్మాభిమాన, జాత్యభిమాన, కులాభిమాన, జ్ఞానాభిమాన, మోహాభిమానములు గలిగియుండుటయు 29, న్యాయము నెఱుంగకుండుటయుఁ, దానొనరించిన యన్యాయమును గ్రహింపకుండుటయు, వ్యర్థముగా నభిమానమును బెంచుకొనుటయు భ్రమ 30. వెనుకటివిషయములను మఱచిపోవుటయు, ముందువిషయములు తోఁచకుండుటయు, నఖండముగ గర్విష్ఠయియుండుటయు 31, ప్రతీతిరహితముగ నౌషధమును సేవించుటయుఁ, బ్రతీతిరహితముగాఁ బథ్యము నొనర్చుటయుఁ, బ్రతీతిరహితముగా జ్ఞానబోధ గావించుటయు భ్రమ 32. ఫలము నెఱుంగక యేదేని ప్రయోగము

గావించుటయు,. జ్ఞానములేకున్నతఱి యోగము గావించుటయు, వ్యర్థముగ శరీరభోగముల ననుభవించుటయు 33, "బ్రహ్మ లలాటమున నెట్లు లిఖించెనో యటులె జరుగును" అను నిట్టి వేదాంతవాక్యములు నుడువుచుఁ గార్యములలోఁ బూనికచూపక మిన్నకుంటయు భ్రమ 34.

ఈ విధముగ అజ్ఞానులలో భ్రమ బాగుగాఁ బాదుకొనియున్నది. సాధారణరీతిగా నెఱుంగుటకై నేనిట భ్రమను సంక్షేపముగాఁ దెలిపితిని 35. విశ్వమంతయు స్వాభావికముగా భ్రమరూపముగా నున్నప్పుడు చెప్ప వలసిన దిఁక నేమున్నది ? నిర్గుణబ్రహ్మముదక్క మిగిలినదంతయు భ్రమ రూపమనియే గ్రహింపవలయును 36. జ్ఞానులు ప్రపంచాతీతులు కావున గతించిన జ్ఞానుల చమత్కారములనుగూడ భ్రమయని గ్రహింపనగును 37. "జ్ఞాతల సమాధులు పూజింపఁబడుచున్నవిగదా ! అందువలన ఫలము కలుగునా? లేదా? యనియు 38, అ వ తా ర పు రు షు లీకాలమున లేకున్నను వారల మహిమలు, వారి సామర్థ్యములు నేటికిని ఆదరింపఁబడు చున్నవి. వారలుగూడ వాసనయందుఁ జిక్కియుండిరాయనియు నొకశంక మా శ్రోతలకుఁ గలుగుచున్నది 39. ఇప్పుడు సమర్థుఁ డీసందియమును దొలంగింపవలయును. ఇంతతో భ్రమనుగూర్చిన కథగూడ సమాప్తి యైనది 40.

---

## ఏడవ సమాసము - సాధువులు చమత్కారము చేయరు.

శ్రోత లిట్లు ప్రశ్నించిరి. అవతారపురుషులు, జ్ఞానులు, సాధు పురుషులు పూర్తిగా ముక్తులైరిగదా ! వారి సామర్థ్యము నేటిదనుక నెట్లు నడచుచున్నది ? వక్త యిట్లు నుడివెను. చాలమంచి ప్రశ్న గావించితిరి. ఇఁక దీనికి ఉత్తరము వినుండు 1-2. జ్ఞానులు ముక్తులగుచున్నారు. అనంతరము వారిసామర్థ్యము నడచుచుండును. కాని వారలు వాసనను ధరించిరారు 3. లోకులకుఁ గాన్పించుచున్న చమత్కారములను, ఆ చమ త్కారములను లోకులు సత్యములని నమ్ముచుండుటను జతురులు విచారింపవలసియున్నది 4. చనిపోయినవారి సంగతి నటులుంచుఁడు. బ్రదికి యున్నపు డెన్నిచమత్కారములు ప్రజలలో జరుగుచున్నవో సరిగా

నెవ్వరెఱుంగుదురు ? ఈ విధమగు తాత్కాలిక ప్రతీతిని బ్రత్యక్షముగఁ జూచుకొనుఁడు 5. ఆతఁడొక స్థలమునుండి స్వయముగా వేఱొక స్థలమునకుఁ బోవనేలేదు. జనులాతనినిఁ బ్రత్యక్షముగా వేఱొకస్థలమునందుఁ జూచిరి. ఈ చమత్కార మీ విధముగా జరిగినది. ఇప్పుడు దీనిని నేమందము? * 6. తమ తమ భావకారణముననే జనులకిట్లు గోచరించుచున్నది. భావికులకు దేవుఁడు యథార్థముగా నున్నాఁడు. భావములేని కల్పనమంతయు వ్యర్థము, కుతర్కపూరితము 7. తనకుఁ బ్రియమైన వస్తువును స్వప్నమునందుఁ గాంచుటగలదు. వాస్తవమున కావస్తు వచటికి వచ్చుచున్నదా యేమి ? "అట్లు వచ్చుటలేదు. అది జ్ఞప్తిమాత్రము వచ్చుచున్నది" అని యొకవేళఁ జెప్పఁదలఁచినచోఁ దక్కినవస్తువుల రూపమెందులకుఁ గనుపించుచున్నది ? కేవలము వానికిఁగూడ స్వప్నమునందు జ్ఞప్తియే యేలరాదు ? 8. కావున నిదియంతయును మనకల్పనము. స్వప్నమునందు నానావిధపదార్థములు కనిపించుచున్నవి. కాని వాస్తవమున కవియెవ్వియును లేవు. అవి జ్ఞప్తికి వచ్చుటయునులేదు 9. ఇంతటితో సందేహము తొలఁగిపోవుచున్నది. జ్ఞాతకు జన్మకల్పనము గావింపకుము. ఒకవేళఁ జక్కఁగ బోధపడకపోయినచో వివేకముతో మరల బాగుగాఁ దెలిసికొనుము 10. జ్ఞానులు ముక్తులై పోయెదరు. వారల సామర్థ్యము నడచుచుండును. వారలు పుణ్యమార్గమును దొలంగరు గావున గతించిన పిమ్మట మహత్త్వము కొఱఁతవడకున్నది 11. కావున పుణ్యమార్గమును దొలంగక వర్తింపవలయును. ఈశ్వరభజనము నభివృద్ధి గావింపవలయును. న్యాయమును దొలంగి యన్యాయమార్గమున నడువరాదు 12. శుభపురశ్చరణ లెన్నెని చేయవలయును. తీర్థాటనము చక్కఁగఁ జేయవలయును అంతతోఁబోక వైరాగ్యబలముచేఁ దన సామర్థ్యమును బెంపొందింపవలయును 13. పరమాత్మునియందు విశ్వాసమున్నచో జ్ఞానమార్గమువలనఁ గూడ సామర్థ్యము వృద్ధియగును. కాని శాంతిభంగమగునట్లు యత్నము చేయరాదు 14. గురువు, ఈశ్వరుఁడు అను నీ యిద్దరిలో నొకరియందుఁ గాని యిద్దరియందుఁగాని అవశ్యముగా శ్రద్ధ కలిగియుండవలయును. శ్రద్ధ

* ఉదాహరణముగా వ్రాసిన యీ యంశము, ఎవరో సాధుపురుషుని చమత్కారమును దృష్టిపథమునందుంచుకొని శ్రీసమర్థుఁడు రచించెనని తోఁచుచున్నది.

లేనిచో నంతయు వ్యర్థమగును 15. జ్ఞాతలు నిర్గుణజ్ఞానము గలిగినపిమ్మట సగుణమునందున్న ధ్యానమును దొలంగించిన యెడల నిర్గుణమునకు సగుణమునకుంగాక చెడిపోవుదురు 16. అట్టిజ్ఞాతలకు సహజముగా భక్తియుండదు, జ్ఞానముగూడ నుండదు. కేవలముగ నభిమానముమాత్రమే మధ్యయందుం గలుగును. కావున జప తపో ధ్యానముల నెప్పుడును విడువఁజనదు 17. సగుణభజనము విడిచివేయువారు జ్ఞానులైన నగుదురుగాక. వారికియశము లభింపదు. కావున సగుణభజనము విడువనే కూడదు 18. నిష్కామబుద్ధితోఁ గావించు భజనమునకు సమానమైన దీ మూడులోకములలో నేదియులేదు. కాని సామర్థ్యములేనిది నిష్కామభజన మెన్నఁటికిని కుదురదు 19. సకామభజనమువలన ఫలము దొరుకును. నిష్కామభజనము వలన భగవంతుఁడు దొరుకును. ఇఁకఁ జెప్పుడు, ఫలమెక్కడ? భగవానుఁ డెక్కడ? ఔరా! ఈ రెంటి కెంత యంతరమున్నది 20. ఈశ్వరునియొద్ద నానావిధ ఫలములు గలవు. కాని ఫలములు భగవంతునినుండి మనుజుని దూరపఱచును కావున నిష్కామమే భజింపఁదగినది 21. నిష్కామభజన ఫల మద్భుతమైనది. దానివలన నంతులేని సామర్థ్యము వృద్ధినొందును. ఈ స్థితిలో బాపము! ఫలాపేక్షితులేమి లెక్కకువత్తురు? 22. భక్తుఁడు తన హృదయమున నుంచుకొన్న విషయము నీశ్వరుఁడు స్వయముగా జేయును. భక్తుల కేవిషయమునందేని జింతింపవలసిన యవసరములేదు 23. రెండు సామర్థ్యములు (భగవంతునియొక్కయు భక్తునియొక్కయు సామర్థ్యములు) ఒకటియైనపుడు కాలముగూడ నేమియుఁ జేయఁజాలదు. ఇఁక నితరులదేమిలెక్క? అందఱు నచ్చటఁ బురుగులవలె నుందురు 24. కావున నిష్కామభజనమునకును బ్రహ్మజ్ఞానమునకును గట్టెదుటం ద్రిలోక సంపదలుగూడఁ బరిగణింపఁదగినవి కాఁజాలవు 25. బుద్ధికిఁ బ్రకాశదాయకమైన దింతకంటె వేఱుగా నేదిగలదు? నిష్కామభక్తునకుఁ గీర్తియు, యశమును, బ్రతాపమును నిరంతరము లభించును 26. ఆధ్యాత్మనిరూపణము హరికీర్తనము జరుగుతావున మనుష్యమాత్రునకుఁ గల్యాణము కలుగును 27. భ్రష్టాకారముగాని పరమార్థ మెన్నఁటికిని సంకుచితము కాఁజాలదు. పరమార్థమువలన నేర్పడిన నిశ్చయసమాధాన మెన్నఁటికిని జెదరదు 28. సారాసారవిచారణమువలనను, న్యాయాన్యాయ

ములపై నిరంతరము దృష్టినుంచుటవలనను బరమాత్మునిచేఁ బ్రసాదింపఁ బడిన బుద్ధి స్థిరపడును 29. అనన్యభక్తునకు భగవంతుఁడు స్వయముగా బుద్ధినొసంగును. ఈ భగవద్గీతావాక్యమును వినుఁడు 30. "దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే" కాని సగుణభజనము, దానిమీఁద బ్రహ్మజ్ఞానముఁ మరల ననుభవయుక్తమగు శాంతి సంసారమునందు (ప్రపంచమునందు) దుర్లభములై యున్నవి 31.

---

## ఎనిమిదవ సమాసము – ప్రతీతినిరూపణము.

ప్రతీతి (ఎఱుక) లక్షణములు వినుండు. ప్రతీతిని విచారము గావించు వారలే చతురులు. ప్రతీతిరహితులగు మానవులు పిచ్చివాండ్రు, దీనులు నై యున్నారు 1. నానావిధరత్నములు, నాణెములు పరీక్షింపక తీసికొన్న చో హానికలుగును. అట్లే విశ్వాసము కలుగకున్న చో నిరూపణమునందుఁ బ్రవేశింపనేకూడదు 2. గుఱ్ఱమును శస్త్రమును ద్రిప్పిచూడవలయును. అవి మంచివని తెలిసికొనినప్పు డెటుఁగినమనుజుఁడు వానిని దీసికొనవలయు ను 3. విత్తనములను మొలచుట కర్హములని బాగుగ నిర్ణయించుకొన్న పిమ్మట మూల్యము నొసంగి తీసికొనవలయును. ఇట్లే ప్రతీతియైనపుడు నిరూపణమును వినవలయును 4. ఈ యౌషధమువలన శరీరమున నారోగ్యము కలుగునను నమ్మకము ప్రజలలోఁ గలిగియున్నపుడే యా యౌషధమును దీసికొనవలయును 5. ప్రతీతిలేక యౌషధము దీసికొనుట తన యారోగ్యమును భంగము గావించుకొనుటయే. అనుమానముతోఁ బనిచేయుట మూర్ఖత్వము 6. ప్రతీతి లేనితావున బంగారపు నగలు చేయించుట తన్నుఁదాను కావలయునని మోసగించుటయేసుమా 7. చూడక, ఆలోచింపక యేపనినేని చేయుట యుక్తముగాదు. దీనివలనఁ బ్రాణములు సైతము పోవును 8. యోగ్యులెన్నఁటికిని అనుమానముతోఁ బనిచేయ రాదు. అట్లు చేసినచో మంచికిబదులుగాఁ జెడుగు జరుగుచుండును 9. నీటిలో మునిఁగియున్న బట్టనుఁ గ్రయమునకుఁ దీసికొనుట ఉత్తమబుద్ధికి లక్షణముగాదు. చూడక విచారింపక పనులొనరించినచో తరువాత వ్యర్థమయ్యెనని పశ్చాత్తాపము నొందవలసివచ్చును 10. పలువురు మను

జులు విశ్వాసముగలవారై యెదుటివారిపై నమ్మకముంచి యింటఁ గూర్చుండి అమ్మకట, కొనుట జరుపుదురు. కాని కపటులు తమ కాపట్యమునం దుపయోగించియే తీరుదురు. అట్టి కపటములను దెలిసికొన వలయును 11. చూడక, యోజింపక అన్నమునుగాని, వస్త్రమునుగాని గ్రహించుటచే నొకానొకప్పుడు జనులు తమ ప్రాణములను జేతిమీఁదుగాఁ గోల్పోవుచున్నారు. అనృతవాదిని నమ్ముటయే మూర్ఖత్వము 12. దొంగతోఁ జెలిమిచేసినచో హాని కలిగితీరును. కపటులు మోసగాండ్రు బాగుగా విచారించిన వెల్లడియగుదురు 13. అసత్యవాదులు, తామసులు, వేషము మార్చి మోసగించువారు, నానావిధ కపటజాలనిర్మాతలు నగువారలను బాగుగా నెఱింగి వారలయెడ జాగరూకత గలిగియుండవలయును 14. దివాలాతీయువారల వైభవములు, చమత్కారములు చూచుటకు మిగుల గొప్పగఁ గనిపించును. కాని యంతయు వట్టి మోసపుబని. కొన్నాళ్ళకీ యనృతభాండము పగిలితీరును 15. ఇట్లే విశ్వాసములేనిది జ్ఞానగ్రహణము జేసినచో సమాధానము కలుగదు. సందేహయుక్తమగు జ్ఞానమువలన ననేకుల కహితమయ్యెను 16. వైద్యశాస్త్రము నెఱుంగక వైద్యముచేయుచుండు వైద్యనామధారి రోగిని దన యశక్తివలనఁ జంపునట్లు మంత్రయంత్రోపదేశమువలన నజ్ఞానప్రాణులు మరింత యధోగతిపాలగుచున్నారు 17. సరిగాఁ దెలియనివైద్యమువలనఁ బాపము! ఎవఁడేని మనుజుఁడు చనిపోయిన యెడల రెండవవారు రోగశాంతి కేమి యుపాయము గావింపఁగలరు? 18. బాధవలన లోలోనఁ గుమిలి యెండిపోవుదురు. అంతియగాని వైద్యుని కడకుఁబోయి యౌషధమునుమాత్ర మడుగరు. అట్టిప్రజల కాత్మహత్యాత్వదోష మేల కలుగదు? 19. జ్ఞానిపయి నభిమానము కలిగియుండుట స్వయముగాఁ దా నజ్ఞానియగుటవలననే తటస్థించుచున్నది. ఇది తన్ను దాను ముంచుకొనుటయే. బాగుగా యోజింపుఁడు. ఇట్లు చేయుటవలన హానికలుగున దెవరికి? (జ్ఞానికా లేక అభిమాన ముంచువానికా) 20. "పాపములు నశించినవి. జననమరణయాతనలు తొలఁగినవి" అను విశ్వాసము తనకుగలిగినపుడె మానవునకు శ్రేయముకలుగును 21. "నేను పరమాత్ముని గుర్తించితిని. నేనెవ్వఁడనో తెలిసికొంటిని. ఆత్మనివేదనమైన"దని నిన్నుఁగూర్చి నీవుచక్కఁగ తెలిసికొన్నప్పుడు అంతయుఁ జక్కఁ

బడును 22. బ్రహ్మాండము నెవఁడు రచించినదియు మఱియు నేపదార్థ ములతో రచించినడియు ముఖ్యకర్త యెవఁడైనదియు నీవు చక్కఁగఁ దెలిసికొన్నయెడల నంతయుఁ జక్కఁబడును 23. ఇది యంతయుఁ దెలిసి కొనుటలో నింకను నొకవేళ సందియము శేషించియున్నయెడల నాతని యనుభవమంతయు వ్యర్థమయ్యెననియు విశ్వాసహీనుఁడగుటచే నామాన వుఁడు సందేహమగ్నుఁ డయ్యెననియు గ్రహింపవలయును 24. ఇది పర మార్థమర్మము. ఇం దసత్యము కలదని యెవఁడేని నుడివినచో వాఁ డధముఁడు. అట్లసత్యముగా భావించువాఁడు పాపులలో నగ్రేసరుఁడు 25. ఇఁక నిప్పుడు చెప్పుచున్న యంశమునకుఁ బరిమితి పూర్తియైనది. ఎఱుఁగని యెడలఁ బరమాత్మ యెఱుంగఁబడదు. పరమాత్మా! ఇం దసత్యములేదని నీవె యెఱుంగుదువు 26. సత్యమగు జ్ఞానమును వివరించుటయె నా యు పాసనా విశేషము. మిథ్య చెప్పినయెడల నా ప్రభువుమీఁదికి దోషము వచ్చును 27. కాన సత్యమును జెప్పుచున్నాఁడను. కర్తను గుర్తింపవలెను. మాయోత్పత్తిహేతువు శోధింపవలయును 28. వివరింపఁబడిన నిరూపణ మునే యిచట మఱల వివరించితిమి. శ్రోతలు సావధానులరై వినుండు 29. సూక్ష్మనిరూపణమునుగూర్చి ప్రసక్తివచ్చినపుడు చెప్పినదానిని మఱలఁ జెప్పుచుందును. ఏలయన, శ్రోతల హృదయములో నావిషయము బాగుగా బోధపడుటకె 30. వాస్తవమునకుఁ బ్రతీతిని సంబాళించుటవలన జనరూఢి తొలఁగును. కావునఁ జనరూఢిని గాపాడుచుఁ బ్రతీతిని గావించుటకై, ఇంతచిక్కను దెచ్చిపెట్టుకొనవలసి వచ్చినది 31. ఒకవేళ జనరూఢిననుస రించియే చెప్పుదుమన్నచో బ్రతీతియొక్క సమాధానము తొలఁగిపోవు చున్నది. ఒకవేళ ప్రతీతిసమాధానముల రక్ష గావింతమన్నచో జనరూఢి లేచిపోవును 32. ఈ విధముగ రెండు పక్షములనుండియు సంకటములు కలుగుచున్నవి. ఈ కారణముననే చెప్పినదానిని మఱల జెప్పవలసివచ్చు చున్నది. ఇపుడు రెండింటిని (జనరూఢిని, ప్రతీతిసమాధానమును) రక్ష జేయుచు సమస్యను సాధించెదను 33. కావున జనరూఢి, ప్రతీతి ప్రమాణము అను నీరెంటిని రక్షజేయుచుఁ గావింపఁబడిన నిరూపణమును బరమచతురు లగు శ్రోతలు మననము గావింపవలయును 34.

## తొమ్మిదవ సమాసము – పురుషుఁడు, ప్రకృతి.

ఆకాశమునందు వాయునిర్మాణమున్నట్లు బ్రహ్మమునందు మూల మాయ యుండును. అనంతరము వాయురూపమగు మూలమాయనుండి త్రిగుణములును బంచభూతములును గలుగుచున్నవి 1. వటబీజమునందు మిగులఁ బెద్దవృక్షము జనించుచున్నది. కాని బీజమును బగులఁగొట్టి చూచినయెడల నది కాన్పింపదు. నానావిధవృక్షసమూహమంతయు బీజము నుండియే కలుగుచున్నది 2. అటులె మూలమాయగూడ బీజరూపముగా నున్నది. ఆ బీజరూపమునుండియే సమస్తవిశ్వ మేర్పడెను. దీనిస్వరూపమును శోధించి చక్కఁగాఁజూడవలయును 3. అచట నిశ్చలచంచలములు రెండును గాన్పించును. వాని ప్రతీతిని వివేకమువలనఁ జేయవలెను. నిశ్చలమునం దున్న చంచలస్థితియే వాయువు 4. దానియందున్న చేతనశక్తియే జగజ్జ్యోతియొక్క స్ఫూర్తి. వాయువు, చేతనశక్తి గలిసి మూలమాయ యనిపించుకొనును 5. "సరిత" యని నుడువఁగానే యది యేస్త్రీకైనఁ బేరైయుండునని తోఁచును. కాని యచటఁ జూచినచో నేముండును ? జలము. ఇట్లే వివేకవంతులు మాయ నెఱుంగవలయును 6. వాయువు చేతనశక్తి (జగజ్జ్యోతి) కలిసి మూలమాయ యనఁబడును. పురుషుఁడు ప్రకృతియని సైతము దీనినందురు 7. వాయువును బ్రకృతియనియు, జగజ్జ్యోతిని బురుషుఁడనియు నందురు. వీనికే పురుషప్రకృతులు, శివశక్తులు అని పేరులుగలవు 8. వాయువునందుఁగల చేతనవిశేషమే ప్రకృతియందుఁ బురుషుఁడు. ఈవిషయమునందు విశ్వాస ముంచవలయును 9. వాయువు శక్తి, చేతనము శివుఁడు. వీనినే జనులు అర్ధనారీనటేశ్వరుఁ డందురు 10. వాయువులోఁ జేతనగుణముగలదు. ఇదియే ఈశ్వరలక్షణము. దీనినుండియే మరలఁ ద్రిగుణము లేర్పడెను 11. త్రిగుణములలో సత్త్వగుణము శుద్ధ చైతన్యలక్షణము. దీని దేహధారిస్వరూపము శ్రీవిష్ణుమూర్తి 12. ఆ విష్ణ్వంశమువలననే జగత్తు నడచుచున్నదని భగవద్గీత నుడువుచున్నది. ఈ గందరగోళము విచారమువలన నెట్లుస్పష్టమగును? 13. ఒక్కచేతన శక్తియే అన్నిప్రాణులయందును వ్యాపించియున్నది. అదియే తన మెలుకవలన నన్నిశరీరములను రక్షించుచున్నది 14. దానిపేరే జగజ్జ్యోతి. ప్రాణి

మాత్రులు దానివలననే జీవించుచున్నారు. దాని సాక్షాత్ ప్రతీతిని ప్రత్యక్షముగాఁ గనుఁగొనవలెను 15. జగత్తునందలి పక్షిశ్వాపదకీటక పిపీలికాది సమస్త ప్రాణివర్గమునందును జేతనము నిరంతరము వర్తించుచుండును 16. దాని గుణమువలననే, దాని మెఱుకవలననే శరీరమును బరుగెత్తించుటయుఁ గాపాడుటయు దాఁచుటయు దటస్థించుచున్నది 17. అది జగములన్నింటిని పాలించుచున్నది. అందువలననే దానిపేరు జగజ్జ్యోతి. అది వెళ్లిపోయినపిమ్మటఁ బ్రాణులచ్చటచ్చటఁ జనిపోవును 18. జలము తుషారమై యనంతరేణురూపముతో నున్నట్లు మూలమాయ యొక్క చేతనవికారము ముందునకరిగి విస్తృతమయ్యెను 19. అట్లే దేవ దేవతాద్వైవతభూతాదులు మిథ్యయని చెప్పఁబడుటలేదు. అవియన్నియుఁ దమతమ సామర్థ్యమువలన నీ సృష్టియందుఁ దిరుగుచుండును 20. ఇవి నిరంతరము వాయుస్వరూపముతోఁ జరించుచుండును. మఱియుఁ దమతమ యిచ్ఛానుసారంగా రూపములను మార్చుకొనుచుండును. అజ్ఞానప్రాణులు తమభ్రమవలనను సంకల్పమునలనను భూతాదులచేఁ బీడితులగుచుందురు. 21. జ్ఞాతకు సంకల్పము కలుగనేకలుగదు. అందుచే భూతాదులు జ్ఞాతను బాధింపనేరవు. కావున ఆత్మజ్ఞానాభ్యాస మవశ్యముగాఁ జేయువలయును22. ఆత్మజ్ఞానము నభ్యసించుటవలన సకలకర్మములును ఖండనమగును. ఇది కేవలముగఁ బ్రత్యక్షానుభవమగు నంశము. ఇందు సందియములేదు 23. జ్ఞానము కలుగనిది కర్మము లెన్నఁటికిని ఖండింపఁ బడవు. ఇట్లే సద్గురుఁడు లేనిది జ్ఞానమెన్నఁటికిని గలుగదు 24. కావున సద్గురుని యనుగ్రహము సంపాదింపవలయును. సత్సంగమమును బడసి దాని శరణ్యమున కరుగ వలయును. అంతఃకరణమునందుఁ దత్త్వజ్ఞానమును మననము జేయ వలయును 25. తత్త్వములోఁ దత్త్వము వెడలిపోయినపిమ్మట వాస్తవ ములో స్వయముగ నీవు (త్వం) అనునదియే మిగులును. ఈవిధముగ నన్యభావము గలిగినపిమ్మట సులభముగనే సార్థకత్వము గలుగును 26. విచారింపక చేయునదంతయును వ్యర్థమగును. కావున మొట్టమొదటనే విచారింప నారంభింపవలయును. 27. విచారమును జేయువాఁడే పురుషుఁడు. విచారమును గావింపనివాఁడు పశుప్రాయుడు. ఈవిధమగు భగవద్వచనము లన్ని గ్రంథములయందును గనిపించుచున్నవి 28. సిద్ధాంతమును నిశ్చి

తము గాపించుటకుఁ బూర్వపక్షము నెగురగొట్టవలసియున్నది. మఱియు నీ నిరూపణమువలననే సాధకులకు సత్యమగు జ్ఞానముమీఁద విశ్వాసము గలుగును 29. శ్రవణ, మనన, నిదిధ్యాస, ప్రతీతుల నొనరించుటవలన విశ్వాసము జనించును. మఱియుఁ బ్రత్యక్షానుభవము గలుగుటయందుఁ బ్రయాసముండదు 30.



## పదియవ సమాసము — నిశ్చలము - చంచలము

బ్రహ్మము ఆకాశమునకు సమానము. అది మిగుల గొప్పదియు, ఉన్నతమును, విస్తీర్ణమును, నిర్గుణమును, నిర్మలమును, నిశ్చలమును, సర్వకాలప్రకాశితము నైయున్నది 1. దానిని పరమాత్మయందురు. ఇంకను దానికెన్ని పేరులుగలవో సమగ్రముగా నెవరెఱుంగుదురు? అది యాద్యంతములయందొకరీతిగానే యున్నది 2. అది యనంతరూపముతో నన్ని యెడలను సఘనముగా వ్యాపించియున్నది. మఱియు నిరాభాసముగా నున్నది 3. పాతాళమునఁగాని అంతరాళమునఁగాని నలుదిక్కులఁగాని మఱియెచ్చటఁగాని దాని కంతము లేదు. కల్పాంతకాలమునందును సర్వ కాలములయందును నది సంచితముగనే యున్నది 4. ఒక్కటియగు నా యచంచల మిట్టిది. ఆయచంచలమునందు భాసించు చంచలమునకు సైతము పెక్కునామములు గలవు. అది త్రివిధముగా నున్నది 5. చూడకయే పేరులుబెట్టుటయు గురుతులు దెలుపుటయు నొక చిత్రవిషయము. దాని నెఱుంగుట కట్లు చేయక తప్పదు 6. మూలమాయ, మూలప్రకృతి, మూలపురుషుఁడు, శివుడు, శక్తి మున్నగుపేరులు దాని కెన్ని యోగలవు 7. కాని యేపేరు దేనికిఁ బెట్టఁబడినదో దానిని మొదట గుర్తెఱుఁగ వలయును. ప్రతీతిలేని కల్పనమేల చేయవలయును? 8. స్వరూపము నెఱుంగక నామముపై నాధారపడి క్రిందుమీఁదు కారాదు. ప్రతీతిలేని కేవలానుమానజ్ఞానమువలన భీభత్సమగును 9. నిశ్చలమగు గగనమందుఁ జంచలమగు వాయువు మహోర్భటితోఁ బ్రవహించుచున్నది. కాని యా గగన సమీరములలో భేదమున్నది 10. అటులె పరబ్రహ్మము నిశ్చలముగ నున్నది. దానియందుఁ జంచలమగుమాయయొక్క భ్రమభాసించుచున్నది.

ఇపు డా భ్రమను వివరించెదను 11. గగనమునందు వాయువు నడచునట్లు నిశ్చలము (బ్రహ్మము) నందు స్ఫూర్తిలక్షణరూపియగు ఇచ్ఛకు (మాయకు) స్ఫురణరూపముతో జలనము గలుగుచున్నది 12. బ్రహ్మము యొక్క అహంత్వమువలనఁ జేతనము కలుగుచున్నది. అదియే మూల ప్రకృతి యనఁబడుచున్నది. మఱియు దానివలననే ఈబ్రహ్మాండపు మహా కారణకాయము రచింపఁబడెను. 13. స్థూలసూక్ష్మకారణమహాకారణ ములను నీనాలుగుదేహము లెట్లు పిండమునకుఁగలవో యట్లే విరాట్టు, హిరణ్యగర్భము,అవ్యాకృతము, మూలప్రకృతియను నీనాలుగు దేహములు బ్రహ్మాండమునకుఁగలవు 14. ఈపంచీకరణము శాస్త్రసమ్మతమైనది. విరాట్ హిరణ్యగర్భావ్యాకృతమూలమాయలను ఈశ్వర తనుచతుష్టయమని చెప్పెదరు. ఇందువలననే చేతనమునకుఁబైన మూలమాయ యని చెప్పఁ బడెను 15. పరమాత్ముఁడు,పరేశుఁడు, పరమేశ్వరుఁడు, జ్ఞానఘనుఁడు, ఈశ్వ రుఁడు, జగదీశుఁడు, జగదాత్ముఁడు, జగదీశ్వరుఁడు మున్నగునవి పురుష నామములు 16. దానిని సత్తారూపము, జ్ఞానరూపము, ప్రకాశరూపము, జ్యోతిరూపము, కారణరూపము, చిద్రూపము, శుద్ధము, సూక్ష్మము, అలిప్తము అని చెప్పుదురు 17. కాని ఆత్మ, పరమాత్మ, విశ్వాత్మ, ద్రష్ట, సాక్షి, సర్వాత్మ, క్షేత్రజ్ఞుఁడు, శివాత్మ, జీవాత్మ, దేహి, కూటస్థ మని నుడువుదురు 18. దానిని ఇంద్రాత్మ, బ్రహ్మాత్మ, హరిహరాత్మ, యమాత్మ, ధర్మాత్మ, నైరృత్యాత్మ, వరుణవాయుకుబేరాత్మ, మఱియు ఋషిదేవముని ధర్మాత్మ యని చెప్పుదురు 19. గణ గంధర్వ విద్యాధర యక్ష కిన్నర నారద తుంబురాదు లందఱకు నేది యాత్మయో దానిని సర్వాత్మయందురు 20. చంద్రుఁడు, సూర్యుఁడు, తారామండలము, భూమండలము, మేఘమండలము, ఇరువదియొక్క స్వర్గములు, సప్త పాతాళములు మున్నగువాని యన్నింటి వ్యాపారము ఆయంతరాత్మయే నడుపుచున్నది 21. ఆ గుప్తవల్లిక నలుదెసల వ్యాప్తినొందియున్నది. దాని పురుషనామముల నిదివరకుఁ బేర్కొంటిని. ఇఁక శ్రోతలు దాని స్త్రీ నామముల నాకర్ణింపనగును 22. దానిని మూలమాయ, జగదీశ్వరి, పరమవిద్య, పరమేశ్వరి, విశ్వవంద్య, విశ్వేశ్వరి, త్రైలోక్యజనని యని యందురు 23. దానిని అంతశ్చైతువు, అంతర్కళ, మాన్యగర్భముచేతన

శక్తి, చపల, జగజ్జ్యోతి, జీవనకళ, పర, పశ్యంతి, మధ్యమ యని యందురు 24. అది యుక్తి, బుద్ధి, మతి, ధారణ, సావధానత, నానా విచారములు భూతభవిష్య ద్వర్తమానములు మున్నగువానిని ప్రకట పఱచి చూపుచున్నది 25. అది జాగ్రత, స్వప్నము, సుషుప్తి, తుర్యము, తటస్థము మొదలగు నవస్థల మానావమానములను అన్నింటిని గ్రహించుచున్నది 26. అది పరమకఠినమును, కృపాళువును నై యున్నది అది పరమకోమలమును, స్నేహాళువును నై యున్నది. అటులే యది పరమక్రోధియు, మితిలేని ప్రేమతోఁ బ్రేమించునదియు నై యున్నది 27. శాంతి, క్షమ, విరక్తి, భక్తి, అధ్యాత్మవిద్య, సాయుజ్యముక్తి, వివేకము, సహజస్థితి దానిమూలముననే మనుజులకుఁ బ్రాప్తించుచున్నది 28. మొదటఁ బురుషనామములను, ఆ పిమ్మట స్త్రీ నామములు నిరూపించితిని. ఇప్పు డాచంచలమునకుఁగల నపుంసకనామముల నాలింపుఁడు 29. ఎఱుఁగుట, అంతఃకరణము, చిత్తము, శ్రవణము,మననము, చైతన్యము, జీవితము, వచ్చుట, పోవుట మున్నగునని సుచిత్తుఁడై చూడవలయును 30. దానిని అహంత్వము, త్వంత్వము (నీవు నేను అనునవి), ఎఱుక, జ్ఞాతృత్వము, సర్వజ్ఞత్వము, జీవత్వము, శివత్వము, ఈశ్వరత్వము, అలిప్తత్వము అని చెప్పుదురు 31.

ఇట్టి నామము లెన్నియో గలవు. కాని యా జగజ్జ్యోతియున్న దొక్కటియే. ఆ సర్వాంతరాత్మను విచారవంతులగువారలే యెఱుంగుదురు 32. ఆత్మ, జగజ్జ్యోతి, సర్వజ్ఞత్వము అను నీ మూడింటిని నొక్కటి యనియే తెలిసికొనవలయును. దానినే అంతఃకరణము లేక జ్ఞప్తియని నిశ్చయపూర్వకముగా నెఱుంగవలయును 33. పదార్థములయొక్కయుఁ బురుష స్త్రీ నపుంసకములయొక్కయు నామములే లెక్కకుమించియున్నవి. ఈ స్థితిలో సృష్టిరచననామముల నెంతదనుకఁ జెప్పఁగలను ? 34. అన్నిటిని నడుపునది అది యొక్కటియే. ఆ యంతరాత్మ అనంతబ్రహ్మాండముల వ్యాపారమును నడుపుచున్నది. చీమ మొదలుకొని బ్రహ్మ,విష్ణు, మహేశ్వరులదనుకఁ గల సమస్తమును దానిమూలముననే వర్తించుచున్నవి 35. ఆ యంతరాత్మ నిచ్చట నీ స్వల్పవివరణమువలననే తెలిసికొనవలయును. నానాప్రకారములగు చిత్తములు (వినోదములు) అన్నియు దానియందే

యున్నవి 36. అది తెలిసికొనదగినదేగాని కన్పించునదికాదు. దానివిషయమున నమ్మకము గలుగుచున్నది గాని గోచరించుటలేదు. అది శరీరమునందున్నదిగాని యొక్కచోటునఁ గూర్చుండియుండదు 37. అది తీక్ష్ణభావముతో ఆకాశమునందు నిండిపోవుచున్నది. సరోవరమును గాంచఁగనే పూర్ణమగుచున్నది. మఱియుఁ బదార్థమును జూడఁగనే నలుదెసల వ్యాప్తమగుచున్నది 38. ఏ విధముగఁ బదార్థము గాన్పించుచున్నదో యావిధముగ నదియగుచున్నది. మఱియుఁ జంచలత్వమునందది వాయువునకంటె నధికమైనది 39. అది యనేక దృష్టులతోఁ జూచుచున్నది. పెక్కు నాలుకలతోఁ జవి జూచుచున్నది.అనేక మనస్సులతోఁ బరికించుచున్నది 40. చెవిలోఁగూర్చుండి శబ్దము నాలించుచున్నది. ఘ్రాణేంద్రియ సహాయమున వాసన మూర్కొనుచున్నది. చర్మముతో శీతోష్ణాదులను గ్రహించుచున్నది 41. ఇట్లే యది యందఱి మనస్సులలోని మాటలను (భావములను) గ్రహించుచున్నది. అది యన్నింటియందున్నది. అన్నింటికి వేఱుగ నొక్కటియైయున్నది. దాని యగాధలీలల నదియే యెఱుంగును 42. అది పురుషుఁడుకాఁడు. స్త్రీ కాదు. బాలకాదు. తరుణకాదు. కుమారి కాదు. అది నపుంసకమగు శరీరమును ధారణముచేయుచున్నది. కాని యది నపుంసకము నైతముగాదు 43. అది సమస్తదేహమును నడుపుచున్నది. చేసియును అకర్త యనిపించుకొనుచున్నది. అది క్షేత్రజ్ఞమును క్షేత్రవాసియు నైయున్నది. మఱియు దానిని దేహియనియుఁ గూటస్థమనియుఁ గూడ నుడువుదురు 44.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥

జగత్తులో క్షరము అక్షరము అని రెండువిధములగు పురుషులు గలరు. భూతములన్నింటిని క్షరమనియుఁ గూటస్థుని అక్షరమనియునుఁ జెప్పుదురు 45. ఉత్తమపురుషుఁ డింకను వేఱుగనున్నాఁడు. ఆతఁడు నిష్ప్రపంచుఁడును, నిష్కలంకుఁడును, నిరంజనుఁడును, పరమాత్ముఁడును, ఏకమును, నిర్వికారుఁడును నై యున్నాఁడు 46. సాధకులు నాలుగు దేహములను నిరసనముగావించి దేహాతీతులు గావలయును. దేహాతీతుని అనన్యభక్తునిగ నెఱుంగవలయును 47. దేహమాత్రము నిరసనమై పోయి

నంతన అంతరాత్మగూడ నెచ్చట శేషింపఁగలదు? నిర్వికారమునందు వికారమునకుఁ దావేలేదు* 48. నిశ్చలమైన దొకబ్రహ్మమే యనియుఁ జంచలమెంతగలదో యదియంతయు మాయికమనియు వివేకమువలన నిశ్చయమగు ప్రత్యయము గావింపవలయును 49. దీనియందు మిక్కిలి తలమునుకలు గొనఁబనిలేదు. ఏలయన, ఉన్నవిరెండే. ఒకటి చంచలము, మరియొకటి నిశ్చలము. ఈ రెంటిలో శాశ్వతమెద్ది? యను విషయము కేవలజ్ఞానముతో నెఱుంగవలయును 50. అసారమునువిడిచి సారమును గ్రహింపవలయునని సారాసారవిచారమునఁజెప్పఁబడెను. జ్ఞానులు నిరంతరమును నిత్యమెయ్యది, అనిత్యమెయ్యది యను సంశమును విచారింపుచుందురు 51. జ్ఞానము విజ్ఞానముగను, మనస్సు ఉన్మనముగను నగు ఆత్మయందుఁ జంచలత్వమెక్కడఁ గలుగఁగలదు? 52. చెప్పుటతో నేమియుఁ బనిలేదు. తన యనుభవమువలననే తత్త్వము నెఱుంగవలయును. అనుభవములేని వ్యర్థపరిశ్రమచేయుటయే పాపము 53. సత్యమునకు సమానమగు సుకృతము లేదు. అసత్యమునకు సమానమగు పాతకములేదు. మఱియుఁ బ్రతీతిలేని సమాధాన మెచ్చటనులేదు 54. సత్యమున కర్థము బ్రహ్మము. ఇదియే పుణ్యము. అసత్యమున కర్థము మాయ. ఇదియే పాపము. మాయరూపమగు పాపము నష్టమైనపిమ్మటఁ బుణ్యరూపమగు పరబ్రహ్మము శేషించియుండును. దానియం దనన్యమైనంతన తానుగూడ నామాతీతుఁడగును 55-56. మనము స్వతస్సిద్ధమగు వస్తువై యున్నారము. అచ్చట దేహసంబంధములేదు. ఇంతజరిగినపిమ్మటఁ బాపరాసులు స్వయముగ భస్మమగును 57. బ్రహ్మజ్ఞానము దప్ప ఇతరసాధనము లెన్నింటిని గావించినను వ్యర్థపరిశ్రమ యగును. నానాపాపము లెట్లు అడంగిపోఁగలవు? 58. ఈ శరీరము పాపముతో (దృశ్యము లేక మాయతో) నిర్మింపఁబడినది. మఱియు ముందుసైతము (మాయను సత్యమని విశ్వ

* ఈ పద్యములోని అంతరాత్మయను శబ్దప్రయోగము దేహసంబంధముతో చేయఁబడెను గావున దేహమే నిరసనమై పోయినపుడు అనంతర మంతరాత్మ యెక్కడ మిగులును? బ్రహ్మస్వరూపము నిర్వికారము; దానియందు వికారము లేదు. అంతరాత్మ యను శబ్దప్రయోగము దేహోపాధిరోగమువలన నైనది. ఆ యుపాధి బ్రహ్మమునందు లేదు.

సించుకతన) పాపములే ప్రోవగుచున్నవి. లోపల రోగమున్నపుడు పయి పయి యుపచారమువలన నేమియగును ? 59. అనేక క్షేత్రములలోఁ దలలు గొరిగించుకొనుచున్నారము. అనేక తీర్థములలో దేహమునకు దండనము లొసంగుచున్నారము. స్థలస్థలమున నానావిధములగు విగ్రహములతో దేహమును ఖండించుచున్నారము. బహువిధములగు వృత్తి కలతో నీ దేహమును గసగస తోముచున్నారము. తప్తముగావింపఁబడిన ముద్రలతో నీ దేహమునిండ వాతలను వేయుచున్నారము. ఈ విధముగా బైపైని దేహమున కెన్నిశ్రమలు కలుగఁజేసినను గొంచెమేని శుద్ధినొంద గలదా? 60_61. ఎన్ని పేడముద్దలను మ్రింగినను, గోమూత్రధార యెంత గ్రోలినను, రుద్రాక్షలు కాష్టమణిమాలలు మెడలో నెన్ని ధరించినను బాహ్యాడంబరము లీవిధముగా నెన్ని యొనరించినను లోపలఁ బాపమునిండి యున్నచో దానిని దూరపఱచుట కాత్మజ్ఞానమే కావలయును 62_63. బహువిధములగు వ్రతదానయోగతీర్థాటనాదు లన్నింటికంటె ఆత్మజ్ఞాన మహిమ కోటిరెట్లధికము 64. ఆత్మజ్ఞానమునుగూర్చి యోచించు పురుషుని పుణ్యమునకు మేరయే లేదు. దుష్టమగు పాపబాధ లట్టి పురుషుని నంటఁజాలవు 65. వేదశాస్త్రములయందుఁ జెప్పఁబడిన సత్యస్వరూపమే (ఆత్మవిచారులగు) జ్ఞానులకుఁగూడ గల రూపము. అట్టివారల అనుపమ పుణ్యాత్ములనియు, మేరలేని సుకృతులనియు నెఱుంగనగును 66. ఇవి యనుభవవాక్యములు. ఆత్మదృష్టితో జను లనుభవము గడింపవలయును. అనుభవముతో భిన్నులై కష్టాత్ములు కాఁజనదు 67. ఓ యనుభవ నీయులారా! అనుభవము లేనిదంతయు శోకము. కావున మీరలు రఘునాథుని కృపవలన నిశ్చయాత్మికమగు అనుభవము గలవారలై యుండుఁడు 68.



# పదునొకండవ దశకము.

## మొదటి సమాసము – సిద్ధాంత నిరూపణము.

ఆకాశమునుండి వాయువు జనించినవిధము మనకుఁ దెలియుచునే యున్నది. వాయువునుండి యగ్ని యెట్లుత్పత్తియయ్యెనో శ్రోతలు సావధానులరై యాలింపగోరెదను 1. వాయువువలని కఠినమగు రాపిడివలన అగ్నియును, శీతలమును మందమును నగు వాయువువలన ఉదకమును ఉత్పన్నము లగుచున్నవి 2. ఉదకమువలన నానావిధ బీజరూపమగు నీపృథ్వి కలుగుచున్నది. బీజములనుండి యుత్పత్తికలుగుట స్వాభావికమే కదా 3. ఆదినుండియే సృష్టికల్పనామయము. కల్పనము మూలమాయకుఁ జెందినది. అట్లే దానివలననే (త్రిగుణాత్మికమగు) ముమ్మూర్తు లుదయించిరి 4. నిశ్చలము (పరబ్రహ్మము)నందున్న చంచలము (మూలమాయ) కేవలము కల్పనమే. అదియే అష్టవిధప్రకృతికి మూలము 5. అనఁగా కల్పనమే అష్టధాప్రకృతి. అష్టధాప్రకృతియే కల్పనము. అష్టధాప్రకృతి మూలమాయనుండి ఉత్పన్నమయ్యెను 6. పంచభూతములు, త్రిగుణములుగలసి ఎనిమిదియయ్యెను. ఇందువలననే దీనిని అష్టధాప్రకృతి యని యందురు 7. అష్టధాప్రకృతి ఆదియందు కల్పనరూపముతో నుండును. తరువాత నదియే విస్తృతమై సృష్టిరూపమునందు స్థూలత్వము నొందుచున్నది 8. మూలమునందున్నదే మూలమాయ. దానివలనఁ ద్రిగుణములను గలిగించినది గుణమాయ. దానివలన సృష్టిరూపమునకుఁ గలిగెడి స్థూలత్వమే అవిద్యామాయ 9. దానివలననే ఖాణీల (జరాయుజములు, ఉద్భిజ్జములు, అండజములు, స్వేదజములు అను) నాలుగు (సృష్టి) గనులును, (పరా పశ్యంతి మధ్యమా వైఖరులను) నాలుగు వాణులును, అనేక యోనులును, అనంతవ్యక్తులును ప్రకటనములై విస్తృతము లగుచున్నవి 10.

ఈ విధముగ నుత్పత్తి యగుచున్నది. సంహార క్రమమునంతయు వెనుకటిదశకమునఁ జెప్పితినిగదా 11. ఐనను మఱల నిచట సంక్షేపరూపముగాఁ జెప్పెదను. ధ్యానముతోసంగి యాలింపుము 12. శాస్త్రము లందుఁ గల్పాంతవర్ణన మీవిధముగానున్నది. నూఱుసంవత్సరములు వర్షములు కురియవు. అందుచే సమస్త జీవసృష్టియు నశించును 13. పండ్రెండుకళలతో సూర్యుఁడు లోకమును మాడ్చివేయును. దానిచే భూమండలమంతయు బూడిదయైపోవును. తరువాత నాబూడిదయంతయు నీటిలోఁ గరగిపోవును 14. అనంతర మాజలమునుగూడ అగ్ని శోషింపఁ జేయును. అగ్నిని వాయువు హరించును. తరువాత తనంతన వాయువుగూడ నదృశ్యమగును. నిరాకారమెచ్చటి దచ్చటనే యుండిపోవును 15. ఈ విధముగా సృష్టి సంహారమగును. ఈ సంహార క్రమమునంతయు నింతకుమున్ను విస్తారముగ వివరించితిని. మాయయంతయు నీ విధముగా నిరసనమైనపిమ్మట నిరాకార స్వరూపస్థితి శేషించును 16. అప్పుడచట జీవశివులు, పిండబ్రహ్మాండములు మొదలగువానినిగూర్చిన వితర్కములు నశించును. మఱియు నవిద్యామాయవలని సంపూర్ణ కోలాహలమంతయు నాశనమైపోవును 17.

ఈ ప్రళయమును వివేకముతోఁగూడఁ జేయవచ్చును. దానిని వివేకప్రళయమందురు. వివేకవంతులే వివేకప్రళయము నెఱుంగుదురు. పాపము మూర్ఖు లేమి యెఱుంగుదురు? 18. సృష్టినంతను బరిశోధనము గావించినపిదప ఒకటి చంచలమనియు, నొకటి నిశ్చలమనియు విదిత మగును. చంచలమునకుఁ గర్త చంచలరూపముగనే యుండును 19. సకల శరీరములందు వర్తించునదియు, అన్ని కర్తృత్వములయందుఁ బ్రవృత్తమగు నదియు, చేసియు అకర్త యనబడునదియు 20, దరిద్రుఁడు మొదలుకొని రాజువఱకును బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవులదనుకను అన్నింటియందును సమానముగ వర్తించునదియు, ఇంద్రియముల తోడ్పాటుతో శరీరముల వ్యాపారములు నడుపునదియుఁ బరమాత్మయని లోకులు చెప్పుచున్నారు. పరమాత్మను సర్వకర్తయని భావించుచున్నారు. ఆ పరమాత్మకు సైతము నాశనము కలుగుచున్నది. వివేకముతో దీనిని బ్రతీతి గావింపవలయును 21-22. పరమాత్మ కుక్కయందుండి మొఱుగుచున్నది. సూక

రమునందుండి ఘుర్ఘురమనుచున్నది. గాడిదయందుండి బిగ్గరగా నోండ్ర పెట్టుచున్నది 23. సాధారణజనుల ధ్యానము కేవలముగ నానావిధ శరీర ములపై మాత్రమే యుండును. వివేకవంతులు ఈ శరీరములలోపలి వస్తువునుజూతురు. అనఁగా నిట్టి పండితులు సమదర్శనులుగా నుందురు 24.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః॥

పైపై జూచుటకు దేహములు వేఱువేఱుగా నున్నను అన్నింటి లోపలను నున్నది యొక్కవస్తువే యని తలఁచి సమదర్శనులగు వివేకులు ప్రాణిమాత్రులనెల్ల సమానభావముతోఁ జూచుచుందురు 25. చూచు టకుఁ బ్రాణిసముదాయము అనంతప్రాణులుగాఁ గనిపించుచున్నను సత్య మున కివి యన్నియు నొక్క శక్తివలననే వర్తించుచున్నవి. ఆ శక్తి జగజ్జ్యోతి లేక సంజ్ఞాశక్తి యైయున్నది 26. ఈ జ్యోతి (శక్తి) చెవియం దుండి బహువిధములుగ శబ్దజ్ఞానమును కలిగించుచున్నది. త్వక్కునందుండి శీతోష్ణముల నెఱుంగఁ దోడ్పడుచున్నది. కనులయందుండి వస్తుసము దాయమును జూచు జ్ఞానమును గలుగఁజేయుచున్నది 27. అటులే నాలుకయందుండి రుచిని, ఘ్రాణమునందుండి గంధమును, కర్మేంద్రియము నందుండి నానావిధ విషయ సౌఖ్యములను గ్రహించుచున్నది 28. ఈ విధముగాఁ బరమాత్మ సూక్ష్మరూపముతో అంతరమునందుండి స్థూల మును రక్షించుచున్నది. అంతియగాక నానావిధసుఖదుఃఖములను దెలిసి కొనుచున్నది. కావుననే దానిని అంతస్సాక్షియనియు, అంతరాత్మయని యుఁగూడఁ బిలుచుచున్నారు 29. దానినే ఆత్మ, అంతరాత్మ, విశ్వాత్మ, చైతన్యము, సర్వాత్మ, సూక్ష్మాత్మ, జీవాత్మ, శివాత్మ, పరమాత్మ, ద్రష్ట, సాక్షి, సత్తారూపి యందురు 30. ఈ వికారియే (అంతరాత్మయే) వికారము (దృశ్యసృష్టి) నందుండి అఖండరీతిగా నానావిధవికారములను గావించుచుండును. దీనినే మూర్ఖులు పరబ్రహ్మమని నుడువుదురు 31. అన్నింటిని (చంచలమును నిశ్చలమును) సమానముగా భావించుట అంత యును మిశ్రితము గావించుట యను నీ మాయికస్థితికి అచంచలమగు అవిద్యామాయమాత్రమె కారణమైయున్నది 32. కాని వాస్తవములో

జంచలము, మిథ్యయునగు మాయ వేఱుగా నున్నది. అచలమును శాశ్వత ము నగు పరబ్రహ్మము వేఱుగా నున్నది. దాని నెఱుంగుటకొఱకే నిత్యానిత్యవివేకముయొక్క ఆవశ్యకము గలుగుచున్నది 33. అట్లే బ్రహ్మముతో నైక్యము నొందినజీవుఁడు బ్రహ్మాంశము. అట్టి జీవునిపట్ల పిండబ్రహ్మాండములు రెండును నిరసన మగుచున్నవి. ఇవియే చతుర్జీవులు 34_35.

ఈ కనుపించునదియెల్లఁ జంచలము. చంచలమంతయు నశ్వరము. నిశ్చలమంతయు ఆద్యంతములయందుఁగూడ నిశ్చలమే 36. ఆ వస్తువు (బ్రహ్మము) ఆదిమధ్యాంతములయందు సమానముగా నుండునది. మఱియు నది నిర్వికారియు, నిర్గుణియు, నిరంజనమును, నిస్సంగమును, నిష్ప్రపంచమునై యున్నది 37. ఉపాధి నిరసనమైనపిదప జీవశివుల కైక్యత గల్గిపోవును. కాని విచారించిచూచితిమేని ఉపాధియనున దేమియును లేదు 38. తెలిసికొనఁదగినది జ్ఞానము. కాని పరబ్రహ్మమునందు అనన్యమైపోయినపిమ్మట ఈజ్ఞానము విజ్ఞానమైపోవును. మనస్సు ఉన్మనమైపోవును. ఆ యున్మనీయ దశను మనస్సుతో నెట్లు గుర్తింపఁగలము ? 39. వృత్తికి నివృత్తిస్థితి దెలియదు. గుణమునకు నిర్గుణప్రాప్తి యెట్లు కాఁగలదు ? సాధకుఁడు వివేకముతో గుణాతీతుఁడై సత్స్వరూపమును బడయును 40. శ్రవణముకంటె మననము శ్రేష్ఠమైనది. ఏలయన, మననమువలన సారాసారము విదితమగును. ఆపిమ్మట నిదిధ్యాసమువలన నిస్సంగమగు వస్తువు సాక్షాత్కారమగును 41. నిర్గుణమునం దనన్యతగలుగుటయే సాయుజ్యముక్తి. అచట (సాయుజ్యముక్తియందు) లక్ష్యాంశవాచ్యాంశములు రెండును సమాప్తి యగుచున్నవి 42. అలక్ష్యమునందు లక్ష్యము లీనమగును. సిద్ధాంతమునందుఁ బూర్వపక్షము లయమగును. మఱియు అప్రత్యక్షము (దృశ్యము) ఉండియును గూడ లేకుండును 43. అనఁగా మాయికమగు నుపాధి యుండఁగనే స్వరూపాకారవృత్తియగుట సహజసమాధి యందురు. శ్రవణమువలన నిశ్చయబుద్ధిని బెంపొందింపవలయును 44.

## రెండవసమాసము — సృష్టిక్రమము.

ఒకటి నిశ్చలమైనది, ఒకటి చంచలమైనది. చంచలమునం దెల్లరును జిక్కియున్నారు. నిశ్చలము యథావిధముగ నిశ్చలముగనే యున్నది 1. నిశ్చలమును వివేకించువాఁడు లక్షలకోలఁది మనుజులలో నొక్కఁ డుండును. నిశ్చలముతో సమానమగు నిశ్చయాత్మకుఁడె నిశ్చలుఁడు 2. నిశ్చలమునకు సంబంధించినమాటలను జెప్పుచుఁ జంచలమువైపునకై పరుగెత్తుచుండువారలు పలువురు గలరు. చంచలచక్రమునుండి విడివడి పోవువారలు మిగుల నరుదుగా నున్నారు 3. చంచలమునందుఁ జంచలము జనించుచున్నది. చంచలమునందె పెరుగుచున్నది. బ్రతికినంతకాలమును చంచలమే ప్రతిబింబించును 4. పృథ్వియంతయుఁ జంచలమువైపునకె పోవుచున్నది. చేయవలసినదంతయుఁ బెట్టవలసినదంతయుఁ జంచలమునందె జరుగుచున్నది. చంచలమునువిడిచి నిశ్చలమువైపునకు మొగ్గెడివాఁ డెవఁడు? 5. చంచల మేమాత్రమును నిశ్చలము కాఁజాలదు. నిశ్చల మెప్పుడును జంచలము కాఁజాలదు. ఈవిషయము నిత్యానిత్యవిచారణము వలన జనులకుఁ గొంతకొంత బోధయగును 6. కొంచెముగఁ దెలిసికొనుట వలన నిశ్చయము గాదు. మఱియు సందేహ మటులే నిలిచియుండును 7. కాని సంశయము, అనుమానము, భ్రమ మున్నగువానివలనఁ గలుగు ఆపత్తు చంచలమునందుమాత్రమే యుండును. నిశ్చలమునం దెప్పుడు నుం డదు. దీనిమర్మమును గ్రహింపవలయును 8. చంచలాకార మంతయు మాయ. మాయికమగున దంతయు లయమగును. ఇట్లు లయమగునవి చిన్నవి పెద్దవి యని చెప్పవలసిన యావశ్యకములేదు 9. సమస్తమునందును మాయ వ్యాపించియున్నది. అష్టధా ప్రకృతి విస్తృతమైయున్నది. మఱియు నానావిధరూపములతోఁ జిత్రవిచిత్ర వికారములు కనుపించు చున్నవి 10. నానావిధములగు నుత్పత్తివికారములు, పలుతెఱంగులనున్న చిన్నపెద్దప్రాణులు, నానావిధపదార్థములు మున్నగునవియెల్ల మాయ యొక్క క్రీడలు 11. వికారవంతమగు నీమాయ వికృతియై సూక్ష్మము నుండి స్థూల మగుచున్నది. మఱియు నమర్యాదితరీతిగ నొకటికి వేఱొక టియై కాన్పించుచున్నది 12.

మఱిల నానావిధములగు శరీరములు నిర్మింపఁబడుచున్నవి. అనంత నామములు పెట్టఁబడుచున్నవి. భిన్న భిన్న భాషల ననుసరించి యందుఁ గొన్నికొన్ని తెలియుచుండును 13. తరువాత నానావిధములగు వాడుకలు, రీతులు, జనరూఢులు ప్రచలితము లగును. నానావిధములగు నాచారము లేర్పడును. వాని ననుసరించి జనులందఱును ప్రవర్తింతురు 14. అష్టధా ప్రకృతికిఁ బెద్దవియుఁ జిన్నవియునగు శరీరములు నిర్మాణమగుచుండును. పిమ్మట ప్రజలు తమతమ మనస్సు ననుసరించి వర్తించుచుందురు 15. నానా మతములు నిర్మాణమగును. అనేకవిధములగు పాషండమతములు వ్యాపించును. బహువిధములగు కోలాహలములు చెలరేగును 16. జనరూఢి ననుసరించి ప్రజలు ప్రవర్తింతురు. ఎవఁ డెవని నాటంకపఱుపఁగలఁడు? జనులలో నేకత్వము లేకున్నది 17. భూమండలమునందంతటను గల్లోలము వ్యాపించియున్నది. ఒకనికంటె నొకఁడు పెద్దయైయున్నాఁడు. ఎవనిది సత్యమో యెవనిది అసత్యమో యెవ్వఁడెఱుంగును? 18. దురాచారములు విశేషించి వ్యాపించియున్నవి. ఎందఱెందఱో ఉదరపోషణమునఁ దన్మయులై చనిపోవుచున్నారు. ఎందఱెందఱో అభిమానగ్రస్తులై యాడంబరములకుఁ బాలగుచున్నారు 19. దేవత లగణితములైనవి. ఆ దేవతల యార్భాటములు మిగుల విజృంభించియున్నవి. దేవతలు, భూతములు గావించు మోసములుగూడ మిక్కుటమైనవి 20. ముఖ్యదైవతము నెఱుంగుటలేదు. ఒకనికి మఱియొకనితో నైక్యము కుదురుటలేదు. ఒకని కింకొకఁడు లొంగియుండుట లేదు. ఎవరికి వారుగ నందఱును స్వచ్ఛందు లగుచున్నారు 21. విచారమంతయు నీవిధముగ నష్టమైనది. సారాసార విచారము గావించువాఁడే లేఁడు. ఎక్కడిపెద్ద? ఎక్కడిచిన్న? ఏమాత్రము గోచరించుటయేలేదు 22. శాస్త్రముల విక్రయవీథి సాగినది. దేవతల గోల యెక్కువయైనది. జనులు సకామ్యవ్రతములయెడ నాసక్తి గలవారలై ప్రాణముల విడుచుచున్నారు 23. ఈ విధముగా సత్యధర్మమంతయు నాశనమగుచున్నది. సత్యాసత్యముల జాడపోడలే కనుపించుటలేదు. నలుదెసల పరస్పర విరుద్ధవర్తనము లతిశయించుచున్నవి 24. మతమతాంతరుల కలహములు పెచ్చు పెరుగుచున్నవి. ఒకనిని మఱియొకఁ డడుగనేయడుగఁడు. ఎవ్వఁ డేమతమునందుఁ బడిపోయిన వానికదియే సర్వోత్తమ

మైనదిగఁ దోఁచుచున్నది 25. అసత్యము నభిమానించు జనులు పతన మొందుచున్నారు. ఇందువలననే జ్ఞాతలగువారలు సత్యమును శోధించుచున్నారు 26. జనుల ప్రవర్తనమంతయు జ్ఞాతలగువారికిఁ గరతలామలకముగ నున్నది. కావున వివేకులగు జనులారా! వినుఁడు 27. జనులే మార్గమున నడచుచున్నారో ఏ దేవతను భజించుచున్నారో తెలిపెదను. ప్రత్యక్షానుభవమగు నీయంశమును సావధానులరై వినుండు 28.

మన్ను, రాయి, ఇతరధాతువులు సమకూర్చిచేసిన విగ్రహములను దేవతలనినమ్మి పలువురు వానినే పూజించుచున్నారు 29. కొందఱు దేవతల యవతారకథల నాలకించుచున్నారు. అంతఁబోక యవతారములను గూర్చి ధ్యానము, జపము, పూజ గావించుచున్నారు 30. కొందఱు అందఱి యంతరాత్మను విశ్వమునందు వర్తించు విశ్వాత్మను ద్రష్టను జ్ఞానాత్మను (సాక్షిని) విశ్వసించుచున్నారు 31. కొందఱు నిర్మలులుగ, నిశ్చలులుగ నున్నారు. ఎప్పుడును జంచలత్వమొందుటయేలేదు. మఱియు ననన్యభావముతో స్వయముగఁ గొందఱు కేవల వస్తురూప మగుచున్నారు 32. ఈ సృష్టియందు నాలుగువిధముల దేవతలున్నవి. మొదటిది నానావిధప్రతిమలు. రెండవది అవతారములు. మూఁడవది అంతరాత్మ. నాలుగవది నిర్వికారము. ఈ నాలుగింటియందుదక్క నితరమునందు జనులకు భావన లేదు 33-34. కొందఱు సర్వము నొక్కటియేయని నమ్ముచున్నారు. అంతియెగాక పరమేశ్వరుని సాక్షియని చెప్పుచున్నారు. పరమేశ్వరుని సాక్షియనుటకుఁ బ్రధానకారణమగు అష్టధాప్రకృతినిగూడఁ గుర్తెఱుంగవలయును 35. ప్రకృతికి సాక్షియగు పరమేశ్వరుఁడు ఆ ప్రకృతి స్వభావమే! కాని భావాతీతుఁడగు నా పరబ్రహ్మమును వివేకముతో నెఱుంగవలయును36. నిర్మలమును ధ్యానించువాఁడు నిర్మలుఁడేయగును. ఇంతయేల, ఎవఁ డెద్దానిని భజించునో వాఁ డారూపమునందే లీనమగును 37. నీటిని, పాలను వేఱువేఱు గావించునవి రాజహంసలు. అట్లే సారమును అసారము నెఱింగినవారలు మహానుభావులు 38. ఓరీ! చంచలమును (మాయను) ధ్యానించువాఁడు స్వాభావికముగనే నాశనమగును. నిశ్చలమును (బ్రహ్మమును) భజియించువాఁడు నిశ్చలుఁడుగనే యుండును 39. ప్రకృతి ననుసరించి వర్తింపవలయును. కాని అంతఃకర

ణమునందు శాశ్వతమును గుర్తెఱుంగవలయును. మఱియు సత్త్వస్వరూపులై సాధారణజనులవలెఁ బ్రవర్తింపవలయును 40.

---

## మూఁడవ సమాసము — సాంసారికోపదేశము.

మనుష్యశరీరము బహుజన్మము లెత్తినమీఁదట లభించును గావున దీనిని బడసినందులకు నీతిని, న్యాయమును విడువక సత్యముగఁ బ్రవర్తింపవలయును 1. ప్రపంచమును (సాంసారిక కార్యములను) నియమపూర్వకముగ నిర్వహింపవలయును. దీనివలన ఇహపరములు రెంటియందును సౌఖ్యము గలుగును 2. మానవుని ఆయువునకు నియతి నూఱువత్సరములు. అందు బాల్యావస్థ అజ్ఞానముతోడను, యౌవనావస్థ సంపూర్ణ విషయసుఖములతోడను గడచిపోవుచున్నది 3. వృద్ధావస్థయందు నానా రోగములను, కర్మభోగములను ననుభవింపవలసి యుండును. ఇఁక భగవంతునిభజన మెప్పుడు గావింపనగును ? 4. రాజకీయములు, దైవికోద్వేగములు నగు చింతలయందో, అన్నవస్త్ర శరీరరక్షణములయందో ఇట్టివియు నింక నితరములు నగు నిర్బంధములయందో దగుల్కొనియున్న సమయమునం దాకస్మికముగా మృత్యువేతెంచును 5. జనులు మరణించుచుందురు. ఇది ప్రత్యక్షమేగదా! పలువురు పేరొందినవారలు గతించిరి. ఇది మనమెఱింగిన యంశము. నీ విదియంతయుఁగాంచి నిశ్చయముగ నేమి గావింపగలిగితివి? 6. ఇంటియందుఁ జిచ్చు దగుల్కొనియున్నది. గృహయజమాని సావకాశముగ నిదురబోవుచున్నాఁడు. ఇట్టి యాత్మహంతకు నెవఁడేని మంచివాఁడని యనునా ? 7. పుణ్యమార్గమంతయు వ్యర్థమైనది. పాపసంగ్రహము మితిమీఱినది. యమయాతన మిగుల దుస్సహమైనది 8. కావున నిఁక నిట్లు వర్తింపఁదగదు. మిగులఁ గనిపెట్టి నడువవలయును. ఇహపరములను రెంటిని సాధింపవలయును 9. అలసత (సోమరితనము) యొక్క ఫలము ప్రత్యక్షముగఁ గనిపించుచున్నది. ఆవలింతతో నిదురవచ్చుచున్నది. సోమరిపోతులా నిదురనే సుఖమనితలంచి యువ్విళులూరుచున్నారు 10. ఉద్యోగము గావించుటవలన గష్టము కలుగును. కాని ముందుసౌఖ్యము లభించును. యత్నము గావించుటచే దినుట,

త్రావుట మున్నగు సకలసౌఖ్యములు సమకూరును. అలసతవలన ఉదాసీనత్వము, దరిద్రము కలుగును. ప్రయత్నము నిష్ఫలమగును. దౌర్భాగ్యమావరించుకొనును 11-12. కావున సోమరితనము లేకుండుటవలననే వైభవములు లభించుచున్నవి. అంతియగాక ఇహలోక పరలోకములలోఁ గూడ మనుజులకు సమాధానము కలుగును 13.

ఇపుడు చేయదగిన ప్రయత్నమేదియో దెలుపుదును. సావధానులరై వినుండు 14. ఉషఃకాలమున లేచి కొన్ని యుత్తమవచనములను వల్లింపవలయును. యథాశక్తిగఁ బరమాత్ముని స్మరింపవలయును 15. అనంతరము దానేకాంతప్రదేశమునకు మలవిసర్జనమున కేగవలయును. మఱియు నిర్మలమగు జలముతో శౌచాచమనములను జేయవలయును 16. ముఖమార్జనమును, ప్రాతఃకాలస్నానమును, సంధ్యాతర్పణ దేవతార్చనములను నొనరించి అగ్నిపూజనము, ఉపాసనము సాంగోపాంగముగా నొనర్పవలయును 17. పిదపఁ గొంచెము జలముద్రావి గృహకార్యములు నిర్వర్తింపవలయును. మధురభాషణములతో నెల్లరను దన కిష్టులుగాఁ జేసికొనవలయును 18. తన వ్యాపారములలో జాగ్రత్త గల్గియుండవలయును. దుశ్చిత్తుఁడుగనున్నచో దుష్టులు మోసగింతురు 19. దుశ్చిత్తతవలనను సోమరితనమువలనను మనుజుఁడు పొరఁబడుననియు, మోసగింపఁబడుననియు, మరచిపోవుననియు, హితమును విడుచుననియు, జ్ఞాపకమువచ్చినపుడు తడబడుననియు మన మెఱింగియేయున్నారము 20. కావున మనస్సును సావధానముగను, ఏకాగ్రతగను నుంచవలయును. అట్లు సావధానముగ నేకాగ్రతగ నుంచినపుడె తినుట, త్రాగుట మంచిదిగ స్ఫురించును 21. భోజనానంతర మేదేని కొంచెము చదువవలయును. చర్చింపవలయును. లేదా యేకాంతముననుండి నానావిధగ్రంథములను మననము గావింపవలయును 22. ఇటుల నొనరించుటవలననే మానవుఁడు నేర్పరియగును. ఇటులఁజేయకున్న మూర్ఖుఁడుగ మారును. ఇట్టి మూర్ఖులున్నంతలోఁ దిని దీనరూపులై వ్యర్థముగా సంచరించుచుఁ బ్రొద్దు గడుపుదురు 23. భాగ్యవంతుని లక్షణములను నిఁక నాలకింపుఁడు. భాగ్యయుతులు దమ జీవితమున నొక క్షణమేని నిరర్థకముగాఁ గడుపరు. తన సంసారవ్యాపారములను మిగుల నేరుపుగ నెరవేర్చుచుందురు 24. భాగ్య

యుతుఁడు మొదట కొంత సంపాదించి నిలువఁజేసికొని యవసరమువెంట నుపయోగించుకొనును. దిగబడినజనుల నుద్ధరించును. తనదేహము నేదేని సత్కార్యములయందు మగ్నమొనర్చును 25. కొంత ధర్మచర్చ, పురాణము, హరికథ, అధ్యాత్మనిరూపణము మున్నగు సత్కార్యములు భాగ్యయుతుఁ డొనరించుచుండును. అంతియగాక ప్రపంచపరమార్థములను రెంటి నొకక్షణముగూడ వ్యర్థముగఁ బోనీయఁడు 26. అన్నివిధముల నీప్రకారముగనున్న సావధానికి దుఃఖ మెట్లు కలుగఁగలదు? వానియభిమానము వివేకములవలన నశించును 27. ఉన్నదంతయు నీశ్వరునిదే యని తెలిసికొని వర్తింపనగును. ఈ విధముగ మెలంగుటవలన ఉద్వేగము సమూలముగా నాశనమగును 28. ప్రపంచమునందు ధనమెట్లవసరమో యటులె పరమార్థమునందుఁ బంచీకరణము గావలయును. దీనితరువాత మహావాక్యముల వివరణ మొనరించుటవలన మోక్షము గలుగును 29. కర్మము, ఉపాసనము, జ్ఞానమువలన సమాధానము కలుగును. కావునఁ బరమార్థసాధనములను శ్రవణము గావింపవలయును 30.

---

## నాలుగవ సమాసము — సద్విచారము.

బ్రహ్మము నిరాకారము. అది యాకాశమువలె నున్నది. దానియందు వికారము లేదు. అది నిర్వికారము 1. బ్రహ్మము నిశ్చలము. అంతరాత్మ చంచలమైనది. ద్రష్టయనియు సాక్షియనియు నంతరాత్మనే చెప్పుదురు 2. అంతరాత్మ నీశ్వరుఁడని చెప్పవలయును. దాని స్వభావము చంచలము. అది సమస్తజీవులలో నుండి పరిపాలించుచున్నది 3. అది లేని పదార్థము జడము. దేహము వ్యర్థమైనది. అంతరాత్మవలననే పరమార్థము మొదలగునవి తెలియుచున్నవి 4. కర్మమార్గము, ఉపాసనమార్గము, జ్ఞానమార్గము, సిద్ధాంతమార్గము, ప్రవృత్తిమార్గము, నివృత్తిమార్గముల నీశ్వరుఁడె నడుపుచున్నాఁడు. చంచలము (అంతరాత్మ) లేనిది నిశ్చలము (బ్రహ్మము) తెలియఁబడదు. చంచలము స్థిరముగా నుండదు. ఇట్టి విచారముల నెన్నింటినో బాగుగా గమనించి చూడవల

యును 5 - 6. చంచలము (అంతరాత్మ) నిశ్చలము (పరబ్రహ్మము)ల సంధి (మాయ)లో బుద్ధి తిరుగుచువడును. కర్మమార్గము మొదలగునవి యీ సంధికి (మాయకు)దరువాత ప్రకటనమైనవి 7. వాని కన్నింటికిని మూల మీశ్వరుఁడు (అంతరాత్మ) కాని యీశ్వరునకు మూలము లేదు. పర బ్రహ్మము నిశ్చలమును నిర్వికారమును నై యున్నది 8. నిర్వికారము వికారము నొక్కటియేయని చెప్పువాఁడు మూర్ఖుఁడు. అట్టి మూర్ఖుని వలనఁ జూచుచుండఁగనే విచారము నష్టమగును 9. సమస్త పరమార్థము లకును మూలము పంచీకరణమును మహావాక్యవిచారణమునునై యున్నది. దానినే మాటిమాటికి మననము గావింపవలెను 10. స్థూల దేహము మొదటిది. మూలమాయాదేహ మెనిమిదవది. ఈ యెనిమిది దేహము లును నిరసనమై పోయినపిమ్మట వికార మింక నెచ్చట నుండఁగలదు? 11. వాస్తవమునకు ఈ వికారవంతమగు మాయ గారడీవిద్యవలె సత్యమువలెఁ గాన్పించును. దీనియథార్థమొకానొకఁడు మాత్రమె తెలిసికొనును. ఒకఁడు సత్యమని విశ్వసించును 12. నిర్వికారము ఉత్పత్తి, స్థితి, సంహారముల కంటె భిన్నముగానున్నది. దీనినెఱుంగుటకే సారాసారవివేకము పేర్కొనఁ బడెను 13. సారాసారములు రెండును నొకటి గావింపఁబడినపుడు వివేక మింక నచట నెక్కడనుండును? తెలిసికొనఁజాలనివారలు (బుద్ధిహీనులు) పరీక్షించుట యెఱుంగరు 14. అన్నింటియందు నేది వ్యాపించియున్నదో దాని నంతరాత్మయందురు. అంతరాత్మ నానావిధ వికారములతో వికృతి మైయున్నది. కావున నది నిర్వికారము కాఁజాలదు 15. ఇది స్పష్టము గనేయున్నది. తన యనుభవముతో నీయంశము గమనింపవలయును. ఏదియుండునో యేదిపోవునో యీవిషయము అవివేకియగు పురుషునకు దెలియఁబడదు 16. అఖండరీతితో ఉత్పన్నము నాశనమునగు నా వస్తువు నందఱును జూచుచునేయున్నారు 17. ఒకఁ డేడ్చుచున్నాఁడు. ఒకఁడు తికమక పడుచున్నాఁడు. ఒకఁడు రెండవవాని భారమును దనపయి నిడు కొనుచున్నాఁడు. ఒకఁడు కఱవుకాలములోని అన్నాతురునివలె రెండవ వానిపై విఱుచుకొని పడుచున్నాఁడు 18. న్యాయములేదు. నీతిలేదు. ఈ విధముగ జనులు వర్తించుచున్నారు. వివేకహీనుల నెల్లరును ఉత్తము లనుచున్నారు 19. ఒకవైపు తాళ్ళను విడిచి బంగారమును

గై కొనుచున్నారు. మట్టినివిడిచి అన్నము తినుచున్నారు. రెండవవైపు మూర్ఖతతో నెల్లరను ఉత్తములని చెప్పుచున్నారు 20. కాన దీనిని విచారింపవలయును. ఈ విచారము సత్యమార్గానుసారముగా నొనర్ప వలయును. వివేకలాభము నెఱుంగవలయును 21. వజ్రమును ఱాతిని సమానముగా నెంచినపుడు పరీక్ష యెక్కడనున్నది? కావున నేర్పరులగు వారలు పరీక్ష గావింపవలయును 22. పరీక్షలేనితావున శ్రమ కలుగును. ధాన్యమంతయు నిరువదిరెండు శేరులేయని శలించుట బండతనమగును 23. గ్రాహ్యమెద్దియో దానినే గ్రహింపవలయును. అగ్రాహ్యమును విడిచి వేయవలయును. ఉచ్చ నీచములను గురుతెఱుంగుటకు జ్ఞానమనిపేరు 24. జనులు (నరదేహమను మూలధనమును దీసికొని) సంసారమను (ప్రపంచ మను) వీధిలోనికి వచ్చుచున్నారు. వారిలోఁ గొందఱు (తమ మూలధన మును సదుపయోగ మొనరించి) లాభమునొంది శ్రీమంతులగుచున్నారు. కొందఱు మోసగించి (దురుపయోగ మొనరించి) తమ మూలధనమును కూడఁ గోలుపోవుచున్నారు 25. కాని జ్ఞానులగువార లట్లు చేయఁ గూడదు. (వారలు నరదేహరూపమగు తమమూలధనమును వ్యర్థముగాఁ బోఁగొట్టుకొనరాదు). సారమునువెదకి గైకొని అసారమును వమనమును వలె విడిచివేయవలెను 26. ఆ వమనమును సేవించుట కుక్కయొక్కస్వభా వము. పవిత్రుఁడగు బ్రాహ్మణుఁ డెన్నఁటి కావమనము నాశింపఁడు 27. సంచితానుసారముగ ఫలము లభించును. అభ్యాసానుగుణముగఁ బట్టువడిన దెన్నఁటికిని వదలిపోదు 28. ఒకఁడు దివ్యపదార్థములను భుజించుచున్నాడు. ఒకఁడు అశుద్ధము నెత్తివేయుచున్నాఁడు. కాని తమపెద్దలగొప్పతనమును దెలుపుటలో నందఱు సమముగాఁ బొల్గొనుచుందురు 29. వివేకములేని కథనమంతయు వ్యర్థము. శ్రవణ మననముల నెల్లరును మాటిమాటికిఁ గావింపవలయును 30.

---

## ఐదవ సమాసము — రాజనైతికయుక్తులు.

చేసినకర్మమునె మఱలఁ జేయవలయును. ధ్యానమునందు ధరిం చినదానినే ధారణము గావింపవలయును. వివరణము గావించిన నిరూపణ మును మఱల వివరణము గావింపవలయును 1. ఈ విషయమె నాచే

జరుపఁబడినది. చెప్పినదానినే మఱలఁ జెప్పవలసి వచ్చినది. చెడిపోయిన సమాధానమును జక్కఁగ స్థాపించుటకై యిట్లొనరించితిని 2. జనసామాన్యమునం దనన్యత గలిగియుండుటయు అన్యులగువారలకుఁగూడ నీవిషయమున భక్తి కలుగఁజేయుటయు ఉపాయముయొక్క ముఖ్యాభిప్రాయము 3. హరికథ, అధ్యాత్మనిరూపణము ముఖ్యము. రాజనీతి విషయము రెండవది. అన్నివిషయములందును మెలకువ గలిగియుండుట మూఁడవది 4. విడువక పట్టుదలతోఁ గార్యము లొనరించుట నాల్గవ కర్తవ్యము. బహువిధములగు నాక్షేపములను దూర పఱుపవలయును. (పరులొనరించిన) చిన్నవి పెద్దవి యగు నపరాధములగూడ క్షమింపవలయును 5. రాజనీతివిదుఁడు రెండవవాని హృదయములోని విషయము నెఱుంగవలయును. ఎల్లప్పుడు నుదాసీనుఁడై యుండవలెను. నీతిన్యాయములపట్ల నంతరువు పడనీయరాదు 6. చతురత్వముతో జనులహృదయములను దనవైపున కాకర్షించుకొనవలయును. ఒక్కొక్కని గలసికొని యెల్లరకు బోధింపవలయుగు. అంతియగాక యథాశక్తిగఁ బ్రపంచమును గూడ సంబాళింపవలయును 7. ప్రపంచ సందర్భముల నెఱింగి మిగుల ధైర్యముతో నుండవలయును. ఎవ్వనితోడనైన మిక్కుటముగ సంబంధముంచుకొనరాదు 8. ప్రయత్నమును విరివిగ నొనర్పవలయును. కాని ప్రయత్నోపాధిలోఁ దగుల్కొనరాదు. నీచతను మూర్ఖతను దొలుత నుండియుఁ దనతలపై నుంచుకొనవలయును 9. ఇతరుల దోషములను దాఁచవలయును. ఎవరి దుర్గుణములనేని నిరంతరముగ వివరింపఁజనదు. దుర్జనులను దన పిడికిటిలోనికిఁ దెచ్చుకొని వారలకు మేలొనరించి విడిచి వేయవలయును 10. ఏవిషయములోనైనను మొండిపట్టుదల తగదు. నానావిధములగు నుపాయములను శోధించి వెలికిఁ దీయవలయును. ఏకార్యమేని కాకున్నచో దీర్ఘయత్నమొనరించి దానిని నెరవేర్పవలయును 11. జనసముదాయమును జీలిపోవనీయఁగూడదు. ఏవేని సంకటములు కలిగినచో నేర్పుగా వానిని సవరింపవలెను. ఎవరితోడనేని మిగుల వాదోపవాదము లొనరింపరాదు 12. ఇతరుల కోర్కెల నెఱింగి బహుజనాభిప్రాయమును బాటింపనగును. ఒకవేళ బహుజనాభిప్రాయమును బాటింపరాని పరిస్థితు లేర్పడినచో ఆ తావున నుండనేకూడదు 13. ఇతరుల

దుఃఖము నెఱింగి తొలంగింప యత్నింపవలయును. అట్లే జనసముదాయపు మంచితనము, చెడ్డతనముగూడ సహించుటకు సిద్ధముగా నుండవలయును 14. గద్యమయములు, పద్యమయములు నగు విషయముల నెన్నియేని జ్ఞాపకముంచుకొనవలయును. ఆలోచనమును విడువఁజనదు. సర్వావస్థలందును నిరంతరమును బరోపకారమునఁ దత్పరత గలిగియుండవలయును. తన హృదయమున శాంతిని నెలకొల్పి యితరులయందు శాంతమును స్థాపింపవలయును. తాను మొండిపట్టువిడిచి యితరుల మొండిపట్టు వదలింపవలయును. అంతియగాక తొలుతఁ దాను స్వయముగఁ గార్యమునొనరించి యితరులచే నట్టి కార్యములను జేయింపవలయును 15—16. ఒకవేళ నెవరిపట్లనేని అపాయము (విఘ్నము) చేయవలసియున్నచో నావిషయము తొలుతనే తెలుపఁగూడదు. ఇంకను వేఱువేఱుగ వానికి విఘ్నానుభవమును గలుగఁజేయవలయును 17. బహుజనాభిప్రాయమును సహింపకున్నచో బహుజనము తనతోఁ గలియదు. కాని బహుజనుల భావములను సహించుటవలనఁగూడఁ దన మహత్త్వముండదు* 18. రాజనైతిక యుక్తుల విశేషించి యొనరింపవలయును. అన్నింటిని రహస్యముగా నుంచవలయును, ఇతరులకు గష్టము గలిగింపవలయునను తలంపు హృదయమునం దుంచరాదు 19. జనులను బరీక్షించి (స్వభావములను) గనుఁగొనవలయును. రాజనైతికయుక్తులతో వారల యభిమానమును తొలంగింపవలయును. అట్లే యేదేని సూత్రాంతరముతో వారలను మఱలఁ గలుపుకొనవలయును 20. నిలుకడలేని మనుజుని దూరముగా నుంచవలయును. దుష్టవృత్తి గలవారితో మాటలాడరాదు. ఒకవేళ సంబంధము తటస్థించినచో దప్పించుకొని తొలంగిపోవలయును 21. ఈవిధముగ రాజనైతిక యుక్తులను జెప్పఁబూనినచో నెన్నియేని కలవు. స్థిరచిత్తముగలిగియున్నచో రాజనైతిక యుక్తులు చక్కఁగ విశదమగును 22. భయపడువానికి ధైర్యము కలిగింపవలయును. తలయెత్తెడివానిని హుంకరింపవలయును. ఇట్టి రాజనైతిక

* బహుజనాభిప్రాయమును సహించుటవలనఁ బలువురు తనతో గలియుట సత్యమే! సహనశీలము నెక్కువగాఁ జూపించుటవలనఁగూడ నొకొక్కప్పుడు తన మహత్త్వము తగ్గునేమోయను భయము గలుగును. కావున సందర్భమునుగని యట్టి రాజనీతి విషయము వర్తింపవలయును.

యుక్తులెన్నియో గలవు. వాని నన్నింటి నిచట వివరింపఁజాలను 23. రాజనైతికవిదుఁడు శోధించినచోఁ బట్టువడఁడు. తన కీర్తి నలుదెసల నావరింప నంగీకరించును. సంపత్తివైభవములు వానికడకుఁ దమంతన వచ్చును. కాని వాని నాతఁడు గైకొనఁడు 24. ఒకనికి సహాయము గావించుటయు నొకానొకనికి సహాయము గావింప నిచ్చగింపకుండుటయుఁ జాతుర్యలక్షణముగాదు. (అందఱిపట్లను మనస్సుంచవలయును) 25. న్యాయమగు మాట లంగీకరింపక హితమగు యోచనలకు హృదయమునందుఁ దావొసంగకయుండు మానవుని బరిత్యజించుటతప్ప గత్యంతరములేదు 26. శ్రోతలహృదయము ననుసరించి యీ యంశము జెప్పితిని. న్యూనాధిక్యములకు క్షమింపఁగోరెదను 27.



## ఆఱవ సమాసము — మహంతు (సాధు) లక్షణము.

శుద్ధముగను సుందరముగను జదువవలయును. వ్రాసి శుద్ధముగ సంస్కరింపవలయును. అనంతరము శుద్ధముగా జదువవలయును. చదివినది మఱువఁగూడదు 1. చెడిపోయిన వర్ణములను సవరింపవలయును. విషయములను దృఢపూర్వకముగా హృదయమునం దుంచుకొని కథలను సరసముగా వర్ణింపవలయును 2. ఎఱిఁగినయంశ మితరులకుఁ దెలుపఁబనిలేదు. చెప్పఁదగినమాటను కొద్దిలోఁ జెప్పవలయును. కొద్దిలోఁ జెప్పుమాటలు శ్రోతలకు నిశ్చయాత్మికములు కాఁజాలవు. తెలిసికొననియెడల శ్రోతల నుండి యేమాటయు వెలువడదు 3. సాధుపురుషుఁడు హరికథ, అధ్యాత్మనిరూపణము, నిశ్చయాత్మికములగు రాజనైతికయుక్తులు వ్యావహారిక జ్ఞానము మున్నగు నంశము నెఱింగియుండవలయును 4. సాధుపురుషుఁడు అడుగుటయుఁ జెప్పుటయు నెఱింగియుండవలయును. బహువిధముల అర్థసమన్వయముతో నితరులకుఁ జెప్పగల్గి యుండవలయును. ఇంతియగాక అందఱను సమాధానపఱుప నేర్చియుండవలయును 5. తాను జూడ నెఱుంగఁదలఁచినయంశమును తొలుత నెఱింగియుండవలయును. సావధానముగఁ బూర్వపక్షము గావింపఁబడని తెఱంగున విషయమును దర్కింపఁగలిగియుండవలయును. ఎఱుక నెఱింగి యథాయోగ్యముగ నేర్పు గలిగియుండ

వలయును 6. ఈ విధముగా సర్వము నెఱింగినవాఁడు బుద్ధిమంతుఁడగు మహాంతు (సాధువు). ఇందులకు వ్యతిరేకులగు మానవులు సాధారణులు 7. సాధుపురుషునకుఁ దాళజ్ఞానము, తానమానములు, ప్రబంధము, కవిత్వము, సుభాషితశ్లోకములు మున్నగు సభాచాతుర్యములగు ననేకాంశములు తెలిసియుండును 8. అతఁ డేకాంతవిచారమునందు తత్పరుఁడై యుండును. బహువిధములగు గద్యపద్యమయ విషయములను గంఠస్థము గావించి యుండును. మఱియు నేదేని దుర్భేద్యములగు గ్రంథములందలి మార్మికార్థములను వెదకుచుండును 9. ఇట్లు తొలుత దాను నేర్చి యితరులకు నేర్పుచుండువాఁడు మహాంతుపదవి కర్హుఁడగును. మహాంతుపురుషుఁడు తన వివేకము నుపయోగించి పడిపోయినవారల నుద్ధరించును 10. ఆతని లేఖనము, పఠనము, వక్తృత్వము, ప్రవర్తనము మున్నగునవి మనోహరముగా నుండును. భక్తిజ్ఞానవైరాగ్యములయందు మహాంతు పూర్ణదక్షుఁడుగ నుండును 11. ప్రయత్నకార్య మాతనికి సంతోషావహము. నానావిధ ప్రసంగములయం దాతఁడు పాల్గొనును. సాహసముతో ముందంజ వేయును. వెనుకడు గెన్నఁడు వేయఁడు 12. మహాంతు సంకటము లొదవినపుడు తప్పించుకొనగల్గును. ఉపాధియందుఁ గలియుట నెఱుంగును. అంతియగాక యుపాధి కంటియంటక యుండుటఁగూడ నెఱిఁగి యుండును 13. ఆతఁ డంతటను వర్తించుచుండునుగాని వెదకిచూచినచో నెచటను లభింపఁడు. అంతరాత్మవలె నాతఁ డన్నికడల నుండియు గుప్తముగ మెలంగును 14. అంతరాత్మలేని ప్రాణియే లేదు. కాని చూచినచో నా యంతరాత్మ గోచరింపదు. గోచరింపకుండియుఁ బ్రాణిమాత్రుల వ్యాపారములను అంతరాత్మ నడుపుచున్నది 15. ఇట్లే మహాంతుగూడ నానా విధయత్నములతో జనసముదాయమును జతురుల నొనరించుచుండును. పెద్దవారియందును చిన్నవారలయందును మహాంతు బహువిధములగు విద్యాప్రచారము లొనరించును 16. స్వప్రయత్నమువలన దక్షుఁడైన మానవుఁడు స్వాభావికముగనే ప్రయత్నశీలుఁడుగా నుండును. ఇదియే సత్యమగు మహాంతులక్షణము 17. మహాంతు న్యాయమును నీతిని రక్షింపఁ గల్గియుండును. ఆతఁడన్యాయము నెన్నఁడును జేయఁడు. ఇతరులచేఁ జేయింపఁడు. కఠినపరిస్థితులలో నుపాయము నెఱిఁగియుండును,

పూర్వోక్తమగు నిట్టి ధారణాశక్తిగల పురుషుఁడె సర్వజనుల కాధారుఁడై యుండును. ఇట్టి మహాంతుల గుణగణము అనుసరణీయమని శ్రోతలకు రామదాసస్వామి చెప్పుచున్నాఁడు 18_19.

## ఏడవ సమాసము – మాయారూపియగు చంచలనది.

చంచలము (మాయ) గుప్తమగు గంగానది. దీని వివరణమువలన లోకము పావనమగును. ఈయంశమును శ్రోతలారా! మీరలు ప్రత్యక్షముగాఁ బ్రతీతి గావించుకొనుఁడు. ఇందు మిథ్యయావంతయేని లేదు 1. ఇది యచలమునుండి (నది పర్వతమునుండి కలిగినట్లు మాయ యచల పరబ్రహ్మమునుండి) నిర్మాణమగుచున్నది. మరియు నది వేగముగా దిగువవైపునకుఁ బ్రవహించుచున్నది. ఇది యఖండముగాఁ బ్రవహించుచున్నను దీని నెవరును జూడఁజాలకున్నారు 2. దీనిలో నందందు వంపులు, వంకరలు, సుడిగుండములు, నురువు, తెప్పలు, తరంగములు, ఉబ్బలలు, అలలు, బురద, అగాధమగు లోతు మున్నగునవి కలవు 3. ఈ నదియందు గుప్తజలము ప్రవహించుచున్నది. ధారయున్నది. ప్రతాపము ధ్వని యున్నది. చంచలముగ జల మెగురుచు జలజలమని పరుగెత్తుచున్నది 4. ఫేనము లేచుచున్నది. తుంపురులు మింటి కెగురుచున్నవి. నీరు స్వచ్ఛందముగాఁ బరుగులెత్తుచున్నది. చినుకులను, తుంపురులను, అణువులను, రేణువులను ఎంతదనుక లెక్కింపశక్యమగును? 5. బురద నీటిలోఁ జెత్తయుఁ జెదారము గలసి ప్రవహించుచు వచ్చుచున్నది. ఎత్తునుండి జలము పడుచున్నది. గండశిలలు, చిన్నరాళ్ళు, కంకర, బండలు మధ్య నాటంకపరచుటచే నందందు సుడిగుండము లేర్పడుచున్నది 6. మెత్తని పృథ్వియంతయుఁ బ్రవాహపురాపిడిచేఁ దెగిపోయినది. కఠోరభాగము లట్లే నిలిచియున్నవి. ఈ స్థితి స్పష్టముగ నన్నితావులందును గనుపించుచున్నది 7. కొందఱు శీఘ్రప్రవాహమునందుఁ గొట్టుకొనిపోవుచున్నారు. కొందఱు సుడిగుండములలోఁ దట్టుకొని పడియున్నారు. కొందరు తల క్రిందై కందకములోఁ దట్టుకొనుచున్నారు 8. కొందఱు పడుచు లేచుచు వెళ్ళిపోవుచున్నారు. కొందఱు నలిగి నలిగి చనిపోవుచున్నారు. కొందఱు

నీరు కడుపునిండఁ గ్రోలుటకతన ఉబ్బిపోయిరి 9. బలశాలు రిది ఉద్గమము (బ్రహ్మము) దనుకఁ జేరుచున్నారు. మఱియు ముద్గమదర్శనముకతన స్వయముగా బవిత్రులై తీర్థస్వరూపులగుచున్నారు 10. ఉద్గమమునందు బ్రహ్మమొదలగు దేవతల భవనములు గలవు. బ్రహ్మాండదేవతల స్థానములు గలవు. గంగకు దిగువనుండి యీదుకొనిపోవువారలందఱు నా యుద్గమస్థానమునందుఁ గలిసికొందురు 11. ఈ జలమునకు సమమగు నిర్మలపదార్థ మింక నేదియులేదు. దీనికి సమానమగు చంచలపదార్థము గూడ వేరొకటిలేదు. దీనిని కేవలము "ఆపోనారాయణ" యని చెప్పుదురు 12. ఆ నది మిగుల గొప్పది. కాని గుప్తముగా నున్నది. సర్వకాలము ప్రత్యక్షముగ బ్రవహించుచున్నది. ఇంకను జూడుఁడు. ఆ నది స్వర్గ మర్త్య పాతాళలోకములయందుఁగూడ వ్యాపించియున్నది 13. క్రిందను మీఁదను దశదిశలును ఆ నదీజల మావరించియున్నది. జ్ఞాతలానదిని జగదీశునకు సమానముగా నెంచుచున్నారు 14. పాత్రరూపములుగ నున్న మనుజులందఱు మాయానదీజలముతో నిండియున్నారు. కొందఱు కొందఱి లోనిజలము (సాధువులకువలె) కారిపోవుచున్నది. కొంతఱు కొందఱు తమజలమును (బద్ధమనుజులవలె) వ్యయపఱచుచున్నారు 15. ఒకానొకని కాజలము చేదగుచున్నది. ఒకానొకనికిఁ దీయగను, వేరొకనికి పులుపుగను, ఇంకొకనికి ఉప్పగను జప్పగను బరిణమించుచున్నది 16. జల మేయేపదార్థములతోఁ గలియు నప్పు డాయారూపము లొందుచున్నది. లోతగు పృథ్వీతలమున నాజలము లోతుగఁ బ్రవేశించుచున్నది 17. అది విషములోఁ గలసి విషముగను అమృతములోఁ గలసి అమృతముగను సుగంధములోఁగలసి సుగంధముగను దుర్గంధములోఁ గలసి దుర్గంధముగను మాఱుచున్నది 18. అది గుణావగుణములలోఁ గలియుచున్నది. ఇదియేల? అది దేనితోఁ గలియుచున్నదో యావస్తురూపము నొందుచున్నది. జ్ఞానము లేనిదా యుదకమహిమ తెలియనేరదు 19. అపరిమితమగు జలము ప్రవహించుచున్నది. ఆ జలము నదినుండి ప్రవహించుచున్నదో బుగ్గనుండి ప్రవహించుచున్నదో యెఱుంగ శక్యముగాదు. ఎందఱో జనులు జలవాస మొనరించుచున్నారు. (ఆమాయలోనే మునిఁగియున్నారు) 20. ఉద్గమమున కావలియొడ్డున కరగినపిమ్మట

వెనుకకుఁ దిరిగిచూచినచో నాయుదకమే సమాప్తమగును. ఏమియు నుండదు* 21. యోగీశ్వరులు వృత్తిశూన్యులుగనుందురు. ఈవిషయ మునుగూర్చి సాధకులు విచారింపవలయును. మాటిమాటి కెంతదనుకఁ జెప్పుదునని రామదాసు నుడువుచున్నాఁడు 22.

## ఎనిమిదవ సమాసము — అంతరాత్మ నిరూపణము.

ప్రప్రథమమున సకలకర్తయగు నీశ్వరునకు నమస్కరించెదను. ఆతఁడు దేవత లందఱకును స్వామి. ఓసోదరా ! యెవ్వరైనను సరియే. ఈశ్వర భజనమునందుఁ బ్రవృత్తులు కావలయును 1. ఈశ్వరుఁడె లేకున్నచో నే పనియు జరుగఁజాలదు. ఆతఁడు లేనిది ఆకుగూడఁ గదలనేరదు. త్రిలోకవ్యాపార మాతనివలననే నడచుచున్నది 2. కర్తయగు నా భగవానుఁ డందఱకు నంతరాత్ముఁడు. దేవదానవ మానవజాతులకును నాలుగుగనులకు నాలుగు వాణులకును నాతఁడే ప్రవర్తకుఁడు 3. అన్నిఘటములలో భిన్నరూపుఁడై యాతఁడొక్కఁడే వ్యవహరించుచున్నాఁడు. సమస్తసృష్టినిగూర్చిన యీ విషయ మెంతదనుకఁ దెలుపగలను? 4. ఈ విధముగ గుప్తముగ నున్న వానినే యీశ్వరుఁడని చెప్పవలయును. అందఱును ఆతనిమూలముననే గొప్పగొప్ప యైశ్వర్యముల ననుభవించుచున్నారు 5. ఆ యీశ్వరుని గాంచువారలు విశ్వంభరులె యగుదురు. అట్టివారలముందు సమాధిని సహజస్థితిని నెవఁడు ప్రశ్నించును ? 6. త్రిలోకవివరణము నొనరించిన పిదపఁ ముఖ్యమగుమర్మము సిద్ధించును. ఆ పరమనిధానము సిద్ధించినపిదప జేయవలసినపరిశ్రమ యేదియులేదు 7. వాస్తవములో నెవఁ డంతరాత్మను వివరణము గావించి చూడఁగలఁడు ? ఎవనినేని చూడుము. కొద్దిగనో గొప్పగనో తెలిసికొని తన సమాధానముతోఁ దానే తృప్తిపడును 8.

---

* మాయారూపమగు నదియందు ఊర్ధ్వముమునై పున కీదుకొనిపోయి మాయయొక్క ఉద్గమమగు పరబ్రహ్మ స్వరూపమునొంది వెనుకకు మఱలిచూచినచో ఇంతకుమున్ను ఈది దాటిన నది లే నే లేదని విదితమగును. అప్పట్టున మాయ మిథ్యయని వారలకు దెలియును. అనంతరము నది యనునది లే నే లేదని ఎఱుక పడును. (అనఁగా వారలు వృత్తిశూన్యులై పోవుదురని భావము.)

ఓ సోదరా! ఈ చూచినదానినే మరలమరలఁ జూడవలయును. వివరణము గావింపఁబడినదానినే పలుమారు చదువవలయును 9. అంతరాత్మ ఎంత పెద్దది? ఎట్టిది? దానిని విచారించువాని స్థితి యెట్లుండును? మున్నుగు ననేక విషయములలో పాటుబడి వినినవానికిఁ గనినవానికి వివేకము గోచరించును 10. ఎన్నియేని వినియు, నెన్నియేని యాలోంచియు గడించిన వివేకము అంతరాత్మ నెఱుంగుటకుఁ జాలదు. క్షుద్ర దేహధారియగు జీవుఁడు (ఆ సర్వవ్యాపియగు నంతరాత్మను) ఏమియెఱుంగఁగలఁడు? 11. ఆ పూర్ణమును (అంతరాత్మను) ఈ పూర్ణుఁడు (జీవుఁడు) ఏల తెలిసికోనఁ జాలఁడో తెలియునా? ఏలయన, ఇతఁడు (జీవుఁడు) అంతరాత్మ నఖండరీతిగ వివరణమొనర్పఁడు. ఒకవేళ నఖండరీతిగ వివరణమును గావించినచో నప్పుడితఁ డద్దానినుండి వేఱుఁగ మిగులఁడు. (ఈతఁడుకూడ నదియేయై పోవును) 12. విభక్తుఁడై యుండనివాఁడే (అనన్యుఁడై యుండువాఁడె) భక్తుఁ డనఁదగియుండును. అట్లుగానిచో వ్యర్థపటాటోపమును గావించి పాటుపడుటయే యగును 13. సాధారణముగ మనుజులు ఏదేనిగృహమును దృష్టియందుంచుకొని నడచివత్తురు. కాని యా గృహయజమానిని దెలిసికోనఁ దలంపఁడు. బాటసారులు రాజ్యమునుండి ప్రయాణము చేయుచుందురు. ఆ రాజ్యమునేలు రాజెవ్వరో గ్రహింపరు 14. అట్లే దేహము నాధారముగఁ జేసికొని మనుజులు విషయసుఖములను అనుభవించుచున్నారు. అంతియగాక దేహసంయోగమున సౌఖ్యములనొందుచున్నారు. కాని దేహమును ధారణచేయుచున్న అంతరాత్మను మఱచియున్నారు. ఇది మిగుల నాశ్చర్యకరమగు నంశము 15. జనులీవిధముగాఁ బ్రత్యక్షముగ నవివేకులయ్యు మేము వివేకులమని చెప్పుచున్నారు. ఓ యన్నలారా! మీ యోగ్యతానుసారముగ వర్తింపుడు 16. అజ్ఞాను లేదేని మనస్సునందు నిలుపుట యెఱుంగరు. కాననే జ్ఞానులయొక్క యవసరము కలుగుచున్నది. కాని జ్ఞానులే మూర్ఖులై యున్నారు గదా! 17. తాను పాతిపెట్టిన ధనమును మఱచి యిటునటు వేసారి తిరుగువానివాలె నజ్ఞానియగు జీవుఁడునై తమ ఈశ్వరునిఁ దనయొద్దనుంచుకొనియు నన్నికడల వెదకుచుఁ దిరుగుచున్నాఁడు 18. ఈ యంతరాత్మను ధ్యానింపఁగలవాఁ డీసృష్టియం దెవఁడున్నాఁడు? వృత్తి యేకదేశీయముగా

నుండునుగదా! అట్టియెడ నడి యీ సర్వవ్యాపి నెటుల నాకలనము గావించుకొనఁగలదు? 19. బ్రహ్మాండమునం దనంతరూపములతో ననంత విధములగు ప్రాణులు నిండియున్నవి. చిట్టచివఱకుఁ భూగర్భమునందును బాషాణములయందును గూడ నెన్నియో ప్రాణులు నిండియున్నవి 20. అన్ని ప్రాణులయందును సర్వవ్యాపియగు భగవానుఁ డొకఁడె వర్తించుచున్నాఁడు. ఆతఁ డొకచోట గుప్తముగను నొకచోట ప్రకటితముగను నున్నాఁడు 21. కాని చంచలమెన్నఁటికిని నిశ్చలము కాఁజాలదు. ఇది యనుభవనీయమగు నంశము. చంచలముగాని దేదిగలదో అదియే నిశ్చల పరబ్రహ్మము 22. ఈ శరీరమునందలి తత్త్వములన్నియు నొకదానివెంటనొకటి తొలంగినంతన దానితోఁబాటు దేహాభిమానముగూడ నెగిరిపోవును. అపుడు నలుమొగములందును నిర్మల నిశ్చల నిరంజనమే శేషించియుండును 23. మనమెవ్వరము? ఎందున్నారము? ఎక్కడి వారము? అను నంశములనుగూర్చి యోచించుటయే వివేకమార్గము. కాని స్వయముగా నీ యంశము అపరిపూర్ణముగనున్న ప్రాణికిఁ దెలియఁబడదు 24. కావున ఉత్తముఁడు వివేకమును గడింపవలెను. వివేకమూలమున దుస్తర సంసారము తరింపవలెను. ఇట్లే హరిభక్తిగలవాఁడై తన వంశమునంతయు నుద్ధరింపవలయును 25.

## తొమ్మిదవ సమాసము — జ్ఞానోపదేశము.

తొలుదొలుత మానవుఁడు విధిపూర్వకములగు కర్మము లొనరింపవలయును. అందేదేని కొఱంత వాటిల్లిన యెడల దోషము కలుగును 1. కావునఁ గర్మారంభము తొలుతఁజేయుట కర్తవ్యము. ఎంతదనుక కర్మ సరిగ ననుకూలించునో నంతదనుక మంచిదె. ఒకవేళ నంతరాయము తటస్థించిన యెడల హరిస్మరణము గావింపవలెను 2. (రిత్తగ స్మరణము మాత్రమే చేయఁగూడదు.) ఇంకను ఆ హరి యెట్టివాఁడు? అను విచారమునుగూడఁ జేయవలెను. సంధ్యవార్చుటకు ముం దాజగదీశ్వరుని యిరువదినాలుగు నామములను స్మరణము జేయవలయును 3. ఆ చతుర్వింశతి నామములు సహస్రనామములు అనంతనామములు అనామము

గల పరాత్పరుఁ డెట్టివాఁడను సంశయము నంతఃకరణమునందు గుర్తెఱుంగ వలయును 4. బ్రాహ్మణుఁడు స్నానసంధ్య లొనరించి దేవతార్చనము నారంభించును. అట్లే విధిపూర్వకముగఁ బ్రతిమాపూజనము జేయును. అనేక దేవతామూర్తులను జనులు ప్రేమపూర్వకముగాఁ బూజించు చున్నారు. కాని యా విగ్రహము లెవనివి? ఆ పరమాత్మ యెట్టివాఁడు? అనుదానినిగూడ గుఱుతింపవలయును గదా! 5. గురు తెఱిఁగి భజింప వలయును. అధికారిని గుఱుతెఱింగి వందనము జేయునట్లు పరమాత్ముఁ డగు పరమేశ్వరుని జక్కఁగ గుర్తెఱింగి నమస్కరింపవలయును. అప్పుడే యీ భవసాగరమునకుఁ దీరము లభించును 6—8. అవతారపురుషులు నిజధామమున కేగుచున్నారు. కాని వారిమూర్తుల కొనరించు పూజ యంతయు నంతరాత్మకె చెందును 9. ఐనను ఆ యవతార పురుషులు గూడ నిజరూపముతో నుందురు. ఆ నిజరూపము జగజ్జ్యోతియే. ఇదియే సత్త్వగుణము. దీనినే చేతనాశక్తి యని యెదరు 10. ఆశక్తి యుదరమునందుఁ గోటులకొలఁదిగ దేవతలుందురు. ఈ యనుభవ విషయములను బ్రత్యయముచే నెఱుంగవలయును 11. దేహరూపకమగు నగరమునందు నివసించియుండు ఈశ్వరుని బురుషుఁడని చెప్పుదురు. సంపూర్ణ జగత్తునందు వ్యాపించియుండువానిని జగదీశుఁ డందురు 12. సంపూర్ణ ప్రపంచములోని శరీరముల నన్నింటిని చేతనమె నడుపుచున్నది. ఆ చేతనమునే అంతఃకరణ విష్ణువని యెఱుంగవలయును 13. ఆ విష్ణువు సంపూర్ణ జగత్తుయొక్క అంతఃకరణమునం దున్నాఁడు. మఱియు మన యంతఃకరణమునందుఁగూడ నాతఁడే యున్నాఁడు. చతురపురుషు లాయంత రాత్మనే కర్తగను, భోక్తగను ఎఱుంగవలయును 14. ఆతఁడే ఆలకించుచు జూచుచు వాసనజూచుచు భుజించుచు నున్నాఁడు. బుద్ధితో విచారించి సమస్తమును నాతఁడే గుర్తించుచున్నాఁడు. తనది పరులది యనుదాని నాతఁడే గ్రహించుచున్నాఁడు 15. నిశ్చయముగా సంపూర్ణ జగత్తున కంతరాత్మ యాతఁడొకఁడె కాని శారీరక మోహము మధ్యవచ్చిపడినది. శరీరసంయోగమువలన నతఁడు భిన్నుఁడై యభిమానధారణము గావించు చున్నాఁడు 16. అతఁడు పుట్టుచుఁ బెరుగుచుఁ జంపుచుఁ జచ్చుచు నున్నాఁడు. సముద్రయోగమునఁ దరంగములపైఁ దరంగములు లేచుచుఁ

బోవునట్లు ఈ యంతరాత్మ సంయోగమునఁ ద్రిలోకములు కలుగుచు నశించుచున్నవి 17. ఈ మూఁడులోకములను నడిపెడివాఁ డొక్కఁడే. కాననే యాతనినిఁ ద్రిలోకనాయకుఁ డందురు. ఈ యనుభవనీయాంశ మునుఁ బ్రత్యక్షముగాఁ జూచుకొనవలయును 18.

అంతరాత్మస్వరూప మిట్టిది. కాని దీనికిఁగూడ దత్త్వములయందే గణనయున్నది. దీనితరువాత మహావాక్యవిచారణము గావింపవలయును19. తొలుత దన దేహములోని యంతరాత్మను జూడవలయును. తరువాత దానినే సంపూర్ణజగత్తునందు వ్యాపకమై యున్నదానినిగ నెఱుంగ వలయును. ఆవల పరబ్రహ్మమునుగూర్చి విచారము కలుగును 20. పరబ్రహ్మమును విచారించుటచే సారాసారనిర్ణయము సిద్ధించును. ఇఁకఁ జంచలము నాశమగుట నిశ్చయమేగదా ! 21.

నిరంజనమగు వస్తువు ఉత్పత్తి, స్థితి, సంహారముల కావలనున్నది. అచట జ్ఞానము విజ్ఞానమైపోవును 22. అష్టదేహములు, నామరూపములు మున్నగునవి వివేకముచే నాశనమైనపిమ్మట నిరంజనమగు విమలబ్రహ్మము ప్రాపించును 23. విచారమువలననే అనన్యుఁడు గావలయును. కాని (ప్రత్యయము) వచ్చుటగూడ వృత్తియే. ఈ వృత్తికిఁగూడ నివృత్తి కావలయును. చక్కఁగ యోచింపుఁడు 24. చాలును. ఇంతతో వాచ్యాంశము వదలిపోవుచున్నది. లక్ష్యాంశముగూడ వివేకముతోఁ జూచినచో విడువఁబడును. అట్లే లక్ష్యాంశము వెంటనే వృత్తిభావనగూడ వెడలిపోవును 25.



## పదియవ సమాసము – నిస్పృహుని వర్తనము.

మూర్ఖుఁడు ఏకదేశీయుఁడుగ (సంకుచిత విచారయుక్తుఁడుగ) నుండును. చతురుఁడన్నచో అంతరాత్మ సర్వవ్యాపకమై యెట్లు నానా సుఖముల భోగించుచున్నదో యట్లుండి సర్వమును దిలకించుచుండును 1. మహాంతుగూడ నా యంతరాత్మయే. అతఁడు సంకుచిత విచారవంతుఁ డెట్లు కాఁగలఁడు? మహాంతు (సాధుపురుషుఁడు) వ్యాపకుఁడును, సర్వజ్ఞుఁడును, విఖ్యాతయోగియు నై యున్నాఁడు 2. వాస్తవమునకుఁ గర్తయు,

భోక్తయు నాతఁడె. భూమండలమునఁగల శక్తియంతయు నాతనిదె. దాని నెఱుంగఁదగు జ్ఞాత మహంతుదక్క నింక నెవఁడున్నాఁడు? 3. మహంతు ఇట్టివాఁడై యుండవలయును. ఆతఁడు సారమునంతయు వెదకి కైకొన వలయును. ఒకవేళ యెవరేని శోధించినచో తటాలున నాతఁడు పిడికిలి లోనికి రాఁగూడదు 4. నిస్పృహుఁడగు మహంతు నిశ్చయముగాఁ గీర్తి రూపముతో లోకమునందు మిగులఁ గీర్తినొందును. చివరకుఁ బిన్న పెద్ద లందఱు నాతని నెఱుంగుదురు. కాని యాతఁడేదేని యొక వేషముతోఁ గాన్పింపఁడు 5. ఆతని యచంచలకీర్తి ప్రత్యక్షప్రపంచమునం దావరించి యుండును. స్వాయముగ నాతఁడు జనులకుఁ దెలియఁబడఁడు. జను లాతనిని వెదకుచుందురు. కాని యాతని జాడపోడలే కాన్పింపవు 6. మహంతు సుందరమగు వేషము నాదరింపఁడు. కీర్తియొక్క యభివృద్ధినే భూషణముగ నెంచి యాదరించును. అట్లే అఖండరూపముగా నాతని హృదయమున నాలోచనలు వృద్ధియగుచుండును 7. మహంతు తన్ను గురుతెఱింగినవారలను విడిచిపోవును. నిరంతరము అన్ని తావులందును గ్రొత్తవారితోఁ బరిచయము కలుగఁజేసికొనును. ప్రజలాసాధుపురుషుని హృదయాభిప్రాయములయందుఁ గనుఁగొనఁ దలంచుచుందురు. కాని యాతని సంకల్పమెద్దియో యెవ్వరికిని విశదముగాదు 8. ఆతఁడు పూర్తిగ నెవరివైపును జూడఁడు. పూర్తిగ నెవ్వరితోడను మాటలాడఁడు. పూర్తిగ నొకచోట నిలిచియుండఁడు. లేచి వెళ్ళిపోవును 9. తానెచటికిఁ బోవలసియుండునో యాస్థల మితరులకు జెప్పఁడు. ఎచటికి బోవుచుంటినని చెప్పునో యచ్చటకుఁ బోవనేపోవఁడు. సారాంశమేమన, తన విషయమెవ్వని యనుమానమునకేని రానీయఁడు 10. జను లాతనిపట్ల నేమిచేయఁదలఁచిరో దానినుండి తప్పించుకొనును. జను లాతని విషయమున నేమి తలంతురో దాని నసత్యము గావించును. మఱియు జను లాతనిగూర్చి యేమి తర్కింతురో దానిని నిష్ఫలము గావించును 11. జనులా మహంతును దర్శింప వాంఛింతురు. కాని యితరులకు దర్శనమీయవలసిన నిమిత్త మాతనికి లేదు. జను లాతనిసేవకై వేచియుందురు. కాని జనులకు సేవ యొసంగవలసిన నిమిత్త మాతనికి లేదు 12. ఈ విధముగా నాయోగీశ్వరుండు (మహంతు — నిస్పృహుఁడు)

కల్పనములోనికి రాఁడు. తర్క మాతనియెదుటఁ బనిచేయదు. మఱియు నెప్పుడును భావనచేయుటకుఁగూడ నాతఁడు సాధ్యపడఁడు 13. ఈ విధముగ నాతని హృదయము గోచరింపదు. ఆతని దేహ మొకతావుననుండదు. ఒకక్షణకాలమేని యాతఁడు కథాకీర్తనములను మఱునడు 14. జను లాతనిపట్ల గావించు సంకల్పవికల్పములన్నియు నిష్ఫలములగును. ఆయోగీశ్వరుఁడు జనులకు దమతమ వృత్తులచేతనే లజ్జితులఁ గావించును 15. మహాంతు, పెక్కుమంది పరీక్షించిన పిమ్మటను బెక్కుమంది హృదయములలోఁ దనకు స్థాన మేర్పడిన పిమ్మటను మిగుల భారమగు కార్యమిప్పుడు నెరవేర్పఁగలిగితినని తెలిసికొనవలెను 16. అఖండరీతిగ ఏకాంత సేవ గావింపవలెను. నిరంతర మభ్యాసమునే చేయుచుండవలెను. అట్లే అన్యజనులనుగూడఁ దనవెంటనుంచుకొని కాలము సార్థకము గావింపవలెను 17. మహాంతు తొలుదొలుత ఉత్తమగుణము లెన్నిగలవో వాని నన్నింటిని గ్రహింపవలెను. పిమ్మట నితరుల కాగుణములనే నేర్పవలెను. మిగుల గొప్ప జనసముదాయమును బ్రోవుచేయవలెను 18. కాని గుప్త రూపముతో నాజనసముదాయమును ఉచితకార్యమునం దఖండరీతిగ నన్వయింపఁజేయవలయును. సంపూర్ణ సంసారమును (ప్రపంచమును) ఉపాసనయందు లగ్నపఱుపవలెను. ఈతఁడు సత్యమగు నిస్పృహాగల మహాంతుగ నున్నాఁడని లోకులు తెలిసికొన్నఁగాని యాజ్ఞాపాలనము గావింపరు 19. తొలుదొలుత కష్టమును సహించినఁగాని ఫలము లభింపదు. కష్టము లేదేని ఫలమేయుండదు. ప్రయత్నములేకున్నచో సర్వము వ్యర్థమగును 20. జనులను వెదకి వెదకి వేలకొలఁదిగ తనచేతిలోనికిఁ దీసికొనవలెను. వారివారి యోగ్యత నెఱుంగవలెను. అనంతర మాప్రజలను వారివారి యోగ్యతలను విచారించి యొకానొకనిని సమీపమునందును ఒకానొకనిని దూరమునందును నుంచవలెను 21. యోగ్యతననుసరించి కార్యములు జరుగుచుండును. యోగ్యతయే లేనప్పుడా మనుజుఁ డేపని కుపకరించును? మహాంతు అందఱి మనస్సులను జక్కఁగాఁ బరీక్షింపవలెను 22. ఎదుటివాని యోగ్యతను గమనించి పనిచెప్పుచుండవలెను. కార్యశక్తినిగాంచి యెదుటివానియెడ విశ్వాసముంచవలెను. అట్లే తన విచారము నింకొకటిగనే యుంచవలెను 23. ఇది యనుభవముతోఁ

జెప్పెడుమాట. ఇపుడు చెప్పినవన్నియు మొదట నాచేఁ జేయఁబడినవి. తరువాతఁ జెప్పఁబడినవి. యుక్తముగనున్నచోఁ బ్రజ లొకవేళ గ్రహించిన గ్రహింతురుగాక* 24. మహంతు ఇంక ననేకమహంతులను నుత్పత్తి గావించుట విధి. ఆ మహంతులను యుక్తులతోడను సద్బుద్ధులతోడను నుండునట్లు దిద్ది జ్ఞాతలఁజేసి అనేకదేశములలో వ్యాపింపఁజేయవలెను 25.

పదునొకండవ దశకము సమాప్తము.



* ఈ సమాసము మిగుల మహత్త్వముగలది. ఇందుఁ జెప్పఁబడిన యంశములన్నియు అనుభవపూర్ణములు. ఈవిషయముల నన్నింటి మొట్టమొదటఁ దానొనరించి తరువాత నేర్పుచున్నాఁడనని శ్రీరామదాసస్వామివారు నుడువుచున్నారు. ఇందు సందేహింపఁ దగినది లేదు. ఈ సమాసము రామదాసస్వామి యాత్మచరిత్రయని భావింపనగును.



# పంద్రెండవ దశకము.

## మొదటి సమాసము — విమలలక్షణము.

తొలుదొలుతఁ బ్రపంచమును (గృహస్థాశ్రమధర్మమును) జక్కఁ నాచరింపవలెను. పిమ్మట పారమార్థికవిచారము గావింపవలెను. వి వంతులారా ! ఇందు సోమరులై వర్తింపఁదగదు 1. ఒకవేళ బ్రపంచము (గృహస్థాశ్రమమును) విడిచి పరమార్థమును గావింతువేని దానివలన నీ బాధనొందుదువు. ప్రపంచ పరమార్థములను రెంటిని గాపాడగలిగినపు నీవు వివేకివని యనిపించుకొందువు 2. ఎవఁడేని యొకవేళఁ బ్రపంచము విడిచి పరమార్థకృత్యముగావించుచో వానికి మొదటఁ దినుటకు అన్న దొరుకదు. ఇఁక నా యభాగ్యుఁడు గడించినపరమార్థపుఁ జేరే మొత్తవల పనియుండదు 3. ఇట్లే యెవఁడేని పరమార్థమును విడిచి ప్రపంచబంధము దగుల్కొన్నచో వాఁడుగూడ యమయాతనల ననుభవింపఁగలఁడ అందుచే నంత్యమునందుఁ బరమకష్టములకుఁ బాలగును 4. ఎవఁడె తన యజమానునికొలువున కేగక యింటియందు సుఖముగాఁ గూర్చుఁ యున్నచో నాతనిని యజమానుఁడు దండించును. జనులు వినోదమ చూచుచుందురు. ఇది యెల్లరు నెఱింగిన యంశమె 5. ఆదశయం వాని మహత్త్వమే పోవును. ఆతఁడు దుర్జనులచేఁ బరిహాసము గావిం బడును. అంతియగాక స్వయముగాఁగూడఁ గష్టముల ననుభవించును ఈస్థితియే చివరకుఁ గలుగఁబోవునది. కావున భగవంతుని భజనమ గావింపవలయును. పరమార్థమును బ్రత్యక్షముగా ననుభవము గావిం కొనవలయును 7. సంసారమునందుండియు దానినుండి ముక్తుఁడై (అం యంటకుండి) వర్తించువానిని నిజమగు భక్తునిగ నెఱుంగవలయును. ఆ డఖండరీతిగ యుక్తాయుక్తములను విచారణము గావించుచుండును ప్రపంచమునందు (గృహస్థాశ్రమమున) సావధానిగ నుండువాఁడు ప మార్థము నొనరింపఁగలఁడు. గృహస్థాశ్రమమును సవరించుకొనఁజాలనివాఁడ

పరమార్థము నేమియొనర్పఁగలదు? 9. కావున మానవుఁడు సావధానతతోఁ బ్రపంచపరమార్థములను రెంటిని గావింపవలెను. ఇట్లు చేయఁజాలకున్న యెడల నానాదుఃఖముల ననుభవింపవలసివచ్చును 10. వనస్పతులమీఁద నుండు తృణజలూకము (ఆకుపచ్చగను పొడవుగనుండు పురుగు) ముందుఁ జూచి తన శరీరభాగము నెత్తి నడుచుచుండును. (జీవజంతువులుగూడ నీ విధముగ వివేకముతో వర్తించుచున్నవి). పురుషుఁడై యుండియు నవివేకియై వర్తించువారల నేమనవలయునో తోఁచదు 11. కావున దూరదర్శిగ మానవుఁ డుండవలెను. అఖండరీతిగ విచారము గావింపవలెను. ముందు జరుగఁగలస్థితిగతులను (భవిష్యత్ ఘటనలను) మొదటినుండియే తెలిసికొనవలెను 12. జాగరూకతగ నుండువాఁడు (సావధానపురుషుఁడు) సుఖియగుననియు, అజాగ్రతగలవాఁడు (సావధానరహితుఁడు) దుఃఖిగ నుండుననియు అంద ఱెఱింగియున్నారు 13. కావున సర్వవిధముల సావధానిగ నుండుపురుషుఁడే ధన్యుఁడు. అట్టివాఁ డొకఁడే జనులను సంతోషపఱుపఁ గలిగియున్నాఁడు 14. మొదటినుండి సావధానిగనుండుటలో సోమరితనము ప్రకటించుచుండెను. వానిపయికి మధ్యకాలమున నాకస్మికముగ తుములయుద్ధము తటస్థమయ్యెను. అప్పు డాత్మరక్షణము గావించుకొనఁదగు సందర్భమెక్కడనుండును? 15. దూరదర్శులగు పురుషుల యోచనల ననుసరించి వర్తింపవలెను. ఏలయన, రెండవవాని నాదర్శముగ నుంచుకొనియే జనులు చతురులగుచున్నారు 16. కావున గుణవంతులు, చతురులు నగు పురుషులను గురు తెఱింగి వారి గుణగణములను గ్రహింపవలెను. అవగుణములను బరీక్షించి విడిచివేయవలెను 17. వివేకియగు పురుషుఁ డందఱను బరీక్షించుచునేయుండును. ఎవరిమనస్సునుగాని నొప్పింపఁడు. ఆతఁడు మనుష్యమాత్రుని దన యనుమానములోనికిఁ దెచ్చుకొని పరిశీలించును 18. సాధారణముగ వివేకవంతుఁడు జనులందఱకు సామాన్యునివలెఁ గనుపించును. వాస్తవమున కాతఁడు గొప్పవివేకిగా నుండును 19. ఆతఁడు బాగుగా నెఱింగియే, బాగుగాఁ దెలిసికొనియే అన్నివిధములగు జనుల నంగీకరించును. అంతియగాక యెవరినెట్లు గౌరవింపవలయునో యట్లు గౌరవించును. అన్నిటికంటె గొప్పగ నాతనియందుఁ గల యపూర్వత్వ మిదియే 20.

## రెండవ సమాసము — ప్రపంచానుభవము.

ప్రపంచములోని కేతెంచిన స్త్రీ,పురుష, నిస్పృహాజనులారా! నేను చెప్పబోవునంశమును ధ్యానపూర్వకముగ వినుండు 1. వాసన యేమగు చున్నదో కల్పన మేవిషయమునఁ గల్పనచేయుచున్నదో చూడవలయును. ఏలయన, మనస్సులో నానావిధములగు తరంగము లుద్భూతము లగు చుండును 2. చక్కఁగఁదినుటయుఁ, జక్కఁగఁద్రాగుటయు, మంచిమంచి యాభరణములను ధరించుటయు, మంచిదుస్తును గట్టుకొనుటయు, సర్వ విషయములయందును మనస్సున కనుకూలముగ వర్తించుటయు సాధా రణముగ జరుగుచునేయున్నది. దీనివలన జరుగున దొక్కటియు లేదు. మంచిపనిచేయుచుండగనే యాకస్మికముగ నది చెడుగై పోవును 3-4. ప్రపంచమునందలి మానవులలోఁ గొందఱు సుఖులుగఁ గొందఱు దుఃఖు లుగనుంట ప్రత్యక్షముగఁ జూచుచున్నారము. జనులు తఱుచుగా భయ చేతస్కులై చిట్టచివరకు భాగ్యముల ననుభవించుచున్నారు 5. మను జులు పొరపాటులేకుండ నేయత్నమునేని చేయఁజాలరు. కావుననే వారొన రించు యత్నములు నెరవేరకున్నవి. మఱియు నేమైనఁజేయనిమ్ము. మాన వుఁడు తన దుర్గుణములను దాను గ్రహింపలేఁడు 6. తన లోటుపాటులఁ దానెఱుంగనివాఁ డితరులవిషయ మేమియెఱుంగఁగలఁడు? పూర్వోక్తము లగు కట్టుబాటులననుసరించి నడువకపోవుటచేతనే మానవులకు స్వాభావిక ముగ దారిద్ర్యము కలుగుచున్నది 7. వాస్తవమేమన్న జనులు పరస్పర ముగ నొకరి హృదయములోనియంశము నొకరు తెలిసికొనఁజాలకున్నారు. ఈ కారణముననే జనులలో సమానప్రవర్తనము కనఁబడకున్నది. అట్లే అజ్ఞానకారణమున మనుజులలో నానావిధములగు పోరాటములు సమ కూరుచున్నవి 8. ఆ పోరాటములే క్రమముగ వృద్ధినొందుచున్నవి. కావున నెల్లరును గష్టముల నొందుచున్నారు. ప్రయత్నమొకప్రక్క నిలిచిపోవుచున్నది. వ్యర్థమగు శ్రమమాత్రము జరుగుచున్నది 9. కాని వాస్తవములో ఈ వర్తనము విహితముగాలేదు. నానాప్రకారములుగా నున్న జనులను బరీక్షింపవలెను. ఎవ్వఁ డెటులుండునో వానినట్లే తెలిసి కొనవలెను 10. దక్షుఁడగు పురుషునకుఁ గొంచెముగనో గొప్పగనో ఎదుట

వానివాక్యములు హృదయము గోచరించును. మూర్ఖపురుషున కెట్లు తెలియును? 11. జనులు తమయెడఁ బక్షపాతము గలిగియుంటకు ఇతరులను నిందించుటకు బాగుగా నలవాటుపడియున్నారు. ప్రపంచమునందు దఱచుగా నిదియే కానఁబడుచున్నది 12. కాని తన ప్రతిష్ఠను గాపాడుకొనుటకై మంచివాఁడు సైత మీనిందను సహించుచున్నాఁడు. సహింపకపోయినచో నవ్వులపాలగుట స్వాభావికవిషయము 13. తనకు యోగ్యముగ నుండనిత్రావున నుండుట మానవున కెన్నఁటికిని రుచింపదు. మఱియు నెవని మొగమాటమునేని త్రెంచివేయుటఁగూడ నుచితమని తోఁచదు 14. సత్యము మాటలాడుచు సత్యముగావర్తించుచు నుండువానిని పిన్న పెద్దలందఱును బ్రేమింతురు. న్యాయాన్యాయవిషయములు సులభముగాఁ బరస్పరము విదితమగును 15. ఇతరుల యపరాధములను వివేకపూర్వకముగ సహింపవలయును. లేకున్న నాతనిపయి లోకులకు భక్తికలుగదు. అంతియగాక అట్టివానిని జనులు సాధారణమానవునిగా భావింతురు 16. అరుగదీయకయుంచినంతవఱకు గంధపుకట్టెయొక్క సుగంధము వెల్లడి గాదు. అన్యవృక్షములను జూచినట్లు దానిని జూతురు 17. ఉత్తమ గుణములు స్వయముగాఁ జూచినఁగాని లోకులీతఁడు లోకోత్తరుఁడని నిర్ణయింపరు. అట్లు నిర్ణయించినపిదప నుత్తమునియెడ లోకమంతయు బ్రసన్నమగును 18. లోకము ప్రసన్నముకాగానే లోకముతో మైత్రికలుగును. అనంతరము జనులందఱును సంపూర్ణముగఁ బ్రసన్నులగుదురు 19. జగద్రూపియగు జనార్దనుఁడే (ఈశ్వరుఁడే) ప్రసన్నుఁడైనపు డిఁక నాతనికిఁ దక్కువయేమున్నది? కాని లోకులనందఱను సంతోషపఱచుట మిక్కిలి కష్టము 20. నాటఁబడినవిత్తనము మొలచును. ఇచ్చినవాయనము మఱల దొరకును. మర్మమునకుసంబంధించిన మాట చెప్పినచో ఇతరులహృదయమునకుఁ గష్టముగలుగును 21. జనులకు మేలుచేయుటచే సుఖ మభివృద్ధి నొందును. శబ్దము ననుసరించియే ప్రతిశబ్దము వచ్చుచుండునుగదా 22. ఇది యంతయు మన స్వాధీనములో నున్నవిషయము. దీనియం దితరుల దోషమించుకేనియు లేదు. ఈ యంశము సాధకుఁడు తన మనస్సునకు క్షణక్షణమునను నేర్పుచుండవలెను 23. ఒకవేళ నెందేని దుర్జనుఁడు గలిసినచో తా నాతనిని క్షమింప నవకాశము లేకున్నచో సాధకుఁడగువాఁడు

వెంటనే యచటనుండి మౌనముగా వెడలిపోవలెను 24. జనులు నానా విధ పరీక్షలు బాగుగా నెఱుంగుదురుగాని ఇతరుల హృదయములను బరీక్షించుట యెఱుంగరు. కావుననే జనులు దుఃఖముల నొందుచున్నారు. ఇందు సందియములేదు 25. మనమేనాఁడో చావవలసియేయున్నది. కాన మంచిబుద్ధితో నడుచుకొనవలయును. వివేకలక్షణము మిగులఁ గఠినమైనది 26. చిన్నతోనైననుఁ, బెద్దతోనైనను, సమానునితోనైనను, తనవానితో నైనను, బరునితోనైనను, గడకెవరితోనైనను గాఢమైత్రి గలిగియుండ వలెను 27. మంచియొక్క పర్యవసానము మంచియే యగును. దీనినందఱు నెఱుంగుదురు. ఇంక నింతకంటె నధికముగా నేమి చెప్పవలయును? 28. హరికథలను, అధ్యాత్మికనిరూపణములను గావించుచుండవలెను. మహత్త్వ పూర్ణములగు రాజనైతికవిషయములవైపునగూడ ధ్యానము నుంచ వలెను. కాని ప్రసంగము (సందర్భము) తటస్థింపనివిషయ మెద్దియు యుక్తముగనుండదు 29. ఒకఁడు విద్య బాగుగా నేర్చుకొనియున్నాఁడు. కాని అవసరము నెఱుంగఁడు. ఈ స్థితియం దీవిద్య నెవ్వఁ డడుగును? 30.

## మూఁడవసమాసము — ఈశ్వరుఁడు - భక్తుఁడు.

పృథివిమీఁదనున్న జనులందరును వివేకముతో నడచుకొనవలెను. ఇహపరలోకములను రెంటిని బాగుగా విచారింపవలెను 1. ఇహలోకమును సాధించుటకు జ్ఞాతలసాంగత్య మొనరింపవలెను. పరలోకమును సాధించుటకు సద్గురుఁడు కావలెను 2. సద్గురుఁడు కావలయుననుట సరియే. మొదట నాయన నేమి యడుగవలెనో తెలియకున్నది. మంచిది. మొదట ననన్యభావముతో నాతనిని రెండువిషయము లడుగవలయును 3. ఆ రెండువిషయము లెవ్వియన, ఈశ్వరుఁ డెవ్వఁడు? మనమెవ్వరము? అనునవి. ఈ రెండువిషయములను మాటిమాటికి వివరణ మొనరింప వలెను 4. మొదట ఈశ్వరుఁడెవ్వరు? అనుదానిని జూడవలెను. పిమ్మట భక్తులగు మనమెవ్వరము? అనునంశము చూడవలెను. పంచీకరణ మహా వాక్యముల వివరము మాటిమాటికిఁ జేయుచుండవలెను 5. నిశ్చలమును శాశ్వతమును గురుతెఱుంగుటకును, 'మనమెవ్వరము?'అను విషయమును

విచారించుటకును ముఖ్యముగ నిదియంతయుఁ జేయవలయుననిభావము 6. సారాసార విచారము గావించుటవలన నేపదవియందైనను శాశ్వతము లేదని విదితమగును. కావున వానికన్నిఁటికిని గారణమగు భగవంతుని తొలుదొలుత గుర్తెఱుఁగవలెను 7. నిశ్చలము, చంచలము, జడము ఇదియంతయు మాయావికారము. కాని వీనియన్నిఁటిలో వస్తువే సారము. దానికి నాశములేదు 8. ఆ పరబ్రహ్మమును వెదకవలెను. వివేకముతో మూఁడులోకములందును లెస్సగాఁ జరింపవలెను. మాయికమును విచారముచే ఖండింపవలెను 9. అసత్యమును విడిచి సత్యమును గ్రైకొనవలెను. పరీక్షకుని బరీక్షింపవలెను. మఱియు మాయాస్వరూపమంతయు మాయికమని (మిథ్యయని) యెఱుంగవలెను 10. ఈ మాయ పాంచభౌతికము. మాయికమంతయు లయమైపోవును. పిండబ్రహ్మాండములు,ఎనిమిది దేహములు నాశవంతములే 11. కనుపించునదంతయు నాశమయ్యెడిదే. ఉత్పత్తి యగునదంతయు మరణించునదే. మాయారూపమునుదాల్చునదంతయు జెడిపోయెడిదె 12. వృద్ధినొందునదంతయు క్షీణించెడిదె. వచ్చునదంతయుఁ బోయెడిదె. కల్పాంతమునందు భూతములను భూతములె తినివేయును 13. దేహధారులెన్నిగలవో యన్నియు నాశమొందునవె. ఇది ప్రత్యక్షమగు నంశము. మనుజుఁడులేనిది వీర్యోత్పత్తి యెటులగును ? 14. అన్నము లేకున్న వీర్యమెక్కడనుండి కలుగును ? ఓషధులు లేనిచో అన్నమెట్లు వచ్చును ? పృథ్విలేకున్నయెడల ఓషధు లెట్లుండును ? 15. ఉదకములేనిది పృథ్వి యేర్పడఁజాలదు. తేజము లేకున్నచో జలము కలుగనేరదు. వాయువు లేకున్న చోఁ దేజము కలుగఁజాలదు 16. అంతరాత్మ లేకున్నచో వాయు వెట్లు కలుగును? వికారములేకున్నచో అంతరాత్మ యెక్కడనుండి వచ్చును ? చూడుఁడు. నిర్వికారమునందు వికార మెచ్చటినుండి వచ్చినది ? 17. నిర్వికారమునందు పృథివ్యాపస్తేజోవాయు అంతరాత్మాది వికారము లెవ్వియులేవు 18. నిర్వికారమును నిర్గుణమును నగునదియే శాశ్వతలక్షణము. అష్టధాప్రకృతి సంపూర్ణముగ నాశవంతమైనది 19. నాశవంతమగునదంతయు నుండియు నశించినదగుచున్నది. సారాసార విచారమువలన సమాధానము కలుగును 20. ఇట్లు వివేకపూర్వకముగఁ జూచినచో సారాసారవిచారము హృదయమునఁ బాదుకొనును 21.

శాశ్వతమును నిర్గుణము సగునదె ముఖ్యాద్వైతమని యిప్పుడు విదితమైనది. ఇంక నేను అనువాఁడెవఁడు ? అనువిషయము తెలియవలసి యున్నది 22. "నేను" ఎవ్వాఁడు ? అనునది తెలియవలసియున్నది. దేహముయొక్క సంపూర్ణ తత్త్వముల నన్వేషించుటవలన నేను నీవు అనునది మనోవృత్తియందుండునని విదితమగుచున్నది 23. శరీరమునంతను వెదకుటచేతను తత్త్వవిచారణ మొనరించుటచేతను నేను నీవు అనుదాని జాడపాడ లెచ్చటను గాన్పింపవు. వాస్తవమునకు నేను నీవు అనుభావము తత్త్వములలోనే లీనమైయుండును 24. దృశ్యపదార్థములు నిరసనమగుటయుఁ దత్త్వములలోఁ దత్త్వములు లయమగుటయుఁ దటస్థించినయెడల అప్పుడు నేను నీవు అనునదెచ్చట శేషించును ? ఆ సమయమునఁ గేవల వస్తువే వాస్తవముగ శేషించియుండును 25. పంచీకరణ తత్త్వవివరణ మహావాక్యములవలన "నేనే వస్తువునై యున్నాను" అనునది సిద్ధాంతమగుచున్నది. (కాని యిట్లు నుడువుటనుబట్టి యేవస్తువైనను బ్రహ్మము కాఁజాలదు.) నిస్సంగత్వముతో నివేదనము (ఆత్మనివేదనము) గావింపవలెను 26. ఈశ్వరునియొక్కయు, భక్తునియొక్కయు మూలమును శోధించినచో నిరుపాధియుఁ గేవలమునునగు ఆత్మప్రాప్తి కలుగును 27. అహంత్వము (నేననుభావము) మునిఁగిపోవును. వివేకమువలన భిన్నత్వము తొలంగును. నివృత్తిపదవి (ఉన్మనీపదవి) లభించును 28. జ్ఞానము విజ్ఞానములో లీనమగును. ధ్యానము ధ్యేయములోని కరుగును. కార్య కారణాదులన్నింటినిగూర్చిన వివేక ముదయించును 29. అంతటితో జనన మరణముల గోల నశించును. పాపములన్నియు మునిఁగిపోవును. యమ యాతనలు తొలంగిపోవును 30. బంధములన్నియు విడిపోవును. విచారము వలన మోక్షప్రాప్తియగును. జన్మమంతటికిని సార్థకత్వము కలుగును. సందేహములన్నియుఁ దొలంగును. ప్రమాదములన్నియు విడిపోవును. జ్ఞానవివేకమువలన జనులందఱును బవిత్రులగుదురు 31-32. పతితపావనుని దాసులు (పతితపావనుఁడు రాముఁడు, అతని దాసుఁడు రామదాసు) జగత్తును బావనము గావించెదరని పెక్కుమంది హృదయములలోఁ బ్రతీతి కల్గుగును 33.

## నాలుగవ సమాసము — వివేకవైరాగ్యములు.

ఎవనికేని రాజ్యప్రాప్తియై యాతఁడు దానిననుభవించుట యెఱుంగకున్నచో వానిదశ యేమగునో యట్లే వివేకములేని వైరాగ్యయుతుని దశగూడఁ బరిణమించును 1. గార్హస్థ్యముయొక్క నానావిధములగు జంజాటములవలన విసుగొంది వేసారి దుఃఖములపాలైనపిదప మానవునకు వైరాగ్యముదయించును. మనుజుఁ డాస్థితియందు గృహమునువిడిచి వెడలిపోవును 2—3. వాఁడు చింతనువిడిచి పరాధీనతను రూపుమాపి సాంసారికదుఃఖములనుండి ముక్తుఁడై ఆరోగ్యమునొందిన రోగివలె నగును 4. కాని స్వచ్ఛందముగాఁ దిరిగి నష్టుఁడు, భ్రష్టుఁడు కాఁగూడదు 5. వివేకములేనిది వైరాగ్యమును గైకొనువాఁడు అవివేకకారణమున అనర్థముల పాలగును. అంతతోఁబోక యిహపరములుగూడ నష్టమగును 6. వానికిఁ బ్రపంచమూ కుదురదు. పరమార్థమూ అంతకుమున్నె కుదురదు. జీవితమంతయు వ్యర్థమగును. అవివేకమువలన అనర్థము కలుగును 7. వైరాగ్యయోగము లేకుండ జ్ఞానసంబంధములగు వైరాగ్య వాక్యములను వదరుట, కారాగృహమున బంధీకృతుఁడగు పురుషుఁడు పురుషార్థములనుగూర్చి మాటలాడుటవంటిది 8. వైరాగ్యశూన్యులై జ్ఞానసంబంధవాక్యములను జెప్పుట వ్యర్థమగు నభిమానము జూపుటయే. ఇట్టిమనుజుఁడు మోహ, దంభ కారణమునఁ గష్టము లనుభవింపవలసి వచ్చును 9. కట్టివేసియుంచినను గుక్క మొఱుగుచుండును. అట్లే దంభశీలుఁడుగూడ స్వార్థముకొఱకు (ఎన్నియో వేదాంతవాక్యముల) వల్లించుచుండును. మఱియు నాతఁడభిమానకారణమున రెండవవాని యుత్కర్షఁ గాంచి సహింపఁజాలఁడు 10. వివేకములేని వైరాగ్యము, వైరాగ్యము లేని వివేకము అను నీరెండవస్థలందును శోకమే కలుగును. ఇఁక నిప్పుడు వివేకవైరాగ్యముల రెంటి సంయోగము కలవాని లక్షణముల నాలకింపుఁడు 11.

వివేక వైరాగ్యములు గల మానవుఁడు లోలోన విరక్తుఁడగును. మఱియు వైరాగ్యముకతన ప్రపంచమున కతీతుఁడగును. ఇట్లాతఁడు అంతర్బాహ్యములనుండి ముక్తుఁడై నిస్సంగయోగి యగును 12. నోటి

నుండి చెప్పుజ్ఞానవాక్యములకుఁ గొంచమేని మార్పులేనివిధమున నాచర ణముగూడ నుండును. అతనియుపదేశములను విని గొప్పగొప్ప పవిత్ర పురుషులుగూడఁ జకితులగుదురు 13. త్రైలోక్యరాజ్యమును గూడ నాతఁడు లెక్కచేయఁడు. వైరాగ్యస్థితి వానిహృదయమునఁ బాదుకొని యుండును. ఆతని హృదయమునఁగల యత్నవివేకధారణాశక్తులకు మేరయే యుండదు 14. హృదయపూర్వకముగా నాతఁడు మనోహర ముగను రసవంతముగను హరికీర్తన మొనరించును. తాళస్వరములతోఁ బ్రేమపూర్వకముగ భక్తిపూర్ణములగు భజనముల గానమొనరించును 15. ఆతని హృదయమునందు జనసముదాయమును తత్కాలముననే సన్మార్గ మునఁ బ్రవేశపెట్టఁగల వివేకము మెలకువతోనుండును. అనుభవసాహిత్య మాతని హృదయమును విడిపోవదు 16.

సన్మార్గమును బ్రచారముజేయుచుఁ దన వ్యాపకత్వమువలన నెవ్వడు సంపూర్ణజనులలోఁ గలసిపోవునో యాతనికి జగదీశ్వరుఁడు ప్రసన్నుఁడగును. సత్యమేమన్నచో, సందర్భమును గనిపెట్టవలెను 17. తీక్ష్ణమగు వైరాగ్యము, ఉదాసీనత్వము, అనుభవజన్యమగు బ్రహ్మజ్ఞా నము, స్నానసంధ్యలు, భగవద్భజనము, పుణ్యమార్గాచరణము కలిగి యుండవలెను 18. వివేకయుక్తమగు వైరాగ్యమె సరియగు వైరాగ్యము. కేవలవిరాగమునగాని శబ్దజ్ఞానమాత్రమునఁగాని కార్యమెన్నఁటికిని నెరవేరఁ జాలదు 19. కాఁబట్టి వివేకవైరాగ్యములు రెండును గలిగియుండుట మహాభాగ్యము. ఈ విషయమును యోగ్యులగు సాధువులే యెఱుంగు దురని రామదాసు నుడువుచున్నాఁడు 20.



## ఐదవ సమాసము – త్రివిధాత్మనివేదనము.

గీతలవంపులవలన అక్షరము లేర్పడుచున్నవి. అక్షరములనుండి శబ్దములు కలుగుచున్నవి. శబ్దములతోఁ గద్యపద్యమయమగు ప్రబంధము లేర్పడుచున్నవి 1. ఇట్లు వేదశాస్త్రపురాణములు, అనేక కావ్యములు మున్నగు అసంఖ్యాకగ్రంథములు నిరూపణ మొందుచున్నవి 2. ఋషు లనేకులు. వారలమతము లనేకములు. భాషలుగూడ నట్లేయున్నవి. ఇంతి

యగాదు, లిపులుగూడ అనంతములుగా నున్నవి 3. వర్గము, ఋక్కు, శ్రుతి, స్మృతి, అధ్యాయము, సర్గము, స్తబకము, జాతి, ప్రసంగము, మానము, సమాసము, ప్రకరణము మున్నగు భేదములుగలవు 4. పదము, శ్లోకము, పద్యము, డోరా, సాఖీ, దోహా మున్నగు ఛందోభేదములు గలవు 5. సన్నాయిపాట, నాగస్వరము, మురళీగానము, వీణాగానము, కథాగానము మొదలగు నానావిధ గానములు గలవు. ఇట్లే అనేకవిధము లగు నాటలుగలవు 6. ధ్వని, ఘోష (నాదము) చతుర్విధవాణులతో నున్నవి. దీనిభేదములను వినుఁడు 7. ఉన్మేషము (స్ఫురణము) పర నుండియు, ధ్వని పశ్యంతినుండియు, నాదము మధ్యమనుండియు, శబ్దము వైఖరినుండియు ఉత్పన్నము లగుచున్నవి. వైఖరి నానాశబ్దరత్నములను వెల్లడించును 8. అకారము, ఉకారము, మకారము, అర్ధమాత్రము గలిసిన"ఓం"అనుమూడున్నరవర్ణముల మాత్రముననే సంపూర్ణ వర్ణ సము దాయ ముత్పత్తియయ్యెను 9. పిదప రాగజ్ఞానము, నృత్యభేదము, తానమానము, అర్థభేదము, తత్త్వజ్ఞానము మున్నగునవి సృష్టియయ్యెను 10. శుద్ధసత్త్వగుణమే సంపూర్ణతత్త్వములలో ముఖ్యతత్త్వము. ఓం యొక్క అర్ధమాత్రమే శుద్ధతత్త్వగుణము (మహత్తత్త్వము లేక మూల మాయ) ఐయున్నది* 11. చిన్న పెద్దతత్త్వము లెన్నియోగలిసి ఎనిమిది విధములగు శరీరములయ్యెను. అష్టధాప్రకృతి నాశవంతము 12. పర బ్రహ్మము వాయురహితమగు ఆకాశమువలె ఘనముగా నున్నది. అష్ట దేహములను నిరసించి పరబ్రహ్మమును జూడవలెను 13. బ్రహ్మాండము మొదలుకొని పిండముదనుక నుత్పత్తి. పిండమునుండి బ్రహ్మాండముదనుక సంహారము. ఈ రెంటికిని వేఱుగనున్న శుద్ధసారమే విమలబ్రహ్మము 14. దృశ్యప్రకృతి జడము. ఆత్మ చంచలము. విమలబ్రహ్మము నిశ్చలము. దానినే వివేకించి దానియందే తద్రూపుఁడు కావలెను 15. తనువు, మనస్సు, వాక్కు మఱియుఁ బదార్థమాత్రసహితముగ నేను పరమాత్మునకుఁ జెందియుంటినని యెఱుంగుట జడాత్మనివేదనము 16. సంపూర్ణసృష్టికిఁ

---

* ఓంలోనున్న అకారము తమోగుణమునకు, ఉకారము రజోగుణమునకు, మకా రము సత్వగుణమునకు దర్శకములై యున్నది. అర్ధమాత్ర (బిందువు) శుద్ధతత్త్వగుణము (లేక మూలమాయ లేక మహత్తత్త్వము)నకు దర్శకము.

గ ర్తయగు జగదీశ్వరుని యంశములే ప్రాణిమాత్రములు. సమస్తము జగదీశ్వరునిదే. మనమేమియుఁ గాము. ఆతఁడే కర్తయని తెలిసికొనుట చంచలాత్మనివేదనము. 17-18. చంచలమాయ స్వప్నమువలె నశ్వరమైనది. పరమాత్మ నిశ్చలమును, నిరాకారమునై యున్నది. ఇదిగాక చంచలమాయ యెప్పుడు వాస్తవమునం దేమియు లేకున్నదో యప్పుడు "మనము" (మేము) అనుకల్పనమే మిథ్య *. ఇది నిశ్చలాత్మనివేదనము 19 - 20. పైనిఁజెప్పిన మూడువిధములగు విచారములు గావించినపిదప మనమునన దేమియులేదు. రెండవది (ద్వైతము) లేనేలేదు. మనమే లేనప్పుడు నేననునది కలుగుటయెక్కడ సంభవమగును? 21. యోచింపఁగ యోచింపఁగ అంతయు ననుమానములోనికి వచ్చును. తెలియుచుఁ దెలియుచుఁ దెలిసిపోవును. పూర్ణానుభవము కలిగినపిదపఁ జెప్పుట శాంతించును 22.



## ఆఱవ సమాసము — ఉత్పత్తిక్రమము.

పరబ్రహ్మము నిర్మలమును, నిశ్చలమును, శాశ్వతమును, సారమును, అమలమును, విమలమును, ఆకాశమువలె సర్వవ్యాపకమును నైయున్నది 1. ఆ పరబ్రహ్మమునకు చేయుట, పెట్టుట, పుట్టుట, మరణించుట, ఎఱుంగుట, ఎఱుంగకుండుట మున్నగునవి లేవు. అది శూన్యమునకంటెఁగూడ అతీతముగనున్నది 2. అది యేర్పడుటలేదు. చెడుటలేదు. ఆగుటలేదు. పోవుటలేదు. మాయాతీతముగ నిరంజనముగ నదియున్నది. దానికి మేరలేదు 3. (పరబ్రహ్మమునుండి) తొలుత నుదయించు సంకల్పమును షడ్గుణుండీశ్వరుఁడనియు అర్ధనారీనటీశ్వరుఁడనియుఁ జెప్పుదురు 4. అతనిని సర్వేశ్వరుఁడు, సర్వజ్ఞుఁడు, సాక్షి, ద్రష్ట, జ్ఞానఘని, పరేశుఁడు,

* ఆత్మనివేదనము మూడువిధములు. జడము, చంచలము, నిశ్చలము. నేను నాది యనునదంతయు ఈశ్వరునిదనుబుద్ధి కలుగుట జడాత్మనివేదనము. ఉన్నదంతయు ఈశ్వరరూపము, అనఁగా కొంతయున్నది, అది యీశ్వరస్వరూపమని తెలియుట చంచలాత్మనివేదనము. పరబ్రహ్మ స్వరూపముకంటె వ్యతిరేకమైన దెద్దియును లేదని నిశ్చయించుట నిశ్చలాత్మనివేదనము.

పరమాత్ముఁడు, జగజ్జీవనుఁడు, మూలపురుషుఁడు అనియందురు 5. ఆత నినే (దానినే) మూలమాయయనికూడ నందురు. అతఁడు బహుగుణిశిశై యుండును. సృష్టి గావింపవలయునను సంకల్పము గలుగఁగనే ఆతనిని (ఆ పరబ్రహ్మమును) గుణక్షోభిణి యందురు. త్రిగుణము లాగుణక్షోభిణి నుండియే కలుగుచున్నవి 6. పిదప చేతనరూపియు సత్త్వగుణాకారుఁడు నగు విష్ణువు యుత్పన్నమగుచున్నాఁడు. ఈతఁడు త్రిలోకములను బాలించును 7. తరువాత జ్ఞానాజ్ఞాన మిశ్రితమును రజోగుణరూపము నగు బ్రహ్మ జనించుచున్నాఁడు. ఆతనివలన నీ మూఁడులోకము లుత్పత్తి యగుచున్నవి 8. ఆవల సకలసంహారకారణుఁడును, తమోగుణ స్వరూపుఁడును నగు రుద్రుఁ డుత్పన్నమగుచున్నాఁడు. ఇంతటితోఁ గర్తృత్వము సమాప్తమగును 9.

అనంతరము పంచభూతములు వ్యక్తమగుచున్నవి. ఈరీతిగా అష్టధా ప్రకృతి స్వరూపములు మూలమాయనుండి యేర్పడుచున్నవి 10. నిశ్చల మునందుండు చలనమే వాయులక్షణము. పంచభూతములు, త్రిగుణములు కలిసి అష్టధా సూక్ష్మప్రకృతి యగుచున్నది 11. ఆకాశము అంతరాత్మ వలెనే యుండును. దానిమహిమను అనుభవముతో నెఱుంగవలయును. దానినుండియే వాయువు జనించుచున్నది 12. ఆ వాయువు రెండువిధముల నుండును. ఒకటి శీతలము, రెండవది ఉష్ణము. శీతలవాయువువలనఁ దారాగణము చంద్రుఁడు నుదయించుచున్నారు. అట్లే ఉష్ణవాయువువలన సూర్యుఁడు, అగ్ని, పిడుగు మున్నగునవి యుదయించుచున్నవి. శీతలము ఉష్ణము అను నీ రెండునుగలసి "తేజ" మని పిలువఁబడును 13-14. తేజమువలన జలము జనించుచున్నది. ఉదకమువలన పృథ్వీరూపము కలుగుచున్నది. అనంతరము అనంతములగు నోషధీసముదాయ ముత్పన్నమగుచున్నది 15. ఓషధులవలన బహువిధబీజములు అన్నాదులరసము ఉత్పన్నమగుచున్నది. అట్లే భూమండలమునందు ఎనుబదినాలుగులక్షల యోను లుదయించుచున్నవి 16.

ఇట్లు సృష్టియగుచున్నది. ఈ యంశమును హృదయమునకుఁ దెచ్చుకొనవలయును. ప్రతీతిలేకున్నయెడ సందేహపాత్రులు కావలసివచ్చును 17. ఉత్పత్తిప్రకారమిది. ఇట్లే సంహారముగూడఁ గలుగుచున్నది. ఈ విషయ

మున గావించువిచారమును సారాసారవిచార మందురు 18. ఏది యేది యెచ్చటనుండి పుట్టుచున్నదో అయ్యది యచ్చటనే లీనమగుచున్నది. ఈ విధముగా మహాప్రళయమునందన్నింటికిని సంహారము జరుగును 19. ఆది మధ్యాంతములందు శాశ్వతుఁడుగను నిరంజనుఁడుగను నుండు పర బ్రహ్మమును జ్ఞాత లనుసంధానమునం దుంచుకొనవలెను 20. బహు విధములగు రచనలు కలుగుచున్నవి; పోవుచున్నవి. కాని యవి యే మాత్రమును నిలిచియుండుటలేదు. ఇందుచే సారాసారవిచార మావశ్యక మైయున్నది 21. అంతరాత్మను ద్రష్టయనియు సాక్షియనియు నెల్లరు దానిమహిమను గాన మొనరించుచుందురు. కాని యాసర్వసాక్షియవస్థను గమనింపవలెను 22. ఆదినుండి యంతముదనుక నది యంతయు మాయా విస్తారమే. దానియందు నానావిద్యలను కళాకౌశలములు నున్నవి 23. ఉపాధి కంతమును గనుఁగొనినవాని కిదియంతయు భ్రమయని తెలియును. ఉపాధిమగ్నుఁడగు మానవు నెవ్వఁడు వెలికిఁదీయఁగలఁడు? 24. వివేక కార్యములగు అనుభవకార్యములు సందేహపూర్ణములు భ్రమాకుల ములు నెన్నఁటికిని గావు. సారాసారవిచారయోగమువలననే సాధకులు బ్రహ్మమును బడయుచున్నారు 25. వాస్తవమునకు మూలమాయ బ్రహ్మాండముయొక్క మహాకారణదేహము. కాని వివేకహీనులగు పురుషు లీయపూర్ణమునే పూర్ణబ్రహ్మమందురు 26. సృష్టియందు బహువిధ మానవులున్నారు. అందుఁ గొందఱు రాజ్యభోగముల ననుభవించు చున్నారు. కొందఱు అశుద్ధమును మోయుచున్నారు. ఇప్పుడు ప్రత్యక్ష ముగాఁ జూడుఁడు 27. తామే యందఱికంటెను మిగుల గొప్పవారలమని చెప్పుకొనువారలెందఱోగలరు. వివేకియగు పురుషుఁడన్నింటి నెఱుంగును 28. మానవులదశ యీవిధముగా నున్నది. కావున దీనిని విచారింపవలసి యున్నది. పెక్కుమంది యీ విధముగఁ జెప్పుచున్నంతమాత్రమున నీ ప్రపంచమును నిందింపఁజనదు 28-29. పుస్తకపఠనముననే యొకవేళ నిశ్చయ జ్ఞానము గలిగినచో నిఁక గురువు నేర్పఱచికొనవలసిన యవసరముండదు. కావుననే తనయనుభవముతో వివరణ మొనరింపవలయును 30. పెక్కు మంది చెప్పిరని దాని ననుష్ఠించువాఁడు తప్పక శ్రమలపాలగునని గ్రహింప వలెను. యజమాని లేకున్నయెడల వేతనము నెవని నడుగవలయును? 31.

## ఏడవ సమాసము — విషయత్యాగము.

న్యాయకారణమున నిష్ఠురములాడుట చాలమందికి వెగటుగఁ దోఁచును. మనస్సు వ్యాకులముగ నున్నసమయమున భోజనముచేయుట మంచిదిగాదు 1. విషయములను జాలమంది నిందింతురు. కాని యానందించువారలే దానిని సేవించుచుందురు. అట్లేలగావింతురన్నచో, విషయత్యాగము గావించినచో శరీరరక్షణమే యసంభవమందురు 2. చెప్పునదొకటి. చేయునది మఱియొకటి. అట్లొనరించుట వివేకహీనతవలననే సుమా! ఇట్లు వర్తించువానిని గాంచి లోకులు నవ్వుదురు 3. బాగుగా విచారించి చూడుఁడు. విషయత్యాగము గావింపనియెడలఁ బరలోకము కొంచెమేని ప్రాప్తింపనేరదని ప్రతిగ్రంథమునందును జెప్పఁబడెను 4. శ్రోత లిట్లుప్రశ్నించిరి. గృహస్థాశ్రమలోలురు తినుచుఁ, ద్రాగుచునున్నచోఁ బారమార్థికులేమేని యుపవాసముగావించుచున్నారా? ప్రపంచవిషయములయందు గృహస్థులు, విరాగులు సమానముగనే కాన్పించుచున్నారు 5. కావున నో దేవా! (గురువర్యా) దేహముండఁగనే ప్రపంచమునందు విషయముల నెవ్వఁడు బరిత్యజింపగలఁడు? దయచేసి యీసంగతి నాకుఁ దెలుపుఁడు 6. సంపూర్ణ విషయములను విడనాడినపుడే పరమార్థము గావింపనగునని చెప్పువిషయము విచిత్రముగఁ గనిపించుచున్నది 7. వక్త యిట్లు ప్రత్యుత్తరమొసంగెను 8.

వైరాగ్యముతోఁ ద్యాగము గావించినపుడె పరమార్థము లభించును. ప్రపంచమునుద్యజించినయెడల సాంగోపాంగముగాఁ బరమార్థ మేర్పడును 9. పూర్వకాలమునం దీ యార్యావర్తమునందుఁ బలువురు జ్ఞానులుండిరి. వారలుగూడఁ దొలుత నెన్నియో కష్టముల సహించి జ్ఞానులని పేరుబడసిరి 10. తక్కినవారలు మత్సరలోలురై గతించిరి. కొంద 'అన్నమో దేవుఁడా' యనుచుఁ జనిపోయిరి. మఱియు నెందఱో పొట్టకొఱకు భ్రష్టులైపోయిరి 11. తొలుతనుండి వైరాగ్యమన నేమియో యెఱుంగనివారును, ప్రత్యయజ్ఞానరహితులును, శుచి ఆచారముల నెన్నఁడు తెలియనివారును, భజనమును గ్రహింపనివారును నగు మానవులు పరులతో మేము సజ్జనులమని చెప్పుకొనుచుందురు. వాస్తవమునకు

భ్రమయందుఁ బడియున్నందుననే అట్లు భాషించుచున్నారు 12-13. తమ పూర్వకృతకర్మములఁ దలంచి పశ్చాత్తాపము నొందకుండుటయే గొప్పపాపము. ఇట్టి బద్ధపురుషులు పరోత్కర్షను గాంచినంతనే క్షణక్షణమునకు దుఃఖమొందుదురు 14. నూరియొద్ద లేదు. కావున మీయొద్ద నుండుటగూడ సహింపనని చెప్పుమానవులు పలువురుగలరు. ఉన్నంతలోఁ దృప్తిగఁదినుచు, ద్రావుచునుండువానిని దరిద్రులుచూచి సహింపనే సహింపరు 15. దివాలా ఎత్తినవారు గొప్పగొప్ప భాగ్యవంతులనే నింద జేయుదురు. అంతిమగాక సాహుకారును గాంచినచో దొంగలు కన్నము వేయ నుత్సాహపడుదురు 16.

(ఈ స్థితినంతను గాంచినపిదపఁ దెలియవచ్చెడి దేమన) వైరాగ్యమునకు సమానమగు భాగ్యమెద్దియులేదు. వైరాగ్యములేని తావున అభాగ్యము పాదుకొనును. వైరాగ్యములేని పరమార్థకృత్యము యోగ్యముగాదు 17. ప్రత్యయజ్ఞానియు, వీతరాగియు, వివేకబలమున సకలత్యాగియు నైయుండువానినే మహాయోగియనియు, ఈశ్వరీయ పురుషుఁడనియు నెఱుంగవలయును 18. మహాదేవుఁడు అష్టసిద్ధుల నుపేక్షించి యోగదీక్షను వహించి ఇంటింట భిక్షనడుగుచుఁ దిరుగుచున్నాఁడు 19. ఆ మహేశ్వరునితో నేవేషధారిపురుషుఁడైనను సామ్యము కాఁగలఁడా? కావున నెల్లరును సమానము కాఁజాలరు 20. ఉదాసీనుని, వివేకిని జనులందఱును వెదకుదురు. దురాశాపీడితుని, మూర్ఖుని, దరిద్రుని, దుర్బలుని ఎవ్వఁడును నడుగఁడు 21. విచారచ్యుతులును, ఆచారభ్రష్టులును, విషయలోభమున వైరాగ్యమును మఱచినవారలును 22, భజనయన్న రుచింపనివారును శుభపునశ్చరణ మొనర్పనివారలును నగువారి సంపర్కమువలన (ఉత్తముల) మంచితనము వికసింపదు 23. వైరాగ్యశీలురై ఆచారభ్రష్టులు గానివారును, జ్ఞానులై భజనము విడువనివారును, వ్యుత్పన్నులై వితండావాదమునందుఁ బ్రవేశింపనివారును మిగులఁ గొద్దిగనున్నారు 24. పరిశ్రమయొక్క కష్టము ఫలించుటచేతనే పొలమునందు అన్నము (ఫలము) లభించుచున్నది. మంచిపదార్థములు తత్కాలముననే అమ్మకమగును. జ్ఞానియగు పురుషునిసేవకై జనులంద ఱుత్సాహముతోఁ బరుగెత్తుదురు 25. దురాశాపీడితులకు మహత్త్వము నిలిచియుండఁజాలదు.

వారలజ్ఞానము విభ్రష్టమైపోవును 26. నిరర్థకవిషయములను బరిత్యజించి కేవలావశ్యక విషయములనే గ్రహణమొనరించుట విషయత్యాగము యొక్క ముఖ్యలక్షణము 27. పరమాత్ముఁడు సమస్తమునకుఁ గర్త. మాయయనున దేమియును లేదు. ఇదియే వివేకులసమ్మతము 28. శూరత్వమున మిగులఁ దీవ్రతగలిగియుండువానిని బిన్నలు పెద్దలు అంగీకరింతురు. సోమరియుఁ, బ్రయత్నశీలుఁడు నెన్నఁటికి సమానముకారు 29. త్యాగాత్యాగములు, తర్కవిషయములు నెఱింగి చెప్పినదాని ననుసరించి నడుచువాఁడును, పిండబ్రహ్మాండాదుల యథాయోగ్యముగ నెఱింగిన వాఁడును నగు నుత్తమగుణోపేతుఁడును సర్వజ్ఞుఁడు నగు పురుషునితోఁ గలిసికొనుటవలన సులభముగనే సార్థకత్వము కలుగును 30_31.



## ఎనిమిదవ సమాసము — కాలస్వరూపము.

మూలమాయయే జగదీశ్వరుఁడు. సృష్టిక్రమము ననుసరించి అష్టధా ప్రకృతియొక్క ఆకారము మూలమాయవలననే వ్యాపించియున్నది 1. ఇదియంతయు నేమియు లేకుండినపుడు ఒక నిరాకారమే. ఆకాశమువలె విస్తారమాత్రమై యుండెను. అప్పుడు కాలాదికముల కల్పనముగూడ లేకుండెను 2. ఉపాధి విస్తారమైనప్పటినుండియుఁ గాలము దృగ్గోచరమయ్యెను. లేకున్నచోఁ గాలమునకు స్థానమేలేదు 3. ఒకటి చంచలము, ఒకటి నిశ్చలము. ఈ రెండునుగాక కాలమనునది యెచ్చటనున్నది ? ఎంతదనుకఁ జంచలమో అంతదనుకఁ గాలమని యనుకొనుము 4. అవకాశమును ఆకాశమని చెప్పుచున్నారము. అవకాశమని విలంబమును జెప్పుచున్నారము. అట్టి విలంబరూపమగు కాలమును గుర్తెఱుఁగవలెను 5. ఆ విలంబము సూర్యుని కారణమున మనకు విదితమగుచున్నది. దాని వలననే సమస్తమునుగణింప నవకాశముకలిగినది. మఱియు గనురెప్పపాటు మొదలుకొని యుగములదనుక లెక్కింపఁగలిగితిమి 6. సూర్యుఁడుంట వలననే నిమిషము, గడియ, జాము; దినము, సంధ్య, పక్షము, నెల, అయనము, సంవత్సరము, యుగసృష్టి యేర్పడెను 7. సూర్యుని సంబంధముననే ఈ భూమండలమునందు సత్యయుగము త్రేత, ద్వాపరము,

కలియుగము మున్నగు యుగముల సృష్టి యేర్పడెను. శాస్త్రములలో దేవతలకుఁ జెప్పఁబడిన గొప్పగొప్ప యవస్థలన్నియు సూర్యుని కారణ ముననే యుత్పన్నమయ్యెను 8. త్రిగుణాత్మకులగు బ్రహ్మావిష్ణు మహేశ్వ రుల కృత్యము (ఉత్పత్తి స్థితి సంహారములు)సూక్ష్మరూపముగను, విశేష రూపముగను అన్నిపిండములందును జరుగుచున్నవి. కాని జనులు సంప్ర దాయమును వదలివేయుచున్నారు. ఈ కారణముననే వారికి అజ్ఞత కలుగుచున్నది 9. మిశ్రిత త్రిగుణము లెస్సఁటికిని వేలువేలు కాఁజాలవు. ఆదినుండి అంత్యముదనుక సృష్టిరచనము వానివలననే సాగుచున్నది. ఏది పెద్దదియో, ఏది చిన్నదియో యెట్లు నుడువనగును ? 10. ఇది జ్ఞాత యొక్క పని. అజ్ఞాని వ్యర్థముగ భ్రమయందుఁ దగుల్కొనుచున్నాఁడు. అనుభవసహాయమున ముఖ్యతత్త్వము నెఱుంగవలయును 11. ఉత్పన్న కాలము, సృష్టికాలము, స్థితికాలము, సంహారకాలము మున్నగు ఆద్యంత కాలములన్నియు విలంబరూపములే 12. ప్రసంగానుసారముగఁ గాలమను పేరుపడిపోయినది. అనుమానకారణమున నీయంశ మొకవేళఁ జక్కఁగ ధ్యానములోనికి రాకున్నచో ముం దీ విషయమునుగూర్చి యింకను వినుఁడు 13.

వర్షకాలము, శీతకాలము, ఉష్ణకాలము, సంతోషకాలము, సుఖ దుఃఖకాలము, ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలము, వసంతకాలము, పర్వకాలము, కఠినకాలము మున్నగుకాలములన్నియుఁ బ్రసంగానుసారముగా నెఱుంగఁబడుచుండును 14 - 15. జన్మకాలము, బాల్యకాలము, తరుణకాలము, వృద్ధకాలము, అంత్యకాలము, విషమ కాలము మున్నగునవియెల్ల సమయముయొక్క రూపములు 16. సుకా లము, దుష్కాలము, ప్రదోషకాలము మొదలగు సమయములన్నియుఁ గలిసి కాల మనఁబడును 17. జరుగుచున్నదొకటి తెలియవచ్చుచున్నది వేఱొకటి. దీనిపేరు వివేకహీనత. నానావిధములుగనున్న ప్రవృత్తి జనులుప్రవృత్తినే యెఱుంగుదురు 18. ప్రవృత్తి అధోముఖముగ నడుచును. నివృత్తి ఉచ్చముఖముగా నడుచును. ఉచ్చముఖముగా నడుచుటవలన నానాసుఖములు కలుగును. వానిని వివేకియే యెఱుంగును 19. బ్రహ్మాండరచన మెచ్చటినుండి జరిగెనో

యంతదనుక వివేకియగు పురుషుఁడు తనదృష్టిని బ్రసరింపఁజేయును. అంతియగాక వివేకి వివరణమొనరించి యొనరించి పూర్వాపర (మూల) స్థితులనుఁ బ్రాపించును 20. ప్రపంచమునందుండి పరమార్థమును సాధించుఁ వాఁడును, బ్రారబ్ధయోగమున జనులలోఁగలిసియుండువాఁడును గూడ నాస్థితినె పడయును 21. మానవులందఱకును మూలమొక్కటియే. కాని యీ మానవులలోఁ గొందఱు జ్ఞాతలుగను మఱికొందఱు మూర్ఖులుగా నున్నారు. వివేకముతోఁ దత్కాలముననే పరలోకమును సాధింపవలెను 22. వివేకమువలననే జన్మము సార్థకమగును. వివేకినే ఇహాపర సాధకులగు జనులు మంచివాఁడందురు. వాస్తవములో ముఖ్యతత్త్వము నన్వేషింపవలెను23. వివేకహీనులగు మనుజులను పశుసమానులుగ భావింపవలెను. అవివేకులమాటలు వినినయెడలఁ బరలోకమెట్లు లభింపఁగలదు? 24. మంచిది. దీనివలన మనదేమిపోవుచున్నది. మానవులెట్లు కర్మము నొనరింతురో అట్లు ఫలము నొందుదురు. విత్తినదెద్దియో అదియే మొలచును. మఱియు దానినే మానవు లనుభవింతురు 25. ముందుఁగూడ నెవఁడెట్లు గావించునో యట్లు ఫలమొందును. భక్తియోగమువలన భగవానుఁడు లభించును. భగవంతునకు భక్తునకు నైక్యము కలుగుటవలన అపూర్వమగు సమాధానము ప్రాప్తించును 26. చచ్చినపిమ్మటఁ దమ కీర్తిని లోకమున వదలిపోవనివారలు సాధారణముగ నిట్లే లోకములోనికి వచ్చుచుఁ బోవుచుందురు. చతురులయ్యును ధర్మమును మఱతురు. ఏమి చెప్పవలయును? 27. అంతయు నిచటి దిచటనే యుండునని తెలియుచున్నది. ఓయీ సోదరా! చెప్పవేమి? ఎవ్వఁడేమితీసికొని పోవుచున్నాఁడు? 28. సాంసారికపదార్థముల విషయమున ఉదాసీనతతో నుండవలెను. మఱియు నిశ్చింతగ వివేకమును సాధింపవలయును. ఇట్లు చేయుటచే అలభ్యుఁడగు జగదీశ్వరుఁడు లభించును 29. జగదీశ్వరుఁడు లభించుటకు సమానమగు లాభమెద్దియు లేదు. అవసరమునుబట్టి అన్నింటి నొనరించుచు గృహకర్మములు నెఱవేర్చుచునుండినను గూడ సమాధానము బ్రాప్తించును 30.

పూర్వకాలమునందు జనకాది రాజన్యు లెందరో రాజ్యమును బాలించుచు భగవానుని బొందిరి. ఇప్పటికిఁగూడ నిట్టిపుణ్యశ్లోకులెందరో

గలరు 31. రాజునకొకవేళ మృత్యువాసన్నమగుచో నా రాజు తనకున్నది గదా యని లక్షలు కోట్లకొలఁది రూప్యముల లంచమిచ్చెద నన్నను మృత్యువాతని నేమాత్రమును విడువఁజాలదు 32. ఇది యిట్టి పరాధీన జీవితము. జీవికసంబంధములగు నానావిధ కష్టోద్వేగ చింతాదులయం దెంతదనుకఁ జిక్కుకొని యుందము? 33. కావున మానవులారా! ప్రపంచమను (గార్హస్థ్యమను) వ్యాపారవీథి తెఱువఁబడియున్నది. దీనిఁ నుండుఁ జరించి యీశ్వరుఁడను లాభమును ఆర్జింపుఁడు. అప్పుడే యీ కష్టములకుఁ బ్రత్యామ్నాయము లభించును 34.

---

## తొమ్మిదవ సమాసము – ప్రయత్నమునుగూర్చిన యుపదేశము.

దుర్బలులును, జేతకానివారలును, దరిద్రులును, సోమరులును, దిండిపోతులును, ఋణగ్రస్తులును నగు మనుజులందఱును మూర్ఖత్వము వలననే న్యస్తులై (వేరుపడినవారలుగ) యున్నారు. ఇంక నేకారణమునను గాదుసుమా! 1. “తినుటకులేదు, త్రాగుటకులేదు, తొడుగుటకులేదు. పఱచుకొనుటకులేదు, కప్పుకొనుటకులేదు. కడకు నివసించుటకు గుడిసె గూడ లేదు. అభాగ్యుఁడై యున్నాఁడు 2. సహాయులులేరు, కుటుంబులు లేరు, ఇష్టులులేరు, మిత్రులులేరు, ఎఱిఁగినవారలుగూడ నెచ్చటను గానిపింపరు. ఆశ్రయరహితుఁడును బరదేశియును నై యున్నాఁడు 3. ఇట్లున్న పురుషుఁ డేమిచేయవలయును? ఎవరిసహాయమును దీసికొనవలయును? బ్రదుకవలయునా? లేక చావవలయునా? ఏ విధముగ వర్తింపవలయును ? తెలుపు”మని యొకఁడు ప్రశ్నించెను. ఈ ప్రశ్నమున కింకొకఁ డీవిధముగాఁ బ్రత్యుత్తర మొసంగెను. శ్రోతలు సావధానులై వినవలెను 4-5.

పెద్దపని గానిమ్ము, చిన్నపని గానిమ్ము, చేయని దేదియుఁ గాజాలదు. కావున నో నిర్భాగ్యుఁడా! ప్రయత్నమును గావింపుము. దానివలన నీవుగూడ భాగ్యవంతుఁడ వగుదువు 6. చిత్తమే సావధానముగ నుండ నపుడును యత్నముగూడఁ బూర్తిగ నెరవేరనపుడును, సుఖసంతోషములు లభింపవలయునన్నచో నెట్లు లభించును? 7. కావున సోమరితనమును

విడువవలయును. పరిశ్రమతోఁ బ్రయత్నము చేయవలెను. ఇంతియగాక దుశ్చిత్తతను దొలంగఁద్రోచి వెలువరింపవలెను 8. ప్రాతఃకాలమున లేచి ప్రాతస్స్మరణము గావించి నిత్యనియమానుసారముగ సుభాషితములను గొన్నింటిని పఠింపవలెను 9. వెనుకటిదానిని వల్లించి ముందుదానిని బఠింపవలెను. నియమబద్ధముగఁ బ్రవర్తింపవలెను. వ్యర్థముగ వదరరాదు 10. మలవిసర్జనమునకు దూరమేగి పాత్రతోఁడై రావలెను. మఱల వచ్చునపుడు ఏదేని గొనిరావలెను. రిక్తహస్తములతో వచ్చుట మంచిదిగాదు 11. ధౌతవస్త్రములను బిండి ఆరవేయవలెను. పాదములను బాగుగ కడుగుకొనవలెను. అనంతరము యథావిధముగ దేవదర్శనమును దేవతార్చనమును గావింపవలెను 12. పిదపఁ గొంచము ఫలాహారమొనరించి తనవృత్తిని కొనర్పవలెను. పరులనుగూడఁ దనవారలుగ నెంచవలెను 13. సుందరముగా నక్షరములను లిఖింపవలెను. స్పష్టముగను సరిగను జదువవలెను. మనన మొనరించి మర్మమగు నర్థము గ్రహింపవలెను 14. యుక్తమును సుందరమునగు రీతిగఁ బ్రశ్నింపవలెను. చెప్పునది బాగుగాఁ దెలియునట్లు స్పష్టపరచి చెప్పవలెను. అనుభవములేనిది చెప్పఁగూడదు. అట్లుచెప్పుటవలనఁ బాపము కలుగును 15. సావధానముగ నుండవలెను. నీతిమర్యాదలను గాపాడవలెను. జనులకు రుచించునట్లు క్రియాసిద్ధి నొనరింపవలెను 16. వచ్చినవానికి సమాధానము కలిగించి హరికథ, అధ్యాత్మనిరూపణము, సందర్భోచితవర్తనము జరుపవలెను 17. తాళము, చిఱుతలు, ముద్ర, అర్థము, ప్రమేయము, అన్వయము మున్నగునవి శుద్ధముగ నుండవలెను. గద్యపద్యాది దృష్టాంతములుగూడ శుద్ధముగఁ గ్రమానుసారముగ నుండవలెను 18. పాడుట, వాయించుట, ఆడుట, హావభావములను వెల్లడిచేయుట, సభారంజకములగు మాటలనుడువుట, ఉపకథ, ఛందఃప్రబంధములు మొదలగు నివియెల్ల సరిగను జక్కఁగను నుండవలెను 19. పెక్కండ్ర సమావేశపఱచి యెవరికేది యిచ్చయో దానినే చెప్పవలెను. మఱియు కథయందు త్రుటులను (ఆపుటలు) జేరనీయరాదు 20. జనులను మిక్కిలిగ వెక్కిరింపరాదు. లోకులహృదయములను విప్పవలెను. ఇట్లొనరించినయెడల సులభముగా యశము వ్యాపించును 21. భక్తిజ్ఞానవైరాగ్యయోగములను మననము

గావించినంతనే భవరోగములు దూరమగును. నానావిధసాధన ప్రయోగము లను జనసముదాయమునకు వివరింపవలెను22. వాక్యములును వర్తనమును సమానముగ నుండవలెను. దీనివలన స్వాభావికముగ మహాంతు ధర్మము (సాధువృత్తి) ప్రాప్తించును 23. యుక్తరహితమగునది యెంతమంచి దైనను బర్షిగ్రహింపరాదు. అది దురాశారోగము. దానివలన వెంట నుండువారికిఁ గష్టము గల్గును 24. కావున నిట్లెప్పుడును జేయఁజనదు. జనులకుఁ గష్టము కల్గనీయరాదు. హృదయమునందు సమర్థరఘునాథుని జింతించుచుండవలెను 25. ఉదాసీనవృత్తి జనుల కామోదావహముగ నుండును. ఇంతియగాక కథానిరూపణముగూడఁ గావింపనగును. రామ కథను సంపూర్ణ బ్రహ్మాండమునందు వ్యాపింపఁజేయవలెను 26. సాంగో పాంగలక్షణయుక్తుఁడై సుందరముగ లోకప్రియముగ గానము గావింప నేర్చిన మహాంతునకు వైభవమునఁ గొఅంత యెన్నఁటికిని గలుగదు. ఆకాశమునందుఁ దారాగణము లెక్కచోఁ గూడియున్నట్లు మహాంతు వద్ద జనులు గుమిగూడియుంకురు 27. ఎచ్చట బుద్ధియుండదో యచట సర్వమును అవ్యవస్థగనే యుండును. బుద్ధియనున దొక్కటిలేనిచో సమస్త మును వ్యర్థమే 28. బుద్ధిని విస్తరింపఁజేసి మానవుఁడు బ్రహ్మాండము కంటె గొప్పవాఁడు కావలెను. ఇటు లొనరించినచో నీచమగు దరిద్ర మెచ్చటినుండి రాఁగలదు? 29. ఇంతటితో సందేహము తొలంగిపోవును. యత్నమునందు హృదయము ప్రవేశించును. అంతఃకరణమునందు (యత్నమునొనర్చి ఫలము లభించునను) కొంతయాసగూడ అభివృద్ధి నొందును 30.



## పదియవ సమాసము — ఉత్తమపురుషుఁడు.

కడుపునిండ భుజించి పిమ్మట మిగిలిన అన్నమును బంచిపెట్టవలెను. వ్యర్థముగఁ బారవేయుటధర్మముగాదు 1. ఇట్లే సాధకుఁడు తొలుత జ్ఞాన మును గడించి తృప్తినొందవలెను. తరువాత ఆ జ్ఞానమును లోకులకుఁ జెప్ప వలెను. మునిఁగిపోవువారల నుద్ధరించుట యీత నేర్చినవానికి ధర్మము 2. ఉత్తమగుణములను దాను స్వయముగ ముందు గ్రహింపవలెను. తరు

వాత వానినే పలువురకుఁ దెలుపవలెను. తాను నడుచుకొనక యితరుల కుఁ జెప్పునదంతయు మిథ్య 3. స్నానము, సంధ్య, దేవతార్చనమునొనర్చి ఏకాంతమునందు జపమును ధ్యానమును గావింపవలెను. హరికథను అధ్యాత్మనిరూపణమును గావింపవలెను 4. శరీరమును బరోపకారమున నన్వయింపవలెను. పెక్కుమంది కుపకరింపవలెను. ఎవరికిని హాని గలుగ నీయరాదు 5. దుఃఖులు, పీడితులు నగువారల నెరుంగవలెను. యథాశక్తిగ నట్టివారలకుఁ దోడ్పడవలెను. అందఱితో మృదుమధురముగా మాటలాడవలెను 6. ఇతరుల దుఃఖములనుగాంచి దుఃఖియు,ఇతరుల సుఖ మునుగాంచి సుఖియునగువాఁడె ఉత్తమ పురుషుఁడు. మృదువచనములతో ప్రాణిమాత్రులను గలుపుకొనవలెను 7. పెక్కుమంది యన్యాయమును క్షమింపవలయును. పెక్కుమందితలపైఁగల కార్యమును దానొక్కరుఁడె చేయవలయును. మఱియుఁ బరులను సన్మానింపవలయును 8. ఇతరుల హృదయములోని భావమును గ్రహించి తదనుసారముగాఁ బ్రవర్తింప వలయును. జనులను నానావిధముల నట్లే పరిశీలింపవలయును 9. మిత భాషిగ నుండవలయును. తత్కాలముననే ఉత్తరము చెప్పవలయును. ఎప్పుడు గ్రోధస్వభావముతో నుండరాదు. క్షమారూపుఁడై యుండవల యును 10. సోమరితనము నంతలోవిడిచి ప్రయత్నమును విశేషించి చేయవలెను. ఎవరిపట్లఁగూడ మత్సర ముంచరాదు 11. ఉత్తమపదార్థము నితరుల కీయనగును. శబ్దము నాలోచించి పలుకుట యుచితము. సమాధానము వెంటఁ దన గృహస్థధర్మమును సంబాళించుకొనఁదగును 12.

మరణమును స్మరణమునందుంచుకొని హరిభక్తియందు తత్పర భావముతోనుండవలెను. మరణానంతరమునఁగూడ భూలోకమునఁ దన కీర్తిని నిలిపియుంచవలెను 13. ఉత్తమవర్తనము గల మానవుఁడు జను లందఱకుఁ బరిచితుఁడై యుండును. ప్రజలందఱియెడ వినీతభావము గలిగి వర్తించువాని కేవిషయముననేని లోపము గలుగదు 14. ఇట్టి యుత్తమగుణములు గలవానినే వాస్తవమునకుఁ బురుషుఁ డనఁదగును. అతఁ డొనరించుభజనవలనఁ బరమాత్ముఁడు తృప్తినొందును 15. ఇతరు లెంత ధిక్కరించి మాటలాడినను దన శాంతిని భంగము గావింపఁదగదు. దుర్జనులతోఁ గలసిమెలసియుండు సాధువులు ధన్యులు (అనగా దుర్జనులను

దమవంటివారలనుగఁ జేసికొందురు) 6. జ్ఞానవైరాగ్యాది ఉత్తమ గుణములతో శోభించుమానవుఁ డొకఁడే యీ భూమండలమున యోగ్యుఁడు 17. తాను స్వయముగాఁ గష్టమును సహించి పలువురి కుప కారము జేయవలెను. మఱియు నీ విధముగాఁ దన దేహమును బరోప కారమునందు నియోగించి కీర్తిరూపముతోఁ బ్రపంచమునం దమరుఁడై యుండవలెను 18. కీర్తినాశించినచో సుఖము లభింపదు; సుఖమునాశించి నచోఁ గీర్తి లభింపదు. విచారములేని సమాధాన మెచ్చటను లేదు 19. రెండవవాని హృదయమునకు శ్రమ గలుగఁజేయఁజనదు. మఱపు నెప్పటికిని దరిజేరనీయఁగూడదు. క్షమాశీలుఁడగువాని ప్రతిష్ఠ కెప్పటికిని హానిగలుగదు 20. తనదైనను, బరునిదైననుకానిమ్ము. అందఱిపనులను నెరవేర్పవలెను. సమయమువచ్చినప్పుడు పనిచేయుటలో వెనుదీయుట మంచిదిగాదు 21. చక్కఁగ (నమ్రతగ) మాటలాడుటవలన సుఖము గలుగునని యంద ఱెఱింగియున్నారు. పరునినైతము ఆత్మీయునివలె నాదరింపవలెను 22. కఠినశబ్దములు కటువుగనుండునని అంద ఱెఱింగియుఁ గొందఱు కఠినవాక్యముల నేలకో నుడువుచుందురు 23. తనవద్దనున్న చిన్న వస్తువు నింకొకఁడు గైకొనినచో మనస్సున కెంతేని శ్రమగలుగును. ఇట్లే యెల్లరకు నుండునని గ్రహింపవలెను 24. ఇతరులకు మనోవేదనమును, గష్టము గలిగించు వాణి అపవిత్రమైనది. అపవిత్రవాణి యెప్పుడో యొకప్పుడు తననుగూడ సంహరించును 25. విత్తినదే మొలచును. మాటలాడినరీతిగనే ప్రత్యుత్తరము లభించును. ఇట్టిస్థితిలోఁ గర్కశముగా నేలమాటలాడవలయును? 26. తనపురుషార్థవైభవములవలనఁ బలువురకు సుఖము గలుగఁజేయుట యుక్తమెగాని యెవరికైనను గష్టముగలుగఁ జేయుట రాక్షసకార్యము 27. దంభము, దర్పము, అభిమానము, క్రోధముగలమాటలు పలుకుట అజ్ఞానిలక్షణమని భగవద్గీతయొక్క పదునాఱవ యధ్యాయమునందలి నాలుగవశ్లోకమునఁ జెప్పఁబడెను 28. ఉత్తమగుణశోభితుఁడే మిగుల సజ్జనుఁడు. అట్టివానికై మనుజులెందఱో వెదకుచుందురు 29. క్రియలేని కేవలశబ్దజ్ఞానము కుక్కగావించినవమనము. యోగ్యుఁడగువాఁడు దానివైపుచూడనే చూడఁడు 30. మనస్సుబురికొల్పి భక్తియోగము ననుష్ఠించువాఁడును ఉత్తమగుణముల నవశ్యముగా

గ్రహించువాఁడును నగు మహాపురుషునికై జనులు వెదకుచుందురు 31. ఇట్టి మహానుభావులగు పురుషులు జనసముదాయమును ప్రోగుచేయ వలయును. భక్తియోగముతో దేవాధిదేవుఁడగు పరమాత్మని దన వానినిగాఁ జేసికొనవలయును 32. ఎప్పుడో యొకదినమున నాకస్మికముగాఁ జావవలసియున్నదిగదా ! ఇక (మరణానంతరము) భజనము నెవ్వఁడు చేయఁగలఁడు? ఇట్లు తలపోసి ఇంకను పెక్కుండ్రుజనులను భజనమునకు సమకూర్పవలయును 33. (నా యభిప్రాయమేమని యడిగినచో) శిష్యుల నింకేమియు నడుగఁజనదు. ఓ యన్నలారా! నేను మరణించినపిదప మీర లందఱును జగదీశ్వరుని భజింపుచుండుఁడు. (ఇదియే నా కోరిక అనెదను) ఇదియె నా ప్రతిజ్ఞ 34. కావున మిగుల నుత్సాహముతో జనసముదాయ మును ప్రోగుజేయవలయును త్వరితముగ దేవాధిదేవుని ప్రసన్నుని గావించుకొనవలయును 35.

ఇఁక సముదాయముకొఱకు ఆవశ్యకములగు విషయములు రెండు గలవు. శ్రోతలందఱును సావధానముగ మనస్సు నిటనుంచి యవియేవియో వినవలయును 36. పెక్కుమంది హృదయములలో భక్తియేయుక్తివలన నుత్పన్నమగునో నా యుక్తి ప్రబోధయుక్తి (బోధించునైపుణ్యము) అనేకుల హృదయమును దనచేతిలోనికిఁ దీసికొనవలయును 37. వెనుక వివరింపఁబడిన యుత్తమగుణములు మానవున కుండవలసినవె! కాని ప్రబోధశక్తి (ఉపదేశమునిచ్చెడుబలము) వాని యన్నింటికంటె నత్యధికా వశ్యకము 38. రెండవ విషయమెద్దియన్న, చెప్పినదాని నెవఁడనుసరించునో మొదటఁ దానొనరించి పిదప నితరుల నెవఁడుజేయుమని చెప్పునో అట్టివానిమాటల నెల్లరును సత్యమని యంగీకరింతురు 39. జనులు తమకు రుచింపనిమాట లెన్నఁటికిని విశ్వసింపరు. ఆ పరిస్థితులలో నొంటరిగ నొక్కమనుజుఁ డేమిచేయఁగలఁడు? 40. కావున వెంబడించువారలు (అనుయాయులు) ఉండవలెను. కొద్దికొద్దిగ వారికి నేర్పవలెను. మెల్ల మెల్లఁగ వివేకసహాయమున వారలను దీరము జేర్పవలెను 41. కాని

యిది వివేకముతోఁ గాదగుపని. దీనిని వివేకులే చక్కఁగ యుక్తియుక్తముగ నెరవేర్పఁగల్గియుందురు. ఇతరులవలనన్ననో, పాపము ఇతరుల భ్రమలలోనై తగవులాడుచుందురు 42. సైన్యమేమియులేని ఒంటి మనుజుఁడు పలువురితోఁ బోరాడి యెట్లు జయింపగలఁడు? ఈ కారణమ ననే పలువురుమనుజులను దనకిష్టులనుగ నుంచుకొనవలెను 43.

పంద్రెండవ దశకము సమాప్తము.





# పదమూఁడవ దశకము.

## మొదటి సమాసము — ఆత్మానాత్మ వివేకము.

ఆత్మనుగూర్చియు, అనాత్మనుగూర్చియు వివేచన మొనరింపవలెను. అనంతరమున చక్కఁగ మననము గావింపవలయును. మననమొనర్చి దృఢపూర్వకముగ మనస్సునందు ధరింపవలయును 1. ఆత్మయెద్ది ? అనాత్మ యెద్ది ? దీని నిరూపణమును సావధానులరై వినుండు 2. పురాణములలోఁ జెప్పఁబడిన విధముగా నాలుగుఖనులు (అండజస్వేదజాది నాలుగుయోనులు) నాలుగు వాణులు (పరాపశ్యంతి మొదలగు వాక్కులు) ఎనుబదినాలుగు లక్షల జీవజాతులు లోకమునందు వర్తించుచున్నవి 3. ఈ సృష్టియందు అపారములు నానావిధములునగు శరీరములుగలవు. వానిలో ఆత్మ యెద్దియో యిపుడు నిర్ణయింపవలయును 4. ఆత్మ ప్రత్యక్షదృష్టితో జూచుచున్నది. శ్రవణముతో నాలించుచున్నది. నాలుకతోఁ జవిజూచుచున్నది 5. ఘ్రాణముతో వాసనజూచుచున్నది. సర్వాంగములతోఁ దాకుచున్నది. వాక్కునందు శబ్దజ్ఞానము గలుగఁజేయుచున్నది 6. ఆత్మ సావధానముగనుండి చంచలమైయున్నది. అది యొక్కటియే ఇంద్రియ సహాయమున నలుదిక్కులను సమగ్రమగు నలజడి గలిగించుచున్నది 7. ఆత్మ పాదములను నడిపించుచున్నది. చేతులను గదిలించుచున్నది. కనుబొమ్మలఁ జిట్లించుచున్నది. కనులను ద్రిప్పుచున్నది. మఱియు నితరసంకేతములను జూపుచున్నది 8. ఆత్మ దంభములు పలికించుచున్నది. లజ్జింపఁ జేయుచున్నది. గోకించుచున్నది. దగ్గుచున్నది. వమనము గావించుచున్నది. ఉమియుచున్నది. అన్నము తినుచున్నది. నీళ్ళను ద్రాఁగుచున్నది 9. ఆత్మ మలమూత్రములను విసర్జించుచున్నది. సంపూర్ణ దేహమును నిర్వహించుచున్నది. ప్రవృత్తినివృత్తుల విచారించుచున్నది 10. ఆత్మ వినుచున్నది. చూచుచున్నది. ఆఘ్రాణించుచున్నది. రుచిజూచుచున్నది. నానావిధముల వర్తించుచున్నది. సంతోషించుచున్నది. మఱియు భయపడుచున్నది 11.

ఆనందము, వినోదము, ఉద్వేగము, చింత, కాయము, ఛాయ, మాయ, మమతల ననుభవించునదియు జీవితకాలమున నానావిధవ్యథల నొందు నదియు ఆత్మ 12. పరమార్థమునం దాస్థఁ బెట్టుకొనునదియు జనులలో మంచిచెడుఁగుల గావించునదియుఁ దనవారలను బ్రతికించునదియుఁ బెర వారలఁ జంపునదియు నాత్మ 13. యుద్ధసమయమునందు ఉభయదళముల లోని మనుజుల దేహములం దాత్మ యావరించియున్నది. ఆత్మచచ్చుచుఁ బడుచుఁ జంపుచుఁ బడవేయుచునున్నది 14. ఆత్మ వచ్చుచున్నది. పోవు చున్నది. దేహమున వర్తించుచున్నది. నవ్వుచున్నది. ఏడ్చుచున్నది. పశ్చాత్తాపము నొందుచున్నది. ఉద్యోగానుసారముగా ధనవంతుఁడో, దరిద్రుఁడో యగుచున్నది 15. పిఱికిపందగను, బలవంతుఁడుగను, విద్యా వంతుఁడుగను, మూఢుఁడుగను, న్యాయవంతుఁడుగను, ఉద్ధతుఁడుగను నగుచున్నది ఆత్మయే 16. ధీరత్వము, ఉదారత్వము, కృపణత్వము, ఉన్మత్తత్వము, విచక్షణత్వము, ఉచ్ఛృంఖలత్వము, సహనశీలత్వము మున్నగు భావములు గలదియే ఆత్మ 17. విద్య, కువిద్యయను రెంటిలో నానందరూపమున వ్యాపించి వర్తించునదియు, ఎచ్చట జూచిన నచ్చట నన్ని దెసలఁ గా న్పిం చు న ది యు ఆత్మనాఁబడును 18. నిద్రించుచుఁ, గూర్చుండుచు, లేచుచు, నడచుచు, బరుగెత్తుచు, ఊగుచుఁ, బొరలుచు, మఱియు జోడుగనుండి యోచనలఁ గావించుచు నుండునదియే ఆత్మ 19. పుస్తకము చదువునది, అర్థమును వివరించునది, తాళమును ధరించునది, పాడఁదొడంగునది, వాదవివాదములను గావించునది యాత్మయేసుమా 20. దేహమునం దాత్మలేకున్నచో నా దేహము శవమగును. ఆత్మదేహ మును వెంబడించుకొని సర్వము గావించు చున్నది 21. ఒకటి లేకున్నచో రెండవది యెందులకుఁ బనికిరాదు. ఆత్మశరీరముల సంయోగమువలనసమస్త వ్యాపారములును నడచుచున్నవి 22. దేహ మనిత్యము, ఆత్మనిత్యము ఇదియే నిత్యానిత్యవివేకము. ఆ సూక్ష్మము (ఆత్మ) యొక్క సంపూర్ణ వృత్తాంతమును జ్ఞానులే యెఱుంగుదురు 23. పిండమునందు దేహధారి జీవుఁడు, బ్రహ్మాండమునందు దేహి శివుఁడు, మఱియు నీశ్వరతనుచతుష్ట యమునందు దేహి ఈశ్వరుఁడు 24, త్రిగుణాతీతుఁడగు అర్ధనారీనటేశ్వరుని వలననే సమస్తసృష్టివిస్తారము జరిగెను 25. అచట (అర్ధనారీనటేశ్వరు

నందు) స్త్రీత్వపురుషత్వములెవ్వియు లేవనియు గొంచెముగనో గొప్పగనో చంచలరూపముగ గోచరించుననియుఁ జక్కఁగ విచారించినచో విశద మగును 26. ఆదినుండి యంత్యముదనుకను బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మొదలుకొని చీమదనుకను నందఱును దేహధారులే. ఈ నిత్యానిత్య వివేక మును జతురులగువారలెల్లరు నెఱుంగవలెను 27. జడమంతయు అనిత్యము. సూక్ష్మమంతయు నిత్యము. ఇందు నిత్యమెద్దియో అనిత్యమెద్దియో ముందే చెప్పితిమి 28. (యోగులు) వివేకముతో నీ స్థూలసూక్ష్మములను రెంటిని లంఘించి పోవుచున్నారు. కారణ మహాకారణదేహములనుగూడ విడిచి వేయుచున్నారు. మఱియు విరాట్టు, హిరణ్యగర్భులను సైతము ఖండన మొనరించుచున్నారు 29. దీనికిఁ బిమ్మట వృత్తి అవ్యాకృతమగు మూల ప్రకృతిలోనికరిగి కూర్చుండును. ఇఁక నీవృత్తిగూడ నివృత్తియగుటకు అధ్యాత్మనిరూపణమును వినవలెను 30. ఇచటఁ జెప్పబడిన ఆత్మానాత్మ వివేకమువలనఁ జంచలాత్మ ప్రత్యయమునకు వచ్చును. ఇక రాఁబోవు సమాసమునందు సారాసారముల నెఱింగించెద 31.

---

## రెండవ సమాసము — సారాసార విచారము.

ఈ కనంబడుచున్న సంపూర్ణ బ్రహ్మాండాడంబరమునందు సార మెద్దియో అసారమెద్దియో గుర్తెఱుంగవలెను 1. కనఁబడునదియెల్ల నశించుచున్నది. వచ్చునదియెల్లఁ బోవుచున్నది. కావున నెల్లప్పుడు చెదరక యుండుదానినే సారమని గ్రహింపవలెను 2. గతసమాసమునందుఁ జెప్పిన ఆత్మానాత్మవివేకమున ఆత్మయెట్టిదో గుర్తించి విడిచివైచితిమి. అంతియగాక ఆత్మ నెఱుంగుటవలన మూలముయొక్కజాడ గోచరించెను 3. కాని ఆ మూలములో శేషించెడి వృత్తిగూడ నివృత్తిగావలెను. అందు లకై శ్రోతలు సారాసారవిచారము చక్కఁగ జేయవలెను 4. నిత్యా నిత్య వివేచనము గావించితిమి. ఆత్మ నిత్యమని స్థాపించితిమి. కాని యానిరాకారమునందుఁగూడ నివృత్తిరూపముతో హేతువు (నివృత్తి యను భావన) అట్లే నిలచియున్నది 5. ఈ హేతువనునదిగూడఁ జంచలమే! వాస్తవమునకు నిశ్చలము నిర్గుణమైయున్నది. సారాసార

విచారమువలన నీ చంచలము (ఆత్మభావన) గూడ నిరసనమైపోవును 6. ఇది నశ్వరము. కావుననే యిది చంచలము. అది శాశ్వతము కావుననే నిశ్చలము. నిశ్చలమునందుఁ జంచల మెగిరిపోవును 7. జ్ఞానమును, ఉపాసనమును జక్కఁగఁ దెలిసికొనుము. ఉపాసనమువలన జనులును, జగత్తును ఉద్ధరింపబడుదురు 8. ద్రష్ట, సాక్షి, జ్ఞాత, జ్ఞానధని, చైతన్యము మొదలగువానికన్నిఁటికిని బయినున్న సత్తయు, ఈజ్ఞానస్వరూపులన్నియుఁ బరబ్రహ్మమేయని చక్కఁగ విచారించుకొనుఁడు 9. కాని యీాజ్ఞానము గూడ విజ్ఞానమగును. మతములన్నింటిని జక్కఁగ విచారించిచూడుఁడు. చంచలమంతయు నాశనమగుచున్నది 10. నాశవంతమగుచున్నదెల్ల నిజముగ నాశమగుచున్నదా లేదా యని సంశయించుపురుషుఁడు సులభముగ నెన్నఁటికిని జ్ఞానాధికారి కాఁజాలఁడు 11. నిత్యమును నిశ్చయముగ నెఱింగినపిమ్మటఁగూడ నొకవేళ సందేహములకుఁ బాల్పడుచో నట్టి మానవుఁడు మహామృగజలమునందుఁ గొట్టుకొనిపోవుచుండెనని భావింపనగును 12. పరబ్రహ్మమునకు క్షయములేదు. అది యక్షయము. సర్వవ్యాపి. ఆ నిర్వికారమునందు హేతువు (సందేహము) లేనేలేదు 13. పరబ్రహ్మము మిగుల గొప్పదియు నఘనము నై యున్నది. ఆదిమధ్యాంతములయం దది అచలముగ, అటలముగఁ, బూర్ణముగ యథావిధమున నున్నది 14. చూచుటకది గగనముగ నున్నను గగనముకంటెను మిగుల సఘనముగా నున్నది. దానియం దంజనము (మలము-తమములేక అనిత్యత) లేదు. అది నిరంజనముగను నిరంతర మేకరీతిగఁ బ్రకాశించునదిగను నున్నది 15. చర్మచక్షువులు, జ్ఞానచక్షులుగూడ నిరర్థకములే. నిర్గుణము వాస్తవమునకు అలక్ష్యము, లక్ష్యింపఁబడనేరదు 16. సర్వసంగపరిత్యాగము గావింపనిది మానవులు పరబ్రహ్మమును గాంచఁజాలరు. మాన్యగర్భుని (బ్రహ్మమును) సర్వసంగత్యాగమొనరించి దర్శింపవలెను 17. నిరసనము గావించుటవలన సమస్తమును వెడలిపోవును. చంచలమంతయుఁ దొలంగును. నిశ్చలపరబ్రహ్మము నిలుచును. ఇదియే సారము 18. ఎనిమిదవదేహము దనుక (మూలమాయవఱకు) నిరసనమగును. సాధుపుంగవులగు మానవులకుఁ గృపాపూర్వకముగ ముక్తిసాధనమును దెలుపుచున్నారు 19. "సోహం, హంసః" (ఆ పరబ్రహ్మము

నేనేనై యున్నాఁడను) తత్త్వమసి (అది నీవై యున్నావు.) ఈస్థితి వివేకము వలన సులభముగనే ప్రాప్తించును 20. ఈస్థితి నొందిన పురుషుఁడు పైకిఁజూచుటకు సాధకునివలె నుండును. కాని లోపల బ్రహ్మమై యుండును. వానికడ వృత్తిగూడ నుండదు. సారాసారవిచారమున కిదియే ఫలము 21. ఆ పరబ్రహ్మము ఉష్ణత్వమొందదు. చల్లఁబడదు. తెలుపును, నలుపును కాదు. మాలిన్యముగాని, శుభ్రముగాని పొందదు 22. అది తడియదు, ఎండదు, చల్లారదు, కాలదు మరియు దాని నెవ్వరును గొనిపోవఁజాలరు 23. అది కనుపింపదు. భాసింపదు. మొలువదు. నశింపదు. వచ్చుటలేదు. పోవుటలేదు 24. అది సన్ముఖముగనే యున్నది. నలుదిక్కులనున్నది. దానికి దృశ్యాభావములేదు. ఇట్టి నిర్వికారబ్రహ్మమునందు లీనమగు సాధుపురుషుఁడే ధన్యుఁడు 25. నిర్వికల్పనముగ (కల్పనాతీతముగ) నుండునదియే సత్స్వరూపము. తక్కిన దంతయు అసత్తు. (భ్రమారూపముననున్నది) 26. కృత్రిమమగుదానిని విడిచి సత్యమును గైకొనువాఁడె పరీక్షకుఁడు. అసారమును విడిచి సారమును (బ్రహ్మమును) గైకొనవలెను 27. తెలుఁగఁగా ఎఱుఁగఁగా ఎఱుకదనము లీనమైపోవును. మఱియు తన వృత్తిగూడఁ దద్రూపమైపోవును. దీనిపేరే ఆత్మనివేదనభక్తి 28. వాచ్యాంశముతో భక్తిని, ముక్తిని బోధింపవలెను. లక్ష్యాంశముతో తద్రూపత ననుభవము గావింపవలెను. మననము చేయఁగఁ జేయఁగఁ నెప్పుడు హేతువుండదో యాయవస్థకే తద్రూపత యని పేరు 29. సద్రూపము, చిద్రూపము, తద్రూపము, తరువాత స్వస్వరూపము, తనరూపము అను నీదశలన్నియుఁ దత్త్వనిరసనమైనపిదపఁ గలుగుచున్నవి 30.

---

## మూఁడవసమాసము — ఉత్పత్తి నిరూపణము.

బ్రహ్మము ఘనమును, నిరాకారమును నై యున్నది. ఆకాశమునకంటె నధికమగు విశాలముగను, నిర్మలముగను, నిశ్చలముగను, నిర్వికారముగను నున్నది 1. బహుకాల మిట్లున్నపిదప నచటనుండి భూగోళము ఉదయించును. ఇపు డాభూగోళమూలమును శ్రోతలు సావ

ధానచిత్తులై వినఁగోరెదను 2. నిశ్చల పరబ్రహ్మమునందుఁ జంచలమగు సంకల్ప ముదయించును. ఆ సంకల్పమునే ఆదినారాయణుఁడనియు, జగ దీశ్వరుఁడనియు, మూలమాయయనియు, షడ్గుణైశ్వర్య సంపన్నుఁడనియు, భగవంతుఁడనియుఁ జెప్పుదురు 3-4. ఆపిమ్మట గుణక్షోభిణి యుండును. అచటనే త్రిగుణము లుదయించుచున్నవి. అచటినుండి ఓంకారము ఉత్పత్తి యగుచున్నది 5. అకార, ఉకార, మకారములు మూఁడుగలసి ఓంకార మయ్యెను. పిమ్మటఁ బంచభూతములు జనించెను 6. అంతరాత్మను ఆ కా శ ము ం దు రు. దానినుండి వాయువు, వాయువునుండి తేజము జనించెను 7. వాయువు రాపిడినుండి అగ్నియు, దానినుండి సూర్య బింబము నుత్పన్నమయ్యెను 8. శీతలవాయువువలన జలము జనించెను. జలము పేరుకొని పృథ్వియయ్యెను 9. పృథ్వియం దనంతకోటి బీజజాతు లుండును. పృథ్వియు జలమును ఐక్యమైనపిదప బీజములనుండి యంకుర ములు వెడలును 10. ఆ యంకురములనుండి లతలు, పత్రములు, పుష్ప ములు, బహువిధ స్వాదుఫలములు జనించుచున్నవి 11. పిదప నానావిధ వర్ణములుగల రసయుతములగు పత్రములు, పూవులు, ఫలములు, మూలములు, ధాన్యములు, అన్నాదులు కలుగుచున్నవి 12. అన్నము నుండి రేతస్సు (వీర్యము) కలుగును. రేతస్సువలనఁ బ్రాణు లుత్పన్న మగును. ఇది యందఱకును బ్రత్యక్షముగఁ దెలిసియున్న యంశమేగదా! 13. అండజములు, జరాయుజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు మున్నగువానికన్నింటికిని బీజము పృథ్వియు జలము నై యున్నది. ఇదియే సృష్టిరచనమునందుఁగల యద్భుత చమత్కారము 14.

ఈ విధములుగ నాలుగుగనులు (అండజాది సృష్టిభేదములు), నాలుగు వాణులు, ఎనుబదినాలుగులక్షల జీవయోనులు, మూఁడులోకములు, పిండము, బ్రహ్మాండము మున్నగునవన్నియు నిర్మాణమగుచున్నవి 15. సంపూర్ణాష్టధాప్రకృతి సాధారణముగ మూలమాయయందే యుండును. ఉదకము పృథ్వితోఁ గలసినపిమ్మట జడచైతన్య జీ వ ము ల న్ని యు జనించును. ఒకవేళ జలమే లేకపోయినచోఁ బ్రాణివర్గమంతయు మర ణించును 16. ఈ చెప్పినదానిలో సందియ మావంతయులేదు. వేదశాస్త్ర పురాణాదులవలన నీ యంశమును విశ్వసింపవలెను 17. విశ్వసింపఁదగిన

సందేహాయుక్తమగు నంశమును గ్రహింపఁదగదు. విశ్వాసములేని తావు ననే వ్యవహారముగూడ నెరవేరదు 18. ప్రవృత్తియందైనను, నివృత్తి యందైనను ప్రతీతికావలెను. ప్రతీతిరహితులై సందేహములలోఁ బడియుండువారలు వివేకహీనులుసుమా 19.

ఈ విధముగ సృష్టిరచనమునుగూర్చిన విస్తారమును సంక్షేపముగ వర్ణించితిని. ఇఁక నీ విస్తారమునకుఁగల సంహారమును వినుండు 20. ఆది నుండి యంతముదనుక జరుగునదంతయు నాత్మారాముఁడే జరుపు చున్నాఁడు. మఱియు నాతఁడే యథాయోగ్యముగ దీని వ్యవస్థనుగూడఁ గావించుచున్నాఁడు 21. ఇఁకముందుఁ బ్రళయనిరూపణమును వినవలెను. ఇంతటితో నీ సమాసము పూర్ణమగుచున్నది 22.

## నాలుగవసమాసము — ప్రళయ నిరూపణము.

ప్రళయకాలమునందుఁ బృథివి యంత్యమైపోవుననియు సంపూర్ణ భూతములు నష్టమగుననియు శాస్త్రములందుఁ జెప్పఁబడెను 1. నూఱు సంవత్సరములదనుక అనావృష్టియుండును. దీనిచే సంపూర్ణసృష్టి కాలి పోవును. పృథ్వియందుఁ బర్వతములుగూడ నిమిడిపోవఁగలయంతటి నెఱ్ఱెలు పడిపోవును 2. పండ్రెండు కళలతో సూర్యుఁడు భూమిని దపింపఁజేయును. సూర్యకిరణములనుండి అగ్నిజ్వాలలు వెలువడును. నూఱుసంవత్సరముల దనుక భూమండలము తగులబడుచుండును 3. వసుంధర సిందూరవర్ణ మొందును. శేషనాగము కాలివేగముగ విషమును గ్రక్కును 4. ఆ విష మునుండి వెడలిన హాలాహలజ్వాలలచే సప్తపాతాళములుగూడఁ గాలును. పాతాళలోకముగూడ నీ విధముగ మహాపావకమునందు భస్మమగును 5. పిదప మహాభూతములు సంతప్తమగును. ప్రళయవాయువు బయలు వెడలును. నలుదిక్కులఁ బ్రళయాగ్ని విజృంభించును 6. ఏకాదశరుద్రులు కుపితులగుదురు. ద్వాదశాదిత్యులు కాలి వేండ్రమై పగిలిపోవుదురు. మఱియుఁ బ్రళయకాలమునందు అగ్నులన్నియు నొక్కటియగును 7. వాయుఘాతమునను, అశనిఘాతమునను భూమియంతయుఁ బగిలిపోవును. భూమికి సహజముగఁ గల పీఠస్థితి (సఘనత్వము) భిన్నభిన్నమగును 8.

అప్పుడు మేరుపర్వతముగూడ లెక్కలోనికిరాదు. ఎవరు దేనిని గాపాడఁ గలుగుదురు ? చంద్రసూర్యులయొక్కయుఁ దారాగణముయొక్కయు ఆధారస్థానము బంధింపఁబడును 9. భూమి తన వీర్యమును (కాఠిన్యమును) విడచివేయును. పృథ్వియంతయు మండిపోవును. ఈ విధముగ నీ బ్రహ్మాండము ఒక్కసారిగ గాలిపోవును 10.

అనంతరము గొప్పవర్షము గురియును. అపుడు భూమండలము జలమునందు లయమగును 11. కాల్చిన సున్నము నీటిలోఁ గరగిపోవునట్లు పృథ్విగూడఁ బిమ్మట నదృశ్యమగును. తన కాఠిన్యమునంతయు విడచి జలమునందుఁ గలసిపోవును 12. శేషకూర్మవరాహములు నష్టమగుటవలన బృథ్వికిగల యాధారము తొలంగును. మఱియు నది తన సత్వమునువిడిచి నీటిలోఁ గలయును 13. ప్రళయమేఘము లొక్కచో గుమి యగును. మిగుల ఘోరధ్వనితో గర్జించును. మెఱుపులు, ఉఱుములు అఖండరీతిగఁ బ్రజ్వలించును. కోలాహల ముప్పతిల్లును 14. పర్వతములవంటి వడగండ్లు పడును. కొండలనుగూడ నెగురఁగొట్టునంతటి గాలివీచును. నిరుపమానముగా గాఢాంధకారము వ్యాపించును 15. సంపూర్ణ నదులును సముద్రములును నొక్కటియగును. ఆకాశమునుండి నదులు క్రిందికిఁబడుచున్నట్లుండును. అంతరముండదు. సర్వము జలమయమగును 16. ఆ జలముతోఁబాటు పర్వత సమానములగు మత్స్యములు, కూర్మములు, సర్పములు పడును. గర్జనముకాఁగానే జలములోజలము కలియును 17. సప్త సముద్రముల యావరణము గలసిపోవును. ఆవరణసేతువులు తెగును. సమస్తమును జలమయమైనపిదపఁ బ్రళయపావకుఁడు ప్రబలుఁడగును 18. బ్రహ్మాండములకు సమమగు తప్తలోహము జలసమూహము నింకించునట్లు జలమంతయు నదృశ్యమగును 19. సంపూర్ణ జల మీ విధముగా నిగిరిపోవును. పిదప నంతయు నగ్నిమయమగును. ఆ యగ్నిని బ్రళయ వాయువు కొట్టివేయును 20. ఆధారరహితమగుటవలన దీప మారిపోవునట్లు ప్రళయపావకుఁడుగూడఁ జల్లారును. పిదప అసంభవమగు వాయువు ప్రబలమగును 21. కాని మిగుల విస్తృతమగు నవకాశము (ఆకాశము)నందావాయువు లయమగును. ఇట్లు ఈ సంపూర్ణ పంచభూతాత్మికమగు వ్యాప్తియంతయు సమాప్తియగును 22. మహాద్భుతమగు మూల

మాయగూడఁ దనలోఁదాను మఱచి లయమొందును. ఈ విధముగా సంపూర్ణపదార్థమాత్రమునకు నిలువ తావేయుండదు 23. సంపూర్ణమగు నీ దృశ్యజగత్తును ప్రళయ మీ విధముగాఁ గబళించును. జడచంచలము లన్నియు లయమగును. శాశ్వతమగు పరబ్రహ్మముమాత్రము కడకు నిలిచియుండును 24.

---

## ఐదవ సమాసము — సృష్టినిగూర్చిన కథ.

ఉదాసీనులగు సాధువు లిరువురు పృథ్వీపర్యటనము గావించు చుండిరి. వారలు మనోరంజనమునకై యొక కథను జెప్పుకొనిరి 1. ఆ యిరువురిలో నొక్కఁడు శ్రోతగ రెండవవాఁడు వక్తగ నైరి. ఏదేని యొక మంచికథను జెప్పుమని శ్రోత వక్త నడిగెను. అట్లే చెప్పెదను. సావధానముగ వినుమని యిట్లు చెప్పెను 2. ఒకానొకచోట స్త్రీపురుషు లిరువురు (ప్రకృతి — పురుషుఁడు) ఉండిరి. ఉభయులకు మిగులఁ బ్రేమ యుండెను. వారలిరువురును నిరంతర మొక్కచోట నొక్కటిగనే వర్తించు చుండిరి. ఎప్పుడును వేఱుగాకుండిరి 3. ఇట్లు కొంతకాలము జరిగినపిదప వారి కొకబాలుఁడు[1] జనించెను. ఆ బాలుఁడు మంచికార్యకర్తగను, సర్వ విషయములందునుఁ జతురుఁడుగను నుండెను 4. కొన్నిదినములు గడచినపిదప నాపుత్రునకుగూడఁ[2] గుమారుఁడు గలిగెను. అతఁడు తండ్రికంటెఁగూడ నధికోద్యోగియయ్యెను. వ్యాపకత్వమునం దీబాలుఁడు తనతండ్రిలో అర్ధభాగము చతురుఁడయ్యెను[3] 5. ఈతఁడు మిగుల గొప్ప ప్రయత్నమును గావించెను. కన్యలను, పుత్రులను (సమస్త సృష్టి) చాలమందిని గనెను. మఱియు నానాప్రకారములుగఁ జాలజనమును సమకూర్చెను 6. ఈతని జ్యేష్ఠపుత్రుఁడు[4] అజ్ఞానియుఁ గ్రోధియు

---

1. సత్త్వగుణాత్మకుఁడును, చైతన్యస్వరూపుఁడును, ప్రతిపాలకుఁడునగు విష్ణువు.
2. రజోగుణాత్మకుఁడును, చేతనాచేత మిశ్రితుఁడును, ఉత్పత్తికర్తయును నగుబ్రహ్మ.
3. అర్ధచతురుఁడగుట యెందుచేతననఁగా, బ్రహ్మయందు అర్ధభాగము చేతనము, అర్ధభాగ మచేతనము నున్నది.
4. తమోగుణాత్మకుఁడును అచేతనరూపుఁడును సంహారకుఁడు నగు మహేశ్వరుఁడు.

నయ్యెను. కొంచెమేమరినచో గొప్పసంహారము గావింపదొడంగెను 7. తండ్రి మౌనముగఁ గూర్చుండియుండెను. కుమారుఁడు (విష్ణువు) మిగులఁ బ్రయత్నము గావించెను. ఈశుఁడు సర్వజ్ఞుఁడును జతురుఁడును మిగుల మంచివాఁడును నయ్యెను 8. మనుమఁడు (బ్రహ్మ) ఆతనిలో సగ మెఱుంగును. మునిమనుమఁడు (శంకరుఁడు) ఏమియు నెఱుంగఁడు. ఏమఱినచో సంహారము గావించును. మహాక్రోధి 9. కుమారుఁ డన్నింటిని బరిపాలించుచుండును. మనుమఁడు సరిగ వృద్ధిఁజేయును. మునిమనుమఁ డాకస్మికముగ మఱచియున్నపుడు సమస్తమును సంహరించును 10. ఈ విధముగ వంశము వృద్ధినొందెను. మిగుల విస్తారమయ్యెను. మఱియు నానందముతోఁ జాలకాలము గడచెను 11. అనంతమగు విస్తృతినొందెను. పెద్దలనుడువు లెవరును విశ్వసింపరైరి. పరస్పరవిరోధములు వృద్ధి నొందెను 12. గృహమునందు బలమగు కయ్యములు చెలరేగెను. ఇందుచేఁ జాలవఱకు సంహారమయ్యెను. పెద్దపెద్దలయందే వైరము కలిగెను. అంతయు నిరంకుశమయ్యెను 13. అనంతరము ఉన్మత్తతవలన యాదవులకు నాశనము కలిగినట్లు అజ్ఞానకారణమున వారల కందఱకును నాశనము కలిగెను. 14. అంతయు మొదలంట నాశనమయ్యెను. కన్య పుత్రుఁడు మున్నగువారల నామములు చిహ్నములుగూడ శేషింపక పోయెను 15. ఈ కథను మననము గావించువానికి జన్మమృత్యువులు తొలంగును. వాని ప్రతీతివలన శ్రోతయు వక్తయు ధన్యులగుదురు 16. ఇట్టి విచిత్రకథఁ బ్రపంచమునఁ బలుమాఱు జరుగుచు ముగియుచున్నది. ఈ కథ నిట్లుజెప్పుకొని యా గోస్వాములు (సాధువులు) మౌనముగఁ దమ త్రోవను వెడలిపోయిరి 17.

ఈ కథను మానవులందఱును మాటిమాటికిని మననము జేయు చుండవలెను 18. ఏమఱుపాటునను మఱపునను నుంటచే సంగ్రహముగ నింతవఱకుఁ జెప్పితిని. న్యూనాధికములకు శ్రోతలు క్షమింతురుగాక 19. వివేకముతో నీకథను నిరంతర మాలించు పురుషులు జగదుద్ధరణము జేయుదురని దాసు నుడువుచున్నాఁడు 20. ఆ జగదుద్ధారణవిషయములను వివరణ మొనరింపవలెను. సారవస్తువు నన్వేషించి లోకుల సమ్ముఖమునం దుంచుటయే నిరూపణము 21. నిరూపణమును శ్రద్ధాపూర్వకముగ

విచారింపవలెను. గురుప్తతత్త్వముల నెన్నింటినో దెలిసికొనవలెను. తెలిసికొనుచుఁ దెలిసికొనుచు నిస్సందేహి కావలయును 22. ఎనిమిది దేహములను వివరణముగావించి చూచినయెడల సహజముగనే నిస్సందేహత్వము ప్రాప్తించును. అంతియగాక అఖండనిరూపణమువలన సమాధానము కలుగును 23. తత్త్వములనుగూర్చి గగ్గోలుపడుచున్నంతదనుక శాంతి లభింపదు. కావున నీ తత్త్వముల గగ్గోలును దూరము జేయవలెను 24. ఈ సూక్ష్మసంవాదమును మాటిమాటికి మననము గావింపవలెను. ఇఁక ముందుసమాసమునందు సావధానులరై శ్రోతలు లఘుబోధ వినఁగోరెద 25.

---

## ఆఱవ సమాసము — *లఘుబోధము.

తొలుదొలుతఁ బంచతత్త్వములనామముల నేర్వవలెను. పిదపఁ దన యనుభవము నూతగఁగొని వానిస్వరూపము నెఱుంగవలెను 1. ఆవల శాశ్వతమెద్దియో అశాశ్వతమెద్దియో యనునది నిశ్చయ మొనర్పవలెను 2. పంచభూతవిచారము వాని నామరూపములు, సారాసారనిశ్చయము నిపుడు వివరించెదను. సావధానులరై వినుండు 3. పృథివ్యాపస్తేజోవాయ్వాకాశము లను పేరులతో ఐదుభూతము లున్నవి. ఇఁక వీని స్వరూపములను వినుండు 4. భూమిని పృథ్వియనియు, ఉదకమును అప్పనియు, అగ్ని సూర్యుఁడు మున్నగు సతేజఃపదార్థములను దేజమనియు నందురు 5. గాలిని వాయువనియు, అవకాశము నాకాశమనియు నందురు. ఇపు డింద శాశ్వతమగునదెద్దియో నీమనస్సునందు విచారింపుము 6. అన్నకణము నొక్కదానిని జూచినంతన అన్నపుమర్మమంతయు విశదమగును. అట్లే స్వల్పానుభవ ముపయోగించి సమస్తము నెఱుంగవలెను 7. పృథివి యేర్పడుచున్నది; నశించుచున్నది. ఈయంశము ప్రత్యక్షముగఁ జూచుచున్నదే! ఈసృష్టియందు నానావిధకల్పనములు జరుగుచున్నవి; నశించుచున్నవి 8. నిర్మితమగునదెల్ల నశించును. జలము

---

* శ్రీ సమర్థరామదాసస్వామి శ్రీఛత్రపతి శివాజీమహారాజునకు సింగణవాడియందు ఈ లఘుబోధము నుపదేశించెనని పరంపరగఁ జెప్పుచున్నారు.

గూడ నాశనమగును. తేజముగూడఁ జల్లారును. వాయువుగూడ నుండదు 9. ఆకాశము నామమాత్రముగ నున్నది. అదిగూడ విచారించి చూచినయెడల నుండనే యుండదు. (పంచభూతములుండవు) 10. పంచ భూతముల విస్తృతి యిట్టిది. ఇది నిశ్చయముగ నాశన మగునట్టిది. నిరాకారమగు ఆత్మను సత్యమనియు, శాశ్వతమనియు నెఱుంగనగును 11. ఆత్మ యెవరికిఁ గనుపింపదు. జ్ఞానము లేనియెడల నది అవగాహనముగాదు. దానిని సత్పురుషుల నడిగి తెలిసికొనఁదగును 12. సజ్జనుల నడిగినచో ఆత్మ అవినాశియని చెప్పెదురు. ఆత్మకు జన్మమృత్యువులు లేనేలేవు 13. నిరాకారమునం దాకారమును ఆకారమునందు నిరాకారమును భాసించు చున్నది. నిరాకారాకారములను వివేకముచే గుర్తింపఁదగును 14. నిరా కారము నిత్యము; ఆకారము అనిత్యము. దీనినే నిత్యానిత్యవిచార మందురు 15. సారమునం దసారమును, అసారమునందు సారమును భాసించుచున్నది. ఈ సారాసారవిచారమును శోధించి చూడవలెను 16. పాంచభౌతికము మాయికము. అయినను నది బహురూపములతో భాసించుచున్నది. ఒక్కటియగు నాత్మ సర్వవ్యాపిగ నున్నది 17. నాలుగుభూతములలో నాకాశ మెట్లువ్యాపించియున్నదో అట్లు ఆకాశము నందుగూడ పరబ్రహ్మము వ్యాపించియున్నది. ఆలోచించి చూచినచో ఆకాశము, పరబ్రహ్మము అభిన్నముగ గోచరించును 18. ఉపాధియోగ నమునే ఆకాశమున్నది. ఒకవేళ నుపాధియే లేకున్నచో ఆకాశమెక్కడిది? పరబ్రహ్మము నిరాభాసము. నిరాభాస మవినాశి. ఇట్లే ఆకాశమునుగూడ నెఱుంగనగును 19.

ఇఁక నీవివరణమును ముగించుదము. ఏది నాశన మొందదో దానిని వివేకముతో ననుమానములోనికిఁ దేవలెను 20. పరమాత్మ నిరాకారము. ఇఁక మనమెవ్వరమో విచారింపవలెను. ఈ విచారము మిగుల ముఖ్యమైనదిసుమా! 21. వాస్తవముగ దేహాంతసమయమున వాయువు వెడలిపోవును. ఇది యనృతముగఁ దోచినచో ఇప్పుడే నిశ్వాస మును, ఉచ్ఛ్వాసమును నాపి చూడుము 22. శ్వాసము నాపినచో దేహపాతమగును. దేహపాతమైనంతన దేహము శవమగును. శవముతో నేపనియు జరుగదు 23. దేహము లేకున్నచో వాయు వేమియుఁ జేయ

నేరదు. వాయువులేకున్నచో దేహమేమియుఁ జేయనేరదు. యోచించి నచో నొకటిలేకున్నచో వేఱొకటి యేమియుఁ జేయనేరదని విశదమగును 24. సాధారణముగఁ జూచినచో మనుజుఁడు గోచరించు చున్నాఁడు. విచారించిచూచినచో నేమియులేదు. అదియే వస్తువై యున్నాఁడు. ఇట్లే అభేదభక్తిలక్షణమును గుర్తెఱుఁగవలెను 25. మన మొకవేళ మనమే కర్తలమని చెప్పునెడల మనతలంపు ననుసరించియే సమస్తము జరుగ వలెను. అట్లు జరుగుటయేలేదు గావున మనము కర్తలమని చెప్పుట వ్యర్థము 26. మనముకర్తలముగాముగదా! భోక్తల మెట్లగుదుము? ఆలో చింపనిదీయంశము తెలియదు 27. ప్రకాశమునకు, అంధకారమునకు నెంత భేదముగలదో విచారమునకు అవిచారమునకు అంతభేదముగలదు. వికారము, నిర్వికారము లొక్కటి కానేరవు 28. విచారములేనితావున నేమియు జరుగదు. సత్యవిషయమెప్పుడు అనుమానములోనికిరాదు 29. అనుభవమును న్యాయమనియు అననుభవమును అన్యాయమనియుఁ జెప్పుదురు. జన్మాంధుఁడగుమానవుఁడు రత్నపరీక్ష నెట్లుగావింపఁగలఁడు?30. కావున నిర్గుణమునందు అనన్యుఁడై యుండువాఁడే జ్ఞాత. అతఁడె ధన్యుఁడు. ఆ పరమపురుషుఁ డాత్మనివేదకారణమున అందఱకును మాన్యుఁడుగ నుండును 31.



## ఏడవ సమాసము — అనుభవమునుగూర్చిన విచారము.

ఆత్మ నిర్మలము, నిశ్చలము, నిరాభాసము నై యున్నది. దాని కాకాశమును దృష్టాంతముగ నిచ్చుచుందురు. అవకాశరూపముగ వ్యాపించియున్నదాని నాకాశమందురు 1. మొదటి దాకాశము. తరు వాత దానియం దన్నిపదార్థములును (తక్కిన నాలుగు భూతములును) నున్నవి. అనుభవముతోఁ జూచినచో నిదియే యథార్థము. అనుభవ ము లేనిచో నంతయు వ్యర్థమే 2. బ్రహ్మము నిశ్చలము. ఆత్మచంచలము. ఆత్మకు వాయువును దృష్టాంతముగ నీయవచ్చును 3. బ్రహ్మమునకు ఘటాకాశము దృష్టాంతము. ఆత్మకు (ఆకాశమునందలి) ఘటబింబము దృష్టాంతము. వివరణముగావించినచో నీ రెంటియర్థము వేఱుగనున్నది 4.

జరుగుచున్నదానినంతయు భౌతికమందురు. జరుగుచున్నదంతయు నాశన మగును. జంచలము వచ్చుచుఁ బోవుచుండును. దీని నెఱుంగవలెను 5. అవిద్య జడము. ఆత్మచంచలము. జడము (అవిద్య) కర్పూరము. ఆత్మ అనలము. రెండును కాలి వెంటనే చల్లారుచున్నవి 6. బ్రహ్మము, ఆకాశము నిశ్చలజాతివి. ఆత్మయు, వాయువు చంచలజాతివి. సత్యా సత్యములను బరీక్షకులు గుర్తించెదరు 7. జడ మనేకముగలది. ఆత్మ యేకము. ఇదియే ఆత్మానాత్మవివేకము. జగత్తుయొక్క వ్యవహారమును నడుపువాఁడు జగన్నాయకుఁడు 8. జడము అనాత్మ. చేతనము ఆత్మ. అన్నింటియందును వర్తించుచున్నది సర్వాత్మ. అన్నియుఁగలిసి చంచలాత్మ యయ్యెను. ఇది నిశ్చలమైనది కాదు 9. పరబ్రహ్మము నిశ్చలము. దానికి దృశ్యభ్రమ లేదు. విమలబ్రహ్మమునకు భ్రమలేదు. అది యచలము 10. మొట్టమొదట ఆత్మానాత్మవివేకము ముఖ్యమైనది. ఆపిమ్మట సారాసారవిచార మొనర్పవలెను. సారాసారవిచారమువలనఁ బ్రకృతి సంహారమగును 11. విచారమునలనఁ బ్రకృతి సంహారమగును. ఉండియును దృశ్యము నష్టమగును. మఱియు అధ్యాత్మశ్రవణమువలన అంతరాత్మ నిర్గుణమునందు సంచరించును 12. అర్థమవగాహనమగు కొలంది అంతరాత్మయు నవగాహనమునకు వచ్చును. అర్థ మవగాహనము కాకున్నచో ఆత్మ వికాసము నొందదు 13. అర్థమునునసరించి ఆత్మ మార్పునొందును. అది యెటుఁగొంపోయిన నటుపోవును. అనుమానము వలన నది యొకానొకప్పుడు సందేహములోఁబడును 14. ఒకవేళ నిస్సందేహముగా అర్థ మవగాహనమగుచో ఆత్మగూడ నిస్సందేహ మగును. అనుమానార్థమగుచో అనుమానరూపమగును 15. నవరసమిళితమగు నర్థము గ్రహించినచో శ్రోతలు నవరసవిదులగుదురు. దురర్థము గ్రహించినచో శ్రోతలు దురర్థులగుదురు 16. సంగమునునుసరించి గిరిశిఖరములయందు వర్ణభేద మేర్పడుచుండును. కావున ఉత్తమమార్గముల నెఱింగి నడువనగును 17. ఉత్తమభోజనమును వర్ణించుచున్నచో మనస్సు గూడ భోజనాకారము నొందును. వనితాలావణ్యవర్ణనము వినుటవలన మనస్సు ఆలావణ్యమునఁనే మగ్నమగును 18. ఇట్లే అన్నిపదార్థములను నెంతవరకు వర్ణింపఁగలను? ఇట్లగునా? కాదా? యని యింతటితోనే

తెలిసికొనవలెను 19. ఎయ్యది విందుమో కందుమో అదియంతయుత హృదయములో దృఢముగాఁ బాదుకొనును. పరీక్షావంతులు కనునెడ వినునెడ హితాహితములఁ బరీక్షింతురు 20.

అన్నింటిని వదలి కేవల మీశ్వరు నన్వేషింపవలెను. అప్పుడే కొంత మర్మము లభించును 21. అన్ని తెలుంగులసుఖములను ఈశ్వరుఁడే నిర్మించియున్నాఁడు. కాని జను లీశ్వరు మఱచియున్నారు. మఱియు జన్మమున్నంతదనుక మఱచియేయుందురు 22. * అన్నింటిని విడిచి నన్నే వెదకుమని స్వయముగఁ బరమాత్ముఁడే చెప్పియున్నాఁడు. కాని జనులు భగవంతునివిషయమున విశ్వాసహీనులై యున్నారు 23. కావుననే మానవులు నానాదుఃఖముల ననుభవించుచున్నారు. కష్టములకుఁ బాల్పడు చున్నారు. మనస్సునందు సుఖమును గోరుదురుగాని తావెక్కడిది ? 24. మానవులు దేనివలన సౌఖ్యములు లభించునో దానిని (పరబ్రహ్మ మును) బుద్ధిహీనులై మఱచియున్నారు. సుఖము సుఖమని కలవరించుచుఁ దుఃఖముల ననుభవించి మరణించుచున్నారు 25. చతురులగుపురుషు లిట్లు గావింపఁజనదు. దేనినుండి సుఖములు లభించుచున్నవో దానినే చేయనగును. బ్రహ్మాండమునకు వెలుపలిదనుక ఈశ్వరుని వెదకుచుఁ బోవలెను 26. ముఖ్యుఁడగు నీశ్వరుఁడు ఎప్పుడు ప్రాప్తించునో యపుడు మానవునకుఁ గొఱంతయే యుండదు. లోకులు పిచ్చివాండ్రు. తమ వివేకమును గోల్పోవుచున్నారు 27. వివేకఫలము సౌఖ్యము. అవివేక ఫలము దుఃఖము. ఈ రెంటియం దెయ్యది యుక్తముగఁ దోఁచునో దానినె గావింపవలెను 28. కర్తను గుఱు తెఱుంగవలెను. అదియే వివేకము. వివేకమును విడిచినచోఁ బరమదుఃఖ కావలసివచ్చును 29. చతురపురుషుఁడు స్వహితమును మఱువఁగూడదు 30.

---

## ఎనిమిదవ సమాసము — కర్త యెవఁడు?

శ్రోత లిట్లు ప్రశ్నించిరి. అయ్యా! నిశ్చయముగఁ గర్తయెవఁడు? ఈ సృష్టియంతయు నెవఁడు నిర్మించెను? 1. ఈ ప్రశ్నను ఒకరికంటె

---

* సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ. భగవద్గీత అ. 18 శ్లో. 66.

నొకరు గొప్పగనున్న సభలోని పండితు లాలకించి ప్రత్యుత్తరము జెప్ప నారంభించిరి. వారలు చెప్పినవిధమును శ్రోతలు సావధానులరై వినుండు 2. ఒకఁ డీశ్వరుండు కర్తయనుచున్నాఁడు. మఱియొకఁ డీశ్వరుఁడెవఁడు? అనుచున్నాఁడు. ఈ విధముగ నెల్లరును దమతమ యభిప్రాయములను వివరింప నారంభించిరి 3. ఉత్తమ, మధ్యమ, కనిష్ఠములుగ నెవరిభావము లెట్లుండునో యారీతిగఁ బండితు లీవిధమున స్పష్టపఱచిరి. తమతమ యుపాసనయే శ్రేష్ఠమని లోకులు విశ్వసించెదరు 4. మంగళమూర్తియగు వినాయకుఁడు కర్తయని యొకఁడును, సరస్వతీదేవి కర్త్రియని యొకఁడును 5, భైరవుఁడు కర్తయని యొకఁడును, ఖండేరావు కర్తయని యొకఁడును, వీరదేవుఁడు కర్తయని యొకఁడును, భగవతి కర్త్రియని యొకఁడును 6, నరహరి కర్తయని యొకఁడును, వనశంకరి కర్త్రియని యొకఁడును, సమస్తమునకు శ్రీమన్నారాయణమూర్తియే కర్తయని యొకఁడును జెప్పుచున్నారు 7. శ్రీరాముఁడే కర్తయని యొకఁడు, శ్రీకృష్ణుఁడు కర్తయని యొకఁడు, భగవానుఁడగు కేశవుఁడే కర్తయని యొకఁడు 8, పాండురంగఁడు కర్తయని యొకఁడు, రంగనాయకులు కర్తయని యొకఁడు, పిశాచములు సర్వము జేయుచున్నవి గావున నవియే కర్తలని యొకఁడు 9, ముంజ్యాకర్తయని యొకఁడు, సూర్యుఁడుకర్తయనియొకఁడు, అన్నిఁటినిజేయుచున్నాఁడు గావున అగ్నిదేవుఁడే కర్తయని యొకఁడు చెప్పుచున్నారు 10. లక్ష్మీకర్త్రియని యొకఁడు, మారుతి కర్తయనియొకఁడు, భూమియే సమస్తము గావించుచున్నది గాన నాయమయే కర్త్రియని యొకఁడు 11, తుకాయీ కర్తయనియొకఁడు, యమాయి కర్తయనియొకఁడు, సటవాయి కర్తయని యొకఁడు 12, భార్గవుఁడు కర్తయనియొకఁడు, వామనుఁడు కర్తయని యొకఁడు, కేవల పరమాత్ముఁడే కర్తయనియొకఁడు నుడువుచున్నారు 13. రేవన్న కర్తయనియొకఁడు, బసవన్న కర్తయనియొకఁడు, వీరన్నయే అందఱికిఁ గర్తయనియొకఁడు 14, ఖలయీ కర్తయనియొకఁడు, కార్తికస్వామి గర్తయనియొకఁడు, వేంకటేశ్వరుఁడే సమస్తముగావించుచున్నాఁడు గాన నాతఁడే కర్తయనియొకఁడు 15, గురువే కర్తయని యొకఁడు, దత్తాత్రేయుఁడు కర్తయనియొకఁడు, జగన్నాథుఁడే ముఖ్యకర్తయని యొకఁడు ననుచున్నారు 16, బ్రహ్మకర్తయని యొకఁడు, విష్ణువు కర్తయనియొకఁడు,

మహేశ్వరుఁడు కర్తయనియొకఁడు 17, పర్జన్యుఁడు కర్తయనియొకఁడు, వాయువు కర్తయనియొకఁడు, నిర్గుణదేవుఁడు చేసియు అకర్తగానున్నాఁడు గావున నాతఁడె కర్తయని యొకఁడు 18, మాయయే చేయుచున్నది గాన నదియే కర్త్రియని యొకఁడు, జీవుఁడు చేయుచున్నాఁడు కాన నాతఁడె కర్తయని యొకఁడు, ప్రారబ్ధయోగమే అంతటికిని గర్తయని యొకఁడు 19, ప్రయత్నమే కర్తయని యొకఁడు, స్వభావము కర్తయని యొకఁడు,ఎవఁడు కర్తయో యెవ్వరెఱుంగుదురని యొకఁడును నుడువుచున్నారు* 20.

కర్తనుగూర్చి ప్రశ్నింపఁగనే సభయంతయు నంగడివీథియయ్యెను. ఇందెవరిమాట సత్యమని విశ్వసింపనగును ? 21. ఎవఁడేవేల్పును నమ్మునో వాఁడు ఆతనిని కర్తయని చెప్పును. ఈ జనుల కోలాహల మాపఁ జాలము 22. తమతమ అభిమానముతో నెల్లరును మనస్సులలో నిశ్చయము గావించుకొని యున్నారు. ఈ యంశమునుగూర్చిన చర్చ యెన్నఁటికిని ముగియదు 23. ఒక్కొక్కని యోచన యొక్కొక్క విధముగ నుండును. ఈ కోలాహలమునంతయు నటుండనిమ్ము. ఈ విచారమునందలి వాస్తవార్థమును జెప్పెద వినుండు 24. శ్రోతలారా! సావధానులు కండు. నిశ్చయముతో అనుమానమును ఖండింపవలెను. జ్ఞాతయగు పురుషుఁడు అనుభవమును సత్యమని యెఱుంగవలెను 25. కర్తచేయుపని యెల్ల కర్తకుఁ దరువాతనే జరుగును. కర్తచేయుపని కర్తకుముం దెటులగును? 26. నిర్మింపబడినదెల్లఁ బాంచభౌతికము. బ్రహ్మాదిదేవతలుగూడఁ బాంచభౌతికులే. కావునఁ బైనిపేర్కొనిన పాంచభౌతికులగు దేవత లీపాంచభౌతికసృష్టి నెట్లు గావింపఁగలరు? 27. పంచభూతములను వేఱుపఱచి కర్తను గురుతెఱుంగవలెను. ఏలయన, పాంచభౌతికములు స్వభావసిద్ధముగనే కార్యములోనికి వచ్చుచున్నవి 28. నిర్గుణము పంచభూతములకంటె భిన్నముగనున్నది. నిర్గుణమునందుఁ గర్తృత్వభావము లేదు. నిర్వికారమునకు వికారము నెవఁడు జతపఱుపఁగలఁడు ? 29. నిర్గుణమువలనఁ గర్తవ్యము కాఁజాలదు. సగుణము కార్యమున కుపకరించును. కావునఁ

* ఖండేరావు, ముంజ్యా, తుకాయీ, యమాయి, సట్వాయి, ఖలయీ మున్నగు వారలు మహారాష్ట్రదేశమునందలి దైవత విశేషములు.

ర్తవ్య మెవరివలన జరుగునో దానిని బాగుగా నెఱుంగవలెను 30. వాస్తవమున కెయ్యది లేనేలేదో (నిర్గుణమును) దానినిగూర్చి 'దీనికిఁ గర్త యెవఁ'డని ప్రశ్నించిన లాభములేదు. కాన నిదియంతయు స్వభావ సిద్ధముగనే యైనదనుట యుక్తముగనున్నది 31. ఒకటి సగుణము, ఒకటి నిర్గుణము. ఇఁక నిప్పుడు కర్తృత్వము నెవని కారోపించెదను ? ఈ యంశము బాగుగా విచారింపఁదగినది 32. సగుణమే సగుణమును నిర్మించె ననుటకు వీలుండునా ? సగుణోత్పత్తి మొదటి నిర్మాణమయ్యెను. ఇంక నిర్మించునదేది? నిర్గుణమునందుఁ గర్తృత్వ మెప్పుడైన నారోపింప నవకాశమేలేదు 33. ఇందువలనఁ జూడఁగాఁ గూడ ఇపుడు డిచట కర్తయే కాన్పించుటలేదు. అనుభవముతో సమస్తము నెఱుంగవలెను. ఏలయన, దృశ్యము సత్యముకాదు 34. చేయబడిన దంతయు మిథ్యయే. ఈ స్థితిలోఁ గర్త పేరెత్తుటయే వ్యర్థము. వక్తయిట్లు చెప్పఁజాలకపోయినను. ఓయీ సోదరా ! వివేకముతోఁ జక్కఁగాఁ గనుఁగొనుము 35. బాగుగా విచారించి చూచినచో ప్రతీతిగలుగును. ప్రతీతిగలిగినచో నిఁక యేలాంటి వాద ఆర్భాటములు గావింపవలసిన యవసరమే లేదు 36. ఈ కథనము నింక ముగించెదను. వివేకియగువానికే యీ యంశము బోధపడును. పూర్వపక్షమును ఎగురఁగొట్టవలెను. ఎగురఁగొట్టకున్నచో నిది యనిర్వాచ్యమగును 37. అనంతరము శ్రోత యిట్లు ప్రశ్నించెను. "స్వామీ ! దేహమునందు సుఖదుఃఖముల ననుభవించునదెవరు?" వక్త యిట్లు చెప్పెను. ఈ ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమును ముందు సమాసమునఁ దేటపడఁగలదు 38.



## తొమ్మిదవ సమాసము — ఆత్మయొక్క సుఖదుఃఖానుభవము.

ఆత్మకు శరీరసంయోగమువలన ఉద్వేగము, చింత, కలుగుచున్నది. శరీరయోగమువలన ఆత్మ జాగరూకతగ నుండునను సంగతి మీా రెల్ల తెలిసికొనినదేగదా 1. అన్నమును దేహ మొకవేళ భుజింపకపోయినచో ఆత్మ జాగరూకతతో నుండఁజాలదు. ఆత్మలేనిది దేహమునందుఁ జేతనము గూడ నుండఁజాలదు 2. ఒకటిలేకున్న నింకొకటి యేమియుఁ జేయనేరదు. ఏపనియైనను ఆత్మయు, శరీరము గలసి చేయుచున్నవి 3. దేహమునందుఁ

జీవనమే లేకున్నచోఁ జెప్పవలసిన దేమున్నది? ఆత్మ స్వయముగ నేపదార్థమునేని యెత్తఁజాలదు. ఇప్పుడు పని యెట్లు జరుగఁగలదు? 4. ఈ చమత్కారమును జూడుఁడు. ఆత్మ స్వప్నావస్థయందుఁ బోవుచున్నది. కాని దేహములోమాత్ర మున్నది. ఎట్లన, నది నిద్రావస్థలో గోరుచున్నది గదా 5. అన్నరసమువలన దేహము పెరుగుచున్నది. శరీరము ననుసరించి విచార మతిశయించుచున్నది. వృద్ధావస్థయందు శరీరమున విచారము సన్నగిల్లును 6. మత్తుపదార్థములను సేవించునది శరీరమే. కాని శరీర యోగమున ఆత్మ భ్రమనొందును. మఱియు విస్మరణకారణమున ఆత్మకుఁ గల తెలివితేటలు మరుగుపడును 7. విషము తినునది శరీరము. కాని ఆత్మ లేచిపోవును. కాన వృద్ధిక్షయములు ఆత్మపట్లనైత మవశ్యముగ నున్న మీఁద పెరుగుటయు, దరుగుటయు, పోవుటయు, వచ్చుటయు, సుఖదుఃఖములును, నానావిధానుభవములును దేహయోగమువలన ఆత్మకు అనుభవింపవలసియే వచ్చుచున్నది 9. చీమలపుట్టలు, చెదలపురుగుల పుట్టలవలె దేహముగూడ అవకాశయుతముగ (లోనలొట్టగ) నిర్మింపఁబడియున్నది 10. శరీరమునం దంతటను జిన్నవి. పెద్దవి యగు నాడులు నిండియున్నవి. ఆ నాడీనివహమునందు లోన (గొట్టములవలె) అవకాశ మార్గములు నిర్మింపఁబడియున్నవి 11. ప్రాణి తినుచున్న అన్నోదకముల వలన రసము జనించును. వాయు వా యన్నరసమును శ్వాసోచ్ఛ్వాసములచే శరీరమునందంతటను బరుగెత్తించును 12. నాడులనుండి జలము ప్రవహించును. ఆ జలమునందు వాయువు ప్రసరించును. వాయువుతోఁ బాటుగ ఆత్మగూడఁ బరుగెత్తుచుండును 13. దప్పిగొని శరీరము వాడిపోవుచున్న సంగతి ఆత్మకుఁ దెలియఁగనే అది శరీరమును జలముచెంతకుఁ గొనిపోవును 14. నీళ్లు కావలయునని యడుగును. శబ్దసహాయమునఁ బిలచును. మార్గమునుజూచి దేహమును నడిపించును. అవసరము కలిగినపుడు దేహమునంతయుఁ గదలించును 15. శరీర మాకలి గొన్నసంగతి ఆత్మ గ్రహింపఁగనే దేహసహాయమున నింటివారలను సమీపించి వాచ్యములను అవాచ్యములను అనిపించును 16. స్త్రీలయందున్న ఆత్మ 'వంటయైనది. వంటయైన'దని పలుకును. అపుడు దేహము నాత్మ స్నానము జేయించి కొనివచ్చును. పాదములలో నాత్మ ప్రసరించి త్వరత్వరగా నడి

పించును 17. భుజించువానిని పళ్లెరము మున్నగువానిచెంతఁ గూర్చుండఁ బెట్టును. నేత్రములలోని కేతెంచి పాత్రములను బళ్లెరములను జూచును. చేతితో ఆచమనము జేయించును 18. పిదపఁ జేతితో నాహారకబలము నెత్తించును. ముఖములోనికరిగి నోటిని తెఱపించును. దంతములతోఁ జక్కఁగ నమలించును 19. ఆత్మ స్వయముగ జిహ్వాయందుండి సరస పదార్థముల రుచిని గ్రహించును. ఒకవేళ భోజ్యవస్తువులలోఁ బుడక, ఱాయి కలిసియున్నచో వెంటనే యుమియును 20. చప్పఁగనున్నచో లవణమును యాచింపఁజేయును. స్త్రీని “ఓసీ ఏమే” యని పిలిపించును. కోపముతోఁ గనుల నెఱ్ఱఁజేసి చూచునట్లు చేయును 21. భోజనము చక్కఁగ నమరినచో ఆనందమొందును. జక్కఁగ నుండనిచో ఖేదమొందును. అంతియగాక దుర్వచనములఁ బల్కి యెదుటవారల యాత్మలు నొప్పించును 22. నానావిధములగు అన్నరసముల తీయదనము నానావిధరసముల మాధుర్యము ఆత్మ గుర్తెఱుంగును. చేదుతగిలినచోఁ దలఁ గదలించును. మఱియు దగ్గ నారంభించును 13. అట్లే యాత్మ కోపపరవశయై కూరలలో “గారము నెక్కువవైచితివి? ఏమిచేత యిది? బండపని” యని యెదుట వారిని గటువచనములఁ బలికించును 24. ఒకవేళ నెప్పుడేని నేయి యెక్కువ గ్రోలినచో భుజించినవెంటనే చెంబునుగొని విస్తారముగా జలము ద్రావ నారంభించును 25.

ఈ విధముగ శరీరమునందుండి సుఖదుఃఖముల ననుభవించునది కేవలమాత్మయే. ఆత్మ లేకున్నయెడల దేహము వ్యర్థము. శవమగును. 26. అనంతములగు మనోవృత్తులను ఆత్మస్థితియని గ్రహింపవలెను. ఉభయలోకములలోనున్న అన్నివ్యక్తులయందును ఆత్మయున్నది 27. జగమున జగదాత్మయున్నది. విశ్వమునందు విశ్వాత్మయున్నది. నానారూపములతో సర్వవ్యాపారములను నడుపునది సర్వాత్మ 28. ఆత్మ యాఘ్రాణించును. రుచిఁజూచును. వినును. చూచును. సుకుమారమును గఠినమును గుర్తించును. అది చల్లఁదనమును, వేఁడిని వెంటనే తెలిసికొనును 29. ఆత్మ సావధానియై లీలలనొనర్చును. ఎంతయో త్రవ్వి తలకెత్తుకొనును. ఈ ధూర్తత్వమును (చతురత్వమును) ధూర్తుఁడే తెలిసికొనగలఁడు 30. వాయువుతో మంచిచెడుగులు (సుగంధదుర్గంధములు) రెండును వచ్చును.

కాని వాయువు సహజముగ నిర్మలమైయుండును 31. శీతము, ఉష్ణము, సువాసన, దుర్వాసన మున్నగునవియెల్ల వాయువువెంటనేయుండును. కాని వాయువులోఁ గలసియుండనేరవు 32. వాయువువలన రోగములు వచ్చును. భూతములు వాయువువెంట బరుగిడును. వాయువుననుసరించి ధూళి, చెత్త, తుపానులు వచ్చును 33. ఇవియేవియు వాయువుతో నిలచియుండవు. ఇట్లే ఆత్మను వెంబడించి వాయువుకూడ స్థిరముగ నిలచి యుండదు. ఆత్మ వాయువుకంటెను మిగులఁ జపలమైనది 34. వాయువు కఠినపదార్థములు సోఁకఁగనే ఆగిపోవును. ఆత్మ యట్లుగాక యే వస్తువునేని భేదించి లోనికేగును. అట్లేగినను ఆ కఠినపదార్థములకు రంధ్రముగాదు 35. వాయువు వీచునప్పు డొకవిధమగు శబ్దమగును. ఆత్మ కాశబ్దాదు లేమియు నుండవు. మననము గావించినచో లోలోపలనే, మహానముగనే ఆత్మజ్ఞాన మభివృద్ధియగును 36. శరీరమునకుఁజేయు మంచియంతయు నాత్మకుఁ జేరును. ఈ విధముగ శరీరయోగముచే ఆత్మకు సమాధానము కలుగును 37. దేహమునువిడిచి యేమిగావించినను అది యాత్మకుఁ జెందదు. దేహయోగముననే వాసన తృప్తినొందును 38. దేహమునకును ఆత్మకు నిట్టిసంబంధము లెన్నియోగలవు. కాని దేహములేకున్నచో ఆత్మ కభ్యంతరము గలుగును 39. దేహము, ఆత్మ యేకమగునెడ నెంతయో కార్యము జరుగగలదు. వేఱుగనున్నచో నేమియు గాదు. దేహాత్మ సంయోగమువలన, వివేకసహాయమున త్రిలోకజ్ఞానము కలుగును 40.

---

## పదియవ సమాసము — ఉపదేశనిరూపణము.

దారముతోఁ బత్రములను, పుష్పములను, ఫలములను, బీజములను, పాషాణములను, గవ్వలను దండలుగా గ్రుచ్చుదురు 1. స్ఫటికములు, కాష్ఠములు, చందనములు, ధాతువులు, రత్నములు మున్నగు మాలికలును, వలలును దారముతోనే గ్రుచ్చఁబడుచున్నవి 2. దారములేకున్న నీపని జరుగదు. (ఇట్లే ఆత్మచే సంపూర్ణజగత్తు గ్రుచ్చఁబడియున్నది) కాని యిచట ఆత్మకు దారమును దృష్టాంతముగ నిచ్చుట పూర్తిగ నన్వయింపదు 3. ఏలయనగ? దారము మాలికలలోని బీజములకు మధ్యనే

(రంధ్రములయందే) యుండును. ఆత్మయో సర్వాంగములందును సమాన రూపముగ వ్యాపించియున్నది 4. ఆత్మ స్వాభావికముగాఁ జపలము. దారము జడము నిశ్చలము. కావున నీ యుపమానము సరిపడదు 5. తీఁగలలో జలభాగము నిండియున్నది. అట్లేచెఱకులోఁగూడ రసము నిండియున్నది. కాని రసముపైనుండు చెక్కయొకటిగాదు 6. ఇట్లే దేహి (ఆత్మ) దేహములు (అనాత్మలు) రెండును భిన్నములుగాఁ నున్నవి. మఱియు నీ రెంటికిని భిన్నములుగ నున్నది నిరంజనమును నిరుపమమునగు పరమాత్మ 7. రాజుమొదలు నిరుపేదవనుక నందఱును మనుష్యులే. కాని యందఱును సమానులెట్లగుదురు? 8. దేవతలు, దానవులు మానవులు, నీచయోనులు, హీనజీవులు, పాపులు, సుకృతులు, మున్నగు వారలెందఱో గలరు 9. జగత్తంతయు నొక్కయంశముతోడనే నడచుచున్నదికాని యందఱి సామర్థ్యములు వేఱువేఱుగా నున్నవి. ఒకరి నాశ్రయించినచో ముక్తిలభించును. వేరొకరి నాశ్రయించినచో నరకము లభించును 10. పంచదార, మన్ను అను నీ రెండును పృథివియొక్క యంశములే. కాని మన్ను తినఁదగినదికాదు. విషము జలముకాదా? అది చెడుగు పదార్థము 11. పుణ్యాత్మునియందాత్మగలదు. పాపాత్మునం దాత్మగలదు. ఇందొకఁడు సాధువు వేఱొకఁడు దుష్టుఁడు. అందఱిమర్యాదయొకరీతిగ నుండదు. ఆత్మ వేరుగ నుండఁజాలదు 12. అందఱి యంతరాత్మలు నొక్కటియే యనుమాట సత్యము. కాని కాకిని వెంటనుంచుకొనరు. పండితుండు, శుంఠ యొక్కటి యెట్లుకాగలరు? 13. మనుష్యుఁడు, గాడిద, రాజహంస, కోడి, రాజు, కోఁతి సమానమెటులగుదురు? 14. భాగీరథీ ప్రవాహములోనిది ఉదకమే. జలధారులందును,బొందలందును, నున్నది యుదకమే. కాని మలినోదకమును గొంచమేని క్రోలరు 15. కావున మానవుడు తొలుదొలుత ఆచారశుద్ధుఁడు, విచారశుద్ధుఁడు, వీతరాగి, సుబుద్ధి కావలయును 16. ఒకవేళ శూరులను విడిచి పిఱికివారలను సైన్యములో నింపుకొన్నయెడల యుద్ధావసరములయందావశ్యముగఁ బరాజయము కలుగును. శ్రీమంతునివదలి దరిద్రునిసేవించినచో నేమిస్థితి కలుగఁగలదు? 17. ఒక జలమువలననే సమస్తమును నేర్పడినమాట సత్యమే! కాని జలము విమర్శించి సేవింపవలయును.

కావున ఏకపక్షీయముగ నన్నింటిని సేవించుట మూర్ఖత్వముసుమీ! 18. ఉదకమువలననే అన్నమయ్యెను. అన్నము వమనమైనయెడల నా వమన పదార్థమును మఱల భుజింపరుగదా! 19. అట్లే నిందనీయమగు వస్తువును విడువవలెను. ప్రశంసనీయమగు సంశమును హృదయమునందుంచవలెను. సత్కీర్తితో భూమండలము నించివేయవలెను 20. ఉత్తమునకు ఉత్తముఁడు రుచించును. నీచునకు ఉత్తముఁడు రుచింపఁడు. కావుననే ఈశ్వరుఁడు నీచుని దరిద్రునిగ నొనరించెను 21. సమస్త దరిద్రలక్షణములను విడిచివేయవలెను. ఉత్తమలక్షణముల గ్రహింపవలెను. హరికథ, పురాణ శ్రవణము, నీతి, న్యాయము మున్నగునవి స్వీకరింపవలెను 22. వివేక పూర్వకముగ నడువవలెను. జనులనందఱను సుముఖులుగ నుంచవలెను. మెల్లమెల్లగ నెల్లరను బుద్ధ్యాత్ములఁ గావించుచుండవలెను 23. బాలకుల నడవడిననుసరించి నడిచినగాని వారలు మనకు మచ్చికగారు. వారలకు రుచించునటుల మాటలాడినఁగాని వారితోఁ జెలిమి కుదురదు. అట్లే మెల్లమెల్లగ జనులభావముల ననుసరించి హితమునేర్పి చతురులఁ గావింపవలెను 24. మనుజు లందఱియెడను మనస్సుంచవలెను. ఇది సత్యము. ఇవియన్నియుఁ జతురత్వలక్షణములు. చతురుఁడు చతుర లక్షణము లెఱుంగును. అన్యులు పిచ్చివాండ్రు 25. కాని పిచ్చివానిని బిచ్చివాఁడనిగూఁడ ననరాదు. మర్మమగునంశము నెప్పుడును జెప్పఁ దగదు. అట్లు వర్తించుచు నిస్పృహాపురుషుఁడు దిగ్విజయ మొందఁ గలఁడు 26. అనేకస్థలములలో, అనేకావసరముల నెఱింగి యథోచితముగ వర్తింపవలెను. ప్రాణిమాత్రులందఱకును అంతరంగముగ (అభిన్నమిత్రుఁడుగ) వర్తింపవలెను 27. ఒకఁడు రెండవవానిని సంతుష్టుని గావింపని యెడల నందఱకును శ్రమగలుగును. ఒకడు రెండవవాని మనస్సు విఱిచి నచోఁ గుశలము గలుగదు 28. అందఱిహృదయములను ప్రసన్నతగ నుంచువాఁడె సత్యమగు మహంతు (లోకోద్ధారకుఁడు.) అతఁడందఱిని ఆకర్షింపఁగలఁడు 29.

పదమూడవ దశకము సమాప్తము.

# పదునాలుగవ దశకము.



## మొదటి సమాసము — నిస్పృహ లక్షణము.

నిస్పృహుని యుక్తి, బుద్ధి, చతురత్వమునుగూర్చిన వివరము లాలకింపుఁడు. దీని నాలకించుటవలనఁ జిత్తమున కెల్లకాలమును నిలకడ గలుగును 1. సులభము, ఫలదాయకమునగు మంత్రమువలె సాధారణము, గుణదాయకమునగు నౌషధమువలె నావచనములును సరళములు, అనుభవయుక్తములు నై యున్నవి 2. ఈ యంశమును విన్నచో దుర్గుణములు తొలంగును, సుగుణములు వెంటనే ప్రాప్తించును. కావున తీవ్రౌషధరూపములగు నామాటలను శ్రోతలు ధ్యానపూర్వకముగ వినఁగోరెదను 3. తొలుదొలుత నిస్పృహగా నుండనగునను నియమము పెట్టుకొననే కూడదు. ఒకవేళఁ బెట్టుకున్నచో దానిని విడువనే కూడదు. విడిచి వైచినచోఁ బరిచితులలోఁ దిరుగనే కూడదు 4. స్త్రీలను దృక్పథమునం దుంచరాదు. కాంతావిషయికస్వాదును మనస్సుచేతనేని చవిజూడనీయ కూడదు. ఒకవేళ ధైర్యము (చిత్తశుద్ధి) భంగమైనచో జనులకు మఱలఁ దనముఖమునుగూడఁ జూపింపఁదగదు 5. నిస్పృహుఁ డొకతావుననే యుండఁదగదు. సంకోచము నుంచుకొనఁగూడదు. మోహములోఁ దగులొ్కని ద్రవ్యమును గన్నెత్తియైనఁ జూడరాదు 6. ఆచారభ్రష్టుఁడు కాఁగూడదు. ఎవరేని యొకవేళ ధనమునొసంగుచోఁ గైకొనరాదు. తనపయి నేదోషమునేని రానీయఁదగదు 7. భిక్షనడుగుటకు సిగ్గుపడకూడదు. భిక్ష నెక్కువఁ గైకొనఁజనదు. ఎదుటివా రెన్నివిధముల నడిగినను దన జాడల నెఱింగింపరాదు 8. ఇతరులుపయోగించినవి, మురికివి యగు వస్త్రములను ధరింపఁగూడదు. మృష్టాన్నము భుజింపరాదు. దురాగ్రహము నొందరాదు. సందర్భానుసారముగాఁ బ్రవర్తింపవలెను 9. భోగముల యందు మనస్సు నుంచఁగూడదు. దేహసంబంధములగు దుఃఖములకు (బాధలకు) భయపడఁజనదు. భవిష్యజ్జీవితముపయి నాశపడరాదు 10. విరక్తి విడువఁగూడదు. ధైర్యమును భంగపరుపకూడదు. జ్ఞానమును మలినము గాకుండ వివేకముచేఁ గాపాడవలెను 11. కరుణాకీర్తనముల విడువ రాదు. అంతర్ధ్యానము తగ్గిపోనీయఁ జనదు. సగుణమూర్తియొక్క ప్రేమ

తంతువుఁ దెంపరాదు 12. (సాధకుఁడా నీవు నిస్పృహివగుము. నిస్పృహివి కాదలఁతువేని) మనస్సులోఁ జింత నుంచుకొనకుము. కష్టములలో భేదము నంగీకరింపకుము. ఏమైననుసరియే అదనున ధైర్యమును దొలంగకుము 13. అవమానమును జెడుగుగా భావింపకుము. ఎవరేని హేళన గావించినచో దుఃఖింపకుము. ఏమైననుసరియే ఇతరులు ధిక్కరించిరని విచారమొందకుము 14. విరక్తుండు లోకసంబంధమగు లజ్జ నుంచుకొనరాదు. గాన ఇతరులు లజ్జింపఁజేసిరని లజ్జనొందకుము. ఇతరు లుద్రేకము కలిగించినచో నుద్రేకమొందరాదు 15. శుద్ధమార్గమును వదలకుము. దుర్జనునితో వాదింపకుము. చండాలునితో సంబంధము కలుగజేసికొనకుము 16. తంపెలమారితనము దరిచేరనీయకుము. కలహించినచోఁ గలహింపకుము. నీ యథార్థస్థితిని గోలుపోకుము 17. నిజమగు నిస్పృహుఁ డితరులు నవ్వించినచో నవ్వరాదు. చెప్పింపఁదలంచినచో నేదియుఁ జెప్పరాదు. క్షణక్షణమును ఇతరులు నడిపించినవిధమున నడువఁగూడదు 18. వేషము ధరింపరాదు. ఒకేయమరికతో నుండరాదు. ఏకదేశీయుఁడై యుండక అన్నితావులందును భ్రమించుచుండవలెను 19. ఎవరితోడనైన దృఢసంసర్గముగలిగించుకొనఁ దగదు. దానము గ్రహింపజనదు. అన్ని వేళలందును సభలలోఁ గూర్చుండరాదు 20. శరీరమునెడ నే నియమమునేని పెట్టుకొనఁదగదు. ఎవ్వరికేని నమ్మిక మీయరాదు. మఱియు నేదేని నిశ్చితవిషయము నంగీకరింపఁగూడదు 21. సత్యనియమముల విడువకూడదు. అభ్యాసములను మునిఁగిపోనీయరాదు. ఏ పరిస్థితులయందేని పరతంత్రుఁడుగ నుండరాదు 22. స్వాతంత్రతను దొలంగనీయరాదు. నిరపేక్షత్వము త్రెంచివేయఁగూడదు. క్షణక్షణమునను బరాపేక్షతో నుండరాదు 23. వైభవదృష్టితోఁ జూడరాదు. ఉపాధిసుఖమున నుండఁగూడదు. స్వరూపస్థితియందలి ధ్యానమును ద్రిప్పివేయఁగూడదు 24. స్వేచ్ఛానుసారముగ మెలంగరాదు. లోకలజ్జ నుంచరాదు. ఎప్పుడైన నేతావునందేని యాసక్తిగలిగి యుండరాదు 25. పరంపరను ద్రెంపఁగూడదు. ఉపాసన మార్గోపాధిని జెడనీయరాదు. జ్ఞానమార్గము నెన్నఁడు విడువఁదగదు 26. కర్మమార్గమును విడువఁజనదు. వైరాగ్యము వీగిపోనీయరాదు. మఱియు నిరంతరముగా సాధనముల, భజనముల

ఖండింపఁదగదు 27. వాదవివాదముల విశేషించి చేయఁగూడదు. అనిత్య విషయమును మనస్సునం దుంచరాదు. వ్యర్థముగు క్రోధముతో హాతము చేయఁగూడదు 28. విశ్వసింపనివాని కేమియుఁ జెప్పఁదగదు. భయము గలుగఁజేయుమాట లాడరాదు. ఒక్క స్థలముననే పెక్కుదినము లుండ గూడదు 29. ఏ యుపాధినేని వ్యాపింపఁజేయరాదు. ఒకవేళ వ్యాపింపఁ జేయుచో నుంచుకొనఁదగదు. ఒకవేళ నుంచుకొనుచో దానియందుఁ దగుల్కొనఁగూడదు 30. గొప్పతనముగ నుండఁగూడదు. మహాత్వము పెట్టుకొని కూర్చుండఁజనదు. మెచ్చుటనైన నేకోరిక యేని గలుగనీయ రాదు 31. సరళత్వము విడువరాదు. కించిత్ జ్ఞత్వము తొలంగిపోనీయఁ గూడదు. బలాత్కారముగఁ దనశరీరముపై నభిమానము తెచ్చిపెట్టుకొనఁ దగదు 32. అధికారములేని దాజ్ఞాసింపఁగూడదు. ఆదలించి ఉపదేశింప రాదు. పరమార్థము నెప్పుడును సంకుచిత పఱుపఁదగదు 33. కఠిన వైరాగ్యమును విడువఁగూడదు. కఠినాభ్యాసమును విసర్జింపఁజనదు. ఎవరి విషయమునందైనఁ గఠినత్వముగా వర్తింపరాదు 34. కఠోరవాక్యము లాడఁగూడదు. కఠినముగా నాజ్ఞాపింపఁజనదు. కఠినమగు ధైర్యము ఏమైన సరియే విడువఁగూడదు 35. స్వయముగ నాసక్తుఁడగుటయుఁ జేయనిదే చెప్పుటయు శిష్యులను కొద్ది గొప్ప లడుగుటయుఁ దగదు 36. ఉద్ధత శబ్దములతో మాటలాడుటయు, ఇంద్రియములను స్మరించుటయు, స్వచ్ఛందవృత్తితో శాక్తేయ మార్గములందుఁ బ్రవర్తించుటయుఁ గూడని పని 37. నీచకార్యమని సిగ్గుపడరాదు. వైభవములను జూచుకొని యున్మత్తుఁడు కాఁగూడదు. ఎఱింగియెఱింగి క్రోధవశుఁడు కాఁగూడదు 38. గొప్పతనము కలిగినపుడు మఱుపు దరిచేరనీయరాదు. న్యాయనీతుల విడువఁదగదు. ఏ విపరీతపరిస్థితులందేని ఆ ప్రమాణికముగ వర్తింపఁ జనదు 39. ఎఱుఁగనిది చెప్పఁగూడదు. అనుమానముతో నిశ్చయము గావింపఁగూడదు. మూర్ఖత్వముతోఁ జెప్పినదానిని జెడుగుగా భావింప రాదు 40. సావధానత, వ్యాపకత్వము వదలఁజనదు. సోమరితనములో సౌఖ్యముగలదని భ్రమపడఁదగదు 41. మనస్సునందు వికల్ప ముంచఁ గూడదు. స్వార్థము నాజ్ఞాపింపరాదు. ఒకవేళ నాజ్ఞాపింపవలసినచోఁ దన కార్యము ముందుగావలె ననఁగూడదు 42. ప్రసంగములేనిది చెప్పఁ

గూడదు. క్రమము విడువఁదగదు. విచారింపకయే అనాలోచిత మార్గ
ములలోఁ బ్రవేశింపరాదు 43. పరోపకారము విడువఁగూడదు. పరపీడఁ
గావింపఁజనదు. ఎవరి హృదయమునేని మలిన పఱుపఁదగదు 44. అమా
యికత్వమును, మహాంతుధర్మమును విడనాడరాదు. ద్రవ్యముకొఱకుఁ
గీర్తనము లొనరించుచుఁ దిరుగఁగూడదు 45. సంశయాత్మకముగఁ జెప్పు
టయుఁ మిక్కిలి నిశ్చయమొనరించుటయు గ్రంథమును దాను దెలిసి
కొనకయే ఇతరులకుఁబోధింపఁ జేతికందుకొనుటయుఁ గూడదు 46. ఎఱిఁగి
యుండి యడుగరాదు. అహంభావము ప్రకటింపఁదగదు. చెప్పెదనని
యెవ్వరితోనైన ననరాదు 47. జ్ఞానగర్వ ముంచరాదు. సాధారణముగ
నెవ్వరికిని గష్టము గలిగింపఁజనదు. ఎవరితోడనైన నెచటనైన వాదు
లాడఁగూడదు 48. స్వార్థబుద్ధికలిగి యుండఁగూడదు. కార్యభారమునఁ
బడిపోవరాదు. రాజద్వారమునందుఁ గార్యకర్తగ నుండఁదగదు 49.
ఎవరికేని నమ్మిక నీయఁగూడదు. భిక్షగ నీయఁబడిన పదార్థము నడుగ
రాదు. భిక్షకొఱకై తన పరంపరను వివరింపఁగూడదు 50. వివాహ
కార్యములందును, మధ్యవర్తిగనుండు పనులందును బాల్గొనఁజనదు.
ప్రపంచోపాధిని శరీరముతో నన్వయింపరాదు 51. ప్రాపంచిక నిర్బంధ
ములలోఁ దగుల్కొనరాదు. చెడ్డఅన్నము తినరాదు. ఆశ్రితునివలె
నిమంత్రణము గైకొనఁజనదు 52. నిస్పృహుఁడు శ్రాద్ధ, పక్ష, త్రై
మాసిక, షాణ్మాసికాది పితృకర్మలలోనికిని రోగశాంతులు, వ్రతములు,
ఉద్యాపనములు మున్నగు కామ్యకర్మములలోనికిని బోవఁదగదు. అచటి
యన్నము తినరాదు. తాను దీనుఁడై వర్తింపరాదు 53–54. లగ్న
ప్రసంగమునఁ బాల్గొనఁదగదు. ఉదరపోషణమునకై గానమొనరింపరాదు.
ధనమునుగైకొని యెచ్చటనేని హరికీర్తన మొనర్పరాదు 55. భిక్షను
గొనుట విడువఁగూడదు. అన్నము భాగభాగములుగాఁ దినకూడదు.
మూల్యము గైకొని యాత్రఁ గావింపరాదు 56. మూల్యమును గైకొని
యెద్దియేని సుకృతము చేయగూడదు. వేతనముఁ దీసికొని పూజారి
కాఁగూడదు. ఇనాము, జాగీరు, (మాన్యము, అగ్రహారము) ఎవరేని
యొసంగనెంచినను నిస్పృహుఁడు గైకొనఁదగదు 57. ఎచ్చటనేని మఠము
నిర్మింపఁగూడదు. ఒకవేళ నిర్మించుచో దానినే ఆశ్రయించుకొని యుండ

రాదు. నిస్పృహుఁడగు మఠాధిపతిగాఁ గూర్చుండి యుండఁదగదు 58.

శ్రోతలారా! ముఖ్యవిషయము వినుండు. నిస్పృహుఁ డన్నియుఁ జేయవలసినదె కాని స్వయముగా నాకర్మములలోఁ జిక్కుకొనరాదు. ఆ కర్మములకు భిన్నుఁడై యుండి లోకమునందు భక్తిమార్గము స్థాపింప వలెను 59. ప్రయత్నరహితుఁడై యుండఁదగదు. సోమరితనము దృష్టి లోనికి రానీయఁగూడదు. దేహమున్నంతవఱకు ఉపాసనా యోగము సహింపరాదు 60. ఉపాధిలోఁ బడఁగూడదు. ఉపాధిని శరీరమునం దన్వ యింపఁదగదు. అవ్యవస్థుఁడై భజనమార్గమునెడ నెన్నఁడును విముఖుఁ డుగ నుండఁదగదు 61. మిగుల నుపాధి గావింపఁగూడదు. ఉపాధిలేకున్న యెడలఁగూడఁ బనిజరుగదు. సగుణభక్తి విడువరాదు. కాని యీశ్వరునకు విభక్తుఁడుగ నుంటగూడ మంచిదికాదు 62. మిగులఁ బరుగెత్తకూడదు. ఒక్కస్థలముననే విశేషించి వసింపఁగూడదు. మిగులఁ గష్టమును సహింప రాదు. మిగుల సోమరితనముతో నుంటగూడ మంచిదికాదు 63. మిక్కిలిగ భాషింపరాదు. కాని మాటలాడకున్ననుగూడఁ బనిజరుగదు. అన్నమును మిక్కుటముగాఁ దినరాదు. కాని ఉపవాసముండుటగూడ మంచిదికాదు 64. విశేషించి నిద్రింపఁగూడదు. బొత్తిగ నిదురబోక యుండుటయుఁ దగదు. మిక్కుటముగ నియమములు పెట్టుకొనుటకూడదు. బొత్తిగ నియమహీనుఁడై యుండఁజనదు 65. పెక్కుమందిలో నుండఁగూడదు. విశేషించి వనవాసము గావింపరాదు. దేహము నెక్కుడుగఁ బోషింపఁ జనదు. కాని ఆత్మహత్య యొనరించుటగూడ చెడ్డపనియేసుమా 66. సంగమెక్కువగ నొనర్పరాదు. కాని సాధుజనసంగమము విడువఁగూడదు. కేవలకర్మాచరణముతోఁ బనిజరుగదు. కాని అనాచారుఁడుగా నుంట గూడఁ దగదు 67. లోకాచారమును బూర్తిగ విడువఁగూడదు. కాని జనుల కధీనుఁడుగ నుంటగూడఁ దగదు. ప్రీతి మిక్కుటముగా నుంచఁ గూడదు. కాని నిష్ఠురభావముతో నుండుటగూడ మంచిదిగాదు 68. సందే హము నెక్కువగా నుంచుకొనఁదగదు. కాని స్వచ్ఛందముగాఁగూడ నుండఁదగదు. సాధనములలో విశేషించి మగ్నుఁడుకాఁగూడదు. కాని సాధనరహితుఁడై యుండుటగూడ మంచిదిగాదు 69. విషయముల నెక్కుడుగా ననుభవింపఁగూడదు. కాని విషయత్యాగము పూర్తిగఁ

జేయఁదగదు. దేహముపై మోహ ముంచరాదు. కాని మిక్కిలి కష్టమునుగూడ సహింపఁజనదు 70. భిన్నుఁడై అనుభవమును గ్రహింపరాదు. కాని అనుభవమును గ్రహింపకుండ నుండఁగూడదు. ఆత్మస్థితి వివరింపఁజనదు. కాని బొత్తిగ స్తబ్ధత్వము కలిగియుండుటగూడ మంచిది గాదు 71. మనస్సును లయమొనర్చి యున్మనికావలెను. కాని మనస్సు లేనిది పనిజరుగదు. అలక్ష్యమైనవస్తువు లక్ష్యములోనికిరాదు. దానిని జూడకుండుటగూడ మంచిదిగాదు 72. అది (బ్రహ్మము) మనోబుద్ధుల కగోచరమైనది. కాని మనోబుద్ధులు లేకున్నచో దానిజ్ఞానముగూడఁ గలుగదు. ఎఱుకను మఱువవలెను. కాని యెఱుకలేమిగూడ మంచిదిగాదు 73. జ్ఞాతృత్వము నుంచఁగూడదు. కాని జ్ఞానములేకున్నచోఁ బనిజరుగదు. అతర్క్యవస్తువు తర్క్యములోనికిరాదు. గావున తర్కములేకుండ నుండుటగూడ మంచిదిగాదు 74. దృశ్యము స్మరణచేయుట మంచిదిగాదు. కాని విస్మరణము గావించుటగూడఁ దగదు. చర్చలెవ్వియుఁ గావింపగూడదు. కాని చర్చలెవ్వియుఁ గావింపకున్నఁగూడఁ బనిజరుగదు 75. లోకులలోఁ గల భేదము పాటింపగూడదు. కాని వర్ణసంకరముగూడ నొనరింపఁజనదు. స్వధర్మమును విడువగూడదు. కాని ధర్మాభిమానముగూడ మంచిది గాదు 76. అశాబద్ధమగుమాట నుడువరాదు. వివేకములేకుండ వర్తింపఁగూడదు. ఏమైననుసరియే శాంతిభంగము గానీయరాదు 77. అవ్యవస్థితముగఁ బుస్తకము వ్రాయఁగూడదు. కాని పుస్తకములేకున్నఁ గూడఁ బనిజరుగదు. అవ్యవస్థితముగఁ జదువఁగూడదు. కాని చదువకుండుటగూడ మంచిదిగాదు 78. నిస్పృహుఁడు వక్తృత్వము విడువఁజనదు. కాని సందేహము కలిగినపుడు వివాదములొనర్పఁ దగదు. మఱియు శ్రోతలవాక్యములను జెడ్డవిగా భావింపఁకూడదు 79. ఈ యుపదేశముల నన్నింటిని హృదయమునందుంచుకొన్నచో సమస్తసుఖములును లభించును. మహంతులక్షణములు తమంతట నవియే కలుగును 80.

---

## రెండవ సమాసము — భిక్షానిరూపణము.

భిక్షనడుగుట బ్రాహ్మణుని ముఖ్యదీక్ష. 'ఓంభవతి' పక్షమును బ్రాహ్మణుఁడు రక్షగావింపవలెను 1. భిక్షనడిగి భుజించువాఁడు నిరాహారి

యనఁబడును. భిక్షనడిగినకారణమునఁ బ్రతిగ్రహాదోషమును భిక్షుకుఁ డొందఁడు 2. సజ్జనునుండియైనను దుర్జనునుండియైనను ఏపురుషుఁడు అన్నమును యాచించిభుజించునో వాఁడు ప్రతిదినమును అమృతపానము గావించుచున్నాఁడని గ్రహింపనగును 3.

శ్లో॥ భిక్షాహారీ నిరాహారీ భిక్షా నైవ ప్రతిగ్రహః ।
అసంతోవాపి సంతోవా సోమపానం దినేదినే ॥

భిక్షామహిమ యిట్టిది. భిక్షమడుగుట సర్వోత్తముఁడగు నీశ్వరునకుఁ గూడ సంతోషావహము. గొప్పగొప్పయోగులు, సిద్ధులుగూడ భిక్ష నడుగుచున్నారు 4. దత్తాత్రేయుఁడు, ఘోరనాథుఁడు మున్నగు సిద్ధపురుషులుగూడ జనుల భిక్షమడిగిరి. భిక్షవలన నిస్పృహత్వము వెల్లడి యగును 5. కొందఱు వారి నియతిననుసరించి భిక్షగ్రహింతురు. ఇది పరాధీనత యగును. ఇట్లే ప్రతిదినము నొక్కగృహమునుండియే భిక్ష గావించుచుండినను స్వాతంత్ర్యముండదు 6. ఎనిమిది దినములకొఱకు అన్నమును బ్రోవుచేసికొనుట మంచిదికాదు. అటునొనరించుచున్నచో నిత్యనూతనత వలసియానందము లభింపఁజాలదు 7. నిత్యమును గ్రొత్త క్రొత్త తావులలోఁ దిరుగవలెను. బాగుగా దేశాటనము గావింపవలెను. అప్పుడే భిక్షమడుగుటలో శోభగలగు. అప్పుడే భిక్షావృత్తి ప్రశంసాపాత్రమగును 8. భిక్షనడుగు నలవాటు అఖండముగఁ గలవానికిఁ బరదేశ మనునది లేనేలేదు. ఎక్కడఁజూచినను నక్కడ నాతనికి మూఁడులోకములును స్వదేశమగును 9. భిక్షనడుగుటకు సందేహపడఁగూడదు. లజ్జ నొందఁదగదు. విసువఁగూడదు. పరిభ్రమణము చేయుచునే యుండవలెను 10. అనేక చమత్కారములను జేయుచు నిరంతరము భగవంతుని నభివర్ణించుచు నుండుపురుషుఁడు నిస్పృహతో భిక్షమడుగుచుంటఁజూచి పెద్దపిన్నలెల్లరును జకితులగుచుందురు 11. భిక్ష కామధేనువు. భిక్షవలన నిరంతరమును ఫలము లభించును. అది సామాన్యమైనది గాదు. భిక్షావృత్తి నగౌరవించు జోగి అభాగ్యుఁడు 12. భిక్షవలన ఎఱుకగలుగును. భిక్షవలన భ్రమ నశించును. మఱియు సాధారణభిక్ష నెల్లరును స్వీకరింతురు 13. భిక్ష యొకవిధముగఁజూచినచో నిర్భయస్థితియైయున్నది. భిక్షవలన మహంతుధర్మము ప్రకటనమగును. భిక్షవలన స్వతంత్రత లభిం

చును. మఱియు ఈశ్వరప్రాప్తి కలుగును 14. భిక్షవలన నేవిధమగు నాటంకముగాని బాధగాని కలుగదు. భిక్షాహారి నిరంతరమును స్వతంత్రముగా నుండును. భిక్షవలన విరాగులు సమయమును సార్థకపఱుపఁ గల్గుదురు 15. భిక్ష అమరకల్పవల్లి. ఇది ఫలములతో నిండియున్నది. చెడ్డ సమయమునందు లజ్జాహీనుఁడగు పురుషునకు భిక్ష ఫలదాయకమగును16. భూమండలమున నెన్నియో దేశములు గలవు. పరిభ్రమించినచో నెవ్వఁడును ఆకలిచేఁ జనిపోవఁడు. పరిభ్రమించి భిక్ష గ్రహించు భిక్షుకుఁడు జనులను బాధింపఁడు 17. గోరక్షణ వాణిజ్య కృషులన్నిటికంటె నుత్తమమైనదిసుమా భిక్షాప్రతిష్ఠ. జోలె నెప్పుడును విడువఁగూడదు 18. భిక్షతో సమానమగు వైరాగ్య మింకొకటిలేదు. వైరాగ్యమునకు సమానమగు నితరసౌభాగ్య మెద్దియులేదు. వైరాగ్యములేకున్నను ఏక దేశీయముగా నున్నను మానవుఁ డభాగ్యుఁడగును 19. కొంచెము భిక్షగలదాయని యడిగినయెడల నొకవేళ నెవరేని యధికభిక్ష నొసంగనెంచి తెచ్చినచో అల్పసంతోషిగా నుండి అందొక పిడికెడుమాత్రమే గైకొనవలెను 29. ఆనందపూర్వముగా భిక్ష నడుగవలెను. ఇదియే నిస్పృహాత్వలక్షణము. మధురముగా మాటలాడుచో నెల్లరకును సుఖముగలుగును 21. భిక్షా విషయమును స్వల్పముగ యథామతి వివరించితిని. భిక్ష సమయాసమయములలోఁ గలుగు నాపదలను దొలగించును 22.

---

## మూఁడవ సమాసము — కావ్యకళ.

శబ్దకుసుమమాలారూపమగు కవిత్వముయొక్క— సుందరసుగంధిత పరిమళరూపమైన అర్థముచే సాధుసజ్జనరూపములగు భ్రమరసమూహమున కానందము కలుగుచున్నది 1. ఇట్టి మాలికలు అంతఃకరణమునందు గ్రుచ్చి శ్రీరాముని చరణములను బూజింపుము. ఓంకారతంతువు నఖండితముగ నుంచుము. దానినెప్పుడును ఖండితము గావింపకుము 2. పరోపకారముకొఱకుఁ గవిత్వము వ్రాయుట ఆవశ్యకము. ఇట్టి కవితాలక్షణములను వివరించెదను 3. ఎయ్యది యాలించిన భగవద్భక్తియు, విరక్తి నుదయించునో యట్టి కవిత్వాభ్యాసమును వృద్ధినొందింపవలెను 4. ఆచరణ

రహితమగు శుష్కశబ్దజ్ఞానమును సజ్జనులగు పురుషు లెప్పుడును మెచ్చు కొనరు. కావున (కవిత్వము నభ్యసించుటకుముందు) అనుతాపసహాయ మునఁ గరుణార్ద్రహృదయముతోఁ బరమాత్ముని బ్రసన్నముఁ గావించు కొనవలెను 5. ఏలయన? పరమాత్ముఁడు ప్రసన్నుఁడైన పిమ్మట (ఈశ్వ రీయస్ఫూర్తితో) ముఖమునుండి వెలువడువాక్కు శ్లాఘనీయమైనది. మఱియు దానినే ప్రాసాదికమని చెప్పనొప్పును 6.

జనులు కవిత్వమును మూఁడు తెఱంగులుగ విభజించిరి (1) దృష్టము (2) పాఠము (3) ప్రాసాదికము. ఇఁక నీ మూఁడువిధములను క్రమముగా విచారింపుదము 7. కొందఱు విచ్చలవిడిగాఁ దమమనస్సు లోనికి వచ్చినవానిపై నెల్ల బలాత్కారపుఁ గవిత్వము నల్లుదురు. దానిని జల్లి కవిత్వమందురు 8. కావ్యగ్రంథములను విశేషించి చదువుటచే నొక్కొ క్కని కావ్యగ్రంథములన్నియు గంఠస్థము లగును. దానినే కొంచెము మార్పుగావించి వారలు కవిత రచింతురు. ఇట్టి కవిత్వమును పాఠకవిత్వ మందురు 9. కొందఱు శీఘ్రముగా (ఆశువుగాఁ) గవిత్వము చెప్పుదురు. ఎదుటఁ గనబడినదానినెల్ల వర్ణింతురు. భక్తిరహితములగు పదములను జేర్చి గణములఁ గూర్తురు. ఇట్టి కవిత్వమునుగూడ (జల్లిపొల్లు) పాఠకవిత్వ మనియే జెప్పనగును 10. కామిక, రసిక, శృంగార, వీర, హాస్య, ప్రస్తా వన, కౌతుక, వినోదాది విషయములలోఁ జెప్పు కవిత్వమునుగూడ జల్లిపాఠ మనియే చెప్పవచ్చును 11. మనస్సు కామాతురమైనప్పుడు ఉద్గారము గూడ (పలుకుబడియంతయు) నట్లేయుండును. కాని యీజల్లికవిత్వముల వలన జన్మము సఫలము కాఁజాలదు 12. ఉదరశాంతికై నరస్తుతి చేయ వలసివచ్చును. ఇట్టి నరస్తుతులలోఁ జూపించు కావ్యకౌశలమునుగూడఁ బొల్లుకవిత్వమందురు 13. కాని కవిత్వము ధృష్టపాఠముగ (పొల్లుగ) నుండఁగూడదు. కవిత్వములోఁ గష్టముకూడదు. మఱియుఁ బాషండ మతపూర్ణముగను, ఉద్ధతముగను నుండుకవిత్వము నిరుపయోగము 14. కవిత్వము పాదపూర్ణముగను, రసహీనముగను, కర్కశముగను, దృష్టాంత హీనముగను నుండఁగూడదు 15. కవిత్వమునందు అనావశ్యకవిస్తారము గాని, సారహీనవిషయములుగాని యుండఁగూడదు. కుటిలునిసంబోధించి గూడ కవిత్వము వ్రాయఁగూడదు 16. కవిత్వము హీనముగ నుండరాదు.

నుడివినదానిని మఱల నుడువరాదు. ఛందోభంగము గావింపఁజనదు. మఱియుఁ గవిత్వము లక్షణరహితముగ నుండఁగూడదు 17. వ్యుత్పత్తి హీనముగను, తర్కహీనముగను, కళాహీనముగను, శబ్దహీనముగను, భక్తిజ్ఞానవైరాగ్యహీనముగను గవిత్వముండఁగూడదు 18. భక్తిహీన మగు కవిత్వమును మోసపుఁదడికయని గ్రహింపవలెను. నీరసమగు వక్తృత్వము భయము నుదయింపజేయును 19. భక్తిహీనముగఁ జెప్ప బడునదెల్ల నొకవిధమగు జంత్రవాద్యము. ప్రీతిలేనిసంవాద మెచటనైన నుండునా ? 20. ఈ జల్లికవిత్వములు, పాఠకవిత్వములు రచించుట మిథ్యయు, అహంకారము, వెట్టితనము మాత్రమేసుమా ! ఇఁకఁ బ్రాసాదిక కావ్యలక్షణము నెఱింగించెదను 20.

స్త్రీలపట్లను, ధనమునందును నసహ్యాభావముగలవాఁడును, అంతః కరణమునందు బరమాత్మధ్యానము పాదుకొల్పువాఁడును, 22 నిరంత రము భగవత్ప్రేమయందు మగ్నుఁడై యుండువాఁడును, పగలు రెండు రెట్లుగ రాత్రులందు నాలుగురెట్లుగ భగవద్భజనమునందు వృద్ధినొందు నుత్సాహముగలవాఁడును 23. భగవద్భజనములేకుండ క్షణమునేని గడుప లేనివాఁడును, అంతఃకరణము నిరంతరము భక్తిరంగమునఁ దాండవమాడు వాఁడును 24. అంతఃకరణమునం దచలుఁడు, శాంతస్వరూపుడు నగు భగవంతునకు నివాసస్థానముగనున్నవాఁడు, నగు పురుషుఁడు స్వాభావిక ముగా నుడువునదియెల్ల బ్రహ్మనిరూపణమైయుండును 25. హృదయ మున గోవిందుఁడు నిలిచియున్న కారణమున భక్తునకు భక్తియందె రుచిలభించును. అతఁడు భక్తిని విడిచి యన్యమేదియును జెప్పఁజాలఁడు 26. హృదయమునందేవిషయమునఁ బ్రీతిగలదో దానినే యాతనివాణి నుడువును. ఆతఁడు భక్తిభావముతోఁగరుణాకీర్తనము గావించును. మఱియుఁ బ్రేమమగ్నుఁడై నృత్యముగావించును 27. భక్తునకు భగ వంతునియందు మనస్సులీనమగును. అందుచే దేహాభిమాన ముండదు. ఇట్లే శంకాలజ్జలుగూడ దూరముగఁ బారిపోవును 28. భక్తుడు ప్రేమ యను రంగులో మునిగిఁపోవును. భక్తిమదమున నున్మత్తుఁడగును. మఱియు నహంకారమును గాళ్ళక్రిందఁ బడవేయును 29. భక్తుఁడు నిశ్శం కగ గానముచేయును. నృత్యము గావించును. అతనికి జనులెచటఁగాన్పిం

తురు? ఆతనిదృష్టిలోఁ త్రైలోక్యనాయకుఁడే నివసించును 30. ఇట్లు
భగవంతునియందు లీనుఁడై పోవుభక్తున కేవిషయమునందును నవసర
ముండదు. ఆతఁడు తనయిచ్ఛకొలంది భగవంతుని రూప కీర్తి ప్రతాపముల
వర్ణించుచుండును 30. భక్తుడు భగవంతుని నానారూపములను, మూర్తి
ప్రతాపములను, అనంతకీర్తిని వర్ణించుచుండును. వానికి నరస్తుతియన్నఁ
తృణసమానముగను, దుచ్ఛముగను దోచును 32. ఈ విధముగ విరక్తుఁడై
సంసారమునందున్న భగవద్భక్తునిసాధుజనులు ముక్తునిగ భావించు
చున్నారు 33. ఆతఁడు భక్తివశమునఁ గానించురసవంతమగు వర్ణనమునే
ప్రాసాదికకవిత్వ మందురు. ఆతఁడు సాధారణముగాఁ జెప్పుప్రత్యంశము
నను వివేకము నిండియుండును 34.

ఇఁక సాధారణరీతిగఁ గవితాలక్షణములను మఱలఁజెప్పెదను
వినుండు. దీని నాలించినచో శ్రోతలహృదయములలో నానంద మతి
శయింపఁగలదు 35. కవిత్వము, నిర్మలముగను, సరళముగను, స్పష్టము
గను, క్రమానుసారముగను నుండవలెను 36. కవిత్వము భక్తిబలయుక్త
ముగను, అర్థప్రచురముగను, అహంకారరహితముగను నుండవలెను 37.
కవిత్వము కీర్తితో నిండియుండిరమ్యముగను, మధురముగను, విస్తృత
ప్రతాపయుతముగను నుండవలెను 38. కవిత్వము సరళముగను, సంక్షిప్త
ముగను, సులభముగను, పద్యాత్మకముగను నుండవలెను 39. కవిత్వము
మృదువుగను, మంజులముగను, కోమలముగను, భవ్యముగను, అద్భుత
ముగను, విశాలముగను, ఆనందదాయకముగను, మధురముగను, భక్తి
రసయుక్తమై రుచిరముగను నుండవలెను 40. అక్షరబంధము, నానా
చాతుర్యప్రబంధము, నానాప్రకారకౌశల్యము, చందోబంధము, ఘాటి,
ముద్ర మున్నగునవి యెన్నియేని కావ్యములయం దుండవలెను 41.
నానావిధయుక్తులు, బుద్ధులు, కళ, సిద్ధి, అన్వయము మున్నగు కావ్య
ధర్మముల నిర్వహించి నానావిధములగు కవిత్వములను నిర్మింపవలెను 42.
కవిత్వమునందు నానావిధములగు సాహిత్యవిషయికదృష్టాంతములు తర్క
ము, యుక్తి, ఉక్తి, సమ్మతి, సిద్ధాంతము, పూర్వపక్షము సహిత
ముండవలెను 43. నానావిధగతులు, విద్వత్త, మతి, స్ఫూర్తి, ధారణ,
ధృతి, శాస్త్రాధారములతో గూడిన శంకాసమాధావిషయములు (నిశ్చయ

ముకలుగుటకు సందేహముతొలగిపోవుటకుఁ దగినయంశములు) గూడ కవిత్వమునం దుండవలెను 44-45. నానావిధప్రసంగములు, విచారయోగ వివరణములు, తత్త్వచర్చాసారము గలదియే కావ్యమనఁబడును 46. నానావిధసాధనములు, పురశ్చరణము, తపస్సు, తీర్థాటనము, మున్నగు వానివర్ణనముగలదియు, నానావిధసందేహములఁ దొలంగించునదియుఁ గవిత్వమనఁబడును 47. పశ్చాత్తాపము జనింపఁజేయునదియు, లౌకిక విషయములను లజ్జితమొనర్చునదియు, జ్ఞానబోధచేయునదియు 48. జ్ఞానము నభివృద్ధిచేయునదియు, వృత్తి నప్తమింపఁజేయునదియు, భక్తిమార్గమును విశదముచేయునదియు, నేదియో అదియే కవిత్వము 49. దేహాభిమానము దొలగించునదియు భవసాగరమును ఇంకించు నదియు, భగవంతుని హృదయమునందు స్పష్టపఱచునదియు, నేదియో యదియే కవిత్వము 50. సద్బుద్ధిప్రసాదించునదియు, పాషండమునశింపఁ జేయునదియు వివేకమును వృద్ధిసేయునదియు, సత్యమగుకావ్యమనఁబడును 51. సద్వస్తువును భాసింపఁజేయునదియు, భాసము నిరసనముగావించునది యు, భిన్నత్వము నశింపఁజేయునదియు, సమాధానము గలిగించునదియు, సంసారబంధములను ద్రెంచునదియు సజ్జనులచే మన్నింపఁబడునదియు, నేదియో అదియే కవిత్వము 52-53. ఈ విధముగాఁ గావ్యలక్షణముల నింకను జెప్పబూనినఁదొఁ జాలగలవు. సాధారణరీతిగ నెఱుంగుటకై సంక్షిప్తముగా నిట వివరించితిని 54.

---

## నాలుగవసమాసము — కీర్తన లక్షణము.

కలియుగమున (దరింపఁగోరువారు) కీర్తనము గావింపవలెను. భగ వంతుని గుణములను మధురశబ్దములతో నేర్పుగా గానముచేయవలెను. కీర్తనమునందుఁ గఠినములు, కర్కశములు నగువచనము లుపయోగింపఁ దగదు 1. కీర్తనములవలన సంసారబంధములగు చిక్కులను దూరపఱుప వలెను. దుష్టులతోఁ దగవులాడఁగూడదు. సత్యాసత్యములవలనఁ దన శాంతికి భంగముకలుగనీయరాదు 2. గర్వగీతములను బాడరాదు. పాడుచుఁ బాడుచు అలసిపోవఁగూడదు. గోప్యమును బ్రకటనము జేయఁ

దగదు. భగవంతుని గుణములను గానముచేయవలెను 3. కీర్తనము గావించుతఱి మిగులఁ గదలుట, ఊగుట, దగ్గుటకూడదు 4. కీర్తనము నందు భగవంతుని యనంతనామములను, సగుణేశ్వరుని బహువిధ ధ్యాన ములను, భగవత్కీర్తికి సంబంధించిన అనేకాద్భుత చమత్కారములను ప్రకటింపవలెను 5. కీర్తనమునందు మంచివిషయమునుగాని, చెడ్డవిషయ మునుగాని విడువఁగూడదు. ఎవరి మనస్సునకేని భిన్నభావము గలుగఁ జేయుమాట లుండఁదగదు 6. కీర్తనమునం దెవరితోనేని పందెముచేయఁ దగదు. ఒకవేళ నెవరేని తనతోఁ బందెము వైచినచో సహనము గలిగి యుండవలెను 7. కీర్తనము గావించుతఱి యెవరినిగూర్చియేని వ్యర్థ ప్రసంగములు చేయఁదగదు. జాగరూకులుగ నుండువారలు పవిత్రులగు దురు. మిగుల వైభవముతో జనరూపుఁడగు జనార్దనుని (శ్రోతృగణ స్వరూపుఁడగు నీశ్వరుని) సంతోష పఱుపవలెను 8. దప్పిగొన్న మాన వుఁడు చల్లని నీటియొద్దకు స్వయముగా నేగువిధముగాఁ బ్రేమమయుఁడగు శ్రోత తనంతన భగవత్కీర్తనమునకు వచ్చును 9. ఇట్టి శ్రోతలఁ బిలువ వలసిన పనిగాని, రప్పించుటకుఁ బ్రయత్నింపవలసిన పనిగాని యుండదు 10. కీర్తనముజేయుటకేదేని మిషకల్పింపగూడదు. అనాసక్తిగ నుండఁజనదు. లజ్జనొందరాదు 11. కీర్తనమునకు ఆటంకము గలుగఁజేయు దుష్టులను దగ్గఱకుఁ జేరనీయఁజనదు. మధ్య కలహములు జరుగనీయఁగూడదు. కలహములవలన ధ్యానము భంగమగునను భయము కలుగును 12. కీర్త నము చేయునపు డభిమానముతో మఱుపును దరిజేరనీయఁగూడదు 13. కీర్తనమొనరించుచు మెల్లమెల్లగఁ గదలుచుఁ బరమాత్మునిపైఁగల ప్రేమతో నృత్యముచేయవలెను. బొత్తిగ స్తబ్ధుఁడై యుండఁగూడదు 14. సుందరమగురీతితో, నమ్రతాపూర్వకముగ మధురస్వరముతో గానము చేయవలెను 15. కరతాళము, తాంబుర, తానమానము, తాళబద్ధమగు తంతుగానము మున్నగునవి విని బుద్ధిమంతులగు మనుజులు తత్కాల ముననే తనుమనములతో భక్తియందు లీనమగుదురు 16. ప్రేమాన్వి తులగు భక్తులు వివిధపద్ధతులతోఁ గావించు నృత్యమునుజూచియు వార లొనర్చు సుస్వరయుక్తమగు గానమునువినియు జనులు ప్రసన్నులగు దురు 17. దక్షుఁడగు కీర్తనకారుఁ డొనరించు కౌశలయుక్తములగు కథా

ప్రబంధముల నాలించిన శ్రోతల యంతఃకరణములు కరుణతో నిండును 18. ఆతని కీర్తనము వినుటకుఁ జతురపురుషులు వేగముగాఁ బరుగెత్తుకొని వత్తురు. ఆతనిబుద్ధి విలక్షణతనుగాంచి వారలాశ్చర్యము నొందుదురు. ఈ విధమగు కూడికచే రానురాను సభలో రక్తియతిశయించును 19. నానావిధ పాండిత్యాతిశయముచేఁ బూర్ణములగు హావభావములు, కౌతుకము కీర్తనమునందుఁ జూపవలెను 20. కీర్తనము పాపము నశింపఁ జేయునదిగను, బుణ్యమును ప్రకాశింపఁజేయునదిగను నుండవలెను. కథ కుఁడుజెప్పు కథాంశము శ్రోతలు శ్రద్ధాభక్తులతో మననము చేయఁదగి నదిగ నుండవలెను 21. కీర్తనమునందు వ్యర్థముగా మాటలాడఁగూడదు. ఎవరినేని నిందింపరాదు 22. ఉత్తమభక్తిపూర్ణమగు కథనాలించుటకై జనులందఱును ఉత్సాహముతోఁ బరుగెత్తుదురు 23. పరోపకార వ్రత ముచే నలంకృతుండగు భక్తుని ప్రజలందఱును బ్రశంసింతురు 24. కీర్తనకారుని యుత్తమోపదేశములను శ్రోతలాదరింపవలెను. మోహముచే నున్మత్తులు కాఁజనదు. అభిమానపడుటవలన హానిగలుగును 25. శిక్షా పూర్ణమగు వక్తృత్వము నాలించుటకై జనులు తమంతఁ దామె గుమి గూడుదురు. పిలువవలసిన యవసరముండదు 26. రాగరంగయుక్తమును, రసవంతమును, సుందరమును నగుమనోహర సంగీతము నాలకించినంతన శ్రోతల యంతఃకరణములు అందు లీనమగును. రత్నపరీక్షకులు రత్నముల వెంటఁ బరుగెత్తునట్లు ఉత్తమకీర్తన పరీక్షకులు కీర్తనములు వినుటకై పరుగెత్తుదురు 27. భక్తిపూర్ణమగు కీర్తనము నాలించినయెడల జనుల యందీశ్వరప్రేమ వృద్ధియగును. మనస్సు నిర్మలమగును. మఱియు హృద యమున భూతదయ వృద్ధినొందును 28. కీర్తనములందు వ్యర్థవచనముల నుడువఁగూడదు. వ్యర్థవివరణము గావింపరాదు. వినీతుఁడై మంచివక్తృత్వ ముచేజనుల నానందపఱుపవలెను. 29. జనులందఱకును సారాసారము నేర్పవలెను. సజ్జనులగు పురుషులకు సంగీతసాహిత్యములు రెండును రుచి కరముగానుండును 30. సత్యాసత్యములు భాషించుతఱి సత్యమగుమాట విశదమైనంతన లోకులానందింతురు. అనృతము నెవ్వఁడుగాని గౌరవింపఁడు. 31. వేదశాస్త్రములు విద్వాంసులు అనుకూలించునట్లు భాషింపవలెను. లేకున్నచో నెవ్వఁడును నభిమానింపఁడు32. ఆనందపరవశుఁడై పొంగిపోవుచు

నవ్వులు, హేళనములలో మునిగితేలు కీర్తనకారునకు హితము గలుగదు 33. బ్రహ్మమువైపు లక్ష్యమును నెలకొల్పి దానిని రక్షింపవలెను. స్వయముగ ద్రష్టలగు లోచనములనుగూడఁ జూడవలెను. అట్లు గావించిన-చో తనంతన అలక్ష్యమునందు లక్ష్యము లగ్నమగును 34. క్షేత్రజ్ఞుఁడు క్షేత్రమును (ఆత్మదేహమును) క్షుబ్ధపఱచుచున్నాఁడు. మఱియు క్షమతో క్షమించి క్షేత్రమునకు శాంతిని గలిగించుచున్నాఁడు. ఆ సర్వవ్యాపియగు క్షేత్రజ్ఞుని (ఆత్మయందు) క్షమాక్షోభలు రెండును నున్నవి 35.

---

## ఐదవ సమాసము — హరికథారీతి.

ఇఁక బుద్ధిమంతులగు శ్రోతలు హరికథారీతిని సావధానులరై వినవలెను 1. హరికథ నేవిధముగఁ జెప్పవలయునో రఘునాథుని కృపాపదవి లభించునట్లు దాని నే విధముగ ర క్తిఁ దేవలెనో వినఁగోరెద 2. బంగారమునకుఁ దావియుఁ, జెఱుకునకు సుందరమును, మధురమును, రసవంతమునగు ఫలమును నుండుట యపూర్వవిషయము 3. అట్లే హరిదాసు విరక్తుడగు జ్ఞాతప్రేమతోఁగూడిన హరిభక్తుఁడు వ్యుత్పన్నుఁడు వాదరహితుఁడునై యుంటగూడ అపూర్వవిషయమే! 4. ఇన్ని సులక్షణములుండి హరిదాసుఁడొకవేళ రాగజ్ఞానియు, తాళజ్ఞానియు, సకలకళాయుక్తుఁడును, బ్రహ్మజ్ఞానియు నిరభిమానియునై జనులలోఁ గలసిమెలసియున్నచో నిఁక జెప్పవలసిన దేమున్నది? 5. మత్సరరహితుఁడు, సజ్జనులకు మిగులఁ బ్రియుఁడు, చతురత్వలక్షణముల నెఱింగినవాఁడు, ఆత్మనిష్ఠుఁడు నగువాఁ డెవఁడో యాతఁడె ఉత్తమ హరిదాసు 6. జయంతి మున్నగు పర్వదినములలో భక్తితో నుపవసింపక దేవాధిదేవుఁడగు పరాత్పరుఁడు వర్తించు క్షేత్రరాజములను విశ్వసింపక కేవలముగ దమకుఁగల శబ్దజ్ఞానమాత్రమున సమస్తమును మిథ్యయని చెప్పుపామరులకు శ్రీపతియగు భగవానుఁడెట్లు లభింపఁగలఁడో యోజింపుఁడు 7-8. పామరులకు సందేహకారణమున నిర్గుణమునందు మనస్సు లగ్నముకాదు. బ్రహ్మజ్ఞానమునందలి యభిమానమున నిర్గుణము రుచింపదు. ఈ విధముగా వారలు రెంటికిఁ జెడుదురు 9. ముందు సగుణమూర్తినుంచుకొని నిర్గుణమును

గూర్చినకథలఁ జెప్పువాఁడును, నిర్గుణమును బ్రతిపాదించి సగుణము నుచ్ఛే దనము గావించువాఁడును జదివినమూర్ఖుఁడు 10. వాస్తవమున కీ రెండు పంథలును (సగుణ నిర్గుణమార్గములు) జేతికెజిక్కకుండునట్లు హరికథ గావింపఁగూడదు. ఇఁక హరికథా లక్షణముల వినుండు 11.

సగుణమూర్తి సమ్ముఖమున భావపూర్వకమగు కరుణాకీర్తన మొన రింపవలెను. మఱియు నీశ్వరుని కీర్తిప్రతాపయుక్తములగు నానాధ్యాన ములను వర్ణింపవలెను 12. ఇట్లు గానముచేయుచున్నయెడల రసయుక్త ముగాఁ గథ నోటినుండి సహజముగా బయలువెడలును. అప్పుడు శ్రోత లందఱి హృదయములందును బ్రేమసుఖ ముప్పతిల్లును 13. సగుణములో నిర్గుణమును దేఁగూడదు. శ్రోతలగుణదోషములు నుడువఁగూడదు. ఇదియే కథాకల్పనమునందుఁ బ్రధానయుక్తి 14. భగవంతుని వైభవమును మహత్త్వమును నానావిధముల వర్ణించుచు సగుణమునందు శ్రద్ధయుంచి కథ నుడువవలెను 15. లోకలజ్జ విడిచి ధనముపై నాశతొలంగి నిత్యనూతన ములగు కీర్తనములపై బ్రేమనుంచవలెను 16. దేవమందిరపు రాజాంగ ణములందు నిశ్శంకుఁడై పొరలవలెను. కరతాళములు ప్రయోగించుచు, నృత్య ము జేయుచు భగవానుని నామమును ఘోషింపవలెను 17. ఒకదేవత కీర్తిని రెండవదేవతముందు వర్ణించుట మంచిదిగ నుండదు. కావున నేదేవత కీర్తి నాదేవతముందె ప్రశంసింపవలెను 18. ఎదుట సగుణమూర్తి లేకున్న తరుణమునందును సాధువులగు శ్రోతలముందును నవశ్యముగా నద్వైత నిరూపణము గావింపనగును 19. విగ్రహములేని తావునను సాధుసజ్జనులు లేనితావునను భావికజనులు శ్రోతలుగనున్నప్రదేశమునను పశ్చాత్తాప యుక్తమగు (కరుణాపూర్ణమగు) వైరాగ్యమును గీర్తింపవలెను 20. శృంగారాది నవరసములలో శృంగారవర్ణనము విడిచిపెట్టవలెను. స్త్రీలు మున్నగువారి వినోదములను వర్ణింపఁదగదు 21. సుందరీమణుల లావణ్యా వర్ణనముల నాలించినంతన సులభముగా హృదయమునందు వికార ముద యించును. అంతదనుకనేల! తత్కాలముననే శ్రోతలధైర్యము భంగ మగును 22. కాన శృంగారవర్ణనమును విడువవలెను. శృంగారవర్ణనము సాధువులకు సహజముగా బాధకరముసుమా! ఇట్టివర్ణనముల నాలించు చున్నయెడల అంతఃకరణమునందు స్త్రీలపై ధ్యానము పాదుకొనును 23.

స్త్రీలావణ్యము నాలకించుటవలనను, ధ్యానించుటవలనను మనస్సు కామాతురమగును. అందుచే నీశ్వరధ్యానస్మరణములు జరుగఁజాలవు. 24. స్త్రీవర్ణనము నాలించి యానందించువాఁడును స్త్రీలావణ్యానందమున మగ్నుఁడగువాఁడునునగు పురుషుఁడు ఈశ్వరునిచే వంచితుఁడగును 25. ఒకక్షణమాత్రమేని పరమాత్ముఁడు ధ్యానములోనికి రాఁగలిగినచో కథయందు బాగుగా మనస్సు లీనమగును 26. ఈశ్వర ధ్యానమునందు మనస్సు లీనమైనపిదప నిఁక సంసార మెట్లు జ్ఞాపకమునకువచ్చును ? నిశ్శంకముగ నిర్లజ్జగనుండి కీర్తనము గావించుచున్నచో ఆనందము కలుగును 27. కథనుడువు నాతఁడు రాగజ్ఞాన, తాళజ్ఞాన, స్వరజ్ఞానముల నెఱింగియుండవలెను. అట్లే యుపదేశపూర్ణమగు కీర్తనము గావింపవలెను 28. ఏఁబదియాఱుభాషలు, నానాకళలు, కోకిల కంఠమువంటి మధుర గాత్రముగూడ హరిదాసునకు అలవడియుండవలెను. ఇవి గౌణ విషయములు. భక్తిమార్గము వీనికంటె వేరుగనున్నది. దానిని భక్తులే యెఱుంగుదురు 29. భక్తుల కీశ్వరధ్యానమే యుండును. ఈశ్వరుఁడుదక్కఁ దదితరము వారెఱుంగనే యెఱుంగరు. కళావిదుల హృదయము కళలయందే నిమగ్నమైయుండును 30. శ్రీహరి సంబంధములేని కళలన్నియు వ్యర్థములు. భక్తిరహితములగు కళలయందు మగ్నుఁడగు పురుషుఁ డీశ్వరునిచేఁ బ్రత్యక్షముగ వంచితుడగును 31. సర్పములచే నావరింపబడిన కారణమునఁ జందనవృక్షమెట్లు దరిచేరరానిదిగ నున్నదో, భూతప్రేతముల భయమువలన ద్రవ్యభాండాగార మెట్లు అంటరాని దగుచున్నదో అట్లే నానావిధ కళలవలన నీశ్వరుఁడుగూడ దుర్లభుఁడగుచున్నాఁడు 32. సర్వజ్ఞుఁడగు పరమాత్మునివదలి కేవల నాదమునందు మగ్నుఁడగుట విఘ్నమును మధ్య ప్రత్యక్షముగా సమకూర్చుకొనుటవంటిది 33. మనస్సు స్వరమునందుఁ జిక్కువడియున్నయెడ శ్రీహరి చింతన మెట్లుజరుగును? ఇది చోరుఁడు బలాత్కారముగ నెవనినేనిబట్టుకొని వానిచే సేవచేయించుకొనుటవంటిది 34. పరమాత్మప్రాప్తికి రాగజ్ఞానము విఘ్నముకలిగించును. మనస్సునుబట్టుకొని స్వరమువెనుకకు లాగికొనిపోవును 35. రాజును దర్శింపఁబోవువానిని గూలికి లాగుకొనిపోవుచోఁ గలుగు దుర్గతి కళవలనఁ గళావంతునకుఁ గలుగును 36. ఈశ్వరుని

హృదయమందుంచి హరికథను జెప్పువారలనే ధన్యులనుగా భావింప నగును37. హరికథయెడఁ బ్రీతియు నిత్యాభివర్ధనముగు నభిమానము గల వానికిఁ బరమాత్ముఁడు లభించును 38. హరికథ జరుగుచోటి కన్నింటిని విడిచి పరుగెత్తువాఁడును, సోమరితనము నిద్ర స్వార్థమువదలి హరికథ యందుఁ దత్పరుఁడగువాఁడును 39, హరిభక్తుల గృహమునందు నీచ కృత్యమునకుఁగూడ నంగీరించువాఁడును, స్వాయముగ నన్నివిధముల హరి భక్తునకు సహాయభూతుఁడగువాఁడును 40, నామస్మరణమునందు మిగుల విశ్వాసముగలవాఁడును హరిదాసుఁ డనఁబడును. ఇంతతో నీ సమా సము ముగియుచున్నది 41.

## ఆఱవసమాసము — చాతుర్యలక్షణము.

రూపలావణ్యము లభ్యాసముచే సాధ్యమగుననికావు. స్వాభావిక గుణము ఉపాయములచే సిద్ధింపదు. ఆగంతుకగుణములకొఱకుఁ గొంత కొంత ప్రయత్నము చేయవలసియున్నది 1. నల్లని మనుజుఁ డెఱ్ఱనివాఁడు కాఁజాలఁడు. మరుగుజ్జు పొడవరి కాఁజాలఁడు. మూగవాఁడు మాట లాడనేరడు 2. గ్రుడ్డివాఁడు దృష్టిగలవాఁడు కాలేఁడు. చెవిటివాఁడు వినజాలఁడు. కుంటివాఁడు మఱలఁ బాదముల నొందఁజాలఁడు. ఇవి స్వాభావిక విషయములు 3. కురూపత్వలక్షణముల నెంతదనుక వర్ణింప గలను? స్వాభావికగుణములు మార్పునొందవు 4. కాని అవగుణములు విడిచిపెట్టినచో వెడలిపోవును. అభ్యాసముగావించినచో ఉత్తమగుణము లలవడును. కాన చతురపురుషులు దుర్విద్యను విడిచి సద్విద్య నభ్య సింతురు 5. మూర్ఖత్వము విడిచినచో విడిపోవును. చతురత్వము నేర్చు కొన్నచో నలవడును. ప్రయత్నము గావించినచో అన్నియు బోధ పడును 6. ప్రతిష్ఠనొందఁ గోర్కియున్నచో దానినేల యుపేక్షింపవలెను. చతురత్వము లేనిచో ఉచ్చపదవి యెప్పుడును లభింపదు 7. ఒకవేళ నీ విషయమున విశ్వాసమున్నచో నీక జనులు స్వహితము నేల గావించు కొనరు? సన్మార్గులగు మనుజులను సత్పురుషులె మన్నింతురు 8. దేహము నెంత శృంగారించినను ఒకవేళ చతురతయెలేనిచో ఆ శృంగార మంతయు

వ్యర్థమే. గుణములేనితావునఁ బయిపై మెఱుంగులతో రూపము నేర్పరచుటగూడ వ్యర్థమే 9. అంతఃకరణమును శృంగారింపవలెను. నానావిధ జ్ఞానముల నార్జింపవలెను. సంపదలనొంది సుఖముగా ననుభవింపవలెను 10. ప్రయత్నముచేయక, అభ్యసింపక, దేహశ్రమ యొనర్పక, ఉత్తమగుణములు నేర్చుకొనక నిరంతరము క్రోధిగానుండువానికి సౌఖ్యము లభింపదు 11. మన మితరులపట్లచేయు పనిననుసరించియే వారలుచేయు బదులుపనిగూడ నుండును. జనులకుఁ గష్టము గలుగఁజేసినచో మనము గూడ మిగులఁ గష్టము లనుభవింపవలసి వచ్చును 12. న్యాయముగ నడచువాఁడె చతురుఁడు. అన్యాయిగ నుండువాఁడె నీచుఁడు. బహువిధ చాతుర్యలక్షణములను చతురుఁడె యెఱుంగును 13. సర్వజనులచే నభిమానింపఁదగు విషయము నందఱును గ్రహింతురు. నిందనీయమగు నంశ మెవ్వరు నంగీకరింపరు 14. జనులు నీయెడఁ బ్రసన్నభావులై యుండుట లేక యెల్లరును నీపయి విరుచుకొనిపడుట (అను నీ రెంటిలో నీ కేది యిష్టము) వీనిలో నీ కేది యనుకూలమో దాని ననుష్ఠింపుము 15. సమాధానమువలన సమాధానము పెంపొందును. మైత్రివలన మైత్రి మిగుల గాఢమగును. నాశనమొందించినచో మంచియంతయు క్షణమాత్రముననే నాశనమొందును 16. అయ్యాయని పిలిచినచో ఏమండీయనియు ఓరీయని పిలిచినచో ఏమిరాయనియుఁ బ్రత్యుత్తరమువచ్చుట మనము నిత్యమును వినుచున్నారము. ఇది ప్రత్యక్షముగా నెఱింగియుండియు అవివేకమునకుఁ బాల్పడనేల? 17. చాతుర్యమువలన హృదయమునకు శోభగలుగును. వస్త్రమువలన దేహమునకు శోభ యేర్పడును. ఈ రెంటిలో నేది శ్రేష్ఠమగు శృంగారమో యోచింపుఁడు (లోపలిశృంగారమా లేక బయటిశృంగారమా) 18. బాహ్యశృంగారమువలనఁ బ్రజల కేమియు లాభములేదు. చాతుర్యమువలనఁ బలువురకుఁ బలువిధముల రక్షణము కలుగును 19. బాగుగా దినుట, బాగుగా ద్రావుట, మంచి దుస్తులు ధరించుట, అందఱిలో మంచివాఁడనిపించుకొనుట అందఱును గోరునదియె 20. కాని తనువుతో, మనస్సుతోఁ బరిశ్రమ గావింపనంతదనుక నెవ్వరుఁ బ్రశంసింపరు. వ్యర్థములగు సంకల్ప వికల్పములలోఁ బడుటవలన గష్టమే గలుగును 21. ప్రజలు తాము నిర్వహింపఁజాలక

ఆపిన కార్యము నెవ్వఁడు నిర్వహింపఁగలఁడో ఆతనియొద్దకు జనులు తమంత నేగుదురు 22. కావునఁ బ్రజలను సుఖమునొందించి తాను స్వయముగా సుఖములను బడయవలెను. ఇతరులకు దుఃఖమును గలిగించినచో దానుగూడఁ గష్టముల ననుభవింపవలసివచ్చును 23. ఈ విషయమందఱు నెఱింగినదే. బాగుగా యోచింపనిచోఁ గార్యము జరుగదు. తెలిసికొనుటయే ప్రాణిమాత్రులకుఁ జక్కని యుపాయము 24. చక్కఁగఁ దెలిసికొని వర్తించు పురుషులే భాగ్యవంతులు. అట్టివారలను విడిచినచోఁ దక్కినవారలెల్లరు నభాగ్యులే 25. ప్రయత్నానుసారముగా వైభవము లభించును. వైభవమునుబట్టి సౌఖ్యముగూడ సమకూరును. ఈ యుపాయము ప్రసిద్ధముగనేయున్నది. తెలిసికొనవలయును 26. అలసత్వము వలనఁ గార్యము భంగమగును. ప్రయత్నము సోమరితనమువలన మెల్ల మెల్లగ నగును. ప్రత్యక్షవిషయము దెలియనివాఁ డవివేకి యనిపించుకొనును 27. మైత్రివలనఁ గార్యము సమకూరును. వైరమువలన మృత్యువు గలుగును. ఈ విషయము సత్యమో, అసత్యమో గుర్తెఱుంగవలెను 28. తాను నేర్పరియగుట నెఱుఁగనివాఁడు, స్వహితము నెఱుంగనివాఁడు, జనులతో స్నేహముగా నుంట యెఱుఁగనివాఁడు, మీదుమిక్కిలి వైరము గావించుకొనువాఁడు అజ్ఞాని యనఁబడును. ఇట్టి యజ్ఞానులకడ నెవరు సమాధాన మొందఁగలుగుదురు 29, 30 ఎవఁడేని యొకవేళ ఆకస్మికముగాఁ బ్రపంచముతో నొంటరిగాఁ బోరాడఁ బ్రయత్నించినయెడల బలువురి ముందా యొంటరికాఁడు విజయము నెట్లు బడయగలఁడు? 31. నిజమగు హరిభక్తుఁడు పలువురి నోటియందుండవలెను. పలువురి యంతఃకరణములందుఁ బాదుకొనవలెను. ప్రాణిమాత్రులకు ఉత్తమగుణములు నేర్పవలెను 32. లోకులను జతురులుగఁ జేయవలెను. పతితులను బావనము జేయవలెను. సృష్టియందు భగవద్భజనమును వృద్ధినొందింపవలయును 33.

---

## ఏడవ సమాసము — కలియుగధర్మములు.

నానావిధవేషములు, నానావిధాశ్రమములు మున్నగువాని కన్నింటికిని మూలము గృహస్థాశ్రమము. ఈ ఆశ్రమమునందు అన్నివిధములగు

మనుజులును విశ్రాంతినొందుదురు 1. దేవతలు, ఋషులు, మునులు, యోగులు, నానా తాపసులు, వీతరాగులు, పితరులు మున్నగు నధికారులు అతిథి అభ్యాగతులు మున్నగు వారలందఱును గృహస్థాశ్రమమునం దుత్పత్తియగుచున్నారు. వీరలెల్లరుం దమతమయాశ్రమములు వదలివేయుమన్నను గీర్తిరూపముతో గృహస్థుని యింటియందు నిరంతరము తిరుగుచున్నారు 2, 3. కావున గృహస్థాశ్రమ మన్నియాశ్రమములకంటెను శ్రేష్ఠమైనది. కాని స్వధర్మము, భూతదయ ఆవశ్యకము. (ఈ రెండు గుణములు గృహస్థునందు అవశ్యముగనుండవలెను). అప్పుడే గృహస్థాశ్రమమునకు శోభ 4. వేదవిహితములగు కర్మములాచరింపవలెను. అందఱితో మధురముగా భాషింపవలయును 5. అన్ని విధములను నుచితముగాం బ్రవర్తింపవలెను. అన్నిపనులను శాస్త్రానుకూలముగ నొనర్పవలెను. భక్తిమార్గముతో నడువవలెను 6. పురశ్చరణియు, కాయక్లేశియు, దృఢవ్రతుడును, పరమోద్యోగియు, జగదీశ్వరునిదక్క నితరుని గొప్పవానిగం దలంపనివాడును 7. కాయవాగ్జీవములతో భగవంతునికొఱకుం గష్టించువాడును, భజనమార్గమునందు దృఢభావముగలవాఁడును, 8. సత్యమగుభక్తుడు. ఆతడుంని శేషించి హృదయమునందు విరక్తుండై యుండును. ఆతడు సంసారచింత విడిచి ముక్తుండగును 9. హృదయము నందు వైరాగ్య భావము గలవాఁడే మహాభాగ్యశాలి. సంసారాసక్తికి సమానమగు దౌర్భాగ్యమింకొకటి లేదు 10. ఎందఱోరాజులు రాజ్యములను వదలి భగవంతునికొఱకు నంతటను దిరిగిరి. భూమండలమునందుం గీర్తిరూపముతోం బవిత్రులైరి 11. ఇట్టియోగీశ్వరులే అనుభవశాలురు. వారలు తమసదుపదేశమహత్వమున లోకమును బావనముచేయుచున్నారు 12. ఉదాసీన వృత్తియుతులగు నిట్టియాత్మజ్ఞానులను దర్శించినంతన మానవులు పవిత్రులగుదురు 13. వారలవలన మనుష్యమాత్రులకుం గళ్యాణములు గలుగును. వారలవలన నెవ్వరికిని జెడుగు గలుగదు. అఖండరీతిగ వారలహృదయములు భగవంతునియందు లగ్నమైయుండును 14. జనుల కిట్టియోగి దుశ్చిత్తునివలె గోచరించును. వాస్తవమున కాతడే సావధానుడు. ఏలయన! ఆతనిచిత్తము పరమేశ్వరునియందు లగ్నమై యుండును 15. ఉపాస్యమూర్తిని ధ్యానిం

చుటలో నాతని చిత్తము మగ్నమై యుండును. ఆత్మానుసంధానమునందుఁ దగిలియుండును. శ్రవణమననములలో నాతనిహృదయ మన్వయించియుండును 16. పూర్వజన్మసుకృతాతిశయము కోట్లకొలదిగ సంగ్రహమైన యెడల నిట్టిపుణ్యపురుషులతోడి సమాగమము లభించును 17.

ప్రతీతిరహితమగు జ్ఞానమంతయు బ్రాయికముగ ననుమాన మాత్రము. అనుమానజ్ఞానమువలన మనుజులకెన్నిటికిని ముక్తి లభింపదు 18. కావున బ్రతీతియే ముఖ్యమైనది. ప్రతీతిలేకున్నచోఁ బని నడువదు. చతురపురుషులు ఉపాయాపాయములను రెంటి నెఱుంగుదురు 19. కొందఱు బుద్ధిహీనులు సుఖముకొఱకు గృహస్థాశ్రమమును విడిచివేయుదురు. ఐనను వారలు ఇహపరలోకములు రెంటికి వంచితులై దుఃఖముతో మరణింతురు 20. క్రోధపడి గృహత్యాగము గావించిన మనుజుడు కలహించుచు మరణించును. అంతియగాదు. పలువురను దుఃఖములపాలుచేయును. స్వయముగఁ దానుగూడ దుఃఖము లనుభవించును 21. వైరాగ్యమున నిల్లువిడిచి వెడలిపోవునుగాని చిత్తమునం దజ్ఞానము తొలంగకయుండును. శిష్యులుగానేర్పడి జను లాతని వెంబడింతురు. గురుశిష్యులిరువురును సమానముగ నజ్ఞానరూపులై యుందురు 22. ఇట్టి యాశాబద్ధుఁడును అనాచారియు నగు పురుషుఁ డొకవేళ గృహమునువిడిచి (గార్హస్థ్యమునువదలి) వెళ్ళిపోయినచో నాతడు జనులలో ననాచారమును వ్యాపింపఁజేయును 23. ఇంట నిత్యోపవాసము లోనరింపలేక యాయాసపడి విరాగియైన జనుడు ప్రతిష్ఠలమునను దొంగతనము జేయుటజూచి చావఁజితుకఁ గొట్టుదురు 24. సంసారమును మిథ్యగా నెఱింగి జ్ఞానప్రాప్తి నొంది వెడలిపోవు యోగ్యుఁడు తనకు సమానులగు జనులనందఱను బావనమొనర్చును 25. ఒకనిసాంగత్యమువలన జనులు తరింతురు. ఒకనిసాంగత్యమువలన మునిఁగిపోవుదురు. కావున (సాంగత్యమునకు) ముందుగనెదుటివానిని బాగుగాఁ బరీక్షింపవలెను 26. వివేకహీనుఁడు ఇతరులకేమి యుపదేశింపగలడు? ఇట్టి యవివేకికి అడిగినచో భిక్షసైతము దొరకదు 27. ఇతరుల హృదయములలోని భావము నెఱింగి దేశకాలోచితముగఁ బ్రసంగింప నేర్చినవాని కీప్రపంచమునం దేవిషయమునను గొఱంతయుండదు 28.

నీచప్రాణి గురుత్వము నొందిన తావున ఆచారమే మునిగిపోవును. ఈదశలో వేదశాస్త్రములను బ్రాహ్మణులను నెవ్వఁడడుగును? 29. బ్రహ్మజ్ఞానమును విచారించు నధికారము బ్రాహ్మణునకే కలదు. 'వర్ణానాం బ్రాహ్మణో గురుః' (అన్నివర్ణములకు బ్రాహ్మణుఁడే గురువు) అని శాస్త్రములందుఁగలదు 30. కాని బ్రాహ్మణులు బుద్ధిచ్యుతులైరి. వారియాచారములు భ్రష్టములైనవి. వారలు గురుత్వమునువదలి శిష్యులకుఁ గూడ శిష్యులైరి 31. ఎందఱో బ్రాహ్మణులు, దావలమల్లకునకు (ఒకమహమ్మదీయతీర్థమునకుఁ) బోవుచున్నారు. ఎందఱో పీర్లను భజించుచున్నారు. ఎందఱో బుద్ధిపూర్వకముగాఁ దురుష్కు లగుచున్నారు 32. ఇదియే కలియుగాచారస్థితి. విచారపు జాడపోకడ లెచ్చటను గనిపించుట లేదు. ఇఁక దీనికిముందు సాంకర్యమే జరుగుచున్నది 33. నీచజాతికి గురుత్వము ప్రాప్తించినది. కొంచెము స్వల్పసాధువృత్తి (మహంతుతనము) పెంపొందఁజేసి శూద్రులు బ్రాహ్మణాచారములను ముంచివేయుచున్నారు. 34. బ్రాహ్మణుల కిది తెలియదు. వారివృత్తియే మాఱుకున్నది. వారలకు మూర్ఖత్వజన్యమగు మిథ్యాభిమానము నశింపకున్నది 35. మన రాజ్యము మ్లేచ్ఛుల యింటిలోనికి వెళ్ళిపోయినది. గురుత్వము అపాత్రులపాలైనది. మనము మనలో లేము, పరులలోనున్నాము. ఏమియు లేకుండఁబోయినది 36. బ్రాహ్మణులను గ్రామణ్యము (గ్రామాధికారము) ముంచివైచినది. భృగుమహర్షి పాదఘాతమును ఆదరపూర్వకముగ ధరించిన విష్ణుమూర్తియే పరశురామావతారమున బ్రాహ్మణజాతికి శాప మొసంగెను 37. మేమును ఆ బ్రాహ్మణులమే. మా పూర్వులు వహించు గ్రామణ్యమునుదానిని దగిలించిపోయిరని దుఃఖముతోఁ జెప్పవలసివచ్చినది. 38. ఇప్పటి బ్రాహ్మణు లేమి యొనరించిరి? అన్నముఁగూడ లభింపనివారైరి. ఈ విషయము మీరలందఱు నెఱుంగుదురు 39. మంచిది. పూర్వుల నేమందము? బ్రాహ్మణుల భాగ్యమే యిట్లున్నదని యెఱుంగవలయును. ప్రసంగము తటస్థించినందున సాధారణరీతిగ నింతదనుకఁ జెప్పివైచితిని. శ్రోతలు క్షమింపవలయును 40.

## ఎనిమిదవ సమాసము — అఖండధ్యానము.

మంచిది. అయినదేమో అయిపోయినది. ఇఁక నిప్పుడు బ్రాహ్మణులను మేల్కొలుపవలయును 1. నిర్మలహస్తములతోఁ బరమాత్మునిఁ బూజింపవలెను. అట్లు పూజించినచో వైభవములన్నియును లభింపఁ గలవు. మూర్ఖులు, భక్తిరహితులు, వ్యస్తులు నగు మనుజులు దారిద్ర్య మనుభవింతురు 2. మొదట నీశ్వరుని గుర్తింపవలెను. పిదప ననన్యభావముతో నాతని భజింపవలెను. ఆ సర్వోత్తముని అఖండరూపము నందు ధ్యానముంచవలెను 3. అందఱియందుత్తముఁడగువాఁడు సర్వోత్తముఁడు. ఆత్మానాత్మవివేక మొనరించి యా సర్వేశ్వరుని మర్మము నెఱుంగవలెను 4. ఎఱుకవలన నాత్మ దేహమును రక్షించును. ఆత్మ ద్రష్టయు, నంతస్సాక్షియునై యున్నది. అది యెఱుకవలనఁ బదార్థమును బరీక్షించును 5. ఆత్మ అన్ని దేహములందును వర్తించును. ఇంద్రియగణమున కాత్మయే చేష్టలొసంగును. అనుభవమువలనఁ బ్రాణిమాత్రుల ప్రత్యయములోనికి వచ్చును 6. ప్రాణిమాత్రుల యంతఃకరణములయందుఁ బరమాత్ముఁ డున్నాఁడు. కావున నెల్లరియంతఃకరణములను సంతుష్టిగా నుంచవలెను. ఆ పరమాత్ముఁ డొకఁడే దాతయు, భోక్తయు, నన్నియునై యున్నాఁడు 7. సంపూర్ణముగనున్న జగత్తుయొక్క అంతఃకరణము నందుఁ బరమాత్ముఁడు వర్తించుచున్నాఁడు. ఆతఁడు మన యంతఃకరణమునందు త్రిలోకములలోని ప్రాణులయంతఃకరణమునందు నున్నాఁడు. చక్కఁగ యోచించి చూడుఁడు 8. వాస్తవమునకుఁ జూచెడి వాఁ డాతఁ డొక్కఁడే. కాని యాతఁ డన్ని తావులయందును వ్యాపించియున్నాఁడు. దేహప్రకృతిననుసరించి యాతఁడు భిన్నభిన్నముగ నున్నాఁడు 9. పరమాత్ముఁడు దేహమును ఉపాధికారణమున భిన్నముగ భాసించుచున్నాఁడు. సంపూర్ణజగత్తుయొక్క అంతఃకరణమునం దాతఁడొక్కఁడే వ్యాప్తుఁడై యున్నాఁడు. భాషించుట, నడచుట మున్నగునవియెల్ల నాతనివలననే జరుగుచున్నవి. ఇందు సందేహములేదు 10. నావారు, పెరవారు అని మనమనుకొనుసమస్తజనులు, పక్షులు, శ్వాపదములు, పశువులు మున్నగునవియు, కీటకములు చీమలు మొదలగు దేహధారులగు సమస్తప్రాణులు

ఖేచరభూచరవనచరములు, నానావిధజలచరములు, చతుర్విధసృష్టికి సంబంధించిన జీవవ్రాతము మొదలగుజంతువుల నెంతవనుక బేర్కొనఁగలను? సమస్తప్రాణులును చేతనశక్తివలననే వర్తించుచున్నవి. దీనినిఁ బ్రత్యక్ష ప్రతీతిగఁ జూచుకొనుము. ఆ చేతనశక్తికిని మనకును సాంగత్యము అఖండ రీతిగ నేర్పడియున్నది 11, 12, 13. జగత్తుయొక్క అంతఃకరణము నందు వ్యాప్తుఁడై యున్న పరమాత్ముఁడు ప్రసన్నుఁడైన పిదప (మనుజులందఱును బ్రసన్నులైనపిదప) అనంతమగు మనుష్యసమూహ మంతయు మనవద్దనే ప్రోవగును. జగద్రూపుఁడగు పరమాత్ముని బ్రసన్నునిఁ గావింపదగిన యుపాయము మనవద్దనే యున్నది 14. ప్రజలనందఱిని సుఖులనుగ నుంచవలెను. ఏలయన ? దేహమునకుఁ గావించుమేలు ఆత్మకుగూడఁ జేకూరును 15. దుర్జనులగు ప్రాణులయందుండెడి ఈశ్వరాంశముయొక్క స్వభావముగూడ నిట్టిదె. కావున దుర్జనుఁడొకవేళఁ గ్రోధవశుఁడగుచో వానితోఁ గలహింపఁదగదు 16. తొలుత వానిని విడిచిపెట్టవలెను. తరువాత వానినిగూర్చి యోచింపవలెను. వివేకముతో నెల్లరను సజ్జనులఁ జేయవలెను 17. ఔషధభేదమువలన జలమునందు నానావిధములగు రుచులు గలుగును. అటులే దేహసంబంధమువలన ఆత్మత్వమునందు సైతము భేదములు కలుగును 18. విషమైనగానిమ్ము అమృతమైనగానిమ్ము, అందలి జలతత్త్వముపోదు. ఇట్లే సాక్షిత్వముతో ఆత్మను గుర్తెఱుంగవలయును 19. అంతర్నిష్ఠగల పురుషుఁడు అంతర్నిష్ఠా కారణమున అందరికంటె నుత్తముఁడు. ఆతఁడు జగదంతర్యామియగు జగదీశ్వరుని గుర్తెఱుంగఁగలఁడు 20. కంటితోఁ గంటిని గాంచునట్లును, మనస్సుతో మనస్సును వెదకునట్లును (ఘటసహాయమున) భగవంతుని ఘటఘటమున వ్యాపకునిగా నెఱుంగవలెను * 21. ఆతఁడు లేకున్నచోఁ గార్యమాగిపోవును. అంతయు నాతనివలననే జరుగుచున్నది. అతని సంయోగమువలననే ప్రాణికి వివేకము ప్రాప్తించును 22. జాగరూకత వలన జరుగు వ్యాపారసంబంధమంతయు నీశ్వరసంబంధముననే జరుగు

* సమస్త ప్రాణులందెట్లున్నాఁడో యట్లే మనలోఁగూడఁ బరమాత్ముఁడు. దీనితో నితరుల యంతఃకరణము నెఱుంగుట సర్వఘట వ్యాపకుఁడగు భగవంతుని భగవంతునిమూలమునఁ జూచుటయేయని యెఱుంగవలయును.

చున్నది. అట్లే స్వప్నమునందు జరిగెడిదంతయు నాతని సంబంధముననే జరుగుచున్నది 23. ఈ విషయమును బాగుగా విచారించినచో అఖండ ధ్యానలక్షణము విశదమగును. పరాత్పరుని యఖండస్మరణము సులభముగ నెరవేరును 24. జనులలోఁ దఱచుగ నొకలోపము కనఁబడుచున్నది. అది యేదన? సులభమును విడచి కఠినమును బట్టుకొనుటయే. జనులు ఆత్మను విడిచి అనాత్మను ధ్యానింతురు 25. కాని యనాత్మ ధ్యానము కడముట్టదు. అనాత్మధ్యానమారంభించినచో నానావ్యక్తులు ధ్యానములోనికివచ్చును. వ్యర్థముగా శ్రమ గలుగును 26. ప్రయత్న పూర్వకముగ మూర్తిని ధ్యానించినచో నచట ఒకటికి మఱియొకటి గానిపించును. (భాసింపగూడనిది భాసించును) ఇట్లే కొంత విలక్షణముగ భాసించును. 27. దేవునిగూర్చియా ధ్యానముచేయవలసినది? లేక దేవాలయమునుగూర్చియా? అను నీ యంశమును మునుముందు జక్కఁగా విచారింపవలెను 28. దేహము దేవాలయము. అందలి యాత్మ దేవుఁడు; ఈ రెంటిలో నీవు దేనియందు భక్తియుంచెదవు? దేవునిగుర్తించి యాతని యందు హృదయమును లగ్నపరుపవలెను 29. సత్యమగు ధ్యానమిది. జనరూఢిజ్ఞానము అన్యము. అనుభవము లేనిదంతయు వ్యర్థము. ఇది సత్యము 30. సందేహమువలన సందేహమే వృద్ధినొందును. ఈ సందేహ దశలోఁ గావించెడి ధ్యానము తత్క్షణమే భంగమగును. పాపమును వ్యర్థముగాఁ బ్రజలు స్థూలధ్యాన మొనరించుచుఁ గష్టములను సహించుచున్నారు 31. పరమాత్ముని దేహధారిగ విశ్వసించుటచే వీరల హృదయమునందు నానావికల్పము లుప్పతిల్లును. మానవునకు భోగత్యాగాది విపత్తులు దేహయోగము వలననే కలుగుచున్నవి 32. (అనాత్మధ్యానము వలన) నానాప్రకారములగు విషయములు మనస్సులోనికి వచ్చును. వానిని విచారించుట మిగుల గఠినము. స్వప్నమునందేని గాన్పింపని దృశ్యములు అనాత్మధ్యానమున గనుపించును 33. కనిపించువానినెల్ల వివరించుట యసాధ్యము. బలాత్కారముగ దానియందు విశ్వాసముంచుట గూడ యసాధ్యమె. ఈకారణమున సాధకుని యంతఃకరణమునందు 34 ధ్యానము సాంగోపాంగముగా నమరినదనుటకు సాక్షి తన మనస్సె. మనస్సునందు వికల్పదర్శనము గావింపఁదగదు 35. చంచలముగనుండు

మనస్సును స్థిరపరచి యఖండధ్యాన మొనరించుటవలనఁ గలుగు ఫల మేదియో జనులు చూడకున్నారు 36. అఖండధ్యానమునందొకవేళ నెవని కేని హితముగలుగనిచో నట్టివానినిఁ బతితునిగ భావింపవలెను. ఈవిషయ మును సుచిత్తుఁడై చక్కఁగ విచారింపవలెను 37. ధ్యాన మొనరించు వాఁడెవ్వఁడో? ధ్యానములోనికి వచ్చువాఁడెవ్వఁడో యీ యిరువురియందును అనన్యలక్షణము లుండవలెను 38. వాస్తవమున కనన్యత స్వాభావికమే. సాధకుఁడు శోధించిచూడమిదే అభ్యంతరము. జ్ఞానియగు పురు షుఁడు మననము గావించు సమాధానమునందు మగ్నుఁడగును 39. ఇవి యనుభవకార్యములు. అనుభవము లేకున్నచో భ్రమతో బాధలొంద వలసివచ్చును. సాధారణజనులు జనరూఢి ననుసరించి వర్తింతురు 40. అవలక్షణులు, అభాగ్యులునగు మనుజులు జనరూఢినసుసరించి ధ్యానలక్ష ణములనే పట్టుకొనియుందురు. సాధారణజనులు సత్యాసత్యము లెఱుం గరు 41. వారు డాంబికములాడుచు ఆర్భాటములను జేయుదురు. కాని మనస్సులో యోచించిన పిమ్మట అంతయు మిథ్యగ గోచరించును 42. ఒకానొకమనుష్యుఁడు (స్థూలమూర్తిని ధ్యానములోనికిఁ దెచ్చుకొని) మానసపూజ గావించుచుండెను. (కిరీటమున్నందునఁ బూలదండ విగ్రహ కంఠమునఁ బడకుండెను.) రెండవ మనుష్యుఁడు (అంతస్సాక్షిత్వశక్తివలన నీ విషయమునెఱింగి)వానితోఁ గిరీటము దించి పూలదండ వేసినచోఁ జక్కఁగ విగ్రహకంఠమున నిముడునని యనెను 43. ఓ సోదరా! మనస్సునకేమి పోవుకాలము వచ్చినదని, పుష్పమాల కల్పించితివి? (దేశీయ దశయందు బూలదండఁ గల్పించువాఁడును గిరీటమును దించి మాలికను వేయుమని యుక్తిని దెలిపినవాఁడును) ఈ యిరువురును బరమమూర్ఖులని యెఱుంగ వలెను 44. ప్రత్యక్షముగ నేమియుఁ గష్టపడవలసిన యగత్యము లేదు. దారముతోఁ పూవులను గ్రుచ్చవలసిన పనిలేదు. ఈ స్థితిలోఁ గల్పితపుష్ప మాలల నేల యింకను జేయుచున్నారు 45. బుద్ధిహీనులగు ప్రాణులంద ఱును మూర్ఖులు. వారితో (రాద్ధాంత సిద్ధాంతముల) గోల కెవరు సిద్ధ ముగనున్నారు? 46. ఎవరెట్లు పరమార్థముగావింతురో వారి కట్టిరీతియే పృథ్విపై గలుగును. మఱియు సప్తకముపైనను పంచకముపైనను వారి

కభిమానము వృద్ధినొందును * 47. ప్రత్యయములేకుండ నభిమానపడుట మోసగించి రోగిని జంపుటవంటిది. ప్రత్యయము లేకున్నపు డంతయు ననుమానమే ! జ్ఞానమునకుఁ దావెక్కడిది? 48. కావున సంపూర్ణాభిమానమును విడిచివేయవలెను. ప్రతీతిపూర్వకమగు వివేకము నార్జింపవలెను. అంతియగాక మాయారూపమగు పూర్వపక్షమును వివేకముచే ఖండనము గావింపవయును 49.

## తొమ్మిదవ సమాసము – శాశ్వతనిరూపణము.

ఇంతకుమున్ను పిండమును గూర్చియు ఆత్మానాత్మ వివేకమును గూర్చియుఁ జర్చించితిని. దీనివలనఁ బిండ మనాత్మయనియు అన్నిఁటికిఁ గర్తయగు నాత్మ పిండముకంటె భిన్నమనియు విదితమైనది 1. ఇంతియగాక యనాత్మపట్ల యనన్యత గలిగియుండవలయునను సంగతిగూడ విశదమైనది. ఇక బ్రహ్మాండ రచనమునుగూర్చి విచారింపవలెను 2. ఆత్మానాత్మవివేకము పిండమునందున్నది. సారాసార వివేకము బ్రహ్మాండమునందున్నది. రెంటివివరణమును బాగుగా నొనర్చి యందలిరుచి గ్రహింపవలెను 3. పిండకార్యమునకు బ్రహ్మాండము(పంచభూతములు) కారణము. దీని వివరణము గావించు విధము ముందుఁ దెలుపుదును 4. నాశవంతమగు దాని నసారమనియు శాశ్వతమగుదానిని సారమనియుఁ జెప్పుదురు. కల్పాంతమునందు నాశమొందునది సారముగాదు 5. పృథివి జలమువలన నేర్పడెను. అంత్యమున నది జలమునందే లయమగును. జలము తేజమువలన నుత్పత్తియయ్యెను 6. ఆ జలమును తేజ మెండించును. మహాత్తేజమువలన జలము లయమగును. జలము లయమైన పిదప తేజము మిగులును 7. వాయువువలనఁ దేజము కలుగును. కావున వాయువే తేజమును లయమొందించును. తేజ మీవిధముగా లయమై పోయిన పిదప వాయువే మిగులును 8. వాయువు ఆకాశమునుండి జనించును. కాన అంత్యమునందు ఆకాశమునందే వాయువు లయమగును. ఈ కల్పాం

* ఈ సప్తకము సప్తవ్యసనములనియు, ఈ పంచకము పంచేంద్రియాసక్తులనియుఁ దోఁచుచున్నది.

తవర్ణనము వేదాంతశాస్త్రము నందున్నది 9. గుణమాయయు, మూలమాయయు సైత మంత్యమునఁ బరబ్రహ్మమునందు లయమగును, ఇక నా పరబ్రహ్మమును విచారించుటకు వివేకము గావలసియున్నది 10. అన్ని యుపాధులకు నంత్యముగనున్నదియు, దృశ్యమున కతీతముగనున్నదియు నగు నిర్గుణపరబ్రహ్మము అన్నింటియందును వ్యాప్తమైయున్నది 11. ఎన్ని కల్పాంతములకైనఁ బరబ్రహ్మమునకు నాశములేదు. మాయను ద్యాగమొనరించి శాశ్వతమును గుర్తెఱుంగవలెను 12. ఈశ్వరరూపమగు అంతరాత్మ సగుణము. ఈ సగుణమునుండియే నిర్గుణము లభించును. నిర్గుణజ్ఞానమువలన అనుభవాత్మకమగు జ్ఞానము కలుగును 43. కల్పనాతీతమై నిర్మలముగనున్న వస్తువునకు మాయామల మెప్పుడును సోకఁజాలదు. మిథ్యాత్వమునుండి (మాయనుండి) ఈ సమస్త దృశ్యము కలుగుట నశించుట జరుగుచున్నది 14. ఎయ్యది యుత్పత్తియగునో యది మఱియొక క్షణమున నశించుచున్నది. ఇది ప్రత్యక్షముగ గనుపించుచున్న సంగతి. ఉత్పత్తినాశనములు లేని పరబ్రహ్మమును వివేకబలముతో గుర్తెఱుంగవలెను 15. జ్ఞానము, అజ్ఞానము, విపరీతజ్ఞానము అను నీమూఁడును (ఈ త్రిపుటి) లయమగుటయే విజ్ఞానము (అద్వైతానుభవ జ్ఞానము) 16. వేదాంత సిద్ధాంత రాద్ధాంత (స్వానుభవము) ములయొక్క ప్రతీతిని గడింపవలెను. ఆనిర్వికార పరబ్రహ్మము నిరంతరము అన్నింటియందును ప్రకాశించుచున్నది 17. ఆ సదోదిత నిర్వికార పరబ్రహ్మమును జ్ఞానదృష్టితోఁ గాంచవలెను. చూచి దానియందే లీనుఁడై యుండవలెను. దీనినే ముఖ్యమగు ఆత్మనివేదన మందురు 18. దృష్టికి దృశ్యము గాన్పించుచున్నది. మనస్సునకు భాస భాసించుచున్నది. కాని అవినాశియగు పరబ్రహ్మము దృశ్యభాసలు రెంటికవ్వలనున్నది * 19. విచారము గావించినచోఁ

* దృష్టితో (చర్మ చక్షువులతో) పరబ్రహ్మము గనుపింపదు. ఏలయన? నది దృశ్యముకంటె నావలనున్నది. ఇట్లే భాసతో (మనస్సుతో) ఆ పరబ్రహ్మము భాసింపదు. ఏలయన, నది భాసకంటె నావలనున్నది. కాన దృశ్యాత్మకమగు చక్షువులుగాని, భాసాత్మకమగు మనస్సుగాని యెచటలేవో, ఎప్పుడు దృశ్యము అదృశ్యము అవునో, ఎప్పుడు మనస్సు ఉన్మనమగునో అప్పుడే ఆ యనిర్వాచ్యదశయందే పరబ్రహ్మము గోచరించునని భావము.

బరబ్రహ్మ మెంతయో దూరమున నున్నట్లు గోచరించును. యథార్థమున కదిలోపలను, వెలుపలను, అంతటను వ్యాప్తమైయున్నది. దాని కంత్యమే లేదు. అది యనంతము. ఆ పరబ్రహ్మమున కుపమానమే లేదు 20. చంచలము స్థిరముగాదు. నిశ్చల మెప్పుడును చలముగాదు. మేఘములు వచ్చుచుఁబోవుచున్నను ఆకాశ మచలముగానున్నది 21. వికారమువలన బెరుగుచు క్షీణించుచు నుండుదానికి శాశ్వతత్వ మెట్లుకలుగును? సమస్తమును గల్పాంతమునందు లయమగును 22. అంతఃకరణమునందు భ్రాంతి నొందుచు మాయాసంభ్రమమున భ్రమనొందుచు నుండువాని కీయపార ప్రపంచచక్ర మెటులబోధ గాఁగలదు? 23. సంకోచమువలన వ్యవహారము కొనసాగదు. సంకోచమువలన సిద్ధాంతము విదితముగాదు. సంకోచము వలన అంతఃకరణమునందుఁ బరమాత్ముఁడు గోచరింపడు. వైద్యునియెడ నొకవేళ నమ్మకము కుదురకున్నను సంకోచమును విడువకున్నను రోగి బ్రతుకఁజాలఁడు 25. రాజును గుర్తెఱింగినవాఁడు సాధారణ రాజకీయోద్యోగిని గణింపఁడు. పరమాత్ముని గురుతెఱింగినవానిని బరమాత్మస్వరూపునిగఁ దలంపుఁడు (ఏలయన?పరమాత్మస్వరూపుఁడు గానిది మానవుండు పరమాత్ముని గుర్తింపఁజాలఁడు) 29. మాయనుగూర్చి భయపడు నీచ మానవుఁ డెవరి కేమిచెప్పఁగలఁడు? విచారించిచూచినచో నిదియంతయు స్పష్టముగా నున్నది 27. మాయకీవల సంకోచము ఆవల పరబ్రహ్మము నున్నది. మాయ సంకోచ పరబ్రహ్మములకు మధ్య సదోదితముగా నున్నది 28. మిథ్యను సంకోచించుటయు భ్రమవలన నొకదానికి మఱియొకటి చేయుటయు వివేకలక్షణముగాదు 29. అసత్యమునంతయు విడువవలెను. సత్యమును విశ్వాసపూర్వకముగా గుర్తింపవలెను. మాయను బరిత్యజించి పరబ్రహ్మమును గుర్తింపవలెను 30. మాయాస్వరూపము నింతకుమున్నె వివరించితిని. సుచిత్తతతో మాయను విచారింపవలెను 31.

---

## పదియవ సమాసము — మాయ మిథ్యయైయున్నది.

మాయ కాన్పించుచున్నది. కాని నాశమగుచున్నది. వస్తువు కాన్పించుటగాని నాశమగుటగాని లేదు. మాయ సత్యముగఁ దోఁచును. కాని యది పూర్తిగ మిథ్య 1. దరిద్రుఁడు చిక్కులపాలై నానావిధ

యత్నము లొనరించినను అతఁడు కోరినదొక్కటియు నెరవేరదు. అట్లే మాయయునై యున్నది 2. ద్రవ్యముయొక్కయు, దారలయొక్కయు స్వప్నవిభవములు నానావిధములగు విలాసయుక్తహావభావములు, క్షణములో గోచరించి యంతర్హిత నడంగును. వాస్తవమున కవి మిథ్యలు. మాయయు నట్లే మిథ్య 3. ఆకాశమునందు నానావిధములగు గంధర్వనగరములు (మేఘములు మొదలగువాని మిథ్యాదృశ్యములు) కనిపించునట్లు మాయ నానారూపములతో, నానావికారములతో గోచరించుచున్నది 4. బహురూపి (పగటివేషధారి) వైభవమెంత సత్యముగా గోచరించినను కడకది మిథ్యయే. అట్లే మాయయు మిథ్యయైయున్నది 5. దసరాదినమున జమ్మియాకులను ధరించుటను జనులు బంగారమనియందురు. కాని యవి జమ్మియాకులే. ఈ ఆచార మన్నితావులందును గలదు. మాయయు నిట్టిదే 6. మృతపురుషునకు మహోత్సవముల నొనర్చుటయు, సతి సహగమనము గావించిన (స్త్రీ) కీర్తిని పెంపొందించుటయు, శ్మశానమునకరిగి యేడ్చుటయు మిథ్య. అట్లే మాయయు మిథ్య 7. విభూతిని (భూతి=సంపద) లక్ష్మియందురు. మఱియొక లక్ష్మి గలదు. (స్త్రీలు గర్భలక్షణము నకై మంత్రితమగు దారమును నడుమునకు గట్టుకొందురు. ఆ దారము పేరు లక్ష్మి) మూఁడవది నామమాత్రపు లక్ష్మి. ఇదియెట్టిదో మాయయు నట్టిదే 8. బాలవిధవయొక్క నామము జన్మ సావిత్రియని యుంటయు ఇంటింటఁ దిరిపెమెత్తుకొని బ్రతుకువానికిఁ గుబేరుఁడను నామముంటయు నెట్టిదో మాయయు నట్టిదె 9. నాటకమునందు ద్రౌపదిపాత్రమును ధరించినవానికి జీర్ణవస్త్రములపై నాశగలుగుటయు, ఏదేన్ని నది నామము పయోష్ణియని యుంటయు నెట్టిదో మాయయు నట్టిదె 10. రామవేషధారి (కల్పితరాముఁడు) గ్రామవాసులకుఁ దనవేషముఁ జూపించుచుఁ బ్రేక్షకులను మహారాజా ! అయ్యా! యని సంబోధించుచుఁ దనలఘుత్వమును బ్రకటించుట యెట్టిదియో మాయయు నట్టిదె 11. పేరుమాత్ర మన్నపూర్ణాదేవి. కాని యింటియందన్నము దొరుకదు. పేరు సరస్వతి. కాని విద్యయన్న నేదియో యెఱుంగక యెల్లప్పుడు పేడ్రబ్రోగుచేయుచుండును 12. కుక్కకు వ్యాఘ్రమని పేరిడిరి. పుత్రున కింద్రుఁడని పేరుపెట్టిరి. కురూపుని సుందరా యని పిలుచుచుండిరి 13. మూర్ఖునకు సకలకళావిశా

రదుండని పేరిడిరి. గాడిదకుఁ గోకిలయని పేరిడిరి. లొట్టకన్నులు గలవానికి నయనసుందరుఁడని పేరిడిరి 14. పరమలోభిణికిఁ దులసీదేవి (విష్ణుప్రియ) యని పేరిడిరి. చండాలినికిఁ గాశియని పేరిడిరి. ఆదిశూద్రిణికి భాగీరథి యని పేరుబెట్టిరి 15. ఇదియంతయు నెట్టిదియో మాయయు నట్టిది. అంధకారచ్ఛాయ యెట్టిదియో మాయయు నట్టిది 16. చెవి, వ్రేళ్ళు, సంధులు, కరతలము మున్నగు శరీరములోని యేభాగములైనను రవికిరణములు సోకినంతన రమ్యమగు నరుణ వర్ణముతో మెఱయుచు నగ్నిహోత్రమువలెఁ గాన్పించుట యెట్టిదో మాయయు నట్టిది 17. కాషాయ వర్ణముతోనున్న వస్త్రమును జూచినచో అగ్ని యంటియున్నటులఁ గాన్పించును. విచారించి చూచినచో నిశ్చయమెద్దియో విశదమగును. మాయయు నట్టిదె 18. నీటియందుఁ జేతులు, కాళ్లు, వ్రేళ్లు, మిగులఁ జిన్నవిగను బెద్దవిగను వంకరగను గానుపించును. మాయయును నిట్టిదే 19. గుండ్రముగా కవాయి తిరుగునప్పుడు పృథ్వి యంతయుఁ జీఁకటిగా నున్నట్లును, తిరుగుచున్నట్లును దోఁచును. కామెరలగుటవలన సమస్త వస్తువులును బచ్చగాఁ గనుపించును. సన్నిపాతరోగికి సర్వ వస్తువులును క్రిందు మీఁదగుచున్నటుల గోచరించును. మాయగూడ నిట్టిదియే 20. వికార కారణమునఁ గొన్ని కొన్ని పదార్థములు సాధారణముగ భాస మాత్రములై కాన్పించును. ఒకటి మఱియొకటిగ గోచరించును. మాయ గూడ నిట్టిదే సుమా 21.

పదునాలుగవ దశకము సమాప్తము





# పదునేనవ దశకము.

## మొదటి సమాసము – చతురుని ప్రవర్తనము.

అస్థిమాంసమయమగు నీ శరీరమునందు జీవాత్మ వసించుచున్నది. మఱియు నది నానావిధవికారము లొందుచున్నది 1. పొల్లేదియో, పొట్టెయ్యేదియో, ఏది వలయునో ఏది వలదో జీవుఁడు విచారించి తెలిసికొనుచున్నాఁడు 2. ఒకనికి యాచించినచో నిత్తురు. ఒకఁడడుగనిదే యొసంగుదురు. ప్రతీతివలన సులక్షణములను గుర్తెఱుంగవలెను 3. తన జీవుని నన్యజీవుల జీవులయందుఁ జేర్పవలెను. ఆత్మను అనాత్మయందుఁ గలుపవలెను. ఇతరుల యంతఃకరణములలోఁ బ్రవేశించి వారల యంతర్భావముల నెఱుంగవలెను 4. జన్నిదము వదులుగనున్నచో జారిపోవును. బిగువుగనున్నచోఁ జక్కఁగ నిమిడియుండును. అట్లే మనస్సు గూడ వదులుగనున్నచో జారిపోవును. వివేకమున్నచో యథావిధిగ నుండును. ఇట్టి మనస్సును ఇతరుల మనస్సులలోఁ గలుపవలెను 5, 6. సందేహము వలన సందేహమే వృద్ధియగును. సంకోచమువలనఁ గార్యనాశనమగును. కావున మొట్టమొదటనే మెఱుకగలిగి యుండవలెను 7. ఇతరుల యంతఃకరణములను గ్రహింపనేరక యితరుల హృదయములలోని భావములను దెలిసికొనఁజాలక నానావిధములుగనున్న జనులు వశులుకావలయునన్న నెటులగుదురు? 8. బుద్ధిసహాయముగ లేనిజనులు తాత్కాలికముగ నితరులను వశీకరణము గావించికొందురు. వారలవలనఁ బ్రయోజనము లేదని తెలిసికొన్నంతన జనులు వారల నుపేక్షింతురు 9. సంపూర్ణవిశ్వమునందు జగదీశ్వరుఁడు వ్యాప్తుఁడై యున్నాఁడు. ఇఁక బుద్ధిహీనులవలన యుపయోగ మెవరికిఁగలదు? వివేకముతో విచారించువాఁడే శ్రేష్ఠుఁడు 10. శ్రేష్ఠుఁడగుపురుషుఁ డెప్పుడును శ్రేష్ఠమగుకార్యము జేయును. కృత్రిమకార్యము లొనరించువాఁడు నీచుఁడు. మనుజులు కర్మానుసారముగ మంచివారలు, చెడ్డవారలు నగుచున్నారు 11. రాజులు రాజమార్గము

నను, చోరులు చోరమార్గమునను నడుతురు. మూర్ఖతవలనను, అల్ప స్వార్థమువలనను బిచ్చివాండ్రు మోసగింపఁబడుదురు 12. నేను గొప్ప జాణతనము గలవాఁడనని మూర్ఖుఁ డనుకొనును. అట్లనుకొనువాఁడు వాస్తవమునకుఁ బిచ్చివాఁడును దీనుఁడునని గ్రహింపనగును. నానావిధము లగు చాతుర్య చిహ్నములను జతురుఁడె యెఱుంగును 13. జగత్తు యొక్క అంతఃకరణమునందుఁ గలసిపోవు పురుషుఁడు జగదంతఃకరణుఁడే యగును. వానికీలోకమునందుఁగాని పరలోకమునందుఁగాని యేవిషయము నందేని కొఱంతయుండదు 14. బుద్ధి భగవంతుఁ డనుగ్రహించినది. బుద్ధి లేని మనుజుఁడు పచ్చికాయవంటివాఁడు. బుద్ధివిహీనుఁడగు పురుషుఁడు అమూల్యమగు రాజ్యమునువిడిచి బిచ్చమెత్తుకొనును 15. ఎవ్వఁ డెక్కడ నుత్పన్నమయ్యెనో వానికాతావు రుచించును. అభిమానకారణమున జనులు ప్రతిష్ఠలమునందును మోసగింపఁబడుదురు 16. జగత్తులోని మానవు లందఱు మేము పెద్దలము మేము పెద్దల మందురు. అందఱును మేముసుంద రాకారులమందురు. అందఱును మేము చతురులమని చెప్పుకొందురు 17. ఈ దృష్టితోఁ జూచినచోఁ గొద్దివాఁడే లేఁడు. జ్ఞాత సర్వమెఱుంగును 18. తమతమ యభిమానములతో జను లనుమానించి వర్తించుచున్నారు. ఈ యంశమును వివేకముతో విచారింపవలెను 19. మిథ్య నభిమానించు టయు సత్యమునుబూర్తిగా విడిచివేయుటయు మూర్ఖత్వలక్షణములు 20. సత్యమునం దభిమానముకలవాఁడే నిరభిమాని. న్యాయాన్యాయము లెప్పుడును సమముగావు 21. శాశ్వతమును న్యాయమనియు, అశాశ్వత మును అన్యాయమనియు నందురు. మూర్ఖులు సజ్జనులు నెట్లు సమాన మగుదురు 22. ప్రజలలోఁ గొందఱు నిశ్చింతులై సుఖభోగు లగుచు న్నారు. కొందఱు చోరులై పాఱిపోవుచున్నారు. కొందఱియందు సాధు త్వము ప్రశంసనీయముగా నుండును. కొందఱివర్తనము నిందనీయముగా నుండును 23. ఆచారవిచార శూన్యముగా నొనర్చుపనియంతయు నిష్ఫ లము. చతురులు విచక్షణులు నగు వారలె యీ విషయమును విచా రింప సమర్థులు 24. చతురపురుషుఁడు సర్వసాధారణులగు మానవులను దనస్వాధీనములో నుంచుకొనఁగల్గును. చతురులయెదుట సర్వసాధారణుల యత్న మేదియు నడువదు 25. కావున ముఖ్యులతో మైత్రిగావింప

వలెను. ఇట్లొనరించినచో నసంఖ్యాకులుగా జనులు వచ్చి కలసి కొనుచుందురు 26. చతురునకుఁ జతురుఁడే రుచించును. చతురుఁడు చతురుల తోడనే కలసికొనును. వెఱ్ఱివాండ్రెవరితోఁ బనిలేక తిరుగుచుందురు 27. ఎదుటివాఁడు చతురుఁడని గ్రహించినంతన చతురుని మానసము ఆ చతురుని మానసముతోఁ గలసిపోవును. కాని యీ వ్యాపారమంతయు గుప్త రూపముగా జరుపవలెను 28. సామర్థ్యశాలియగు పురుషుని హృదయమునకు సంతుష్టి యగునట్లు వర్తించినను లేక వాని యిష్టానుసారముగా సంచరించినను బెక్కుమందిజనులు తనతోఁ గలియుదురు. సర్వసాధారణులగు జనులు, సజ్జనులు మున్నగువారెల్ల వినతులొనర్తురు 29. పరిచయముతోఁ బరిచయమును వెల్లడింపవలెను. బుద్ధితో బుద్ధిని వికసింపఁ జేయవలెను. నీతిన్యాయములతోఁ బాషండమార్గముల నాటంకపఱుపవలెను 30. పైకి వెఱ్ఱివానివలె వేషముధరించి యుండవలెను. అంతియ గాదు. హృదయమునందు నానావిధకళ లుండవలెను. ఎవ్వరిహృదయము నేని త్రెంపివేయఁగూడదు 31. నిస్పృహుఁడై నిత్యమును నూతన స్థలములలో, దిరుగువాఁడును, ప్రత్యయాత్మకమగు బ్రహ్మజ్ఞానము గలవాఁడును, ప్రసిద్ధజ్ఞాతయునగు సజ్జనుఁడు లోకమునందు దుర్లభుఁడు 31. బహువిధములగు సుభాషితములవలన జనులందఱి హృదయములును బ్రసన్నము లగును. కాన నలుదిక్కులను భ్రమణమొనరించి ప్రజలందఱును దనవై పునకుఁ జేరు నట్లాకర్షింపవలెను 33. ఒక్కస్థలముననే కూర్చుండి యున్నచోఁ బనిజరుగదు. కావున సావధానముగా నందఱితోఁ గలియుచుండవలెను 34. లోకులతోఁ బలుమాఱు గలిసికొని వారలను సంతుష్టిపఱచుటయు, సంచరించుచుఁ గలియుటకు ఉత్సుకుఁడై యుంటయుఁ జాతుర్య లక్షణములు. ఉత్తమగుణములవలన మనుజులందఱును సమాధానము నొందుదురు 35.

---

## రెండవసమాసము — నిస్పృహుని పని.

ఈ పృథ్వీమండలమునందుఁ జిన్నవియుఁ బెద్దవియునగు మానవదేహము లెన్నియో నిండియున్నవి. అవి ప్రతిక్షణమునందును దమ మనోవికారమును మార్చుకొనుచుండును 1. ఎన్నిమూర్తులు గలవో అన్ని

స్వభావములు గలవు. అవి యెప్పుడును నొక్కవిధముగ నుండవు. నియమమే లేదు. ఎంతదనుక నింక నేమిచూతము? 2. ఎందఱో మ్లేచ్ఛులైరి. ఎందఱో పరంగులలోఁగలసిరి. మఱియు నెందఱో దేశభాషలకారణమున నభ్యంతరముగలిగి పడియున్నారు * 3. ఈ విధముగ మహారాష్ట్రులు మిగుల స్వల్పసంఖ్యాకులుగ నున్నారు. వీరలుగూడ రాజకీయ విషయములందుఁ దగుల్కొనియున్నారు. పాపము వారికిఁ దిండితినుటకైన నవకాశములేదు. అనేక కార్యభారములు వెన్నంటియున్నవి 4. ఎందఱో యుద్ధప్రసంగములలోఁ దగుల్కొని యుంటవలన నున్మత్తులై రాత్రింబవళ్లు యుద్ధచర్చలనే యొనరించుచున్నారు 5. ఉద్యమపురుషులు తమతమ వ్యాపారములయందే చిక్కుకొనియున్నారు; వారికిగూడ విశ్రాంతిలేదు. వారలు నిరంతరము తమ యుదరములను బోషించుకొనుట యున్నగు చిక్కులలోఁ దగుల్కొనియున్నారు 6. షడ్దర్శనములు నానామతములు చాలవఱకు వృద్ధినొందినవి. ఎక్కడజూచిన నక్కడ జను లీ విషయముననే యుపదేశించుచుఁ దిరుగుచున్నారు 7. ఇందుమీఁదఁగూడ మిగిలిన జనులనందఱిని స్మార్తులు, వైష్ణవులు తమతమ మతములలోఁ గలుపుకొనుచున్నారు. ఈవిధముగా దేశమునందుఁ బెద్దకోలాహలము వ్యాపించినది 8. ఎందఱో కామ్యభక్తు లన్నితావులందును నాసక్తులై తిరుగుచున్నారు. యుక్తాయుక్త విచారము గావించువాఁడే కనుపట్టఁడు 9. ఈ కోలాహలములో నింక నెవరేని రెండవ కోలాహలమును సాగించినచో దానినిజూచి వైదికజనులు సహింపఁజాలకున్నారు. అది వారలకన్నులలో ముల్లువలె గ్రుచ్చుకొనుచున్నది 10. హరికీర్తనము నందెందఱి హృదయములో లగ్నములై యున్నవి. ప్రత్యయాత్మికమగు బ్రహ్మజ్ఞానము నెవ్వఁడును జూడకున్నాఁడు 11.

జ్ఞానము మిగుల దుర్లభము. ఈ యలభ్యలాభము పుణ్యమువలన లభించును. కాని విచారశీలురగు పురుషులకంతయు సులభముగ నున్నది 12. తెలిసినవాఁడు విచారమును దెలుపఁబూనినచో నది నెరవేరదు. ఎన్నియో విఘ్నములు కలుగును. ఉపాయములొనర్చినను

---

* దేశమునంతటికిని ఒక్కభాష లేకపోవుటచేఁ బరస్పర మొకరిభావ మొకరు గ్రహింప జాలకున్నారని భావము.

అనేకవిఘ్నములు లుపస్థితమగును 13. తీక్ష్ణముగాఁ గార్యములనొనర్చు ప్రయత్నశీలుఁడొక క్షణమాత్రమేని వ్యర్థముగా గడుపఁజాలఁడు. చతురుఁడు, తార్కికుఁడు, విచక్షణుఁడునగు నిట్టి పురుషుఁడు సర్వజన మాన్యుఁడగును 14. వానికి నానావిధములగు నీతులు, లోకోక్తులు జిహ్వాగ్రము నందుండును. సమయోచితముగ వానిని లోకులముందు నుడువును. తన సామర్థ్యబలముచే నీతిమార్గమును స్వచ్ఛముగఁ బ్రశస్తముగ నొనర్చును 15. ప్రయత్నశీలుఁడు ప్రబోధశక్తికి వలయు ననంతమార్గముల నెఱింగియుండును. అందఱి యంతఃకరణములలోని విషయముల నెఱింగి యుండును. అందుచే నాతని నిరూపణముల నెల్లరు నాసక్తితో నాలింతురు 16. అనుభవయుక్తములగు మాటలవలన సమస్త మతాంతరములును బటాపంచలగును. ప్రయత్నశీలుఁడు లోకరీతిని లక్ష్యపెట్టక లోకుల హృదయములను దనవైపునకు నాకర్షించుకొనును 17. అతఁడు ప్రసంగానుసారముగ నీతిపూర్ణములు, ప్రభావయుతములునగుమాటల నుడువును. ఉదాసీన వృత్తియందలి అభిమానముతో లేచిపోవును 18. అనుభవవాక్యముల వివరించి మెచటికేని యరుగును. ఈ కారణమున నచటిజనుల కాతని గలసికొనవలయునను కోర్కి తీవ్రముగ నుదయించును. ప్రజలు నానామార్గములను వదలి యా మహాత్ముని శరణములోనికే యరుగుదురు 19. అతఁడెచ్చటను దొరుకడు. ఏ స్థలమునందైనఁ గని పింపఁడు. వేషముగాంచినచో హీనునివలె, దీనునివలె నుండును 20. భిక్షుకునివలె వేషభాషల దిద్దుకొని ప్రయత్నశీలుఁడు గుప్తరూపముతో నెన్నియో పనులఁ జేయును. అందుచే నా పురుషుని యశఃకీర్తి ప్రతాపములు మేరలేకుండ వృద్ధినొందును 21. అతఁడన్నితావులయందును భజనల వృద్ధినొందించును. తాను స్వయముగ నచ్చటనుండక వెడలిపోవును. మత్సరయుక్తములగు మతకల్లోలముల నడంచివేయును 22. దుర్గమస్థలముల (పర్వతకందరముల)కుఁ బోయి నివసించును. అచట నాతని నెవ్వరుఁ జూడరు. అతఁడచ్చటనేయుండి సర్వజనులనుగూర్చి చింతించును. (అచట నుండియే జనోద్ధరణమునకై వలయు ప్రయత్నములు గావించును) 23. జనులువచ్చుట కవకాశములేని కఠినములు, నగమ్యములునగు స్థలముల యందాతఁడు సావధానిగ నుండును. జగత్తులోని జనులందఱు నాత

డెందుండెనో యని వెదుకుకొనుచు వచ్చుచుందురు 24. ఆ త్యాగశీలుని ముందెవరిమాటయుఁ జెల్లదు. ఆతనిముందెవనికిని అణుమాత్రమేని యను మానమున కవకాశముండదు. ఆతఁడు సంఘశక్తి నభివృద్ధినొందించి జనులను రాజకీయ విషయములయందు లగ్నపఱచును 25. ఆ మనుష్యులు (నిస్పృహునివలన నుపదేశమొందినవారు) ఇతరులను దమ సముదాయములోఁ గలుపుకొందురు. ఈవిధముగ జనసముదాయ మసంఖ్యాకముగ వృద్ధినొందును. గుప్తరూపముగ సమస్త భూమండలమునందును నిస్పృహునిశక్తి వ్యాపించును 26. ప్రతిస్థలమునందును నాతనిసంఘములెన్నియో నిర్మాణమగును. మనుష్యులందఱు నాతనిచే నాకర్షింపఁబడుదురు. ఈవిధముగా నలుదెసలను బరమార్థబుద్ధికిఁ జక్కని ప్రచారము కలుగును 27. నిస్పృహుఁ డన్నిస్థలములందును (భక్త సముదాయమును సమావేశపఱచి) ఉపాసనము నభివృద్ధి నొందించును. తన యనుభవ సహాయమునఁ బ్రాణిమాత్రుల నందఱ నుద్ధరించును 28. ఈవిధముగా నిస్పృహుఁడగు ప్రయత్నశీలుఁడు పెక్కుయుక్తుల నెఱుంగును. ఆతనివలన నితరులు చతురులగుదురు. అన్నితావులందును బ్రాణిమాత్రుల కనుభవము ప్రాప్తించును 29. ఇట్లు తనకీర్తిని బ్రపంచమునందు వ్యాపింపఁజేసి పోయినవానిదే సార్థకజన్మము. ఈవిధముగ దాసు నుడువుచున్నాఁడు. ఈ విషయము స్వాభావికముగానే సంక్షేపముగాఁ జెప్పఁబడినది 30.

## మూడవసమాసము — జ్ఞానియొక్క గొప్పతనము.

మూలమాయ మొదలుకొని యనర్గళరూపముగ వ్యాపించియున్న సృష్టియంతయును బంచభూతాత్మకము. దానియందలి సాక్షిత్వతంతువు గూడఁ దత్స్వరూపమే (పంచభూతాత్మకమే) 1. ఉన్నతమగు సింహాసనముపై రాజు కూర్చుండియున్నాఁడు. రాజున కిరుదెసల సన్నిధానవర్తులగు కార్యదర్శులు, సైనికోద్యోగులు ఆజ్ఞకు వేచి సిద్ధముగానున్నారు. ఇందలి సారమెద్దియో మీ హృదయములందుఁ దెలిసికొనుఁడు * 2. దేహమా

* మధ్య రాజు, రెండువైపుల సన్నిధివర్తులు కూర్చుండిరనుటకు భావము మధ్య జాత్మశక్తి(సాక్షి) ఇరుదెసల జగద్రూపమగు సైనికవిస్తారము వ్యాపించియున్నదనుట.

త్రులందఱును అస్థిమాంసములతో నిండియున్నారు. అట్లే రాజుదేహము గూడ అస్థిమాంసమయమే! అనగా మూలమాయ మొదలుకొని యీ సృష్టియంతయుఁబంచభూతాత్మికములే♦ 3. రాజుయొక్క సత్తచే నంతయు నడచుచున్నది. కాని యున్నదెల్లఁ బంచభూతములే. మూలమాయయందు జ్ఞాతృత్వశక్తి విస్తారముగానున్నది. అంతరమింతియసుమా! 4. వివేకము వలన వ్యాపకత్వ మతిశయించును. కావుననే అవతారములను సన్మానించుచున్నారు. చక్రవర్తులు, మనువులు మున్నగువారలు వివేకకారణముననే అవతార పురుషులని పేరొందిరి 5. జ్ఞాతృత్వశక్తి యెవరి యందెంత యతిశయముగానుండునో వారియందంత యతిశయముగ సద్దైవత్వముండును. జ్ఞాతృత్వశక్తి స్వల్పముగ నుండుటవలననే జనులు నిర్దైవతములుగ, దరిద్రులుగ మారిపోవుచున్నారు 6. నిత్యమును బ్రయత్నదీక్షా తత్పరులై వర్తించుచుఁ దన్నులు, జీవాట్లు సహించువారలు మనము చూచుచుండఁగనే భాగ్యవంతులగుదురు 7. ఈ కాలమున నీవిధము తప్పని సరిగ జరుగుచున్నది. కాని మూర్ఖులకిది తెలియదు. (ఇదియెంతయు విచారకరమగు నంశము) వివేకవంతులు సమస్తము గ్రహింపఁగల్గుదురు 8. చిన్న పెద్ద యనునంతరములు ఏర్పడుటకు బుద్ధియే కారణమనునంశము జనులకు బొత్తిగఁ దెలియకున్నది. (జను లజ్ఞానకారణమున) ముందుపుట్టిన వానినే పెద్దయనుచున్నారు 9. రాజు వయస్సునఁ జిన్నవాడైనను వృద్ధులాతనికి నమస్కరింతురు. దీనికిఁగారణమేమి? వివేకస్థితి మిగులఁ బ్రత్యేకమైనది. ఇది జనులెఱుంగవలెను 10. సాధారణ జను లజ్ఞానమున దఱుచుగ అనుమానరూపముగ నుండును. అది లోకరూఢి లక్షణము 11. ఎవ్వరి నాపఁగలము? సాధారణజనుల కేమి తెలియును? ఎవ్వరి కెంతదనుకఁ జెప్పఁగలము? 12. హీనుఁడొకానొకప్పుడు భాగ్యవంతుఁడగునో నప్పుడుకూడ జను లాతని దుచ్ఛుఁడని యందురు. కావున నీవక్రపథగాములగు మనుజులను దూరముగనే యుంచవలెను 13. అవివేకులు చక్కఁగ నేవిషయమునేని తెలిసికొనఁజాలరు. ఉచితరీతితో రాజనైతిక

♦ దేహధారులయొక్కయు రాజుయొక్కయు దేహములు అస్థిమాంసమయములనుటకు భావము సమస్తజగత్తు, సాత్త్వికతత్త్వరూపము లనుట.

ముల నెఱుంగరు. మూర్ఖత్వకారణమున వ్యర్థముగ గొప్పదనము ప్రదర్శించుచుందురు 14. నిశ్చయాత్మికమగు జ్ఞాన మావంతయులేక యెవ్వరిచే గౌరవింపఁబడక యుండు వయోవృద్ధులను పెద్దలని యెవరందురు? 15. పెద్దలలోఁ బెద్దతనములేదనియుఁ జిన్నలలోఁ జిన్నతనము లేదనియుఁ జెప్పువారలు చతురులుగారు, వారల మూర్ఖులనిగూడ నుడువవచ్చును * 16. గుణములేనిపెద్దతనము వ్యర్థము. పెద్దతనము వలన గణించిన అనుభవమే యోగ్యమైనది. (దానికే గౌరవముకలదు) 17. ఒకవేళ పెద్దలను మాన్యతగాచింపవలయునన్నచోఁ బెద్దలు తమ పెద్దరికమునుగూడ గుర్తెఱుంగవలెను. ఇట్లు చేయకున్నచో ముందు ముందుఁ బెద్దరికపుటభిమానమువలనఁ గష్టములను భరింపవలసివచ్చును. 18. అన్నింటికంటెను గొప్పదగు నంతరాత్మ యేపురుషుని హృదయము నందుఁ బ్రకాశించుచున్నదో యాతనిదే మహిమయని వేఱుగఁజెప్పవలసిన పనిలేదు 19. కావున నెల్లరును వివేకముతోఁ జతురత్వము నలవఱచి కొనవలెను. వివేకము నభ్యసింపనిచోఁ బ్రతిష్ఠయుండదు 20. ప్రతిష్ఠయె లేకపోయినచో సమస్తము తొలంగెనని భావింపనగును. ఇఁక జన్మమెత్తి యాతఁడేమిగావించినాఁడు? మిఁచుమిక్కిలి యెఱిఁగియెఱింగి తననెత్తిపైఁ దానే యవమానమును బెట్టుకొనెను 21. ఇట్టిపురుషుని స్త్రీలుసహితము దూషింతురు. చూడుఁడు. ఎట్లు చిక్కులపాలయ్యెనో యని లోకులు సైతమందురు. ఈ విధముగా నాతని మూర్ఖత్వము వెల్లడియగును 22. ఇట్లు ఎవ్వరును గావింపతగదు. అందరును దమజీవితమును సార్థకపఱుప వలెను. (ఒకవేళ సార్థకపఱుచునుపాయము) తెలియకపోయినచో గ్రంథములను జదివి మననమొనర్పవలెను.(గ్రంథపఠనమువలన జీవితముసార్థకమగు నుపాయము లభించును) 23. చతురుపురుషుని జనులందఱు గౌరవింతురు. మూర్ఖుని నందరు నిందింతురు. సంపదలనుబడయ మనస్సునఁ గోరికయున్న

---

* వయస్సున జిన్నయగు జ్ఞానవంతుఁడగు బాలకుఁడు వయోవృద్ధునికడ నేదేని జ్ఞానవిషయమ్ము వివరించుచో "కలియుగమే తెంచినది. పెద్దలకు పెద్దతనము జిన్నలకుఁ జిన్నతనము లేకుండఁబోయినది. చిన్ననోటికి పెద్దమాటలు వచ్చుచున్నవే" యనిపలుకు దురు. ఇట్లు నుడువు వృద్ధులు మూర్ఖులని శ్రీ రామదాసస్వామి చెప్పుచున్నాఁడు.

చో॑ జతురుఁడు కావలయును 24. చతురత్వము నలవఱచికొనుట కెంతటికష్టములు భరింపవలసివచ్చినను సహించి యవశ్యముగ నలఁవఱచి కొనవలెను. కష్టములకోర్చి పలువురికి సేవగావించియైన జతురత్వము నేర్చుకొనవలెను 25. పలువురిచే గౌరవింపబడువాఁడే చతురుఁడు. చతురపురుషునకుఁ బ్రపంచమునందుఁ గొఱంతయే లేదు 26. ప్రపంచమునం దాత్మహితముగావించుకొననిమనుజుని ఆత్మఘాతియననగును. ఆ మూర్ఖునితో సమానుఁడగు పాపియెవడునుండఁడు 27. చతురపురుషుఁ డెన్నఁడును, బ్రపంచమునఁదాను శ్రమలొందఁదగినవియు నితరులకుఁ గ్రోధము గలుగఁజేసి వారియాగ్రహమును సహించునవియునగు పనులెన్నఁడును నొనర్పఁడు 28. సహజస్వభావముతో నిది సాధకుల కెఱింగించితిని. చక్కఁగ రుచించినచో గ్రహింపుఁడు. రుచింపకున్నచో విసర్జింపుఁడు 29 శ్రోతలారా! మీరలు పరమదక్షులు. మీర లలక్ష్యమగు వస్తువుయెడల లక్ష్యముంచుచున్నారు. ఇది ప్రత్యక్షమగు సామాన్యవిషయము మీర లెఱింగియే యుంటిరి గదా 30.



## నాలుగవ సమాసము — బ్రహ్మనిరూపణము.

పృథ్వినుండి వృక్షములు జనించుచున్నవి. వృక్షములవలనఁగట్టెలు జనించుచున్నవి. ఆ కట్టెలుభస్మమై మఱలఁ బృథ్వియగుచున్నవి 1. పృథ్వి నుండి తీగలు జనించుచున్నవి. అవి నానా విధముల నల్లుకొనుచున్నవి. అంత్యమునం దవి క్రుళ్లి చివికి మఱలఁ బృథ్వి యగుచున్నవి 2. నానా విధధాన్యములతో వంటకములొనరించి మనుజులు భుజించుచున్నారు. మఱల నవి నానావిధములుగ మలరూపమునను, వాంతిరూపముగను మాఱి పృథ్వియే యగుచున్నవి 3. ఇతర పదార్థములను భుజించు పశు పక్ష్యాదులు సైతమిట్లె యగుచున్నవి. వానిమలముగూడ నెండి పృథ్వి యందుఁ గలసిపోవుచున్నది 4. మనుజుఁడు మొదలగు ప్రాణిసమూహ మంతయుగూడఁ జనిపోయినపిమ్మట పృథ్వియే యగును 5. అనేక విధములగు తృణాది పదార్థములు సైతము కుళ్ళి మట్టియగుచున్నవి. అనేకకీటకములు సైతము మరణించి పృథ్వియందుఁ గలసిపోవుచున్నవి.

6. పదార్థము లసంఖ్యాకములుగ నున్నవి. వాని విస్తారము నెంతదనుక వివరింపఁగలను? వాని కన్నింటికిని ఈపృథ్విని విడిచినచో నింకఁ దావెక్కడఁ గలదు ? 7. చెట్లఆకులు, తృణములు మున్నగునవి పశువులు దిన్న పిదప పేఁడగా మాఱును. పేఁడ, మూత్రము, భస్మము సైతము మఱలఁ బృథ్విగా మాఱుచున్నవి 8. ఉత్పత్తిస్థితి సంహార చక్రబరిభ్రమణము లోనికి వచ్చెడివన్నియుఁ బృథ్వియందుఁ గలియును. జనించునవియు, మరణించునవియు మఱలఁ బృథ్వియే యగును 9. నానావిధధాన్యములు రాసులుగఁ బెరిగి పెరిగి యాకాశమున కంటిపోవును. కాని యంతమునం దవియన్నియును బృథివిలోఁ గలియును 10. జనులు నానావిధధాతువులను బాతిపెట్టుదురు. చాలకాలము జరిగినమీఁద నవి మట్టియైపోవును. బంగారమునకును జాళ్ళకును తుద కీగతియే పట్టును 11. మట్టియే సువర్ణముగను, జాళ్లుగను మాఱును. కాని పృథ్వీగర్భమునందలి తీక్ష్ణాగ్నిచే నవి భస్మరూపమునొంది మఱలఁ బృథ్వియే యగును 12. బంగారముతో జరీచేయుదురు. అది యంత్యమునఁ జినిఁగి రసరూపమునంతట వ్యాపించును. అది మఱలఁ బృథ్వియేయగును 13. పృథ్వివలన ధాతువులు జనించి యగ్నిచేగఱఁగి రసమగుచున్నవి. తరువాత నా రసము కఠినరూపమై పృథివియగుచున్నది 14. నానావిధములనుండి గంధము వెలువడి పృథ్విరూపమొందును. దినదినక్రమమున జలమెండిపోవును. పిమ్మట నా పృథివి పృథివిగనే శేషించును 15. పత్రపుష్పఫలాదు లుదయించుచున్నవి. వాని ననేక జీవులు మెసవుచున్నవి. ఆ జీవులు మరణించిన పిమ్మట పృథ్విగ మాఱుచున్నవి 16. ఆకారసహితముగ నుండు దానికెల్ల పృథ్వియే యాధారమైయున్నది. ప్రాణిమాత్రు లుదయించుచున్నారు. మరణించుచున్నారు. అంతయు నంత్యమునఁ బృథివియే యగుచున్నది. 17. ఎంతదనుక నీ యంశము దెలుపఁగలను? వివేకమువలన నిట్లి సమస్తము నెఱుంగవలెను. మఱియు నుత్పత్తిసంహారముల మూలము గూడ నెఱుంగవలెను 18. జలమెండి పృథ్వియగును. మఱల నాపృథ్వి జలమునందే లయమగును. ఏలయన? అగ్నిసంయోగముచే భస్మమగును 19. జలము తేజమువలనఁ గలుగును. మఱలఁ దేజమే జలము నెండించును. ఆ తేజము వాయువుచే జనించును. తేజమును మఱల

చేసినను దీఁగ తడిలేనిచో బ్రతికియుండఁజాలదు 10. వృక్షమునకుఁ ద్రాళ్ళుగట్టి బిగించినను అవి తమయిష్టానుసారముగఁ బెరుగుచుండును. కొన్ని వృక్షములన్ననో ఆకాశమున కెగిరిపోవుచున్నటు లుండును 11. ఈ వృక్షములు భూమికంటె వేఱుగనున్నను అవి యెండిపోవు. ఎచ్చట నుండునో యచ్చటనే యవి చక్కఁగ వృద్ధినొందును 12. అంతరాత్మ తోడ్పాటుచే వృక్షములు వృద్ధినొందుచున్నవి. అంతరాత్మ లేకున్నచో నావృక్షములు జడములగు కట్టెలగును. ఇది ప్రత్యక్షముగఁ జూచుచున్న విషయము. ఇందు గూఢమయరహస్య మించుకేనిలేదు 13. ఒకా నొకప్పుడు వృక్షములనుండిగూడవృక్షములు కలుగును. అవిగూడ నాకా శమునంటునట్లు పెరుగును. వానివ్రేళ్లు పృథివియందు నుండవు 14. వృక్ష ములనుండి లభించు మేఁత, నీరువలననే శాఖావృక్షములు బ్రతుకు చున్నవి. వృక్షముల శబ్దసంఘర్షణమువలనఁ జెప్పెడివారలు విచార మొనర్తురు 15. కావలసినదంతయు మొదటనే యయ్యెను. ఆ పిమ్మట కల్పనముజేసి చేసి జనులు తమ యిష్టానుసారముఁ జెప్పుచుందురు. జ్ఞాను లగు పురుషులు సమస్తము నెఱుంగుదురు 16. తెలిసికొన్నచో వెదక వలసిన పనియుండదు. వెదకవలసి వచ్చినచోఁ తెలిసికొనుట యుండదు. అనుభవ రహితమగు నంశ మెద్దియు ననుభవముకురాదు 17. తొలుదొ లుత, అంతటికిని ఉత్పత్తికర్త యెవఁడో విచారింపవలెను. ఇదియంతయు నెఱింగిన పిదప ఆ జగదంతరాత్మ నెఱుంగుటవలనఁ దనకుఁదనది లభిం చును 18. అంతర్నిష్ఠయొక్క ప్రశస్తి మిగులగొప్పది. బహిర్ముఖ (పైపై విచారము గావించువారు లేక అంతరాత్మనుగూర్చి విచారింపని వారు) జనుల సాంగత్యము వ్యర్థము. ఈ విషయమును జతుర పురుషులే యెఱుంగుదురు. ఇతరులకేమి తెలియును 19. ఎల్లరిమనస్సులను సంతుష్టిగా నుంచుచో నెవరెవరికేమి సహాయము చేయుదురో తెలియదుగాని యెల్లరి మనస్సులను సంతుష్టిగా నుంచకుండుటవలన మాత్రము తోటకూరకట్టతో సమానమగు క్షుద్రపదార్థముగూడ లభింపదు 20. ఇది ప్రత్యక్షముగా అనుభవసిద్ధము. పైనిజెప్పినటుల అలక్ష్యమునందు లక్ష్యము ననుసంధింప వలెను. దక్షునితోఁ గలసికొనుటవలన దక్షునకు సమాధానము కలు గును 21. మనస్సుతో మనస్సుగలసినపిదప (అనన్యమైన పిదప) పర

బ్రహ్మమును జూడఁగలుగుదురు. మఱియు మాయారూపమగు చంచల చక్రమును దాటిపోవుదురు 22. ఒకసారి చంచలచక్రమునుదాటి పర బ్రహ్మమును జ్ఞానచక్షువులతోఁ జూచి వచ్చినచో నది మొదలుకొని నిరంతరము సర్వస్థలములందు నదియే (పరబ్రహ్మమే) గోచరించును. (పరబ్రహ్మ రహితమగు స్థలమెద్దియుఁ గాన్పింపదు) కాని మనుజులు దానిని జర్మచక్షువులతోఁ దక్కఁ జూడఁజాలరు 23. ఈ చంచలము (మాయ) అన్నిశరీరములయందును నిరంతరముగఁ గదలికను గలిగించు చునే యుండును. కాని పరబ్రహ్మము (మాయవలెఁగాక) సర్వస్థలము లందును నెల్లప్పుడును నిశ్చలముగ నున్నది 24. చంచలము యెప్పుడొక ప్రక్కకుఁ బరుగెత్తునో యప్పుడు రెండవప్రక్క నేమియునుండదు. చంచ లము అన్నిప్రక్కల వ్యాపించియుండుట యెప్పుడును బొసఁగదు 25. చంచలమువలనఁ జంచలముయొక్క పనియే నెరవేరదు. చంచలమువలన సమస్త చంచలవిచారమే జరుగదు. ఇఁక నిశ్చలమును, అపారమునగు పరబ్రహ్మము చంచలమువలన నెట్లు అనుమానములోనికి రాగలదు* 26. ఆగ్నేయబాణము (అవ్వాయిచువ్వ) కాల్చివిసరినచో నాకాశమునకుఁ బోవును. అంతియగాని యది యెన్నఁటికిని ఆకాశపుఁగొననుదాటి పోవఁ జాలదు. మధ్యనే చల్లారిపోవుట దానికి స్వభావగుణము 27. మనోధర్మ మేకదేశీయముగ నున్నప్పుడు వస్తువెట్లు ఆకలనమగును. ఇట్టి యపయశ స్కులగు పురుషులు (ఏక దేశీయమగు మనోవృత్తిగల వారలు) నిర్గుణ మును విడిచి సర్వబ్రహ్మమని నుడువుదురు 28. సారాసారములు లేని తావుననంతయు నంధకారమే యెఱుంగనగును. తెలియని బాలుఁడు సత్య మునువిడిచి మిథ్యనే గ్రహించును 29. బ్రహ్మాండముయొక్క మహా కారణ (మూలమాయ)వలన నీ పంచమహాభూత సముదాయ ముత్పన్న మయ్యెను. కాని యీ మహావాక్య వివరణము వేఱుగనున్నది 30. మహాతత్త్వమునే మహాభూతమందురు. దానినే భగవంతుఁడని యెఱుంగ

* మనస్సు చంచలముగ నుంచుకొన్నచో మాయావివరణము కాఁజాలదు. ఇఁక నిశ్చలము, అపారమునగు పరబ్రహ్మమెట్లు అనుమానమునకు వచ్చును?

నగును. ఆ భగవంతునికడ నుపాసన మంతమగును* 31. కర్మోపాసన జ్ఞానములయొక్క త్రికాండజ్ఞానము వేదములయందుఁ జెప్పఁబడెను. కాని పరబ్రహ్మమునెడ జ్ఞానము విజ్ఞానమగును. (జ్ఞానముకూడ లయమగు ననియే నుడువవచ్చును) 32.

---

## ఆరవ సమాసము – విశిష్టచాతుర్యము.

పీతము (దీపము) వలనఁ గృష్ణము (కాటుక) ఉత్పత్తియయ్యెను. మఱియు నా కాటుకయే అక్షరరూపముతో సంపూర్ణభూమండలమునందు వ్యాపించియున్నది. ఆ కాటుకయే లేకున్నచో మనుజులకు జ్ఞానప్రాప్తి యగుటయే యసంభవము ♦ 1. కాటుకచూచుటకు స్వరూపలక్షణయుక్తముగఁ గనిపించును. వాస్తవమున కా కాటుకయందె యన్నియుఁ గలవు. (అధమోత్తమగుణములు దానియందున్నవి) 2. మహీసుతను (పృథ్వి నుండి జనించు దంటును) దీసి లేఖినిగాఁజేసి మధ్యనుండి చీల్చెదరు. ఈ రెంటితో (సిరా, కలములతో) పని గడుచుచున్నది 3. శ్వేతము, అశ్వేతము (కాగితము, కలము) కలియుటవలనను, మఱియుమధ్యను కృష్ణము (సిరా) కలియుట వలనను, లోకమునకు † సార్థకత్వముకలుగుచున్నది 4. ఈ విషయమును యోచించినచో మూర్ఖులుసైతము చతురులగుదురు. తత్కాలముననే ప్రతీతికలుగును. మఱియుఁ బరలోకముగూడ సాక్షాత్కారమగును 5. ఎల్లరకు మాన్యమగు పరబ్రహ్మమునే సామాన్యముగనెంచి జనులు ఆ పరబ్రహ్మము నందనన్యులు గాకున్నారు 6. హస్త రేఖలు ఉత్తమము, మధ్యమము, కనిష్ఠము అని మూఁడువిధములుగ నుండును. లలాటమునందుగూడ నదృష్టరేఖలుండును. కాని యీ నాలు

---

* "ఏకోవిష్ణుర్మహద్భూతమ్" అని చెప్పఁబడెను. ఉపాసనము (ద్వైతమునుంచుకొని భగవద్భజనము గావించుట) ఇంతదనుకనే మహద్భూతమున కావల నద్వైతముండదు. అచట ననన్యమై పోవలసివచ్చును.

♦ కాటుకతో సిరా చేయుదురు. ఆ సిరాతో సమస్తగ్రంథములు వ్రాయుదురు. వానిమూలమున నెల్లరకును జ్ఞానము కలుగును.

† వ్రాయుట, జదువుట, నేర్చి విద్వాంసుఁడైనచో ఇహలోకము సార్థకమగును.

గింటి యనుభవము నొక్కటి కాఁజాలదు 7. తమ పూర్వులగు పదు నాలుగు తరములవారి గొప్పతనమును నిరంతరమును గానముజేయువారి నేమనలెను? వెఱ్ఱివారలని యందమా? చతురులని యందమా? ఇపుడు మనవలనఁ (ఆతని పెద్దలుగావించిన పనిలో) గొంచమేని యగునా? కాదా? యను నంశమును శ్రోతలు యోచింపవలెను 8. రేఖలన్నింటిని (హస్తరేఖలను ఫాలరేఖలను) దుడిచివేయవచ్చునను సంగతి ప్రత్యక్ష ముగాఁ దెలిసియున్నప్పుడు భాగ్యము కలుగునను విశ్వాసముతో నేల యుండవలెను? 9. పెక్కండ్రమాటలను జెవిజేర్చు మనుజులు సందేహ ములో మునుఁగుదురు. వార లనుభవాత్మకమగు నిశ్చయమును మఱచి పోవుదురు 10. పెక్కండ్రు తెలుపు పెక్కుమాటల నాలింపవలెను. అనుభవముతో నందఱు చెప్పునదియు విచారింపవలెను. అంతియగాక తనహృదయమున సత్యాసత్య నిర్ధారణ మొనరింపవలెను 11. ఎవరి తోడనైనఁ దన యనంగీకారమును వెల్లడింపఁదగదు. ఉపాయమునుగాని అపాయమునుగాని తెలిసికొని యనుభవమునకుఁ దెచ్చుకొనవలెను. ఎక్కువగా వదరుటవలన నేమిలాభము? 12. హాతుడైన గానిమ్ము, దురా గ్రహియైనఁ గానిమ్ము, వ్యర్థుడైన గానిమ్ము. అట్టివాఁడు దెలుపు మాట లనుగూడ సాదరముగ నాలింపవలెను. ఈవిధముగఁ దన ప్రవర్తనవలన అందఱి హృదయములను బ్రసన్నతగా నుంచవలెను 13. హాతము; ద్వేషము, కల్మషము హృదయమున నుంచుకొనువాఁడును, ఈ దుర్గుణ ములను మిగులఁ బెంపొందించువాఁడునునగు చంచలుని చతురుఁడని యెట్లనఁగలను? ఇట్టిపురుషుఁ డితరుల నేమి సంతోషపరుపఁగలడు? 14. మూర్ఖులను జతురులనొనర్చువారి జీవితమే సార్థకము. వ్యర్థముగా వాదమునుబెంచుట మూర్ఖతయేసుమా! 15. జనులలోఁ గలియ వలెను. వారలను దనలోఁ గలుపుకొనవలెను. (వారలఁ దన విచారమున కనుకూలముగఁ జేయవలెను) వారలలోఁ గలసిమెలసియుండి వారల అభిప్రాయములను మార్చవలెను. వివేకబలముచేఁ దన మనోమర్మము నితరులకు వెల్లడింపకుండవలెను 16. రెండవవాని నడవడి ననుసరించి వర్తింపనగును. రెండవవాఁడు చెప్పినవిధముగాఁ జెప్పవలయును. రెండవ వాని మనోగతమునందుఁ గలసిపోవలెను 17. ఇతరుల హితముగోరు వాఁ

డెన్నఁడును ఇతరులకు విరుద్ధము గావింపఁజాలఁడు. ఆతఁడు సంతోషపూర్వక
ముగ ఇతరుల హృదయములు తనకనుకూలములుగ నొనర్చుకొనును 18.
మొట్టమొదట నితరులను దన యభిప్రాయములోనికి దెచ్చుకొనవలెను.
మెల్లమెల్లగఁ దన యుద్దేశమును ఇతరుల హృదయములయందు నింప
వలెను. ఈవిధముగ నానాప్రయత్నములచే నితరులందఱిని దనచేతిలోనికిఁ
దెచ్చుకొనవలెను 19. హఠము గావించువానికి హఠముగావించువాఁడె
తటస్థమగుచో గోలయగును. తరువాతఁ గలహములోనికి దిగును. అపుడు
నేర్పరితన ముపకరింపదు 20. వ్యర్థముగా నార్భాటము జేయువారలేగాని
చేసిచూపువారలు పూజ్యము. ఇతరుల హృదయములను దన కనుకూ
లము గావించుకొనుట మహాకఠినము 21. ఇతరులను తనవైపు ద్రిప్పుకొనఁ
బ్రయత్నించునెడ ద్రోహిడులు, దెబ్బలు సహింపవలెను. నీచశబ్దముల
నోర్పుగ వినవలెను. ఇంత సహించినపిదపఁ బశ్చాత్తాపమునొంది యిత
రులు తనవారలగుదురు 22. ప్రసంగమును గనిపెట్టి భాషింపవలెను.
జ్ఞాతృత్వాభిమాన మించుకేని యుంచుకొనఁదగదు. ఎచ్చటికేగిన నచ్చటఁ
గలుపుగోలుతనముతోఁ బ్రేమపూర్వకముగ మెలఁగవలెను 23. కుగ్రామ
ములను (దుర్గమ వాసస్థలములను) నగరములను, ఇండ్లలోనుండు చిన్న
యిండ్లను, అవియివి యననేల? చిన్నయిండ్లను పెద్దయిండ్లను నొక్కటి
యేని మిగులకుండ బిచ్చమను నెపముతో గాలించివేయవలెను 24.
(తిరుగుటవలన) పెక్కుమందిలో నేదియేని లభించితీరును. విచక్షణులగు
పురుషుల స్నేహము లభించును. కాని రిత్తగఁగూర్చున్నయెడలఁ దిరుగుట
కాని జ్ఞానప్రాప్తియగుటగాని జరుగదు 25. సమస్తమును సావధానముగా
నెఱుంగవలెను. అన్నివిధములగు వార్తలను దొలుతొల్తనే గ్రహింప
వలెను. తానేగవలసిన తావునకు వివేకపూర్వకముగా నేగవలయును 26.
నానావిధములగు యుక్తులనెఱింగినచో మనుజులందఱి హృదయములను
బ్రసన్నతగావింపవచ్చును. ఆ యుక్తులను ఇతరులకు వ్రాసియిచ్చినచో
నిఁకఁ జెప్పవలసిన దేమున్నది? వ్రాసియిచ్చుట జనులపై మేరలేని పరోప
కారమును గావించుటయే 26. ఎవని కేదివలయునో వానికది ప్రసా
దించు మానవుఁడు సర్వమాన్యుఁడును శ్రేష్ఠుఁడునగును 28. భూమండల
మునందు సర్వమాన్యుఁడుగ నున్నవానిని సామాన్యపురుషునిగ భావింపఁ

దగదు. ఆ మానవునిచెంత నెందఱో పురుషు లనన్యులై యుందురు. సర్వ మాన్యుఁడగుపురుషుఁడు లోకసంగ్రహమును జక్కఁగఁ జేయజాలియుం డును 29. చాతుర్యలక్షణము లిట్టివి. చాతుర్యముతో దిగ్విజయము గావించు పురుషున కేమిలోపముండును ? ఆతఁ డెచ్చటికరిగిన నచ్చట సమస్తమును సిద్ధముగానుండును 30.

---

## ఏడవ సమాసము — అథోర్ధ్వలక్షణము.

నానావికారములకు మూలమెద్దియో యదియే మూలమాయ. అది సూక్ష్మరూపముతో అచంచలము (పరబ్రహ్మము) నందుఁ జంచల రూపముగ నున్నది 1. మూలమాయ జ్ఞాతృత్వరూపముగ గలది. అది పరబ్రహ్మమునకు ఆదిసంకల్పరూపము. దానిని షడ్గుణేశ్వరుఁడగు భగ వంతుడని యెఱుంగవలెను 2. ప్రకృతిపురుషులనియు, శివశక్తియనియు నర్ధనారీనటేశ్వరుడనియు దానినే చెప్పుదురు. కాని యాజగజ్జ్యోతియే వీని కన్నింటికిని మూలము 3. సంకల్పముయొక్క చలనమే వాయు (మాయ) లక్షణము. వాయువునందుఁ ద్రిగుణములును బంచభూతములును గలవు 4. ఏతీఁగ నైనఁ జూడుఁడు. దానిమూలమెంతయో లోతునకుఁబోవును. మఱియుఁ బత్రపుష్పఫలాదులుగూడ మూలమునందే యుండును 5. ఇం తియగాక నానావిధవర్ణములు, ఆకారవికారములు, తరంగములు, స్వా దువులు మున్నగునవియెల్ల లోపల మూలమునందే యుండును 6. ఆమూ లములను ఛేదించిచూచినచో నందేమియుఁ గాన్పింపదు. కాని యనంతర మామూలము పెరుగఁగాఁ బెరుగఁగా దానినుండి సమస్తమును గాన్పిం చును 7. ఎత్తైన దిబ్బమీఁద నేదేనితీఁగ మొలచినచో నది క్రిందివైపు నకు బలముగా వృద్ధినొందును. తరువాత నది భూతములపై వ్యాపించు ను 8. మూలమాయగూడ నిట్టిదేయని గ్రహింపుడు. మూలమాయ యందు మొదటనుండియుఁ బంచభూతములు, త్రిగుణములు గలవను నీ సత్యవిషయమును అనుభవమువలన నెఱుంగవలెను, 9. తీఁగ తప్పక నలు గడల నల్లుకొనును. నానావిధములగు మార్పులతో శోభించును, ఆమా ర్పులవలన నితరములగు మార్పులుగూడఁ జక్కఁగ వృద్ధినొందును 10.

నానాశాఖ లుత్పన్నమగుచున్నవి. నానావృక్షములు పెరుగుచున్నవి. ఈవిధముగనే భూమిపై ననంతములగు తీఁగలు పెరుగుచున్నవి 11. ఎన్నియో ఫలములు క్రుళ్ళిపడుచున్నవి. వెంటనే మఱలఁ క్రొత్త కాయలు కాచుచున్నవి. ఇట్లే యెల్లప్పుడును జరుగుచుండును 12. కొన్నితీగ లెండిపోవును. మఱల నచ్చటనే క్రొత్తతీఁగలు మొలచును. ఈవిధముగా నెన్నితీగలుజనించెనో, యెన్నిగతించెనో యెవ్వరెఱుఁగుదురు 13. ఆకులు రాలిపోవును. మఱల జిగుర్చును. ఫలపుష్పముల స్థితియు నిట్టిదె. ఈఫలపుష్పపత్రములలో నానావిధజీవములుగూడ నేర్పడియుండును 14. ఒకప్పుడు తీగయంతయు నెండిపోవును. మూలమునుండి మఱలఁ జిగుర్చును. ఇట్లే యీయంశమును బ్రత్యక్షానుభవమువలన గ్రహింపవలెను 15. మూలమును ద్రవ్వి తీసిపారవేసినయెడల (ప్రత్యయజ్ఞానముచే నిర్మూలముగావించినప్పుడు) అన్నివిధములగు వృద్ధులును ఆగిపోవును 16. మూలమునందు (ఆదిలో) బీజముండును. అత్యంతమునందు బీజముండును. మధ్యను జలరూపమున బీజముండును. ఇదేవిధముగా బీజములంతటను స్వాభావికముగా వ్యాపించియున్నవి 17. ఈబీజసృష్టి (బీజమునుండి ఉత్పన్నమైన ఫలపుష్పపత్రాదులగు సమస్తవిస్తారము) మూలమునందిమిడి యున్న అన్ని విషయములను బ్రకటించుచున్నది. అనంతరము ఏది దేనియంశమో యది దానియందు స్వాభావికముగ లయమగును 18. పోవుట, వచ్చుట, మఱలఁ బోవుట మున్నగు ప్రత్యావృత్తి యథావిధముగ జరుగుచున్నది. ఆత్మజ్ఞానియగు యోగ్యునకీప్రత్యావృత్తివలని కష్టములు గలుగవు 19. ప్రత్యావృత్తికష్టములు గలిగినను, కలుగకపోయినను మానవుఁడేదేని కొంత యెఱుంగవలసియున్నదని పెద్దలందురు. ఆత్మ తనహృదయమునందే యున్నను అది యెల్లర కెచ్చటఁ దెలియును? 20. ఆత్మవలననే కార్యములు నెరవేరుచున్నవి. దాని నెఱుంగరు. అది కనుపింపనే కనుపింపదు. ఈ స్థితియందుఁ బాపము జనులేమిచేయుదురు? 21. విషయభోగము సైతము ఆత్మవలనే జరుగుచున్నది. అది లేనిచో నేదియు జరుగదు. వాస్తవమునకు స్థూలమునువిడిచి సూక్ష్మమునందుఁ బ్రవేశము గడింపవలెను 22. తనయొక్కయు జగత్తుయొక్కయు అంతఃకరణ మొక్కటియే. కాని శరీరభేద వికారము

మాత్రము వేఱుగనున్నది 23. ఒకవ్రేలివేదన రెండవవ్రేలికిఁ దెలియదు. కాళ్ళు చేతులు మున్నగు నవయవముల స్థితిగూడ నిట్టిదె 24. ఒకశరీరము నందున్న యొకయవయవము సంగతి మఱియొక యవయవము యెఱుంగ నప్పుడు ఒకఁ డితరులస్థితి నెట్లెఱుంగఁగలఁడు? కాన రెండవవాని యంతః కరణము తెలియఁబడదు 25. ఒకే జలముచే నానావిధములగు వనస్ప తులు కలుగుచున్నవి. కాని వానిలో నానావిధములగు భేదములు కను పించుచున్నవి. ఎంత విరిగిపోవునో అంతియ యెండిపోవుచున్నది. తక్కిన దంతయుఁ బచ్చదనము గలిగియుండును 26. ఇట్లే భేదమన్నింటియందును గలవు. ఒకదాని భేదము రెండవదానికిఁ దెలియదు. కాని జ్ఞానము గలిగినపిమ్మట నీ యాత్మ భేదముండదు. (జ్ఞానియగు పురుషుఁడు సమస్త జగత్తునందు నొకే యాత్మను గాంచుచున్నాఁడు.) 27. దేహప్రకృతి కారణమున ఆత్మత్వమునందు భేదము భాసించుచున్నను ఈ విషయమును (సహజముగ భేదములేదని) జాలమంది యెఱుంగుదురు 28. (సామా న్యులు) చూచి కని యెఱుక గావించుకొందురు. చతురులు మనస్సును బరీక్షించెదరు. విచక్షణచణులగు వారలు గుప్తరూపముతో (సూక్ష్మ రూపముతో) నంతయుఁ దెలిసికొందురు 29. పెక్కుమందిని బరిపాలించు వాఁడు పెక్కండ్ర యంతఃకరణముల నెఱుంగును. అంతియగాక విచక్ష ణతచే సమస్తము గ్రహించును 30. మొదట మనస్సును బరీక్షించును. అప్పుడు విశ్వసించును. ఈ విధముగనే ప్రాణిమాత్రులు ప్రవర్తించు చున్నారు 31. యుక్తమును బ్రత్యక్షానుభవమును నగు నీ విషయము స్మరణకుఁ బిదప విస్మరణకు వచ్చుచున్నది. తాను పెట్టిన పదార్థమునే మనుజుఁడు స్వయముగా మఱచుచున్నాఁడు 32. తన సంగతియే తనకు జ్ఞాపకముండదు. తాను జెప్పిన సంగతియే తనకు జ్ఞాపకముండదు. అనంత ములగు కల్పనములు దొరలుచుండును. ధ్యానము నందెంతదనుక నుంచు కొనుటకు సాధ్యపడును? 33. ఈ చంచల చక్రమిట్టిది. ఇది కొంతసరిగను గొంత వక్రముగను నున్నది. పురుషుఁడు అత్యల్పుఁడైనను ప్రత్యక్ష దేవేంద్రుఁడైనను అందఱకును స్మరణ, విస్మరణములు వెన్నంటియే యుండును 34. స్మరణము (చైతన్యము) దేవగుణమనియు విస్మరణము (మూఢత) దానవగుణమనియుఁ జెప్పుదురు. మానవుఁడు స్మరణ, విస్మర

ణములు రెంటియందును వర్తించుచున్నాఁడు 35. ఇందువలననే, దైవ, దానవము లను రెండువిధములగు సంపదలు గలవని తెలియును. ఈ విషయమునఁ బ్రతీతిని వివేకసహితముగ మనస్సులోనికిఁ దేవలెను 36. అద్దమునందు నేత్రముల సాయమున నెట్లు నేత్రములను గాంచుచుంటిమో యట్లు వివేకమువలన వివేకము నెఱుంగవలయును. మఱియు నాత్మవలన నాత్మను గుఱుతెఱుంగవలెను 37. స్థూలదేహముతో స్థూలదేహము నెట్లు గోకుకొనుచుంటిమో యట్లు సూక్ష్మమువలన సూక్ష్మమును గుర్తెఱుంగవలెను. మఱియు సంకేతమువలన సంకేతమును మనస్సులోనికిఁ దేవలెను 38. విచారమువలన విచారము నెఱుంగవలెను. అంతరాత్మ వలన నంతరాత్మ నెఱుంగవలెను. రెండవవాని యంతఃకరణమునందు ప్రవేశించి వాని యంతఃకరణముగూడ నెఱుంగవలెను 39. స్మరణమునందు విస్మరణము నొందుటయే భేదముయొక్క లక్షణము. ఎవ్వరైనగానిమ్ము. ఏకదేశీయుఁడగు (సంకుచితుఁడగు)వాఁడు పరిపూర్ణుఁడు కాఁజాలఁడు 40. ముందునేర్చుకొనును. వెనుక మఱచిపోవును. ముందఱవెలుతురు, వెనుకచీకటి, అంతయు మొదట జ్ఞాపకమునకు వచ్చును. తరువాత మఱచిపోవును 41. తురీయమును స్మరణమని యెఱుంగవలయును. సుషుప్తిని విస్మరణమని యెఱుంగవలయును. ఈ రెండును సరిసమానముగ శరీరమునందు వర్తించుచుండును 42.

---

## ఎనిమిదవ సమాసము — సూక్ష్మజీవ నిరూపణము.

కొన్నికొన్ని కీటకములు రేణువులకంటెను గూడ సూక్ష్మముగా నుండును. వానియాయువుగూడ మిగుల స్వల్పముగా నుండును. అట్లే యుక్తి, బుద్ధిసైతము వానియందుఁ దక్కువగానుండును 1. ఇట్లే నానావిధప్రాణులు గలవు. అవిచూచిన గోచరింపవు. కాని వానియందుఁగూడ అంతఃకరణ పంచకస్థితిగలదు 2. వానికిఁ దగినట్లు వానికిఁగల జ్ఞానము చాలియున్నది. వాని విషయములకు వలయు నింద్రియములుగూడ వానికమరియున్నవి. వాని సూక్ష్మశరీరము నెవఁడు విచారించి చూచుచున్నాఁడు? 3. సూక్ష్మాతి సూక్ష్మములగు నీ కీటకములలోఁ జీమయే మిక్కిలి గొప్ప

యేనుగు. చీమ మాత్రమే సముద్రమని జనులందురు 4. సారాంశమేమన చీమలవలెఁ జిన్నవియు, బెద్దవియు నగుశరీరము లనంతములుగలవు. వాని యన్నింటిలోనను జీవేశ్వరుఁడు వసించుచున్నాఁడు 5. ఈ విధముగ పృథ్విపై గీటకము లనంతములుగ నిండియున్నవి. అత్యంతోద్యోగి యగు పురుషుఁడే వీనినన్నిఁటిని విచారించి గ్రహించుచున్నాఁడు 6. అనేక నక్షత్ర కమండలములలోఁగల జీవులుసైతము ఉద్యోగియగు పురుషునకుఁ బర్వత సమానముగ (దూరదర్శినీయంత్రసహాయమున) గోచరించును. వారలా జీవుల గొప్పగొప్పయవస్థల జాడలనుగూడఁ గనిపెట్టుదురు 7. పక్షులయంత చిన్నజీవము లెవ్వియులేవు. మఱియుఁ బక్షులతో సమానమగు పెద్దజీవము లెవ్వియులేవు. సర్పములయొక్కయుఁ, జేపలయొక్కయు స్థితిగూడ నిట్టిది గనే తెలిసికొనుఁడు 8. చీమమొదలుకొని యేనుఁగుదనుకఁ బెద్ద పెద్ద శరీరము లెన్నియోగలవు. ఆయా జంతువులగూర్చి యోచించినచో వాని లోపలి తత్త్వసారము విశదమగును 9. జంతువు లనేకవర్ణములుగ అనేక జాతులుగనున్నవి. జంతుసముదాయ మనేకరూపములుగ నున్నవి. అందుఁ గొన్ని మంచివర్ణము కొన్ని చెడ్డవర్ణములు గలవి. ఎంత దనుకనని చెప్ప గలను 10. కొన్ని జంతువులను జగదీశ్వరుఁడు సుకుమారులుగ నొనరించెను. కొన్నింటిని గఠోరములుగ నొనరించెను. కొన్నింటి శరీరమును బంగార మువలె దేదీప్యమానముగ నొనరించెను 11. ఈ విధముగా జీవులయందు శరీరభేదము, ఆహారభేదము, వాచాభేదము, గుణభేదము గలదు. కాని యన్నింటి యంతఃకరణములు అభేదములుగను, ఏకరూపములుగను నున్నవి. ఆత్మయన్నింటికి నొక్కటియే 12. ఆ జీవులలోఁ గొన్ని కష్ట దాయకములు. కొన్ని ఘాతుకములు. ఈ విధముగా యోచించి చూచి నచో నీ సృష్టియందు ఎన్నియో యమూల్యములగు కౌతుకములు గోచ రించును 13. ఈ రీతిగ సమస్తమును ఏ ప్రాణి విచారించి చూడఁగలఁడు? తమతమ స్వార్థపూరణమునకుఁ జాలినంతవరకుఁ గించిన్మాత్రముగ నంద ఱును దెలిసికొనుచుందురు 14. భూమండలము నవఖండములుగ నున్నది. దీనికి నాలుగుదిశలు సప్తసాగరము లావరించియున్నవి. బ్రహ్మాండమునకు వెలుపలఁగూడ జలమావరించి యున్నది. కాని దీనినంతను జూచెడివాఁ డెవ్వఁడు? 15. ఆ నీటియందనంతములగు జీవములు నివసించుచున్నవి.

ఈ యసంఖ్యాకములగు జీవులస్థితి నెవ్వఁడెఱుంగును? 16. జలమున్న తావున జీవులుండును, ఇది యుత్పత్తిస్వభావము. విచార మొనరించిన వో నిందలియభిప్రాయము విస్తృతముగ విశదమగును 17. భూగర్భమునందు నానావిధజలము గలదు. ఆజలమున శరీరములుగలవు. అందు బహువిధము లగు పెద్దజీవములు, చిన్నజీవములు నున్నవి. వాని నెవ్వఁడెఱుంగును! 18. కొన్నికొన్ని ప్రాణు లాకాశమున వసించుచుండును. అవి భూమిని నెప్పుడును కనులనైనఁజూడవు. ఱెక్కలువచ్చిన మీఁదకూఁడ నవి పైపై ననే యెగిరిపోవుచుండును 19. నానావిధములగు ఖేచరములు, భూచర ములు, వనచరములు, జలచరములు మున్నగు నెనుబదినాలుగు లక్షల జీవయోను లీప్రపంచమునందుఁగలవు. వాని నెవ్వఁడెఱుంగును? 20. ఉష్ణము తేజముదక్క మిగిలిన సమస్త స్థలములును జీవులకు వాసస్థలములు. కల్పనమువలనఁ బ్రాణులు జనించుచున్నవి. వీనినన్నింటిని ఎవ్వఁడెఱుం గును? 21. కొన్ని నానా ప్రకారములుగ సామర్థ్యములచే నిర్మింపఁబడు చున్నవి. కొన్ని ఇచ్ఛామాత్రమున నుత్పన్నమగుచున్నవి. కొన్ని మాట వెడలఁగనే శాపదేహమునొంది నశించుచున్నవి 22. కొన్ని గాంధర్వ దేహములు, కొన్ని గారుడదేహములు, కొన్ని దేవతాదేహములు నగు చున్నవి 23. కొన్ని దేహములు క్రోధమువలనను గొన్ని దేహములు తపమువలనను జనించుచున్నవి. కొన్ని శాపమోక్షమువలనఁ బూర్వదేహమును బడయుచున్నవి 24. భగవంతుని కృత్యములిట్లుం డును. ఎంతదనుకనని చెప్పఁగలను? విచిత్రమగు మాయాకారణమున నీ జీవజాలమేర్పడుటయు నశించుటయు జరుగుచున్నది 25. ఈ మాయ (ప్రకృతి) ఎప్పుడును, నెవ్వరుచూడనివియు, విననివియు నగు, నడ్డదిడ్డము లను గావించును. అదియొనరించు సమస్తచిత్రకళలను దెలిసికొనవలెను 26. జను లేకొంచెమో విద్యనేర్చికొందురు. ఉదరపూరణమున కుపక రించు చదువులను జదువుదురు. ఇంతమాత్రముననే వ్యర్థముగా మేము జ్ఞానులమైతిమని గరువించి నష్టులగుదురు 27. ఎవనియంతరాత్మ సర్వ జనులయందును వ్యాపించియున్నదో వాఁడే సర్వాత్ముఁడగుజ్ఞాని. ఆతని మహిమను గ్రహించుటకు బుద్ధియెంతదనుకఁ బనిచేయఁగలదు? 28. సప్తకంచుకము బ్రహ్మాండము. దానిలో సప్తకంచకము

పిండము. ఆ పిండములోఁగూడ నెన్నిప్రాణులు వసించుచున్నవో యెవ్వరెఱుంగుదురు ? 29. తనదేహస్థితియే తనకుఁ దెలియని మానవునకు సమస్తము నెట్లు తెలియఁగలదు ? కాని జనులు అల్పజ్ఞానము వలననే (సర్వజ్ఞులమని) గర్వించిపోవుదురు 30. అణురేణువునకు సమానముగనుండు స్వల్పప్రాణుల పాలిటికి మనము విరాట్పురుషులము. ఆ స్వల్ప జీవులతోఁ బోల్చిజూచినయెడల మనయాయువు మిగుల గొప్పదిగదా! 31. స్వల్పజీవుల ప్రవర్తనమనేకరీతులుగ, అనేకపద్ధతులుగ నుండును. వీనియన్నింటిస్థితిగతులను సమగ్రముగా నెఱింగిన వాఁడెవడు ? 32. పరమేశ్వరుని కృత్యమున కనేకవందనములు. అంతఃకరణమునం దాతని గూర్చి యనుమానముగూడ గలుగదు. పాపియగు అహంకర్తృత్వాభిమానము మానవులను వ్యర్థముగా నావరించుచున్నది 33. అహంభావము దొలగించి పరమేశ్వరుని యగాధకృత్యములను విచారింపవలయును. కాని యీ మహాత్కార్యము నెదుటనుంచుకొని చూచినచో మానవ జీవితము మిగుల కొద్దిది. అతఁడీపనికిఁ జాలఁడు 34. జీవితము స్వల్పము. దేహము క్షణభంగురము. శరీరము పతనమగుట కాలస్యముపట్టదు. ఐనను జనులు నిష్కారణముగ గర్వపడుచుందురు 35. ఈ దేహము మలినమగుతావున జన్మించినది. అంతియగాక మలినరసమువలననే పెంపొందినది. ఈ స్థితిలో జనులు దీనిని గొప్పదని యెట్లునుడువుచున్నారో గదా! 36. ఈ దేహము మలినము, క్షణభంగురమునై యున్నది. దీనిని వ్యధ లావరించి యున్నవి. చింత నిరంతరము వెన్నంటియున్నది. ఈ స్థితి యందుఁగూడ జనులు ఆలోచనారహితులై వ్యర్థముగా నీ దేహము గొప్పదని నుడువుచున్నారు 37. ఈ శరీరసంపత్తి రెండుదినముల బండారము. జీవితమునందు ఆదినుండి యంత్యము దనుక నెన్నియో చిక్కులంటుకొని యున్నవి. ఈ స్థితియందుఁగూడ జనులు డాంబికవేషములను ధరించి వ్యర్థముగ గొప్పతనము జూపుదురు 38. ఎన్ని మోసములు గావించినను జివరకవియెల్ల బయటఁబడును. బయటఁబడినపిదప నలుముఖములను దుర్గంధము బయలువెడలును. (అపయశస్సు వ్యాపించును.) కావున వివేకముతో సత్కార్యము లొనరించు పురుషుఁడే ధన్యుడు 39. వ్యర్థముగా డాంబికములను మోసములను నేలచేయవలెను ? అహం

భావపు గల్లోలము నాపివేయుము. వివేకముతోఁ బరమేశ్వరు నన్వేషించుట యన్నింటికంటెను మిగులమంచిపని 40.

## తొమ్మిదవ సమాసము – పిండోత్పత్తి.

నాలుగు విధములగు సృష్టులలోని (జరాయుజాదులు) సమస్త ప్రాణులును నీటివలననే వృద్ధినొందుచున్నవి. ఇవి యసంఖ్యాకముగ జనించి గతించుచున్నవి 1. పంచతత్త్వములచే నీ శరీరము నిర్మింపఁబడినది. దేహము ఆత్మననుసరించి వర్తించును. వాస్తవమున కీశరీరమునకు మూలము విచారించితిమేని జలరూపము 2. స్త్రీపురుషుల శరీరమునుండి జలరూపమగు వీర్యమువెడలి పరస్పరముగలియును 3. తరువాత అన్నరసము, దేహరసము, రక్తము, శుక్రము మున్నగువానివలన ఉండగట్టును. అనంతరమా రసద్వయపుటుండఁ జక్కఁగ వృద్ధినొందును 5. గర్భము పెరిగి దినక్రమమున వృద్ధినొందును. అది కోమలత్వము వదలి కఠినమగును. పిమ్మట సమస్తావయవము లందును జలము ప్రవేశించును. గర్భము సంపూర్ణమైనపిదప శిశువు వెలుపలకు వెడలును. భూమిమీఁదఁ బడఁగనే శిశువేడ్చును. ఇంతియే! అందటి శరీరములు అన్ని శరీరములు ఇట్లే నిర్మింపఁబడెను 6. దేహమువృద్ధినొందును. కుబుద్ధి వృద్ధినొందును. ప్రారంభమునుండి యంత్యమువరకు నంతయు జరుగుచుండును. చూచుచుండగనే దేహము పెరిగి పెరిగి నష్టమొందును 7. ఈ విధముగ శరీరములు దినక్రమమునఁ బెద్దవియైన గొలఁది కొంతకొంత యోచనశక్తి కూడ గలుగును 8. ఫలములోనికి బీజమువచ్చినట్లు మనుజులను జూచుచు వారిమాటల నాలించుచు నున్నకొలఁదిఁ సమస్తము ఎఱుకలోనికివచ్చును 9. జలమువలన బీజము లంకురించును. జలములేకున్నచో బీజములు నష్టమగును. మన్ను, జలము గలసినచో బీజము లంకురదశకువచ్చును 10. రెంటిలో బీజములుండుటవలన సహజముగఁ దడిసిన విత్తనమునుండి యంకురము వెలికివచ్చును. ఆయంకురము పెరిఁగినకొలఁది యూనఁదకరముగా నుండును 11. వేళ్ళు నేలలోనికిఁ బరుగిడును. చివరలు అంతరాళమునకును వ్యాప్తినొందును. మూలము, చివర, బీజమువలన నేర్పడినవే 12.

మూలము పాతాళమునకును, జివరలు అంతరాళమునకుఁ బ్రస రించి కొలఁది వృక్షమునకు ఆకులు, పూవులు, పండ్లు విస్తరించును 13. ఫలముల జనకస్థానము పుష్పములు. పుష్పముల జనకస్థానము పత్రములు. పత్రములకు జనకస్థానము వృక్షములు 14. వృక్షములజనకస్థానము సన్నని మూలములు [వేళ్లు]. మూలమునకు జనకస్థానము జలము. జల మెండిపోయినపిదపఁ పృథ్వియే శేషించును 16. ఇదియే యనుభవము. కావునఁ బృథ్వియే అన్నింటికిని జనని. పృథ్వికి జనకస్థానము "ఆపో నారాయణ స్వరూపము" 16. దానికి (ఆపోనారాయణ స్వరూపమునకుఁ) దండ్రి అగ్నిదేవుఁడు. అగ్నికి తండ్రి వాయువు. వాయువునకు జనక స్థానము స్వాభావికముగా అంతరాత్మ 17. ఈ విధముగ నన్నింటికి జనక స్థాన మంతరాత్మ. ఆ యంతరాత్మ నెఱుంగనివాఁడు దురాత్ముఁడు అనగా వాఁడు ఆత్మకు దూరముగా నుండును 18. ఇట్టి పురుషుఁడు దగ్గఱనున్ననుగూడ ఆత్మను మఱచియుండును. అతఁ డనుభవమును గడింపఁడు. అతఁ డంతరాత్మకారణముననే వచ్చును. అంతరాత్మ కారణముననే వెడలిపోవును 19. అన్నింటికిని జనకుఁడగు పరమాత్మునియెడ ననన్యభావము గలిగియుండినచో నీ ప్రకృతియొక్క స్వభావము మార్పు నొందును 20. (స్వభావము మార్పునొందినపిదప) తన ధ్యానసంగమును దానొనర్చును. ధ్యానభంగమెప్పుడును గలుగదు. మాటలాడుటయందుఁ గాని, నడుచుటయందుగాని వ్యంగ్యము రానీయఁడు 20. జనకునిచే నిర్మింపఁబడినదానినెల్లఁ దిలకింపవలెను. కాని యాతఁడు (జనకుఁడు) ఏమేమి నిర్మించునో వాని నెంతనిచూడఁగలము 22. ఏ పురుషునియందు ఆ పరమపిత (అంతరాత్మ) ప్రకాశించునో యతఁడే భాగ్యశాలి. ఆ పరమ పిత యెవని యందల్పముగాఁ బ్రకాశించునో యతఁడే అల్పభాగ్యశాలి 23. ఆ నారాయణమూర్తిని హృదయమునందిడి అఖండముగ ధ్యానము గావింపవలెను. ఇట్లొనరించినచో లక్ష్మి వానికడనుండి యెక్కడికిఁ బోవఁ గలదు? 24. నారాయణుఁడు విశ్వమునందంతటను వ్యాప్తమై యున్నాఁ డు. ఆతనిని బూజింపవలెను. అనఁగా అందఱిని సంతుష్టి పఱుపవలెను. అందఱిని సంతుష్టిపఱుచుటయన నారాయణమూర్తిని సంతుష్టిపఱచుటయే యని భావింపుఁడు 25. మనము ఉపాసనయొక్క యోగ్యత విచారించితి

మేని ఉపాసనయన విశ్వపాలిని యని తెలియవచ్చును. దానిలీల లగమ్యములు, ఎవ్వఁడు దానిని బరీక్షింపఁగలడు * 26. పరమాత్మునిలీలలు పరమాత్ముఁడుదక్క నితరుఁ డెఱ్ఱుంగఁగలడు? మనమెంతదనుకఁ జూచుచుంటిమో యది యంతయు మనకుఁ బరమాత్ముఁడుగనే గోచరించును27. ఉపాసన అన్నితావులయందున్నది. ఆత్మారాముఁ డెచ్చట లేఁడు? రాముఁడు ప్రతిష్ఠలమునందును నిండియున్నాఁడు. ఉపాసన, ఆత్మారాముఁడు, రాముఁడు అను నీ మూఁడును నొక్కటియే. ఇది సర్వవ్యాపకమైయున్నది 28. నా యుపాసన యిట్టిది. ఇది యనుమానములోనికి రాఁజాలదు. ఇది నిరంజనమునకుఁగూడ నావలితట్టునకుఁ గొనిపోవును 29. అంతరాత్మసంయోగముచేఁ గర్మలు జరుగును. అంతరాత్మసంయోగముచే ఉపాసను లేర్పడుదురు. అంతరాత్మసంయోగము వలననే యెందఱో జనులు జ్ఞానులగుచున్నారు 30. నానాశాస్త్రములు, నానామతములు అనునవి పరమేశ్వరునిచేఁ జెప్పబడినవె. నియమములు, అనియమములు, వ్యస్తములు, అవ్యస్తములు కర్మానుసారముగానగును31. పరమేశ్వరున కన్నియుఁ జేయవలెను. వానినుండి యెంతదీసికొనఁగలరో అంతియ తీసికొనవలెను. అధికారము ననుసరించి నడువవలెను 32. ఉపాసనయందు ఆవాహన, విసర్జన విధానములు మాత్రమె గలవు. (మాయయొక్క ఉద్భవసంహారముల విచారముమాత్రమె కలదు.) ఇంతదనుక బూర్వపక్షమే యైనది. ఉత్తరపక్షము (సిద్ధాంతము) దీనికిముందున్నది 33. వేదాంతము, సిద్ధాంతము రాద్ధాంతము(శాస్త్రప్రతీతి, గురుప్రతీతి, ఆత్మప్రతీతి) ఈ మూఁడింటిలో ఆత్మప్రతీతియొక్క ప్రమాణము ముఖ్యమైనది. పంచీకరణమును విడిచి హితకారకములగు మహావాక్యములనువాని యర్థమును యోజింపవలెను 34.

## పదియవ సమాసము — సిద్ధాంతనిరూపణము.

ఆకాశము నందంతయు జనించున్నది. నశించుచున్నది. కాని

* పరమాత్మునిసేవయే విశ్వసేవ, ఈ రెండు నొక్కటియే. పగమాత్మునిసేవను ఉపాసన మందురు. కావుననే ఉపాసన విశ్వపాలిని యైనది.

యాజనించునవియు, నశించునవియు నాకాశమువలె నిలచియుండుటలేదు. ఇట్లే నిశ్చలము (పరబ్రహ్మము) నందు చంచలము (మాయ) నానావిధములుగఁ గలిగి నశించుచున్నది. కాని యీమాయ పరబ్రహ్మమువలె నిశ్చలముగాదు 1. గాఢాంధకారము వ్యాపించి నపుడాకాశము నల్లగ గాన్పించును. సూర్యకిరణములు వ్యాపించి నపుడది పింగళవర్ణముగఁ గాన్పించును 2. మిక్కిలి చలిగా నున్నపు డాకాశము చల్లగానున్నట్లును, వేడిగాలి వీచునపు డాకాశ మెండిపోవునట్లును తోచును 3. ఇట్లు కనిపించుచుమార్పంతయు నిలుకడగా నుండదు. ఆకాశమువలె ఆమార్పు నిలుకడగా నుండుట యెప్పుడును సంభవముకాదు 4. ఉత్తమమగు జ్ఞాతృత్వవిషయమును జక్కఁగఁ దెలిసికొని చూడవలెను. ఆకాశమునిరాభాసము. భాసము మిథ్య 5. ఉదకము వ్యాప్తినొందుచున్నది. వాయువు వ్యాప్తినొందుచున్నది. ఆత్మగూడ నత్యంతముగా వ్యాప్తినొందుచున్నది. ఇంతయేల! సకలతత్త్వములును వ్యాప్తినొందుచున్నవి 6. చంచల నిశ్చలము లన్నియు అంతఃకరణమునకు దెలియును. విచారము చేయుట వలననే సమస్తము ప్రాణిమాత్రులకు విశదమగును 7. విచారమును జేయఁజేయ (మననము జేయుటవలన) సాధకు లంత్యమున నివృత్తిపదమునందు లీనులగుదురు. మఱల వియోగము గలుగదు 8. నివృత్తిపదమునందు జ్ఞానము విజ్ఞానమగును. మనస్సు ఉన్మనమగును. ఈవిధముగా వివేకముతోఁ దత్త్వనిరసన మొనరించిన పిమ్మట సాధకు లనన్యులగుదురు. జనకుని (అంతరాత్మను) శోధించి చూచినచోఁ జంచలము నిశ్చలమగును. ఆస్థితియందు దేవుడు, భక్తియనునది (ద్వైతోపాసన యనునది) వెడలిపోవును. అనన్యత కలుగును 10. అచ్చట తావు, నిశ్చలస్థానము (ఠికానా) మున్నగు పదార్థము లెవ్వియు లేవు. పదార్థమనునది లేనేలేదు. అందుఱు నెఱుంగుటకై ఎద్దియో యొకదానిని చెప్పుదురు 11. అజ్ఞానశక్తి నిరసనమైనంతనే జ్ఞానశక్తిగూడ లయమగును. వృత్తిశూన్యమైనపిదప నెట్టిస్థితిగలుగునో అప్పుడు చూడుఁడు 12. చంచలము (మాయ)యొక్క కోలాహలములేని స్థితికి ముఖ్య నిర్వికల్పసమాధి యనిపేరు. మాయయొక్క భ్రమ నాశనమైనపిమ్మట శాంత పురుషుఁడు నిర్వికారమగు శాంతము (పరబ్రహ్మము) నందు లీనమగును 13. వాస్తవ

మునకుఁ జంచలము వికారయుతము. కాని యీ చంచలము అచ్చట నుండఁజాలదు. నిశ్చలముతోఁ జంచలము కలిసియుండఁజాలదు 14. మహా వాక్యములను విచారించుటకు సన్న్యాసియే యధికారి. ఏ పురుషునిపై దైవమునకుఁ గృపగలదో యాతఁడుగూడ మహావాక్యములను విచారించును 15. సమ్యక్ప్రకారముగఁ ద్యాగముగావించు వానిని సన్న్యాసి యందురు. విచారవంతులగు పురుషులందఱును సన్న్యాసులే. మనవిహిత కృత్యములన్నియు నిశ్చయముగ మనవద్దనే యున్నవి 16. జగదీశ్వరుఁడు ప్రసన్నుఁడైన పిదప సందేహమింక నెక్కడనుండఁగలదు? ఈ విచారమును విచారశాలియగు పురుషుఁడే యెఱుంగును 17. (పరమార్థమును) దెలిసి కొనిన విచారవంతులు నిస్సంగు లగుదురు. దేహాభిమానులై యుండు వారలు దేహాభిమానమునే రక్షగావింతురు 18. అలక్ష్య (పరబ్రహ్మము) ధ్యానమునందుఁ గూర్చుండియున్నచోఁ బూర్వపక్షము (సందేహము)ఎగిరి పోవును. అంతియగాక హేతురూపమును, అంతస్సాక్షియునునగు ఆత్మ గూడఁ బరమాత్మయందు లయమగును 19. ఆకారము, పాతాళము అనునవి ఉభయాంతరాళముల పేర్లు. దృశ్యమును (పృథ్వియను తెఱను) మధ్యనుండి లాగివైచిన పిదప రెండును గలసి యొకటియగును 20. ఆకాశపాతాళములు రెండునుగలసి యొకటియే. కాని మనస్సు ఉపాధి ప్రక్కను ధ్యానమునుంచి చూచును. ఉపాధిని నిరసనముగానించిన పిదప భేదమెట్లుండగలదు? 21. అది (పరబ్రహ్మము) శబ్దమున కావలనున్నది. కల్పనమునకుఁగూడ నావలనున్నది. మఱియు మనోబుద్ధుల కగోచరముగా నున్నది. మనస్సునందు దీనిని విచారపూర్వకముగా బోధగావించుకొన వలెను 22. విచారము చేయఁజేయ విదితమగునుగాని విదితమగునదంతయు వ్యర్థముగఁ బోవును. (తెలిసెను అను నీ భేదజ్ఞానముండఁగాఁ దెలియుట వ్యర్థము.) ఇది యెన్నియో అడ్డదిడ్డములతోఁ గూడిన విషయము. దీని నెట్లు వివరించి చెప్పశక్యమగును? 23. మహావాక్యముల కర్థము, వాచ్యాంశ విచారము, ముగిసినపిదప వెడలు లక్ష్యాంశముగూడ అలక్ష్య మునందు (పరబ్రహ్మమునందు) లీనమగును. దానికిఁ దరువాతఁ జెప్పుట యనునది ఆగిపోవును 24. శాశ్వతమును శోధించుచుఁ బోవుచుండువాఁడు సత్యమగు జ్ఞానియగును. ఆతఁడు వికారమును విడిచి నిర్వికార(బ్రహ్మ)ము

నందుఁ గలిసిపోవును 25. సుషుప్త్యవస్థయందుఁ బెక్కు దుస్స్వప్న ములు గలుగును. మేల్కొనిన పిమ్మట నవియన్నియు మిథ్యలగును. మఱలనవి జ్ఞప్తికివచ్చినను మిథ్యయే 26. (ఒకసారి జ్ఞానముగలిగినపిమ్మట మఱల దేహమహత్త్వ ముండదు.) ప్రారబ్ధయోగానుసారముగ మఱల దేహముండినను లేకున్నను అంతఃకరణ విచారము అవశ్యముగ అచల మును స్థిరమునునై యుండును 27. బీజమును గాల్చినచో నది యింక మొలువఁజాలదు. అట్లే జ్ఞానియొక్క వాసనారూపమగు బీజముగూడ జ్ఞానాగ్నివలన దగ్ధమగును 28. విచారమువలన బుద్ధి నిశ్చల మగును. బుద్ధివలననే కార్యసిద్ధియగును. పెద్దల బుద్ధిని విచారించి చూచినచో నది నిశ్చలత్వము దనుఁక ప్రవేశించెనని విదితమగును 29. నిశ్చలమును ధ్యానిం చువాఁడు నిశ్చలుఁ డగును. చంచలమును ధ్యానించువాఁడు చంచలుఁ డగును. పంచభూతములను ధ్యానించువాఁడు భూతమగును 30. అంత మును బొందిన (బ్రహ్మప్రాప్తియైన) వానిని మాయ యేమియుఁ జేయఁ జాలదు. అంతర్నిష్ఠుల పాలికి మాయ యొకవిధమగు నింద్రజాలము 31. మాయ మిథ్యయను సంశే మెప్పుడు విదితమగునో మఱియు నెప్పుడు దాని మిథ్యాత్వభావన విచారము వలన దృఢమగునో అప్పుడు ఆకస్మిక ముగా భయమంతయు దూరమగును 32. మనము ఉపాసనపట్లఁ గృతజ్ఞత గలిగియుండవలెను. భక్తినిగూర్చి ప్రచారము గావించుచుండ వలెను. అంతఃకరణమునందు వివేకము గలిగి సమస్తమును దెలిసికొన వలెను 33.

పదునేనవ దశకము సమాప్తము.





# పదునాఱవ దశకము.

## మొదటి సమాసము – వాల్మీకిస్తుతి.

ఋషులలోఁ బుణ్యశ్లోకుఁడని పేరొందిన వాల్మీకిమహర్షికి నమస్కరించెదను. ఈ ముల్లోకములను బావనమొనరించిన యా మహానుభావునికి సాష్టాంగపడెదను 1. జరుగనున్న శ్రీరామజీవితమును (ఒకటి రెండుమాటలలోఁగాక) శతకోటిశ్లోకపరిమితిగల గ్రంథముగ రచించిన యిట్టిమహానుభావుఁ డీప్రపంచమున వేఱొక్కఁడులేఁడు. ఈ సృష్టినంతయుఁ గాలించి చూచినను వాల్మీకి మహర్షివలె భవిష్యత్తును గ్రంథమున సమకూర్చిన వాఁడింకొకఁడు గనుపింపఁడు 2. భవిష్యత్తును జెప్పినదానిలో నొక్కమాటయేని యొకవేళ నెప్పుడేని సత్యముగా జరిగినచోఁ బృథ్వీమండలములోని జనులందఱును నాశ్చర్యపడుదురు 3. రఘునాథునియవతారము కలుగకమున్నె వాల్మీకిమహర్షి శాస్త్రాధారములను గైకొనకయే రామకథను మహాగ్రంథముగ నొనరించెను 4. ఆతని వాగ్విలాసముల నాలించి మహేశ్వరుఁడు సైత మానందించెను. అనంతర మా జడదారి శతకోటిశ్లోకయుక్తమగు రామాయణము నీ ముల్లోకములలోఁ బంచిపెట్టెను 5. శంకరుఁడు వాల్మీకిమహర్షి కవిత్వమున కక్కజపడెను. సామాన్యులగు నితరమానవు లాతనికవిత్వమునుగూర్చి యనుమానింప నేర్తురా? రామాయణము పఠించుకతన శ్రీరామోపాసకులకుఁ బరమసమాధానము గలిగెను 6. ఎందఱెందఱో ఋషులు గతించిరి. పలువురు గ్రంథములను రచించిరి. కాని వాల్మీకికి సమానుఁడగు కవీశ్వరుఁ డింతదనుకఁ గలుగలేదు. ఇకఁ గలుగఁడు 7. వాల్మీకి తొలుత దుష్కర్మము లాచరించుచుండి యనంతరము శ్రీరామనామమును స్మరించి పావనుఁడయ్యెను. అతఁడు దృఢముగను, నియమపూర్వకముగను శ్రీరామనామమును జపించుటచే మేరలేని పుణ్యమును గడించెను 8. తల్లక్రిందుగ రామనామము జపించినందున నాతని పాపపర్వతములు చూర్ణమయ్యెను. మఱియు బుణ్యధ్వజము బ్రహ్మాండముపై రాజిల్లెను 9. వాల్మీకిమహర్షి తపముగావించిన

యరణ్యముగూడఁ బుణ్యాతిశయముచేఁ బావనమయ్యెను. ఆతని తపో బలముచే ఎండిపోయిన కొయ్యగూడఁ జిగిర్చెను 10. తొలుదొలుత వాల్మీకి విఖ్యాతజీవఘాతుకుఁడగు "వాల్యా" యనుపేరుగల కిరాతుఁడుగ నుండెను. ఆతని కిపుడు మహాపండితులు, ఋషీశ్వరులు నగువారలెల్లరు నమస్కరించుచున్నారు 11. నిగ్రహాశక్తియు, అనుతాపముగల మానవుని కడఁ బాప మెట్లు నివసింపఁగలదు? దేహాంతముదనుకఁ దపముగావించు టచే వాల్మీకిమహర్షికిఁ బుణ్యరూపమగు ద్వితీయజన్మ ప్రాప్తించెను 12. అనుతాపతప్తుఁడై సుస్థిరాసనాసీనుఁడై యున్నందున ఆతని దేహమునిండఁ బుట్టలుపెరిగెను. కాననే యాతనికి వాల్మీకియను పేరుగలిగెను 13. సంస్కృతమునందుఁ బుట్టను వల్మీకమని యందురు. తనపైఁ బుట్టలు పెరిగినందుననే వాల్మీకియను పేరేర్పడెను. ఆతని తీవ్రతపస్థితి విన్నంతన మహాత్ములగు ఋషులహృదయములు కంపించెను 14. ఋషిగణము నందు వాల్మీకి ఉత్తముఁడు. అంతియగాదు. ఆతఁడు కవులయందుగూడ నుత్తముఁడె. ఆతఁడు చెప్పునది స్పష్టమును, నిశ్చయాత్మకమును నై యున్నది 15. వాల్మీకి మహర్షి నిష్ఠావంతులకు మండనుఁడు. రఘు నాథునిభక్తికి భూషణము. ఆతని ధారణాశక్తి యసాధారణమైనది. సాధకుల నా మహాత్ముఁడు దృఢాత్ముల నొనర్చును 16. శ్రీ రఘువీర సమర్థుని (యాస్థాన) కవీశ్వరుఁడగు వాల్మీకిమహర్షికి ధన్యవాదములు. ఆతనికి సాష్టాంగభావముతో నమస్కారములు 17. ఒకవేళ వాల్మీకి మహర్షి రచించి ప్రకటింపక పోయినచో మనకు రామకథ యెట్లు తెలి యును? భక్తబృందమునకు రామకథ ప్రసాదించిన సమర్థుఁడగు నీ మహా త్ముని యెంతదనుకఁ గొనియాడఁగలము? 18. వాల్మీకి రఘునాథునికీర్తిని ప్రకటించెను. అందుచే నాతనిమహత్త్వము సైతము వృద్ధినొందెను. అంతియగాక రామకథాశ్రవణమాత్రమున భక్తమండలి సుఖియయ్యెను19. వాల్మీకిమహర్షి తనకాలమును సార్థకముగావించెను. రఘునాథునికీర్తి యందు మగ్నమయ్యెను. ఆతనివలన భూమండలమునందలి జనులెంద రెందఱో యుద్ధరింపఁబడిరి 20. రఘునాథస్వామి భక్తు లెందరెందఱో జనించిరి. నశించిరి. వారల మహిమ యపారము. నేను వారలందఱకుఁ గింకరుఁడనని రామదాసు నుడువుచున్నాఁడు 21.

## రెండవ సమాసము — సూర్యస్తుతి.

ఈ సూర్యవంశమునకు నమస్కరింతును. అన్నివంశములలో నీ సూర్యవంశము ప్రశస్తమైనది. సూర్యమండలప్రకాశము సమస్త భూమండలమునందును వ్యాపించినది 1. చంద్రునిదేహమునందు లాంఛనము గలదు. అతఁడొకపక్షమున క్షీణించును. సూర్యకిరణములు తనపయి సోఁకినంతన కళాహీనుఁడగును 2. ఇందుచేఁ జంద్రుఁడు సూర్యునకు సమానము గానేరఁడు. సూర్యప్రకాశముననే ప్రాణిమాత్రులకు వెలుతురు లభించుచున్నది 3. ఈ సృష్టియందలి ఉత్తమ మధ్యమాధములు సుగమదుర్గములు, ధర్మకర్మములు, నిత్యనియమములు మున్నగునవియెల్ల సూర్యునివలననే కలుగుచున్నవి 4. వేదశాస్త్రపురాణమంత్రయంత్రములు, నానాసాధనములు, సంధ్యాస్నానపూజలు, విధివిధానములు మున్నగు నేకర్మధర్మములైనను సూర్యభగవానుఁడు లేకున్నచో నెరవేరవు 5. అసంఖ్యాకములగు నానాయోగములు, నానామతములు సూర్యోదయానంతరము యథావిధిగ జరుగును 6. ప్రాపంచికమునకుగాని, పరమార్థమునకుఁగాని సంబంధించిన యేకార్యమైనను దినము లేనిచో సార్థకముగాదు 7. సూర్యుని యధిష్ఠానస్థానము నేత్రములు. నేత్రములులేనిచోఁ బ్రజలందఱును గ్రుడ్డివారె. కావున సూర్యుఁడు లేకున్నచో నేకార్యమైనను జరుగదు 8. సూర్యుఁడు లేకున్న కార్యములు జరుగుటలేదా? గ్రుడ్డివాంద్రు కవిత్వము చెప్పుచుండిరిగదాయని మా శ్రోత లందురేమో? ఇందులకుఁగూడ సూర్యుఁడే కారణము. ఏలయన! మనస్సు చల్లఁబడినచో నిఁక నెట్లు ప్రకాశించును? 9. ఉష్ణప్రకాశము సూర్యునిది. శీతప్రకాశము చంద్రునిది. ఉష్ణములేకున్నచో దేహము మరణించును 10. కావున సూర్యుఁడులేకున్నచో సులభముగ నేకార్యమైనను నడువదు. మీరలు విచక్షణులగు శ్రోతలు. యోచించి చూడుఁడు 11. హరిహరులకు, అనేకావతారములకును, శివశక్తికి, అనంతవ్యక్తులకుఁ బూర్వమునఁగూడ సూర్యుడుండెను. ఇప్పుడును నున్నాఁడు 12. ఎంతమంది యీలోకములోనికి వచ్చుచున్నారలో వారలందఱును సూర్యునిక్రిందనే వర్తించుచున్నారు. అంత్యమునందు సూ

ర్యుని యెదుటనే దేహత్యాగమొనర్చుచున్నారు 13. చంద్రుఁడు సూర్యునకుఁ జాలవెనుక జనించెను. క్షీరసాగరమునుండి మథించితీయఁబడిన నాలుగు రత్నములలోఁ జంద్రుఁ డొకఁడు. చంద్రుడు లక్ష్మికిఁజుట్టము 14. ఈ భాస్కరుఁడు విశ్వచక్షువని పెద్దలు, పిన్నలు అందఱు నెఱుంగుదురు. కావున దివాకరుఁడు ఉత్తములందఱికంటె మిగులనుత్తముఁడు 15. సూర్యుఁడు లోకోపకారార్థమై యపారమగు నభోమార్గభ్రమణము గావించుటకును నిత్యము వచ్చుచుఁ బోవుటకును సమర్థుఁడు (భగవంతుఁడు) కట్టడి చేసియున్నాఁడు 16. పగలే లేనియెడల విశ్వమంతయు నంధకారబంధురమగును. సారాసార మెవరికిని స్ఫురింపదు. పగలే లేకున్నచో దొంగలు, గ్రుడ్లగూబలు చేయుప్రచారము యథావిధిగ సాగును 17. సూర్యునకు సాటి యెవ్వరునుగారు. ఈ తేజోరాశి అవశ్యముగా నుపమానరహితుఁడు 18. సూర్యుఁడు రఘునాథునకుఁ బూర్వుఁడగుటవలన మనయందఱకుఁగూడ మిగులఁ బూర్వుఁడు. ఈతనిమహిమ యగాధము. మానవవాక్కుతో నీ సూర్యభగవానుని నెంతని కొనియాడగలము? 19. రఘునాథుని వంశమునందును (రామునకు) ముందును వెనుకను జనించిన రాజులందఱును ఒకరినొకరు మించినవారుగఁ బేరొంది గతించిరి. మందమతినగు నాకీ విచార మెట్లు తెలియును? 20. రఘునాథుని సముదాయమునందు నా యంతఃకరణము చిక్కుకొనియున్నది. కావున నాతని మహాత్త్వము వర్ణించుటకు నేను వాగ్దుర్బలుఁడను, అసమర్థుడనునై యున్నాను 21. సూర్యునకు నమస్కరించుటవలన దోషములన్నియుఁ దొలంగును. నిరంతరము సూర్యదర్శనము గావించుటవలనఁ దేజోబలములు పెంపొందును 22.

## మూడవ సమాసము - పృథ్వీస్తుతి.

ఈ వసుమతికి వందనములు. అనేకవందనములు. దీనిమహిమ నెంతదనుక గానముచేయఁగలను? ప్రాణిమాత్రులు దీనియాధారముననే వసించుచున్నారు 1. అంతరిక్షమునందుండు జీవులునై తము పృథ్వీకారణముననే నిల్చియున్నవి. ఏలయన, జడదేహములేనిచో జీవుఁ డెట్లుండఁ

గలఁడు? (జడత్వము పృథ్విలక్షణము) 2. జనులు పృథ్విని కాల్చు చున్నారు, దోకుచున్నారు, పొడుచుచున్నారు, దున్నుచున్నారు, చీల్చు చున్నారు, త్రవ్వుచున్నారు. మఱియు నీ పృథ్విపై మలమూత్రములు, వమనము విడచుచున్నారు 3. క్రుళ్ళిన, పాసిన, జీర్ణించిన పదార్థములకుఁ బృథ్విపైఁ దక్క మఱియెక్కడ సహాయముగలదు? దేహాంతకాలము నందు శరీరముగూడ భూమిమీదనే పడును 4. మంచిచెడ్డల కన్నిఁటికిని బృథ్విదక్క సహాయస్థానము వేఱొక్కటి లేదు. నానావిధధాతువులు, ద్రవ్యములుగూడ నీ పృథ్విగర్భమునందే యున్నవి 5. ఒకప్రాణి నింకొక ప్రాణి యీ పృథ్విమీఁదనుండియే సంహరించుచున్నది. భూమిని విడిచి నచోఁ బోవఁదగిన తావెచటనున్నది? 6. ఈ యంశము * గడములు, కోటలు, పురములు, పట్టణములు, నానాదేశాదిస్థానములు పర్యటనము గావించినచో విశదమగును. దేవతలు, దానవులు, మానవులు మున్నగు వారలందఱును బృథ్విమీదనే వసించుచున్నారు 7. నానారత్నములు, వజ్రములు, స్పర్శవేది, నానావిధ ధాతువులు, ద్రవ్యములు మున్నగునవి పృథ్విలేకున్నచో గుప్తములు, ప్రచురములు కాఁజాలవు 8. మేరుమందర హిమాలయాదులగు అష్టకులాచలములును, మఱియుఁ బక్షి మత్స్య సర్పాది జీవులును భూతలమునందే వసించుచున్నవి 9. నాలుగు దిశలను ఆవరణ జలముతో నిండిన నాలుగుసముద్రము లావరించియున్నవి. వానికవ్వలి గట్టునఁగల భూమిపై నత్యద్భుతములగు మహాపర్వతములు పగిలియున్నవి 10. ఆ శైలములయందుఁ జిన్నవి, పెద్దవియగు గుహ లపారముగానున్నవి. ఆగుహలు నిబిడాంధకారబంధురములుగ నున్నవి 11. ఆవరణ జలపార మెవ్వడెఱుంగును? అద్భుతములు, మహత్తరములునగు జలచరము లందు నిండియున్నవి 12. ఆ జలమునకు వాయువాధారము. నిబిడమును, గాఢమునై పేరుకొన్న యీ జలము ఏ దిశనుండియు భేదింప వీలుగాదు 13. కఠినత్వరూపమగు నహంకారము ప్రభంజనునకు ఆధార ముగ నున్నది. ఈ విధముగనున్న విచిత్రతరమగు భూగోళపుమేర నెవఁడు

* గడములు: సింహగడము, రాయగడము మొదలగునవి. కోటలు: అకలుకోట: రాజకోట మున్నగునవి. పాలెము: పల్లె, పాడు మున్నగుగ్రామనామముల కివి మహా రాష్ట్రమునఁ బర్యాయపదములు.

దాటగలఁడు? 14. నానాపదార్థవంతములగు గనులు, ధాతురత్న కలిత ములగు స్థలములు, కల్పతరువు, చింతామణి, అమృతకుండము, నానా ద్వీపములు, నానాఖండములు, పెక్కు నగరములు, మఱియు నానా ప్రకారములగు జీవులు, ప్రత్యేక జీవిత వ్యతీతపద్ధతిలో నివసించు ఊషర క్షేత్రములు, ఆ సముద్రప్రాంతములఁ గలవు 15, 16. మేరువునకుఁ జుట్టుప్రక్కలఁ బర్వతములు పగిలియున్నవి. అచ్చట నద్భుతముగాఁ జీఁకటి వ్యాపించియున్నది. నానావిధములు, నిబిడములునగు వృక్షము లచట నెన్నియో గలవు 17. అచటనే లోకాలోకపర్వతము గలదు. అచట సూర్యుని చక్రము తిరుగుచుండును. చంద్రాద్రి, ద్రోణాద్రి మైనాకములను పేరులుగల మహాగిరులు సైత మచటనే యున్నవి; 18. అనేక దేశజములగు నానాపాషాణభేదములు, నానావిధములగు వృత్తిభేద ములు, నానాగుప్త నిధానములు విభూతులు, నానాఖనులు మున్నగునవి యెల్ల నీ భూమండలమునందె గలవు 19. వసుంధర బహురత్నమయి, భూమికి సమానమగు పదార్థ మెద్దియు లేదు. నాలుగు దిశలను మేరలేక యీ భూమండలము వ్యాపించియున్నది 20. ఈ సమస్త ధరణీతలము నందంతటను జరింపఁగలప్రాణి యెవ్వఁడు? ఈ పృథ్వి కెద్దియుఁ దుల్యము గాదు 21. బహువిధములగు నిరుపమానలతలు, నానావిధములగు సస్యాదులు ఈ పృథ్విమీదనే యున్నవి 22. స్వర్గ మర్త్య పాతాళములను నీమూఁడులోకములు సృష్టికర్తచే నత్యద్భుతముగ సృజింపఁబడెను. పాతాళలోకమునందు గొప్పగొప్ప నాగములు, సర్పములు వసించు చున్నవి 23. ఈ విశాలమగు భూమండలమే నానాలతలకును, బీజము లకును గనియైయున్నది. కర్తయగు భగవానుని కృత్యము మిగులఁ జిత్రమై నది 24. మనోహర దుర్గములు, కోటలు, బహువిధ నగరములు, పుర ములు, పత్తనములు మున్నగు నన్నిస్థానములందును జగదీశ్వరుఁడు వసించుచున్నాఁడు 25. ఎందఱో బలవంతులు జనించి గతించిరి. వార లీ పృథ్విపై మిగులఁ గ్రోధకర్మము లొనరించిరి. కాని వారలు తమ శక్తి సామర్థ్యములచే నీ పృథ్వికి వేఱుగ నుండలేకపోయిరి 26. ఈ పృథ్వి మిగుల విశాలమైనది. బహువిధ జాతులుగల జీవులీ భూమిపై వసియించు చున్నవి. భూమండలమునందలి యవతారములకు నా నా భేదములు

గలవు. 27. ఈ యంశము ప్రత్యక్షముగా నిపుడు సైతము కనిపించు చున్నది. అనుమానింపవలసిన యావశ్యకములేదు. నానాప్రకారములగు జీవితము లీపృథ్వి యాధారముననే గడచుచున్నవి 28. ఈ భూమి నాయదియని ఎందఱో యనుచుందురు. కాని యంత్యమునందు నాది యనువారె గతింతురు. పృథ్విమాత్ర మనంతకాలమునుండి యథావిధ ముగ నున్నది 29. పృథ్విమహిమ యిట్టిది. దీని కెద్దియును సాటిగాదు. బ్రహ్మాదిదేవతలు మొదలు మనుష్యులు దనుక నీ భూమండలమే యాశ్రయస్థానముగా నున్నది.



## నాలుగవ సమాసము — జలస్తుతి

ఇక నిపుడు సమస్తమునకు జన్మస్థానమును సమస్త జీవులకు జీవనమును "ఆపోనారాయణస్వరూప" మనఁబడునదియు నగు జలమును గూర్చి చెప్పెదను 1. పృథ్వి కావరణోదక మాధారము. సప్తసముద్రముల జలము, నానా మేఘోదకము ఈ పృథ్వియందుఁ బ్రవహించుచుం డును 2. అనేక దేశములం దెన్నెన్నియో నదులు ప్రవహించి సముద్రములోఁ గలియుచున్నవి. కొన్ని నదులు పెద్దవి. కొన్ని నదులు చిన్నవి. కొన్ని పవిత్రములు. వాని మహిమ యగాధము 3. నదులు పర్వతముల నుండి బయలుదేరి నానాదరీకుహరములలోఁ బ్రవహించుచు హర్ హర్, ఖడ్ ఖడ్ యని ధ్వని యొనర్చుచు నెంతయోదూరము బోవుచున్నవి 4. కూపములు, భావులు, నీటిబుగ్గలు, గొప్పతటాకములు, మున్నగు ననేక జలస్థానము లన్నిచోటులందును గలవు. వానిలో నిర్మలమగు జలము నిండియున్నది 5. తుంపురు లాకాశమునకు బలముగా నెగయుచున్నవి. ఎన్నియో కాలువలు బారుచున్నవి. మఱియుఁ దనంత నీరు పైకుబుకు నీటిబుగ్గలనుండి జలము బ్రవహించుచున్నది 6. కొన్ని తావులఁ గూపములనుండియు నీరు వెల్లివిరియుచున్నది. పర్వతములను బగులగొట్టుకొని నీరు ప్రవహించుచున్నది. ఇట్లు భూమండలమునందు జలమున కనేక భేదములు గలవు 7. అనేక పర్వతములనుండి యెన్నియో జలధారలు శిలలను జీల్చుకొని బయలుదేరుచున్నవి. వానితో

బుగ్గలు, నదులు, కాలువలుగూడ వెడలుచున్నవి 8. భూమండలము నందలి జలము నెంతని వర్ణింపగలను? నానావిధములగు తుంపురుల నెగఁజల్లు నీటిగొట్టములలోనికిఁగూడ నీటిని బంధించికొని తెచ్చుచున్నారు 9. (జలాశయములు) మడుగులు, గుంటలు, గాబులు, గంగాళములు మున్నగు వానియందేగాక నానాగిరికందరములయందుగూడ జలము నిండి యున్నది. అనేక లోకములలో నానావిధములగు జలములుండును 10. ఒకదానికంటె నొకటి యెక్కుడుగఁ బవిత్రములగు పుణ్యతీర్థము లీపృథ్విపై నెన్నియోగలవు. శాస్త్రకారు లాయాతీర్థముల యగాధ మహిమలను బ్రశంసించి యున్నారు 11. నానాతీర్థములలోని పుణ్యోదకములు, నానాస్థలములయందలి శీతలోదకములు, నానాక్షేత్రముల యందలి ఉష్ణోదకములు ప్రతిస్థలమునందును గలవు 12. పలుతెఱంగులుగఁ గనుపించు తీఁగలలో జలమున్నది. పలుతెఱంగులుగ నున్న ఫలములందును కుసుమములందును జలమున్నది. ఇంతయేల! నానావిధములగు కందమూలములలో సైతము జలమున్నది. ఈ జలములన్నియు గుణకారకములై యున్నవి 13. క్షారోదకము, సింధూదకము, విషోదకము, అమృతోదకము మున్నగు నుదకములు నానాస్థలములలో నానాగుణ యుక్తములుగ నున్నవి 14. నానావిధములగు ఇక్షురసము, నానావిధములగు ఫలరసము, నానావిధములగు గోరసము, మదము, పాదరసము, గుడరసము మున్నగు రసములన్నియు నుదకమే 15. నానాముక్తాఫలములందలి జలము? నానారత్నములందు మెఱయు జలము, నానాశస్త్ర జలము మున్నగు జలములు నానాగుణ యుక్తములుగ నుండును 16. వీర్యము, రక్తము, చీము, మూత్రము, స్వేదము మున్నగునవిగూడ ఉదకభేదములే. ఈ యంశము యోచించిచూచినచో బాగుగ విశదమగును 17. ఈ దేహముదకముతో నిండియున్నది. భూమండలముగూడ నుదకమయమే. చంద్రమండలము, సూర్యమండలము ఉదకముతో నిండియున్నవి 18. క్షారసముద్రము, క్షీరసముద్రము, సురసముద్రము, ఘృతసముద్రము, దధిసముద్రము, ఇక్షురససముద్రము, శుద్ధోదక సముద్రములుగూడ జలమయములె 19. ఇట్లు మొదటినుండి తుదిదనుక జలము వ్యాపించి యున్నది. మఱియు మధ్యమునందు సైతము జలముగలదు. కొన్నితావుల

గుప్తముగనున్నది 20. నీరే బీజములందు మిశ్రితమగునో యా బీజముల స్వాదునే గ్రహించి ప్రసిద్ధమగును. చూడుఁడు. చెఱకులోనుండి రుచ్యమగురసము జలము గైకొనుచున్నది 21. ఈ దేహ ముదకముచే నిర్మింపఁబడెను. నిరంతర మీ దేహమునకు ఉదకమేగావలయును. ఉదకమునకు సంబంధించిన ఉత్పత్తివిస్తారముల నెంతదనుక వివరింపఁగలను 22. ఉదకము తారకము. ఉదకము మారకము. ఉదకము నానాసుఖదాయకము విచారించిచూచినచో నది లోకాతీతమని (అలౌకికమని) విదితమగును 23. ఉదకము భూస్థలమునఁ బరుగులిడును. దానినుండి నానావిధములగు మనోహరధ్వనులు వెడలును. పెద్దపెద్దజలధారలు హహర్, హహర్ అను ధ్వనితోఁ బడుచుండును 24. ప్రతిస్థలమునందలి జలమును బరస్పరము గలిసికొని తటాకములలో నిండును. అంతియగాక నదులు, కాలువలు మర్మరధ్వనితోఁ బ్రవహించును 25. ఒకానొకచోట గుప్తగంగఁ బ్రవహించును. ఉదక మన్నితావులందును బ్రత్యక్షముగ నున్నది. ఒకానొక యెడ భూగర్భమున నున్న జలము ఘుట్ ఘుట్ అనుధ్వనితో బుగ్గలనుండి ప్రవహించును 26. భూగర్భమునందు బుగ్గ లెన్నియో గలవు. వాని వృత్తాంతము విన్నవారుగాని, కన్నవారుగాని లేరు. కొన్ని తావులలోఁ బిడుగులుపడుటచే బుగ్గ లేర్పడెను 27. భూమినిండను, భూమిలోనను జలము నిండియున్నది. పృథ్వికిఁ బైభాగమునఁగూడ జలము వాయు రూపముతో వ్యాపించియున్నది 28. స్వర్గ మర్త్య పాతాళములలో నొక్క నదియున్నది. మేఘసముదాయము ఆకాశమునుండి జలము వర్షించుచుండును 29. పృథ్వికి మూలము జలమె. జలమునకు మూలము అగ్ని. అగ్నికిమూలము వాయువు. వాయువు భూతములలో మిగుల గొప్పది 30. వాయువుకంటెను గొప్పవాఁడు పరమేశ్వరుఁడు. పరమేశ్వరు నుండియే మహద్భూతవిచార ముత్పన్నమయ్యెను. పరమేశ్వరునికంటెను, అన్నింటికంటెను గొప్పవాఁడు పరాత్పరుఁడగు పరబ్రహ్మము 31.

## ఐదవ సమాసము — అగ్నిస్తుతి.

అగ్నిహోత్రునకు వందనములు. ఈతఁడు రఘునాథునకుఁ గన్యాదాతయగుమామ. అగ్నిదేవుఁడు విశ్వవ్యాపకుఁడు, విశ్వంభరుఁడు నైయు

న్నాఁడు. జానకీదేవి కగ్నిహోత్రుఁడు తండ్రి 1. భగవానుఁ డీ యగ్ని ముఖమునుండియే ఆహారమును గ్రహించును. ఋషులకీతఁడే ఫలదాయకుఁడు. ఈ యగ్నిభట్టారకునివలననే అంధకారము, శీతము, రోగము హరించును. జగత్తులోని మానవుల నీ యగ్నిహోత్రుఁడే భరించుచున్నాఁడు. మఱియుఁ బోషించుచున్నాఁడు 2. లోకములో నానా వర్ణములు, నానాభేదములుగలవు. కాని యగ్ని జీవమాత్రులకెల్లరకు సమానుఁడై యున్నాఁడు. బ్రహ్మాదులకుఁగూడ నాతఁడు భేదరహితుఁడుగఁ బరమశుద్ధుఁడుగ నున్నాఁడు 3. ఈ సృష్టి యగ్నివలననే నడుచుచున్నది. అగ్నివలననే జనులుష్ణమును బడయుచున్నారు. అగ్నివలననే చిన్నపెద్దలందఱును జీవించుచున్నారు 4. అగ్నిహోత్రుఁడే యీ భూమండలమును నివాసయోగ్యముగ సృజించెను. ప్రతిస్థలమునందును, దీపములు, దీపికలు నానావిధజ్వాలలు, అగ్నిహోత్రునివలననే యేర్పడెను 5. గర్భమునందున్న జఠరాగ్నివలననే జనుల కాకలికలుగును. అగ్నివలననే భోజనమునందలి రుచి తెలియును 6. అగ్నిసర్వాంగము లందును వ్యాపించియున్నది. జనులందఱును ఉష్ణమువలననే జీవించుచున్నారు. ఉష్ణతలేకున్నచో జనులు మరణింతురు 7. అగ్ని మందమైనంతన ప్రాణులు మరణింతురను నంశము లోకులందఱెఱింగినదె 8. అగ్నిబలమున్నచోఁ దత్కాలముననే శాస్త్రవాదములందు జయము లభించును. ఎంతదనుక నగ్నియుండునో అంతదనుకనే జీవితము 9. నానావిధరసము లగ్నివలన నిర్మింపఁ బడుచున్నవి. ఆ రహస్యములను బుచ్చుకొనుటచే మహారోగు లారోగ్యవంతు లగుచున్నారు 10. సూర్యుఁ డన్నింటికంటెను గొప్పవాఁడు. కాని యగ్నిదేవుని ప్రకాశమహిమ సూర్యప్రకాశముకంటె నధికమైనది. రాత్రులందు జను లగ్నిసహాయముగఁ గైకొనుట మనము ప్రత్యక్షముగఁ జూచుచున్నారముగదా! 11. శూద్రునియింటియగ్నిని దెచ్చుకొనినను దోసము లేదని పెద్దలుచెప్పిరి. అందఱిగృహములలోని యగ్నియుఁ బవిత్రమైనదే 12. నానాయాగములు, అగ్నిహోత్రములు విధిపూర్వకముగ నగ్నివలననే జరుగుచున్నవి. అగ్ని తృప్తినొంది సుప్రసన్నుఁడగును 13. దేవతలు దానవులు, మానవులు అగ్నిసహాయముననే వర్తించుచున్నారు. అగ్ని యందఱకును సహాయమైనది 14. గొప్పగొప్పవారలు వివాహముచేయు తఱి

నానాప్రకారములగు అగ్నికౌతుకులను (బాణసంచాకాల్చువారిని) గొని పోవుదురు. అగ్ని క్రీడలవలననే మహోత్సవములకు శోభవచ్చును. 15. రోగు లుష్ణౌషధములను సేవించి యగ్నివలన సౌఖ్యములు బడయు దురు 16. బ్రాహ్మణులకు ముఖ్యులగు పూజనీయులు సూర్య భగ వానుఁడు, హుతాశనుఁడే. ఇందు సందియములేదు 17. జనులలో జఠ రానలముగలదు. సాగరమునందు బడబానలముగలదు. భూగోళమునకు నలుదిక్కులందును ఆవరణానల మున్నది. శివునినేత్రమునందును విద్యుల్ల తలయందును అగ్నికలదు 18. కాంశ్యపాత్రమునుండియు ఆగ్నేయ దర్పణమునుండియుఁ గట్టెలను ఒరయుటవలనను చెకుముకిరాతి నుండియు అగ్నిజనించును 19. అగ్ని యన్నితావులను గలదు. కఠినముగ రాపిడి యొనర్చినచో అగ్నిజనించును. అగ్నిసర్పములవలన గిరికందరములుగూడ భస్మమగును 20. అగ్నితో నెన్నియో ఉపాయములు గావించుచున్నారు. అంతియగాక బహువిధములగు హోనులుసైతము కలుగును. వివేకము లేనిచో అంతయు నిరర్థకము 21. భూమండలమునందలి పిన్న పెద్దలంద ఱకును అగ్నియే యాధారము. పరమేశ్వరుఁ డగ్నిముఖముననే సంతుష్టి నొందును 22. అగ్నిహోత్రుని మహాత్త్వమిట్టిది. దీని నెంతదనుక వర్ణిం చినను అసమగ్రమె. అగ్నిపురుషుని మహిమ లోకమునకుదిగిన కొలఁది అగాధముగా నుండును 23. అగ్ని జీవితకాలమున సుఖము నొసంగును. చనిపోయినపిదప శవమును భస్మమొనరించును. అది సర్వభక్షకము. దాని ఘనత నెంతదనుక వర్ణింపగలము? 24. సమస్తసృష్టిని ప్రళయకాలమునం దగ్ని సంహరించును. అగ్నిహోత్రుని బారిని బడిన పదార్థమేదియు దక్కదు 25. అనేకులనేకవిధముల హోమమొనర్తురు. ఇంటింటను బలియు వైశ్వదేవము జరుగుచుండును. క్షేత్రములలో దేవతా విగ్రహముల ముందు దీపముల వెలిగింతురు 26. దీపారాధనముతో, నీరాజనముతో భక్తులు భగవంతునకు హారతులిత్తురు. కాఁగుచున్న గంగాళములోని చమురునందు చేయియుంచి జనులు సత్యాసత్యములు వెల్లడింతురు 27. అష్టధాప్రకృతి, ముల్లోకములు, మున్నగువాని యన్నింటి యందును అగ్ని వ్యాప్తమైయున్నది. అగ్నిదేవుని యగాధమహిమ నెంతదనుక వర్ణిం పఁగలను? 28. అగ్నికి నాలుగు శృంగములు, మూఁడుపాదములు, రెండు

తలలు, ఏడుచేతులు ఉన్నవని శాస్త్రములందుఁ జెప్పఁబడినది. ఇది యను భవము లేకే చెప్పఁబడినదా? 29. ఉష్ణమూర్తియగు అగ్నిదేవుని నేను యథామతిని వర్ణించితిని. న్యూనాధిక్యములకు శ్రోతల క్షమింపఁ గోరెదను 30.

---

## ఆఱవ సమాసము — వాయుస్తుతి.

వాయుదేవున కనేకవందనములు. వాయుదేవుని స్వభావము మిగులఁ జిత్రమైనది. వాయువువలననే జగమునందు సమస్తజీవులు వర్తించుచున్నారు 1. శ్వాసోచ్ఛ్వాసములు వాయువువలననే జరుగుచున్నవి. నానావిద్యలు వాయువు వల్లనే అభ్యసింపఁబడుచున్నవి. శరీరములందు జలనము (చేతనము) వాయువువలననే కలుగుచున్నది 2. చలనము, వలనము, ప్రసారణము, నిరోధనము, అకుంచనములు. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానములు, నాగకూర్మ కృకర దేవదత్త ధనంజయములు మున్నగునవి వాయువునకుఁ గలస్వభావభేదములు 3, 4. తొలుత వాయువు బ్రహ్మాండమునఁ బ్రకట మయ్యెను. తరువాత బ్రహ్మాండమునందును దేవతలయందును నిండి నానాగుణములనొంది పిండమునందుఁ బ్రకటమయ్యెను 5. స్వర్గమునందలి దేవతలందఱును, పురుషార్థులగు దానవులును, మర్త్యలోకములోని మానవులును, విఖ్యాతులగు రాజులును; యిట్టివేయగు నరదేహ భేదములును, అనంత ప్రకారములగు శ్వాపదములును, వనచర, జలచరాదులును వాయువువలననే ఆనందముగాఁ గ్రీడించుట తటస్థించినది 6, 7. వానియన్నిటియందును గాలి యాడుచున్నది. పక్షులన్నియు వాయువు వలననే యెగురుచున్నవి. అగ్నిజ్వాలలు వాయువువలననే హెచ్చుచున్నవి 8. ఆకాశమునందున్న మేఘములన్నింటిని వాయు వొకతావునకుఁ జేర్చుచున్నది. మఱలఁ దత్క్షణమె వేఱువేఱుగావించి తొలఁగఁ ద్రోయుచున్నది. వాయువుతో సమానమగు కార్యదక్షతగలది వేఱొండు లేదు 9. వాయువు ఆత్మయొక్క సత్త. అది దేహమునందు వర్తించుచున్నది. వ్యాపకత్వమున వాయువునకు సమానమైనది ప్రపంచమున

లేదు 10. వాయువుబలమువలననే పర్వతములమీదనుండి దట్టమగు మేఘసైన్యము లోకహితార్థమై యుదయించు చున్నది. మఱియు వాయుబలముననే ఉరుము లురిమి పిడుగులు పడుచున్నవి 11. ఈ బ్రహ్మాండమునందుఁ జంద్రుడు సూర్యుఁడు నక్షత్రమాల గ్రహమండలము మేఘమాల, నానాకళలు వాయువువలనే నెలకొనియున్నవి 12. ఎన్నియో కలసియున్న పదార్థములొక్కటిగ నున్నచో విభజింప వీలు చిక్కదు. అట్లే పంచభౌతికపరిణామముగూడ భేదింప నవకాశము గలుగదు 13. వాయువు సరసర వీచుచుండును. వడగండ్లు పడుచుండును. మఱియు వర్షమువెంట నెన్నియో జీవములు పడుచుండును 14. వాయురూపమగు కమలకళయే జలమున కాధారము. జలాధారమువలననే శేషువు భూమండలము ధరించియున్నాడు 15. శేషుని కాహారము వాయువు. వాయుభోజనముచే దేహముబ్బి యున్నప్పుడు భూమండలము నాతఁడు తనపై ధరించుచున్నాడు 16. మహాకూర్మదేహము బోరగిలఁబడిన బ్రహ్మాండమువలె నుండును. దీనివలన మహాకూర్మదేహ మెంతగొప్పదో తెలిసికొనవచ్చును. అదిగూడ వాయుసంయోగముననే నిల్చియున్నది 17. భూమండలమును ఆదివరాహము తనకోరపై ధరించెను. ఆశక్తి వాయుకారణముననే దానికి లభించెను 18. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు జగదీశ్వరుఁడు గూడ వాయు స్వరూపములందె యున్నారు. ఈ విచారమును వివేకులే యెఱుంగుదురు 19. ముప్పదిమూఁడు కోట్లదేవతలు, ఎనుబదినాలుగు వేలఋషులు, అసంఖ్యాకులగు సిద్ధయోగులు మున్నగువారందఱును వాయువువలననే నిలిచియున్నారు 20. తొమ్మిదికోట్ల కాత్యాయనీదేవతలు, ఏఁబది యారుకోట్ల చాముండీశక్తులు, మూడున్నర కోట్లభూతగణము వాయురూపముననే యున్నవి 21. భూతములు, దైవతములు, నానాశక్తుల వ్యక్తివిశేషములు వాయురూపములే. మఱియు భూమండలమునందలి నానావిధజీవులు వాయువువలన నెన్ని కలుగుచున్నవో యెవ్వరెఱుంగుదురు? 22. వాయువు పిండబ్రహ్మాండములలో నిండియున్నది. బ్రహ్మాండమునకు వెలుపలఁగూడ నది వ్యాపించియున్నది. సామర్థ్యవంతమగు నీ వాయువు అన్నితావులందును బరిపూర్ణముగా నున్నది 23. వాయువు మిగుల సమర్థమైనది. తనతనువును, మనమును రఘునాథస్వామి

శరణమునందు మగ్నమొనరించిన హనుమంతుఁడీ వాయుదేవుని పుత్రుఁడే 24. హనుమంతుఁడు వాయుదేవునకుఁ బ్రసిద్ధ కుమారుఁడు. తండ్రి కుమారులలో భేదము లేదు. ఈ యుభయుల పురుషార్థములును సమముగానున్నవి 25. హనుమంతునిఁ బ్రాణనాథుఁ డందురు. వాయుకారణముననే యాతఁడు సమర్థుఁ డయ్యెను. వాయువులేనిచో నంతయు వ్యర్థమే 26. పూర్వకాలమున హనుమంతునకు మృత్యువాసన్నమయ్యెను. వాయు వపుడు రుద్ధమయ్యెను. అందుచే దేవతలందఱికి బ్రాణాంతకావస్థ గలిగెను 27. దేవతలందఱును గలిసి వాయుదేవుని స్తుతింపఁగా వాయుదేవుఁడు ప్రసన్నుఁడై యందఱను రక్షించెను 28. మహాప్రతాపశాలియగు హనుమంతుఁ డీశ్వరావతారము. దేవగణ మీతని బురుషార్థమును జూచుచుండును 29. దేవతలు కారాగృహమున నిర్బంధింపఁబడుట హనుమంతుఁడు ఆకస్మికముగఁ జూచి లంకకుఁ జట్టుప్రక్కల సంహారక్రీడ విజృంభింపఁజేసి రాక్షసులకు దుర్దశ గలిగించెను 30. దేవతలకుఁ బ్రతీకారము రాక్షసులనుండి గైకొనెను. రాక్షసకులమును మూలమట్టముగా నాశనమొనరించెను. ఆపుచ్ఛకేతుని లీలలు మిగుల నాశ్చర్యకరములుగ నుండును 31. రావణుఁడు సింహాసనము నధిష్టించియున్నపుడు అచటికేగి హనుమంతుఁడు నిందించెను. లంకకుఁ బోవునపు డాతనిని సముద్రముసైత మాటంకపఱుపలేక పోయెను32. దేవతలకు ఆంజనేయుఁ డాధారమయ్యెను. ఆతని మహాపరాక్రమమును గాంచి దేవతలు రఘునాథుని స్తుతించిరి 33. సమస్తదైత్యులను హనుమంతుఁడు సంహారమొనర్చెను. తత్కాలముననే దేవతల నుద్ధరించెను. త్రిలోకము లందలి ప్రాణివర్గము యిందుచే సుఖమొందెను 34.



## ఏడవ సమాసము — మహాద్భూత నిరూపణము.

పృథ్వికి మూలము జలము. జలమునకు మూలము అగ్ని. అగ్నికి మూలము వాయువు. ఈ విషయమగు వర్ణన మింతకు మున్నొనర్చితిని 1. ఇపుడు పవనమునకు మూలమును, అన్నింటి యందత్యంత చంచలముగ వర్తించునదియు నగు అంతరాత్మ వర్ణనము నాలింపుఁడు 2. అంతరాత్మ

వచ్చుచున్నపుడు గోచరింపదు. ఒకచోట స్థిరముగాఁ గూర్చుండియుండదు. దానిస్వరూప మిట్లుండునని వేదశ్రుతులునైతము అనుమానింపలేకున్నవి 3. బ్రహ్మమునందుఁ దొలుత గలుగుస్ఫురణమే అంతరాత్మ లక్షణము. అదియే జగదీశ్వరుఁడు. త్రిగుణములు దానివలననే కలిగెను 4. త్రిగుణములనుండి పంచభూతము లేర్పడెను. పిదప నవి సృష్టిరూపముతో విస్తృతమయ్యెను. వివేకముతో నా భూతముల స్వరూప మెఱుంగవలెను 5. ఈ పంచభూతములలో ముఖ్యమైన దాకాశము. ఇది తక్కిన నాలుగు భూతములకంటెను శ్రేష్ఠమైనది. దీని ప్రకాశముననే అన్నియుఁ బ్రకాశించుచున్నవి 6. విష్ణువే యొక మహద్భూతము. ఇదియే భూతముల రహస్యము. కాని యీ యంశము ననుభవములోనికిఁ దేవలెను 7. ఈ భూతముల వివరము విస్తరించి వివరించితిని. ఈ భూతముల యందెయ్యది వ్యాప్తమైయున్నదో యది విచారపూర్వకముగఁ జూచినయెడల ననుమానములోనికి వచ్చును 8. ఆత్మకుఁగల చపలత్వముముందుఁ జాపము వాయు వెంతటిది. ఆత్మచాపల్యము ప్రత్యక్షముగ విచారించి చూడవలెను 9. ఆత్మలేనిది కార్యము నడువదు. ఆత్మ కనుపింపదు. దొరుకదు. అది గుప్తరూపముతో నానావిచారములఁ దిలకించును 10. ఆత్మ పిండబ్రహ్మాండములందు వ్యాప్తమైయున్నది. నానావిధ దేహములలో విరాజిల్లుచున్నది. అది జగత్తులోని సకలప్రాణుల యంతఃకరణములందును నున్నది. ఈ యంశము వివేకశాలురగు జనులంద ఱెఱుంగుదురు 11. ఆత్మలేకుండ దేహము వర్తించుటయనునది కల్పాంతమునందేని జరుగదు. ఆత్మయోగముననే అష్టధాప్రకృతియొక్క వ్యక్తులు రూపమునొందెను 12. ఆదిమొదలు అంత్యముదనుక సమస్తము నాత్మయే చేయుచున్నది. ఆత్మకుఁ బిదప నిర్వికారమగు పరబ్రహ్మమున్నది 13. ఆత్మ శరీరమునందు వర్తించుచు ఇంద్రియగణమునకుఁ జేష్టలొసంగుచున్నది. దేహరూపమగు నుపాధితో నది సుఖదుఃఖసంబంధములగు నానా భోగముల ననుభవించుచున్నది 14. ఈ బ్రహ్మాండము సప్తకంచుకము. దానిలో మఱల సప్తకంచుకము పిండము, ఆ పిండమునందలి యాత్మను దృఢమగు వివేకముతో గురుతెఱుంగవలెను 15. ఆత్మ శబ్దమునువిని తెలిసికొనుచున్నది, తెలిసికొని ప్రత్యుత్తర మొసంగుచున్నది. మఱియు చర్మముతోడ్పాటుచేఁ

గరిన, మృదు శీతోష్ణములను గ్రహించుచున్నది 16. అది నేత్రములలో నిండి పదార్థమును గాంచుచున్నది. నానాపదార్థములం బరీక్షించుచున్నది. మనస్సులోని ఉచ్చనీచములను దెలిసికొనుచున్నది 17. ఆత్మ క్రూర దృష్టి, సౌమ్యదృష్టి, కృపాదృష్టి, మొదలగు నానావిధదృష్టి భేదములను దెలిసికొనుచున్నది 18. అది జిహ్వాలోని నానావిధ రుచులను గ్రహించి వాని భేదాభేదములను విమర్శింప నేర్చియున్నది19. ఉత్తమభోజనముల పరిమళము, నానాసుగంధవస్తువుల పరిమళము, నానాఫలముల పరిమళము, ఆత్మ ఘ్రాణేంద్రియసహాయమునం దెలిసికొనుచున్నది 20. జిహ్వాతో రుచి నెఱుంగుటయు, మాటలాడుటయు, హస్తేంద్రియములతో నిచ్చిపుచ్చు కొనుటయుం, బాదేంద్రియములతో వచ్చుట పోవుటయు ఇంక నిట్టి యితర క్రియలు నిరంతరమాత్మయే చేయుచుండును 21. శిశ్నేంద్రియముతో సురతభోగము, గుదేంద్రియముతో మలోత్సర్జనము, మనస్సుతో సమస్త కల్పనము, ఆత్మయే గావించుచున్నది 22. ఆత్మ యీ త్రిలోకములయందును నీ విధముగా ననేక వ్యాపారములను ఒంటరిగనే యొనర్చుచున్నది. దాని గొప్పతనము నెవరు వివరింపగలరు? 23. దాని మహిమను అదిదక్క నితరులు ప్రశంసింపలేరు. ఆత్మవంటి వ్యాపారము, విస్తారము, ఇంతకుము నుపు కాలేదు. ఇకముందుం గాబోదు 24. పదునాలుగు విద్యలు, అఱువది నాలుగుకళలు - చతురత్వమునకు సంబంధించిన నానాకళలు, వేదశాస్త్ర పురాణములు, అంతఃకరణము ఆత్మయందుందక్క నెక్కడనున్నవి? 25. ఈ లోకపు ఆచారము, పరలోకపు సారాచారవిచారము, ఉభయలోకముల నిర్ధారణము ఆత్మయే చేయుచున్నది 26. నానామతములు, నానావిధసంవాద వివాదములు, నానానిశ్చయములు, ఆత్మయేచేయుచున్నది27. ముఖ్యతత్వ మంతటను వ్యాపించియున్నది. అది సమస్తపదార్థములకును స్వరూపమొసంగినది. ఆత్మ సంయోగముచే నంతయు సార్థకమైనది 28. వ్రాయుట, చదువుట, వల్లించుట, అడుగుట, వివరించుట, అర్థమునెఱుంగుట, పాడుట, వాయించుట, ఆడుట ఆత్మవలననే జరుగుచున్నవి 29. ఆత్మ నా నా సుఖములతో నానందించుచున్నది. నా నా దుఃఖములతో దుఃఖించుచున్నది. నానా విధములగు దేహములను ధరించుచున్నది. విసర్జించుచున్నది 30. ఆత్మ యొక్కటియే నానా దేహములను ధరించి

(యొక్కటియే) నానా ప్రకారముల నటించుచున్నది. నటనాట్యములు, కళాకౌశలములు ఆత్మ లేకున్నచో జరుగఁజాలవు 31. ఆత్మ యొంటరిగనే యుండి బహురూపియగు చున్నది. అది పలుతెఱంగుల మహోద్యోగి గను, మహాప్రతాపిగను నలరారుచున్నది. మఱియుఁ బిఱికిఁగగూడ నగు చున్నది 32. ఆత్మ యొక్కటియేగదా! ఎట్లు విస్తృతమైనది? అది బహు విధములగు వినోదములు గావించుచున్నది. దాంపత్యము లేకయే యది సర్వత్ర యెట్లు వ్యాపించినదో చూడరాదా 33. స్త్రీలకుఁ బురుషుఁడును, బురుషునకు స్త్రీయును గావలయును. ఇట్లు పరస్పరముగఁ గలిసికొందు రేని వారల కానందముఁగలుగును 34. స్థూలము (పదార్థభేదము)నకు మూలము (కారణము) లింగము (స్త్రీలింగ పుంలింగాదులు) మఱియు లింగమునం దీవ్యవహారాదులు గలవు. ఈ విధముగనే ఈ జగత్తు ప్రత్యక్షముగ నడుచు చున్నది. 35. లింగభేదము ననుసరించి పురుషజీవులను జీవుఁడనియు, స్త్రీ జీవులను జీవియనియును నుడువవలసిన జంజాటము కలుగుచున్నది. ఈ సూక్ష్మకూటకము (మోసము) తెలిసికొనవలయును 36. స్థూలయోగము వలన భేదము తెలియుచున్నది. కాని వాస్తమునకు సూక్ష్మమునందంతయు నభేదమే. ఈ వాక్యము నిశ్చితము, అనుభవయుక్తము నని విశ్వసింపఁ దగును 37. స్త్రీ స్త్రీతోడ సంభోగించుట యెప్పుడును జరిగియుండలేదు. స్త్రీ తన యంతఃకరణమునందుఁ బురుషుని చేరుచుండును 38. స్త్రీకిఁ బురుషుఁడును, బురుషునకు స్త్రీయును గావలయును. ఈ సంబంధమిట్టిది. ఇది సూక్ష్మమునందుఁగూడఁ గలదు 39. పురుషుని భావమందుఁ బ్రకృ తియుఁ, బ్రకృతి భావమునందుఁ బురుషుఁడు నుందురు. కావుననే వానిని "ప్రకృతి పురుషులని" యందురు 40. పిండమునందు బ్రహ్మాండమును విచారింపవలెను. ప్రతీతిని బ్రాప్తింపఁ జేసికొనవలెను. ఒకవేళఁ దెలియ కున్నచో మాటిమాటికి విచారించి తెలిసికొనవలెను 41. ద్వైతేచ్ఛ మొదటినుండియు నుండెను. కాననే యది భూమండలములోనికి వచ్చినది. భూమండలమును ఆదిస్థానమును (మూలమాయను) మిళితముగావించి చూడవలెను 42. ఇప్పటికొక మహాత్కార్యము నెరవేరినది. ఏమన? శ్రోతల యాక్షేపణము నివారణమైనది. అంతియగాక ప్రకృతి పురుషుల రూపముగూడ నిశ్చయమైనది 43.

## ఎనిమిదవ సమాసము — ఆత్మారామ నిరూపణము.

గణపతీ! నీ యనుగ్రహమువలననే హృదయమునకు బలము కలుగుచున్నది. కాన నీ మంగళమూర్తికి వందనములు. జనులు ఆత్మనే భజించుచు ఆత్మనే స్తుతించుచున్నారు. (ఆత్మవలన మతిస్ఫూర్తి కలుగుచున్నది. అట్లే గణపతివలనఁగూడఁ గలుగుచున్నది. కావున గణపతియే ఆత్మ) 1. తల్లీ సరస్వతీదేవి? నీవు అంతఃకరణమునకుఁ బ్రకాశమును బ్రసాదించుచున్నావు. నానావిధములగు విద్యలను బూర్ణరూపముతో నీవే వివరణము గావించుచున్నావు. నీవు జగదీశ్వరివి, వైఖరీరూపవు. నీకు నమస్కరించెదను 2. రామనామము సర్వోత్తమమైనది. శంకరుని శ్రీరామ నామస్మరణమువలననే కష్టము లొక్కమాఱుగఁ దొలంగి విశ్రాంతి లభించెను 3. రామనామము మిగుల మహిమగలది. ఆ పరాత్పరుని, పరమేశ్వరుని, త్రైలోక్యధారుని నామము రానురాను మహత్త్వమునొందుచున్నది 4. ఆత్మారాముఁడు నలుదిక్కులను నిండియున్నాఁడు. ఆతని వలననే జనులు ఇటునటు తిరుగుచున్నారు. ఆత్మలేనియెడల దేహము పడిపోవును. మరణించును 5. ఆ జీవాత్మ,విశ్వాత్మ, పరమాత్మ, జగదాత్మ, శివాత్మ, గుప్తాత్మ, ఆత్మ, అంతరాత్మ, సూక్ష్మాత్మ యను నామములతో దేవదానవ మానవజాతులందంతటను నిండియున్నది 6. ఆత్మయోగమున నెల్లరు నడచుచు, మాటలాడుచు వ్యవహరించుచున్నారు. అవతారము లాత్మయోగముననే కలుగుచున్నవి. బ్రహ్మాదిదేవతలుగూడ ఆత్మయోగమువలననే జననమరణము లొందుచున్నారు 7. దానిని నాదరూపమనియు, జ్యోతీరూపమనియు, సాక్షిరూపమనియు, సత్తారూపమనియు, చైతన్యరూపమనియు, సత్స్వరూపమనియు, ద్రష్టరూపమనియు నెఱుంగనగును 8. అది నరోత్తమము, వీరోత్తమము, పురుషోత్తమము, రఘూత్తమము, సర్వోత్తమము, ఉత్తమోత్తమము, త్రైలోక్యవాసియు నై యున్నది 9. నానావిధములగు కోలాహలములు, కలహములు ఆత్మవలననే జరుగుచుండును. ఆత్మలేనిపక్షమున నలుదిశలును బ్రపంచమును జదరమై శూన్యమై పోఁగలదు 10. ఆత్మలేనియెడల శరీరము వ్యర్థము. ఆత్మలేని శరీరము మృతినొందును. ఆత్మలేని

శరీరమును ప్రత్యక్ష ప్రేతముగనే భావింపనగును 11. ఆత్మజ్ఞాని యీ విషయము తన మనస్సున గ్రహించును. అతఁడు మనుష్యమాత్రులందు ఆత్మవ్యాప్తిని దిలకించుచున్నాఁడు. ఆత్మలేనియెడల భువనములు త్రిభువనములు పాడువడును 12. ఆత్మయోగముననే పురుషుఁడు పరమ సుందరుఁడు చతురుఁడునునై సారాసారముల నన్నింటిని దెలిసికొనుచున్నాఁడు. ఆత్మలేనిచో ఇహలోకము, పరలోకము అంధకార బంధురమని గ్రహింపుఁడు 13. సమస్తవిధ సిద్ధులు, సావధానములు, నానాభేదములు, ఆనందములు, మున్నగునవియెల్ల ఆత్మవలననే కలుగుచున్నవి 14. అల్పునైననుఁగానిమ్ము, బ్రహ్మాండ దేవతలనైన గానిమ్ము. అందఱిని నడుపునది ఆత్మయొక్కటియే. నిత్యానిత్య వివేచన మందఱును నొనరింపవలెను 15. పద్మినీజాతి స్త్రీయైననుఁగానిమ్ము. ఆత్మ దేహమునందున్నంతవఱకు మాత్రమె పురుషుఁడు ఆ పద్మినీజాతి స్త్రీని బ్రేమించును. ఆత్మ వెడలిపోయిన పిదప దేహమునఁ దేజ మెక్కడనుండును? ఆత్మతోఁబాటుగ దేహసౌందర్యము గూడ వెడలిపోవును 16. ఆత్మ కనిపింపదు. భాసింపదు. ఇతరు లది యున్నదనిగాని లేదనిగాని యనుమానించుటకుఁగూడ వీలులేదు. మనస్సంబంధములగు నానావిధ కల్పనలన్నియును ఆత్మయోగము వలననే కలుగును 17. ఆత్మ శరీరమునందుండును. అది సమస్త బ్రహ్మాండము యొక్క సంపూర్ణ వివరణ మొనరించును. నానావిధ వాసనలను, భావనలను ఎంతదనుక వివరింప శక్యమగును? 18. మనోవృత్తు లనంతములు. అనంతములగు ప్రాణులు అనంతప్రకారములగు కల్పనము లొనరించుచుండును. వాని యంతఃకరణముల నెంతదనుక వర్ణింపగలను? 19. అనంతవిధములగు రాజనీతి యుక్తులనుబన్నుటయు, కుబుద్ధితోఁగాని సుబుద్ధితోఁగాని వివరించుటయు, మర్మము తెలియనీయ కుండుటయు, ప్రాణిమాత్రుల మఱపించుటయు, ఆత్మయోగముననే యగుచున్నది 20. ఒకఁడు రెండవవానిని వంచింపఁ బొంచియుండును. ఒకఁడు రెండవవానికై మరణించును. దాఁగికొనును. ఇట్లె నలుమొగములను శత్రుత్వ స్థితిగతులు వర్తించుచున్నవి 21. పృథ్వియందలి జనులు ఒకఁడు రెండవవానిని బరస్పరము బంధించుచున్నాఁడు. ఎందఱోభక్త లొకరికొక రుపకారములు గావించుకొనుచున్నారు 22. ఆత్మ యొకటియేగాని భేదము లనంతములు.

అన్నియు దేహానుసారముగా స్వాదువును గ్రహించును. వాస్తవమున కాత్మకు భేదములేదు. కాని యది భేదమునుగూడ ధారణమొనర్చు చున్నది 23. పురుషునకు స్త్రీయును స్త్రీకిఁ బురుషుఁడును గావలయును. స్త్రీకి స్త్రీ యావశ్యకమగుట యెప్పుడును జరుగఁజాలదు 24. పురుషుని యాత్మను జీవుఁడనియు, స్త్రీయొక్క ఆత్మను జీవియనియు నుడువవలసిన యవస్థ యాత్మకుఁలేదు. విషయసుఖములకు సంబంధించిన గోలగల తావుననే యిట్టిభేదమున కవకాశముగలదు 25. ఏ ప్రాణి కెయ్యది యాహారమో దాని నా ప్రాణి కోరుచుండును. పశువులుతిను గడ్డిగాద ములను మనుజుఁడు భుజింపఁడు 26. ఆహార దేహములయందు జీవుల కెట్లుగుప్తము, ప్రకటనములగు భేదములుగలవో యట్లు ఆనందమునందుఁ గూడ భేదముగలదు 27. సముద్రమునందును, భూగర్భమునందునుగల జలములోనైతము ప్రాణులుగలవు. ఆవరణోదకమునందుఁగల జలచర ములు మిగులఁబెద్దవి 28. సూక్ష్మదృష్టితో విచారించిచూచినచో శరీర ముల కంతము దొరుకనేరదని విశదమగును. ఈ స్థితిలో అంతరాత్మ యెట్లనుమానములోనికి రాఁగలదు? 29 దేహముయొక్కయు, ఆత్మ యొక్కయు, సంయోగమును విచారించినచో ఆత్మనుగుఱించి కొంత కొంత యనుమానములోనికి వచ్చును 30. ఈ కల్లోలమును నవరించు టకు నానావిధములగు నిరూపణము లొనర్పఁబడినవి. అంతరాత్మ కృపతో అనేక ముఖములతోఁ దత్త్వమును వివరించినది 31.

---

## తొమ్మిదవ సమాసము — ఉపాసననిరూపణము.

(ప్రశ్న) భూమిలో బహువిధ మానవులున్నారు. వారలకు నానావిధములగు ఉపాసనలుగూడ నున్నవి. ప్రతి స్థలమునందును మాన వులు తమతమ భావముల ననుసరించి భజనమునందు మగ్నమై యున్నారు 1. మానవుఁడు తనదేవతల భజించును, నానాస్తవములు స్తుతులు నొనర్చును. కాని యెవఁడైనఁ గానిమ్ము. తనయుపాసనము నిర్గుణమనియే చెప్పును 2. దీని యభిప్రాయమును మాకు వివరింపుఁడు. (ఉత్తరము) ఓరీ! ఇది స్తుతియొక్క స్వభావము సుమా! 3. నిర్గుణమును

దానికి బహుగుణమని యర్థముగలదు. బహుగుణి యంతరాత్మ. సర్వ మును ఆ యంతరాత్మ యంశలే. ఇది కేవల సత్యము. ప్రతీతిని గావించు కొనుఁడు 4. సమస్త జనులను అభిమానించిన మానవుఁ డంతరాత్మను బ్రాప్తించును. కాని అధికారమును జూచియే యభిమానింపవలయును 5. (ప్రశ్న) ఇది యుక్తి యుక్తముగాలేదు. మూలమునందు నీరుపోసినచో నది అన్నియాకులకు లభించును. ఇది ప్రత్యక్షానుభవ విషయము 6. (ఉత్తరము) తులసిచెట్టుపై నొక చెంబెడునీరు పోసినయెడలఁ బైన నొక క్షణమాత్రమేని నిలువక భూమిలోనికి దిగిపోవును 7. (ప్రశ్న) పెద్ద వృక్షముపై నెట్లు నీరుపోయగలము? చివర కొమ్మలపైకిఁ బాత్రము జలముగొని యెట్లుపోగలము? దేవా! ఈ విషయమును సవిస్తరముగాఁ దెలుపుఁడు 8. (ఉత్తరము) వర్షమువలనబడు జలమంతయుఁ జెట్టుపై నుండక మూలమునకు జేరును. వృక్షాగ్రమున నీరుబోయుదమన్న చేయియేయందదు. ఏమిచేయనగును? 9. అందఱికిని మూలము లభింపఁ దగినంత పుణ్య మెట్లుసమకూరును? వివేకమువలన సాధువుల హృదయ మంతదనుకఁ జేరును 10. వృక్షముమీఁదబోయునీరు మూలమునకుఁ జేరు నట్లు సమస్తజగత్తునకు సేవఁగావించినచో బరమాత్మునకుఁ బ్రాప్తిం చును 11.

(ప్రశ్న) గురువర్యా! వెనుకటి శంక నివారణమయ్యెను. ఇఁక సగుణమును నిర్గుణమని యెట్లు చెప్పనగునో వివరింప గోరెదము 12. ఏలయన! చంచలము వికారయుక్తము నైయున్నదెల్ల సగుణము. తక్కి నది గుణాతీతము అనఁగా నిర్గుణము 13. (ఉత్తరము) ఈ విషయము నెఱుంగవలయునన్న సారాసారముల విచారింపవలయును. అంతఃకరణము నందు నిర్ధారణమైన పిదప మఱల నామముగూడ నుండదు 14. రాజు నకు సమానుఁడగు నొక వివేకశాలియగు పురుషుఁడుండె ననుకొనుము. రెండవవాఁడు (నామమాత్రమునకు) రాజు అనుపేరుగల సేవకుఁడు గలడని యనుకొనుము. ఈ యిర్వురి తారతమ్యము నిపుడు విచారింపుఁడు. వివాదము గావించుట వ్యర్థము 15. కల్పాంతప్రళయమునందు నాశన మొందక నిలిచియుండుదానినే నిర్గుణమందురు. మిగిలినదంతయు మాయ లోనికె చేరును 16. సేనయందును, బట్టణమునందును, అంగడివీధి

యందును, నానావిధయాత్రలందును అపారమగు ధ్వని కలుగుచుండును. ఆ ధ్వని నెట్లు వేఱుచేయఁగలము? 17. వర్షర్తువు నందు సరిగ నర్ధరాత్రమున నానావిధజీవు లఱచుచుండును. వాని యన్నింటి శబ్దముల వేఱువేఱుగా నెట్లెఱుంగ వీలగును? 18. భూమండలమునం దసంఖ్యాకములు, నానావిధములు నగుదేశములు, భాషలు, మతములు గలవు. ఎందఱో ఋషులు గలరు, ఋషినిర్మితములగు మతములుగూడ నెన్నియో గలవు. వానినన్నిఁటి నెట్లెఱుంగనగును? 19. వానగురిసినపిదప నేలపై నెన్నియో మొలకలు మొలుచును. చిన్నవిగఁ బెద్దవిగ నుండి నానావిధముల నున్న యామొక్కల నెట్లు వేఱువేఱు గావింపనగును? 20. ఖేచరములు, భూచరములు, జలచరములు, మున్నగు జీవముల దేహములు నా నా వర్ణయుక్తములై చిత్రవిచిత్రములుగా నుండును. వాని నన్నింటి నెట్లెఱుంగనగును? 21. దృశ్యమెట్లు ప్రకటనమయ్యెను? నా నా విధములచే నెట్లు వికృతమయ్యెను ? అనంతర మేవిధముగా వ్యాపించి యున్నది ? ఇవి యన్నియు నెట్లెఱుంగనగును? 22. ఆకాశమునందు గంధర్వ నగరములు గలవు. అందు నా నా వర్ణములుగల పెద్ద చిన్న వ్యక్తులు లెక్కకు మించినవారు బహువిధముల నలరారుచున్నారు. వారి నెఱుంగుట యెట్లు? 23. రాత్రి, పగలు, వెన్నెల, చీకటి, విచారము, అవిచారము, నెట్లుఱుంగనగును? 24. స్మరణ, విస్మరణములయొక్కయు వ్యస్తత, అవ్యస్తతలయొక్కయు, ప్రతీతి అనుమానములయొక్కయు స్థితి సైతమిట్టిదే! 25. వివేకములేనిచో న్యాయాన్యాయములు, యుక్తాయుక్తములు, మున్నగునవియెల్ల నెట్లెఱుంగనగును? 26. కార్యకర్తను, వ్యర్థుని, శూరుని, పిఱికిపందను, ధర్మిని, అధర్మిని, తెలిసికొనవలెను 27. ధనాఢ్యుని దరిద్రుని, వర్తకుని దొంగను, సత్యమును అసత్యమును తెలిసికొనవలెను 28. శ్రేష్ఠుని కనిష్ఠుని, భ్రష్టుని అంతర్నిష్ఠుని, సారాసార విచారమును స్పష్టముగా తెలిసికొనవలయును 29.

---

## పదియవ సమాసము _ త్రిగుణములు _ పంచభూతములు

పంచభూతములచే నీజగత్తు నడుచుచున్నది. ఇదియంతయుఁ బంచ

భూతవ్యాపకమే. పంచభూతములు వెడలిపోయిన పిదప నుండునది యెద్ది? 1. (ప్రశ్న) భూతములమహిమ నింతగొప్పగాఁ జెప్పితిరి. కాని త్రిగుణము లెచ్చట జనించినవి? దయచేసి తెలుపుడు? 2. (ఉత్తరము) అంతరాత్మ ఐదవ భూతము. త్రిగుణములు దాని కంగభూతములు. ఈవిషయమును సావధాన చిత్తముతో విచారింపుము 3. జరిగిపోయిన దానినెల్ల భూతమందురు. ఆ జరిగిపోయిన దానియందే త్రిగుణములుగూడ వచ్చిపోయెను. ఇంతటితో సంశయమూలము తెగిపోవును 4. భూతముల కంటె భిన్నమైన దెద్దియులేదు. సమస్తమును భూతములవలననే యుత్పన్నమయ్యెను. ఒకటి లేనిచో మఱియొకటి యెప్పుడును కాఁజాలదు 5. ఆత్మవలనఁ బవనము, పవనమువలన అగ్ని, అగ్నివలన జలము కలుగునని చెప్పుదురు 6. జలమంతయు సూర్యకిరణముల వేడిచేఁ బేరుకొన్న పిదప అగ్నివాయు సంయోగమువలన భూమండలమేర్పడెను 7. అగ్నియు, వాయువు, సూర్యుఁడు లేకున్నయెడల నీప్రపంచము మిగులఁ జల్లగ నుండెడిది. కాని శీతలత్వమునందుఁగూడ నుష్ణత్వముండును 8. ఈ విచిత్రమయ ప్రపంచమును బరమాత్ముఁడు సృజించెను. సంపూర్ణ దేహధారులందఱిని నాతఁడే సృజించెను 9. ఒకవేళ నీ లోకమంతయు శీతలముగ నున్నచో సమస్త ప్రాణులు చనిపోయియుందురు. లేక యంతయు నుష్ణముగా నున్ననుగూడ లోకమంతయు మాడి పోయెడిది 10. భూమండలము సూర్యకిరణములవలన నేర్పడిన పిదప నింకను గొన్ని యుపాయములు భగవానుఁడొనరించెను 11. వర్షర్తువు నేర్పఱచెను. దానివలన నుష్ణముగనున్న భూమండలము చల్లఁబడెను. పిమ్మటఁ గొంచెముష్ణము, గొంచెముశీతలమునగు శీతకాలమును నిర్మించెను 12. శీతకాలమున జనులు కష్టము లొందుచుందురనియు వృక్షాదులెండిపోవుననియు భగవంతుఁ డుష్ణకాలమును నిర్మించెను 13. ఆ యుష్ణకాలమునఁ గూడఁ బ్రాతఃకాలమును, మధ్యాహ్నకాలమును, సాయంకాలమును నేర్పఱచి శీతము, ఉష్ణము నిర్మించెను 14. ఈ విధముగ భగవంతుఁడొక దానివెంట నొకటి సృజించెను. క్రమముగ నన్నింటికి నియమబంధము లేర్పడెను. ఈ నియమబంధములవలననే ప్రాణిమాత్రుల జీవితము స్థిరపడెను 15. నానావిధములు, కఠినములు నగురోగములు ప్రాణులను బీడించుచుండుటఁ

జూచి భగవంతుండు ఓషధులు సృజించెను. (ఇదియంతయు జరిగెను) ఇక సృష్టివివరణము నెఱుంగవలసియున్నది 16. రక్తరేతస్సులే దేహమూలములు. ఆ జలములోనే దంతములేర్పడెను. ఇట్లే భూమండలమునఁగల నానారత్నములుగూడ నేర్పడెను 17. అన్నింటికిని మూలము జలమే యని గ్రహింపుఁడు. జలమునవలననే యీ జంజాటములన్నియు నడుచుచున్నవి. జలములేకపోయినచో నంతయు శూన్యమేయని భావింపుడు. జలమేలేనిచోఁ బ్రాణిలోక మెచ్చటనుండి గలుగును? 18. ముక్తాఫలములు, శుక్రగ్రహమువలెఁ బ్రకాశించు వజ్రములు, మాణిక్యములు, ఇంద్రనీలములు, మొదలగునవియెల్ల జలమువలననే కలిగెను 19. దేని మహిమ వర్ణింప సాధ్యమగును? అంతయు మిశ్రణమయ్యెను. వేఱువేఱుగ నెట్లు గావింపఁగలము? 20. హృదయమున వివేకముగలుగుటకై యేదియో కొంచెము చెప్పితిని. వివేకపురుషులు సర్వమును గ్రహింపఁగలుగుదురు 21. అన్నింటిని గ్రహింపఁగల్గుట యసంభవము. శాస్త్రములకుఁ బరస్పరముగ ఐక్యము కుదురదు. అనుమానముచే నేదియు నిశ్చయముకాదు 22. భగవంతుని గుణము లగాధములు, శేషుఁడు సైతము తన నోటితో భగవన్మహిమలను వర్ణింపఁజాలఁడు. పరమాత్ముఁడు లేని వేదవిధినిగూడ నపక్వముగనే భావింపుఁడు 23. ఆత్మారాముఁ డందఱిని బాలించుచున్నాఁడు. ఆతఁ డీసమస్త త్రిలోకములను నిర్వహించుచున్నాఁడు. ఆతఁడొక్కఁడు లేనిచో నీ లోకమంతయు మట్టిలోఁ గలిసిపోవును 24. ఆత్మారాముఁడు లేనితావున నేదియు నుండఁజాలదు. ఆ పరమాత్ముఁడె లేనిచోఁ ద్రిలోకములందలి సమస్త ప్రాణులును మృతతుల్యములు 25. ఆత్మ లేకపోయినచో మరణము గలుగును. ఆత్మలేకున్నచో నెవఁడు జీవింపఁగలడు? ఈ యంశమును అంతఃకరణమునందుఁ జక్కఁగ వివేచింపవలయును 26. ఆత్మలేకున్నచో వివేకపూర్వకముగాఁ దెలిసికొనుటగూడ జరుగదు. అందఱును జగదీశ్వరుని భజింపవలయును 27. ఉపాసన ప్రకటనమగుటవలననే యీ విచారము విదితమయ్యెను. కావునఁ బరమాత్ముని నుపాసనము గావింపవలెను 28. ఉపాసన మానవునకు గొప్ప ఆశ్రయము. ఉపాసనలేకున్నచోఁ గార్యము నడువదు. ఉపాసనమును మాని యెన్ని యుపాయములనైనఁ గావింపనిమ్ము. అవి సఫలములుగావు 29. సమర్థుని

యాశ్రయము గడింపనివాని నెవఁడైన నులిమివేయును. కావున లేచినపుడు, కూర్చుండి యున్నప్పుడు నిరంతరము భగవంతుని భజించుచుండ వలెను 30. భజనము, సాధనము, అభ్యాసము వలననే పరలోకము లభించును. ఈ యంశమునందు విశ్వాసముంచవలయునని రామదాసు నుడువుచున్నాఁడు 31.

పదునాఱవ దశకము సమాప్తము.





# పదునేడవ దశకము.



## మొదటి సమాసము – అంతరాత్మ సేవ

నిశ్చల బ్రహ్మమునందుఁ జంచలమగు ఆత్మయున్నది. అన్నింటి కంటెను నావలనున్న పరమాత్ముఁడే చైతన్యుఁడును, సాక్షియు, జ్ఞానాత్ముఁడును, షడ్గుణేశ్వరుఁడును నై యున్నాఁడు 1. ఆతఁడే సర్వజగత్తుల కీశ్వరుఁడు. కావనే జగదీశ్వరుఁడని యాతని నందురు. ఆతనివలననే యీ సృష్టివిస్తారమంతయు నేర్పడెను 2. శివశక్తి, జగదీశ్వరి, ప్రకృతిపురుషుఁడు, పరమేశ్వరి, మూలమాయ, గుణేశ్వరి, గుణక్షోభిణి 3. క్షేత్రజ్ఞుఁడు, ద్రష్ట, కూటస్థుఁడు, సాక్షి, అంతరాత్మ, సర్వద్రష్ట, శుద్ధసత్త్వము, మహత్తత్త్వము, పరీక్షించువాఁడు, జీవేశ్వరుఁడు, సాధువు ఆ జగదీశ్వరుఁడే యైయున్నాఁడు 4. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, నానాపిండములలోని జీవేశ్వరుఁడు, ఇంకను జిన్నయుఁ బెద్దయునగు ప్రాణిమాత్రులును నాజగదీశ్వరుని భాసింపఁ జేయుచున్నవి 5. అంతరాత్మ దేహరూపమగు దేవాలయమునఁ గూర్చుండి యున్నాఁడు. భజనముగావింపనిచో దేహమును దండించును. కావనే భయవశమున నాయంతరాత్మను భజించుచున్నారు 6. సమయమునకు భజనముగావింపని వానిని ఆసమయమున భగవానుఁడు త్రోసివేయును. కావనే సమస్తజను లాతని భజించుచున్నారు 7. అంతరాత్మ యెప్పు డేవిషయము నపేక్షించునో యపుడె జనులు దానినొసంగుచున్నారు. ఇట్లె జనులందఱు అంతరాత్మను భజించుచున్నారు 8. పంచవిషయక నైవేద్యములు అంతరాత్మ కెపుడువలయునో యపుడె యమర్పవలయును. అట్లు గావింపనిచో నాక్షణముననే రోగములు కలుగును 9. నైవేద్యము సకాలమున లభింపకున్నచో నంతరాత్మయుండడు. అతఁడు బహువిధభాగ్యములు వైభవములను బదార్థములను విడిచివెళ్ళిపోవును 10. వచ్చెడిసమయమునం దీతఁడు (అంతరాత్మ) ఎవరికైనఁ దెలియనీయఁడు. ఎవరికిని యాజాడ

పోకడలు తెలియవు. అతడు (అంతరాత్మ) దక్క నెవ్వరు నాతనిగూర్చి యనుమానింపఁ జాలరు 11. దేవునిగాంచుటకు దేవాలయమును వెదుకవలయును. ఎచటనైన నొకచోట దేవాలయ గుణమున దేవుడు ప్రకటనమగును 12. ఈ నానాదేహములే దేవాలయములు. వీనియందే జీవేశ్వరుఁడు నివసించుచున్నాడు. నానావిధదేహములు గలవు. వానిలో భేదము లనంతములుగ నున్నవి 13. ఈ నడచుచుఁ, దిరుగుచు నున్న దేవాలయములలో దేవుఁడు నివసించుచుండును. ఎన్ని దేవాలయములు గలవో వానినన్నింటి నెఱుంగ వలయును 14. మత్స్యము, కూర్మము, బహుకాలము భూమండలము ధరించిన వరాహము మొదలగు ననేక కరాళ వికరాళనిర్మలదేవాలయము లెన్నియొ గలిగి నశించినవి 15. అనేక దేవాలయములలో నాతఁడు సుఖించుచున్నాఁడు. సముద్రమువలె నాతఁడు సుఖముచే నిండి పూర్ణుఁడగుచున్నాడు. కాని యాసుఖమెల్ల కాల ముండదు. సుఖ మశాశ్వతము (అతఁడు సుఖముతో లిప్తుఁడు కాఁడు) 16. అగాధకృత్యముల నొనరించు నా యశాశ్వత శిరోమణి కనుపింపకున్ననేమి? వాస్తమునకు ధనియనియు ధనాఢ్యుఁడనియు నాతనినే ప్రశంసింతురు 17. ఆదేవునియెడ లక్ష్యముంచినచో అభేదత్వము కలుగును. ఆతనికి విముఖుఁడుగనున్నచో భేదము కలుగును 18. అన్నింటికి నాతఁడు మూలమెగాని కాన్పింపఁడు. భవ్యుఁడును, భారవహుఁడును నైయుండియు నాతఁడు భాసింపఁడు. ఒకక్షణమాత్రమేని యొకతావున నుండఁడు 19. ఆ పరమాత్ముని స్థితి యిట్లగాధముగ నున్నది. ఆతని మహిమ లెవ్వరెఱుంగుదురు? ఓ సర్వోత్తమా! నీ లీలలను నీవే యెఱుంగుదువు 20. నిత్యానిత్యవివేకశాలియగు పురుషుని జన్మమే సార్థకము. ఇట్టి పురుషుఁడు ఇహలోక పరలోకములను రెంటిని సాధింపఁగలడు 21. మననశీలుఁడగు జనులకడఁ బరమాత్ముఁ డఖండరీతిగఁ జెదరక యుండును. విచారించిచూచినచో ఇట్టిపురుషుల పూర్వసంచితపుణ్యమనుపమానమని విదితమగును 22. (పరమాత్మునికిట్టి పురుషులతో) అఖండ (సం) యోగము గలిగియుండును. కాననే వారల యోగులందురు. (పరమాత్ముని కెవనితో సం) యోగము లేకుండునో వాఁడు వియోగి (దుఃఖి). కాని వియోగికూడ యోగబలమువలన యోగి

యగును 23. జ్ఞానులగువారలు జనులను సన్మార్గమునందుఁ బ్రవేశ పెట్టుదురు. వారల మహిమ గుట్టిది. ఈఁతనేర్చిన వాఁడెదుటనున్నచో మునిఁగిపోనున్నవాని నుద్ధరించుట కర్తవ్య ధర్మమని తలంచును 23. స్థూలసూక్ష్మ తత్త్వవివరణ మెఱింగి పిండబ్రహ్మాండముల స్వరూపము గ్రహించి అనుభవముగడించిన పురుషులు భూమండలమున మిగుల నరుదుగనున్నారు 25. అఖండవివరణముతో వేదాంత పంచీకరణమును దెలిసికొనవలెను. మహావాక్యములతో నంతఃకరణ రహస్యము గ్రహింప వలెను 26. పృథ్వియందలి వివేకశాలుర పరిచయము ధన్యత్వము గలిగించును. వారల యుపదేశముల నాలించి ప్రాణిమాత్రులు సద్గతి నొందుదురు 27. సత్సంగము, సచ్ఛాస్త్రశ్రవణ వివరణము తెంపులేనట్లు జరుగుతావున సత్సంగపరోపకారములకు సంబంధించిన ఉత్తమ గుణములు లభించును 28. సత్క్రియాయుతుఁడగు పురుషుఁడు పరమేశ్వరాంశ సంభూతుఁడు. ధర్మసంస్థాపనమునకు వలయు నుత్సాహము వారలయందే కనిపించును 29. సారాసారవిచారము శ్రేష్ఠమైనది. దానివలన జగముద్ధరింపఁబడును. సంగత్యాగమువలన నెందఱో పురుషు లనన్యులైరి 30.

---

## రెండవ సమాసము — శివశక్తి నిరూపణము.

బ్రహ్మము ఆకాశమువలె నిర్మలము, నిశ్చలము నైయున్నది. అది నిరాకారమును, కేవలమును, నిర్వికారమును నైయున్నది 1. దాని కంతమేలేదు. అనంతమును శాశ్వతమును సదోదితము నైయున్నది. అది యశాంతమైనదికాదు. నిరంతరము శాంతముగ నుండును 2. పరబ్రహ్మ మవినాశి. అది ఆకాశమువలె వ్యాప్తముగనున్నది. విఱుగదు. తెగదు, పగులదు, నిరంతరము యథావిధముగా నున్నది 3. పరబ్రహ్మమునందు జ్ఞానములేదు. అజ్ఞానములేదు. స్మరణములేదు విస్మరణములేదు. అది యఖండమును, నిర్గుణమును, నిరవలంబనము నైయున్నది 4. అచట చంద్రుఁడు, సూర్యుఁడు, అగ్ని, చీకటి, వెలుతురు మున్నగునవి యెవ్వియునులేవు. ఉపాధికంటె వేఱుగ నొక్కనిరుపాధి బ్రహ్మమే యున్నది. 5. నిశ్చలమునందు జాగరూకమగు స్మరణమును చైతన్యమందురు. గుణముల

సమానత్వ కారణమున దానిని గుణసామ్యమందురు 6. ఆకాశమునందు మేఘచ్ఛాయ వచ్చువిధముననే (పరబ్రహ్మమునందు) మూలమాయ యున్నది. (ఆకాశమునందు మేఘముల రాకపోకల కెటుల నాలస్యము కలుగదో అట్లే) మూలమాయయొక్క ఉద్భవ లయముల కాలస్యము పట్టదు 7. నిర్గుణమునందు గల గుణవికారమే షడ్గుణేశ్వరుఁడు. దాని నర్ధనారీనటేశ్వరుఁ డందురు 8. మఱియు ఆదిశక్తియనియు, శివశక్తియనిగూడ దానినే చెప్పుదురు. అన్నిఁటికి నదియే మూలశక్తి. నానావ్యక్తులు దాని వలననే నిర్మాణమయ్యెను 9. శుద్ధసత్వమును, రజస్తమములును దాని వలననే యుత్పత్తియయ్యెను. వీనిని మహత్త్వము లనియు, గుణక్షోభిని యనియు, మాయ యనియు నందురు 10. మూలమునందు వ్యక్తియే లేనపు డచటికి శివశక్తి యెక్కడనుండి రాఁగలదు? అని యీ యంశమున నొకసంశయము గలుగవచ్చును. సావధానులరై యీ శంకకు సమాధానము వినుండు 11. బ్రహ్మాండము మొదలు పిండముదనుకను, పిండము నుండి బ్రహ్మాండము దనుకను విచారమొనర్చిన యెడల నీ యంశమున నిశ్చయము తెలియును 12. విత్తును బగులగొట్టిచూచినచో దానియందు ఫలముగన్పింపదు. విత్తునుండి వృక్షము వృద్ధినొందినపిమ్మట నా వృక్షము నందనేక ఫలములు గలుగును 13. ఫలమును బగులఁగొట్టినచో దాని యందు విత్తులుగాన్పించును. పిండ బ్రహ్మాండములస్థితి సైత మిట్టిదియే 14. పిండమునందు నరనారీభేదములు రెండును స్పష్టముగా నున్నవి. మూల మందే యీ భేదము లేకున్నచో అనంతర మెట్లు స్పష్టము కాగలఁదు? (నరనారీభేదములు రెండును మూలమాయయందే ప్రకృతి పురుషరూపమున నున్నవి) 15. నానాబీజ రూపములుగ నున్న బీజములయందేమి యుండదు? అంతయు నుండును. కాని సూక్ష్మరూపముతో నుండును. ఇందువలననే భేద మొక్కమాఱుగ భాసించుటలేదు 16. స్థూలమునకు మూలము వాసన. ఆ వాసన తొలుత కనిపింపదు. స్థూలము లేకున్నచో ఏ విషయముననేని యనుమానము కలుగఁజాలదు 17. కల్పనమువలన సృష్టియేర్పడెనని వేదశాస్త్రములు వాకొనుచున్నవి. కాని కల్పనము కనిపించుటలేదు. ఇంతమాత్రమున దానిని మిథ్యయని చెప్పఁగూడదు 18. ఒకొక్కజన్మ మొకొక్కతెఱవలె నడ్డుపడియున్నప్పుడు (ఎన్నిజన్మము

లిదివఱకు లభించెనో అన్ని తెఱ లడ్డుపడినప్పుడు) సత్యవిచార మెట్లు విశదమగును ? నిశ్చితవిషయములు అట్లె గూఢములుగ నుండును. గూఢత్వమే నిశ్చయమునకుం దావు 19. పురుషులందును స్త్రీలయందును వసించు జీవులందఱు నొక్కటియే. కాని దేహస్వభావములు వేఱువేఱుగ నుండును 20. కావుననే స్త్రీకి స్త్రీవలన నావశ్యకములేదు. పిండమువలన బ్రహ్మాండబీజమును నిశ్చయింపవలెను 21. స్త్రీహృదయము పురుషుని మీఁదికిని పురుషుని హృదయము స్త్రీ మీఁదికిని బ్రసరించును. మూలమునుండియే యీ వాసనాస్థితి వచ్చుచున్నది 22. ఆదినుండి వాసన అభేదముగనున్నది. దేహసంబంధమున నది భేదమొందుచున్నది. దేహ సంబంధము విడిపోవఁగనే భేదముగూడ విడిపోవును 23. నరనారీ మూలము శివశక్తి యందున్నది. జన్మములను గైకొనుటవలన నీ విషయము చక్కఁగ విశదమగుచున్నది 24. నానావిధములగు ప్రేమవాసన లొకరివి వేఱొకరికి తెలియవు. తీక్ష్ణమగు దృష్టివలనఁగొంచెముగ ననుమానము మాత్రము కలుగును 25.

బాలకుని వానితల్లి పాలించుచున్నది. పోషించుచున్నది. పురుషుని వలన నీ పనికాఁజాలదు. వనితవలననే ఉపాధి వృద్ధినొందుచున్నది 26. (తల్లికి బాలుని పోషించుటయందు) రోత, శ్రమ, అలసత, విసుగుదల కలుగదు. తల్లికిఁదప్ప (బాలునిపై) ఇంతమోహ మితరుల కుండదు 27. నానావిధములగు ఉపాధులవృద్ధి నొందించుటయు, నానావిధ మోహములతో శిశువును వశపరచుకొనుటయు నామె యెఱుంగును. నానావిధములగు ప్రాపంచిక ప్రీతుల ననుసంధింపఁజేయుటనుగూడ నామెయే యెఱుంగును 28. పురుషునకు స్త్రీయెడ విశ్వాస ముదయించును. స్త్రీకిఁ బురుషునియెడ నానంద ముదయించును. ఉభయులను బరస్పరవాసనలు బంధించివైచినవి 29. ఈశ్వరుఁడొక గొప్పజాలమును నిర్మించెను. దానిలో మనుజులు చిక్కుకొందురు. ఎవరికంటుకొనినను వదలించుకొన వీలుగాని జిగటను నిర్మించెను 30. స్త్రీ పురుషుల కీవిధముగాఁ బరస్పరము మహాప్రీతి కలుగుచున్నది. ప్రీతి సనాతనముగ (మూలమాయవలన) ఆదినుండియే వచ్చుచున్నది. ఇది వివేకముతోఁ బ్రత్యక్షముగాఁ జూడవలెను 31. ఆదియందు సూక్ష్మ ముత్పన్నమయ్యెను. పిమ్మట నా

సూక్ష్మము స్పష్టమై కాన్పించెను. ఈ రెంటివలన నుత్పత్తికార్యము నడుచుచున్నది 32. వాస్తవమునకు శివశక్తియే మూలమునందుండెను. తరువాత వధూవరులై రి. పిదప నెనుబదినాలుగు లక్షల యోనివిస్తారము లుగ వ్యాపించిరి 33. ఇచ్చటఁ బ్రత్యక్షముగఁ జూపిన శివశక్తిరూపమును శ్రోతలు హృదయములోనికిఁ దెచ్చుకొనవలెను. విచారము లేకుండ నుడివిన వాక్యము వ్యర్థమని గ్రహింపనగును 34.

## మూడవ సమాసము - అధ్యాత్మ శ్రవణము

ఆగుమాగుము! వినుమువినుము! తొలుదొలుతనే గ్రంథమును విడిచివేయకుము. చెప్పినదానిని సావధానముగా నాలింపుము 1. అన్ని శ్రవణములలో ముఖ్యమైనది ఈ అధ్యాత్మనిరూపణశ్రవణము. కావున ఈ విషయమును సుచిత్తాంతఃకరణమున విచారింపవలయును 2. శ్రవణ మననములను విచారించినచో నిదిధ్యాసమువలన నిశ్చయముగ మోక్షము సాక్షాత్కారమగును. అది ఋణరూపమున నుండదు. ఋణమనుపేరునే యెత్తుకొనకుము 3. నానావిధములగు రత్నములఁ బరీక్షించునపుడును బదార్థములను దూచునపుడును ఉత్తమమగు బంగారమును వెండినిగఁలుగు నపుడును సావధానముగ నుండవలయును 4. నానావిధములగు నాణెము లను లెక్కించునపుడు నానా ప్రకారములగు పరీక్షల నొనర్చునపుడును, వివేకశాలితో మాటముచ్చటలుగావించునపుడును, మనుజుడు సావధానిగ నుండవలయును 5. ఎట్లన? లభాహార (శివపూజావిశేషము) యందు ధాన్యమును ఏరిఏరి పూజించినయెడల దేవత తృప్తినొందును. ఒకప్రక్క నుండి మంచివి, చెడ్డవి పాటింపక పూజించినచో దేవత కమాన్యత కలు గును. అది తన హృదయమున క్షోభించును 6. ఎప్పుడైన నేకాంతము నందు సూక్ష్మాంశమును యోచింపవలసి వచ్చినచో మిగుల జాగరూక తయుఁ దెలివియు గలిగియుండవలెను. అధ్యాత్మవిచారణమునం దంతకుఁ గోటిరెట్లు అధికముగా సావధానత గలిగియుండవలెను 7. అధ్యాత్మవిద్య మిగులఁ గఠినమైనది. అదివృత్తాంతములు, కథలు, వార్తలు, నాటకములు గొప్పవగు నవతారచరిత్రములకంటెను మిగుల గాఠిన్యమైనది 8. గఠించిన

విషయముల (కథలను) వినుటవలనఁ జేతి కేమిలభించును? పుణ్యప్రాప్తియగు నని కొందఱందురు. కాని యందు యేమియు గనుపించుటలేదు 9. అధ్యాత్మ నిరూపణస్థితి యట్టిదికాదు. దీనివిచారము ప్రతీతిపూర్ణము. దీనినెఱుంగుట వలన సందేహములు నశించును 10. అనేకులు మహానుభావులు జనించి మరణించిరి. వారలందఱు ఆత్మమూలముననే వర్తించిరికాని ఆత్మ మహిమను దెలిసికొనఁదగినవాఁ డింతవఱకు జనింపలేదు 11. యుగాను యుగములనుండి ఈ త్రిలోకములను ఆత్మయొక్కటియే నడుపుచున్నది. కావున ఆత్మవిచారమును మాటిమాటికి కొనసాగింపవలయును 12. ప్రాణు లనేకులు జనించుచున్నవి. అనేకములు మరణించుచున్నవి. తమతమ కార్యములను ఇష్టానుసారముగా వర్ణించుకొనుచున్నవి 13. దేనియందలి యాత్మ యఖండరూపముగఁ బ్రకాశింపకున్నదో యా దేహము వ్యర్థమే. పాపము! ఆత్మవిచారములేని కష్టదేహము ఏమి యెఱుంగఁగలదు? 14. ఇట్టి యాత్మజ్ఞానియే శ్రేష్ఠుడు. ఆతనికి సమానుఁ డెవ్వఁడునుగాఁడు. లోకములోని వివేకవంతులే యీయంశము నెఱుంగుదురు 15. పృథివ్యాపస్తేజముల విచార మీ భూమియందే లభించును. కాని యన్ని తత్త్వములకును బీజమగు అంతరాత్మ వేఱుగ నున్నది 16. వాయువునకు ముందుఁగూడ వివేకము గావించు పురుషునకు ఆత్మ సమీపముననే లభించును 17. క్రమముగా సూక్ష్మరూపమునుండి వాయువు, ఆకాశము, గుణమాయ, ప్రకృతి పురుషులు, మూలమాయ, మున్నగువానిని విచారమొనరించి ప్రతీతిని గడించుట మిగులఁ గఠినము 18. మాయాదేవి జంజాటమునందుఁ దగుల్కొనిన పిదప నెవ్వఁడు సూక్ష్మము నందు మనస్సు లగ్నముచేయఁగలఁడు? సూక్ష్మమునందు మనస్సు లగ్నము గావించువానికి సందేహవృత్తి నశించును 19. మూలమాయ (బ్రహ్మాండమునకు) నాలుగవదేహము. విదేహుఁడు కావలెను. విదేహుఁడు (దేహాతీతుఁడు) అగు సాధువే ధన్యుఁడు 20. సారమువలన ఉన్నతస్థానమున కెక్కువారికె ఊర్ధ్వగతి లభించును. (మోక్షము లభించును.) పదార్థమునందే పడియుండువారల కధోగతి కలుగును 21. పదార్థములు చూచుటకు మిగుల యోగ్యములుగా నుండును. కాని యవి క్షణమాత్రముననే నాశన మొందుచుండును. ఈ కారణమున జనులు రెండువిధము

లను భ్రష్టులగుచున్నారు 22. కావునఁ బదార్థజ్ఞానము మఱియు నా నా విధానుమానము మున్నగువాని నన్నింటిని దొలంగి నిరంజన పరబ్రహ్మ మును శోధించుచుండవలెను 23. అష్టాంగయోగమును, పిండజ్ఞానమును, అంతకంటెను గొప్పదగు తత్త్వజ్ఞానమును, దానికంటెను పెద్దదియగు ఆత్మ జ్ఞానమును విచారింపవలెను 24. మూలమాయ కావలితావును మూల మునందు (ఆదిలో) హరిసంకల్పము (అహం బ్రహ్మాస్మి అను దాని స్ఫురణము) కలుగు ప్రదేశమేదియో యటకు ఉపాసనయోగముతోఁ జేరవలెను 25. దానికావల నిఖిలమును, నిర్గుణమును నగు బ్రహ్మము గలదు. అది నిర్మలముగను, నిశ్చలముగ నున్నది. దాని నాకాశముతోఁ బోల్పవచ్చును 26. అది యిచ్చటనుండి యచ్చటివఱకు నిండియున్నది. అంతియగాదు. ప్రాణిమాత్రులతోఁ గలిసియున్నది. పదార్థముల నంటి యున్నది. అన్నింటియందును వ్యాప్తమైయున్నది 27. దీనికి సమానమగు గొప్పది వేఱొకటిలేదు. దాని విచారము పిండబ్రహ్మాండములు సంహార మైనపిదప విదితమగును. అదియంత సూక్ష్మాతి సూక్ష్మముగనున్నది 28. పిండబ్రహ్మాండము లున్నను ఒకవేళ వివేక ప్రళయమును జూచినపక్షమున నైనను వాస్తవములో శాశ్వత మెద్దియను నంశము విదితముగాఁ గలదు 29. సమస్తతత్త్వములను వివేచించి, సారాసార విచారమొనరించి పిదప సావధానము ననుసరించి సుఖపూర్వకముగా గ్రంథమును విడిచివేసిన యెడల హాని యేదియు నుండదు సుమా 30.



## నాలుగవ సమాసము — సంశయమునశింపఁజేయుము.

పలువురి కుపకరించు నుపయోగమును దెలుపుమని ప్రార్థించిన చో వక్త శ్రోతను కలఁతపెట్టఁజనదు. మఱియుఁ జెప్పుచుఁజెప్పుచుఁ గ్రమమును విడువఁదగదు 1. శ్రోతయేదేని సందియమును దొలంగిం పుమని కోరినచో దానిని వెంటనే నివారింపవలయును. తాను నుడివిన మాటవలనఁ దనమాటయే ఖండమగునట్లు భాషింపఁజనదు 2. ముందు జెప్పఁబోవుదానిపయి ధ్యానముంచుటవలన వెనుకఁజెప్పిన విషయము (అసంపూర్ణముగ) దిగఁబడునట్లు భాషింపదగదు. అంతియగాదు. వెనుకఁ జెప్పినయంశముపై ధ్యాసయుంచుటవలనఁ జెప్పఁబోవుసంగతి మనస్సున

కంటనట్లును భాషింపఁజనదు. ఈ పరిస్థితు లన్ని తావులందును గలుగు తెలుంగున నైతేము మాటలాడరాదు 3. స్వయముగాఁ దాను మునిఁగి పోవు ఈఁతకాఁడు ఇతరుల నెట్లుల వెలికితీయఁగలఁడు? ఇట్లుసందేహ మగ్నుఁడై జనులసందేహముల హరింపలేనివాఁడు జనుల నేమి యుద్ధరింపఁగలఁడు? 4. ఒకవేళ మనము సంహారమును వర్ణింపవలసియున్న యెడల అన్నింటిసారమునుగూడ వివరించుట ఆవశ్యకము. మఱియు దుస్తరమగు మాయానదియొక్క నావలితీరమును జేరగల్గువిధముగూడఁ జూపింపవలెను 5. (ప్రసంగమును) ఎన్నిసూక్ష్మనామములను గైకొందునో వాని యన్నింటి రూపములను ప్రకటన మొనర్చి శ్రోతలకుఁ జూపింపవలెను. అప్పుడే విచారశీలుఁడగు ఈవక్తయని లోకులు ప్రశంసింతురు 6. బ్రహ్మమనునెట్టిది? మూలమాయ యెట్లున్నది? అష్టధాప్రకృతియు శివశక్తియు నేవిధముగనున్నవి? అట్లే షడ్గుణేశ్వరునియొక్కయు గుణసామ్యము (గుణమాయ) యొక్కయు స్థితిగతు లెట్టివి? 7. అర్ధనారీనటేశ్వరుఁడు, ప్రకృతిపురుషుల విచారము, గుణక్షోభిణి, ఆపిమ్మటఁ ద్రిగుణములు ఎట్లుండును? 8. పూర్వపక్షమున కాదియేది? అంతమెద్ది? వాచ్యాంశ, లక్ష్యాంశములకు భేదమెద్ది? మున్నగు నానాసూక్ష్మాంశముల విచారించు సాధుపురుషుఁడు ధన్యుఁడు 9. అట్టిసాధుపురుషుఁ డెన్నఁడును నానావిధములగు వ్యర్థవిస్తారములలోఁ దగుల్కొనఁడు. చెప్పిన దానినే మఱలఁ జెప్పఁడు. పరమేశ్వరుని మనస్సులోనికిఁ గొనివచ్చును 10. పరబ్రహ్మము విశుద్ధము, ఏకము నై యున్నదని యొక్కమాఱును, కాదు జగత్తంతయుఁ బరబ్రహ్మమేయని యొక్కమాఱును, ద్రష్టయును సాక్షియును, అన్నింటి కావలనున్న సత్తామాత్రమునునై యీపరబ్రహ్మమున్నదని యొక్కమాఱును జెప్పువక్త సరియగువక్త గాఁడు 11. ఆతడు (ఆవక్త) నిశ్చలమును జంచలముగను, జంచలమును నిశ్చల పరబ్రహ్మముగను జెప్పును. ఇట్లే బరస్పరభిన్నభావములను శ్రోతలకుఁ గలుగఁజేయును. ఒకదానినేని నిశ్చలము గావింపఁడు 12. అతఁడు చంచల, నిశ్చలముల నన్నిఁటిని కేవలచైతన్యమనియే వివరించును. అంతియగాక భిన్నభిన్నరూపములను స్పష్టపఱచి వివరింపఁజాలడు 13. ఈవిధముగ వ్యర్థమాయాజాలమునందు స్వయమునఁబడియున్నవాఁడు ఇతరులకు

నెట్లుబోధింపఁగలఁడు? నానావిధములగు నిశ్చయములను గావించుటవలన (అస్థిరములను నిశ్చయములని వివరించుటవలన) వ్యర్థములగుసందేహ ములు పెరిగిపోవును 14. భ్రమను పరబ్రహ్మముగను, పరబ్రహ్మమును భ్రమగను వివరించుచు అసమర్థుఁడగువక్త తన జ్ఞాతృత్వమిషను బ్రకటిం చును 15. ఆతఁడు శాస్త్రము లాధారముగాఁ జూపుచు అనుభవము లేని నిరూపణము లొనరించుచు సందియముల దీర్పుమన్నఁ గోపగించుచు నుండును 16. జ్ఞాతయయ్యును బద్ధార్థాపేక్షయు నిస్పృహాహరహితుఁడును నగువాఁడు పాపము ఇతరుల కేమి బోధింపగలడు? సారాసార నిశ్చ యము జరుగవలెను 17. వైద్యుఁడు తన మాత్రల మహాత్త్వమును మిగులఁ బ్రశంసించును. కాని మాత్రలు కొంచెమేని గుణమీయవు. అనుభవములేని జ్ఞానస్థితి గూడ నిట్టిదే 18. సారాసార విచారములేని తావున సమస్తమును అంధకారమే. అచట నానావిధ పరీక్షలను గూర్చిన విచారము జరుగఁజాలదు 19. అవివేకియగువక్త పాపపుణ్యములను, నరక స్వర్గములను వివేకావివేకములను అన్నింటిని సర్వబ్రహ్మమని చెప్పును 20. అతఁడు పతితమును, పావనమును, నిశ్చయమును, అనుమానమును గూడ బ్రహ్మరూపమని విశ్వసించును 21. సమస్తమును బ్రహ్మరూపముగ నున్నతావున బ్రహ్మమునకంటె వేఱుగుదానిని నెవఁడు విడదీయఁగలఁ డు? శర్కరామయముగ నున్నతావున వేఱువస్తువు నెట్లు సమకూర్పఁ గలుగుదుము 22. ఇట్లే సారాసారము లేకాకారమగు తావున అవిచార ములు ప్రబలును. విచారమనునది నామమాత్రమునకుఁగూడనుండదు 23. వంద్యమును, నింద్యమును నేకమగు తావున చేతికబ్బునది యేమున్నది? మత్తుపదార్థములు సేవించి మతిచెడి కూర్చుండిన యాతఁడు అవకతవక లుగ నేదియో వదరుచునే యుండును. 24. ఇట్లే అసమర్థుఁడగు వక్త అజ్ఞానరూపమగు భ్రమతో సర్వమును మఱచియున్నాఁడు, 'సర్వ బ్రహ్మ' యనియే నిశ్చింతముగఁ గూర్చుండి యున్నాడు. ఆతఁడు మహాపాపా త్ముని, సత్పురుషుని, సమముగా భావించుచున్నాఁడు 25. సర్వసంగపరి త్యాగమును, ఇచ్చకువచ్చినటు లొనరించు విషయభోగమును, ఒకవేళ నొక్కటిగనే భావించునెడ నిఁక శేషించిన దేమున్నది? 26. భేదము నీశ్వరుఁడే కల్పించెను. భేదమునిప్పుడు అయజ్ఞాని కాదు. ఆతనియబ్బ

స్వైతమును నుడచినేయలేడు, ఈశ్వర నియమమునకు విరుద్ధముగ నెవ్వఁ డేవిధముగ నొనర్పఁగలఁడు? నోటిలో వేసికొనఁదగు పదార్థమును అపాన ద్వారమున వేసికొమ్ము. (చూతము) 27. ఏవిషయోపభోగముల కేయేయింద్రియములు నిర్వచింపబడునో అవియే యాసౌఖ్యములను సాంగోపాంగముగ ననుభవించును. ఈసమస్తజగమీశ్వర విరచితము. దీని నియమముల నితరులు త్రిప్పఁజాలరు 28. ఇవియన్నియు భ్రాంతివలనఁ గలుగు ప్రమాదములు. ప్రతీతిలేని సమస్తవిషయము మిథ్య. వెఱ్ఱియెత్తిన వాఁడు వెఱ్ఱిగ నేదేని భాషించుచుండును 29. కావున సావధానియు, అనుభవనీయుఁడును, జ్ఞాతయు నగువాని నిరూపణముల నాలింపవలెను. ఇట్లొనరించినయెడల ఆత్మ సాక్షాత్కారమగును. ఎఱుక తత్క్షణమే లభించును 30. వెనుకముందుల బాగుగా గుర్తెఱుంగవలెను. పాదములనుజూచి వీఁడుగ్రుడ్డివాఁడని నిశ్చయింపవలెను. వ్యర్థ భాషణమును వమనప్రాయముగఁ పరిత్యజింపవలెను 31.

---

## ఐదవసమాసము — అజపానిరూపణము

అజపాజపసంఖ్య ఇరువదియొక్కవేయి ఆఱునూఱులని పెద్దలు నిర్ణయించిరి. విచారమొనరించినచో అంతయు సులభమే 1. ప్రాణము ముఖమునుండియు, నాసికనుండియు అఖండముగా వచ్చుచుఁ బోవుచున్నది. సూక్ష్మదృష్టితో నీయంశము విచారింపనగును 2. మొట్టమొదటఁ జూచినపుడు స్వరమొక్కటిగనే గోచరించును. వాస్తవమున కాస్వరమునకు మూఁడు భేదములుగలవు 1. తార=నిషాదము 2. మంద్రము=మధ్యమము 3. ఘోరము=ఖర్జము. అజపావిచారము ఘోరమున కంటెను మిగులసూక్ష్మమైనది 3. స, రి, గ, మ, ప, ధ, ని, అను నీయేడు అక్షరములను నుడివిచూడుము. ఈ గుప్తస్వరములలో నేదైన నొకదానిని మూలముగ భావించి (శ్రుతిస్థానముగఁ జేసికొని) క్రమముగఁ బైకిపొమ్ము 4. పరవాచలకుఁ బైనను పశ్యంతికి క్రిందను (నాభికిహృదయమునకు మధ్య) స్వరమునకు జన్మస్థానము గలదు. స్వరస్ఫురణ మచటినుండియే కలుగుచున్నది 5. ఏకాంతమున స్వస్థుఁడై కూర్చుండవలెను. అచట దీనినంతయు గ్రహించవలెను. ప్రయోగము నొనర్పవలెను.

పవనమును అఖండముగా లాగికొనవలెను. విడువవలెను 6. ఏకాంత మునందు మౌనముగాఁ గూర్చుండవలెను. సావధానిగనో, సుఖిగనో యుండి చూచినచో శ్వాసము పైకిలాగునపుడు సోయనియు, వెలుపలికి శ్వాసమువిడుచునపుడు హంఅనియు నిట్లే నిరంతరము సోహం సోహం అను శబ్దము కలుగుచున్నట్లు విశదమగును 7. ఉచ్చారణము లేక కలుగు శబ్దములను నైసర్గికశబ్దములని గ్రహింపవలెను. ఆశబ్దము లనుభవములోనికి వచ్చుచుండునుగాని వానికిఁ బేరులుమాత్రము లేవు 8. ఆశబ్దములను గూడ విడిచి కూర్చుండువానిని మహామౌనియని నుడువనగును. యోగాభ్యాసపు జంజాటమంతయు నిటులే యున్నది 9. ఏకాంతస్థలమున మౌనముగాఁగూర్చుండి బయలువెడలుశబ్దమును విచారించినచో అంతరమునందు "సోహం" అనుశబ్దములె భాసమగును 10. శ్వాసము దీసికొను తఱి సోయనియు విడుచునపుడు హంఅనియు నీవిధముగా అఖండముగా సోహం సోహంఅను నీశబ్దము జరుగుచుండును. దీనివిచారము మిగులవిస్తృతము 11. సమస్తదేహాధారులగు ప్రాణులు స్వేదజోద్భిజ్జాది యోనులు, మున్నగు ప్రాణులన్నియు శ్వాసోచ్ఛ్వాసాదులులేనిచో నెట్లు బ్రతుకఁగలవు? 12. అజప ఈ విధముగ నెల్లరికడ నున్నది. ఈయంశము జ్ఞాతకె తెలియును. (అజ్ఞానికిఁదెలియదు) సహజమును (నైసర్గికమును) విడిచి కల్పితవిషయమునఁ బడఁగూడదు 13. సహజదేవుఁడు చెదరకయే యున్నాఁడు. అతఁ డవినాశి. కల్పితదేవుఁడు (విగ్రహాదులు) పగిలిపోవును. వినాశనమగును. కాన నాశవంతమగు దేవునిపై విశ్వాస మెవ్వఁడుంచును? 14. జగదంతరాత్ముని (రాముని) దర్శించినచో స్వాయముగ సులభముగ అఖండధ్యాన మలవడును. సమస్తజనులును ఆత్మారాముని యభీష్టానుసారముగ వర్తించుచున్నారు 15. ఆత్మారామునకు సమాధానమగు విధముగ భోజనము మానవునకు లభించును. విడిచివేసినవి, నాశనమొందినవి నగునవెల్ల నాతనికే యర్పణమగును 16. అగ్నిదేవత లుదరమున వసింతురు. వారికిఁగూడఁ బ్రాణులు అవదానము నొసంగుచుందురు. ఈ విధముగా సమస్తప్రాణులుఆత్మారాముని ఆజ్ఞానుసారముగా మెలంగుచుందురు 17. పరమాత్ముని జపధ్యానస్తవాదులు ఈవిధముగా స్వాభావసిద్ధమగురీతితో జరుగుచున్నవి. ఆత్మారాముఁడు వానిని స్వీక

రించుచునే యున్నాఁడు. (కాని ఈ విషయ మెఱుఁగవలెను) 18. ఈ నైసర్గికవిషయమును గ్రహించుటకు జనులు నానావిధములగు హఠ యోగము లొనర్చుచున్నారు 19. పాతిపెట్టినధనము మఱచినచో దరిద్రము కలుగును. ఒకప్పుడు నిధినిక్షేపాదులపై మనుజులు తిరుగు చుందురు. కాని యాదరిద్రప్రాణు లేమిచేయుదురు? తాము నిధినిక్షేపాదు లపైఁ దిరుగుచున్న సంగతియే యెఱుఁగరు 20. భూగర్భమునం దనంత ముగా ద్రవ్యమున్నది. గోడలలో ద్రవ్యముంతురు. స్తంభములందును దూలములందును ధనము దాచుదురు. దరిద్రు లాద్రవ్యమునకు మధ్య కాపురము జేయుచుందురు 21. అభాగ్యుఁ డీవిధముగ లక్ష్మీమధ్యమున నాట్యమాడుచుండును. కాని వానిదరిద్రము క్రమక్రమముగాఁ బెరిగి పోవుచుండును. ఇటఁ బరమానందులగు పరమపురుషుల ఆశ్చర్యస్థితిని జూడుఁడు 22. ఒకఁడు కూర్చుండియున్నాఁడు. ఒకఁడు తినుచున్నాఁడు. ఇది వివేకగమనము. ప్రవృత్తి నివృత్తులస్థితి సైత మిట్టిదియే 23. అంతః కరణమునందు శ్రీమన్నారాయణమూర్తి వసించియున్నప్పు డిఁక లక్ష్మి కేమికొదువ! లక్ష్మిగలవానిని (లక్ష్మిగృహమును = పరమాత్మని) బాగుగా దృఢముగా నాశ్రయింపవలెను 24.

---

## ఆఱవ సమాసము – దేహి, దేహము.

దేహి (ఆత్మ) దేహము నందుండును. నానావిధసుఖదుఃఖముల భోగించుచుండును. మఱియు నంత్యమునం దొకట్రమాఱుగ ఆత్మ దేహమును విడిచివేయును 1. తరుణత్వమునందు దేహము పుష్టిగా నుండును. అందుచేఁ బ్రాణి నానాసుఖభోగముల ననుభవించును. వృద్ధా వస్థయందు అశక్తస్థితినొంది దుఃఖముల ననుభవించును 2. చావవలదను కోరిక మాత్రముండును. అంత్యమునందుఁ గాళ్లుచేతులు గుంజుకొని ప్రాణములను విడుచును. వృద్ధత్వమునం దెన్నియేని కఠినదుఃఖములను సహించును 3. దేహము ఆత్మల సాంగత్యమున స్వల్పముగా సుఖము ననుభవించును. అంత్యకాలమున గిలగిల తన్నుకొని మరణించును 4. ఇట్టి యాత్మ దుఃఖదాయకమైనది. ప్రపంచము నందొకజంతువు రెండవ జంతువును జంపి దాని యుసురు గొనును. అంత్యమునందు ఏయుద్దేశమేని

వెలువడదు 5. ఇది యీ విధముగ రెన్నాళ్ళభ్రమ. దీనినే జనులు పరబ్రహ్మమందురు. నానాదుఃఖములగోల దీనియందేయున్నది. జనులు దీనినే సుఖమని విశ్వసించుచున్నారు 6. దుఃఖియై గిలగిల తన్నుకొనుటలో నేమి సమాధానమున్నది? ఒకానొకప్పుడు గొప్పగనో కొద్దిగనో సుఖము లభించినను దుఃఖము తక్షణముననే సిద్ధముగ నున్నది 7. పుట్టినది మొదలుకొని కలుగు దుఃఖములన్నింటిని దలంచికొన్నచో సర్వము విదిత మగును. ఈ జన్మమున దుఃఖము లెన్నియో నిండియున్నవి. ఈ దుఃఖ ముల నెంతదనుక లెక్కింపఁగలను? 8. ఆత్మల సాంగత్యస్థితి యిట్టిది. ఏమన ! నానాదుఃఖములు కలుగుచున్నవి. ప్రాణులందఱు దుఃఖములతో విసిగి వేసారిపోవుచున్నారు 9. జన్మము నందంతటను గొంత యానంద మున్నచోఁ గొంతదుఃఖముకూడ దానివెంటనే యున్నది. పలుతెఱంగు లగు విరుద్ధపరిస్థితు లుత్పన్నమై ప్రాణుల కనేకదుఃఖములు ప్రాప్తించును10. నిద్రాకాలమున నల్లులును, దోమలును మానవుని బలుతెఱంగుల బాధిం చును. వానిబాధ తొలంగుట కేదేని యుపాయము గాపింతమేని యాప్రాణులకు దుఃఖము కలుగును 11. భోజనకాలమునం దీఁగలు వ్రాలును. ఆహారవస్తువులను ఎలుకలు గొనిపోవును. ఇంతలోఁ బిల్లులు వచ్చి యా యెలుకలను జంపితినును 12. పేలు, మిణ్ణల్లులు, జెఱ్ఱులు, మానాపతులు మున్నగు ననేక జంతువులు పరులను శ్రమపెట్టి జీవించు చున్నవి. స్వయముగఁ దామునుగూడఁ గష్టము లొందుచున్నవి 13. తేలు, పాము, పులి, ఎలుగుబంటి, మొసలి, తోఁడేలు, మనుష్యుఁడు మున్న గునవి దమలోఁదాము (ఒకటి రెండవదానికి) దుఃఖదాయకములుగా నున్నవి. అన్నియు దుఃఖమయములే. సుఖసంతోషములు దేనికిని లేవు 14. ఈ యెనుబదినాలుగు లక్షల జీవయోనులలో నొకటి రెండవదానిని భక్షించుచునే యున్నది. నానాపీడలు, నానాదుఃఖములు గలవు. ఎంత దనుకఁ జెప్పఁగలము? 15. అంతరాత్మ కృత్యము లిట్టివి. ఈ భూమిపై నిండియున్న సమస్తజీవులలో నొకటి రెండవదానిని సంహరించుచున్నది. జీవజాలమంతయు నెల్లప్పుడు ఏడ్చుచునే యుండును 16. గిలగిల కొట్టు కొనును. గుంజుకొని గుంజుకొని ప్రాణములు విడచును. ఇట్టి యాత్మను మూర్ఖులు పరబ్రహ్మమని యేలయందురో తెలియకున్నది 17. పరబ్రహ్మ

మొక తావునుండి వేరొక తావునకుఁ బోవదు. ఎవరికేని దుఃఖము గలిగింపదు. పరబ్రహ్మమునకు స్తుతి నిందలలో నేదియుఁ దగులదు 18. ఎన్ని తిట్టులైనఁ దిట్టుము. అవి యన్నియు అంతరాత్మకె తగులును. యోచించినచో అంతయు యథాతథ్యముగఁ బ్రత్యయములోనికి వచ్చును 19. తిట్లు పలుతెఱుంగుల నుండును. వాని నెంతదనుక వివరింపఁ గలను? 20. తిట్లు పరబ్రహ్మమునకుఁ దగులవు. కల్పనమే నడువదు. అసంబద్ధమగు జ్ఞాన మెన్నడును మాన్యము గాదు 21. సృష్టియందు జీవసముదాయమనంతముగాఁగలదు. అన్నింటికిని వైభవమెక్కడినుండి వచ్చెను? ఈశ్వరుఁడు ఆ నానాజీవులకు యోగ్యతానుసారముగ వైభవము పంచిపెట్టును. సర్వసాధారణులగు మానవులెందఱో గలరు. కాని వారిలో ఉత్తమోత్తమ విషయములను భాగ్యవంతులగు పురుషులే పొందుదురు 23. ఇట్లే భోజనము, పాత్రములు, దేవతార్చనము, బ్రహ్మజ్ఞానము సైతము ప్రారబ్ధానుసారముగా లభించుచుండును 24. సర్వసాధారణముగా జనులందఱును సుఖులుగనే యుందురు. ప్రపంచమును సుఖపూర్ణమనియే భావింతురు. కాని మహారాజు లనుభవించు మహావైభవములు అభాగ్యపురుషున కెట్లు లభ్యమగును? 25. కాని అంత్యమునం దందఱికిని నానా విధదుఃఖములు గలుగును. ఆకష్టసమయమున రాజు, దరిద్రుఁడు మున్నగు వారలందఱును సమానమగుదురు. కాని మొదటినుండి నానాసుఖముల ననుభవింప నలవాటుపడినవారలు మాత్రము అంత్యమున దుఃఖమును సహింపఁజాలరు 26. కఠినదుఃఖమును సహించుట చాలకష్టము. శరీరమును ప్రాణములు త్వరత్వరగా వీడవు. మృత్యుదుఃఖ మీవిధముగా సమస్తజనులను బీడించును 27. జను లనేకులు అవయవహీనులై యుందురు. ఈ విధముగ నంత్యకాలమునందు దుఃఖములొందిన పిదపఁ బ్రాణములు వెడలిపోవును 28. సమస్తరూపలావణ్యములు, శారీరక సామర్థ్యముగూడ నొకప్రక్కనుండి తొలంగిపోవును. ఒకవేళ నెవరేని చుట్టు ప్రక్కల లేకపోయినచోఁ బ్రాణియింకను దుర్దశకుఁబాలై వెడలిపోవును 29. అంత్యకాలపుబాధ అందఱికె సమానముగ నుండును. ఈ విధముగ నీయాత్మ చంచలమును, అవలక్షణమును, దుఃఖకారకము నైయున్నది 30. ఇట్లయ్యుఁగూడ దీనిని (ఆత్మను) భోగించినను అభోక్త

యందురు. ఇదియంతయు అజ్ఞాతభావనవలన జరుగుచున్నది. జనులు విచారింపకయే యిట్లు (ఆత్మను అభోక్తయని) నుడివి యూరకుందురు 31. అంత్యకాలము మిగులఁ గఠినమైనది. ప్రాణములు శరీరమును సులభముగా విడువవు. అంతియగాక ఆశాతృష్ణలుగూడ దృఢముగా నావరించు కొనును 32.

## ఏడవసమాసము — సంసారగతి.

ఆదియందు జలము నిర్మలముగా నుండును. కాని యది పలు తెఱంగులగు తీఁగెలలో బ్రవేశించినంతన సంగదోషముచే బులుపు, కారము, చేదు మున్నగు రుచులొందును 1. ఆత్మ ఆత్మత్వముతో నుండును. దేహసంగమువలన వికృతమగును. మరియు నభిమానవశమున ఇచ్ఛకు వచ్చినరూపము నొందును 2. మంచిసాంగత్యము లభించినచో ఆత్మస్థితి చెఱకులోనికి మధురత్వమువచ్చినట్లగును. (చెడ్డసాంగత్యమువలన) ఆత్మ స్థితి ప్రాణఘాత గావించు విషవల్లికిఁ దుల్యమగును 3. పదునెనిమిది తెఱంగులగు వనస్పతులు గలవు. వానివానిగుణములను వేఱువేఱుగ నెంతదనుక వర్ణింపఁగలను? నానాదేశములందున్నకతన ఆత్మస్థితియు నిట్టిదె 4. మంచివగు నాత్మలు సత్సంగమువలన దరికిఁజేరుచున్నవి. వివేకబల మున ఆత్మలు దేహాభిమానమును వదలుచున్నవి 5. ఉదకమునకు వినా శనమే యగును. కాని యాత్మ వివేకమువలన దరిజేరును. ఆత్మప్రత్యయ మిట్టిది. వివేకముతోఁ జూడుఁడు 6. స్వహితము గావించుకొననివాని కెంతదనుకఁ జెప్పవలయును? ఇదియంతయుఁ బ్రతిమానవుఁడును స్వవిషయ మునఁ దెలిసికొనవలెను 7. తన్నుఁదాఁ గాపాడుకొనువానిని మనకుమిత్రు నిగను దనకుఁదాను స్వయముగా నాశనము గావించుకొనువానిని వైరిని గను దలంపనగును 8. తనకుఁ దాను అహితము గావించుకొనఁదలఁచిన వానినెవ్వఁడభ్యంతరపెట్టఁగలఁడు? ఇట్టిపురుషుఁ డేకాంతమునకరిగి తనజీవుని దానుజంపుకొనును 9. తనకుఁదా నపాయము గలుగఁజేసికొనువాఁడాత్మ హాత్యా పాతకుఁడని నమ్ముఁడు. వివేకశాలియగు సాధువే ధన్యుఁడు 10. మానవులు సత్సంగతివలనఁ బుణ్యాత్ములు, అసత్సంగతివలనఁ బాపా త్ములు నగుదురు. సుగతియు, దుర్గతియు సహవాసయోగమునఁ గలు

గును 11. కావున ఉత్తమ సాంగత్యము గావింపవలెను. తనచింతను దానే స్వాయము గాఁ జేసికొనవలెను. మఱియు జ్ఞాతయగువాఁడు తనబుద్ధి నంతఃకరణమునందుఁ జక్కఁగా మననము గావింపవలెను 12. జ్ఞాతయగువాని కిహలోకము, పరలోకము సౌఖ్యకరమగును. అజ్ఞాని కవివేక కారణమున ఇహపరలోకములు దుఃఖదాయకములగును 13. జ్ఞాని దేవాంశసంభూతుఁడు. అజ్ఞాని రాక్షసాంశ సంభూతుఁడు. ఇఁక నీయిరువురిలో నెవరు గొప్పవారలో తెలిసికొనవలెను 14. జ్ఞాత సర్వమాన్యుఁడుగను అజ్ఞాత అమాన్యుఁడుగను నుండును. ఈ యిరువురిలో నెవరినాశ్రయించినచో మనము కృతార్థులమగుదుమో వారినే యాశ్రయింపవలెను 15. ఉద్యోగియుఁ, జతురుఁడు నగువానిస్నేహము జేసినవాఁడు ఉద్యోగియుఁ, జతురుఁడు నగును. ఇట్లే సోమరితోడను మూర్ఖునితోడను జెలిమిఁజేయువాఁడు సోమరిగను మూర్ఖుఁడుగను నగును 16. ఉత్తమసాంగత్యఫలితము సుఖము. అధమసాంగత్యఫలము దుఃఖము. ఆనందమును విడిచి దుఃఖము నెవఁడుగైకొనును? 17. విషయము స్పష్టముగనేయున్నది. మనుష్యమాత్రులందఱు నీ రెండుసాంగత్యములలోనే వర్తించుచున్నారుగావున నీవిషయమునఁ బ్రపంచమున కనుభవముగూడఁ గలుగుచున్నది 18. సత్సంగతి వలన సమస్తసుఖములు లభించును. అసత్సంగతివలన సమస్తదుఃఖములు గలుగును. సంపూర్ణకార్యములను వివేకముతో నొనరింపవలెను 19. ఆకస్మికమున నేదేని చిక్కులలోఁ దగుల్కొన్న యెడల నా చిక్కులలో నుండి వెలువడుటకు యత్నింపవలెను. వెలువడిన పిమ్మట సావధానత యెంతయేని గలుగును 20. నానావిధముల వర్తించు దుర్జనుల సంసర్గము వలన క్షణక్షణమునకును మనోభంగము గలుగును. కీర్తికాముఁ డిహలోకమునఁ దనప్రతిష్ఠనుంచి వెళ్లనగును 21. ప్రయత్నకారణమునఁ జతురున కేయంశమునందును లోపముండదు. అతఁడు సుఖసంతోషముల ననుభవించును. ఆతనిగుణగణమును లోకులు నానావిధములఁ బ్రశంసింతురు 22. జను లీస్థితిలో నిపుడున్నారు. (మఱియుఁ బ్రత్యక్షముగా) నీస్థితిలో వర్తించుచున్నారు. కాని యెవ్వఁడు (దీనిని) తెలిసికొని చూచునో వానివలనఁ బ్రయత్నములు నెరవేరును 23. ఈ వసుంధర బహురత్నఖనియైయున్నది. బాగుగా నెఱింగి యోచింపుము. ఏలయన !

తెలిసికొనుటవలన అంతఃకరణమునకు నమ్మకముగలుగును 24. మానవుఁడు దుర్బలుండును, సంపన్నుఁడును, బిచ్చివాఁడును, వ్యుత్పన్నుఁడును అగుట అఖండరీతిగ (సృష్ట్యాదినుండియే) వచ్చుచున్నది 25. ఒక భాగ్యవంతుఁడు చెడిపోయినచో రెండవవాఁడు భాగ్యవంతుఁడగుచుండును. ఇట్లే విద్యయు, ఉత్పత్తియు గలుగుచుఁ బోవుచున్నవి 26. ఒకఁడు సంపన్నుఁడగు చున్నాడు. వేఱొకఁడు రిక్తహస్తుఁడు అగుచున్నాడు. రిక్తహస్తుఁడు మఱల సంపన్నుఁ డగుచున్నాఁడు, సంపన్నుఁడుగూడఁ గొంతకాలము జరిగిన పిదప రిక్తుఁడగును 27. ఇది సంసారస్థితి. సంపద రెండుజాముల వేళయం దగుపించు నీడవంటిది. వయఃపరిమితిగూడ మెల్ల మెల్లఁగాఁ బూర్తికావచ్చినది 28. బాలతారుణ్యవార్ధక్యాదిదశలను మానవులు స్వయముగా నెఱింగియే యున్నారు. కావున నెల్లరును దమజీవితమును సార్థకముగావింపవలెను 29. దేహమెట్లు చేసిన నట్లుపకరించును. యత్న మొనరించిన యెడలఁ గార్యము సిద్ధించును. అట్టియెడ మానవుఁడు దుఃఖియేలకావలయునో నాకుఁదోఁచకున్నది 30.

---

## ఎనిమిదవ సమాసము — పంచీకరణము, దేహచతుష్టయము.

నాభినుండి స్ఫురణరూపమున బయలు వెడలు వాణిని పరావాణి యందురు. ధ్వనిరూపమున పశ్యంతివాణి యందురు. ఈ పశ్యంతివాణి హృదయమునందుండును 1. నాదము కంఠమునుండి జనించును. ఆ నాదమును మధ్యమవాణి యందురు. అక్షరముల యుచ్చారణ జరిగినపుడు బయలు వెడలు వాణిని వైఖరియందురు 2. పరావాక్కునకు నెలవగు నాభిస్థానమే అంతఃకరణమునకు ఉనికిపట్టు. ఇఁక నంతఃకరణ పంచకము యొక్క నిశ్చయము నాలకింపుఁడు 3. నిర్వికల్పావస్థయందు (శూన్యాకారవృత్తి గలిగిన పిమ్మటఁ) గలుగు స్ఫురణము (ఒకవిధమగు స్మరణము)నే అంతఃకరణమనియు లేక చేతనశక్తియనియు నెఱుంగవలయును 4. అంతఃకరణలక్షణము స్మరణము. ఆ పిమ్మట అగును—కాదు, చేయుదునా? చేయకుందునా? అని కలుగు భావనయే మనస్సు 5. అనఁగా సంకల్పవికల్పములు గలుగుటయే మనోధర్మము. ఇదియే మనస్సుయొక్క చిహ్నము. ఈ మనస్సునుండియే సందేహ ముత్పన్నమగుచున్నది. తరు

వాత అంత్యమునఁగలుగు నిశ్చయమే బుద్ధిరూపము. అనఁగా నిశ్చయము గావించుట బుద్ధిధర్మము 5. చేసియే తీరెదననిగాని, చేయనేచేయను అని గాని నిశ్చయించుటయే బుద్ధిధర్మము. వివేకముతో నీవిషయము నాంత ర్యముసం దెఱుంగవలెను 7. నిశ్చితమగు వస్తువును జింతన మొనరించుట చిత్తలక్షణను. ఇవ్విషయమున సందియములేదు 8. "ఈ కార్యము నవశ్యము చేయువలెను." అను నభిమాన ముంచుటగాని, అట్టి కార్య మునకుఁ బూనుకొనుటగాని అహంకారము 9. ఇదియే అంతఃకరణ పంచకము. ఐదువృత్తులునుగలిసి ఒక్కటిగ నున్నవి. కార్యవిభాగము వలన అయిదువిధములుగ వేఱువేఱైనవి 10. ఇట్లే కార్యవిభాగమును బట్టి ఐదుప్రాణములును వేఱువేఱుగాఁ జెప్పఁబడుచున్నవి. అట్లుకాకున్నచో వాయురూప మొక్కటియేగదా? 11. వ్యానము సర్వాంగములందును, సమానము నాభియందును, ఉదానము కంఠమునందును, అపానము గుద మందును, ప్రాణము ముఖనాశికములందును నుండును. ఇది నిశ్చయమని యెఱుంగవలయును 12.

ప్రాణపంచకము నిప్పుడు చెప్పితిని. ఇఁక జ్ఞానేంద్రియ పంచకమును వినుండు. చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు అను నీయైదును జ్ఞానేంద్రియములు 13. వాణి, చేతులు, పాదములు, శిశ్నము, గుదము, అను నీ యైదును కర్మేంద్రియములు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను నీయైదును (ఐదు జ్ఞానేంద్రియముల) విషయములు 14. అంతఃకరణ పంచకము, ప్రాణపంచకము, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచ కము, విషయపంచకము అనునివి యైదుపంచకములు 15. ఈ విధముగ నీ యిరువదియైదుగుణములు గలిసి సూక్ష్మదేహమగును. దీనివివరముల నాలింపుఁడు 16. అంతఃకరణము, వ్యానము, శ్రవణము, వాక్కు శబ్ద విషయము. ఆకాశరూపము. ఇఁకముందు వాయువిస్తారమును జెప్పు దును 17. మనస్సు, సమానము, త్వక్కు, పాణి, స్పర్శవిషయము. పవన రూపము. ఇది యంతయు రేఖలుగగీసి యందువ్రాసి బాగుగాఁ దెలిసి కొనవలెను 18. బుద్ధి, ఉదానము, నయనము, చరణము, రూపవిషయము. అగ్నిరూపము. వీనినన్నింటిని నేను సాంకేతికముగఁ దెల్పుచున్నాఁడను. మనస్సునంచి యోచింపవలెను 19. చిత్తము, అపానము, జిహ్వా, శిశ్నము,

రసవిషయము. జలరూపము. ఇఁకముందుఁ బృథ్వీరూపమును సావధాన మనస్కులరై వినుండు 20. అహంకారము, ప్రాణము, ఘ్రాణము, గుదము, గంధవిషయము, పృథ్వీరూపము. ఇది శాస్త్రమతానుసారముగ నొనర్పఁబడిన నిరూపణము 21. సూక్ష్మదేహమిట్టిది. దీనిని మననమొనరించినచో సందేహములు నశించును. ఇది యందఱికిఁ దెలియునంశము గాదు. దీనియందు హృదయముంచి తెలిసికొనువానికే యీ యంశము బోధపడును 22.

ఈ విధముగా సూక్ష్మదేహస్థితిఁ జెప్పితిని. ఇఁకముందు స్థూల దేహమును వర్ణింతును. పంచగుణములతో నాకాశము స్థూల దేహమునం దేవిధముగ వర్తించుచున్నదో వినుండు 23. కామక్రోధ శోకమోహభయములను నీ యైదుభేదములును ఆకాశగుణములు. ఇఁక బంచవాయువులఁ జెప్పెదను 24. చలనము, వలనము, ప్రసరణము, నిరోధనము, అకుంచనము అను నీయైదులక్షణములు వాయుగుణములు 25. ఆఁకలి, దప్పిక, ఆలస్యము, నిద్ర, మైథునము అను నీ యైదును తేజో గుణములు. ఇఁకముందు జలలక్షణములు వినుండు 26. వీర్యము, రక్తము, లాల, మూత్రము, స్వేదము అను నీ యైదును జలభేదములు. ముందు బృథ్వీలక్షణములఁ దెలుపుదును 27. అస్థి, మాంసము, త్వక్కు, నాడి, రోమము లను నీ యైదును పృథ్వీధర్మములు. స్థూలదేహమర్మ మీవిధ ముగ గ్రంథములలోఁ జెప్పఁబడెను 28. పృథివ్యాప స్తేజోవాయ్వాకాశ ములను నీ యైదుభూతముల యిరువదియైదు తత్త్వములు గలిసి స్థూల దేహముగ నయ్యెను 29.

మూఁడవ దేహమగు కారణము, అజ్ఞానము, నాలుగవదేహమగు మహాకారణము, జ్ఞానము అను నీ నాలుగు దేహములు నిరసనమైనసిదప విజ్ఞానరూపమగు పరబ్రహ్మము మిగిలియుండును 30. విచారముతో నాలుగు దేహములను వేఱుపఱచిన యెడల అహంత్వము(నేనను భావము) తత్త్వములతోఁ బాటుగఁ దొలఁగిపోవును. మఱియు నీవిధముగఁ బర బ్రహ్మమునందు అనన్యమగు ఆత్మ నివేదనము జరుగును 31. ప్రాణి వివేకమువలన జన్మమృత్యువులనుండి విముక్తుఁడగును. నరదేహమున మహాత్కృత్యము సాధించుచున్నాఁడు. భక్తియోగ సహాయమునఁ

గృతకృత్యుఁడు, సాధకుఁడు నగుచున్నాఁడు 32. ఈ పంచీకరణ వర్ణనము ముగిసినది. ఈ విషయమును దప్పక విచారింపవలెను. స్పర్శవేధి సోకుట వలన నినుము బంగారమగును 33. ఈ దృష్టాంతము సరిగా లేదు. ఏలయన ! స్పర్శవేధి రాయి. అది స్పర్శవేధినె నిర్మింపఁజాలదు. కాని సాధుజనుల శరణ్యాములోని కగుటవలన మానవుఁడు స్వయముగా సాధువేయగును 34.

## తొమ్మిదవ సమాసము — తనుచతుష్టయము.

స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములను నీ నాలుగును దేహములు. జాగ్రతి, స్వప్నము, సుషుప్తి, తురీయము లను నీనాలుగును అవస్థలు 1. విశ్వము, తైజసము, ప్రాజ్ఞము, ప్రత్యగాత్మ అను నీ నాలుగును అభిమానములు. నేత్రము, కంఠము, హృదయము, శిరస్సు అను నీ నాలుగును స్థానములు 2. స్థూలభోగము, వివిక్తాభోగము, ఆనంద భోగము, ఆనందావభాసభోగము అను నీనాలుగు భోగములును నాలుగు దేహములవి 3. అకారము, ఉకారము, మకారము, అర్థమాత్ర ఈ నాలుగుమాత్రలు నాలుగు దేహములవి 4. తమము, రజస్సు, సత్త్వము, శుద్ధసత్త్వము అను నీ నాలుగు గుణములు నాలుగు దేహములవి 5. క్రియాశక్తి, ద్రవ్యశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి అను నీ నాలుగుశక్తులు నాలుగు దేహములవి 6. ఈ విధముగ నివి ముప్పదిరెండు తత్త్వములు. సూక్ష్మ దేహతత్త్వములు, స్థూల దేహతత్త్వములుగలసి యేఁబది తత్త్వములు. అన్నియుఁగలసి ఎనుబదిరెండు తత్త్వములు. ఇవిగాక అజ్ఞాన (కారణదేహ) జ్ఞానము (మహాకారణదేహము) లున్నవి 7. ఈ విధముగా నీతత్త్వము లన్నింటినెఱింగి యీ తత్త్వములను మాయికములని భావింప వలెను. మఱియుఁ దన్ను సాక్షిగాభావించి యీ రీతిగ దత్త్వములను నిరసింపవలెను 8. జ్ఞానమును సాక్షియందురు. జ్ఞానమును సాయముగాఁ గొని అజ్ఞానమును గుర్తెఱుంగవలెను. దేహముతోబాటుగాఁ జ్ఞానాజ్ఞానములను నిరసింపవలెను 9. బ్రహ్మాండమునందు గల్పనము గావింపఁబడిన దేహములు విరాట్టు, హిరణ్యగర్భుఁడు అని పిలువఁబడును. ఆత్మజ్ఞానము

వలనను, వివేకమువలనను అవికూడ నిరసనమగును 10. ఆత్మానాత్మ వివేచనము, సారాసారవిచారము నొనరించినచోఁ బంచభూతముల మాయికవార్త విశదమగును 11. అస్థి, మాంస, చర్మ, నాడీ, రోమ ములు ఐదును బృథ్వియొక్క గుణధర్మములు. వీనినన్నింటిని బ్రత్యక్ష ముగఁ దనశరీరమునందే శోధించి చూచుకొనవలెను 12. శుక్ల, శోణిత, లాలా, మూత్ర, స్వేదములను నీ యైదును జలభేదములు. తత్త్వములను దెలిసికొని వీనిని స్పష్టపఱచుకొనవలెను 13. క్షుధా తృష్ణా లస్య నిద్రా మైథునము లను నీ యైదును తేజోగుణములు. ఈ తత్త్వములను జక్కఁగ నిరూపణము గావింపవలెను 14. చలన, వలన, ప్రసరణ, నిరోధనాకుంచ నము లను నీ యైదును వాయుగుణములు. శ్రోతలు వీని నెఱుంగ వలెను 15. కామ క్రోధ శోక మోహ భయములను నీ యైదును ఆకాశ గుణములు. వివరణము గావింపకున్నచో నివియెవ్వియు గ్రాహ్యములోనికి రాఁజాలవు 16.

స్థూలశరీర మీ విధముగా నిరువదియైదు తత్త్వములతో నిండి యున్నది. సూక్ష్మదేహమును గూర్చిన వివరముల నిఁక వివరించెదను 17. అంతఃకరణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నీయైదును ఆకాశభేదములు. ముందు సావధానమనస్కులరై వాయుభేదముల వినుఁడు 18. వ్యానము, సమానము, ఉదానము, ప్రాణము, అపానము అను నీయైదును వాయుతత్త్వభేదములు 19. శ్రోత్ర, చర్మ, చక్షు, జిహ్వా, ఘ్రాణము లను నీయైదును తేజోభేదములు. ఇఁక సావధానులరై ఆపో భేదముల వినుండు 20. వాక్కు, పాణి, పాదము, శిశ్నము, గుదము అను నీయైదును జలభేదములు. ఇఁకఁ బృథ్వీభేదములను జెప్పెదను. శబ్దస్పర్శరూపరసగంధము లనునవి పృథ్వీభేదములు. ఈ విధముగా నీయిరు వదియైదును సూక్ష్మదేహభేదములు 22.

---

## పదియవ సమాసము — సాధువులు — మూర్ఖులు.

పృథ్వికిఁ జుట్టుప్రక్కలనున్న ఆవరణోదకమునందు హాటకేశ్వరుఁ డను పాతాళలింగముగలదు. దానిమహిమ మిగుల గొప్పది. ఆ లింగ మునకు నమస్కరింపవలయును 1. కాని యచ్చటికేఁబోవ వీలులేదు. శరీర

మున్నంతదనుక నది గనిపింపదు. కావున నాయీశ్వరుని వివేకసహాయమున ననుమానములోనికిఁ దెచ్చుకొనవలెను 2. సప్తసముద్రములును అత్యంత విశాలమగు నీ భూమండలము నావరించియున్నవి. ఆ సముద్రములచెంత మహత్తరములగు పర్వతపంక్తులుగలవు 3. సప్తసముద్రములను లంఘించి యచటి కెట్లుపోవ వీలగును ? కావున సాధుజనులు హాటకేశ్వరుని గాంచుటకు వివేకులు గావలెను 4. తమకుఁ దెలియని యంశములను జ్ఞాతలగు వారినడిగి గ్రహింపవలెను. మనోవేగము ననుసరించి దేహముతో నడుచుట సాధ్యముగాదుగదా ! 5. చర్మదృష్టికిఁ దెలియనిదానిని జ్ఞానదృష్టితోఁ జూడవలెను. మఱియు బ్రహ్మాండమును మననముగావించి మనస్సులో సమాధాన ముంచవలెను 9. మధ్యను పృథ్వి తెఱవలెనున్నది. ఇందువలననే ఆకాశపాతాళము లేర్పడెను. ఒకవేళ నీ తెఱయే లేకున్నచో (పాతాళనామము నశించును. మఱియు) నాలుగుదిశలను ఆకాశమే ఆకాశమయ్యెడిది 7. స్వాభావికముగా నుపాధిరహితముగ నున్నదానిని పరబ్రహ్మమందురు. ఆ పరబ్రహ్మము ముందు దృశ్యమాయయొక్క నామము శూన్యాకారము (దృశ్యమచ్చటలేదు) 8. దృష్టికిఁ గాన్పించునది దృశ్యము. మనస్సునకు గోచరించునది భాసము. మనస్సునకంటె నావలనున్న నిరాభాసమును వివేకదృష్టితోఁ గనవలెను 9. దృశ్యమునకును, భాసమునకును నెచట తావులేదో యచటికి వివేకము ప్రవేశింపఁ జాలియుండును. కాని యీ భూమండలమున సూక్ష్మదృష్టిగల జ్ఞాతలు మిగుల స్వల్పసంఖ్యాకులుగా నున్నారు 10. వాక్కుతోఁ జెప్పబడునది వాచ్యాంశము. చెప్పనవకాశములేని దానిని లక్ష్యాంశమని యెఱుంగనగును. గుణయోగమువలననే నిర్గుణమును అనుభవములోనికిఁ దెచ్చుకొనవలెను 11. గుణములకు నాశనముగలదు. కాని నిర్గుణ మవినాశియై యున్నది. సూక్ష్మమును జూచుటలో, స్థూలమును జూచుటకంటె విశేషత్వముగలదు 12. దృష్టికి గోచరింపనిదానిని విని గ్రహింపవలెను. శ్రవణ మననములవలన నన్నియు విదితమగును 13. అష్టధాప్రకృతికి నానాదృశ్య

పదార్థములు గలవు. అవియున్నియు విదితముగావు. ఎవ్వరుఁగూడ నెఱుంగఁజాలరు 14. ఒకవేళ నంతయు సమానస్థితియై పోయినయెడలఁ బరీక్షయు మునిఁగిపోవును. రుచి యెఱుంగని పురుషుని భోజనము ఒక దానిలో నొకటిగ నంతయుఁ గలిపికొని యంతయుఁ దినినట్లగును 15. మూఁఢుఁడు ఎన్నఁటికిని గుణగ్రాహి కాఁజాలఁడు. మూర్ఖునకు వివేకము కలుగఁజాలదు. అవివేకమును, వివేకమును మూర్ఖు లొకటియనియే చెప్పు దురు 16. ఉచ్చనీచము లెఱుంగనివాని యభ్యాసమంతయు నిష్ఫలము. అభ్యాసము లేనిచో గతియేయుండదు 17. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు నగుమానవునకు సమస్తమును సమానముగా గోచరించును. అట్లు జూచు వారలు మూర్ఖులని, యవివేకులని యెఱుంగవలెను 18. అఖండరీతిగ నెద్దినాశనమగుచున్నదో దానినే మూర్ఖు లవినాశియందురు. ఇట్టి వదరు బోతుల నేమన్న నేమిలాభము ? 19. ఈశ్వరుఁడు నానాభేదముల నొన రించెను. సమస్తసృష్టియు భేదముతోఁ బ్రవర్తించుచున్నది. గ్రుడ్డివారలు పరీక్షకులుగా నున్నచో నిఁకఁ బరీక్షయెక్కడిది? 20. మఱియుఁ బరీక్షోన్ను భావముగల జనసముదాయము మోసముతో నిండినది. గుణము లేని తావున గౌరవ మెక్కడినుండివచ్చును ? 21. అసత్యమును, సత్యమును సమానమొనరించినచో నిఁక వివేకమెక్కడనున్నది ? సాధుజనులు అసార మునువిడిచి సారమును గ్రహింతురు 22. దరిద్రుఁడగు పురుషుఁ డుత్తమ వస్తువు నెట్లు పరీక్షింపఁగలఁడు ? దీక్షాహీనునకు దీక్ష యెక్కడినుండి వచ్చును? 23. బాహ్యమున కరిగి శౌచముగావించుకొనుట యెఱుంగని మురికితనపు సోమఱికి వేదశాస్త్రములు, పురాణము లేమి యుపకరిం చును? 24. తొలుదొలుత మానవుఁ డాచారమును రక్షింపవలెను. పిదప విచారమునకుఁ బూనవలెను. (అట్లొనరించినచో) ఆచారవిచార ములనుండి (భవసాగరమును) ఉత్తీర్ణులగుదురు 25. నియమబద్ధుఁడగు సాధకునికిఁగూడఁ దెలియఁబడనియంశము బుద్ధిహీనున కెట్లు తెలియును? కన్నులుగలవారలే మోసపోవుతావున గ్రుడ్డివారలెందులకుఁబనికివత్తురు?26.

పాపపుణ్యములను స్వర్గనరకములను సమానముగా భావించునెడ ఇక వివేకావివేకములతో నావశ్యకమేమున్నది? 27. (ఒకవేళమూర్ఖులను దలంచినయెడల) అమృతమును విషమును నొకటియే యనుఁడు. కాని విషమును భుజించినచోఁ బ్రాణములు పోవును. కుకర్మము లొనరించినచో నిందగలుగును. సత్కర్మము లొనరించుటవలనఁ గీర్తి వృద్ధినొందును 28. ఇహలోక పరలోకములను సంపూర్ణముగా విచారింపనియెడల నంతయు నిరర్థకము 29. కావున సాధుసజ్జన సాంగత్యము గావింపవలెను. సత్ శాస్త్రములనే ఆలకింపవలెను. నానాప్రయత్నములతో ఉత్తమగుణముల నభ్యసింపవలెను.

పదునేడవ దశకము సమాప్తము.





# పదునెనిమిదవ దశకము.

## మొదటి సమాసము — దేవతాస్తుతి.

ఓ గజాననా! నీకు నమస్కరించెదను. ఎవ్వరును నీమహిమ నెఱుంగరు. చిన్నలకుఁ బెద్దలకు ఇంతయేల అందఱికిని నీవు విద్యాబుద్ధులను బ్రసాదించుచున్నాఁడవు 1. ఓ తల్లీ! సరస్వతీ! నీకుఁ జేలుగవ మోడ్చెదను. నాలుగువాణులకును నీవె కారణమవు. నీ ప్రధానస్వరూపము నెఱింగిన పురుషులు మిగుల నరుదుగానున్నారు 2. ఓ చతురానన! నీకుఁ బ్రణామసహస్రము. ప్రణామసహస్రము. సృష్టిరచనమును నీవ యొనర్చితివి? వేదశాస్త్రములను నానాభేదములను నీవె నెలకొల్పితివి 3. విష్ణూ! నీకు వందనములు. నీవు పాలనమునకుఁ గర్తవు. ఏకాంశమాత్రమున నీ వెఱిఁగి యెఱిఁగి జీవులను వృద్ధినొందించుచు వానితోఁ గలిసిమెలసి వర్తించుచున్నాఁడవు 4. ఓ (భోళా) శంకరా! నీ కనేకప్రణతులు. నీయనుగ్రహమునకు మేరయేలేదు. నిరంతరమును నీవు రామనామమును జపము గావించు సుకృతివి 5. ఓ యింద్రదేవా! నీకు అనేక ధన్యవాదములు. ధన్యవాదములు. నీవు వేల్పులందఱికును వేల్పువు. ఇంద్రలోక వైభవము నెంతయని వర్ణింపఁగలను? 6. ధర్మస్వరూపా! యమదేవా! నీకు నాసట నంజలిగీలించెద. ధర్మాధర్మముల నన్నింటిని నీవెఱుంగుదువు? మఱియు నీవు ప్రాణి మాత్రుల మర్మపుజాడలుగూడఁ దెలిసికొందువు 7. ఓ వేంకటేశ్వరా! నీమహిమ కంతములేదు. గొప్పగొప్ప మనుజులుగూడ నీ యాస్థానమునందు నిలువఁబడి ప్రసాదమును గైకొందురు(దధ్యోదనము, పొంగలి,పులిహోర మున్నగు ననేకపక్వాన్నముల స్వాదును గైకొందురు)8. ఓ వనశంకరీ! నీకు సాష్టాంగప్రణతులు. నీవనేకశాకములను భుజింతువు. ఈ విధముగా వెదకి వెదకి భుజించెడివారలు ఈధరణిపై నీవుదప్ప మరి యెవరు గలరు? 9. ఓ బలభీమా! హనుమానుడా! నీకు వందనముల నర్పించెద. పచ్చితులసి దండలను బెక్కింటిని నీవు వక్షమునధరించితివి?

తులసియాకును దినుటవలన జనులందఱకును నానందముకలుగును 10. ఓ ఖండేరాయా! నీకు జోహారులొనరించెద. నీ మేను పసుపున నిండియున్న కతనఁ బచ్చఁగానుండును. నీ సన్నిధిలో ఉల్లిగడ్డలతో నిండిన పిండివంటక ముల దినుటకు జనులందఱును సిద్ధముగా నుందురు 11. ఓ తులజాభవానీ ! నీకు బ్రమొక్కెదును. నీ వెల్లప్పుడును భక్తులయెడఁ బ్రసన్నభావముతో వర్తింతువు. నీ సుగుణసంపద నెన్నఁగల నేర్పరి యీ ప్రపంచముననే లేడు 12. ఓ పాండురంగా ! నీకు నొసట నంజలిగీలించెద. నీ సన్నిధిలో హరికథలు ముమ్మరముగా నిరంతరము జరుగుచుండును. నానావిధతానమానములు, రాగరంగములు నీసన్నిధిలో మిగుల వ్యాప్తి నొందియుండును 13, క్షేత్రపాలా ! నీకు దండప్రణామములు. పలువురు జనులను నీవు భక్తిభావమున లగ్నమొనరించితివి. హృదయపూర్వకముగా నీయెడ భక్తులై యున్నవారలకుఁ గామితఫలములు వెంటనే లభించును 14.

ఇఁక రామకృష్ణా ద్యవతారముల మహిమలన్ననో ! వానికిఁ భారమేలేదు. వారలవలననే పలువురు మానవులు (భక్తియందును) ఉపాసనయందును దత్పరులైరి 15. కాని యీ సమస్తదేవతలకును మూలము కేవల మీ యంతరాత్మయే. భూమండలమునందు సమస్త భోగములును దీనికే లభించుచున్నవి? 16. అంతరాత్మయే నానావిధములగు దేవతారూపములతోఁ గూర్చుండియున్నది. మఱియు నానాశక్తి రూపములతో నిదియే ప్రసిద్ధముగా నున్నది. సమస్త వైభవములకు భోక్తసైతమిదియేసుమా? 17. అంతరాత్మనుగూర్చి విచారించిన కొలది దానివిస్తారము మిగులగొప్పదని విశదమగును. ఈ యంతరాత్మయే స్వయముగ ననేక దేవతలు, మనుష్యులు నగును 18. యశము, అవయశము, అతినింద, అతిప్రశంస, సమస్తభోగప్రాప్తి మున్నగునవి యెల్ల నంతరాత్మకే కలుగును 19. అంతరాత్మయే దేహమునందుండి యేమి చేయుచున్నదో, ఏ దేహమునందుండి యేమి భోగించుచున్నదో యెవ్వ రెఱుంగుదురు? భోగి, త్యాగి, వీతరాగి మున్నగునవన్నియు నీ యంతరాత్మయే 20. ప్రాణులు తమతమ యభిమానమునఁ దన్మయులై యుందురు. దేహమువైపుననే చూచుచుందురు. లోపలనుండియున్నను

ముఖ్యమగు నంతరాత్మను బొందఁజాలరు 21. ఓరీసోదరా ! ఈ యాత్మ కృత్యములను బాగుగాఁ బూర్ణముగా నెవ్వఁడు విచారింపఁగలఁడు? మానవునకుఁ బుణ్య మగాధమైనంతన కొంచెముగనో, గొప్పగనో ఆత్మానుసంధాన మలవడును 22. ఆత్మానుసంధానమైనంతనే పాపములు కాలిపోవును. అంతర్నిష్ఠులగు జ్ఞాను లీ యంశమును మననము గావించి చూచుచుందురు 23. అంతర్నిష్ఠులగువారలు తరింతురు. అంతర్భ్రష్టులగు వారలు నశింతురు. ఏలయన, పాపము? అంతర్భ్రష్టులు పైపై లోకాచారములయందే (మగ్నులై ముఖ్యవిషయమును) మఱచియుందురు 24.

## రెండవ సమాసము — జ్ఞాతలపమాగమము.

ఎఱుకలేనికారణమున జరిగినదేమో జరిగిపోయినది. ఇఁక నియమపూర్వకముగా నెఱుకగలిగి ప్రవర్తింపవలయును 1. జ్ఞాతయగువానితో స్నేహమొనరింపవలెను. జ్ఞాతకు సేవయొనరింపవలెను. మెల్లమెల్లఁగ జ్ఞాతయగు పురుషుని సుబుద్ధినిగూడ నేర్చుకొనవలెను 2. జ్ఞాతకడఁ జదువుటయు, వ్రాయుటయు నేర్చుకొనవలెను. ఇంతయేల? అన్నివిషయముల నడుగవలెను 3. జ్ఞాత కుపకారము గావింపనగును. జ్ఞాతకొఱకుఁ దన దేహమునేని వ్యయపెట్టవలెను. మఱియు సాధకుఁడు జ్ఞాతగావించు విచారమెద్దియో యెఱుంగవలెను 4. జ్ఞాతసాంగత్యము నందుండి భజనము గావింపవలెను. ఆతనిసాంగత్యముతోఁ గష్టములను సహింపవలెను. ఆతనిసాంగత్యము ననుభవపూర్వకముగాఁ దెలిసికొని మానవుఁ డనుభవనీయుఁడు కావలెను 5. జ్ఞాతచెంత గీతములను గానముచేయవలెను. ఆయన యొద్ద వాద్యములను ప్రయోగింపవలెను. నానావిధములగు వాద్యములను వాయింపవలెను. నానావిధాలాపములు నేర్చుకొనవలెను 6. జ్ఞాతను అండగా నుంచుకొనవలెను. జ్ఞాతచెంత ఓషధులను గ్రహింపవలెను. మఱియు జ్ఞాతతెలుపు పథ్యమునే ముందుగ నాచరింపవలెను 7. జ్ఞాతవలనఁ బరీక్ష నేర్చుకొనవలెను. జ్ఞాతకడ వ్యాయామము నొనరింపవలెను. ఆయనయెదుటనే యీఁతగొట్టుట నేర్చుకొనవలెను 8. జ్ఞాతచెప్పినట్లు మాటలాడవలెను. ఆయన చెప్పినట్లు నడుచుకొనవలెను. నానావిధములుగ

జ్ఞాతయెట్లు ధ్యానముగావించునో యట్లు ధ్యానమొనరింపవలెను 9. జ్ఞాత
చెంత కథలను నేర్చుకొనవలెను. జ్ఞాతయొక్క యుక్తుల నెఱుంగవలెను.
మఱియు నాతఁడెఱింగిన ప్రతివిషయమును మననము గావింపవలెను 10.
జ్ఞాత పన్నుచున్న వ్యూహములను, జ్ఞాతకల్పించుచున్న యుక్తిని నెఱుంగ
వలెను. ఆతఁడేవిధముగా నన్యులను సంతుష్టిపరచునో యట్లే తానును
స్వయముగా నెల్లరను సంతుష్టులుగా నుంచవలెను 11. జ్ఞాతప్రసంగము
నెఱుంగవలెను. జ్ఞాతల వర్ణమును గ్రైకొనవలెను. జ్ఞాతయొక్క స్ఫూర్తి
తరంగముల నభ్యసింపలెను 12. జ్ఞాతయొక్క యుద్యోగమును గ్రహింప
వలెను. జ్ఞాతయొక్క తర్కము నెఱుంగవలెను. జ్ఞాతచెప్పకున్నను నాతని
సంకేతమును దెలిసికొనవలెను 13. జ్ఞాతయొక్క విశిష్ట ప్రకారచాతుర్య
మును, నాతని రాజనీతిని, ఆతనినిరూపణమును వినుచుండవలెను 14. జ్ఞాత
యొద్ద కవిత్వమును నేర్చుకొనవలెను. గద్యపద్యముల గుర్తెఱుంగవలెను.
అంతఃకరణమునందాతని మధురవచనముల భావమును యోచింపవలెను!5.
జ్ఞాతయొక్క ప్రబంధమును గాంచవలెను. ఆతని వచనభేదములు, నాతని
నానావిధ సంవాదములు చక్కఁగా విచారింపవలెను 16. జ్ఞాతయొక్క
తీక్ష్ణత, సహిష్ణుత, ఉదారత తెలిసికొనవలెను 17. జ్ఞాతయొక్క నానావిధ
కల్పనములు, అతని దూరదర్శిత్వము, మఱియు వివంచనముగూడఁ
దెలిసికొనవలెను 18. జ్ఞాత తనకాలము నెట్లు సార్థకము చేయుచున్నదియు,
ఆతని యాధ్యాత్మిక వివేకమును, ఆతని గుణగణములును సంపూర్తిగా
గ్రహింపవలెను 19. జ్ఞాతయొక్క భక్తిమార్గమును, వైరాగ్యయోగ
మును, నాతనిసమస్తప్రసంగమును దెలిసికొనవలెను 20. జ్ఞాతయొక్క జ్ఞాన
మును దెలియవలెను. ఆతనిధ్యానమునభ్యసింపవలెను. జ్ఞాతయొక్క సూత్మ్ర
చిహ్నమును గ్రహింపవలెను 21. జ్ఞాతయొక్క అలిప్తతను, విదేహలక్షణ
మును, బ్రహ్మనివరణమును, దెలిసికొనవలెను 22. జ్ఞాతగూడ నొకయంతరా
త్ముఁడు. అతని మహిమల నెంతదనుకఁ జెప్పశక్యమగును? ఆతనివిద్యకును,
కళలకును, గుణములకును మేర నెవ్వఁడు నిశ్చయింపఁగలఁడు? 21. పర
మేశ్వరుని గుణానువాద మొనరించి అఖండ సంవాదము గావింపవలెను.
అటు లొనరించుటవలన నఖండమగు నానందము లభించును 24. పర
మేశ్వరునిచే నిర్మింపఁబడిన దెల్ల అఖండరీతిగా దృష్టికిముందున్నది. కాని

మాటిమాటికి విచారమొనరించి దానినెరుంగుట వివేకవంతుల కర్తవ్యము 25. నిర్మితమైన సమస్తమును భగవంతుడే సృజించినాడు. తొలుదొలుత నిర్మాణమును (దృశ్యపదార్థమును) వేఱు గావింపవలెను. (తరువాత ఈశ్వరస్వరూపమును గాంచవలెను) 26. భగవంతుడన్నింటిని సృజించుచున్నాఁడు. చూచినచో నాతఁడు స్వయముగా గోచరింపఁడు. కావున నాతని వివేకబలముచేఁ గనుఁగొనవలెను 27. భగవంతునిపయి నఖండముగా ధ్యాన ముంచినచోఁ గృపాయుతుఁడై దర్శనము నొసంగును. నిరంతరము ఆతనియంశతో భాషింపవలెను 28. ధ్యానరహితుఁడగు భక్తుఁడు, ధ్యానధారిభక్తుఁడు, భగవంతుఁడు (ఆత్మారాములగు) భక్తులను సంసారముక్తుల నొనర్చును 29. ఉపాసన సమాప్తమైనపిదప దైవమునకును భక్తునకును అఖండసమావేశము గలుగును. ఇది యనుభవపూర్వక విషయము. ఈ విషయ మనుభవనీయుఁడై గ్రహింపఁదగియున్నాఁడు 30.



## మూఁడవసమాసము — సదుపదేశము,

ఈ నరజన్మమే దుర్లభము. అందుఁ బూర్ణాయు వింకను దుర్లభము కాన నీ నరజన్మమును వ్యర్థముగా నాశనము గావింపఁదగదు. చక్కఁగ వివేకము నార్జింపవలయునని "దాసు" నుడువుచున్నాఁడు 1. ఉత్తమ విధముగా వివేకము నభ్యసింపనిచో జీవితమునందంతటను అవివేక వర్తనమే జరుగుచుండును. మఱియుఁ బ్రాణి దరిద్రునివలెఁ గాన్పించును 2. ఈ దురవస్థను మానవుఁడు తనకుఁదానే కల్పించుకొనును. సోమరితనమే మానవులను దరిద్రులఁ జేయుచున్నది. చెడ్డవారలచెలిమి చూచుచుండఁగనే మానవుని ముంచివేయును 3. మూర్ఖత్వ మభ్యాసమైనచో బుద్ధిహీనత యనునది తలపై కెక్కికూర్చుండును. మఱియు నది తరుణత్వము నందుఁ జండాలపుఁబనులను జేయించును 4. పడుచుతనమునం దొకవేళ మూర్ఖుఁడును సోమరియు నగునాతఁడు అన్నివిధములగు దుఃఖములను దరిద్రములను అనుభవించును. ఆతనికేమియు లభింపదు. ఇట్టిదశయం దెవ్వరి నేమననగును? 5. వానికడ ఆవశ్యకపదార్థము లుండవు. అన్న

వస్త్రములుగూడ నుండవు. మఱియు నంతఃకరణమునందు ఉత్తమగుణములెవ్వియు నుండవు 6. ఆతనికిఁ జెప్పుటయు నిలుకడగాఁ గొంచెము సేపుగూర్చుండుటయుఁ జేతగాదు. అవసరము కొంచెమేని దెలియదు. అభ్యాసమువైపు శరీరముగాని హృదయముగాని అన్వయింపదు 7. వ్రాయుట, చదువుట, అడుగుట, చెప్పుట మున్నగునవి యాతఁడెఱుంగఁడు. మఱియు బుద్ధిహీనతవలన నాతనికి నిశ్చయమునుగూర్చిన అభ్యాసము గూడఁగలుగదు 8. ఆతఁడు స్వయముగా నేమియు నెఱుంగఁడు. అంతియ గాదు ఇతరులు చెప్పునదిగూడ నంగీకరింపఁడు. స్వయముగా నాతఁడు పిచ్చివాఁడేగదా? అట్లయ్యును సజ్జనులనుగూడ నిందజేయును 9. లోపల నున్నదొకటి. వెలుపలికి వెలువరించునది యొకటి. ఇట్టివివేకముగల పురుషునకుఁ బరలోకమెట్లు లభించును? 10. ఇట్టిపురుషుని గార్హస్థ్య ధర్మము నాశనమగును. తరువాత నాతఁడు హృదయమునందుఁ బశ్చాత్తాపము నొందును. కావున వివేకము నభ్యసింపవలెను 11. మనస్సు నేకాగ్రమొనరించి దృఢదీక్షతో సాధనము గావింపవలెను. మఱియుఁ బ్రయత్నముచేయుటలోఁ గొంచెమేని సోమరితనము రానీయరాదు 12. దుర్గుణములనన్నిఁటిని విడిచివేయవలెను. ఉత్తమగుణముల నభ్యసింపవలెను. మఱియు గ్రహణార్థములగు ప్రబంధములను బఠించుచుండవలెను 13. పదప్రబంధములు, శ్లోకప్రబంధములు, నానావిధకవిత్వములు, ముద్రలు, ఛందస్సులు కంఠపాఠము గావింపవలెను. ఏలయన? నానావిధ ప్రసంగజ్ఞానమువలననే ఆనందము కలుగును 14. ఏప్రసంగముపై నేమి నుడువుట యుచితమో యావిషయమును జక్కఁగఁ దెలిసికొనవలెను. వ్యర్థముగ నిట్లేల కష్టమును భరింపవలెను? 15. ఇతరుల హృదయ మెఱుంగవలెను. అభిరుచి నెఱింగి యేదేని నుడువవలెను. జ్ఞప్తికి వచ్చిన దానిని బఠించి కూర్చుండుట మూర్ఖత్వము 16. ఎదుటివాని యుపాసన నెఱింగి తదనుసారముగా గానము గావింపవలెను. మఱచిపోవఁ దగదు. మఱియు రాగజ్ఞానమును దాళజ్ఞానమును అభ్యసించుచుండవలెను 17. సంగీత సాహిత్యముల సహాయముతోఁ బ్రసంగానుసారములగు కథలను ముమ్మరముగా వ్యాపింపఁజేయవలెను. శ్రవణమననముల సహాయమున గూఢార్థమును వెలికిఁదీయవలెను 18. చక్కఁగాఁ బాఠములు జరుగ

వలయును. సర్వకాల సర్వావస్థలయందును వల్లెవేయుచుండవలెను. మఱియుఁ జెప్పిన యంశమును జ్ఞాపకముంచుకొనవలెను 19. అఖండరీతిగా నేకాంతసేవనము గావింపవలెను. సమస్త గ్రంథములను గాలించివేయ వలెను. తన మన స్సేయర్థము నంగీకరించునో దానినే గైకొనవలెను 20.

## నాలుగవ సమాసము — నరదేహ మహత్త్వము.

గణేశ్వరపూజయు, శారదావందనము ఈ దేహమువలననే జరుగు చున్నది. దేహమువలననేగదా గురువులు, సజ్జనులు, సాధువులు, శ్రోతలు మున్నగు వారల పనులు నెరవేరుచున్నవి 1. దేహముండుటవలననే కవితారచనము, అభ్యాసము, నానావిధ విద్యలు అలవడుచున్నవి 2. గ్రంథలేఖనము, నానావిధములగు లిపులను గురుతెఱుంగుట, నానాపదార్థ ములను విమర్శించుట దేహమువలననే కలుగుచున్నవి 3. మహాజ్ఞానులు, సిద్ధులు, సాధువులు,ఋషులు, మునులు మున్నగువార లనేకులు దేహము వలననే పేరొందుచున్నారు. మఱియు నీ దేహమువలననే మనుజులు తీర్థాటనము గావించుచున్నారు 4. పురుషుఁడు శ్రవణమననములయందు మగ్నుఁడగుటయు ముఖ్యపరమాత్మను బ్రాప్తించుటయు దేహమువలననే జరుగుచున్నది 5. కర్మమార్గము, ఉపాసనామార్గము, జ్ఞానమార్గము మొదలగునవన్నియు దేహమువలననే సమకూరుచున్నవి 6. యోగులు, వీతరాగులు, తాపసులు, మున్నగువారలు నానావిధ పరిశ్రమలు దేహము వలననే గావించుచున్నారు. దేహకారణముననే ఆత్మ ప్రకటన మగు చున్నది 7. ఇహలోకము, పరలోకము మున్నగునవి దేహమువలననే అమరుచున్నవి. దేహము లేకున్నచో అన్నియు నిరర్థకములే యగును 8. పురశ్చరణము, అనుష్ఠానము, ధూమపానము, శీతోష్ణసహనము, గోరాం జనము, (వాతలువేసికొనుట) పంచాగ్ని సాధనములు దేహమువలననే మానవున కేర్పడుచున్నవి 9. మానవులు దేహమువలననే పుణ్యాత్ములు గను, బాపాత్ములుగను, స్వేచ్ఛాచారులుగను, బవిత్రులుగను నగుచున్నారు 10. అవతారపురుషులు, వేషధారులు దేహమువలననే యగుచున్నారు. నానావిధములగు దురాచారపాషండములు దేహము

వలననే యగుచున్నది 11. విషయభోగము, సర్వత్యాగము, నానావిధ రోగములు గలుగుట, సహించుట దేహమునలననే జరుగుచున్నవి 12. దేహమువలననే నవవిధభక్తి మార్గములును, నాలుగు విధములగు ముక్తి మార్గములును, నానావిధములగు యుక్తులును, నానామతములును గలుగుచున్నవి 13. దానధర్మములు జరుగుటయు నానారహస్యములు వెల్లడియగుటయుఁ బూర్వకర్మఫలములు లభించుటయు, దేహకారణముననే యని జనులు నుడువుచున్నారు 14. నానాస్వార్థములు, అర్థవ్యర్థ ములు, ధన్యతలు, నానాకళలు, న్యూనాధిక్యములు, భక్తిమార్గము నందలి ప్రేమ, నానావిధ సన్మార్గసాధనలు దేహమువలననే కలుగుచున్నవి. బంధనములు దేహమువలననే తెగిపోవుచున్నవి. దేహమువలననే ఆత్మ నివేదనమై మోక్షము లభించుచున్నది 15—17. అన్నింటిలో దేహ ముత్తమమైనది. దేహమునందంతరాత్ముఁడు వసించుచున్నాఁడు. పురు షోత్తముఁ డన్నిగృహములలో నున్నాఁడు. వివేకులందరీయంశము నెఱుంగుదురు 18. దేహమువలననే నానావిధములగు కీర్తులు లభించు చున్నవి. మఱియు నానావిధాపకీర్తులుగూడ దేహమువలననే లభించు చున్నవి. దేహకారణముననే అవతారపంక్తులు కలుగుట, పోవుట జరుగు చున్నది 19. నానావిధ భ్రమసంభ్రమము లీ దేహమువలననే కలుగు చున్నవి. మఱియు నీ దేహమువలననే ఉత్తమోత్తమపదవులు జనులను భవించుచున్నారు 20. దేహమువలననే సమస్తము జరుగుచున్నది. దేహము లేకున్నచో నేమియులేదు. దేహము లేకున్నయెడల ఆత్మ కలు గుటయుఁ గలుగకుండుటయు సమానమే 21. దేహము పరలోక నౌక. నానాగుణనిలయము. దేహమువలననే నానాగుణరత్న విచారము నెరవేరు చున్నది 22. దేహమువలననే గానకళయు, సంగీతకళయు, నెఱుకపడు చున్నవి. దేహయోగమువలననే అంతఃకళప్రాప్తి యగుచున్నది 23. దేహము బ్రహ్మాండముయొక్క ఫలము. అది మిగుల దుర్లభమైనది. ఐనను దీనికి శుద్ధమగు బోధము నొసంగవలయును 24. దేహమూలముననే పెద్దలు, పిన్నలునగు జనులెల్లరును దమతమ వ్యాపారముల నొనరించు చున్నారు. దేహకారణముననే మానవులలో బెద్దలు, పిన్నలు అను భేద మేర్పడుచున్నది 25. దేహమునుధరించి ఈ లోకమున నుదయించుచున్న

జీవులందఱును నెద్దియో కొంతపని చేసిపోవుచున్నారు. హరిభజనమువలన నెందఱో పావనులైరి 26. అష్టధా ప్రకృతికిమూలము కేవలసంకల్పమే. నానాసంకల్పములే దేహరూపములగు ఫలములను గైకొని ప్రకటిత మయ్యెను 27. హరిసంకల్పము తొలుతనుండియు నుండెను. ఫలరూప ముగా నిపుడు దానినే గాంచవలెను. వాస్తవమున కది నానాదేహ ముల యందన్వేషించినచో విదితమగును 28. తీగెమూలమున బీజ ముండును. తీగయంతయు సంపూర్ణముగ, సుదకరూపముగ నుండును. పిదప ఫలమునందు సైతము మూలముయొక్క యంశతో బీజముం డును 29. మూలకారణమున ఫలముదయించును. ఫలకారణమున మూలము కలుగును. సంపూర్ణ బ్రహ్మాండస్థితియు నిట్టిదే 30. ఏపని యైనను దేహములేకున్నచో నెరవేరదు. దేహమును సార్థకము గావించుట మంచిది 31. ఆత్మకారణమున దేహమేర్పడెను. మఱియు దేహకారణ మున ఆత్మ వర్తించుచున్నది. ఈ రెంటి సంయోగముచే సంపూర్ణ కార్య ములు జరుగుచున్నవి 32. దాగియుండి మానవుఁడు గుప్తరూపముగాఁ గావించుపనులన్నియు నాత్మకు విశదమగును. ఏలయన? కర్తృత్వ మంతయు నాత్మదేగదా! 33. దేహమునం దాత్మ నివసించుచున్నది. దేహము పూజింపఁబడుచో నాత్మ సంతోషించును. దేహమునకు బాధ కలిగించినచో ఆత్మ క్షోభించును. ఇది ప్రత్యక్షవిషయమేగదా 34. దేహములేకున్నచోఁ బూజ లభింపదు. దేహములేకున్నచోఁ బూజ యంటదు. జనులలోననే జనార్దనుఁడు వసించుచున్నాఁడు. కావున జనులను సంతుష్టుల నొనర్పవలెను 35. అత్యంత వివేకశాలియగు మానవుఁడె ధర్మమును స్థాపింపఁదగినవాఁడు. ఆతని పుణ్యశరీరమే పూజనీయమైనది 36. అందఱిని సమానముగాఁ బూజించుట మూర్ఖతయగును. గాడిదను పూజించుటవలన నించుకేని ఫలముగలుగునా? 37. కావున వాస్తవమున కెవ్వఁడు పూజనీయుఁడో వానిని బూజింపవలెను. అట్లని యుపేక్షింపక యితర జనులనుగూడ సాధారణరీతిగాఁ బ్రసన్నులఁ జేసికొనవలెను 38. సమస్త జగత్తుయొక్క హృదయమునందలి దైవము (సంపూర్ణ జన సమాజము) క్షుబ్ధమైపోయినచో నిఁక నివసించుటకుఁ దావెక్కడ దొరకును? జనులను విడిచినచో జనుల కన్యగతియేలేదు 39. పరమేశ్వ

రున కనంతగుణములు గలవు. పాపము ! మనుష్యమాత్రుఁ డాగుణచిహ్నముల నెంతవరకు విశదపఱుపఁగలఁడు. కాని యధ్యాత్మగ్రంథముల నాలించినచో నంతయు సుబోధమగును 40.

---

## ఐదవసమాసము — సమాధానయుక్తి.

ఏ పదార్థమునైన నేకొలపాత్రముతోనేని కొలువుఁడు. కాని యాకొలపాత్ర నూపదార్థమును దినదు. ఇట్లే యనేకజనులు అనేక గ్రంథములను జదివివేయుదురు. కాని వారలహృదయములయం దాగ్రంథములలోని విచార మొకటిగూడ నిలిచియుండదు 1. పారమన్ననో ధారాప్రవాహముగాఁ జెప్పుకొనిపోవుదురు. అడిగినచోఁ జెప్పగలిగిన దేదియులేదు. అనుభవవిషయము దెలుపుమనినచో వారలు గందరగోళమునఁ బడిపోవుదురు 2. (కాన యిట్లు కాఁదగదు) శబ్దరత్నములను బరీక్షింపవలెను. అనుభవాత్మకమగు శబ్దములను గ్రహింపవలెను. ఇతరమగు తుక్కునంతను నొకప్రక్కను విడిచివేయవలెను 3. నామరూపములన్నింటిని విడిచి పిదప అనుభవమును బ్రాప్తిగావించుకొనవలెను. సారాసారముల నొక్కటిగాపించుట మూర్ఖత్వమగును 4. చదువువాఁడు పుస్తకము నొకేవిధముగా జదువుకొనిపోవలయునా? లేక తెలిసికొని చదువవలయునా? ఈ విషయమును బాగుగా యోచింపుము 5. సత్యమేమన? ఎచ్చటఁ దెలిసికొనుటలేదో యచ్చట నంతయు అధ్వాన్నముగ నుండును. తెలిసికొనఁజాలనివక్త యితరు లేవిషయముననేని సందియము తీర్పుమనినచో సమాధాన మొసంగఁజాలఁడు 6. తెలిసికొనక విషయము గ్రహింపక కేవలము పెక్కుశబ్దములను మాత్రము తున్ఙముగాఁ గంఠస్థముగావించుకొన్నవాఁడు సభాసమాజమునందు శాస్త్రార్థప్రసంగము వచ్చినచో నోరుమెదల్పఁజాలఁడు. ఆతఁడు నేర్చిన విద్యవలని యుపయోగము గూడ నుండదు 7. తిరుగలియందుఁ ద్వరత్వరగాఁ బిడికిళ్లకొలఁది ధాన్యమునుబోసి విసరుచున్నచో మెత్తనిపిండి యెట్లుపడఁగలదు? 8. నోటినిండ త్వరత్వరగా దొకదానివెంటనొకటిగా ముద్దలు పెట్టుకొనెను. నమలుట కవకాశము కలుగలేదు. నోరంతయు నిండిపోయెను. త్రిప్పినఁ దిరుగదు. ఇఁక నప్పు డెట్లు జరుగవలయును? 9.

శ్రోతలారా! ఇపు డీవిషయమును శ్రద్ధతో వినుండు. సభయందు వ్యాఖ్యాత కర్తవ్య మేదియో తెలుపుదు. వ్యాఖ్యాత యొక క్షణమాత్రమేని శ్రోతలకు రసహీనముగా నుండునట్లుపన్యసింపఁగూడదు. అందరి యంతఃకరణములను సంభాళించుచుండవలెను 10. సూక్ష్మవిషయముల నవశ్యముగా బ్రకటింపవలెను. కాని వానినన్నింటి నంతకుముందే స్వయముగాఁ దెలిసికొనియుండవలెను. అట్లు తెలిసికొన్న యంశములనే శ్రోతలకు బోధింపవలెను 11. వక్తసభలో గొప్ప గొప్ప కఠినప్రశ్నలకు సమాధానము చెప్పుచున్నచో శ్రోతలకు మిగుల నానందముకలుగును. మఱియు వార లావక్తను మిగుల బ్రశంసింతురు 12. కఠినసమస్యలను సాధించిన పిదప వక్తను సభ్యులు మిగుల బ్రశంసింతురు. కాని యొకవేళ నేదేని ప్రసంగమునందలి సమస్యను సాధింపలేక పోయినచో (భయపడినచో) నప్పుడు శ్రోతలు నిందఁగూడఁ జేయుదురు. ఆపరిస్థితులలో శ్రోతలపై వక్త అనిష్టపడవలసిన యవసరమేమున్నది? 13. ఒకపిడితాతిపయి నరుగదీసిచూచియుఁ, గొలిమిలోఁ గాచియు బంగారమును బరీక్షించి గైకొను విధమున వక్తయొక్క శ్రవణమననముల ముఖ్యానుభవము నెఱింగి యాతనివాక్కులఁ బరిగ్రహింపవలెను 14. వైద్యునిమీఁద విశ్వాసము గలుగదు. వ్యాధి నివారణముగాదు. ఈస్థితిలోఁ గ్రోధపడుటవలన లాభమేమి? 15. అసత్యము నెరవేరునది కాదు. దాని నెవ్వరును నంగీకరింపరు. కావున సత్యమును గ్రహింపవలెను 16. వ్రాయుట, చదువుట నేర్చుకొనక వ్యాపారముగావించుచో నది కొలఁది దినములు మాత్రమె నడచును. ఎచటనైన నెవరేని లెక్కనెఱింగినవారలు తటస్థమైరా వెంటనే యసత్యము వెల్లడియగును 17. ప్రమాణసాక్ష్యసహితముగా లెక్కనంతయు శుభ్రముగ నుంచవలెను. ఇట్లుంచినచో లెక్కనెఱింగినవాఁ డేమియుఁ జేయజాలఁడు 18. స్వయముగా నజ్ఞానమున మగ్నుఁడైనవాఁడు అన్యుల కెట్లు బోధింపఁ గలడు? ఎవరైనఁగానిమ్ము అజ్ఞానమువలన సంకటములోఁ బడుచునేయున్నారు 19. బలములేదు, యుద్ధములోని కరిగినాఁడు. ఆతఁడు దప్పక పరాజయ మొందితీరును. ఈ దోష మెవ్వరిది? 20. అనుభవములోనికి వచ్చు సత్యవిషయమును ఆదరపూర్వకముగా గ్రహింపవలెను. అనుభవరహితమగు మాట పొల్లు

వంటిదని యెఱుంగవలెను 21. (అనుభవరహితముగా) నేర్పుటవలన (ప్రోత్సహించుటవలన) ప్రోత్సాహముగలుగును. కాని వెనుకనుండి పశ్చాత్తాపము గలుగును. అయిన, మిథ్యానిశ్చయము తత్కాలముననే యెగిరిపోవును 22. సత్యమునువిడిచి మిథ్యాగ్రహణ మొనరించినచో హానికలుగును. పరమాత్ముని న్యాయానుసారముగా నడువవలెను 23. న్యాయమును వదలగినచోఁ బ్రపంచమంతయు నిందఁగావించును. ఎంత మందితోనని పోరాడి కష్టములను సహింపశక్యమగును? 24. అన్యాయము వలన నెప్పుడును నెవరికిని మేలుగలుగదు. అసత్యమునం దభిమానముంచుట నెట్టితనము 25. అసత్యము పాపము. సత్యము పరమాత్మస్వరూపము. ఈ రెంటిలో నెయ్యది గ్రాహ్యమో యింక యోచింపుఁడు 26. చెప్పుట, నడచుట మున్నగునదంతయు మాయయందున్నది. మాయలేకున్నచో మాటలాడుటయే యసంభవము. కావున నిశ్శబ్దము నన్వేషింపవలెను 27. వాచ్యాంశము నెఱింగి త్యజింపవలెను. లక్ష్యాంశమును వివరణమొనర్చి గ్రహింపవలెను. ఇట్లొనరించినచో నిశ్శబ్దపుజాడ తెలియును 28. పూర్వపక్షమగు అష్టధాప్రకృతినివిడిచి అలక్ష్యమునందు లక్ష్యముంచవలెను. మననశీలుఁడును బరమదక్షుఁడును నగునాతఁడే యీ విషయమును నెఱింగి యుండును 29. పైనుండు నానావిధములగు పొట్టును ధాన్యమును నొకటియే యనుట యనృతము. నీరసమును రసమును నొకటిగాఁదలఁచి చతురుఁ డగువాఁడెన్నఁడును నీరసమును సేవింపడు 30. పిండమునందు నిత్యానిత్యవిచారమును, బహుప్రకారములతో బ్రహ్మాండమునందు, సారాసారవిచారమును గావించి అన్నింటిని శోధించి సారమునుమాత్రము గ్రహింపవలెను 31. అన్వయము, వ్యతిరేకము మున్నగునవియెల్ల మాయాకారణములుగ నున్నవి. ఒకవేళ మాయయే లేకున్నచో వివేక మెట్లు సాధ్యమగును? 32. సంపూర్ణతత్త్వములను శోధింపవలెను. మఱియు మహావాక్యములయందుఁ బ్రవేశ మొనరించి ఆత్మనివేదనము వలన సమాధానము గడింపవలెను 33.

## ఆఱవసమాసము — *దివ్యగుణోపదేశము.

శరీరమును నానావిధములగు వస్త్రములచేతను భూషణముల చేతను ఎట్లలంకరింతుమో యట్లే వివేకముతో, విచారముతో, రాజనీతితో అంతఃకరణమునుగూడ నలంకరింపవలెను 1. శరీరము మిగుల సుందరముగను తేజోయుక్తముగను వస్త్రభూషణములతో సజ్జితముగను నున్నను అంతఃకరణమునందుఁ జాతుర్యబీజములు లేకున్నచో నది యెప్పుడును శోభనొందఁజాలదు 2. నోటిదుడుకుదనము గలవాఁడును, నీచుఁడును, కఠోరవచనుఁడును, అభిమానమగ్నుఁడును, న్యాయనీతులను గ్రహింపఁజాలనివాఁడును 3. దుష్టుఁడును నిరంతరము శీఘ్రకోపియు, మర్యాదహీనుఁడును రాజనైతికయుక్తుల యోజించుటలోఁ బాల్గొనని వాఁడును 4. నగు ఉద్దండుఁడు, అప్రమాణికుఁడునైనవాని మాటలలో సత్యస్పర్శమెప్పుడును నుండదు. వానిని బాపియని, మూర్ఖుఁడని యన వచ్చును. ఇట్టి మనుజులు రాక్షసులు సుమా! 5. ఎప్పుడును నొక్కవిధమగు నవసరము రాదు. నియమములుగూడ నొక్కవిధమగు పని నొసంగవు. నియమములు బెట్టుకొని కూర్చున్నచో రాజనైతికయుక్తి ప్రయుక్తులందు మోసము వాటిల్లును 6. (కావున మిగుల నియమవంతుఁడు కాఁగూడదు) అతియనుదానిని అన్నివిషయములందును రానీయఁదగదు. (అతిసర్వత్రవర్జయేత్) చూచి నడువవలయును. వివేకశాలియగు పురుషుఁడు దురాగ్రహమునకు లోనుగాఁ జనదు 7. మిక్కిలిగా హఠము గావించినచో వ్యవహారము చెడి పోవును 8. ఈశ్వరుఁడు తన భక్తుల యెడ నభిమానముంచును. మఱియు "తులజాభవాని"కిఁగూడ మనయందనుగ్రహముగలదు. కాని ప్రతి కార్యమును విచారించి చేయవలెను 9. అఖండమగు జాగరూకతతో నుండవలెను. ఇంతకంటె నధికముగా సూచన గావింపవలసిన దెద్దియున్నది. ఐనను అన్నివిషయములను జక్కఁగఁ దెలిసికొనవలెను 10. సమర్థుఁడగు పురుషునికడఁ బలువురు జనులుందురు. ఆజనులందఱియెడ నభిమానముంచవలెను. ఇట్లుచేయుటవలన జనులు నిశ్చల

*అఫ్జల్ ఖానుని వధించినప్పుడు శ్రీఛత్రపతి శివాజీ మహారాజునకు శ్రీసమర్థ రామదాసస్వామి ఈ సమాసము నుపదేశించెనని చెప్పుదురు.

మనస్కులై యుందురు 11. ప్రపంచమున దుష్టులు మిగుల వృద్ధినొందిరి. నాలదినములనుండి వారల వలన యుపద్రవ మతిశయించుచున్నది. కావున అఖండముగా సావధానముతో నుండవలయును 12. ఈశ్వరుఁడు సమస్తమునకును కర్త. ఎవ్వని నీశ్వరుఁడు తనవానిగాఁగైకొనునో ఆ పురుషుని విచారమును ప్రత్యక్షముగా గ్రహించును 13. న్యాయము, నీతి, వివేకము, విచారము, నానావిధ ప్రసంగములు, మఱియు నితరులమనస్సులను బరీక్షించుశక్తి ఈశ్వరుఁ డనుగ్రహింపవలసినవె 14. మహాయత్నములు, హెచ్చరిక, సమయమున ధైర్యముగలిగియుండుట, అద్భుతకార్యముల నొనర్చుట, ఇవి యీశ్వరుఁడు ప్రసాదింపవలసిన గుణములు 15. యశము, కీర్తి, ప్రతాపము, మహిమ, అపరిమితములగు నుత్తమగుణములు, అనుసమత్వము నీశ్వరుఁ డనుగ్రహింపవలసినగుణములు 16. దేవబ్రాహ్మణులపై శ్రద్ధనుంచుట, ఆచారవిచారములతో సంచరించుట, ఎందఱో జనులకాశ్రయమొసఁగుట, పరులకుఁ జేతిమీఁదుగా నుపకారము జరుపుట, ఈశ్వరదత్తలక్షణములు 17, ఇహలోకపరలోకములను సంభాళించుకొనుట, అఖండమగు సావధానతతో వర్తించుట, పెక్కుమందిని సహించుట ఈశ్వరదత్తగుణము 18. పరమాత్మపక్షమును గ్రహించుట, బ్రాహ్మణులనుగూర్చి చింతించుట, పెక్కండ్రను బరిపాలించుట, ఈశ్వరుఁ డనుగ్రహించినచో జరుగును 19. ధర్మస్థాపనముగావించునరులు ఈశ్వరావతారములు. పూర్వమనుజులిదివఱ కెందఱో జనించిరి. ఇఁకముందు జనింపనున్నారు. ఈస్థితి గల్పించువాఁడీశ్వరుఁడు 20. ఉత్తమగుణగ్రాహికత్వము, తీక్ష్ణమగుతర్కము, వివేకము, ధర్మవాసన, మఱియుఁ బుణ్యశ్లోకత్వము, ఈశ్వరుఁ డనుగ్రహింపవలసినవి 21. ఎప్పుడును దీరుమానములను యోచించుచుండవలెను. వివేకముతోఁ బ్రవర్తింపవలెను. ఇదియే సకలగుణసారము. దీనివలన ఇహలోక పరలోకములను రెంటిని సాధింపవచ్చును 22.

---

## ఏడవ సమాసము — లోకుల స్వభావము.

లోకులస్వభావము దురాశాయుతముగా నుండును. ఆరంభమునందే "తెమ్ము తెమ్ము" అందురు. వారలకు "మా కేమైననిమ్ము" అను

వాసనవిరివిగా నుండును!. భక్తితో నుండకయే లోకులు ఈశ్వర ప్రసన్నత్వమును గోరుదురు. ఇది యజమానునికి సేవగావింపకయే వేతనము నిమ్మని కోరుటవంటిది 2. కష్టపడనియెడల ఫలములభింపదు. శ్రమపడ కున్నచో రాజ్యము లభింపదు. మఱియుఁ బ్రయత్నము గావింపకున్న యెడల లోకమునందు సాధ్యమగునదిగూడఁ బూర్ణముగ నెరవేరఁజాలదు 3. సోమరితనమువలనఁ గార్యము నాశనమగుట మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నారము. ఈ యంశము నెఱింగియు హీనజనులు పరిశ్రమ గావింపవలసినచో దేహము దాచుకొందురు 4. తొలుదొలుత పరిశ్రమ, దుఃఖము సహించువారలే యనంతరము, సుఖఫలము ననుభవింతురు. తొలుదొలుత సోమరులై కూర్చుండువారలు ముందుముందు దుఃఖముల ననుభవింపవలసి యుందురు 5. ఇహలోకమైన (స్వార్థము) గానిమ్ము. పరలోకమైన, (పరమార్థమైన) గానిమ్ము. ఈ రెంటికిని బ్రయత్నము చేయవలసియేయున్నది. దూరదర్శిత్వము మిక్కిలి యావశ్యకము 6. సంపాదించినదంతయు నెప్పటిదప్పుడు తినివేయు మానవులు కఠిన సమయ మేతెంచినపుడు క్షుధార్తులై మరణింతురు. కావున దూరదర్శిత్వముగలిగి వర్తించువారలే సుఖులై యుందురు 7. ఇహలోకముకొఱకు ధనమును, బరలోకముకొఱకుఁ బరమార్థమును సంచితము గావింపనిచో జీవిత మంతయు వ్యర్థమే! ఇట్లు గావింపని మనుజులు బ్రతికియున్నను జచ్చిన వారలేయని నమ్ముము 8. ఒకసారి మరణించినంతమాత్రమున బంధములు విడిపోవఁజాలవు. అనేక జన్మములెత్తి యాతనల ననుభవింపవలసియున్నది. ఈ విధముగాఁ దన్నెవఁడు చంపుకొనుచున్నాఁడో, (విముక్తి నొందింప కున్నాఁడో) యాతఁడాత్మ హంతకుఁడు 9. ప్రతిజన్మమునందును ఆత్మ ఘాత జరుగుచున్నది. ఆ జన్మముల నెవ్వఁడు లెక్కింపఁగలఁడు? ఈ ప్రకారముగనున్న జన్మమృత్యువు లెప్పు డాగిపోఁగలవు? 10. ఈశ్వరుఁ డంతయుఁ జేయుచున్నాఁడని ప్రాణిమాత్రులెల్లరును నుడువుచున్నారు. కాని యాతని సమావేశలాభము మిగులఁ గొలఁదిగ (ఒకానొకనికె మాత్రమే)కలుగును 11. వివేకలాభమువలనఁ బరమాత్ముఁడు లభించును. వివేకులగు పురుషులకే వివేకములభించును 12. పరమాత్ముఁ డొక్కఁడు. కాని యాతఁడు చేయుచున్న వనేకములు. ఆయనేకములను(దృశ్యములను)

ఒకటియని (పరమాత్మయని) చెప్పఁగూడదు 13. దైవకర్తృత్వము, దైవము, [illegible] సభిప్రాయమును దెలిసికొనవలెను. ఎందఱో మనుష్యుఁ[illegible] దెలిసికొనక వ్యర్థముగా నేదియో నదరుచుందురు 14. [illegible]లు మూర్ఖత్వకారణమున వ్యర్థముగా నేదియో భాషింతురు. [illegible]కేమియులేదు. తాము చతురులమని వెల్లడించుటకే యట్లు చెప్పుచుందురు. వాస్తవముగ సత్యమగు చాతుర్యమును బ్రకటింపవలసిన యావశ్యకత యుండదు. అది (చాతుర్యము) స్వయంప్రకాశమై యున్నది 15. [illegible] శ్రమనొంది కష్టములను సహించి ప్రయత్నించు మానవుఁడు భాగ్యవంతుఁడై సుఖముల ననుభవించును. అభాగ్యులగు జనులు నోటికి వచ్చినట్లు చెప్పుచునేయుందురు. (కాని చేయరు) 16. అభాగ్యుని దరిద్రలక్షణములను విచక్షణ పురుషులు తెలిసికొందురు. కాని యోగ్యుని యుత్తమగుణము లభాగ్యున కెన్నటికిని దెలియవు 17. అభాగ్యునకు దుర్బుద్ధి పుట్టుచుండును. వానికి జ్ఞానస్మృతి యెక్కడనుండును? వానికిఁ గుబుద్ధియే సుబుద్ధిగాఁ దోఁచును 18. స్మృతిదప్పిన మనుజుఁడు భాషించు ప్రసంగమున దేనిని సత్యమని విశ్వసింపవీలగును ? స్మృతిహీనుని కడ యోచన యనునది నామమాత్రమునకైన నుండదుగదా ? 19. విచారము (యోచన)వలన ఇహపరలోకములు రెండును లభించును. జన్మము సార్థకమగును. కావున యోచించి నిత్యానిత్య వివేచనము గావింపవలెను 20.

---

## ఎనిమిదవ సమాసము — అంతర్దైవ నిరూపణము.

బ్రహ్మము, నిరాకారము, నిశ్చలము ఆత్మ, వికారయుతము, చంచలము. కాని జనులెల్లరును దానినే, (ఆత్మనే) దైవమని నుడువుచున్నారు 1. దైవముయొక్క జాడపోకడలే చిక్కకున్నవి. ఒక్కదైవమేని నిశ్చయముగా విశదమగుటలేదు. ఎందఱో దైవములు గలరుగదా ? అందొక్క దైవమేని యనుమానములోనికి రాకున్నది 2. కావున సారాసారావిచారము గావింపవలసిన యావశ్యకముకలదు. విచారసహాయమున దైవమును శోధింపవలెను. పెక్కు దైవములను తలంపునకుఁ దెచ్చుకొని

తికమక పడఁదగదు 3. జనులు తీర్థక్షేత్రములకేగి యచటఁగల దైవ ప్రతిమలనుగాంచి వానికి సమానముగా ధాతువులతో దైవప్రతిమల నిర్మించుచున్నారు. ఇట్లే యీ వాడుక భూమండలమునందంతట నెగఁబ్రాకి నది 4. కేవల క్షేత్రదైవమే నానావిధ క్షేత్రదైవములకు మూలము. ఈ భూమండలముననున్న నానావిధక్షేత్రములను శోధించిచూడవలెను 5. క్షేత్రదైవము పాషాణముతో నిర్మింపఁబడినదిగా నుండును. దానినిగూర్చి యోచించినచో దాని మూలతంతువు (ఆ విగ్రహరూపము) అవతారము ననుసరించి యున్నట్లు విశదమగును 6. అవతారముగైకొని (దేహధారణ మొనరించి) దైవతములు వర్తింతురు. అంత్యమునందు వారల యవతార ములు సమాప్తమగును. బ్రహ్మవిష్ణుమహేశ్వరు లాయవతారమూర్తుల కంటెను గొప్పవారలుగ గణింపఁబడుదురు 7. కాని యీ త్రిమూర్తుల పైని సత్త(అధికారము)గలది అంతరాత్మయే. వాస్తవమునకుఁ బ్రత్యక్ష ముగఁ గర్తయు, భోక్తయు నంతరాత్మయే 8. అనేక యుగములదనుక నంతరాత్మయే యీ మూఁడులోకముల వ్యాపారమును నడుపుచుండును. ఈ నిశ్చయవివేకమును వేదశాస్త్రములయందుఁ జూడవలయును 9. అంత రాత్మయే చేతనరూపముతో వివేకవశమున సమస్త శరీరవ్యాపారమును నడుపుచున్నది 10. ఈ యంతర్దైవతమును జనులు మఱచిపోవుచున్నారు. మఱియుఁ బరుగులెత్తి తీర్థస్థానముల కరుగుచున్నారు. పాపము! ప్రాణు లెల్ల రీవిధముగా దేవుని గుర్తెఱుంగజాలక కష్టములను భరించు చుందురు 11. అనంతరము మనస్సులం దిట్లు విచారింతురు. “ఎచ్చటఁ జూచిన నచ్చట (తీర్థస్థానములయందు) జలము, రాళ్ళు నిండియున్నవి. వ్యర్థముగ నడవులను బట్టుకొని తిరుగుటవలన నేమిలాభము గలుగును ?” ఇట్టియోచన కలిగినవాఁడు సత్సాంగత్యము గావించును. సత్సంగమువలన దెక్కఁడకు దైవము లభించెను 13. ఇట్టి వివేకసంబంధములగు నీ విషయ ములను వివేకులగు పురుషులు నిశ్చయముగా నెరుంగఁగలరు. అవివేకులు భ్రమలోఁబడి మఱచియుందురు. అవివేకుల కిట్టివిషయములు తెలియవు 14 ఎదుటి వాని యంతఃకరణమునందుఁ బ్రవేశము గావింపఁగల పురుషుఁడే లోపలిస్థితి గ్రహించును. కేవలము పైపై మెరుంగులఁగాంచు వాఁడెద్దియు

నెఱుంగఁజాలడు. కావుననే వివేకులు, చతురులు నగు మనుజులు అంతఃకరణమును శోధింతురు 15. వివేకరహితమగు భక్తియున్నను లేకున్నను నొక్కటియే. ప్రతిమాస్థాపితము మూర్ఖునికొఱకని చెప్పుచున్నారు. (ప్రతిమాస్వల్పబుద్ధీనాం) 16. విచారముగావించుచుఁ దెలిసికొనుచుఁ దనజీవితమును గడపువాఁడే యుత్తమవివేకి. వాఁడే తత్త్వములను (స్థూలదృశ్యమును) విడిచి నిరంజనమును (పరబ్రహ్మమును)బడయును 17. ఆకారమునకు సంబంధించినదంతయు నాశనమగును. వాస్తవమునకు ఈ జంజాటము లన్నింటికంటెను వేఱుగానున్న దానినే పరబ్రహ్మమని యెఱుంగవలెను 18. ద్వైతభావము చంచలము, పరబ్రహ్మము నిశ్చలము. పరబ్రహ్మమునందు భ్రమలేదు. ప్రత్యయజ్ఞానమువలన (అనుభవజన్యజ్ఞానముచే) భ్రమ దూరమగును 19. ప్రతీతిలేక చేయునదియెల్ల వ్యర్థమగును. మఱియుఁ బ్రతీతిరహితులగు ప్రాణులు కష్టము లనుభవించి కష్టములలో నుండి కర్మబంధములలోఁ దగుల్కొని మరణింతురు 20. ఒకవేళ కర్మనుండి వేఱుగాకున్నచో (ఒకవేళఁ గర్మఫలమునే కోరవలసినచో) ఇఁక నీశ్వరభజనము నేలగావింపవలయును? ఈ విషయమును వివేకశాలురగు పురుషులు స్వాభావికముగనే యెఱుంగుదురు. మూర్ఖు లెఱుంగరు 20. కొంచెము యోచించినచో జగత్తులోఁ బరమేశ్వరుఁడున్నాఁడని విశదమగును. సగుణమువలననే నిశ్చయముగ నిర్గుణము లభించును 22. సగుణమును యోచించుచు దానిమూలము దనుక నరిగినపిదప సులభముగనే నిర్గుణము లభించును. మఱియు సంగత్యాగమువలనఁ బ్రాణి స్వయముగా బ్రహ్మరూపమైన ముక్తినొందును 23. పరమేశ్వరు ననుసంధానము గావించు మానవులు పావను లగుదురు. ముఖ్యముగా జ్ఞానమువలననే విజ్ఞానము (మోక్షము) లభించును 24. ఈ వివేకాంశములను సుచిత్తముతో అంతఃకరణమునందు యోచింపవలెను. నిత్యానిత్యవివేకము నాలించుటవలన జగత్తున కుద్ధారణమగును 25.

## తొమ్మిదవ సమాసము — నిద్రానిరూపణము.

ఆదిపురుషునకు నమస్కరించి నిద్రావిలాసమును (సుఖనిద్రను) [illegible] గాఢనిద్రవచ్చినచో నెంతపోఁగొట్టుకొన్నను బోదు 1.

శరీరమునందు నిద్ర వ్యాప్తముకాఁగానే సోమరితనము, ఆవలింతలు, ఒడలువిఱుపు జనించును. అందుచే నిముసమేని కూర్చుండఁజాలరు 2. (నిదురకుముందు) త్వరత్వరగా ఆవులింతలు వచ్చును. అందుచే జనులు చటచట చిటికెలు ప్రయోగింతురు. మరియు వంగివంగి మిగులఁ గునికిపాట్లుఁ బడుదురు. 3. కొందఱుకొందఱు నిదురవచ్చినప్పుడు మందగతిగా నుందురు. కొందఱికిఁ గన్నులు మూఁతబడును. కొంద ఱులికిపడి నలుదెసలు గాంతురు 4. కొందఱు బోరగిల పడిపోదురు. బ్రహ్మవీణను బగులఁగొట్టుదురు. డమరు (వాద్యవిశేషము) ముక్కలుముక్కలగును. అప్పటికిని దెలివిరాదు 5. అనుకొని కూర్చుండి కొందఱు గురుకఁబెట్టుట కారంభింతురు. కొంద ఱుత్థానులై సాచుకొనిపరుందురు 6. ముడుచుకొని కొందఱు, పొరలుచుఁ గొందఱు, నలువైపులఁ జక్రాకారముగాఁ దిరుగుచుఁ గొందఱు బరుందురు. 7. కొందఱు చేతులను గదుల్తురు, కొందఱు పాదములు గదుల్తురు. కొందఱు కఱ్ఱుకఱుమని, దంత ములతోఁ గొఱుకుకొందురు 8. కొందఱు కట్టుబట్టలు వీడిపోవుటచే దిస్సమొలతోఁ బొరలుదురు. కొందఱు వెంద్రుకలముడివీడి నలుమొగ ముల నావరించుకొనఁ బడియుందురు 9. కొంద ఱస్తవ్యస్తముగఁ బొరలు చుందురు. కొందఱు పీనుఁగులవలెఁ గనిపింతురు. కొందఱు నోరుతెఱచు కొని దంతములుగనిపించునట్లు పడియుంటచే భూతములవలె ప్రకారముగ గనిపింతురు 10. కొందఱు గుఱ్ఱులిడుచుఁ బక్కమీఁదినుండి లేతురు. కొందఱు చీఁకటిలోఁ చేతులుజాడింతురు. కొందఱు ప్రక్కచివర నోదిగి పరుందురు 11. కొందఱు పుణికిరింత లొనర్తురు. కొందఱు భూమిని దేవులాడుదురు. కొందఱు లేచి (నిద్రమత్తుచే) దారితెన్ను యోచింపక యేదేని యొకదిక్కున కరుగుదురు 12. కొందఱు గుఱ్ఱుపెట్టుదురు. కొందఱు వెక్కివెక్కి యేడ్తురు. కొందఱు మిగుల సంతోషముతోఁ గిలకిల మని నవ్వుదురు 13. కొందఱు ప్రలాపింప నారంభింతురు. కొంద ఱఱ తురు. కొంద ఱులికిపడి తమస్థానముననే పడియుందురు 14. కొందఱు క్షణక్షణమునకును గఱ్ఱుగఱ్ఱుమని దగ్గుదురు. కొందఱు తలగోకుకొందురు. మఱియు నెక్కువగాఁ గాండ్రింతురు 15. కొందఱికి (పెదవిచివరనుండి) లాలాజలము కారుచుండును. ఒకానొకఁడు తాంబూలము నమలి రస

ముచు విడుచుచుండును. ఒకఁడు ప్రక్కలోనే హాయిగా లఘుశంకను విడుచును 16. కొందఱు అపానవాయువులు విడుతురు. కొందఱు అజీర్ణముచేఁ ద్రేన్పులు విడుతురు. కొందఱు దగ్గిదగ్గి పరున్న స్థలమునకుఁ జేరువనే (మంచివెన్నెలు గినునివఁటి) తుమ్మివేయుదురు 17. కొందఱు మలమువిడుతురు. కొందఱు నాంతిగాంచుకొందురు. కొందఱు కాండ్రింతురు. కొందఱు తుమ్ముదురు. కొందఱు అస్పష్టస్వరముతో మంచితీర్థము కావలయు నందురు 18. కొందఱు స్వప్నములచే వ్యాకులు లగుదురు. కొందఱు మంచిస్వప్నములుగాంచి యానందింతురు. కొందరు సుషుప్తికారణమున గాఢనిద్రామగ్నులై యొడలెఱుంగక పడియుందురు 19. తెల్లవారు జామైనది. ఒకఁడు చదువుట కారంభించుచున్నాఁడు. ఒకఁడు ప్రాతస్స్మరణమునకో, హరికీర్తనమునకో ప్రార్థించుచున్నాఁడు 20. కొందఱు ధ్యానమూర్తిని స్మరింతురు. కొందఱు ఏకాంతమున జపముచేయుదురు. కొందఱు తాము కంఠస్థమొనరించిన దానిని వల్లెవేయుదురు 21. కొందఱు తమతమ యభిరుచుల ననుసరించి నానావిద్యలను నానాకళలను నేర్చుకొందురు. కొందఱు తానమానములతో గాయనకళ లభ్యసించుచు గాన మొనరింతురు 22. వెనుకటినిద్ర సమాప్తియగును. మెలకువగలుగును. కావున మనుజులు తమతమ ప్రయత్నములలోఁ బాల్గొందురు 23. జ్ఞాతయగు పురుషుఁడు తత్త్వమును (దృశ్యమును) లఘించివేయును. తురీయదశ కావలిప్రక్కకు వెడలిపోవును. మఱియు నాత్మనివేదనమువలన బ్రహ్మరూపుఁడగును 24.

---

## పదియవ సమాసము — శ్రవణవిక్షేపము.

ఏదేని యొకకార్యమును నిర్వహింపనెంచినచో మధ్యమధ్య నేదేని విఘ్నము వచ్చుచుండును. కాని సమయము సహాయమైనపక్షమున (కాలమనుకూలించినచో) ఆ కార్యము దానికదియే నెఱవేరును 1. కార్యము నెఱవేరినచో మానవునకు సుఖముగలుగును. దినదినమును (ముందుగావలసిన) ఆలోచన స్ఫురించుచుండును 2. ప్రాణి యెప్పుడు దవ తీర్ణుఁడగునో యప్పుడు కాల మేమాత్రముగానైన ననుకూలమేయగును. పరమేశ్వరుఁ డనుగ్రహశాలియై దుఃఖాంతరమున సుఖమునే యిచ్చు

చుండును 3. కాలమంతయు సాధారణముగా ననుకూలముగా నమరి యున్నచో జనులందఱును రాజులై యుండెడివారలే! సారాంశమేమన! కాలము కొంతకాల మనుకూలముగనుండును. కొంతికాలము ప్రతికూల ముగనుండును 4. ఇహలోకము, పరలోకము అనునీరెంటిలో నేవిషయము నేనిసాధింపవలయునన్న ఈశ్వరదత్తమైన స్వాభావికము,అద్భుతమునగు వివేకము గావలయును 5. వినుటయే విషయ మవగాహనమగుటయు, నేర్వకయే చతురత్వ మలవడుటయు విన్నదిగాదు కన్నదిగాదు 6. వినుటవలన విషయము విదితమగును. విశదమైనకొలది వృత్తిశుద్ధమగును. దానినే సారాసారనిర్ణయము మనస్సున స్థిరముగాఁ బాదుకొనును 7. వినుటను శ్రవణ మందురు. విన్నవిషయమును హృదయమున మాటిమాటికి యోచించుట మననమందురు. ఈ రెండుపాయములవలననే త్రిలోకవ్యాపారము జరుగు చున్నది 8. శ్రవణమునఁగలుగు బహువిధవిఘ్నముల నెంతదనుక లెక్కింప గలము? కాని సావధాన హృదయులైయున్నచో నవిఅన్నియు ననుభవములోనికి వచ్చును 9. శ్రవణమునందు (మొదటినుండియు) గూర్చిండి యున్నవారలు వ్యాఖ్యాతచెప్పఁగాఁజెప్పఁగా ఏకాగ్రచిత్తులగుదురు. వెనుక నుండి శ్రవణమునఁ బ్రవేశించినవారలు ఏకాగ్రచిత్తులు కాఁజాలరు 10. వెలుపల దిరిగివచ్చిన మనుజుఁడు నానావిధవిషయములను వినవచ్చును. కావున నాతఁడంతయో యింతయో కదలిక గలిగించితీరును. మౌనముగాఁ గూర్చునియుండఁడు 11. సందర్భమును బరికించి నడచుమనుజులు మిగులఁ దక్కువగా నున్నారు. ఇఁక శ్రవణమునందుఁగలుగు విఘ్నముల నాలింపఁ గోరెదను12. శ్రవణమునఁ గూర్చున్నంతనే తొలుత ఒడలువిఱుపు వచ్చును. తరువాత నిద్రాకారమునఁ ద్వరత్వరగా ఆవలింత లారంభించును 13. కొందఱు సుచిత్తులై కూర్చుందురు. కాని విషయము వారి హృదయమున కంటదు. వారలు వెనుకవినియున్న యంశములనే మనస్సులోఁ బెట్టు కొందురు 14. శరీరమును మాత్రము వినుటకుఁ దత్పరముగావింతురుగాని మనస్సులోని కితరవిషయములే వచ్చును. మనస్సులోనికి వచ్చు తలంపుల నెంతదనుక వర్ణింపగలను? 15. విన్నయంశములను మననము గావించి నప్పుడే విషయము కొంతకొంత బోధపడును 16. పట్టుకొంద మాయున్న మనస్సు కొంచెమేనియుఁ గనుపించునదికాదు. కావునఁ బ్రతిమనుజుఁడును

దనహృదయము నర్పిట్టినలయును. అరికట్టినపిదప హృదయమును అర్థము నందు ప్రవేశపెట్టవలయును 17. మిక్కిలిగ భుజించి నిరూపణమునందుఁ బెద్దలెదుట గూర్చుండుటచేఁ గూర్చున్నంతనే దప్పివలన వ్యాకులుఁడగును 18. వెంటనే నీరు త్రాగవలయునని యడుగును. పిదప గటగటగట నీరు విశేషించి త్రాగును. ఈ కారణమున మనస్సుచెదరి యాతఁడు లేచిపోవును 19. పుల్లని ద్రేపులు వెక్కిళ్ళువచ్చును. ఒకవేళ నెక్కుడనేని కొంచెము వాయువు జనించెనా నిఁక నడుగవలసిన పనియేలేదు. అనేకజనులు మాటిమాటికి లఘుశంకకు పోవలసివచ్చును 20. ఒకానొకఁడు తొందరపడి యంతయు విడిచి నిరూపణ సమయముననే అధికశంకకుఁ (విరేచనమునకు) బోవును 21. ఒకానొకని హృదయము దృష్టాంతముగా నుడువఁబడిన యఘూరార్యానికమునందే లగ్నమైయుండును. ముందురాఁబోవు నంశముల నాతఁడు వినఁడు 22. ఒకఁడు నిరూపణములోనికేతెంచి కూర్చున్నంతన వానిని దేలుకుట్టును. ఈ యవస్థలో నిఁక నిరూపణమెక్కడిది ? పాపము ! వాఁడు వ్యాకులుఁడై పోవును 23. ఒకనికిఁ బొట్టలో బాధ గలిగి వీపులోనికి వెళ్లి వచ్చును. దగ్గు, చీదర, నుసిమిరి, గడ్డ, పుండు మున్నగువానివలని బాధచే స్థిరముగాఁ గూర్చుండ వీలుకలుగదు 24. ఒకఁడు శైత్యశీలుచుటవలన మూర్ఛితుఁడగును. ఒకఁడు వెలుపలజరుగు గోల నాలకించి దానిచేఁ బరుగెత్తుకొనిపోవును 25. కొందఱు విషయాసక్తులు కథనాలించు సమయమున స్త్రీలవైపే చూచుచుందురు. దొంగ లీతరుణమునఁ బాదరక్షలను దొంగిలించుకొని పోవుదురు 26. ఒక్కొక్కప్పుడు "ఔను కాదు" అని యేదేని వివాదముకలుగును. అప్పుడు జరుగు గల్లంతులవలన హృదయమునకు మిగుల ఖేదముకలుగును 27. కొందఱు నిరూపణసమయమునఁ గూర్చుండి చక్కఁగ భాషించుకొందురు. హరిదాసులు పొట్టకొఱకు రేరేయని రాగము లాలాపనము చేయుదురు 28. జ్ఞాత లెక్కువమంది యొకచోఁ బ్రోవైనయెడల నొకనివెనుక నొకఁడు మాటలాడ నారంభించును. అచట శ్రోతల యాశయ మొకప్రక్కనే యుండును 29. "ఇది నాది నీదికాదు" అని యెల్లప్పుడును నుడువుట కలవాటు పడిన వాఁడు న్యాయనీతులనువిడిచి యన్యాయపక్షమునఁ జేరును 30. ఒకఁడు గొప్పతనమునకై వాచ్యములను, అవాచ్యములను

నుడువును. న్యాయరహితుఁడగువాని నిష్పూడుగాకున్నఁ జివరకేని లోకులు "వీఁడు పరమాన్యాయస్థుఁడురాయని" యనితీరుదురు 31. అభిమాన గ్రస్తులై సంతప్తహృదయులుగనుండు శ్రోతలను సత్యవంతులని నుడువ వలయునో, అనృతవాదులని యనవలయునో నేను నిర్ణయింపఁజాలను 32. కావుననే విచక్షణులు, బుద్ధిమంతులు నగువారు తొలుదొలుతనే "మేము తెలియనివారము" అను భావముతో నుందురు. మఱియు వార లితరులతో అన్నా! మేము మూర్ఖులము. నిరక్షరులము. ఏమియు నెఱుంగము అని నుడువుదురు 33. పరమాత్ముఁడు తనకంటె గొప్పవాడని తలంచువాఁడు ప్రపంచమునందలి జనులందఱను సంతుష్టిపఱచును. ఏల యన! సంపూర్ణ ప్రపంచమునందుఁ బరమాత్ముఁడు నిండియున్నాఁడు 34. సభయందొకవేళ కలహముప్పతిల్లినచో జనులు జ్ఞాతయందే దోషము నారోపింతురు. "జనుల హృదయములు వశపఱచుకొనఁజాలని వీఁడెట్టి యోగి"యని యందురు 35. వైరము గావించినచో వైరమే వృద్ధి యగును. తాను దుఃఖము సహింపవలసివచ్చును. కావునఁ జతుర పురుషునిగూడ విచారమును దెలిసికొనవలెను 36. ఉత్తమపురుషులు లోపాలోపములు సవరించుకొనుచు నడుచుకొందురు. తమమీఁది కేవిధమగు దోషమునేని రానీయరు. వారలు క్షమను, శాంతిని అవశ్యముగా నాచరింతురు 37. దుర్గుణుని యెడఁగల దుష్టగుణములను సుగుణవంతులగు పురుషులు వెంటనే తెలిసికొందురు. వివేకులగు వారలు తమతమ పను లన్నింటిని వివేకముతో నొనరింతురు 38. వివేకబలముతో బహువిధోపాయములు, దీర్ఘప్రయత్నములు గావించుచుండువాఁడు తనమహిమ తానే యెఱుంగఁగలఁడు 39. వివేకరహితుని దుర్జనులు తమవలలో వేసికొందురు. బుద్ధిహీనులుగూడ నాతని మఱింత బుద్ధిహీనుని జేయుదురు 40. న్యాయము, పర్యాయము, (అవసరము) ఉపాయములకు సంబంధించిన అనేక యుక్తులు, మూర్ఖుల కెట్లు తెలియును? 41. కాని చెడిపోయిన పరిస్థితులనుగూడఁ జతురులు సవరింపఁగలరు. చతురులు స్వయముగా ఆత్మయజ్ఞము చేయుదురు. ఇతరులచేఁ జేయింతురు. అట్లే స్వయముగాఁ బ్రయత్నము చేయుదురు. ఇతరులచేఁ జేయింతురు 42. సాధారణముగా జగత్తునందంతటను మనుజులు నిండియున్నారు. కాని

వారలలో నెవరు మనుజమాత్రులకు సమాధానమును ప్రసాదింతురో అట్టి సత్పురుషులు ధన్యులు 43. ఇట్టి సత్పురుషుడు జనుల కోర్కులను నానావిధములఁ బరీక్షించును. మర్యాదను, ప్రసంగమును, సమయమును గురుతెఱుఁగును. మఱియు సంతప్తులగు జనుల ననేకవిధముల శాంతులను గావించుటగూడ నెఱుఁగును 44. ఇట్లే యాతఁడు సంపూర్ణ ప్రపంచ విషయములుగూడ నెఱుఁగును. ఆతఁడు వివేకముతో సమస్తకార్య ములను గావించుటయందు సమర్థుఁడై యుండును. ఆతఁడు ఎట్లు ఏమి చేయుచున్నాఁడో యని లోకుల కేమియుఁ దెలియనేదెలియదు 45. సత్పురుషుఁడగు వివేకశాలి పలువురుజనులను గార్యమునఁ బ్రవేశపెట్టును. జనసముదాయపుఁగదలిక తనచేతిలో నుంచుకొనును. ఇట్టియోగ్యుఁడె వివేకమువలన* సమర్థపదవి నొందును 46. కాని వివేచనము నేకాంత మున నొనర్పవలెను. తన ధారణాశక్తిసహాయమునఁ బరమాత్మ్ముని ధారణ గావింపవలెను. మఱియు మనుష్యమాత్రునిఁ దనవానిగఁ దెలిసికొన వలెను 47. ఏకాంతప్రవేశమునందు వివేకము స్ఫురించును. ఏకాంతము నందు యత్నము లభించును. మఱియు నేకాంతమునందుఁ దర్కశక్తి సమస్తబ్రహ్మాండముపై విరాజిల్లును 48. ఏకాంతమునందు స్మరణ గావించుటవలన మఱచిపోయిన ద్రవ్యభాండారమునైతము లభించును. ఏకాంతమునందుఁ గూర్చుండి యాత్మతో నంతయో యింతయో విచా రము గావింపవలెను 49. ఏకాంతవాసమున కలవాటుపడినవానికార్యము అందఱికార్యములకంటె ముందు నెఱవేరును. ఏకాంతములేనిచో మహా త్త్వము లభింపఁ జాలదు 50.

పదునెనిమిదవ దశకము సమాప్తము.

---

* ఈపద్యమును శ్రీసమర్థరామదాసస్వామియొక్క ఆత్మచరిత్రముగ నే భావింప వలయును.



# పందొమ్మిదవ దశకము.

## మొదటిసమాసము — లేఖనకౌశల్యము.

బ్రాహ్మణులు బాలబోధ (హిందీ దేవ నాగరి) అక్షరముల నభ్యసించి చతురులుచూచినంతనే యానందించునట్లు సుందరముగా వ్రాయవలెను 1. గుండ్రముగను, సరళముగను, విడివిడిగను, జిక్కనిసిరాతో ముత్తెపుసరములవలె అక్షరపంక్తులను వ్రాయవలెను 2. ప్రతియక్షరము స్పష్టముగ నుండవలెను. మధ్యనుస్థలము వాక్యాంతమునమాత్ర రేఫ. అసంపూర్ణవాక్యముల కంతమున (కామా) గుర్తుమున్నగు నక్షరములకు వలయు సర్వాంగములు చక్కఁగ నుండవలెను 3. మొదటి అక్షరమెట్లుండునో గ్రంథములోని యక్షరములన్నియు నట్లుండవలెను. అథ మొదలు ఇతివఱకు (మొదటినుండి చివరవఱకు) గ్రంథమంతయు నొక్క కలముతో ఒక్కేపట్టుదలతో వ్రాయఁబడినట్లు కనఁబడవలెను 4. అక్షరముల నలుపుదనము, కలముయొక్క లావువంపులు, మున్నగునవియెల్ల సరళముగనుండవలెను 5. పంక్తితోఁ బంక్తి గలియఁగూడదు. మాత్ర, రేఫ, బిందు మున్నగునవి యొకదానితో నొకటి కలిసిపోవరాదు. అట్లే యొకదానితో నొకటి తగులునట్లు అక్షరములను బొడవుగా లాగివ్రాయఁ గూడదు 6. కాగితపుఁబుటలపై ముందుగా సీసముతో గీతలుగీచి స్ఫుటముగా నక్షరములు వ్రాయవలెను. పంక్తులకుమధ్యనుండు స్థలము మిగుల దగ్గరగాఁగాని మిగుల దూరముగాఁగాని యుండఁగూడదు. సమానముగా నుండవలయును 7. వ్రాసినదానిని మఱల శోధింపవలసిన యవసరము లేని విధముగా వ్రాయవలెను. పొరబాటులు వెదకినను గనుపింపనివిధమునను మఱల లేఖకు నేదేనిసందియము నడుగవలసినపని లేనట్టుగను వ్రాయవలెను 8. నూతనలేఖకులు (బాలకులు) జాగరూకతతోఁ గనిపెట్టియు మిగుల గుదిరకగా నుండునట్లును లేఖనపద్ధతిగాంచినంతన యెదుటివారు మోహితులగునట్లును వ్రాయవలెను 9. పెక్కండ్రుయౌవనదశలో మిగులఁ జిన్నయక్షరములు వ్రాయుదురు. వారలు వార్ధకమునందు దామువ్రాసిన

దానినే బ్రౌము చదువఁగాలరు. కావున మిగులసన్నగాఁగాని, మిగులబెద్ద గాఁగాని కాక మధ్యమతరగతిగల యక్షరములను వ్రాయవలెను 10. కాగితమునకుఁ జుట్టుప్రక్కల స్థలము విడువవలెను. మధ్యసుందరముగను స్పష్టముగను వ్రాయవలెను. కాగితమువాడుకవలనఁ జినిగిపోవనున్నను అక్షరములుమాత్ర మట్లే చెదరనిదిగా నుండవలెను 11. ఈ విధముగా వ్రాయవలయునను కోర్కి-మనుష్య మాత్రునకుఁ గలుగునట్లును "ఔరా! ఈలేఖకుని జూడవలయునురా"యని జను లనుకొనునట్లును గ్రంథమును చక్కఁగ నిర్మించి వ్రాయవలెను 12. శరీరముతో బాగుగాఁ బరిశ్రమ చేయవలెను. తన యుత్కృట కీర్తిని బ్రపంచమునందు విడువవలెను. ఏదేని యుత్తమగుణమును జూపి లోకులను మోహితులఁ గావింప వలెను 13. గట్టికాగితమునుదెచ్చి మిగుల జాగరూకతగా దానిని గ్రంథ మునకుఁ దగినట్లు చింపవలెను. వివిధములగు వ్రాతపనిముట్లులను జాగ్రత్త జేసికొనవలెను 14. చాకు, కత్తెర, గీతలుగీయుయంత్రము, సీసము, గోట్టము, పలుతెఱంగులనుండు మంచిమంచి రంగులు, మఱియు నితర సాధనములు సేకరించి యుంచుకొనవలెను 15. దేశదేశాంతరములలోఁ గల గాఢములు, సూక్ష్మములు, సుందరములు నగు రంగు పాత్రములు (సిరాబుడ్లు) ప్రోవుచేయవలెను 16. కలమునుజెక్కెడి యంత్రము, గీతలు గీయు యంత్రము, సీసపుబుండలు మున్నగు చిత్రవిచిత్రములగు సాధన ములు సంపాదించుకొనవలెను 17. ఎండినదియుఁ బచ్చిదియు నగునలుపు రంగు దగ్గఱ నుంచుకొనవలయును. ఇంతియగాక నానావిధవర్ణములు వేఱువేఱుగా దూదితోఁ దడిపి జాగ్రత్తజేసికొనవలెను 18. గ్రంథము నందు ఇతిశ్రీ (సమాప్తి)ని నానావిధములగు సుందరచిత్రములతో లిఖింప వలెను. దేశదేశాంతరములలో నుపయోగించు చిత్రలేఖనపరికరములు సిద్ధముగానుంచుకొనవలెను 19. నానావిధములగు నవారు, వేష్టనము, ఎఱ్ఱనిరంగు, మైనపుగుడ్డ, పెట్టెలు, తాళములు మున్నగు నెన్నేనిసామా నులు, పుస్తకములను సురక్షితముగా నుంచుకొనుటకు గావలయును * 20.

---

* ఈసమాసను వలన శ్రీసమర్థ రామదాసస్వామి వారికాలమునగల లేఖన ప్రణాళిక తెలియును.

## రెండవసమాసము — చతురత్వ ప్రవర్తనము.

గతసమాసమందు వ్రాయువిధము వివరించితిని. ఇఁకనిప్పుడు అనేక ప్రకారములగు అర్థముల నెఱుంగురీతుల వినుఁడు. అన్నివిధములగు విషయములను దెలిసికొనవలెను 1. శబ్దభేదము, అర్థభేదము, ముద్రాభేదము, ప్రబంధభేదము, నానాధ్వనుల ధ్వనిభేదము నెఱుంగవలెను 2. నానాసందేహములు, ఉత్తరప్రత్యుత్తరములు, ప్రతీతిసాక్షాత్కారము మున్నగువాని నెఱుంగవలెను. ఏలయన! ఈ విషయముల నెఱింగినచో జనుల యంతఃకరణములు ప్రసన్నములగును 3. నానావిధములగు పూర్వపక్షసిద్ధాంతానుభవములను జక్కఁగ నెఱుంగవలెను. సందేహపూర్ణములగు నస్తవ్యస్తవిషయములఁ జెప్పఁగూడదు 4. ప్రవృత్తియైనఁగానిమ్ము. నివృత్తియైనఁగానిమ్ము. ప్రతీతి (అనుభవము)లేనిచో నంతయుభ్రాంతియే! అనుభవరహితుఁడగు మానవుఁడు మట్టిప్రమిదవంటివాఁడు. (అనుభవతైలములేనిచో) దానిలోనిజ్యోతియెట్లువెలుంగఁగలదు? 5. హేతువునుదెలిసికొనియుత్తరమీయవలెను. రెండవవానిమనస్సులోని యంశమునుగ్రహింపవలెను. ఇదియే ముఖ్యమగు చాతుర్యలక్షణము 6. చతురత్వములేనిచో నేప్రయత్నమైన సిద్ధినొందఁజాలదు. చాతుర్యములేనిచో సమస్తవిద్యలును వ్యర్థము. చతురత్వములేని సమాజమునందు మిగుల గొప్పగొప్ప విషమపరిస్థితులు తటస్థించును. జనులకు సమాధానమే కలుగదు 7. ఇతరులు నుడువు మాటల నన్నింటిని మౌనముగ వినుచుండవలెను. స్వాయముగా నేమియుఁ జెప్పఁజనదు. కాని యందఱిమనోభావములను దన చతురత్వముతోఁ గొద్దిలోనే తెలిసికొనవలెను 8. బుద్ధిహీనులతోఁ గూర్చుండఁదగదు. ఉద్ధతుఁడగు మనుజునితో విశేషించి భాషింపరాదు. తనకొఱకై యెవరిచిత్తసమాధానమునేని భంగము గావింపఁజనదు 9. ఎఱుకలేమిని (దీనత్వమును) విడువరాదు. ఎఱుకకలదని గర్వపడఁగూడదు. సమస్తజనుల హృదయములను మృదుశబ్దములతోఁ బ్రసన్నముగా నుంచుకొనవలెను 10. ప్రసంగమును జక్కఁగఁ బరిశోధింపవలెను. పలువురి నప్రసన్నులుగ నొనరింపఁదగదు. సత్యమునుడివియేని సభ్యుల మనోభంగము గానీయరాదు 11. జాడదీయుటయం దాలస్యము కూడదు.

భ్రష్టజనులలోఁ గూర్చుండరాదు. ఒకవేళఁ గూర్చున్నచో మిథ్యాదోష
ములు నుపొనరాదు 12. అర్హుఁడగు మనుజుని యంతఃకరణమును బరి
కింపవలెను. చదివినది యేకొద్దిమైనను దెలిసికొనునది విశేషముగ నుండ
వలెను శ్రేష్ఠుఁడగు పురుషుని దనగుణములచే లోఁబఱచుకొనవలెను 13.
జల్సా, మేజువాణి మున్నగు వినోదములలోఁ బాల్గొనరాదు. భోజన
ప్రసంగములోనికిఁ బోవఁదగదు. పలవసన, అచ్చటికేగినచో ఆత్మగౌరవ
మునకుఁ గొఱంతగలుగును 14. ఉత్తమగుణములను వెల్లడించుచు
అందఱితోఁ గలిసియుండుటలో నానందముగలదు. యోగ్యులగు మను
జులను జూడఁగనే వారిని బాగుగాఁ బరిశీలించి పిదపఁ దనమిత్రులను
గావించుకొనవలెను 15. ఉపాసనముననుసరించి భాషింపవలెను. అంద
ఱను సంతుష్టిపఱుపవలెను. మఱియు నెల్లరిపట్లను సకలవిధములఁ బ్రతిష్ఠ
నుంచవలెను 16. తొలుదొలుత అన్నితావులందును అన్నివిషయముల
లోను జాడ నెఱింగి పిమ్మట గ్రామములలో బ్రవేశింపవలెను. మనుష్య
మాత్రునియెడ సోదరప్రేమయుంచి సాదరముగా భాషింపవలెను 17.
ఎవ్వరినిగాని ఉచ్చనీచములాడఁదగదు. అందఱిహృదయములను జల్లఁగ
నుంచవలెను. సూర్యాస్తమానకాలమునం దెచటికిని బోవఁదగదు 18.
మనుజునియందుఁగల వాణి యొక్క యుత్కృష్టపదార్థము. దానివలనఁ
బ్రపంచమంతటితోఁ జెలిమి కుదురును. అన్నితావులందును సత్పాత్రుని
వెదకి కనుఁగొనవలెను 19. హరికథాప్రచారము జరుగుతావున కరుగ
వలెను. అందఱికంటెను దూరముగా దీనునివలెఁ గూర్చుండవలెను. ఇట్లే
దూరమునుండియే హరికథాభావము గ్రహింపవలెను 20. హరికథా
కాలక్షేపములలో సజ్జనులు లభింతురు. గొప్పగొప్ప ప్రభావశాలురగు
జనులతోఁ బరిచయము కలుగును. ఈ విధముగా సమస్తమును నెఱింగి
తెలిసికొని పిదప మెల్లమెల్లగా జనసముదాయములోఁ గలియుటకుఁ
బ్రయత్నింపవలెను 21. అన్నిటిలో శ్రేష్ఠమైనది శ్రవణము. శ్రవణము
కంటెను గొప్పది మననము. మననమువలనఁ బెక్కుమందికి సమాధానము
కలుగును 22. ధూర్తతవలన (విశిష్టచాతుర్యమువలన) అన్నింటి నెఱుంగ
వలెను. లోలోపల నంతయు మనస్సునందే నిశ్చయము గావించుకొన
వలెను. తెలిసికొనకయే యేల శ్రమను భరింపవలయును 23.

## మూఁడవ సమాసము – అభాగ్యునిలక్షణములు.

అంతఃకరణమును పదిలపరచి అభాగ్యునిలక్షణములు వినుఁడు. ఈ యవలక్షణములను విడిచినచో భాగ్యలక్షణము లలవడును 1. పాపము దరిద్రమువలనఁ గలుగును. పాపము దరిద్రమువలననే సంచిత మగుచున్నది. నిరంతర మిక్కట్లే జరుగుచుండును 2. కావున అభాగ్యలక్షణములను విని వానిని త్యజించుట యావశ్యకము. ఇట్లు గావించుటవలనఁ గొన్నికొన్ని భాగ్యలక్షణము లలవడును 3. అభాగ్యునకు సోమఱితనము రుచించును. వానికెప్పుడును ప్రయత్నము గావింపవలయునను తలంపే కలుగదు. మఱియు వానివాసన నిరంతరమును అధర్మము నందే లగ్నమై యుండును 4. అభాగ్యుఁడు సర్వకాల సర్వావస్థలయందు భ్రమాకులుఁడు గను నిద్రాప్రియుఁడుగను నుండును. ఎవరికిని రుచింపనివిధముగా నాతఁ డడ్డదిడ్డము లాడుచుండును 5. అభాగ్యుఁడు చదువుటయు, వ్రాయుటయు నెఱుంగఁడు. వ్యాపారముగాని వ్యవహారముగాని చేయఁజాలఁడు. లెక్క-డొక్కల వ్రాయనొల్లఁడు. ఆతనికి ధారణాశక్తిగూడనుండదు 6. ఆతఁడు (తనవస్తువులను) బోఁగొట్టుకొనును. విడిచివేయును. ఎందో పడ వేయును. పగులఁ గొట్టుకొనును. మఱచిపోవును. పొరపాటుబడును. ఎన్ని దుర్గుణములు గలవో యన్నియు వానికడనే యుండును. యోగ్యుల సాంగత్య మాతని కించుకేని రుచింపదు 7. అభాగ్యుఁడు దుష్ప్రవర్తనులను జతగాండ్రనుగఁ జేసికొను దుష్కర్ములను మిత్రులుగఁ జేసికొనును. చోరులను పాపులను దుష్టులను సమకూర్చును 8. చూచినవారితోఁ గలహించును. నిరంతరము దొంగతనముచేయును. నరుల కపాయము చేయుటలో అభాగ్యుఁడు మిగుల నేర్పరి. మార్గమునందుండి బాటసారులను దోచుకొనును 9. ఆతనికి దూరదర్శిత్వముండదు. న్యాయముగాని, నీతిగాని రుచింపదు. నిరంతర మితరుల వస్తువులను దొంగలింప నువ్విళులూరుచుండును 10. అభాగ్యుఁడు సోమరితనముతోఁ గొన్నిదినములు దేహమును బోషించుకొనును. కాని, పొట్టకులేనప్పుడు ఏమియుఁ జేయఁజాలఁడు. వానికిఁ గట్టుకొనుటకుఁ, గప్పుకొనుటకుఁ జింపిరిగుడ్డలైన దొరుకవు 11. సోమరితనముతో దేహ

మును గా[illegible]. ఎల్లప్పుడు తలగోకికొనును. రాత్రింబగళ్లు నిదు రించుచు[illegible] 12. [illegible] చెలిమిచేయఁడు. కఠినవాక్యము లాడును. మూర్ఖత్వ[illegible] [illegible]పరచినను వినఁడు 13. పవిత్రులతోఁ గలియు[illegible] [illegible]. అపవిత్రులగు జనులలోనికి నిశ్శంకముగాఁ బోవును. [illegible] దుష్కర్మము లభాగ్యునకు మంచిపనులని తోఁచును 14. [illegible] పరోపకారమన నేమియో తెలియదు. అనేకుల సంహరించును. [illegible] ధనముల నిరంకుశుఁడును, పాపియు, అనర్థియు, మూర్ఖుఁడు[illegible] 15. అభాగ్యుఁడు శబ్దములను గనిపెట్టి మాట లాడఁడు. [illegible] నాగఁడు. ఆతనిభాషణ మెవనికిని రుచింపదు 16. ఎవరి [illegible]శ్వాసము [illegible]. ఎవరితో మైత్రియు లేదు. విద్యా వైభవ మేమాత్రము [illegible]. ఐనను మిడిసిపడుచునే యుండును 17. పెక్కండ్ర మానసములను ప్రసన్నము గావించుకొనఁగలిగినపుడే సౌభాగ్యము ప్రాప్తించునని యెనరేని యభాగ్యునితోఁ జెప్పినచో నిట్టివివేకవాక్యముల నాలింపఁడు 18. స్వయముగా నాతనికిఁ దెలియదు. ఇతరులు నేర్పనెంచి నచోఁ దెలిసికొనఁడు. ఇట్టి పురుషునికొఱ కేమియుపాయములఁ జేయఁ గలము? 19. అభాగ్యుఁ డెన్నియో యోచనలఁ గావించును. మనో రాజ్యమును బరిపాలించును. కాని యేమియుఁ బ్రాప్తింపదు. ఈ విధముగ నాతఁడు నిరంతరము సందేహములలోఁ బడియుండును 20. పుణ్యమార్గ మును [illegible]యును. ఇఁక నాతనికిఁ బాప మెట్లుతొలంగును? నిశ్చయ మేమియు నొనర్పఁడు. ఎల్లపుడు సందేహములలో మునిఁగి తేలుచు సర్వ మును నాశనముగావించును 21. చక్కఁగ నేవిషయము నెఱుంగఁడు. అట్లయ్యు సభలో నేదియో మాటలాడఁబోవును. ఆతఁ డేమియు నెఱుంగనివాఁడు గావున సభలో మాటలాడునపుడు లోకులసమ్ముఖమున బుద్ధిహీనుఁడు, వ్యర్థుఁడునై కూర్చుండును 22. ఎవ్వని నిశ్చయభావము (కొంతయైనను) పెక్కుమందికి విశదమగునో యాతఁడు ప్రపంచమున మాన్యుఁడగును 23. కష్టమును సహింపకున్నచోఁ గీర్తి యెట్లు లభించును? గౌరవ మూరక లభింపదు. మీఁదుమిక్కిలి అవలక్షణమువలన నలుదిక్కు లందును నిందగలుగును 24. యోగ్యులస్నేహము గావింపక చతురత్వము గడింపక యుండువాఁడు తనకుఁ దానె వైరి. స్వహితము నాతఁ డెఱుం

గఁడు 25. జనులకొనరించు ఉపకృతికిఁ బ్రతిఫలము తనకు తత్క్షణమే లభించును. ఈ విషయ మభాగ్యునకుఁ దెలియదు 26. ఉత్తమగుణములు లేకుండుటయే అభాగ్యతాలక్షణము. బహుజనులకు రుచింపని వేవియో యవియే స్వాభావికముగా నవలక్షణములు 27. చేయని దేపనియుఁగాదు. పనికిమాలిన వాఁడు దుఃఖప్రవాహమునందుఁ గొట్టుకొనిపోవును 28. బహుజనులకు మాన్యుఁడుగ నెవ్వఁడుండఁడో యాతనికి సమానుఁడగు పాపాత్ముఁ డింకొకఁ డుండఁబోఁడు. అభాగ్యుఁ డన్నితావులందును నిరాశ్రయుఁడై, దీనరూపుఁడై యుండును 29. కావున అవగుణములను విడిచి పెట్టవలెను. ఉత్తమగుణముల నెఱింగి గ్రహింపవలెను. ఇట్లొనరించినచో సమస్త విషయములను దన కనుకూలమగును 30.

---

## నాలుగవ సమాసము — భాగ్యవంతుని లక్షణములు.

ఇంతకుముందు మీకభాగ్యుని లక్షణములు నివేదించితిని. వాని నన్నింటిని వివేకముతో నెఱింగి విడువవలెను. ఇఁకఁ బరమ సుఖదాయకములగు భాగ్యలక్షణములను వినుండు 1. భాగ్యవంతుఁడగు పురుషుఁడు స్వాభావికముగనే గుణవంతుఁడగును. ఆతఁడు నానావిధములఁ బరోపకార మొనరించును. మఱియు నిరంతర మెల్లరకును బ్రియుఁడై యుండును 2. భాగ్యశాలి సుందరములగు అక్షరముల వ్రాయుట యెఱుంగును. వేగముగను, శుద్ధముగను జదువఁగలఁడు. అంతియగాక ననేకవిధముల నర్థములు వివరించిచెప్పుట నేర్చియుండును 3. ఎవరి మనస్సునేని ద్రెంచి వేయఁడు. యోగ్యుల సాంగత్యము విడువఁడు. మఱియు నితర భాగ్యవంతుల లక్షణములను ఆలోచనలోనికిఁ దెచ్చును 4. భాగ్యశాలి యందఱకును బ్రియుఁడు. తానేగిన తావున జనుల కాతఁడు నిత్యనూతనుఁడుగఁ గన్పట్టును. మూర్ఖత్వ కారణమున నెన్నఁడును సందేహములలోఁ దగులొ్కనఁడు 5. నానావిధములగు నుత్తమగుణములు గలవారును, సత్పాత్రులును నగువారే జగన్మిత్రులు. వారలకీర్తి లోకమంతటను నావరించుకొనును. వారలు పరాధీనులుగ నుండరు. నిరంతరము స్వతంత్రులుగ నుందురు 6. భాగ్యశాలి జనులందఱి హృదయముల నానంద

పఱచును. పెక్కుగ్రంథముల నవలోకించును. తన నిశ్చయము నెన్నఁడును వదలఁడు 7. నమ్రతతో నడుగుటయుఁ, జక్కఁగ నర్థమును వివరించుటయుఁ జెప్పినరీతిగా నుత్తమకార్యము లొనరించుటయుఁగూడ నాతఁ డెఱుంగును 8. బహుజన ప్రియుఁడై వర్తించుభాగ్యశాలి నెవరేని 'యిది యేమి' యనఁజాలరు. ఆ మహాపురుషుఁడు దేదీప్యమాన పుణ్యరాశియై యుండును 9. ఆతఁడు పరోపకారము జేయుచుండును. అందఱికి నాతనితో నవసరముండును. ఈ స్థితిలో నాతనికి భూమండలమం దేవిషయముననేని కొఱంతయుండదు 10. పలువు రాతనికై నిరీక్షింతురు. అందఱికడ కాతఁడు తత్కాలముననే సకాలమునకు వచ్చును. ఎవరికి హీనత్వముగలిగినను ఆతఁడు సహింపఁడు 11. భాగ్యశాలి పదునాలుగు విద్యలు, అఱువది నాలుగు కళలు, సంగీతము, గాయనకళ నెఱుంగును. ఆత్మవిద్యాశక్తిగూడ నాతనికిఁ జాలినంతయుండును 12. అందఱితో నమ్రతగ భాషించును. అందఱియెడ హృదయముంచి వర్తించును. ఎవ్వరికైన నేవిధమగు హీనత్వమును గలుగనీయఁడు 13. భాగ్యశాలి న్యాయము, నీతి, భజన, మర్యాద, జవదాటక సమయమును, నిరంతరమును సార్థకముజేయును. దరిద్రజన్యములగు ఆపద లాతనికడ కెట్లువచ్చును 14. ఆతఁ డుత్తమ గుణభూషితుఁడు. బహుజనశోభితుఁడు. అంతియగాక ప్రకట ప్రతాపమున మార్తాండునివలె నుదితుఁడై యుండును 15. అనుభవనీయుఁడగు పురుషుఁ డరిగినత్రోవునఁ దగ వెట్లుకలుగును? 16. భాగ్యశాలి ప్రాపంచిక సుఖార్థమై రాజనైతికయుక్తి ప్రయుక్తుల నెఱుంగును. పరమార్థప్రాప్తి నొందుటకై ఆధ్యాత్మిక వివరణముగూడ నెఱుంగును. ఆతఁ డన్నింటియందు నెద్ది యుత్తమగుణమో దానికి భోక్తయైయుండును. 17. ఎదుట నొకటి జెప్పుట, చాటున మఱియొకవిధముగా వర్తించుట, యాతఁడెన్నఁడు నెఱుంగఁడు. ఆతనితో నందఱకు నవసరము కలిగియుండును 18. ఎవరి హృదయమునకేని బాధకలుగునట్లు భాగ్యశాలియగు పురుషుఁ డెన్నఁడును వర్తింపఁడు. ఆతఁ డన్నివిధముల వివేకమును బ్రకటించును 19. కర్మవిధి, ఉపాసనావిధి, జ్ఞానవిధి, వైరాగ్యవిధి విశాలమగు జ్ఞాతృత్వబుద్ధి యెన్నఁడును భాగ్యశాలిని దొలంగిపోవు 20. వానియొద్ద నున్నవన్నియు నుత్తమోత్తమగుణములె; ఈ స్థితియం దాతని నెవఁడేని యయోగ్యుఁడని

యనఁగలఁడా? ఆత్మవలె నాతఁ డన్నిఘటములలో సంపూర్ణముగా వ్యాపకుఁడై యుండును 21. చిన్న పెద్దలందఱును దమతమకార్యములలో నెట్లు తత్పరులై యుందురో, యట్లు భాగ్యశాలి మనఃపూర్వకముగా నెల్లరికి ఉపకారము గావించుచుండును 22. ఇతరుల దుఃఖమునుగాంచి దుఃఖియగును. ఇతరుల సుఖముగాంచి సుఖియగును. నిరంతరము జను లందఱును సుఖముగా నుండవలయునని తలంచును 23. చిన్న పెద్ద పిల్ల లందఱియెడ్ల తండ్రిమనస్సు ప్రేమాన్వితముగా నుండునట్లు మహాపురుషుని హృదయము ప్రజలందఱియెడ సమానచింతగలిగి యుండును 24. మహా పురుషుఁడు పరులదుఃఖమును జూడలేఁడు. ఎల్లప్పుడును నిస్పృహుఁడై యుండును. ధిక్కరించినను వేఱుగఁదలఁపఁడు 25. మిథ్యాశరీరము నెవఁ డేని దూషించినచో అందువలన నాతని దేమిపోవును? జ్ఞాతయగువాని నెందేని దేహబుద్ధి జయింపగలదా! 26. ఎన్నఁటికిని, జయింపదు. జ్ఞాత దేహముకంటె భిన్నుఁడు, ఉత్తముఁడు. కొన్నియైన నుత్తమగుణములను ప్రపంచమునకుఁ జూపవలెను 27. ఉత్తమగుణములు మనుజు నాకర్షించును. చెడ్డగుణములు మనుజునికి ఖేదముగలిగించును. సాధారణ మానవులకుఁ దీక్ష్ణబుద్ధివిషయ మేమి తెలియును? 28. ఈతఁడు జనులయెడ నత్యంతక్షమ జూపుచున్నాఁడని గ్రహింపకనే జనులు ఆపురుషున కనేకవిధముల సహా యముజేయుదురు 29. పలువురు తమ్ముదాము గొప్పవారలమని భావింతురు. లోకులు తన్ను గొప్పవానిగఁ దలంపనంతవఱకుఁ దనకై తాను గొప్పవాఁడనని చెప్పుకొనుటవలనఁ గలుగు ఫలమేది? మహాపురుషుఁడు ధీరుడుగను, ఉదారుఁడుగను, గంభీరుఁడుగను నుండును 30. "ఉత్తమ గుణములన్నియు సమర్థుని లక్షణములు, అవగుణములన్నియు అభాగ్యుని లక్షణములు" అని తెలిసికొనవలెను 31.



## ఐదవ సమాసము — దేహమువలని యుపయోగము.

మన్ను, ఱాయి, బంగారము, వెండి, కంచు, ఇత్తడి, రాగి మున్నగు లోహములతో నిర్మింపఁబడిన దేవతావిగ్రహములను, చిత్ర పటములను మానవులు పూజించుచున్నారు 1. దూదితోఁ, గట్టెతోఁ

జేసిన వైవతములు, ప్రవాళదైవతములు, బాణములు, తాండలములు, నర్మదేశ్వరములు, సాలిగ్రామములు, కాశ్మీరిదైవతములు, సూర్యకాంత చంద్రకాంతములుగూడఁ బూజింపఁబడుచున్నవి 2. కొందఱు దేవతార్చనమునందు రాగినాణెములను, బంగారునాణెములను బూజింతురు. చక్రాంకితములగు నాణెములను జక్రతీర్థమునుండి తెచ్చుకొందురు 3. ఉపాసన పలుతెఱంగుల నుండును. ఎంతదనుకఁ జెప్పఁగలను! శ్రద్ధానుసారముగ నెల్లరును ఉపాసన గావించుచున్నారు 4. తొలుదొలుత నన్నింటికిని గారణమగు స్మరణమును విచారింపవలెను. దైవతములన్నియు దానియంశలే 5. ఆదియందు ద్రష్టయు, దైవము నొక్కటియే. అదియే యనేకమయ్యెను. అనేకమువలన నీయంశము ధ్యానములోనికి వచ్చును 6. దేహము లేకున్నచో భక్తి జరుగదు. ఇంతియగాక పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడుగాఁడు. కావున భజనకు మూలము దేహమే 7. మొదటి నుండి దేహమును వ్యర్థమని తలంచినచో భజన మెట్లు జరుగఁగలదు? సారాంశమేమన, దేహాత్మ సంయోగమువలననే భజనము జరుగును 8. దేహము లేకున్నచో ఈశ్వరభజనము, పూజనము, మహోత్సవము మున్నగునవి యెట్లు జరుగఁగలవు? 9. దేహము లేకున్నచో అత్తరు, గంధము, పత్రపుష్పఫలతాంబూలములు, ధూపదీపనైవేద్యములు మున్నగుపూజ లెట్లు జరుగఁగలవు? 10. దేవునితీర్థము గైకొనుట, దేవుని చందనము నలఁదుకొనుట, దేవునిపయి పూవులుంచుట మున్నగు విషయములు దేహము లేకున్నచో జరుగుట యెట్లు? 11. ఇంతయేల! దేహములేకున్నచో నేపనియు జరుగదు. దేహమువలననే భజన జరుగును 12. దేవుఁడు, దేవత, భూతము (ప్రాణిమాత్రులు) దైవతము మొదలగు నన్నింటియందును బరమాత్ముఁడు నిండియున్నాఁడు. కావున యోగ్యతానుసారముగా నందఱను బ్రసన్నులఁ గావింపవలెను 13. అందఱికిఁ గావించుసన్మానము మూలమునకె (పరమాత్మునకె) ప్రాప్తించును 14. మాయాలత అల్లుకొనియున్నది. నానావిధములగు దేహఫలములతో నిండియున్నది. ఫలములలో మూలమునందలి చైతన్యము విదితమగుచుండును 15. కావున ఉదాసీనతను జూపనక్కఱలేదు. చూడఁదలఁచినవాఁ డిక్కడనే చూడవలెను. మఱియు విశ్వాసముకలిగిన

పిమ్మట సమాధానియై యుండవలెను 16. ఎందఱో మనుజులు సంసార మునువిడిచి దేవునివెదకుచుఁ దిరుగుచుందురు. వారు పోయినతావుననెల్ల బహువిధ సందేహములలోఁ బడుదురు 17. సర్వసాధారణులగు జను లలోఁ గొందఱు గృహమునందే దేవతార్చనము గావింతురు. మఱియు నిటునటు భ్రమణమొనరించి క్షేత్రములలోని దేవతలను దర్శింతురు 18. లేదా ! బహువిధములగు నవతారకథల నాలించి (యేదేనియొకయవ తారమునందె తమహృదయమును) నిశ్చయము గావించుకొందురు. కాని దానికి గొప్పవిస్తరము గలదు 19. కొందఱు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కథ లాలించి వారలనే గొప్పవారినిగ భావింతురు. కాని యన్నింటికంటెను ముందుగా నా గుణాతీతుఁడగు జగదీశ్వరుని గాంచవలెను 20. కాని యా జగదీశ్వరుని కెచ్చటను నెలవులేదు. ఎచ్చట భజన చేయవలెను? ఇది మిగుల సందేహమగు నంశము 21. ఆ పరమాత్ముని సందర్శింపఁ జాల కున్నచోఁ బవిత్రుల మెట్లగుదుము? కావున నన్నింటినెఱింగిన సాధుపుంగ వులకు వందనములు 22. పృథ్వీమండలమునం దెందఱో వేల్పులున్నారు. వారలయెడ విశ్వాసము తొలంగ వీలులేదు. ముఖ్యదైవతము(పరమాత్మ) అనేకప్రయత్నములు గావించినపిదపఁగూడ నిశదముగాదు 23. కావునఁ గార్యమును వేఱుపఱచి (మాయను=దృశ్యమునువేఱుజేసి) పిదప నా పర మాత్ముని జూడవలెను. అప్పుడే కొంత గోప్యము విశదమగును 24. అది కాన్పింపదు. భాసింపదు. కల్పాంతమునందు సైతము మదినశింపదు. మఱియు సుకృతములేకున్నచో దానిమీఁద మనస్సు విశ్వాసముంచదు 25. కల్పనము మిగులఁ దర్కముచేయును. వాసన మిగులఁ గోరును. మఱియు నంతఃకరణమునందు నానావిధతరంగము లుత్పన్నమగుచుండును 26. కావునఁ గల్పనారహితమగు వస్తువే శాశ్వతమైనది. దాని కంత్యములేదు. కాన దాని ననంతమందురు 27. జ్ఞానదృష్టితో దానినిజూడవలెను. చూచి యచ్చటనే యుండవలెను. నిది ధ్యాసము సంగత్యాగములతోఁ దద్రూ పము కావలెను 28. పాపము! ఈ క్షుద్రజీవునకు దాని యానంద లీలలు దాని చిత్రవిచిత్రము లేమి తెలియును? ఆ స్థితి సాధుసమాగమము వలన స్వానుభవమైనపిమ్మట సిద్ధించును 29. ఆస్థితి సిద్ధించినపిదప అధోగతి నశిం చును. ఈ విధముగా సద్గురునిసేవవలనఁ దత్కాలముననే సద్గతిలభించును.

## అలవసమాసము — బుద్ధివాదము.

పరమార్థియు, వివేకియు నగుపురుషుని కార్యమందఱకు రుచించును. ఏలయన! ఆతఁడన్ని పనులను ఆలోచనాపూర్వకముగా నొనరించును. మఱియును దరిచేరనీయఁడు 1. జనులకు రుచింపనిపని నాతఁడెన్నఁడును జేయుఁడు. ఆదినుండి యంతముదనుక నాతఁడన్నిసంగతులు దెలిసికొనును 2. స్వయముగా నిస్పృహత్వము నాచరింపని వానిమాట నెవ్వరు నామోదింపరు. ముఖ్యవిషయమేమన! ఆ జగద్రూపుఁడగు పరమాత్ముని సంతుష్టుని నొనరించుట కఠినతరము 3. కొందఱు బలవంతముగ మంత్ర ముపదేశించి గురువులగుటకుఁ దలంతురు. కొందఱు ఎవరినేని మధ్యవర్తిగ నేర్పఱచికొని గురువగుటకు యత్నింతురు. కాని యిట్టివారలు దురాశా కారణమున స్వాభావికముగనే లోకులకడఁ దమగౌరవమును గోల్పోవుదురు 4. వివేకమును బడయఁదగినవారలే ప్రతికూలురగు చో నిఁక ముందటివ్యవహార మెట్లు జరుగఁగలదు? 5. కొన్ని తావులలో సోదరునకు సోదరుఁడె గురువుగా నుండును. దీనిచేఁ బోనుపోను గొప్పచెడుగు సంభవించును. కావునఁ బరిచయులచెంత గురుత్వము (మహాంతుధర్మము) ప్రకటింపఁ దగదు 6. ఇట్లొనరించుట తొలుత బాగుగానున్నట్లు కనిపించినను గ్రమముగాగోల యారంభమగును. ఔను. విచారరహితులగు మానవు లెంతసంతోషమున గుమిగూడియుండినను నుందురుగాక! వివేకి కిదియెట్లు రుచించును? 7. పతి శిష్యుఁడు. పత్ని గురువు. ఇదిగూడ నొకవిచిత్రమగు విషయమే! నానా ప్రకారులగు భ్రష్టాకారులలో నీ భర్తయు నొకఁడు 8. వివేకమును బ్రకటింపక గుప్తముగనుంచుచుండును; సత్యము ననుమానములోనికేని రానీయనివాఁడును 9. అభిమానమగ్నుఁడై యుండువాఁడును, ఇతరుల వివేకమెఱింగినచో దానిని గ్రహింపనివాఁడును నగు పురుషుఁడు దూరదర్శి కాఁజాలఁడు 10. నా యభిప్రాయ మేమన? ఎవ్వరి నేమియు నడుగక భగవద్భజనము నభివృద్ధిచేయవలెను. వివేకబలముతో జనులను భజనమునందన్వయింపజేయవలెను 11. వివేకముతో నితరులమనస్సుల జెదరనీయక తనకోర్కిని స్వధర్మమును లోకాచారము ననుసరించి (ఈ మూఁడింటిని

గాపాడుకొనుచు) పనిచేయుట మిగులఁ గఠినము 12. తాను స్వయముగా మ్లేచ్ఛుని గురువుగాఁజేసికొని చండాలురను శిష్యులగఁజేసికొని తిరుగుచున్నచో జనసముదాయము భ్రష్టమగును 13. కావున నిత్యానుసరింపక బ్రాహ్మణమండలు లనేకత్రగావింపవలెను. భక్తమండలులను గౌరవింపవలెను 14. ఉత్కటమును, భవ్యమును నగువిషయమునే గ్రహింపవలెను. ఇతరవిషయముల నన్నింటిని త్యజింపవలెను. నిస్పృహత్వముతో భూమండలమునందు విఖ్యాతి నొందవలెను 15. వ్రాయుట, చదువుట, అర్థమును జెప్పుట, పాడుట, ఆడుట, పఠించుట మున్నగుసమస్త విషయములును జక్కఁగ నుండవలెను 16. దీక్షయు, మైత్రియు మంచివిగ నుండవలెను. ఇంతియగాదు. రాజనీతివిషయికమగు దీక్షబుద్ధిగూడ కావలెను. కాని తాను మాత్ర మన్నివిధముల నలిప్తుఁడుగ నుండవలెను 17. హరికథలయెడ నిరంతరము ప్రేమయుంచవలెను. ఇందుచే జనులందఱకును హరికథయందుఁ బ్రేమ యుదయించును. సూర్యునివలె ప్రభావయుతమగు నుపదేశ మొనరింపవలెను 18. దుర్జనులను సంబాళించుటయు, సజ్జనులను బ్రసన్నులఁ గావించుటయు, నెల్లరి మనోభావములు గ్రహించుటయు బుద్ధిమంతుని ధర్మము 19. ఇట్టి సాధుపురుషుని సాంగత్యమువలన జనులు సదాచరణు లగుదురు. తత్కాలముననే వారలయం దుత్తమగుణములు పొడసూపును. జనసముదాయమంతయు నఖండరీతిగ నభ్యాసమునకు యత్నించును 20. ఆ పురుషుఁ డెచటికేగిన నచట నిత్యనూతనుఁడుగఁ గనిపించును. ఈతఁడిచ్చటనే నిలిచియుండవలె నని జనులు తలంతురు. కాని దురాశ నీతఁడించుకేని దరికిరానీయఁడు 21. ఉత్కటభక్తి, ఉత్కటజ్ఞానము, ఉత్కటచాతుర్యము, ఉత్కటభజనము, ఉత్కటయోగానుష్ఠానము, మున్నగు ఉత్కటగుణములనే యాతఁ డన్నితావులఁ బ్రచారము గావించును 22. ఉత్కటమగు నిస్పృహత్వముగలవానికీర్తి దిగ్దిగంతములలో వ్యాపించును. ఉత్కటభక్తివలన సమస్తదేశములందలి జనసముదాయము శాంతినొందును 23. ఉత్కటవిషయ మేదేని యాచరణమునం దుండనంతవఱకుఁ, గీర్తి వ్యాపింపదు. వ్యర్థుఁడై తిరుగుటవలన నేమిలాభము? 24. దేహము నమ్మదగినదికాదు. ప్రాణము లెప్పుడు పోవునో యెవ్వరికిఁ దెలియదు. ముందీశరీరమున కేపరిస్థితులు

సంభవించునో యెవ్వఁడెఱుఁగును? 25. కావున సావధానియై యుండ వలెను. తనవలనఁ గాఁడఁగినంతలో మనఃప్రాణములకుఁ దెగించి పరోపకార మొనరింపవలెను. భగవత్కీర్తితో భూమండలమును నింపివేయవలెను 26. తన కేను కాలమగునది యెల్లఁ దక్షణమె చేయవలెను. తనవలనఁ గాఁజాలని విషయమును నిర్మలవివేకముతో యోచింపవలెను 27. ఏల యన? వివేకమువలన సాధ్యముగాని దెద్దియులేదు. ఏకాంతమున నున్న ప్పుడు ప్రతివిషయమును వివేకము అనుమానములోనికిఁ గొనివచ్చును 28. అఖండరీతిగఁ బెక్కుతీర్మానములు, చేష్టలు (క్రియలు) జరుగుతావున కొఱంత యే విషయమునైనని యుండదు. ఏకాంతము లేనియెడల మాన వునిబుద్ధి యుపయోగములోని కెట్లువచ్చును? 29. కావున ఏకాంతము నందు వివేకము (వివేచనము) గావింపవలెను. ఆత్మారాముని గుర్తింప వలెను. ఇచ్చటినుండి యచ్చటిదనుక నేవిధమగు గోలయును లేదు 30.

---

## ఏడవసమాసము — ప్రయత్నవాదము.

హరికథను జనులలో నాందోళనము గావింపవలెను. మఱియు అధ్యాత్మనిరూపణమును వ్యాఖ్యానము చేయవలెను. ఏ విషయమునందేని కొఱంత గలిగింపరాదు 1. ఉపదేశకుఁ డొకవేళ నేదేని యంశము మఱచి నచో దాని నుపదేశకుఁడే యెఱుంగఁగలఁడు. అజ్ఞానులగు నితరులు కను లార్పుచుఁ జూచుచుందురు 2. ఏ విషయమున నేని సమాధానము చెప్పు టలో వక్త యాలసించినచో శ్రోతలకాతనియెడ గౌరవముండదు 3. వ్యర్థ వాక్యముల నెక్కువగావదరక కొద్దిలో సమాధానము చెప్పవలెను. ఒకా నొకప్పుడు వారలహృదయమున కంటునట్లుగూడ బోధింపవలెను. మనుజుల మనస్సులనుగూడ హరింపవలెను 4. సహనశీలములేక వ్యర్థక్రోధముజూపు నాతని తామసవృత్తి లోకమునకు వెల్లడియగును. శ్రోతలు తామసుఁ డగు నాయుపదేశకుని ప్రేమింపరు 5. సాధుపురుషుఁడు తానెందఱిని సంతు ష్టిపఱచినది యెవరెవరికి మనోభంగ మొనరించినది పరీక్షించుకొనవలెను 6. శిష్యుఁడు వికల్పకారణమున దుర్మార్గమున ప్రవేశించును. దురాశవలన గురువు శిష్యుననుసరించును. ఇదియంతయు వికల్పమనియే తలంపుఁడు 7.

ఆశాబద్ధుఁడును, క్రియాహీనుఁడును, చాతుర్యహీనుఁడునునగు సాధుపురుషుని సాధుత్వమునకు మిక్కిలి దుర్దశగలుగును 8. ఇట్టి గోస్వాములకు (సాధువులకు) గౌరవముండదు. అన్నితావులందును వారలు శ్రమపడుదురు. ఈ విధముగా వారలే కష్టములుపడుచుండ వారియనుచరులకు సుఖమెక్కడినుండి వచ్చును? 9. జనుల నానందపఱచి నలుదిక్కులఁ గీర్తి వ్యాపించునట్లును అందఱికి నుత్సాహ మతిశయించునట్లును సర్వకార్యములొనరింపవలెను 10. పరకీయ జనులయందుండియు నలిప్తుఁడై సముదాయముపై దృష్టినుంచవలెను. ఎవ్వరి నేమియు యాచింపఁగూడదు. పూర్ణనిస్పృహత్వముకావలెను 11. జగత్తు (బహుజనాభిప్రాయము) ఏ వైపుండునో ఆ వైపుననే జగన్నాయకుఁడు (పరమేశ్వరుఁడు) ఉండును. ఈ వివేకము తెలిసికొనియుండవలెను. వివేకియగు పురుషుఁడు రాత్రింబవళ్లు జనసముదాయమును సంస్కరించుచుండును 12. తానొక్కఁడు కేవలము మంచివాఁడగుటయుఁ దక్కిన జనులందఱు చెడ్డ వారగుటయు నెట్లు సంభవమగును? 13. పాడుబడియున్న దేశములోఁ జూడవలసిన దేమున్నది? మనుజులను విడిచినచో నుండవలసిన తావెద్ది? వ్యర్థమును మిథ్యను విడిచి సత్యమును గ్రహింపవలెను 14. జనులలోఁ గలిసిమెలసి యుండుపద్ధతెఱుంగనివానికి సాధువృత్తితో (మహంతుతనముతో) నేమిపని యున్నది ? అట్టివాఁడు పరసాధనములను నాలించి యడఁకువతో నుండవలెను 15. చక్కఁగ నీఁదుట నెఱుంగనివాఁ డితరుల ముంచినచో నేమి లాభించును? ఆ స్థితిలో మీఁదుమిక్కిలి ప్రేమప్రీతులు వ్యర్థములగును. అంతయు వికల్పమే నిలుచును 16. జనులను సంబాళించు సామర్థ్యమున్నచో సాధుపురుషుఁడని (మహంతని) ప్రసిద్ధినొందవలెను. లేనిచో ఊరకుండుటయే మంచిది. ప్రసిద్ధిని గడించి యితరులకార్యములు పాడుచేయుట మంచిదికాదు 17. మందమందముగ నడుచువాఁడు, చపలుఁడును, తీవ్రబుద్ధిగలవాఁడును నగువాని నెట్లుసంబాళింపఁగలఁడు ? అరబ్బీ దేశపు గుఱ్ఱమును ద్రిప్పువాఁ డెట్టివాఁడుగ నుండవలయునో యోచింపుఁడు 18. ఈ కార్యము మిగులఁ గఠినమైనది. ఈ తీక్ష్ణబుద్ధిరహస్యము సాధారణములగు నమాయికభావములచేఁ దేటపడదు 19. పైరును వేసి కావలి గాయనిచో, వ్యాపారమొనరించి తిరుగనిచో, జనులను గుమిగూర్చి

సవరించుకొనఁజాలనిచో పని యెట్లు జరుగును? 20. పగలు రెండురెట్లుగను రాత్రులు నాలుగురెట్లుగను ఉత్సాహ మతిశయించునపుడే పరమార్థము లభించును. ఆ యోగ్యత నెల్లడియైనచో జనసముదాయము చెదరి పోవును 21. ఆ మాట లోకులకును, లోకులమాట తనకును రుచింపనిచో నంతయు వికల్పమే! ఈ స్థితిలో సమాధానమున కవకాశమే లేదు 22. సర్వనాశకరముగ వర్తించుచుండువాఁడు గురువుగను మోసగాండ్రు శిష్యులుగను గ్రొత్తగ నేర్పడిన నవివేక మెట్లుండఁగలదు? అవివేకము రాజ్యముచేయుచున్నది కావున నిందించుట యుచితముగాదు 23. కొందఱు చాల కాలము శ్రమచేయుదురు. కాని యంత్యమునం దంతయు వ్యర్థమగును. తనవలన నేదియుఁ గానిచో తక్కిన జనుల నుపాధి నేలవృద్ధినొందింపవలెను? 24. నియమముగా నడుపఁగలిగినయెడలనే ఆయుద్యోగము (గురుశిష్యధర్మము) యుక్తముగ నుండును. లేనియెడల నంతయు సంతాపమే! క్షణక్షణమునకు ఆటంకములు గలుగుచుండును. ఎంతదనుక వివరింప శక్యమగును? 25. మూర్ఖులు ప్రపంచమున మూర్ఖత్వముతోఁ బొరలాడు చుందురు. జ్ఞాతలగు వారలుగూడ వాదోపవాదములుగావించుచుఁ గలహములను వ్యాపింపఁజేయుదురు. కావున నీ యిరువురును నిందార్హులే! 26. వీరలు వ్యవహారమును సంబాళింపలేరు. సరిగదా ఊరకయైన గూర్చుండఁ జాలరు. ఇం దితరులదోష మేమున్నది? 27. సత్యమేమన్న ! నష్టమగు నుపాధిని విడువవలెను. అన్నిస్థలములయందును దిరుగుచుఁ దనజీవితమును సార్థకముగాఁజేయవలెను 28. స్వయముగాఁ బరిభ్రమణము గావింపజాలక ఇతరుల పరిభ్రమణము సహింపఁజాలక యుండునాతఁడు వికల్పమూలమున లనేక మనుభవింపవలసియుండును 29. తనమేలు తనచేతిలోనున్నది. తన మనస్సులో బాగుగా యోచించి యుక్తమని తోఁచినవిధముగాఁ బ్రవర్తింపవలయును 30.



## ఎనిమిదవ సమాసము — ఉపాధినిరూపణము.

సృష్టియం దనేకవిధములగు మనుజులున్నారు. పరిభ్రమణము గావించినచోఁ బ్రపంచస్థితిగతులు విదితమగును. అంతియగాక బహువిధ

ములగు యోచనలుగూడఁ గలుగును 1. పరిభ్రమణమునవలన ఉదాసీన వృత్తిగలవారును సుఖదుఃఖములను బాటింపనివారునునగు సాంసారికుల పరిచయభాగ్యము లభించును 2. వారలు స్వాభావికముగనే మితముగా భాషింతురు. నిశ్చయపూర్వకముగా వర్తింతురు. వారలు మాటలాడు విధము నలువురిచే నాదరింపఁదగినదిగ నుండును 3. తాళజ్ఞానము, రాగజ్ఞానము, నీతిన్యాయములు మున్నగునంశములు వారలకు స్వాభావికముగాఁ దెలిసియుండును 4. సమస్తజనులను సంతుష్టిపఱుపఁగలవాఁడును ప్రాణిమాత్రులందఱకును నిత్యనూతనముగఁ బ్రీతిగూర్చువాఁడును నగు శూరపురుషుఁడు దేశభ్రమణము గావించినచో ఒకఁడో, అరయో లభించును 5. ఆకస్మికముగఁ గొన్ని విశేషములు తటస్థించును. ఎందేని యొక మహాపురుషుని దర్శన మబ్బును. ఆతనియందు ఆకస్మికముగ మహాత్మునకుండవలసిన సమస్తలక్షణములు గోచరించును 6. ఇట్టి పురుషుఁడు లభించినంతన నాతని చమత్కారముచే గుణగ్రాహులగుపురుషులు మోహితులగుదురు. ఏలయన ? ఆతని యాచారోపదేశములు అనుభవయుక్తములుగ నుండును 7. తన దుర్గుణములను సుగుణములనుగఁ బ్రదర్శించుట దుర్గుణములన్నిటికంటెను దుర్గుణము. ఇది మిగుల ఘోరపాపము. ఈ పాపమువలన దరిద్రము నశింపదు 8. మిగుల ధ్యానముగావించినను (యోచించినను) నెరవేరనికార్య మొకానొకప్పుడు సహజముగా నెరవేరును. యుక్తిప్రయుక్తులుగాని, ఆపదలుగాని, పొందఁబనియుండదు 9. (కార్యకౌశలము) ఒకానొకని కభ్యాస మొనరించినను బట్టువడదు. ఒకానొకనికి సహజముగనే యభ్యాసమగును. భగవంతుని మహిమ యెట్టిదియో తెలియకున్నది 10. గొప్పగొప్పరాజనీతులలో మతిమఱపు గలుగును. విఘ్నములు వచ్చును. ఇట్లే యనేకలోపములవలన నలుగెలంకుల నిందగలుగును 11. కావున మఱుపును గొంచెమేని రానీయఁదగదు. మఱుపులేకున్నచో సమస్తోపాయములును జక్కఁగ నెఱవేరును. కాని మఱుపువలన నుపాయములుగూడ నపాయములగును 12. ఒక్కొక్కప్పుడు జరిగిన పొరపాటే గోచరింపదు. మానవునిహృదయమే వంగదు. అభిమానము పీడనికారణమున ఉభయలోకములయందును దుర్దశకలుగును 13. సమస్త సంస్థలును నాశనమగును. జనుల మనస్సులు విరిగిపోవునేగాని

యుక్తి యందు మఱపెచటవచ్చునో తెలియదు 14. ప్రయత్నములేకుండఁ జేయుపనులన్నియు భంగములగును. దూరదర్శకత్వము, బుద్ధిసంయమము లేకపోవుటవలననే యీ పరిస్థితు లేర్పడును 15. ఒక్కొక్కఁడు మిగుల మూర్ఖుఁడుగ నుండును. వానిపనులన్నియు వెఱ్ఱివాని పనులవలెనుండును. ఇట్టి పురుషుఁడు నానావికల్పములను వ్యాప్తినొందించును 16. ఆ వికల్పములను దాను సవరించుకొనఁజాలఁడు. ఇతరులకుఁ దెలియవు. వికల్పములనుండి కల్పనము బయలువెడలి యన్నితావులఁ బెంపొందును 17. ఆ గుప్తకల్పనము లెఱుంగువాఁ డెవఁడు? ఎవరువానిని సవరింపవలెను? కల్పనములందు జిక్కినవాఁడే తనబుద్ధిని తాను దిద్దుకొనవలెను 18. ఉపాధిని సవరింపజాలనివాఁడు ఉపాధినిబెంపొందింపఁగూడదు. చిత్తమును సావధానపఱచి సమాధానపూర్వకముగా నుండవలెను 19. ఉపాధిని కౌఁగలించుకొనుటయు, స్వయముగాఁ గష్టములను సహించి లోకులను గష్టపెట్టుటయు వ్యర్థ విషయములు. ఇవి తగవు 20. జనసముదాయమును మిగుల గష్టపెట్టుటయుఁ, దానును గష్టములొందుటయు నిరర్థకము. ఈ జంజాటము నిరుపయోగకరము 21. ఉపాధికార్య మిట్లుండును. కొంత మంచిదిగఁ గొంత వక్రముగా నుండును. అన్నింటి నెఱింగి వర్తించుట యుక్తముగా నుండును 22. అందఱి హృదయములందును భక్తి యుండదు. కావున మనము జనులవిషయమున శ్రద్ధదీసికొనవలెను. కాని యంత్యమునం దెవరిమీఁదను దోషము నారోపింపఁగూడదు 23. అంతరాత్మయే మంచిచెడుగుల నన్నింటిని చేయుచున్నది. నిర్గుణ మలిప్తముగా నున్నది. సమస్తగుణాగుణములు చంచలమునందు (అంతరాత్మయందు) కలుగుచున్నవి 24. శుద్ధవిశ్రాంతియగు స్థలము నిర్మలము, నిశ్చలము మాత్రమే! అచట సమస్తవికారములును నిర్వికారములగును 25. అచట సమస్తోద్వేగములును నష్టమగును. మనస్సునకు విశ్రాంతిలభించును. ఇట్టి దుర్లభమగు పరబ్రహ్మస్థితిని వివేక సహాయమునఁ బడయవలెను 26. మనమెడ ఉపాధి బొత్తిగలేదనియు, కర్మయోగముతో నివియన్నియుఁ గూడినవనియు వీనిసంయోగము వలనఁగాని, వియోగమువలనఁగాని హాని లేదనియు బాగుగా నెఱుఁగనగును 27. ఉపాధికి భయపడువాఁడు శాంతముగఁ గూర్చుండవలెను. తనచేతగానిదానిని దలఁచుకొని యేల

కలవరపడవలెను? 28. మనకు అవకాశము, విశ్రాంతి లభించుటకై కలవరములోఁ గొంతయు, శాంతిలోఁగొంతయుఁ గాలము గడుప వలెను 29. ఉపాధి యెల్లపు డేమాత్రమునుండుననదిగాదు. సమాధానము కంటె శ్రేష్ఠమైన దింకొకటి లేదు. అట్లే నరదేహము మాటిమాటికిని దొరుకదు 30.

### తొమ్మిదవ సమాసము — రాజనీతి వ్యవహారము.

జ్ఞానియు, ఉదాసియు, జనసముదాయమును సమావేశపరుప వల యునను నుత్సాహముగలవాఁడును నగు మానవుఁ డఖండముగా నేకాంత సేవనము గావింపవలెను 1. ఏలయన! ఏకాంతమున యోచనలు బాగుగా స్ఫురించును. అఖండక్రియలు తెలియును. మఱియుఁ బ్రాణిమాత్రుల స్థితి గతు లవగతమగుచుండును 2. మానవుఁ డొకవేళ క్రియాశూన్యుఁడైనచో నాతని కేమియుఁ దెలియదు. ఔను. దివాలాతీయువానికి ఆదాయవ్యయము లేమి తెలియును ? 3. కొందఱు ధనద్రవ్యముల నార్జింతురు. కొందఱు తమవద్దనున్న ఆ స్తినిగూడఁ గోలుపోవుదురు. ఇవియన్నియు ఉద్యోగ విషయములు 4. ఎదుటివాని మనుస్సులోని యంశమును తొలుదొల్తనే తెలిసికొన్నచో అనిష్టము గలుగవలసిన యవసరమేయుండదు 5. ఒక్క చోట విశేషకాలమున్నచో జనులు పరిహసింతురు. అతిపరిచయమువలన నవమానము కలుగును. కావునఁ జిరకాల మొకతావుననుండి విశ్రాంతి నొందరాదు 6. సోమరితనమువలనఁ బనిపాటలన్నియుఁ జెడును. మఱియు సముదాయముయొక్క సంకల్పము పూర్ణముకాదు 7. కావున ఉపాసనకు సంబంధించిన సమస్తకార్యములను నిత్యనియమముగా జనుల కభ్యాసము చేయవలెను. ఇట్లొనరించినచో జనుల కితర కృత్రిమకార్యము నొనరించుట కవకాశమే లభింపదు 8. ఎఱిఁగి బాగుగాఁ దెలిసికొని దొంగను భాండా గారమున కధికారిని జేయవలెను. దోషము కనబడఁగనే వానిని మంద లించి సవరించుకొనవలెను. మెల్లమెల్లఁగ నాతని మూర్ఖత్వమును దూర పఱుపవలెను 9. ఇవియన్నియు ననుభవముతోఁ జెప్పుమాటలు. ఏప్రాణి కైనఁ గానిమ్ము; దుఃఖము కలిగింపఁగూడదు. కాని రాజనీతితో జను

లందఱిని లోఁబఱచుకొనవలెను 10. నష్టమునొందిన పురుషుని నష్టమునకై
విచారింపవలెను. వాచాలురిలో వాచాలురగువారిని లోఁబఱచుకొన
వలెను. తనవిరోధికి శిల్పజాలమును రానీయఁదగదు 11. ముంటితో
ముంటిని వెలికిఁ దీయవలెను. వెలికిఁదీయు వలయునేగాని తెలియనీయరాదు.
కలహాసక్తుని పదవిని రానీయఁజనదు 12. గుప్తముగా నెవరికిఁ దెలియని
రీతిగా నొనర్చుపని తత్కాలముననే సిద్ధినొందును. గజిబిజిపడినచోఁ గార్య
మేమియు యోగ్యముగ నెరవేరదు 13. ఎవరికీర్తినేని విన్నయెడల మిగులఁ
బ్రీతినొందవలెను. ఆతనిని సూచినపిదప నాప్రీతి మిగుల దృఢముగావలెను.
అట్లే యాతనిపరిచయమైన పిదప నాతనిసేవ గావింపవలెను 14. ఏపనియైనఁ
గానిమ్ము. చేసినచో నెరవేరును. లేకున్నఁ జెదరిపోవును. కావున సోమరి
తనముతో వర్తింపఁదగదు 15. ఇతరునిపై విశ్వాసముంచువాని వ్యవ
హారము భంగమగును. కావున స్వయముగాఁ గష్టమును సైరించుచు
ఆత్మవిశ్వాసముగలిగి తన కార్యమును దిద్దుకొనువాఁడే వాస్తవమునకు
యోగ్యుఁడు 16. అందఱకు నన్నివిషయములు తెలియనీయఁదగదు. ఏల
యన ? అట్లొనరించినచో నావిషయముల యందలి మహాత్త్వము
తొలఁగును 17. ముఖ్యసూత్రమును జేతిలోనికిఁ దీసికొనవలెను. చేయ
వలసినదెల్ల జనసముదాయముచేఁ జేయింపవలెను. రాజనైతికములకు
ననేకసమస్యలను సాధింపవలెను 18. వాచాలుని, బలశాలిని, కలహ
కర్తనుగూడఁ దనచేతిలో నుంచుకొనవలెను. కాని రాజనీతిని బురస్క
రించుకొని దుర్జనులతో దుర్జనులఁ గలియనీయరాదు 19. విరోధులను
భేదనీతితోఁ బట్టుకొనవలెను. వారలను బిండిగా నూరివేయవలెను. కాని
తరువాత (విజయానంతమున) వారలను గాపాడవలెను. నష్టమేమాత్రమును
గలుగనీయఁదగదు 20. దుష్టులకు, దుర్జనులకు భయపడునెడ రాజనీతి
మహాత్త్వముండదు. మీఁదుమిక్కిలి మంచిచెడ్డలన్నియు వెల్లడియగును 21.
మనుష్య సముదాయము నభివృద్ధిచేయవలెను. ఆక్రమణశక్తిగూడ దృఢ
ముగ నుండవలెను. మతము నిర్మించి జనసముదాయమును బ్రోగుజేసి
పిదప నున్మత్తకార్యములఁ గావింపఁదగదు 22. దుర్జనులను దనమనస్సుననే
యెఱింగియుండవలెను. వారల కేమియు వెల్లడింపఁదగదు. దీనికి విరుద్ధ
ముగా వారికి మహాత్త్వమొసంగి సజ్జనులకువలె వారికిని వినతి యొనర్ప

వలెను. మఱియు నవకాశముజూచి ప్రతిక్రియ గావింపవలెను 23. దుర్జనుఁడు వెళ్లడియైనపిదప జనులలో గొప్పకల్లోల ముదయించును. కావున దుష్టపథమునే తొలుత నిర్మూలముజేయవలెను 24. శత్రుసైన్యమును గాంచఁగనే రణశూరులభుజము లుప్పొంగునట్లు గావించు పరమార్థ పక్షపాతియు, ధర్మాత్ముఁడు నగువాఁడె రాజు 25. అట్టిరాజును గాంచఁగనే దుర్జనులహృదయములు వికలములగును. ఆతఁడు అనుభవ శృంఖలలతోఁ బ్రజలను నడుపును. ఉపద్రవము, పాషండత్వము సులభముగా నాతనికతన నాశనమగును 26. ఇవియన్నియు ధూర్తకార్యములు. రాజనైతిక విషయములలో దృఢత్వముండవలెను. మెత్తదనంపు భ్రమకు లోనుగాఁగూడదు 27. రాజనీతిచతురుఁడగు పురుషుఁడు అన్నితావులను గనిపింపఁడు. ప్రతిస్థలమునందును నాతనిని బ్రశంసించుచుందురు. తన వాగ్విలాసముచే నాతఁడు సృష్టినంతయు సమ్మోహితము గావించును 28. ప్రబల బలోపేతునియెడఁ బ్రబలబలము నుపయోగింపవలెను. సాధారణునెడ సాధారణపద్ధతి నవలంబింపవలెను. మూఢుని యెదుట రెండవమూఢుని నిలువఁబెట్టవలెను 29. లాటీని లాటీతోనే నెదుర్కొనఁ జేయవలెను. ఉద్ధతునెదిరించుట కుద్ధతుఁడెగావలెను. కపటునికిఁ గాపట్యమే (కపటియే) కావలెను 30. ఎట్టివాని నెదిరించుట కట్టివాఁడే కావలెను. అప్పుడే సంస్థయొక్క రుచి తెలియవచ్చును. ఇదియంతయు జరుగుచున్నను జరుపువాఁడెచటనున్నాఁడో యాజాడపోకడ లెవరికిని దెలియనీయఁదగదు 31.

## పదియవ సమాసము - వివేకి వర్తనము.

అఖండరీతిగ నానాక్రియలు నాచరించుచు అఖండధారణా శక్తితో రాజనైతిక యుక్తిప్రయుక్తుల యోజించుచు నుండువాఁడె నేర్పరి 1. ఆతఁడు సమస్త ప్రపంచముయొక్క ఉత్తమగుణములను నిరూపణ మొనరించును. ఒకక్షణమేని వ్యర్థముగా గడుపఁడు 2. వివేకి తన వక్తృత్వ సామర్థ్యముచే శాస్త్రాధారములతో సమాధానములనుజెప్పి సాధకుల నానందపఱచును. సత్యాసత్యముల నిర్ణయించును. ఎల్లప్పుడు చర్చయొనరించును 3. భక్తిమార్గము వివేకికి బాగుగాఁ దెలిసియుండును. ఉపాసన

మార్గ మూని సవగతమైయుండును. మఱియు నాతఁ డంతఃకరణమునందు జ్ఞానవిచారము మననము గావించును 4. వైరాగ్య మాతనికి మిగులఁ బ్రియమైనది. ఉదాసవృత్తి యాతనికి మిగుల నిష్టముగనుండును. ఆతఁడు విస్తృతమగు మహాధిలోఁ బడియుండియు నలిప్తుఁడగును 5. అనేక ప్రబంధములు పనేకకఁ గంఠాగ్రమునందుండును. ప్రశ్నలకు ననుకూలమగు నుత్తరములనిచ్చును. ఉచితభాషణములచే నందఱి యంతఃకరణములను శీతల మొనరించును 6. జనుల కతనిపైఁ బ్రేమమెండు. ఎవరేని యాతని ముందేమియు నుడువరు. ఆతనికడ కనేకు లేతెంతురుగాని వాని యంతరంగస్వరూప మిట్టిదని యెవరేని యనుమానింపఁజాలరు 7. ఉపాసనమును ముందుంచుకొని వివేకి సమస్తదేశములందును వ్యాప్తిగావించును. భూమండలమునందలి సమస్తజనుల నాతఁ డెఱుఁగును 8. ఆతని నందఱెఱుంగుదురు. కాని యెవ్వరికిని లభింపఁడు. ఆతఁ డేమిచేయుచున్నదియు జనుల కెఱుకపడదు. సమస్త దేశవాసులగు వివిధమానవు లాతని వెదకుచుఁ దిరుఁగుదురు 9. వారలందఱి మానసములను వివేకి తనచేతిలో నుంచుకొనును. వారల హృదయములను వివేకవిచారములతో నించును. ప్రజల యనిశ్చిత హృదయములను మననమువైపు మఱలించును 10. వివేకి యెందఱు మనుజులఁ బ్రోవుగావించెనో యెంత జనసముదాయమును దనచేతిక్రింద నుంచుకొనెనో యెవ్వరికిని దెలియదు. అందఱు నాతఁడు శ్రవణమననములందు మగ్నులఁ గావించును 11. వివేకి తన సమాజమునకు హితము బోధించును. గద్యపద్యములు వివరించును. నిరంతర మితరుల హృదయములను సన్మార్గమునఁ బ్రవేశపెట్టును 12. ఇటు లఖండరీతిగా వర్తించుచు సావధానిగనుండు వివేకిని నెవ్వరును నేమియుఁ జేయజాలరు 13. ఎంత తనకుఁ దెలిసియున్నదో యదియంతయు మెల్లమెల్లఁగా జనులకుఁ జూపింపవలెను. ఈ విధముగ జనులనందఱను జతురులఁ గావింపవలెను 14. నానావిధములుగ బోధింపవలెను. అభ్యంతరముల నెఱింగింపవలెను. నిస్పృహుల నేరియేరి తనకడ నుంచుకొనవలెను 15. చేతనైనంతవఱకు స్వయముగాఁ జేయవలెను. తన చేతకానిదానిని లోకులచేఁ జేయించవలెను. కాని భగవద్భజనముమాత్రము తానుచేయక యితరులచేఁ జేయించుట ధర్మముకాదు 16. భగవద్భజనము స్వయముగ జేయవలెను.

ఇతరులచేఁ జేయింపవలెను. స్వయముగా వివరణము గావింపవలెను. ఇత రులచేఁ వివరణము జేయింపవలెను. మఱియు స్వయముగా భజనమార్గ మును బట్టుకొనియుండి యితరుల నామార్గములోనికిఁ దీసికొనిరావలెను 17. ఒకవేళఁ బ్రాతజనులకడ జిరకాలముండుటవలన విసుగుజనించినచో నూతన ప్రాంతముల కేగవలెను. తనచేఁ గాఁదగినిపను లొనరించుట కించుకేని యాలసింపరాదు 18. దేహాభ్యాసముల కొకవేళ విడినడినచో నాసాధు పురుషుఁడు చెడిపోయినాఁడని తలంపనగును. నూతనులను, నిత్యమును మిగుల నుద్వేగముతోఁ జతురులఁ గావింపవలెను 19. ఉపాధిలోఁ దగుల్కొనరాదు. ఉపాధికి భయపడుటయుఁదగదు. నిర్లక్ష్యముగా నున్నచో నేపనియేని నెరవేరదు 20. చెడిపోవలసి యున్నపని చెడిపోయి తీరును. జనులు పిచ్చివాండ్రవలె నట్టెచూచుచుందురు. సోమరియు, హృదయశూన్యుఁడు నగుమానవుఁడు పనిచేయుటన నేమియో యెఱుం గఁడు 21. ఇది వెనుకముందు త్రోసికొనవలసిన (ధక్కాధక్కీ) వ్యవ హారము. అశక్తునివలన నేమగును? కావుననే శక్తిగల (బలవంతుఁడగు) పురుషునకు నానావిధములగు బుద్ధులను, యుక్తులను నేర్పవలయును 22. తనప్రయత్న మెంతదనుక నెరవేరునో అంతదనుక కార్యభారము వహింప వలెను. నెరవేర నప్పుడాస్థానమునువదలి యెటకేని వెడలిపోవలెను. ఆపిదప నానందస్వరూపుఁడై కోరినతావుననెల్లఁ దిరుగవలెను 23. ఉపాధిని తొల గించుకొన్నవానికి నిస్పృహత్వ మింకను దృఢమగును. మఱియు నాతఁ డానందపూర్వకముగఁ దలంచిన తావునకు వెడలిపోవును 24. కీర్తి కాశించినచో సుఖములేదు. సుఖము నాశించినచోఁ గీర్తిలేదు. మఱియు నేమిచేయక యూఱకఁ గూర్చున్నచో నెచ్చటను నేమియుఁగాదు 25. ఈ విధముగా నుండునది యెద్దియులేదు. జరుగవలసినపని జరుగుచునే యున్నది. అవును మానవుఁడు కేవలము తన దుర్బలత్వముపై దోష మాపాదించుకొని కూర్చుండియున్నాఁడు 26. తొలుదొలుతనె ధైర్య మును గోలుపోయినను లేక మధ్యనే ధైర్యమును గోలుపోయినను నిక

నీ సంసారసారము నెట్లు గాంచఁగలుగుదుము ? 27. సంసారము మొదటి నుండియుఁ గొల్లది. వివేకముతో దానిని బాగుచేయవలెను. బాగుచేసినచో నది యింకను జప్పఁబడును 28. యోచించినచో నీ సంసారపుదశ యిట్టిదని మనస్సునకుఁ దెలియును. కాని యెవ్వరును ధైర్యమును విడువగూడదు 29. ఏలయన ? ధైర్యమును విడుచుటవలన నయ్యెడిదేమున్నది ? అంతయు సహింపవలసియే యున్నది. చతురుఁడగు పురుషుఁడు నానావిధములగు బుద్ధులను, నానామతములను గ్రహించుచున్నాఁడు 30.

పందొమ్మిదవ దశకము సమాప్తము.





# ఇరువదవదశకము.

## మొదటి సమాసము పూర్ణము — అపూర్ణము.

జీవుఁడు, మనస్సు, పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము, త్రిగుణములు, అంతరాత్మ, మూలమాయ మున్నగునవి వ్యాపకములుగ నున్నవి 1. నిర్గుణబ్రహ్మము గూడ వ్యాపకముగ నున్నది. అన్నియు నీ విధముగా వ్యాపకములే. అట్లయినచో నివియన్నియు సమానములా? లేక యేమేనిభేదములు గలవా? 2. ఇంకొక సందియముగలదు. ఏమన? జను లాత్మను నిరంజనమందురు. ఆత్మ సగుణమా? నిర్గుణమా? నిరంజనమా? 3. శ్రోత యీ విధముగాఁ దనసందియమును దెలిపెను 4. మంచిది. ఇఁక నీ సందేహమునకు ఉత్తరమును వినుము. అంతయు గజిబిజి గావింపకుము. వివేకమును బ్రకటించి అనుభవప్రాప్తి గావింపుము 5. శరీరమును సామర్థ్యమును ననుసరించి జీవునకు వ్యాపకత్వము గలుగును. కాని మనస్సునకు సమానమగు చపలము (జీవునకు) లేదు 6. చపలత్వ మేకదేశీయము. దానియందుఁ బూర్ణవ్యాపకత్వము లేదు. పృథివికిఁగూడ మర్యాద (మేర) లేదు 7. అట్లే అపస్తేజములుగూడ స్వాభావికముగనే అపూర్ణములుగ నున్నవి. వాయువునుగూడఁ జపలము, ఏకదేశీయమునని తెలిసికొనుము 8. ఆకాశము, నిరాకారపరబ్రహ్మము, నిస్సందేహముగాఁ బూర్ణవ్యాపకములు 9. త్రిగుణములు మాయగూడ నాశనమగును. కావున నవియు నపూర్ణములు, ఏకదేశీయములుసుమా! అని పూర్ణములు వ్యాపకములుగావు 10. ఆత్మయు నిరంజనమును వేఱు వేఱుగ నున్నవి. ఇఁక వీనిభేదమును జక్కఁగ వివరింతును 11. ఆత్మ (మనస్సు) అత్యంత చపలమైనది. కావున నిది వ్యాపకముగాదు. ఈ విషయము నంతఃకరణమును విమలమును సుచిత్తమును గావించి తెలిసికొనవలెను 12. అది (ఆత్మలేక మనస్సు) యొకవేళ నాకాశమునందున్నచోఁ బాతాళమునం దుండును. ఒకవేళఁ బాతాళమునందున్నచో నాకాశమునం దుండును

అనఁగా నది నాలుగుదిక్కులను బూర్ణముగా నుండదు 13. దానిని ముందుంచినచో వెనుకనుండదు. ఎడమవైపుననుంచినచోఁ గుడివైపుననుండదు. ఏ దిక్కున నుంచిన నా దిక్కుననే యుండును. దశదిశలలో నది వ్యాపకము గాలేదు 14. మనస్సన్ని త్రోవుల నొకసమయమును సమానముగా నుండదు. దీని వలన మనస్సుయొక్క పరిపూర్ణతి యనుభవము గాఁగలదు 15. పరబ్రహ్మమునకు సూర్యుని దృష్టాంతముగ నీయఁదగదు. ఏలయన? సూర్యునకు ఉదయాస్తమానములు రెండునుగలవు. పరబ్రహ్మ మట్లుగాదు. సహోదరము, నిర్గుణము 16. ఘటాకాశ, మఠాకాశ, మహదాకాశముల దృష్టాంతములు సామాన్యము నిర్గుణ పరబ్రహ్మమున కన్వయింపఁగలవు 17. బ్రహ్మాకాశ మనఁగ నాకాశము. ఆత్మాంశము మనస్సు. ఈ రెంటిని జక్కఁగ నెఱుంగవలెను 18. ఇఁక నాకాశము, మనస్సు సమమెట్లగును? మనన శీలురగు మహాపురుషులంతయు నెఱుంగుదురు 19. ఒకవేళ మనస్సుముందు విరాజిల్లుచున్నచో వెనుకనేమియు నుండదు. ఇఁక దానిని బూర్ణాకాశ మునకు సమానమని యెట్లు చెప్పఁగలను? 20. పరబ్రహ్మము నచలమందురు. పర్వతమునుగూడ నచలమందురు. కాని యీ రెంటి నొకటియని నుడువనగునా? 21. జ్ఞానము, అజ్ఞానము, విపరీతజ్ఞానము ననునీ మూఁడును సమానమెట్లగును? మననముచేసి యందనుభవము గడింపవలెను 22. ఎఱుఁగుటను జ్ఞానమందురు. ఎఱుకలేమి నజ్ఞానమందురు. ఒకదానిని మఱి యొకటిఁగ దెలిసికొనుటను విపరీతజ్ఞానమందురు 23. జ్ఞానమును అజ్ఞానమును వేరుపఱచినచో స్థూల పాంచభౌతికము మిగులును. దానినే విపరీత జ్ఞానమని యెఱుంగవలెను* 24. ద్రష్టయు, సాక్షియునగు నంతరాత్మయే జీవాత్మ. జీవాత్మయే శివాత్మ. పిదప శివాత్మయే జీవాత్మయై జన్మమును గైకొనుచున్నది 25. ఆత్మత్వమునందు జననమరణము లంటుకొనుచున్నవి. జననమరణ భంగ మాత్మత్వమునఁ గలుగదు. (కృష్ణభగవానుఁ డీయర్థముననే) 'సంభవామి యుగేయుగే'యని వచించెను 26. ఏకదేశీయుఁడగు జీవుఁడు విచారమువలన విశ్వంభరుఁ డగుచున్నాఁడు. కాని విశ్వంభరు నుండి సంసారము (ప్రపంచము) ఎట్లు విడిపోఁగలదు? 27. వర్తిరూప

* ఈ పాంచభౌతికవ్యాపము విపరీతజ్ఞానము. ఇది జ్ఞానమును గాదు. అజ్ఞానమును గాదు. కేవలభ్రమ. అనఁగా విపరీతజ్ఞానము.

మున జ్ఞానాజ్ఞానములు రెండును సమానములే. నివృత్తిరూపమున విజ్ఞానుడు కావలెను 28. జ్ఞాన మీ బ్రహ్మాండమును నిర్మించెను. దీని నిదియే వృద్ధి గావించెను. అది నానాప్రకారములగు వికారముల సమూహమై యున్నది 29. బ్రహ్మాండముయొక్క యెనిమిదవదేహము (మూలమాయ) వాస్తవమునకు జ్ఞానమే. దానికంటెను నావలనున్న విజ్ఞానరూపమగు విదేహావస్థను బ్రాపింపవలయును 30.

---

## రెండవ సమాసము — త్రివిధసృష్టి.

ఒకవేళఁ జంచలమగు మూలమాయయే లేకున్నచో నిర్గుణబ్రహ్మము, గగనాంతరాళములు, నలుదిక్కులవలె నిశ్చలముగ నుండెడిది 1. దృశ్యము వచ్చుచున్నది. పోవుచున్నది. కాని యాబ్రహ్మము గగనమువలె నలుదిక్కులనిండి నిశ్చలముగా నున్నది 2. బ్రహ్మమెటుజూచిన నటే యపారముగ నున్నది. ఏ దిక్కునను దానికిఁ బారములేదు. అది యొకేవిధమైనదిగను స్వతంత్రమైనదిగను నున్నది. దానియందు ద్వైతము లేదు 3. బ్రహ్మాండమునకుఁ బైనఁగూర్చుండి (బ్రహ్మాండమును దృశ్యముగా భావించి) ఆకాశముయొక్క యవకాశమును మఱియు దాని శూన్యాకారమును నవలోకింపవలెను. ఇటులొనరించినచో నడుమ చంచల వ్యాపకములపేరిట శూన్యాకారము గలదని విదితమగును 4. దృశ్యమును వివేకముతో వేఱుచేసినచో నలుదిక్కులను పరబ్రహ్మమే నిండి యుండును. కాని యది యెప్పుడును నెవ్వరి యనుమానములోనికిని రాదు 5. క్రిందను బైనను నలుదిక్కులను అన్నితావులను నిర్గుణ పరబ్రహ్మమే కనిపించుచున్నది. దృశ్యము నడుచుచున్నది. బ్రహ్మమచలముగనున్నది. దృశ్యము కాన్పించును. బ్రహ్మము కాన్పింపదు. దృశ్యకల్పన మాకలనమగును. పరబ్రహ్మకల్పన మాకలనముకాదు 7. కల్పనమేదియొ యొకపదార్థముగాదు. బ్రహ్మము సర్వస్థలములందును నిండియున్నది. మహావాక్యార్థమును మననము గావింపవలెను 8. పరబ్రహ్మమునకు సమానమగు శ్రేష్ఠవస్తు వింకొకటి లేదు. శ్రవణమును విడిచినచో నింక సాధనమేలేదు. ఎఱుఁగకున్నచో నేమియు సమాధానము

కలుగును 9. పరబ్రహ్మము పిపీలికామార్గమువలన మెల్లమెల్లగ విదిత మగును. విహంగమ మార్గమువలన శీఘ్రముగ ఫలములభించును. సాధక జనులు మననముచేయుచు బ్రహ్మచింతచే నిశ్చయజ్ఞానము కలుగును 10. పర బ్రహ్మమునకు సమానమగు రెండవసత్యమెద్దియులేదు. పరబ్రహ్మమునకు నిందాస్తుతులు లేవు 11. పరబ్రహ్మ మీ విధముగ ననుపమము. దానికి సమానము నన్యముగ చెప్ప వీలుండదు. మహానుభావులు పుణ్యరాసులు నగు వారికే యీ పరబ్రహ్మమునందు ప్రవేశముకలుగును 12. చంచలము వలన దుఃఖము ప్రాప్తించును. నిశ్చలమునకు సమానమగు విశ్రాంతి యెచ్చటను లేదు. మహానుభావులగు పురుషులు నిశ్చలము ననుభవ ముగ [illegible] గాంచెదరు 13. ఆదినుండి యంత్యముదనుక విచారముగావించు వానికే [illegible] యొక్క నిశ్చయము లభించును 14. ఈ కల్పనసృష్టి మూడు [illegible] ములుగా భాసించుచున్నది. తీక్ష్ణబుద్ధితో దీనిని మనస్సు లోనికి దేవలెను 15. మూలమాయనుండి త్రిగుణములు కలిగెను. అవి యస్పష్టము లే దేశీయములు. మఱియుఁ బంచభూతములస్థూలగుణము ప్రత్యక్షముగఁ గాన్పించుచున్నది 16. పృథ్వినుండి నాలుగువిధములగు నుత్పత్తులగుచున్నవి. వాని నాలుగు విధముల కృత్యములును వేఱు వేఱుగా నున్నవి. సృష్టియొక్క గమనిక యిచ్చటనుండియే నారంభ మయ్యెను 17. ఇట్లు సృష్టియొక్క త్రివిధలక్షణములను విశదీకరించెదను. శ్రోతలు తమ యంతఃకరణములను సావధానము గావింతురుగాక 18. ఆదినుండియుఁ జేతనరూపమగు మూలమాయ సూక్ష్మ కల్పనారూపముగ నుండెను. పరవాక్కే యీవిధముగ స్ఫురణరూపముగనున్నదో యట్లే మూల మాయయుఁగూడ నలరారుచున్నది 19. అష్టధాప్రకృతికిమూలము కేవల మీ మూలమాయయే. అన్నిబీజములును సూక్ష్మరూపముతో నాది నుండియు మూలమాయయం దున్నవి 20. అది జడపదార్థములకుఁ జేతనము నొసంగుచున్నది. కాననే దానిని చైతన్యమందురు. సూక్ష్మ రూపముతో సకలలక్షణములను గ్రహింపవలెను 21. ప్రకృతిపురుషులు, అర్ధనారీనటేశ్వరుఁడు, అష్టధాప్రకృతి మున్నగునవియెల్ల నదియే 22. త్రిగుణములు గుప్తరూపముతో మూలమాయయం దున్నవి. ఇందువలననే మూలమాయ మహత్తత్త్వమనుచున్నారు. శుద్ధ సత్త్వగుణము సైతము

గు ప్తరూపమున దానియందే యున్నది 23. మూలమాయవలన మూఁడు గుణములును బ్రకటనమగుచున్నవి. కావున దానిని గుణక్షోభిణియందురు. త్రిగుణముల రూపమును దెలిసికొనుచున్న సాధువులకు వందనములు 24. మూలమాయయందు గుణములు సమానముగ నున్నవి. కాన దానిని గుణసామ్యమందురు. ఈ సూక్ష్మవిచారమును బహుస్వల్ప సంఖ్యాకులే యెఱుంగుదురు 25. త్రిగుణము లీవిధముగా మూలమాయనుండి కలిగెను. కాని యవి చంచలములు, నేకదేశీయములు నై యున్నవి. ఈ విషయ మనుభవమువలనఁ దెలియును 26. దీనికిఁబిమ్మటఁ బంచ భూతముల విస్తారముకలిగెను. సప్తద్వీపములు, నవఖండములతోఁ గూడిన వసుంధర, యంతయు నీ విస్తారమునందే యున్నది 27. ఈ ప్రకారముగా సృష్టి రెండువిధములు (త్రిగుణములు, పంచభూతములు) గలదయ్యెను. ఇఁక మూఁడవవిధము వినుఁడు 28. పృథివి నానా పదార్థములకును బీజము. అండజజరాయుజస్వేదజోద్భిజ్జములను జతుర్విధోత్పత్తులు, చతు ర్వాక్కులు, స్వాభావికముగా దీనినుండియే నిర్మాణము లయ్యెను 29. చతుర్విధోత్పత్తులు, చతుర్వాక్కులు కలుగుచున్నవి. పోవుచున్నవి. కాని పృథివిమాత్ర మట్లే చెక్కుచెదరకున్నది. ఈ విధముగా నెన్నియో ప్రాణులు కలుగుచున్నవి. మరణించుచున్నవి 30.

---

## మూఁడవ సమాసము — సూక్ష్మవిచారము.

ఆదినుండి యంత్యముదనుక నానావిధమగు విస్తారమును నెఱిం గించితిని. దానిని మననముగావించుచు గానించుచు మఱల వృత్తిని వెనుకకు మరల్పవలయును 1. నాలుగుఉత్పత్తులు, నాలుగువాక్కులు, ఎనుబదినాలుగులక్షల జీవయోనులు మఱియు నానా ప్రకారములగు ప్రాణులు జన్మించియున్నవి 2. అన్నియుఁ బృథివినుండియే కలిగినవి. పృథివియందే కలిసిపోవుచున్నవి. ఈ ప్రకారముగ నెన్నియో పుట్టు చున్నవి. గిట్టుచున్నవి. కాని పృథివి యటులేయున్నది 3. ఇది శిఖరము పై పుభాగము, రెండవభాగము భూతములగోల, మూఁడవభాగములో ననేకసూక్ష్మనామరూపములు గలవు 4. స్థూలము నంతయువిడిచి సూక్ష్మ

మును గుర్తింపవలెను. త్రిగుణములకు మొదటిదెద్దియో దానిని సూక్ష్మ దృష్టితోఁ జక్కఁగ విచారింపవలెను 5. చేతనాచేతనములను గుణరూప ములను మాటిమాటికి విచారమొనర్పవలెను. కాని సూక్ష్మదృష్టియొక్క చమత్కారము దీనికంటె ముందున్నది 6. శుద్ధాచేతనము, తమోగుణ ము, శుద్ధచేతనము, సత్త్వగుణము, మఱియుఁ జేతనాచేతనము, మిశ్రి తమై రజోగుణకార్యము జరుగుచున్నది 7. ఇదియే త్రిగుణములరూపము. త్రిగుణముల మొదటి కర్దమమును గుణక్షోభిణి యందురు 8. రజస్సత్త్వ తమోగుణములు మూఁడింటి కర్దమము గుప్తరూపముగ నెచటనుం డునో దానిని మహత్తత్త్వమందురు 9. ప్రకృతిపురుషులనియు, శివ శక్తులనియు, అర్ధనారీనటేశ్వరులనియు దానినే నుడువుదురు. అది త్రిగుణకర్దమరూపము 10. సూక్ష్మరూపముతో గుణములకు సమానత్వ ముగ దానిని గుణసామ్య మందురు. మఱియుఁ జైతన్యరూపమగు మూలమాయగూడ సూక్ష్మముగ నున్నది 11. ఆ సూక్ష్మకర్దమరూప మగు మూలమాయయే బ్రహ్మాండముయొక్క మహాకారణ (ఎనిమిదవ) కాయము. ఈ విధముగ సూక్ష్మాన్వయములను మాటిమాటికి విచా రింపవలెను 12. చతుర్విధోత్పత్తులు, పంచభూతములు పదునాలుగు సూక్ష్మసంకేతములు, వీనిలో నన్నియు వచ్చును 13. పైపై విజూచినచో నేమియుఁ దెలియదు. ప్రయత్నముగావించినను బోధకాదు. నానావిధ ములగు జనుల హృదయములందు సందియములు వృద్ధినొందును 14. మూలమాయయొక్క పదునాలుగునామములు, పంచభూతములుగలిసి పందొమ్మిదియయ్యెను. వీనిలోఁ జతుర్విధోత్పత్తులు గలియగనే యిరు వదిమూఁ డయ్యెను. వీనిలో మూలమునకు సంబంధించిన పదునాలిగింటిని మాటిమాటికిఁ జూడవలెను 15. మననమొనరించి తెలిసికొనువానికి సందియ ముండదు. తెలియకయే పెట్టుకొను జంజాటమంతయు వ్యర్థము 16. సమస్తసృష్టిబీజమును స్వాభావికముగనే మూలమాయయం దుండును. దీనినంతయుఁ దెలిసికొన్నచోఁ బరమార్థసిద్ధి యగును 17. తెలిసికొన్నవాఁడు వ్యర్థప్రలాపనలు గావింపఁడు. నిశ్చయభావయుక్తుఁ డగు పురుషుఁడు సందేహమునఁ బడఁడు. ఆతఁడు తనపరమార్థము నెప్పుడును జెడనీయఁడు 18. చెప్పఁదగిన శబ్దాతీతవిషయములను

వాచ్యాంశము లందురు. శుద్ధలక్ష్యాంశమును వివేకముతోఁ గాంచవలెను 19. మాయను బూర్వమందురు. ఇది సిద్ధాంతములో లయమగును. మాయలేకున్న మీఁదట నిఁక నాస్థితి నేమని నుడువవలెను? 20. అన్వయవ్యతిరేకములు, పూర్వపక్షవిచారములు (మాయావిచారములు); సిద్ధాంతమునందు శుద్ధమొకటియే యుండును. దానిలో రెండవదెద్దియు లేదు 21. అధోముఖమువలన (మాయవైపు దృష్టినిడుటవలన) భేదము వృద్ధినొందును. ఊర్ధ్వముఖమువలన (పరబ్రహ్మమువైపు దృష్టినిడుట వలన) భేదము విడిపోవును. నిస్సంగముతోఁ బాటుగ నిర్గుణిగనున్నవాఁడే మహాయోగి 22. మాయయొక్క మిథ్యాత్వము నిశ్చితమైనప్పుడిఁక దానికేల భయపడవలెను? దానికి భయపడుటవలననే స్వానుభవస్థితి లభింపకున్నది 23. మిథ్యయగు మాయకు భయపడి సత్యపరబ్రహ్మమును విడుచుట యుక్తముకాదు. ముఖ్యనిశ్చయమునుబొంది భయపడనేల? 24. పృథివియందుఁ బెక్కండ్రు జనులున్నారు. వారిలోఁ బెక్కుమంది సజ్జనులుగూడ నుందురు. కాని సాధువునువిడిచినచో నింకెవరు సాధువును గుర్తింతురు? 25. కావున గార్హస్థ్యమును విడిచినపిదప సాధువును వెదుకవలెను. తిరిగి సాధువును గనుఁగొనవలెను 26. పలువురుసాధువులతోఁ గలియవలెను. వారలయందెచటనో యొక యనుభవశాలియగు సాధుసత్తముఁడు లభించును. ఏలయన్న! అనుభవములేనిచో స్వహితము జరుగదు 27. ప్రపంచమైనఁ గానిమ్ము! పరమార్థమైనఁ గానిమ్ము. అనుభవములేనిచో నంతయు వ్యర్థమే. అనుభవజ్ఞానముగలవాఁ డొకడతికంటెను సమర్థుఁడు 28. రాత్రింబవళ్లు అర్థవిచారము గావింపవలెను. అర్థవిచారము గావించువాఁడే సమర్థుఁడు. వానివలననే పరలోక సంబంధమగు సత్యస్వార్థము లభించును 29. కావునఁజూచినదానినే మఱలఁ జూడవలెను. శోధించినదానినే మఱల శోధింపవలెను. అంతయు విదితమైనప్పుడు సహజముగనే (సులభముగనే) సందేహము నశించిపోఁగలదు 30.

---

## నాలుగవ సమాసము – ఆత్మనిరూపణము.

ఏదియో నొకరీతిగ మనస్సు నుదాసీన పఱుపవలదనియు అనుభవపూర్ణమగు నిరూపణమును హృదయమునం దుంచవలెననియు నందఱిని

బ్రార్థించుచున్నాఁడను 1. అనుభవ మొకవైపునుంచి తన యిచ్చవచ్చి నట్లు తాను పరుగెత్తినచో నిఁక సారాసారవిచార మెట్లగును ? 2. సాధారణదృష్టిలో సృష్టిని గాంచుమని యంతయు నొక గందరగోళముగాఁ గాన్పించును. కాని మహారాజసత్తావిషయము వెలుఁగనున్నది 3. పృథ్వి యందలి శరీరములన్నియు భగవంతుని గృహములు. ఆ గృహముల వలననే నానాసుఖము లాతనికిఁ బ్రాప్తించుచున్నవి 4. ఆతనిమహిమ యెవనికిఁ దెలియఁగలదు ? కృపాళుఁడగు నా జగదీశ్వరుఁడు మాతృరూప ములోఁ బ్రత్యక్షజగత్తును రక్షించుచున్నాఁడు 5. ఆతని సత్తయంతయు నీ సంపూర్ణ జగత్తునందు విరాజిల్లుచున్నది. భగవంతుని కళవలననే సృష్టి వర్తించుచున్నది 6. మూలజ్ఞాతయగు పురుషుని, (పరమాత్ముని) సత్తి శరీరమునందు విస్తారితమై యున్నది. కళయుఁ, జతురత్వము నందే యున్నవి 7. అన్ని పురములకును నీశుఁడగు జగదీశుఁడు జగత్తునందు వ్యాపించియున్నాఁడు. నానాశరీరముల యందునిండి యాతఁడే యానంద ములో నీ సృష్టిని నడుపుచున్నాఁడు 8. పైపైనిజూచినచో నీసృష్టి యొక్క సమస్తరచన మొక్కనివలన నడువఁజాలదని తోఁచును. కాని యాతఁడొక్కఁడే నానాదేహములు ధరించి దీనిని నడుపుచున్నాఁడు 9. అతఁడేకార్యముల నుం దుచ్చనీచముల విచారింపఁడు. మంచిచెడుగులఁ జూడఁడు. పని జరుగుచుండుటమాత్రమే భగవంతుని యభిప్రాయము 10. భగవంతుఁడు అజ్ఞానులను సృజించి లోకుల కాటంకము గలుగఁజేసెనో లేక యభ్యాసమునకుఁ బనిచేసెనో తెలియదు. ఎందులకాతఁడు దేనిని నిర్మించెనో యాతనికే తెలియును 11. జగదాంతర్యము (జనులందఱి యంతఃకరణము) చక్కఁగ ననుసంధానము గావించుటయే ధ్యానము. ఈ ధ్యానజ్ఞానము లోకోపయోగమగును 12. ప్రాణి ప్రపంచములోని కేతెంచి కొంత చతురుఁడై నపిదప భూమండలములోని విషయముల నెన్నింటినేని మననము విచారముగావించును. 13. శ్రీరాముని పతాకము ప్రసిద్ధముగాఁ బ్రకాశించుచున్నది. ఆ యాత్మారాముఁడు జ్ఞానధనుఁడు. ఆ విశ్వంభరుఁడు సర్వస్థలములందును వెలుఁగుచున్నాఁడు. కాని గొప్పభాగ్యమువలనఁగాని యాతఁడు ప్రాప్తింపఁడు 14. ఉపాసనమును మనము విరళించినకొలఁది విస్తరమగును. సత్యము. దానిమహిమ వర్ణింపనేరితరము ? 15. చూచెడి

వానిని ద్రష్టయందురు. ఎఱింగినవానిని సాక్షియందురు. ఆయనంత రూప మగు ననంతమును గురుతెఱుంగవలెను 16. యోగ్యులతోఁ జెలిమియుఁ, బరమాత్ముని కథలందును, అధ్యాత్మ నిరూపణమునందును బ్రీతియుఁగలుఁగఁ గానే మనస్సునకుఁ గొంతవిశ్రాంతి లభించును 17. ఇంతయైనను సందేహ నాశనముగావించు అనుభవజ్ఞాన ముండితీరవలెను. ఏలయన ! అనుభవము లేనిచో సమాధాన మెట్లులభించును ? 18. మూలసంకల్పమే హరి సంకల్పము. మఱియు మూలమాయయొక్క వ్యాపారరూపమే జగదంతః కరణమునందుఁ గాన్పించుచున్నది 19. ఉపాసన జ్ఞానస్వరూపము. కాని జ్ఞానముయొక్క యునికియందు నాలుగవ దేహపుఆరోపణ గలదు. ఇందుచే సంకల్పములన్నింటిని విడిచి విజ్ఞానరూపమగు దేహావస్థ నొంద వలయును 20. అదియే విశాలపరబ్రహ్మము. అది యాకాశమువలె సర్వ వ్యాపియు సఘనమునై యున్నది. అది పలుచనిదనిగాని, కోమలమైనదని గాని యెట్లు చెప్పఁగలము ? 21. జ్ఞానమును ఉపాసనమందురు. జ్ఞానము వలనఁ బరమేశ్వరుఁడు లభించును. జ్ఞానమువలననే యోగులకు సమా ధానము కలుగుచున్నది 22. బాగుగా విచారించినచో తానే యుపాసన యని విశదమగును. ఒకఁడు గతించుచున్నాఁడు. మఱియొకఁడు దేహ మును ధరించివచ్చుచున్నాఁడు 23. పరంపరగ నీ విధముగనే చక్రగతి జరుగుచువచ్చినది. మఱియు నిప్పటికిని సృష్టిస్థితియద్దియే 24. అరణ్య ముపై నరణ్యచరములకు (జంతువులకు) సత్తుగలదు. జలముపై జలచర ములకు సత్తగలదు. భూమండలముపై భూపాలురకు సత్తగలదు. అన్నింటి స్థితియు నిటులేయున్నది 25. ఆందోళనము గావించువాని కావశ్యకముగా సామర్థ్యముకలుగును. కాని దానికి భగవంతుని యధిష్ఠానము కావ లెను 26. కర్త జగదీశ్వరుఁడే. అదిసత్యమే కాని యాతనికృత్యములు వేఱువేఱుగా విభాగములైనవి. ఐనను అహంతాభ్రమ (అహంకర్తృ త్వాభిమానభ్రమ)యందుఁ జిక్కుకొనఁజనదు 27. 'హరిర్దాతాహరిర్భోక్తా' యను సిద్ధాంతము జగత్తునందంతటను వర్తించుచున్నది. కాని దీనిని బాగుగా యోచింపవలెను 28. సర్వమునకు కర్త పరమేశ్వరుఁడు. "నేను" అనునది యేదేని యొకపదార్థముగాదు. దానికి స్ఫూర్తియుండు ప్రసంగ మును జగదంతఃకరణములో గలిసి యొనర్పవలెను 29. ఆత్మతో పరియగు

చంచలమైన దిక్కొనటిపేను. అట్లే పరబ్రహ్మముతో సమానమగు నిశ్చల మెద్దియు లేదు. సోపానపరంపరపై మూలముదనుక నెక్కి అనుభవము గడింపవలెను 30.

---

## ఐదవ సమాసము — పదార్థ చతుష్టయము.

ఇచ్చటినుండి యచ్చటిదనుకఁ జూచినచో మొత్తము నాలుగు పదార్థము లున్నట్లు కనబడును. ఒకటి (పరబ్రహ్మము) పదునాలుగు (మూలమాయ) ఐదు (భూతములు) నాలుగు (ఉత్పత్తులు) 1. కాని పరబ్రహ్మ మన్నిటికంటెను వేఱుగనున్నది. అది యన్నింటికంటెను శ్రేష్ఠముగను నానా కల్పనములకంటె భిన్నముగను నున్నది 2. పరబ్రహ్మ విచారము నానా కల్పనముల కావలనున్నది. అది నిర్మలము, నిశ్చలము, నిర్వికారము, అఖండము నై యున్నది 3. ఇఁక నన్యములగు పదార్థములు మూఁడు. అవి నానా కల్పనారూపమగు మూలమాయ కంతర్గతములుగ నున్నవి 4. మూలమాయ నానా విధములతో సూక్ష్మరూపములుగ నున్నది. అది సూక్ష్మరూపమయ్యుఁ గర్దమరూపమై యున్నది. మూలముయొక్క సంకల్పారోపణము దానినిమీఁదికి వచ్చుచున్నది 5. మూలముయొక్క హరిసంకల్పమే యందఱికి ఆత్మారాముఁడు. ఇఁక భిన్న భిన్న నామముల వివరణము వినుండు 6, నిశ్చలమునందు చంచలము యొక్క చేతనము గలుగును. కావున దానిని చైతన్యమందురు. మఱియు నది గుణసమానత్వ కారణమున గుణసామ్య మనఁబడు చున్నది 7. అర్ధనారీనటేశ్వరుఁడని, షడ్గుణేశ్వరుఁడని, ప్రకృతిపురుషులని, శివశక్తియని గూడ దానికే చెప్పుదురు 8. శుద్ధ సత్త్వగుణము, అర్ధమాత్ర గుణక్షోభిణి మఱియు నాతర్వాత మూఁడు గుణములు ప్రకటనము లగుచున్నవి 9. మనస్సు, మాయ, అంతరాత్మదనుక నీ పదునాలుగు నామములు లెక్కింపఁబడుచున్నవి. అన్నింటిలోను జ్ఞానాత్మ విద్యమానమై యున్నది 10. మొదటిది పరబ్రహ్మము. రెండవది పదునాలుగు పేరులు గల మూలమాయ. ఇఁక మూఁడవ విధమగు పంచమహాభూతముల విధము జెప్పెదను 11. పంచమహాభూతముల జ్ఞాతృత్వశక్తి స్వల్పము.

వాని యాద్యంతములు ప్రత్యక్షములు. ఇక నాలుగవవిధ ముత్పత్తుల గూర్చినది. దానినిగూడఁ దెలుపుదును 12. చతుర్విధోత్పత్తులలో ననంత ప్రాణులుగలవు. వానియన్నింటిలో జ్ఞాతృత్వశక్తి బాగుగా నిండియున్నది. ఈ విధముగా మొదటిది బ్రహ్మము, రెండవది మాయ. మూఁడవది పంచభూతములు, నాలుగవది చతుర్విధోత్పత్తి. నాలుగు పదార్థము లయ్యెను 13.

బీజము కొంచెము నాటఁబడును. కాని తరువాత మిగులనుత్పత్తి యగును. చతుర్విధోత్పత్తులు, చతుర్విధవాక్కులు ప్రకటనమైన పిదప ఆత్మకుఁ గలిగెడి స్థితిగూడ నిట్టిదె 14. ఈ విధముగ సత్త ప్రబలమైనది. స్వల్ప సత్త మిక్కుటమయ్యెను. మఱియు నది మనుష్యదేహముతో నానా ప్రకారములుగా సృష్టిని భోగించుచున్నది 15. శ్వాపదజంతువులు అన్య జంతువులను జంపి తినుచున్నవి. ఇంతియే. ఇంతకుఁదప్ప నవి యేమియు నెఱుంగవు. కాని మనుష్యప్రాణులు నానా విధములగు భోగ ములను భోగించుచున్నవి 16. నానావిధ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విశేష రూపముగ నరదేహమే తెలిసికొనుచున్నది 17. అమూల్యరత్నములు, నానావిధ వస్త్రములు, యానములు, శస్త్రములు, విద్యలు, కళలు, శాస్త్రములు, నరదేహమే గ్రహించుచున్నది 18. పృథివి యీశ్వరసత్తతో వ్యాప్తమైయున్నది. ప్రతిస్థలమునను ఆసత్త సంపూర్ణరూపముగ నిండియున్నది. దానివలననే నానావిద్యలు, కళలు, ధారణాదులు ఉత్పన్నమయ్యెను 19. నరదేహమునొంది సమస్త దృశ్య ములను జూడవలెను. స్థానమానముల సవరించుకొనవలెను. సారాసార ముల విచారింపవలెను 20. ఇహపరలోకములను, నానావిధ వివేకా వివేకములను మనుజుఁడే గ్రహించుచున్నాఁడు 21. నానావిధ పిండ బ్రహ్మాండరచనము, నానామూలములగు బహువిధ కల్పనములు,నానావిధ ధారణలు, మనుజుఁడే గ్రహించుచున్నాఁడు 22. అష్టభోగములు, నవరస ములు, నానావిధ విలాసములు, వాచ్యాంశ లక్ష్యాంశ సారాంశములు మనుజుఁడే గ్రహించుచున్నాఁడు 23. మనుజుఁ డన్నింటిని దెలిసికొనును. ఆ మనుజుని నీశ్వరుఁడు పోషించుచున్నాఁడు. ఇదియంతయు నరదేహ యోగమువలననే విదితమగుచున్నది 24. నరదేహము పరమదుర్లభము.

దీని వలన సులభముగ లాభములు లభించుచున్నవి. దీని యోగముననే దుర్లభము సులభమగుచున్నది 25. రెండవ (ఇతర) దేహము చిత్తి చెరాటములని [illegible]. నరదేహ మొకగొప్ప ద్రవ్యభాండారమువంటిది. కాని నరదేహము [illegible], ఉత్తమ వివేకమును గ్రహింపవలెను 26. నరదేహమునొంది [illegible] బరమాత్ముని గుర్తింపనివాఁడు అన్ని విధముల మునిగిపోవును 27. విశ్వాసపూర్వకముగ శ్రవణ మొనరించుచు నిరంతరము మననశీలమగు నంతఃకరణముతో వర్తించుచు నుండు నరుఁడే [illegible] 28. స్వయముగా నీఁదనేర్చినవాఁడు రెండవవాని నదినుండి [illegible] సహాయము బడయవలసిన యవసరముండదు. స్వతంత్ర ము[illegible] [illegible] శోధించవలెను 29. పదార్థమాత్రమును శోధించువానికి [illegible]దేహముండదు. [illegible] (నిస్సందేహావస్థయందు) నాతఁ డెట్లుం డునో [illegible]తెలియంగును 30,

---

## ఆఱవ సమాసము — ఆత్మయొక్క గుణములు.

ఈ పృథ్వీ మండలముపై నొక్కొక్క తావున మిగుల జలము, నొక్కొక్క తావున పేరునకైన నీటిగుర్తులులేని మిగుల విశాలములగు నిసుక మైదానములు గలవు 1. ఈ దృశ్యమంతయు నిటులె వ్యాపించి యున్నది. దీనియం దొకచోట చేతనశక్తి వెలుంగుచున్నది. ఒకానొకచో దాని యభావము గాన్పించుచున్నది 2. నాలుగుత్పత్తులు, నాలుగు వాణులు, ఎనుబదినాలుగులక్షల జీవయోనులు గలవు. శాస్త్రములయం దివి యున్నియు నీ క్రిందివిధముగా నిశ్చయింపఁబడెను 3. మనుజులు నాలుగులక్షలు, పశువులు ఇరువదిలక్షలు, క్రిములు పదునొకండు లక్షలు, ఖేచరములు పదిలక్షలు, జలచరములు తొమ్మిదిలక్షలు, స్థావరములు ముప్పదిలక్షలు అని శాస్త్రమునందుఁ జెప్పఁబడెను 4—5. ఈ విధముగా నెనుబదినాలుగులక్షల యోనులుగలవు. ఏ ప్రాణి యేయోనియందలిదో యంతయు యాప్రాణి యెఱుంగును. ఈ యోనులలో ననంతదేహములు నిండియున్నవి. వానివాని మేరలు వివరించుట కష్టము 6. ప్రాణము లనంతములుగాఁ బుట్టుచున్నవి. గిట్టుచున్నవి. వాని కధిష్ఠానము పృథివి.

పృథ్వి లేకున్నచో నవి యెట్లు మెలఁగఁగలవు ? 7. ప్రకటన మగుచున్న పంచభూతములలోఁ గొన్ని యాకృతిని ధరించుచున్నవి. కొన్ని యట్లే యున్నవి 8. చపలత్వమే యంతరాత్మ గురుతు. ఇఁక జ్ఞాతృత్వముయొక్క- యధిష్ఠానమును సావధానులరై వినుండు 9. సుఖదుఃఖముల నెఱుంగు వాఁడు జీవుఁడు. అట్లే శివుఁడనిగూడ నెఱుంగుము. మఱియు నంతఃకరణ పంచక మాత్మాంశము 10. స్థూలమునందుఁగల యాకాశగుణము లాత్మాంశములు. సత్త్వరజస్తమోగుణము లాత్మగుణములు 11. నానా విధచేష్టలు, ధృతి, నవవిధభక్తులు, చతుర్విధముక్తులు, అలిప్తత, సహ జస్థితి, ఆత్మగుణములు 12, ద్రష్ట, సాక్షి, జ్ఞానఘనము, సత్త, చైతన్యము, పురాతనము, శ్రవణము, మననము, వివరణములు ఆత్మగుణములు 13. దృశ్యము, ద్రష్ట, దర్శనము, ధ్యేయము, ధ్యాత, ధ్యానము, జ్ఞేయము, జ్ఞాత, జ్ఞానము ఆత్మాంశములు 14. వేదశాస్త్ర పురాణాదులయర్థము. గుప్తముగానడచు పరమార్థము, సర్వజ్ఞతతోఁగూడిన సామర్థ్యము, బద్ధత ముముక్షుత్వము, సాధకత్వము, సిద్ధత, శుద్ధవిచారము, బోధప్రబోధ ములు ఆత్మగుణములు 15-16. జాగ్రత్ స్వప్నసుషుప్తితురీయములు, ప్రకృతిపురుషులు, మూలమాయ,పిండబ్రహ్మాండములు, అష్టకాయములు, పరమాత్మ, పరమేశ్వరి, జగదాత్మ, జగదీశ్వరి, మహేశుఁడు, మహేశ్వరి ఆత్మగుణములు 17-18. సూక్ష్మనామరూపము లన్నియు నాత్మస్వరూప ములు. దాని కనంతములగు నామములు, చిహ్నములు గలవు 19. ఆదిశక్తి, శివశక్తి, ముఖ్యశివశక్తి, మూలమాయ, నానాపదార్థముల యుత్పత్తిస్థితులు, పూర్వపక్షము, సిద్ధాంతము, పాడుట, వాయించుట, సంగీతము, నానావిధాద్భుతచర్యలు, జ్ఞానము, అజ్ఞానము, విపరీతజ్ఞానము, అసద్వృత్తి, సద్వృత్తి, జ్ఞప్తి, మాత్రము, అలిప్తత్వము ఆత్మగుణ ములు 20-22. పిండము, బ్రహ్మాండము, తత్త్వవివరణము, నానాతత్త్వ నిశ్చయము, స్పష్టమగు విచారముగావించుట, నానాధ్యానములు, అను సంధానము, నానాస్థితులు, నానాజ్ఞానములు, అనన్యమగు నాత్మనివేద నము, ముప్పదిమూఁడుకోటుల దేవతలు, ఎనుబదివేల ఋషీశ్వరులు, అనంతవిధప్రాణులు, మున్నగునవన్నియు నాత్మగుణములు 23-25. మూఁడుకోటుల యేబదిలక్షల భూతములు, ఏఁబదియాఱుకోటుల చాముండీ

దేవతలు, తొమ్మిదికోటుల కాత్యాయనులు, చంద్రుఁడు, సూర్యుఁడు, తారామండలము, నానానక్షత్రములు, గ్రహమండలి, శేషుఁడు, కూర్మము మేఘమండలము ఆత్మగుణములు 26_27. దేవతలు, దానవులు, మానవులు, నానావిధజీవులు, భావాభావము మున్నగునవి యెల్ల నాత్మగుణములు 28. ఈ విధముగా నాత్మకు నానాగుణములుగలవు. బ్రహ్మము, నిర్వికారము నిర్గుణమునై యున్నది. ఏకదేశీయమగుటయు, బూర్ణజ్ఞానము కలుగుటయుఁగూడ నాత్మగుణములు 29, ఆత్మారాముని యుపాసనము వలన నిరంజన పరబ్రహ్మలభించును. మఱియు మనుజుఁడు నిస్సందేహి యగును. సంశయ ముండదు 30.

## ఏడవ సమాసము – ఆత్మవివేకము.

సమాధాన మనిర్వాచ్యముగనున్నను దానిని వివరింపవలెను. వివరించుటవలన సమాధానము లేచిపోవనేరదు 1. కొంత విడుచుటగాని, కొంత జోడించుటగాని తటస్థింపదు. విచారమాత్రముననే యంతయు విశదమగును 2. ముఖ్యుఁడగు కాశీవిశ్వేశ్వరుఁడు, సేతుబంధన రామేశ్వరుఁడు, మల్లికార్జునుఁడు, భీమశంకరుఁడు మున్నగు వేల్పులందఱును నాత్మగుణములు 3. ముఖ్యములగు ద్వాదశలింగములవలె నింక నెన్నియో లింగములుగలవు. ఇవియున్నియు నాత్మగుణములు. వీనియనుభవమును జగత్తెఱుంగును 4. భూమండలమునం దనంతములగు శక్తులుగలవు. సాక్షాత్కారనులు, చమత్కారము లనేకములు జరుగుచుండును. మఱియు వివిధములగు సామర్థ్యయుత దేవతామూర్తు లెన్నియోగలవు. ఇవియున్నియు నాత్మగుణములు 5. సిద్ధులయు, నానామంత్రములయు, యంత్రములయు, లతలయు, తీర్థములయు, క్షేత్రములయు, నింతయేల ? భూమండలమునందలి నానావస్తువులయు సామర్థ్యము లాత్మగుణములు 6_7. ఉత్తమగుణములన్నియు నాత్మలక్షణములు. మంచిచెడుగు లన్నియు నాత్మయోగమువలననే జరుగుచున్నవి 8. శుద్ధాత్మ యుత్తమగుణిగను, శబలాత్మ (ఉపాధియుక్తమైనది) అవలక్షణిగను నుండును. ఈవిధముగా మంచిచెడుగులకు సంబంధించిన కృత్యములన్నియు నాత్మవే 9. నానావిధములగు నభిమానముల నుంచుకొనుటయు, నానావిధములగు

ప్రతిసృష్టులఁ గావించుటయు, నానావిధములుగ శాఖోపశాఖలను లొసంగు కొనుటయు నాత్మయోగముననే జరుగుచున్నది 10. పిండమును జక్కఁగ శోధింపవలెను. తత్త్వముల పిండములనుగూడ బాగుగా శోధింపవలెను. తత్త్వములను శోధించినచో బిండమునకు సంబంధించిన విషయమంతయు విశదమగును 11. జడదేహము భూతములది. దానిలోని చంచలగుణ మాత్మది. నిశ్చలబ్రహ్మము లేనితావెందును నెచ్చటనులేదు 12. పిండము నందు నిశ్చల చంచలజడము (బ్రహ్మము, ఆత్మ, భూతము)లను నిర్ణయింపవలెను. అనుభవరహితముగాఁ జెప్పునది వృథము గాను 13. పిండము నుండి యాత్మ తొలంగిపోవఁగనే యీ నిర్ణయములన్నియు నగుపడును. చూచుచుండఁగనే యీ జడదేహము పతనమగును 14. ఇట్లే జడమంతయు బతనమగును. మఱియుఁ జంచలమంతయు ధ్యానములోని కేతెంచును 15. ఇదిగాక ఆ నిశ్చలము జగత్తునందంతటను వ్యాప్తమైయున్నదనియు, దానిలో గుణము, వికారము మున్నగునవెన్నియు లేవనియు స్పష్టముగా దెలిసియేయున్నది 16. పిండమెట్లో బ్రహ్మాండ మట్లేయని యీ జడచంచలములు వెళ్ళిపోయిన పిదప శ్రేష్ఠమగు నాపరబ్రహ్మము శేషించియుండు ననియు స్పష్టమేగదా 17. మహాభూతములతో నుగ్రహమునుసృజించి దానిలో నాత్మనుంచి ప్రాణిగ నొనరింపఁబడుచున్నది. ఇట్లే సృష్టినిర్వర్తనముగూడ నడుచుచున్నది 18. వాస్తవమున నాత్మయు, మాయయుఁ గలసి వికారము గావించుచున్నవి. కాని యీ వికారమును బ్రహ్మముపై నారోపింతురు. ఈ విషయమునం దనుభవము, వివరణము గావించువాఁడే శ్రేష్ఠుఁడు 19. బ్రహ్మ మఖండవ్యాపకముగలది. బ్రహ్మమునకు దక్క నితరపదార్థముల కఖండవ్యాపకత్వములేదు. పరిశోధించినచో నదియుఁ దెలియును 20. ఆకాశము ఖండఖండములు జేయఁజాలము. మహాప్రళయమునందు సైతము ఆకాశమునందలి యొకభాగమేని నాశనము గాదు 21. ఏది సంహారమొందుచున్నదో దానినే వాస్తవమునకు నాశవంతమని యెఱుంగవలెను. ఈసమస్యను జ్ఞాతలగు పురుషులే సాధింపగలరు 22. ఎఱుకలేమిచేనన్నియు గహనసమస్యలుగఁగాన్పించును. కావున నేకాంతమునందు నిశ్చయపూర్వకముగా యోచింపవలెను 23. అనుభవనీయులగు సత్పురుషులతో సమాగమముగలుగుట యేకాంతము కంటెను బ్రశస్త

గూడఁ గాఁడు. కావున నీ విషయములోఁ గొంత యోచింపవలసి యున్నది 3. దేవుఁడు నానాదేహములుధరించి మజల విడిచివేయు చున్నాఁడు. ఈతఁ డెట్టిదేవుఁడో వివేకముతో నెఱుంగవలెను 4. నానా సాధనములు, నిరూపణములు, ఆ దేవుని శోధించుటకే యేర్పడియున్నవి. అంతయుఁ దనయంతఃకరణమువలననే తెలిసికొనవలెను 5. బ్రహ్మజ్ఞానము తెలిసికొనుటవలననే లభించును. దాని నెవ్వరు నొసంగఁజాలరు. "ఇదిగో తీసికొమ్ము. పొమ్ము" అని చెప్పుట యదియొక పదార్థమా? 6. నాకు దేవునితోఁ బ్రత్యక్షసమావేశము కలుగవలయునని జనులందఱును దలం చుచుందురు. కాని (యిందులకుఁ దగిన) వివేకము సత్సంగము నాశము వేఱుగనున్నది 7. విచారము గాంచి నాడో వాని నాని (గ్రహింపఁదగనివానిని) దేవుఁడని చెప్పఁజాలము. కాని జనులొప్పుకొనరు. ఏమిచేయవలెను? 8. మహాపురుషులు గతించిన పిమ్మట వారి మూర్తు లను నిర్మించి జనులు సాదరముగా దర్శింతురు. ఇదెరో యుప స్థితి 9. గొప్పగొప్ప వ్యాపారములను విడిచి నుపకేని క్షుద్రవ్యాపారము లొనరించినచో రాజ్యసంపద యెట్లు ప్రాప్తించును? 10. కావున మహాత్మ భక్తిలోఁ బడియుండుట అజ్ఞానలక్షణము. అజ్ఞానమువలన దేహాధిదేవుఁ డెట్లులభించును? 11. అజ్ఞానమునకు జ్ఞానము రుచింపదు. మఱియు జ్ఞాత కనుమానము రుచింపదు. కావున సిద్ధులలక్షణములను గ్రహింప వలెను 12. మాయనువిడిచి యనాదిపురుషునివైపున కరుగవలెను. అప్పుడే సమాధానము లభించును. ఇట్లొనరింపనిచో నిత్యానిత్య భ్రమింప వలసివచ్చును 13. మాయను దాటుటకొఱకీశ్వరుఁ డనేకములగు నుపాయములను నిర్మించెను. ప్రతీతిపూర్వకమగు నధ్యాత్మశ్రవణమార్గము వలననే పరమాత్మను బ్రాప్తింపఁగల్గుదురు 14. ఇట్లు గాంచనిచో లోకమునందంతటను మఱుపు కలుగును. సత్యాసత్యదశను గుర్తింప వలెను 15. అసత్యమార్గమునఁ బోవఁదగదు. అనృతవాదులతోఁజెలిమి చేయరాదు. తనయందేమాత్రమైనను కృత్రిమ ముంచుకొనరాదు 16. కృత్రిమ మెన్నఁటికైనఁ గృత్రిమమే. సత్యమందుఁ గృత్రిమము నిలువఁ జాలదు. తన యధోముఖ మానసమును (మాయవైపున కరుగు హృదయమును) ఊర్ధ్వముగనొనరింపవలెను 17. అధ్యాత్మశ్రవణము

గాపించుచుండవలెను. ఇట్లు చేయుచున్నచో నంతయు లభించును. నానావిధజాలములు తెగిపోవును 18. చిక్కులుపడిన దారమును సరిగం దీయునట్లు మనస్సును సరిపఱచి యనుకూలము గావింపవలెను. మఱియు మెల్లమెల్లగా మూలపురుషుండగు పరబ్రహ్మము ప్రక్కకు మనస్సును సంధింపఁజేయవలెను 19. ఈ సృష్టియంతయు గర్దమరూపము. ఆ కర్ద మము నానాప్రకారములగు శరీరములయందు విభ్రాజితమై యున్నది 20. చూడవలసినవానినెల్ల నీ శరీరమునందే చూడవలెను. ఇదియేమి? ఇదియెట్టిది? అనువాని నిందే శోధింపవలెను. మఱియు మూలమాయ యొక్క పదునాలుగునామములను దీనియందే తెలిసికొనవలెను 21. నిర్గుణనిరాకారమొకటియే యన్నితావులందును వ్యాపకమైయున్నది. ఆ నిష్కళంక మీ దేహమునందున్నదో లేదో చూడవలెను 22. సంకల్ప రూపమగు మూలమాయ యంతఃకరణస్వరూపము. జడమునకుం జేతనము నొసంగెడి చైతన్యరూపముగూడ శరీరమునం దున్నది 23. సమానగుణ ములుగలుగుట (ఈ శరీరముయొక్క) గుణసామ్యము. మఱియు సూక్ష్మ విచారము అగమ్యము. సూక్ష్మము నెఱుంగుసాధుపురుషు లందఱకును ప్రణామములు 24. వామాంగము, దక్షిణాంగము అనునవి శరీరమునందలి రెండుభాగములు. దీనినే పిండమునందలి యర్ధనారీనటేశ్వరునిగ నెఱుంగ వలెను 25. ప్రకృతిపురుషులు, శివశక్తులు, షడ్గుణైశ్వర్యసంపన్నుండగు భగవంతుండుగూడ నదియే 26. దానినే మహత్తత్త్వ మందురు. త్రిగుణ ముల గూఢత్వము దానియందే గలదు. అర్ధమాత్రయు, శుద్ధసత్త్వమును గుణక్షోభిణియు నదియే! 27. త్రిగుణమువలన శరీరము ప్రవర్తించుట ప్రత్యక్షవిషయమేగదా! సరియే చాలును. మూలమాయాశరీరముగూడ నిట్టిదియే! కర్దమరూపమని యెఱుంగవలెను 28. మనస్సు, మాయ, జీవుండు, శరీరమునందు స్వాభావికముగనే యున్నది. ఈ విధముగాం బదు నాలుగునామములయభిప్రాయమును బిండమునందు గ్రహింపవలెను 29. పిండము పతనమైనంతన యంతయు వెడలిపోవును. కాని పరబ్రహ్మము మాత్రము శేషించియుండును. దానినే శాశ్వతమని తెలిసి గ్రహింప వలెను 30.

## పదియవ సమాసము — పూర్ణబ్రహ్మనిరూపణము.

పరబ్రహ్మమును బట్టుకొనజాలము. పారద్రోలజాలము. అది యన్ని తావులందును బూర్ణముగ నున్నది 1. ఎటుజూచిన నది యటు నిలిచియున్నది. దానికి మనము విముఖులము కాదలంచినను నదిమాత్ర ము సమ్ముఖముననే యుండును. మీరు ప్రేమింపనిచో నది సమ్ముఖ మగుట తొలంగిపోజాలదు 2. కూర్చున్న మనుజుడొకవేళ లేచిపోయి నను అక్కడంగూడ నాకాశముండును. మీరు కేడికైనను బోవుడు. నిరంతర మాకాశము సమ్ముఖముగనే యుండును 3. మనుజుడెక్కడికిం బారిపోయినను నాకాశము వానికి నలుదిక్కుల నమరియుండును. ఎంతబల ముపయోగించినను మీరాకాశమును దాటిపోజాలరు 4. మీరెచటనైన నడువుడు. ఆకాశమెదురుగనేయుండును. రెండుజాములవేళ సూర్యునివలె నాకాశము మస్తకముపైననే యుండును 5. కాని సూర్యుం డేకదేశీయము. పరబ్రహ్మమున కాద్యంతములు లేవు. ఇచట నీనో దార్థ మాద్యంతము నిచ్చునిని 6. అనేకతీర్థములు, నానావిధదేశములు జూడవలయునన్న మిగులం గష్టబడి పోవలెను. కాని పరబ్రహ్మముకొఱ కంతకష్టపడి పోవంబనిలేదు. అది మన మెచ్చటకూర్చుండియుంటిమో యచ్చటనే సిద్ధముగా నున్నది 7. మీరొక్కచోటనే కూర్చుండి యుండుడు లేదా పరుగెత్తుచుం దిరుగుడు. కాని వాస్తవమునకుం బర బ్రహ్మము మీ వెంటనే యున్నది 8. ఆకాశమునం దెగురుచున్న పక్షి కెటుజూచిన నటు ఆకాశమే గాన్పించును. ఇదేవిధముగా మీరును బరబ్రహ్మమునం దున్నారు 9. పరబ్రహ్మము పూర్ణముగను సఘనము గను నిండియున్నది. అది యంత్యమునకుంగూడ నాశ్యము. నిరంతర మది యందఱియొద్దను నమరియున్నది 10. దృశ్యమునకు లోపలను వెలుప లను బరబ్రహ్మము వ్యాప్తమైయున్నది. అది బ్రహ్మాండముయొక్క యుదరమున నిండియున్నది. ఓరీ! ఆ విమలమును దేనితో నుపమింప నగును? 11. వైకుంఠమునందును, కైలాసమునందును, రుద్రలోకము నందును స్వర్గలోకమునందును, బహునాలుగు లోకములందును, మఱియుం బాతాళలోకమునందును నది నిండియున్నది 12. కాశీమొదలు రామేశ్వ రమువఱకు నది భరతఖండమునందంతటను నపారముగ నిండియున్నది. దీని

కొంత్ర్నెన్నిను కానిటువంటిను నింక నేతావన్నైనను బరంపరగఁ జూ పము. కాని పరబ్రహ్మమునకుఁ బారావారము (అంతు) లేదు 13. ఏకదేశము లైనా పరబ్రహ్మ మొక్కమాటుగా నంతటిని వ్యాప్తిగావించు కొనును. మఱియు నది యన్నింటిని నన్నిస్థలములందును స్పృశించు చున్నది 14. పరబ్రహ్మము వానచేఁ దడియదు. బురదలోఁ గూరుకొని పోదు. ప్రవాహాతీరముననున్నను నందుఁ గొట్టుకొనిపోదు 15. ముందు వెనుకలను, క్రిందిమొదలను, క్రిందమీఁదను నది సమానరూపముతో నన్నింటియందును వ్యాప్తమై యున్నది 16. ఆకాశము జలాశయమున నిండియున్నది. అది యెప్పుడును దరుగదు. నలుదిక్కుల నది యపారముగా వ్యాపించియున్నది 17. కాని యాకాశ మేకదేశీయమును శూన్యాకార మును నై యున్నది. ఆ పరబ్రహ్మమునందన్ననో దృశ్యభాసము లేనే లేదు. అది నిరాభాసము 18. సత్పురుషులు, సాధువులు, మహాను భావులు, సిద్ధులు, దానవులు, మానవులు మున్నగువారలందఱికిని బ్రహ్మ మొక్కటియే విశ్రాంతిస్థలము 19. ఆ నిత్యమే పునఁ గొనుగొన నగునా? దేనికిఁ బారావారము (అంత్యము) లేదో దానిమర్యాదయెట్లు నిశ్చితము గావింపనగును? 20. పరబ్రహ్మము స్థూలము గాదు. సూక్ష్మము గాదు. దేనితోనైనను సమానమైనదియుఁ గాదు. జ్ఞానదృష్టికిఁదప్ప (దాని విషయమున) సమాధానమే లేదు 21. పిండబ్రహ్మాండములు నిరసన మైనపిదప నిరాభాసబ్రహ్మ మొక్కటియే యుండును. ఇక్కడినుండి యక్కడి దనుక నవకాశమే యవకాశముగ వ్యాపించియున్నది 22. బ్రహ్మము వ్యాపకమైయున్నస్థితి సత్యమే! కాని యీ విషయములు (మాటలు) దృశ్యమున్నంత మట్టునకే యుండును. దృశ్యమే లేకపోయినచో (వ్యాప్యము — దృశ్యములేనిది) వ్యాపకమని యెట్లు నుడువఁగలము? 23. కావున బ్రహ్మమునందు శబ్ద మంటఁజాలదు. కల్పన కచ్చటిదనుక నడకయే లేదు. ఆ కల్పనాతీతమగు నిరంజన పరబ్రహ్మమును వివేకముతో గుర్తె ఱుంగవలెను 24. శుద్ధము, సారమునగుదానిని శ్రవణము గావించుట వలనను, శుద్ధము ప్రత్యయాత్మకము నగుదానిని మననముగావించుట వలనను విజ్ఞానప్రాప్తియైనంతన స్వాభావికముగనే మనస్సు లయమగును. (ఉన్మనీదశ కలుగును) 25. (ఇప్పటికి) సాధనఫలము లభించెను. సంసారము

(ప్రపంచము) సఫలమయ్యెను. నిశ్చలము, నిర్గుణమునగు బ్రహ్మము అంతఃకరణమునం దావరించెను 26. మాయయొక్క లెక్కలపుస్తకము ముగిసినది. పంచభూతములనిత్యములైనవి. సాక్షిత్వము నిర్మించినది. కావున నిక సాధనము (నిలిచి)పోను 27. స్వప్నములందుం గాంచినదెల్ల జాగ్రదవస్థలో నెగిరిపోయినది. కావున స్వాభావికముగనే యనిర్వాచ్య దశ యేతెంచెను. ఇక జెప్పవలసిన యవసరములేదు 28. దీనినంతను వివేకముచే నెఱుంగవలెను. ఆస్థితి ననుభవము గావింపవలెను. చాలును దీనితో జన్మమృత్యుచక్రము నశించితీరును 29.

భక్తాభిమానియగు దాశరథినాయం దనుగ్రహము చూపినాడు. ఆ సమర్థుని కృపావచనములే యీ దాసబోధయం దున్నవి 30. ఇఱువది దశకములుగానున్న యీ దాసబోధను శ్రవణమననములు గావించువానికి పరమార్థము ప్రాప్తించును 31. ఇందలి యిరువదిదశకములను (రెండు వందల సమాసములను) సాధకులు చక్కగ సత్యమనము గావింపవలెను. మాటిమాటికి మననముగావించినచో దీనియందలి విశేషత్వము విశదమగును 32. గ్రంథమును బ్రశంసచేయుట సహజము. కాని యట్లు ప్రశంసించుటవలనం బ్రయోజనములేదు. ఈ గ్రంథమునందున్నది యనుభవ విషయము. కావున అనుభవమునే గావించుకొనవలెను 33. దేహము పంచభూతములది. దీనిలో కర్తయెవ్వరు. ఈస్థితిలో గ్రంథరచనము నాదను జని దెట్టులగును ? 34. కావున నెప్పుడంతయు జగదీశ్వరుండే (కర్తయై) చేయుచున్నాడో యప్పుడు మఱల గ్రంథరచనము మనుష్యకృతమని చెప్పుటమిథ్య 35. సంపూర్ణ దేహమునందలి యొక్కొక్క తత్త్వమును వేఱుగావింపుడు. ఏమియును శేషించియుండదు. ఆ స్థితిలో మఱల నేపదార్థమును "మనది"యని యందము ? 36. ఇవియన్నియు వివేక కార్యములు. కావున నీ విధముగనే భ్రమయందుం దగుల్కొని యుండం దగదు. జగదీశ్వరుండే సమస్తమును రచించెను 37.

**ఇరువదవ దశకము సమాప్తము.**

**శ్రీ ఆంధ్ర దాసబోధ సర్వము సంపూర్ణము.**

**శ్రీ రామదాసార్పణమస్తు.**



# శ్రీ వ్యాసాశ్రమమున దొరకు గ్రంథములు.

1. **శ్రీ యోగవాసిష్ఠము:** ఇది 32000 వేల శ్లోకములు. తెనుంగు తాత్పర్య సహితము 4 వాల్యూములు. వెల రు. 50—0—0
2. **శ్రీ మహాభగవద్గీత:** దీనియందు శ్రీ శంకరాచార్యులు మొదలుగాగల తొమ్మిది మంది భాష్యకర్తల ఆశయములుగలవు. 14—0—0
3. నారద పరివ్రాజకోపనిషత్తు. 1—4—0
4. రజతోత్సవ సంచిక: దీనిలో శ్రీ సద్గురు మలయాళస్వాములవారి బాల్యదశనుండి ఫోటోలు, ధర్మోపన్యాసములు, తీర్థయాత్ర క్రమములు గలవు. 10—0—0
5. శివయోగప్రదీపిక. 1—0—0
6. **గీతార్థప్రకాశము:** ఇది శ్రీసద్గురు మలయాళస్వాములవారు వ్రాసినది. మూలము, పదవిభాగము, టీక, తాత్పర్య విశేషార్థములతో కూడినది. 6—0—0
7. **నారద భక్తిసూత్రములు:** మూలము, పదవిభాగము, టీకాతాత్పర్య విశేషార్థములతో గూడినది. 2—0—0
8. **ఆత్మపురాణము:** 2 భాగములు దీనిని ఆంధ్రభాషలోనికి ఇదివరలో యెవరున్ను అనువాదము చేయలేదు. ఇప్పుడు చేయడమైనది. శ్రీ శంకరానంద మునివర్యుల విరచితము. 8—0—0
9. శ్రీ వేదాంత బాలబోధము. 2—4—0
10. **అనుభూతి ప్రకాశము:** ఇది 20 అధ్యాయములతో కూడినది. వేదాంత పంచదశి రచించుటకు ముందుగా శ్రీ విద్యారణ్య స్వాములవారు రచించినది. దీనికెవరున్ను ఆంధ్రతాత్పర్యము వ్రాయలేదు. ఇదిన్నీ యిపుడు వ్రాయడమైనది. 6—0—0
11. **పాతంజల యోగదర్శనము:** మూలము, పదవిభాగము, తాత్పర్యము, విశేషార్థముతో గూడినది. 5—0—0

## శ్రీ మలయాళస్వాములవారి గ్రంథములు.

| | | |
|---|---|---|
| 12. | ఈశ్వరకృప. ... ... | 6—0—0 |
| 13. | ధర్మసేతువు. ... ... | 4—0—0 |
| 14. | బాలయోగిని ... ... | 4—8—0 |
| 15. | లోకోద్ధారకము. ... ... | 4—0—0 |
| 16. | శ్రీ శుష్కవేదాన్త తమోభాస్కరము. ... | 3—0—0 |
| 17. | స్వబోధ సుధాకరము. ... ... | 1—8—0 |
| 18. | ఓంకార ప్రణవోపాసన. ... ... | 1—4—0 |
| 19. | ప్రశ్నోత్తర మాణిక్యమాల. ... | 2—0—0 |
| 20. | ఉపదేశామృతము 1 భాగము ... ... | 0—8—0 |
| ,, | 2 భాగము ... ... | 0—10—0 |
| ,, | 3 భాగము ... ... | 1—8—0 |
| ,, | 4 భాగము ... ... | 1—8—0 |
| 21. | ఓంకార సత్రయాగము. ... ... | 2—0—0 |
| 22. | గురుభక్తి ప్రభావము. ... ... | 1—4—0 |
| 23. | గృహస్థాశ్రమధర్మము (దివ్యజననము) ... | 2—0—0 |
| 24. | ధర్మోపన్యాసము 1 భాగము ... | 3—0—0 |
| ,, | 2 భాగము. ... | 3—0—0 |
| 25. | బ్రహ్మచర్యము. ... ... | 1—4—0 |
| 26. | కర్మసిద్ధాన్తము. ... ... | 1—0—0 |
| 27. | మాయను మాయముచేయుట. ... | 0—12—0 |
| 28. | నిర్వాణ నిలయము. ... ... | 2—0—0 |
| 29. | నిర్విఘ్న యోగసిద్ధి. ... ... | 1—0—0 |
| 30. | శ్రీ మలయాళ యతీంద్రగీత. ... | 3—0—0 |

వలయువారు:— ఈ క్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొన వచ్చును.

శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు పోస్టు, (చిత్తూరుజిల్లా.)

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు: 26—10—55 కా. 1000.